## ఠే

**ఠే.** దే. వి. ధ్వనించుటయం దగుననుకరణము "క మును గడితూరంబునఁ గట్టినపెనుఠేగంట రవము ఠే యనుచుండ." ద్వా ౨, ఆ ౫

**ఠేవ** దే వి 1. ఒప్పిదము "మ. తన దుర్వారకర ప్రతాప శిఖిచేతం బుట్టుపేరాహితా, వనిరా ట్పట్టణ భస్మపాళి గొని ఠేవన్ వస్నైగావించు నా,ర..." రామా ౧, ఆ ౭౪; 2 విధము రీతి "చ ..పుట్టినపటుకరాల చక్రఠేవలు సూడ..." భాగ ౬, స్కం. ౬౪. "సీ పరిఘవింతుఁ బ్రబాధ పరమేశ్వరునిఠేవ సూక్తివైచిత్రి నొక్కొక్క మాటు." కాశీ ౧, ఆ ౧౩; 3. స్థానము "సీ. వేదవేదాంతాది విద్యలయం దెల్ల గుటిపేయఁ దగుఠేవ గురునిసేవ" ఇందు ౧, ఆ ౧౭౨; 4 ఆశ్వికేతనములలో నొకటి "సీ వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి ఠేవ చూపి" పి. శకుం ౧, ఆ. ౧౧౨.

**ఠేవణి** దే వి అభినయభేదము "ద్వి డిల్లాయిరూకణి ఠేవణి జంకె .."పండితా పర్వ ౩ ౭౦ పే.

**ఠేవము** వై వి (సం ఠేమః) తడి ఆర్ద్రత్వము "లయగ్రాహి.. రక్తస్రావమునఁ బెల్లయిన ఠేవ మునఁ జూడఁ గడు చేవ మగుపట్ల .."భార. స్త్రీ ౨, ఆ ౫.

## ఠో

**ఠోలా** దే వి తెగ, సమూహము (శ. ర)

**ఠోళి** = ఠోళి (వా)

## డ

**డ ఉథ** దే వి ఒకానొక యక్షుగము. సం. వి. అ. పుం. 1 ధ్వని, 2 భయము; 3 శివుఁడు; 4 బడబాగ్ని సం. ఆ. స్త్రీ డాకిని (దీనికిఁ దెనుఁగన వ్యస్తప్రయోగము లేదు)

**డం.** దే వి డమ్మనధ్వనికనుకరణము (చూ. డమ్మను)

**డంక** దే విణ దుష్టుడు "ఆ కొంకు లేనివెకల గుంటెడి ముగుపల, డంకతనము మీఱ జంకులేక" నీలా ౩, ఆ ౨౧

**డంకా.** వై. వి (సం. ఢక్కా) డక్క (శ ర)

**డంగరి** సం. వి ఈ. స్త్రీ పాడవుదోస

**డంగు** దే అ. క్రి. (బిడ్డము మొ) నలఁగు. (శ ర) విణ నలఁగినది (శ. ర)

**డంగుఁబ్రాలు.** దే. వి బ. (డంగు+ప్రాలు.) తెల్లఁగా నలిగినబియ్యము. (శ. ర.) [ప్ర. ౧౨౦.

**డంగురము.** దే. వి. చర్మవాద్యవిశేషము. ఆం. భా.

**డంచు** దే స క్రి. (డంగుధా. ప్రే) 1. ధాన్యము మొ రోకళ్లతో నలఁగఁగొట్టు. (వా): 2. చిదుకఁగొట్టు "సీ పిండిపిండిచంపుగాఁ బృథివీధరంబులు డంచునే కాలదండమున నభవ" కాశీ ౭, ఆ ౭౯.

**డంచకము.** దే వి. దంచుట, "సీ . డంచకములకు వంటకములకును..."భార శాం ౫, ఆ. ౩౯౩.

**డంబకము** దే వి మోసము "ద్వి బకమురూపమున డంబకము సూపుచుచు." అ. మ క ౧, ఆ ౧౫ పే. ౫ ప పండితా పురా. ౧౨౨ పే.

**డంబము.** వై. వి (సం. దంభః) 1 స్థితికి మించిన వేషము; 2. ప్రతిష్ఠ. (చూ. డంబు)

**డంబరము** సం. వి. అ పుం 1. సమూహము; 2. ఆడంబరము; 3. జృంభణము; 4 పోలిక. విణ. (అ ఆ. అ) సమానమైనది.

**డంబు** వై వి (సం. దంభః క. డంబవు) 1. కప టము, మోసము "పంచచామరము ..నరాదుఁ డీమృగంబు డంబునన్ వనంబులోనఁ గానరా ..."ఉ రా. ౧, ఆ ౪౪ ద్వి హరిశ్చ ఉ. ౬౧౧ పు; 2. గౌరవము "ద్వి నరుఁడు డంబునకు జన్నము చేసెనేని" ద్వి భాగ ౬. స్కం (శ. ర); 3 గర్వము "మ ప్రతివీరప్రకరంబు డంబుమెయిఁ గప్పం బొప్పనం చేక ."ఉ హరి ౪, ఆ ౩౯. చంద్రికా ౧, ఆ ౧౩, 4. శోభ, కాంతి "ఆ .. మేళ్ళఁ, డంబుతోడ వచ్చెఁ దుంబురుండు" కళా. ౨, ఆ ౭౭ నీలా ౩. ఆ ౧౦౯; 5 విధము, రీతి "గీ అఖిల జనములు దాతలై యలరఁ గలరు, సత్యలోకం బుడంబున జగము దనరు" ధర్మ. ౧, ఆ ౨౦౫ "సీ తనదివ్యమకుటంబు తనంబున ననంతమణి సంతతద్యోత మహిమఁ గాంచ" ఉ. రా. ౧, ఆ ౮౩. విణ. 1. అధికము. "క. డంబుగఁ బాచమహాశ, బ్దంబులు మ్రోయంగ .."భా. రా. ఆ ౮౩, 2. సుందరమైనది. "సీ. కమనీయ ముఖచంద్రుఁ గబళించుచిల్వ నా డంబైనబిరి గడ్డము చెలంగె." శుక ౨, ఆ. ౩౫౮.

దంభము. సం. వి. అ. పుం. దంభము; "శా. దంభాచారము లుజ్జగించి..." కావ్యా. ౨, ఆ. ౧౩౨. "ఉ. తంభమయూఖ్యదర్శన విడంబనుఁడు..." వృషా. ళ. ౯౪; "సీ. దంభ మిచ్చుటను గూడదు కృష్ణ..." అప్ప ౨ ఆ. ౧౪౩. (పాణినీయమున దంభధాతువే గాని డంభధాతువు కానరాదు. ఐనను ప్రయోగము లిట్లున్నవి.)

ఢక్క. వై. వి. (సం. ఢక్కా) వాద్యవిశేషము; "వ...కరంబులఁ దంబులలు వీణెలు ఢక్కలు .." ఉ. రా. ౫, ఆ. ౨౪౯.

ఢక్కఁగొను. దే అ. క్రి. (ఢక్కన్+కొను) వశపఱచుకొను. "ఉ...ఏలనిబంటుగా మరుం, డక్కఁగొనంగరాదె యకటా నను పేఁడు విగ్రహించినన్." విజ. ౨, ఆ. ౩౫ విజ. ౧, ఆ.౯౬

దక్కి. వై. వి. డక్క. "వ ..అనగరంబు దెసనుండి దిమ్ము రేఁగినయట్లు... తప్పెటలును డక్కలును...మ్రోయ..." ద్వా ౧౧, ఆ. ౨౬. అం. భా. ప్ర. ౧౨౭.

దక్కించుకొను దే. స. క్రి. (పోకుండ) కాపాడుకొను; "క...హ, రక్కసివంగడ మంత్రయు, దక్కించుకొనంగఁ జూడు ట క్కడిగి యిఁకన్." అచ్చ. సుం ౧౪౬

దక్కి = దక్కి "క సంగీతపు మేళము జత, సంగతి తాళములు నాగసరములు దక్కిల్." ప్రబంధ. ౯౩.

దక్కు. దే. అ క్రి. 1. చేతికి చిక్కు. "ఉ...నీకు నే దక్కితి నంచుఁ బ్రేమ నిగుడం బువ్వుఁ బొన్నున జేర్చి యచ్చటన్." శుక. 3, ఆ. ౫౩౬, 2. అధీనమగు; "ఉ దక్కెను రాజ్యమంచు నకటా యిటు తమ్మునిభాగ మీక .." భార. ఉద్యో ౨, ఆ ౫౨ శాశ ౧, ఆ. ౧౧౬; 2. లభించు; "క. చుక్కల రాయఁడు మరుఁడుం, జక్కలయొకిమీనికొడుకు జతవోలనియి, చక్కని వాఁడు నీకున్, దక్కంబో యల్లుఁడై దిటం బలరాగన్." అచ్చ. బాల. ౧౯౫; 3 స్థిరముగా నుండు 'ఉ అక్కట మందభాగ్యునకు నట్టికనూ ధవరత్న మెవ్విధిం, దక్కు..." భార ద్రో. ౨, ఆ. ౧౪౦. పాండు. ౫, ఆ. ౯౦. వి ధియము "ద్వి ఉక్కడఁగింతు రన్ దక్కును లేక." పండితా దీక్షా. ౪౨ పా.

దక్కొను = దక్కొను. (శ. ర)

దగర. దే వి పిశాచము; "గీ. మగువ గాదుర యిది పెనుదగరగాని." కళా 3, ఆ. ౧౯౬ వివ మగది. "గీ చొక్కముగఁ బొటఁబొడు నొక్కొక్కచోట, దగరకోయిల లెల్లఁ బట్టితిక మరియ." ఉ. రా. ౭, ఆ ౪౪౪. గంధ. ౬

దగరము దే. వి కీడు. "మ ..ఈ, దగరంపుఁబగఱన్ జయింతు నని కుండాలంబులున్ మేటిలే, రుగముల్"...కొల్వ..." సుద 3, ఆ. ౧౭. ఉ. హరి ౫ ఆ ౧౯౪.

డెగ్గర = దగర (శ. ర)

దగ్గఱ దే. వి. సమీపప్రదేశము. "ఉ. దగ్గఱ మేపినీ పరివృఢప్రవరుండు..." నైష. ౯. ఆ ౧౦౯. "చ . అతినిష్ఠురఘోరనిశాలదండతా, దనములు చేయుచున్ జమునిదగ్గఱకుం గొనిపోయి చూచు ..." భల్లా. 3, ఆ (శ. ర)

దగ్గఱించు. దే. అ. క్రి 1. దగ్గఱకు వచ్చు, సమీపించు; "ఉ...మృత్యువు చెంద వానికిం, గాలము దగ్గఱించె నది గానియెడన్ మది నిట్టు లెంచుచే." ఉ. రా. 3. ఆ. ౩౧౯. స. క్రి. దగ్గఱకు వచ్చు నట్లుచేయు; "చ...కుంజరఘోటకంబులన్, మొనయఁగ దగ్గరించియును..." వై. 3, ఆ ౪౧.

దగ్గఱిలు. దే స క్రి. సమీపించు "క. దగ్గఱిలి మైత్రి భామిని, దగ్గుత్తిక యిడుచు..." ప్రబోధ. 3, ఆ. ౭౫.

దగ్గఱు. దే అ. క్రి సమీపించు; "క పెలుచఱచి వెగడుపడి ని, వ్వెఱఁగందుచుఁ గురుబలంబు వీరులకని దగ్గఱ..." భార. భీష్మ. ౨, ఆ ౨౨౩. కు. సం ౯, ఆ ౨౪.

దగ్గు = దగ్గు (శ. ర)

దగ్గుత్తిక. దే. వి (దగ్గు+ఉత్తిక) గాద్గద్యము; "మ. అని దగ్గుత్తికతో మహాభయముతో..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౬౯. అం. భా. ప్ర. ౧౨౨.

దగ్గుత్తికపడు. దే అ. క్రి. (దగ్గుత్తిక+పడు) గాద్గద్యము కలదగు; "గీ కూఁతు సొదఁబొయువగల దగ్గుత్తిపడఁగ." కాళిందీ 3, ఆ ౨౦౫

దగ్గుపడు. ద్వ అ. క్రి. (దగ్గు+పడు.) గాద్గద్యము నొందు; "చ . కెంజిగురుగుంపులు లంపులు మేసి క్రొవ్వి పి, కున నొగరెక్క దగ్గుపడుకత్తు

కలన్... కెరలించెఁ గోవెలల్." శ్రీరం. ఆ. ౨, ౨౫౧.

డజను. ఆం వి. (Dozen) పన్నెండు.

డప్పి దే వి 1 ఆయాసము; "వ...నీవు కడు దూరంబు వచ్చి డస్సితి వింక మరలుట లెస్స..." గీ. నాకు డప్పి యొక్కుడిది మనంబు భ్రమ్మ, చరణ యుగళ దాసక్తమై .." భార ఆర ౭, ఆ ౨౩౯. ౨౪౦ హరి పూ. ౨, ఆ ౪౪, 2 దైన్యము, "క. ఏవానిబంధుమిత్రులు, జీవధనంబులును డప్పిఁ జెందను గృశునిం, గా వాని కెన్నఁగాఁ దగు..." భార. శాం ౧ ఆ ౫౨. 3. దాహము, పానము చేయుఁగోరిక; 'గీ డప్పిఁ గుందితి డస్సి దట్టంబు నైతి" కాశీ ౬ ఆ ౪౪. ఆం. భా. ద్వి ౨౬౦.

డప్పిగొను. దే. అ క్రి. (డప్పి+కొను.) దాహముందు "గీ. ప్రవాహావాయుం తురంగమంబరమునందు, డప్పిగొని యాసుధాంశుమండలము సొచ్చి." నైష ౮, ఆ. ౧౭౭.

డప్పు దే. వి. (క. డప్పు.) మాదిగవాఁడు వాయించు చర్మవాద్యవిశేషము (శ. ర.)

డబడబ. దే. వి. గర్వము. "సీ. పాలవాఁడు రాముఁడై బూకంపుఁజల్కులఁ గొట్టినడబడబల్ గట్టువడియె" చమ ౨, ఆ ౭౩.

డబిత్థము సం. వి. అ. పుం కట్టితో చేయఁబడిన మృగము

డబ్బులు దే వి బొంకు. 'గీ. డబ్బులు పల్కువారి కడ్డంబు గలదె." కాశీ ౪, ఆ. ౯౬.

డబ్బా. దే. వి. 1. తుపాకిమందు లోనగునవి యుంచు కొనెడి తోలుపెట్టె (శ. ర.); 2. నూనె మొదల గునవి పోయుట కుపయోగించు రేకుపాత్ర (వా)

డబ్బాటు. దే. వి ఆకస్మికత. 'సీ. డబ్బాటుమై నొక్కెడలు చూపి యవి మాయ నడఁగ పెఱిఁ జాపువ్యాపృతులును" ఆము. ౬, ఆ. ౧౮. విణ ఆకస్మికము ఆం భా. 3, ఆ 3౨ క్రి విణ హఠాత్తుగా "క ఒకనాఁ డఖుండు నీసీ,డకు డబ్బా టరుగు కెంచుటయుం...' భార. శాం 3, ఆ. 3౯౨ ఆము. ౬, ఆ ౮౦

డబ్బాటుపాకిరి. ద్వ విణ యదృచ్ఛాభిక్షుఁడు శ ర.

డబ్బి దే వి. (హిం. డిబ్బీ. క డబ్బి 1. బరణి 'సీ ..భరణి మీఁజను దార్పు బరణి డబ్బి' ఆం. భా. ద్వి ౧౬౬; 2. ఒకానొక శకునపక్షి. "ఆ. డబ్బి బొబ్బలిడియె నుబ్బు లదర." ద్వా. ౧, ఆ. ౨3౧

డప్పి = డబ్బి వా.)

డబ్బు. దే. వి. (క. డబ్బు.) 1. కపటము ఆం. భా. ప్ర ౧3౮, 2 అబద్ధపుమాట. ఆం. భా. ప్ర. ౧౧౯; 3. డాబుమాట. "క. పలికిన విని మిక్కిలి డబ్బులు నిలుపుము చాలు...."పరమ ,౫, ఆ ౧౭; 4. మూఁడు (నాలు) పైసలు విలువ గలనాణెము. ఆం. భా. ద్వి. ౨౭౪; 5. ధనము, సొమ్ము."క... నాడ,జ్యేవారిఁ బ్రోవ భిక్షా, డీకవర్ణికిని విధి సృజించెనుగాదే." ఆము. ౪, ఆ. ౬౭,6 . ఒకా నొకశకునపక్షి."వ...,కౌశికంబు డబ్బు గబ్బులుఁగు ..."ఆము. ౬ ఆ. ౬౬. హంస. 3, ఆ ౧౨. విణ. ప్రకాశవంతము. ' ద్వి డబ్బైనయొడల నొడ్డాణంబు మీఱి.' ద్వి శ. సా ౨, ఆ. ౯౧. పొ ౧3 కుం. స క్రి. అబద్ధమాడు. "ఉ. మొన్న సమర్తపెట్టె నని ముద్దియ డబ్బిన నుబ్బె నయ్యెడన్." బహు ౫, ఆ ౧౦౬.

డబ్బుడుబ్బు. దే వి. తుపాకులధ్వని కనుకరణము. "వ...గుంటిక్రొవ్వుల డబ్బుడుబ్బులు."ప్రబంధ. ౭౮౮. కళా. ౮, ఆ. ౧౦౯.

డబ్బుర దే వి 1. పానపాత్ర ఆం. భా. ద్వి. ౨౪౪, 2 పెద్దనోరు గల లోహపాత్రవిశేషము. (శ ర)

డమరము. సం వి. అ. పుం 1. కొల్లగొట్టుట మున్నగు దేశోపద్రవము, 2. భయముచే పాఱిపోవుట. పుం. మశ్మశునము

డమరుకము సం వి అ పుం. డమరువు.

డమరుగము వై. వి. (సం డమరుకః.) చర్మవాద్య విశేషము. ఆం. భా. ప్ర. ౧౨౭.

డమరువు. సం వి. ఉ పుం. బుడుబుడక్కలవాఁడు వాయించువాద్యవిశేషము.

డమామి దే. వి. మహారాజచిహ్న మగు పెద్దవాద్యము "సీ తరలి రమ్మనినఁ జేతము కొక్కటియె కాని పేర్కొన జిజుతురు పెదడమామి" చంద్రా. ౧, అ. ౫౦. సుదంతా ౬, ఆ 3౧.

డమాయి = డమామి. శ ర)

డమారము దే. వి (క. డమార) చర్మవాద్యవిశేషము (శ. ర.)

దమ్మను. దే. అ. క్రి. (దం+అను.) 1 తప్పుగా పలుకు "ఉ అక్కట పొట్టదించిన నొకకుర మైనను రాదు టెక్కులుం. దక్కులె కాని య మ్మనిన దమ్మనసేరఁడు..." శుక ౨, ఆ. ౪౩౭; 2. చచ్చు. (శ. ర. బ్రౌ)

దయనము సం. వి. అ న. 1. క్రీడాశకటము. (శ. ర), 2. పక్షియెగురుట; 3. మూఁపున నిడికొని మోయఁ పల్లకి మొ.

దయ్యించు. దే. స క్రి. (దయ్యుధా. ప్రే.) చిక్కునట్లుచేయు. "గీ. దుష్కరం బైనతప మిట్లు తోడరి చేసి,మేను దయ్యించుకొనఁగ నేమి టికి వచ్చె." వార. ౪, ఆ ౨౩.

దయ్యు. దే అ. క్రి. 1 అలయు, "ఉ కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ, వియ్యెడఁ దప్పితేని జగ మే మను నిచుక సేపు పోరులం, దయ్యుట తప్పె .." భార భీష్మ 3, ఆ ౭౬౯. వార ౨ ఆ ౧౧, 2. బలహీన మగు "గీ. దప్పిఁ గుందిరి దప్పి దట్టంబునైరి" కాశీ ౬, ఆ ౪౪ ను సం ౧౦, ఆ ౪౫౬, 3. చిక్కు, కృశించు. "ఆ. ఏమికొఱత యయ్యె నిట్లు దయ్య ను,చ్ఛాయ పతిఁగియుండ .." భార. సభా. ౨, ఆ. ౧౦౨ పైవ ౨, ఆ. ౧౧3, 4 అణఁగు, తగ్గు ఆం. గ్రా. ప్ర. "క. వెయ్యేం డ్లయ్యెను సీతోఁ, గయ్యంబడి యున్న వాడఁ గామసుఖములం, గ్రుయ్యు దొక యుంచుకై నక్, దయ్యదు కొనలిడియోఁ దృష్ణ నవపద్మముఖి" భాగ. ౯, స్కం. ౧౭౭, 5. చెడిపోవు సీ ఏఱువ్రయ్య లొనర్చి యూరు దయ్యఁగఁ జేసి మలయుఁలాహిరికని మహిమ యెంత." ఉ రా. ౧, ఆ. ౬౬.

దయ్యంబాఱు దే. అ. క్రి. (దయ్యక్+పాఱు. స్వార్థమున) అలయు, దయ్యు "శా అఖిలం బగుదంష్ట్రిపోట నట దయ్యంబాటె ఖన్నాం గుండ్జే ౯, ౧౩౯.

దల్లకము. సం వి. అ. న. వెదురుగంప

దవాలీ. ఉ. వి. సాకరువీళ్లను కగిలించుపట్ట (బ్రౌ.వా.)

దవిణ దే. వి. డిండిమము, జయము మొదలగువానిని సూచించుటకై మ్రోయించువాద్యవిశేషము. "గీ. కేతి తోడ దట్టికొని బిట్టు కేకపైచి, మీస ములు దీటి యెదిరికి రోస మెదవ, దవిణ వాయించుకజేయుచు..." కువల ౪, ఆ. ౨౧౦. ఆం భా. ప్ర. ౧౨౭.

దవ్వులం. దే వి 1. మదింపు, అంచన (శ ర); 2. రాజానకు రాజ్యముసుండి వచ్చు ఆదాయము (బ్రౌ); 3. దంభము. (బ్రౌ.)

డా

డా. దే. విశే. ఎడమనున్న ది. (ఇది సమాసపూర్వావయవమై యుండును. ఉదా. డాకన్ను. డాకేలు. మొ.)

డాఁగరి. సం. వి. ఈ. స్త్రీ. పొడవైనదొకపక్షి (విల్యమ్సు.)

డాఁకొను. దే. అ క్రి. (డాఁగు+కొను- స్వార్థమున.) డాఁగు, మఱుఁగున నుండు. "గీ ..కమయింటి డాఁకొని యున్న విన్న, మూలదేవరవి ల్లెత్తఁ జాలు మేటి." అచ్చ. బాల. ౧౭౯.

డాఁగనముచ్చిట్లు. దే. వి. బ. (డాఁగుడా.) బాల్య క్రీడావిశేషము. "క. అచ్చిన్ని చెలువ డాఁగన, ముచ్చిట్లను సాల్గుగంబముల యాటలు..." పాంచా. ౧, ఆ. ౫౭.

డాఁగనముచ్చులు. = డాఁగుడుమూఁతలు. "సీ. తన దాపె కరి డాఁగు నవురీతిఁ జెలికాండ్రకాడ డాఁగనముచ్చు లాడ నేర్చు." రా. వి. ౨, ఆ. ౨౩.

డాఁగికొను. దే. అ. క్రి. (డాఁగు+కొను. స్వార్థమున.) డాఁగు. "క...గర్భగృహమునఁ దన్నా, త్రికివెనుక డాఁగికొని..." శుక. 3, ఆ. ౭౯.

డాఁగిలిమూఁతలు = డాఁగుడుమూఁతలు. 'సీ.అచ్చన గండ్లు డోయాలును డాఁగిలిమూఁతలు నాలుగు మూలలాట." దశా. ౮, ఆ. ౮౧.

డాఁగిలిముచ్చులు. = డాఁగుడుమూఁతలు. "సీ. డాఁగిలిముచ్చులాటలు గచ్చకాయలు..." కాశీ. 3, ఆ. 33.

డాఁగిసేయు. . దే. స క్రి. (డాఁగి+చేయు.) కాల యాపనము చేయు. "మ. చనునే పెండిలి డాఁగి సేయ .." శ్రీరాధా. 3, ఆ. ౧౦౯.

డాఁగు. దే. అ. క్రి. దాఁగు, మఱుఁగుననుండు. "క. లోఁగుఁ దరమైనబాదసుల, సాఁగిన శకునంబు తలఁచు నడుగడుగునకున్, డాఁగఁ గెల నరయు..." కు. సం. ౫, ఆ. ౧౩. "శా.

డాఁగెం బల్వలకుంకసేను బకజాలక్రప్తపాతిన ముల్." పారి. ౪, ఆ. ౨౦.

డాఁగుడుమూఁతలు. దే. వి. బ. బాల్యక్రీడావిశేషము. "గీ. మేఁక దలఁపక డాఁగుడుమూఁత లాడు." య. ౩, ఆ. ౧౫౫.

డాఁగురించు. దే. అ. క్రి. డాఁగు. ఆం. భా. కృ. ౯౮. స. క్రి. 1. దాఁచు. "ఉ....ఏ మటు పోక కొరి మది సేర్పడ ముస్ గని డాఁగురించెనో." భార. సౌ. ౧, ఆ. ౨౩౦; 2. మోసపుచ్చు. 'గీ. అలిక మొఱఁగి, మగఁడుఁ బలి డాఁగురించి భామయుఁ దిరుగుదు,రు..."హరి. ఉ. ౯, ఆ. ౪౮. "శా. శాకద్వేషుల డాఁగురించుటకునై నాఁడేసుఁగై కొన్న శాం,తాకారంబు ..భాగ. ౮, స్కం. ౩౯౧.

డాఁగురింత. దే. వి. (డాఁగురించు ధా.) 1. దాఁచుట. 2. దాఁగియుండుట; 3. మోసగించుట బ. బాలక్రీడావిశేషము. "చ...డాఁగురిం,తలు హరితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్."హరి. పూ. ౮. ఆ. ౩౫. కథ. ౩, ఆ. ౭౮.

డాఁగురుమూఁతలు. దే. వి. బ. బాల్యక్రీడావిశేషము. "సీ. పైఁడిపెట్టెక లెక్క పై కేఁగి చేతగట్టుందు డాఁగురుమూఁత లాడి యాడి."య. ౩, ఆ. ౧౫౫. వేం. మా. ౬, ఆ ౯౬.

డాఁచు. దే. స క్రి. (డాఁగుధా. ప్రే.) 1. డాఁగఁజేయుట, కప్పిపుచ్చు. "చ ..వృకోదరుం డొకం,డతటికిఁ జొచ్చి దోర్బలము డాఁపక పోరెడు..." భార. భీష్మ. ౨, ఆ. ౭. స్వా ౧, ఆ. ౭౫; 2. దాఁగ్రత్తపెట్టు. "ఉ. డాఁచినసొమ్ము చేంచిచటన్..."ఉ. హరి. ౧, ఆ. ౧౬౮. విక్ర. ౮, ఆ. ౧౨.

డాఁపరీఁడు. దే. పుం. వంచకుఁడు, మోసగాఁడు. 'గీ. చక్రవాకము లెడఁబాయ జారసతులు,డాయనట్ట లాసంబు డాఁపరీఁడు, ప్రాచి కొనరించె గుసుమ భూబాలికెలువ." పి. శకుం. ౩, ఆ. ౧౫౪.

డాక. దే. వి. (క. డాకు.) 1. పరాక్రమము. "క. లగ్గలకునట్లు కోటకు, దగ్గఱకన పెంపల కల్ల డాకఁ దఱిమి..." ప్రభా. ౫, ఆ. ౨౦౧. ఆం. భా. కృ. ౪౫; 2. విజృంభణము. "శా...తోడై తీర్పురమాకుమారుకును రెండున్ విందులం బోలియుం,తే డాకన్ బలికె..." వేం. పంచ. ౧, ఆ. ౬౦. కళా. పీఠి. ౯౧; 3. ఒప్పు. "ద్వి. డాకతో నదిని గాఢంబు కాఢంబు, జోకమై బాసినచొప్పు దీపింప."రం. రా. అయో. ౧౩౯, పా. ౩౦. పం. 4. రీతి, విధము. "సీ అఁ కొన్నవారిడాక చేకొన్నవాఁ డంచుఁ గాకపై ఖరిదండకరుఁడు పూను." ఉ. రా. ౩, ఆ. ౧౪౧; 5. పతియాఁక. ఆం. శా. ద్వి. ౯౯.

డాకరేమి. వై. వి. (సం. ద్రాక్షారామః) ద్రాక్షారామము. "చ . దక్షవిరోధికి డాకరేమి దీపక మొనరించె .." శా. ప. మం. ౩.౨౬.

డాకలి. దే. వి. (డాయి+కలు.) కమసాలివానిలో హంపుదిమ్మె. "సీ తనరును లోహసంతాడనాధారంబు డాకల్లు పట్టెడ డాకలి యన." ఆం. భా. ద్వి. ౨౯౯.

డాకల్లు. దే. వి. (డాపు+కల్లు.) 1. బండిచక్రము యొక్క ఆకు. (బ్రౌ.) 2. లోహసంతాడనాధారము, కమసాలి లోహమును సాగగొట్టు ఉక్కుదిమ్మ. ఆం. భా. ద్వి. ౨౯౯.

డాకిని. సం. వి. ఈ. స్త్రీ. పిశాచభేదము.

డాకిరి. దే వి. మల్లక్రియాభేదము. "సీ. డాకిరి సొచ్చిన డాగినీ మూఁగిన..."ద్వా. ౭, ఆ. ౬౦.

డాకురు. దే. స. క్రి. కాళ్లు తేలగిలవేయు. (శ. ర.)

డాకొను. దే. అ క్రి. (డాపు+కొను.) 1. సిద్ధపడు. (బ్రౌ.) 2. ఉండు. "క. కని రాజహంసలు భజింప నున్నమత్పుండరీకమండలములు డాకొనఁ జక్రవర్తుల భంగిన..... పొదలు కదల్చిన్." వరాహ. ౭, ఆ. ౫౫. (డాకొనన్ = సముద్రపక్షమున ఉండఁగా. అని యర్థము.) 2. లాంఛితమగు, గుర్తుగా అంటు. "క. కను పుపలంబితకరణంబుఁ గూడిరి నలియుం వల్లభుఁడు నిదె యొకగోడను లాక్షారస మొకగోడను జందురకర్దమంబు డాకొనఁ బడఁటి." రసిక. ౬. ఆ. ౨౫. స. క్రి. పట్టుకొను. "క. రాకొమరులార గుబ్బలి, రాకన్నియమగని యబ్బురపుని ల్లిది ముం, డాకటి మెడనొర దీనిం, డాకొని బలుటక్కరుల నడంచెం గడిమిన్."అచ్చ. బాల. ౧౭౦, అ క్రి., స. క్రి. సమీపించు. "గీ. గొల్ల లెల్లను చెల్లుగ వల్లియలను, బల్లిదపులం కొలుపులం మొల్లముగను, బాదియ మ్మేటి పొగరుటా బోరుతుటుము, బలిమి మెఱయంగ డాకొని కట్టుటయును."నీలా. ౨,ఆ. ౬౪.

"గీ. ఒక్కసతి వెలికిలి యీఁద నొప్పెఁ గురులు, వీఁగుఁజున్నులం వలరాచవేఁటకాఁడు. కోకములఁ బట్టి నొడ్డువాగురులు వాని, డాకొనఁగఁ బెట్టుదీమపిట్టలు ననంగ." వరాహ. 3, ఆ. ౧౦3.

డాకొలుపు. దే. స. క్రి. (డాకొను. ధా. ప్రే.) దగ్గఱకు రప్పించు. (చూ. డాకొల్పు)

డాకొల్పు = డాకొలుపు. 1. (దగ్గఱకురప్పించు.) "మ... మెకములం డాకొల్పు వశ్యంపుమం, దులు..." హరిశ్చ. ౨, ఆ. ౮; 2. (ప్రతిష్ఠించు, నిలుపు.) "సీ. గ్రహరాజరథముమం గల కయాంకంబుగా డాకొల్పు వజ్రంపుతఱఁ యనఁగ" భాను 3, ౮౪.

డాగలి = డాకలి.

డాగిని. దే. వి. మల్లక్రియావిశేషము. ద్వా. ౭, ఆ ౬౦.

డాగు. దే వి. (క. డాగు) 1. గుఱుతు "సీ. గాఢ నాళీకసంగ్రస్తుఁడై పేఁడును వీడాగువాఁడు వాణీ విలాసి" వసు. 3, ఆ. ౧౭౭. చంద్రా. ౬, ఆ. ౨౭; 2. మచ్చ. వా:—సిరాబుడి బట్ట డాగయినది; 3. కళంకము. "సీ. వేయిడాగుల తోడి విబుధలోకేశునిమూర్తికి నవ్వఁడు మాల మర్త్యో." భాగ. ౧౦, స్కం. ఉ ౧౦; 4. వాత. "చ. విరహిజనంబులన్ మరుఁడు వీపుల డాగుల వేయఁ బూని..." చంద్రా. ౪, ఆ. ౨౦౫.

డాచేయు. దే. స. క్రి. (డాపు+చేయు.) ఆధారము చేసికొను. "మ...లచ్చినిట్టఁపుంజన్గవఁ బోలు మున్నెరగు మున్ డాచేసి యుల్లాసిల్లై." పాండు. 3, ఆ. ౧౩౦.

డాపల. దే. వి. ౘో. వామభాగము. "ద్వి. డాపలి కేలు విటారంబు సెఱప." ద్వి. పరమ. ౧, ఆ. ౧౭. పొ. ౧౬ పం. "క. కటుశరములవిఱిదికి డాపటిస్ వలపటికి నపరభాగమునకు ముంగటిఁ జదల నడపె.." భార. ద్రో ౪, ఆ 3౬౨.

డాపలించు. దే. స. క్రి. ఎడమప్రక్కగా నుంచు... "క. అరయుందముగాని యిష్టో కారమునకును డాపలించి యరవముఁ బోనిమ్మురపడి..." భార. విరా. ౪, ఆ. ౨౪౬.

డాపు. దే. వి. దగ్గఱ. "చ...కర్ణకుండలరుచిధాళధళ్యములడాపునఁ బొంచి..." వసు. 3, ఆ. ౪౯. శేం. పంచ. ౧ ఆ. ౫౫; 2. ఆశ్రయము "సీ. డాకేలు సెక్కున డాపిడి తనలోనఁ దల పోసి.." దశ. ౫, ఆ. ౪౦. విణ. సమీపము, దగ్గఱయున్నది. (శ. ర.)

డాపురము, దే. వి. ప్రాప్తి. (శ ర) విణ ప్రాప్తించినది. (శ. ర)

డాబ. దే.వి. 1. పక్షివిశేషము. "సీ. మూలసందులనుండి మూల్గు డాబల క్రిందుగుంపు కేరఁపుఁ గయ్యంపు రొదలు" చంద్రా. ౨, ఆ. ౮౧ పార్వ. ౬, ఆ. ౭౭. (కం. డాబ.); 2. యోధులు మెదలఁ దాల్చెడు తోలుపటకా. ఆం. భా. ద్వి. ౨౦౪.

డాబా. దే. వి. 1. యోధులు మెదలఁ దాల్చెడు తోలుపటకా. "గీ. పడఁతి జఘనంబు పెద్ద డాబాలు పూని, కాయజాఁడు పొక్కిలను సొరంగ మనఁ దూఱి, తెగువఁ గుచదుర్గయుగము సాధించుకొఱకుఁ, దార్పునిశ్రేణి యన వళిత్రయము సెలఁగు." బిల్హ. ౨, ఆ. ౧౦౮. 2. శత్రువుల ఫిరంగిగుండ్లు తగులకుండ అడ్డుగా కట్టు పెద్ద కేడెమువంటి సాధనము. "గీ. పార్థివేంద్రుని భటులు డాబాల నడుమ" కువల. 3, ఆ. ౧౦. రంగా. 3, ఆ. ౭౯; 3. ఉన్నతమైన కట్టడము, బోడిమిద్దె (వా)

డాబు. దే. వి. 1. అతిశయపుమాట. (శ. ర.); 2. దినవులపట్టిక. (బ్రౌ); 3. కృత్రిమవేషము.

డాబుచేయు. ద్వ. స. క్రి. (వా.) (డాబు+చేయు.) మోసగించు. వేమన. ౧3౭.

డామరము. సం. వి. అ. పుం. 1. క్షోభ; 2. ఉపద్రవము. "చ...తదీయదేశముల్, దలరక యొప్పె లోగభయ తస్కరడామరవర్జితంబులై." భార. ఆ. ౮, ఆ. ౮; 3. ఉత్సవాదుల యందలిధ్వని; 4. చమత్కారము; 5. ఒకసంకీర్ణ జాతిభేదము.

డాయి. దే. వి. గాకిలి. (శ. ర.)

డాయించు. దే. స. క్రి. 1. డాయఁజేయు, పొందించు. "మ...మాయ డాయించుచున్." శుక. ౧, ఆ ౫౦౧; 2. సోకించు. "ద్వి. ముద్దాడి మోముపై మోము డాయించి." ద్వి. పరమ. 3, ఆ. ౧౬౧. పొ.

డాయు. దే. అ. క్రి. ప్రవేశించు. "క...అమంద గతిన్ మరునిమాయ మదిలో డాసెన్." ఇందు.

౨, ఆ. ౧౮౭. స. క్రి. 1. పొందు. "మ. కలలోఁ వార్తలు విప్పి చెప్పెడి క్రియన్ గాథా పురాణార్థముల్ దెలుపన్నేర్తురు గాని శేరరు సుమీ తీవ్రవ్రతాచారశక్యులులై యుండెడు ముండధారులు ముముక్షుల్ డాయఁగా......" పాండు. ౫, ఆ. ౨౧౪: 2. తగులు; "ఉ. రాముఁడు దమ్ముఁడున్ గొలువ రాజశిఖామణి చిత్రకూట చూడామణి యైనవార్త చెవి డాసిన నొచ్చితి నింక..." భా. రా. అయో. ౧౬౯; 3. కవియు. తాఁకు. "చ...పోటరి యతఁ డింద్రజిత్తునికి డాయరు మీని సురాసురాదులున్." భా. రా. యు. ౭౯౫, అ. క్రి. స. క్రి. సమీపించు "క. మోపెట్టఁగ, కొలఁదియె యని డాయన్వైరి కొందఱు దాకిన్." భార. ఆది. ౭, ౧౭౬. "ఉ ఒయ్యన డాయఁగాఁ జనియె నుగ్రవిలోచనపార్శ్వభూమికిన్." కూర. 3, ఆ. ౬౬. భార ఆది. ౬, ఆ ౨౦౪.

డాలించు. దే. అ. క్రి. కేడెముపట్టు. (శ. ర.) స. క్రి. 1. కట్టించు "ద్వి. జవ్వాదిమెఱుఁగుహస్తము ల డాలించి." ద్వి. పరమ. 3, ఆ ౨౦౪, 2. మార్చు. 'ద్వి క్రొత్తకస్తూరిమఁట్యములు, డాలించుకరణి..." ద్వి. పరమ. 3. ఆ. ౧౭౦. పా, 3. ప్రకాశించు. "ద్వి. బాలేందుచాయల పదికెండువగల, డాలించు నూర్ధ్వపుంద్రంబుల వాని." ద్వి. పరమ. ౪, ఆ. ౨౮౦. పా. ౨ ౫౬. పా.

డాలు. వై. వి. (సం. ఢాలమ్. క. డాలు.) 1. కేడెము. "గీ. నడుమనీ లన్నతోలుడాల్, బెడఁగు సూప" శుక. ౨, ఆ. ౪౨౬. పాండు. ౧, ఆ. ౧౦౦; 2 కాంతి. "క...అతనునిడా లావాల్బాపు లన మిటారి రహించెన్" వసు. ౨, ఆ ౨౩౮. రా. వి. ౧, ఆ. ౭౯; 3. కాంతి "సీ. నీలమేఘముడాలు డీలుచేయఁగఁ జాలు..." ఆము. ౧. ఆ ౧౨. ఆం. భా. ప్ర. ౮౨, 4. వీణాధ్వనివిశేషము. "గీ. డాలునకు డాలు చెల్లుగాఁ జాలు కంపితమునఁ గంపిత మయ్యె విధాత్రుశిరసు" పాంచా. ౧, ఆ. ౫. వరాహ ౧౧, ఆ. ౩౫.

డాలుకాఁడు. ద్వ విశే. (డాలు+కాఁడు.) డాలు ధార్పినవాఁడు. (శ. ర.)

డాలువాఱు. ద్వ. వి. కేడెము. (శ. ర.)

డావరడంగి. దే. వి. ఏరవకడ, దేవతాళము ? (శ.ర.)

డాహూళము. సం. వి. అ పుం. పక్షివిశేషము.

డి

డింక దే వి మరణము (చూ. డింకవేయు)

డింకవేయు దే. అ క్రి. (డింక+వేయు) మరణించు; "మ. కెడసెన్ దుష్టులు డింకవేసె కొలుఁగుల్ గిట్టెన్ బులుల్..." సా. ౧, ఆ ౧౦౭. ఆం. భా. కృ ౮౭.

డింకాకొట్టు = డింకవేయు. (శ ర)

డింకి దే. వి. (క. డింకి.) సాములలో నొకానొక భేదము, "ఉ దండములున్ బుటమ్ములును దాళములున్ బసికీలు తిర్గుడుల్, మండులు డింకులున్..." పార్వ ౬, ఆ. ౩౧.

డింకీలు దే వి బ మల్లవిద్యావిశేషము. ఆం. భా. ద్వి ౨౦౭.

డింకు దే అ క్రి. 1. చచ్చు; (శ. ర. ప్రా.); 2. అణఁగు (ప్రా.)

డింగరము. సం వి. అ పుం. 1. ప్రేరించుట; 2. చిమ్ముట, 3. తిరస్కృతి; 4. అరణ్యము.

డింగరీఁడు వై. వి. (సం డింగరః క డింగర) 1. సేవకుఁడు, 2 భక్తుఁడు, "ద్వి. మీబంట మీదూత మీడింగరీఁడ." బస. ౪. ఆ ౧౦౨. పం.

డింగరుఁడు. సం. విశే. (అ ఆ. అ) 1. మోసకాఁడు; 2. సేవకుఁడు; 3. అధముఁడు.

డింగిల్లు దే. వి. బ. నమస్కారభేదము (శ ర)

డించు. దే. స క్రి. 1. విడుచు; "చ...ఒకమాటు నాగ్రహము డింపవు" భార విరా. ౫, ఆ ౧౮౬. కాశీ ౨, ఆ. ౭౫; 2. తగ్గించు, "వ ...ఏము చాంద్రాయణంబులఁ జంద్రవృద్ధిబడిఁ గడి యెక్కించినఁ దా డించు..." ఆము ౫,ఆ ౯౫౭; 3. క్రిందికిఁ జేర్చు; "ఉ కాంచనపర్వతోన్నతముగాఁ బెనుబ్రో విడి మద్యభాండముల్,డించి..." భా. రా యు. ౮౫౮, పుసు. ౬, ఆ ౧౧.

డిండిమము. సం. వి. అ. పుం. 1. వాద్యవిశేషము; 2. కలివె ?.

డిండీరము సం. వి అ. పుం. ఫేనము, నురుఁగు.

డిండించు. దే. స. క్రి. (డిందుధా. ప్రే) 1. నశింపఁజేయు; "కా...రణపణ్ణాహంబు డిండించి రంగత్కోణం బడఁద్రొబ్బెఁ గృష్ణుఁడు..." భాగ. ౧౦,

స్కం. ౧, శ్లో. ౧౩౭౪; 2. ముంచు; "మ...నే నొల్లకుండిన నర్వోర్వియుఁ ద్రొక్కి తోయములలో డిందింతు..." హరి. పూ. ౧, అ. ౧౦౪

డిందు. దే. అ. క్రి. 1 తగ్గిపోవు; "సీ. సురుచిర కరుణవిస్ఫురణంబు డింది యొంతయు మాఁగువడిన మార్తాండుకరగిది" మార్క. ౧, అ. ౧౬౭. ఆం. భా. కృ. ౭౭, 2. అడఁగు మణఁగుపడు. "మ. అపాపులం, బిఱుపోవున్, బొద లిందు డిందుఁ బొదమున్..." భార. అర. ౬, అ. ౩౨౭. భార. ఆశ్వ. ౨, అ. ౧౮; 3. మ్రొగ్గు. "చ...తనయంగమునం గలమాంసమెల్లఁ జెట్టినను గపోతభాగము గడిందిగ డించుచు నుండె నత్తులన్" భార. అర. 3, అ. ౨౩౫; 4. తొట్రుపడు "ఉ. కాంచి విరించి నందనుఁడు కన్నులు బిమ్మిటిగొంద డింది యొ, క్కించుక కొంతు దేఱి..." పాండు ౨, అ. ౧౯౦; 5 మరణించు; "గీ రావణుఁడు డిందె భువనముల్ రక్తిఁ జెందె. ఉ. రా. ౧, అ. ౧౪౯; 6. అణఁపోవు; "మ ..పై మూడెడు తళ్ళ్రితాప మయుదీపజ్వాల డిందన్..." ఆము ౪, అ. ౨౪; 7. నశించు; "క. ముసుకొని దుఃఖములు డిందు మోక్షము చెందున్." వాసిష్ఠ. ౪, అ. ౯౬; 8. మునుఁగు; "శా రారానబ్ధిఁ గలంబు డిందుటయుం..." దశ. ౨, అ. ౭౯. వి అడఁకువ. (శ. ర)

డిందుపడు ద్వ. అ. క్రి. (డిందు+పడు-స్వార్థమున) 1. శాంతించు, "క ..అతనికిఁ బుట్టినయుత్తలపాటు కొంత డిందుపడఁగన్." భార. విరా. ౧, అ. ౯౯ భార ఉద్యో ౨, అ ౫౪, 2. సమాధానపడు, "ఆ ..తొడిగినట్టి తూపు గొనలోన పైచిన, దచుక డిందుపడదు మనసు నాకు" రామా. ౬, అ ౧౭౧, 3 మత్తెక్కు, ఆం. భా. కృ. ౧౧౬.

డిందుపఱుచు. ద్వ. స. క్రి. (డింపుపడు ధా ప్రే) పోఁగొట్టు, "సీ. సంతసంబున ముఖాబ్జమునందుఁ జిఱునవ్వు కందళింపకయుండ డిందుపఱిచి" స్వా 3, అ. ౯౭. భార. విరా. ౪, అ. ౧౭౮.

డిందుపాటు. ద్వ. వి. డిందు+పాటు) సంస్థచిత్తత; "క ..ఏమిటను డిందుపాటు లేకుండిన నంద భూపాలుండు .." విక్ర. 3, అ ౧౦౬. వైజ. 3, అ ౬౧.

డింపు దే వి. దింపు. "ద్వి పెద్దల బాలుర వేరయుఁ గాంతలుఁ, దద్దయు డింపునఁ దరలించుకొనుచు" ద్వి భాగ. ౧౧, స్కం. (శ. ర)

డింబము సం వి. అ పుం. 1. భయము; 2 కలలము, గర్భస్థపిండము; 3. ఆత్మునం దడమునైపున నుండు మాంసగోళము; 4 గ్రుడ్డు; 5 మొగ్గ.

డింభ. సం. వి అ స్త్రీ. ఆఁడుపిల్ల.

డింభకము. సం వి అ. పుం శిశువు.

డింభకుఁడు. సం. వి. అ. పుం బాలకుఁడు.

డింభము సం. వి. అ పుం మృగాదుల శిశువు.

డింభిక సం. వి. అ. స్త్రీ బాలిక.

డింభుఁడు. సం. విణ (అ. ఆ అ) 1. మూర్ఖుఁడు; 2. చంటిబిడ్డ.

డిఁగఁద్రావు దే అ క్రి. (డిగన్+త్రావు.) 1. అణఁచివేయు; "గీ మేలు డిఁగఁద్రావి కీడు దుగ్గమింపఁ జేయు, పాతకర్ముండు రాజైన బ్రతుకు గలదె." వేం. పంచ. ౧, అ ౪౫౬; 2. విడిచిపెట్టు; "సీ. వేగ మాయావధూవేషంబు డిఁగఁద్రావి..." హర ౬, అ ౧౩౧ ఉ. హరి ౬ అ ౧౭౩.

డిఁగఁబడు ద్వ అ. క్రి. (డిగన్+పడు.) 1 క్రేలాడు; "క మెడ బిగియఁబట్టుకొని డిగఁ, బడియొడిబాలకునిచేత .." భాగ. ౧౦ స్కం. పూ. ౨౭౪; 2. కేలపై కూలు; "ఉ...బలుండు సంగరా. ఘాటము దాఁటవైచిన విగంబడెఁ గ్రోతయుగంబు చక్కటికే" ఉ. హరి ౪. అ ౨౯౯.

డిగించు. దే. వి. క్రిందికిఁ జేర్పు; "చ మునివరి బుష్యశృంగుఁడు ప్రమోద మెలర్పఁగ శత్రు దారుణాం, బహుసురవారణంబుఁ దనకై నిజమంత్ర బలంబు పేర్మి మే, దినికి డిగింపఁగాఁ గొని..." హరి పూ. 3, అ. ౮౦

డిగియ. దే. వి. నడబావి "క...డిగియబావి దొరుకులన్" హంస. ౪, అ ౨౧౦ (శ. ర పా)

డిగు దే. అ క్రి. 1. అవతరించు. "చ. వినుకలిఁ గూర్మి జిక్క పృథివీభువనంబునకుం డిగఁగ నే, యనువును లేక..." నైష. ౨, అ ౫౪. 'క ఇది యేమి కంక నీ వున్మదవృత్తిని శంకదక్క నా గద్దియవైఁ, బవిలంబుగఁ గూర్చుండితి నదియుంచు గా కిపుడు డిగవు .." భార. విరా ౫, అ ౩౧౭. 2. క్రిందికి అణఁగిపోవు. "గీ. జలధి యుల్లోల కల్లోలములను దగిలి, యట్టె యొగయుచు డిగు

చును." దశా. ౧, ఆ. ౧౯౫; 3. తగ్గిపోవు "సీ. ఆతుని దానధారాపూర్ణవర్ష మూర్వరఁ బర్వ డిగిరెను నవగ్రహార్తి." వసు. ౬ ఆ. ౯౯; 4. బస చేయు "క చాలఁ గుఱ్ఱంగట మడుఁగుల, గాలాపుస్వేటలాడఁ గా దొరకిన బల్మిలం చవిఁ దల్పై నపుడా, పాలెంబున డిగిన లక్కిలా ట్రాతులకున్." కుచేల ౨, ఆ. ౧౦౮; 5 జాఱు "సీ. కటములఁ డిగి చిఱుతముని కేఁ బేరిన మదము..." ఆము. ౪, ఆ ౧౫౩ స. క్రి. అవరోహణము చేయు "చ. డిగకుఁడు వాహనంబులు కడింది మగంటిమి గోలుపోవ..." భార ద్రో. 3, ఆ. 3౮౧.

డిగుడు = దిగుడు. (శ ర)

డిగువ. దే. వి. క్రిందిభాగము. "ద్వి ఎందు లోకో న్నతుఁ డిటఁడె దుఃఖముల, డిందియక్కడ మలికి డిగువ నున్నాఁడు." రం. రా. యు. ౫౭౭, పౌ. ౭౯. సం. విణ క్రిందిది (శ. ర)

డిగువడు. ద్వి. అ క్రి. (డిగు+పడు) శాంతించు "గీ. అని యనేకవిధంబుల నతనియాగ్రహంబు డిగువడఁ జెప్పి రామావనీశు, నతులదివ్యాస్త్ర మహిమయు నట్లఁ దెలిపి" భా రా అర ౧, ఆ. ౨౫౭.

డిగ్గఁద్రావు = డిగఁద్రావు స. క్రి. 1. అణఁచివేయు. "శా. దుర్గంపుంబలు చిల్వరాఁపడగనున్ ద్రొంగెంపు జాచాయలన్, డిగ్గంద్రావి..." ఉ రా. ౪, ఆ. ౨౫౩; 2. పరిత్యజించు. "ఆ. మర్మభేద లైనమార్గణంబుల కోపాటించి సిగ్గుఁ బలము డిగ్గఁద్రావి." భార. కర్ణ. ౧, ఆ ౧౩౩ భో ౧, ఆ. ౧౧౧

డిగ్గజాఱు = దే అ. క్రి. (డిగ్గన్+జాఱు) క్రిందికి జాఱు "గీ ఆదికూర్మంబునకు భీతి యగ్గలింప, సప్తపాతాళములు డిగ్గజాఱి యడఁగ." హరి. ఉ ౯, ఆ ౨౭౦.

డిగ్గదాఁటు దే స క్రి. డిగ్గన్+దాఁటు) క్రిందికి దుముకు "క. శౌరిదివిజోన్ని శకునిబలము, న్నదగతి సాత్యకిరథంబు నడికిన నాతం, డది డిగ్గదాఁటి." భార భీష్మ. ౨, ఆ ౧౦౭

డిగ్గన. దే క్రి. విణ. ద్రు. కటాలున 'ద్వి గద్దియ మీఁద డిగ్గన డిగ్గ నుఱికి." రం రా యు ౨౯౭, పౌ. 3. కు. ఋమా. ౫, ఆ ౨౬.

డిగ్గించు దే. స. క్రి. దింపు. "వ...అమ్మానవనందనుం దరదంబు డిగ్గించె.." భార. సౌ. ౨, ఆ. ౨౬.

డిగ్గియ. వై. వి. (సం. దీర్ఘికా.) నడబావి. "సీ. అలరు పత్త్రమ్ములకలిమిఁ జెల్వగు డిగ్గియలతీర భూముల నట్లఁ బొంది" భార. శాం 3, ఆ. ౩౩౨. అం. భా ప్ర. ౧౬౩.

డిగ్గు. దే. అ క్రి. 1. క్రిందికి వచ్చు. "సీ. పంచ పాటుగా డిగ్గుపవనాంకురంబులు జడలిక యూర్పులభాగుఁ దెలుపు" కపు 3, ఆ ౬౨ 2 అవరోహించు. "సీ. పేరోలగంబునఁ బెద్దగద్దియ నుండి దృష్టించి డిగ్గినధీరతయును." నైష ౨, ఆ. ౩౫; 3. పలితము గు, రాలు "చ. ఒక చికురున్ సుపర్వ యగుచుర్వికి డిగ్గఁగనీవు .." ఆము. ౪. ఆ ౯౦; 4. దిగఁబడు "ఉ...పెం చాన లిసాత్మ జవెంట బ్రేఁగునన్, మిక్కిలి డిగ్గ పాపసరణిన్..." ఆము. ౫, ఆ. ౬౯; 5. సన్నద్ధము గు. "ఉ...రాముని బాట సేను సుగ్రీవుఁడరా దురాత్మ రణకేళికి డిగ్గుడు గాక..." భా. రా. యు. ౪౭౩; 6. ఉపశమించు. "సీ కరిముఖుం డెప్పుడు కడుపుబ్బు డిగ్గనికతన లంబోదరాఖ్యా కు దయ్యె" వరాహ ౧౨, ఆ. ౬౧. ద్వా. ౫, ఆ. ౭౩; 7. తగ్గిపోవు. "గీ వాహకుం డెక్కి విడిచినవారువంపుఁ, గోదమయుంపుబోలి రతికేళిమదము డిగ్గి." క్రీడా ౮౭, 8 దిగుమతి యగు "సీ మలయజం బేవటఁ దొలుచెక్కడు లిచి మేడల కిడ్డ మిగులు భూములకు డిగ్గు" ఆము ౨, ఆ 3. స క్రి. 1. అవరోహించు. "చ తురగము డిగ్గి తల్లజముతో శతధన్వుఁడు పాదచారియై..." భాగ. ౧౦, స్కం. ఉ. ౯౦. వరాహ. ౧, ఆ. 3; 2 పైనుండి క్రిందికి దిగు. "మ ..ఈసుల్లీ డిగ్గిన యా యూడలఁ బ్రాకి కాదె మనోగ్గం బోయఁ దేజాలమున్" కేయూర 3, ఆ ౪౮ కాశీ. ౨, ఆ ౨౧౧. వి. 1. త్రైణ్యము, తక్కువతనము. "అ ఒక్కరూపు కాని యొక్కఁడు డిగ్గుచు, గానరాదు ముఖ్యనిరూపమునకు." నిర్వ ౧, ఆ ౪౪; 2. ఊటుకులు మున్నగువానియం దగుధ్వని కనుకరణము "గీ. అని శపించినఁ దుంబురుఁ డతిభయమున, డిగ్గనంగ విమానంబు డిగ్గనుఱికి." హర. ౧, ఆ. ౫.

డిగ్గడు. దే. వి. దిగులు. "ద్వి. కొమరుదలిర్పి కొక్కుళ్ల డిగ్గళ్ల" పండితా. పర్వ ౩౪౩, ప్రా. విశే. 1. భల్లము; (శ ర) 2. తక్కువ (శ ర.)

డిగ్గన. దే. క్రి. విశే. తటాలున; "సీ. కొలువున నుండి డిగ్గన డిగ్గనంతన్" దశా ౨, ఆ ౧౩౧.

డిగ్గుపడు. ద్వ. అ. క్రి (డిగ్గు+పడు) న్యూనమగు, తక్కువపడు. "ఉ...చుక్కల సోయగంబు ము,త్యాలబెడంగు డిగ్గుపడునట్లుగఁ జేసిన బాగపుం బలీ." య. ౪, ఆ. ౧౬౩.

డిక్షుఁడు. సం. వి. అ. పుం. విశేషలక్షణములు గల పురుషుఁడు ("శ్లో. శ్యామరూపో యువా విద్వాన్ సుందరః ప్రియదర్శనః, సర్వశాస్త్రార్థ వేత్తాచ డిత్థ ఇత్యభిధీయతే.")

డిప్ప. దే. వి. 1. అఁటిచెట్టుపైపొర. (వా) 2. పుపర పరవ మొవలగుకాయల పైతొక్క (వా); 3. తలపైచిప్ప (వా)

డిప్పకాయ. దే. వి 1 తలపైకొట్టుదెబ్బ (వా) 2. ఊరుఁగాయ. (వా)—విశే. అల్లరివాఁడు. (వా) అతఁడు పట్టిడిప్పకాయ.

డిబ్బి = దబ్బి. (వా)

డిబ్బీ = డిబ్బి. (వా)

డిబ్బుడిబ్బు. దే. వి. మొండెములు నేలపైఁ బడునప్పుడు కలుగుధ్వని కనుకరణము; "చ ..డిబ్బుడిబ్బునఁ బడునట్టులుం గడుభయావహమయ్యె మహారావంబునన్." కు. సం. ౧౧, ఆ. ౧౫౧.

డిమము. సం. ౨. అ. పుం. దృశ్యకావ్యభేదము.

డిమ్మరి. దే. విశే. దుష్టుఁడు. (చూ. డిమ్మరితనము.)

డిమ్మరితనము. ద్వ. వి. (డిమ్మరి+తనము) చెడ్డతనము "క. మనికలపురుషులయెడఁ గా,ట్టినయది తల్లి దరి నేఁత డిమ్మరితన మె, ట్టినిక్రృష్టుం డైనను ని, ప్పనికిఁ బోఁడు..." భార. శాం. ౬, ఆ. ౨౦౮.

డిమ్మ. ఆం. విశే (Dim) కాంతిలేనిది

డిల్ల. దే వి. పిఱికితనము. "ద్వి డిల్ల సొంపఱి తల్ల డిల్ల..." అ. మ క. ౨, ఆ. ౬౭. ప్రా.

డిల్లగుడుచు దే.అ.క్రి. (డిల్ల+కుడుచు ) అధైర్యపడు "అ. అయిన నిట్టిమాట యీవెలందుకయొద్ద, అనిన డిల్లగుడుదు నట్టుగాన" కాళిందీ.౧, ఆ. ౧౨౦.

డిల్లచెడు. దే. అ. క్రి. (డిల్ల+చెడు ) ధైర్యముపోవు, "సీ కుంభినిఫణముఁదిరొని డిల్లచెడినట్లు పరవశు గలిరుగ్గకరణినుండ." ఇందు. ౪, ఆ. ౩౭.

డిల్లతనము. దే. వి. (డిల్ల+తనము.) తెలతెలపోవుట. "ఉ. దెండము విన్నపయ్యె నొకడిల్లతనంబొదఁ గూడె మోముపైమందరిలాగుగాఁదు.." కావ్యా. ౨, ఆ ౫౯.

డిల్లపడు. ద్వ. అ. క్రి. (డిల్ల+పడు.) (భయపడుటచే) 1. బలహీనమగు. "ఉ...తమవృద్ధతమర్మ జలంబుఁ దాల్చుచున్, డిల్లపడంగ .." భార. విరా ౨, ఆ. ౯౧; 2. కలఁతనొందు. "వ... వలవంతల సొగలఁగ్రాఁగి వేఁగిసైపరాకున్న డిల్లపడి .." నీలా ౩,ఆ ౩౦ ఆం. భా. కృ. ౧౦౦; 3. భయపడు. "గీ...జనులెల్లఁ దల్లడిల్ల ప్రేమల్లె దద్దయుఁడిల్లపడియె. హరి పూ. ౬, ఆ. ౯.

డిల్లపాటు. ద్వ. వి. (డిల్లపడు ధా.) 1. అధైర్యము. "గీ. బాణహతినిం దుకయు డిల్లపాటుగలిగి, తోన తిరమైన ధైర్యంబుతోడఁ బొలిచి "భా. రా. యు. ౧౦౪౮, 2. తెల్లఁబోవుట. "చ. అరవిరి బాగుతమ్మరస మాటివకన్నులు డిల్లపాటుక్రొం, జీఁకుచెమటల్ ..." వేం. పంచ. ౪. ఆ. ౩౫౧.

డిల్లపోవు. దే అ. క్రి. (డిల్ల+పోవు.) అశ్చైర్యపడు. "సీ. ఉరుకుచాప్రుల నంట రూపించు సూహించి శ్రేష్ఠునలంగిన డిల్లపోవు." సాంబో. ౧ ఆ. ౭౦.

డిల్లము. దే వి 1. వ్యాకులత్వము. "ఉ...ఉల్లము డిల్లము చెంద నవ్విభుం, డొండొకధర్మమార్గమున నొప్పఁగ సంతతి నిర్వహింపఁడే." భో. ౨, ఆ. ౧౯౬; 2. దౌర్బల్యము. 'ఉ తల్లుల సేరిన న్వినక దానులడిక్కుచు జూడ కంగముల్, డిల్లము నొంద..." పద్మ. ౩, ఆ. ౧౪౩.

డిల్లాయి దే. ౨. 1. నాట్యవిశేషము. "ద్వి. డిల్లాయి గంగాణి తేవణి ఝుండి." పండితా. పర్వ ౩౭౮, ప్రా, 2. అశ్వశిక్షలలో నొకటి. "సీ. డిల్లాయి ప్రకటించి తేప చూ ." పై. శకు. ౧, ఆ. ౧౧౨.

డిస్ట్రిక్టు. ఆం. వి. (District) జిల్లాకలెక్టరు అధికారిమున నుండు దేశభాగము.

## డీ

డీ. దే. అవ్య. 1. తలతో పొడిచి ఆడునపుడు పిల్లలనుమాట. (వా.); 2. పొట్టేళ్లను పోరించుటకై పురికొల్పుమాట. (వా.); 3 యుద్ధప్రేరణము. (చూ. డీకొను, డీకొలుపు ము )

డీకు. దే వి. పురికొలుపుట. (శ. ర.)

డీకొను. దే. అ. క్రి. (డీ+కొను.) పూనుకొను. "శా...దిగ్విజయ మీ డీకొన్నచందాన..." విజ. ౧, ఆ. ౧. ౪. క్రి., స. క్రి. 1. ఎదుర్కొను. "ఉ. ఖేదిలద్రొబ్బ నయ్యగర భిమిటి కొంది చెమర్చి మ్రొగ్గి దుర్మాదముతోడ డీకొను బ్రమత్తవిమర్దను నాజనార్దనున్." భాగ. ౧౦, స్కం. పూ ౧౧౮౩. ఆం. భా. శ్రీ ౧౩౬; 2 ఆటయందు బాలురు డీడీ యనుచు తాకుకొను. (వా), 3. పొట్టేళ్లు పోట్లాడుటవలె తాకు. "క...డీకొనఁగాఁ దగ రని వాసినఁగని రోటము పెట్టినట్లు కోవసాధా." భార. ఉద్యో. ౨, ఆ ౧౩.

డీకొలుపు దే. స. క్రి. (డీకొను. ధా. ప్రే.); 1. ప్రేరేపించు "క...ఏకాంతంబున నుండిన, లోకములోఁ దలఁప నెట్టిలోకుల్మనైనన్, డీకొలుపు బుద్ధి నలిపై .."బిల్హ. 3, ఆ. ౭౮; 2. కలియఁజేయు. "క . ఆజక బాలకుఁ డనియును, గొంజక దయమాలి రాజకుంజర యంతన్, గుంజరమును డీకొలిపెను, గుంజరపాలకుఁడు గోప కుంజరుమీఁదన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౧౭. పా. ౨, ఆ. ౮౬.

డీకొల్పు = డీకొలుపు. (కలియఁజేయు) "క... డీకొల్పి రతుల .."హంస. ౨, ఆ. ౧౭౦. దశా ౪, ఆ. ౧౮౪.

డీకోలు. దే. వి. (డీకొను ధా.) డీకొనుట (శ. ర.)

డీడిక్కు. దే. వి. బాలురు ఆటలో తలలు తాఁకించునపు డుపయోగించుమాట. (చూ. డీడిక్కులాడు.)

డీడిక్కులాడు. దే. అ. క్రి. (డీడిక్కులు+ఆడు.); 1. బాలురు డీ డీ డిక్కు, అనుచు తలలు తాఁకించుకొను. (వా.); 2. ఒకదానితో నొకటి కొట్టుకొను. "క. ఉరుపడి డీడిక్కులాడునొ పునఁ దఱుచై." రంగా 3, ఆ, ౬౭.

డీనము సం. వి. అ. న. పక్షియొగురుట. వి. ఙ. (అ. ఆ. అ. ఎగిరినది. [శ్రీ. ౮౮.

డీలగు. దే అ. క్రి. (డీలు+అగు.) తగ్గు. ఆం. భా.

డీలపోవు = డీలుపడు (వా.)

డీలాకుషు = డీలపోవు. (వా.)

డీలించు దే. స. క్రి. చులుకనగాఁ జేయు. "గీ. సగము డీలించ బాహులు దిగిచికొనఁగ." నిర్వ.౪, ఆ. ౯౫.

డీలు. దే. అ. క్రి. నిస్సారమగు. (శ. ర.) విణ. దుర్బలమైనది. "మ. అరుణాంశుండు హిమర్తుపన్రజని డీలై క్రుంకి .."ఆము. ౫, ఆ. ౧౦౫.

డీలుకొను. దే. అ. క్రి. (డీలు+కొను.) చెదరు. "వ...డీలుకొనం బడుపడగండ్లగములు..."పార. ౨, ఆ ౨౦.

డీలుపడు ద్వ అ. క్రి. (డీలు+పడు.) 1. బలహీనమగు "మ ..భోగివరుండు డీలుపడ..."ఉ. రా. 3, ఆ. 33౮, శైవ. ౨, ఆ. ౫౦; 2. వ్యర్థమగు "ఉ ..అతనియాలు డీలుపడ నట్టిమనోజునివాలు..." శుక. ౨, ఆ. ౬౨. శ్రీ. శకుం. శీత. ౨౯; 3. బాధపడు "ద్వి. ప్రకృతివాసన డీలుపడుచు నజ్ఞానవికరవారిధుల మునింగి తేలుచును." ద్వి పరమ. ౧, ఆ. ౨౨. పా; 4. మరణించు. (చూ. డీల్పడు.)

డీలుపఱచు. దే స క్రి. (డీలుపడు. ధా. ప్రే.) తక్కువపఱచు. (చూ. డీల్వఱచు )

డీలుపాటు ద్వ. వి (డీలుపడు ధా.)"గీ....డీలుపాటు ప్రకటదైన్యంబుఁ దోఁప..."శైవ ౭, ఆ. ౫౨. (శ. ర.)

డీలుసేయు = డీలుపఱచు. (డీలు+చేయు.) "సీ. నీల మేఘముడాలు డీలుసేయుఁగఁ జాలుమెఱుఁగుఁ జామనచాయ మేనితోడ." ఆము. ౧, ఆ ౧౨

డీల్పడు = డీలుపడు. (వ్రతిగొను.) "సీ మడియుట తెగుట డీల్పడుట..."ఆం.భా.ద్వి.౨౨౫.

డీల్వఱచు. = డీలుపఱచు "సీ. పూరోత్తముఁడు వాయుసుతుఁ డంత నిల కలిగాఢప్రమోదసంఘటన దొరక, లంక పెంపెల్ల డీల్వఱచె..." రాఘవ. ౪, ఆ ౩౨

## డు

డు. దే. ప్ర. (ఇది బిందుపూర్వకముగా నుండును.) 1. ప్రథమావిభక్తిప్రత్యయము. ఉదా:— రాముఁడు, రంగఁడు; 2. ప్రథమపురుషప్రత్యయము ఉదా:—వినుచున్నాఁడు, చదువుఁడు. మొ; 3 ప్రార్థనాద్యర్థకములందలి మధ్యమపురుషప్రత్యయము. ఉ: —చదువుఁడు, రండు. పొండు. మొ; 4. కర్తృ, కర్మ, అధికరణ, కరణ, భావార్థములందు నిర్బిందుకముగ వచ్చువర్ణము. (కర్త్రర్థము.) "క . కుఱుమాపుడుఁ బుట్టం, బల పడఁ గట్టి ..' భార. విరా. ౧, ఆ ౨౯౧.

(కర్త్రర్థకము.) "చ. కనచెలు లిండ్లయం దదవ ద్రావుకు ద్రావుచు..." పాండు. 3, ఆ. ౧౯. (అధికరణార్థము.) "ఉ. ఎక్కడివా రొకో గరుడు డెక్కుడుగాఁ గలవారు..." ఉ హరి. ౬, ఆ. 3౭. (కరణార్థకము.) ఉదా:— త్రోపుడుబండ, చోపుడుకోల. మొ. (భావార్థము.) "ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడుపుట్టుడుఁ జేరఁడ పుట్టు నుత్తమజ్ఞానము..." భార. ఆది. ౧, ఆ. ౧౫౯.

దుంకు. దే. అ. క్రి. (క. డొంకు.) 1. కగ్గు. ఆం. భా. కృ. ౯౯; 2. వళవుగు "ద్వి. శంకింప కెదురుగాఁ జనుదెంచురిపుల, దుంకఁబట్టుచుఁ బండ్లు దుల్లంగఁ గొట్టి." అ. మ క. ౧, ఆ ౫౯. పొ. ౨౬, పొ.

దుంగు. దే అ. క్రి. వణఁకు, చలించు. "క. వాలు వయునదుచున ట్లుబ్బాలిక నడునడన దుంగి భయ మున..." భార. ఆది. ౨, ఆ. ౧౫౫. కు. సం ౨, ఆ. 3౯.

దుంఠి. సం వి. ఇ పుం. కాశికలో వాయవ్యభా గమున నున్నవిఘ్నేశ్వరుఁడు "శా...లోలార్కు నిన్, దుంఠికున్ వినుతించి..." చంద్రా. 3, ఆ. ౭౨. కాశీ. ౧, ఆ ౨.

దుండుకము. సం. వి. అ. పుం. దుండిగము. ౘ విణ. (అ. ఆ. అ.) 1. అల్పము; 2. క్రూరము.

దుండుభము. సం వి. అ. పుం. విషము లేనిరెండు తలలపాము.

దుక్కు. దే. అ. క్రి. 1. దాఁగు "ఉ:...అక్కట దిక్కులేమి రజతాచల మెక్కఁడు పెల్లగించె... అంచునవ్వరిన్, దుక్కినగట్లరాజ కొడుకున్ నవరత్నవినూత్నసౌధముల్." చంద్రా. ౧, ఆ. ౧౫; 2. వాడు, వడలిపోవు. "చ. కొలనికెలం కులన్ జెలులు కమలి నిల్చిన మేనికాఁక చే నల నలఁ గాఁగ నీర్లు...దుక్కె విసంబులు ప్రీతె బత్త్రముల్." ప్రబంధ. ౫3౯.

దుబుదక్క. వై. వి. (సం. హుండుక్కా.) దుబు దక్కవాదివాద్యము. "సీ. కడిదివిరాళంగఁ జంక నిడినకొట్టియకోల డాకమ్రోసెడు దుబుదక్క కేల." హంస. ౨, ఆ. ౨౭. చంద్రా. ౮, ఆ. ౬.

దుబుదక్కవాఁడు. ద్వి. వి. (దుబుదక్క+వాఁడు.) సోయిలవాఁడు, "గీ. వచ్చె నభటికి దుబుదక్క వాఁ డొకండు." హంస. ౨, ఆ. ౨౭. చంద్రా. ౮, ఆ. ౬.

దుయ్యు. దే. అ. క్రి. 1. నాఁటి పైకి వెడలు. "క...అది గుఱ్ఱక్క ఆ గాఁడి దుస్సి పాఱిన.." స్కా. ౮, ఆ. ౮౫. భా. రా. యు. ౬౯; 2. తెగు. "సీ. తోరణంబులు దుస్సి ధూళిఁ గలసె." వీర. ౮, ఆ. ౨౮౬. స. క్రి. 1. పైకి తీయు. "వ...ఆడిదంబులు దుస్సి వ్రేసినఁ బూసిన చందంబున నేలం గూలిన యేనుంగుపీనుంగు లును.." ఉ హరి. 3, ఆ. ౨౭; 2. నద లించు. "ఉ:...దీని మిత్రికిం బుత్త మటంచుఁ బట్టెదలు బోరన దుయ్య భయంకరాకృతిన్." స్కా ౮, ఆ. ౮౦; 3. గ్రుచ్చు. "ద్వి...గొ ఱ పంబులను దుస్సి..." రం. రా. ఉ. ౫౨, పొ. ౯. పం.

దుఱ్ఱుచ్చి. దే. వి. 1. యుద్ధమునకు పిలుచుటయం దుపయోగించుమాట. (బ్రా. శ. ర.); 2 ఆఁబో తులను తెచ్చకొట్టుట కుపయోగించుమాట. (వా.)

దులదుల. దే. వి. రాలుట నున్నగువానియం దగు ననుకరణము. "ద్వి. ప్రళయకాలమునాఁటి బ్రహ్మాండతలము, దులదులఁ జుక్కల దుబ్బికైవ డిని." రం. రా. యు. ౮౧3, పొ. ౭౬. పం.

దులి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు.

దులిపించే. దే. స. క్రి. (దులుపు. ధా. ప్రే.) రాల్పఁజేయు. (చూ. దుల్పించు.)

దులుచు. దే. స. క్రి. 1. పడఁజేయు "వ. ముట్ట కోలల రారాజానుకుటుంబముజులు దులిచి.." భార. విరా. ౫, ఆ. ౨౨౧. కు. సం. ౮, ఆ. ౧౧౫. వరాహ. ౧, ఆ. ౫౨; 2. ఊడఁదీయు. "సీ. సాలీఁడు గాఁబోలు సమద వేదండంబు తెలి నారచీరలు దులిచి తెచ్చు." కువల. ౨, ఆ. ౬3. ఆము. ౨, ఆ. 3; 3. పోఁగొట్టు. (చూ. దుల్పు.), 4. ఎడచేయు. "ప. ఖాండిక్యుండు భయకర్మంబులు దులిచి..." ఆము. 3, ఆ. ౮౯.

దుల్లు. దే. అ. క్రి. 1 రాలిపోవు. "ఆ. రత్నశేఖ ములు రాజితశేఖరంబులును రుచిరకుంటికలును బార్థుబాణనికాలిఁ దునిసిపడెఁ గౌరవులచేతు, తెలుప దుల్లుమల్లములను బోలె." భార. విరా. ౫, ఆ. ౫౦. భార. ద్రో. ౧, ఆ. ౧3౨; 2. ఊడిపడు. "వ...కాండిలి యనునొక్కతపస్వి

కేటుఁ, బోవుతఱి డేగపడముగ భోజనంబు, జేసి..." సా. ౧, ఆ. ౨౯.

డేగాట. దే. వి. (డేగ+ఆట.) పెండ్లిలో అయిదవ నాఁడు వధూవరుల నెత్తికొని డేగలవలె ఆడెడు ఆట, దండాడింపు. (బ్రా. శ. ర.)

డేగిసా దే. వి నీర్లకాఁచెడి కాఁగు. (వా.)

డేర. దే. వి. గుడారము. వేంక. మాన ౨౭.

డేరా = డేర. "గీ చాల నలరారు డేరా వాకార మునను." రసిక. ౩, ఆ. ౧౪౧.

## డై

డైరీ. ఆం. వి. (Diary) దినచర్య. దినచర్యవ్రాయు పుస్తకము.

## డొ

డొంక. దే వి. 1. పొద. "సీ. పాలచేరులఁబట్టి తూలింప బలిమి నీడ్చుకొని డొంకలఁ దూఱి చుట్టఁబెట్టు." స్వా. ౪, ఆ. ౪౭. రామలిం. ౧౨, 2. కల్లపుప్రదేశము. "చ.. డొంకలను వంకలఁ బంకము లారె .." కృ. శకుం. ౧ ఆ. ౪౪. "గీ గంగ ప్రవహించునీటిడొంకలను బోలె." పాండు. ౫, ఆ. ౧౫౪.

డొంకవల. దే. వి (డొంక+వల) ఒకరకపువల హంస ౪, ఆ. ౧౯౫.

డొంకు. దే. అ. క్రి. (క. డొంకు.) 1 క్షీణించు. "ఉ.. దరస్మితకిలాపుఁజంద్రిక డొంకె వాడు టన్." స్వా. ౩, ఆ. ౫౩. వా. పంచ ౭, ఆ. ౧౧౪; 2. తగ్గు. "చ...మరుకెట్ట కెఱంగున డొంకి డొంకి పొర్లినగతి..." హంస. ౩. ఆ ౧౦౩; 3. ఇంకిపోవు. 'క. ధరణీపంకంబు లింకె కటినులు డొంకెన్." భా. రా. కిష్కిం ౪౦౯. నృసిం. ౩, ఆ. ౧౧౦, 4. దాఁగు. 'సీ. ఇన కరాంకురముల కెడయాని మ్రానిక్రీనీడతావల డొంకి నిలిచెఁ గొన్ని" వెం. పంచ. ౪, ఆ. ౭౩౯; 5. వెనుదీయు. "చ. ముని మఱిచీఁకటి స్నదుప ముంగిటివాఁకిట నైననొంటిపాటున నడయాడుజవ్వనుల డొంకక పర్యోద నైనఁ గెట్టనైనను...పట్టు..." దశా. ౯, ఆ. ౭౭౨. వి. వంకర. "ద్వి. గూను డొంకులు దీఱఁ గ్రుమ్మడి వాఱు." రం. రా. అయో. ౧౩౦, పా. ౧౪. పం. రా. వి. ౧, ఆ. ౭౬. విణ 1. వంకరైనది. "సీ. వికలంపుఁ గాల్గళోగిక డొంకుచేతులు బందిలి గుంజలపగిది కాళ్లు." ప్రబంధ. ౭౭౩, ఉ. హరిశ్చ. ౪, ఆ ౧౫౭; 2. అవ్యక్తమధురమైనది. "ద్వి కల్లడిగొన డొంకుమాటలు జేర్చి." రం. రా. బాల. ౭౦. పా. ౭౯. పం.

డొంకెన. దే.వి. 1. వంకరయులుగు గలయాఁటె.(శ.ర.) వంకర యైనచ్ఛేదనసాధనము. "ఉ . ఈఁటెల డొంకెనలన్ గటార్ల బల్, కత్తుల నత్తలంబు లను." కళా. ౯, ఆ. ౫౭. భోజసుతా. ౩, ఆ. ౨౯; 2. చివరచిన్నపుల్ల కట్టి కాయలు మొ. కోయుట కుపయోగించుగడ. (వా.) ఆడొంకెనతో కాయలు కోయుము.

డొంకెనపోటు దే. వి. (డొంకెన+పోటు.) డొంకెనతో పొడిచినపోటు. "క. పడిఁ కేడిఁ టోలి రా ఙార్వడి డొంకెనపోటుగా నురఃస్థలి నపుడా, పిడికటిగోరకన్ వేయన్.. " సా. ౧, ఆ. ౯౬. "సీ. డొంకెనపోటులఁ బొంక మడఁచి." భార. శల్య. ౧, ఆ. ౩౪౦.

డొంగ. దే. వి. దొంగ. "గీ. డొంగవలె వచ్చి యిచ్చట డొంగిసావ, దేవయా..." వైజ. ౪, ఆ. ౩౬.

డొంగియాడు. దే. అ. క్రి. (డొంగి+ఆడు.)బాలురు చేతులు మోఁకాళ్లు ఆని నడచు..."సీ. ఎలనవ్వు పాలబుగ్గలపై దువాళింప నత్తత్త యని డొంగి యాడు చుండ." సా. ౧, ఆ. ౪౯. ద్వి. పరమ. ౫, ఆ. ౩౭౭. పా.

డొంగు. దే. అ. క్రి. 1. దాఁగికొను. "గీ. డొంగ వలె వచ్చి యిచ్చట డొంగిసావ, దేవయా..." వైజ ౪, ఆ. ౩౬; 2. ప్రాఁకు. "ద్వి. ఎలమిఁ గూర్చుండియు నేఁగరాకున్న, నిల డొంగి డొంగి యొక్కింత నడఁగఁ, బోరఁ బోరి డొంగియుఁ బోవ రాకున్న." పండితా. పర్వ. ౫౭౩, పా. ౧౭. పం. వి. 1. చెట్టులొఱ్ఱ. (బ్రా. శ. ర.); 2. చిల్లి, రంధ్రము. (చూ. డొంగులువాఱు.)

డొంగులువాఱు. దే. అ. క్రి. (డొంగులు+వాఱు.) తొఱ్ఱలేర్పడు. 'ద్వి. పలుచని నిడువాలు పదను దూపునను, గొరిచినరీతి డొంగులువాఱ గొఱిగి." ఆ. ము. క. ౭౦౯, పా. ౧౬. పం.

డొకారము. దే. వి. కడుపు, అంతరాళము. (శ. ర. చూ. డొకారముపొచ్చు.)

**డొకారముపొచ్చు.** దే. అ. క్రి. (డొకారము+చొచ్చు.) 1. లోపల ప్రవేశించు. "చ. కరుణను క్రోధముం చని డొకారముపొచ్చిన నాఁగ..." పార్వ. ౫, ఆ. ౨౦౭; 2. శరణుచొచ్చు. "చ. గరగరి మాని యొక్కట డొకారము పొచ్చుమహోద్రులో యనన్." చంద్రా. ౧, ఆ. ౧౩. ౪, ఆ. ౨౭౦.

**డొక్క.** దే. వి (క. డొక్కె.) 1. ఎముకలగూడు, కంకాళము. "క. ధూమాయక దుందుభి యను, వానికళేబరము కొత్త వాలి యొకం డై, కేశొకయ నగుడుఁ దక్కన,వానికి నాడొక్క కొత్త వచ్చున జగతిన్." భా. రా. కిష్కిం. ౧౪ భార. శాం. 3, ఆ. ౨౧౪; 2. టెంకాయపై చెక్క. ఉదా:—కొబ్బరిడొక్క; 3. శవము; ఆం. భా. ద్వి ౧౩౪; 4. శరీరము. "వక్కసపుమద్యపానపు, డొక్కపసం దగిలి దుర్వృత్తుండై చెడిరిన్." భాగ. ౬, స్కం. ౧౩౬. వేమన. ౧, ఆ. ౧౬౭; 5. ఉదరము. "గీ. శరధిజలమెల్ల రిక్తగాఁ గురియ నుప్పు, డొక్కఁ జేరిన నత్తెర్చి చక్కి..." ఆము. ౪, ఆ. ౧౭౦. ఆం. సం. మాన. ౨౪. విణ. ముసలివాఁడు. ఆం. భా. ద్వి. ౧౧౮.

**డొక్కబుట్ట.** దే. వి. (డొక్క+బుట్ట.) లేగ పాలకీ పీడిన కాటివిత్తు. (శ. ర.)

**డొక్కరము.** వై. వి. (సం. డోక్కరమ్. క. డొక్కర. హిం. ఠోకర.) మల్లబంధవిశేషము. "గీ. కళవరానకు వచ్చి డొక్కరము వ్రాత్తి." ఉ. హరి. 3, ఆ ౬౮. భాగ. ౧౦. స్కం. పూ. ౧౩౪౫.

**డొక్కు.** దే. అ. క్రి. ముడియు. (శ. ర.) విణ. ముడిసినది. ఆం. భా. ద్వి. ౧౧౯.

**డొగరు.** దే. వి. 1. అపరాధము, 2. నింద. (శ. ర.

**డొప్పు** = దొప్పు. (దొన్నె.) "గీ..... డొప్పుదెప్పులును..." శైవ. ౭, ఆ. ౯౩.

**డొమిణి.** దే. వి. (హిం. డోమని.) దొమ్మరులలో నొకజాతివాఁడు. హంస. 3, ఆ. ౨౯.

**డొలుక.** దే. వి. దొలుక. "క. రవిమండలము డొలుకగా నని చెల్లెన్." కళిక. ౨, ఆ. ౧౯౦.

**డొల్చు.** దే. స. క్రి. డొల్లఁజేయు, దొరలించు. "సీ...అబండికలు డొల్చి నత్యలోకంబునుండి యూకములగద్దుఁ, దు..." కాశీ. ౧, ఆ. ౭౭.

**డొల్ల.** దే. వి. 1. చేటవలె మూఁడుప్రక్కలందు అడ్డుపులకలు గలబల్ల లోనగునది. "మ...విరోధులంబునిధివెల్లిం డొల్లఁ జెల్లింపఁగన్. ఉ: హరి. ౪, ఆ. ౨౦౬; 2. మల్లసాధనవిశేషము. "సీ. కంబము కోణత లాగను డొల్ల..." ప్రబంధ.౮౭.

**డొల్లబొట్ట.** దే. వి. (డొల్ల+పొట్ట.) బొజ్జకడుపు. "క. డొల్లంబొట్టతోం జంకర,కాళ్లన్..." మల్హా. ౨, ఆ. ౬౭.

**డొల్లు.** దే. అ క్రి. 1. పొరలు,ప్రవహించు. "గీ. డొల్లునీరంబు నాఁకట్టఁ జెల్లఁగాక." కవిక. ౪, ఆ. ౧౧౯; 2. దొరలు. "సీ. ఎలనీటిబొండలంబులవోలె మెదడెల్ల జుట్టిపై చిన డొల్లుపుట్టెగములు." ఆము. ౯, ఆ. ౧౭. కాశీ. ౧, ఆ. ౭౭; 3. వ్రేలాడు. "చ...ఒయారపుగండపుఁజూఁక డొల్లుపోఁగులు..." హంస. ౧, ఆ ౨౩౨; 4. తెగిపడు. "క. విందునికల యిలపై డొల్లఁగ చేసెఁ దీవ్రభల్లప్రవాలిన్." భార ద్రో. 3, ఆ. ౧౪౬. భార. భీష్మ. ౧, ఆ. ౨౭౦; 5. నదులగు. "ద్వి. డొల్లకుప్పసములు నల్లగాజులును." పండితా. పర్వ. ౩౫౩, పొ; 6. విడిపోవు. "చ. నివిడినబొజ్జపై మిగులనిద్దపుదోవతిదట్టి డొల్లి రాఁ, దివిచి..." ఆము. ౬, ఆ ౧౧; 7. చచ్చు. "చ...అరాతిసేన డొల్లనడిచి యీఁదుశర్మని బలంబుఁ జలంబున మాన్చి..." భార. విరా. 3, ఆ ౨౦౪. విణ. వ్రేలాడునది. "వ...మూరకొక్కండును జేన కొక్కండును గాఁ గుట్టిన డొల్లుటుల్గారు లుల్లసిల్లి.." ఆము ౪, ఆ. ౩౫.

డో

**డోంబి.** సం. వి. ఈ. స్త్రీ. రూపకములలో నొకటి.

**డోఁకి.** దే. వి. పట్టుకొనుటకు వెదురుబద్ద గ్రుచ్చిన చిప్ప. "సీ. చెలమలో నీరుడోఁకులఁ జేట్ల దోఁడుఁగా కడితోయముఁ దోడ నలవి యగుచు." రామలిం. ౯౭.

**డోఁకు.** అ. క్రి. (హిం. డోక్ ) క్రక్కు. (వా.) వి. వమనము. (శ. ర.) స. క్రి. గడ్డిలోనగువానిని పాటు మున్నగువానిచే చెక్కు. (వా.)

**డోఁగాడు.** దే. అ. క్రి (డోఁగు+ఆడు) బిడ్డ నేలపై చేతులుపెట్టి మోకాళ్లతో ప్రాకు. (నూ. డోఁగిరూడు)




డోఁగియాడు = డోఁగాడు. "సీ. కొమరొప్పఁ దనుఁ దాన కూర్చుండఁగా జేర్చి నాడకాడను డోఁగి యాడనేర్చె." చంద్రా. ౨, ఆ. ౪. (శ. ర. పా)

డోఁగు. దే. అ. క్రి. 1. డోఁగియాడు. (శ. ర); 2. మేనిరోఁలు ఒలుచు. శ. ర.)

డోకడా. దే. వి. 1. నూఱవపాలు. (బ్రా. శ. ర) 2. వడ్డికట్టుటకు మూలధనసంఖ్యను కాలముచే గుణింపగా వచ్చిన మొత్తము (వా.)

డోరడి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు.

డోరము. సం. వి అ. న. చేతికిఁ గట్టుకొను వ్రత సూత్రము.

డోరములు. దే. వి. బ. కత్తిమీఁదిచారలు. (శ. ర.)

డోరియా. ఉ. వి. (ఉర్దూ. డోర్యా) ఒకవిధమైన చార. (వా.) డోరియాచీర

డోల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉయ్యాలవంటియానసాధనము; 2. ఉయ్యాలతొట్టె; 3 నీలిచెట్టు.

డోలనము. సం. వి. అ. న. ఊఁచుట.

డోలాబ్జము. సం. వి. అ. న. కలువపూవు. (శ. ర)

డోలాయంత్రము. సం. వి అ. న. ఔషధశుద్ధికై యుపయోగించుయంత్రము.

డోలి. వై. వి. (సం డోలికా.) ఉయ్యాలవంటి అందలము (శ ర.)

డోలిక. సం. వి. ఆ. స్త్రీ. డోల.

డోలు వై. వి. (సం. ఢోలః.) చర్మవాద్యవిశేషము. "వ... ముఖవీణె... డోలు ..మున్నగు ననంఖ్యాత వాదిత్రత్రితయపరంపరలు......" ఆము. ౪, ఆ 3౧౫. ఆచ్చ. యు. ౨౦౫.

## డౌ

డౌలు = దవులు. (మదింపు. రీతి శ. ర.)

## ఢ

ఢ. సం. ఒకానొక అక్షరము. వి. అ. పుం 1 ఢక్క; 2. కుక్కతోఁక; 3. పాము; 4. కుక్క, 5. ప్రతిధ్వని విణ. (అ. ఆ అ.) నిర్గుణుఁడు.

ఢకాఢకి. దే. వి. తాఁకుటయం దగుధ్వని కనుకరణము. "వ...మొకమ్ములు వంచి రెండిమ్ముల ఢకాఢకిఁ దాఁకి..." ప్రబంధ. ౧౮౬.

ఢకీలు దే వి మొట్టుట, తాఁకుట మున్నగు వానియం దగుధ్వని కనుకరణము. (దీనియామ్రేడితము. ఢకీలుఢకీలు) "ఉ. కిట్టి పెడంద పేరెద ఢకీలుఢకీలునఁ గుమ్ములాడు..." ప్రబంధ. ౯౨.

ఢక్క. సం. వి. ఆ. స్త్రీ. 1. ...

ఢక్కను. దే. వి. మహారాష్ట్రదేశములలో నొకజాతి. (దక్కనుదేశస్థులు) రంగా. ౬, ఆ. 3౯.

ఢక్కామొక్కి. ఉ. వి. ఇరుకు, సంకటము. (గ్రా.)

ఢమామిక. సం. వి. ఆ స్త్రీ. చర్మవాద్యవిశేషము.

ఢమామీ. దే. వి. ఫిరంగివంటి మారణసాధనము. "వ . ఢమామీలఢమఢమలు .." కృష్ణ. 3, ఆ ౨౯.

ఢమీ. దే. వి ప్రేలుటయం దగునకరణము. రంగా. 3, ఆ. ౬౪.

ఢమీలు. దే. వి. ప్రేలునప్పటిధ్వని కనుకరణము. "చ. పరువడి నొక్కపెట్టునఁ దుపాకులు ఢామ్మ ఢమీ ఢమీలనన్." రంగా. 3, ఆ. ౬౪.

## ఢా

ఢాం. దే వి. ప్రేలెడిధ్వని కనుకరణము. 'వ ..పెట్టుఁ గ్రొవ్వుల వరుసల . ఢాం ఢంకరణశబ్దంబులు .." ప్రబంధ. ౭౮౮.

ఢాంగు దే. వి. ప్రేలెడిధ్వనికనుకరణము, ప్రబంధ. ౭౭౮.

ఢాక. దే. వి. 1. వెలరేఁగుట. "క. బల్లిదుఁడు కృష్ణభూపతి, పెల్లుగ ఝుళిపించువాలు పెనుఢాకకు ఢిల్లీలిల్లినభగవాఁడు .." కళా. టీకి. ౯౧. ప్రభా. ౨, ఆ. ౧౧౬; 2. ఉత్సాహము. "ఉ. తెచ్చిన నెక్కయవ్విభుఁడు తీవ్రత లంకకు సమ్ముఖంబుగా, వచ్చినఢాక థేయనిన నేమని చెప్ప .." పరమ. 3, ఆ. 3౧౫. 3. పరాక్రమము; "క అమల పాటు విరోధులు, కే కాదు ప్రపంచధర్మ మెఱుఁగని వృత్తా, నీకంబునకుం గలిగెను, ఢాక వసంతు నిజ మిక్కుటంబుగ ధాత్రిన్." కళా. ౭ ఆ. ౧౧౧.

ఢాణదారు. దే. వి. మల్లయుద్ధమందలి పదునాలుగు విసరులలో నొకటి. ప్రబంధ. ౭౮.

ఢామర. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడువాంత

ఢామ్మ. దే. వి. ప్రేలుటయం దగునకరణము; "చ .. ఢామ్మఢమీఢమీలనన్." రంగా. 3, ఆ. ౬౪.

ఢాలము. సం. వి. అ. న. డాలు.

## ఢి

ఢిమఢిమ. దే. వి. ప్రేలుటయం దగుధ్వనికనుకరణము, కృష్ణ. 3, ఆ. ౨౯.

ధిమిరింగు. దే. వి. త్రేలటయందగుధ్వనికనుకరణము, ప్రబంధ. ౪౮౮.

ధీ

ధీ. సం. వి. ఈ. పుం. గోష్ఠివారలను పోట్లాడించుటకై ప్రేరేపించుమాట.

ధు

ధుంఢి. సం. వి. ఇ. పుం. కాశియందుండు గణేశ్వరుడు. (ఢుంఠి యని తెలుగుకవులు చూ. ఢుంఠి)

ధో

ధోలము. సం. వి. అ. పుం. డోలు.

ధ్రా

ధ్రాకనము. సం. వి. అ. న. 1. గమనము; 2. పొందించుట.

ణ

ణ. ఊథ. ఒకానొకయక్షరము. సం. వి. అ. పుం. 1. బిందుదేవుడు; 2. అలంకారము, 3. చలిపందిరి; విశే. గుణహీనుడు. (దీనికి దెలుగున వ్యస్త ప్రయోగము లేదు)

త

త. ఊథ. ఒకానొకయక్షరము. దే. ప్ర. 1. కొన్ని శబ్దములకు స్త్రీత్వమునుబర్థముల వచ్చుతద్ధితప్రత్యయము. ఉదా.—బోయత, మాలెత మొ. ద్రు; 2. ధాతువునకు ఆశీరాద్యర్థమందు వచ్చుప్రత్యయము; 'శా...సీ, తాభామాపతి ప్రోవుతం దిరుమలేంద్రశ్రీమహారాయనిన్." వసు. ౧, ఆ ౧; 3. యువర్ణాంతధాతువులకు తఱచుగా వచ్చు కృత్ప్రత్యయము ఉదా:—కోత, కలత. మొ. సం. వి. అ. పుం 1. తోక, 2. ఱొమ్ము; 3. గర్భకోశము; 4. దొంగ; 5. యోధుడు; 6. అలంకారము, 7. దుర్మార్గుడు. న. 1. ధర్మము; 2. భావము; ఆ. స్త్రీ. లక్ష్మీదేవి. (దీనికి తెలుగున వ్యస్త ప్రయోగము లేదు.)

తంకము. సం. వి. అ. పుం. 1. వియోగదుఃఖము; 2. కష్టజీవనము; 3. భయము. 4. కట్టుబట్ట; 5. ఉలి.

తంకర. దే. వి. పొల్లు, గింజలేనిధాన్యము. ఆం. భా. ద్వి. ౬౩౮.

తంగు. దే. వి. గుఱ్ఱపుగంత జాతిపోకుండ బిగఁగట్టెడువారు. ఆం. భా. ద్వి. ౧౯౯.

తంగువారు. దే. వి. (తంగు+వారు) తంగు (శ. ర.)

తంగెడు. దే. వి. ఔ. అహా. గుల్మవిశేషము. ✽ "సీ. కెలఁకుల నున్నతంగెటిజొంపు గృహమేధి .." స్వా. ౧, ఆ. ౬౬. రసిక. ౫, ఆ. ౧౩౧.

తంగేడు = తంగెడు. "సీ...వైఁడితంగేడు తంగేడు తగిడి యంస్తై." హంస. ౪, ఆ. ౧౦. కాశీ. 3, ఆ. ౧౧౦.

తంగేడుగొరవంక. దే. వి. (తంగేడు+గొరవంక.) తంగేడుపూవువలె వచ్చురంగు గలగొరవంక; "సీ ..తంగేడుగొరవంక జక్కున చెరువుకోడి." హంస. 3, ఆ. ౧౨.

తంటు. దే. వి. (క. తంటె) 1. మోసము; "ఉ. ఎందుకుఁ దప్పె యోజనలు కృష్ణునితంటు లెఱింగి దానికై, నింద ఘటించు నేమగును..." రాధా. 3, ఆ. ౧౩౪ చంద్రా. 3. ఆ. ౧౦౭; 2. అధర్మము; "ద్వి. బాలుఁడ నని తంటుపని సేయఁబోక." ద్వి. శ. సా. ౧, ఆ. ౪౮. పా. ౧౭ పు. 3 బాఁడీ, కొండెము. (శ. ర.) 4 కలహము (శ ర.); 5, కష్టము. (వా); 6. చిక్కు; "గీ. కాని యవి రత్నమయము శాకటకములను, డాల్చఁజేసితి నే నంట తంట గాదె." పార్వ. ౫, ఆ. ౧౩౭; 7. అక్కు. (శ. ర.)

తంటులమారి. దే. విశే. (తంటులు+మారి) వంచకుఁడు; వంచకురాలు. "ఉ ..ఆ, తంటులమారి మర్మముగ దానికి నానృపుప్రేమఁ దెల్పఁగన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౪౫.

తంటసము = తండసము. "ద్వి...తంటు, సమ్మున నిడి కొయ్య చక్కఁనఁ బెఱుక్." పండితా. పురా. ౧౩౪. పు.

తంటా = తంటు. "క. వింటివా లేదో యిపు డొక, తంటా గొని తెచ్చు కొంటి..." చంద్ర. వి. ౨, ఆ. ౯౦.

తంటెయము = తంటెము.

తంటెము. దే. వి. తగిరిస. ✽ "క. తంటెపుమోకా యిదేమి తప్పిదోక్రా." చంద్ర. వి. ౨. ఆ. ౯౦.

తండ. సం. వి. ఆ. స్త్రీ. దెబ్బ.

తండకము. సం. వి. అ. పుం. న. 1. నురుఁగు; 2. కాటుకపిట్ట; 3. చెట్టుబోదె; 4. గృహదారుభేదము; 5. అలంకారము; 6. సమాసవాక్యము; 7. ఒకానొకవృత్తవిశేషము. (శ. ర.)

**తండకుఁడు.** సం. విణ. (అ. డి కా. అ.) 1. మాయావి; 2. బాధించువాఁడు.

**తండము.** సం. వి. అ. పుం. గుంపు "సీ...తటివద్ద కంకాళతండములును." కాశీ. ౩, ఆ. ౧౩౮, "క. మనుజులతండము గని..." భార. భీష్మ. ౩, ఆ. ౩౮౯.

**తండతండములు.** సం. విణ. అపరిమితము "మ...తగఁ దమంబుల్ తండతండంబులై." విప్ర. ౩, ఆ. ౭౮. పి. శకుం. ౧, ఆ. ౮౬.

**తండసము.** ఉభ. దే. వి. మంగలి పెండ్రుక లూడలాగు సాధనము. "వ...తండసంబులం బోలెఁ దన కెందుఁ గొరల బిట్టూఁది..." కాశీ. ౪, ఆ. ౬౮. సం. వి. అ. పుం. అంగారధాని; కమ్మరకొలిమి. (శ. ర.)

**తండా.** దే. వి. 1. లంబాడీ మున్నగువానిగుంపు (శ.ర.); 2. బరువు నింపినగోనెల సమూహము. (శ. ర.)

**తండారు.** దే. అ. క్రి. (తండు+ఆరు) చల్లారు. "ద్వి. తరమఁ జేసియుఁ గేల తండారవైతి." రం. రా. అయో. ౧౧౭, పొ. ౭౯. పం.

**తండిగము.** దే. వి. ఒకగంధ మైనగోనెసంచి; "చ. తణ గము లానుకంట్లములు తండిగముల్..." హంస. ౫, ఆ. ౯౭.

**తండిరి.** దే. వి. జనకుఁడు. "ఆ. అనిన వార లిట్టు లనిరి తండిరిచావు, వినియుం వెనుకచేసి చనఁగ నగునె." భో. ౬, ఆ. ౩౭౦. (శ. ర. పా.)

**తండు.** దే. స. క్రి. (అ. క్రి. అని. శ. ర. బ్రా. 1. ఈయవలసిన ధనాదికమును అడుగు. (శ. ర.); 2. ధనమును వసూలుచేయు. (బ్రా.)

**తండుగోల.** దే. వి. 1. చేఁపలను పొడిచెడి చిల్లకోల. "సీ. చుంగు లల్లాడుగోఁచులు తండుగోలల కొట్టు కొల్పిన మీలపుట్టికలును." శేం. పంచ. ౧, ఆ. ౬౦౩; 2. త్రెడ్డు. (బ్రా.)

**తండుకీణము.** సం. వి. అ. పుం. 1. పురుగు; 2. కడుగునీరు.

**తండులము.** సం. వి. అ. పుం. 1. బియ్యము; 2. వజ్ర మణియొక్క మానభేదము.

**తండులీయము.** సం. వి. అ. పుం. 1. చిర్రికూర; 2. వాయువిడంగము, 3. ధాన్యము. (శ. ర.)

**తండువు.** సం. వి. ఉ. పుం. 1. నందికేశ్వరుఁడు. "క. కలకల మని మొగసాలకు, వెలుపట నొక రవళి వొడమ విని తండువుఁడున్, దిలకింప..." పార్వ. ౪, ఆ. ౪౩.

**తండెలు.** దే. వి. ఓడపెత్తనగాఁడు. (శ. ర. బ్రా.)

**తండేలు** = తండెలు. (శ. ర.)

**తండోపతండములు.** సం. విణ. బ. (తండములు+ఉప తండములు.) అపరిమితము. "ఆ. తప్పు లెన్ను వారు తండోపతండములు .." వేమన. ౨, ఆ. ౧౮ "సీ. తండోపతండములు వీరభటప్రవరులు." వరాహ. ౩, ఆ. ౨౮.

**తండ్రి.** వై. వి. (సం. తాతః. క. తందె. త. తంద్రై.) 1. కన్నవాఁడు, జనకుఁడు. "శా. తల్లిందండ్రియుఁ నన్నుఁ గానరిమనస్తాపంబునం బొక్కఁగా..." స్వా. ౩, ఆ. ౯౪. ఆము. ౪, ఆ. ౧౨౯; 2. వాత్స ల్యము భక్తి మున్నగునవి సూచించునప్పు డుపయో గించుపదము. "గీ. ఎన్ని చేర్పితి నన్నుఁ గన్న చిన్నితండ్రి." దశా. ౫, ఆ. ౬౬. "ఆ. పతియుం శరణముఁడు బంధుండు గావునఁ దండ్రి మమ్ముఁ బ్రోవఁదగుదు నీవు." భా. రా. అర. ౧. ఆ. ౫.

**తండ్రితండ్రి.** దే. వి. పితామహుఁడు. (శ. ర.)

**తంతి.** ఉభ. దే. వి. టెలిగ్రాఫ్. ఆం. భా. ప్ర. ౧౨౬. సం. వి. ఇ. స్త్రీ. 1. త్రాడు; 2. గోవు; 3. వరుస; 4. విరివి. [(బ్రా.)

**తంతికుఱ్ఱు.** దే. వి. (తంతి+కుఱ్ఱు.) నారకుఱ్ఱు.

**తంతిపాలుఁడు.** సం. వి. అ. పుం. 1. గోపాలకుఁడు; 2. అజ్ఞాతవాసమున సహదేవుని పేరు.

**తంతియలు.** దే. వి. బ. మెట్లు. "చ. వెనుకొని కోట తంతియలవెంబడిగా దిగివచ్చి..." ముకుంద. ౧, ఆ. ౨౧. పొ. ౩. పం.

**తంతు.** వై. వి. (సం. తంత్రమ్. క. తంతు.) 1. ఉత్స వము. ఆం. భా. ప్ర. ౧౪౩, 2. ఉభయార్థ సాధకమైనయుపాయము. (శ. ర.); 3. చేయఁ దగినక్రియ. (వా.); 4. మోసము. (వా.)

**తంతుకాష్ఠము.** సం. వి. అ. న. 1. సాలెవానిబాడె, 2. నూలుపడకెడికదురు.

**తంతుకీటము.** సం. వి. అ. పుం. 1. పట్టుపురుగు. 2. సాలెపురుగు.

**తంతునాగము.** సం. వి. అ. పుం. సర్పాకారమైన జల జంతువు, ఉగడు. (శ. ర.)

**తంతునాభము.** సం. వి. అ. పుం.-నాభియందు దారము గలది - సాలెపురుగు.

తంతుభము. సం. వి. అ. పుం. 1. తెల్లావ; ✽ 2. దూడ.

తంతువాయము. సం. వి. అ. పుం. 1. నేత, 2. సాలె పురుగు.

తంతువాయుఁడు. సం. వి. అ. పుం. నేతగాఁడు; సాలె.

తంతువు. సం. వి ఉ. పుం. 1. దారము, 2. తామర తూఁడు లోనుగువానియందలిదారము, 3 వీణ తీఁగ, 4. సంతానము. పుం. న. 1. కత్తి, 2. కత్తి పిడి. న. సామర్థ్యము.

తంతుశాల. సం వి అ. స్త్రీ. నేతనేసెడియిల్లు.

తంతుసారము. సం వి. అ పుం. పోఁక. ✽

తంతె = తంతియు. (మెట్టు.) ఆం భా. ద్వి ౨౨.

తంత్రకము. సం. వి. అ పుం. 1. క్రొత్తబట్ట, 2 తంత్రము.

తంత్రణము. సం వి అ. న. కార్యములను సక్రమముగ నడపుట

తంత్రపాలుఁడు. సం [illegible] పుం సేనాధిపతి.

తంత్రము. సం. వి. అ. న. 1. కుటుంబమును పోషింపఁ దగిన వ్యాపారము, 2. సిద్ధాంతము, 3 ఔషధ విశేషము, 4. ముఖ్యాంశము, 5 పరివారము 6. హేతువు, 7 సైన్యము; 8. రాష్ట్రము; 9. స్వరాష్ట్రచింత; 11. ధనము, 12. శపథము, 13. మార్గము, 14 గృహము, 15 శివప్రోక్తమగు శాస్త్రవిశేషము, 16. నూలిపోఁగు; 17. రాజ్యాంగ పరిపాలనాదివ్యవస్థ, 18 శాస్త్రము, 19. పూర్వమీమాంసాశాస్త్రము; 20 సమూహము, గుంపు

తంత్రి. సం వి. ఇ, ఈ. స్త్రీ. 1 వీణాగుణము, 2. తిప్పతీఁగ ✽, 3. దేహమందలిసిర, 4. త్రాఁడు, 5. ధనురాదులనారి న్. పుం. 1 గాయకుఁడు; 2 యోధ. విశే (న్. జీ. న్.) 1. తంతువులు గలది. బట్ట, 2 తీఁగలు గలది. (వీణె)

తంత్రీపాలుఁడు. సం. వి. = తంతిపాలుఁడు

తందనతానలు. దే వి బ 'తందానతాన' అను పల్లవితో పాడుపాట. 'శా. ఏలల్ తందనతాన లేమను లేఁతే యించు...' పం పంచ. ౨ ఆ. ౧౩౩.

తందనకుసుమలు. = తందనతానలు (వా.)

తంటనము. వై వి (సం. తానక.) 1. తానశబ్దపూర్వకముగా చేయు రాగాలాపము, '[illegible]. నారదుఁడు పెద్దపుచును తాండవాలు పాడె." దశా. ౬, ఆ. ౧౩౭. కళా. ౩, ఆ. ౧౮౭; 2. పోరు, జగడము. (చూ తందనాలజడదారి) గంటలు వేయుచు సంతోషముతో పాడుపాట.

తందనాలజడదారి వై. వి. (తందనాలు+జడదారి) నారదుఁడు. "చ. జగడపుఁ గూటిని త్తరువు సారెకుఁ గోరుచు వీరివారినిం, దగిలెడుతందనాల జడదారి .." కళా. ౨, ఆ. ౩౮౭.

తందర వై. వి. (సం. తంద్రా. 1. కునికిపాటు "సీ. నిన్న విశ్వామిత్రునికిఁ దొందర ఘటించి యొడలెఱుంగక పడియుండఁ జేసె." కువల. ౨, ఆ. ౮౦, 2 ఆలసట (బ్రా.) "చ....చిట్లుగంధమున్...తడఁబడుయానమున్ వలపుతందరయుం దగమారుపాదనం,బడలి..." రాధికా. ౩, ఆ. ౧౧౨. 3. చింత "ఉ. సుందరయాన యుందు మణిసుందరమందిరసీమ లేమికిం,దందరఁ జెందె." కాళింగి. ౨, ఆ ౧౭౨.

తందానతానలు = తందనతానలు. (వా.)

తంద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. బడలిక, 2. కునుకుపాటు; 3. సోమరితనము.

తంద్రము. సం. విశే. (అ. ఆ అ) 1. బడలినది; 2. సోమరియైనది; 3. సోమరి.

తంద్రి. సం. వి ఇ, ఈ. స్త్రీ. తంద్ర.

తంప సం. వి. ఆ స్త్రీ ఆవు.

తంపటి. దే వి. 1. తేగలు మున్నగువానిని కుండలు పెట్టి బోరగిలఁజేసి పైని మంటపెట్టి ఉడికించుట. (వా.), 2. పెద్దమంట. (బ్రా.)

తంపము దే విశే. 1. సాంద్రము; 2. సమూహము. (చూ. తామరతంపము.)

తంపర. దే. వి. తియ్యనిపీ రూరెడుపల్లపుప్రదేశము. విశే. 1. సాంద్రము ఆం. భా. శ్రృ. ౧౬; 2. సమూహము. "గీ. అచటివారలుజపమూర్తి నంద లేక, దురుసుటంపుటతంపర దొనలఁ బడిరి." సుదంతా ౧. ఆ. ౫౩.

తంపి. దే. వి. 1. దాలి; దాలిగుంట "సీ. సేతులు గొనిపోయి కొలియఁ దంపులఁ బోసి పెనుమంట లొండొంట కనరఁజేయు' మారి. పూ. ౫, ఆ ౨౦౬. ఆం. భా. ద్వి. ౨౪౧; 2. కలహము. (శ ర)

తంపిపెట్టు. దే అ క్రి. (తంపి+పెట్టు) 1. తంపటిలో నుల్చు. (బ్రా.); 2 జగడము పురికొల్పు. (బ్రా. వా)

**తంబ.** ఉభ. దే. వి. ఒకవిధ మైనతీఁగె. శ్రీ. "గీ. తంటి యూ జమ్మి తంబ యనంగ..." ఆం. భా. ద్వి. ౩౨. సం. వి. అ. స్త్రీ. అవు. (వై. ని.)

**తంబళ.** దే. వి. శివపూజ చేయు ఒకానొకజాతి "సీ. నంబికవిత్వంబు తంబళజోస్యంబు .." వేణు. ౩౨. చంద్ర. వి ౩, ఆ. ౧౬౧.

**తంబళి.** దే. వి. (తంబళ+ఇ) శివార్చకుఁడు "గీ ..పూజచేయఁ, బ్రతికాణాచితంబళి హత్తు కొనిరొ." హంస. ౧ ఆ. ౧౮౨ ఆం. భా ద్వి ౨౮౪.

**తంబి.** దే. వి తమ్ముఁడు. "చ...నీమటావతున్, వినుతి యొనర్పు తంబి యన సీలగలిన్ గని దాగి మ్రొక్కినన్." చెన్న. ౩, ఆ ౧౯౮.

**తంబిక,** సం. వి. ఈ. స్త్రీ ముక్కుమాట.

**తంబిగె.** దే. వి మెడ నిడుపుగా నుండెడుచెంబు. (శ ర. 'తంబిగె, తంబుగె' అని బ్రా.)

**తంబు** దే. వి. 1. తమ్ముఁడు, 2 వాత్సల్యసంబోధన మం దుపయుక్తము (శ. ర.)

**తంబుగు** = తంబిగె "ద్వి కుంకుమ నలుగిడి గొజ్జంగి నీరు, పొంకంపుఁ బసిఁడితంబుగులచే ముంచి" ద్వి. పరమ. ౫, ఆ ౨౪౮. పా. ఆం. భా. ద్వి. ౨౪౫.

**తంబుర.** వై. వి. (సం తుమ్బురమ్. క. తంబూర) గాయకులు శ్రుతికై వాయించు తంత్రీవాద్యము. "క. వెనుకం బురుహూతుదెసం, దనతంబురవలన గెలిచె నానాగతులన్." కువల. ౪, ఆ. ౧౦౭

**తంబురా** = తంబుర. "సీ. అలరాజ్ఞపాక చిన్నన్న రోమము లైనఁ దంబురాదండెకుఁ దంతు లౌను". వేణు. ౭౩. (వా.)

**తకతక.** దే. వి. తాళమునం దగుధ్వని కనుకరణము

**తకపిక.** దే. వి. సంచలించుటయం దగుధ్వని కనుకరణము. "సీ దాసిజనులఁ గన్నఁ దకపికల్ వెట్టుచు" పల్నా. ౩, ఆ ౧౦.

**తకపికలాడించు.** దే స. క్రి. (తకపికలాడు ధా. ప్రే.) మోసపుచ్చు. "ద్వి. ఒక పేదతపసిగా నూహించి నన్నుఁ, దకపికలాడింపఁ దలఁచితివేని" ద్వి. మరీచ. (బ్రా.)

**తకపికలాడు.** దే అ. క్రి. (తకపికలు+ఆడు), 1 ఇట్టటు చలించు; "చ...తకపికలాడ నాచెలువు ధన్యత నందఁగ..." శశాం. ౪, ఆ. ౯౧; 2. కలఁగు; "చ. తకపికలాడు నంచు మదిఁ జాలిమి వీడుము వేడు మైవమున్" రాధా. ౨, ఆ ౧౧; 3. మోసగడు. (చూ. తకపికలాడించు.)

**తకరా** = తకరారు. (వా.)

**తకరారు.** హిం. వి. వివాదము. ( ర )

**తకిట** దే వి తాళమునం దగుధ్వని కనుకరణము, "గీ తకిట తక్కిట యం చని తాళగీతి, రంభ మొదలైనవారు తలంటఁగలరు." పార్వ. ౫, ఆ. ౧౨౩.

**తక్క** దే అవ్య. ప్ర విచార్థకము 'క... బ్రాహ్మణ, తాదక దక్కనె ప్రకాంతిఁ దక్కఁ గుమారా" భార. శాం. ౫, ఆ ౧౮౬. ఆం భా. కృ ౯౯.

**తక్కటి** దే. వి. త్రిముఖగేపు ఆం. భా. ద్వి. ౧౬౫, విణ ఇతరము; "వ .. యీ యు దుగసినం దక్కటి చేసం గైదువుగొని .." భార. భీష్మ. ౧, ఆ. ౨౯౭, ఆం భా కృ. ౨౮.

**తక్కరి.** వై. విణ (సం. తస్కరః—తస్కర+అరి.) 1 వంచకము, 'ఈ ..నాలుగువుయు నున్నపు గింజయు నానఁబెట్టిబల్, తక్కరివారదుం డిందు ...'' నిరం. ౪, ఆ ౧౮. 2 మాయ కలవాఁడు; "క. ముద్దులతక్కరిబిడ్డఁడు, ముద్దుల గూల్పంగఁ దలఁచి మసలక తా నా, మద్దులుయున్నచోటికి, గ్రద్దన లీవుఁగొను చుఁ గడకం బసిరొన్" భాగ. ౧౦, స్కా. పూ ౪౧౦.

**తక్కరీఁడు** ద్వ. విణ. (తక్కరి+ఈఁడు స్వార్థమున) మోసగాఁడు, "సీ తక్కరీఁడు తక్కరిపుల్కు దక్కనందతకొక్కలిచ్చువాఁడవు..." అచ్చ. భా. ౧, ఆ ౧౭.

**తక్కల.** దే వి. కళవళము (చూ. తక్కలపడు.)

**తక్కలపడు** ద్వ. అ క్రి (తక్కల+పడు) కలఁత నొందు, "వ తక్కలపడియుఁ డి యేమి చోద్యం బని విచారింపఁగ .." ద్వా. ౧౧, ఆ ౫౫, (బ్రా. పా.)

**తక్కించు.** దే. స. క్రి. 1 తొలఁగించు, చక్కఁజేయు, 'సీ. చక్కఁగా నక్క దృక్కులు ముక్కు చక్కఁ, జిక్కఁ దక్కించి...'' సీతారా. ౧, ఆ ౯౯, 2. మోసపుచ్చు; "క. క్రించా మూఢుని నిను దక్కించుట యున గొంత..." పేం పంచ. ౪, ఆ. ౪౧౮.

**తక్కిట** దే. వి తాళధ్వని కనుకరణము; "గీ. తకిట తక్కిట యం చని తాళరీతి ' పార్వ. ౫, ఆ ౧౨౩.

**తక్కిడి.** ఉభ. దే. వి. 1. మోసము (శ. ర), 2. తక్కెడ. (వా.) వై. విణ (సం. తస్కరః) 1. వంచకుఁడు; (చూ. తక్కిడితనము), 2. అబద్ధము; "క. ననుఁ జిత్తంబున మఱవకుఁ, దని తక్కిడివగల లోచనాంబుపు లురులన్." చెన్న. ౨. ఆ. ౩౦౨.

**తక్కిడికాఁడు** ద్వ విణ. (తక్కిడి+కాఁడు. స్వార్థమున) వంచకుఁడు; "క. ఉక్కడిదినేలతేఁడులఁ, దక్కునఁ గనుఁబ్రామి నన్నిటకుఁ దెచ్చినబల్, తక్కిడికాఁడవు..." అప్ప సుం ౪౭, (శ. ర. పా.)

**తక్కిడితనము.** వై. వి. (తక్కిడి+తనము) మోసము "గీ. ఖగిలి యిలువిద్య తక్కిడితనము నాడి." విక్ర. ౪, ఆ ౨౮.

**తక్కినవాఁడు.** దే విణ. అన్యుఁడు. ఆం. శ. ౭౧.

**తక్కిలి.** వై వి. (సం. తర్కారి) ఋద్ధుబుసర శ్రీ. ఆం. భా. ద్వి ౫౦.

**తక్కు.** దే. అ. క్రి. 1. మిగులు, "ఉ. ఇక్కడ చాంద్రభూపతి శిరోనపరశతఁ జేవ యెక్కఁగా, నెక్కడ వాసుదేవుఁ డిల నే నొకరుండన వాసుదేవుఁడన్, దక్కినవాఁడు నందకసుదర్శనశార్ఙ్గగదాదిహేతులన్, ద్రుక్కక పట్టినన్..." ఉ. హరి. ౩, ఆ. ౪, భార. విరా. ౩, ఆ. ౧౧౫, 2. తక్కువగు; "ద్వి. తక్కనిభక్తితోఁ దప్పిదంబులకు, మొక్కి పోవుచు..." రం. రా. ఉ. ౮, పా. ౪, పం, 3 పోవు, "... తమ మెల్లం, దుదిపోయి లేక తక్కెను..." భార. అను. ౧. ఆ ౩౫౮, స్కా. ౪, ఆ. ౬౯; 4. ఉడుగు, అణఁగు, "ఉ... సందడుల్, దక్కె పురంబు వీధుల..." భార. విరా. ౨, ఆ. ౩౧౯; 5. తొలఁగు; "ఉ. అంచితహారవల్లి వలయాభరణంబులు తక్కఁ ద్రోయుఁ జే, ల్మంచుఁ బసిండి..." ఆము ౧, ఆ. ౬౧, స. క్రి. 1. విడుచు. "చ ధరణిపుచక్కఁ గట్టెదురు దక్కి..." భార. విరా ౧, ఆ. ౧౨౯; "ఉ.. ధర్మముం, దక్కుట కోర్వఁజాలుదురె..." భార భీష్మ ౩, ఆ.౩౦౭; 2. మానుకొను, "క. ఐతిఁగెడివారికి నైనను, గఱకఱ తక్క రుచిత ప్రకారము..." భార. విరా. ౧, ఆ. ౧౧౬; 3. వంచించు; "క. ననుపు విటుని దక్కుచు నా, తనిచెలికాసికిఁ బ్రియంబుఁ దగఁ జె, ప్పిన..." కాశ. ౪, ఆ. ౭౧; 2. తక్కుచేయు, "ఉ ..అని యసత్యపుఁదక్కులు తక్కి పెండిగన్." శుక. ౨, ఆ. ౨౧౭. వి. 1. విలాసము; "ద్వి. మొక్కఁ గనుఁగొని మోహించి సుతునిఁ, దక్కులమాట లాతని నాడ లేదు." ద్వి. శ. సా. ౩, ఆ ౧౦౪, పా. ౧౫, పం, 2. విలాసచేష్ట; "ఉ...మాధవుఁ డూరక లంచితక్కులం, బూనె .." దశా. ౨, ఆ ౩౮౩; 3. మాయ, "ద్వి. మొక్కులు చిక్కులు మొఱఁగులు నక్క, తక్కులు నీ పట్టితానకంబులును" ద్వి. హరి. శ్బ. భూ ౧౧౮౬, పం. ఉ. రా. ౪, ఆ. ౨౧౪, 4. అబద్ధము, ఆం. భా. ప్ర.౧౧౯; 5. మిగులు; (శ. ర.), 6. విసర్జనము; ఆం. భా. ద్వి. ౧౭౩. విణ, 1. ఇతరము, అన్యము; "గీ. అట్టిగర్భంపునిలంపుత క్కన్నిగర్భ, ములును భవదస్త్రమున దగ్ధములుగఁ జేయుం, ము..." భార. సౌ. ౨, ఆ. ౮౦, భార. శాం. ౧, ఆ ౯; "గీ... దీన లెకుండు... చెప్ప, దక్కొకంటను లేదు..." భార. స్వ. ౮౨.

**తక్కుడు.** దే. వి. 1. విడుచుట, "ఉ...వినయంబు దక్కుడ, స్థైర్యముఁ జేకయున్న..." నిర్వ. ౪, ఆ. ౬౬. (శ. ర. పా.) 2. మిగులుట(బ్రా.)

**తక్కులఁబడు.** ద్వ. అ. క్రి. (తక్కులన్+పడు) మోసపోవు, "ద్వి. తక్కులఁబడఁడ నాదుబ్బులఁ బడఁడ" పండితా పర్వ. ౫౧౮, పా. ౧౬. పం.

**తక్కులఁబెట్టు.** దే. స. క్రి. (తక్కులన్+పెట్టు) మోసపుచ్చు, "ఉ. దారుణవృత్తి నున్ననను తక్కులఁబెట్టఁగఁ జూచెదేని..." వి. పు. ౧, ఆ. ౧౪౪.

**తక్కులాఁడి.** దే. విణ (తక్కులు+ఆఁడి,) 1. వంచకురాలు, 2. విలాసవతి. (శ. ర.)

**తక్కులాఁడు.** దే. విణ. (తక్కులు+ఆఁడు.) 1. వంచకుఁడు; 2. విలాసవంతుఁడు. (శ. ర)

**తక్కువ.** దే. విణ. 1. న్యూనము; "శా. నీపై శిష్యులు తిట్టులన్ మెఱయునే నీకంటె నేఁ దక్కువే." స్కా. ౬. ఆ. ౪౯. వి. లాఘవము; "ఆ. ఇరువురందు నప్పు డెక్కువ తక్కువ, యింత లేక .." విక్ర. ౪, ఆ ౧౮౩, భార. ఉద్యో. ౪, ఆ. ౫౯.

**తక్కువపడు.** ద్వ. అ. క్రి. (తక్కువ+పడు.) న్యూనతఁబొందు, "ద్వి. తక్కిసభూకాభిధానంబు

షము, 3. పొట్టేలు. (శ. ర.) ౨. తగరమూలమున పుట్టు నొక గ్రంధద్రవ్యము.

**తగరు.** వై. వి. (సం. తగరః.) పొట్టేలు, "క. కొండం గని తగరు తాఁకఁగోరుట కాదే." భార. ఉద్యో. ౧, ఆ. ౨౩౭, 'క...తాఁకు తగళ్ల నడుమఁ జచ్చినసక్కన్" సా. పంచ. ౧, ఆ ౧౭౭.

**తగరురౌతు.** ద్వి. వి. (తగరు+రౌతు) మేషవాహనుఁడు, అగ్ని. (శ. ర.)

**తగరులవిడుపులు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము, "మహాప్రగ్రథర, సరిపేసుల్ దూర్ణతుంకాల్ తగరులవిడుపుల్..." ఇాదు. ౨, ఆ. ౧౦.

**తగవరి.** దే. వి. (తగవు+అరి.) తీర్పరి, క. పగవరియగుశా నొంచినఁ, ఐగుదండము రాజువాని దండింపఁదగున్.." విష్ణు ప్ర. ౧౨౨, ఆం. భా. ద్వి. ౧౮౩, విణ. న్యాయశీలుఁడు, "క. నళినదళలోచనుఁడు ఏమఁ, జెలిపిన స్వధర్మపద్ధతిచిఁ దగవరులై, యిలఁ బరిపాలించుచు.." భాగ ౧౦, స్కం. ఉ ౭౬.

**తగవు.** దే. వి. 1. తగుట, 'క...బుద్ధి సొంపిపి, తడవి కని కొంసంగవలయుఁ దగవ్వఁ దగమిటున్." భార. శాం. ౨,ఆ. ౧౮౭. భార. సభా. ౨, ఆ. ౧౧౯, 2. న్యాయము; "ఆ. చేటుకాల మైనఁ జెట్ట మాటలు సెలి,గాని తెరువు పట్ట్రిజములును, తగవులట్ల లోఁచు .." భార ఉద్యో. ౨, ఆ ౬౪. (శ. ర. పా) ఆం. భా. ద్వి. ౧౯౧ 3. జగడము; "క. కోపమూ పాపమునకుఁ బొత్తే పెను దగవునకుఁ దగఁగ నేతెల్లాటల్, ప్రాపించునో..." కళా 3, ఆ. ౨౭౯, భీమ. ౫. ఆ. ౯౫, 4. వివాహాది శుభసమయములం దిచ్చెడు కానుక; "గీ. తగవు లిచ్చిరి పుట్టింటివార్ల ప్రజలు."౬.రా. ౨, ఆ. ౬౨, యు. ౪, ఆ. ౧౨౪, 5. మేలు, "చ. తగిన నరేంద్రసూనుఁ డని తన్నుఁ బ్రియంబునఁ బిల్చి తెచ్చి మచ్చిగ సుత నిచ్చి మత్ప్రియముఁ జేసిన సింహళరాజసూనుఁ డా,తగవు మదిం దలంపక.." విక్ర. ౬, ఆ. ౭౬; 6. తీర్పు, "ద్వి. వసుధేశ యీపట్టివాగ్వాద మేల, మసలక మీలోకిమల కలువాయఁ, దగవు గాంతుఁ బెద్దలు మెచ్చి పొగడ ద్వి. హరిశ్చ. ఉ. ౭౭౩, పం. శై. భా. ౮, ఆ. ౨౦౯; 7. రీతి; "సీ. చిగురులు కంటి కేతగవునఁ బొడమెనో యాదంపుదొట్రుపాటొందువదన." కకు. ౪, ఆ. ౩౦, విణ. తగినది, "క. తగుఁ బగఁ దీర్చుట యిమ్మెయిఁ, దగ వగునే కత్తుకత్తి త్రావుట .." భార. స్త్రీ ౨, ఆ. ౬౨, భార. ఉద్యో. ౧, ఆ ౫౫.

**తగవుగోరి.** దే. విణ. (తగవు+కోరి) సంధిచేయుంవాఁడు "వ ..తగవు గోరియుంబోలెఁ గూడఁ బెట్టితిం .." కవిక. ౪, ఆ. ౧౧౩. (శ.ర.పా.)

**తగవులాఁడు.** దే. విణ. (తగవులు+ఆఁడు) న్యాయస్థుఁడు. "సీ. తనకూఁతుసవతి మందాకినీనదికి సాధార మై నిలిచినతగవులాఁడు." వరాహ. ౧౦, ఆ. ౪౧.

**తగాదా.** హిం. వి. వ్యాజ్యము; తగవు.

**తగాయిదా** = తగాదా. (వా).

**తగిడి.** దే. వి. వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౧౦.

**తగిరిస.** దే. వి. ప్రచ్ఛాదనము ॥. "మ. గురుగుంజెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకు..." ఆము. ౪, ఆ. ౧౩౪, ఆం. భా. ద్వి. ౯౯.

**తగిలించు.** దే. స. క్రి. 1 సక్తముచేయు; "క మనసుఁ గరఁగించి పులకలు, తనువునఁ బొదలించి రతులఁ దగిలించి తగన్" విక్ర ౮, ఆ ౩౮, హంస. ౪, ఆ. ౪౮, 2. సంబంధము కలిగించు, "క. తగిలించుకొన్న పిమ్మట, నిగిలించుటే కాని కార్య మేమున్నది .." శుక. ౨, ఆ. ౨౯౧; 3. లగ్నము చేయు, 'సీ ..ఖడ్గము సంకఁ దగిలించి .." భార. విరా. ౧, ఆ. ౨౧౧, 4 మోహింపఁజేయు, "గీ. దీనిఁ తగిలించి తగులక తాన ధైర్య, వంతుఁడై యున్నసొబగుఁ డెవ్వఁడు జగతి." కు. సం ౭, ఆ. ౧౪; 5 ముట్టించు; "గీ. చని యధిశ్రవణిని వహ్ని సంగ్రహించి, యింటెనడి కప్పు తగిలించి..." శుక. 3, ఆ. ౨౦౪.

**తగు.** దే. అ. క్రి. (క. తగు.) 1. అర్హమగు; "మ.. అపాండుపుత్రులు నీపుత్రులు కారె వారిఁ దగునే దూరస్థులం జేయఁగన్." భార. ఆది. ౮, ఆ. ౪౬, నైష. ౧, ఆ ౬౮, 2. న్యాయమగు, "క. తగునిది తగ దని యెందలో, వగవక సాధులకుఁ జేవ వారల కెగ్గుల్, మొగిఁ జేయుఁ దుర్వినీతుల, కగున నిమిత్తాగంబు లైనభయంబుల్" భార. ఆది. ౧, ఆ. ౮౫, పారి. ౪, ఆ ౫౬; 3. సమర్థమగు; "క...సారథి తగువాఁ, డెచ్చోట లేమి కాతం,

దచ్చుపటుకుండయ్యె..." భార. విరా. ౪, ఆ. ౨౮, హంస. ౧, ఆ. ౩౭; 4. సమానమగు, "గీ. కౌరవవ్యూహమునకుఁ దగంగ నొక్క, బంధుర వ్యూహ మొనరింపఁ బంపు మనిన" భార భీష్మ. ౧, ఆ ౧౨౯, వి ప్ర ౪, ఆ. ౨౪౨; 5. అను కూలమగు, "ఉ కోరినకోర్కి యెంత దగఁగఁ గుంతి సుత ప్రియయం బుఁ గాంచె..." భార. ఆది. ౫,ఆ. ౧౭౯. ౬ ఆ. ౧౨౧, 6. తప్పనిసరియగు, "మ. అల మాకందముకుఁదఁ డింపఁ దగు .." విప్ర ౨, ఆ. ౬౯, ఆము. ౪, ఆ. ౨౩౮, 7. శోభిల్లు, "శా. భామారత్నము రూపసంపదఁ దగన్ భావించు .." నైష ౨, ఆ ౧౦౫, పారి. ౨, ఆ. ౪౩, 8. వర్తించు, ఉండు. "క. నామములు దీర్చి తులసీ, దామంబులు వైచి వేలకనమున దగునీ, సాములె..." విప్ర. ౨. ఆ ౭౩, 9. కొంచెమగు; 'ఉ...విష్ణుగా, ధాపులీలలం గడ పెదం ద్దగుప్ర ద్దని విన్నవించి..." విప్ర. 3, ఆ ౮౧.

తగుకత్తి దే వి. (తగు+కత్తి సాధన కుపయుక్త మగు ఆయుధము. (శ. ర.)

తగుతగములు. దే. వి. బ. (తగు+తగమి+లు యుక్తా యుక్తములు; "గీ ముచ్చు మది కున్న పెనఁగొన్న మోహమునను, దగుతగము లెంచ కెంత కెంతకుఁ బెనంగు" పాంచా. ౨, ఆ ౮౮. పు.

తగులఁగట్టు. దే స. క్రి. (తగులన్+కట్టు.) తగి లించు; "మ...ఈయుద్ధమం, దగులంగట్టిన బ్రహ్మ కేర్పరిగదా..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౩౮.

తగులఁబడు. ద్వ. అ. క్రి. (తగులన్+పడు. స్వార్థ మున ) 1. చిక్కు, లగ్నమగు, "మ, జగతీనా యక యింత యేమిటికి నీసౌందర్యజాలంబునన్, దగులంబడ్డది" కేయూర. ౪, ఆ ౪౪. 2. దగ్ధ మగు (వా.); 3 పాడగు

తగులఁబెట్టు. దే స. క్రి. (తగులన్+పెట్టు ) 1. తగులఁజేయు. (వా) 2 కాల్చు (వా, 3. పాడు చేయు. (వా)

తగులమి. దే వి. అనక్తత "క. అనహంకారము నప్రార్థనమును విషయములఁ బెద్దతగులమియును మే, లనఘా." భార. శాం. ౫, ఆ. ౪౫౩.

తగులము. దే. వి. 1. ప్రేమము "ఉ. అలము కోని నాతగుల మాఱసి యిచ్చఁగ నేల జేల .." భార. విరా. ౨, ఆ. ౨౫౩ "క మగ లవేకువ నుండక తమ, తగులము పాటించు రెట్టితగులం బైనన్" భార విరా. ౨, ఆ ౨౬౧, 2. సంబంధము "గీ. కరికర ములు క్ష్వేడోష కల్పమంబు, నమనయుగంగ సలియూరుళ్లై పొడమిగాఁ, యిప్పరంబుల తగులంబుః గానె " పాండు 3, ఆ. ౧౮౩; 3. నిరోధము. "చ. ఎడపక ముప్పు మింటిపయి నేతగులంబును లేక మూకతన్; వెడలెడుచో ..." ఆము. ౪, ఆ. ౮౫

తగులాట దే వి. (తగులు+ఆట.) 1. సంబంధము. "ఆ. తనకు దైవమునకుఁ దగులాటమే కాంతి ..." వేమన. 3, ఆ ౮౪, 2. రతిసంబంధము. (వ్యా. తగులాటము )

తగులాటము=తగులాట 'చ .. పతి నీవు భార్య నే, వెలమి యొనర్చు మన్మఁడె యిద్దఱకుం దగు లాట మియ్యెడన్." ఉ. రా ౭, ఆ. ౪౭౧.

తగులాటకత్తె దే. విశే (తగులాట+కత్తె.) తగు లాటము గలది. ఆం. భా. ద్వి ౧౧౦.

తగులాటకాఁడు. దే విశే. తగులాటము+కాఁడు.) రతిసంబంధముకలవాఁడు. విటకాఁడు, జారుఁడు. (బ్రౌ)

తగులాయము, దే విశే. సంబంధి; కావలసినవాఁడు. "మ. అదరం గాదు సముద్రుఁ డిందిరకులాయం బన్మదీయేప్సితం బడుగం జెప్పితి సంఘటింపుము..." వేం. పంచ. ౧. ఆ. ౬౪౦.

తగులు. దే. అ. క్రి. (క. తగిలు.) 1. ఆసక్తినొందుఁ "ఆ. ఒరులవలనఁ బుట్టునోటమియును సిగ్గుఁ, బొరయకుండ నరసి పుత్రవరులఁ, దగిలి కాచు నట్టితల్లి సర్పములకు, నేల యలిగి శాప మిచ్చె నయ్య." భార ఆది ౧, అ. ౧౬౦, కాశీ. ౪. ఆ. ౮౧; 2. చిక్కు, లగ్నమగు "క. అని పలికినఁ బాంచాలియుఁ, దనయుఁరులం గీచకుండు దగులట భావంబున సిక్కుచించి..." భార. విరా ౨, ఆ. ౨౬౪ భార భీష్మ. ౨, ఆ. ౩౬౪, 3. దొరకు. "ద్వి. తగిలినపులుఁగుల దయతోడఁ బట్టి" ద్వి. నల ౧, ఆ. ౩౪౬. దశా. ౪. ఆ. ౫; 4. సంభవించు, కలుగు. 'ఆ. తనములోనఁ గొఱత తగిలినదో యేమొ, లేకను మగవాని నీక

యుజ్నై." పార్వ. ౪, ఆ. ౭౩. హరి. భూ. ౧, ఆ ౧౮౧; 5. ఇష్టపడు "ద ..ఘోరనిష్ఠతోఁ, దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్ముగ నిచ్చి ..." భార. ఆని. ౨, ఆ. ౧౪౯. భార. ఉద్యో. ౨, ఆ ౧౬౧ (వ్యవహారమునందలి యర్థవిశేషములు) 1. పోవు "వ పృగంబువెంటఁ దగిలి .." భార. ఆది ౨, ఆ ౧౬౫, 2 తాకు వానికి రోగము తగిలినది; 3. వచ్చు. గోదావరికి క్రొత్తనీరు తగిలినది, 4. వ్యయమగు. అతఁడు రాక వానికి మఱిమూఁడురూకలు తగిలినవి; 5. కలుగఁజేసికొను నీ వావ్యవహారములో తగులవద్దు. (వ్రా.), 6 కలుగు, తటస్థించు. అతనికి మంచిచేరము తగిలినది; 7. పుట్టు. వరికి పొట్టలు తగిలినవి; 8. మొలకకెత్తు. కాలువను నీరు లేక పడవలు తగులుచున్నవి, 9. ప్రాప్తించు. వానికి నాలుగు చీవాట్లు తగిలినవి, 10. కనఁబడు. నీకాదారిలో పెద్దమేడ తగులును, 11. స్ఫురించు. ఆవిషయము నామనసునకు తగులలేదు; 12. ఫలించు. వానిలెట్లు నాకు తగులవు, 13 సంభవించు. నాకు రేపు ప్రయాణము తగిలినది; 14. అంటుకొను. మన్ను కాలికి తగిలినది , 15. దొరకు. ఆగ్రంథమున నా కాపద మెచ్చటను దగులలేదు; 16. తగులుబడియగు. అపనికై నాచేతిని పదిరూపాయిలు తగిలినవి; 17. ప్రవేశించు. అశాస్త్రమున నాబుద్ధి తగులదు. స. క్రి. 1. కూడియుండు. "ఆ. సుందరాంగి వారియం దేల యకరక్తయగు మనోముదంబుఁ దగులుఁగాక." భార. ఆని. ౮, ఆ ౨౬౫. భార. శల్య ౧, ఆ. ౬, 2. వెంబడించు. "గీ. మగుడ నడచి నడిచినఁ దగిలి యతని,తోడ, దమ్ములుఁ బోన్ .." భార. ద్రో. ౧, ఆ. ౧౧౧. అను. ౫, ఆ. ౧౧౭, 3. ఆశ్రయించు. "క. ఏనీరిని వారిఁ దగిలి నేల వచింతున్." కళా. 3, ఆ. ౨౨౭; 4. కూడు "వ ..సాహసాంకచక్రవర్తిచాళుక్య ..విదర్భరాజనందనం దగిలి..." విక్ర. ౪, ఆ. ౨౨౮, 5 పురికొలుపు. "చ. జగదభిఖ్యాతిసత్రవు సారెకుఁ గోరుచు వీరివారినిం, దగిలెను తాఁదనాల జనదారి .." కళా. ౨, ఆ ౩౮౩. అ. క్రి. స. క్రి. 1. తాఁకు. "సీ. నాకుఁ దక్షిణంబునన్ కాళ మొక్కటి లగుల రెండవమేను దాల్చవలసె." కళా. ౫, ఆ, ౧౦. స్వా. ౧, ఆ. ౩౭; 2. మోహించు. "చ...భిక్షుకుం,దగిలి తపంబు సేసె దంటె .." కు. సం. ౭, ఆ, ౨౦, స్వా. ౬, ఆ ౭౪. వి. 1. అభిలాష. "ఆ. ఎంత రెంటుపడిన నంటియు నాదంబుసంపుఁ దగులుఁ బలము నతిశయిల్లు." భార. అర. ౨, ఆ. ౬౨. కేయూర. ౪, ఆ. ౨౦౩; 2. మోహము. "గీ. సాధ్వి మీఁదఁ, దలఁపు గలదు నా కతఁడును దగులుగలిగి యుండు .." భార. ఉద్యో. ౪, ఆ. ౨౭౫. భార. శాం. ౧, ఆ. ౨౪౮; 3. సంబంధము. "గీ. అట్టిపేరఁ బ్రసిద్ధమై యంతలోనఁ, దల్లితగు బాడఁ దీర్ఘయాత్రగ ధరిత్రిఁ, గ్రమ్మరుచు .." కళా. ౪, ఆ. ౧౪౪. భార. శాం. ౬, ఆ. ౬౨, 4. కలయిక. "క. నీవంటిరూపవతికిని, నీవంటిప్రియుండు గలుగ నిర్మింపక హా, యీవిధిని దగులుచేసిన, యావిధి నిటు దూఱ నిఁక నగుఫల మేమీ." హంస. ౧, ఆ. ౯౧ 5. రతి. "ఆ. మసనబాణభిన్నహృదయమై యాతని, తలఁపు దెలిసి తగులుఁ దలఁపు చేసి." వి. పు. ౬, ఆ. ౧౮. కాశీ. ౧, ఆ. ౪౪; 6. సంతోషము. "గీ. తనదుమాడ్కికి సంతయుఁ దగు లొనర్చి." భార. స్వ. ౫౪; 7. అడ్డము. "సీ ..తలవరి యొత్తిగినఁ దగులు సేయు." భాగ. ౧౦, స్కం. పూ. ౯౭౮. హరి. ఉ ౫, ఆ. ౮౪; 8. దండుగ. (వా) ఆచేరమందు నాకు తగులు లేదు. విశే. 1. సక్తుఁడు, సక్తము. "చ .. కుసుమచేతనయాగ్రణికిం దగులైతిఁ గ్రొత్తగన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౪౩. భో. ౨. ఆ. ౧౧౨; 2. ప్రియురాలు. "తరల ..కుతొగతగుల్ వెడవింటిబోయకు- దోడు వచ్చినవాఁడవో." విజ. ౩, ఆ. ౬౪ , 3. ఆశ్రితుఁడు. "చ . ఇంత మాత్రకు నిటు శోకములం బఱతురా గుడికిం దగులైననంబులన్." వి. ప్ర. ౫, ఆ. ౨౭.

తగులుకొను దే. అ. క్రి. (తగులు+కొను) ప్రీతి కలుగు, ప్రేమించు "ద్వి. సుగుణాత్మురాలైన సుదతిరొ య్యైనఁ, దగులుకొందురుగాక దాన మీఁగలరె." ద్వి. ధర్మ ౩, ఆ. ౬౧, పు. పారి. ౫, ఆ. ౭౯. స. క్రి. మోహించు, "క. మగఁ డేల రాఁడో యొండొక, మగువం దగులుకొని నన్ను మఱచెనొకొ..." శుక. ౨, ఆ. ౩౨౮;

అ. క్రి. స. క్రి. అంటు, సోఁకు. "గీ..తత్త ప్తోన, లము భూతర్లోకమును మించి యమరనగరిఁ, దగులుకొన్న సుకర్ముల తల్లడిల్లి." దశా. ౪, ఆ. ౨౪, కాశీ. ౨, ఆ. ౯౮.

తగులుకొలుపు. దే. స. క్రి. (తగులుకొను ధా ప్రే.) తగుల్కొనఁజేయు. (చూ. తవులుకొలుపు.)

తగులుకోలు దే. వి. తగులుకొనుట. (శ. ర.)

తగులుగొండి. దే విశే. (తగులు+గొండి.) తగులుకొనునది. (శ. ర.)

తగులుచే. దే. స. క్రి. 1. కుంచ్చు, "క.విను మాఁట దివోలెం దన, తనువున కడ్డంబు గాఁగఁ దగిలిచి కొన్నాఁడు .." భార. ద్రో. 3, ఆ. ౨౦౧, భీమ. ౫. ఆ. ౯౫, 2. అంటించు. (చూ. తగుల్చు)

తగులఁడు. దే. వి. తగులంటు "క. పానము జూదము వేఁటయు, మానినియును భూపతులకు మధుర వినోద, స్థానము లగు నైనను దగ, నైనవిధము దక్కఁ దగులు డాఁపదదెచ్చున్." భార. శాం 3, ఆ. ౨౭౨. (శ ర. పా. తగులము' ముద్రి.)

తగులుదల. దే. వి. తగులుడు. (శ. ర.)

తగులుపడు ద్వ. అ. క్రి. (తగులు+పడు.) 1 ఆసక్తినొందు. "సీ. సుందరీముఖములఁ జూడ గోరుచుఁ జూడ్కి తావకాకృతులపైఁ దగులు పడదు." భాగ. ౭, స్కం. 3౬3; 2. చిక్కుకొను, (చూ. తగులువడు.) 3. లభించు, "సీ. తామరచెలిపట్టి తావుఁ గొల్లాడఁగాఁ దగులుపడ్డట్టి యేనుఁగులగములు" య. ౪, ఆ.౭౭, 4. అగు, (చూ. తగుల్పడు.)

తగులుపఱచు. ద్వ. స. క్రి. (తగులుపడు. ధా. ప్రే.) 1. ఆసక్తి కలుగఁజేయు, "గీ. మిగులఁ జొక్కించి యెంతయుఁ దగులుపఱిచి." ప్రబోధ. ౧, ఆ ౭౫, 2. నిలుపు, "సీ . నగరు గావు పటాచుఁ దగులు పఱిచి." అచ్చ. యు ౪3౮; 3. లగ్నము చేయు. "సీ. ..తరలనినియమంబుఁ దగులు పఱిచి." ఉ. రా. ౨, ఆ. ౧౬3.

తగులుపాటు. ద్వ. వి (తగులుపడు. ధా.) 1. తగులుబడి, వ్యయము. (బ్రౌ.) 2. తగులువాటు. (శ.ర.)

తగులుబడి. దే. వి. కట్టుబడి, వ్యయపఱచుట. (శ. ర. బ్రౌ.)

తగులువడు = తగులుపడు. 1. (ఆసక్తమగు) "క. సౌందర్యవిలాసాదుల, యందునఁ దగులువడి యితరవరయనిమగవారుం దఱుఁగఁ గ్గలరు..." కళా. ౭, ఆ. ౯౯; 2. (చిక్కు), "గీ. దశరథమహానరేంద్రనందనునిచేత, .., ఆనుమహానాక నాక కన్యాలలామ, తగులువడె " రామా. ౪, ఆ ౧౫౯; 3. (కొరకు) ఆం. భా. కృ. ౧ ౫; 4. (అడ్డుకలదగు), "క. తగులువడి యపుడు వడి సెడి, గగనమణిరథంబు దొరగలుపడి నిలిచెన్." కాశీ. ౧, ఆ. ౧33.

తగులువాటు = తగులుపాటు. తగులువడుట.

తగ్గించే. దే. స. క్రి (తగ్గు. ధా. ప్రే.) తగ్గఁజేయు, కృశింపఁజేయు. "మ ..తపం బొనర్చు జటిలవ్యాఘ్రంబు బనాస్రాక్షపువృషముచందం బగుచే ననూననియమభ్రాష్టాగ్నిఁ దగ్గించుచున్." పాండు. ౫, ఆ. ౧౮౬.

తగ్గింపు. దే. వి. (తగ్గు. ధా.) తగ్గుదల. (బ్రౌ. వా.)

తగ్గు. దే. అ. క్రి 1. తక్కువగు. ఆం. భా. కృ. ౯౬, 2. వెనుదీయు. "గీ. స్మరుఁడు పరదేవతాంఘ్రులు సంస్మరించి, వెఱగుపాటుతు గరికల్వవిరిని బూన్చి, పుడిభుజము తగ్గఁ దేటగా వడిగ నీడ్చి, శంభుఁడు చలింప మోహనాస్త్రంబు వైచె." పార్వ. 3, ఆ. ౫౪; 3. ఒఱగు. 'క. తగ్గను కారణము లేక కడఁబడి పడగల్." భార. విరా. ౪, ఆ. ౮౭, 4. కృశించు. 'ఉ .....వాడి వత్తలై,తగ్గినమేనులున్ ..." విప్ర. ౨, ఆ. ౫3. వి. 1. తక్కువ. (వ్యతి. మొగ్గు.); 2. ఉదయస్థానవృద్ధు లందొకటి యగుక్షయము. ఆం. భా. ద్వి. ౧౭౦. విశే. తగ్గినది. "చ ..మార్మ్గల పగ్గాలు తగ్గులుసేసి..." ప్రబంధ. ౧౭.

తగ్గుదల. దే. వి. (తగ్గు. ధా.) తక్కువ. (శ.ర.)

తగ్గుపడు. ద్వ. అ. క్రి. (తగ్గు+పడు.) 1. నశించు. "గీ. దార్ఢ్య మాలోచనము తెల్వి తగ్గుపడియె." హంస. ౧, ఆ. ౧౯౦; 2. కృశించు. "గీ .. సుధాధరానన సెమ్మేను తగ్గుపడియె." చంద్రా. ౨, ఆ. ౧౨3

తచ్చే. వై. వి. సాకు, మిష. "ద్వి. తచ్చులు పచరించి కటమటించెదవు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౪ పు.

తచ్చన వై. వి. (సం. తర్జనీ.) 1. గోలి ఆం. భా. ప్ర. ౧3౯, 2. అసత్యము. "ద్వి. తచ్చనఁ దమయింటఁ దద్దినం బనుచు" రం. రా. అర. ౧౫౧, పు, 3. సాకు. (చూ. తచ్చే.); 4.

మోసము. (చూ. తచ్చనగొండి.) విశే. అసత్యము, సత్యముకానిది. "వ...తచ్చనవినయంబులు..." వసు. ౪, ఆ. ౨౩. శుక. ౩, ఆ. ౭౧.

తచ్చెనగొండి. ద్వ. విశే. (తచ్చన+గొండి.) మోసకత్తె. "సీ. తచ్చనగొండి పోతరకత్తె కల్లరి..." చెన్న. ౨, ఆ. ౨౪.

తచ్చెనలాడు. ద్వ అ. క్రి. (తచ్చనలు+ఆడు.) చిక్కుపడు. "ద్వి తచ్చులు మెఱయంగ గొనకొన్నసగులు, తచ్చనలాడంగ .." ఆ. రు. క ౪, ఆ ౭౭. భా. ౨౯, పం. ౬౨ క్రి స క్రి గేలిసేయు "చ ..అనుచు శారద తచ్చనలాడ మాటికిం, గలకల నవ్వె ధాత..." కాళింది ౧, ఆ. ౭. ఉ. హరిశ్చ ౧, ఆ. ౩౨.

తచ్చెనవాటు ద్వ. వి. (తచ్చన+వాటు) ఉత్తకోటు "చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతో బరస్పర మెచ్చించి కాంచనపులాతులం దచ్చనవాటు లాడంగా." నైష. ౩, ఆ. ౯౫

తచ్చెనసేయు. వై. అ. క్రి. (తచ్చన+చేయు.) గేలిసేయు. "ఉ. వచ్చిపయోజపత్త్రముల ప్రాలెడు తుమ్మెదబొమ్మిముంగలన్, దచ్చనసేయుచున్ ." పాండు. ౧, ఆ. ౧౯౯.

తచ్చెలాడు. ద్వ. స. క్రి. (తచ్చనలు+ఆడు.) 1. గేలిసేయు, వ...పచ్చరాగచ్చుల నిచ్చలంపు బచ్చిపచ్చికల తచ్చలాడుగోడల నాడనాడ క్రీడలతో జలక్రీడలాడు గొల్లకాపుప్రౌఢచేడియలు.." పావి. ౧, ఆ. ౧౧౧, 2. మోసగించు, "ఆ. పచ్చవిల్తుచేత గ్రచ్చర జనులెల్ల, దచ్చలాడబడిరి ధరణిలోన." వేమన. ౧౧౧.

తచ్చాడు. ద్వ. అ. క్రి. (తచ్చనలు+ఆడు.) ఊరక యటునిటు తిరుగు. (శ్రా. వా.)

తజవీజు. దే. వి. (హిం. తజ్ వీజ్.) ఇంగితము, 'పీ. తజవీజులో మెల్ల రుజావుచేసితిగదా సాహావహైరాల నాడునాటు." రంగా. ౨ ఆ. ౩౯. "ఆ. దాని బట్టబూనుతజవీజు గనుగొని .."చంద్ర. వి. ౩, ఆ. ౩౨.

తటకా. దే. వి 1. నిశ్చేష్టత. (చూ. తటకాపడు.); 2 కలత (చూ. తటకాపడు.)

తటకాపడు ద్వ. అ. క్రి. (తటకా+పడు). 1. ఆశ్చర్యపడు. అం. భా. తృ ౧౦౧; 2. చేష్టలు దక్కు. "ఉ ..లవ,కాపురరాజ్యలక్ష్మి దటకాపడి మాచుచు నున్న నత్తఱిన్." దశా. ౭, ఆ. ౨,౯. ౯౫. "చ. కలగుచు బల్కబోవు దటకాపడు ..." రాధికా. ౧, ఆ. ౧౨౯; 3. కలగు. "మానిని. గబ్బినఖుల్ తటకాపడి మానిని గన్గొని పల్కిరి కర్జము గాన్" ప్రబంధ. ౫౩౬.

తటకాపాటు. ద్వ. వి. (తటకాపడు ధా). ఆశ్చర్యము. అం భా ప్ర. ౧౩౨

తటతట దే. వి. 1. గుండె మొ అదరుటయం దగు ధ్వని కనుకరణము. "సీ. హృదయంబు తటతట నదరంగ .." భార. విరా. ౪, ఆ. ౭౦; 2. పడుటయం దగుధ్వని కనుకరణము. "సీ. చిటచిటారవముతో దటతట పడగండ్లు యువరాజముఖ్యుల నొదుగంజేయ." హంస. ౪, ఆ. ౨౨౧; 3. బాధ. (చూ తటతటపడు.)

తటతటపడు. ద్వ అ. క్రి (తటతట+పడు. బాధపడు "క. పొటపొట నాకట సోలుచు, దటతటపడుచాతకములదైన్యము వాసెన్." వైజ. ౨, ఆ ౧౪౬ [చించు. (వా).

తటపటాయించు దే. అ. క్రి. వెనుకముందు లాలో

తటపెట. దే. వి. వాహ్యముల మోతయందలిధ్వని కనుకరణము. క్రీడా. ౨౨౫.

తటమట. దే. వి. 1. మోసము. "క. తప్పక కనుచుంటి వారితటమట లంతన్." రాధికా. ౨, ఆ. ౧౩౪; 2. కలత. (చూ. తటమటించు.) విశే. కలగినది "క ..తటమటగమనంబు లూని తప్పగ నడచున్." నృసిం. ౪, ఆ. ౧౯౨.

తటమటించు. దే. స. క్రి 1. మోసగించు. "ద్వి. తచ్చులు పచరించి తటమటించెదవు." ద్వి. హరిశ్చ ఉ. ౧౬౪, పం.; 2 కలచు. "సీ తమ్మితేకుల సిరి దటమటింపగ జాలుమెఱుగుగన్నులం గలంచి రాగ." [illegible] ౪, స్కం. ౭౪౬, స్వా. ౫, ఆ. ౧౦౧

తటము. సం. వి. అ [illegible] న. 1 ఏటియొడ్డు; 2. ప్రదేశము. (కటితటము); 3. కొండచరియ. (గిరితటము).

తటవట. దే. వి. 1. మోసము (శ ర.); 2 కల్ల. అం. భా. ప్ర. ౧౯౯. విశే వంచకము. "ద్వి తటవట మాటలు దప్పకాడెదవు."ద్వి. శ. సా. ౬౪, పు

తటవటచేయు. ద్వ. స. క్రి. (తటవట+చేయు). మోసగించు, "ద్వి. తల్లిదండ్రులు బాపి తటవట

చేసి" ధర్మా. ౧.భా. (శ. ర.) దశా. ౨, ఆ. ౩౮౨.

కటస్థము. సం. విణ. (అ. ఆ. అ); 1. ఒడ్డున నున్నది; 2. సమీపమున నున్నది; 3. ఉదాసీనము; 4. లభించినది.

కటస్థించు. సం. అ. క్రి. 1. కలుగు. "వ...ప్రద్యుమ్నున కిద్దురవస్థ కటస్థించె..." హర. ౩, ఆ. ౮౯; 2. లభించు.

కటస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ); 1. ఒడ్డున నున్నవాఁడు; 2. ఉదాసీనుఁడు; 3. న్యాయస్థుఁడు; 4 లభించినవాఁడు.

కటాకము. సం వి. అ. పుం. న. చెఱుపు.

కటాన. దే. క్రి. విణ. ద్రు. (దీనిరూపమే ద్విరుక్తరూపము కటాకటాన); 1 శీఘ్రముగా. "ఉ. ..బంతి కటాన వైవ " కృ. శతం. ౨, ఆ ౯౭. 'పంచచా. కటాకటాన గుండె పాఱి ఝల్లుమింపుచుండఁగా." ఉ. హరిశ్చ ౨, ఆ ౧౨౮; 2. ఆకస్మికముగా. "ఉ ..యముండు కటానఁ జూచి ..." ఉ హరిశ్చ ౪, ఆ. ౧౬౯.

కటాయించు. దే అ. క్రి సాఁటు. "క ..ఎదఁ డటాయించన్, గొంచించక మొగలిపువుగుమ్మితిఁ దిమ్మెన్." ఉ. హరిశ్చ ౪, ఆ. ౧౧౪. స. క్రి. అడ్డగించు. ఆం భా కృ. ౧౨౦.

కటాలు. దే. వి. 1. గుండె యదరుటయం దగునను కరణము. "క...గుండియ కడా లనఁగన్ జై. ౬, ఆ. ౧౩; 2. ఆకస్మికముగ సంభవించుటయం దగుననుకరణము. "మ...వర్షముల్ జడిగాఁ బట్టి కటా లనంగ వెలిచెన్..." హర. ౨, ఆ. ౨౯.

కటాలున = కటాన. (శీఘ్రముగా) "చ మని యటు రాఁ దటాలున సమున్నతపీఠము డిగ్గి .." పను. ౨, ఆ. ౮౪.

కటాల్న = కటాలున "ఉ. ఈవరి పాటిఁ దార్చి నగునింటికి వీనిఁ దటాల్న..." వైజ. ౩, ఆ. ౯౩.

కటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒడ్డు; 2. ప్రదేశము.

కటిత్రు. సం. వి. ల్. స్త్రీ. మొలపు.

కటని. సం. వి. ఈ. స్త్రీ. నది.

కటుకున దే. క్రి. విణ. ద్రు. 1. శీఘ్రముగా. "ద్వి.. ఆచక్రవర్తి, కటుకున నిత్యకృత్యము లెల్లఁ దీర్చి." ద్వి. హరిశ్చ. పూ. ౯౯౬, ౯౦; 2. అనాలోచితముగా. "ఉ. కటుకున నియ్యకొంటి మతి దప్పి మరుద్గురునంతవానిలో." కాశీ. ౨, ఆ. ౧౧౧; 3. ఆకస్మికముగా. "చ కటుకున రాజు మోమెదుటఁ దారస మైన..." స్వా. ౫, ఆ. ౮౧; 4. అవలీలగా. "చ.. ఏకున దత్తురంగమున్, దటుకునఁ బట్టెదన్..." జై. ౪, ఆ. ౧౦౭.

కటుక్కున = కటుకున. (శీఘ్రముగా) "చ ..విల్లటు కటుక్కున ధారుణి వైచి..." రామా. ౨, ఆ. ౪౦. భీమ. ౬, ఆ. ౬౫.

కట్ట. దే. వి. (క. కట్టె. త. కట్టమ్.) 1. వెదురుగంప. "పడ్లతోఁ గూడఁ బ ఎ ట్టుండవలసి వచ్చె" (శ. ర.); 2. పల్లిక. ఉదా:—తక్కెడకట్ట; 3. (లోహాదికముతో చేసిన) పళ్లెము "క. అని యనిమిషపతి కనుఁగొని కరిచేఁ బసిఁడి కట్టఁగప్పులబాగాలును దొడవు లొసఁగి..." చంద్ర. ౨, ఆ. ౬౦ ఆం. భా. ద్వి. ౨౪౪. "సీ. చెలువొందువలువలు వెలహెచ్చుసొమ్ములు పొందిక్కకట్టలఁ బొందుపఱిచి." కళా. ౩, ఆ. ౫.

కట్టకొమ్ము. దే. వి. (కట్ట+కొమ్ము) పేఁట కగుసాధనములలో నొకటి. రుక్మా. ౩, ఆ. ౭౦.

కట్టగిల్లు. దే. అ. క్రి. గట్టియగు (శ. ర.)

కట్టపాగ. దే. వి. (కట్ట+పాగ.) కట్టవలె సుట్టఁగఁ జుట్టినతలపాగ. "చ...కట్టపాగ లీగరిమను జెమముల్ దనరఁగా..." చెన్న. ౨, ఆ. ౨౦౬.

కట్టము. దే. వి. (క. కట్టు. ఎండుచర్మము. "సె... కట్టిన పెనుఁబొఁపకట్టంబుతోడ "కళా. ౩, ఆ. ౬౨. (శ ర. పా. 'దట్టము' ముద్రి. పా); 2. (చర్మాదుల) ప్రోగు. "లయగ్రాహి. ముట్టిగజయూథములఁ బట్టి రదనాగ్రములఁ గుట్టి తెగఁజీరి పలుకట్టములు పెట్టెన్ "కు. సం. ౧౨, ఆ. ౧౭౩.

కట్టస. వై. వి. స్థైర్యము. "చ. జవమున నాసికాచరి భుజంబులు సాఁచుచుఁ గిన్క రమథూధవుపయి కేఁగుదేరఁ గడుఁ దట్టన హుంకృతితోడ సంయమిప్రవరుఁడు ఘోరివాక్యముల భర్జనసేయుచు..." భా. రా. బాల. ౨౯౩. ఉ. హం. ౩, ఆ. ౧౨౩.

కట్టాడు. దే. అ. క్రి. (కట్ట+ఆడు) 1. ఇటు నటు తిరుగు. "ద్వి. కట్టాడ కిటు వేగ కరుణి

ర మ్మనుచు.' బస. ౨, ఆ ౫౭. పు; 2. అడుగు లిటువటు వేయు. "సీ రెండుమూఁ డడుగు లొం డొండఁ దట్టాడునప్పుడు త్రివిక్రమలీల బుద్ధిఁ జూచు." నృసిం. ౩. ఆ, ౧౪౭; 3. కొమ్మదిగాఁ దిరుగు. "ఉ దివ్యగంధములతో సుఖశీతల మారుతంబు దట్టాడె "ఉ. హరి. ౧, ఆ ౧౨౩. సుది. ౨, ఆ. ౧౨౨.

తట్టి. దే. వి. 1. కంచము. వేంక. మాస. ౪౭. సాం. ని. మాస. ౨౫, 2. (క. తట్టి) కేంటతెర. "సీ. తట్టికి వచ్చి యిట్టట్టు వో నేరనిలేళ్లవిధంబున లీల మెఱయు." నిర్వ. ౫, ఆ. ౧౦౦. కృష్ణ. ౩, ఆ. ౩౭.

తట్టివేయు. దే. స. క్రి. (తట్టు+వేయు. స్వార్థమున) తట్టు,వెనుకకు గెంటు. "ఉ. దిప్పనఁ దట్టివేయఁ గలదా వలదా తలదాఁకగా నలెన్." పార్వ. ౨, ౧౨౭.

తట్టు. దే అ. క్రి. 1 కలుగు. 'ఆ. దైవయోగము నను దట్టినమేలు', క్లనుభవింప కెట్టు. లరుగ వచ్చు." కుచేల. ౩, ఆ. ౧౬. పసు ౨, ఆ ౧౦౪; 2. స్ఫురించు. "క. అట్టిశుభ పాయము నీకుం,దట్టిన నృపుపొందుమాటఁ దలఁపుము...' హంస ౨, ఆ. ౧౨౭, 3. కరఁగు. "చ. ఘనగత శంపఁ గంచ మిడ కాటుకఁ దీర్చి పునుంగినొప్పఁ దట్టినది యిలంది..."ఆము. ౨ ఆ. ౧౬ స క్రి. 1. ఇది కొన్ని క్రియలతుమున్నంతరూపముల కనుప్రయుక్తమై యాయాధాతువుల ప్రేరణార్థము నిచ్చును. ఉదా.—పోవఁదట్టు, పాయఁ దట్టు, పోఁడట్టు. మొ.), 2. చేతితో మెల్లగాఁ గొట్టు; "ఉ...కేల నాభూమిభుజేంద్రు దట్టి ముని పుంగవుఁ డిట్లనియెఁ బ్రియంబునన్." కువల. ౨, ఆ. ౧౭, 3. వాయించు, "ప్రగ్ధర ..జే తాళక్రవ్యాదభూతోత్కరము ఒతలై తాళముల్ దట్టి యాడన్ ..' భాగ. ౧౧. స్కం. ఉ. ౪౪౩; 4. విడుచు; "గీ. అంకిలిని గట్టి దప్పులఁ దవులఁ దట్టి." పార్వ ౪, ఆ ౪౨. వార్ష్మి. ౨ ఆ. ౧౨౬; ౫. సిలుపుకొను. "సీ.. ఎట్టు తట్టుదుఁ బ్రాణము..." మార్క. ౧, ఆ. ౧౬౩; ౬. చేరు; 'చ పథిన్, దనరుసుధాశనేందు లను దట్టిలి మున్పడిమాడు కోటులన్" అచలా. ౧, ఆ.౭౨. యు. దే. వి. 1. చఱచుట కొట్టుట మొదలగు వానిచే చర్మము పొంగుట; అట్లు పొంగినచర్మము. వా —వ నినీపుమీఁద చఱవఁగాఁ దట్లు లేచినవి. (చూ. తట్టుగట్టు.); 2. పొంగు; చర్మరోగవిశేషము. (బ్రౌ); 3. నీచజాతిగుఱ్ఱము. "సీ. పఱ గఁటికట్టైన భద్రేభిమైనను ద్యాగశీలునకు లత్యంబు గాదు" రాధులిం. ౬౭; 4. శబ్దదోషములలో నొకటి "చ. జవరఁదనంబు గల్గి మటే జల్లిని బొల్లను దిట్టు ప్రోవనుం, దవులక..."భల్లా ౧, ఆ. (శ. ర.); వై. వి (సం. తటీ.) 1. తీరము. ఏటిదరి; ఆం. భా ప్ర. ౧౫౫, 2. ప్రదేశము, చోటు; "క....ఆతట్టున నొక్కతోఁట నమరఁగఁ జేసెన." హంస. ౧, ఆ ౧౮౩.

తట్టుగట్టు. దే. అ. క్రి. (తట్టు.) చఱచుట కొట్టుట మొ. వానిచేఁ జర్మము పొంగు. "క. అడిచెద నని యెూఁకించుట, యాడుచుట మెయి తట్టుగట్ట నడుచుట .. అధికపుఁదప్పల్." విజ్ఞా.ప్రా.౫౧.

తట్టుచేయి. ద్వ. వి. (తట్టు+చేయి.) కోటకొమ్మమీఁది యవయవవిశేషము "ద్వి. తట్టుచేతులును గొత్తడములతోఁడ, నిట్టుకకోటయు..."రం. రా యు. ౨౮౦. పు.

తట్టుపునుఁగు. ద్వ. వి. (తట్టు+పునుఁగు.) పూతి పునుఁగు. (ఇది మిక్కిలి శ్రేష్ఠమైనది.) "సీ. అలరుకస్తురితేఁట లటికి వాకిళ్ల చెంతల పైచి పోయిన తట్టుపునుఁగు" య. ౧, ఆ. ౪౭. ఆం. భా. ద్వి. ౧౬౧.

తట్టుముట్టాడు. ద్వ స. క్రి. (తట్టు+ముట్టు+ఆడు.) అపారమగు; మిక్కుటమగు. "గీ. తట్టుముట్టాడు నిట్టిపేదఱికి మిట్టు, కొంప దీని కుపాయ మూహింపవైతి."భాగ. ౧౦, స్కం. ఉ. ౯౬౬. "ద్వి. దరహాసదీప్తులు తట్టుముట్టాడ." పండిత. మహిమ. ౧౩౩. పొ. ౧౫. పం.

తట్టుముట్టు. ద్వ. అ. క్రి. (తట్టు+ముట్టు.) అపారమగు. (చూ. తట్టుముట్టాడు) వి. పసిముట్టు. (బ్రౌ)

తట్టువ. వై వి (సం. దండరి) 1. నీచజాతిగుఱ్ఱము; గుఱ్ఱము. ఆం. భా. ద్వి. ౧౯౬. "వ...అదిట్టి తట్టువ నభిముఖంబుగఁ బాఁకొలిపి..." సాంబో. ౩, ఆ. ౨౬. అచ్చ. యు. ౧౯౬. 2. వాహనము. (చూ. తట్టువము.)

తట్టుపడు. ద్వ. అ. క్రి. (తట్టు+పడు.) 1. సక్తమగు. "వ. ఆగట్టుకొఱపట్టె...పట్టరాని తమకంబునం దట్టుపడి..." వసు. ౨. ఆ, ౧౮౦, 2. కృశించు "వ.. చిట్టెసంగుసాఁకటం దట్టుపడి..." స్వా. ౪, ఆ. ౩౭

తట్టుపము = తట్టుప (వాహనము.) "ఉ. అందలికత్తెలనిగమి నందఁగ గాడుపుతట్టువాలు వే, పందెము పైచి పర్వులిడుపట్టున నోడియ కాదె..." అచ్చ. బాల. ౩౭.

తట్టువాఱు. ద్వ. అ. క్రి. (తట్టు+పాఱు) వెనుకకు మరలు, "ఆ. కడిఁది మ్రోఁత మేఘకంఠీరవంబులు, తాఁకి తాఁకి దస్సి తట్టువాఱె." క్రీడా. ౨౩౦. శై. ౨, ఆ. ౩౧.

తట్టువిఱుగు. ద్వ. అ. క్రి. (తట్టు+విఱుగు.) అత్యధికమగు. ఆం. భా. తృ. ౧౦౧.

తట్టూర్చిపోవు. ద్వ. అ. క్రి. (తట్టు+ఊర్చు+పోవు) తట్టువిఱుగు. "మ. తపస్తోత్రం దపోపాస మానమునం దట్టూర్చి పో మేన ముత్పులకల్ గ్రక్కునఁ బర్వె.." కు. సం ౯, ఆ. ౪౮.

తట్టూర్చు. ద్వ. అ. క్రి. (తట్టు+ఊర్చు) అపారమగు (చూ. తట్టూర్చిపోవు)

తట్టొఱగు ద్వ. అ. క్రి. (తట్టు+ఒఱగు) ఒకదరికి వంగు; అతిశయమగు. "క. వెన్నలతుద హిమకణములె, చెన్నగఁ దట్టొఱగి రాశిలెన్ రాజనముల్." చం. రా. ౫' ఆ. ౨౯. విపు. ౨, ఆ. ౧౪.

తట్ర. వై. వి. (సం. త్వష్టా.) బంగారుపని చేసి జీవించువాఁడు. ఉదా.—తట్రవాఁడు, తట్రది. (శ. ర.)

తడ. దే. వి. 1. అడ్డు. "క. తడ వాయెఁ గడఁగి వేల్పులు,తడ వాయం జేతు నని యతండు పిడికిటం, బొడిచిన..." సమీర ౧, ఆ. ౧౭౫. చం. రా. ౪, ఆ. ౮౯; 2. కూసము. "క త్రడ విడిచినపాములవలె..." దశా. ౪, ఆ. ౬, 3. దవ్వు. 'చ. ఘనఖరతామిశ్ర ద్విషమకాండసమున్నతహేతిజాతతా, పనికర మంతయుం దడఁకుఁ బాయఁగ..." చంద్రి. ౩, ఆ ౮౮; 4. తొట్రుపాటు (చూ. తడఁబడు); 5. ధ్వనుపెట్టు. ఆం. భా. ద్వి. ౫౬. పాంచ. ౪, ఆ. ౧౧.

తడఁబడు ద్వ. అ. క్రి. (తడ+పడు) 1. తొట్రుపడు. "సీ తలి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి పడిచూపు లాదట బయలుపఱుప." భార. విరా. ౫, ఆ ౪౦౨ ఉ. రా. ౩, ఆ ౩౪౭; 2 తప్పు "చ. తడఁబడె దివ్యబాణము తంత్రము .." భార. భీష్మ. ౩, ఆ. ౩౫౧; 3. తాఱుమాఱు. "ఆ నలువు గిలువు దంపతుల కొకప్పుడు దడం,బడును గాని యెట్టియెడల నట్లు జగతి శాఁడు దినము మగతనంబును దడం, బఱచుకొనుట యెందు కాఁగఁబడదు" కళా. ౫, ఆ. ౯౨; 4. చలించు. "మ. తయద్రూపాం భుజముల్ ఘటిం దడఁబడన్ జన్దోయి లేఁగొనపై దయదప్పన్..." ఆము ౧, ఆ. ౫౬; 5. ఒకదానితో నొకటి కొట్టుకొను. "సీ. మ్రాఁకుల మొదళుల వీఁకఁబట్టి. ఆ. వడిఁ గదల్పఁ బడ్డు దడఁబడి వారల,తోన ధరణిమీఁదఁ దొరఁగుచుండ. భార. ఆది ౫, ఆ. ౧౬౬; 6 పొరపడు. "క... నినుఁ దడంబడకుండన్, మదిలోన చేర్పరించుట, సుదుర్లభము . ..." కళా. ౩, ఆ. ౧౭౬; 7. క్షోభించు. "క. తడఁబడఁబడియెదురవమును, బడి కాలెదురవమును ." భాగ. ఆది. ౭, ఆ. ౨౧౪. 8. ఏకమగు "సీ. భేరీనాదములును బ్రకటగంధర్వమృదంగనాదములును దడఁబడంగ. హరి. ఉ. ౭, ఆ. ౫౪ కళా. ౩, ఆ ౯, 9 ఒకదాని నొకటి మించు. "మ...బాంధవాచర్యమాన్యుల గేహంబులచుం దడంబడుచు నుండుక్ పండెయుఁక్ బైఁడియుఁన్." విప్ర. ౧, ఆ ౪౧. భీమ. ౧, ఆ. ౪౦; 10. వెనుదీయు. "చ...దొంగవేడబముఁ దెచ్చుకొంటివె తడంబడ కిట్టు లనంగ న్యాయమే." రంగా. ౨, ఆ. ౨౧౫. ఉ రా. ౨, ఆ. ౧౦౧.

తడఁబఱచు ద్వ. స క్రి. (తడఁబడు ధా. ప్రే.) 1. బాధించు; క్షోభపెట్టు. "క. సంగీతకళలఁ దెలఁగుకు,రంగాక్షీ బెడంగులం గరంగుట తపొ, భంగించి యితరకాంతఁ దొఱంగుట తపొ తడంబఱచి పురుషులకున్." కళా ౭, ఆ. ౨౪; 2. తాఱుమాఱుచేయు. "ఆ. జగతి శాఁడు దనము మగతనమును దడం,బఱచుకొనుట యెందు కాఁగఁబడదు." కళా. ౫, ఆ. ౯౨. విజ్ఞా. ప్రా. ౬౧.

తడఁబాటు ద్వ. వి. (తడఁబడు. ధా.) 1. తొట్రుపాటు. "చ...తడఁబాటున దత్తరము జలంబులో, నడరఁగ." పారి ౧, ఆ. ౧౦౧. విజ ౧, ఆ ౪; 2. పొరపాటు. "ఉ. పట్టఁగ వచ్చి కారో తడఁబాటున పీని మరిభ్రమంబునన్" శివరా. ౪, ఆ. ౫౬; 3 వ్యత్యయము. ఆం. భా ద్వి. ౧౯౪; 4 కష్టము. "గీ వసుధలోపల నిరువురు వాసుదేవులున్నఁ దడఁబాటు గాదె." పారి. ఉ. ౬, ఆ. ౯౩, 5 విభ్రమము. "గీ క్రాలుకన్నులు పలిచన్నుఁగవలుఁ దలిరు, మొగములుఁ గురులు బంధురముగను బెరసి, చూడఁ దడఁబాటుగా జలక్రీడ సలిపె, శిలమిమనముల కెలఁకొన్నఁ జెలువపిండు" నిర్వ. ౮, ఆ. ౫౩

తడక. దే వి. (తడిక యనియు వాడుక. శ. ర. అస్మదృష్టమంటకుఁగాని ఇస్మదృష్టమంటకుఁ గాని నిర్ధారక ప్రయోగములు కానరావు) 1. వెదురు బద్దలు కొబ్బరియాకు మున్నగువాని యాకులతో నల్లి తలుపు మొదలగువానివలె నుపయోగించుకొను సాధనము. (చూ. తడకపెట్టు, తడకద్రోపరి మొ. 2. శిథిలమగువస్తువు "క. పుస్తకపుందడక ధరియించి" ప్రబోధ 3, ఆ ౨౦ వైశ ౭, ఆ. ౧౯౭; 3. బిగి లేనివాక్యరచన. ప్రబంధ. ౨౧

తడకట్టు. దే. స. క్రి (తడక+కట్టు.) అధిక్షేపించు. "క పాదసంగ గవ్వపుగుబ్బలి, నడుమ త్తమమీఁదఁ గుందనపుఁగొండఁ జెలం, గడు పేల్పువీటిచెలువముఁ, దడకట్టుఁగఁ గాలునొప్పె డంబులతోడన్." వరాహ. ౧౧, ఆ ౩౧. విశ. 1. అధిక్షేపించునది, పాఱఁద్రోలునది. "చ .. శే, పొలఁతుక కాళికొట్టు తమపుందడకట్టు సరోజసౌధముల్, కల చెలితోడ బుట్టు తొలుగట్టుకయిం గనుపట్టె నంతటన్." రా. వి ౭. ఆ. ౮, 2. స్తంభింపఁజేయునట్టి, నిరోధించునది. "సీ. పిడుగుకైదువు పెట్టు తడకట్టుగాఁ బయోధిమహామధిరసంబు చమరె ననఁగ." వసు. ౫, ఆ. ౩౬.

తడకకట్టు. దే అ. క్రి. (తడక+కట్టు.) అధిక్షేపించు, హేళనము చేయు. ఇట్లే, తడకలుకట్టు. (వా.)

తడకద్రోపరి. దే. వి. (తడక+త్రోపు+అరి) కవాటనోదకుఁడు, తలుపు బద్దలుగొట్టి చొరఁ ప్రవేశించు దొంగ. ఆం. భా. ద్వి. ౨౬౧. పెం. పంచ. ౪, ఆ. ౨౪౦.

తడకద్రోపు = తడకద్రోపరి. "క...తడకద్రోపు లొంటరికాండ్రున్, లజ్జ యెఱుంగనిబిటులును, సజ్జనమగు వారగతులజన్మఫలంబుల్." శుల్హ. ౨, ఆ. ౧౪.

తడకపెట్టు దే. అ క్రి (తడక+పెట్టు). పొఁద్రోలు. "సీ. బంధుల కిడఁ దంచుఁ బరుల దూషించుచు దినయిల్లు చొచ్చినఁ దడకపెట్టు." వేమ. ౬౩.

తడకాలు దే. వి. (తడ+కాలు); 1. వణఁకుకాలు. (చూ. తడకాళ్లపడు); 2. మల్లబంధములలో నొకటి. ఆం. భా. ద్వి. ౨౦౯.

తడకాళ్లపడు ద్వ. అ. క్రి. (తడ+కాళ్ల+పడు). కాళ్లు వణఁకు. "సీ. ఉడుగనివిభ్రాంతిఁ దడకాళ్ల పడ నిల్పుభూపులు డాగఁ జేకటులు సేసె." వసు ౧, ఆ. ౪౬.

తడగము దే. వి. పక్కాలి, ఎద్దుమీఁద నుంచి నీళ్లు తెచ్చుతోలుసంచి "ద్వి. ఒడలిపీర, సెఱుంగ కుదరంబు పెద్ద, తడగంబుగతిఁ దోఁచ .." ద్విపదారిశ్చ ఉ. ౧౯౫౬. పం.

తడచు. దే. వి. 1. త్వక్కు, పట్ట. ఆం. భా. ద్వి ౩౭; 2. తాటికప్ప మొ. వానినుండి తీయునార. (శ.ర. వా)

తడపెట్టు. దే. స. క్రి. (తడ+పెట్టు) తడబఱచు, తాఱుమాఱుచేయు. "చ. తలఁపులు పిక్కుసీరు పడఁ దాల్మలు పెల్లగిలంగ. కోర్కుల త్రుందు చేష్టితంబులఁ దడపెట్ట .." పారి ఉ. 3, ఆ. ౮ (శ. ర. పా).

తడము. దే. స. క్రి. 1. నిమురు. "వ...అక్కునకు రోమలి కల్లనల్లన తడమికొని వచ్చి .." కు. సం. ౫, ఆ ౧౪౪; 2. అరయు. "గీ.. ఇచ్చఁ దలఁచి, తడవి నాచేత దీవన వడయు మమ్మ." భార. విరా. ౨, ఆ. ౨౧౪.

తడయు. దే. అ. క్రి. 1. ఆలసించు. "గీ. వీఁగి తన తల్లిదాస్యంబు నీఁగఁ బూని, తడయ కమృతంబు గొనిపోవఁ గడఁగి వచ్చె" భార. ఆది. ౨, ఆ. ౮౪; ౬, ఆ ౨౬౦; 2. వసించు. "ఆ. అడవిలోన నేము దడసినదినము లన్నియుం గణించి యంబునిధిపురంబు, కేగకడయ ముంచు..." భార. సా. ౧౯౭, 3. అలస్యమగు. "క. సకలైశ్వర్యసమృద్ధులు నొకకల సంతానలాభ మొకకల యదియుఁ దడవు నిండురేఖాయుతటుని

కృప యేల లేదు మన కిప్పాటన్." కాశీ. ౩, ఆ. ౨౧౬

తడవ. దే. వి. మాఱు, పర్యాయము. ఆం. సం. మాన. ౬౨.

తడవాటు. ద్వ. స. (తడవు+పాటు.) ఆలస్యము, విలంబనము. "ద్వి. దాటుమాటలు కొన్ని తడవాటు వన్ని గెంటక నోరార్చి గెల్వఁజూచెదవు" ద్వి. హరిశ్చ పూ. ౨౯౦. పం. (తడవాటువన్ని = విలంబనమునకై పన్ని.)

తడవాడు. దే. అ. క్రి. (తడవు+ఆడు.) 1. దోఁగి యాడు. "క. తడవాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్." భాగ. ౧౦, స్కం. పూ. ౨౯౦. 2. క్షోభపడు; "క తడవాడి రరులు భయమునఁ, దడవాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్". భాగ ౧౦ స్కం. ౨౬౦; 3. చేతులతోఁ దడవు. "చ... చీఁ, కటి నడిమిండ్ల టింటఁ బడి కాంతమణుల్ బయ లంచు భ్రాంతి చేనట శౌగఁ బ్రాఁకి తాఁకి తడవాడుచు గూడుల వెంట దూఱి..."రాధా ౨, ఆ. ౧౪౦. స క్రి. వెదకులాడు. 'గీ. మాపుచాలమి వివిధరూపోపకరణ్యవితతిఁ దడవాడు .."పాండు. ౨, ఆ. ౧౯

తడవియాడు = తడవాడు. 1. (దోఁగాడు) "గీ తడవియాడెడి వసుంధరాస్థలమునందు, విశ్వపతి తత్త్వ మనుమణి వెదకురీతి." కాళ. ౩, ఆ ౩౦. (చేతులతోఁ దడవు) "గీ. మన్మథాకారుఁ డొక రెండుమానికంబు, లిరువు రేశాయ తాక్షుల కిచ్చి మరల, నొకతె మణి వేగఁ గైకొనె నొకతె మణికిఁ, దడవియాడుచుఁ బృథుపయోధరము లంటె." కంథ ౯౦.

తడవిల్లు. దే. వి. (తడ+విల్లు.) తడచెట్టుకఱ్ఱల బద్దలతోఁ జేసినవిల్లు. "సీ తడవిండ్లు చేపట్టి తడయుక యొఱపులై యార్చుచు .."భార. అర. ౧, ఆ ౩౦౦. ఉ. రా. ౩, ఆ. ౩౭౭.

తడవు. దే. అ. క్రి. (క. తడవు. త. తడవు.) 1. దోఁగాడు, మెల్లదిగాఁ బ్రాఁకు. "సీ. ముద్దులు దొలఁకాడ మోఁకాలఁ గేలను దడవుచు నొందును దారి తారి." హరి. పూ. ౫, ఆ. ౧౯౩; 2. తొడఁగు; యత్నించు. "గీ ..నారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ, బూనఁ దడవ..."భాగ. ౪. స్కం ౩౪౭. ద్వి. పరమ. ౨, ఆ. ౫౨. పు,

౩. జీవించు,వర్తిల్లు. "క. ఊడివోనిసిరుల నిటువలెఁ దడవెడునయ్యాల్లగళ్యఁ దనియింతుడు..." నీలా. ౧, ఆ. ౫౩. స. క్రి. 1. నిమురు. 'గీ ఆయ్యోపేంద్రుఁడు నొచ్చినహాయదయంబుఁ, దడవి తేర్చి .." భార భీష్మ ౨, ఆ ౧౪౧. ఆం. శా. కృ. ౧౩౩; 2 వెదకు; "క ..ఇాడు నిటుం దడవి కంటి మిఁ పాడు "భార. శల్య ౨, ఆ. ౬౬; 3. సంపాదించు; "సీ ధర్మమార్గంబునఁ దడవినఘన మెల్ల ధరణీసురుల కర్థి దాన మిచ్చి .." పళ. ౯. ఆ ౧౪, 4. తాఁకు; "గీ. వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు." పాండు. ౩, ఆ. ౪౩; 5. తలఁచు, "చ ..కలవించె దైవమున్, దడవుచు బంచమధ్యముల తానము లీనుదికాంగవాగతిన్." కాళ. ౧, ఆ. ౫౦; 6. ఆలోచించు; "క. ఎయ్యెడనైనను బుద్ధి పోనిపి, తడవి కని కొనంగవలయుఁ దగవుఁ దగ మిరయున్."భార. శాం. ౨, ఆ. ౧౭౭; 7. పలుకు; "గీ ఇట్టివిగదయ్య చెప్పఁబోయిన నుపమలు, వీనిఁ దడవ నీగ్గోదన నన్వాలది కాంచి "ప్రభా. ౨, ఆ. ౬౪, 8. స్తుతించు "సీ గంభీరపదవాద్యగద్యప్రబంధ విశ్రమరమాపారీణు బాణుఁ దడవి." వరాహ ౧, ఆ ౧౭; 9. నిందించు "క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు కీడు నిచ్చుఁ గర్తలు తనకుం, గర్మములు ప్రమాణైనను, గర్మగుడై పరులఁ దడవఁగా నేమిటికిన్" భాగ ౧౦ స్కం. పూ. ౩౨. నీతి ౨౧; 10. చేయు. "క. నాపైఁ, గినియ విని యతఁడు దర్పిత, దనుజకృతం బని రణంబు దడవున్ బిదపన్." ఉ. హరి. ౫, ఆ. ౧౭౫. వి 1. జాగు. "క ఈవాయుపుత్త్రుఁ డాటిన్, ద్రాక్షదు నే దుస్సనేచురక్తం బనియెన్, ద్రాఁగ శక్యం బేనిన్,ద్రావ మనంగాజ యుంకఁ దడ వేమిటికిన్" భార. ఉద్యో. ౪, ఆ. ౧౯౫; 2. కొంతసేపు. "గీ. పెట్టుటకు నంగవలతుమ బట్టె దడవు." నైష. ౬, ఆ. ౧౨౨; 3 కెఱపి. "వ... ఆడుగువారికిఁ దెలివిపడ నుదువం దడవు లేక......" పారి. ౪, ఆ. ౬౬; 4. సేపు. "చ. గడెకడ వాతఁ డొక్కపనిగాఁ జని యుంటిక రాకయుండినన్ దడఁబడు .." శకాం. ౨, ఆ. ౭౭; 5. చిరాయువు. "సీ. కాకిపిట్టకుఁ జాలఁ

గడచేనిబ్రదు కిడి చిలుకకుఁ దడ వేల చేయఁ దర్యో." నీలా. ౧, ఆ. ౧౧౧. విశే. చిరము, అధికముగఁ గడచినది. "ఆ. తడవుగానముఁ దను ధరణీసురశ్రేష్ఠ, మాకు మీకు సంగమంబు గలిగె" కుచేల ౨ ఆ. ౭౮.

**తడవుగొను.** దే. అ. క్రి (తడవు+కొను) స్వార్థము.) తడవు, వెదకు. (వా.)

**తడవుడు** దే వి. (తడవు. ధా.) వెదకుట. ఆం. భా. ద్వి. ౧౭౩.

**తడవులనిడుకడు** దే. గ (తడవులు+నిడుపు+అడుగు= దిరకాలదీర్ఘ శరీరి) అనంతుఁడు. శేషుఁడు "క. తడవులనిడుకనికి నైనఁ దరమే యెన్నన్.." అచ్చ. రామ. ౫౫. వేంక. తిర్య ౧౦౪.

**తడవులాడు** = తడవాడు. (వా)

**తడాకము** సం. = తటాకము.

**తడాగము.** సం. వి అ. పు న. చెఱువు.

**తడి.** ఉ. ధ. దే. వి. (తడియు. ధా. క-తడి) 1. నీరు: "చ. తడి తల డిగ్గ ముంప .." అను. ౪, ఆ ౧౧౮ చంద్రా. ౪, ఆ. ౨౬౨, 2. తేమ "చ. చిరసముపాత్రితాగ్ని తడిఁ జెంది నశించు నంచునో..." ఆము. ౨, ఆ. 33, 3. తడిబట్ట "సీ తడి గట్టినట్లు ..' కవిరా. 3, ఆ. ౧౮౮, 4. కష్టము, 'గీ ధార్మికస్థాన ఘన కిట్టిశ్రల్లి ఫ్రుత్రె రామలిం ౮౯. విశే. ఆర్ద్రము, తేమగలది. "గీ. దరుల తడివందు పొదువు మూపురము లంటు, జెల్లుగంటల నాదోతు లుల్లసిల్లె" ఆము. ౪, ఆ ౧౫౬ సం. వి. ఇ పుం. చెబ్బ. విశే (ఇ) కొట్టునది.

**తడిగ.** వై. వి. (సంస్థాలికా. త. తళిగై.) స్థాలిక, పాత్రము; కళ్లేరము. 'చ. ..డఁగనవచ్చువారి కిని భోగము వారికి నాటవారికిన్,దడిగలు మోచు వారికిని దాడలు గట్టెడువారికిన్ ." శ్రీరంమా ౬, ఆ. ౭౭.

**తడితీయు.** దే. అ. క్రి. (తడి+తీయు.) ఎండు. "గీ. పెదవి పేటెత్తు నాలుక పిడుచగట్టు, గొంతు తడిలీయు .." దశా ౨, ఆ. ౧౩౬

**తడిత్తు.** సం. = తటిత్తు.

**తడిత్వంతము.** సం. వి త్. పుం. మేఘము.

**తడిపి.** దే. వి. ధనము, సొమ్ము. (వా.)

**తడిపొడి** దే. విశే (తడి+పొడి.) కొంచెము తడి గలిగి పొడిగా నుండునది. (శ. ర. వా.)

**తడిలము** దే వి శయ్య. తలిమము ఆం భా ద్వి. ౧౬౪.

**తడిమము** = తడిలము ఆం భా ద్వి ౧౬౪

**తడియాఱు**=తడితీయు "గీ పెదవు,లెండుఁ గుత్తుక తడియాఱు .." కూర్మ ౨, ఆ 3౪.

**తడియు** దే. అ క్రి. ఆర్ద్రమగు. 'చ. తడిసినమేక వస్త్రపరిధానములోడ .." భార. సభా. ౨, ఆ 3౦౭.

**తడియొత్తు.** దే అ. క్రి. (తడి+ఒత్తు) తుడుచుకొను. "సీ ..,స్నాన మాచరించి, గీ పేగ పెడ పడఁ దడియొత్తి .."దశా. ౧,౨౯౦. వి. తుడుచుకొనువస్త్రము "సీ. ధౌతాంశుకంబులు తడియొత్తులును నేర..." ఆము. ౫, ఆ ౮౯ "సీ. .. వడియొత్తులకు మేనితళ్లు తుడిచి" చంద్రా. ౪, ఆ ౨౬౨

**తడివెండి.** దే గ. (తడి+వెండి.) పాదరసము. వా)

**తడిసుడు** = తడి యొత్తు (తడితుడుచుకొనుబట్ట) "ద్వి. సరగున మంగళస్నాన మాడించి, తరుణికి జిలుఁగారుతడిగుడు విచ్చి." ద్వి. పరమ. ౫, ఆ. ౫౨౮, పు

**తడుకు.** దే వి. 1. తడక. ఆం. భా. ద్వి ౧౨; 2. కంచె. 'గీ తడుకు పొడిపించి చూరుల, గుడిసెల పసియించె మంత్రి గురుభట వంశుఁడై" ఆము.3, ఆ ౧౭; 3. వేటసాధనవిశేషము "క. కట్టలుకఁ దడుకుచాటునఁబిట్టల నురిగోలఁ దిగిచి......" భాగ. ౭, స్కం ౫౯.

**తడుకుఁబెండెము.** దే వి. (తడుకు+పెండెము) తెట్టు కొఱకు ముడ్లతో నల్లినతడక. ఆం భా తృ. 3౪. 'ఆ... తాఁ,దడుకుఁబెండె మలుక పొడవు పెరలి. ఆము. 3, ఆ. ౨౭.

**తడుకున** = తటుకున. (శీఘ్రముగా) "చ. మడిఁగి ముసుంగుతో వెనుక ముంగుచు జాడక వచ్చి గొనికిం, దడుకునఁ బోయి..." కవిక. ౪, ఆ. ౯౬ (శ. ర. పా)

**తడుకువాడుచు** దే అ క్రి. (తడుకు+పాడుచు.) 1. కంచెవేయు. 'క...పరు లావాల వుటు చొరకుండఁ దడుకువాడిచినభంగిన్"కళ. ౫, ఆ. ౧౫౫ స్వా. ౪, ఆ. 3౭; 2. కంచెవేసినట్లు

చిమ్మ. "సీ. కేతకీమందారకేసరాదులఁ దన్ని కాకవీ వీథుల కొల్లఁ దడుకువాడిచి." రామా. ౬, ఆ. ౨౦౧.

తడుపు. దే. స. క్రి. (తడియు. ధా. ప్రే) ఆర్ద్రి కొనర్చు. "గీ. అంగరాజ్యాభిషేకార్ద్రి మైన శిరము, దడిపె వెండియు హర్షాశ్రుకణులఁ జేసి." భార. ఆది. ౬, ఆ ౫౩. "సీ...దగదొట్టి పెద వ్రులు దడుపువారు." హర. శతం. 3, ఆ. ౧౦౬. వి. 1. వస్త్రము. "గీ. తడుపు గట్టక సీల్లాడఁ దగవు గాదు." కాశీ. ౨, ఆ. ౮౫. భార. శల్య. ౨, ఆ. ౧౬౦; 2. చిన్నవస్త్రము; "గీ పసుపుఁ గోకసమును బచ్చపట్టు తడుపు, నపురఁ బొన్నారి చిణుతప్రాయమున ముక్కు, జగతి బలి వేఁడినట్టి వేషము ధరించి." వైజ. 3, ఆ. ౧౩౬. హరి. పూ. ౫, ఆ. ౨౫౫. విశే. తడిసినది "గీ. పడఁతు లర్ఘ్యోర్ధఁ దడుపుపావడలు విడిచి." భాను. ౨, ఆ. ౯౦.

తడుపుదాలుపు. దే. వి. (తడుపు+తాలుపు.) బ్రహ్మ చారి "సీ...వడుగు బొమ్మాసారి తడుపుదాల్ప గీ. నఁగ వటుండు .." వేంక. మాన. ౩౮. అం. భా. ద్వి. ౧౮౬.

తడుమన. వై. వి. (సం. జడిమన్. త. తడిమన్.) సంశయము. "క. అడిగిన నృపసుత గా నని, నొడివెడినో యిది మనంబు నొవ్వ నని విభుం, డుదురాజవదన వడుగక, తడుమన నొక కొంత ప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్." భాగ. ౯, స్కం. ౯౧౧. విశే. మందము, అల్పము గీ. పరభృతా వలిఁ దొలుమొల్లపుండ్లరసము ద్రావె నన ముద్దుఁ బలుకులు దడుమ నయ్యె, మధుమదాసక్తి నిజ రూపమహిమ లెడసి, యభినవాంగప్రభాసిత వైరి నతులు." కు. సం. ౯, ఆ ౧౩౩. "సీ. అప్పుడ యగుమర్త్య మల్లలసాడంగఁ దడుమునియానంబు తడఁబడంగ." వీర. ౨, ఆ ౧౬౯.

తడుము. దే. స. క్రి. నిమురు. "చ...పృథుభీషణ బాహులసాశుంబులన్, డడిమి కెరల్పుచున్ జవిరి .."స్వా. ౪, ఆ. ౩౦. (శ. ర పా.)

తణగము. దే వి ఎద్దుమీఁదనుంచి వీర్ల తెచ్చెడి తోలుసంచి. "సీ. హేరాది యొడ్డాది భారాదు లనవద్చు గోనెలు తణగాలు గోతములను." హంస ౪, ఆ. ౮౪. హంస ౫, ఆ. ౯౨.

తతకారము. సం. వి. అ. న. తాళము వేయునపుడు చేయుశబ్దోచ్చారణము. "సీ. అత్తమామలు చూడ వలివేణి యొక్కతె తతకారములు చేసి తాళ మొత్తె." వి పు. ౨, ఆ. ౨౮౦.

తతపత్త్రి. సం. వి. ఈ స్త్రీ. విరివి యైనఆకులు గలది అరఁటి.

తతము. సం. వి అ. పుం. గాలి. న. 1. వీణ లోనగు వాద్యము; 2. విస్తారము. విశే. (అ. ఆ. అ.) 1. విరివియైనది; 2. వ్యాపించినది.

తతి ఉభ. దే. వి. సమయము. "గీ. తతిఁ గూడు లేక యీఁకటఁ, గుతిలపడు నతండు గువ్వతుత్తుక తోడన్." పాండు. ౩, ఆ. ౨౦. అం. భా. ప్ర. ౮౬. సం. వి. ఇ. స్త్రీ. 1. సమూహము; 2. వరుస.

తతిగొను. దే. అ. క్రి. (తతి+కొను) సమయము కని పట్టు. "క. తనయుఁ డని నొడువఁ దలఁచును, దనయుండు గా కున్న మిగులఁ దతిగొని సవతుల్ దను నగియెద రని తలఁచును .." భాగ. ౧౦, స్కం. ఉ. ౩౨.

తతిమ్మా. దే. విశే. (హిం. తతిమ్మా ) మిగిలినది. (శ.ర.)

తత్క్షణము. సం. వి. అ. పుం. ఆక్షణము, అప్పుడు.

తత్తకతక. దే. వి. తాళమునం దగుధ్వని కనుకరణము. శతాం ౪, ఆ. ౬౫.

తత్తడి. దే. వి. గుఱ్ఱము ; వాహనము. "చ. సగర కుమారు లందఱును...తత్తడిఁ గానక తత్తరంబు నన్." జాహ్నవీ ౨, ఆ. ౫౯. "క...జేజేగము లకుఁ, దఱుగని మే లిడినశిబ్యతత్తడిదొరకున్." నీలా. ౧, ఆ. ౧౯.

తత్తడిమోరపైదలి. దే. వి. (తత్తడి+మోర+పైదలి) కిన్నరస్త్రీ. అచ్చ సుం. ౩౫.

తత్తబడ. దే. వి. 1. సైన్యము. "ఉ...ఈ,తత్త బడల్ పిఱిందిదెసఁ దాఁకిన..." నిర్వ. ౬, అ. ౧౪౬; 2. పరివారము. "క. చిత్తం బారఁ గలఁచెదు,కొత్తము నాతోడ నాదచేరుపు గలదేఁ, బొత్తుగలని నీవును నీ,తత్తబడలు రండు గెలిచెదం బరువడిలోన్." ఉ. హరి. ౩, ఆ. ౧౧౬. (శ. ర. పా 'తత్తబళ.' ముద్రి.)

తత్తఱ. దే. వి. (తఱ+తఱ.) 1. తొందర. "చ... ఎచటికేనియు నేఁగుతలంపుతోఁడఁ దత్తఱమున నేఁగుదెంచి ప్రమదంబున నిన్నుఁగొంటి నియ్యె

డన్" రుక్మా. ౫, ఆ. ౯. ఆం. భా. ప్ర. ౧౪౦; 2. ఆకులపాటు "చ...తడఁబాటును దత్తరమును బలుకు లోఁనదరఁగ..." పారి. ౧, ఆ. ౧౦౧. విశే. సంభ్రమముతోఁ గూడినది. "క. పెదవులు దడుపుచుఁ బదములు, గుదిగొనఁ దత్తఱపుమాట గుత్తుక దగులన్." శు. పారి. ౩, ఆ, ౧౩౬.

తత్తఱపడు. ద్వి. అ. క్రి. (తత్తఱ+పడు) 1 తొందరపడు "క ఇత్తెఱఁగున నయ్యింతులు, చిత్తజబాణముల చేత సిగ్గంతయుఁ బోఁ, నొత్తి ముని పెండ్లియాడఁగఁ, దత్తఱపడు లెటి గి వర్షధరుఁ డాలోనన్" వి. పు. ౫, ఆ. ౧౯౨; 2. ఆకులపాటు నొందు "చ. మఱికొందను హైత్యుఁ డాన్నృపకుమారుని నుగ్రశిలీముఖంబులన్, నెఱకులు దూఱ నేసి...తత్తఱపడఁ జేసి దేవ సముదాయము చెన్ను నదగ్రవృత్తిలై." భా. రా. యు. ౨౦౫౭.

తత్తఱపాటు. ద్వి. వి (తత్తఱపడు ధా.) 1. తొందఱపాటు, సంభ్రమము. 'సీ. తాఁకినవాఁడు తత్తఱపాటులోఁ మేలుకని మ్రుచ్చు మ్రుచ్చంచుఁ గళవళించె." కాశీ. ౪, ఆ. ౧౭౪. చంద్రి. ౧, ఆ. ౫౫, 2. ఆకులపాటు. "క. అత్తాపసోత్తమునిమదిఁ,దత్తఱపాటొదవఁజేయఁ దక్కొరులకుఁ గాదు..." ఉ. హం. ౨, ఆ. ౧౨౯. పె. శకుం. ౨, ఆ. ౯౪.

తత్తఱపెట్టు. దే. స. క్రి. (తత్తఱ+పెట్టు.) తొందర పెట్టు. "క. మనసిజుఁ డిద్దఱకును గుంపైన రాని తనంబు చేసెడిం గనుఁగొన నాఁ,జనవులు మాటల యనువులుఁ, దనువునఁ బులకలును గలుగఁ దత్తఱ పెట్టెన్." ?. క్ర. ౭, ఆ. ౫౪.

తత్తఱబిత్తర. దే. విశే. (తత్తఱ+బిత్తరము. క. తత్తఱ బిత్తఱ) కలఁతనొందినది. "ద్వి...తలఁపు లెంత యును దత్తఱబిత్తర రయ్యె." ప్రభు. ౧, ఆ. ౩, గతి. ౧౦. పు.

తత్తఱించు. దే. అ. క్రి. 1 తొందరపడు. "చ... పోయి గం బొలఁకఁగ వచ్చె నత్తఱి రఘూత్తము చిత్త తత్తఱించఁగన్." ఉ. రా. ౬, ఆ. ౧౬౧; 2. క్షోభపడు, ఆకులతనొందు. "గీ. అర్చి యొడ వంక సాత్యకి యడ్డగించు, వాసుదేవుండు వలవంక వచ్చి యారము, ప్రేయ నవ్వరుఁ డచ్చోట ప్రేసె దత్తఱించి పౌండ్రుండు ధర మోకరిల్లఁ బడియె." ఉ. హరి. ౩, ఆ. ౬౫; 3. చలించు; "సీ. మెలఁత కొమ్మైన గ్రమ్మెఱుఁగుగనంచున మించ దనుజేంద్ర చిత్తముల్ దత్తఱించె." దశా. ౨, ఆ. ౩౦౧; 4. భయపడు, "గీ. ఉదకమునఁ దత్తఱించుచు నున్ననన్నుఁ, జూచి భయ మేమి యనుటగా చోద్యమయ్యె." దశా. ౧, ఆ. ౧౩౬. నరస. ౨, ఆ. ౧౧౫.

తత్తఱింత. దే. వి. (తత్తఱించు ధా.) తొందర. "గీ. మమతలును దత్తఱింతలు మక్కువలును ..' పి. శకుం. ౩, ఆ. ౨౧౯. కేయూర. ౧, ఆ. ౬౯.

తత్తఱిల్లు. దే. అ. క్రి. 1. తొందరపడు; "ఉ .. కాంతఁ బొన్నునకుఁ దార్చను దన్మధురాధరామృతా, క్రాంతిరసోద్ధతిన్ దనమొగంబులు నాలుగు నొక్కమాటె యత్యంతము దత్తఱిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్." కళా. ౫, ఆ. ౧౪. కళా. ౭, ఆ. ౭౬; 2. కలఁతనొందు; "వ...పచ్చవిలుకాఁడు మునుకటెవచ్చిగా యంబులపై విచ్చలవిడిఁ బెచ్చుపెరిఁగి క్రొత్తవిరిముల్కి మొత్తములు హత్తించిన బిత్తరి తత్తఱిల్లి... మూర్ఛిల్లి...'వసు. వి ౨, ఆ. ౮౦.

తత్తళా. దే. వి వాహనము. "ఉ...మరుండును జిల్కదత్తళా, మీఁదఁ జివుక్కునం బడి .." గంధ. ౧౪౫. [౩౦౩.

తత్తెర. దే. వి. సారాయి పోసెడి తిత్తి. ఆం. భా. ద్వి.

తత్పరము. సం. విశే. (అ. ఆ అ.) 1. ఆసక్తము; 2. ఒకదాని తరువాతిది.

తత్పురుషము. సం. వి. అ. పుం. (వ్యాక.) తఱచుగా ఉత్తరపదార్థప్రధాన మగునొకసమాసము.

తత్ఫలము. సం. వి అ. పుం. 1. నల్లకలువ; 2. చెంగల్వ కోష్టు*; 3. చోరమను ఓషధి.*

తత్రత్యము. సం. విశే. (అ. ఆ. అ) అక్కడనున్నది.

తత్త్వజ్ఞుఁడు. సం విశే. (అ. ఆ. అ.) తత్త్వము నెఱిఁగినవాఁడు.

తత్త్వము. సం వి. అ. న. 1. సత్యము; 2. కలరూపు; 3. బ్రహ్మము; 4. చేతము; 5. వస్తువు; 6. స్వభావము; 7. సత్త్వరజస్తమాదులలో నొకటి; 8. పృథ్వ్యాద్యవయవభూత మగుపదార్థము. (ఇవి మత భేదములచే ననేకవిధములు.)

తథా. సం. అవ్య. అట్లు, అప్రకారము. ఉదా:— తథా కృతము.

తథాగతుఁడు. సం. వి. అ. పుం. బుద్ధుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. అట్లు వచ్చినవాఁడు, 2. అట్లు వెళ్లిన వాఁడు.

తథ్యము. సం. వి. అ. న. సత్యము. విణ. (అ. ఆ. అ.) [సత్యమైనది.

తద్. సం. స. (ద్) అ. ఉదా.—తత్కాలము.

తదర్థము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అది ప్రయోజనమైనది; 2. అది యర్థముగాఁ గలది; 3. దాని కొఱకైనది; కొఱకైనది. "సీ. నీతదర్థంబులై నిఖిలలోకంబులు వర్తిల్లు లోక పావనము లగుచు." భార. సభా. ౧, ఆ. ౧౭౮. ఆది. ౨, ఆ. ౨౦౮.

తదర్థీయము సం. = తదర్థము.

తదా. సం. అవ్య. అపుడు. ఉదా.—తదాగతుఁడు.

తదాత్వము. సం. వి. అ. న. ఆకాలము.

తదానీంతనము. సం. విణ. (అ. ఈ. అ.) ఆకాలముది

తదియ వై. వి. (సం తృతీయా) పక్షమునందలి మూఁడవతిథి. "గీ. విదియునాఁ డేఁటపడకున్నఁ దదియనాఁడు, కానఁబడియెడునని కిరణ గనల సేల" య ౫, ఆ. ౬, ఆం. భా. ప్ర. ౭౮.

తదీయము. సం విణ (అ. ఆ. అ.) తత్సంబంధమైనది. (వానిది, వారిది, ఆమెది, దానిది)

తద్గతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దానిని పొందినది; 2. దానియందు లగ్నమైనది.

తద్గుణము. సం. వి. అ. పుం తనగుణము విడిచి యన్యాన్యగుణము గొనుసలంకారవిశేషము. విణ. (అ ఆ. అ.) దానిగుణముల వంటిగుణములు గలది

తద్ద దే. అవ్య పుక్కిలి. (తద్దయుఁ, తద్దన్ అనురూపములును దీనికిఁ గలవు) "ఆ. ఎట్టిసాధ్వులనును బుట్టినయిండ్లను, బెద్దకాల మునికి తద్ద తగదు.' భార ఆది. ౪, ఆ ౬౫. "క...తద్దయు భక్తిన్.' భార ఆది ౧, ఆ. ౯౨. "సీ గుడియఁ జేసొని తద్దఁ గుంటిపాటు జమును...''అచ్చ.బాల ౬౭.

తద్దినము. సం. వి. అ. న. 1. అదినము; 2. ఆబ్దిక దినము, "సీ శాంతులు గండదోషములఁ దద్దిన ములు భూసురు లెంతురు భోజనేచ్ఛ'' దశా ౧౦, ఆ. ౧౯; 3. ఆబ్దికము, "ద్వి. తప్పనఁ దన యింటఁ దద్దినం బనుచు, మునులను నియమించి మొద మెప్పుఁ దెచ్చి" రం. రా. అర. ౧౫౦౧.పు.

తద్ది=తదియ. (ధాత్ర పదబహుళముగ వచ్చుతదియ ఉంప్రాక్తతద్ది యనియుం అత్వయం బహుళమున వచ్చుతదియు అట్లతద్ది యనియు వాడుక.)

తద్ధితము. సం. వి. అ. పుం. సుబంతములకు భావార్థ మత్వర్థాదులందు వచ్చుప్రత్యయము" విణ. (అ ఆ. అ.) దానికి, ఆమెకు, వానికి, వారికి - హితమైనది.

తన. యు దే. స. ఏ. (బ తమ. రూ తాను, తాము, తారు, తమరు, తన్నున్, తమ్మున్, తనచేతన్, తమచేతన్ మొ.) ఆత్మార్థకము (ఇది తచ్ఛబ్ద యుష్మదస్మచ్ఛబ్దములయర్థము నిచ్చును. మఱియు నిది బహుత్వమున నేకవచనరూపమున నుండును) "సీ. పని యేమి పంచినఁ బనకడి జేసెద ననత తక్ బంచినయాజ్ఞలఁబ, చేయుచు..." భార. ఆది. 3, ఆ. ౧౧౧. "గీ. తమరు పెద్దలరై తిరి" కృష్ణ. ౨, ఆ ౩౮. "గీ తన్ను సెఱఁగక వెగ డొందు నన్ను నిసుఁడు.' భార. శాం ౬, ఆ ౧౩౪. "క విను బీజంబున బీజంబును దేహమునందు దేహమును నింద్రియముల్, దనతనవలనం దానను మనంబునను మనసు పుట్టు మహిత విచారా." భార. శాం. ౬, ఆ. ౩౦. వై. ప్ర (సం. త్వమ్) 1. భావార్థమున వచ్చుతద్ధితప్రత్యయము. ఉదా —సొగసుఁడనము మొ; 2 క్రియాజన్యవిశేషణములమీఁద వచ్చుప్రత్యయము. ఉదా :—ఆఁకొన్నతనము, 3. స్వార్థమున వచ్చుప్రత్యయము. ఉదా.—అసూయతనము. దశ. ౫, ఆ ౪౫.

తనఖా. హిం. వి. కొంతయాస్తి హామీగా నుంచి కొంతసొమ్ము బదులు పుచ్చుకొనుట.

తనిఖీ హిం. వి. విమర్శము, పరీక్ష.

తనయ. సం. వి. అ. స్త్రీ. 1. కూఁతురు; 2. కోల పొన్న శీ.

తనయుఁడు. సం. వి. అ. పుం. కొడుకు.

తనరారు. దే. అ. క్రి. (తనరు+ఆరు. స్వార్థమున.) 1. విజృంభించు. "సీ...దుర్దమగతిఁ దనరారు వారిసత్త్వము లెల్లఁ బోలియ..." రాఘవ. ౪, ఆ, ౬౭; 2. ఒప్పు. "సీ. సొగసినకొన లేచి వింగి యంతంతకు నవులఁ ద్రోవఁగఁ దనరారుదాని." భార విరా. ౧, ఆ. ౧౬౨.

తనరించు. దే. స. క్రి. (తనరుధా. ప్రే) 1. చేయు, "చ . రావణుఁడు...ఈశభూజ గరిమం దన రింప ..''అచలా. ౯, ఆ. ౪౩; 2. కలుగఁ జేయు, "మ...సురాంగనలకున్ కూరాహిత

త్రేణికిన్, దనరించుం దగులంబులు..." కావ్యా. ౫, ఆ ౧౦౨; 3. సంతోషింపఁజేయు. "ద్వి... నీజవ్వన మనునిధానంబు, రిక్తపుచ్ఛక తనరించి తైకొనుము." ద్వి పరమ. ౫, ఆ. ౪౧౦. పు.

తనరు. వై. అ. క్రి. (సం. తన్.) 1. అతిశయించు, మించు. "క...ఘనుఁ డీతఁడు పేరికంటెఁ గార్ముక విద్యన్, దనరినవాఁ డయ దీటికి, మొనసెం గా కన్యుఁ డిట్లు పెంపయుం గల డే." భార ఆది ౭, ఆ. ౧౯౯; 2. ఒప్పు, విలసిల్లు. "ఉ...తామ రతంబకై తనరెఁ దత్పురిఁ గింపచ గేహవాటికల్." పారి. ౫, ఆ. ౪౫, 3. పండు, ఫలించు, "క. దునకయు వెద పెట్టకయున్, దవరె నఖిలసస్యము లుచు..." హరి. పూ. ౧, ఆ ౧౧౯; 4. ఉప్పొంగు, పెరుఁగు "క...హాలాయుధుఁడు సదుదెంచిన నెమ్మనము దెలివొంద మూఁపులు, దనర మొగం బలర నీదుతనయుని కధిపా." భార. కల్య. ౨, ఆ. ౨౨౯. సౌ. ౨, ఆ. ౧౬3; 5. వసించు, ఉండు. "సీ...తపసి డెందపుటిండ్లఁ దనరువాఁడు" రామా. 3, ఆ. ౪౫.

తనరుచు. వై. అ. క్రి. (తనరు+చు స్వార్థము.) తనరు. (చూ. తనర్పు.) స. క్రి. తనరు ధా. ప్రే.) తనరఁజేయు, కలిగించు. (చూ. తనర్పు.

తనరుట. వై. వి. (తనరుచు ధా.) తనరుట. (చూ. తనర్పు.)

తనర్చు = తనరుచు. అ. క్రి. 1. (పొంగు.) "మ... రౌద్రరస మగ్నాంగన్ దనర్పన్ భుజాగ్రములు..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౯, 2. (వ్యాపించు.) "క...కడల నిరులు తనర్చెన్." సీలా. 3, ఆ. ౫, 3. (వసించు.) "సీ. స్వచ్ఛ వృత్తిని దనర్పంగ ముక్తము లగుభాతి నొక్కట ద్విజపుంక్తు లురుల." దశా. ౨, ఆ. ౧3౯. స. క్రి. కలిగించు. "చ...భయముం దనర్ప నిట్టను నకఁ డొజ్జఁ గన్గొని నిరంతరవిస్ఫురితాధరోష్ఠుఁ డై." నృసిం. ౪, ఆ. ౯.

తనర్పు = తనరుపు. 1. (ఎత్తు.) "చ. అరుదుగ పర్వతైలములయంత తనర్పును..." భార. ఆది. ౨, ఆ. ౧౧; 2. (పెరల్పు.) ఆం. సం. స్థా. 33; 3. (పృథుత్వము) "చ. నదు మధ దింతిచన్నుల తనర్పున ముందఱ గాదరాదు..." కు. సం. ౯. ఆ. ౧౬. 4. (అధికత్వము. పెంపు) "కుజాగ

ప్రయాతము. విభీతుండవై ధర్మవేదిత్వబుద్ధిం, దనర్పొందు నీవు..." భార. స్త్రీ. ౧, ఆ. ౯౯.

తసాలి. దే. వి. చూరు నిలఁబడుటకై స్తంభముల మీఁద వేసెడుపెద్దకమ్మి. (శ. ర బ్రా. వా.)

తని. వై. విశ. (సం. తనుః.) 1. అల్పము. "గీ... చెమట, పొడము మేనులతనికంపు..." భార. విరా. ౨ ఆ. ౨3౯; 2. చిన్నది. 'సీ...తని మొగ్గవిరవాదిదండ..." ఆము. ౨, ఆ. ౬౧; పక్వము. 'సీ తనిపండ్లరస మాని..." భార. ఆను. ౧, ఆ. ౧౯౧; 4. సమృద్ధము. "సీ... తరుల నెప్పుడు పండ్లు తనిగ నుండు." కృ. శకుం. ౧, ఆ. ౧3; 5. శుద్ధము. (నీరు కలియ నిది) "ఉ. ఆరితకూడు...తనిమజ్జిగ..." వేం. పంచ. ౧, ఆ. ౬౯౭.

తనిమ. సం. = తనిమము.

తనిమము. సం. వి. న్. పుం. 1. బక్కతనము; 2. పలుచఁదనము; 3. చులుకఁదనము.

తనియించు. దే. స. క్రి. (తనియు ధా. ప్రే.) తృప్తి పఱుచు. "క. ఉడివోనిసిరుల నిటువలెఁ, దడవెడు నర్యాళ్ళకర్ల దనియింతురు సొంపడర పీరి దాముఁ దచునొక, కొడుకును మఱి నీల యగెడు కూఁతు రొకర్తున్." సీలా. ౧, ఆ. ౫3. బహు. ౧, ఆ. ౯౨.

తనియు. దే. అ. క్రి. తృప్తిపడు. "క. ధనమున విద్యను సంతతిఁ, దనిసినవా రెందుఁ గలరె..." భార. ఆది. ౫, ఆ. ౧౧౯. భార. ఆది. ౫, ఆ. ౯౯౨.

తనివారు. దే. అ. క్రి. (తనివి+ఆరు) తృప్తినొందు. "గీ. వానిఁ దనివారఁ జూడనివనజగంధి, చూచి తలయూచి మెచ్చని సుందరాంగి." శుక. ౧, ఆ. ౨౬౯. ఇందు. ౫, ఆ. ౯౮.

తనివి. దే. వి. తృప్తి. "ఉ. లక్ష్మిపరపోక్తులన్ దనివిఁ జెంది ముకుందుఁడు లేచెఁ జెప్పిరన్." ఉ. రా. ౨, ఆ. ౪౦. ఆం. భా. ౨, ప్ర. ౨౬౦.

తనివిదను. దే. అ. క్రి. (తనివి+దను.) తృప్తినొందు "క. కనుఁగొని పూతుం దరదముఁ, గొనిపోరెం డొలఁగ నపుడు కుంతీతనయుం, దనిఁ దనివిదనక గుంపులఁ గొనియుష్ణాద లరసెఁ గలయఁ గురు సైన్యమునన్." భార. విరా. ౫, ఆ. ౧౨౨. సౌరి. ౧, ఆ. 3౫.

తనివు. దే. వి. తృప్తి. "ఆ. కర్ణమద్రపతులకాంతల విధవలఁ, జేయువాఁడ నీవు చెన్నుమిగిలి నగుచు నేఁడు ద్రుపదనందనవీనుల, ధర్మసుతునిచెవులఁ దనివు నినుప." భార. కర్ణ. 3, ఆ. ౨౬౪.

తనివుపడు. ద్వ. అ. క్రి. (తనివు+పడు) తృప్తి నొందు. "గీ. ప్రతిదినంబును జంగమార్చనము లేక, తనివుపడ నొల్ల విజితకందర్పు యనుడు." కాశీ. ౧, ఆ. 3౫.

తనివెచ్చ. దే. వి. (తని+వెచ్చ.) గోరువెచ్చ; కవోష్ణము. "ఆ ..కదుష్ణనాఁడు, మలరు గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ, యన...." ఆం. భా. ప్ర. ౮3.

తనివోవు. దే. అ. క్రి. (తనివి+పోవు) తృప్తినొందు. "చ. తమతమయంత నెచ్చెలులు దారును నెప్పటి యట్ల యాటఁ జిత్తము దనివోక..." నిర్వ. ౮, ఆ. ౬3. మార్క. ౧, ఆ. ౧౭౯.

తనిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అన్నిటికంటె కృశించినది; 2. అన్నిటికంటె అల్పము, 3. అన్నిటి కంటె విరళము.

తనీయము సం విశే. (న్ యసీ. స్.) 1. కృశతరము; 2. అల్పతరము; 3. విరళతరము.

తను. దే. విశే. వృత్తియందు 'తనుపు'శబ్దమున కంత్య వర్ణము లోపింపగా మిగిలినరూపము. "క. అచటఁ బొలయుచల్లని, తనుగాలిం దేటి లజ్జితస్వాంతుండై." నిర్వ. ౪, ఆ. ౭౮.

తనుకము. సం =తనువు.

తనుకాఁడు. దే. విశే. (తనుపు+కాఁడు) తృప్తినొందించువాఁడు. "సీ. జగములఁ గలయుతుష్టాతల తనుకాఁడు పిత్రుఁ గాంచి పెంచినయొయారి" రా. వి. 3, ఆ. 3.

తనుకు. దే. అ. క్రి. 1. కలుగు, "క. ధరణి కర గ్రహాథియంబు దనుకక యుండదన్." భార. సభా. ౧, ఆ. ౪౨, హరి. ఉ. ౨, ఆ. ౬౪; 2. జ్వలించు, "క. కొని త్రచ్చుడు లోపల నల్లని క్రిమియై తోఁచి చూడ లత్తుకవర్ణంబునఁ బొమ్మై విమ వహ్నులు, దనుకఁగఁ గురుపీరుఁ గలచి తత్తరుఁ డరిగెన్." భార. ఆది. ౨, ఆ. ౨౦౦. భార శాం. 3, ఆ. 3౧౮; 3. భయపడు, "ద్వి. అసు టరయుం గట్టతం దంబుధిఁ ద్రచ్చెఁ, దనుకక మందర ధర బెట్టు మోచె." ద్వి. భాగ. ౮, స్కం. (శ. ౪); 4. ప్రకాశించు, "క. మొగమునఁ దని కినకెంపుతోడ మునిపతి యుండెన్." ఉ. హరి. ౪, ఆ. ౮౯. వె. శకుం. ౨, ఆ. ౧౯౬; 5. తపించు. "చ... సాధుఁడు పల్లియ కేఁగుదెంచి లెం,దనికి భుజింప ..." పాండు. ౪, ఆ. ౧౭3. పాండు. ౪, ఆ. ౨; 6. అతిశయించు, "క. అనఁ జెలువమ్ము పొంగంబునఁ,దనరఁ జకచ్చకితకర్ణతాటంకరుచుల్, దనుకన్..." శశాం. 3, ఆ. ౧౮; 7. ప్రసరించు, "మ. అని గర్వోక్తులు పేర్కొఁ బల్కు మెస నయ్యబ్జాక్షిదృగ్ధితుల్, దనుకంగాఁ జని కాంచె నంత హిమవంతమ్మున్..." మార్క. ౧, ఆ. ౨౨. అ. క్రి. స. క్రి. తగులు. "క. వినుఁ జేతప్పున దోషము, దనుకక యుండంగ..." భార. మా. ౨౦౨, భార. శాం. ౪, ఆ. ౧౯౨, వి. భయము. "గీ. కులనగములైన ప్రయ్యలై కూలునట్లు, గా నొనర్చెడికైదు వాకరణిఁ గప్పె, భావ మొంది క్రమ్మఱ వచ్చి పాకశాస, నునికరము చేరె నెంతయుఁ దనుకు సొచ్చి." హరి. పూ. ౪, ఆ. ౧౪౮.

తనుక్షీరము. సం. వి. అ. పుం అంబాళము ✿ విశే. (అ. ఆ. అ.) అల్పమైనక్షీరము గలది.

తనుగాలి. దే. వి. (తనుపు+గాలి) చల్లనిగాలి. "క... ధనదుమాతుఁ డ,తని నొకపద్మాకరంబుతటమున నుం బెట్టిన నచటఁ బొలయుచల్లని, తనుగాలిం దేటి లజ్జితస్వాంతుండై." నిర్వ. ౪, ఆ. ౭౮. దశ. ౭, ఆ. ౧౧౧.

తనుచ్ఛదము. సం. వి. అ. పుం. దేహమును కప్పునది-కవచము.

తనుచ్ఛాయము. సం. వి. అ. పుం. తెల్లతుమ్మ ✿. విశే. (అ. ఆ. అ.) అల్ప మగుఛాయ గలది.

తనుజ. సం. వి. ఆ. స్త్రీ. దేహమునుండి పుట్టినది—కూఁతురు; ఇట్లే: తనూజ, తనూభవ మొ.

తనుజుఁడు. సం. వి. అ. పుం. దేహమునుండి పుట్టినవాఁడు—కొడుకు. ఇట్లే: తనూజుఁడు, తనూభవుఁడు మొ.

తనుత్రము. సం. వి. అ. న. దేహమును కాపాడునది-కవచము.

తనుత్వక్కు. సం. వి. చ్. స్త్రీ. చిఱుకల్లి ✿. విశే. (చ్.) పలుచనితోక్క గలది.

తనువత్త్రము. సం. వి. అ. పుం.-సన్నని ఆకులు గలది-గారె, ఇంగుది.✿

**తనుపారు.** అ. క్రి. (తనుపు+ఆరు.) 1. తృప్తి నొందు. "చ. ప్రమదము లుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలు వోయి .." హరి పూ. ౮, అ. ౧౬౬. పి. శకుం. 3, అ. ౩౮; 2. చల్లనగు. "క. కని యాపద్మాకరమునఁ, దనుపారెదునీను ద్రావి..." ఉ. హరి. ౪, ఆ. ౩౧. కు. సం. ౫, అ. ౧౪౮.

**తనుపు.** దే. స. క్రి. (తనియుధా. ప్రే.) 1. తృప్తినొందించు. 'సీ. పాయసాపూపాదిబహువిధాన్నం బుల జగతీమరుత్సహస్రంబుఁ దనిపి." కాశీ. 3, అ. ౨౨౬. ఉ. రా. ౧, అ. 3; 2. కాపాడు. "క. మొనయంగనకా కటకట, మొనయం గన కాద్రిధరుఁడె ముదిత నుపవనా, తనుపవనాహతి కొనఁగక, తనుపవనా మదన నీయందాంచిత కరుణన్." వసు. 3, అ. ౧౭౬. వి. 1. సంతృప్తి. "ఆ....అగ్ని,నాలిమిత్రుఁ దయ్యె నగ్నినాహి, తమ్మైనర్పు ళాగ్ని తముఁ బ్రోవఁ బ్రజ లెల్ల", దల్లి మణుగు ప్రజలతనుపు గనిరి." పాంచా ౧, అ ౧౦౭. కు. సం. ౧౨, అ. ౯౯౬, 2. పితృయజ్ఞము. "సీ ..తనుపు నాఁగను పితృయజ్ఞాఖ్య మొనరు..." ఆం. భా. ద్వి. ౧౭౧, 3. చల్లఁదనము. (చూ తనుపుచేయు), 4. తడి. "క జనకునయిన సోదరునై,నను సుతునైన నొకపరిఁ గనం దరుణులకున్, దనుపెక్కను లజ్జపద మని వారితో ద్రుపదపుత్రి యనెఁ గద తాలు కన్." సా. ౨, అ. ౨౪౬, 5. ఉపచారము "చ. కనుఁగొని సత్యభామ మదిఁ గంపము నొందెక నాఁటియున్న యామునిశితబాణము స్పృశకి కోణికమున్ గరపల్లవప్రమార్జనమున నొయ్యఁ బాపుచును నామరమారుతసంప్రయుక్తిచేఁ, దను బొనరించి వల్లభుగతవ్యథఁ జేసె ముహూర్త మాత్రలోన్." హరి. ఉ. ౪, అ. ౧౬౦. విశే. చల్లనిది. "సీ. అరుదారు మేలుక ట్టాయితంబై చూడ నొప్పారి తనుపగుచప్పరములు." భార. ఉద్యో. ౧, అ. ౯౩. దశ. ౫, అ. ౩౯.

**తనుపుచేయు.** దే. అ. క్రి. (తనుపు+చేయు.) చల్లఁదనము గల్గించు. "గీ. పలిపిరోగాన్ని మనములో పంతతంబు,దగిలికొని కాల దానికిఁ దనుపుచేయఁ, దలఁచిరో..." కు. సం. 3, అ. ౮౭.

**తనుబీజము.** సం. వి. అ. పుం.- చిన్నగింజలు గలది- పెద్దరేగు.*

**తనుమధ్య.** సం. వి. అ. స్త్రీ. సన్ననినడుము గల యాఁడుది; ఆఁడుది.

**తనుభస్త్ర.** సం వి అ. స్త్రీ. దేహమునకు గొలిమి తిత్తివంటిది - నాసిక.

**తనురుహము.** సం. వి. అ. న. 1. రోమము, వెండ్రుక; 2. పక్షి ఱెక్క. విశే. (అ. ఆ. అ.) శరీరమునఁ బుట్టినది. ఇట్లే, తనూరుహము.

**తనులము.** సం. విశే. (అ. ఆ. అ.) విస్తరించునది, వ్యాప్తము.

**తనువడు** ద్వ. అ. క్రి. (తనుపు+పడు.) చల్లపడు. "క. కనుఁగొని యించుక సేపునఁ, దనువడు నవి పలికెఁ బిపాఁ దనువడుటయునన్, బహు పడియె..." భార. శాం. ౬, అ. ౧౩౫.

**తనువు.** సం. వి. ఉ. స్త్రీ. త్వక్కు, చర్మము. ఉ, ఊ. స్త్రీ; స్. న. దేహము. విశే. (ఉ, ఉ, స్వీ. ఉ.) 1. సన్ననిది; 2. పలుచనిది; 3. చిన్నది

**తనువొందు.** దే. అ. క్రి (తను+పొందు) తెలి పండు, లేఁత. "క. తనువొంది మొయ్యనొయ్యన, గంధమ్ములు విచ్చి పాఁది..." చంద్ర. ౪, అ. ౯౫

**తనూకరించు.** సం స. క్రి. చిన్నదిగాఁ జేయు. "క. తనువుం దనూకరించుచు, హనుమంతుఁడు సురస యొందరమందుః ప్రవేశం, బొనరించి వెడలి వచ్చిలె ..' చం. రా. ౭, అ. ౧౩.

**తనూనపము.** సం. వి. అ న.- చిక్కనవానికిఁ బుష్టి నిచ్చునది - నెయ్యి.

**తనూనపాత్తు.** సం, వి ద్. త్. పుం. - (తనూనప+ అద్ = నెయ్యి త్రాగునది; తనూ+నపాత్ = తనువును నిల్పునది)—1. అగ్ని, 2. చిత్రమూలము.*

**తన్ను.** దే. స. క్రి. 1. తాఁచు. "సీ. వీఁడెపో బండిలో శ్వేలుపు నుంకించి పిండిగాఁ దన్నినదండి జోదు." నీలా. 3, అ. ౭౭. సాం వి. మాన. ౩౮; 2. గెంటు. "సీ. కర్ణడోలాహార్తికచ్ఛాయ లెగఁబ్రాకు నురుహారరుచులఁ ద్రస్తరికిఁ దన్ను." ఆము. ౨, అ. ౭౫; 3. తాఁకు. "చ. మెలఁకలు మిన్ను దన్ను తెలి మేడలఁ గ్రీడలు సల్పుచుండి.." రామా. ౧, అ. ౧౩౫; 4. ఆక్రమించు. "మ...మిన్ దన్ని వేఁగునదేలాంగుఁడు గాంచెఁ బాదపలిశాఖంబుల్ మరుత్ప్రస్ఫుటమున్." ఆము.

౪, ఆ. ౧౦౫. వి. తాఁపు "సీ...ఒంటితన్నునఁ గొని గుడిసి యుండిసి." దశ. ౯, ఆ. ౩.

తన్నుఁగోల దే. వి. (తన్ను+కోల.) ఉపఘ్నము, కోటు. (శ. ర. బ్రా.)

తన్నుకొను. దే. అ. క్రి. 1. కాళ్లు కొట్టుకొను. "క... అశఁడు గూలి తన్నుకొనుచుం జచ్చెన్." భా.రా. యు. ౯౯౧; 2. గిజగిజ కొట్టుకొను; బాధపడు. "సీ. మూత్రపురీషసంప్లుతగాత్రుఁడై యుంట తన్నుఁ దా నెఱుఁగక తన్నుకొనుట." వా. రా. ౧, ఆ. ౧౧౧. స. క్రి. అకస్మికముగాఁ బైఁబడి కాళ్లతో పట్టుకొను. "చ. ఉలుకకయుండఁ గొండపడ నొండొక కొండనఁ గోడెనాగమున్, బులుఁగులఱేఁడు దన్నుకొని పోవ,తెఱం గిటు లాడి చూపెఁ గ్రావలయు ననంగ .."రామా. ౬, ఆ. ౨౧౯.

తన్నుబల్ల. దే వి (తన్ను+బల్ల.) ద్వారముయొక్క అరిగాళ్ల మీఁద వేసెడుబల్ల. (శ. ర.)

తన్నుబిల్ల. దే వి. (తన్ను+బిల్ల) బాలక్రీడా విశేషము. (దీనిరూపాంతరములు-తనుబిల్ల, తన్నుబిళ్ల.) "సీ...వెన్నెలకుప్పలు తన్నుబిల్లను..." కాశీ ౩, ఆ. ౩౩.

తన్నులాడు. దే. అ. క్రి. (తన్నులు+ఆడు.) పరస్పరము తన్నుకొను, "సీ...కోడిపుంజులఁ దన్నులాడ విడుచు" ప్రబంధ. ౬౧౬.

తన్నువడు. ద్వ. అ. క్రి. (తన్ను+పడు.) ఆక్రమింపఁబడు; తాఁపునందు. "గీ తరుణి లజ్జాభరంబుచేఁ దన్నువడియు." నైష. ౭, ఆ. ౧౭౦.

తన్పు=తనుపు. 1. (తృప్తిపఱచు) "చ...భక్తి నెప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నన్నగ నోడుదున్." భార. ఆది. ౧, ఆ. ౧౩౯; ౧, ఆ. ౯౦; 2. (రక్షించు) "సీ ..ధనం బచ్ఛిదంబు ముఖ్య. మైనయట్టిది తన్పు నదియ జేని..." కళా. ౬, ఆ. ౧౬౬. వి. 1. (తృప్తి) "చ విడువనికౌఁగిలింత పురి విచ్చని మచ్చిక తన్పు లేనిసంగడి..." శుక. ౫, ఆ. ౩౮; 2. (శైత్యము) "ఉ...సలిలంబు దప్పివోఁ, ద్రాగిన వారి కింపగునె తన్పుకు డియ్యఁదనంబు వాసనా, రూఁగముఁ గల్గెనేని విహగోత్తము నిర్మల వారి పూరముల్." నైష. ౨, ఆ ౮౧. విశే. 1. (తృప్తికరము.) "క. గ్రామగ్రామంబున నొక

సామంతున కిడినచలువ చప్పరములు తన్పై మేదినిఁ గుంపటిలోఁ, దామరలం బోలె నట్టితటి నొప్పారెన్." అను. ౨, ఆ ౬౪; 2. (మనోజ్ఞము) "శా. కన్పించున్...తన్పౌచక్కఁదనంబు పెక్ బడగయై తన్వంగి పర్వాకృతిన్." మల్ల. కృం. ౫.౨.

తన్మయము సం. విశే. (అ ఈ. అ.) 1. తత్స్వరూపమైనది; 2. దానితో లయమైనది.

తన్మాత్రము. సం వి. అ. న. శబ్దస్పర్శరూపరసగంధములలో నొకటి. విశే. (అ. ఆ అ.) అపరిమితి గలది, అంతటిది.

తన్వి. ఉభ. దే. వి. తృప్తి. "గీ. తన్వి దీఱంగ నింత నీతన్విఁ గూడి." విజ ౨, ఆ. ౧౧౧. సం. వి. ఈ స్త్రీ. 1. పలుచనిదేహము గలస్త్రీ; స్త్రీ; 2. సాలపర్ణి.

తన్వివసము=తనివిసను. "సీ. సంగరంబునఁ దన్విపని కాంతిఁ బొందినచిత్తంబుతో..."భార. ద్రో. ౫,ఆ.౩.౨౨.

తన్వు = తనివు (నిండు; ఒప్పైనది) "ఉ...దళవాటికా, ధామవిలాసదీర్ఘికలఁ దన్వుగఁ జూచిన పాల్లకంబులన్." భీమ. ౫, ఆ. ౪౪.

తపత్. సం. శత్ర. 1. తపించుచున్న; 2. తపింపఁ జేయుచున్న.

తపతప. దే. వి తెక్కలుమెు. కొట్టుకొనుటయందగు నను కరణము. 'గీ. కోడి తపతప తెక్కలు గొట్టి కొనుచు." కళా. ౮, ఆ. ౨౪.

తపతి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది; 2. సూర్యపుత్త్రి.

తపనము. సం. వి. అ. పుం. 1. వేసఁగి; 2. నల్లజీడి; 3. జిల్లేడు; 4. నరకవిశేషము; 5. సూర్యకాంతమణి. న. 1 తాపము; 2. బాధ; 3. శృంగారచేష్టావిశేషము. విశే. (అ. ఆ. అ.) 1. కాఁచునది; 2. కాల్చునది; 3 బాధించునది; 4 ప్రకాశించునది.

తపనాత్మజుఁడు. సం. వి అ. పుం. సూర్యపుత్త్రుఁడు- 1. యముఁడు; 2. కర్ణుఁడు; 3. సుగ్రీవుఁడు.

తపని. సం వి. ఈ స్త్రీ 1. గోదావరీనది; 2. తపతీనది; 3. వేఁడిమి.

తపనీయకము. సం. వి. అ. న. 1. బంగారము; 2. ఉమ్మెత్త.

**తపనీయము.** సం.=తపనీయకము. విణ. (అ.ఆ.అ.) 1. కాఁచఁదగినది; 2 కాల్పఁదగినది; 3. బాధింపఁదగినది; 4 ఆచరింపఁదగినది. (తపస్సు.)

**తపనుఁడు.** సం. వి. అ పుం. 1. సూర్యుఁడు; 2. చంద్రుఁడు; 3. అగ్ని; 4. అగస్త్యుఁడు.

**తపము.** సం. వి. అ. పుం. గ్రీష్మఋతువు. స్. న = తపస్సు.

**తపశ్చరణ.** సం. వి. అ. న. తపోనుష్ఠానము, తపస్సు చేయుట, "ఆ. ధరణిఁ బ్రజఁ గరంబు దయతోడ వర్ధ ధర్మాభిరక్షఁ జేసి యమలచరిత, నేని రాజ్యవిభవ మిది యేల యని తపశ్చరణ మునికి నీక చనియె ననఘ." భార. ఆది. 3, ఆ. ౨౩.

**తపశ్చరణము.** సం.=తపశ్చరణ.

**తపశ్చర్య.** సం. వి. ఆ. స్త్రీ.=తపశ్చరణ.

**తపసి.** వై. వి. (సం. తపస్వి.) 1. ఋషి; 2. అగిసెచెట్టు. "చ... చిగురాకుఁజేతులన్, దపసిని గౌఁగిలించె వనితా యిద రంభ దలంప రంభ దా, నపరిమితానురాగమున నోలసమై చిగురాకుఁజేతులన్, దపసిని గౌఁగిలించు టుచితం బెకదా యన నవ్వె రంభయున్." స్వా. 3, ఆ. ౭౭. (పై రెండిటికి నుదాహరణము.); 3. వనగ్రుగ్గు, ఆడవిమునగ. ఆం. పదా. నానా. ౫౯.

**తపసికన్నాపు.** ద్వ. వి. (తపసి+కన్ను+పాపు.) అత్రి నేత్రజుఁడు-చంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౫, ఇట్లే, తపసికన్నుంబాపు. ప్రబంధ. ౧౬౨.

**తపసు.** సం.=తపస్సు.

**తపసుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు

**తపస్య.** సం.=తపశ్చర్య.

**తపస్యము.** సం. వి. అ. పుం-తపోనుకూలమైనది. ఫాల్గునమాసము. న. 1. తపశ్చర్య, 2. మొల్లపువ్వు.

**తపస్యుఁడు** సం. వి. అ. పుం. అర్జునుఁడు.

**తపస్వి.** సం. వి. న్. పుం. 1 ముని; 2. నారదుఁడు, 3. ఒకజాతి కానుగు; 4. శిశిరఋతువు; 5 మత్స్యభేదము విణ. (న్. నీ. న్.) 1. తపస్సుచేయువాఁడు; 2. కనికరింపఁదగినవాఁడు, దీనుఁడు.

**తపస్విని.** సం వి. ఈ. స్త్రీ. 1. తాపసురాలు; 2. దీనురాలు; 3. జటామాంసి. కటుకరోహిణి.

**తపస్విపత్త్రము.** సం. వి. అ. పుం. దవనము.

**తపస్సు** సం. వి స్. న. 1. శరీరశ్రమ కలిగించు కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతము, ఉపవాసము; 2. బ్రహ్మచర్యాదికము; 3. మనసును నింద్రియములను నేకాగ్రముగా నుంచుట; 4. వర్ణాశ్రమవిహిత మైనధర్మము; 5. తపోలోకము; 6. వేఁడిమి. పుం. 1. మాఘమాసము; 2. గ్రీష్మము; 3. శిశిరఋతువు; 4. అగ్ని.

**తపారము.** దే. వి. ఒకరకమునకుల్లాయి. "గీ. అలఁతి రుదురాకగమితుట్టలందు మెఱయ, వెలిదపారంబు మించ దువ్వలువ గప్పి .." ఆము. ౪, ఆ. ౫౮. ఆం. భా. ౨, ప్ర. ౧౫౫.

**తపారు** = తపారము. (శ. ర.)

**తపించు.** సం. అ. క్రి. 1. తాపమునొందు. "ఉ. అతిలోకం బగుకాల్మితోఁ దపము లిట్లారాఁజుల్ సల్పఁగా ... ముల్లోకములున్ దపింపఁగని భాషాధీశుఁ డుద్భ్రాంతుఁడై" ఉ. రా. ౧, ఆ ౨౭౬; 2 తపస్సుచేయు (శ. ర.); 3. ప్రకాశించు. "సీ. దహనుండు వేఁడిమిదళము చూపఁగ లేఁడు పద్మబంధుఁడు తపింపఁగ వెఱచు." భా. రా. యు. ౧౫౭౯. స క్రి. తాపమునొందించు." ఉ. అవిమవహ్నికీలలు సురావళి నంటి తపించునప్డు .."దశా. ౨, ఆ. ౨౦౭.

**తపియించు.** సం. అ. క్రి 1. తాపమునొందు. "సీ. తపియింపఁబోయి తాఁ దపియించె శుచి..." దశా. ౪, ఆ ౨౨౫. ఉ. రా. ౧, ఆ. ౨౮౪; 2. తపస్సుచేయు. (శ. ర.) స. క్రి. తాపము నొందించు. దశా. ౪, ఆ. ౨౨౫.

**తపిష్ఠుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తాపము నొందించువాఁడు; 2. మిక్కిలి తపస్సు చేయువాఁడు.

**తపుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**తపుస్సు.** సం. వి. స్. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**తపెల.** దే. వి (క. తపలె. తపేలి, త. తవలై.) వంటగిన్నె. "సీ. పడెడుబియ్యము వండఁ బాత్రమైన తపెల యుంచినచిన్ని యసిమిదోస్సిను వెలయ.." హంస. ౧, ఆ ౧౫౭.

**తపేల** = తపెల (వా)

**తపోధనుఁడు.** సం. వి అ. పుం. ముని. విణ. (అ. ఆ, అ.) తపస్సే ధనముగాఁ గలవాఁడు.

**తప్త.** సం. విణ (ఋ. స్త్రీ. ఋ.) 1. తపింపఁజేయువాఁడు; 2. ప్రకాశించువాఁడు.

**తక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కాల్పఁబడినది; 2. కరఁగింపఁబడినది; 3. తపింపఁజేయఁబడినది.

**తప్ప.** దే. వి. గింజలేనిధాన్యము. "సీ. తుచ్ఛ ధాన్యాభిధ తోఁచుఁ దాలు తఱక పొల్లకట్టు తలక పొల్లు పొల్ల. గీ. తప్ప తంకర తూరు నా..." ఆం. భా. ద్వి. ౨౩౯. విణ. బీజములేనిది. (కాయ మొ.) ఉదా. తప్పకాయ. అవ్య. ద్రు. వినార్థకము, కాక. (తప్పు ధాతువు యొక్క తుమున్నాద్యర్థకరూపము. "శా...నీవే తప్ప నితఃపరం బెఱుఁగ..." భాగ. ౮, స్కం ౯౦. వై. ౭, ఆ. ౬౮.

**తప్పఁజూచు.** దే. స. క్రి. (తప్పన్+చూచు.) అపవాద రించు. "క. భూరిగుణ నిట్టివులని,స్తారకు దారకు నుదారధర్మప్రియని,పాక్కారణము తప్పఁజూడఁగ, సారమతీ చను నె నాఁటినత్యము గలుగన్." భార. ఆది. ౪, ఆ. ౯౨. కు. సం. ౮, ఆ. ౬.

**తప్పక.** దే. అ. వ్య. (తప్పుధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థకరూపము) 1. చలింపక, ఏకదేకదృష్టితో. "ఉ. తెప్పలువాల్ప కప్పుడమితేనిమనోహర మూర్తి నిచ్చలుం, దప్పక చూచి చూచి..." శైవ. ౧, ఆ. ౬౫. వి. పు. ౨, ఆ. ౨౮౩, 2. విడువక. "ఉ. ఎప్పుడు భక్తభావమున నిం పలరన్ ద్విజరాజపాదముల్,దప్పక సేవ సేయు సుకృతంబునఁ గాంచె .." ప్రభా. ౨, ఆ. ౭౩. దశా. ౧, అ. ౮౪; 3. శ్రద్ధతో. "క. తప్పక యాలింపుము నీ,విప్పుట్టునఁ గినుక లేక యెలమి దలిర్పన్." సీలా. ౨, ఆ. ౫౩.

**తప్పకుండ.** దే. అవ్య. ద్రు. (తప్పక+ఉండన్.) 1. మానక,విడువక. "గీ. ఉత్సవం బుత్సవము దప్పకుండ సురలు,వత్తు రౌత్సుక్యమున దక్షవాటమునకు." భీమ. 3, ఆ. ౯౦; 2. సరిగా. "గీ. తప్పకుండ మీయిద్దఱ తారతమ్య,మెంతవారును దెలియంగ నెంతవారు." కాశీ ౧, ఆ ౧౦౪. హరి. ఉ. ౭, ఆ. ౧౧౪.

**తప్పరము.** దే. వి. ఒకవిధమగు కుళ్లాయ. "ద్వి. పట్టు కుప్పసమును బట్టుతప్పరము..." పండితా. మహిమ. ౨౭౯.

**తప్పరించు.** దే. స. క్రి. తప్పించుకొను. "ఉ... జంకు లేక యెదురేఁగి శరీరము లంటనీక కాల్, చాఁపుదుఁ దప్పరించి పదిలంబుగ..." విష్ణు. ౨, ఆ. ౨౨౪. చెన్న. ౫, ఆ. ౧౫౧.

**తప్పించి=తప్ప.** దే. అవ్య. (తప్పించు ధా.) వినార్థకము,కాక. "గీ. నిద్ర మేల్కాంచి...తగదు వీక్షింప నరునకుఁ దల్లి వదినె నత్తగారిని దప్పించి యన్యవిధవ." కాశీ. ౨, ఆ. ౮౩. కాశీ. ౫, ఆ. ౨౩౩.

**తప్పించు.** దే. స. క్రి. (తప్పుధా.) 1. పోఁగొట్టు "క ..ఈ, చా పువివేకులయది యిది, దప్పించును పద్ధతియుం నుదాత్తయశంబున్." భార. భీష్మ ౧, ఆ. ౧౯౦. పాండు. ౫, ఆ. ౪౧; 2. కడపు, "గీ. రేపు చుక్కలఁ జూచుచు మాపు తిమిర, వైరిఁ జూచుచు సంధ్యవార్పంగవలయు, నట్టివేళలు తప్పించి యాచరించు, నిత్యసంధ్యావిధానముల్ నిష్ఫలములు." వి. పు ౪, ఆ. ౧౨౩; 3. గడుచు, "సీ. చంద్రికి పూతలికిఁ దప్పించు నత డెట్లు వ్యష్ణవలిశ్రాద్ధసరణి గొపు." రామలిం. శ. ౫౭, 4. దొరకకుండఁజేయు; దూరమొనర్చు. "క. ఇప్పింతు రాత్మపశులకుఁ, దప్పింతురు పరుల కార్పి తప్పింతురు రా,జిప్పగిది వాఁడె యని చే, చెప్పినపెఱవారు నమ్మి చేరక యుండన్." ఆము. ౪, ఆ. ౨౭౯.

**తప్పిదము.** ద్వ వి. (తప్పు+ఇతము) 1. దోషము, "ద్వి. తనయుఁడు చేసినతప్పిదమునకు, గనలుచు బంధువర్గముదానఁ జూచి." ద్వి శ. సా. ౧, ఆ. ౪౩, పు, 2. పొరపాటు. "ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టె తతండు దోల సిగ్గేమియు లేక పాఱుపడ నెవ్వరు దిట్టిరి నిన్ను గెల్చుటం,గ్రాము మలోనఁ దప్పిదము గల్గినయంతన యింతగర్వమేలరా..." భార. ద్రో. ౪, ఆ. ౨౮౮.

**తప్పిదారి.** దే. అవ్య. (తప్పి+దారి) 1. సుతితప్పి. "చ...ఒకబాలకుకంబు రకంబుఁ జూచి వా, లిమి నదల్చుచున్ విరులబంతి నెలంతుక దాని నేసె నుత్తలమునఁ దప్పిదారి యది తాఁకె నృపాలుని పెన్నురంబునన్." కృ. శతం. ౨, ఆ. ౩౩; 2 పొరపడి, "గీ. ఈపరమగోప్య మొరుప్రశయాపురంధ్రి), తప్పిదారియుం నెఱిఁగింపఁ దగవుగాదు" పాండు ౧, ఆ. ౨౨౧. ఉ. రా. ౧, ఆ. ౧౭౪; 3. చెదరిపడి, "గీ...కడుపు బిరి యంగఁ దిని పండుఁ గుడుము లెల్ల, వారిరొంటు

లతోఁ దప్పిదారి యఁన్న, నెల్లఁ దిను మని తన లేచి కిచ్చు నెలవు" శుక. 3, ఆ. ౨౧౯; 4. తలవనితలంపుగా, దైవవశమున. "ఉ ..తక్కిన రాజ లావిమలతామరసాక్షికిఁ గల్గ నేర్పునే, యక్కట తప్పిదారి యటులైనను నాప్పుద, యాంబుజాత మ్మాదిక్కునఁ జిక్కెనే..." సా. ౨, ఆ. ౧౯. ఆము. ౨, ఆ. ౨౭.

తప్పు. దే. అ. క్రి. 1. పొరపడు, "సీ. మఱచి తప్పియుం నన్యమహిమ విమర్శింపఁ జూడ వేవన్యుని పొలుగు జేద్క" కళా. ౪, ఆ. ౧౨౯. భార. కర్ణ. 3, ఆ 3, 2. హానిచేయు, "క. బాణాంతకుఁ డక్రూరుని, ప్రాణార్థంబులకుఁ దప్పవని శపథంబు, తీణగతి నిచ్చి పిలువఁగ, క్షోణీసురవరులఁ దగినచుట్టలఁ బనిచెన్." వి. పు. ౬, ఆ. 3౨3. వరాహ. 3, ఆ. ౯౫; 3. నిరుపయోగమగు. "క. అగునది యట్టిద దైవము, దగ నిచ్చిన యవ్వరంబు దప్పునె మనకున్.' భార. విరా. ౧, ఆ. ౬3; 4. చెడు. "క...గోత్రంతాలస్యమ్మునఁ గొంతంత ప్రయోజనము దప్పు ననఁగా విన మే." కళా. ౨, ఆ. ౧౭౦, హంస. ౫, ఆ. ౭౦; 5. మరణించు. "చ ..పాండురాజు దప్పినపిదపం దదాత్మజులు పెల్కుఱి..." భాగ. 3, స్కం. ౧౧. జై. ౮, ఆ. ౯౦; 6. కడచు, దాఁటు. "ఆ. తగదు మిగుల నిచటఁ దడయఁగ సంకేతితం బగుసమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరిగెద..." రాఘవ. ౪, ఆ. ౧౯, 7. తప్పుచేయు, అపచరించు, "క. ఏమిటఁ దప్పితిమో నా, స్వామికి విశ్వేశ్వరునకు..." కాశీ ౫, ఆ.౧౬౦. భార. ఉద్యో. 3, ఆ. 3౯౪; 8 తొలఁగు. "చ. తమతమదుష్కృతంబు సుకృతంబును సాకదయుక్ష్ శుభంబులై, తముఁ దఱియైనఁ బొందు నది దప్పునె...'' సిర్వ ౭, ఆ. ౧౫, భా. రా. యు. ౧౪౪౨; 9. చెదరు. "ఉ. చెప్పెడి దేమి బాలికలచిత్తము లంబుతరంగలోలముల్, తప్పునో తాఁకునో కుసుమధన్వనియేటులు దైవికంబు గాక." జై. ౨. ఆ, ౬౭. 'సీ. భయ మింత లేక తప్పునిచూపుచేఁ జూచుఁ జూచి చూడనియట్టి చూడ్కిఁ జూచు." కవి. రా. ౨, ఆ. ౧3;10 ప్రతికూలమగు. "చ...ఎంతయు భీతిఁ బొంది రానారియు నరుండుఁ గర్ణుపడి కంత విధాత్ఋఁడు దప్పె వానికిన్." భార. కర్ణ. 3, ఆ. 3౭౭. హరి. పూ. ౬, ఆ. ౧౪; 11. కల్లయగు. "వ... ఈయంగుళీయకంబు నీ కెట్టు గలిగె నున్నరూపు చెప్పుము తప్పఁ జెప్పితేని భూపాలుండున్నిధిం బెట్టి నిజంబు తెలిపి దండింపింతు" కాశీ. ౪, ఆ. ౧౦౦. కవిరా. 3, ఆ. ౧౯౦; 12. తక్కు. "మ. బలిమిం జేకొనరాదు. సామమునఁ దప్పన్..." జై. ౭, ఆ. ౬౯; స. క్రి. 1. అతిక్రమించు, దాఁటు. "సీ...ధర్మవు సుచితంబుఁ దప్పనివారల పదమలాచారుల..." భార. ఆది. 3, ఆ. ౧౪, భార. ఉద్యో. 3, ఆ. 3౬౬; 2. తొలఁగించుకొను, "క. తనతప్పుఁ దప్పఁ జిత్తిని, మనితా యేత్రోవ త్రొక్కవలయుం జెపుమా." శుక. ౨, ఆ.౧౨౯; 3. విడుచు. "చ...ఏ, రెండల సపత్నితోఁ జెలిమి యొంచుక తప్పకు మమ్మ..." సా. 3, ఆ. ౯౬. భార. ఉద్యో. 3, ఆ. ౨౫౯; 4. మఱచు. "క...చేసినమేలుం, దప్పితివో .." భాగ. ౧, స్కం. 3౫౫; 5. కోలుపోవు, (ఈయర్థమునఁ బెక్కుచోట్ల నిది కొన్ని నామవాచకములతోఁ గూడి శబ్దపల్లవ మగును. ఉదా.—మతితప్పు, పరువముతప్పు. మొ.) వి. (సం. దమ్భః.) 1. దోషము. "గీ. భూభుజులతప్పె యది వారిఁ బొందియున్న, ధరణిసామ్రాజ్యభూతంబు తప్పు గాక." కాశీ. ౪, ఆ. ౨౦౨. భార. విరా. ౫, ఆ. ౨౭౫, 2. న్యూనత. "సీ. తలవాఁకిటను రాణి నిలిపి సమ్మతిఁ జెంద దనరాయసమునకుఁ దప్పు గాద" ఇందు. ౧, ఆ. ౪౫; 3. బొంకు. "ద్వి. తప్పాడవాడినఁ దప్పు నాకుఁ, దప్పకవరములు దయ నిచ్చితేని..."రం. రా. అయో. ౯౨, పు.; 4. నిష్ఫలత్వము. "గీ ఐనఁ దెలిపితి నీమనసయ్యె యింక,ధాత వ్రాసినవ్రాతకుఁ దప్పు గలదె." సా. ౨, ఆ. ౨౯. కుచేల. ౧, ఆ ౯౪. విఠ. దోషయుక్తము. "సే. నరపర్ణములతప్పునరణు లుడిపి..." ఆము. ౪, ఆ. ౨౭౦. శుక. 3, ఆ. ౧౦౯.

తప్పుకొను. దే. అ. క్రి. (తప్పు+కొను. స్వార్థమున) తొలఁగు. "చ. అదె యిదె యంచుఁ దప్పుకొను మంచుఁ దగున్ బళి యంచు..." కళా. ౮, ఆ ౧౦౦.

తప్పుకోలు. దే. వి. (తప్పుకొను ధా) తప్పుచేయుట. "సీ. చేయప్పు లడిగి తెప్పెదనంచుఁ జని కాంచుఁ

గోడెమిండని తప్పకోలుత్రొక్కు..." శుక. ౨, ఆ. ౩౬౮.

**తప్పుచేయు.** ద్వ. స. క్రి. (తప్పు+చేయు) తప్పుగాఁ దలఁచు. "చ...నేను గొనితెచ్చినమాత్రన తప్పు చేసి యుయ్యానిమిషభర్త యిద్ధు నిటు కంపె నటే..." వి. పు. ౬. ఆ. ౪౦.

**తప్పుతు.** వై. వి. (తప్పు. ధా.) 1. తప్పుట. (శ. ర.); 2. పరితప్పు. (శ. ర.)

**తప్పుతెరువు.** దే. వి. (తప్పు+తెరువు) అపమార్గము, పెడత్రోవ. "వ ..చెంచువంచనాశరుండై, బొక్కసం బెత్తుకొని తప్పుతెరువునం గాఁ దన పల్లెకుం బోయి..." కాశీ. ౫, ఆ. ౬౪. ఇట్లే తప్పుత్రోవ. ఆం. భా. తృ. ౩౩.

**తప్పుదల.** దే. వి. (తప్పు ధా.) తప్పుట. (శ. ర.)

**తప్పుదారి.** దే. వి. (తప్పు+దారి.) తప్పుత్రోవ, అపథము. (శ. ర.)

**తప్పునీళ్లు** దే. వి. బ. (తప్పు+నీళ్లు) కల్లు, మద్యము. "సీ. లంకఁ గాల్చినవానిబిరుక మెంతు రదేమొ హెచ్చుమందులకొండఁ దెచ్చుటరుతా. గీ. యనుచు మది తప్పుఁ దప్పునీళ్లాని...పట్టి పగ్గెలు ప్రేలునవ్వారజరక." శుక. ౩, ఆ. ౨౩.

**తప్పులుపట్టు.** దే. స క్రి. (తప్పులు+పట్టు.) 1. న్యూనపఱచు. "వ ..మమత నెదిగి పొదువుజలమాలికాకృతిం బ్రకృతిరై యొప్పి విప్పునీలంపు లప్పుల దప్పి తప్పులుపట్టు కొంతికప్పుఁగొప్పు..." చంద్రా. ౪, ఆ. ౧౧౯.

**తప్పుపట్టు** = తప్పులుపట్టు. "గీ. తననడలు మెప్పి కొమ్మలఁ దప్పుపట్టు." ఉ. రా. ౧, ఆ. ౧౭౮.

**తప్పుపడు.** ద్వ. అ. క్రి. (తప్పు+పడు) తప్పుచేయు. "ఆ. మాము కేల చెప్పు మాను సరోజాక్షి, దనుజతనయఁ బొంది తప్పుపడితిఁ,గామి నయిన నన్నుఁ గరుణింపు .." భాగ. ౯, స్కం. ౫౪౩.

**తప్పుసేయు** = తప్పుచేయు. స్వా. ౨, ఆ. ౭౩.

**తప్పెట.** యు. దే. వి. అడవియెలప, సనకుపత్తము. "గీ...తప్పెట కారుకొల్లి, మాడి యనఁగ పనపు పత్త మగు మహేశ." ఆం. భా. ద్వి. ౫౮. వై. వి. (సం. తమ్మటకి) చర్మవాద్యవిశేషము "గీ. కవడె యన సురుమ యనఁగఁ గరిడి యనఁగఁ దప్పెట యనంగ వాద్యభేదములు చెలఁగు." ఆం. భా. ప్ర. ౧౨౮. యు. ౪, ఆ. ౧౫౮.

**తప్పేల** = తపెల (క. తప్పలె-వాడుకలో దీర్ఘాంతముగా నున్నది.)

**తబక.** దే. వి. తప్పు, గింజలేనికాయ. "సీ. తుచ్ఛ ధాన్యాభిధ తోఁచుఁ దాలు తబక పొల్లకట్టు తబక పొల్లు పొల్లు..." ఆం. భా. ద్వి. ౨౩౮.

**తఫావతు.** హిం. వి. 1. భేదము; 2. లోపము.

**తబము.** వై. వి. (సం. తపస్. ప్రా. తబ. తవ. త. తపస్, తవమ్.) తపస్సు. "సీ. గాలి రొంగిరము గాఁగను నీటిలోనఁ దబము లొనర్చెదునిరాబారిగ ములు." యు. ౨, ఆ. ౪౩.

**తబిసి.** వై. వి. (సం. తపస్వి.) 1 ముని. "చ తబిసివిగానఁ జావునకుఁ దప్పితి నీ కిది కేఁటుకంతయూ, యబలుఁడవు..." హార. ౭, ఆ. ౫౫. తపతీ. ౪, ఆ. ౪౪; 2. సన్న్యాసి. "సీ...కనుకట్టు సన్న్యాసి కావిగోఁచి. గీ. దారి బోడ తబిసి వాఁగ..." ఆం. భా. ద్వి ౧౭౬.

**తబిసితనము.** వై. వి. (తబిసి+తనము.) ఋషిత్వము. "ఆ. గర్వరేఖ మిగులఁ గానంగనయ్యెడు, దాంభికంబు నీదుతబిసితనము." హార. ౭, ఆ. ౬౨.

**తబిసీలు.** ఉ. వి. (ఉర్దూ. తఫ్సీలు.) వివరము.

**తబుకు.** దే. వి. తమలపాకులపళ్లెము; పళ్లెము. "సీ... పరఁగుచుండఁ, దాంబూలపాత్రంబు తబుకంబనంగను గంపె యం చనఁగను..." ఆం. భా. ద్వి. ౧౬౬. "ద్వి. తలఁబ్రాలు బంగరు తబుకుల నునిచి..." రం. రా. బాల. ౭౬. పు. ద్వి. శ. పా. ౨౪, పు.

**తబేలా.** హిం. వి. గుఱ్ఱపుశాల. (శ. ర.)

**తబ్బిబ్బు.** దే. వి. (క. తబ్బిబ్బు.) 1. తడఁబాటు. "వ...మంతనంపువేళల మాటలతబ్బిబ్బునం బుట్టు పొలయలుకలం దలలు వంచి..." స్వా. ౩, ఆ. ౨౮. దశా. ౮, ఆ. ౩౩; 2. వంచన, మాయ. "క. అబ్బిబ్బులి గన వచ్చెం, దబ్బిబ్బులిఁకేమి సేయుదాన ననుచు నబ్బిబ్బోకవతి మనంబున, నబ్బురమును భయముఁ ద్రొక్కు లాడఁగ నుండెన్." శుక. ౨, ఆ. ౨౫౩; 3. వ్యత్యస్తవచనము. "గీ. ఇటునితబ్బిబ్బులకుఁ గేరు పెలమిటారి,నగవు జేలినడాలు...కలికి చాదంతి పొడమె వాజలధియందు." దశా. ౯, అ. ౨౨౪. విశే. 1. తడఁబాటు గలది. "సీ. ఒకక్రౌంచ మును గొట్టి యబ్బి తబ్బిబ్బైనశిఖామకురుని

తారుణ్యంబు ఘనమె." రంగా. ౧, ఆ. ౧౦౧; 2. అసత్యము. "వ ..ఆహో! యవ్వ కడుపు కూటికి దబ్బరాడిలి నని తలంచి యుండావే అది కల్ల గాదు కైలాట గాదు తరకటబరకట గాదు తబ్బిబ్బు గాదు .." వేం. మా. ౫, ఆ. ౩౯; 3. వ్యత్యస్తము. "సీ. చనఁ దెత్తులిడక మజ్జన ముఖ్యవిధులకుఁ జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు" ప్రభా. ౨, ఆ. ౧౦౯. కళా. ౯, ఆ. ౪౦; 4. కలఁతనొందినది. "క. గబ్బున గానిరించిన నొక, దెబ్బ గొనుచు ..... నెదురఁ ద్రిజగముల నొరుల్, తబ్బిబ్బుగ జంగములకుఁ, బబ్బంబులువెట్టు ముష్టిపరిఘుట్టనలన్." శివరా. ౪, ఆ. ౯౧.

తమంగము. సం. వి అ. పుం. తమగము,మంచె. (శ.ర.)

తమకపడు. ద్వ అ క్రి. (తమకము+పడు.) 1. త్వర పడు. "గీ. వారమూర్తికి బిటులకుఁ గౌరవేంద్రు, మూడిగపుఁగొమ్మలకుఁ బొందు లోకటఁ జేయఁ, దమకపడుకంతునకు,..." సాంబో. ౫, ఆ. ౨౯౨. భా. రా. యు. ౧౬౯౪; 2. తహతహపడు. "సీ. పొడవైనతెలిమేని పూఁతదావులఁ దావు దరలి ఘాలాతుంబు దమకపడఁగ." ఉద్భ. 3, ఆ. ౭౫. నైష. ౬, ఆ ౯౪.

తమకము. ఉభ దే. వి. 1 తొందర, త్వర "క. పురుషసింహుఁడు మదం,బెక్క యుధిష్ఠిరుఁ బొదివెడు, నెక్కుడుతమకమునఁ గదిసె నేడ్తెర మెఱయన్." భార. ద్రో. ౧, ఆ. ౨౦౮. ఉ. హరి. ౪, ఆ. ౨౫౩; 2. మోహము. "గీ ..వేడ్క సేయుఁదురయ్య వివేక లెవ్విధమున నాబుద్ధి విన వయ్య తమక ముడిగి." భార. విరా. ౨, ఆ. ౭౩, 3. తహతహ,వేడుక. "క. తొలుప్రాయపుమగ లాదముల, తలఁపులఁ దమకములు మిగులఁ దను నెదురుకొనన్." కళా. ౧, ఆ. ౨౯. హరి 3, ఆ. ౧౪; 4. కాళి, కోరిక. "గీ. కాళియును గోట కెలిమంటపంబుఁ దోఁచుఁ, దమక మునఁ గను." అం. భా. కృ. ౫౫; 5. కోటవెలిమంటపము. అం. భా. కృ. ౫౫. సం. వి. అ. పుం వ్యాసరోగభేదము.

తమకి. దే. విశే. (తమకము+ఇ.) తమకము గలవాఁడు, తమకము గలది.) "క. విను గర్భిణి ప్రజ్వలకు తున, తమకూపము హైనయట్టియాహారంబుల్, గొనుగలిఁ బలి ధరణీప్రజ్వమునికిఁ దగనడచునది తమకిగా కెప్పుడున్." భార. శాం. ౨, ఆ. ౧౭౯.

తమకించు. దే. అ. క్రి. 1. యత్నించు. "ఉ... ఉ,క్కలయి యిట్లు సృష్టిపనికిం దమకింపఁగఁ జన్నె .." హరి. పూ. ౧, ఆ. ౭౨. భార. భీష్మ. ౧, ఆ. ౨౬౭; త్వరపడు. "సీ...తను కష్టదీయప్రాణసంరక్షయందుఁ దగిన. గీ. తొల్త మాభాగ్యవశమునఁ దోఁచుఁ దాక,నోర్చుటయ కాక తమకింప యుక్తమగునె." ప్రభా. ౪, ఆ. ౩౬. భార శాం. ౨, ఆ. ౧౩౯; 3. జంకు. "చ. వలఁ బడి చిక్కుటొండె వల ద్రెచ్చుక పోవుట యొండెఁ గాక వృత్తులు వలఁ గొంచు భారమునకుం దమకింపక యంబరంబునన్, వల గొనిపోయెటోల్ల" నా. పంచ. ౨, ఆ. ౧౧; 4. మోహించు. "సీ...పడఁతి విశ్వాచి నా నమరకామిని నెవ్వి యెరుగఁ జూచి, తమకించి." వాసిష్ఠ 3, ఆ. ౨౦. స క్రి. భయపెట్టు. "సీ. హరులైన దంభోళిధరులైనఁ దమకించు రాజద్వ్యమణులైన రాజమణులు." కృ శకుం.౧, ఆ. ౫౫.

తమకు. దే. అ. క్రి. 1. చలించు, కదలు. "సీ తమకన్నులకు వీఁగి తమకుచందంబునఁ బెల్లుగాఁ గల్వలు తల్లడిల్ల" య. 3, ఆ ౬౩. (శ. ర. పా.); 2. భయపడు "క. చెట్ట దను మోవవచ్చిన, పట్టున ధైర్యంబు వదలి పలుమఱు మిగులన్, రట్టుపడి తమకి మదిలో, నట్టిట్టని లేని నవ్వరా సరివారల్" హరిశ్చ. ౪, ఆ. ౧౧౪; 3. దాఁగు. "సీ . తమకన్న మునుమున్న తమకు వారల ముంచి దమకువారు." చంద్రా. ౬, ఆ. ౯౪. వి. విధము. "వ...వలరాజుకొత్తపలకలకమకునం గను పట్టువీఁపున .." పాండు. 3, ఆ. ౧౭౮. (శ ర. పా. 'తళుకునన్.' ముద్రి.)

తముగము. వై. వి. (సం. తమంగః. ప్రా. తముగ.) 1. మంచె, "శా...హరి కంపప్రాణహింసార్థియై, లంఘించెం దముగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్." భాగ. ౧౦. స్కం. పూ. ౨౩౭౨; హరి. పూ. ౯, ఆ. ౫౯, 2. మండపము; కోట వెలిమండపము. "సీ. నలుకంక శోభనంబులతోడ మిన్నంది కొమరారునీలంపుఁ దముగ మైన." రామా. ౬, ఆ. ౧౨౯. "గీ. నడచి తముగపుఁ గోట నసాన్నిహి తెల్ల,నవరఁ జొఁజాలుదీర్చి..." కువల.౨,ఆ.౫౧.

**తమట.** దే. వి. అగ్నిజ్వాల, కీల. "సీ. తమ టనఁ గీల పదం బగు..." అం. శ. ౭౦.

**తమటము.** దే. వి. చర్మవాద్యవిశేషము, తప్పెట. "సీ. తప్పటం బనఁగను దమటం బనంగను దమటాభిధానంబు దనరుచుండు." అం. భా. ప్ర. ౧౨౭.

**తమతుఁడు.** సం. విణ. (అ. అ. అ.) తృష్ణాపరుఁడు.

**తమము.** సం. వి. అ. న. 1. అంధకారము; 2. పాదము యొక్క అగ్రము; 3. తమోగుణము. పుం. 1. రాహుగ్రహము; 2. చీకటిచెట్టు; స్. న=తమస్సు

**తమరము.** సం. వి. అ న. 1. తగరము; 2. సీసము.

**తమస.** సం. వి. ఆ. స్త్రీ. ఒకనది.

**తమసము.** సం. వి. అ. పుం. 1. అంధకారము, 2. కూపము. న. 1. చీకటి; 2. నగరము; విణ. (అ. ఆ అ.) నల్లనిరంగు గలది.

**తమస్వతి.** సం. వి. ఈ. స్త్రీ 1 రాత్రి; 2 పసుపు చె.

**తమస్విని.** సం.=తమస్వతి.

**తమసు.** సం. వి. స్. న. 1. సత్త్వరజస్తమోగుణము లలో నొకటి; 2. చీకటి; 3. అజ్ఞానము; 4. శోకము; 5. పాపము; 6. బలము, 7. రాత్రి. పుం. న. రాహుగ్రహము.

**తమస్సు.** సం.=తమసు.

**తమాయించు.** దే. అ. క్రి. స్తిమితపడు, శమించు. (శ. ర. వా.)

**తమాలకము.** సం. వి. అ. పుం. 1. చీకటిచెట్టు; 2. వెదురుపైతోలు.

**తమాలపత్త్రము.** సం. వి. అ. న. 1 తిలకము; 2. చెట్టు; 3. ఆకుపత్రి. చె

**తమాలము.** సం. వి. అ. పుం. 1. ఉలిమిరిచె; 2. చీకటి చెట్టు; 3. వెదురుపైతోలు; 4. కత్తి, 5. ఆకు పత్రిచె, 6. నల్లచండ్రచె; 7. బొట్టు, తిలకము.

**తమాలిక.** సం. వి. ఆ స్త్రీ. నేలయుసిరిక చె.

**తమాలిని.** సం. వి. ఈ స్త్రీ. 1. నేలయుసిరిక చె; 2. తమాలవృక్షములు దట్టముగాఁ బెరిగిననేల.

**తమాషా.** ఉ. వి. (ఉర్దు. తమాషా) చమత్కారము. "సీ. నిబ్బరంబుగఁ జూడు నేఁ డిది తాతమాషా యని చెలరేఁగి చాల నలసి." బలిరకతిబేల్పు శత కము. ౭౦.

**తమాసు** = తమాషా. "సీ. పులితోలు సరిగెపూవుల పొద్దు కిముఖాలు గొప్ప తమాసుగా నొప్పఁ జేసి." పార్వ ౫, అ ౧౪౯.

**తమి.** ఉభ. దే. వి. 1. త్వర. "సీ. బంగారు పైఁ బోఁచుశృంగారచేష్టలతమిఁ దచ్చికోటకూర్ధ్వముఖ డాచి." స్వా. 3, అ. ౯౭. కళా. ౫, అ. ౪౪; 2. అపేక్ష; కుతూహలము. "క. రం గగు తోఁట పూలఁ బూఁతల, నంగుగఁ గైసేసి యందు నాడెడు తమిచేఁ, బొంగారెడు వేడుకతో, సింగారపుఁదోఁట కరిగెఁ జెలువలుఁ దానున్." య. 3, అ. ౫౩, నీలా. ౧, అ. ౧౮, 3. వలపు మోహము; "క. మేను గరుపాఱఁ దమి నుప్పొంగి జపముఁ దపముఁ దన్న మఱచి యనంగ,గ్లానిఁ బడి..." స్వా. ౬, అ. 3౪. శుక. ౨, అ. ౧౦౬; 4. స్నేహము, పారవశ్యము; "గీ. నిదురతమి నైన నుడిగింపు చదురు లిట్లు, వాసనాబలమునఁ బూవుపజము ఖుల." వసు ౪, అ. ౭౫. సం వి. ఇ స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు చె

**తమిఁద.** దే. వి. చోడిపైరుచె. బ. చోళ్లు (వృత్తి యందు వికల్పముగా బహువచనలోపము.) "గీ. అమరికలఁ గల్గి సంకటితమిఁద రొట్టె,క ట పొట్ట కైన మినుపపిండి .." ప్రబంధ. ౧3.౧. చెన్న. ౨, అ. ౪౭.

**తమికొను.** దే. అ. క్రి. (తమి+కొను.) 1. త్వరపడు; 2. అపేక్షపడు; 3. కుతూహలపడు; 4. మోహపడు. (శ. ర.)

**తమికొల్పు.** దే. స. క్రి. (తమికొను ధా. ప్రే.) (మోహపఱచు.) " సీ. వేల్పురాయని ప్రోల వెలయుంనాడెపుటచ్చరల కల్లఁ దమికొల్పి కల సిరాఁడ." అచ్చ. అర. ౫౮.

**తమిర.** దే. వి. కాఁడినడిమిచీల,శవ్యా. (శ. ర.)

**తమిస్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. చీకటిరేయి; 2. రేయి; 3. చిమ్మచీకటి; 4. పసుపుచె. [3. పసుపుచె.

**తమిస్రము.** సం. వి. అ. న. 1. చీఁకటి; 2. కోపము;

**తముకు.** దే. వి. (త. తముక్కు.) చర్మవాద్యవిశే షము. "సీ. బరువులెత్తినయెద్దుపై నొంటితముకు రావములును వేణునాదములు పొసఁగ." శుక. ౨, అ. ౫౪౮. అం. భా. ప్ర. ౧౨౭.

**తముకువేయు.** దే. స. క్రి. (తముకు+వేయు). తముకు వాయించుచు అధికారుల ఆజ్ఞను ప్రక టించు; ప్రకటించు. "సీ. తముకువేసినచొక్కఁ దాఁ జరించినఁ బట్టి యునుపకుండఁ దలార్ల కొలఁగి యొనఁగి." శుక. ౪, అ. ౧౧౧.

తములపాకు. ద్వ. వి. (తములము+ఆకు.) నాగవల్లీదళము. "గీ. ..ఉత్తరించు, తములపాకునిక్కడు క్రియ దాఁటె నిట్టి." ఉ. హరి. ౪, ఆ. ౨౦. ప్రభా. ౨, ఆ. ౧౫.

తములపుటాకు = తములపాకు. "చ... లేఁత విడిగాఁ దగుఁ గేదఁగి జేకటందపుం,దములపుటాకుముద్దు లును .." శశాం. ౩, ఆ. ౧౦౫. రాధికా. ౧, ఆ. ౭౯.

తములము. వై. వి. (సం. తాంబూలమ్. ప్రా. తంబోలమ్. త. తంబళమ్. క. దంబుల.) 1. నాగవల్లి, తములపుఁదీఁగ. ('తాంబూలాఖ్యలత' మొదలగు పదములఁబట్టి యీయర్థము గృహీతము.). 2. వీటిక, పోఁకచెక్కలు మున్నగువానితోఁ గూడిన నాగవల్లీదళము. "మ. తములముం బువ్వుం బులున్ లోనుగా, లలితద్రవ్యము లెల్ల నా కొసఁగె కేలంబాడుచుం బ్రీతితోన్." దశ. ౩, ఆ. ౪౦; 3. తమ్మ,నమలిన నాగవల్లీదళాదికము. "గీ మృగమదముమించుతములంపుటిరుల మోవి." ఆము. ౪, ఆ. ౧౩౫.

తములముసేయు. ద్వ. అ. క్రి (తములము+చేయు.) తాంబూలమువేయు. "క. తములము సేయని నోరును ..హీనధాముఁడు లేనిరాత్రి హీనము సుమతీ" సు. శ. ౫౩.

తమోమణి. సం. వి. ఇ. పుం—చీకటిలో మణివలె ప్రకాశించునది—1. మిడుఁగుఱుబురుగు; 2. గోమేదకమణి.

తమోరి. సం. వి. ఇ. పుం.-తమస్సునకు శత్రువు- 1. సూర్యుఁడు; 2. చంద్రుఁడు. 3. అగ్ని.

తమ్మ. దే. వి. 1. చర్వితతాంబూలము, నమలిన తాంబూలము. "సీ. ఎదిరి వీనికి నిర్వహింపనికాళాంబూలారులతమ్మలకు నోరొగ్గకున్న" కవిక. ౬, ఆ. ౧౯౪. ప్రబోధ. ౩, ఆ ౫౧; 2. తంబ,చమ్మకీ "ఆ. చిల్ల చింత మొగలి చీకిరే నూడుగు, నిమ్మ తమ్మ తుమికి కామ్మి జమ్మి,వేగి వేము మొదలుగాఁ గల మ్రాఁకుల..." వేం. పంచ. ౪, ఆ. ౫౨౨.

తమ్ముంటులు. దే. వి. బ. (తమ్మి+అంటులు) కుండలములు, "సీ. పుసుకతమ్ముంటులఁ బోలుచు వీనుల వారు నొసల మిక్కిలిచూపు లెసఁగువారు." పాండు. ౧, ఆ. ౧౬౫.

తమ్ముంట్లు = తమ్ముంటులు. "సీ. ధాతు మించినమంచి తమ్ముఁట్లరాగంబు శ్రవణభాగంబుల నందడింప." వరాహ. ౧౧, ఆ. ౯.

తమ్మటము. దే. వి. (త. తంబట్టమ్. క. తమటే, తప్పటే) చర్మవాద్యవిశేషము. ఆం. భా. ప్ర. ౧౨౭. (ఇది సంస్కృత సమాసమధ్యమునను గాననగుచున్నది.) "వ. శంఖకాహళభేరీ పటహఝల్లరీ పణవమర్దళ తమ్మటప్రముఖ నిఖిలవాద్యనిర్ఘోషంబులును." కళా. ౬, ఆ. ౬౯, రుక్మా. ౪, ఆ. ౩.

తమ్మతనుకు దే. వి. తమ్మపడిగ. (శ. ర. బ్రౌ.)

తమ్మతొట్టి. దే. వి. తమ్మపడిగ. (బ్రౌ.)

తమ్మపడిగ. దే. వి. తమ్ములము ఉమియుపాత్రము. "సీ. జాళువాచందువ ఖ్యాలవల్లిక తమ్మపడిగము కాళంజిబలక..." రసిక. ౪, ఆ. ౪, అచ్చ. సు. ౩౫.

తమ్మళ. దే. వి. శివార్చన చేసి బ్రతికెడు నొకజాతి. ఉదా —తమ్మళవాఁడు, తమ్మళది. (ఇది ప్రాచీన శాసనము లోఁ గానవచ్చినపదము).

తమ్మళి. దే. వి. తమ్మళజాతివాఁడు. "సీ. పిల్లలు పోరాడె బల్లి యూరక త్రుళ్లెఁ దమ్మళిపొడసూపెఁ దుమ్మె నెవర." ద్వా. ౧, ఆ. ౨౧౩. ఆం. భా. ద్వి. ౨౪౪.

తమ్మి. దే. వి 1. పద్మము, తామరపువ్వు; "సీ. నలువ కామ్మోముఁదమ్ములు కేళిగృహములు తసుకుటద్దంబు సత్కవులమనసు" వైష. ౧, ఆ. ౫, ఆం. భా. ప్ర. ౧౬౪; 2. పద్మమువలె నుండునది. పద్మవ్యూహము. "సీ. తమ్మిఁ దాల్చినవానిఁ దమ్మిఁ దొల్చినవానిఁ దమ్మి మొల్చినవానిఁ దారసించు." నరస. ౧, ప్ర. ౬౪; 3. వృషవిశేషము. (శ. ర.)

తమ్మికంటి. దే. వి. (తమ్మి+కన్ను+ఇ)-కమలము వంటి కన్నులు గలవాఁడు;కమలమువంటి కన్నులు కలది; 1. అందమైనకన్నులు గలది; స్త్రీ. "సీ. కాఁబోలు నీతమ్మికంటిచిరద్యుతుల్ మించఁ బోల్చినతళుక్కు మించుఁదీవ." చంద్రి. ౩, ఆ. ౫౩; 2. విష్ణువు, కమలాక్షుఁడు. "ఆ...కొడుగురే, ద్రిమ్మరుల నడంచి తమ్మికంటి." నీలా. ౧, ఆ. ౪౦.

తమ్మికెంపు. ద్వ. వి. (తమ్మి+కెంపు) పద్మరాగమణి. "సీ. మగమానికముల క్రొన్నిగనిగల్ దులకింప బలు తమ్మికెంపు మేల్ పసలు నింప." నీలా. ౨, ఆ.౪౯.

తమ్మిగద్దియ. దే. వి. (తమ్మి+గద్దియ) పద్మాసనము. వేంక. దేవ. ౬.

తమ్మిగద్దియబోటి. ద్వ. వి. లక్ష్మి. సాం. ని. దేవ. ౬.

తమ్మిచక్కిలిగింత. దే. వి. సూర్యుఁడు. "సీ. కాల జోడు తమ్మిచక్కిలిగింత వేవెల్గు కలువలసూడు చీకటులగొంగ. గీ... నాఁ జెలఁగు దనరు లోక బాంధవుఁడు .." సాం. ని. దేవ. ౯.

తమ్మిచుట్టము. దే. వి. (తమ్మి+చుట్టము) సూర్యుఁడు. "గీ తమ్మిచుట్టము మిత్రతనమ్ము సూర్యుఁ డా..." ఆం. భా. ప్ర. ౯౧, వేంక. దేవ. ౧౨.

తమ్మిచూలి. దే వి (తమ్మి+చూలి) బ్రహ్మ "ఆ భాగ వతము తెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన." భాగ. ౧, స్కం. ౧౯. చంద్రి. ౨, ఆ ౪౬

తమ్మిదాయ. ద్వ. వి. (తమ్మి+దాయ) - కమలవిరోధి- చంద్రుఁడు. 'సీ. చిమ్మిన నక్కోల యిమ్ముఁ జని పెను బొమ్ము గాఁడుటయుఁ రాతమ్మిదాయ" అచ్చ. యుం. ౨౬౪. (రాతమ్మిదాయ = రాజ చంద్రుఁడు).

తమ్మిదీవి. ద్వ. వి. (తమ్మి+దీవి) పుష్కరద్వీపము (శ.ర.)

తమ్మిదొర. దే. వి. (తమ్మి+దొర) సూర్యుఁడు. "గీ. అట్లకా కని మునికేవ మథిగమించి, పంపకడఁ దమ్మిదొరచూలి పంప వచ్చి, గాద్పుకొమరుండు రామలక్ష్మణులఁ గాంచి, పలికె భయభక్తియుక్తు లేర్పడఁగ నిట్లు." రామా. ౭, ఆ. ౨౭౯. (తమ్మి దొరచూలి = సూర్యసుతుఁడైన సుగ్రీవుఁడు.)

తమ్మినూలు. దే. వి. (తమ్మి+నూలు) బిసతంతువు, తామరకాఁడతంతువు. "సీ. పానకమ్మినూల్వంటి యసదులేఁగొను పై నొర గాఁగఁ బరుండి రొయిరగఁ గొంకి." ప్రబంధ. ౭౫౦.

తమ్మిపగతుఁడు=తమ్మిదాయ (శ. ర.)

తమ్మిపుట్టు=తమ్మిచూలి. భాను. ౧, ఆ. ౩.

తమ్మిమొలక = తమ్మిచూలి. చెన్న. ౧, ఆ. ౧౧౭.

తమ్మియనుఁగు = తమ్మిచుట్టము. అచ్చ. యుం. ౪౦౩.

తమ్మియింటిగరిత. దే. వి. పద్మాలయ; లక్ష్మి. ఆం. సం. దేవ. ౧౦.

తమ్మివిందు = తమ్మిచుట్టము. "గీ. పరిధకీర్ణ పరాగాగ్ని సాక్షి గాఁగఁ, దమ్మివిందుకరగ్రహణమ్మొనర్పఁ, బొలఁచుపద్మినికిని నల్లపూసదండ, గట్టినాఁ దన కాలదేఁటిగములు ప్రొద్దులె." రాజ. చ. ౨, ఆ. ౬౯.

తమ్మిసూఁడు = తమ్మిదాయ. "ఉ... ఈగురుమఖో త్తముని కొఱ్ఱథికైనఁ దమ్మిసూఁడల్లనిబాఱఁ, ద్రోచి హృదయంబు గలంగ నొనర్చి కేపె నీ, యల్లనిఁ జేసి తెచ్చెద రయంబున నేఁ గనుఁగీటి పిటికిన్." చెన్న. ౨, ఆ. ౨౩౧.

తమ్ముఁడు. దే. వి. (త. తంబి క. తమ్మ.) 1. దీనికే వృత్తియందు 'డుజ్' లోపము. భార. ద్రో. ౪, ఆ. ౨౧౯. వెనుకఁ బుట్టినవాఁడు, అనుజుఁడు. "క. అమ్మదికఁ జూచి యన్నయుఁ,దమ్ముఁడు నొక్కటి మనోజతాడితులై .." భార. ఆది. ౮ ఆ. ౧౦౬, ఆం. భా. ద్వి. ౧౦౩; 2. వాత్సల్యార్థమునిచ్చును. భా. రా. అయో. ౭౩; 3. తోఁబుట్టు. "గీ. తమ్ములాశొమ్మ కెమ్మోముతమ్ము లనఁగ." విక్ర. ౪, ఆ. ౧౮.

తమ్ముఁగుఱ్ఱ. దే. వి. (తమ్ముఁడు+కుఱ్ఱ) తమ్ముఁడు. "క. నీతమ్ముఁగుఱ్ఱ రూపసినీలివిదుఁడు .." భార. ద్రో. ౪, ఆ. ౧౩౬. పాండు. ౩, ఆ. ౩౮.

తమ్ముదోయి. ద్వ. వి. (తమ్ముఁడు+దోయి) తమ్ముల జత, కవలుగాఁ బుట్టినతమ్ములు. "సీ... భీముని విల్చి మనుజపతుల,కెల్లను వే భూజ లిమ్మన్న నమ్మ రుత్తనయుండు దగఁ దనతమ్ముదోయి,కెలమిఁ గూర్పకొని..." భార. అశ్వ. ౪, ఆ. ౧౪౩.

తమ్ములపగవాఁడు. దే. వి. పద్మవిరోధి, చంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౭.

తమ్ములము. వై. వి. (సం. తాంబూలమ్. ప్రా. తంబో లమ్. త. తంబళమ్. క. తంబుల.) 1. నాగవల్లి, తములపుతీఁగ, (తాంబూలదళము, తాంబూలా ఖ్యలత మొదగుపదములను బట్టి యీయర్థము గృహీతము); 2. పోఁకచెక్కలు మొదలగునవి గలనాగవల్లీదళములు, వీటిక. "గీ. నీవు మున్నేఁగు మని యతనికి విభూషణాంబరంబులతోఁ దమ్ము లంబుఁ బెట్టిపీడుకొలిచ్చి పుచ్చిన..." భార ఉద్యో. ౧, ఆ. ౨౭౭. ఆం. భా. ద్వి. ౧౬౭; 3. చర్వితతాంబూలము, తమ్మ. "గీ. అమ్మెఱుఁగుఁ బోఁడి పుక్కిటితమ్ములమున, బుగులుకొనువాస నయుం..." ఉ. రా. ౪, ఆ. ౧౮౪.

తమ్ములముసేయు. ద్వ. అ. క్రి. (తమ్ములము+చేయు) తాంబూలముసేయు. "గీ. తమ్ములముసేయుచో నొక్కతలిరుఁబోఁణి, రాకుమారునిఁ జూచుపరాకు కతన, మఱచి తాంబూలపత్రంబు మాఱు

గాఁగ, గజాతిఁ గొంగెలిపడికేలి కమలదళము." శైవ. ౬, ఆ. ౬౩.

తమ్ములయిల్లు. దే. వి. బొ. (తమ్ములు+ఇల్లు) కమలాకరము, సరస్సు. "వ. కని తమ్మికంటి తమ్ములయింటి పొలుపునకు మెచ్చుచు..." భాగ. ౧౦, స్కం. పూ. ౪౯౨.

తమ్మువాఁడు. దే. వి. (తమ్ముఁడు+వాఁడు) తమ్ముఁడు. (శ. ర.)

తమ్మె. దే. వి. (క. తమ్మె.) 1. చెవి అడుగుభాగము. "ద్వి. అని యప్డు కరముల నద్దైత్యుచెవులు,బెనఁచి తమ్మెలనొదఁ బెఱికి రాఁ దిగిచి" రం. రా. యు. ౪౧౭ పు., 2. పశువుల మెడను తగిలించెడు పలుపు ముందుభాగము.

తమ్మెట. దే వి. చర్మవాద్యవిశేషము. "వ... భేరులును డోలు గౌరు గుమ్మెట తమ్మెట." హంస. 3, ఆ. ౨౯.

తయారు. హిం. విశే. సిద్ధమైనది; సంసిద్ధుఁడు. (శ.ర.)

తయినాతి. హిం. వి. పనిపెట్టుకొనియుండుట. (శ.ర.)

తరంగము. 1. సం. వి. అ. పుం. అల, ఊర్మి, 2. గుఱ్ఱము మొదలగువానిదాఁటు.

తరంగి. సం. విశే. (న్. నీ. న్.) అలలు కలది.

తరంగిణి. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

తరంగితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తరంగములు కలది, 2. చంచలము, 3. పొంగి పొరలునది.

తరండము. సం. వి. అ. పుం. 1. గాలపుదారమునకు గట్టిన కఱ్ఱముక్క లోనగునది; 2. ఓడనడపు త్రెడ్డు; 3. ప్లవము, తెప్ప.

తరంతము. సం. వి. అ. పుం. 1. సముద్రము; 2. జడివాన, ఆసారము; 3. కప్ప; 4. తెప్ప.

తరంతి. సం. వి. ఈ. స్త్రీ. నౌక.

తరంతుఁడు. సం. వి. అ. పుం 1. భక్తుఁడు; 2. రాక్షసుఁడు.

తరంబుజము. సం. వి. అ. న. కరబూజాపండు.

తరఁగ. వై. వి. (సం. తరంగః) 1. అల,కెరటము "మ ..సం,దినియత్నేటితరంగలన్ దేఁగుచున్." భార. ఆది. ౮, ఆ. ౨౯. ఆం. భా. ప్ర. ౧౫౪; 2. వళి,కడుపుమీఁదిముడుత. "చ. సరవిరోమ రాజి దంతురత చాలనినున్నపుమూత్తరంగలన్." కవిక.3, ఆ. ౧౩.

తరఁగలెత్తు. ద్వ. వి. (తరఁగలు+ఎత్తు) పొంగిపొరలు: అతిశయించు. 'సీ. అమృతంబు చిప్పిలుమాధుర్యమధురగాంధర్వరూపంబునఁ దరఁగలెత్త." కవిరా. ౧, ఆ. ౧౦౬.

తరకట. వై. విశే. (సం. తర్కితః) అసత్యము. (ఇది పెక్కుచోట్ల నీయర్థమున "బరకట, బురకట" శబ్దములతోఁ గలిసి సోదకత్తెయాడుమాటలం దుపయోగింపఁబడుచున్నది.) "క. తరకట బరకట గాదే, తరుణీ నామాట నీకు దార్కాణగునే" దశా ౭, ఆ. ౨౧౯. వేం మా. ౫, ఆ. ౩౮

తరకటించు. వై. అ. క్రి. తర్కించు. "సీ. తనశిరఃకోటీరతపనీయమయరుచుల్ తపనాంశురేఖతోఁ దరకటింప." ఇందు. ౫, ఆ. ౪౬. (తరగలింప ముద్రి.)

తరకటింపు. వై. వి. (సం. తర్కితః) తర్కము. "సీ... తరకటిం పునఁగను దర్క మెసఁగు." ఆం. భా. ప్ర. ౧౦౩.

తరకసము. దే. వి. అమ్ములపొది, తూణీరము. "సీ. రాణనొప్పారువైరాణంబుసింగిణి తళుకుల కోరుల తరకసంబు." స్వా. ౪, ఆ. ౭౮. ఆం. భా. ద్వి. ౫౪.

తరకసా = తరకసము. "శా. త్రైలాంచత్కచపాళిఁ గూర్చి మెలు లొందం జుట్టి మేల్ పాగలం, గీలున్ సింగిణి చేకటిం దరకసాల్ కెంపైనమీసంబు...విరాజిల్ల..." రా. వి. ౭, ఆ. ౫౧.

తరక్షువు. సం. వి. ఉ. పుం. సివంగి, క్షుద్రశార్దూలము.

తరగంచె. దే. వి. ఒకరకము అంపము. "సీ. అంపమసంగను గ్రకచంబు తరగంచె యనఁ గరపత్రభేదాఖ్య మీఱు." ఆం. భా. ద్వి. ౩౦౧.

తరగతి. మి. గ్రా. వి. (తరము+గతి.) తరమును దెలిపెడుభాగము, తెగ. వ్యవః—వాఁడు నాల్గవ తరగతిలోఁ జదువుచున్నాఁడు. (శ. ర. బ్రౌ.) బ. శ్రీకంఠభూషావిశేషము. ఉదా.—తరగతి గుండ్లు.

తరగతిగుండ్లు = తరగతులు. బ. శ్రీకంఠభూషావిశేషము. (శ. ర. బ్రౌ.)

తరటు. దే = తఱటు. (కశ, కొరడా.) "చ...తరటుల పాలుసేయుమి." విక్ర. ౫, ఆ. ౮.

తరణ. సం, వి. ఆ. స్త్రీ. తరవాణి.

తరణము. సం. వి. అ. న. ఈదుట.

తరణి. సం. వి. అ. న. ఈదుట.

తరణి. సం. వి. ఇ. పుం. 1. సూర్యుడు; 2. కిరణము; 3. జిల్లేడు*; 4. రాగి, తామ్రము; 5. సముద్రము. ఇ, ఈ. స్త్రీ. 1. నావ; 2. పిన్న గోరంట*; 3. నది; 4. దాటుట.

తరణీయము. సం. విశే. (అ. ఆ అ.) దాటఁదగినది.

తరత్. సం. శత్రు. దాటుచున్న.

తరతమము సం. విశే. (అ. ఆ అ.) హెచ్చుతగ్గులు కలది.

తరతరము. దే. క్రి. విశే. (తరము+తరము) 1. క్రమక్రమముగా. "వ...కద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన .." భార. ఆది. ౨*, ఆ. ౪, హార. ౬, ఆ. ౯౯; 2. వరుసపెట్టి. "గీ...అతఁ డమేయభల్ల, తతుల నన్నింటిఁ దునుమాడెఁ దరతరంబ." భార. భీష్మ. ౨, ఆ. ౧౭౭. భార శాం. ౧, ఆ ౯౭; 3. మిక్కిలి. "గీ. అంతరంగంబులో నాత్మహానశంక, తరతరమె యుద్భవిల్లంగఁదల్లడిలుచు." నైష. ౭, ఆ.౧౨౩, పండితా. దీక్షా. ౨, పు; 4. వంశపరంపరగా, "క. చిరకాలంబది మొదలుగఁ, దరతర మస్మత్పూర్వకంబు దగ మాయింటన్...ఒప్పుచు నుండెన్." భా. రా. బాల. ౬౭౮, భార మహా. ౧, ఆ. ౧౮.

తరపణ్యము. సం. వి. అ. న. ఓడకూలి, పడవకేవు.

తరపు. దే. స. క్రి. పోఁగొట్టు, అణఁచు. "సీ. ఈచంపకాశోక యాక్రొవ్విరులతోఁటఁ బ్రోచుఁ దుష్మెదపిందు హాలయకుండ. గీ. తావిక్రొవ్విరి వాసనల్ తరపు నటుచు." చంద్రా. ౪, ఆ. ౯౩, "గీ. సత్యభాషణనియమంబు జరపినాఁడు, నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు, దండిలోభాది గుణములఁ దరపినాఁడు, మంచిగుణములు తన యందు మలపినాఁడు" భాగ. ౬, స్కం. ౯౯.

తరఫు. హిం. వి. పక్షము. వ్యవ:—నీవు నాతరఫున పనిచేయుము.

తరబడి. ద్వ. వి. (తరము+బడి) తరము, పరిమాణము "సీ. దుర్గంబు వెలువడి దూరస్థలంబున పొమ్ముల తరబడి చూచునపుడు" ద్వా. ౧౦, ఆ. ౧౭౫, 2. తెగ, "గీ. అచటియొకపాటి దొరమనమాస్తులకును, కొత్తుగున్నలు దిక్కులమత్తకరులు, అచటి శేరాచలాయంపుటులఁతితేజీ, కింతరెండవతరబడి యింద్రహయము." పాంచా. ౧, ఆ. ౩౯. విశే. 1. సాటి, సదృశము. "గీ సాటి సాటువ తరబడి సవతు...ఈ దనఁగ సదృశాఖ్యలై యొసఁగు చుండు." ఆం. భా. ద్వి. ౩౦౨; 2 అర్హము. "క. పరికించి కులవారలఁ, దరబడిపదములను నిల్పు దానికి రాజ్య, స్ఫురణ దగు మేన సకలా, భరణంబులరీతి పీడుకడకుండ నృపా." చిత్రభా. ౫, ఆ. ౪౯, అవ్య. ద్రు. వెంబడి. "గీ. ఎఱుక గలవారి తరబడి నేగునపుడు, కరముల శిఖాలు చేసి ముమ్మారు తురుష్కులు, లవలఁ బొమ్మని కొత్వాలకిప్పగింతు, రచ్చటికిఁ జేరఁ బరులకు నలవి కాదు." కృష్ణ. ౨, ఆ ౧౨౩.

తరమిడి. ద్వ. అవ్య. (తరము+ఇడి) 1. వరుసపెట్టి. "సీ ..సహస్రబాహుఁ, బరిమార్చి నృపతులఁ దరమిడి తునుమాడె నిరువదియొక్కమా రెల్లచోట." భార. ద్రో. ౨, ఆ. ౨౧౨, భార. ఉద్యో. ౪, ఆ ౧౫౦; 2. విడువక, "ద్వి. వనజాక్షుఁడు మెచ్చి వరమిచ్చువేళ, నరుల జన్నక యున్న నాఁటికి మెల్ల, దరమిడి నేఁడిదే తలకూడె నీకు." రం. రా. యు. ౪౨౧, పు భాగ. ౨, స్కం. ౧౦౧; 3. తారతమ్య మెంచి (ద్రా) "ద్వి. వరుస నార్వురుచక్రవర్తులకోన, దరమిడి ముక్కున్నఁ దగుచక్రవర్తి." ద్వి హరిశ్చ. పూ. ౨౪౦, పం.

తరము. ఉభ. వై. వి. (సం. అంతరమ్. క. తర. త. తరమ్ ) 1. జీవితకాలము, "క...ఎడ తెగక యిట్టు వచ్చినవంశం, బురుభుజ నీ వుండఁగ నీతరమున విచ్ఛిన్న మగుట ధర్మమె..." భార. ఆది. ౪, ఆ. ౨౨౧. విజ్ఞా. వ్యవ. ౫౦, 2. పురుషాంతరము. "గీ. ఇవ్వల నేడుదరంబుల నవ్వల నేడు, దరములను పితృవర్గంబు నరుఁడు గంగ,నాడి శుచిఁ జేయు .." భార. అను. ౨, ఆ. ౧౧౦. ఆం. భా. ద్వి. ౧౧౨; 3. మానము, కొలఁది. "చ. వివిధము లైనయశ్వములు వేలతరంబులు నీరు ద్రావుచున్నవియును బోవుచున్నవియు నైనవి.." నై. ౨, ఆ. ౧౬, భార. ఉద్యో. ౪, ఆ. ౧౮; 4. సామ్యము, పోలిక. "సీ. నరపుంగవులు కాని నరపుంగవులు గారు తరమెన్న పరధర్మధర్మభృతుల" వసు ౧, ఆ ౪౧, కుపల ౧, ఆ. ౪౪; 5. వరుస. క్రమము. "చ తరమునఁ గన్న

వల్ పోలయుఁ దల్లిముఖాబ్జము చూచు..." కు. సం. ౧౦, ఆ. ౭౧, స్వా. ౪, ఆ ౪౦; 6. రకము, "క. కురువీరుల గెలిచి తదం, బరము లనోఁ జిత్రవర్ణభాసురములుగాఁ, దర మెఱిఁగి లోచనోత్సవ, కరములుగా బొమ్మపొత్తికలకుం దండీ." భార. విరా. ౪, ఆ. ౪౭, విజ. ౧, ఆ. ౧౪౮; 7. విధము, "మ బలవిక్రాంతియశంబులన్ బలరిపుం బ్రస్ఫారలక్ష్మీవిభా,కలనం బార్థశశాంకు శక్తిగరిమన్ గాంగేయు నేర్పంగి వే, ల్పులలోన స్గణుతింతు రాతరముగాఁ బోల్పం దగుం గాక విన్ను .." హరి. పూ. ౭, ఆ. ౧౪౩, చంద్రి. ౨, ఆ. ౭౯; 8. శక్తియము, "చ బలుకుందపు మొగ్గచిల్కుటు, మ్ములు మరుఁ డేయఁ బూచుఁ దరముం దరముం జెలి చెంతఁ జేరినన్." చంద్రి. ౪, ఆ. ౧౨౫; 9. పెద్దదూలములు మున్నగు వానిని మోసికొని పోవుట కుపయోగించుసాధన విశేషము, జడ్డి, 'సీ. తరముల నిట్టట్టుఁ దగుసలల్ దరలించుబలుమానుసుల యార్పుకలకలంబు." పరమ. ౫, ఆ. ౪౦. హరి. పూ. ౭, ఆ. ౭౦; విణ. 1. శక్యము "గీ. తరమె విష్ణునిలోఁ బోరఁ దమ్ములార." ఉ. రా. ౨, ఆ. ౧౩, విక్ర. ౪, ఆ. ౧౨; 2. శక్తము, సమర్థము. "సీ. కలికిజక్కవ పిట్టకవఁ గూర్ప విప్పంగఁ దరమైనకనుదోయి దయ దలిర్ప." దశా. ౫, ఆ. ౪౬, శుక. ౨, ఆ. ౬; 3. సమానము. "గీ. పాటినూత్నహరిద్రావిధంగము నకుఁ, దరము సౌదామనీదామధామమునకుఁ, గరముఁ బోలపొందు దీనియంగములకాంతి." వైమ. 3, ఆ ౧౫౬. అం. సం. స్థా. ౩౪, 4. శ్రేష్ఠము, "సీ. రాణించుగొప్పసుప్పాణి యొం టులఁ దాల్చి తరమైనబలుకెంపుతాళి వైచి." వాశి. ౧, ఆ. ౧౭, అం. భా. తృ. ౧౫, సం. వి. అ. పుం; 1. దాఁటుట; 2. ఓడకూలి; 3. అగ్ని. విణ. (అ. ఆ. అ) దాఁటునది.

తరల. సం. వి. అ. స్త్రీ. 1. గంజి; 2. కల్లు, సుర; 3. ఒకానొకవృత్తము.

తరలించు. దే. స. క్రి. (తరలు ధా. ప్రే.) 1. తొలఁగించు, పోఁగొట్టు. "క. నరునిశరీరమునఁ జరా, తరుణి ప్రవేశించి ప్రజ్ఞఁ దరలించుఁ జుమీ." వాసిష్ఠ. ౧, ఆ. ౧౨౩; 2. లాగుకొనిపోవు, "చ. పరిమిళిత ప్రవాళనవ పట్టపటుధ్వజ చూత నూతన, స్మరరథరాజమున్ ధ్రిమరజాలగుణాంచిత పాంసుచక్రముల్, గెరల మహారథంబుఁ దరలింప లతావనితాళియువ్వలే. మరువపుబంతులట్ల శుక మండలి యాడెడిఁ గంటె వైపయిన్." వసు. 3, ఆ. ౧౩౫. పరమ. ౫, ఆ. ౪౦; 3. బయలు వెడలఁజేయు. "గీ. తండ్రిఁ బిలిపించి వార్త యంతయును గలిపి, పీడు దరలింపు మిప్పుడ పీడ నసిన. చెన్న." ౨, ఆ. ౩౦౪.

తరలిక. దే. వి. (తరలుధా.) ప్రయాణము. "గీ. తర లుము తరలక యరుగు దరుగడమ్ము,...అనఁగ యాత్ర, తగును .." అం. భా. ద్వి. ౨౧౯.

తరలు. దే అ. క్రి. (క. తెరళు) 1. ప్రయాణమగు. "తరల ..క్రక్కుచున్ రజతాద్రికిన్, దరలఁగా వలె నంచుఁ జెచ్చెరఁ దమ్మిగద్దియ డిగ్గినన్." దశా. ౨, ఆ. ౬౫. సీలా. 3, ఆ. ౧౦; 2. నడచు, చను. "గీ. తరలె నన నడచె ననుట తనరు నభవ." అం. భా. తృ. ౭౬; 3. తొలఁగు. "గీ. అచలగతి నుండె దనుజసైన్యంబు మిగులఁ, బరఁగి దైవసైన్యంబుచేఁ దరలదయ్యె." ఉ. హరి. ౧, ఆ. ౧౯. సా. కుచ. 3, ఆ. ౨౦౦, 4. పోవు, నశించు. "గీ. అనుచు రాముఁడు ఘనరీతిఁ దనప్పుషత్క, తతిసహస్రకరస్ఫూర్తిఁ దరలఁ జేయఁ, బఱచె నర్జునభూధరపక్షబలము" దశా. ౬, ఆ. ౧౨౨. వసు. 3, ఆ. ౨౦; 5. చలించు, 'చ. గరుడసమర్పితాభినవగారు డరత్నమయూంగ దంబు భూ, వరభుజపీఠిఁ బొల్చె నగవర్యసుతా వరణాధ్యసూయచేఁ, దరలనిభూతధాత్రియన..." వసు. ౫, ఆ. ౯౧. ప్రభా. ౨, ఆ ౩౪. స. క్రి. విడుచు, వదలు "క. అరయఁగ సంసారాట విఁ,దరలక యాపుత్త్రమిత్త్రదారాదు లనం, బరఁగుచు నుండెడు వృకములు పరువడి నరులస్తము లను భక్షించు చడిన్." భాగ. ౫, స్కం. ౧, ఆ. ౧౬౪. వసు ౧, ఆ. ౪౭

తరలుఁడు = తరలిక అం. భా. ద్వి ౨౧౯.

తరళము. సం. వి. అ. పుం. 1. హారమధ్యరత్నము, నాయకమణి; 2. హారము; 3. వజ్రమణి. విణ. (అ. ఆ. అ.) 1. చలించునది; 2. ప్రకాశించునది.

తరళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చలింపఁ జేయఁబడినది; 2. చంచలమైనది.

తరవరి. = వై. వి. పట్టాకత్తి. "వ... తరవరులకిచ్చియు. "ఉ. హరి. ౬, ఆ. ౫౦. "క. పినతండ్రిచావుఁ గని యుద్ధమునకుఁ డుయూపాక్షుఁ డంతఁ దరవరిఁ గొనుచుం, దనరఁగమ డిగ్గి సింహధ్వని యొనఁగన్ ద్వివిదుఁ దాఁకె దర్ప మెలర్పన్." భా. రా. యు. ౧౯౯౩.

తరవలి. వై. వి. (సం. తరవారిః. ప్రా తరవారి. హిం తల్వార్.) పట్టాకత్తి. ఆం. భా. ద్వి. ౨౧౪.

తరవాణి. దే. వి. అన్నములోఁ గలిపి పులియఁబెట్టిన గంజి. (వా)

తరవాయి. దే. వి జా. (త. తరవాయ్.) వరుస, అనుక్రమము "గీ. ఒక్కతరవాయి దొరకొని యొకటి నొకటిఁ, బృథుభుజాదండమునఁ బట్టి పెలుచ నూఁచె" హరి. పూ ౭, ఆ. ౮౧. భార. కర్ణ. ౧, ఆ. ౨౪౯; 2. కాలము. "చ. చెడుతరవాయి నిట్టిపని చెప్పితిఁ గాని ధనంబు కాంక్షకున్, గడపల లేదు..." సా. పంచ. ౧, ఆ ౧౫౭, 3. చెప్పినవి మరల మరలఁ జెప్పుట, వల్లె. "గీ చెలఁగి తొలువాఁడు తరివాయిఁ జెప్ప నట్టి, యెల్లవన్నంబు జేకరువిడి పదంబుఁ, గ్రమము గుణియించు నైష్ఠిక బ్రహ్మచారి, నికరములు గొల్వ వచ్చె శాండిల్యుహాని." రా. వి. ౨, ఆ ౮; 4. ఉపక్రమము. "వ... లాఁతుల, మా తరవాయుండుగ మాటలాడుం డనుచున్." ద్వి. పరమ. 3, ఆ. ౨౨౫.

తరవారి. సం. వి. ఇ. పుం. కత్తి. (చూ. తరవరి, తరవలి.)

తరసము. సం. వి. అ. న. మాంసము. వ్. న. 1. వేగము; 2. బలము. విణ. (అ ఆ. అ.) 1. వేగము గలది; 2. బలము గలది.

తరసానము సం. వి. అ. పుం నౌక.

తరస్వి. సం. వి. న్. పుం. 1. పులి; 2. వాయువు, గరుడుఁడు; 4. శూరుఁడు; 5. వడిగాఁ బోయి వార్తలఁ దెచ్చుభటుడు. విణ. (న్ నీ. న్.) 1 వడి గలవాఁడు; 2. బలిమి గలవాఁడు.

తరస్సు. సం. వి స్. న. 1. వడి; 2. బలిమి, 3. తీరము; 4. ప్రోఁతి; 5. తెప్పలు.

తరాజు. దే. వి. (క. త. తరాసు. హిం తరాజూ) తూఁచెడుసాధనవిశేషము, త్రాసు "ఉ ..ఈ, రాజులు రాజులా పెనుతరాజులు కాక ధరాత లంబునన్" అడిదముసూరకవిచాటువు.

తరాసు. దే. వి = తరాజు. "సీ. త్రాసు తరాజు నాఁ దనరును కారాచి .." ఆం. భా. ద్వి. ౩౦౦.

తరి ఉ ధ. వై. వి. (సం. తరిః.) 1. త్రచ్చుట, మథనము. "క. తరతరము తరువఁ దరువం, దరియం దుదయంబు నొందె ధన్వంతరి సాగర మునఁ గడు గరగరనై, కరమునఁ గర మమరు నమృతకలశము దానున్." భీమ. ౪, ఆ. ౯౪; 2. కవ్వము. "సీ. గిరిఁ దరిఁ జేసి యాశరథి మథించి సంధిలుసుధారసము సాధించువాఁడు." చమ. ౧, ఆ. ౯. భా. రా బాల. ౪౭౪ ; 3. వన్న. ఉదా.—తరియావు. తరిపాలు. మొ. సం వి. ఇ, ఈ. స్త్రీ. 1 నౌక; 2. బట్టయంచు; 3 పౌఁగ.

తరించే. సం. స. క్రి. 1. (సముద్రము మున్నగు వానిని ఓడ మున్నగుసాధనములచే) దాఁటు. "చ... ఇంతవిపదంబుధి నేకరణిన్ దరింతు..." ఉ. రా. ౬, ఆ. ౧౮౯ ; 2. (అజ్ఞాదులను) అతిక్రమించు, మీఱు "సీ. శాఖామృగస్వామి శాసనంబుఁ దరింప గండమై యుండిన నుండుఁ గాక." చం. రా. ౩, ఆ. ౯౨; 3. కడపు, వెళ్లఁ బుచ్చు. "ఉ... తుషారమహోరహితాసితాభ్రరీతి మెయిం దినంబులు దరించుచు నుండె నితాంతఖిన్నయై." హ. న. ౪, ఆ. ౯౫.

తరికుఁడు. సం. వి. అ. పుం. రేవుపుచ్చు కొనెడి యధికారి.

తరిగంబము. ద్వ. వి. (తరి+కంబము) కవ్వము దగిలించి త్రచ్చుట కుపయోగించు స్తంభము, కుటరము. "క. తరిగాండ్రలోన నొకఁ డట, తరి గడవకుఁ గుదురు నాఁకత్రాడట చేరుల్, తరి గంబంబును దానట హరిహరి హరిచిత్రలీల హరిమే యొఱుఁగున్." భాగ. ౮, స్కం. ౨౦౫.

తరిగట్టు = తరిగొండ. (చూ. తరిగట్టుత్రాడు, తరిగట్టుదారి ) [పాం. ని. తిర్య. ౮౦.

తరిగట్టుత్రాడు. ద్వ వి (తరిగట్టు+త్రాడు) శేషుఁడు.

తరిగట్టుదారి. ద్వ. వి. (తరిగట్టు+దారి.) మందరధరుఁడు, విష్ణువు. ఆం. సం. దేవ. ౭.

తరిగడవ ద్వ. వి. (తరి+కడవ.) పెరుఁగు త్రచ్చెడు కడవ, మంథని. భాగ. ౮, స్కం. ౨౦౫.

తరిగాఁడు. ద్వ విణ. (తరి+కాఁడు) త్రచ్చువాఁడు, మథించువాఁడు. భాగ. ౮, స్కం. ౨౦౫.

తరిగొండ. వై. వి. (తరి+కొండ.) కవ్వపుఁగొండ, మందరపర్వతము. "సీ. తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటిచలిఁ దేర్చిరట్టి కచ్ఛపము నీవ." పారి. ౧, ఆ. ౪౯. వరాహ. ౧౦, ఆ. ౧౧౮.

తరిగొఱ్ఱ. ద్వ. వి. (క. తరిగొట్టు.) ఒకదినుసుకూరాకు, విశల్యకశీ. "సీ. తనరు విశల్యయై తరిగొఱ్ఱ చెన్ను చెఱుకుపొత్తి నాఁగ..." ఆం. భా. ద్వి. ౬౮.

తరిగోల. ద్వ. వి. (తరి+కోల) కవ్వము, మంథానము. (శ. ర. బ్రౌ.)

తరిచేట్టు. ద్వ. స. క్రి. (తరి+చుట్టు) (పెరుఁగు దేవతానులకు) నివేదనముచేయుట. (శ. ర.)

తరిటి. జే. వి. కొండుకోనలకు కొండుమూటలుగాఁ గట్టి నడుమ బిగించి యెద్దు మున్నగువాని వీఁపుమీఁద వైచెడి గోనెసంచి (శ. ర.)

తరిటీ = తరిటి. (శ. ర.)

తరిణి. సం. వి. ఈ. స్త్రీ. నౌక.

తరిత. సం. వి. ఆ. స్త్రీ. 1. చూపుడువ్రేలు ; 2. గంజాయిచెట్టు. విణ. (బు. త్రి. బు.) తరించువాఁడు.

తరితీపు. ద్వ. వి. (తరి+తీపు.) 1. ఉపేక్ష. "మ... సరసాలాపసుధారసం బయినఁ గాంతుం గ్రోలఁగా నియ్యవే, తరితీపేల యటంచు రాఘవుఁడు సీతన్ మంచె రాగాంబుధిన్." ఉ. రా. ౬, ఆ. ౫౧; 2. అతిశయము ; 3 మధనమాధుర్యము, తరుచుటచే తనైనమాధుర్యము. "సీ. కులములోఁ దరితీపు గలిగి మించినమేటి..." స్వా. ౫, ఆ. ౪౭. (పైరెండర్థములకు నుదాహరణము) ; 4. మోహము. "సీ. తరితీపుఁ జూపుచి త్తరపుఁజూపులు చూచి..." దశా. ౨, ఆ. ౩౦౪. ప్రబోధ. ౧, ఆ. ౭౫, 5. విలాసము, శృంగారచేష్ట. "చ...ఇష్టపుసరి ప్రాణసఖులు... [illegible] తరితీపులఁ దలకొత్తుఁ జేసెన్." వైజ. ౩, ఆ. ౧౦; 6. తహతహ, తమకము. "గీ. తమకము తహతహ తమి తత్తఱము చిడిముడి తరితీపు త్తలమ్ము చిడిముడిపాటు, నాఁగఁ దనరారు." ఆం. భా. ప్ర. ౧౪౦. ప్రభా. ౫, ఆ. ౪౫ ; 7. అపేక్ష. (శ. ర.) "క...వెండియు దినదినమున దన, దండను వేదండయాన తరితీపుమగల్, కొండుకోన

దుండఁ గన్నులపండువుగాఁ జూచి కామపరవశుఁ డగుచున్." శశాం. ౨, ఆ. ౯౧; 8. ప్రీతి సంతోషము. (చూ. తరితీపుసేయు.); 9. బాధ. "చ...రథాంగదంపతుల్, తెఱఁ గొదవంగఁ బట్టి తరితీపుల బెట్టు మృణాళమో యనన్." విక్ర. ౪, ఆ. ౨౦౪.

తరితీపుసేయు. ద్వ. అ. క్రి. గర్వించు. (శ. ర.) స. క్రి. 1. సంతసింపఁజేయు. "గీ. తాన దోషాత్ము లయినదుష్కవులకతన, గరిమ వహియింపఁ గవిరాజకావ్యమహిమ, బహుళపక్షంబు చీకటి బహుళ మగుటఁ, జాయవెన్నెల తరితీపుసేయుఁ గరణి." పాండు. ౧, ఆ. ౧౪; 2. పీడించు. "ద్వి. పురణించుచుఁ దనపూర్వకర్మంబు, తరువు కాఁడై వెంటఁ దరితీపుసేయ, నిలిచినచోటఁ గాల్ నిలుపంగ లేక, నలిరేఁగి చిత్రాంగినగరి కేతెంచె." ద్వి. శ. సా. ౧, ఆ. ౨౦. పు. ౯౦. రా. ఆర ౧౯౦. పు.

తరిత్రము. సం. వి. ఆ. న. నౌక.

తరిదాల్పు. ద్వ. వి. (తరి+తాల్పు) విష్ణువు. "సీ. తరిదాల్పుపొక్కిటి తమ్మికమ్మరితావి యల్ల నద్దెసలను జల్లి దల్లి." నృసిం. ౧, ఆ. ౫౪.

తరిత్రాడు. ద్వ. వి. (తరి+త్రాడు). మంథరజ్జువు, కవ్వము త్రిప్పుత్రాడు "చ. సురనికరంబు రక్కసులుఁ జుట్టములై యమృతాభిలాష మందరగిరిఁ జిల్వరాచతరిత్రాట బిగించి పయఃపయోధి నిర్భరగతిఁ ద్రచ్చుచో .." పారి. ౩, ఆ. ౫౯. చం. రా. ౩, ఆ. ౬౩.

తరిఫీదుచేయు. వి. (ఉర్దు. తరిబయతు.) అలవఱచుట.

తరియింపే = తరింపే (దాఁటు) "క...అనుపమనోకార్ణవమున, మునిఁగియుం నిజయోగసత్త్వమునఁ దరియించెన్." భాగ. ౩, స్కం. ౧౬౨. మార్క. ౧, ఆ. ౧౮౮.

తరిపట్టు ద్వ. స. క్రి. (తరి+పట్టు) గేవలుపు నుద్దేశించి పెరుఁగును త్రచ్చుట నిలుపు "సీ. తోడఁ గాలితఱపుల విడుతురా తోడిలోడి జన్నులఁ దరిపట్టుజాడ గలదె." ఉ. హరి. ౪, ఆ. ౩౦౮.

తరీషము. సం. వి. ఆ. పుం. 1. నౌక, 2. సముద్రము, 3. పూనిక, కృషి; 4. స్వర్గము, విణ. (అ.అ.అ.) సమర్థము.

**తరుచు.** వై. స. క్రి. (సం. తక్ష. ప్రా. తచ్ఛ) 1. సానఁబెట్టు. (చూ. త్రచ్చు); 2. చిలుకు, మథించు. "చ. వడిగొని వార్ధి నిట్లు దరువం దరుపన్ విష ముద్భవిల్లి .." భార. ఆది. ౨ ఆ. ౧౫, హరి. పూ. ౫, ఆ. ౨౦౩; 3. పరిశీలించు, బాగుగా నాలోచించు. "సీ తరిచి ముప్పదిరెండుతత్త్వంబు లూహించి .." పాండు. ౨ ఆ. ౮. శివరా. ౨, ఆ. ౮౨; 4. రాచు, ఒఱపెట్టు. "క. కర మొప్పఁగ వేనజనేశ్వరు దక్షిణకరతలంబు సంరంభముతోఁ, దరువంగ నరణి మథనస్ఫురితుం డగుజాతవేదుపోలిక యమరన్" హరి. పూ. ౧, ఆ. ౧౦౮ భార. శాం. ౪. ఆ. ౧౫౯.

**తరుణము.** ఉభ. దే. వి. యుక్తకాలము. (వ్యవ.)

తరుణము. సం. వి. అ. పుం; 1. ఆముదపుఁజెట్టు; 2. పొట్టిపువ్వుల ఆముదపుఁజెట్టు. విణ. (అ ఆ అ.) నూతనము, క్రొత్తది.

**తరుణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది, 2. యౌవనము గల ఆఁడుది; 3. చిన్నగోరంట✽. 4. సేపాళము✽. పెద్దజీలకఱ్ఱ; 5. చీడ అనుగంధద్రవ్యము.

**తరుణిమ.** సం: వి. న్. పుం. తరుణత్వము.

**తరుణియ.** వై. వి. (సం. తరుణీ) యౌవనము గలస్త్రీ; స్త్రీ. "చ. తరుణియ లొప్ప నాడిరి ముదంబునఁ దన్ను జనాలి మెచ్చఁగన్." భార ఆది. ౮, ఆ. ౧౫౩. శు సం. ౮. ఆ. ౬౮.

**తరుణుఁడు.** సం. వి అ. పుం. యౌవనవంతుఁడు.

**తరుతూలిక.** సం. వి. అ స్త్రీ. - వృక్షమునం దూఁగు నది—గబ్బిలము.

**తరునఖము.** సం. వి. అ. పుం. ముల్లు, కంటకము.

**తరువు** వై. వి. (తరుచేధా.) తరుచుట మథనము. (చూ. తరుపుఁద్రాడు).

**తరుపుఁద్రాడు.** ద్వి. వి. (తరుపు+త్రాడు) మంథ రజ్జువు, కవ్వము త్రిప్పెడిత్రాడు. "సీ. సర్వసర్వం సహాసంభృతి ప్రకటనుండు ..తరాకస్వామితరుపుఁ ద్రాడు" హర. ౬, ఆ. ౪౦.

**తరుభుక్కు.** సం. వి. జ్. పుం. వృక్షాదని, బదనిక✽

**తరుభుజము.** సం. వి. జ్. పుం.=తరుభుక్కు.

**తరుమృగము.** సం. వి అ. పుం. కోఁతి.

**తరురాగము.** సం. వి. అ. న.-చెట్టు కెఱుపు కలిగించునది- లేఁత చిగురు.

**తరురాజము.** సం. వి అ. పుం. 1. శ్రేష్ఠమైన చెట్టు; [2. తాటిచెట్టు

**తరురుహ.** సం. వి. ఆ. స్త్రీ.-చెట్టుపై మొలచునది - బదనిక ✽.

**తరువల్లి.** సం. వి. ఈ. స్త్రీ. బదనిక. ✽

**తరువాయి.** దే వి. ఔ. 1. అనంతరము, పిమ్మట. "గీ. వినుము తరువాతి కథలు సవిస్తరముగ." నిర్వ. ౪, ఆ. ౧౮. కాశీ. ౨. ఆ. ౧౯౯; 2. మిగిలినభాగము, శేషము. "క. తలఁచి యది యపు డొకింతయుఁ, దొలుకటికరువాయి మఱియుఁ దోఁచక." పరమ. ౨, ఆ. ౧౨౩, వరాహ. ౭, ఆ. ౪౩.

**తరువిడు.** దే. స క్రి. (తరువు+ఇడు) 1. ప్రేరేపించు. "క. ఆవేళ దివిజమురజని, రావము హరి రచితగింపురప్రాంగణరీ, ధీనితతంబై గింజా, వైవాహికకలనమునకు నడిఁ దరువిడిరొయన్." వసు. ౫, ఆ ౧౦౬; 2. తొందరచేయు, (నిర్బంధించు అని సూ. ని.) "వ. అమ్మునిచొంత నున్నపరశురాము విలోకించి నీవైన నీచంచలాక్ష్మిఁ ద్రుంచెదవో లేదో యని యడుగ గడగడ వడంకుచు కేలు మొగిచి మీరు నొడివినవడువున నడంచెద ననినఁ దడవుసేయకు మని తండ్రి తరువిడ..." దశా. ౬, ఆ. ౮౫

**తరువిలాసిని** సం. వి. ఈ. స్త్రీ.-చెట్టునకు విలాసిని వంటిది - నవమల్లిక ✽.

**తరువు.** ఉభ. దే వి. 1. తొందర (చూ. తరువిడు); 2. ప్రోత్సాహము, ప్రేరేపణము. (చూ. తరువిడు); 3. ఈయవలసినదానాదికము లిమ్మని చేయు నిర్బంధము. "చ. హరిదవధిక్షమారమణులాతురగాళినుదుల్లకట్టముల్, తరువులరాయసంబుల విధంబునఁ గన్గొని శ్వేతమానవే, శ్వరునకుఁ దెచ్చి యిచ్చి వసువస్తుపరంపర లెక్కఁగూడుపె, స్వైరసులరీలఁ దత్పవన వీతిఖురాంకము లొప్పె నుర్వరన్" వరాహ. ౧౨, ఆ. ౬౦. ద్వి. పరమ ౬, ఆ. ౪౬౦. ఫు. ౯౫ (ఈయవలసినధనాదికము లిమ్మని) నిర్బంధించువాఁడు. "గీ. తరువు పనిచెను తనదుకింకరుల వారు, సేఁగి ధనము వచ్చుటకునై యుట్టునట్టుఁ, బరుసఁదనములు చూపి తద్విరచితావ, మానులై క్రమ్మఱఁగ వచ్చి మనుజపతికి." పరమ. ౪, ఆ. ౧౪౫. ద్వి. హరిశ్చ. ఊ. ౯౬౦. కం; 2. కావలివాఁడు, "ఊ...కా, మాతురకాలికేకమున జాఱెడిపోకలఁ

తరిగొండ. వై. వి. (తరి+కొండ.) కవ్వపుఁగొండ, మందరపర్వతము. "సీ తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటిచలిఁ దేర్చినట్టి కచ్ఛపము వీవ." పారి. ౧, అ. ౪౯. పరావా. ౧౦, అ. ౧౧౮.

తరిగొట్టు. దృ. వి. (క. తరిగొట్టు.) ఒకదినుసుహూరాకు, విశల్యకి. "సీ తనరు విశల్యయై తరిగొట్టు చెన్ను చెఱకుపాత్తి నాఁగ..." అం. భా. ద్వి. ౬౮.

తరిగోల. ద్వ. వి (తరి+కోల) కవ్వము, మంథానము. (శ. ర. బ్రౌ.)

తరిచేట్టు. ద్వ. స క్రి (తరి+చుట్టు) (పెరుఁగు దేవతానులకు) నివేదనముచేయు. (శ ర.)

తరిటి. దే. వి. రెండుకొనలను రెండుమూటలుగాఁ గట్టి నడుమ బిగించి యెద్దు మున్నగువాని వీఁపుమీఁద వైచెడి గోనెసంచి (శ. ర.)

తరిటీ = తరిటి. (శ. ర.)

తరిణి. సం. వి ఈ స్త్రీ. నౌక.

తరిత. సం. వి. ఆ. స్త్రీ. 1. చూపుడువ్రేలు, 2. గంజాయిచెట్టు. విణ (బు. త్రి. బు.) తరించువాఁడు.

తరిపీపు. ద్వ. వి. (తరి+తీపు.) 1. ఉపేక్ష. "మ... సరసాలాపసుధారసం బయినఁ గాంతం గ్రోలఁగా నియ్యవే, తరిలీ పేల యటంచు రాఘవుఁడు సీతన్ ముంచె రాగాంబుధిన్." ఉ. రా. ౬, అ. ౫౧; 2. అతిశయము, 3 మధనమాధుర్యము, తరుచుటచే కస్వైనమాధుర్యము. "సీ కులముల్లోఁ దరిలీపు గలిగి మించినమేటి..." స్వా. ౫, అ ౪౩. (పైరెండర్థములకు నుదాహరణము); 4. మోహము. "సీ. తరితీపుఁ జూపుటి త్తరంపుఁజూపులు చూచి..." దశా. ౨, అ. ౩౦౪. ప్రబోధ. ౧, అ. ౭౫, 5. విలాసము, శృంగారచేష్ట. "చ...ఇన్నపైఁ ప్రాణసాయకుఁడే మైకుమె మగ సీ సీసిఁ తొగ్గలంపునత్తరితీపులు చేఁ దలకెక్కఁ జేసెనన్." హైజ. 3, అ. ౧౦; 6. తహతహ, తమకము. "గీ. తమకము తహతహ తమి తత్తఱము చిఱిమిండి తరితీపు తత్తలమ్ము చిడి ముడిపాటు, నాఁగఁ దనరారు." ఆం. భా. ప్ర. ౧౪౦. ప్రభా. ౫, అ. ౪౫; 7. ఆపేక్ష. (శ. ర.) "క... పెండియు దినదినమున దన. దండను కేదండదయాన తరితీపునగల్, ఖండుకొన నుండఁ గన్నులపండువుగాఁ జూచి కాముదరవశుఁ డగుచున్." శకుం. ౨, అ. ౯౧; 8. ప్రీతి సంతోషము. (చూ. తరితీపుసేయు.); 9. బాధ. "చ...రథాంగదంపతుల్, తెఱఁ గొదవంగఁ బట్టి తరితీపుల బెట్టు మృణాళమో యనక." విక్ర. ౪, అ. ౨౦౪.

తరితీపుసేయు. ద్వ అ. క్రి. గర్వించు. (శ. ర.) స. క్రి. 1. సంతసింపఁజేయు. "గీ కాన దోహత్తు లయినదువక్కపులకతన, గరిమ పహియించఁ గవిరాజకావ్యమహిమ, బహుళపక్షంబు చీకటి బహుళ మగుటఁ, జాయవెన్నెల తరితీపు సేయుకరణి." పాండు. ౧, అ. ౧౪; 2. పీడించు. "ద్వి. పురణించుచుతు దనపూర్వకర్మంబు, తరువు కాండై పంటఁ దరితీపుసేయ, నిలిచినచోటఁ గాల్ నిలుపంగలేక, నలిరేఁగి చిత్రాంగినగరి కేతెంచె." ద్వి. శ. సా. ౧, అ. ౨౦. పు. రం. రా. అర ౧౯౦. పు.

తరిత్రము. సం. వి. అ. న. నౌక.

తరిదాల్పు. ద్వ. వి. (తరి+తాల్పు) విష్ణువు. "సీ. తరి దాల్పుపొక్కిటి తమ్మికమ్మనితావి యల్ల నల్లనలను జల్లి చల్లి." నృసిం. ౧, అ. ౫౪.

తరిత్రాడు. ద్వ. వి (తరి+త్రాడు). మంథరజ్జువు, కవ్వము త్రిప్పుత్రాడు "చ. సురనికరంబు రక్కసులు జట్టమలై యమృతాభిలాష మందరగిరిఁ బిల్వరాచతరిత్రాట బిగించి పయఃపయోధి నిర్భర గతిఁ ద్రచ్చుచో..." పారి. 3, అ. ౫౯. చం. రా. 3, అ. ౬3.

తరిఫీదు=ఉ. వి. (ఉర్దూ. తరిబయతు.) అలవఱుచుట.

తరియించు = తరించు (దాఁటు) "క...అనుపమనోకార్ణవమున, మునిగియుం నిజయోగసత్వమునఁ దెరింఁచెన్." భాగ. 3, స్కం. ౧౬౨. మార్క. ౧, అ. ౧౮౮.

తరిపట్టు ద్వ. స. క్రి (తరి+పట్టు) దేవులనుద్దేశించి పెరుఁగుతు త్రచ్చుక నిలుపు "సీ. తోడఁ గాలికఱపుల విడుకురా తోడితోడి జక్కులఁ దరిపట్టుజాడ గలజ." ఉ. హరి. ౪, అ. ౩౦౮.

తరీషము. సం. వి. అ. పుం. 1. నౌక, 2. సముద్రము, 3. భూనిక, కృషి; 4. స్వర్గము, విణ. (అ.అ.అ.) సమర్థము.

**తరుచు.** వై. స. క్రి. (సం. తక్ష్. ప్రా. తచ్ఛ) 1. సాన(బెట్టు. (చూ. త్రచ్చు); 2. చిలుకు,మథించు. "చ. వడిగొని వార్ధి నిట్లు దరువం దరుపన్ విష ముద్భవిల్లి .." భార. ఆది. ౨ ఆ. ౧౫, హరి. పూ. ౫, ఆ. ౨౦౩; 3. పరిశీలించు, బాగుగా నాలోచించు. "సీ తరిచి మున్పది రెండుత త్త్వంబు లూహించి .." పాండు. ౨ ఆ. ౮. శివరా. ౨, ఆ. ౮౨, 4. రాచు, ఒఱపెట్టు. "క. కర మొప్ప(గ వనజనేత్రుఁడు దక్షిణకరతలంబు సం రంభముతోఁ, దరువంగ వరణి మథన స్ఫురితుం డగుజాతవేదుపోలిక యమరన్" హరి. పూ. ౧, ఆ. ౧౦౮ భార. శాం. ౪. ఆ. ౧౫౯.

**తరుణము.** ఉభ. దే. వి. యుక్తకాలము. (వ్యవ.) తరుణము. సం. వి. అ. పుం; 1. ఆముదపుఁజెట్టు; 2. పొట్టిపువ్వుల ఆముదపుఁజెట్టు. విణ. (అ ఆ అ.) నూతనము, క్రొత్తది.

**తరుణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది, 2. యౌవనము గల ఆఁడుది; 3. పిన్నగోరంట౹. 4. నేపాళము౹. పెద్దజీలకఱ్ఱ; 5 చీడ అను గంధద్రవ్యము.

**తరుణిమ.** సం. వి. న్. పుం. తరుణత్వము.

**తరుణియ.** వై. వి. (సం. తరుణీ) యౌవనము గలస్త్రీ; స్త్రీ. "చ. తరుణియ లొప్ప నాఁడిరి ముదంబునఁ దన్ను జనాలి మెచ్చఁగన్." భార. ఆది. ౮, ఆ. ౧౫౩. కు సం. ౮. ఆ. ౬౮.

**తరుణుఁడు.** సం. వి అ. పుం. యౌవనవంతుఁడు.

**తరుతూలిక.** సం. వి. ఆ. స్త్రీ. - వృక్షమునం దూఁగు నది—గబ్బిలము.

**తరునఖము.** సం. వి. అ. పుం. ముల్లు, కంటకము.

**తరుపు** వై. వి. (తరుచు ధా.) తరుచుట మథనము. (చూ. తరుపుఁద్రాడు).

**తరుపుఁద్రాడు.** వ్య. వి. (తరుపు+త్రాడు) మంథ రజ్జువు, కవ్వము త్రిప్పెడిత్రాడు. "సీ. సర్వసర్వం సహాసంభృతిప్రపణుండు ...కాకస్వామితరుపుఁ ద్రాడు" హర. ౬, ఆ. ౪౦.

**తరుభుక్కు.** సం. వి. క్. పుం. వృక్షాదని, బదనిక౹

**తరుభుజము.** సం. వి. క్. పుం.=తరుభుక్కు.

**తరుమృగము.** సం. వి అ. పుం. కోఁతి.

**తరురాగము.** సం. వి. అ. న.-చెట్ల కొఱుపు కలిగించునది- లేతచిగురు. [2. తాటిచెట్టు

**తరురాజము.** సం. వి అ. పుం. 1. శ్రేష్ఠమైన చెట్టు;

**తరురుహ.** సం. వి. ఆ. స్త్రీ.-చెట్టుపై మొలచునది - బదనిక ౹.

**తరువల్లి.** సం. వి. ఈ. స్త్రీ. బదనిక. ౹

**తరువాయి.** దే వి. ఔ. 1. అనంతరము, పిమ్మట. "గీ. వినుము తరువాతి కథలు సవిస్తరముగ." నిర్వ. ౪, ఆ. ౧౮. కాశీ. ౨ ఆ. ౧౧౯; 2. మిగిలినభాగము, శేషము. "క. తలఁచి యది యపు డొకింతయుఁ, దొలుతటితరువాయి మఱియుఁ దోఁచక." పరమ. ౨, ఆ. ౧౬౩, వరాహ. ౭, ఆ. ౪౩.

**తరువిడు.** దే. స క్రి. (తరువు+ఇడు) 1. ప్రేరే పించు. "క. ఆవేళ దివిజమురజని, రావము హరి రచితగింపురప్రాంగణవీ, థీవితతంబై గింజా, వైవా హికకలనమునకు నడిఁ దరువిడియెన్." వసు. ౫, ఆ ౧౦౬; 2. తొందరచేయు, (నిర్బంధించు అని యూ. ని.) "వ. అమ్మునిచెంత నున్నపరశురాము విలోకించి నీవైన నీచంచలాత్మఁ ద్రుంచెదవో లేదో యని యడుగ గడగడ వడంకుచు కేలు మొగిచి మీరు నోడిచినవడువున నడచెద ననినఁ దడవుసేయకు మని తండ్రి తరువిడ..." దశా. ౬, ఆ. ౭౫

**తరువిలాసిని** సం. వి. ఈ. స్త్రీ.-చెట్టునకు విలాసిని వంటిది - నవమల్లిక ౹.

**తరువు.** ఉభ. దే వి. 1. తొందర (చూ. తరువిడు); 2. ప్రోత్సాహము, ప్రేరేపణము. (చూ. తరు విడు); 3. ఈయవలసినదానాదికము లిమ్మని చేయు నిర్బంధము. "చ. హరిదవధిక్షమారమణు లాతుర గాలినుదుర్లక్ష్యట్టముల్, తరువులరాయ సంబుల విధంబునఁ గన్గొని శ్వేతమానవే, శ్వరు నకుఁ దెచ్చి యిచ్చి వసువస్తుపరంపర లెక్కఁ గూడుపె, శ్వేరసులరీతిఁ దత్సవన వీతిఖురాంకము లొప్ప నుర్వరన్" పరాహ. ౧౨, ఆ. ౬౦. ద్వి. పరమ ౬, ఆ. ౪౬౦. వు. ౯౫ (ఈయ వలసినధనాదికము లిమ్మని) నిర్బంధించువాఁడు. "గీ. తరువు పనిచెను తనదుకింకరుల వారు, సేఁగి ధనము వచ్చుటకునై యుట్టునట్టుఁ, బదుసేదన ములు చూపి తద్విరచితావ, మానులై క్రమ్మఱఁగ వచ్చి మనుజపతికి." పరమ. ౪, ఆ. ౧౪౫. ద్వి. హరిశ్చ. ఉ. ౯౬౦. వు; 2. కావలివాఁడు, "ఉ...కా, మాతురతాలికేతమున నాఁడిపోకలఁ

బోవఁ జూచినన్, వే తరు వుండి పట్టుకొన నీరజ గర్భునకైన శక్యమే." వేం పంచ. ౪, ఆ. ౪౩౯. వైజ. ౩, ఆ. ౧౦; 3. బాధకము; బాధించువాఁడు, "క. కొరవులె కొఱవులు కేసర, తరువులె తరువులు సమీరతరు కాదరముల్ దరముల్ కలశాగరములు, గరములు మనమంటవిరహాకాంతల కబలా." రా. వి. ౩, ఆ. ౧౧౧. సం. వి. ఉ. పుం వృక్షము, చెట్టు

తరువుకత్తె. దే. విశే. (తరువు+కత్తె) (ఇయ్యవలసిన ధనాదికము నిమ్మని నిర్బంధించునది. "ఉ.. గాటపుకాంక్ష యర్క తరువుకత్తెమదిక్ ద్వరసేయ నల్లనక్, మీటిన మ్రోఁకుం బీణెవలెమించు నెలుంగున భర్తతో ననున్." ఉ రా ౬, ఆ. ౧౯౭.

తరువుకాఁడు. దే విశే. (తరువు+కాఁడు.) (ఇయ్యవలసినధనాదికము నిమ్మని నిర్బంధించువాఁడు. "గీ. వెఱఁగునొందుచుఁ దనమీఁది తరువుకాండ్ర,జూచి యెంతచేసిన నిందు సొమ్ము లేదు, రండు కంచికి మీరు మీద్రవ్య మిత్తునగధరుని యాన యని వారి నమ్మఁ బలికి." పరమ ౪, ఆ. ౧౬౮. వైజ. ౨, ఆ. ౧౪౩.

తరువుసేయు. ద్వే స. క్రి. (తరువు+చేయు) పురికొల్పు, ప్రేరేపించు. "చ. చెలఁపుని వెంటఁ బోఁ దరువుసేయు మనోజునిమాట..." కువల. ౪, ఆ. ౫౪. సా. ౩, ఆ. ౧౩౮.

తర్కము. సం. వి. అ. పుం. 1. కాంక్ష, కోరిక; 2. విచారణ, 3. న్యాయశాస్త్రము; 4. మీమాంసాశాస్త్రము; 5. కారణము, 6. అర్థవాదము; 7. వాదము, కలహము. "ఉ... కల్వచెల్వము చూచి వానిలోఁ, దర్కము పెట్టఁ బూనిన విధంబున సొక్కవ నిక్కెఁ జొక్కలున్." ద్వా. ౮, ఆ. ౯౧.

తర్కి. సం. విశే. (న్. ఈ. న్) 1. తర్కించువాఁడు; 2. తర్కశాస్త్రజ్ఞుఁడు.

తర్కించు. సం. స క్రి. 1. తర్కముచేయు, ఊహించు. "మ.. మనలో దృష్టించి యెవ్వాఁడు దొంగవిధం బొప్పఁగఁ ద్రవ్వి చేకొనియెనో కాంచఁ దర్కించుచుక్." ద్వా. ౯, ఆ. ౧౨౦ మార్క. పీఠి. ౧౬; 2. కలపోయు. "మ .. నృహరీ తర్కింతు నిక్కపుడున్." చంద్రా. ౧, ఆ. ౭౮.

తర్కితము. సం. వి. అ. న. తర్కము, ఊహ. విశే. (అ. ఆ. అ.) 1. పరిశీలింపఁబడినది; 2 ఊహింపఁబడినది.

తర్చు = తఱచు. (బహుళము) "క. గ్రామగ్రామంబున నొక,సామంతుని కిడినచలువచప్పరములు తర్చై .." ఆము. ౨, ఆ. ౬౫.

తర్జకుఁడు సం. విశే. (అ. ర్జికా. అ) = తర్జయిత.

తర్జన. సం. వి. ఆ. స్త్రీ. = తర్జనము.

తర్జనము. సం వి. అ. న. 1. బెదరింపు, అదలుపు; 2. బెదరించుటకు చూపుడువ్రే లల్లలాడించుట.

తర్జని. సం వి. ఈ. స్త్రీ. చూపుడువ్రేలు, ప్రదేశిని.

తర్జయిత. సం విశే. (ఋ త్రీ. ఋ.) బెదరించువాఁడు, అదల్చువాఁడు.

తర్జించు. సం. స. క్రి. బెదరించు, అదల్చు. "మ. హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప నుత్కర్ణుఁడై యెందును లేఁడు లేఁ డని సుతున్ దైత్యుండు దర్జింప..." భాగ. ౭. స్కం. ౨౭౭. రం. రా. ౧౮౪. పు.

తర్జితము. సం. వి. అ న. బెదరింపు, అదలుపు. విశే (అ. ఆ. అ.) బెదరింపఁబడినది.

తర్ణకము. సం. = తర్ణము.

తర్ణము. సం. వి. అ. పుం దూడ, అప్పుడు పుట్టినదూడ.

తర్పకుఁడు. సం. విశే (అ ఆ అ.) 1. తృప్తిపడువాఁడు, 2. తృప్తినొందించువాఁడు.

తర్పణ. సం. వి. ఆ. స్త్రీ. = తర్పణము.

తర్పణము. సం. వి. అ. న. 1. సంతోషపెట్టుట; 2. తృప్తి; 3 పితృయజ్ఞము, 4. సమిధ. విశే. (అ. ఆ. అ.) తృప్తి కలిగించునది.

తర్పయిత. సం. విశే (ఋ. త్రీ. ఋ )=తర్పకుఁడు

తర్పిత. సం. = తర్పయిత.

తర్పితుఁడు. సం. విశే (అ. ఆ. అ.) సంతోషపెట్టఁబడినవాఁడు

తర్పటము సం వి అ. పుం. 1. సంవత్సరము, 2. చక్రమర్దిము, తగిరిస.

తర్షకుఁడు. సం విశే (అ. ర్షిక . అ) 1. దప్పిగొనువాఁడు; 2. దప్పి కలిగించువాఁడు, 3. ఆసగొనువాఁడు; 4. ఆస కలిగించువాఁడు.

తర్షణము. సం. వి. అ. న. 1 దప్పి; 2. ఇచ్ఛ, ఆశ.

తర్షము సం. వి. అ. పుం. 1. దప్పి; 2. ఇచ్ఛ, ఆశ; 3. సముద్రము; 4. పడవ.

తర్షయిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. దప్పి కలిగించువాఁడు; 2. ఆస కల్గించువాఁడు.

తర్షిత. సం. = తర్షయిత.

తర్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) 1. దప్పిగొన్నవాఁడు; 2. ఆశ కలవాఁడు.

తఱఁకించు. దే. స. క్రి. (తఱఁగు ధా ప్రే.) పోఁగొట్టు. "సీ. దరహాసరుచిమోవి తళుకించుఁ దఱఁకించు విధుకరిహాసోక్తి వెరవుఁ బోరవు." కు. సం. ౯, ఆ. ౧౪౬.

తఱఁగు. దే. అ. క్రి. (ఈపద మొక్కకుమారసంభవమునందే కానఁబడుచున్నది) 1. పర్వు, వ్యాపించు. "గీ. ఓలిఁ దాంబూలవల్లీకమాలసేల, భాతి దఱఁకంగఁ బరిపక్వపనసపూగ, భాసురారుణ ద్యుతులు..." కు. సం. ౭. ఆ. ౯౮. కు. సం. ౯, ఆ. ౯౧; 2. తగ్గు. "ఉ. చారునిశీథినీ విమలసాంద్రసుధాకరభాతి రోదసీ, పూరితమై దినంబుల నభోమణిదీప్తిఁ దఱఁగ కిమ్ముగాఁ, బేరి ఘనీభవించె ననఁ బెల్లెసఁగెఁ బిత మేఘమాంసము కేరుమాకాశసంహతులు గ్రిక్కిరిసెన్ శరదాగమంబునన్." కు. సం. ౬, ఆ. ౧౧౬. కు. సం. ౭, ఆ. ౬౫. స. క్రి. వీడు, వదలు. "ఆ... ఉగ్రయోధవరులు గురిసి రురువడి శస్త్రాస్త్రవృష్టి నమరవరులు వీకు దఱఁగ." కు సం. ౧౨, ఆ. ౨౭. కు సం. ౯, ఆ. ౬౪.

తఱక. దే. వి 1. పొల్లుధాన్యము, "క. తఱకల చొప్పయు చాలున్, మఱదియుఁ దలపోలము దిక్కు మసలెడికునికిన్..." భా॰ ౪, ఆ. ౭౧౧; 2. గఱుకుతనము, విషమత్వము. చూ. (తఱతఱకలువాఱు.)

తఱచు. దే. వి. (త. తఱచు) (దీని కున్నర్థ్యముగను ప్రయోగములు కన్పట్టుచున్నవి.) 1. సాంద్రత, చిక్కన, "సీ...తూఱరానితఱచుతో నభమున భూరితరమహాంధకార మడరె." కు. సం. ౮, ఆ. ౯౭. భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౧; 2. బాహుళ్యము. "క. అఱిముఱి నదరినరథికుల, తఱచు నకు సుభద్రకొడుకు దలఁకక..." భార. భీష్మ. ౨, ఆ. ౮౮; 3. అతిశయము; "సీ శస్త్రాస్త్రములు రథ్యసారథివర్మాంగతతి నాఁటుతఱచునఁ దల్లడిలక." భార విరా. ౪, ఆ. ౬౨. విణ. 1. సాంద్రము. "క. మెఱసి యుద్ధయించు గ్రహములు, తఱచు ప్రభలఁ గ్రేణి కేసి..." భార. విరా. ౪, ఆ. ౧౧౪. కాశ. ౧, ఆ. ౫౩; 2. బహుళము. "క. రథములు తఱచై చెలువగు, పృథుసైన్యముతోడ .." భార. భీష్మ. ౧, ఆ. ౯౧; 3. అధికము, "క. ఊఱ వగుచారుగపుటలు, గొఱియలపాడియును దఱచగు బఱువులకు..." భార. అర. ౪, ఆ. ౨౯౫. స్వా 3, ఆ. ౮౪, క్రి. విణ. 1. సాంద్రముగా, "క. మెఱుఁగారు వారసమ్ములు, దఱదుగ నించిరిఁ గడంగి తద్గాత్రమునన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౦; 2. అధికముగా, "క. పసిగొనుచు మేయ వచ్చిన, పసిఁ గొనుచుం గోలుపులులుం బలిసెన్ నృప నీ, యసి యాడు తేని యచ్చట. నసియాడం దఱచు వెఱచు నఱచుం బఱచున్." రామా. ౨, ఆ. ౧౩. ఉ. రా. 3, ఆ. ౨౧౫; 3. ప్రాయికముగా, "మ... తఱచెందుఁ దల్లిబడిలో ల్చెట్టాటమే కామహిన్." ఆము. ౫, ఆ. ౧౩౨.

తఱచుఁదనము. దే వి. (తఱచు+తనము) సాంద్రత్వము. "ఆ. కఱుకుఁదనముఁ జాలఁ దఱచుఁదనంబును...కినలయాధర కొప్పు..." పాండు. 3, ఆ. ౨౦౧.

తఱటు. దే. స. క్రి. కొరడాతో కొట్టు. (శ. ర.) వి. కశ, కొరడా. "వ. మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాదరించుపురుషుని నసి పత్త్రవనంబునందు యమకింకరులు తఱట్ల నడుచుచుఁ బరిహసించుచుం దోలుచుండ..." భాగ. ౫, స్కం ౨, ఆ. ౧౪౨. అం. భా. ద్వి. ౧౯౯. విణ. మూర్ఖము. (శ. ర.)

తఱటుగొను. దే. స. క్రి. (తఱటు+కొను.) కశతోఁ గొట్టు. (శ. ర బ్రా.)

తఱటుచేయు. దే. స. క్రి. (తఱటు+చేయు) కశతోఁ గొట్టు. "ఉ. చేసిన సూతుఁడుం బదనుచేసిన రథ్యము లామొగంబుగాఁ, జేసి బళీ యనం దఱటు చేసినవాఁడును బర్వ..." కళ. ౫, ఆ. ౧౭౦. పాండు. ౧, ఆ. ౧౬౩. స్వా. ౪, ఆ. ౧౧౫.

తఱతఱ దే. వి. తత్తఱ, తొందర. (శ. ర. బ్రా.)

తఱతఱకలు. దే. వి. బ. (తఱకలు+తఱకలు) మిక్కిలి గఱుకుతనము. (చూ. తఱతఱకలువాఱు.)

తఱతఱకలువాఱు. దే అ. క్రి. (తఱతఱకలు+వాఱు) గొగ్గియగు, నిమ్మొన్నతమగు. "క.

విఱుగుట గానక కెరయం౹దఱతఱకలువాఱఁ గొంత తడ వది గొఱికెన్... " వేం. పంచ. ౪, ఆ. ౫౪౦.

**తఱతఱలాడు.** దే అ. క్రి. (తఱతఱం+ఆడు.) తత్తఱపడు వ్యవ. వాఁడామాట విని తఱతఱలాడుచున్నాఁడు. (శ. ర.)

**తఱపి.** దే. వి. 1. కొదమ, పిల్ల. "సీ. మెఱపులో వజ్రంపుటొఱపులో శశిరేఖతఱపులో యీ వటూత్తమునికొఱలు..." పాండు. ౪, ఆ. ౨౮౭; 2. వత్సతరము, ముదురుదూడ; వత్సతరి. "గీ ఎదిరికొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె,తఱపు లను బొమ్ముచును .." నీలా. ౨, ఆ. ౪౩. "సీ...తఱపి సాఁగను వత్సతరి దనర్చు." ఆం. భా. ద్వి. ౨౬౩. విశ. ముదురు. "సీ తఱపి వెన్నెలలోనిధావళ్య మొకకొంత..." కాశీ. ౧, ఆ. ౧౨౩. భీమ. ౨, ఆ, ౪౬.

**తఱపియావు.** దే. వి. (తఱపి+ఆవు) బక్కయణి, చిరకాలముక్రితమే యీనినఆవు "గీ. అమరు బక్కయణి తఱపియా వనంగ." ఆం. భా. ద్వి. ౨౬౪.

**తఱలు** = తరలు. 1. (చలించు) "చ. ఒఱగె వసుంధరాస్థలి మహోరగనాథుఁడుఁ గ్రుంగెఁ గూర్మముం,దఱలె .." భా రా. యు. ౧౨౨౫; 2. (విడుచు.) "ద్వి. తఱలకు ధైర్యంబు .." ద్వి. పారిశ్ర ఉ. ౭౬౪. పం.

**తఱి.** యు దే. వి. 1. సమయము; యుక్తకాలము. "క. వినుము తఱి వేచి రిపుమూఁపుల మోవఁగ వలయుం సమయముం గనుఁగొను క్రక్కునఁ గడవ కీలాస్థలి పైఁబడచాడ్పున చేర్చు మెఱయుఁ జెఱుచుట యొప్పున్." భార. శాం. 3, ఆ. ౨౭౧. భార. అది. ౬, ఆ. ౧౧౪. స్వా. ౨, ఆ. ౩౩, 2. అవకాశము "చ ..సుస్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దఱి లేమి .." విక్ర. ౧, ఆ ౭౧. పారి ౫, ఆ. ౩౧; 3. అనంతరము, పిమ్మట. "ద్వి. అనుటయుఁ జంద్రబింబాస్య సీతార్మిళనయుల జిద్దఱతఱిఁ బుట్టువాఁడు" రం. రా. ఉ. ౧౮. పు; 4. త్రాడు మున్నగువానియొత్తుడువలనఁ గలిగినరేఖ "చ... తీఁగచుట్టు కూత్తఱు లయి యున్నపాదు తఱి త్రాటిమలంకల..." కాశీ. ౫, ఆ. ౨౮౪. రా. వి. ౪, ఆ. ౨౭; 5. తరంగము, అల. "చ. పఱలుంజటాటవిం గుసుమవల్లరులై చదలేటిసీటితు, త్తఱుల జనించుక్రొన్నురువుతండములై......" నృసిం. పీఠి. ౪. ౫. పఱలు. కడుపుమీఁదిమడుతలు, ముడుతలు. "ఉ ..ముత్తఱుల్, తగ్గక యొప్పఁ గోమలికిఁ దత్సమయోచితయౌవనం బునన్." సుద. ౪, ఆ. ౮౮. వసు. ౫, ఆ. ౭౫. వై. వి. (సం. తరసమ్) మాంసము. "శా. ప్రవ్వుల్ గారుచు నీచుకంపుతఱచున్ రోఁతై తఱిం బాసి .." మల్లభూ. నీతి. ౯.

**తఱఁదఱి.** దే క్రి. విశ. ద్రు. వెన్వెంట. "క. తఱఁ దఱి నిను లోనదచక, పిఱుఁదెక్కినరుదులు దమము బిట్టడరుదు ని,వ్వెఱ నిండ్లలోన డాఁగిన, తెఱ గున నుద్దీపదీపదీప్తులు వెలిఁగెన్." కు. సం. ౮, ఆ ౯౫. పద్మ. 3, ఆ. ౨3.

**తఱిగించు.** దే. స. క్రి. (తఱుగుధా. ప్రే.) తగ్గించు. "సీ. తఱిగించు బుద్ధి ని,ద్రామహోత్సాహతుధాకారతేజోబలాది కెద్ది. గీ. అట్టి చింతాజ్వరంబు నన్నలమికొనియె." కాశీ. ౧, ఆ. ౧౧౧. చంద్రా. 3, ఆ. ౮౨.

**తఱిగివచ్చు.** దే. అ. క్రి. (తఱుగు+వచ్చు) తగ్గు, "సీ. అత్యంతదుర్భిక్షమై దేశములు నొచ్చె ధారణ లెంకయుఁ దఱిగి వచ్చె." వి. పు. ౬, ఆ. 3౧౫.

**తఱిగొను** దే. అ. క్రి. (తఱి+కొను) యత్నించు, పూను. "క. అఱువదికోటులు కపివరులఱిక జగత్త్రయముఁ బెలుచ నువ్వెత్తుగొనన్, తఱిగొన్నయట్లు నడవఁగ, కెఱలి కుముదుఁ డరుగుదెంచి నృపవరుఁ గనియెన్." భార. అర. ౭, ఆ 3౬. పారి. ౫, ఆ. 3౧.

**తఱిగొల్పు** దే. స. క్రి. (తఱిగొనుధా. ప్రే.) పూనఁ జేయు. "క చెఱిచినది గన్న తెఱఁగున, మఱచిన తొలుబాము లెల్ల మదిఁ గని విష్ణున్, దఱిగొల్పెదు యోగస్థితి, తెఱఁ గంతయుం బుద్ధిశిం బ్రతీతం బైనన్." పారి. పూ. ౨, ఆ. ౨౨౫

**తఱిద్రొక్కు.** దే. అ క్రి. (తఱి+త్రొక్కు) (మరణకాలము) సమీపించు, "సీ తఱిద్రొక్కి యున్న యీశల్లిదండ్రులఁ జాల పఱచ వై సంతోషపఱచవైతి." పాండు. 3, ఆ. 3౬.

**తఱిపి**=తఱపి. (వి. ముదురుదూడ) 'సీ నీళ్లల కేటి లోనికి డిగ్గఁగాఁ బెద్దతఱిపివెయ్యలఁ బట్టి నుఱిసి

ఱేఁడు." హరి. పూ. ౬, ఆ. ౯. (విశే. ముదురు.) "సీ. తఱిపెవెన్నెలవేఁడి తలఁకించుఁ గలికి నీయధరాధరామృతం బానవిమ్ము." కృ. శతం. ౨, ఆ. ౧౩౩.

తఱిమించు. దే. స. క్రి. (తఱుముధా. ప్రే.) పలాయితులఁ జేయు. "సీ. ప్రతిఘటించిన కొంతబలవంతులను బటాపంచగాఁ దఱిమించు ప్రాభవంబు" దశా. ౫, ఆ. ౪౧.

తఱిమెన. దే. వి. కత్తి లోనగువానిని నునుపుచేయుటకును, వానిమీఁద నకిషీపని చేయుటకును వడ్రంగు లుపయోగించుసాధనవిశేషము. "సీ. దారునిర్మథనసాధనవిశేషము త్రోపు దనఁ దఱిమెన యన నలరుచుండు." ఆం. భా. ద్వి. ౩౦౧. కళా. ౨, ఆ. ౧౫; 2. పట్టుకాఱు, "సీ. తఱిమెన సంధించి మెఱవిన క్రియఁ దటద్రుమకోటు లున్మూలితములు గాఁగ." భో. ౭, ఆ. ౪౪.

తఱిమెనఁబెట్టు. దే. స. క్రి. (తఱిమెనన్+పెట్టు.) తఱిమెనతో నునుపుచేయు. తఱిమెనతో నకిషీపని చేయు. (శ. ర.)

తఱిమెనదొడ్డి. దే. వి. తఱిమెనఁబెట్టుట కుపయోగించుసాధనవిశేషము. (బ్రౌ.)

తఱియఁజొచ్చు. ద్వ. స. క్రి. (తఱియన్+చొచ్చు.) 1. ప్రవేశించు. "మ. మఱియుం జీకటికొండ చందమయినన్ మా కెల్లఁ బాతాళముం, దఱియం జొచ్చు తెఱంగు దోఁచె నవటన్ .." ఉ. హరి. ౨, ఆ. ౪౯, ఉ. రా. ౪, ఆ. ౩౭; 2. దాఁటు, అతిక్రమించు. "గీ...గోపురంబు, దఱియఁ జొచ్చి మహోన్నతగరుడకేతు, రాజ నలరారు హరిశాతారంబుఁ జేరి." ఉ. రా. ౧, ఆ. ౩౧౬; 3. ఎదుర్కొను, ప్రతిఘటించు. "గీ. అతఁడు ఫల్గును సేఁబది శితశరముల, నేసి పేర్చినఁ గౌరవులెల్ల నార్వ నుఱక యాతఁడు గురుపైఁ దఱియఁ జొచ్చె." భార. భీష్మ. ౩, ఆ. ౩౭.

తఱియఁబడు. వై. అ. క్రి. (తఱియన్+పడు) 1. ప్రవేశించు. "వ...మృగయుండు బిస యొడ్డి సంఘటించిన కానికోపులకు బడి పెగడక యద్దారు పీద్చుకొని యారములఁ దఱియంబడి..." స్వా. ౪, ఆ. ౩౭; 2. తెగించు, సాహసించు. "ఉ. అట్టిద రైనవాఁడ తఱియంబడి మూర్ఖతనంబు సేయరే..." భార. విరా. ౪, ఆ. ౨౩౩. (చూ. ౨౩౨.) కువల. ౨, ఆ. ౧౩౩.

యు. వై. అ. క్రి. (సం. తర్.) 1. తొలఁగు. "సీ. అది ధృతి యనుమహాప్రదమున కోర్కిఁ దమము రజస్సును దఱియఁ ద్రోచి, కొనుచు సత్యము నూఁతగొని చొచ్చి..." భార. అను. ౪, ఆ. ౨౪౧; 2. కూడు, కలియు. "గీ. మెఱపు మెఱసినచాడ్పునఁ దఱియఁ గొఱుము." భార. విరా. ౫, ఆ. ౧౬, స్వా. ౫, ఆ. ౭౧. స. క్రి. 1. సమీపించు. "గీ. ఇలకుఁ జనియెదునవ్భుతాంబుకళలఁ బోలి, తఱిసి రా రామ లోకనవోద్యానసీమ." సుద. ౫, ఆ. ౨౨, స్వా. ౨, ఆ. ౨౩; 2. దాఁటు, తరించు. "సీ. ఉగ్రంబు లైనయా యుంధముల మొనలపై నుఱుకుట యంభోధిఁ దఱిసి చనుట" భార. అర. ౬, ఆ. ౧౧౧. భార. ఆది. ౧, ఆ. ౧౯; 3. ప్రవేశించు. "గీ ..మధుకైటభారి, రత్నసోపానకలితమార్గముల డిగ్గి, కులసలిలముఁ దాను వేలుపుఁగొలను దఱిసె." హరి. ౪, ఆ. ౨౭, వరాహ. ౧౨, ఆ. ౩౨; 4. మార్కొను. "సీ. అఖిలమైత్రాల నడగి పాండవసేనఁ దఱిసి మందాకినీతనయుఁ డేచి." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౮. భార. విరా. 3, ఆ. ౧౮౦; 5. పరిశీలించు, విమర్శించు. "సీ. తఱియుం సధర్మవేదశిరః ప్రపంచంబు లారణ్యకముల్లోన లరసి చూచు." కాశీ. ౨, ఆ. ౧౫౧.

తఱివడు. ద్వ. అ. క్రి. (తఱి+పడు) ఒత్తుడుపడు, నొక్కుపడు. "సీ. గూనిబీ పులమీఁద గోడిరై బోటెత్తి తఱివడ్డకంకాళఖండములును" కాశీ. 3, ఆ. ౧౩౮.

తఱుగరి. దే. విశే. (తఱుగు+అరి) క్రయవిక్రయములు గుదిర్చి అందులకై ప్రతిఫలముగా ద్రవ్యము గొనువాఁడు. "సీ. జట్టికాఁ డనఁగను జనుఁ గ్రేత తఱుగరి యనఁగను దత్సహాయాఖ్య యగును." ఆం. భా. కృ. ౧౧.

తఱుగాడు. దే. వి. (తఱుగు+ఆడు) కొయగూర (శ. ర.)

తఱుగు. దే. అ. క్రి. తగ్గు, క్షీణించు. "చ. తఱుగక నే మెలఁగినను దామరకంటికి మోముఁదమ్మితో, సాటిఁ దొవరంగు బొం గిడెడునీటరి సాటి యటంచుఁ బల్కఁగా, నుఱియలు లోఁగ వైరియుఁక నుండఁగ నీతము గా దటంచుఁ దానఱవఱ లరయ్యఁ జెమ్మట నొయారపుఁగస్తురిబొట్టు మోము వస్." కాళిందీ. ౨, ఆ. ౯, ఆం. భా. కృ. ౯౬.

స. క్రి. 1. ఖండించు, కోయు. "సీ. తఱిగె కావ్వఁడు ఖడ్గధారాంచలంబున నగ్నిచాలుక లేడు నంటఁ బట్టి." కాశీ. 3, ఆ. 3౨, హర. ౨, ఆ. ౯౨౧; 2. తొలుచు, చిల్లిపొడుచు. (వ్యా. కఱవు.) వి. అమ్మెడువానికిని కొనెడివానికిని నొక సరకును వెలఁ గుదిర్చి వారియొద్ద ప్రతిఫలముగా నూటికింత యని పుచ్చుకొను ద్రవ్యము. "సీ. కేళ్ల మాదు లమర్చి విమతైద్యల వహించి తఱుగుబేర ముల సొతయును మించి" శుక. 3, ఆ. 3౭౫. చంద్రా. ౪, ఆ. ౨౭౯. విణ. తఱుగరి, అమ్మెడు వానికిని కొనెడువానికిని బేరము కుదిర్చి అందుకు ద్రవ్యము పుచ్చుకొనువాఁడు. "మ...తద్ఘన కర్పూరపటంబు లందుకొని వేడ్కం గోరక ప్ర్యూహామో, హానముక్తావలిఁ దార్చి నీకఱుగుగా దృష్టాక్షి వీక్షించితే." వసు. 3, ఆ. ౧౪౨.

తఱుచే = తఱమే. ('తఱమే' ఉన్మధ్యముగాఁ గూడఁ గలదనుట కుదాహరణము లు.) వి. (బాహుళ్యము). "గీ. ఈడుము గరిమిడికొక్షుఁ దండడియుఁ వెల్ల,రొలుక కల్లెల్ల తఱుచును సేమిచెప్ప." స్వా. ౪,ఆ ౨౫. భీమ. 3, ఆ. ౫౭. విణ. (సాంద్రత.) "ఆ యోధవరుల నెల్ల నుఱకతఱుచు,టంపవానఁదడిసి..." భార. భీష్మ. ౪, ఆ. ౧౪౯. ఆము. ౨, ఆ. ౬౯. (అధికము.) "సీ. అధ్వరాధికసత్క్రియల్ ప్రవర్తింపక తెక్కలిబడి యెదిక్కులందు, తఱుచయ్యె..." భార. శాం. ౨, ఆ. ౦౯. క్రి విణ. (దట్టముగా.) "క. వెఱచఱవనితకంటెం, దఱుచేగబాణంబులేసి..." భార. సభా. ౨, ఆ. 3౦౫.

తఱుచేఁగన్నులవేల్పు. దే. వి. ఇంద్రుఁడు. "మ... క్రమ్మెఱుఁగుం జెంద్రికకావిపట్టు సురభూమీజార్పితంబిచ్చె నాతఁ డుఁచుగన్నులవేల్పుకట్టి వసుగోత్రామండలస్వామికిన్." వసు. ౫, ఆ. ౯౪.

తఱుపు. దే. స. క్రి. (తఱియుధా. ప్రే.) కూడఁబెట్టు. "సీ. బూసంబు దఱిపి సేర్పున నమ్మికొనుటకుఁ గఱవుఁ గొఱెడుదోసకారి బుడుగ." వేం. పంచ. ౧, ఆ. ౭౬3.

తఱుము. దే. అ. క్రి. 1. కవియు, (శత్రువులపై) పడు. "క...పాండుతీతీశనందనులను రూపుఱపేయం జేయూడదు, దఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్." భార. ఉద్యో. ౧, ఆ. ౭౪; 2. త్వరపడు, "ఆ...నేఁ, దర్పూరంబు సొత్త మని తలంచి, తఱిమి నడచితిమి లతాతన్వి యిది వడ, గొనిరొమోది తెమ్ము కొంతదవ్వు." భార. విరా. ౧, ఆ. ౧౫౨. ౧, ఆ. ౧౪౭; 3. తొట్రుపడు. "క... తెఱచినకను మూయ కినునిదెస చూచుచు నే, డ్తెఱ నూర్ధ్వబాహుండై మతిఁ,దఱుమక శ్రుతి నొడికొనుచుఁ దప మొనరించెన్." కా. రా. ౨, ఆ. ౧౯౪, 4. విజృంభించు, అతిశయించు. "స్రగ్ధర. వేదండవ్రాతంబు మూడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినన్ .." భార. ఉద్యో. ౧, ఆ. 3౨3. "సీ. ద్వాదశాదిత్యులు తఱిమి కాసినసైనఁ గల్పశతం గేల గ్రాఁగఁ దకఁడు" వాసిష్ఠ. ౨, ఆ. ౨౪౬. స. క్రి. 1. తోలుకొని పోవు. "చ ..సూతుఁడు రాజానేనఁ గ్రమ్మిన పెనుమూర్ఛఁ జూచి తఱిమెన్ వడితోడ రథంబు నీటికిన్." జై. ౪, ఆ. ౫౪, పారి. ౪, ఆ. ౬౬; 2. వెన్నాడి పరుగెత్తించు. "క...మనయోధావళి, ఱివ్వవడిరొ వారిమొన దఱిమికొని వచ్చెన్." భార. ద్రో. ౧, ఆ. 3౮౧. స్వా. ౪, ఆ. ౯౨; 3. బలాత్కరించు, నిర్బంధించు. "గీ. ఇయ్యకొనుమని తఱిమె నిట్లెంత కఱిమినను .." భార. అను ౧, ఆ. ౧3, మార్క. ౭, ఆ. ౨౭3; 4. గొట్టు, త్రోయు. "సీ తలుపు గిఱ్ఱనకుండఁ దఱిమి కొంచెం బైనయోరవాకిట దేహ మొయ్యఁ జొనిపి." కాశీ. ౪, ఆ. ౧౨౧. హరి. 3, ఆ. ౧౨౪; 5. పోఁగొట్టు. "గీ . సొగ సెల్లఁ దఱిమి యొడల .." నీలా. ౧, ఆ. ౧౦3. ఆం. భా. కృ. ౧౧౯, 6. పురికొల్పు. "క. కౌరథికులు తను నిమ్మెయిఁ, బోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం, గౌరవపతి డాగినగతి .." భార. శల్య. ౨ ఆ. 3౭, శుక. 3, ఆ. 3౩౯; 7. కవియు, మీఁదఁబడు. "గీ. తత్ప్రపవబాణశిఖిశిఖల్ తఱుము నపుడు, మనదుకన్నీరు పన్నీరు మాన్పఁ గలదె." శకు. 3, ఆ. ౧౨౦; 8. అధిక్షేపించు, నిందించు. "క. మునిముఖ్యులార మీచేసినపని యటు గట్టి పెట్టి చేకొని యేలాఁ,వచుఁ దఱిమితి రిఁక నేమియుఁ, నవకుఁడు నాతోడికొంగ లైతిరి మీరున్." ప్రభా. ౫, ఆ. ౮౦; 9. తొందరపెట్టు. "ద్వి. పరగున నింటికి జరుగు లెమ్మనుచుఁ, దనవెంట కపుత్రుఁడు తఱుముచు నడవ." ద్వి. హరిశ్చ. ఉ. ౯౦౭. పు; 10, (చెప్పుటయందు) ఒత్తు, నొక్కు,

"క. అని మఱియుం దఱిమి చెప్పఁగ..." రాఘవ. ౪, ఆ. ౧౦౮. భాగ. ౩, స్కం. ౩౪; 11. తఱిమెనఁబెట్టు. (శ. ర. ప్రా.) వి. 1. నిర్బంధము, బలాత్కారము. "క. తరుణులు తఱుములు పెట్టుచు, సరగునఁ దోలేర .." రాజ. చ. ౩, ఆ. ౯౬; 2. త్రోపుడు. (చూ. తఱుములిడు)

తఱుముడు. దే. వి. (తఱుము. ధా.) తఱుముట. (చూ. తఱుముడుపడు.)

తఱుముడుచెండు. దే. వి. (తఱుముడు+చెండు) బాల క్రీడావిశేషము. "సీ. సిరిసింగణావత్తి తఱుముడు చెండును, వెన్నెలకుప్పలు కన్నుకట్టు." ప్రబంధ. ౬౧౩.

తఱుముడుపడు. ద్వ. అ. క్రి. (తఱుముడు+పడు) తఱుమఁబడు. "క. తఱుముఁడుపడి మే న్వడఁకన్ ..చావుపరువెత్తు చవాో..." వేం. పంచ. ౧, ఆ. ౬౦౫.

తఱుములిడు. దే. స. క్రి. (తఱుముల+ఇడు.) త్రోయు. "వ ..పిఱుఁదలబలిమికలిమిం దొట్టి నిట్టవాడిచిన నెట్టుకొని తఱిమిసం దఱుములిడి..." శ్రీరం. మా. ౧, ఆ. ౧౩౭.

తఱులమొకపుమెకము. ద్వ. వి. కోఁతి, వలీముఖము. "గీ ..తఱుల,మొకపుమెకములపై హెచ్చరికల నెరలె." అచ్చ. యు. ౧౫౮. ఇక్లే. తఱులవెంరమెకము. అచ్చ. యు. ౮౧.

తఱువు = తఱుగు. (రంధ్రము చేయు, తొలుచు) "క. కరవాఁడిసూడిఱుద మొన, నర దఱువంబడి మత్తియంబునుపోలెన్..." నైష. ౮, ఆ. ౬.

తఱుసంటి. దే. విశే. (తఱుసలి అని. శ. ర. ప్రా. 'తఱుచంటి' అని వావిళ్ల. పా.) 1. మూర్ఖుఁడు. "క. తఱుసంటి తన్ను నెదిరిని, నెఱుఁగఁడు..." కు. సం. ౭. ఆ. ౪౯, 2. ఉద్ధతము. "ఆ. ఎల్లవారు నెఱుఁగఁ గొల్లనిధర్మువు, చేల నీకుఁ జెప్ప నేల వలసెఁ, జెఱుతవాని కింత తఱుసంటిపలుకులు, సన్ను వృద్ధజనము లున్నచోట." భార. సభా. ౨, ఆ. ౨౨౮. (శ. ర. పా.)

తట్టి. దే. విశే. నీచుఁడు. (శ. ర. ప్రా.)

తట్టు = తట్టి. "ఉ. జాఱైద రామనామమున జొబ్బిలుచున్నసుధారసంబు నే, జాఱైద జాట్టిజాట్టిఁగరుచుల్ గనువారిపదంబుఁ గూర్పవే, తట్టులతోడి పొత్తిదక..." దాశరథిశ. ౩౭.

తల. యు. దే. వి. (క. తలె. త. తలై.) 1. శిరస్సు. "క...పృథివీపతి పీఁతలన తనకార్యఖడ్గం,బులమో పెక్కించె .." భార. విరా. ౫, ఆ. ౨౩. ఆం భా. ద్వి. ౧౪౪; 2. తలవెండ్రుకలు, శిరోజములు. "క...దేవి తల పట్టి యీడ్చి తిట్టు కొలఁది రో,షావేశము పతి రొుందిన..." హరి. పూ. ౧, ఆ. ౧౭౨. శుక. ౨, ఆ. ౧౧౫; 3. చివర, కొన. "క. వల దీరే యిది మనకడ, నిలిచినఁ గీడొందు మనల నేఁ డెల్లిటిలో,పలఁ జేరకున్నఁ గాలము, తలసైనను చేరు నింత తథ్యముసుండీ." కేయూర. ౩, ఆ. ౩౯; 4. ఎత్తు, ఉద్ది. "క. వా ఏొకతల యే నొకతల, యీరెండు తెఱంగులందు నెయ్యది ప్రియము..." భార. ఉద్యో. ౧. ఆ. ౭౫; 5. నుదురు. "సీ. పాపపుదైవంబు పానెనో మనలను దలను వ్రాసిన వ్రాలు తప్ప దింక." శకుం. ౪, ఆ. ౨౦: 6. స్థైర్యము. (చూ. తలచెడు.); 7. ముందరిభాగము, పురోభాగము. "గీ. వాఁడు సభ వాడి నంతయు నేఁడు పేరుఁ బట్టు లున్నాఁడు మొన తల ననిలసుతుఁడు." భార. భీష్మ. ౩, ఆ. ౭౪. శై. ౩, ఆ. ౯౬, 8. మొత్తము; సమూహము. "క. ఒకఁ డొకఁడ పాండవులఁ దాఁ,కక సైన్యోపేతగాఢగతి నందఱు నొ,క్కొకతల గాఁ దలపడి వ్రాసిరడంక యుండుపగఁ వలయుఁ గ్రీడయు పోలెన్." భార. శల్య. ౧, ఆ. ౧౦౦. ౨, ఆ. ౩౫౭, 9. ఎడ,పట్టు. "చ.. దోర్బలపరాక్రమభీకరు లైనవారి నుద్ధురగతి నెట్లు మార్కొని రొుదొ కదువింతలుపుట్టె నీతలన్." మార్క. ౬, ఆ. ౧౫౦. హరి. ఉ. ౯, ఆ. ౩౮; 10. సమయము, తఱి. "క. మెలఁగుదెస మెలఁగి క్రమ్మఱ, తల నొకమరి యెఱుతించి దాడిచెయిం దోర్బలము మెఱసి పైఁబడి నాచలము నెఱపి పోదు మీఁకుఁ జాటిలిఁ జూండీ." నిర్వ. ౭, ఆ. ౩౧; 11. కూడిక, కలయిక. (చూ. తలయుగు); 12. పక్షము, వైపు. "క. ఒకతల సమస్తజగములు, నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొకతల నైసన్." భార. ఉద్యో. ౨, ఆ. ౩౧౫. వాల్మీకి. ౨, ఆ. ౧౨౨; 13. అందు అను సప్తమీవిభక్తిప్రత్యయార్థముఁ దెల్పును. "క. మానిత మగుగుడరవమున, నూఁదినతుండీరఫలము యొగి తేజితల,

ద్నాని మృదు వైనపవనమొ,సా నద్రిజతోఁప్ప మోవి నయమై యొప్పున్." కు. సం. ౩, ఆ. ౬౨. ఉ. హరి. ౫, ఆ. ౨౮౨; 14. (ఎవరి పుట్టుకువారు ప్రత్యేకము అనుఅర్థమున షష్ఠీ విభక్తితోఁ గూడి యిచ్చును.) "గీ. మఱియుఁ దలకొకమాటగా మానిబాధ,తాఁ మన వద్దచేయక తసి..." చంద్ర. ౩, ఆ. ౧౯; 15. ఒకవిధ మగు జలాశయము. "క...కొ,కోణ బుగ్గ వాఁగు దొన తల,పరిగుండము కాల్వ డిగ్గి బావి దొరువులన్." హంస. ౪, ఆ. ౨౧౦; 16. కొన్ని ధాతువులమీఁద భావార్థమున వచ్చుప్రత్యయము. ఉదా:—పట్టుదల, పాయుదల. మొ.; 17. కొన్ని విశేషణములమీఁద వచ్చు తద్ధితప్రత్యయము. ఉదా. :— కొత్తల. విణ. మొదటివాఁడు, ముఖ్యుఁడు. "గీ. అతిరథుల కెల్లఁ దల దండ్రి యట్టివాఁడ, యసురవిభుఁడు ఘటోత్కచుండు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౬౭. వై. వి (సం. తలమ్.) చోటు, ప్రదేశము. "ఉ ..వంగజగతీపతి యొక్కనకుంజరంబుఁ బెల్లెత్తి యుదగ్రకుంభదళనోద్ధతకేళి యొనర్పఁగా నతం, డత్తల దాఁటి యొంతయు భయాతురుఁడై తొలఁగంగఁ బాఱెనన్." హరి. ఉ. ౩, ఆ. ౧౨౪. భార. భీష్మ. ౨, ఆ. ౨౫౭.

**తలంటు.** దే. అ. క్రి. (తల+అంటు.) అభ్యంగమునకై తలమీఁద నూనెపెట్టి రాచు. "మ .. అయ్యాఖఁడు తేవన్ బెండ్లికిఁట న్వసించె లతాతన్వి తలంటి నల్గిడఁగ నుస్మేరాననాంభోజుఁడై." ఇందు. ౫, ఆ. ౨౪. వి. అభ్యంగము, తలమీఁద నూనెపెట్టి రాచుట. "వ ..పండువతలంటుఁకు నిఁటికిం దెచ్చు..." అము. ౪,ఆ. ౧౮౭.

**తలఁకాడు.** దే. అ. క్రి. (తలఁకు+ఆడు.) చలించు, తొనఁకు. "క. సురనది దలఁకాడ సుధా, కరరేఖ చలింప .." కు. సం. ౯. ఆ. ౩౫.

**తలఁకించు.** దే. స. క్రి. (తలఁకు. ధా. ప్రే.) 1. భయపెట్టు. 'సీ. ఘనులైన మనుజవాహనులైన దలఁకించు సార్వ్యభౌములైన యర్యజనులం.' కృ. శతకం. ౧, ఆ. ౫. హరిశ్చ. ౨, ఆ. ౪౧.

**తలఁకు.** దే. అ. క్రి. 1. కంపించు, వణఁకు. "అప్పుడుమన బాణాసురుఁ, డప్పుడే కప్పటికిఁ దలఁకె నతికభయమునన్." ఉ. హరి. ౬, ఆ. ౨౦౫. కేయూర. ౩, ఆ. ౧౨; 2. కలఁగు, క్షోభపడు. "గీ. పోవు టనుచిత మెప్పుడు పోరకుని, యేమి సేయుఁదు నని యాతఁ డిచ్చఁ దలఁకె." కాశీ. ౬, ఆ. ౧౦. విప్ర. ౫, ఆ. ౫; 3. జంకు, వెనుదీయు. "క. కురునృప వినుము సంసారము, దరిద్రొక్కనవార మింకఁ దలఁకెదమే సంగరమునకు .." భార. ఉద్యో. ౪, ఆ. ౨౬; 4. సంకోచించు, అనుమానించు. "వ...పరమదయాపరుండైన పాండవాగ్రజు మఱవు పొచ్చిద్రుడుకుం దను మంతలంతలు దప్పులుసేసితి మని తలంక వలవ దెంతలు సేసినను గాంగేయపూర్వజుండు శాంతిసుధానిధి యగుటంజేసి శరణు సొచ్చినం గాచు .." భార. ఉద్యో. ౨, ఆ. ౨౬౪; 5. విచారించు, దుఃఖించు. "గీ. సమరమొనరించినంతనే చావు రాదు, పాఱిపోయిన యంతనే బ్రదుక రాదు, జీవితంబును మరణంబు దైవకల్పితములు వాని మది మందఁ దలఁక వలదు." మార్క. ౧, ఆ. ౫౪; 6. భయపడు, వెఱచు. "చ. పులిఁ బొడగన్న లేళ్లగమిపోలె సుయోధనుసైనికుల్, దలఁకి కలంగి వివ్వెఱఁగు దన్కసఁ జేష్టలు దక్కి చిత్రరూపుల క్రియ నుండిరి..." భార. భీష్మ. ౨, ఆ. ౧౫౭. రం. రా. అర. ౧౫౯. పు; 7. బాధపడు, శ్రమనొందు. "సీ. మునుపోఁకుమూఁకల మోవనోపక నేలచేడియ తలఁకి చేచేఁ గూడి." నీలా. ౧, ఆ. ౭౦. శుక. ౨, ఆ. ౧౭౩; 8. చెదరిపోవు, విరియు. "క...తిమిరోత్కరంబు తలంకె రఁచ్చరియుం దివిఁ దొలంకెఁ గడంకన్." బహు. ౨, ఆ. ౧౦, 9. తొనఁకు, పైకిఁ బ్రసరించు. "మ...కన్గొనలం దలఁకెన్ సముద్రవారి..." కు సం. ౫, ఆ. ౩౦. నిర్వ. ౬, ఆ. ౫౪. వి. 1. భయము, వెఱపు. "క. క్షోణీవల్లభ వినుమేఁ, బ్రాణములో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా, ద్రోణునకుఁ గాదు సగణస్థాణున కైనను వశంబె తలఁకేమిటికిన్." భార. ద్రో. ౧, ఆ. ౧౨౦. భార. విరా. ౨, ఆ. ౧౦౬; 2. సందేహము. "ఉ... మోక్షముం,బొందినవీరభక్తిఁ గృతపుణ్యు లెఱుంగ బ్రతిష్ఠసేయుఁ డీశుం దలఁకెల్ల మాని యనుచుం బని రందఱు వారు సంకటస్." కాశీ. ౪, ఆ. ౧౩౪; 3. దుఃఖము, విచారము. "క. పిలిచి

ప్రతివచన మొదవమిఁ,గళవళమున నిల్లు పొచ్చి కానచరు న,స్నలవునఁ గానక వైశ్యుఁడు, నలుమూలలు వెదకి సొమ్మనము దలఁకొందన్." కాశీ. ౫, ఆ. ౬౬; 4. చాంచల్యము. "చ. తలఁకఱ నిల్పి కాంత మెదఁ దాల్చి...భక్తిఁ దలంచిన ముక్తి చేకుఱున్" కు. సం. ౬, ఆ. ౭౦.

తలఁకుఁబాటు. దే. వి. (తలఁకు+పాటు) కలఁత. "చ. పదములఁ బట్టినం దలఁకుఁబా టొకయింతయుం లేక కూరత౯, మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుఁగాం కఘట్టనం, జెదరఁగఁ జిమ్మె నమ్మకరి చిప్పలు పాదులు దప్ప నొప్పఱన్..." భాగ. ౮. స్కం. ౫౩.

తలఁకొత్తు. దే. అ. క్రి. (తలఁకు+ఒత్తు) సందేహించు. "క. చిత్తము నీకుఁ బ్రసాదా,యత్తంబై యున్న దేని యడిగెద నిను రా,జోత్తమ యొక్కటి నినుఁ దలఁకొత్తక యది సేయుం మనుడు నుర్వీశుండున్." మార్క. ౫, ఆ. ౨౦౭.

తలఁగఁబడు. ద్వ. అ. క్రి. (తలఁగన్+పడు - స్వార్థమున) వెనుదీయు, మరలు. "క. తనదుగుడారము దాఁకను, గనుకని తలఁగఁబడి వచ్చుఘననిజసేనం, గనుఁగొని యోడకుఁ డోడకుఁ, డనుచున్..." కళా. ౮. ఆ. ౫౦.

తలఁగఁబెట్టు. దే. స. క్రి. (తలఁగన్+పెట్టు) తొలఁగునట్లు చేయు. "సీ. తనక్రేవఁ గనుపట్టుధరణీధ్రములు గిట్టు సెలసి కొమ్మునఁ గొట్టుఁ దలఁగఁబెట్టు." దశా. ౧, ఆ. ౨౦౬.

తలఁగించు. దే. స. క్రి. (తలఁగుధా. ప్రే.) 1. పోఁగొట్టు. "సీ. ద్రౌపదిబన్నంబు దలఁగించె నెవ్వఁ డాదీనమందారుండు దిక్కు నాకు." పాండు. ౫, ఆ. ౧౩౯. పద్మ. ౩, ఆ. ౯౪; 2. తప్పించు. "శా. సామీ దేవరవంటి వీరపురుషుల్ సైతంబు నొల్లక్పుడున్, సాముల్ సేయుంట వైరిపోటు దలఁగించన్..." చంద్రా. ౨, ఆ. ౫౩.

తలఁగు. దే. అ. క్రి. (దీనికిఁ బ్రార్థనాద్యర్థమందు 'తలము' తలఁడు' అనురూపములును, ఈయర్థమందే ఆమ్రేడితమగు తలతల, తలతలము, తలతలఁడు, 'తలఁడు తలఁడు' అనురూపములును వచ్చును.) 1. పోవు. "క. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతం బైనఁ గడున్, దలరి..." భార. అర. ౨, ఆ. ౬౪. పాండు. ౩, ఆ. ౧౮౩; 2. తొలఁగు, అపసరిల్లు. "ఆ. క్షత్త్రబంధుఁ డనఁగఁ గలఁ డొక్కనరపతి, యతఁడు మాలవాని నధికదుఃఖ, భాగిఁ గాంచెఁ గాలిఁ బఱచువిప్రక్షేత్ర, తలము రేణువునకుఁ దలఁగి చనఁగ." భార. అను. ౪, ఆ. ౪౬. స్కా. ౬, ఆ. ౭౯, భో. ౪, ఆ. ౨౨౬. భాగ. ౮, స్కం, ౨౧౭. సా. ౨, ఆ. ౨౨౯. పి. శకుం. ౨, ఆ. ౧౩౧; 3. అంతర్ధానమగు, కనఁబడకుండు. "క. ఏ నిం దెవ్వఁడ నయినం,గానం గనులార పరమకారుణికుండన్, మానసబంధుఁడ నిత్య, ధ్యానము మీకొసఁగవలసి తలఁగితిఁ జుండీ." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౭౯ స. క్రి. 1. విడుచు, త్యజించు. "క...పురుషునకుం దగదు కొచముం దలఁగంగన్." కాశీ. ౫ ఆ ౧౯౮. భాగ. ౩, స్కం ౩౧౭, 2. పోఁగొట్టు, తొలఁగించు. "క. తనుఁ దలఁచినవారలబం,ధనముల విడఁజేయుచక్రి తలిదండ్రులబం, ధనములఁ దలఁగుట చిత్రమె .." సాంబో. ౧, ఆ. ౧౨౭. భార. అర. ౩, ఆ. ౬౮.

తలఁగుడు. దే. వి. (తలఁగుధా) తొలఁగుట. "సీ. తొలఁగు డనంగను దలఁగు డనంగను నపసరణాఖ్యలై యలరుచుండు." ఆం. భా. ద్వి. ౨౨౪.

తలఁచు. దే. అ క్రి. 1. వివేచించు, యుక్తాయుక్తవిచారణ చేయు. "క. మతిఁ దలఁపక నాపుత్త్రకు, నతిబాలకు ననపరాధు నడిచిరి పెలుచన్." భార. ఆది. ౧, ఆ. ౮౪; 2. విచారించు, యోజించు. "చ...అది మాయ యాటకుఁ దలంచఁ దదీయమ యూరపించి కా, భ్రమణమె సాక్షి..." ఆము. ౨, ఆ. ౬౪. విక్ర. ౧, ఆ. ౨౮. స. క్రి. 1. ఎంచు, పరిగణించు. "క. తన్నుఁ దనతమ్ములను నా, కన్నకొడుకులట్ల తలఁతుఁ గాని విభేదం, బెన్నఁడు నామది లేమికి..." భార. ఉద్యో. ౩, ఆ. ౧౯౩; 2. చేయు. "చ.. ఇట్టికలఁ పాత్మఁ దలంపక..." ఆము. ౫, ఆ. ౪౯; 3. స్మరించు, జ్ఞప్తికిఁ దెచ్చుకొను. "చ. తనసుదువుల్ దలంచుకొని తా నిటు లంచుఁ దలంచె నంతయున్." ఉ. రా. ౨, ఆ ౨౦౪. భార. విరా. ౨, ఆ. ౨౦౨; 4. స్తుతించు, పొగడు. "తరలము...దు, ర్భరతపోవిభవాధికున్ గురుసద్యవిద్యకు నాద్యు నం,బురుహాగర్భునిఁ బ్రచేతసుపుత్త్రు భక్తిఁ

దలంచుచున్." భార. ఆది. ౧, ఆ. ౨౧, నీలా. ౧, ౮; 5. ధ్యానించు. "క. ..పాలుపుగ ధర్మం, పెలఁపుము మఱి నూతఁడె వేల్పులలోపలఁ బెద్ద ధర్మువున సత్యమునన్." భార. ఆది. ౫, ఆ. ౯౨. భార. ఆర. ౪, ఆ. ౨౬; 6. ప్రస్తావించు, ప్రసంగించు. 'చ ..ఆమృతక వేలుపు ..కసి మమ్ముఁ లంపఁగ నేల యచ్చటన్." పా. ౧, ఆ. ౮౪; 7. లక్ష్యముచేయు, పాటించు "క ఆర ను లెండనె యుండిపోఁ, బ సర త్తులపు నీడపట్టై నిలిచెన్, ధరపై నున్న తులునిజా తురఁ లంపుమరె నూ తులఁ బ్రోచు నెడన్." కవిక ౨, ఆ. ౯౮, 8. కోరు. చ. ప్రజకోర్క లిచ్చుతన కాన్కఁ ంలంచిన ప్పటే యనన్." ఆము. ౫, ఆ. ౧౪౨. సు. ౪, ఆ. ౧౩౫, 9. తెలిసికొను, ఎఱుఁగు. 'చ. పలుకఁ లంప న్వ లగుభారతరామకథార్థముల్ .." కళా. పరి. ౬, భార. ఉద్యో. ౧, ఆ ౧౧

తలఁపెన్ను. దే.స క్రి. (తలన్+ఎన్ను) 1. తలమీఁదఁ ఎన్ను. "మ ..తాడి ,న్నెడు వాఁడె ..లఁ ఎన్నువాఁడు గలఁ డన్వేషింప సం చెంచితిన్" కళా. ౨, ఆ ౮౭; 2. మీఱు, అతిక్రమించు. "గీ. పుట్టినప్పుడె జ న్వనంబును సమస్త, భామినీ క టిఁ పెలపెన్ను పాటిచెలువు, గలిగె దీనికి .." కుమ. 3, ఆ. ౬౭. బిల్హ ౨, ఆ. ౧౯౦.

తలఁపింపు. దే.స. క్రి. (తలచేధా. ప్రే.) 1 స్మరింపఁ జేయు, జ్ఞప్తికిఁ దెచ్చుకొనునట్లు చేయు. 'క మఱచినఁ తలఁపింపఁగ నగు,మఱఁగనిదాఁ డెల్ల పాటు దెలెఁగింపఁ గున్." భార. ఆది. ౪, ఆ. ౭౧. భార. శల్య. ౨, ఆ. ౩౯౬, 2. తెలియఁ బఱుచు. "మ ..విహారవిపినక్షోణీవిభాగంబునన్, గలపుంపొక్కిలకెంత కోమలకుహూ కారప్రపంచం బుతోఁ, పెలఁపించెన్ రతికాంతమూలరథినీధాటీ సమారంభమున్." భీమ. ౫, ఆ ౯౮.

తలఁపు. దే. వి. (తలఁచు. ధా.) 1 అభిప్రాయము. "గీ. అధిప యోగీశ్వరేశ్వరుం డైనకృష్ణుఁడును ధనుర్ధరవర్యుఁ డర్జునుఁడు నెచట, నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు, భూతినిత్యంబు లగు నిది నాతలంపు." భార. భీష్మ. ౧, ఆ. ౨౩౦. భార. శాం. ౫, ఆ. ౧౯౩; 2. కోరిక, వాంఛ. "గీ. ఆత్మమూర్త్యంతరం బైనయగ్నిదేవు, నర్చనము చేసి నియతి నయ్యష్టమూర్తి, బహుతపోవ్రత నియమైకఫలవిధాత, తలఁపుచేసెను మది నొక్క తలఁపుఁ జేసి." హర. 3, ఆ. 33. భార. విరా. ౧, ఆ. ౧౮౭; 3. మోహము, వలపు. "గీ.సౌంథ పుర ల్లభుం డైన పాఠ్యమీఁదఁ, లఁపు గలదు నా కతఁడును గులు గలిగి, యుండె..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౭౪. నీలా. ౨, ఆ. ౩౧; 4. చింత, ఆలోచనము. "గీ. తలఁపులసందడి ంచిన తాల్మి క లుకిరికంపగతులమెఱయు." భార. ఆర. ౭, ఆ. ౨౮, ఆము. ౫, ఆ. ౪౯, 5. ఎంచుట, అనుకొనుట. "గీ. మనము గాండీవిఁ బాపు మని తలంపఁ, లఁపుకొనిన వచ్చెను త్ క్షణంబ . వాసుదేవుఁ డనఘు." జై. ౧, ఆ. ౧౧౬, 6. ధ్యానము. (చూ. తలఁపుచేయు.); 7. మనస్సు,హృదయము."కి. ఓతల్లి కొ . యొక్కటి, నాతలఁపునఁ దోఁచినది వినన్ పలయు గుణా, న్వితుండు గాసిసుతుఁడు ప్రసూతుం డగునట యకాలసురత క్రియలన్." కళా. ౪, ఆ. ౧౩౧. ఉ. హ. ౪, ఆ. ౧౩౮, 8. తెలివి. "సీ. అధర పల్ల మాన సంగంబు మఱచు ంతక్షతంబునఁ గొంత తల పు గలుగ." కాశి. ౨, ఆ. ౨౦, 9. జాగరూకత, హెచ్చరిక. "క. అలు చైనను బగ తుని వెనఁ, లఁపు గలుగ లయు." భార. విరా. 3, ఆ. ౧౦౭.

తలఁపుమాలి దే.వి. (తలఁపు+మాలు+ఇ)భూవజాఁడు, మన్మథుఁడు. "సీ తలఁపుమాలి మరుంమ పల పేఁడు చిలుకరౌ తామనిచెలి గాడ్పుటరంపు దొర ..మ ాఖ్య లమరు సాంబ" సాం. ని. దే. . ౮.

తలఁపుచేయు. దే. అ. క్రి. (తలఁపు+ చేయు.) ఎంచు, భావించు "ఆ...ఆతని, తలఁపుఁ దెలిసి తగులఁ దలఁపుచేసె." వి. పు. ౬, ఆ. ౧౮. (శ. ర. పా.) స. క్రి. 1. ధ్యానించు. "గీ. ఆత్మమూర్త్యంతరం బైనయగ్నిదేవు, నర్చనముచేసి నియతి నయ్యష్టమూర్తి, బహుతపోవ్రత నియమైకఫలవిధాత, తలఁపుచేసెను మది నొక్కతలఁపుఁ జేసి." హర. 3, ఆ. 33; 2. జ్ఞప్తికిఁ దెచ్చు. "క. ముంగోలు మొలకపెన్నెల,లం గలఁగంబడుతిమంబులుం గలగ గన్నొత్తంగను గంగాయమునా, సంగమముం దలఁపుచేసె సజలాకృతియై." కవిక. ౪, ఆ. ౧౨౮.

తలఁపునఁబాఱు. దే. అ. క్రి. (తలపునన్+పాఱు.) జ్ఞప్తికి వచ్చు. "గీ. నందనమ్మునకును వ్రజనాథ దైత్యుఁ డపుడు చేసినకష్టపా టబ్జనాథ, యిపుడుఁ దలఁపునఁబాఱినవ్యా యమునకు, నధికతర మైన పరితాప మావహిల్లె" ప్రభా. ౧, ఆ. ౯౩. పాం. టీ. ౨౦.

తలపుమానికము. ద్వ. వి. (తలఁపు+మానికము.) చింతామణి. పాం. ని. దే. ౧౮.

తలఁపురాయి. దే. వి. (తలఁపు+రాయి) చింతామణి. "గీ. కొలుచువారలపాలిటి తలఁపురాయి, రాఘవానుజదాయి శ్రీరంగశాయి." వసీ్క. ౨, ఆ. ౩౧. రామా. ౫, ఆ. ౧౮౨. ఇట్లే తలఁపు కెంపు, తలఁపుమిన్న, తలఁపురతనము, తలఁపుఱాయి. మొ.

తలఁపువాఱు. దే. అ. క్రి. (తలఁపునుపాఱు) జ్ఞప్తికి వచ్చు. "క. దీపితముక్తాహారముఁ,బాపిన ప్రేమంబు తలఁపువాఱినఁ బశ్చాత్తాపమున కొరలి..." కవిక. ౬, ఆ. ౨౮.

తలఁపుసాకిరి. = తలపుసాక్షి. (శ. ర.)

తలఁపుసాక్షి. మి. విశే. (తలఁపు+సాక్షి.) స్వాగత సాక్షి, ఈసంగతి నీ వెఱిఁగినదేకదా జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్మని యడుగఁబడుసాక్షి. "సీ. మఱియొక యీయర్థ మెఱుఁగు మీరని యప్డు తలఁపింపఁ బడువాఁడు తలఁపుసాక్షి." విజ్ఞా. వ్య. ౧౦౦.

తలఁబ్రాలు. దే. వి. బ. (తలన్+ప్రాలు.) వివాహ కాలమున దోసిళ్లతో వధూవరు లొకరితలపై నొకరు పోసికొను నాచుడుబియ్యము. "మ.. నాథునిమౌళిన్ దలఁబ్రాలు పోసె నపుడా..." స్వా. ౫, ఆ ౮౪. దశా. ౭, ఆ. ౧౮౨.

తలకట్టు. దే. వి. 1. జుట్టు, శిరోజములు. "సీ. నవదంపుజొత్తులఁ జెవులకూ పడఁగంగఁ బాపటఁ దలకట్టుభంగి గప్పు." భార. విరా. ౧, ఆ. ౨౭౮. భార. ద్రో. ౨, ఆ. ౧౩౦; 2. కిరీటము. "సీ ..కిరీటమ్ము వెలయు, దలకట్టు నాఁగను." ఆం. భా. ద్వి. ౧౪౭.; 3. పాగచుట్టుట. (శ.ర.), 4. పాగ. (శ. ర.), 5. హల్లుమీఁదఁ జేర్చు 'అ'కారచిహ్నము, అకారము. "సీ. పట్టె పట్రు పయిను బొప్పిష్టి తలకట్టు గుడిసున్న కియ్యము నుడియు ముడియు. గీ. కీలుకొన వ్రాయసంబులు వ్రాయ వ్రాయ." పాండు. ౧, ఆ. ౭౧. అప్ప. ౩, ఆ. ౪౫.; 6. స్థానము. "చ...భూతలమున కీర్తిసంపనఁ దాఁ దలకట్టునుు నైనభానుమ, త్కులమున కెల్ల..." రామా. ౭, ఆ. ౨౧౩. విశే. ముఖ్యము. "గీ. నన్ను బ్రతికించుటయు నీగుణైపుణముల, కెల్లఁ దలకట్టు " హరి. ఉ. ౭, ఆ. ౧౪౪. ఆం. సం. స్థా. ౨౭.

తలకడచు. దే. అ. క్రి. (తల+కడచు.) (సంతోష ముచే) పైకిలేచు ఎగయు. "క...నరమహేం, ద్రజ మిత్రార్జున యంచును, భుజములు దలకడవ రాకపోకలఁ జేరున్." భాగ. ౧, స్కం. ౩౭౦. అ. క్రి. స. క్రి. దాఁటు, కడచిపోవు "క. అమ్ముఖమున నకురము రౌద్రమ్ము పెనిచె మద్రవిభునిఁ దలకడచి యనీకమ్ము బహులాస్త్రశస్త్రచ, యమ్ముల ధర్మజుని బొదివె నత్యుగ్రమునన్." భార. శల్య ౧, ఆ. ౨౪౩. "వ . ఇట్లుభయ సైన్యంబులు...తలపడియె నట్టిసమయంబున. క. తలకడచి నడచుద్రోణుని, యలవుఁ జలంబును సహింపక ." భార. భీష్మ. ౨. ఆ. ౩౪౪, ౩౪౫. స. క్రి. ఉల్లంఘించు, మీఱు. "వ... ఇవ్విధంబున సంయోధకటకుం డాయోధనంబు విడిచి యోధధర్మంబుఁ దలకడచి పాఱిన..." ఉ. రా. ౩, ఆ. ౨౨.

తలకప్ప. దే. వి. జలజంతువిశేషము. (నీరుడుము, జలగోధిక అని బ్రౌ.) "సీ. నీరుకుమ్మరపుర్వు నీరుఁగ తలకప్ప .." హంస. ౪, ఆ. ౧౮౬.

తలకము. సం. వి. అ. న. కొలను.

తలకాఁడి. దే. వి. బరు వధికమై రెండెద్దులకంటె హెచ్చుగా కట్టవలసినప్పుడు సంతనచేసి మొదటి కాఁడికిముందుఁ గట్టెడిమఱొకకాఁడి, ప్రాసంగము. (శ. ర.)

తలకాయ. దే వి. తల,శిరము. "చ. పులుల వధించుఁ ద్రుంచుఁ గురుపోతుల దుప్పులఁ జప్పరించు మృన్నులఁ బడఁ ద్రున్నుఁ బందులఁ దినున్ దలకాయలఁ జీల్చు దంతులన్." సుప. ౩, ఆ. ౧౫౫. పరాహ. ౧౧, ఆ. ౫౭.

తలకుమీఱు. దే. అ. క్రి. (తలకున్+మీఱు.) అతిశయించు, మిక్కుటమగు. "సీ. భీతిఁ బాకాడి పురుహూతు వెన్కొని బాడుదలఁ బట్టి దర్పంబు దలకుమీఱ." నృసిం. ౨, ఆ. ౧౧౯.

తలకూడు. దే. అ. క్రి. (తల+కూడు). 1. సిద్ధించు, నెఱవేఱు. "ఉ...నా కోరిక యొక్కట నేఁడు దలకూడె నరేశ్వర..." భార. అర. ౭, ఆ. ౩౧౬. భార. భీష్మ. ౩, ఆ. ౭౪.; 2. ఫలితమిచ్చు. ఫలించు. "ద్వి. వనజభవుఁడు మెచ్చి వర మిచ్చు వేళ, వరుల కన్నక యున్న నాఁటిక ప్పెల్ల, దరమిడి నేఁ డిదే తలకూడె నీకు." రం. రా. యు. ౩౨౧. పు.; 3. లభించు. (చూ. తలకూర్చు.)

తలకూర్చు. దే. స. క్రి. (తలకూడు. ధా. ప్రే.) నెఱవేర్చు. "ద్వి. అంతయుఁ బ్రార్థింప నట్లకా కనుచుఁ, బలికెఁ దొంగునఁ గాని భామినికోర్కి, తలకూర్ప లేక తద్దయు నున్నవాఁడు." రం. రా. ఉ. ౨౦. పు; 2. లభింపఁజేయు, సమకూర్చు "సీ. తగినసాహాయ్యంబు దలకూర్చుకొని యుగ సాధింపవలయు నుత్సాహలీల." నా. పంచ. ౧, ఆ. ౨౩౪.

తలకెక్కు. దే. అ. క్రి. (తలకున్+ఎక్కు.) 1. నెత్తికెక్కు.(ఇది యవజ్ఞను గర్వమును సూచించును.) "సీ. కమలించెఁ గాక యంగజవిరోధిశిరోధిఁ దలకెక్కఁజాలెనే హాలహలంబు." పను. ౪, ఆ. ౨౯. "చ. శివుఁ డిటు రమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి యుగ్రుఁడై, భర్గమునఁ జూచుచో నదుగు పట్టితివి..." విజ. ౩, ఆ. ౫౧.; 2. అతిశయించు. వర్ధిల్లు. "సీ. రోహిణి రూపరేఖావిశేషంబున హెచ్చు నచ్చామమిఁదిఁ, వలపులు తలకెక్కి కల నైనఁ దమవంకఁ గడకంటఁ జూడమిఁ గడమ సతులు. గీ. విరహితాపభరంబున వేఁగి వేఁగి." వరాహ. ౬, ఆ. ౪౫., 3. కలుగు. "గీ. అదియుఁ దల్లికి జనియించినది మొదలుగ, సంగమాపేక్ష తలకెక్కి చాలఁ దివురు." హంస. ౪, ఆ. ౧౯౦; 4. బోధపడు. (వ్యా: నే నెంత బోధించినను వానికి పాఠము తలకెక్క లేదు.)

తలకెడవు. దే. విశే. (తల+కెడవు.) తలక్రిందైనది. "ఆ. శకటుతలఁ బెటిలింగి చయ్యన నాతోనఁ, జరణ మొకటి లీలఁ జాఁచి తాఁచెఁ, దల్ క్షణంబ బండి తలకెడవై పాసి, యవ్వలనందు వెడలి యాననిఁ జెపర." హరి. పూ. ౫, ఆ. ౧౭౬. ఉ. హరి. ౧, ఆ. ౫౩.

తలకెడవుపడు. వ్యు. అ. క్రి. (తలకెడవు+పడు.) తలక్రిందగు. "క. ఏ మిచటఁ బాడుచుండం, గా మోక్షప్రణుండు తనదుకాలుకడకతో, నే మీఁది కెత్తి తాఁచిన, నీ మెయిఁ దలకెడవువడియె నిబ్బండి వెసన్." హరి. పూ. ౫, ఆ. ౧౯౭.

తలకొట్టుమారి. దే. విశే. (తల+కొట్టు+మారి.) 1. శిరచ్ఛేదనము నొందినవాఁడు. (శ. ర.); 2. దుష్టుఁడు; అవినీతుఁడు. "గీ. నందనందనుఁ దశ్చైనా నపరిధానముఖంబు దక్కినచందానఁ జెలఁగుఁ జిత్తమానసోహరుఁ బాసి నేఁ దదల వ్రాసె, నౌర తలవ్రాఁత తలకొట్టుమారి ధాత." రాధికా. ౨, ఆ. ౬౬.

తలకొట్టుమారితనము. వ్యు. వి. (తలకొట్టుమారి+తనము.) దౌష్ట్యము, అవినీతి. "సీ. బట్టకూర్చుతనానఁ బుట్టచెండ్లగరీని మఱచెనో తలకొట్టుమారితనము." శశాం. ౩, ఆ. ౩౭.

తలకొను. దే. అ. క్రి. (తల+కొను) 1. కలుగు, జనించు. "చ. తలకొని సంగమంబున జనించును గామము కామవృద్ధిచేఁ, దలకొనుఁ గ్రోధము .." శాం. ౧, ఆ. (శ. ర.) భార. శాం. ౧, ఆ. ౬౯; 2. యత్నించు. "క. అలజడియె కాక నీ కే, నిలుకడ నొకవేలు కలదె నిజము వినుము మా, పలుకులు సంతలిఁ బడయం, దలకొను మొక తెఱఁగు దైత్యదర్పధ్వంసీ." భార. ద్రో. ౦, ఆ. ౩౪౩; 3. ఉండు. ద్వి. తలఁపులోఁ బాయక దలకొన్నయలుకు, దెలుపుచుఁ జంద్రమతీదేవి పలికె." ద్వి. హరిశ్చ. పూ. ౧౧౧౩. పం. హంస. ౪, ఆ. ౨౧౩; 4. తలయందుండు. "క. ఓయి నెఱిజాణ తలకొనఁ, జేయుము విరు లివె జవాది చెయిఁ బట్టుము..." సా. ౨, ఆ. ౮౩; 5. ప్రకాశించు. "సీ. ఎంతమాత్రకరుచి దలకొనమఱు మాట పలికినఁ గాదె యుంత్సలవిలాక్షి." భార. విరా. ౨, ఆ. ౪౫; 6. రేఁగు, రెచ్చు. "క. పొరిఁ బొరి నెగయుచు మ్రొగ్గుచు, ధరణీస్థలిఁ బొరలఁ బడుచుఁ దలకొని శిఖం, బొరసినవయ్యూహాయంబులు, ధరియింపవు కొంతతడవు పల్యాణంబుల్." పారి. ౪. ఆ. ౬౮. రం. రా. ౩, కిష్కి. ౨౦౬. పు. స. క్రి. 1. తాల్చు, వహించు. "క. ఇల నీకై కొన్న తెఱఁగు, తలఁపఁగ ధర్మంబొ కాదొ దైవ మెఱుంగున్, దలవనిచింత యుండెగి ధృతి, దలకొని పాలింపు యజ్ఞపశుఁడ వగుదున్." భార. శాం. ౧, ఆ. ౧౧౩. భార. కర్ణ. ౧, ఆ.

౧౩౭; 2. శిరసావహించు. "ఆ. తండ్రియాజ్ఞ చేసి దలకొని రాజ్యంబు, విడిచి యిట్లు వైశ్య వృత్తి నున్న, వాఁడ..." మార్క. ౭, ఆ. ౨౫౩; 3. అంగీకరించు. "క. నరహితముగఁ బ్రార్థించితి, ధరఁ బుట్టుం దవుచు దానిఁ దలకొనిరి పెయన్." భార. భీష్మ. ౨, ఆ. ౨౭౧. భార. ద్రో. ౧, ఆ. ౩౪౩; 4. అవలంబించు. "క. కుల మెంచ రాఁడి కోల్లకు, బలఁకరు పడి వావి రుస బలఁకరు నీతిన్, దలకొనరు సత్యమాడరు, కలకంఠులు వారి నమ్మఁగా నెటు వచ్చున్." హంస. ౫, ఆ. ౨౬౭.

తలకొనుదెంచు. దే. అ. క్రి. (తలకొను+తెంచు—స్వార్థమున) కలుగు, సంభవించు. "క ..పలీ, పలితంబు లయ్యె పగరును, నెలమేరుచు నుక్కి సయుంను దలకొనుదెంచెన్." భార. ఆది. ౩, ఆ. ౧౯౧.

తలకొలువి. దే. వి. (తల+కొలువి) 1. శవవహనము చేయునపుడు తల యం దుంచుకొలువి. "ద్వి. కొంత యొల్కలలోనఁ బొదపటికాలి, కొంత చిక్కిన కడకొలువులు దెచ్చి,కుఱుప్రోగుగా నిడి కొడుకువం దునిచి, కొలువి నొక్కటఁ దలకొలు విడఁ బూని." ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౫౯. పం; 2. గూఢశత్రువు. (బ్రౌ)

తలకొలుపు. దే. స. క్రి. (తలకొనుధా. ప్రే.) 1. కలిగించు. "క. ఏమీ యిది దేవరకను, దామరలకు నింత వెఱఁగు దలకొలిపెదు నే." ప్రభా. ౧, ఆ. ౫౬; 2. నెఱవేర్చు. "ఉ...అంతకం గఁ ద్రోఁచి మత్పతు లుదాత్తమతిన్ భవదీయవాంఛితంబుం దలకొల్పఁ జాలుదురు..." భార. విరా. ౩, ఆ. ౭౨; 3. బోధించు. "క. తెగి చంపరాదు గాక మఱపెగ వని దుర్నీతు లపుడు తలకొల్పఁగ నీ, దగుమంత్రులం నీవును నీ, పగిదిం బడపలనె నిట్టి పాపము గంటే." నా. పంచ. ౩, ఆ. ౨౯౦; 4. ప్రేరేచు పురికొల్పు. "క...ముకు కలఁగి నవీ, మొన లెల్ల నొక్కమొగముగ, నొనరిచి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్." భార. ద్రో. ౫, ఆ. ౪౧, భా. రా. యు. ౬౭౩.

తలకోల. దే. వి. (తల+కోల.) సాధువు కానిగూవును పిదుకునపుడు కొనను త్రాడు కట్టి దానికొమ్ములకుఁ దగిలించి పట్టుకొనెడుకఱ్ఱ. "ఆ. ఆవుఁ బిదుక బోయి యలికేణి యొక్కతె, దూడ వెనుక



కాళ్లతోఁడ నావు, నడఁగఁ గట్టి యొత్తి యాఁ బోతుఁ దలకోలఁ,బట్టి యుఱ్ఱు గట్టి బయలు పిలికె." వి. పు. ౭, ఆ. ౨౮౨. ద్వా. ౨, ఆ. ౧౫౫.

తలకోలు. దే. వి. (తలకొను. ధా.) తలకొనుట.(శ.ర.)

తలక్రిందు. దే. విణ. (తల+క్రిందు.) అధోముఖమైనది. "సీ...తలక్రిందు లైనరథవ్రజములు." జై. ౨, ఆ. ౧౮. కు. ౩, ఆ. ౧౪౩. ఇట్లే: "తల్లక్రిందు." సానందో. ౨ ఆ, ౧౨౩.

తలగడ. ద్వ. వి. (తల+కడ.) (పండుకొనునపుడు) తలయుంచుకొను దిక్కు; తలయుంచుకొను ప్రదేశము. "గీ. తూర్పుదక్షిణములలోన దొరకినట్టి, దిక్కు తలగడ గాఁగ నిద్రించెనేని మేలు తక్కిన దిక్కులు మేదినీశ,యధికరోగంబుఁ గావించు నని బుధులు." వి. పు. ౪, ఆ. ౨౧౭. "చ. తలగడఁ బామఁ జేర్చుకొని పెయ్యము నెయ్యము నమ్మి..." వాల్మీకి. ౨, ఆ. ౨౮; 2. తలక్రింద నెత్తుగా నుంచుకొనెడిదిండు, ఉపధానము. "వ... భీమసేనుండును పెన్వటవృక్షంబు క్రింద నధికపథశ్రాంతు లయి పరుపుట్టంబులు పఱచుకొని తమ బాహుదండంబులు తలగడలుగా నిద్రితు లయి యున్నసహోదరులం దల్లినిం జూచి .." భార. ఆది. ౬, ఆ. ౧౭౬. ఆం. భా. ద్వి. ౧౬౩.

తలగడిగించు. దే. స. క్రి. (తలగడుగు. ధా. ప్రే.) అభ్యంగస్నానము చేయించు. "చ. తలగడిగించి ధౌతపరిధానము గట్టఁగ నిచ్చి..." పాండు. ౩, ఆ. ౧౨౭.

తలగడుగు. దే. అ. క్రి. అ. (తల+కడుగు.) 1. అభ్యంగస్నానము చేయు. 'క ..తలగడిగిననాఁటి నిద్ర తరుణులయెడలన్, బోలయలుకనాఁటికూటమి, వెల యిం తని చెప్పరాదు..." సుమతీశ. ౯౯; 2. అంటినతలకు నీళ్లుపోయు. "చ... తామరకంటి యొకర్తు తేటవె,న్నెలకటికంపుబిందియల నించినగొజ్జఁగినీటిచేఁ, దలగడిగెన్ యయాతికి..." య. ౪, ఆ. ౯౭. చూ. ౯౬. వి. అభ్యంజనము. "చ. తలగడు గంగమర్దనము ధౌతపటావరణంబు..." పాండు. ౩, ఆ. ౯. ఆం. భా. ద్వి. ౧౬౦.

తలగాచు. దే. స. క్రి. (తలన్+కాచు.) కాపాడు. "సీ. తగిలి తాఁ జేసినధర్మంబు తలగాచు దైవంబు గొలిచినఁ దప్పు మనుచు." నీతిశ. ౪౩,

తలగాము. ద్వ. వి. (తల+గాము.) రాహువు. "ద్వి. తలగాము మట్టనితరు కేందురేఖ." ద్వి. భాగ. ౭, స్కం. (శ. ర.)

తలగుంజె. ద్వ. వి. (తల+గుంజ.) నిట్రాడు. (శ. ర.)

తలగుడ్డ. దే. వి. (తల+గుడ్డ.) పాగాగుడ్డ. తలకుఁ జుట్టుకొను వస్త్రము. "ద్వి. సన్నంపుఁదలగుడ్డఁ జాటుగాఁ బట్టి..." ద్వి. శ. సా. ౧, ఆ. ౧౨. పు.

తలగొను. దే. స. క్రి. (తల+కొను.) తాల్చు, ధరించు "క. అలశంఖచూడుతలమణి, తలగొని మణిఘటితభోగతతిఁ గలశేషుం, దలపించురోహిణీసుతుఁ, గలసి తిరుగు హరి సగంధకస్తూరిక్రియన్." పాంచా. ౧, ఆ. ౧౦౦.

తలచీర. ద్వ. వి. (తల+చీర.) తలపాగ; తలగుడ్డ. "వ...తక్కినయులంతిమాచును రెల్లచు దలచీర వాటించుతలంపు లేక యొండొరుల నిలు నిలుమని పలుకుచుం..." భార. ద్రో. ౫, ఆ. ౩౨౫. "గీ...చెప్పు పావలు దొడి తలచీర చుట్టి." విజ్ఞా. ఆచా. ౫౩.; 2. అవగుంఠనము, మేలుముసుఁగు, ముసుఁగు. "గీ. అతివమనమున సిగ్గు మోహంబు భయముఁ, బోడమ నునుమంచు పెత్తమ్మిఁ బొదువుమాడ్కి, బ్రథమచింతాభరమ్మునఁ బద్మనయన,కోరి తలచీర వాటింప నేరదయ్యె." భాగ. ౧౦, స్కం. ఉ. ౩౩౧. "గీ. అతఁడు పెండ్లికిఁ బిలిచినయట్లు వికచ,హృదయుఁడై తలచీర యాయితముచేసి, ద్రుపదనందనఁ జూచి నాతోన వెనుక,నల్ల నంతంత నరుగుచెమ్మని కదంగె." భార. విరా. ౪, ఆ. ౩౨౩.

తలచీల. దే. వి. (తల+చీల.) నిట్రాడుకు వితపుఁగదురును చేర్చి బిగించెడిచీల. (శ. ర.)

తలచెడు. దే. అ. క్రి. (తల+చెడు.) భయపడు. "క. తలచెడి పాఱెడి బాహా,బల మొప్పఁగ నాదుదృష్టిపథమున ధృతితోనిలిచిన..." భాగ ౧౦, స్కం. ఉ. ౭౫౫. చంద్రా. ౬, ఆ. ౯౩, 2. వైధవ్య మొందు. "గీ. ఒడ లెఱుంగవో చచ్చితో యంర్వి శేవో,చేరఁజాలక తలచెడి శీర్ణ మైతొ, కన్నడంబెట్టు చొచ్చెదు గజపతీంద్ర." (పెద్దనచాటువు.)

తలచెమురు. దే. వి. (తల+చమురు.) 1. తలకు రాచికొనెడినూనె. (శ. ర.); 2. నూనె, తైలము. "గీ...తైల మలరుఁ, దలచమురు నూనె యనన." వేంక. మాన. ౭౨. [చావడి. (శ. ర.)

తలచావడి. దే. వి. (తల+చావడి.) ఇంటిముందటి

తలచెంచె. దే. వి. (తల+చుంచు.) ముందటిజుట్టు. (బ్రా.) "సీ. దండ కై దప్పినఁ దప్పుఁ గ్రేళ్లటికినఁ దలచుంచుఁ గొన్న నొబలము గొన్న" ద్వా. ౨, ఆ. ౬౦.

తలచెట్ట. దే. వి. (తల+చుట్ట) తలపాగ, ఉష్ణీషము. "సీ. బలుపాఁపతలచుట్ట లలవరించినవారు లేతచందురులఁ దాలిచినవారు." పాండు. ౧, ఆ. ౧౬౫.

తలచెట్టు. దే. వి. (తల+చుట్టు) 1. తలపాగ, ఉష్ణీషము. "సీ...రారాజు ద్రోణ, తనయుఁండుఁ జుట్టిన తలచుట్టు నల్లనియవి సూతపుత్త్రుశిరోంబరంబు పచ్చనియది .." భార. విరా. ౫, ఆ. ౨౧౦. ప్రభా. ౧, ఆ. ౫౪; 2. పాగకట్టుట. (శ. ర.)

తలచూపు. దే. అ. క్రి. (తల+చూపు) 1. పొడచూపు, కనఁబడు. "సీ. కనుపట్టె నొకచోట ఘనఘనాఘనరంగవిద్యున్నటీ నాట్యవిలసనములు,... తలచూపె నొకవంక దరదళత్సేవంతికాగంధి నీహారకణభరములు." పారి. ౩, ఆ. ౪౬, హరి. పూ. ౭, ఆ. ౧౭౬; 2. కలుగు, జనించు. "గీ. వేఁకి తలచూపె దాహ మావిర్భవించె." కాశీ. ౩, ఆ. ౧౨౧.

తలడించె. దే. అ. క్రి. (తల+డించు) చలించు, జంకు. "లయవిభాతి ..వెలుతుటి జరాసుతుని బలము రణవీథిం,జలితదనుజావలిక్ బలికి భయభీతసుర,ఫలికిఁ ద్రిజగచ్చలికి హలికిఁ దలడించెన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౬౭.

తలడిల్లు. దే. అ. క్రి. బాధపడు. "చ...విర,క్తులు తలడిల్లువేళలం ..'' భాగ. ౧౦. స్కం. పూ. ౯౬౨. (శ. ర. పా.)

తలతంత్రము. మి. లి. ఎలగోలుసైన్యము, యుద్ధభూమిలో మొదటిసవరణచేయుటకు పంపఁబడు సైన్యము. "ఉ. ధారలు వట్టఁబంపుతలతంత్రముఁ దావడిపంపురత్నథం,డారముతోడ గుఱ్ఱపుదళంబులు ముంగలిపంపుసందడిం, జేరఁగనీకుము..." కు. సం. ౧౦, ఆ. ౫.

తలతల. దే. అవ్య. 1. ప్రతి యనుదానియర్థము నిచ్చును. "చ. తలతలపారువత్తిమలు కద్దయు

మించె గిరీశుచెంగటన్..." చంద్రా. ౧, ఆ. ౧౪, జై. ౭, ఆ. ౯౨; 2. ప్రత్యక్షముగా. "క. పలుకల కేమీ రోసము, గలిగినమగవాఁడ వైనఁ గాచి కడంకం, దలతల పట్టికొనంగా, వలదంటినొ చంపి త్రోవవలదంటి నొకో." వేం. పంచ. ౧, ఆ. ౨౫౧. వి. 1. మెఱుఁగుంటయం దగునసుకరణము. "క. గెలుపు ధ్రువము నీకును మెయిఁ,దలతల మను చాయ దోఁచె దైత్యాంతకుఁడుం, దెలివొంది యున్నవాఁడు..." భార. ద్రో. 3, ఆ. ౧౭. బహు. ౪, ఆ. ౧౯; 2. ఇంచుక మెఱయుంట యం దగునసుకరణము. "క. తలతల మనుచీక టితోఁ, దలతెలవాఱంగ లేచి .." నిరం. ౧, ఆ. ౧౫.

తలత్రాడు. దే. వి. (తల+త్రాడు) పశువులకొమ్ములకుఁ గట్టుత్రాడు. "గీ ..గిడ్డి వెకలించెఁ దలత్రాడు కేలఁ దొట్టి, మారి వెడలించువచువున మాణవకుఁడు" పాండు. ౫, ఆ. ౨౪౫. శుక. ౨, ఆ. ౫౪౫.

తలత్రాణము. సం. వి. అ. న. చేజోడు. "వ...తను త్రాణతలత్రాణంబులు ధరించి .." భార. విరా. ౪, ఆ. ౧౬౯.

తలదండ. వై. విశే. (తల+దండ) పొద్దును రక్షించునది. "సీ. ఇలకెల్లఁ దలదండ చెలియలికట్ట యే రాజాజ్ఞ నద్ధిపై రాదు గాక." భా. రా. అయో. ౨౬౫.

తలదుడ్డు. దే. వి. (తల+దుడ్డు) తలగలచేతికఱ్ఱ. "సీ. కొడిదిబ్బొసలమొలత్రాడు తలదుడ్డుచీరణంబులపాదియును..." వేం. పంచ. ౧, ఆ. ౫౯౯.

తలదువారము. ద్వ. వి. (తల+దువారము) తలవాకిలి. "సీ. తలదువారంపుఁదొంతల నంటితోదియలుచే.." అచ్చ. అయో. ౧౦.

తలదూర్చు. దే. అ. క్రి. నివసించు. (చూ. తలదూర్చుకొను.)

తలదూర్చుకొను. దే. అ. క్రి. (తలదూర్చు+కొను - స్వార్థమున) నివసించు, ఉండు. "గీ. సురేంద్రుండు జీర్ణపర్ణాశనమున, నొడలు కడుఁ జిక్కి నొగులుచు నున్నతపసి, పడఁతి తలదూర్చుకొను చుట్టుగుడిసెపంచఁ, జేరె మదనునిమహిమంబుఁ జెప్పఁ దరమె." కావ్య. వి. ౪, ఆ. ౯౧.

తలద్రొక్కు. దే. స. క్రి. (తల+త్రొక్కు) 1. ఎక్కు, అధిరోహించు. "వ.. దరదకుందిరాజ సమేతుం దశైరయేను ధరణీధరంబు దక్షిణకటకంబుఁ దలద్రొక్కఁద..." హరి. ఉ. ౧, ఆ. ౯౪; 2. మీఱు,మించు. "గీ. విశ్వలోకేశ్వరుఁడు రఘువీరుఁ డిట్లు, పనికివత్తు వటంచుఁ జేపట్టినపుడె, భూమ ణంబులఁ దలద్రొక్కి పూజఁ గొంటి..." రామా. ౬, ఆ. ౧౯౭.

తలధరించు. ద్వ. స. క్రి. (తలన్+ధరించు) శిరసావహించు. "గీ. తమ్ము లిద్దఱుఁ దనరాజ్ఞ తలధరించి." హర. పీఠి. ౨౬, ఇట్టే, తలనిడు, తలఁదాల్చు. మొ.

తలనట్టు. దే. వి. వేరుపురుగుకొఱుకుటచే మోవు లెండుట. (శ. ర)

తలపండు. దే. వి. (తల+పండు) తల. "గీ. పలంతుఁ డేనియ గలతలపండుచేల్వఁ, దలఁచి .." ద్వా. ౨, ఆ. ౯౯.

తలపడు. ద్వ. అ క్రి. (తల+పడు) 1. సిద్ధపడు తొడఁగు "క. కలుషించి తామ్రకేతుఁడు, పలికె గదాధరునిఁ జూచి పాండవులో నచ్చలమునఁ బోరఁగ దొమ్మికిఁ, దలపడితివి నీకు వీరధర్మమె యనుచున్." జై. ౭, ఆ. ౧౭౯. రామా. ౭, ఆ. ౨౭౬; 2. సమీపించు. "గీ...కొమ్మ గదలి జల్లు, తలపడకమున్న పంగుల్గఁ దడిసెఁ దరులు" ఆము. ౪, ఆ. ౧౩౦; 3. ఏర్పడు. (శ. ర.) స. క్రి కవియు, ఢీకొను. "చ. తలధిము వహ్ని మీఁదఁ జవుచందముగాఁ నృపాలుఁ డర్జునుం, పలపడఁ బోక .." భార. ద్రో. ౫, ఆ. ౧౧౯. హరి. ఉ. 3, ఆ. ౧౧౫.

తలపాగ. దే. వి. ఉష్ణీషము. "సీ. తలపాగ పొరమీఁదఁ జెలగెడుసాయుధార్చన నల్పినట్టిదానసపుఁ బూవు." శుక. 3, ఆ. ౧౫౯. దశా. ౧౦, ఆ. ౧౧౨.

తలపాటు. ద్వ. వి. (తలపడుధా.) యుద్ధమునఁ దాఁకుట, కవియుట. "చ. బలములపాటు దాయ తలపాటును జూచి..." రామా. ౯, ఆ. ౬౯. భాగ. ౧౦, స్కం. ఉ. ౬, ఆ. ౧౨౪. నిర్వ. ౧౦, ఆ. ౧౧.

తలపాలు దే. వి. 1. తలప్రత్తి. "గీ. ప్రత్తి తలపాలు నాఁ బున్క పుఱికయ నాఁగ." ఆం. సం. మాన. ౨౫, సుద. ౧, ఆ. ౧౭౬; 2. స్త్రీలు పెట్టుకొను నొకవిధ మగుశిరోభూషణము. "సీ. చెక్కుల

క్రేవల సిరపుమించులతోడఁ దలపాలు తఱుకులు తడబడంగ." విక్ర. ౭, ఆ. ౧౭౬. రామా. ౯, ఆ. ౮౮.

తలపుచ్చె. దే. వి. (తల+పుచ్చె) కపాలము, తలపుఱ్ఱె. "ద్వి. సాయింతిఁ గొనిఎచ్చు పెల్లగిల నన్నుఁ, బోయినప్పుడె తలపుచ్చెను మ్రింగు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౧౬. పం.

తలపెట్టు. దే. అ. క్రి. ప్రారంభించు. "క. వెఱపొక యింతయుఁ లేక, తెలుఁగున మిము నెవ్వఁ డింత తెగి చేసెనొకో, యొకఁ గెలఁగి యుండి యకటా, కొఱవిం దలఁగోఁకికొనుటకుం దలపెట్టెన్." రాజ. చ. ౨, ఆ. ౪౩, శాకు. 3, ఆ. ౭౬. స. క్రి. 1. తలపడఁజేయు, తాఁకించు. "చ...ఉపాయపుఁ బ్రేలరిమాట లాడి ధీరులమని కైన నూరక విరోధ మొనర్చుచు నుందురాజులు, బెలుచన లేఁచి తెచ్చి తలపెట్టుటినో పుఁదీఁట వోవఁగన్." హరి. పూ. ౫, ఆ. ౯౨, భార. ఉద్యో. ౬, ఆ. ౨౦౭; 2. ప్రస్తావించు "క. తలపెట్టకుఁ డిక యన్నఁడు...ఈకథాస్థితి." కళా. ౫, ఆ. ౫౭. ఉ. రా. ౬, ఆ. ౨౨౨, 3 తలపోయు, చింతించు. "క. ఓపల ధరణీపాలక,యోఁ పలవం పాయె నిప్పు డంబ అరో నెచ్చోఁ దలపెట్టక యనరి, చ్చోఁ దలపెట్ట కటు విడువు చూతువు నన్నున్." సా. ౨, ఆ. ౨౩౪.

తలపొలము. దే. వి. (తల+పొలము.) పొలిమేర వెంబడి నున్నపొలము. "క. కఱకంచొప్పయ చాలును, మఱచియుఁ దలపొలముదిక్కు మనలేడి కనికిన్, పెఱతు నని పిలికితనమున, నెలి విఱుగుడు గాక సత్యవిష్ణుఁ దలఁపుడే." భో. ౪, ఆ. ౨౧౧. భార. ఉద్యో. ౨, ఆ. ౧3; 2. ఊర్ధ్వప్రదేశము. "క. తెలతెల వేగిన నగ్గిరి, జలజల ప్రవహించుసెలలచప్పుళ్లు శిఖా,వలకులకలకేకాకల,కలములు గలతలపొలంబు గనుఁగొనువేడ్కన్." స్వా. ౪, ఆ. ౧౨.

తలపోఁత. దే. వి. (తలపోయు. ధా) 1. ఆలోచన. "సీ. దైన్యంబు తలపోఁతఁ దలకొన్నచెలువ కానన మున వెల్లఁదనంబు గదిర." భార. విరా. ౨ ఆ. ౧౦౬. పాండు. ౫, ఆ. ౫౦; 2. కోరిక; వలపు. "చ.. నన్ను నెత్తెఱఁగునసైనఁ బొందఁగ మదిం దలపోఁత కల్గెనేని క్రచ్చుఱ మునివర్గ వాహనుఁడవై చను మమ్ము..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౭౬. నిర్వ. ౮, ఆ. ౭౬; 3. విచారము, చింత. "గీ. తనయుఁ లందఱుఁ బొలియుట వినిన యదలు, మానసంబు దహింప నమ్మనుజవిభుఁడు, వొగులుచును వచ్చె ననుతలపోఁతఁ జేసియుల్ల మక్కటికమునఁ జొత్తిల్లుచుండ." భార. స్త్రీ. ౧, ఆ. ౧౧౭. ఆం. భా. ప్ర. ౧౦౨; 4. ఊహ. "క. కలదో లేదో యనియెడు, తలపోఁతయ కాని నిశ్చితము గాదు సురాదులకుఁ బునర్జన్మం బున, కలిమియుఁ లేమియును నరులు గానమి తప్పె." భార. అను. ౫, ఆ. ౧౬౨. ఉ. హరి. ౪, ఆ. ౯3.

తలపోటము. దే. వి. తంగేడుశీ. "గీ...తలపోట మగును ఒంగే డన నభవ." ఆం. భా. ద్వి. ౬౨.

తలపోయు. దే. అ. క్రి. (తలఁపు+పోయు.) 1. వివేచించు, యుక్తాయుక్తవిచారణ చేయు. "క. తలపోయ కొడు క్షత్రియబలమునకంటెఁ గడు విప్రబల మెక్కుడు. భా. రా. బాల. ౫౬౮. స్వా ౨, ౭౨; 2. సంకల్పించు, కోరు. "ఆ... తపము నిన్ను జేయఁ దలపోసి కీరభృంగాళిరమ్య మైనయాశ్రమమున." స్వా. ౬, ఆ, ౧౯; 3. విచారించు, ఆలోచించు. "క. అని మనమునఁ దలపోయుచుఁ, దనతమ్ముని వల్ల నెత్తి దండడి తొరఁగం, జనుదెంచు నశ్రుపూరము,కనుఁగవలో మ్రింగికొనుచుఁ గామిని పలికెన్." భార. విరా. ౨, ఆ, ౭౯. భో. ౫, ఆ. ౨౪౫. స. క్రి. 1. ధ్యానించు. "చ...ఆత్మలో,హాఁ దలపోసి సౌఖ్యముల నందఁగ..." విక్ర. ౧, ఆ. ౭౧; 2. పరిశీలించు. "గీ. తలవకారంబు శ్వేతాశ్వతరమునవెడు నుపనిషత్తులుఁ దలపోయు నొయ్యనొయ్య." కాశీ. ౨, ఆ. ౧౫౧. ఆ. ము. ౬, ఆ. 3౧; 3. నిశ్చయించు. "చ. చిఱుత తనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక..." భార. ఉద్యో. 3, ఆ. 3౬౧. భార. ద్రో. ౧, ఆ. ౭౨౫., 4. ఎంచు, భావించు. "క...కళే బరము నెవ్వఁ డాత్మగాఁ దలపోయున్." అను. 3, ఆ. ౬౮; 5. స్మరించు,జ్ఞప్తికి దెచ్చుకొను. "చ. అపుడు మనంబులోన వనయుంబు కలిం దలపోసి..." కళా. ౪, ఆ. ౯౦. భార. విరా. ౨, ఆ. ౨౯౨; 6. కోరు. "క. కవకధరాధర

చాపుఁడు, తనబలి గావలె నటంచుఁ దలపోసి మహా,వనమునకుఁ జనియె జననీ,జనకులయనుమతిఁ దనుంబు బలిపెడుకొఱకున్." వరాహ. ౬, ఆ. ౧౫.

తలపోసికొను. దే. స. క్రి. (తలపోయు+కొను స్వార్థము) చెప్పుకొను. "వ...బాంబవదాదు లిట్లాంగి తప్పు దిది యప్పవనతనయాగమన వేగంబు యగు నతండు దడయక వచ్చుటం బోయినపని పండు కాని కాయ గా దని ఛాయగాఁ దనమాటయె తలపోసి కొనుచుండ.." రామా. ౭, ఆ. ౬.

తలవీకవకాయ. దే. విణ. కలఁతనొందినది. "క. చిలువదళవాయుం లప్పుడు, తలవీకవకాయలై యథాయథలై నూ,కులుపత్తులునై మొనతల, నిలువక కామిహికడకు కెటిచెడి పాఱున్." జై. ౭, ఆ. ౧౦౨. (శ. ర. తలవికరకాయ. బ్రౌ.)

తలమాటు. దే. వి. (తల+మాటు) నాశనము చేటు. "క. అలఘురఘువంశమునను, దలమా టించు కయుం లేమి శక్యము గా నీ,వలన సమస్తంబును నే,దెలిసితి నామనము కలఁతదీఱె మహాత్మా." నిర్వ. ౯, ఆ. ౬౬.

తలమానికము. ద్వ. వి. (తల+మానికము) అలంకారార్థము తలపై పెట్టుకొనురత్నము. "ఆ. కలువవిరులచేనిఁ దలమానికము గాఁగఁ, దాల్చినట్టి దొరకు..." చెన్న. ౧, ఆ. ౧౧౭. విణ శ్రేష్ఠము. "క. కన్నియకలమానిక మగు, నన్నా గఁటిచాలిపేరియతివన్" రామా. ౫, ఆ. ౧౮౯. అచ్చ. యు. ౫౭౧.

తలమానిసి. ద్వ. వి. (తల+మానిసి) ప్రధానపురుషుఁడు, యజమానుఁడు "ఉ. దాయలు గూడి యెవ్వరు వికా నిను మాతల గాక యుండ ని,మ్మాయలు పన్ని రింత చలమా తలమానిసి వింట వింట నీ,వేయఁగ నేరవో..." వాల్మీకి. ౨, ఆ. ౧౨౨.

తలమాళిగ. ద్వ. వ్యా. (తల+మాళిగ) ఏనుఁగుకుంభస్థలమునం దలంకారముగా నుంచెడువస్త్రాచ్ఛాదనవిశేషము. "సీ. వలరాజుమదదంతితలమాళిగ యనంగఁ గలికిచన్నులఁ బట్టుకంచె లమర." వాల్మీకి. ౩, ఆ. ౩౦. ప్రబంధ. ౫౩.

తలమాసు. దే. వి. (తల+మాసు.) తలమీఁది మావి. "క. తాజెత్తికొంటిరక్కలు, నేనియుఁ (దలమాసు వోని సెత్తురుకుడుముల్, పేకాని జేసిరణ్యా సవానవ బలిమీఁఎనదనఁవగునే మీకున్." కు. సం. ౧౦, ఆ, ౧౬౬. (తలమాసువోని = మావితొలఁగని, అనఁగా అప్పుడే పుట్టిన అనిభావము.)

తలమించు. దే. అ. క్రి. (తల+మించు) అతిశయించు. "సీ. తలతలమంచుఁ ఎలమించు బలిమించు వాలించు వలిపపావడలుగట్టి." రా. వి. ౩, ఆ. ౧౧౭ కవిక. ౩ ఆ. ౧౬౦. (శ. ర. పా.)

తలమిగులు. దే. అ. క్రి. స. క్రి. అతిక్రమించు, ముందఱకిఁ బోవుదాఁటు. "క. కని యశ్వత్థామయుఁ గృపుఁడును గృతవర్ముఁడును పెక్కుఁడు బరఁగసమునన్, మనసేనకుఁ దలమిగిలిన, మనుజేశ్వర కవిసెఁ గ్రీడి మనపెలరారన్." భార. శల్య. ౧, ఆ. ౨౪౨. "క. పదముడిఁ దలమిగిలి రయం, బడరఁగ సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం, దొడరి..." భార. శల్య. ౧, ఆ. ౩౭౬.

తలమిన్న. ద్వ వి. (తల+మిన్న) శిరోరత్నము. విణ. శ్రేష్ఠము. "చ. అలరులతీవరాయ్యల యొయార పుటాటలఁ గన్నుయిక్కాలం,తలతలమిన్న..." రా. వి. ౩, ఆ. ౯౬, వసు. ౨, ఆ ౪౨.

తలమీఱు. దే. అ. క్రి. ముందఱకి వచ్చు. "క. తలపడి తలమీఱిన కాల్బలములఁ బొడిచేయ..." భార. విరా. ౫, ఆ. ౩౧. అ. క్రి. స. క్రి. (తల+మీఱు) మించు, మీఱు "క. మీరును గృహస్థధర్మము, మేరకుఁ దలమీఱి చనక..." పాండు. ౪, ఆ. ౨౯౨. "ఉ...పొమ్ము చమూవధూటి నీ, కైవశమైనదెప్పు యటు గాక నినుం దలమీఱ నేని..." జై. ౨, ఆ ౫౧.

తలము. ఉభ. దే. వి. 1. విధము, రీతి. "చ. కెలకొను జూటసొరతటి నీనవకైరవిణీవధూటితో, లలితసుధాంశుఁ గూర్చినతలంబున..." కువల. ౧, ఆ. ౩, వి. విశాము. (శ. ర.) విణ. శక్యము. "క... అట్లు, ల్లాసముతో మెలఁగఁ గాఁ దలంబె యొరులకున్." భార. ద్రో. ౨, ఆ. ౧౩౯. స్వా. ౨, ఆ. ౧౨. సం. వి. అ. పుం, 1. చాఁచిన వ్రేళ్లు గల యఱచేయి, చపేటము, 2. తాటిచెట్టు; 3. చలువ; శైత్యము; 4. గొయ్యి, గర్తము; 5. కత్తిపిడి; 6. చేయి. న. 1. వింటిదెబ్బ తగులకుండ చేతికి తొడుగుకొను అత్తెము; 2. అడవి; 3. పాతాళలోకము; 4. తాటిపండు; 5. మిట్టపల్లములు లేక సమముగా నుండు ప్రదేశము; 6. బరిమాణము;

7. కారణము; 8. ప్రదేశము, చోటు. "క... శ్రీస్తనకుంకుమసదృశగ, భక్తిసమూహ ప్రశస్తి పరిదీపితవక్షః స్థలమున తేజోమయు, కౌస్తుభకమనీయలేఖఁ గంసద్వేషిన్." ద్వా. ౪, ఆ. ౧. భార. అను. ౪, ఆ. ౪౩౭; 9 పాదముయొక్క క్రిందిభాగము ఉదా:—పాదతలము) 10. అవసరము. "ఉత్సాహ ..నీకు నలుఁగఁగాఁ, దలము గలదె నన్నుఁ బతుపు దతుఁ బట్టి తెచ్చెదన్" కు. సం. ౫, ఆ. ౬౦. పుం. న. 1. కుడిచేతితో వీణాతంతులు మీటుట, 2. స్వరూపము, 3. క్రింది భాగము. (ఉదా. తరుతలము.)

తలముదప్పు. దే అ. క్రి. (తలము+తప్పు) 1. అశక్యమగు, శక్తికి మీఱు. "ఆ. అనుదు నరులఁ డిట్టులను దేవ తమతమ, నేర్పుపసులవెంట నొగడి ప్రతుక, వలదుఁగాక నగరఁ దలముదప్పిన మెలం, కువలకలుపు లియ్యకొనుట తగుసె." భార. విరా. ౧, ఆ. ౫౬౬. హరిశ్చ. ౪, ఆ. ౭౩; 2. మితిమీఱు. "సీ. తనరూపునకుఁ దోడు దలము దప్పినగర్వ మరకంటఁ జూడఁడే నరిగినపుడు." కాశీ. ౭, ఆ. ౭౦. ద్వి. హరిశ్చ. పూ. ౪౪౧. పం.

తలమునుఁగు. దే. అ. క్రి. (తల+మునుఁగు) అతిశయించు, అధికమగు. "క. అని తలమునిఁగిన పగలం దను మఱచి దశాననుండు ధరపై మూర్ఛిల్లిన ." భా. రా. యు. ౧౩౯౭.

తలమునక. దే. వి. (తలమునుఁగు ధా.) శిరస్స్నానము. (శ. ర. బ్రా.) విశ. 1. తలముంచునది. "క. ఇలఁ జిత్రము కారకుకర్ణతలసంగత మైనఘోరశరవారి పోరన్ నిలుపగుఁ దనుఁ జోరకదరినఁ దలమునక యగు న్విరోధితతి కబ్జభవా." కు. సం. ౪, ఆ. ౧౪. వరస. ౫, ఆ. ౭౪; 2. అధికము. "క. ఊహలు కుత్తుకబంటై, మోహము తలమునక లగుచు..." హంస. ౫, ఆ. ౩౫. హంస. ౫, ఆ. ౧౫౬; 3. దుర్భరము. "వ...గురుండు మొదలైనయందఱకును సాధనంజయుం పోరు దల మునకలయ్యె..." భార. భీష్మ. ౩, ఆ. ౫౧౯. కు. సం. ౪, ఆ. ౧౪.

తలమున్క = తలమునక. విశ. 1. తలముంచునది. "ఉ.తత్తరశాయి తేటుణకటాక్షవిలాసరస ప్రవాహమున్, కుత్తుకబంటి తామరలకుం దలమున్కలు గండుమీలకున్." విజ. ౩, ఆ. ౧౫. కళా. ౧, ఆ, ౭౦; 2. అధికము. "సీ. మును దలమున్కలౌ మోహాంధకారంబు వెసుక దీసినరీతి వేణి దనర." దశా. ౭, ఆ. ౧, ఆ. ౧౭౧; 3. దుర్భరము. "సీ. మద్భావహావీర్యంబు మహితవీర్యంబున దలమున్కలైనవద్ధర్మ వృత్తి. గీ. సంగరము సేయఁజాలక శత్రు లిట్లు,నొంప నద్దలి వడయుట సొంపు గాదె." భార. శల్య. ౫, ఆ. ౪౦౭.

తలముదులు. దే. వి. బ. (తల+ముదులు) చోరులును వేటకాండ్రును ఉపయోగించు ఒక సాధనము. "చ. వలలును బోటుకోలలు సివంగులబండ్లు ముకుదబల్లెముల్, తలముదు లుర్లుబోనులు... అది సాధనంబులు..." ఇందు. ౫, ఆ. ౫౭.

తలముల్లు = తలముదులు. "క. బలపముఁ గన్నపుఁ గత్తియుఁ, దలముల్లును .." పరమ ౪, ఆ. ౧౭౪. వేం. పంచ. ౩, ఆ. ౯౯౯.

తలమోయు. దే. స. క్రి. (తలన్+మోయు) శిరసావహించు. "సీ...లోకపాలురు నీయాజ్ఞఁ దల మోచి నిఖిలభువన,పరిపాలనిపుణులై భాసిల్లుచున్నవారు..." భాగ. ౧౦, స్కం. ఉ. ౭౬౪.

తలమోసల. ద్వ. వి. (తల+మోసల) మొగసాలయొక్కతల. "ఉ. ముజ్జగ మేలువేల్పు తలమోసల నుండి వివాహయత్నముగ్,సజ్జ మొనర్ప..." వసు. ౫, ఆ. ౭౩.

తలయంటు. దే. అ. క్రి. (తల+అంటు) అభ్యంగమునకై తలమీఁద నూనెపెట్టి రాచు. "సీ. తల యంటి రతిపుణ్యకాంతసాంగనలు సెంతయు నింగుదీఫలతైలమునను." పి. శకుం. ౪, ఆ. ౬౫. పరమ. ౫ ఆ. (శ. ర.) వి. అభ్యంగము, తలమీఁద నూనెపెట్టి రాచుట. (శ. ర.)

తలయంపి. దే. వి. 1. తలగడ, ఉపధానము. "గీ... అట్టిచేఁ దలయంపిగా నవ్విభుండు, దర్భశయనుఁడై వాసరత్రయము నియతి, నుండ..." భా. రా. యు. ౫౧౩. ఆం. భా. ద్వి. ౧౬౪; 2. పండుకొనునపుడు తల యుంచుకొనుదిక్కు. "చ. అదుగులయందు శౌచవిధి యాత్మ నొనర్పఁ దలంపకీవు గాల్గడ దలయంపి గా నిమరగొన..." హరి. పూ. ౧,ఆ ౮౭.భార. ఉద్యో. ౧, ఆ.౬౫.

తలయగు. దే అ. క్రి. (తల+అగు) కూడు, కలియు. "చ. మలసి బుణానుబంధమహిమన్ హృదయే

శ్వరుఁ డ త్త న త్తమా, మలతలగాకయుండఁ బలి మాస్తురు కాంతలు వారి కెన్నఁడున్, గలుగవు వశ్నువాసులు..." వేం. పంచ. ౪, ఆ. ౩౭౯. హరి. పూ. ౫, ఆ. ౨౭౦.

తలయూరి = తలవరి. (ఆరెకుఁడు) "ఉ. ఆతలి గొంచుఁ బోయి తలయూరులు ఘోరవనాంతర స్థలిన్, జేతులు గాళ్లు దున్కలుగఁ జేసిన..." సా. 3, ఆ. ౧౩౦.

తలయెత్తు దే. అ. క్రి. (తల+ఎత్తు) 1. తల పై కెత్తు. "క. చెలువుఁడు సెప్పక పోయిన, పొల పున నొకముగ్ధ మున్ను చూడ నచుచు న్గాఁ,దల వంచి యుండఁ జాలక, తలయెత్తెను మరుఁడు లోనఁ దలయెత్త నృపా." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౬౬. ఉ. హరి. ౫, ఆ. ౨౧౩; 2. మొలచు. "చ...తొలుసావిఁ బయోధరధారఁ దోఁగున,య్యిలఁ దలయెత్తు ప్రత్తపు బచేపున వే పులకల్ తనూలతన్, మొలవఁగ నున్న నవ్వి..." పాండు. ౨, ఆ ౫౭; 3. విజృంభించు, చెల రేగు. భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౬౬; 4. సాహసించు. "ద్వి. శరమొప్ప నీరథ గలిగిన నన్ను, సురరాజు తలయెత్తి చూడంగ వెఱచు." రం. రా. అయో. ౧౦౪. పు.

తలయేరు. దే. వి. (తల+ఏరు) శిరోవేదన, తలనొప్పి. "క...వగరును, దలయేరును నుక్కసయును దల కొను దెంచెన్" భార. ఆది. 3, ఆ. ౯౧. స్వా. ౫, ఆ. ౨౭, 2 పశురోగవిశేషము; "ద్వి. తల యేరు తోడకువాతము కల్లవాపు, నలదొబ్బ తెవు లును వాదిగా నెన్నఁ, గలపశురాలరోగములకు నెల్ల." నవ. ౧, ఆ. ౪౧, పు.; 3. పొలము దున్నుట కేర్పఱిచిననాఁగళ్లలో ముందు నడచు నాఁగలి (గ్రా)

తలయేఱు. దే. వి. (తల+ఏఱు) మందాకినీనది. "గీ. అభ్రగంగశిరస్స్రోద మలరున దల,యే ఱనంగ..." ఆం. భా. తృ. ౬౦. "సీ. తలయేఱు దాల్చిగట్టులు పట్టె నగధన్వి .." రామా. ౫, ఆ. ౩౧౭.

తలరారు. దే. అ. క్రి. (తలరు+ఆరు) ఒప్పు. "క. తలతల మనునపరంజిం,దలతలమనుఁ జెలువబల్లిదపు డాల్పులువిం,తలఁ దలరారెడు నమ్మెలఁ, తలతల మానికము సన్నఁదరమే చూడన్." అచ్చ. బాల. ౧౩౩.

తలరు. దే. అ. క్రి. 1. చలించు, వణఁకు. "ఉత్సాహ. అతులశౌర్యుఁ డనిలతనయుఁ డమితవాహినీ వదా, హాలి ధరిత్రి దలర నిట్టు లరిగి..." భార సభా. ౧, ఆ. ౨౪౪. శ్లో. సకంపయన్నివ మహీం బలేన చతురంగిణా సం. భార. సభా. ౧, ఆ ౨౪౪; కు. సం. 3, ఆ. ౧౦౭; 2. జంకు, వెఱదీయు. "క. తలరక మను సౌగం ధికములు గొని యిప్పుడును దర్పమున నిందులపు, వ్వులు గొని మణిమత్ప్రభృతులఁ, బలువుర వధి యించె నెట్టిబలియోఁడో యనుచున్." భార. అర. ౪, ఆ ౨౫. మార్క. ౧, ఆ. ౧౫౭; 3. అతి శయించు. "క. పూఁబోణులకును విటులకు,వే బోకలఁ దలరుసొంపు పేడ్కలుపుఁ బరిన్, వేఁబోకఁ బోఁకతోఁటల, పూఁబాళలకమ్మ తావిఁ బొదలినగాడ్పుల్." భీమ ౧, ఆ. ౯౫ పీఠా. 3, ఆ. ౩౫; 4. బయలువెడలు. "క. అలంత మెయి మున్న పలికిలి,నలుకనినాదులకు తీక్ష్ణమై యింతకు నుజ్జ్వలదహనాకృతిఁ దక్షుఁ, దలరఁగఁ బ్రేరేప కేల తానెడ నుడుగున్." భార. ఆది. ౨, ఆ, ౧౩౮; 5. తొలఁగు, చెదరిపోవు. "వ.. సౌభద్రుఁడు వడుటయు వారిబలంబులు రిచ్చవడి ధండనంబు పక్క తలచిన ధర్మపుత్త్రుండు ప్రబల యోధవీరలోకంబు నాలోకించి యి ట్లనియె." భార. ద్రో. ౨, ఆ. ౧౩౫; 6. దుఃఖించు. "క. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతం బైనఁ గడుం, దలరి..." భార. అర. ౨, ఆ. ౬౪. కు. సం. 3, ఆ. ౧౦౭; 7. త్వరపడు. "చ. వెళవెళ మబ్బు విట్టుఱుకు భీతివిదూరశిలాంకురచ్ఛటో,త్పులకినియై ప్రియుఁ న్నిదురవోవుహరి న్వడిఁ గౌఁగిలింపఁగాఁ, దలరి ధరిత్రి సాఁచుగరుదాల్చినకే లన..." అము. ౪, ఆ. ౧౦౧; 8. కలఁతనొందు; బాధపడు. "చ...తదీయదేశముల్,ఎలరక యొప్పె రోగ భయతస్కరడామరవర్జితంబులై." భార. ఆది. ౯, ఆ ౭. "క...ఇట్లామలతమెయి వనట వెల్లునఁ,దలరవలసె దిక్కుమాలి దైవము చెయి దిన్." భా. ర. స్త్రీ. ౨, ఆ. ౫౭; 9. ఒప్పు. "క. అలి నలరుఁగొమ్మలను వి,త్రిలి సద్విజరాజ సంగతిఁ దగి సువర్ణో,జ్జ్వలమై సుమనోభినుతిం, దలరి పురమకోట తోఁట తనరుఘనశ్రీన్."

కవిజ. ౧, ఆ. ౪౨. అచ్చ. బాల. ౫౩; 10. తిరుగు, వర్తించు. "క. మలగొంగ మొదలు గల కేళుల్ల నంపఱ బొఱదలిమి లోఁగని కడిమిఁ దలఁచుకొనుకు .." అచ్చ యు. ౪౭౨ వి ధయము అం. భా. క్ర. ౧౩౩.

తలవంచు. దే. అ క్రి. తల+వంచు) సిగ్గిలు. "సీ కందర్పచంద్రసాక్రందనసుతులకుఁ ఏలవం ప దివ్వనిలలితమూర్తి." వి. పు. పీ౪. ౪౬.

తలవంపు. దే. వి. (తలవంచు. ధా.) 1. తలవంచుట "గీ. వెలయం జాతనిదేవేరి విలితభర్తృ, దేవతా జననిఁకురుంబ లిప్పమాంబ, బహుసుహాభోగముల నంచుభర్తకుఁ దల,వంపు లొనరించినధరిత్రి పెంపుఁ దగడి. చంద్ర. ౧, ఆ. ౩౧.; 2. సిగ్గు. "ఉ. పంకజనీలపంకరుహాభావము దాలుచుకన్ను కోయి మే,ల్పొంకము సైఁచు నీదుముఖపూర్ణనిశాకరుఁ జూచి చూచి యా, పంకజబృంద మెల్లఁ దల వంపులకుం దగుఁగాక యర్హమే. పంకజనేత్ర నీకుఁ దలవంపుల హేతుకలజ్జ మెత్తురే (పైరెండగ్గములు ఉదాహరణములు) విణ. దుఃఖకరము; లజ్జాకరము "ఉ. మారునిమాయకంపు దినమానము మేల్ సడలింపు జారిణీ, జారులకు స్తరింపు బలజంబులకుం దలవంపు కోకసం, సారము మట్టగింపు. .." లక్ష్మీ. ౪, ఆ. ౪౧.

తలవరి. వై. వి. (సం. స్థలవారః. ప్రా. తలారో) ఆరెకుఁడు, రాత్రులందు దొంగతనము మున్నగు నేరములు జరుగకుండ గస్తుతిరిగి కావలి కాచుటాటు. "చ. తలవరు లింతయుం దెలిసి తల్లడమందుచుఁ గుందుచున్నవా, రిలకుయి లేనిదొంగ నిపు డెచ్చటఁ దెచ్చెద మంచు..." పరమ. ౩, ఆ. ౫౯. నా. పంచ. ౧, ఆ. ౪౪౮; 2. పండసాధికారి. "క. రం డిదె వేంచేయుం డిదె దండ మిదన్ వచ్చినాఁడు తలవరి మీకున్." వైజ. ౪, ఆ. ౮౬, మార్క. పీ౩. ౩౫.

తలవాకిటియిల్లు. దే. వి. (తల+వాకిలి+ఇల్లు) పౌరగిల్లు. "ఉ....వానిమద్గృహ, ద్వారముఁ దూఱి నీక తలవాకిటి యిండ్లకుఁ బోదు చెప్పదున్." కేయూర. ౨, ఆ ౬౭.

తలవాకిలి. దే. వి. టౌ. (తల+వాకిలి) ఇల్లులోనగు వానిముఖద్వారము. "చ. కలుషలవైరి జక్కవలఁ గావఁగఁ బూనిన ధాక...ముత్తితలవాకిలి... తామరలవిందు వెలుంగుచు నుండె నయ్యెడన్." ద్వా. ౫, ఆ. ౭౯. భీమ. ౫, ఆ. ౬; 2. నా. తలను వాకిలివంటిది-నోరు. "సీ వాణి యేమి తనూక్తి వదలదు తలవాకిలి నిలేకుమాట మోచె ననఁ జేసె." వసు. ౧, ఆ. ౩౬, ఇందు. ౧, ఆ. ౧౪౫. ఈరెండు పద్యములు మొదటియర్థమునకు నుదాహరణములు. , 3. ఇంటివెలుపలి ప్రదేశము (చూ. తలవాకిటియిల్లు.)

తలవాడె. దే వి. చెఱకుకొన అం. సం. స్థా. ౯.

తలవారి = తలవరి. (పండసాధికారి) "గీ. మూండటను గంచుకొమ్ము మిన్నంది మొరయుం, జారచోరులగుండియల్ ఝల్లనంగ, వెడలి కోలాహలంబుగా వేకవాటి,జేరి యప్పట్టణము తలవారి గాంచె." వైజ. ౪, ఆ. ౭౮.

తలవిడి. దే. వి. తాటిచెట్టు లోనగువాని తలకుండు. (శ. ర. బ్రౌ.)

తలవిల్లు. దే. వి టౌ. (తల+విల్లు.) వింటిముందటి భాగము ? "వ. వలరాజుబలిగృహమహీతలంబులు మొదల గెలిచి పిదప పరపురంబు గుఱికీసి తలవింట నంటించి తెగ నిండఁ దిగిచినకలువపువ్వు ములికిరియునుం బోలె..." సాంబో. ౧, ఆ ౯౩.

తలవీడు. దే. వి. (తల+వీడు) తలవాకిలి, గృహముఖద్వారము. "క. కులకన్యకలకు వేడుకఁ, దలవీడులఁ బరులతోడి తగుమాటలకుం, దలకొనఁ దగునే..." భార. అను. ౧, ఆ. ౫౧, దశ. ౬, ఆ. ౧౨౫.

తలవెట్టి. దే. వి. (తల+వెట్టి) పెద్దవెట్టి. "గీ...తలవెట్టి గొని యలగౌతమాంగ, వామణి సురేంద్రునొకనాడు నంటఁ జేసి, యావఁలఁ జెంది సకలలోకాపవాద, మొందు టెఱుఁగవె యట్లు గాకుండ వలయు." శుక. ౨, ఆ. ౧౬౦.

తలవ్రాత. దే. వి. (తల+వ్రాత) నొసటివ్రాత. "చ. తలవ్రాతకుఁ దప్పులు గల్గ నేర్చునే." శుక. ౨, ఆ. ౫౦౬.

తలశబ్దము. ద్వ. వి. (తల+శబ్దము) చప్పటులధ్వని. 'చ...వేగమ తా నెదుర్చై కడంగి యే,డ్తెఱఁ దలశబ్ద మిచ్చినఁ గడింది వృషాధముఁ డగ్గలంపుఁ దెం,పుఱవుగఁ దాఁకెఁ గృష్ణు నతఁ డొడ్డినకొమ్ములు నట్టెఁ బిట్టుగాన్." హరి. పూ. ౮, ఆ. ౪౬.

తలసాల. ద్వ. వి. (తల+సాల) తలవాకిలి. "క... భీతిఁ బులి పులి యనుచున్, దలసాల వెడ

తం దొక, హాలికుఁడు శరచాపహస్తుఁ డయి నిక్కం
కన్" వేం. పంచ. ౩, ఆ. ౫౧. ద్వి. హరిశ్చ.
ఉ. ౯౯౪. పం.

తలసూపు = తలచూపు. (తలపడు, ఎదురగు.) "వ... దేవదానవుల కయిన దుర్జయుం డగునర్జునునకుం దలసూప నిచ్చుకే .."భార. విరా. ౪, ఆ. ౧౯౫.

తలా దే. అవ్య. చెరి యొక్కనికి. "ఉ. అం అకం డలా యొకటి స్వార్థము గల్గుట దోసఁ బల్కెన్." ప్రభా. ౩, ఆ. ౭౯. పరమ. ౪, ఆ. ౧౩౬.

తలాఁడి. దే. వి. (తల+అఁడి శ. ర.) తలగడ, ఉపధానము. "చ. సిదికిలి పాన్పుపైఁ బలికి నొయ్యనఁ గేలు తలాఁడి చేసి .." ఉ. హరి. ౫. ఆ. ౧౦౫. ఆం. భా. ద్వి. ౧౬౩.

తలాటము. దే. వి. (తల+ఆట) 1. తురాయి, గుఱ్ఱమునకుఁ బెట్టెడు శిరోభూషణము. "గీ. నీలికుంచె తలాటంబు దేరజంబు, మణులమొగముట్టు పన్ని సాహిణి యొకండు, కర్త యెదుటికిఁ గొని చ్చె......సైంధవంబు" స్వా. ౪, ఆ. ౭౮, ఆం. భా. ద్వి ౧౯౯; 2. (ముసుగులు మున్నగువాని యొక్క) నొసలిచేసినముఖభాగము. "సీ. కామసింహము గెల్వఁ గలదని దనరఁగ సింగపుఁదలాటపునీలి కాసె యొనఁగె." సమీర. ౩, ఆ. ౮౧౭.

తలాడ. ద్వ. వి. తలగడ, ఉపధానము. "ఉ పట్టు తలాడమఁన్ వాశఁది పచ్చుకుంబము..." పాంచాలీ. ౫. ఆ. ౧౦. హర. ౪, ఆ. ౧౭.

తలాతలము. సం. వి. అ. న. అధోలోకములలో నొకటి.

తలారి. వై. వి. (సం. స్థలవారిక) తలవరి, ఆరెకుఁడు. "గా... డాఁగఁ బోయిఁనఁ దలా రిల్లయ్యె నేఁ డేదకున్, బో నా..." ౧, ఆ. ౭౯౭. ఆం. భా. ద్వి. ౧౪౩.

తలాయించే. దే. అ. క్రి. మరలు. "వ...మక్కువం గ్రేపులం దలంచి తలాయించక తమకంబులం దమకముయంత సంభారవంబులు నేయుచు .." భాగ. ౧౦. స్కం. పూ. ౧౧౯౬. భాగ. ౧౦. స్కం. పూ. ౯౬౬.

తలి. దే. వి. తల్లి. "క. మొలకలు రాజకుమారులు, తలిదండ్రులు లేనివారు..." వై. ౧, ఆ. ౬౩.

తలికి. దే. అవ్య. ముందు, పూర్వము. ఉదా— ప్రొద్దపొడుపతలికి వచ్చినాఁడు. (శ. ర.)

తలిగ. వై. వి. (సం. స్థాలికా.) కంచము, భోజన పాత్రము. "సీ. తెలె హరివాణంబు తలిగ కంచము కట్టు చాకి లనంగఁ గంపంబు దనరు." ఆం. భా. ద్వి. ౨౪౪.

తలినము. సం. వి. అ. న. శయ్య, పఱుపు. విణ. (అ. అ. అ.) 1. విరళము, పలుచనిది; 2. స్వల్పమైనది; 3. నిర్మలము; 4. దుర్బలము.

తలిమము. సం. వి. అ. న. 1. దూదిపఱుపు; 2. వితానము, మేలుకట్టు; 3. రాతితోఁ గట్టిననేల; 4. కత్తి.

తలియ. వై. వి. (సం. స్థాలికా.) భోజనపాత్రము, కంచము. "ఆ. తలియ పళ్లెరంబు తెలె హరి వాణంబు, తట్టె కంచ మనఁగఁ బరఁగు పాత్ర." ఆం. సం. మాన. ౩౦. వేంక. మాన. ౪౭.

తలిరాకు. దే. వి. (తలిరు+ఆకు) చిగురాకు. "క. తలిరాకుగుత్తిఁ గమిఁ గోయిల చంచునఁ జించి క్రోలుటీలని..." పారి. ౩, ఆ. ౪౯. ఉ. రా. ౬, ఆ. ౭.

తలిరించే. దే. అ. క్రి. చిగుర్చు. "ద్వి. తలిరించి కడు నివతాళించుచున్న, యెలమావి క్రిందటి కేతెంచి నిలిచి." ద్వి. పరమ. ౨, ఆ. ౫౭. పు.

తలిరు. దే. వి. చిగురు, పల్లవము. "క. కలయఁగఁ గరముం జరణంబుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం, దలి రెసఁగినవదమామిడి చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్." భార. భీష్మ. ౩, ఆ. ౨౨౩. ఆం. భా. ద్వి. ౩౯. విణ. లేత, తరుణము. "సీ. తలిరు బ్రాయమువాని నలరాజు నలరాజు నలరాజుఁ దెగడుసోయగము వాని." వసు. ౩, ఆ. ౪౬. సీలా. ౧, ఆ. ౭౬.

తలిరుఁబోఁడి. దే. వి. (తలిరు+పోఁడి) ఆఁడువి, మనోజ్ఞురాలైనఆఁడుది. "సీ. త్రైలోక్యమునకు జంద్రకళాధరుఁడు తండ్రి తల్లి యాఁగాక యీ తలిరుఁబోఁడి." హర. ౪, ఆ. ౬౪. దశా. ౧, ఆ. ౨౭౨.

తలిరుఁబోణి = తలిరుఁబోఁడి. "గీ. తమ్ములము నేయుచో నొక్క తలిరుఁబోణి, రాకుమారునిఁ జూచి .." సైమ. ౬, ఆ. ౬౩.

తలిరుగ్రోలుగువ్వ. దే. వి. (తలిరు+క్రోలు+గువ్వ.) కోయిల. "సీ ..పిక మాఁ గోవెల కోయిల తలిరు గ్రోలుగువ్వ కెంపు, గీ. కన్నులపులుఁగు పెంపుడు గున్న యనఁగ." వేంక. నిర్వ. ౧౦౭.

తలిరుటాకు. దే. వి. (తలిరు+ఆకు) చిగురాకు. "సీ. తలిరుటాకులు కటారులమాడ్కి మెయి సోఁకఁ గపురంబు పెంధూళిగలిని కప్పు." రసిక. ౪, ఆ. ౨౩. రాధికా. 3, ఆ. ౭౩.

తలిరుదిండి. దే. వి. (తలిరు+తిండి) కోయిల. "సీ. నకె కెందలిరుదిండులకు వందన మొనర్చి చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చి." విజ. 3, ఆ. ౩౯. ఇట్లే: తలిరుమేఁతరి. సాం. ని. తిర్య. ౭౭.

తలిరువిల్తుఁడు. దే. వి. మన్మథుఁడు...సాం. ని. దేవ. ౧. ఆం. భా. ప్ర. ౪౫.

తలిర్చు. దే. అ. క్రి. 1. చిగుర్చు, పల్లవించు. "మ..వసంతకుండు దమపైఁ గన్నిడ్డఁ గారాకుఁ గెం,దలిరాకయ్యెనో నాఁ దలిర్చె వడిఁ గాంతారాంతరక్షోణీజముల్." కు. సం. ౪, ఆ. ౧౫. భార. ఆది. ౪, ఆ. ౨౦; 2. సంతోషించు. "క. అకా పట్టువడియె ధర్మజుఁ, డదయుం డగు ద్రోణుచేత నక్కట నేఁ డు,న్మదుఁడై సుయోధనుఁడు దం,డ్రి దలిర్పఁగ నేఁగుఁ గరిపురికిఁ గొనియెలమిన్" భార. ద్రో. ౧, ఆ. ౧౨౦. వసు. ౪, ఆ ౬; 3. అతిశయించు అధికమగు. "గీ. కౌతుకము పూని యొండొరుఁ గాంచఁ దివురు, చంచలాక్షికిఁ బతికి నేత్రాంచలములు, గూర్చెఁ గలరాచయొజ్జ కోర్కులు దలిర్ప, నదికదా భావికోధనవ్యంజకంబు." వసు. 3, ఆ. ౫౨. భార. భీష్మ. ౧, ఆ. ౧౬౯; 4. ఒప్పు. "సీ. రాగభేద ములపర్వ్యములఁ దొలఁగించి లయశాళశుద్ధి సొంతమూఁ దలిర్ప." కళా. ౨, ఆ. ౩౩. భార. ఉద్యో. 3, ఆ. ౧౧౦, 5. కనఁబడు. "సీ. చేరఁ జేరఁ దలిర్చె వీరలక్ష్మీవాసవనజాతదళముపై వక్రశిఖలు." వసు. ౪, ఆ. ౯౧. భార. భీష్మ. ౧, ఆ. ౧౧౦.

తలిర్పు. దే. వి. (తలిర్చు. ధా.) అతిశయము, పెంపు. "క. మునివర నాదగుచిత్తంబునఁ గౌతూహలము చాల మొలతెంచి తలిర్పున నెలరాకెదు..." భార. అను. ౪, ఆ. ౪౪౭.

తలిమము. వై. వి. (సం. తలిమమ్.) శయ్య, పఱపు. "క. బలుసెన శైవవి గూర్పఁగ, బొలివోవని లేఁత పాయపుం బోగరులతోఁ, దలిపము లెక్కొడి వన్నెల, పులుఁగులఁ గని తనదుమదిని బొదలు విరాళిన్." య. ౨, ఆ. ౮౬. (శ. ర. పా.)

తలుఁగు. దే. అ. క్రి. పోవు; తొలఁగు. "సీ. ఇక్కన్య యతిబాలయుం దుద్భవం బగుదౌహిత్రలాభంబు దలుఁగ కెట్లు. ఆ. దీనిఁ బుత్తు..." భార. ఆది. ౬, ఆ. ౨౪౮. "చ. అటు దలుఁ డొర యొంతటి మహాత్ములు మీరలు.." కళా. ౫, ఆ. ౩౮. స. క్రి. పోఁగొట్టు. "సీ. ఉత్తమక్షత్త్రియుం డొరులదుఃఖంబులు దలుఁగంగఁ బుట్టినధర్మశీలుఁ, డలయుక మృత్యుభయం బైనచో విప్రుఁ గాచి పుణ్యలోకములు వడయుఁ." భార. ఆది. ౬, ఆ. ౨౧౬. భార. ఆర. 3, ఆ. ౧౯.

తలుగు. దే వి. పసులఁ గట్టెడుపలుపు, సందానము. "క. తలుగులపొది యొకదెసఁ బెయ్యలదామెన యొక్కయెలన నచుపై యుండెడన్, మొలమోచి పెక్కుచుట్లం, బలుద్రాటం బట్టి గోపభావం బమరన్." భార. విరా. ౧, ఆ. ౧౨౫, ఆం. భా. ద్వి. ౨౩౧.

తలునము. సం. వి. అ. పుం. వాయువు.

తలుని. సం. = తరుణి.

తలునుఁడు. సం. = తరుణుఁడు.

తలుపు. దే. వి. కవాటము, "మ. ఒకనేత్రాంబుజ మొక్కగల్ల మొకచన్నొయ్యారపుస్జీల పీఠిఁ దోఁపన్ దలుపోరగా నొకపురంధ్రీరత్న మీక్షించె రాజకిశోరంబు..." స్వా. ౫, ఆ. ౬౯. ఆం. భా. ద్వి. ౨౧.

తలేరు. దే. వి. (తల+ఏరు) తలనొప్పి. "సీ...తలేరుదనఁగ శిరస్తోదము నగు .." ఆం. భా. ద్వి. ౧౨౮.

తలోద. సం. వి. ఆ. స్త్రీ. నది, ఏఱు.

తలోదరి. సం. వి. ఈ. స్త్రీ. సన్ననినడుము గల అఁడుది; ఆఁడుది.

తల్కము. సం. వి. అ. న. అడవి.

తల్కు. దే. వి. 1. కాంతి. "మ. తననీటుల్ మెఱయించు జేనపొడవుం దాల్మింటె యగందంపుఁగుం, దనపుందల్కులు గ్రమ్మరించుఁ జిలుక...కత్తిచిమ్మున్..." కువల. ౫, ఆ. ౪; 2 ఒప్పు, ఇంపు. "చ...వానివింతయుం, దమలకు వానియుచ్చక పుఁడల్కులకున్ మఱి వానిమేనిజాల్, కొచురున కేను మేనువడి గుత్తకు నిచ్చితి నేమి చెప్పుదున్." కువల. ౪, ఆ. ౧౭౬; 3. మెఱయుట కనుకరణము. "చ. తనతనుకాంతి దల్కను సుధారస పూరము గాఁగ..." కు. సం. ౭, ఆ. ౧౪౧.

తల్గు. దే. వి. = తలఁగు. దే. అ. క్రి. (తొలఁగించుటకు: "...ప్రభుత్వమెలర్పఁగఁ దాల్మియఁ దుస్తరతరమానస వ్యథలు తల్గుము." భార. అర. ౬, అ.) (శ. ర.)

తల్పకుఁడు. సం. వి. అ. పుం. పక్కలు వేయుబంటు.

తల్పము. సం. వి. అ పుం. న. 1. పఱుపు, శయ్య; 2. మేడమీఁదిగది, అట్టాలకము, 3. భార్య; 4. ఓడ ముందటిభాగము; 5. యుద్ధము.

తల్పు. దే. వి. కవాటము. "చ. తలఁకునఁ గోటనల్గడలఁ దల్పులు వేల్పులు మూసి..." ఉ. రా. ౪, అ. ౨౭౨.

తల్లఁపి. దే. వి. పరుండునపుడు తల యుంచుకొను దిక్కు. "ఉ. కరవీరపుంజాయలదట్టేఁ జుట్టి వే, తల్లఁపి దిక్కునందు నిడి .." రా. వి. 3, అ. ౨౮. (శ. ర. పా.)

తల్లజము. సం. విణ. (అ. ఆ. అ) శ్రేష్ఠము. (ఇది వృత్తియం దుత్తరపదమై ఈయర్థము నిచ్చును. 'ఇతర విశేషణములకువలె విశేష్యాను సారముగ రూపము మాఱ' దని సూ. ని.) "క. పల్లవపేశల శయ్యా, వేల్లగ్రీతులకుఁ దనిసి విపులధ్వనులం, బెల్లెనయుఁచుఁ బుంస్కోకిల, తల్లజాలు వసంతవేళఁ బనరిరి మిగులన్." కాళిందీ. ౪, అ. ౨౦.

తల్లడకుడుచే. ద్వ. అ. క్రి. (తల్లడము+కుడుచు) తల్లడము నొందు (శ. ర. బ్రౌ.)

తల్లడపడు. వై. అ. క్రి. (తల్లడము+పడు) చలించు, వడఁకు. "క. అని మొన సాల్వుఁడు ప్రద్యుమ్ను నిశాతశరాలిబిద్ధమూర్తుం డయి పెల్చన మూర్ఛవోయి పడియెం, ఎనరథముపయిం ధరిత్రి తల్లడపడఁగన్." భార. అర. ౧, అ. ౧౬౫. భార. అర. ౩, అ. ౨౯; 2. బాధపడు. "క. పల్లటిలిన యుల్లముతోఁ, దల్లడపడుచున్నపిన్నతమ్మునిఁ గని." భాగ. ౧, స్కం. ౩౪౬. భార. భీష్మ. ౧, ౨౯౯.

తల్లడపఱుచే. వై. స. క్రి. (తల్లడపడు ధా. ప్రే.) బాధపెట్టు. "క. దిగవిడువక ప్రాణంబులు, తగనాకంఠమున నిలిచి తల్లడపఱిచెన్." నా. పంచ. 3, అ. ౧౭౩.

తల్లడపాటు. వై. వి. 1. బాధ. "క్షి. తల్లి ధరిత్రిపై దొఱఁగి తల్లడపాటునఁ గెంది చిత్తముం, బల్లటిలంగఁ బ్రాణములు వాసిన..." భాగ. ౧, స్కం. ౧౧౯. ఉ. రా. ౬, అ. ౮౯; 2. కంపము, వణఁకు. "క. ఇది యేమో యనియెద వడిఁ బదరై గుండె...తల్లడపాటు దవరఁగఁ బలుకులదీనత, గదురఁగ." సా. ౨, అ. ౨౩౯; 3. భయము. "ఉ...మురమర్దన ముష్టిహతాఖిలాంగుఁడై, తల్లడపాటు చిత్తమునఁ దార్కొన బీరముఁ గట్టిపెట్టి యా, భల్లవిభుండు కృష్ణునకు భక్తిమెయిం బ్రణమిల్లి యిట్లనున్." వి. పు. ౬, అ. ౨౬౭.

తల్లడపెట్టు. ద్వ. స. క్రి. (తల్లడము+పెట్టు) బాధించు. "క. ఇల్లడగొని యాఁచికొనిన, బల్లిదులచె యిటిఁయఁ గట్టఁబడి కేటకముల్, పెల్లుగఁ దేల్లం గాకులు, తల్లడపెట్టంగ నొఱలెదరు నో రెండన్." మార్క. ౨, అ. ౧౦౨. భార. అను. ౫, అ. ౧౦౩.

తల్లడము. వై. వి. (సం. తరళం. త. తళ్లాట్టమ్) 1. చలనము, చాంచల్యము. "ఉ. తామరపాకు నీడ వలెఁ దల్లడ మందిరి కౌరు లెల్లరున్." ఉ. హరి. 3, అ. 3౫. కళా. 3, అ. ౧౪౬; 2. తొందర, సంభ్రమము. "చ. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై, పరువిడఁ బోకు పోకుమని .." భాగ. ౧౦. స్కం. ఉ. ౯౦; 3. కలఁత. "ఉ. తల్లియుఁ గన్నయేవురు సుదాత్తమతుల్ తమయొద్ద వాసినం, దల్లడ మంది యంద ఱును దద్దయుం దుఃఖితచిత్తులై..." భార. ఆది. ౮, అ. ౫3. భార. విరా. ౨, అ. 303; 4. భయము. "గీ. వేషభీషణదానవవితతిలోనఁ, దల్లడంబునఁ బెదన్నులు తడుపుచున్న, సాధ్విరఘువీరగేహినిఁ జక్కఁ జూచి, యవునో కాదో కదా యని యనిలసుతుఁడు." రామా. ౬, అ. ౧3౦. ఆం. భా. ప్ర. ౧33.

తల్లడించే. వై. అ. క్రి. 1. చలించు, కదలు. "చ. కనుఁగవ మ్రాన్పడంగ నెఱక ల్విరియంబడ బోరమోవ కొం, డీనవదనంబులం దెఱచి సిక్కిన యట్టులు దల్లడించుటల్, గనఁబక..." పారి. ౪, అ. ౨౧; 2. కలఁతనొందు. "అ. బహుళసంకటములు ప్రాప్తంబు లైనచోఁ, దల్లడింపఁ డాత్మతత్త్వవిదుఁడు, వాయుశీతవహ్ని వర్షాతపంబుల, కించుకైన గిరిచలించనట్లు." సీతారా. 3, అ. ౧౭3; 3. భయపడు. "సీ. అనువు వేచి, తల్లడించుచు బాణఁ దుల్లంబు గలఁగంగఁ దల

చీర విడి యాదవులు నవ్వ. గీ...పాటి యాత్మ పురము వడిఁ జొచ్చె ..'' భాగ.౧౦, స్క.౦. ఉ. ౪౩౪. దళా. ౨, అ. ౫౯; 4. దుఃఖించు. "వ. ఇంత దురవస్థ వచ్చునే యని తల్లడించు వారును ..'' ఉ. రా. ౪, అ. ౯౪. స. క్రి. బాధించు. "మత్తకోకిల. తల్లిదండ్రుల నన్ను దమ్ములఁ దల్లడించినవారలన్,మల్లడించియు మీర లిప్పుడు మాటిమాటికి నెవ్వడున్,భల్లపంక్తుల పాలు సేయుఁడు...''సానందో.౨, అ. 3౪. పు.

తల్లడింపు. వై. వి. (తల్లడించు ధా.) భయము. "సీ. తల్లడింపు కలఁకు కల్లడము కలరు జనకు జంకెన జంకు జడుపు జాలి .. య టన సధృతి యగు.'' ఆం. భా. ప్ర. ౧33.

తల్లడిలు. వై. అ. క్రి. 1. చలించు, కదలు. "చ... లతాంగిచేత్రమలే, చటులత లజ్జ దల్లడిలె...'' స్వా. ౫, అ. ౮౧, 2. బాధపడు. "శా .. వత్సోజాగ్రద మఁ గాంచి తల్లడిలు నీసుం దాపమున్ మీఱఁగాన్.'' ఆము. ౫, అ. ౧౪౯ 3. భయపడు. "సీ. శస్త్రాస్త్రములు రథ్యసారథి వర్మాంగతతి నాటుకఁ జనఁ దల్లడిలక.'' భార. విరా. ౪, అ. ౬౨. దళా. ౨, అ. ౪3౯.

తల్లడిల్లు = తల్లడిలు. 1. కంపించు, వణఁకు. "ఆ. వచ్చె నకులుఁ దమితవాహినీపదహతిఁ, దల్లడిల్లు చుండ ధరణితలము.''భార. సభా. ౧, అ. ౭౬౭. సీరా, ౨, అ. ౮3; 2. బాధపడు. "గీ. ఎగ్గతం బునఁ దానుఁ గార్గిఁ గారె, నటె యనాథయై దీనికి నంతరంగ, మలఁదురక తల్లడిల్లు యారట మునుచుడుక కలమటఁ బడక యెట్లుండుఁ జెపుము.'' భార. ఆశ్ర; ౨, అ. ౧౬3; 3. భయపడు "గీ...దానిఁ జూచి భయము దగిలి మత్తై స్వాంబు,దల్లడిల్లి యు లిసెఁ బెల్ల రేఁగి.'' భార. ఆర. ౧, అ. ౧౯౧. ఆము. ౪, అ. ౨౦౬; 4. దుఃఖించు. "గీ. మలయు నంతంతఁ జేరువఁ బొలయు నిలిచి,దస్నుఁ జూడమి -ంజయుఁ దల్ల డిల్లు.'' భార. విరా. ౨, అ. ౨౧౦. కళా. ౬, అ. ౬౨. [శయము.

తల్లము. సం. వి. అ. న. బిలము. పుం. చెఱువు, జలా

తల్లి. ఉభ. వై. వి. (సం. తల్లీ. త. తల్లి.) జనని మాత. "శా. తల్లిం దండ్రియు నన్నుఁ గా నని మనస్తాపంబునం బొక్కఁగా.'' స్వా. 3, అ. ౯౦. భార. ఆది. ౧, అ. ౧౫౯. విశ. 1. మొదటిది. (శ. ర.); 2. ముఖ్యమైనది. ఉదా.— తల్లికొండ్ర, తల్లిగోడ, తల్లివేరు. మొ.; సం. వి. ఈ. స్త్రీ. జవరాలు, యువతి.

తల్లిక. సం. వి. ఆ. స్త్రీ. తాళపుఁజెవి.

తల్లికొండ్ర. ద్వ. వి. (తల్లి+కొండ్ర) మొదటికొండ్ర. (శ. ర.)

తల్లిగోడ. ద్వ. వి. (తల్లి+గోడ) ఇంటికి ముఖ్యమైన గోడ. (శ. ర.)

తల్లితనము. ద్వ. వి. (తల్లి+తనము) మాతృత్వము. "ఉ. తల్లిరొ నీవు ధన్యకుఁడు తండ్రి యనంతయు మింతపట్టు నీ,యుల్లమునం దెఱింగియును నొక్కని పల్కులు పల్కె దింక నీ,తల్లితనంబు చాలు...'' దశ. ౧౦, అ. ౮౯.

తల్లితల్లి. వై. వి. (తల్లి+తల్లి) 1. తల్లిని గన్నతల్లి, మాతామహి, 2. (తనతల్లి గాను దల్లి యైన) లక్ష్మీదేవి. "గీ . తల్లితల్లి, కడలిపూఁబోణి సిరి లచ్చిపడఁతి తమ్మి, ఇంటిగరితి తన ౘ యెప్పు...'' ఆం. నం. జే . ౧౦.

తల్లితోడు. ద్వ. వి. ఒకానొక ఒట్టు. వా. విశ. (తల్లి+తోడు) సహాయకము, పోషకము. "సీ. జల్లిముత్తియములు మొల్లపూదండలు, తల్లితోడు థళుకు దడఁబడంగ.'' స్వా. 3, అ. ౧3౯. ఆము. ౫, అ. ౮౬.

తల్లియ. వై. విశ. (సం. తల్లీ.) ముఖ్యురాలు, శ్రేష్ఠురాలు. "క. అనినఁ బ్రభావతి తనయాత్మ నరూరా యాఁడువారితల్లియ యని చిత్తినిఁ బొగడి...'' శుక. ౨, అ. ౧౪౦.

తల్లియిల్లు. ద్వ వి. (తల్లి+ఇల్లు) 1. పుట్టిల్లు. "సీ. ధనసమృద్ధుల కెల్లఁ దల్లియిల్లుగుటఁ గుబేరుని పీటికిఁ బెద్ద యనియు.'' నిర్వ. ౧, అ. ౪౬; 2 పుట్టినటివని లద్దంకి లేక ప్రకాశించు గిన చోటు......'' సీ. ఏమా నిముాలంబు గలకు సాధారనై శేషపడగఁతోఁ జెలిమిసేసు...'' పవృషమునఁ గల .. గ్గినార్గితి మంధనకనం బునకు నుండఁ దల్లియిల్లు.'' స్వా. ౫, అ. ౬౧.

తల్లియెుఱ. ద్వ. వి. (తల్లి+ఒఱ) నూతికి పైని పేరు పెద్దయొఱ. "మ. కరుణన్ దల్లియొఱన్ గుచుంబు లనుకన్ .. నూతులందు...'' ఆము. ౧, అ. ౬౬. ఆము. ౧, అ. ౫౭.

తల్లివేరు. వ్యా. వి. (తల్లి+వేరు) ముఖ్యమైనవేరు, తూఁకటివేరు. (శ. ర.)

తవణించు. దే. అ. క్రి. ఒప్పు, ఎసఁగు. "క. కువ లయహితకథవదుదిత, స్తవముచితుఁడ నైతి నీవు పలుచెడికార్యం,బులంచితఫలసిద్ధులఁ దవణించెడు నస్మదీయదర్శనలబ్ధిన్." శ్రీ. రం. ౩, ఆ. ౫౯౧.

తవన. దే. వి. (త. తవనై) గడువు, మితి (చూ. తవన తప్పు).

తవనతప్పు. దే. అ. క్రి. (తవన+తప్పు) గడువుమీఱు. "ఆ. తవనతప్పి యాములు దఱుచయ్యె మోఱు న్నులుకఁబోఱె .." పరావా. ౪, ఆ. ౬౫. పరమ. ౨, ఆ. (శ. ర.)

తవరము. వై. వి. (సం. తమరస్) లక్కలాశ. "గీ. తవర మబ్బొంగుగలి గడెపలలపిండు,బోలయు దుప్పులకదుపులవిలుబలంబుఁ, గలిగి సురలకై తొల్లి పెక్కులు రణముల, నీవు మార్కొన్న పీరుఁ డిత్వాకుఁ డితఁడు." కు. సం. ౧౧, ఆ. ౯౦.

తవలి. దే. వి. అసత్యము బొంకు. "ఆ ..టక్కు తవలి తవళి,తసుకు నసుకు దుద్దు కటపట తపత సట హుళిక్కి నా నసత్య మభిప." ఆం. భా. ప్ర. ౧౧౯; 2. దొంగ. "గీ. తవళి మోసరి యనఁ జెల్లుఁ దస్కరునకు." సాం. ని. మాన. ౧౭.

తవాయి. దే. వి. ఉపద్రవము. (శ. ర.)

తవిఁద. దే. వి. సస్యవిశేషము,చోడిశీ పైరు.శీ బ. చోళ్లు. "మ ... ఏచఁగుకుంభమ్ములలోనిముత్య ములఁ గన్గ్రిడ్డుల్ విఁర్మించి ఖిల్లగణేంద్రుల్ వెలబోమ్మలం దవిఁదచేలం జేయుందుర్ గాపుగన్." కాశీ. ౩, ఆ ౭.

తవిడాడు. దే. అ. క్రి. (తడవి+ఆడు-తడవునకు వర్ణ వ్యత్యయముచే తవుడు అనురూపము వచ్చినది.) ప్రాఁకియాడు. "క. తవిడాడ నేర్చెఁ జెవులకుఁ, జవులుగఁ బలుకంగ నేర్చెఁ జగదాధర ,రంములు ఘులుఘుల్లన లివలిచ నడుగిడఁగ నేర్చె లీలాగతు లన్." సు. ౨, ఆ. ౨౪.

తవిరుదాసరి. వ్యా. వి. ఒకజాతిదాసరి. "వ...పరిహాస కులు సుద్దలకుమాళ్లు కొమ్మాలిదాసళ్లు తవిరుదా సళ్లు..." హంస. ౩, ఆ ౨౯.

తవిలించు. దే. స. క్రి. (తవులుధా. ప్రే) 1. తవులఁ జేయు. "సీ. తవిలి బ్రహ్మాస్త్రంబుఁ దవిలింప నర్హంబు విటుప్రసవాస్త్రవర్గ వేళలందు. కాశీ. ౫, ఆ. ౯౨; 2. బంధించు. "సీ. యాఁపమునో మృగ రాజుఁ దవిలింపఁ దీర్చినమదనవాగుర లిందువదన కురులు." శైవ. ౧, ఆ. ౧౫. 3. నిష్పంటించు. "వ...ఏఱుపిడుకలదాళ్లడి జెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించిన స్బచ్చుపెరుఁగుచిచ్చు లాత్రం పులం దవిలించి చిమిడ నుడికిన వెలువరించి..." స్వా. ౪, ఆ. ౬౦. [ము; 3. బలము.

తవిషము. సం. వి. అ. పుం. 1. సముద్రము; 2. స్వర్గ

తవిషి. సం. వి. ఈ. స్త్రీ. 1. వాయుసమూహము, వాక్య; 2. ఒకానొకదేవకన్య; 3. భూమి; 4. ఇంద్రపుత్త్రిక.

తవు. దే. అ. క్రి. 1. ఒప్పు,ఎసఁగు. "క. ద్వివిధం బగుసాధర్మ్యము, భువి నుపమానోపమేయముల కొక్కటియై,తవుటయు రెంటికి ద్వివిధం,బవుట యన ద్వితీయగతియు నలరు ద్వివిధమై." నరస. ౫, ఆ. ౭౫. శేం. కుచ. ౧, ఆ. ౭౭౭; 2. అర్హమగు,తగు. "మధ్యాహ్నకర...అత్తపసి,కపిల గడ్డంబును గపిలజడలను గపిలకన్నులును, దవిన యన్నులు నల్లనైనదీర్ఘపుందనువును జూచి,యుఁవిద కన్నుంగవ మొగిచి తెలియక యుండె భయమున." భార. ఆది ౪, ఆ. ౨౫౪.

తవుగోల. దే. వి. (తవు+కోల) తవ్వుట కుపయో గించు ఇనుపపనిముట్టు. "గీ. పరఁగుఁ దవుగోల దోఁకుడుపాఱ నాఁగ." ఆం. భా. ద్వి. ౨౩౦.

తవుటిపాము. దే. వి. (తవుడు+పాము) ములుగు చేఁప. (శ. ర.)

తవుడు. దే. వి. డా. బియ్యముమీఁది మెత్తనిపొట్టు. "గీ. తెలుఁగు మాలి తవుడు దిని చచ్చువానికి, విసము వెట్టువాఁడు వెఱ్ఱివాఁడు.' ఉ. హరి. ౪, ఆ. ౬౨, ఆం. భా. ద్వి. ౨౫౪.

తవులఁబడు. వ్యా. వి. (తవులన్+పడు) చిక్కు, లగ్న మగు. "క. విను సకలభూతములవు,రత్నములు గను నపుడు బుద్ధి దవులఁబడక యొందును బరఁగి దివ్య బోధంబుల నలవడఁబట్టి పెంపుఁ బొందు మనిం ద్యా.' భార. శాం. ౨, ఆ. ౧౫౪. ప్రబోధ. ౩, ఆ. ౪; 2. (శత్రువులచు) తాఁకు, కవియు. "చ. ప్రకటబలాఢ్యు లొక్కట తిరం బయి పల్వురు వీరక భూమిపాలకునకు సద్దమైనఁ దవులం బడి హుమ్మని నోరికంత నాఁ,డిరానిన ప్రోఁగు తెల్పులిదిశేషము దోఁచుఁగఁ బొడ్డుపట్టి సాయక

ముల నొంచినం జెరలి రందఱు లేసలకిందు నా కృతిన్." భార. ద్రో. ౨, ఆ. ౧౫౹; 3. విరోధిగాఁబడు. "గీ. ఎవ్వఁ దడ్డముసొచ్చిన నించుక యేను, ఎవ్వలఁబడక సమద్ధతిఁ దివిరి మనలఁ, దేఱి చూచుచుఁ బార్థుఁ డేదిక్కు గవిసె." భార. కర్ణ. 3, ఆ. ౧౭౬. భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౫.

తవులమి. దే. వి. (తవులు ధా.) అంటమి, నిస్సంగము. "చ. అనయుఁసంపదన్ వెలిఁగి యూరయ నింద్రియగోచరత్వముం,దవులమి శక్తి తత్త్వముతు దత్త్వముఁ దానె యనంగ నొప్పు త్రైరవి జగ దేకమాత .." దశ. ౧, ఆ. ౮.

తవులము. దే. వి. (తవులు ధా) ఆసక్తి, కాంతి. "ద్వి...గోష్ఠి,తవులంబు గలిగినజంగమాను,భఃమంతయప్పుడు పాయ కుండుదుము." బస. 3, ఆ. ౬౦. పు.

తవులు. దే. అ. క్రి. (త. తగిల్.) 1. ఆసక్తమగు, ఆసక్తినొందు. "చ...తలలితాంగియందు నా, హృదయము పద్దయుం దవిలె .." భార. ఆది. ౪, ఆ. 3౦. శైవ. ౪, ఆ. ౯౦, 2. చిక్కు, బద్ధ మగు. "క. భవదాజ్ఞానిగళంబున,దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ,యఁపరజు లిదుమలఁ బడి కడుఁ,జివికిరి చెఱఁ బడినసింహకిశువుల భంగిన్." భార. అర. ౧, ఆ. ౨౧౧. భార. ఉద్యో. 3, ఆ. ౧౧౬; 3. నిమగ్నమగు. "సీ. కేడు పోవనివాఁడు నిష్ఫలం బిష్టవస్యయత్న మంతయుం నని యధిక చింత. ఆ. దవిలియున్న నయ్యుగ్యడంకునభిప్రాయ మెఱిఁగి..." భార. ౧, ఆ. ౧౧౫; 4. దొరకు, చేకుడు. "ప...సరసీ మధ్యంబునం .సనీడం జూచి కంటిఁ గంటి నంటు కాని ననుచు నంటం బోవ నదియునుం దవుల కపలః జన..." నృసు. ౪, ఆ. ౨౨; 5. కలుగు, ప్రాప్తించు. "గీ. వసుదేవుదేవి దనకుఁ,దవులు దేహదుఃఖం బెల్ల నపథివోవ." హరి. పూ. ౫, ఆ. ౧౦౫. కవిక. ౪, ఆ. 3౦, 6. విడువకుండఁ బోవు. "సీ. అహ ణము దిరం బగుఁపొలుపున, విలసిల్లుచున్నయూపేళయందును రాజు పద్మలు నతులితోత్కర్ష కాలి, బాణాసనశరప్రపంచంబు విస్ఫూర్తిఁ బరఁగంగఁ దవిలి వెంబడి నలసిం." రాఘవ. 3, ఆ. ౧౨౫; 7. ప్రయత్నించు, కడఁగు. "గీ. తవిలి మృగతృష్ణలో నీరు త్రావ

వచ్చు." ధర్మ. ౧, ఆ. ౫, దశా. ౪, ఆ. ౨౦౪; 8. కలిగించుకొను; సంబంధము పెట్టుకొను. "క. శివధనము ముచ్చిలించిన, శివధన మన్యాయవృత్తిఁ జెడిపోవంగాఁ, దవులక యుపేక్ష చేసిన, శివభక్తిద్రోహ మండ్రు శివభక్తివిదుల్." భీమ. ౫, ఆ. ౧౪౬. స. క్రి. 1. పొందు. "చ. తెవులులఁగొన్నవారి కవి దీఱుట కౌషధ మీగి దుర్గతుల్, తవులుజనాళిఁ బ్రోవు... ప్రస్తుతి కెక్కిన మేటిధర్మముల్." భార. అను. ౫, ఆ. ౨౧౪. భీష్మ. 3, ఆ. ౯౨; 2. తఱుము, పాఱఁ ద్రోలు. "గీ. దొడ్డిసట్టుల నీఁవ్వక త్రోవ కొవరి, కొదిరికొమ్మలఁ గుమ్ముచుఁ గడిసి కోడె,తఱుపులను బొద్దుచుచును వడి దవిలి అంకె, లిడుచు......" నీలా. ౨, ఆ. ౪3. వరాహ. ౨, ఆ. ౧౦౫; 3. వలచు, మోహించు. "గీ. దక్షపురిసానికూఁతులఁ దవిలినాఁడు." భీమ. ౧, ఆ. ౧౧౦. స. క్రి. అ. క్రి. స్పృశించు, తాఁకు. "క. కవితామధురిమ డెందముఁ, దవులం గొలువుండి సదయతన్ ననుఁ బల్కెన్." స్వా. ౧, ఆ. ౧3, "క. ఘువిపుత్రస్నేహము మా, నవజాతికి కాక లేద నరనాయక మీఁదు విచారింపక చేసితిఁ,దవిలెఁగదా నీకు బెట్టిదపుఁబాపము దాన్." భో. ౬, ఆ. 3౫౭. వి. 1. సక్తత, విషయసంబంధము. "చ...షే,త్తవు లయిన స్వరిణం బయినఁ బ్రాఁ చయిన న్విదు నైనఁ దీర్పు జేలవు తను వూరకే చెడ కిలన్ గృతు నొక్కనిఁ బ్రోచు టొప్పదే." అము. ౬, ఆ. 3౦; 2. అభ్యంతరము, నిరోధము. "చ. రవి యొనఁగెన్ మునీశ్వర తురంగము నీ కిది...ఎందునుం, దవులొకయింక లేక సతతంబుఁ జరించు సముల్లసద్గతిన్." మార్క. ౨. ఆ. ౨౮౦; 3. సంబంధము. "చ...ధళి నిద్దురవోవుచు లెక్క మానఁ డీబల కరపుదవుల్ గలుగఁబక్కనియోగి యటంద్రు కప్పటుల్." వి. ౨, ఆ. ౭౧. విశే. 1. ఇష్టము, ప్రియము. "క. చెవులకుఁ దవులై చల్లఁగఁ,గవులకు దవులై సమస్తకావ్యకళాబ,ధువులై రససింధువులై, యవురా యనఁ గవిత లవని వలఁగ వలదా." వాల్మీకి. ౧, ఆ. ౧౭; 2. సంబంధము కలది. "మ. బటువుంజన్నులు చందమామకళకుల్ ప్రస్వానకాంచీలసల్, కటిలీల ల్గలజవ్వనుల్

తపులుగాఁగాఁ గాక తత్వజ్ఞుఁ డుత్కటరాజకుల్యల కుంచలం బడుచు నిస్త్రాణంపుకుంపారకు, గ్యటుకక గీడ్పడఁ జొచ్చునే..." మల్హభూ. శ్రృం ౩౧.

తపులుకొను దే. స. క్రి. (తపులు+కొను-స్వార్థమున.) వలచు, మోహించు. "గీ...దాని, కోర్కి లిపు రొత్తఁ దపులుకోఁ గూడు నోడయ." నీలా. ౨, ఆ ౧౩.

తపులుకొలుపు. దే. స. క్రి. (తపులుకొను-ధా. ప్రే.) ప్రజ్వలింపఁజేయు. "సీ. చతురశ్రకలిత విస్తృత హోమకుండంబుఁ ద్రవ్వించి పావకుఁ దపులు కొలిపి." జై. ౮, ఆ. ౧౧౪.

తపులుచే. దే స క్రి. (తపులు ధా. ప్రే.) లగ్నము చేయు. "చ. ఉవిద శదుక్తి కంతఁ జెవి యొగ్గక పోఁ జెనఁగ న్విభుండు కేల్దవిలిచి చుట్టు నించుక యొడక భుజముల్ తలగొల్పి పొమ్మనన్." ప్రభా. ౫, ఆ. ౪౧.

తపులుపడు ద్వ. అ. క్రి. (తపులు+పడు) చిక్కు. "ఆ. పూర్వజన్మశుభభూతివ్యముఖ్యుఁడు, భేక రూపరూపబింబితుండు, ప్రయంతసుతుఁడు దపులు పడఁదయ్యె భూపాల,తనయసఖులచేత ధాత్రి తనయ." పాండు. ౫, ఆ. ౩౦౭.

తపులుపఱచు. ద్వ. స. క్రి. (తపులుపడు ధా. ప్రే.) చిక్కుకొనఁజేయు. "గీ. యువజనంబులఁ దన యందిఁ దపులుపఱచు, కీలు గలిగిన యొకనీలనీల వేణి...." పాండు. ౫, ఆ. ౩౦౪.

తపెల. దే. వి. నోరు వెడల్పుగా నుండుకుండవంటి లోహపాత్రము. "క. కమ్మనితావులు చల్లఁగఁ, గమ్మనియాజ్యంబు హాటకపుఁదపెలలఁ దెం, కమ్ముగ వంచిరి..." రా. వి. ౨, ఆ. ౧౦౩.

తప్వ. దే. వి. రెండుసోలలకొలఁది గలమానవిశేషము. (శ. ర. బ్రా. వా.) "గీ...తూము ముంత ముకు సంబు, బల్ల కుం చన సోల తప్వ పడి యడ్డ,గరిసె పుట్టి సెలగ మెడా కల మసంగ,ధాన్యములు గొల్చు వానికిఁ దగుచు సొంబ." సాం. ని. స్థా. ౫౨.

తప్వేఁద. దే. వి. సస్యవిశేషము, చోడిపైరుశీ. బ. చోళ్లు. "క. ఉలవలు చాములు కోద్రవ,ములు కందులు రాజమాషములు నిష్పావం,బులు చణ కంబులు దప్వెం,దలు జొన్నలుఁ గాని సూర్పఁ దగుధాన్యంబుల్." జై. ౪, ఆ. ౯౫, భీమ. ౩, ఆ. ౫౭.

తష్ట. సం వి. ఋ. పుం. 1. వడ్రంగి; 2. విశ్వకర్మ. విణ. (ఋ. స్త్రీ ఋ) చెక్కువాడు.

తష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చెక్కఁబడినది.

తష్టి. సం. వి. ఇ. స్త్రీ. తక్షణము, చెక్కుట.

తసకా. దే. వి. చిక్కు (వా.)

తసి దే. వి. దట్ట మగుకాఱుపరుస, సద. (శ.ర బ్రా.)

తసుకరి. దే. విణ. (తసుకు+అరి) టక్కులాఁడు; టక్కులాఁడి. "క. జాదరివి కుమాళివి సెలి, వాదివి తసుకరివి గెలువ వచ్చునఁ బేదా, మోసర." ఉ. హరి. ౩, ఆ. ౧౧౩. (ముద్రి. పా. 'తస కలిది' శ. ర. పా.)

తసుకు. దే. అ. క్రి. ప్రేమ కలిగినట్లు నటించు. (శ. ర) వి. టక్కు, మోసము, అసత్యము. "చ. తసుకులు మూల్గు లగ్గలికెకాఁకులు సోఁకులు... గుసగుసమాటలు న్నడిచెఁ గూరిమి నిద్దతికి న్సమంబుగన్." రాధికా. ౨, ఆ. ౧౪౩, ఆం. భా. ప్ర. ౧౧౯.

తసుకులాఁడి. దే. విణ. (తసుకులు+ఆఁడి) టక్కులాఁడి. (శ. ర.) [దొంగిలించు స్త్రీ.

తస్కరి. సం. వి. ఈ. స్త్రీ. 1. జారము గలస్త్రీ; 2.

తస్కరుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

తస్స. దే. వి. దుర్మాంసము. "సీ. పుర్లు కీఁగలు వ్రాలఁ బండ్లు బల్లున రాలఁ గండ్లఁ దస్సలు చీల రొండ్లు వ్రేల." చంద్ర. వి. ౩, ఆ. ౪౭, ఆం. భా. ద్వి. ౧౩౧.

తహతహ. దే. వి. (క. తహతహ. త. తహైప్పు.) 1. కుతుకము; తొందర. "క. తయ్యకుఁ దార్చి యనంగుని, సయ్యాటపుఁ జిట్టకంపుఁజదురుల కపు డాయయ్య దొరకొని ప్రియోక్తుల,నయ్యవతిం గవయుతహతహం బ్రార్థించెన్." రామా. ౪, ఆ. ౧౬౧. ఆం. భా. ప్ర. ౧౪౦; 2 దుఃఖము. "క. ఉక్పరమెగసి యజాండము,చిప్పలు రాలంగ మేరుశిఖరంబులపైఁ, గుప్పించి దాఁటికొందునొ, తప్పక నామనసులోనితహతహ తీఱన్." కాశీ. ౧, ఆ. ౧౧౨. హంస. ౧, ఆ. ౧౨౭; 3. అజ్ఞానము, తమస్సు. "సీ. మీతేజమున నాదు మేనిలో తహతహ కలుషంబుకటలంబు గ్రాఁగిపోయె." హర. ౪, ఆ. ౫౯.

తహతహపడు. ద్వ. అ. క్రి. (తహతహ+పడు) దుఃఖించు. "వ...దైన్యరసంబునకు సదనం బగు

శ్రీరామదేవునివదనంబుఁ జూచి యేచందంబునఁ దాళుదు నని తహతహపడుచు..." ఉ. రా. ౬ ఆ. ౩౪౩. దశా. ౪, ఆ. ౧౨౫.

**తహతహపెట్టు.** దే. స. క్రి. (తహతహ+పెట్టు) తొందరపెట్టు. "క. తహతహపెట్టితిఁగా నిను, గుహనావ్యగ్రాంధ ఫలము గడిచితిఁగా..." రామా. ౮, ఆ. ౩౧.

**తహపడు.** వ్యా. అ. క్రి. (తహతహ+పడు) దుఃఖించు, బాధపడు. "క. ముసు దాఁచు మూల దాఁచు సుతుని భార్యను బోషించి యూడె నది దీపము చూపినఁ జూచి వీఁడు పుష్పేమయునో యను శంకచేత మది తహపడుచున్." హంస. ౩, ఆ. ౧౦౯.

**తహశీలు.** హిం. వి. పన్ను, సిస్తు. (శ. ర.)

**తహశీలుదారు.** హిం. వి. శిస్తువ్యవహారముఁ జూచు ఉద్యోగి. (శ. ర. వా.)

**తళతళ.** దే. వి. **1.** మిఱుమిట్లుగొలుపుకాంతి. (దీనికి కర్మధారయమున నిగాగమము వచ్చును.) 'క. తళతళని తరణిమెఱుఁగుల..." స్వా. ౫. ఆ. ౧౦౦. భీమ. ౯, ఆ. ౧౧౭; **2.** మిక్కిలి మెఱయుట మొదలగువాని కనుకరణము "సీ. అరుణాంబుజంబుల యంచద్దళంబుల తళతళ యను జిగి ఒళముకొల్పి." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౪; పరావ. ౪, ఆ. ౩౭ భార. భీష్మ. ౨, ఆ. ౧౭౪.

**తళత్తళ.** వి. = తళతళ. వ. (మిఱుమిట్లు గొలుపు కాంతి.) "వ... . శముఖుని పీఠభటులచేతి విచ్చుకత్తుల తళత్తళల హత్తుగొని .." ఉ. రా. ౪, ఆ. ౧౬౩, రా. వి. ౨, ఆ. ౩౯.

**తళిగ.** వై. వి. (సం. స్థాలికా.) భోజనపాత్రము, కంచము. "వ. నిత్యంబును బదివేవురు బ్రాహ్మణులు బ్రహ్మవిదులు బంగారుతళిగల నిష్టాన్నంబులు గుడిచి తృప్తు లయిరన్..." భార. అర. ౧, ఆ. ౨౧౪; రామ. ౩౬౬.

**తళియ.** వై. వి. (సం. స్థాలికా) భోజనపాత్రము. కంచము. "వ పటికె బంగారుభృంగారుకర్కరీ కలాచికలు, తళియలు, పళ్లెరంబులు, తామ్రపాత్రంబు లారకూటంబులు లన్నియుం దాకట్టు పెట్టియు..." కా శి. ౪, ఆ. ౧౦౦. భార. శాం. ౧, ఆ. ౬౪; **2.** పంట. "సీ. నరమాంసములు దేఁడ శైర్పలి దళియకు జలధీశ్వరుఁడు రాఁడ జలకమార్చు." కు. సం. ౧౦, ఆ. ౧౯౦; **3.** దేవునికి నివేదించినయన్నము. "చ. లలనరో... మాకు నిచ్చులఁ బెరుమాళ్లకో పెలఁ బ్రసాదము కట్టడి సాగి వచ్చునా,తళియ ప్రసాదమీవు సత తంబుఁ బసాపడుము .." వైజ. ౨, ఆ. ౧౨౮, (చూ. ౧౩౦.)

**తళుకారు.** దే. అ. క్రి. (తళుకు+ఆరు) మిక్కిలి ప్రకాశించు. "సీ. మొలకనవ్వులవాఁడు తళుకారుతొలుకారు బలుకాన్కగులఁ గేరుపోలుపు వాఁడు." అచ్చ. సు. ౮౩, సానంబో. ౨, ఆ. ౩౯, పు.

**తళుకు.** దే. వి. (దీనియామ్రేడితరూపము తళుకుతళుకు. మొ ) **1.** అధిక ప్రకాశము. "క. కలికినిదువాలుఁ గన్నుల, తళుకులు మణిదీపశిఖలుఁ దడబడ లక్ష్మీ, నిలయుని కిచ్చి కొంగులు, పెలఁతలు మౌక్తికవిచిత్రనీరాజనముల్." పారి ౨, ఆ. ౩, విక్ర. ౪, ఆ. ౧౯, **2.** మెఱయుటయం దగునను కరణము. "గీ. తళుకుతళుకు కని మెఱపుంఘుంగనప్రఁ బసిఁడి, డాలు చిందాడుయోగదండము ధరించి." రామా. ౫, ఆ ౧౧౪; **3.** కిరణము. "సీ. మిసుకు తళుకు నిగ్గు మించు కళుకనంగఁ గిరణనామంబులై పరలుచుండు." ఆం. భా. ప్ర. ౮౭; **4.** అతిశయము. (చూ. తళుకొత్తు.), **5.** ఒకజాతిదేగ. 'గీ. వేగ్గముకు ఎరు కాడిగ వేఱు వేఱు, యొప్పుదే గలజక గూర్చు పూడుటయును." ప్రబాధ. ౯౧, ఇంద. ౨, ఆ. ౬౦. విజ. మెఱుగునది. 'గీ... తళుకుటద్దంబు సత్కృపులమనసు." వై. ౧,ఆ. ౫.

**తళుకుచూపు.** దే. అ. క్రి. (తళుకు+చూపు) **1.** ప్రకాశించు; బయలుపడు. "సీ. ప్రోక్షసంపుట పరిస్ఫురణావసరములు దంతపోరక కాంతి తళుకు చూపు." కాశీ ౪, ఆ. ౨౬౯; **2.** అధికమగు. "గీ. పహజనంధియు తాత్పర్యసంధియుములు, ఁదు కుచూపంగ సారత్న బ్రీఁ గొనుచు, నిందిరాదేవి యేతెంచె యిందుధరుని, హస్తపాత్రిక నమృత భిక్షాన్న మిడియె." కాశీ. ౫, ఆ. ౧౯౯; **3.** కలుగు, సంభవించు. "గీ. లక్ష్మీనాయన మొకదీపఁ దళుకుచూపు నుత్తరాయణ మొకదీవి నుప్పరిల్లు." ౧, ఆ. ౧౭౯.

తళుకుబెళుకు. దే. వి. ఒకజాతిజేగ, శ్యేనభేదము. "సీ. జలకట్టె గిద్దు తెంచడ మన శ్యేనభేదము లివి గాకయుఁ దళుకుబెళుకు, కంచుమిం చనఁగను గలవు..." అం. భా. ద్వి. ౯౦.

తళుకెక్కు. దే. అ. క్రి. (తళుకు+ఎక్కు) స్పష్టమగు. "సీ. తలచూపి మోసులై త్రాసులై తళుకెక్కి నిక్కి నక్కులవలె నెరసి బెరసి." నరస. ౫, ఆ. ౧౧౩.

తళుకొత్తు. దే. అ. క్రి. (తళుకు+ఒత్తు) 1. శోభిల్లు, ఒప్పు. "రగడ...అస్వీర్ణకు మణికర్ణాదు లేలికలు, దక్షిణమునఁ గిన్నరపురళతకము దళుకొత్తు విచిత్ర తనస్వీర్ణకుఁ, బ్రత్యీశారులు...... రాజులు." వరాహ. ౪౦, ఆ. ౧౪౪; 2. అతిశయించు. "క. మునివరుఁడు గంధవతినం, దనుండు నా గురుఁడు కరుణ దళుకొత్తఁగఁ జెప్పినవాక్యంబుల యర్థము..." భార. శాం. ౬, ఆ. ౪౭౫; 3. కలుగు,జనించు. "సీ. తళుకొత్తె మదిఁ దిలోత్త మకు నుత్తల పాటు..." నైష. 3, ఆ. 3౬. వసు. ౪, ఆ. ౭౭.

తళుక్కు. దే. వి. (దీనియామ్రేడితరూపములు తళుకు తళుక్కుమొ.) 1. అధిక ప్రకాశము. "సీ మీఁటి తళుక్కున మెఱసి నిల్చినయట్టిసోఁగ క్రొమ్మెఱుఁ గులేఁదీఁగవోలె." విక్ర. ౬, ఆ ౪౪, అని. ౧, ఆ. ౧౦౦; 2. మెఱయుటయం దగునను కరణము. "సీ. ఫాలభాగమున వజ్రాలపాపటబొట్టు తళుకు తళుక్కని తాండవింప." శశాం. 3, ఆ. ౯, చం. రా. 3, ఆ. ౧౨౪. విణ. మిక్కిలి మెఱయు నది. "మ...అకైలాటపుంబుల్గు గ్రుక్కన మిన్నందిన మేడమీఁదికిఁ దళుక్కుంగాంతితో జారి..." సా. ౧, ఆ. ౧౭౯.

తళ్కు = తళుకు. (మెఱయుటయం దగునను కరణము; "గీ. మెఱుఁగువలెఁ దళ్కుతళుకను మేనిదాని." ఉ. రా. ౨, ఆ. ౧౨౮. (కిరణము) "శా. క్రీడా మందిరజాలమార్గములచక్కి న్నిక్కి జాబిల్లికా గోడ ల్నీరుగ జాఱు ద్రోచి తళుకళ్కుల్ చొచ్చి వెన్నాడిమై, వాడన్ .." వసు ౪, ఆ. ౨౬. (అతిశయము)(చూ. తళ్కొత్తు.) విణ. మెఱయు నది. "గీ. తళ్కుజెలి చిల్కుపచ్చరా తాళిఁ బోలి." దశా. ౧, ఆ. ౧౧౩.

తళ్కొత్తు = తళుకొత్తు. (మిక్కిలి ప్రకాశించు) "క. చిత్రంబునఁ జైతొనిరొందు, నుత్తల ముడుచుచు ముఖపరోరుహమునఁ దళ్కొత్తెడు వెడ నవ్వునఁ బ్రియుం,చిత్తం బిగుకొత్తఁ జనిరొఁ జెలువ యడవికిన్." భార. ఆర. ౭, ఆ. ౨౧౦. ఉ. రా. ౨, ఆ. ౧౧౦. (అతిశయించు) "సీ. కాంతి దళ్కొత్తునీకడకంటిచూడ్కితోఁ బొందఁ గానని మేను పొగులుటయును." భార. విరా. ౨, ఆ. ౧౧౮. కు. సం. 3, ఆ. 33. (కలుగు, జనించు) "శా...నిజదుర్వృత్తిన్ విసర్జించుచున్, దత్తీర్థాంబువు నాడి క్రోలి విగతాతంకాత్ముఁడై శుద్ధిదళ్కొత్తన్ ముక్తశరీరుఁడై కనియె దివ్యశ్రేష్ఠ సుచ్ఛస్థితిన్." పాండు. ౫ ఆ. ౧౮.

తళ్లు. దే. వి. బ. 1. చెఱువుమున్నగువానియందు గాలిచే ఉబికి పరిని మోఁదెడుచిన్న చిన్న అలలు. (చూ. తళ్లుగొట్టు) 2. బాధలు, కష్టములు. "గీ. చెల్లఁబో నీకు సాధ్వీమతల్లి వైన, తల్లి కేతళ్లు వచ్చె గా..." సా. 3, ఆ. ౯౫. రామలిం.శ.౮౯.

తళ్లుకొను. దే. అ. క్రి. (తళ్లు+కొను) అతిశయించు. "ద్వి...మురిపంబు నొయ్యారమును దళ్లుకొనఁగ." ద్వి. పరమ. ౫, ఆ. 3౮౬ పు. ౭, ఆ. ౪౯౭, పు.

తళ్లుగొట్టు. దే. అ. క్రి. (తళ్లు+కొట్టు) 1. చిన్న చిన్న అలలు కలుగు. "ద్వి. తళ్లుగొట్టెడికుంట వరిఁ జాలఁ బ్రబలి, చల్లఁగా నీడయై చలివెంద్రవోలె, పుట్టంపుఁబోదవున మాసైనమట్టి, చెట్టుక్రిందటి పుట్టచేసొనియుండె." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭3; 2. చల్లఁదనము కల్గించు. "సీ. చల్లనిగాడ్పులు తళ్లుగొట్టుపపాల సాలనిరంతరచ్ఛాయ లాదు." పాంచా. ౪, ఆ. ౨౧౬.

## తా

తాండవము. సం. వి. అ. పుం. 1. పురుషునినృత్యము; 2. తృణవిశేషము శ.

తాండవించు. సం. అ. క్రి. నృత్యముచేయు. "సీ. ఘనపళీకాండముల్ కల్లోలతండముల్ మెండుగా నొండొండఁ దాండవింప ..గీ. పరసి విహరించు నవ్వు దబ్జాతముఖులు, పాలసంద్రంబుశోభల నోలలాడు, వేలుపులవెలఁదులో యన వెలసి రపుడు." కృష్ణ. ౪, ఆ. ౬౭. శశాం. 3, ఆ ౯.

తాండవితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నృత్యము చేయింపఁబడినది; 2. నృత్యము చేయునది.

తాండ్ర. దే. వి. 1. ఖఠిశకము, తాడి. "సీ. తాండ్ర పాపయ్యప్రతాపసై పుణ్యాంబు వెలరాచతాండ్రలవెంపు డిపు." రంగా. ౨, ఆ. ౨౯; 2. చాఁప మొదలగువానిపై రాచి యెండఁబెట్టు తాటిపండ్లయొక్కయు మామిడిపండ్లయొక్కయు రసము. "సీ. మామిడితాండ్ర యూములకముల్ పానకములు ....." రుక్మా. ౧, ఆ. ౧౩౨. రుక్మా. ౩, ఆ. ౬.

తాంతము. సం. వి. అ. పుం. శెల,మానము. విశ. (అ ఆ. అ.) 1. మ్లానము, వాడినది; బాధితము.

తాంత్రికుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. సిద్ధాంతము తెలిసినవాఁడు; 2. శాస్త్రములు తెలిసినవాఁడు, 3. తంత్రసిద్ధాంతముల ననుసరించువాఁడు; 4. రాజ్యతంత్రము మున్నగువాని తెలిసినవాఁడు.

తాంబాళము. దే. వి. (క. తాంబాళ. త. తాంబాళం) తాంబూలము మొదలగునవి యుంచుకొనుట కుపయోగపడున ట్టిత్తడి మున్నగువానితోఁ జేసిన పెద్దపళ్లెము. (శ. ర. బ్రా.)

తాంబూలము. సం. వి. అ. న. 1. తములపాకు; 2. పోఁకచెక్క, క్రముకము; 3. పీటి,వక్కలు లవంగములు మొదలగునవి కలిపినతములపాకులు.

తాంబూలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తములపాకులతీఁగ, నాగవల్లి.

తాంబూలి. సం. వి. ఈ. స్త్రీ. తములపాకులతీఁగ, నాగవల్లి.

తాఁకించు. దే. స. క్రి. (తాఁకు ధా. ప్రే.) 1. తగిలించు, అంటునట్లు చేయు. "సీ. తాఁకించుకొను జటాస్తబకంబు విరియంగఁ బొనపట్టముతోడ ఫాలకలము" భీమ. ౩, ఆ. ౧౯౩. శా. ౩, ఆ. ౧౪౧; 2. శ్రమపెట్టు. "క. అఁగొని పచ్చినవిప్రులు,దాఁకింపక యశన మిడుము .." భోజ. ౬, ఆ. ౧౬౧.

తాఁకు. దే. అ. క్రి. కలుగు, ప్రాప్తించు. "చ. ప్రతిదివసంబు విందుము పురాణముఖంబునఁ గాశియందు సంతతముగ సంతరాయములు దాఁకుచునుండు ననంగ నిప్పు డాశ్రుతి నిజమయ్యె నేనిడ యశోకవనస్థిత నుండఁగా నత్యర్కగతి వచ్చెఁ జూడు మిడె కిన్నరకంఠి మహాంతరాయముల్." కాశీ. ౨, ఆ. ౧౦౮. దశ. ౧౦, ఆ. ౬౫; 2. బడలు; కృశించు, కగ్గు. "క...కుగువలచంచల కటాక్ష మార్గణజాలంబు గెలువఁ దాటినఁ దాఁకవెజగతిం గోవిదులమతులుఁ జదువులుఁ దలుపుల్." ప్రబోధ. ౧, ఆ. ౪౭. స. క్రి. రాచుకొను, ఒరయు. "సీ. జననకాలమునాఁడు జలరాశికుక్షిలోఁ దరిగొండ పొరివోవఁ దాఁకె నేని. గీ. విరహిజను లింత పడుదురే వీనిచేత." హైమ. ౨, ఆ. ౧౨౩. స్వా. ౧, ఆ. ౩౭. స. క్రి. అ. క్రి. 1. తగులు, అంటు. "చ. తములము పెంపుననే మెఱుఁగు దాఁకినచెందిరకావి కౌఁగిలున్." హర. ౧, ఆ. ౧౫. ఆం. భా. కృ. ౧౩౨; 2. (యుద్ధమున) మార్కొను,కవియు. "గీ. ఘోరతుముల,సంగరం బయ్యె నయ్యవసరమునందుఁ, దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ." భార. కర్ణ. ౩, ఆ ౧౯౨. భార. ఆది. ౨, ఆ. ౨౨; 3. కొట్టుకొను, కొట్టు. "సీ. కుల పర్వతంబులు గూల్చి యొండొంటితోఁ దాఁకంగ వీఁకమైఁ దన్నియూడ." భార విరా. ౨, ఆ. ౧౩౪. హర. ౫, ఆ. ౧౬. వి. 1. (యుద్ధమున) కవియుట. "సీ. సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుఁడగు నని తలఁచెద నాతఁడు దక్క నొరులు. గీ. భీష్ముతాఁకోర్వరు .." భార. ఉద్యో. ౪, ఆ. ౧౦౧. భార. శల్య. ౨, ఆ. ౨౫౫; 2. నిరోధము, అడ్డు. "క. చననిమ్ము రథం బని నను, బనుచుటయును గొంకుదేలి బలిపితిఁ దేరిం,దును దాఁకుఁ దగులు లేకయు,యునుపమహారు లద్భుతంబు లై లీలఁ జనన్." హరి. ఉ. ౫, ఆ. ౭౪; 3. తగులుట, స్పర్శ "సీ. బీరెండతాఁకున నీటలువాఁడినపచ్చిగోడలమాడ్కిఁ బగిలె దిశలు." భార. ఉద్యో. ౪, ఆ. ౧౬ స్వా ౪, ఆ. ౫౮; 4. దెబ్బ,ప్రహారము. "చ. తనువు ఘనాస్త్రశస్త్రములతాఁకున నొప్పిని దప్పి పుట్టె......" భార. శల్య. ౨, ఆ. ౩౩. హర. ౫. ఆ. ౪౫; 5. బాధ. "శా...చాండాలికన్ మీటుచున్, గుండు ల్వీరుగ గెండగాలిపసితాఁకుం జూడ కాప్రాహ్ణమున్." ఆము. ౬, ఆ. ౭. 6. క్షతము. "గీ. రవిక బిగియించు నదియును నవల వైచి, కుంకుమపుఁబూఁతఁ జిమచిమ గొనెడు చిన్ని,పచ్చికొనగోటితాఁకులు రచ్చసేయ, గుబ్బయర గానరాఁ బైఁటకొంగు వైచు." కువల. ౪,

ఆ. ౧౮౮; 7. వినుకు. "క. ఆఁకొన్నకూడె యమృతము, తాఁకొందక యిచ్చువాఁడె దాత ధరిత్రిన్." సు. శ. ౯.

తాఁకుడు. దే. వి. (తాఁకు ధా.) తాఁకుట, స్పర్శము. "క. అరుదెంచి యలిగి యేఁండెడి, యరు దెంచి వితాకు తాఁకుడై..." సా. ౨, ఆ. ౧౯౩. (శ. ర. పా. "మదిన్ వితాఁకుడై" ముద్రి. పా.)

తాఁకుడువేఁకి. దే. వి. (తాఁకుడు+వేఁకి) విడుచుచు తగులుచు వచ్చుజ్వరము, మన్నెపుజ్వరము. (శ. ర. బ్రా.)

తాఁకుదల. దే. వి (తాఁకు+తల) (యుద్ధమునందు) కవియుట, మార్కొనుట. "ఆ. బంటు లుత్స హించి బగఁ బోయిరి పోయి,రంచుఁ గదఁగి బొబ్బ లార్పు లెసఁగ, నతిరయమున నదరు నట్లుగ దొరసము,ద్ధతి మొనర్పు వలయుఁ దాఁకు దలల." భార. శాం. ౩, ఆ. ౮. హరి. ఉ, ౨, ఆ. ౩౯.

తాఁకుదెంచు. దే. స. క్రి. (తాఁకు+తెంచు) (యుద్ధమున) కవియు మార్కొను. "ఆ. తరువుఁ బెఱికి కొనుచుఁ దాఁకుదెంచె." భార. ఆది. ౬, ఆ. ౨౯౨. కప. ౪, ఆ. ౧౦౫.

తాఁకులాడు. దే. స. క్రి. అ. క్రి. (తాఁకులు+ఆడు) కొట్టుకొను, డీకొను. "సీ. సకలత్రములలీల శైల ములఁ దివిఁ బ్రతిధ్వనులతో నొండొంటిఁ దాఁకు లాడె." ఉ. రా. ౨, ఆ. ౪౪, భా. రా. యు. ౧౨౪౭.

తాఁకొను. దే. స. క్రి. (తాఁకు+కొను) అంటు కొను, రగులుకొను. "క. ఘూకంబు లున్నగు హకును, వాకిటఁ గాష్ఠములఁ దృణముపడిఁ గప్పింపఁగ,లే కవిసి చిరంజీవియుఁ, దాఁకొన దన ముక్కుకొలఁదిఁ దగిలించి వడిన్." సా. పంచ. ౩, ఆ. ౨౮౬.

తాఁకొలుపు. దే. స. క్రి. (తాఁకొను ధా. ప్రే.) తాఁకఁజేయు, కవియఁజేయు. "ఎ.. అకూపారమేకం బొడుపు దప్పి రొప్పుచు వలవంకం ద్రిప్పి వచ్చి యప్పురుషవరకంసు వాంఛరథదండచండం బగువాలంబునం గీలుకొలుపంగి కొట్టుటయుం నాదిట్ట తట్టువ నఖముఖంబుగఁ దాఁకొలిపి కరివెరిం బరి బరియలుగా నాయుధంబునం జేయుటయు..." సాంబో. ౩, ఆ. ౨౯.

తాఁగలి. దే. వి. పల్లపుమడి. (శ. ర.)

తాఁచు. దే. స. క్రి. 1. తన్ను, పాదతాడనము చేయు. "గీ. ఒడిసి తలపట్టిలిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకు కొసరించుకయు లేక కూలఁ దాఁచె." భార. విరా. ౨, ఆ. ౧౨౮. హరి. ౧, ఆ. ౧౨౩; 2. కొట్టు, తాడించు. "క... మేషయుగళ మత్యుగ్రముగాఁ, బ్రోచియుంచు మస్తకంబులఁ, దాఁచియుఁ దరులోనఁ బోరఁ దా నవ్వేళన్." సా. పంచ. ౧, ఆ. ౧౬౯; 3. విసరు. "చ... దైత్యునో, క్కరువిసంబు మఱొక్కరునిఁ గ్రచ్చుటఁ దాఁచి వధించిరి. .." భా. రా. యు. ౯౪౩౪.

తాఁట. దే. వి. (క. తొగె.) 1. చెట్టుపైపట్ట. (శ. ర. బ్రా.) 2. చర్మము. "ఆ .. తెడ్డుతోడఁ గూడు తెచ్చి పెట్టి,దానితోన వీపు తాఁట యొత్తఁగ మోఁదె..." చెన్న. ౪, ఆ. ౧౫౫; 3. ఱేకు. "ఉ .. హేమకాంతి యొ,న్నారుల కుండఁ గాని యొకనాఁడు పదంపడి సానఁబట్టినన్, దానక యుండునే యినుపతాఁటకుఁ గాయలు పోక. భాస్కరా." భా. శ. ౧౦౮; 4. మోసము. "ద్వి. టక్కరి బూఁటకపు తాఁటలుఁ జేసి ధనము, చక్కనఁ గైకొని జరిగినపిదప." ద్వి. హరిశ్చ. ఉ. ౬౪౨,పరి. విశే. కలుచనిది, దళసరిలేనిది. వ్యవ. తీగె తాఁటగా దున్నది.

తాఁటకత్తె. దే. విశే. (తాఁట+కత్తె) మోసకత్తె. "ద్వి. వెడలి పోఁ జూచెదో వేసాలు మప్పి,లోకం బులో లేనిలోటతాఁటకత్తె. ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౦౩, పరి.

తాఁటదమ్ముఁడు. ద్వ. వి. జీవనార్థము సన్న్యాసి వేషము ధరించినవాఁడు, లింగి. (శ. ర.) "ద్వి. తాటోటుమాటల తక్కరిగొంటు, తాఁటదమ్ముని నమ్మఁదగునా యోయమ్మ." ద్వి. పరమ. ౪, ఆ. ౨౯౯. పు.

తాఁడి. దే. వి. తాండ్ర, విభీతకము. "గీ. తాఁడి యనన్ విభీత,కంబు విలసిల్లుచుండును..." అం. భా. ద్వి. ౪౯.

తాఁపు. దే. వి. (తాఁచు ధా.) తన్ను, పాద తాడనము. "చ...ముసుకటితన్ను గొన్నునుచు మోములపై నొకతాఁపు తాఁచినన్." రామా. ౭, ఆ. ౨౪౬. రాకి. ౭, ఆ. ౬౧.

తాఁబేలు. దే. వి. బొ. (శ. తాఁబేలు, తాఁబ్బేలు) కూర్మము, కమఠము. "సీ. కొత్తమ్మ లనుచుఁ గ్రొన్నల లంచు వటఫలశ్రీ లంచుఁ దాఁబేటి చిప్పలనుచు." ప్రభా. ౨, ఆ. ౬౪. ఆం. భా. ప్ర. ౧౬౧.

తాకట్టు. దే. వి. (తాకు+కట్టు. శ. ర) నమ్మకమునకై అప్పిచ్చువానియొద్ద అప్పులీసికొనువాఁడుంచువస్తువు, కుదువ. "సీ. తాకట్టు కుదువ యుద్ధర వారకం బీ దనంగను సాధి చెలఁగు చుండు." ఆం. భా. ద్వి. ౨౨౯. పరావ. ౯, ఆ. ౧౨౩.

తాకట్టుపడు. ద్వి. అ. క్రి. (తాకట్టు+పడు.) కుదువయుంచఁబడు. "సీ. తాకట్టువడదా యింతకు వైశ్యగృహమున ఘనపుబంగారుభృంగారుకంబు." కాశీ. ౪, ఆ. ౧౦౮.

తాకట్టుపెట్టు. దే. స. క్రి. (తాకట్టు+పెట్టు) కుదువయుంచు. "వ......ఆరకూటిఘటంబు లన్నియుం దాకట్టుపెట్టియు దురోదరక్రీడాపరాయణుండై..." కాశీ. ౪, ఆ. ౧౦౦.

తాకటుంగరము. దే. వి. ఉంగరము మొదలగునవి తాఅపోకుండ బంగారు లోనగువానితో చేసి వేసికొను సన్ననిసాదాఉంగరము. "సీ. కారు కొనసళ్ల వాకట్టుముందులు చరణాంగుళంబులఁ దాకటుంగరములు.' వేం. పంచ. ౧, ఆ ౬౧౪. (శ. ర. పా.)

తాకీదు. ఉ. వి. (ఉర్దు. తాకీద్.) ఆజ్ఞాపత్రిక. (బ్రౌ. వా.)

తాగడించు. దే. స. క్రి. (తాకు+గడించు. శ. ర) బాధించు. "ఆ. వారికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి తండ్రి నూర కేల తాగడింపఁ, గట్టఁ గట్టి పాఁటు కమలాక్షకులనాథ..." భాగ. ౯, స్కం. ౨౮౬.

తాగాఁడి. దే. వి. (తాకు+కాఁడి - శ. ర.) నూతి ముఖమున కడ్డముగ దూలితోఁ గాని మ్రానితోఁ గాని యేర్పఱచుదూలము, పీసావాము. "సీ... పీ బాహంబు తాగాఁడి నాఁ జెలంగు." ఆం. భా. ప్ర. ౧౬౨.

తాగాలి = తాగాఁడి. (శ. ర.)

తాగు. దే. స. క్రి. నీళ్లు లోనగునవి పానముచేయు, త్రావు. (శ. ర.)

తాగుఁబోతు. దే. విశే. (తాగు+పోతు) మితిమీరాటి మద్యపానము చేయువాఁడు. (శ. ర.)

తాచు. వై. స. క్రి. 1. ఖచించు,పొదుగు. "సీ. తెలఁగుదు మంచిముచ్చులు దెచ్చి కూర్చి దట్టంబుగాఁ గూర్చి తాచి తాచి." యు. ౧, ఆ. ౭౫. ఆం. భా. తృ. ౧౩౨; 2. తొలుచు. "సీ. పాషాణధిజలయంత్రిఁ బాఁచిపట్టినదితాకరులు నాఁ జనుమరకతపుఁగరుల, గరులతొండము చిక్కఁ గబళించి మ్రింగినహారులు నాఁ దొండ మొప్పుగుఁ దవళ్ళహారులఁ దాచినతాక లలర".- ఆము. ౧, ఆ ౫౩; 3. తాపటముపెట్టు. "సీ. ఇనకరముక్తమై యిలఁ బనునథ మని వలంప తాచిన వెండి మొల లనంగ." శివలీలావిలాసము. ౧, ఆ. (శ. ర)

తాజా. ఉ. విశే. (ఉర్దు. తాజా.) నవీనము, నూతనము. (బ్రౌ. వా.)

తాజె. దే. వి. కుళ్లాయి. (శ. ర.)

తాట. వై. వి. (సం. తాటంకః) స్త్రీలకర్ణభూషా విశేషము. (వా).

తాటంకము. సం. వి. అ. పుం. దంతము లోనగు వానితోఁ జేయఁబడిన చెవికమ్మ.

తాటంకిని. సం. వి. ఈ. స్త్రీ.-తాటంకములు కలది- సువాసిని యగుస్త్రీ; స్త్రీ. "కా ..ఓకర్ణాట తాటంకినీ." క్రీడా. ౬౦. ఇట్లే; తాటంకవతి.' చంద్ర. ౧, ఆ. ౨౩.

తాటక. సం. వి. ఆ. స్త్రీ. ఒకరాక్షసి.

తాటకేయుఁడు. సం. వి. అ. పుం. తాటక కొడుకు, మారీచుఁడు.

తాటన. వై. వి. (సం. తాడనమ్) కొట్టుట. (చూ. తాటనపుచ్చు.)

తాటనపుచ్చు. ద్వ. అ. క్రి. (తాటన+పుచ్చు) కొట్టు; వాయించు. "ద్వి...ఒడ్డణము గుబ్బల గజ్జెయులును, ధ్వనియింప నల్లన తాటనపుచ్చుచును..." బస. ౩, ఆ. ౭౪. పు.

తాటస్థ్యము. సం. వి. అ. న. 1. ఉదాసీనత; 2. సామీప్యము.

తాటాకుచక్రాలు. ద్వ. వి. బాలక్రీడా విశేషము. "సీ...సింగన్నదాఁటులు జేర్కురాతి, జాజుల్లు తాటాకుచక్రాలు చక్రాలత్రిప్పుదు .." హంస. ౩, ఆ. ౧౪౬.

తాటాదూటము. దే. విణ. చక్కనిది కానిది, సౌందర్యహీనము. "క. తోఁటలు లెస్సై యున్నవి, తాటాదూటములు కావు తావును లుండక్. బేఁటలు దామోదరుచె,ల్లాటలకు కన్నులవులం మధురాపురిచెంతకన్." అప్ప. ౪, ఆ. ౩౮౧.

తాటించు. వై. స. క్రి. 1. ఘట్టనచేయుట. "శా... ప్రమథధ్వజిన్యధిపతుల్ కుంభోదరాదు ల్మహా, భూభృత్పన్నిభు లంఘ్రులన్ ధరణి యాస్ఫోటించి తాటించుచున్." కాశీ. ౭, ఆ. ౩౨; 2. కొట్టు. "శా. ఆటోపంబునఁ జిమ్ము బొమ్మగల పశ్రాభీలదంతంబులం, దాటించుచున్..." భా. రా. యు. ౧౪౩౬; 3. కదల్చు. "సీ. తమిదాపనముఁ గేలఁ దాటించి తాటించె జలజ మిచ్చట కెట్లు మొలిచె ననుచు." చంద్రా. ౩, ఆ. ౯౮; 4. ఆలోచించు. "సీ. తమిదాపనముఁ గేలఁ దాటించి తాటించె జలజ మిచ్చట కెట్లు మొలిచె ననుచు" చంద్రా. ౩, ఆ. ౯౮, 5. పొడుచు. "క...ఇ, క్కడకున్ వచ్చితె యోరీ, చెడుగా యని యలఁతిముష్టిచేఁ దాటించెన్." ఉ. రా. ౫, ఆ. ౪౬. స్వా. ౪, ఆ. ౧౧౫; 6. నాట్యము చేయుట. "క. తాటించి నిటలనయనుఁడు, హాటకగిరిచాపవల్లి నహిశింజిని నాస్ఫోటించెఁ దక్కఁ, టోరమహాటంకృతిఁ గమలకాండ మట పగులంగన్." భీమ. ౪, ఆ. ౧౩౨.

తాటింపు. వై. వి. (తాటించుధా.) 1. కన్ను. "సీ. కాళికాఽకుండదాకాలి తాటింపులకమలు చేరని నాఁటికుముదహితుఁడు.' పి. శకుం. ౧, ఆ. ౩౯; 2. తాఁకుట, పొడుచుట. 'సీ. మోముత్రిప్పలు బొమ్మముడి బొమ్మతాటింపు రానిజంకెన కావరంపుఁబోవరు" శుక. ౨, ఆ. ౪౩౩, హంస. ౫, ఆ. ౨౭.

తాటికట్టెక. ద్వ. వి. (తాడు+కట్టెడ) తాటిగిటిపాము. (శ. ర.) [పాము. (శ. ర.)

తాటిగిటిపాము. ద్వ. వి. తాటిచెట్టుమీఁద నుండు

తాటిచెట్టాట. ద్వ. వి. బాలక్రీడావిశేషము. 'సీ అత్తకోడలియాట యాలుమగలయాట తాటిచెట్టాట కోలాటములును." దశా. ౮, ఆ. ౮౧.

తాటిచెట్లాట = తాటిచెట్టాట. "ఉ... తాటిచెట్లాటలు నిద్దతాంద్రమగపాటలు..." సాని. ౧, ఆ. ౧౧౭.

తాటిటెక్కెమువాఁడు. ద్వ. వి. 1. భీష్ముఁడు. "సీ. తాటిటెక్కెమువానికల్లి కయ్యపుఁబట్టి మించు చీరంబుతో మెఱయువాఁడు." రామ. ౩౩౦; 2. బలరాముఁడు. (వ్యు.)

తాటిడాల్దొర. ద్వ. వి. బలరాముఁడు. "సీ... తాటిడాల్దొర కప్పుటేటిగొంగ... గీ... సాబలుఁడు.." వేంక. దేవ. ౬౧.

తాటిదండము. ద్వ. వి. (తాడు+దండము) మల్లసాధనవిశేషము. "సీ. కంబము కొణత లాగను డొల్ల తాటిదండములు త్రోయంగ కట్టలగను కము." ప్రబంధ. ౮౨.

తాటిపండు. ద్వ. వి. (తాడు+పండు) తాళఫలము. "గీ. అడుసులోపలఁ దాటిపం డదిమినట్లు,లడుము దుకు కాని పాతాళ మంటికొనఁగ...." కాశీ. ౧, ఆ. ౧౧౪.

తాటిపడగవాఁడు. ద్వ. వి. 1. బలరాముఁడు. "ఆ... తాటిపడగవాఁ డనంగ బలుఁడు రుద్ర." అం. సం. దేవ. ౨౯; 2. భీష్ముఁడు.

తాటిబాణము. ద్వ. వి (తాడు+బాణము) ఒకరకముబాణసంచు. "వ... చక్రబాణంబులు నాకాశచక్రంబులుఁ బిట్టబాణంబులుఁ దాటిబాణంబులు గజబిరుసులు మొదలగుబాణవిద్యలవైఖరులు..." హంస. ౩, ఆ. ౨౯, ప్రబంధ. ౧౮౧.

తాటిబెల్లము. ద్వ. వి. (తాడు+బెల్లము) తాటికల్లు వండి తయారు చేయుబెల్లము. (వా.)

తాటియాకులచిలుకలు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. "గీ. తాటియాకులచిలుకలు తాల్లి పాము, లకట యగచాట్లపోతకై యాడుకొనుచు..." హంస. ౩, ఆ. ౧౪౬.

తాటిరిక్క. వై. వి. (తాడు+రిక్క)-తాటిచెట్టువలె నుండు నక్షత్రము - జ్యేష్ఠానక్షత్రము. (శ. ర, బ్రా.)

తాటిరిక్కనెల. ద్వ. వి. జ్యేష్ఠమాసము. (శ.ర.బ్రా.)

తాటిల్లు. ద్వ. వి. (తాడు+ఇల్లు.) తాటియాకు కప్పినయిల్లు. "మ... పక్కణంబునకు వేగం బోయి యేచక్కిఁ జక్కని తాటింటికి నేఁగి త్రేఁక మను కాఁకన్ పెచ్చుగా నూర్చుచున్." వాల్మీకి. ౨, ఆ. ౧౦౩.

తాటిసిడముజోదు. ద్వ. వి. 1. బలరాముఁడు. "వ... నందుండు యశోదయుఁ దాటిసిడంబుజోదును

బుత్తడిదువ్వలుపదాల్పును బయసం బయి .." నీలా. 3, ఆ. ౫౦; 2. భీష్ముఁడు. ఇట్లే; తాటి సిడమువాఁడు. అం. సం. దేవ. 33.

తాటోటు. దే. వి. (క తాటోట్టు.) 1. టక్కు, మోసము. "ద్వి. తాటుకకన్నీరు కరమునఁ దుడిచి, తాటోటు లేఁగనిదానిచందమున." ద్వి. శ. సా. ౨, ఆ. ౫౦. పు. ౧౨, ౪౦; 2. అసత్యము. "సీ ..తాటోటు దబ్బఱయుఁ దబ్బు, బొల్లు టవలి బొంకు కల్ల సా నన్పృత మా..." వేంక. మాన. ౬౬. విణ. వంచకుఁడు; వంచకురాలు; వంచకము. "క. కుటిలకుటిల తొలిచేల్పులఁ గొంపఁటఁ గూలిచి నిక్కి దేమొ తాటోట నిపుంభిఱుదీక పట్టుకొని రూపకుఁ జేసెద..." అచ్చ. యు. 3౧3. శుక. 3, ఆ. ౧౮. వేం. మా. ౫, ఆ. 3౮.

తాడంకము. సం. = తాటంకము.

తాడకాఫలము. సం. వి అ. న.—నక్షత్రములవంటి పుడ్లు గలది - పెద్దయేలకి.

తాడకుఁడు. సం. విణ. (అ. డీ. అ.) కొట్టువాఁడు.

తాడన సం వి. ఆ. స్త్రీ. = తాడనము.

తాడనము సం. వి. అ. న. 1. కొట్టుట; 2. గుణించుట. (గణిత) విణ. (అ. ఆ. అ) కొట్టునది.

తాడని సం. వి. ఈ. స్త్రీ. చబుకు, కొరడా.

తాడనీయము సం. విణ. (అ. ఆ. అ.) కొట్టఁదగినది.

తాడపత్త్రము, సం. వి. అ. న. తాటియాకు; 2. తాటంకము.

తాడము. సం. వి. అ. పుం. 1. కొట్టుట; 2. గుణించుట; 3. చప్పుడు; 4. పర్వతము.

తాడయత్. సం. శత్రు. కొట్టుచున్న.

తాడయమానము. సం. విణ. (అ. ఆ. అ.) కొట్టుచున్నది.

తాడయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కొట్టువాఁడు.

తాడయితవ్యము, సం. విణ. (అ. ఆ. అ) కొట్టఁదగినది.

తాడి. యు. దే. వి. తాళవృక్షము. "గీ. తా దనం గను దాడి నా లోలభూరుహంబునకు నాఖ్యలై యొప్పు నంబికేశ." అం. సం. స్థా. ౬, సం. వి. ఈ. స్త్రీ. 1. శ్రీతాళము, పెద్దయాకులు గల ఒకరకముతాటిచెట్టు; 2. ఖురకత్తు.

తాడించు. సం. స. క్రి. కొట్టు, తాడనముచేయు. "గీ. కాలకంఠునిమూళి శృంగాటకంబు, గాండివంబునఁ దాడింపఁ బాండవుండు." హర. 2, ఆ. ౭౮, హరి. ఉ: ౯, ఆ. ౨౨౫.

తాడితము. సం. విణ. (అ. ఆ. అ.) కొట్టఁబడినది.

తాడితాల్పు. ద్వ. వి. బలరాముఁడు. "రగడ. కోప ద్రిష్టిమీఁక గూరుచుకొన్నసీవును దాడితాల్పును." అచ్చ. యు. ౬౪.

తాడిల్లుపాము. ద్వ. వి. (తాడు+ఇల్లు+పాము) తాటిచెట్టుమీఁద నుండుపాము. (వా).

తాడు. యు. దే. వి. టో. రజ్జువు, పాశము. "గీ. పతగకేతను శ్రీపాదపంకజంబు, గారణంబుగ జన్మించె భూతమహిమ, గంగనైదోడు రిపుకోటి గళముతాడు, బాలుగవజాతి నమధిరోన్నతవిభూతి." కాశీ. పీఠి. ౨౨, వై. వి. (సం. తాళీ.) తాళవృక్షము. "గీ. నిట్టతా దనఁ బొడవుచే నిక్కినాఁడు." స్వా. ౪, ఆ. ౭3. అం. భా. ద్వి. ౪౭.

తాడ్యమానము. సం. విణ. (అ. ఆ అ.) కొట్టఁబడుచుండునది.

తాడ్యము. సం. విణ. (అ. ఆ. అ.) కొట్టఁదగినది.

తాణెము. వై. వి. (సం త్రాణమ్. త. తాణైయమ్) కాపాడుట, రక్షణము. "సీ. సవరణ లేనివికాల దుర్గం బేల గట్టితాణెము లేనిగడి నశించు." నీతి శ. ౭౯, చం. రా. ౫, ఆ 3౮.

తాణెముచేయు. ద్వ. స. క్రి. (తాణెము+చేయు) రక్షించు. "మ...అపూర్వంబగురక్ష మేఁబడిఁ గల్గెన్ మానికిన్ సర్వకాలనిరాపాయక నుండువారలకు నేలా దండు తాణెంబునే, యేఁనర స్వామికిఁ గాక తద్గ్రహణ కృత్యోపాయముల్ సెప్పుమా." వరాహ. ౫, ఆ. ౬.

తాణెముండు. ద్వ. వి. (తాణెము+ఉండు) రక్షకముగా నుండు. "గీ. కొమ్మల కొనర్పు సాలజాలమ్ములోనఁ, జిలుకసాంబ్రాణి లేచిపలీఁ దనుకు, దాణెమున్న వసంతుని రాజు వెల్లఁగన్ను గుట్టైముఁ గడుపుంజి గనుటకతన." కువల. 3, ఆ. ౯౬.

తాత. ఉభ. దే. వి. (క. తాత) 1. తండ్రితండ్రి, పితామహుఁడు. "గీ. తాత ముత్తాత తండ్రులు తరతరంబులఁ దీమవలెఁ గూడఁబెట్టి యయార్జితము సేయ...." పాండు. 3, ఆ. ౧౫, హర. ౭.

అ. ౧౮౫; 2. తల్లితండ్రి, మాతామహుఁడు. "గీ...లంకాపురాధి, పత్యమున నీవు వెలయం దప్పుట్టినాఁడు, వెలయం నీ చేత నని తాత దెలుపుట యుఁడు..." ఉ. రా. ౨, అ. ౨౨౪, ఉ. రా ౨, అ. ౨౨౫; 3. పంశమందలిపూర్వపురుషుఁడు. "సీ. కట్టించె నొకతాత కంచి పార్శ్వంబులు హరిణాంకమౌళి కేకా ప్రపలికి." హార. ౧ అ. ౧౦; 4. అధికుఁడు, మీఁటినవాఁడు; మీఁటినది. "వ...కల్పాంత కాలాదికరాళకాళవ్యాళ ఘుమాఘుమఘుటాకఠోర దీర్ఘనిర్ఘాతచ్ఛటాపాతంబు నకుఁ దాత యగుసానిర్ఘోషంబు..." కాశీ. ౬, అ. ౨౨౭. భా. రా. యుఁ ౩౧౯. వై. వి. (సం. ధాతా.) బ్రహ్మదేవుఁడు. "క. నీతోఁ గరయుగఁ దెమ్మెర,మేకఱపంగదపుడేఁడు మిఁడసిక వాడుఁన్,దాతయుఁ దాతని దాతియుఁ,చేతుర యొక్కించుకైన నిక్కువ మొదవన్." అచ్చ. యుఁ. ౫౨౭. ఆం భా. ప్ర. ౩౯. సం. వి. అ. పుం. తండ్రి. (దీనికి స్త్రీసమత్వము నిత్యము.) "మ. వనితామానససూనసాయకుఁడు జీవత్తాత హాదుండు..." పాండు. ౩, అ. ౬. పాండు. ౪, అ. ౮౩. హరి. పూ. ౧, అ. ౩.

తాతగువు. సం. వి. ఉ. పుం. పితృవ్యుఁడు, పిన తండ్రి. విశే. (ఉ) తండ్రికి హితుఁ డైనవాఁడు.

తాతతాత. ద్వ వి. (తాత+తాత) - బ్రహ్మకు తండ్రి యైనవాఁడు - విష్ణువు. సిం. సార. ౨౬.

తాతనము సం. వి. అ. పుం. కాటుకపిట్ట,ఖంజనము.

తాతలము. సం. వి. అ. పుం. 1. రోగము; 2. పాక ము; 3. ఇనుపగుదియ. విశే. (అ. ఆ. అ.) తప్తము; వేఁడియైనది.

తాతవేల్పు ద్వ. వి. (తాత+వేల్పు) బ్రహ్మదేవుఁడు "గీ. మందిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు, దగవు గా దని రాఁ దయ్యెఁ దాతవేల్పు." నైష. ౪, అ. ౧౨౯.

తాతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కనికరింపఁదగిన వాఁడు.

తాత్కాలికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. అప్పటిది, ఆకాలమందలిది; 2. అప్పుడు మాత్రమే యుండునది.

తాత్పర్యము. సం. వి. అ. న. 1. అభిప్రాయము, భావము; ఆసక్తి, తత్పరత.

తాత్త్వికము. సం. విశే. (అ. ఈ. అ.) సత్యమైనది

తాదాత్మ్యము సం. వి. అ. న అభేదము.

తాదృక్కు. సం. విశే. (శ్) అట్టిది.

తాదృక్షము. సం. విశే. (అ. ఈ. అ.) అట్టిది.

తాదృశము. సం. విశే. (అ. ఈ. అ.) అట్టిది.

తానకము. వై. వి. (సం. స్థానకమ్.) 1. నెలవు, స్థానము. "చ. తనవదనంబు వాక్సతికిఁ దానకమై చెలువొందఁ .." భో. ౨, అ. ౨౯. ఆం. భా. ద్వి. ౧౩; 2. జెట్టి (లుచుదుటయందలిభేదము. "వ . వింతతానకంబుల నిలిచి కదిసినయప్పుడు." భార. విరా. ౨ అ. ౧౪ ప్రబంధ. ౫౧; 3. దండప్రణామము. "ద్వి. తక్కులు నీవట్టి తానకంబులును,గొలుపు మాయెడఁ గుటిలవిచార" ద్వి. మాకళ్ళ. పూ. ౧౨౦ ౬. పం

తానము. ఉభ. వై వి. 1. (సం. స్నానమ్) స్నానము. "ఉ. తత్తఱపాటు లేక నదిఁ దాన మొనర్చి ." కాశీ. ౨, అ. ౪౯, ఆం. భా. ద్వి. ౧౨౦; 2. (సం స్థానమ్.) తావలము, చోటు. "క. తానం బాడి మనీషివి,తానంబున కర్థ మిచ్చి తానంకట నం,తానం బనఁ దగి మగసం,తానంబున నతఁడు ముదము తానం బయ్యెన్." రా. వి ౨, అ. ౧౬; 3. (సం. తానః) తన్నకారముతోఁ బాడెడి పాట. "క. అంకట నాగసరంబుల, వింతులు తానములు మిగుల హెచ్చించుచు..." యా. ౪, అ ౧౫౯, సం. వి. అ. పుం. విస్తారము. న. గానాంగవిశేషము.

తానవము. సం. వి. అ. న. తనుత్వము, అల్పత్వము. విశే. (అ. ఈ. అ.) శరీరసంబంధమైనది.

తానవరుసలు. ద్వ. వి. బ. (తానము+వరుసలు) తానముయొక్కవరుసలు. "గీ. తానవరుసలు పెంచుగంధర్వగాయ, కులను .." దశా. ౧, అ. ౨౬౪.

తాను. దే. స 1. తాశబ్దమునకుఁ బ్రథమైకవచనము, ఆత్మార్థము. "సీ ..అమ్మునులకడకు, వచ్చె తానుగ్రశ్రవసుఁ డనుసూతుఁడు, రోమహర్షణి సుపౌరాణికుండు" భార. ఆది. ౧, అ. ౨౯; ?. విస్పష్టత. "ద్వి. మానితం బగుమంత్రమధ్య తార ములు, దానొంద లయలంకితంబులు నిగుడ." బస. ౩, అ. ౯౩౨.

తామరసము. సం. వి. అ పుం. నీటిసుడి, జలావర్తము.

తాప. దే. వి. 1. విచ్చిన, విశ్శ్రేణి. "లయగ్రాహి .. కపిలుని గలపుఁజూపుసెకలం గలయఁ జాపగరు వంగడము మోక్షోత్తుంగమణిసౌధమునకుం గడపు తాప..." పారి. ౨, అ. ౮౩, అం. సం. స్థా ౨౪; 2 మెట్టు, సోపానము. "చ. అలయుల యాద్రిఁ గుంభభవుఁ డక్కతకంబు శరత్తుఁ గుండ మున్నదలిఁ బ్రతిబింబకైతవమునం దమ కిచ్చిన వాకిదేవతల్, తొలఁకులకేలు తాప నిడి తోమఁ గలం కడఁగెన్..." ఆము. ౪, అ. ౧౪౬. (శ. ర పా. తాఁప. ముద్రి.) 3. మణి రత్నము. "సీ. మేలిచే దొరవుల మెఱుఁగుదాపలు మించు పెట్టేలుకటిఁ జూఁచి మెఱయువాని.' శ్రీరం. ౧, అ. ౧౮౦, వరాహ. 3, అ. ౬౫

తాపకము. సం. వి అ. పుం. 1. జ్వరము. 2. రజో గుణము. విణ (అ. పిశాఅ.) తాపము కలిగించు నది.

తాపనము. సం. వి. అ పుం. 1. వేసవి; 2. జిల్లేడుచెట్టు, 3. సూర్యకాంతమణి న. 1. తాపము కలిగిం చుట; 2. బాధించుట; 3. ఒకనరకము. విణ. (అ. ఆ. అ.) 1. తాపము కలిగించునది; 2 బాధించునది.

తాపనీయము. సం. వి. అ. న. ఒకానొక యుంపరి వత్తు. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁదగినది (అ. ఈ. అ.) బంగారుది, సౌవర్ణము.

తాపసుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

తాపము. సం. వి. అ. పుం. 1. వేఁడిమి; 2. బాధ. (తాపత్రయము.—ఆధ్యాత్మికము, ఆధిభౌతి కము, ఆధిదైవికము )

తాపయత్. సం. శత్రు. తపింపఁజేయుచున్న

తాపయమానము. సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁ జేయుచున్నది.

తాపయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) తపింపఁ జేయువాఁడు.

తాపయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁ జేయఁదగినది.

తాపరము. దే. వి. మెట్టు, సోపానము "సీ ..తాప మెట్టిక తంతె తాపరంబు, మెట్టిక మెట్టనఁ గను మెఱయు సోపానంబు .." ఆం. భా. ద్వి. ౨౨.

తాపలుపెట్టు. దే. అ. క్రి (తాపలు+పెట్టు, మెట్లు గట్టు. "సీ. నేలకు నింగికి నెఱయఁ దాపలుపెట్టు తెలరేఁగి రోకటఁ జిగురుఁ గోయు...గీ... కుదనమాయాకళాధానమువసనేన." మల్హ. ౨, అ. ౪౧.

తాపసతరువు. సం. వి. ఉ. పుం. ఇంగుది, గారచెట్టు.

తాపసపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. దవనముచెట్టు.

తాపసప్రియ. సం వి. ఆ. స్త్రీ. 1. ఋషిభార్య; 2. ద్రాక్షచెట్టు; 3. ప్రియాలము, మోరటిచెట్టు.

తాపసి. వై. వి (సం. తపస్వి.) తపస్వి,ముని. "క. అనమానజనదుతుఁ డంతట,వసుమతిఁ బెక్కేండ్లు పూని పలిమలకడఁ దాపసి యై తిరిగియుఁ సుర నది'వసుధకుఁ దే నోపఁ డయ్యె..." చం. శా. 3, అ. ౧౮. సురా. ౭౦.

తాపసుఁడు. సం. వి. అ. పుం. తపస్వి,ముని. విణ. (అ. ఈ. అ.) తపస్సు చేయువాఁడు.

తాపస్యము. సం. వి. అ. న. ఋషిధర్మము.

తాపి. ఉభ దే. వి. (తాపుధా. క. తాపు. త. తాప్పు.) 1. రహస్యము, సంకేతము. (చూ. తాపియిల్లు); 2. రహస్యస్థానము, సంకేతస్థలము "ఉ. రుక్మిణీ, కాంతకుఁ దొల్లి తాపి యనఁగా దగుమర్గ గృహంబుఁ జూచుచున్." ద్వా. ౯, అ. ౧౯: 3 జాడ. (శ ర. బ్రా.); 4. తార్చుట, విటీ విటులకు సంధానముచేయుట. (తాపికత్తె, తాపి కాఁడు.) 5. ఇటుక, రాయి, మొదలగువానితో గృహాదినిర్మాణముచేయుట కుపకరించు లోహ సాధనవిశేషము. (వా.); 5. తాపితో పనిచేయు వాఁడు. (శ. ర. బ్రా.) సం. వి. ఈ. స్త్రీ. 1. తపతీనది; 2. యమునానది. విణ. (న్. నీ. న్.) 1. తపింపఁజేయునది; 2. తాపము కలది.

తాపించు. వై. స క్రి. 1. కలకొలుపు, నిలుపు. 'ది ..అబ్యాపమీథరంబు, నడుచక్కి దేవతా వగముఁ దాపించి." విష్ణు. పూ. 3, అ. (శ. ర.) 2. చెక్కు, ఖచించు. "క. సురుచిరపల్లవరుచి సుందరతను వగుఁ జేతఁ గదిసి చకముఖుఁ డొప్పున్, బరఁగఁగఁ గాంచనకాంచిన్, వెరవుగఁ దాపించి యున్ననీలము పోలెన్." భా. రా. అర. ౨, అ. ౧౫౮. సా. ౨, అ. ౪౨; 3. మోఁదు. "క. తాపించె ధవదువదనముఁ. గూపెట్టఁగఁ గాలకంఠు కొడుకు కుత్తరవే, దీపపాషాణాంచలమునఁ, బాపు యాగమునఁ దొట్రుపడి రుత్తములున్." కాశీ. ౭, అ. ౯౧. సం. అ. క్రి. తాపమునొందు,

"మ...రతికాంతుం జేర జేరెంచెఁ దత్కులకాంతామణి వారసారసముఖదుర్వారమారాహవోత్కలికా ఘూర్ణితమానసుం డయి కదుం దాపించుప్రాణేశ్వరున్." నిరం. ౨, ఆ. ౯౫.

తాపింఛము. సం. వి. అ. పుం. చీఁకటిమ్రాను, తమాలము.

తాపిక. దే. వి. తార్పుకత్తె. "గీ. చతురికయుఁ జేర దూతికి సంది బొంగ,కడెము పరిచారికయు సారికయును రదికె,తాపికయు సొమ్ము వేశ్యమాతయును గాన్క, లిచ్చి చెప్పించు రతిసేన కేచ్చుకమిని." హంస. ౫, ఆ. ౧౩౫.

తాపికత్తియ. ద్వ. వి. (తాపి+కత్తియ) తార్పుకత్తె, విటీవిటులసంధానము చేయుస్త్రీ. "ఉ...విలాసినులే విటవ్రజం,బున్నరహస్యభూములను సెయ్యనఁ జేర్చి తాపికత్తియల్." తపతీ. 3, ఆ. ౭౫, ఆం. భా. ద్వి. ౧౧౦.

తాపికత్తె=తాపికత్తియ. "చ. ఇలుఁ గలసైన వెల్వడని యీలువుటాండ్రకుఁ దాపికత్తెవై." ఆము. ౫, ఆ. ౭౦.

తాపికము. సం. విశే. (అ. ఈ. అ.) వేసవికాలమందలిది.

తాపికాఁడు. దే. వి. (తాపి+కాఁడు) 1. విటీవిటులను తార్చువాఁడు, సంధానకర్త. "సీ. కాంతను పదవి నాకతమునం బడసినవాఁడు నమ్మినతాపికాఁడు గాఁగ...ఆ. చొచ్చి వనితమనముఁ జొచ్చి క్రీడకుఁ జొచ్చి..." దశ. ౬, ఆ. ౧౮౦, చంద్రా. ౫, ఆ. 33; 2. జాడ తెలుపువాఁడు. "ఆ. తాన చోరులకును దాపికాఁడై వేమ,ధారి మిన్నకేని తపముచేయు." భార. ఆది. ౪, ఆ. ౨౬౨.

తాపిచేయు. దే. స. క్రి. సంధానముచేయు, తార్చు. (బ్రా.)

తాపిచోటు. దే. వి. (తాపి+చోటు) సంకేతస్థానము, రహస్యస్థలము. "సీ. చీర చాకింటఁ దెచ్చెద నంచుఁ జని చేరుఁ దరుణపల్లవుఁ డున్నతాపిచోటు." శుక. ౨, ఆ. 3౬౮.

తాపిత. దే. వి. మేలైనపట్టువస్త్రము. "సీ. పచ్చతాపితదట్టి బిగమించుకుచ్చురాచిలుకక్రొంబిడెవంకి యులవరించి." చంద్రా. ౨, ఆ. ౬౮, శుక. ౧, ఆ. ౨౪౯.

తాపితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తపింపఁజేయఁబడినది; 2. వెచ్చఁజేయఁబడినది; 3. బాధింపఁబడినది. "క. అమ్మునిఁ జూచి యస్మదీయుఁ,డమ్మేఁడు నొక్కట మనోజతాపితులై..." భార. ఆది. ౮, ఆ. ౧౦౬.

తాపిత = తాపిక. "చ. బటువులు తాపితాపుఱుపు పట్టుకలాడముమీఁదఁ బల్వదుప్పటి..." శుక. ౪, ఆ. ౨౨, కృ. శతం. పీఠి. ౧, ఆ. ౮౦.

తాపియిల్లు. దే. వి. (తాపి+ఇల్లు) సంకేతగృహము. "సీ. నాయకునకు మజ్జనజలంబు ఘటియించి తాపియింటికి జేఁగి తడవు చూచు." శుక. 3, ఆ. ౪౪౯. శుక. 3, ఆ. ౧౨౪.

తాపీ = తాపి. (శ. ర.)

తాపు. వై. స. క్రి. 1. చెక్కు, ఖచించు. "సీ. దంతగా మగరాలు దాపినబలితంపుగండ పెండెరము దాకాలఁ గ్రాల." రసిక. ౧, ఆ. ౮౪, ఆం. భా. కృ. ౧౩౨; 2. అదుము, నొక్కు. "సీ. పదఁతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్నితప్తకుచంబులఁ దాపుకొనియె." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౯౦. వి. 1. అవలంబము. ఆధారము. "గీ. ఏడుపాతాళముల క్రింది యిబుకుగొంది, కరికి తో యూత్తరై యున్నధరణిఁ జూచి, మెయిగము దాపుగ నిచ్చి నిర్వక్రశక్తి,గరిమ గడలొత్తఁ గాసెత్తెఁ గరుణఁ బ్రభుఁడు." హరి. పూ. ౪, ఆ. ౧౬; 2. తన్ను,పాదతాడనము. "చ...చాల దయ్యెనో, మునుపటి తన్నుకొమ్మరుచు మోములపై నొకతాపు దాచినన్." రామా ౭, ఆ. ౨౪౬.

తాపురము = తావరము, మెట్టు. "వ. ఒక్కమీఁక నాకసం బెక్క విశ్వకర్మ నిర్మించినతాపురంబులఁ బోలుగోపురంబులమీఁదికి..." పి. శకుం. ౧, ఆ. ౮౬.

తాప్యము. సం. వి. అ. న. మాక్షికధాతువు. విశే. (అ. ఆ. అ.) తపింపఁజేయఁదగినది.

తాబాదు. దే. వి. పాదక, గాగర. (శ. ర. బ్రా. వా)

తాబేదారు. హిం. వి. తక్కువపనివాఁడు, క్రిందియుద్యోగస్థుఁడు.

తామసము. సం. వి. అ. పుం. 1. బడలిక; 2. దోషము. విశే. (అ. ఆ. అ.) 1. బడలిక గలిగించునది; 2. భయము గలిగించునది.

తామర. సం. వి. (సం. తామరసమ్. క. తామరె, తావరె. త. తామరై.) 1. పద్మము, కమ్మి. "క. తామరలు ముడిఁగె జక్కవ, చాములకున్ వెతలు పర్వె..." నీలా. 3, ఆ. ౭, ఆం. భా. ప్ర. ౧౬౪; 2. శరీరములో పద్మాకారముగా నుండు షట్చక్రములలో నొకటి. (యోగ.) "సీ. అంతర్గతము లైనయాఱుదామరలకు నభినవోల్లాసంబు ననువయించి." విక్ర. ౨, ఆ. ౨౪౧; 3. చర్మవ్యాధివిశేషము, మండలకము. (ఇది తామరపూరె పొక్కులతో శరీరమున గుండ్రముగా ... "సీ. .. ...యను ...దామర యన. గీ. మండలక మొప్పు." ఆం. భా. ద్వి. ౧౨౮.

తామరకంటి. ద్వ. వి. (తామర+కన్ను+ఇ) 1. పద్మాక్షుఁడు, విష్ణువు; 2. పద్మాక్షి; స్త్రీ; భార్య. "చ. తఱుగక నే మెలంగినను దామరకంటికి మోము దమ్మితో, నొఱఁ దొవరంగు పొంగిడెడునీటరి సాటి యటంచుఁ బల్కఁగా, నుఱియలు లోఁగ వైరియిఁక నుండఁగ నీతము గాదటంచుఁ దా, నఱవఱ లయ్యెఁ జెమ్మట నొయారపుఁ గస్తురిబొట్టు మోమునన్." కాళిందీ. ౨, ఆ. ౯. "ఉ. జగంబు లన్నియుం, దల్లడమందఁ జేతఁ గద తామర కంటిని జూపకుండినన్." అచ్చ. అర. ౧౦౫.

తామరకెంపు. ద్వ. వి. (తామర+కెంపు) పద్మరాగమణి. "సీ. పెద్దతామరకెంపు బిగిపట్టియలచేత పొలుపైనముత్యాలసోరణములు." య. ౧, ఆ. ౯౭.

తామరచెలి. ద్వ. వి. (తామర+చెలి) కమలమిత్త్రుఁడు, సూర్యుఁడు. "సీ. చెలిమిలోఁ దామరచెలిపట్టి యనిచినచిఱుసరంజీ యొక్కచెలువు పూన." య. ౧, ఆ. ౯౧. (తామరచెలిపట్టి = యముఁడు.)

తామరచూలి. ద్వ. వి. (తామర+చూలు+ఇ) కమలగర్భుఁడు, బ్రహ్మ. "చ...ఇట్టికశీలాంఛనబింబవిభాస్వ నక్కటా, తలపయి మోపు మోప నిటు దామరచూలి యొనర్చె సాక్ష నుష్మలికము లేక..." హరిశ్చ. ౪, ఆ. ౧౫౭.

తామరతంపము. ద్వ. వి. (తామర+తంపము) తామరలసమూహము, కమలషండము. "సీ. తనయుల్లు తామరతంపమై మెఱయ సంపన్నలినాక్షి గాపున్న చోటు." వసు. 3, ఆ. ౧౫౫. చం. రా. ౧, ఆ. ౬౬. విశే. (కమలషండమువలె అలముకొని అధికముగా వ్యాపించినది.) మిక్కిలి యభివృద్ధి నొందినది, అత్యధికము. "గీ. ధరఁ బ్రజావృద్ధి తామరతంప మయ్యె." స్వా. ౬, ఆ. ౧౨౧. వసు. 3, ఆ. ౧౫౫.

తామరతంపర = తామరతంపము. వి. తామరలసమూహము, కమలషండము. "సీ...తనరుచు తామరతంపర యనఁ, గీ. గమలషండంబు .." ఆం. భా. ప్ర. ౧౬౫. విశే. మిక్కిలి యభివృద్ధి నొందినది, అత్యధికము. 'గీ. వారు మీపను వగ బాంధవ ము... ... ... దామరతంప ..., జెలులఁ బట్టు ... పేరెలమి ..., ... యొప్పనొక్క." భార. ఉద్యో. 3, ఆ. 353. "శా. శ్రీవిద్యుత్కలితాంబువంజవమహాజీమూత పాపాంబుధా, రాపేగమ్మున మన్మనోబ్జసముదీర్ణత్వమ్ముఁ గోల్పోయిలెన్, దేవా నీ కరుణాశరత్సమయ మింతే చాలుఁ జిద్భావనా, నీవన్ తామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా." కాళ. శ. ౧, (కాపద్యము విశేష్యార్థమునకు నుదాహరణము.)

తామరతూపరి. ద్వ. వి. (తామర+తూపు+అరి) పద్మశరుఁడు, మన్మథుఁడు. (శ. ర.)

తామరపాకు. ద్వ. వి. (తామర+ఆకు) తామరాకు, నళినీదళము. "మ. ఝుటిలిమ్యూతపలాశపత్త్రపుటికా కాట్ప్రదేశంబులున్, ఘటముల్ దామరపాకులున్ గువాళులున్ గండోలముల్ పూని బ్రాసట వేదంబుఁ బఠించుచుం గదిసి వైశంపాయనాదుల్ సముత్కటభంగిం గొలువంగ నేఁగె ముని భిక్షాకృత్యయాత్రార్థమై." కాశీ. ౭, ఆ. ౧౩౩. పార్వ. ౪, ఆ. ౮.

తామరవిందు. ద్వ. వి. (తామర+విందు) కమలబాంధుఁడు, సూర్యుఁడు. "సీ. భూపతామరవిందుఁ బోల్పనీడై కగు గడితంపునిడుద కెంజడలు వఱల." అచ్చ. యు. ౧౫౪.

తామరసము. సం. వి. అ. న. 1. పద్మము, తామర; 2. బంగారు; 3. రాగి; 4. ఉమ్మెత్త.

తామలకి. సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక.

తామసము. ఉభ. దే. వి. ఆలస్యము, జాగు. "ఉ. నావుడు సత్యభామ నిజనాథున కిట్లను నేల తామసం, బీవిబుధాధినాయకమహీరుహముం బెకలించి లోకసం, భావిత మైననీపలుకుబంతము నెల్ల మదీయగేహకే, ళీవనవాటి వేడుక దలిర్పఁగ

నిల్పుము శివతేశ్వరా." పారి. ౪, ఆ. ౧౧.
దశా. ౭, ఆ. ౨౩౯." సం. వి. అ. పుం.
1. సర్పము; 2. గ్రద్దగూబ. న. 1. తమో
గుణము; 2. చీఁకటి; 3. క్రోధము. "గీ. అర్జునున
కెల్లభంగుల జైనకారి,కంటికిని తెక్కురీతి విక్క-
ముగఁ బ్రోవ,నతనితోఁ బార్థుఁ డేల కయ్యంబుఁ
జేసెఁ,దామసం బెట్లు పుట్టె నాతనికి ననఘ."
చిత్రభా. ౧, ఆ. ౧౯. రం. రా. ఉ. ౧౪౬.
పుం. విణ. 1. తమోగుణము గలది; 2. అంధ
కారము గలది; 3. చీఁకటికి సంబంధించినది;
4. దుష్టమైనది; 5. మూర్ఖమైనది.

తామసి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. చీఁకటి
రాత్రి; 3. నిద్ర; 4. కాళి,పార్వతి; 5. తమో
గుణము గలస్త్రీ; 6. జపుపు*; 7. జటామాంసి*.

తామసించు. దే. అ. క్రి. జాగుచేయు. "గీ. చెల్ల
దిక్కింతయును దామసింప నిచటఁ,సఖులు నీవు ప్రత
లోచనోత్సవము గాఁగ, నాయితము గం దవుచుఁ
బల్కి-....." జై. 3, ఆ. ౧౦. శుక. ౨.
ఆ. ౧౯౦.

తామసికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. తమో
గుణము గలది; 2. చీఁకటి గలది.

తామసుఁడు. సం. వి. అ. పుం. 1. నాల్గవమనువు;
2. రావణువుకొడుకు.

తామిస్రము. సం. వి. అ. పుం. 1. కృష్ణపక్షము;
2. ద్వేషము; 3. తమోమయమైనరకము. విణ
చీఁకటికి సంబంధించినది.

తామెర. వై. వి. (సం. తామరసమ్) తామరపూవు,
పద్మము. "మ...నినుఁ దా మామగా నెంచుఁ
దా,మెరతూపుందొర యింత మాత్రమున కై
మిన్నంటదే చంద్రమా." కృష్ణ. ౪, ఆ. ౭౧.

తామేలు = తాఁబేలు. (కూర్మము) "సీ. మెఱుఁగు
మీఁగాళ్లు తామేళ్లను జేసి తక్కితినత పాలిండ్లఁ
గలంగ నునిచి." ప్రబంధ. ౩౦౭.

తామ్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. సింహపిప్పలి *. 2.
తామ్రవల్లి, మంజిటి *.

తామ్రకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. పడమటిదిక్కు నందలి
అంజన మనుదిగ్గజముయొక్క భార్య.

తామ్రకారుఁడు. సం. వి. అ. పు. రాగిపని చేయు
వాఁడు.

తామ్రకుట్టకుఁడు. సం.=తామ్రకారుఁడు.

తామ్రకుట్టుఁడు. సం.=తామ్రకారుఁడు.

తామ్రకృమి. సం. వి. ఇ. పుం. ఆరుద్రపురుగు.

తామ్రచూడము. సం. వి. అ. పుం.-ఎఱ్ఱనిజుట్టు గలది.
1. కోడి, కుక్కుటము; 2. కుక్కవాగాకు*. 3.
అభినయహస్తవిశేషము. [రకము యొక్క.

తామ్రదుగ్ధ. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱనిపాలు గల ఒక

తామ్రద్వీపము. సం. వి. అ. పు. సింహళద్వీపము.

తామ్రపత్త్రము. సం. వి. అ. పుం. 1. జీవశాకము *
2. దానశాసనాదికము వ్రాసియున్న రాగిరేకు,
రాగిపట్టా. న. 1. ఎఱ్ఱనియాకు. 2. క్రొంజివురు.

తామ్రపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పడమటి దిక్కు
నందలి అంజన మనుదిగ్గజము యొక్కభార్య, 2.
దక్షిణభారతదేశమందలి యొకానొకనది. (ఇది
మలబారు, తిరునెల్వేలిజిల్లాలయందుఁ బ్రవ
హించును.)

తామ్రపల్లవము సం. వి. అ. పుం 1. అశోకము*.
2. ఎఱ్ఱనిచిగురు. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిచిగుళ్లు
కలది.

తామ్రపాకి. సం. వి న్. పుం. కలుజువ్వి*.

తామ్రపాది. సం. వి. ఈ. స్త్రీ. హంసపది*.

తామ్రపుష్పము. సం. వి. అ. పుం. 1. రక్తకాంచనము.
2. ఎఱ్ఱనిపువ్వు. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిపూలు
కలది.

తామ్రపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆరె,ధాతకి*.
2. కలిగొట్టు, పాటల *.

తామ్రపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱతెగడ*.

తామ్రఫలము. సం. వి. అ. పుం. 1. కొండగోనుగు*.
2. ఎఱ్ఱనిపండు.

తామ్రబీజము. సం. వి. అ. పుం. ఉలవ, కులుత్థము*.

తామ్రము. సం. వి. అ పుం. 1. కుష్ఠరోగభేదము.
2. రాగివంటి ఎఱుపురంగు. న. రాగి. విణ. (అ.
ఆ. అ.) రాగివంటి యెఱుపురంగు కలది.

తామ్రమూల. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁటకసింద*.
2. అత్తపత్తి*. 3. గంట్లకచోరము *.

తామ్రవృక్షము. సం. వి. అ. పుం. 1. రక్తచందనము*.
2. ఉలవ, కులుత్థము *.

తామ్రసారము. సం. వి. అ. పుం. రక్తచందనము *.
విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిచేవ గలది.

తామ్రాక్షము. సం. వి. అ. పుం. కోయిల. విణ. (అ.
ఆ. అ.) ఎఱ్ఱనికన్నులు గలది.

**తామ్రాక్షము.** సం. వి. స్. పుం. కద్మరాగము, కెంపు.

**తామ్రిక.** సం. వి. స్. పుం. ఎఱుపు.

**తామ్రికము.** సం. = తామ్రిక

**తాయనము.** సం. వి. అ. పుం. పెంపు, అభివృద్ధి.

**తాయము.** దే. వి. అరుదగువస్తువు. (శ. ర. బ్రౌ.)

**తాయల్లము** = తాయము. (వా)

**తాయి.** దే. వి. (క. తాయి. త. తాతా) తల్లి, జనని "సీ. కన్నబిడ్డలకేవఁ గాందిశీకులఁ బ్రోవ బంగారు తాయి మారంగశాయి." పాంచాలీ. ౧, ఆ. ౨౮, అచ్చ. యు. ౪౩౮.

**తాయెత** = తాయెతు. (రక్షార్థము కాని అలంకారార్థము కాని ధరించువస్తువిశేషము.) "క. తలఁపున నిది గారడ మని, తలఁచకు మానింగఁ దల్ల తటేఁగొండ దరిన్, దలమోచి తెచ్చినవి యివి, తల నుంచుము పసిఁడితాయెతల నుంచు నృపా. శంక. ౧, ఆ. ౧౮. అ. మ. క. ౧, ఆ. ౪౯. పు.

**తాయెతు.** దే. వి. (క. తాయిత్తు. త. తాయెత్తు.) 1. రక్షార్థము కాని యలంకారార్థము కాని ధరించు వస్తువిశేషము, "గీ. ఇమ్ముగా 'మేల్పసిండి తాయెతులు మెల్ల, విరిసరుల్ దట్టముగఁ జుట్టి వేసినట్టి, దూరసిగమీఁదఁ బైచెంగు లునిచి కట్టి, నట్టిఖరు సొదుమాల్ హొయల్ బిట్టు దనర." రసిక. ౧, ఆ. ౮౩, స్వా. ౫, ఆ. ౭౪; 2. కేయూరము, బాహుపురి. "సీ. కేయూరనామంబు తాయెతనంగను సందిదండ యనంగ సందికడియ, మన బాహుపురి యన నలరు." ఆం భా. ద్వి. ౧౯౦.

**తాయెత్తు** = తాయెతు. (రక్షార్థము కాని అలంకారార్థము కాని ధరించువస్తువిశేషము.) "మ... మం,దుల తాయెత్తులు గట్టినన్ శబరపుత్త్రుల్ గూడి యూడం బురిన్." కాళ. 3, ఆ. 3౨.

**తార.** ఉభ. దే. వి. సుషిరవాద్యవిశేషము, ఊఁదుపట్టె యొకానొకవాద్యము. (శ. ర.) "ఉ...అద్భుత, స్ఫారతరార్భటిన్ బిరుదుసంకులఁ దారలు బూరగొమ్ములుం, భేరులుఁ దమ్మటమ్ములును భీషణవృత్తిని బిట్టు మ్రోయఁగన్." కళా. ౮, ఆ. ౧౧౮, మొ. రా. యు. 3, ఆ ౨౬. సం. వి. ఆ. స్త్రీ. 1. బృహస్పతిభార్య; 2. వాలిభార్య; 3. ముత్యము; 4. కంటిపెల్ల గ్రుడ్డు; 5. నక్షత్రము.

**తారక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కంటిపెల్లగ్రుడ్డు, 2. నక్షత్రము.

**తారకము.** సం. వి. అ. పుం. న. పడవ. న. 1. కంటినల్లగ్రుడ్డు, 2. నక్షత్రము, 3. కన్ను, 4. ఓంకారము.

**తారకాణ.** దే. వి. దృష్టాంతము, ప్రమాణము. ఆం. భా. ప్ర. ౧౦౩.

**తారకాణించు.** దే. స. క్రి. రుజువుచూపు, దృష్టాంతీకరించు. "గీ. అనఘమతులార నన్నుఁ జిత్రాంగి యొదుట, నునిచి తారకాణింపంగఁ గనఁగ నట్టి, కల్ల నావల్ల గోరంత కలిగెనేని, యాజ్ఞ సేయ నర్హుఁడను జామి యని యచుండు." సా. ౨, ఆ. ౨౭౯.

**తారకితము.** సం. వి. (అ. ఆ. అ.) నక్షత్రములు కలది.

**తారకుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొకరాక్షసుఁడు; 2. ఓడ నడుపువాఁడు. విశే. (అ. ఆ. అ.) 1. దాటించువాఁడు; 2. ఉద్ధరించువాఁడు, ఆపదనుండి కాపాడువాఁడు.

**తారకోపనిషత్తు.** సం. వి. ద్. స్త్రీ. ఒకానొకయుపనిషత్తు.

**తారణ.** సం. వి. అ. పుం. ప్రభవ మున్నగుసంవత్సరములలో నొకటి.

**తారణము.** సం. వి. అ. పుం. పడవ న. 1. దాఁటించుట; 2. ఉద్ధరించుట, ఆపదనుండి కాపాడుట. విశే. (అ. ఆ. అ.) 1. దాఁటించునది; 2. ఆపదనుండి తప్పించునది. (అ. ఈ. అ.) దాఁటించు సాధనము.

**తారణి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. పడవ, ఓడ.

**తారతండులము.** సం. వి. అ. పుం. తెల్లజొన్న.

**తారతమ్యము.** సం. వి. అ. న. తరతమభావము, న్యూనాధిక్యము.

**తారము.** ఉభ. దే. వి. 1. నాలుగుకాసులరాగి నాణెము. (శ. ర. బ్రౌ.) "సీ. అమరశైలము చిన్నమంతగాఁ దలపోసి యాకాచలము దార మెత్తుఁ జేసి." నరస. ౫, ఆ. ౧౯౧. బహు. ౫, ఆ. ౧౬౫; 2. నాలుగుకాసులవిలువ గలనగ. "మ... నాతల్లియుఁ దండ్రి బాంధవులు వేడ్కన్ మీఱఁ జేయించి రీరవణంబుల్ విను పిన్నలోన నొకతారం బైన నీఁ జాల..." రుక్మా. ౪, ఆ. ౧౨౭; 3. ఒకరకము ముత్తెము. "సీ... మాక్తికం బొప్పును ముత్తెము ముత్యము ముత్తియ మనఁ, దద్విశేషభేద మరరుఁ దార మనంగ..." ఆం. భా.

ద్వి. ౘ౬ఓ. సం. వి. అ. పుం. 1. పల్లు, రదము; 2. పులు గడిసినముత్తెము ; 4. ముత్తెముపులు గడుగుట ; 4. బిగ్గరగా పాడురాగము ; 5. దాటుట, తరణము; 6. తరింపఁజేయుట; 7. కంటి నల్లగుడ్డు ; 8. నక్షత్రము ; 9. చిత్రవర్ణము. పుం. న. వెండి. న. 1. తామరపుష్పు; 2. ఓంకారము. విణ. (అ. ఆ. అ.) 1. గట్టిది. (ధ్వని ; 2. తళతళ మెఱయునది, 3. నిర్మలము,స్వచ్ఛము, (ముత్తెము మొ.); 4. చిత్రవర్ణము గలది.

తారసము. దే. వి. 1. సమీపము. "క. పాలు గల వాఁడు మన కొక,టాలి యిడక తాను తారసానకు వచ్చెన్." అము. 3, ఆ. 3౯; 2. తలపాటు, (యుద్ధమున) తాఁకు. "క. ఈరీతి నుభయబల ములుఁ, దారసమునఁ బోరు కడల . " జై.,గ్,ఆ. ౧౧౫, చంద్రా. ౬, ఆ. ౭౧. విణ. 1. సమీపించినది. "చ. శ్వసనునిఘోటి ఘోటిక తెజంగును దాఁటి పయిం జనంగ దారసమయి..." సా. ౧, ఆ. ౧౦౪, చం. రా ౬, ఆ. ౨౬, 2 దట్టమయినది, గుత్తమయినది. "చ...తారస మగుపుష్పకంచుకము రంజిలఁగాఁ జరియించు బీథులన్." హంస. ౪, ఆ. ౪౦; 3. సంధించినది, కలిసినది. "చ...ఈ,తరి చని సిమ్మటన్ ముదిమి దారసమైన మఱేటినుద్దతే " విప్ర. ౪, ఆ. ౨౨, జై. ౧, ఆ. ౧3౯; 4. కనఁబడినది. "చ...కటకరవంబు బోరు కలఁగన్ రమణుల్ తెరచీర పంచినన్, ఒటుకున రాజు మోమెదుటఁ దారసమైన..." స్వా. ౫, ఆ. ౮౧.

తారసారము. సం. వి. అ. పుం. ఒకయుపనిషత్తు.

తారసించు. దే. అ. క్రి. స. క్రి. 1. (యుద్ధమున) తాఁకు, కవియు. "క. మోహరములు రెండును నున్నాహంబునఁ దారసించినన్ ఫల్గునకేనాహం కృతి యుండిరో నుత్సాహంబునఁ దొరి పాంచజన్యం బొత్తెన్." చిత్రభా. ౭, ఆ. ౬౬. నరన. ౧, ఆ. ౬౪; 2. సమీపించు. "సీ. తారసించిన చోట దారునఁ దొరఁబాటి యొకటి రెంటిని బొల్ల లురల నడచు." స్వా. ౪, ఆ. ౪౨.

తారసిలు. దే. అ. క్రి. 1. ఎదురుపడు. "సీ. ఎచటి కేఁగెద వని యెవ్వరు నడుగక తంటలిపోఁడు తారసిలక.' ప్రబంధ. ౭, ఆ. ౬౦; 2. వచ్చు. "సీ. అనధికతరపుణ్యకాలకం బైనఫలము,పుణ్యవిధు లార నాగ్నిహోత్రంబునకు మిాఱు, కలఁపు గాని కలంపుగాఁ దారసిలుట." కూర. ౪, ఆ. ౫౬; 3. ప్రసరించు. "సీ. కనకరారుణరుచుల్ ఘనల తావులఁ దారసిలి నవ్యకిసలయావళుల నింప" ఉ. రా. ౧, ఆ. ౧౭౮. కళా. ౨, ఆ. ౧౭౪; 4. తొడఁగు, మొదలిడు. "గీ. విరులు కొప్పునఁ దుఱిమి యవ్వెలఁది విభుఁడు, తారసిలి రవ్వడు పునారతంబునను." దశా. ౭. ఆ. ౧౫. ఆ. క్రి. స. క్రి. 1. (యుద్ధమున) తాఁకు, కవియు. "ఉ. అత్తతి రెండుసేనలు రయంబునఁ దారసిలెన్ గడంకమై, నుత్తరదతీ,శార్జపము లొం డొకటన్ పడిఁ దాఁకెనో యనఁగ్." కళా. ౮, ఆ. ౬౨. రా. వి. ౫, ఆ. ౪౧.

తారసిల్లు = తారసిలు, తారసించు. దే. అ. క్రి. 1. పెట్టు. "ఉ...జేఁవేజీకరశాఖ యప్పుడమి పేలుపుచెంతకుఁ దారసిల్లి హేలాతిశయంబునన్ బలికె నంకురితప్రమదానురాగయై." విప్ర. 3, ఆ. ౮౧; 2. సంధిలించు. "ఆ. మఱుజాఁ డెల్ల ప్రొద్దు మానక పేయంగ, దైవయత్న మొకటి తారసిల్లు." కుచేల. ౧, ఆ. ౮౯. అ. క్రి. స క్రి. సమీపించు. "చ. జనపతి దారసిల్ల నొకసంపఁగి తావులకొమ్మ రాగవ ద్ధనసుమనోభిరామ యయి." వసు. ౧, ఆ. ౧౫౬. ఉ. రా. ౬, ఆ. ౨౯.

తారళ్యము. సం. వి. అ. న. 1. చాంచల్యము,కపలిక; 2. జారత్వము, ఱంకు.

తారాచువ్వ. మి. గ్రా. వి. (తారా+చువ్వ) నక్షత్రముల కంటునట్లుగా పైకెగురు నొకవిధ మగు బాణసంచు. "వ...వెలువార నుదారంబు లగు తారాచువ్వలు తారాపథంబుల కెగసి,..." మృ. వి. 3, ఆ ౪3.

తారాడు. దే. అ. క్రి. (తారు+ఆడు-స్వార్థమున) 1. తిరుగు, ఇట్టటు తిరుగు. "క. ఈరీతి కొచట నిలువక, తారాడక నొకరసాలతరుమూలమునన్, జేరి..." రాధికా. ౨, ఆ. ౭౫. యు. ౪, ఆ. ౧౬; 2. తిరాడు, కదలియాడు. "మ. అల పర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడించుచో మేఘుఁడుం, దలపున్నదైల గ్రుంగ లేవను మరు స్సార్థంగికుం దర్థి కాత్త లలిన్ నేలకు వ్రాలుదు కాగియుంచుం దాళాతు నత్తెల్లజల్లులఁ గెం

గుచ్ఛులు నయ్యె ధారలుకు దల్లి శేంద్రగోపం బులున్." ఆము. ౪, ఆ. ౯౨.

**తారాధిపుఁడు.** సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. బృహస్పతి; 3. వాలి; 4. సుగ్రీవుఁడు. (ఇస్లో. తారాపతి. మొ.) [ఆకాశము.

**తారాపథము.** సం. వి. అ. పుం. నక్షత్రమార్గము.

**తారాపీఁట.** మి. వి ఎద్దువెన్నుమీఁద వేయు పీఁట వంటిపరుపు. (శ. ర. బ్రా.)

**తారాపీడుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**తారామండలము.** సం. వి. అ. పుం. న. 1. నక్షత్రమండలము; 2. కంటినల్లగుడ్డు, 3. స్త్రీపత్రవిశేషము. "౧. సూరవరంబులును దారామండలంబులును హంసావళులును ..అనుపేర్ల గల పుట్టంబులు గట్టుకొని .." ద్వి. 3, ఆ. ౧౭౭.

**తారామృగము,** సం. వి. అ. పుం. మృగశీర్షనక్షత్రము.

**తారి.** ఉభ. దే. వి. (తారు ధా.) ఆట ఆడించు సూత్రధారుఁడు. "సీ...తారి నాఁగను సూత్రధారకుండు." ఆం. భా. ద్వి. ౭౮౭. సం. విశే. (న్. ణీ. న్.) 1. దాఁటించునది, 2. ఉద్ధరించునది.

**తారక.** సం. వి. ఆ. స్త్రీ. తాటిక్కల్లు.

**తారితము.** సం. విశే. (అ. ఆ. అ). 1. దాఁటింపఁబడినది; 2. ఉద్ధరింపఁబడినది.

**తారీఖు.** దే. వి.హిం. వి. మాసమం దొక దినము, తేదీ.

**తారు.** దే. అ. క్రి. 1. సంచరించు, ఇట్టట్టు తిరుగు 'సీ. కాననంబున దారుమృగంబులకైవడిఁ దైకొని యసమాస్త్రకర్షితులను.' రాఘు. ౧, ఆ. ౨౦ ఉ.రా. ౫, ఆ. ౭౯, 2. పోవు, వెళ్లు. 'గీ. మోసపోక మునామష్మనుదదిరాలు, దారి నడి నప్పు లేక పాతాళమునకు." కాశీ. ౫, ఆ. ౭౮౯. వాసిష్ఠ ౨, ఆ. ౯3, 3. తొలఁగు,పాయు. "ఉ .. మిమ్ము నహర్నిశమున్ మనంబులం,దారఁగనీక రూపగుణశస్ఫురులై మిముఁ బొందుకై వడిన్." భాగ. ౧౦. స్కం. ఉ. ౧౧౪౯; 4. కలుగు, జనించు. "ఉ. సారసలోచనామణులు చల్లెడిసేసలాసంగ నిమ్మదిన్, దారెడికోరికల్ పెనఁగొనంగ నతండు సభార్యుఁడై శుభ, శ్రీరహిఁ దన్నిదంద్రులకుఁ బ్రేమఁ బ్రణామము చేసి పేడుకన్"ఇందు. ౭, ఆ. ౧౧౨. రావి. ౨, ఆ. ౧౧౨; 5. కాంతి హీనమగు; క్షీణించు, తగ్గు, "శా. అశేశం బలి సంభ్రమాముగుణగంగాంభోధురంబుల్యతిన్, ద్యో

పీఠిం జెలిపెక్కులల్లిగుద సిందుం డందుఁ గ్రీడించు చే వావాసద్విక మయ్యెఁ దన్మథిశకు,భ్రాజిబులై తారెఁ దారాపర్గంబులు"...ఏను. ౪, ఆ. ౭౧. "సీ... అనన్య,జనబుద్ధిఁ జెంది తారని వేడ్కన్." హ. న. ౨, ఆ. ౧౭. స. క్రి. అ. క్రి. చేరు,సమీపించు. "సీ. ఏవిహంగముఁ గన్న వెలుఁగు లిచ్చుచు సోఁకును సైకతంబులఁ గూడఁ దారు." స్వా. 3, ఆ. ౧౬. (శ. ర. పా. 'తాఱు'. ముద్రి. పా.) కువల. ౪, ఆ. ౭.

**తారుకొను.** దే. అ. క్రి. స. క్రి. (తారు+కొను) వ్యాపించు,పర్వు. "చ. అతనికళేబరంబున మహాపురుషుం డొకరుండు నిర్గమిం,చి తరణిబింబడంబర విజిత్వరదివ్యశరీరకాంతిసం,తతులు దిగంతరాళములు దారుకొనంగ విమాన మెక్కె"...వరాహ. ౧౧. ఆ. ౧౧౪.

**తారుకొలుపు.** దే. స. క్రి. (తారుకొను ధా.ప్రే.) అమర్చు. "సీ. చిగురాకుఁ జేసెఁ జేసెఁ గానిశాఁ దమఁ దాఁకేటి సేయూటి దారుకొలిపె." చిత్రభా. ౫ ఆ. 3౧.

**తారుచు.** దే. స. క్రి. 1. చేర్చు. "సీ. తారుండు పరకాంత నయ్యరై దాఁచి వాని గానని పల్కులిచ చనునె." రామలిం. 3౦; 2. సంధానము చేయు. "చ.. ముద్దగుమ్మకుం,చటుకున నొక్కపాలిగురి దారిచి బిగ్గర నంటఁ గట్టె"...సీలా. ౧ ఆ. ౧౧౦. 3. (యుద్ధమునకు) సిద్ధపఱచు. 'మ. అసితాం దారిచి తోడు తెచ్చికొని మిమ్మద్దాలుగా నొడ్డుచుం, జన్మై సోఁకక యుండఁగాఁ దిరిగెడు న్దప్పై జరాసంధుఁడు"...హరి. ఉ. ౧. ఆ. ౧౧౦.

**తారుణము.** సం. విశే. (అ. ఆ. అ). తరుణసంబంధమైనది,పడుచు వారికి సంబంధించినది. [దనము

**తారుణ్యము.** సం. వి. అ. న. యౌవనము,పడుచఁ

**తార్కాణ.**=తారకాణ.(దృష్టాంతము, ప్రమాణము.) "మ...చిత్రము నీ కిచ్చినదేవివాక్యమునకుం దార్కాణగా సామజన్మములు న్వింటిగదమ్మ ..." ప్రభా. 3, ఆ. ౭౫. శుక. 3, ఆ. ౪౨౨.

**తార్కాణము.**=తారకాణ, "క. అనిన నగి యెందుఁ గలదే, మన సెబుఁగనికలియు నొడలు మఱచిన నిమముల్,గనదేలా మనసునదున్, మనసేతార్కాణ మని కుమారుఁడు వేగన్."సా. ౨, ఆ. 3౨.

**తార్కాణచేయు.** దే. స. క్రి. (తార్కాణ+చేయు) రుజువుపఱచు,నిరూపించు. "గీ...లేదు దబ్బర యంటివా లేచి రమ్ము, నీకుఁ దార్కాణచేసెద నేసె వచ్చి, యట్టిగేస్తుని చెవ తె పెడ్డాడఁ దలఁచు." పార్వ. ౪, ఆ. ౧౦౧. కళా. ౨, ఆ. ౧౫౭. 3, ఆ. ౧౦౮.

**తార్కాణయగు.** దే. అ. క్రి. (తార్కాణ+అగు) తెలియు. "గీ. నాకుఁ దార్కాణ మైనయట్టి యుడు దిరుగఁ,నడుగఁ జెప్పంగ దలఁ ...సఘుచరిత,...పుడు ...ఘుని ... నీయుఁ,జెప్పితిరి ...కాని యిది చెప్ప వలయు." కళా. ౨, ఆ. ౫౯.

**తార్కాణించు.** = తారకాణించు. (రుజువుపఱచు.) "వ...తనకలంపు యథార్థ ... తార్కా ణించె .." ప్రభా. ౪, ఆ. ౧౧౫; 2. (స్పష్ట పఱచు) "ద్వి. ఇతరునివలె నది యిది యని కాని,గతులు నీచేతఁ దార్కాణింపఁబడెను' ద్వి. మారిచ్చ. ఉ. ౨౫౧౨. పు.

**తార్కికుఁడు.** సం. వి. అ. పుం. 1. తర్కశాస్త్ర పండితుఁడు; 2. తర్కశాస్త్రము చదువుచున్న వాఁడు.

**తార్కొను.** దే. అ. క్రి. స. క్రి. (తారు+కొను) 1. (యుద్ధమున) తాఁకు,కలియు, "క. తెగగొని బ్రహ్మాస్త్రము వేఁడగ నేసిన నొకటి నొకటిఁ దార్కొని రెండున్, గగనం బంతయుఁ దేజ, స్థగితముగాఁ జేసె"...భార. ఉద్యో. ౪, ఆ. ౩౪౬. ఇందు. ౪, ఆ. ౧౯; 2. మైఁబడు. "సీ. బలిమిఁ దార్కొని కలభాషిణి వేనలి యొక కేలఁ బట్టి"...కళా. 3, ఆ. ౧౧౯. 3. వ్యాపించు క్రమ్ము. "క. ఘనఘనా మోదయ మంబరమునఁ దార్కొని శ్రుతిమనోజ్ఞ భూరినినాదం బున గర్జిల్లఁగ..."రామా. 3, ఆ. ౨౫. ఇందు. 3, ఆ. ౧౦౭. అ. క్రి. 1. కలియు, మిళితమగు. "వ ...కటిఁవేఁపాకుపరిమళంబులో సంబంధించుకమ్మక పిందగంధంబును గమ్మకపింద గంధంబు తోడం దార్కొను నేలకులసౌరభంబులును .." కాశీ. ౭, ఆ. ౧౮౫. భో. ౨, ఆ. ౨౦; 2. కలుగు, పుట్టు. "ఉ. వాడి పత్తలై, తగ్గిన మేనులున్ వణఁకు దార్కొనుకానులు......

కానుపింపఁగన్." విక్ర. ౨, ఆ. ౫౩. వి. పు. ౬, ఆ. ౨౬౭; 3. ఉండు. "చ. వెలువడి యవ్వ ధూవరులవింతలు వేడుకఁ గొంత గన్గొనన్, దలఁచి పిసాళిపాటలు ముదం బలరంగ మెఱుంగు బంగరుం, దలుపులు త్రోచి క్రొంబతులు దార్కొనుసౌరణగండ్ల వెంబడిం, బొలిచిరి .." ఇందు. ౬, ఆ. ౧౩౧, 4. ప్రవర్తించు, నడచు. "చ...అవ్విలాసవతిఁ గౌఁగిటఁ జేర్పక యోర్చు టెట్లు నా,తలఁపులకుం దదాత్మయును దార్కొన కెట్టిది ...సెడు" ప్రభా. ౨, ఆ. 3; 5. తగులుకొను. "శా. ...ర్కాం...పలవత్ప్ర నిర్మిత మహాహర్మ్యాగ్రభాగంబులన్, దార్కొన్ తారక మండలంబుఁ గని ముగ్ధస్త్రీలు .." భీమ. 3, ఆ. ౯౩. పారి. ౪, ఆ. ౮౨. స. క్రి. చేరు, పొందు. 'సీ. ధనవంతుగర్వంబు తార్కొన కే లుండు ..." నా. పంచ. ౧, ఆ. ౧౩౦. నా. పంచ. ౧, ఆ. ౭౨.

**తార్కొల్పు.** దే. స. క్రి. (తార్కొను ధా. ప్రే.) తగులుకొనఁజేయు, సక్తమొనర్చు. "మ...తదీయ మూర్తివిభవధ్యానంబు గావించి చిత్తము సర్వాంగవిమర్శనక్రియలకును దార్కొల్పి..." భాగ. 3, స్కం. ౯౨౮.

**తార్చు.** దే. స. క్రి. (తారు ధా. ప్రే.) 1. చేర్చు "చ...యథోచితవిధు లాచరించి పువుగొజ్జఁగు నొయ్యన మేను దార్చుచున్." వసు. 3, ఆ. ౯౩. భార. శాం. ౫, ఆ ౩౭౦; 2. నిర్మించు. "మ. పొలఁతీ పాపాపగున్నపొన్నవిరికిం బాఁ దేశ బల్కాల్వగా, నలరన్ సారెకు నెక్కుచుం దిగుచుఁ జాలై తుమ్మెద ల్మించె నిచ్చలపుం జాయలతావి జాజివిరి నేజాజోడు గైకొన్నక్రొం దలుకుం బచ్చలమేడఁ దార్చుకెలయంత్రంబో యనం గంటివే." కువల 3, ఆ. ౧౭౦; 3. కదియించు, కూడఁజేయు. "ఉ. ఇరువాయఁగా ముడికిఁ దాల్చినవెండ్రుక ల న్నిమంబునన్." నైష. ౧, ఆ. ౫౩. వసు. ౫, ఆ. ౭౬; 4. ఉంచు. "చ. హరికరుణాకటాక్షమహిమాగత దివ్యవిమానమందిరో, దరకురువింద వేదియెడఁ దార్చిననిర్మలవజ్రపీఠిపై, ధరసుత నుంచి..." వసు. ౫, ఆ. ౧౦౪; 5. కలుగఁజేయు. "చ... తదీయహేలికాం,కరి యతిలోహితావయవగాఁ

దశు నాత్మకృపాదాశరంబులం, దరలక తాల్పు వారలకుఁ దార్పు సురీవరణీయమై ఖరుల్." వసు. ౧, ఆ. ౪౯. ఆము. ౪, ఆ. ౨౪౨; 6 పోఁగొట్టు, తొలఁగించు. "ద్వి. భయములు దార్చు శోభనములు గూర్చు, జయముల నిచ్చు దుర్జయము లడంచు." ద్వి. పరమ. ౫, ఆ. ౩౬౮. పు. పారి. ౧, ఆ. ౧౧౭; 7. ప్రసరింపఁజేయు. "గీ. మోఱకునిచందమున నీఱుఁ ఱచూపు, శౌండవేయునిపైఁ దార్చి బ్రహ్మణుండు, పరికె నిప్పుచ్చరం భైనభాషణముల." హర. ?, ఆ. ౧౪; 8. లాగు, ఆకర్షించు. "ఉ. పూర్ణేందుని మున్ను గొన్నరుచు లిమ్మని నీటికిఁ దార్పునై పడిన్." వసు. 3, ఆ. ౧౫౯. ఆము. 3, ఆ. ౭౪; 9. ఒగ్గు. "సీ. చెవి దార్చి వినీ దీమ చిటుకన్న శోకపాఠి నెలది వెంపరలాడుజెట్ట లెల్ల." స్వా. ౪, ఆ. ౧౭. ఆము. ౨, ఆ. ౨౪; 10. వ్రేయు. "చ. కవ వటు డించి వే గురుకఁగా సురేఁ గొంకుల దార్చి కూలుడున్." ఆము. ౬, ఆ. ౭౧. 11. తాల్చు, అవహించు. "గీ. తార్చె నా గొడగొశ నసఁ దనరు నావహించె నను మాట గా..." ఆం. భా. తృ. ౧౧౯.

తార్క్షుఁడు. సం. వి. అ. పుం. కశ్యపుఁడనుఋషి.

తార్క్ష్యము. సం. వి. అ. పుం. 1. రథము; 2. గుఱ్ఱము; 3. మద్దిచె; 4. పక్షి; 5. ఒకానొకపర్వతము.

తార్క్ష్యుఁడు. సం. వి. అ. పుం. 1. అనూరుఁడు, అరుణుఁడు; 2. గరుడుఁడు; 3. వామనుఁడు, విష్ణువు.

తార్తీయము సం. విణ. (అ. ఈ. అ.) మూఁడవది.

తార్తీయీకము. సం. = తార్తీయము.

తార్పు. దే. వి. 1. అమరిక, కూర్పు. "సీ. కరికుంభములకు బంగారుతార్పులయొప్పు శకటాంగముల నిప్పు జరిగెనే." పి. శకుం. ౨, ఆ. ౧౭౪; 2. బరణి. "గీ. కలుపచెలి దొంగరాఁబడి గలుగు తానింక,ననుదు మునుమున్న పద్మిని తనవికాసపధన మునిచి నీట నిడురాగితార్పు వోలెఁబడియెఁ బదపటికనుమలోఁ బద్మహితుఁడు." రామా. ౭, ఆ. ౯౧. శై. ౮, ఆ. ౧౯౯.;

తార్పులాడు. దే. అ. క్రి. (తార్పులు+ఆడు) పొట్టేళ్లు మొదలగునవి దెబ్బలాడు. "చ. గొఱ్ఱెపోతులన్,బెదఁగుఁగ దార్పులాడఁగను బెట్టు." భల్లా. 3, ఆ. (శ. ర.)

తార్యము సం. వి. అ. న. ఓడకేవు, పడవకూలి. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁదగినది; 2. ఉద్ధరింపఁదగినది.

తాఱించు. దే. స. క్రి. (తాఱు ధా. ప్రే.) పోఁగొట్టు. "సీ. దరిసించుచో నెల్లఁ దాఱించుఁదాప మీయవనీంద్రుచూపు చంద్రాతపంబొ." చంద్రి. ౫, ఆ. ౧౦౪.

తాఱు. దే. అ. క్రి. 1. దాఁగు. "చ. వలదొర మెచ్చఁగా ఘనకువర్ణకులాళకవాసనాగళిన్, గలసి రజస్స్ఫలింగములు గ్రక్కుచు నీవలి వేగ చేరి రా,నలినిధిఁగ్రూనఁ దాఱె".. చంద్రి. ౪, ఆ. ౫౮; 2. నక్కుచుఁబోవు,మఱుఁగుపడియేఁగు. "ఉ. కాంచి కలశ్వణక్కనక కాంచికమై రొద సేఁగి యుప్పు ద,క్కంచనకేతకీకుసుమగాత్రి పయస్యల డించి చన్నిరుం,జాంచలవీధిఁదాఱుచు ..." స్వా. 3, ఆ. ౮౯. నీలా. 3, ఆ. ౧౦; 3. వ్రాలు. "ఉ ..కలధిప్రకరంబు మహీరుహంబుపైఁ, దాఱుతెఱంగు చేసి యతిధైర్యము చూపె నతండు సైరణన్." ఉ. హరి. 3. ఆ. ౫౮. (శ. ర. పా. తారు. ముద్రి.); 4. ప్రవేశించు,చొచ్చు. "ఉ. మాతృసంఘము వసించుగృహంబులొనికిం,దాఁటఁడు కావరే యనఁడు తారము నొందఁడు కంటగింపఁడున్." భాగ. ౭. స్కం. ౯౯౪. హరి. ఉ. ౭, ఆ. ౧౮౨; 5. కృశించు. "గీ రామలక్ష్మణసతతాభిరక్షచేతఁ, బరఁగు నీసాధ్వి యక్కటా భయదరాక్షసీసురక్షితమై భీతిఁ గెంది వగలఁ,దాఱుచున్నది యేమందు దైవగతికి" భా రా. సుం. ౧౫౬. భార. శా. 3, ఆ. ౧౯౨, 6. చెడు, పాడగు. "ఉ. తాఱినయొల్చుఁ బప్పుచు ఘృతంబును దియ్యనిపాయసంబులున్." హర. ౨, ఆ. ౩౧.

తాఱుపుఁబెట్టె. దే. వి. (తాఱుపు+పెట్టె) పెట్టె మూఁత. "ఉ. కాంచనతుంగశృంగములు గల్గి ధరిత్రికిఁ గోటయై పడిన్,మించినచక్రవాళగిరిమీఁదను దాఱుపుఁబెట్టె మూసినట్లంచితమై పెడంగగునబాండకటాహము..." వ. పు. 3, ఆ. ౮౯.

తాఱుమాఱు. దే. వి. (తాఱు+మాఱు) క్రమము తప్పుట, వ్యత్యాసము. (చూ. తాఱుమాఱుపడు) విణ. క్రమముతప్పినది,వ్యత్యస్తము. "ఉ. ఇంత కొఱంత యేల విను పేచి జగంబులు తాఱు

తాళు గ్గానింతునో..."అచ్చ. అర. ౧౦౬.
అం. భా. కృ. ౬౮.

తాళుమాళుపడు. ద్వ్య. అ. క్రి. (తాళుమాళు+పడు) వ్యత్యస్తమగు. "వ...కటిచ్ఛటులం బగు లోచనప్రభాపటలంబు దిక్తటంబులఁ బర్వఁ దాళుమాళుపడ నిడికొనినమొగంబులతో..." స్వా. ౪, ఆ. ౩౭.

తాలంకము. సం. వి. అ. పుం. చెవికమ్మ తాటంకము.

తాలఁబోయు. దే. స. క్రి. (తాలన్+పోయు) పోఁగుచు, తాలించు. "సీ...వలయుసంబారాలు వడియాలు బలియించి దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి." హర. ౨, ఆ. ౧౨౧.

తాలధ్వజుఁడు. సం. వి. అ. పుం. 1. భీష్ముఁడు; 2. బలరాముఁడు.

తాలపత్రము. సం. వి. అ. పు. 1. తాటియాకు; 2. కర్ణిక, ఒకరకపుకర్ణభూషణము.

తాలవృంతము. సం. వి. అ. న. వీవన, విసనకఱ్ఱ.

తాలవ్యము. సం.విశే. (అ. ఆ. అ.) తాలువునఁబుట్టినది.

తాలించు. దే. స క్రి. 1. కూర మొదలగువానిని తిరుగఁబోయు, పోఁగుచు. (శ. ర. బ్రా.); 2. గండిచేయు. "వ ..వాయ పరుగనీక గడిదల లూచి జలకించి యుంను దాలించియుం మించియుం." ప్రబంధ. ౭౮౮.

తాలింపు. దే. వి. (తాలించు. ధా.) పోఁగుచుట, తాలించుట. "వ...కర్కంధూఫలోన్మిశ్రశాక పాకంబులతాలింపులకమ్మనికంపు పాంథఘ్రాణంబుల కింపుసొంపులు సంపాదించు..." కాశీ. ౨, ఆ. ౪౪. అం. భా. ద్వి. ౨౫౨; 2. తాలించినపదార్థము. "మ తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయశ్రేష్ఠుఁ డావారికర్పించుటఁ బావనంబు లగుశాల్యాన్నంబులు స్నేహలుల్, వరుగుల్ చేరులం పప్పు లప్పడములన్ తాలింపులున్..." పాండు. ౨, ఆ. ౨౪, పాండు. ౪, ఆ. ౧౮౪.

తాలిక. ఉభ. దే. వి. 1. మెలిక. "సీ. నడుకత్తి మట్టిపా లిడి తాలిక లొనర్చి కదలుకొల్పినగొప్ప జడలదిండు." శుక. ౨, ఆ. ౩౨, శ్లో. ౩, ఆ. ౪౨; 2. చాఱ, రేఖ. "ద్వి. ఖడ వేల కుడువఁ బోదము రాక మొదలం, కడికోఁ గదర యొాత్రై కలా రసుచుఁ, దాలికల్ గట్టి పెంతలఁ గొంత తాఱ, ఫాలముల్ పచ్చగాఁ బసుపులు పూసి." ఆ. మ. క. ౫, ఆ. ౭౩౬; 3. క్షమ, తాలిమి. "సీ. తాలిమి యొారుపు తాలిక సాఁగపు క్షమ..." అం. సం. మాన. ౬౮. సం. వి. ఆ. స్త్రీ. 1. చపేటము; 2. నేలతాడు •.

తాలికము. సం. వి. అ. పుం. 1. చప్పట; 2. చపేటము, చాఁచినవ్రేళ్లు గలయఱచేయి.

తాలిదము. దే. వి. తాలింపు, పోఁగపు. "మ...తాలిదపుసొంపుల్ నింపువంకాయవేఁ, పుడుగమ్మందనము..." రా. వి. ౨, ఆ. ౧౦౦.

తాలిపించు. దే. స. క్రి. (తాలించు ధా. ప్రే.) ధరింపఁజేయు, తొడిగించు. "ఉ. గమ్మనఁ బచ్చకస్తురిని గజ్జవాదిని గుంకుమంబును, స్నిగ్ధమై నిన్నలుంగు నిడి నిద్దపుఁగండియ దువ్వబెట్టునం, దమ్ముగఁ గట్ట నిచ్చి జిగితం బగుసైకను దాలిపించుచున్, సొమ్ములువెట్టె జాజుతకు సొమ్ములం బెట్టెను మేన మేనయుఁన్." పార్వ. ౫, ఆ. ౨౩౫.

తాలిమి. దే. వి. 1. ఓర్పు, క్షమ. "సీ. తాలిమి భూదేవి తగ సాటి యగుదేవి..." దశ. ౧, ఆ ౮౪, అం భా. ప్ర. ౧౩౪; 2. ధైర్యము, మనస్థైర్యము. "క. పదఁతీ యెట్టటు ప్రాణము, పిడికిటఁ బెట్టుకొని కేఁడు ప్రియుంతో నీ వెప్పుడులలేఁ బలంకక యుంచుక, తడవుందుము మాకుఁగాను దాలిమితోఁదన్."కళా. ౭, ఆ. ౨౦౫. సైప. ౪, ఆ.౩౫.

తాలిమికత్తె. ద్వ్య. విశే. (తాలిమి+కత్తె) 1. క్షమావంతురాలు, 2. ధీరురాలు. (శ. ర.)

తాలిమికాఁడు. దే. విశే. 1. క్షమావంతుఁడు, ఓర్పరి. "సీ. పరఁగును క్షంత యోర్పరి యనఁ దాలిమికాఁడన..." అం. భా. కృ. ౧౧; 2. ధైర్యవంతుఁడు. 3. ధీరుఁడు, పండితుఁడు. "క. వేలంపుదాసఁడనుంగున, వాలాయముఁ గల్పముల నవారిగఁ జేయం, జాలినతొల్లిటియప్పటి, తాలిమికాండ్ర కొఱబల్కుదంటలఁ గొలంతున్." అచ్చ. భా. ౧, ఆ. ౨.

తాలిమిడు. దే. స. క్రి. (తాలిమి+ఇడు) క్షమించు. "ఆ. ఉగ్రశాసనుండు నిగ్రహింపక రాజ్యతనయుఁ దనుచుఁ దప్పు తాలిమిడుఁడు." సా. ౨, ఆ. ౨౮.

తాలికము. సం. వి. అ. న. పర్వతము.

తాలీశపత్త్రము. సం. వి. అ. న. 1. తాళిసపత్త్రి •; 2. నేలయుసిరిక •.

తాలు. దే. అ. క్రి. తిరుగు. (మా. తాలఁబోయెను.) 1. వి. ఎన్ను తీయఁబడి ఎండిపోయినపైరు. (శ. ర. బ్రా.) 2. తప్పగింజ, పొల్లు. "సీ. తుచ్ఛ ధాన్యాభిధ దోఁచుఁ దాలు తరక పొల్లుకట్టు తలుక పొల్లు తప్పు, తంక రవ..." ఆం. భా. ద్వి. ౨౩౯.

తాలుకము. సం. వి. అ. న. 1. తాలువు, 2. తాలువు నందు కలుగురోగము.

తాలుచు. దే. స. క్రి = తాల్చు 1. (వస్త్రాదులను) ధరించు. (ప్రసూనదామము) "గీ. ఇటులఁ దాలిచి సంతుష్టహృదయుఁ డగుచు." దశా. ౨, ఆ. ౧౯; 2. పొందు. "చ. క్షితి హలకృష్టిఁ బుట్టి యడఁగెన్ క్షితియందున సీత యంచుఁ దృశ్యతివిరహార్తిఁ బాండిమము దాలిచి రామశరీర మెత్తి..." ఆము. ౪, ఆ. ౨౯.

తాలుపు. దే. వి. (తాలుచు ధా.) పొగపు, తాలింపు. "ఉ...తమ్మునితాలుపు పొజ్జపిండితో, నొప్పులుగా భుజించిరి బుంగ్ర్తము లాకటిచిచ్చు పెచ్చునన్" భీమ. ౨, ఆ. ౧౩౯.

తాలువ. సం. వి. = తాలువు.

తాలువు. సం. వి. ఉ. న. దౌడ. "సీ. తాలువు తాలువ దవడ దౌడ యనంగ నలరుచు .." ఆం. భా. ద్వి. ౧౪౩.

తాలూకా. హిం. వి. జిల్లాలో నొకభాగము.

తాలూరము. సం. వి. అ. పుం. సీటిసుడి.

తాలూషకము. సం. వి. అ. న తాలువు.

తాల్చు. దే. స. క్రి. 1. (వస్త్రాదులను) ధరించు. "ఉ. ఆనవలా వలంతిపను పాడి దుకూలముఁ దాల్చి .." ఆము. ౫, ఆ. ౩౯. స్వా. ౩, ఆ. ౧౧౯; 2. మోయు, వహించు. "చ. బహుంవన పాదపాబ్ధికులపర్వతపూర్ణపరస్పరస్వలీ, సహిత మహామహీ భరముఁ బ్రస హ ప్రఫణాళిఁ దాల్చి యుస్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్య యైనయ,య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్." భార ఆది. ౧, ఆ. ౧౦౫. ఆం. భా. తృ. ౧౧౯; 3. అవలంబించు, పూను. "చ. తపరఁగ బ్రహ్మచర్యమును దాల్చె జగద్విదితప్రతిజ్ఞుఁ డై." భార. ఆది. ౪, ఆ. ౨౪౨. "క. తమయ కడు మెఱయుంతొడ పృత్తమరూపము గోరువారు తాల్తురు దానిన్." భార. ఉద్యో. ౨, ఆ. ౪౦. (ఇది మొదటియర్థమునకు నుదాహరణము.) భార. అర. ౧, ఆ. ౧౨౭; 4. గ్రహించు, కైకొను. "ఉ. సంచితపుణ్యుఁ డంబురుహాసంభవునంశము దాల్చి పుట్టి..." భార. ఆను. ౩, ఆ. ౪౭. నీలా. ౩, ఆ. ౩౫; 5. పొందు. "క. వినిద్రఁ జెందునంతకుఁ,దా నొల్లదు నిద్రఁ దాల్ప..." కేయూర. ౨, ఆ. ౫౩. శాకున్త. ౧, ఆ. ౧౧౦, 6. (గుడ్లు) పెట్టు. "ఉ. తమ్మిపతంగపల్లి తమిఁ దాల్చినపాండురశారకాండముల్." వసు. ౪; ఆ. ౧౩౪; 7. (నూలు మున్నగువానిని) పురియెక్కించు, పేను. "గీ. ఎనఁగు సంతాపభర మున నిట్టునట్టుఁ, బొరలుశయ్యాతలంబునఁ బువ్వుఁ బోఁడి, తివురు విరహానలంబున దివ్వెలెత్తఁ, జిత్తజాతుండు వత్తిఁ దాల్చినవిధమున." ఉ. హరి. ౫, ఆ. ౧౩౧. విజ్ఞా. అచా. ౨౫; 8. మెత్తని పిండినుండి నూకను విడఁదీయుటకై చేతితో కోడు. (వా.)

తాల్పు. దే. వి. (తాలిక) "సీ. త్రావుచు నెదనెదఁ దాల్పుగా వండిననంబాడుపొరకలు నంజుకొనుచు." ద్వా ౪, ఆ. ౧౩౪.

తాల్మి. తాలిమి. 1. (క్షమ. ఓర్పు) "గీ. ఇట్లు తమ తమవర్తించునెడల సకలజనములకు హృదయానురంజన మొనర్చి,తాల్మి పుయిలోట యడఁకువ తగవు మెలపు, నెఱితెలుగుదు బాటించు నేర్పు గలిగి." భార. విరా. ౨, ఆ. ౩. ఆం. భా. ప్ర. ౧౩౪; 2. ధైర్యము, మనస్థైర్యము. "క. ఈ తాల్మి లేదు బ్రాహ్మణ,జాతికి నీ వెవ్వఁడవు నిజం బనవుఁడు..." భార. శాం. ౧, ఆ. ౨౫. చూ. ౧. ఆ. ౨౪.

తాల్మింటి. దే. వి. ఆయుధవిశేషము. "మ. తన సీటులన్ మెఱయించు కేసపాదపుం దాల్మింటి యందంపుఁగుం, దనపుందల్కులు గ్రమ్మరించు చిఱుసాసాకత్తి చిమ్మన్..." కువల. ౫, ఆ ౪.

తావకము. సం. విశే. (అ. ఆ. అ.) నీసంబంధమైనది, నీది.

తావకాఁడు. దే. వి. బ. (తావలము+కాఁడు) ఏత మెత్తువాఁడు కాఁడించుకొనుట కమర్చినకఱ్ఱ పట్టెలు. (శ. ర. బ్రా.)

తావకీనము. సం. = తావకము.

తావగొను. దే. అ. క్రి. (తావలము+కొను-తావడము కొన్నిచోట్ల శ.సం. లోనే కాని మరెచ్చటను గనుపట్టదు.) 1. నిలుచు, ఉండు. "సీ. వినువీథి కాడఁజూడి విశిఖికొంగింటిలో నిలఁ దావగొని యున్న వెలుఁగుఱేఁడు." శ. సం. ౧౦. ఆ. ౫౬; 2. తాళు, ఓర్చు. "వ. అనుచు నతి సంభ్రమంబునం బఱతెంచిన పదంతకుం గనుంగొని రతి మతి నదల నూరడించినం దావగొనక .." శ. సం. ౫, ఆ. ౭౯ శ. సం. ౫, ఆ. ౪౪.

తావడము. దే. వి. (క. తావడ) హారము; రుద్రాక్షలు లోనగునవి గ్రుచ్చి భక్తులుధరించుమాల. "ఉ. దేవి తమోమనుక్షీరసము లేటఁ బోసంగఁగఁ గట్టిపెట్టి యం,కావళి వ్రాయఁగాఁ దొడఁగె నంబర సంపుటకాంతరంబునన్, బూవిలుకాని శౌర్యగుణ ముల్ హరిణాంకుఁడు ముత్తియంబులం, దావడముల్ రచించినవిధంబున రుక్షటికాముఖంబులన్." నైష. ౭, ఆ. ౧౭౦. ఆం. భా. ద్వి. ౧౪౯.

తావరము. వై. వి. (సం. స్థావరమ్) స్థిరమయినది. "చ... రేవగల్లు దా,వరముగ నుండె నయ్యుటజ వాటికఁ దోఁటకుఁ బ్రోదిసేయుచున్." వి. ప్ర. ౨, ఆ. 33.

తావలము. దే. వి. స్థానము, నివాసము. "చ. కలఁ దఁగ సద్గుణంబులకుఁ దావలమై పెనుపొందు సుజ్వలా,త్ములు సనిరి..." భార. కర్ణ. ౧, ఆ ౪౯. పి. శకుం. ౨, ఆ. ౧౩౭; 2. ఆధారము, ప్రాపు. "క. క్రమమున శిష్టాచార,క్రమ మెఱుఁ గఁగ ధర్మమునకుఁ గడు వాటంబై,విమలం బగుఁ జిత్తము సత్యమును నహింసయును దనకుఁ దావలములు గాన్." భార. అర. ౫, ఆ. ౪౭. నైష. ౧, ఆ. ౧౦౭; 3. అవకాశము, తెఱపి. "ఉ. నా విని యింక నేమియుం బిసఁ రణశోభిద నీ కొంకింతయుం,దావల మెద్ది యాకటుదైత్యుఁడు చేర్చిన కేఁగుదెంచు నే,మో..." కళా. ౬. ఆ. ౧౧; 4. దృష్టాంతము, ఉదాహరణము. "క. ఆవికృతి నొంది మది న్యా,సాదిథముల వలచి వచ్చినను ముక్కుసెవుల్,వోవు నని పలుకు గాథకుఁ,దావలమై నిలిచితిం గదా శేఁ డను చున్." రామా. ౫, ఆ. ౧౩౯ ; 5. స్థలము, ప్రదేశము. "సీ. తా వున తా వుఁ దావకం బనఁగను దావలం బనఁగను దలముపేరు." ఆం. భా. ద్వి. ౧౩. విఠ. విడుపనిది, స్థిరము. "చ. బలరిపుమిత్రుఁ డైన యలపార్థివతల్లజపాదపల్ల వో,జ్జ్వలనఖరేఖ దండనగమండ విఖండనచండి మంబు దా,వలముగ నభ్యసించె నొకొ వజ్రము." వసు. ౧, ఆ. ౧౨౧.

తావళము. = తావడము. "మ...విం,తలుగా వారికిఁ జైత్రుఁ డిచ్చుబురుసాదట్టీలు ముత్యాలతా,వళముల్ వోలెఁ దనుం బిగుల్తఁ గలికావారమ్ము లీరమ్ములన్." చంద్రా. ౪, ఆ. ౭౭.

తావి. దే. వి. 1. సువాసన, పరిమళము. "శా. తావుల్ శ్రీవలఁ జల్లుచెంగలువకేదారంబుతీరంబు నన్." స్వా. ౨, ఆ. ౨౨. ఆం. భా. ప్ర. ౧౦౬; 2. (దుర్గంధము) పండ్లపాచి. "మ. తలలోఁ బేలును గండ్లలోనఁ బుసి దంతశ్రేణిలోఁ దావి పీ,నుసలలోఁ జీవిలి..." శుక. 3, ఆ ౪౪.

తావిగొను. దే. స. క్రి. వాసనచూచు. "గీ. కలవ భూమిలో నాలుక గలయఁ బఱపి, తావిగొని త్రిప్పి చాముండిదేవి...రాక్షసుల నెల్ల మ్రింగె." శ. సం. ౧౯, ఆ. ౧౧౨.

తావిగట్టు ద్వ. వి. (తావి+గట్టు) మలయపర్వతము. "చ...నిచ్చలమునఁ దావిగట్టుకడ సంద్రము లోపలిదీవి యేలుచున్." య. ౨, ఆ. ౬౧. ఇట్లే. తావిగుబ్బలి. య. ౨, ఆ. ౧౨. తావిమల. అచ్చ. సుం. ౧౬౧. తావులకొండ. వేం. పంచ. ౪, ఆ. ౨౧౧.

తావిచెంగలువ. దే. వి. పరిమళము గలయెఱ్ఱకలువ, కహ్లారము. "సీ. హృదయంగమస్ఫూర్తి నొప్పుడు నా మోదంబు గలిగించుతావిచెంగలువ చెలువ." దశా. 3, ఆ. 3౫.

తావితాల్పరి. దే. వి. గంధవహుఁడు, వాయువు. "సీ. తావితాల్పరి పగదాయ కూటపుఁదిండి జక్కులకట్టెఱపక్కి జక్కివాఁడ." ప్రబంధ. ౨౧౭. ఇట్లే: తావిమోపరి. (శ. ర.)

తావినూనె. దే. వి. (తావి+నూనె) తావి గలనూనె, అత్తరు. (శ. ర.)

తావివిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు. (శ. ర.)

తావివోవు. దే. అ. క్రి. (తావి+పోవు) పరిమళ హీన మగు. "చ. అనఘుఁ డతండు నిత్యము సహస్రముఖకృత్యము లాచరించి పాపముపలెఁ జిద్దు లేక కయిద్రాలక తావివోక పుచ్చునియమొప్పగ

గాక కడసారిని మేలిమి నేర్పరించి గ్రక్కునఁ బరువంపుఁ గ్రొవ్విరులఁ గోయుచు వంకపుటీ తలంబునన్." విప్ర. ౨, ఆ. ౨౯.

**తాపిసము.** సం. వి. అ. పుం. 1. సముద్రము; 2. స్వర్గము. వ. తేజస్సు.

**తావు.** దే. వి. (క. తా వు) 1. స్థానము, తావలము. "ఉ... పీతాంబరపాదపంకజము లంటినతావులు ద్రొక్కి నోడి పార్శ్వంబుల సంచరింతురు పరస్పరకేళి వచఃప్రసంగలిన్." పారి. ౪, ఆ. ౧౫. అం. భా. ద్వి. ౧౩ ; 2. కళాస్థానము "ఉ. ప్రాయపువంపుతుల్ పెగదుపాటున నొం డొరుఁ గౌగిలించి యాస్యాహా యిది తెల్లవాతెఁ గద యంచుఁ బుసారలివాంఛ నర్మవాచా యుంటిఁదావు లంటినవెసం దమిరేఁచి రమింపఁ గొక్కురో,కో యని తామ్రచూడములం గూయఁ దొడంగె నదంగెఁ జీకటుల్." కవిరా. ౫, ఆ. ౨౧౬.

**తావుకొను.** దే. అ. క్రి. (తావు+కొను) 1. నెల కొను, వసించు. "క. నా లిని తమ్ముల నేలెను. దేవునిగారావుఁబట్టి లేటమొగమునన్,తీవి నును సగవుసిగ్గులు,తావుకొని మెలంగ నింద్ర తనయుని కనియెన్." కాళిండి. ౫, ఆ. ౪౪. ఉ. రా. ౮, ఆ. ౩౬; 2. ఉండు, నిలిచియుండు. "ఉ. ఇద్దెసం,దాను సహించి యేమిగతిఁ దావుకొను స్నాయుఁ బ్రాణ మర్జునా." భార. మా. ౧, ఆ. ౧౭౨. చం. రా. ౪, ఆ. ౩౮.

**తాస్సీలు.** దే. వి. (హిం. తహాసీలు) ఆజ్ఞ. "సీ. తలఁపు తాస్సీళ్లలో మెలఁగఁ జేసితిఁగదా శక సింధుపూర్జరాశ్మంతపతుల." రంగా. ౨, ఆ. ౩౯.

**తాస్సీల్దారు.** దే. వి. (తాస్సీలు+దారు) ఆజ్ఞయిచ్చు అధికారి. (వా.)

**తాహతు.** హిం. వి. శక్తి, సామర్థ్యము.

**తాళకము.** సం. వి. అ. న. 1. పర్వతమందలిధాతు విశేషము. 2. చిన్నబీగము. 3. తాడిచెట్టు.

**తాళకి.** సం. వి. ఈ. స్త్రీ. తాటికల్లు.

**తాళగించు.** వై. అ. క్రి. తాళము వేయు. "గీ. ఓర్తు కరతాళ మొనరింప నోర్తు సమద,గీతిఁ బచరింప బతిఁ దాళగింప నోర్తు.మధురమదిరారసోల్లాసమ త్తయగుచు, జాడె నొక్కతె లలితాంగివారిగతుల." వసుచ. ౨, ఆ. ౮౨. కవ్మ. ౧, ఆ. ౫; 2. ధ్వని చేయు, మొఱయు. "చ. పరు లశకంబులై జగయుఁ గ్రమ్మడి పిడఁగ గుల్పదోయిలై, నర ములు చౌకళింపఁ గటిపంగతి మేఖల తాళ గింప . మురునినినోదముల్ సలిపె మానిని..." భాగ. ౬. స్కం. ౧౦౧.

**తాళగిరి.** వై. వి. తాళము వేయువాఁడు. "సీ. తాళ ధారి చెలంగు దాళగిరి యనంగ..." అం. భా. ద్వి. ౨౮౭.

**తాళధ్వజుఁడు.** సం. వి. అ. పుం. 1. బలరాముఁడు. 2. భీష్ముఁడు.

**తాళపత్త్రము.** సం. వి. అ. న. 1. తాటియాకు. 2. [చెవికమ్మ.

**తాళపర్ణి.** సం. వి ఈ. స్త్రీ. 1. మురయనుగంధ ద్రవ్యముశీ 2. మధురిక, అడవిసదాపశీ.

**తాళమానము.** సం. వి. అ. పుం. తాళనియమము. "సీ. ప్రౌఢిఁ బలికించుగీతప్రబంధములకుఁ, గత్ర కరపంకరుహ రత్నకటకఝుణఝు, ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప." స్వా. ౨, ఆ. ౨౭, కళాం. ౪, ఆ. ౬౫.

**తాళము** ఉభ. వై. వి. (సం. తాళః) 1. మల్లబంధ విశేషము. "క. పెలుకుఁజే దాళం బిమడిఁపెలఁచి యనువు గాక ధరణితలము గరపుటంబుల నప్పళించె .." భార. విరా. ౨, ఆ. ౧౯; 2. బీగము. "సీ. బీగము తాళ మనఁగ న,యోమయూర్గళవిశే షోక్తి యొప్పు." అం. భా. ద్వి. ౭౨. సం. వి. అ. పుం. 1. తాటిచెట్టు; 2. చప్పట; 3. అఱచేయి,4. ఏనుఁగుచెవుల అప్పళింత; 5. పాడునపుడు లయానుసారముగ చేతులతోఁ బఱచెడిచఱపు; 6. జేన; 7. తగరము; 8. ఖాణముపిడి. వ. అరి దళము. పుం. న. 1. కంచుతోఁ జేసిన తాళపుఁ జిప్ప; 2. బిగము. (శ. ర.)

**తాళమూలిక.** సం. వి. ఈ. స్త్రీ. నేలతాడి శీ.

**తాళవట్టియ.** ద్వ. వి. (తాళము+వట్టియ) వీణ ప్రక్కను దాళము వేయుటకై యమర్చుతీఁగ. "ద్వి. తనరుచు మొగచాళమును నవతానామును మఱి నవతానమును దీపుమెఱయఁ, దాళవట్టి యయము... తలిర్ప." బస. ౩, ఆ. ౯౭౨. పం.

**తాళవృంతము.** సం. వి. అ. వ. విసనకఱ్ఱ, వీవన.

**తాళి.** ఉభ. దే. వి. 1. మంగళసూత్రము. "అ. తాళిఁ గట్టె నపుడె తలిరాకుఁబోఁడికిఁ, బుడమితేఁడు వేడ్క గదలుకొనఁగ." యు. ౪, ఆ. ౧౦౬.

నిరం. ౨, ఆ. ౧౨౯; 2. పారిభాషికము. "మ... ఖ్యాతితో,మను మంచుచు హనుమంతుఁ బల్కి- రఘురామస్వామి సుగ్రీవుఁ డా,యనిపై దూర్యపుఁ దాళిఁ బైకొని కదియ గ్రీవ నుంచెం గృతిన్." ఉ. రా. ౫, ఆ. ౩౦౫. అచ్చ. సుం. ౩౪; 3. పతకము. "వ. హృదయమునను దగుమదనునకుఁ బోదము బీభత్సరసంబు రుచిరవక్షస్స్థలంబునం దోఁచినవిధంబున నీలంపు తాళికయు సంఘటించ..." చంద్రా. ౫, ఆ. ౧౨౪, ఆం. భా. ద్వి. ౧౪౯. సం. వి. న్. పుం. శివుఁడు. ఇ. ఈ. స్త్రీ. 1. నేలయుసిరిక ♣. 2. క్రొత్తాళము, పెద్ద యాకులతాడి ♣. ఈ. స్త్రీ. 1. నేలతాడి ♣; 2. కంది ♣; 3. తాళపుఁజెవి.

తాళించు. దే. స. క్రి. జూదమాడునపుడు క్రింద వేయుటకై పాచికలను చేత నుంచుకొని యుంటు నటు త్రిప్పు. "వ..తాళించుపాచికలపోలిక..." ఉ. హరి. ౩ ఆ. ౭౪, ఉ. హరి. ౩, ఆ. ౧౨౦.

తాళిక. దే. వి. (తాళు ధా.) ఓర్పు, క్షాంతి. "సీ. తాళిక యను క్షాంతి దనరారు..." ఆం. భా. ప్ర. ౧౩౯. విశే. 1. ఓర్వశక్యమైనది. "ఆ. ధనము లే మెవరికిఁ దాళికై యుండదు..." వేమన. ౩, ప్ర. ౧౧౭; 2. చాలినది, సమర్థమైనది. (శ. ర.)

తాళిగోణము. దే. వి. (తాళి+గోణము) పైని పతకము కట్టినగోఁచి, లంగోటి. "సీ. బహుసంకుమద పంకపాణింధమం బైనతాళిగోణపుఁజాంగు నేల జీర." పాండు. ౩, ఆ. ౧౦.

తాళిగోణాము = తాళిగోణము. "సీ. కటిఁ దాళి గోణాము కడచుంగు దరఁ జీర కట్టుదట్టీ క్రిందు గట్టి..." ఉద్భ. ౨, ఆ. ౧౨౧.

తాళిదము = తాలిదము. "ద్వి. ముక్పిరి సంభారముల మించి నేతఁ,జిప్పల నగ్గలించిన తాళిదముల." ఆ. మ. క. ౫, ఆ. ౨౪౯. పు.

తాళిబొట్టు. దే. వి. (తాళి+బొట్టు) మంగళసూత్రమునఁ గట్టుస్వర్ణాభరణవిశేషము, పుస్తె. "గీ.... తాళి,బొట్టు మూసికతోఁ గూర్చి పొసఁగ నటుతఁ, బ్రాడుగట్టక వోగసెల్లఁ దలిమి యొదల, వ్రేలువలరాచబలుబూచి పేరఁ గలదె." పీఠా. ౧, ఆ. ౧౦౩. విక్ర. ౧, ఆ. ౪, ఇట్టే తాళిపతకము. ప్రబంధ. ౨౬౩.

తాళిపత్త్రిరి. వై. వి. (సం. తాలీశపత్త్రమ్) ఒకానొకమందుదినుసు. (శ. ర.)

తాళీకుఁడు. దే. విశే. కార్యసాధకుఁడు, పూనినపనిని నెఱవేర్చువాఁడు. "గీ. పరఁగుఁ దాళీకుఁ డనఁగఁ దీర్పరి యనంగఁ, గార్యకర్తకుఁ బేరు..." ఆం. భా. కృ. ౪.

తాళు. దే. అ. క్రి. (క. తాళు. త. తాళు.) ఆఁగు, నిదానించు. "సీ. తడవాయె ననుచుఁ జిత్తమున నుంకుఁగ నేల యిదె వత్తుఁ దాళుమీ యింతతడవు." దశా. ౨, ఆ. ౩౬౫. స. క్రి. అ. క్రి. సహించు, ఓర్చు. "ఉ...ధైర్యసంపదం,దాళఁ బరోజ గర్భుఁడు రణంబున .." ఉ. రా. ౨, ఆ. ౭౧. ఇందు. ౨, ఆ. ౧౧౯.

తాళుకొను. దే. అ. క్రి. (తాళు+కొను-స్వార్థమున) 1. ఆఁగు, "వ. ఇందువదనా భవదీయమనోరథంబు సఫలం బయ్యెడు మెల్లి యాప్రొద్దుదనుకం దాళుకొమ్ము..." విక్ర. ౩, ఆ. ౪౪, 2. సహించు, ఓరిమిచూపు. "సీ. తనభార్య బలిమిఁ బట్టినఁ జూచుకొని తాళుకొన నేను నుతశ్యమునిని గాను" దశా. ౨, అ. ౪౧, అహ. ౧, ఆ. ౭౪.

తాళువారము. దే. వి. వసారా,పంచాది. "సీ ..పాలు వోసి చాల,నూర్చవచ్చు ననంగ నొనరుచావడి తాళువారంబు చిన్నిగవాక్షు లమరు." శుక. ౩, ఆ. ౪౯౧.

తాళ్లపాములు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. "గీ. తాటియాకులచిలుకలు తాళ్లపాము, లకట యగచాట్లపోకనై యాడుకొనుచు .." హంస. ౩, ఆ. ౧౪౭

తాళ్వారము = తాళువారము. (బ్రౌ.)

తి

తింట. దే. వి. (తిను ధా.) తినుట, భక్షించుట. "తరల. కులగురుండు వసిష్ఠుఁ డంత విశుద్ధి కుందెలు దింట లో,కుల కెఱింగి..." భాగ. ౯, స్కం. ౧౫౯.

తిండాడు. దే. అ. క్రి. (తిండి+ఆడు) బలహీనమగు, కృశించు. "క. తిండాడు వైరివీరులఁ,జెండాడుట యేమి దొడ్డు చెండాడుగలిన్, గొండపలుఁ గొండ గూలఁగఁ, గొండికపాయమున నీటుకోల నీటున్." సుద. ౨, ఆ. ౧౨౬.

**తిండి.** దే. వి. (తిను ధా) 1. భోజనము,తినుట. (చూ. తిండిపోతు); 3. ఆహారము. "సీ. ఉప వాసములఁ దద్దయును గృశింపక మేను తిండిచేఁ బోషించు చుండెనేని..." జై. 3, ఆ. ౩౪. ఉ. హరి. ౪, ఆ. ౪౬.

**తిండికత్తియ.** ద్వ. విణ. (తిండి+కత్తియ) మిక్కిలి తినునది, అమితభక్షకురాలు. (శ. ర.)

**తిండికత్తె** = తిండికత్తియ. (శ. ర.)

**తిండికాఁడు.** దే. విణ. (తిండి+కాఁడు) 1. మిక్కిలి తినువాఁడు, అమితభక్షకుఁడు. (శ. ర.), 2. దురాశాపరుఁడు,లోభి. "క. విను కొడుకుగొన్న వేడుక,కొని కొట్టినతిండికాఁడు కుటిలుం డకఁడా, జనపతిచంపము ధర్మజాననుపమశీలుండు నెఱఁగు దది యట్లుండెన్." భార. ఉద్యో. ౧ ఆ. ౫౬. భార. స్త్రీ. ౧, ఆ. ౧౯

**తిండిపోతు.** దే. విణ. (తిండి+పోతు) మిక్కిలి తిను వాఁడు. "గీ. వాదులాడితోడ వాట్లకత్తెతోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటుకటితోడ నడియరితోడను,వెలకు నెత్తమాడ వెరపు గాదు." ఉ. హరి. 3, ఆ. ౧౧౭. భార. ద్రో. ౪, ఆ. ౭౩౯.

**తిండీఁడు.** దే. విణ. (తిండి+ఈఁడు) తిండిపోతు, అమితభక్షకుఁడు. "గీ. తిండికాఁ డనఁ దిండీఁడు తిండిపోతనంగ భక్షకునకును పెనర్చుఁ జేర్లు." ఆం. శ ౬౮.

**తింతిడీకము.** సం. వి. అ. పుం. న. చింతచెట్టు న. 1. చింతకాయ; 2. చింతపండు.

**తింత్రిణి.** సం. వి. ఈ. స్త్రీ. చింతచెట్టు.

**తింత్రిణీకము.** సం. = తింతిడీకము.

**తిందుకము.** సం. వి. అ. పుం. తుమ్మికిశీ.

**తికతిక.** దే. విణ. కలఁగినది, క్షుబ్ధము. "క. తోక తోకల నుడికి మిడుకుచుఁ, దికతికలై యొండొకట్ల దిగుకత్తుల బల్,చకచకలు నెసక మెసఁగన్, గకవికలుగ హరిబలంబు కళవళ మందెన్." ప్రబంధ. ౭౯౬.

**తికమక.** దే. వి. 1. తొట్రుపాటు. (చూ. తికమక గొను); 2. అవయవములయస్వాధీనత. (చూ. తికమకగుడుచు.); 3. బాధ. "చ. ఒకపరిపోవఁ దోఁకకుద నూఁద విదిర్చిన నింతవచ్చెఁ గ్రాయఁక నొకమాటు పోయి పిల కొక్కుడఁ దోఁకను చుట్టి కొట్టునో, తికమకకోర్వఁ జాల.." సమీర. ౬, ఆ. ౧౭౯. విణ. కలఁగినది క్షుబ్ధము. "చ. తిక మక గాఁగఁ జేసి నలుదిక్కుల శార్ఙ్గటిపేయు సారమే,యకములఁ ద్రెల్లి కొట్టి నుఱుమాడుచు నొక్కవరాహ మేఁగె.." శా. ౧, ఆ. ౯౪.

**తికమకగుడుచు.** దే. అ. క్రి. (తికమక+కుడుచు) విపత్తుఁడగు. "ఆ. ధరణిఁ ద్రెళ్లి, తిరిగి లేక లేక తికమకగుడువంగ.." భాగ. ౬, స్కం. ౩౦౮. (శ. ర. పా.)

**తికమకగొను.** దే. అ. క్రి. (తికమక+కొను) తొట్రుపడు. 'క. ఒకమొగముగాక దిక్కులు, తికమక గొని వైరులెల్ల దీకొనఁ దమ్ముం,బికవికలై నక నకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్." భాగ. ౬, స్కం. ౨౭౫. ఇట్లే: తిక మకలుగొను. పి. శకుం. 3, ఆ. ౨౦౧

**[illegible]** = తికమక. (విణ. కలఁతనొందినది, (క్షుబ్ధము) 'చ. క్రకచునిభార్య కూర్మి చెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం, డకట యొకేని బోయి కడవయ్యె విలంబనహేతు వెద్దియో, తిక మక పైతి నానెగులు దీర్పుము నీ కపు డేఁగి చూచి..." వేం. పంచ. ౪, ఆ. ౩౧.

**తికమకలాడు.** దే అ. క్రి. (తికమకలు+ఆడు) 1. కలఁతనొందు, 2. తొట్రుపడు; 3. అవయవములు) అస్వాధీనతనొందు. (శ. ర.)

**తికమకలుసేయు.** దే. స. క్రి. (తికమకలు+చేయు) కలఁతనొందించు, బాధించు. "క. మొకమెుక గలుగ గద వేమకరాంకునియనుఁగుమేనమామకు నీవుఁ, దికమకలుసేయవలదను, మకటా పేడ పుయి సేఁగునపు డైనఁ జెలీ." విజ. ౨, ఆ. ౧౯౯.

**తికము.** వై. వి. (సం. త్రికమ్) రెండుపిఱుఁదులును వెన్నెముకయుఁ గలియుచోటు, మడ్డిపూస. "గీ... త్రికాభిధాన,మలరుఁ దిక మన ముచ్చు వా నళికనయన." ఆం. భా. ద్వి. ౧౩౯.

**తిక్క.** దే. వి. ఉన్మాదము, వెఱ్ఱి. (చూ. తిక్కగొను.) విణ. ఉన్మాది, వెఱ్ఱియెత్తినది; తిక్కయెత్తిన వాఁడు. "క. అక్కడిఁదిబోదుమంచరఁ, జక్క నిలిచి తేఱిచూడఁ జాలక దిబిజాల్, దిక్కుమొకం బులవలె నలుదిక్కులకుం బఱచి రేమి తెలిపెద నధిపా." ఉ. రా. ౪, ఆ. ౩౦౮. "సీ. వెఱ్ఱి వెంబరవిత్తు వెంగలి పీతీఁడి వెడఁగు వేదురు

తిక్క వెకలి యనఁగ, నస్త్రాదిసంజ్ఞరై రొుప్పు చుండును ..” ఆం. భా. తృ. ౭.

తిక్కగొను. దే. అ. క్రి. (తిక్క+కొను) వెఱ్ఱియెత్తు (శ. ర.)

తిక్కట మక్కట. దే. వి. కలఁత, క్షోభము. శ. ర.

తిక్కటి. వై. వి. (సం. త్రికాష్ఠీ) అయుంధవిశేషము. “సీ. నలువుర కేవురఁ దలలంటఁగొన నేయఁ దిక్కట్లతోడన తిరుగువారు.” రామా. ౧, అ. ౧౬, ఆం. భా. ద్వి. ౨౧౧. [బ్రౌ.

తిక్కడి. దే. వి. నూలువడికెడి చిప్పకదురు. (శ. ర.

తిక్కపట్టు. దే. అ. క్రి. (తిక్క+పట్టు.) వెఱ్ఱియెత్తు. “గీ... వ్రజులార మీ కేల తిక్కపట్టె, పిరిబిగిసికి మఱి గారవించి హరుఁడు, కాయసిద్ధి ... యొసంగునే కల్లగాక.” శుక. 3, అ. ౬౪.

తి క్త. సం. వి. ఆ. స్త్రీ. 1. కటుకరోహిణి ౘె, 2. చిఱుబొద్దిౘె.

తి క్తకము. సం. వి. అ పుం. 1. చేఁదు; 2. చేఁతిపొట్లౘె; 3. నేలవేముౘె; 4. గారౘె; 5. నల్లచంద్రౘె. విశే. (అ. క్తకా. అ.) చేఁదైనది.

తి క్తఫల. సం. వి. ఆ. స్త్రీ. వార్తాకి, ములగౘె.

తి క్తఫలము. సం. వి. అ. పుం. ఇందుగుౘె.

తి క్తము. సం. వి. అ. పుం. 1. చేఁదు; 2. కారము; 3. కొండమల్లెౘె; 4. చేఁతిపొట్లౘె; 5. గుగ్గిలముౘె, 6. ఉలిమిరిౘె; 7.సుగంధము. విశే. (అ. ఆ. అ.), 1. చేఁదైనది; 2. మంచివాసన గలది; 3. కారము గలది. [చంద్రౘె.

తి క్తశాకము. సం. వి. అ. పుం. 1. ఉలిమిరిౘె; 2.

తిగ. వై. స. (సం. త్రికమ్. క. తిగ.) మూఁడు, “సీ. తిగశేక లేర్పడ దిగ్గినవొసలి నుశ్వేలిబూది బొట్టు రంగులు నెలంగ.” సీలా. ౧, అ. ౬౦, ఆం. భా. ద్వి. ౩౦౬.

తిగకంటి. ద్వ. వి. (తిగ+కన్ను+ఇ.) త్ర్యంబకుఁడు, శివుఁడు “సీ. బగలింటికడ నాడు తిగకంటి యొకిమీని గడితంపునిరువాలుజడ లనంగ.” అచ్చ. అయో. ౧౩.

తిగప్రోలుదాయ. వై. వి. త్రిపురహరుఁడు. “సీ మేలిమిగట్టుబిల్ మేటి పుర్కలదారి తిగప్రోలుదాయ బిన్నిగ తుపాసి... గీ...ముక్కంటి యనఁగ, శంకరునినామధేయముల్ వేంకటేశ.” వేంక. దేవ. ౫.

తిగవంగడము. వై. వి. (తిగ+వంగడము.) వైశ్యకులము. (చూ. తిగవంగడపుఁబుట్టువు.)

తిగవంగడపుఁబుట్టువు. ద్వ. వి. (తిగవంగడము+పుట్టువు) మూఁడవకులమువాఁడు, వైశ్యుఁడు. “సీ. తొడకొడుకు తిగవండపుఁబుట్టువు బచ్చు శేరి గోమటి యన నూరుజన్ముఁడు ..” వేంక. మాన. ౨౭.

తిగవచే. ద్వ. స. (తిగ+వచే) నాలుగు, చతుష్కము. “సీ ..తిగవచ చౌకమ్ము తీవచ యడ్డ, యనఁగఁ జతుష్కాఖ్య గురుగు ..” ఆం భా. ద్వి. ౩౦౬.

తిగిచికొను. దే. స. క్రి. (తిగుచు+కొను) ఊడఁబెఱుకుట, హరించుట. (చూ. తిగిచికోలు.)

తిగిచికోలు. దే. వి. (తిగిచికొను ధా.) “ఉ. ..ము, వ్వంటులనాఁడు భూతన యువారణ నెత్తికొనంగఁ జన్నుఁబాల్గొంటయుఁ బ్రాణముల్ దిగిచికోలుచు నొక్కటి గాఁగ నీతఁ డాఁగొంటునిశాచరిక్ వసుధఁ గూల్చుట వింటిమి కాద యేర్పడన్.” హరి. ఉ. ౪, అ. ౨౩౩.

తిగియు = తివియు. దే. స. క్రి. ఆకర్షించు. (శ.ర.)

తిగుచు. దే. అ. క్రి. తగ్గు, తీసిపోవు. “క. వసురాజర్ష్యోడ బలవ, ద్వినృమరపాదప్రసార దీర్ఘాచలుఁడై, యొసఁగఁగ వసుధాపరికీర్ణ సరిన్నిర్ఝరము తక్షణంబునఁ దిగిచెన్.” వసు. ౨, అ. ౬౪. స. క్రి. 1. ఆకర్షించు, లాగు. “క. స్రోతోవేగము పటుగతి, పీత్రబలుం దిగుచునట్లు విషయము లీడ్చున్, చేతోబలసంభృత యోగాగాలితయుఁడు గానివాని నంచితచరితా.” భార. శాం. ౫, అ. ౫౮౧. మార్క. 3, అ. ౩౨౧; 2. చేరఁదీయు. “చ. తిగిచి కవుంగిలించి జగ విభుఁ డక్కమలాయతాక్షి నెమ్మొగము మొగంబునం గదియనోపు...” భార. విరా. ౧, అ. ౨౪౭; 3. లాగివేయు, తీసివేయు. “గీ. కట్టుగవుసెన దీసినభావభవుని, కూఁడివిలుకమ్మిరొూ నాఁగ మునుఁగు డిగిచి, పఱుపుమీఁదను గూర్చుండఁ బడి కళావ, తీశిరోమణి యూరాజాదిక్కు సూచి.” విక్ర. ౮, అ. ౧౦౧. సా. 3, అ, ౧౩౯; 4 పోఁగొట్టు. “క. చెలువకు సంపెఁగనూనెం,దలయంటె సుగంధవాసితము లగుచూర్ణం.బుల నలుఁగువెట్టె గంధా, మలకం బిడి చమురు దిగిచె మజ్జన మార్చెన్.”

ప్రభా. ౪, ఆ. ౧౨౯; 5. తెచ్చు. "వ. అట్టు చని పిలిపాోత్రుండు ధాత్రీధవుం గాంచినం గనుంగొని ప్రసంగంబు దిగిచి నీచేత జన్యంబున విమతసైన్యం బెట్లుబు ధన్యంబుచేయుబడెనే యని యడిగిన .." జై. ౪, ఆ. ౪౭. ప్రభా. 3, ఆ ౬; 6. తెకికిందీయు, ఉద్ధరించు. "వ .. దక్షిణహస్తమునం దదున్నమద్గళదురుఘన్మవారి కణకమ్రకరాబ్జము పట్టి నూతిగో, వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్." భార. ఆది. 3, ఆ. ౧౪౪. దశ. ౧౧, ఆ. ౭౬; 7. (నీరు) తోడు. "వ...కొంకి గల నిముపువెదురునం కేఁద పుచ్చి నీరు దిగిచి యబ్బాలునిదప్పి దీర్చి .." దశ. ౧౧, ఆ. ౭౭; 8. పెఱుకు. "వ...గంతులిముగబ్బిబెబ్బులుల నలఁగుడుల దొడ్డజనంబులు మంత్రించి శారక దిగిచిన నీరుమే ఫుడిసి గిరులు గ్రక్కదల వాపోవుచు." స్వా. ౪, ఆ. ౩౭.

తిగుట. దే. వి. ఆసక్తి, తమి. "క. తగులు విడిరైనఁ గను మెచ్చుగ నాడుదుఁ బులులమాఁటజాదంబులతో, మిగులఁగ నేర్పరి ననఁ దగి, తిగుటన్ పొగటాల నే నతిప్రౌఢుండన్." ద్వా. ౧౦, ఆ ౯౧.

తిగుళ. దే. వి. దేశవిశేషము. "సీ. తిగుళభూములు తెంకులుగఁ ధరించినదొడ్డచెవులపోతుల సెల్లఁ జెండివైచి. గీ. సార్వభౌముఁడిదు దైవసాధనంబు." జై. ౧, ఆ. ౪౫.

తిగ్మము. సం. వి. అ. న. 1. వేఁడిమి. 2. వజ్రము. విశే. (అ. ఆ. ఆ) తీక్ష్ణము, వేఁడిదైనది.

తిగ్మాంశుఁడు. సం. వి. అ. పుం. వేడివెలుఁగు, సూర్యుఁడు.

తిట్ట. దే. వి. (క. తిట్ట. త. తిట్టై) 1. రాశి, ప్రోవు. "సీ....ఒక్క, పెట్ట త్రోచిన దూదితిట్టలపైఁ బ్రాఁకునగ్గిచందంబున ప్రగ్గఁ జేయు." భార. ద్రో. ౧, ఆ. ౨౯౩; 2. గుట్ట, తిప్ప; "ఉ. తీరక పోయి పోయి పలుదెంపుల గండుల శ్రేళ్ల నీళ్లఁ బ్రాఁ, బూరుల దారులం గడిదిబ్బలఁ దిట్టల... నా, పోరుతలిం జరించి జతరానల మాఱక వచ్చి క్రమ్మఱన్." వేం. పంచ. ౧, ఆ. ౪౯౩; 3. పేశాసయూహము. "ఆ. అప్పు డేపడంగి యన్ని పేనలు భీష్ము, రథముపొంత కొదిగె రౌద్రరసవి, నోది దైనయర్జునుఁడు ధనుశ్చాలన, దీప్తమూర్తి యగుచుఁ దిట్ట కుతికె." భార. విరా. ౫, ఆ. ౧౫౪, భార. భీష్మ. 3, ఆ. ౨౧౯.

తిట్టాట. దే. వి. (తిట్టాడు ధా.) వాక్కలహము, దూషణము. "క. తిట్టాట లాడు ప్రాద్వివిఁ, యిట్టివివాదములచోట నెవ్వరినైన, నొట్టిన సాక్షిగఁ గొనఁ జను, నట్టిరయిదర్ సాక్షిగుణము లరియరు పెద్దల్." విజ్ఞా. వ్యవ. ౧౦౩.

తిట్టాడు. దే. అ. క్రి. (తిట్టు+ఆడు) వాక్కలహ మాడు, దూషించుకొను. "సీ. ఎవ్వారిఁ బొడగన్న నెకసక్కెమాడుచు నంగన ల్గలసి తిట్టాడ వినుచు." విప్ర. ౫, ఆ. ౭౬.

తిట్టు. దే. స. క్రి. 1. దూషించు, నిందించు. "మ... చుట్టంబులన్, శిలలన్ దిట్టరె లాఁతిరాజులకు మెచ్చే యివ్విధంబు .." భార. ఉద్యో. 3, ఆ. ౯౫, భార. విరా. ౨, ఆ. ౨౨౦; 2. శపించు. "ఉ. అవిధి నుండునంతట నొకప్పుడు నిన్నును జూచుచో మణి, గ్రీవుని పేరు కోఁచ మదికిన్ మణికంధర యేకదేశసా, మ్యావగుణంబుచే నీతని సాతనియన్నను మద్దిచెట్లుగా దైవతమాని తిట్టినవిధంబు మనంబునఁ బొంది నంతటన్." కళా. ౪, ఆ. ౧౯, భార. ఆది. ౧, ఆ. ౧౩౭.

వి. 1. నింద, దూషణము. "ఉ. తిట్టులఁ బోయి యక్కొలువు తేఁకువ వారలలోని కింతిఁ దా, నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందలపట్టి యీడ్వఁగా, నెట్టు సహించె మాను..." భార. ఉద్యో. ౧, ఆ. ౩౩౧. స్వా. ౬, ఆ. ౪౯; 2. శాపము. "గీ...అతఁడు, తత్పదద్వంద్వమునకు వందన మొనర్చి, తపసితిట్టునఁ బ్లవముయ్యెఁ దక్షణంబ." పాండు. ౫, ఆ. ౨౭౨, తపతీ. ౪, ఆ. ౪౪.

తిట్టులుపడు. ద్వ. అ. క్రి. (తిట్టులు+పడు) నిందింపఁబడు. "గీ...జగము, చేతఁ దిట్టులంపడునట్లు చేసి పోయి, తేల .." భార. ఉద్యో. ౧, ఆ. ౧౩౧.

తిట్టువడు. ద్వ. అ. క్రి. (తిట్టు+పడు.) 1. శాపము నొందు. "గీ. మును కళాపూర్ణుకథ నీవు విఘ్నము ధనదు, పట్టిచే నంత వట్టేల తిట్టువడితి." కళా. ౪, ఆ. ౧౬౭; 2. నిందింపఁబడు. గీ. తెచ్చునే విధి మన్నాథుఁ దిట్టుపడక, యొఱుఁగఁ బలుకు..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౪౦౫.

**తిట్టుపాటు.** వ్య. వి. (తిట్టుపడు ధా.) నింద, అపవాదము. "ఉ. ఈతఁడు మ్రాను నిట్టిధన మిచ్చినవాఁ డనువెల్లలంచి కా,మాతను నీతి గా దుచితమార్గము దప్పుటఁ దిట్టుపాటు నీ,చేతఁ బరాభవంబు నడిచెప్పుట కష్టము చెప్పుకుండ రా, దీతెఱఁగెల్లఁ జెప్పెద మహీశ్వర యెయ్యది యెట్లు వోయినన్." దశ. ౩, అ. ౯౮. ౧౦. రా. అయో ౧౨౭. పు.

**తిడిమి.** దే. వి (దీనియామ్రేడితరూపము. తిడిమితిడిమి, తిడిమితిడిమ్మి) 1. రథము నడుచునపుడు కలుగుధ్వని కనుకరణము. "క. పాదవ్రలకు నింగి చాలని,కడఁకంబశె ఖడమికిం దిగంబడి కెమ్ముల్, పిడుగుల్ ద్రవ్వఁగ విడలెక, దిడిమితిడిమ్ములు చెలంగఁ జేరులబారుల్." రామా. ౮, అ. ౩౩; 2. వాద్యధ్వని కనుకరణము. "వ. ఎద్దిలపైఁ దమ్మటమ్ములు తిడిమితిడి మని మ్రోయ వేయుచు." ప్రబంధ ౫౮.

**తిణింగి.** దే. వి. మల్లబంధవిశేషము. "సీ. కస్నాతచాంగణ కందణంబు తిణింగి గొంతుమాఱును జేల కుమ్మరింపు. గీ ..నాఁగఁ జె న్నలరుచుండు, ముప్పదియుం రెండువిన్నాణములకుఁ జేర్లి." అం భా. ద్వి. ౭౦౯, ప్రబంధ. ౫౮.

**తిణింగించు.** దే. అ. క్రి. తిణి గి యనుమల్లబంధము నుపయోగించి కట్టు. "ద్వి. దీకొని వారి వానిఁ దిణింగించి వైచి, పైకొని జఠరంబుఁ బట్టి లోఁగించి." అ. మ క. 3, అ. ౧౪౧. పు.

**తితఉవు.** సం. వి. ఉ. పుం. న. జల్లెడ, చాలని.

**తితిక్ష.** సం. వి. ఆ. స్త్రీ. క్షమ, శీతోష్ణాదిద్వంద్వసహనము.

**తితిక్షితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ)=తితిక్షువు.

**తితిక్షువు.** సం. విణ. (ఉ) తితిక్షావంతుఁడు, క్షమాగుణము కలవాఁడు.

**తితిభము.** సం. వి. అ పుం. ఆరుద్రపురుగు.

**తితీర్ష.** సం. వి. ఆ. స్త్రీ. తరించుకోరిక.

**తితీర్షువు.** సం. విణ. (ఉ) తరింపఁ గోరువాఁడు.

**తిత్తి.** వై. వి. (సం. దృతిః. క. త. తిత్తి) 1 కొలిమితిత్తి, కొలిమి యూఁదుటకై కమ్మరులు మున్నగువా రుపయోగించుతోలుపనిముట్టు (శ. ర.) "సీ. కొలిమితిత్తులఁ, బోలు కుచములం పీడించి మరగాల్లఁ దగడెడుకరము లంటి." చంద్ర. వి 3, అ. ౧౮౪; 2. చర్మము, తోలు. "వ .. వాఁడు లగుకత్తులం దిత్తు లొలిచి..." స్కా. ౪, అ. ౩౦, శైవ. ౭, అ. ౮౧; 3. తోలుసంచి, సంచి. "చ ..క్రంతలతిత్తి యైనకీ, చను ధరణీస్థలిం బడిపి చక్కనిముద్దగఁ జేసెఁ దుష్టుఁడై." భార. విరా. ౨, అ. 3౫3. "సీ. దిపెదారికొమ్ము కోల్తిత్తియు జోడమ్ము మెడమీఁదిమొగలాకు గొడుగు దనర." అము. ౩, అ. ౬; 4. శ్రుతికై యూఁదుచర్మకృతగానసాధనవిశేషము. "గీ. సుతి యనఁగఁ దిత్తి యనఁగను శ్రుతి దనర్చు." అం. భా. ప్ర. ౧౭౯; 5. సారాయి మొదలగుద్రవపదార్థములు తీసికొనిపోవుట కుపయోగించు చర్మపాత్రవిశేషము (శ. ర.; 6. ంశాకారముగా నుండు శరీరాంతరావయవము. ఉదా:—ఊపిరితిత్తి.

**తిత్తికాఁడు.** వై. విణ. (తిత్తి+కాఁడు) శ్రుతికై తిత్తి యూఁదువాఁడు. (శ. ర)

**తిత్తిరము.** సం. వి. అ. పుం. తీతువుపిట్ట.

**తిత్తిరి.** సం. వి. ఇ. పుం. 1. తీతువుపిట్ట; 2. ఒకానొక ఋషి.

**తిథము** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. కాలము; 3. వర్షాకాలము; 4. కామము.

**తిథి.** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. 1. పాడ్యమి లోనగునది. (పక్షము మొదటినుండి క్రమముగా నైదేసితిథులు నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ యనునామములు కలవి యగును. అనఁగా మొదటిది యాఱవది పదునొకండవది తిథులు నంద సంజ్ఞ కలవి ఇట్లే తక్కినవి యూహింపఁదగును.) 2. ప్రాతిసాంవత్సరిక శ్రాద్ధదినము.

**తినాసము.** వై. వి. (సం. తినిశః) సెమ్మి, తినిశవృక్షము. (శ. ర.)

**తినిపించు.** దే. స. క్రి. (తిను ధా. ప్రే.) తినఁజేయు. "మ...క్షణమాత్రలో సమదదేవారాతిరింఛోళిచే, దినిపించెన్ దృణరాజి..." దశా. ౨, అ. ౪౦౦.

**తినిశము.** సం. వి. అ. పుం. తినాసము, సెమ్మిచెట్టు.

**తిను.** దే. స. క్రి. (త. తిన్. క. తిన్.) 1. భుజించు, భక్షించు. "ఉ.. ఎల్లవారి బాధించి మనుష్యమాంసములు దించుచు క్రొవ్వితి..." భార. ఆది. ౩, అ. ౨౫౪, భార. స్త్రీ. ౨, అ. ౧౨౧; 2. అనుభవించు, "క. ఏలినవానిధనంబులు, కాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్, ప్రేలారిచి

తిం ద్రాకవి, తాలము గని పిదప భీతి నొందఁగుదు రోజన్." భార. విరా. ౪, ఆ. ౨౧౯; 3. అపహరించు. "ఉ...ఆయతికాని కీడు మధురాలయ ముఖ్యము లాఁతఁ దర్థకృష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం దొరల్చి రాజాయతనంబుఁ జేర్చు మతి యట్టి దపఖ్యము దాన నొంటిగాఁ,డే యధికారి గావలయుఁ దించుక తిన్నను వాఁడె రూపఱున్." ఆము. ౪, ఆ. ౨౧౮; 4. కఱచు "ఉ ..భీమశోరగం, బుప్పులవాయి దిన్న విమ ముగ్రత కొక్కఁడు దృష్టి దీఁకటుల్, గప్పఁగ నోరఁ బెన్నురువు గ్రమ్మ మృతుం డయి కూలె మేదినిన్." కేయూర. ౪, ఆ. ౭౫; 5. చంపు, నశింపఁజేయు. "గీ. ముద్దుకొడుకుల సార్వర ముందు తింటి, వింతపాపంబు సేయుంగ నేమి కలిగె." వి. పు. ౭, ఆ. ౮౦; 6. పీడించు. (వ్యవ.) వాఁడు ద ట్బ్రిమ్మని పీఁకుకొని తిను చున్నాఁడు.

తినుకు. దే. అ. క్రి. (విష్ఠించుట, ప్రసవించుట మున్నగువానియందు) ఊపిరి బిగఁబట్టి ముక్కు. "ద్వి. ముదు పెల్ల వేగిరఁ దినికి చాలిడ్డఁ,గనిన చందం బయ్యో జనపాలతిలక." బస. ౭, ఆ. ౩౧౧ పుం. వి. 1. ముక్కి ముక్కి విష్ఠించుట. (శ. ర.), 2. గుదవేదనము. "గీ...తిను, కనఁగ గుదవేద నంబుగాఁ దనరు నభవ." ఆం. భా. ప్ర. ౧౫౦.

తిన్నె = తిన్నియ. (వేదిక, అరుఁగు) "చ ..అ,మై లఁత గృహాంబుఁ బంచఁ దిన్నెమీఁదను రంగపతిం దలంచుచున్." విప్ర. ౪, ఆ. ౩౨.

తిన్న. దే. విశే. (దీనికిఁ గర్మధారయమందు నిగాగమము నిత్యము.) 1. మనోజ్ఞము. "సీ. కలకంఠ ములచేతఁ గఱచినవిద్య వీణల కిచ్చునట్టితిన్నని యొలుంగు." భార. విరా. ౨, ఆ. ౬౭, ఆం. భా. కృ. ౧౪; 2. యుక్తము. "సీ ..బుధరక్ష తిన్నగాఁ బూనువారు." పాండు. ౨, ఆ. ౧౨౧, భార. విరా. ౨, ఆ. ౨౮౭. (శ. ర. పా. 'బుధ రక్షణోన్నతి' ముద్రి. పా.); 3. స్వస్థము. "ద్వి. కన్నులం దెఱవ కుగ్రసమాధిఁ బూని,తిన్నగాఁ బది వేలది వ్యవర్షములు,తపము గావించె..."విష్ణు.పు. 3, ఆ. (శ. ర.), 4. సౌమ్యము, మంచిది. (చూ. తిన్నఁదనము.); 5. ఋజువు, వంకరలేనిది. (వ్యవ.) వాఁడునామము తిన్నగాదిద్ది కొన్నాఁడు.

తిన్నఁదనము. వై. వి. (తిన్న+తనము) 1. మనోజ్ఞత, చక్కఁదనము. "సీ. మానినిగరువంపుమాటపొం దూహించు దళితాబ్జముఖితిన్నఁదనము మెచ్చు." భార. విరా. ౨, ఆ. ౨౯౨. సమీర. 3, ఆ. ౩౫; 2. యుక్తత. (చూ. తిన్న); 3. స్వస్థత. "ఉ ..ధాత్రిం దనబాహుపీఠమునఁ దిన్నఁదనం బుగ నిల్పి భోగసం,క్రందనుఁడై ..." విరం. ౪, ఆ. ౮౦. "గీ. కుంటవిలువంటగొంటరి తంటలకును, దిన్నఁదనమటి విన్నసైఖన్న వగుదు." ఇందు. 3, ఆ. 3; 4. సౌమ్యత,మంచితనము. "క. నాపలుకు పట్టియాగ్రహ,గిపితుఁ డగు టుడిగి మదికిఁ దిన్నఁదనము నీ,వాపాదింపు .." భార. సౌ. ౧, ఆ. ౧౮౦. స్కా ౫, ఆ. ౨౨; 5. మెలఁకువ, జాగ్రత. "వ. గమనంబు తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చివాని నాక్రమించి..." భార. సౌ. ౧. ఆ. ౧౬. విప్ర. 3, ఆ. ౭౮; 6. ఋజుత్వము. (చూ. తిన్న.)

తిన్నన. దే. విశే. 1. "వ ..తిన్న నగునడలు సన్న నగుతొడలు మిన్న నగుకొనులు." ఉ. రా. ౫, ఆ. ౨౪౮. వసు. ౨, ఆ. ౫౬. వి. 1. మనోజ్ఞత; 2. యుక్తత; 3. స్వస్థత; 4. సౌమ్యత.

తిన్నియ. దే. వి. 1. దిబ్బ, తిప్ప. "సీ...సిద్ధంపుటి సుకతిన్నియలు గాఁగ." నీలా, ౧, ఆ. ౨౭; 2. వేదిక,అరుఁగు. "సీ. తిన్నియ లలిక ముత్తియపు ముగ్గులు పెట్టి .." అచ్చ. అయో. ౧౦.

తిన్నె. దే. వి. (క. దిన్నె. త. తిణ్ణై) 1. దిబ్బ, తిప్ప. "సీ. ఎరియించుమిన్నేటియిసుకతిన్నెలమీఁద... భీమ. ౨, ఆ. ౪౪; 2. కొండ. "గీ. జాతివైరంబు లేక మజ్జాతి గాఁగఁ,గన్నువిన్కలిదిన్నెతోఁ డున్న కతన." ప్రబంధ. ౩౪; 3. గవనివాకిట వాటముగా నేర్పఱచినమట్టిదిబ్బ, హస్తినఖము. "సీ...తిన్నె దిబ్బ యనంగ హస్తినఖ మొప్పు."ఆం. భా. ద్వి. ౨౧; 4. వేదిక,అరుఁగు. "ద్వి. పొలతాలతిన్నెల నీడలఁ దోఁచునీలాలకంబాలు..." ద్వి. పారిజా. పూ. ౧౭౩ పం. నీలా. 3, ఆ. ౩౯.

తిపిరి. దే. వి. మాఱుపాటు, వ్యత్యాసము. (శ. ర.) విశే. అల్పము. "సీ. అరుదైనతిపిరికిన్నెరకప్పుపడి గంబు వన్నెకోకలచందువాకిరంగి." ప్రబంధ. ౫౨౩. ప్రబంధ. ౭౯.

తిపిరిదండియ. ద్వ. వి. (తిపిరి+దండియ) చిన్నవీణె. "వ...తిపిరిదండియలుం గైకొని గాణదండి మెఱయ మంద్రమధ్యమతారస్వరంబులు సుధా రసంబులు గురియ గానంబులు సేయుం వారును." రఘు. రా. ౨, ఆ. ౧౦౫.

తిపిరిదండె = తిపిరిదండియ. "సీ మత్తాపదరక్షయుం మావుపెశ్నుఱక గుట్టినయోటితిపిరిదండెయును మెఱయ." ఆము. ౬. ఆ. ౬.

తిపురు. దే. వి. వ్యాపనము. (చూ. తిపురుకట్టు.)

తిపురుకట్టు. దే. అ. క్రి. వ్యాపించు. "ద్వి. తాటంక వజ్రాంశుధాళధళ్యములు, లేటచెక్కులమీఁదఁ దిపురుకట్టఁగను." విష్ణు. ఉ. ౪, ఆ. (శ. ర.)

తిపురుల్గొను. దే. అ. క్రి. (తిపురులు+కొను) వ్యాపించు. "చ...ద్యుతుల్, వొలిచె ననంగఁ గ్రొత్తమెఱుపుల్ తిపురుల్గొన నంతనంతటన్." ఇందు. 3, ఆ. ౧౦.

తిప్ప. వై. వి. (సం. ద్వీపః. క. తిప్పె. త. తిప్పై) 1. రాశి; దిబ్బ. "మ. బలుకప్రంపుటనంటికప్పురపుఁదిప్పల్..." వసు. ౧, ఆ. ౧౩౯. రసిక. ౨, ఆ. ౧౪; 2. గుట్ట,చిన్నకొండ. "గీ...పెన్రాల తిప్పలు వట్టి తిరుగు." ఆము. 3, ఆ. ౨౪; 3. పర్వతము,కొండ. "మ. పొదుపుందిప్ప కటాలునం దిగినయంభోజాక్షబింబంబునం,గడమై రత్నమరీచి వీచికలు దిగ్వాటిన్ మిటారింపఁగా." సుద. ౫, ఆ. ౨౯. అం భా. ద్వి. ౨, ఆ. ౨౯. వా. ౨, ఆ. ౪౬. బ. కష్టములు,బాధలు. వ్యవ. ఎన్ని తిప్పలు వచ్చినను వాడు న్యాయము తప్పఁడు.

తిప్పకాయ. ద్వ. విశే. (తిప్ప+కాయ) పెంకె వాఁడు; పెంకెది; అకతాయి. "ద్వి. మలయుం దుష్టైదలు దిమ్మరి దిప్పకాయ, లిలఁ జందమామ తొయ్యెడఁ బక్షపాతి." ద్వి. పరమ. 3, ఆ. ౨౪౭. ప్ర. "గీ. సంధ్యవార్చఁడు వేల్వఁడు చర్చ సేయఁ,డాగమంబులఁ దీర్థంబు లాడఁ డుచిత విధుల నుడవాడ మందఁడు తిప్పకాయ,చంద ములు తక్క భూసురనందనుండు." ఉద్భ. ౨, ఆ. ౧౭౯. ప్రభులిం. ౨, ఆ. ౫౬. ప్ర.

తిప్పతీఁగె. దే. వి. గుడూచి. "సీ.. తిప్పతీఁగె నాఁగను గుడూచి,పలుఁగును..." అం. భా. ద్వి. ౨, ఆ. ౫౪. హంస. ౪, ఆ. ౧౦.

తిప్పద్రిమ్మరి. ద్వ. విశే. (తిప్ప+ద్రిమ్మరి) నగచరుఁడు, కోఁతి. "గీ. అట్టి దలితారుఁ దటకతోఁ దిప్ప ద్రిమ్మరులఁ బటాపంచలుగఁ దోలి..." అచ్చ. యు. ౨౫౩. కిష్కిం. ౨౯.

తిప్పతెల్లు. ద్వ. వి. (తిప్ప+తెల్లు.) ఇత్తుకము; 4. (శ. ర)

తిప్పలుగొను. ద్వ. అ. క్రి. (తిప్పలు+కొను) ప్రోగు పడు. "సీ. ఎరువుతిప్పలుగొని యొల్లమందలు గొఱుకెక్కి మేపులచోటు ద్రొక్కఁబడిరొ." హరి. పూ. ౬, ఆ. ౫.

తిప్పలుపడు. వై, అ. క్రి. (తిప్పలు+పడు.) బాధ పడు. (వ్యవ.) వాఁడు చిన్నప్పటినుండియుఁ దిప్పలు పడుచున్నాఁడు.

తిప్పలుపెట్టు. దే. స. క్రి. (తిప్పలు+పెట్టు)పీడించు, బాధించు (వ్యవ.) అతనిఁ డామెను తిప్పలు పెట్టుచున్నాఁడు.

తిబ్బి. దే. వి. ముందఱికి కుట్టు పోనిచ్చుచు వెనుకకు మరలించి కుట్టెడికుట్టు. (శ. ర. దీనికి 'డిబ్బికుట్టు' అనివాడుక.)

తిమి. సం. వి. ఇ. పుం. 1. నూఱుయోజనములు పొడుగు కలచేఁప; చేఁప; 2. సముద్రము.

తిమింగిలము. సం. వి. అ. పుం. 1. తిమిని మ్రింగెడు చేఁప; 2 ఒకానొకద్వీపము.

తిమింగిలగిలము. సం. వి. అ. పుం. తిమింగిలమును మ్రింగుచేఁప.

తిమిజము. సం. వి. అ. న. ఒకరకము ముత్తెము.

తిమితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తడిసినది, ఆర్ద్రము; 2. కదలిక లేనిది,నిశ్చలము; 3. సుస్థిరమైనది.

తిమితిమి. దే. వి. ముసురుపట్టుట మొదలగువానియం దగునసుకరణము. "సీ. తొలితొలిసన్నంపుఁదుంపుర లొలుకఁగా మెఱుఁ దిమితిమి యని ముసురు వట్టె." ద్వా. 3. ఆ. ౯౩.

తిమిరము. సం. వి. అ. పుం. న. 1. చీఁకటి. "క. తిమిరంపువయసుగుబ్బలికొమరులవు..." శ్యా. ౪, ఆ. ౮౩; 2. నేత్రరోగవిశేషము, అంధత్వము. (తిమిరంపువయసు = మదముకలయౌవనము.)

తిమిరారి. సం. వి. ఇం. పుం. సూర్యుఁడు.

తిమిరి. యా. దే. వి. (క. తిమర్.) పూర్ణము తెలి యనిరోగవిశేషము. (చూ. తిమిరివాసు) వై. వి.

తియ్యమ్రాను. దే. వి. (తియ్య+మ్రాను) చెఱకు, ఇక్షువృక్షి. "సీ. ..ఇక్షుకాయమూల్దనరుఁ దియ్యమ్రాను కన్నులు గలమ్రాను చెఱకనంగ." వేంక. స్థా. ౮౨.

తియ్యవిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. "వ....తీఁగెయుయ్యెలల నాడుచుఁ దియ్యవిలుకాని బాడుచు .." కళా. ౬, ఆ. ౨౨౮, విక్రి. ౮, ఆ. ౬౮.

తియ్యవిల్కాఁడు = తియ్యవిలుకాఁడు. ఆం. సం. దేవ. ౧౮.

తిరపడు. వై. అ. క్రి. (తిరము+పడు) స్థిరపడు, కుదురుకొను. "ఉ. గరుడుని డగ్గి పీడ్కొలిపి కంపవిరోధిపురంబులోపలం, దిరపడి దారకుం బనిచెఁ దేరలవాటుగఁ దేర నెక్కి..." ఉ. హరి. 3, ఆ. ౯౧.

తిరము. వై. వి. (సం. స్థిరః. క. తిర. త. తిరమ్.) నెలవు, ఉనికిపట్టు. "చ. అలికిడి పుట్టనీక నిశితాసి నగల్చి మృగంబు నొంచుబెబ్బులిగతిఁ బొంచి పొంచి చని భూపతి యున్నతిరంబు డాయుచున్." రంగా. 3, ఆ. ౨౫౩. విశే. 1. స్థిరము, నిశ్చలము, శాశ్వతము. "ఉ. భాగ్యము కాక సేచరణపద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా, యోగ్యత గల్గెనేని నను నొక్కని నొల్లవా కామసౌఖ్యవైరాగ్యము సీమ నంబునఁ దిరంబొ నిజం బెఱుఁగంగఁ జెప్ప సౌ, భాగ్యము గుందునే మగలపై నొకయించుక చూడ్కి నిల్పనన్." భార. విరా. ౨, ఆ. ౨౫౨, ఆము. ౫, ఆ. ౨౮, 2. ధ్రువము, నిశ్చితము. "ఉ. ...ండజం, గమ ప్రమథ లెత్తతి నేమిప దార్థ మెంత యు, కందుప పేఁడినం దిరముగా నశేదండజ కాపదార్థ మా, కందుప నేపు ప్రాణ మెడగా నిడిరైన ఘటించి పెట్టు..." హర. ౨, ఆ. ౫, నృసిం. ౨, ఆ. ౧౨౯, 3. నాఁటినది, బోధపడినది. "క. హరికంశ ప్రమథకథాం, తర మునఁ గలవింత లెల్ల చెప్పక మదిలో, దిరమయ్యెఁ గదా వర్తవర యేకళలో బిచం బ్రియ మును డున్." ఉ. హరి. ౧, ఆ. 3.

తిరముకొను. ద్వ. అ. క్రి. (తిరము+కొను) స్థిరపడు (చూ. తిరముకొలుపు)

తిరముకొలుపు. ద్వ. స. క్రి. (తిరముకొను ధా. ప్రే.) స్థిరముగా నిలుపు. "గీ....రాహుమారు లాగురు నిరూఢిఁ, దిరముకొలిపెఁ దదచ్యుతతేజ మిలను." రాఘవ. ౨, ఆ. ౨౬.

తిరముకొల్పు = తిరముకొలుపు. 1. స్థిరముగా నిలుపు. "సీ...ఇనమండలంబుపై దృష్టి యత్యంతంబు దిరముకొల్పి." పరమ ౧, ఆ. ౧౧౨; 2. నాఁటు, స్థాపించు "లయగ్రాహి. నందనములోని హరిచందనముఖద్రుమములం దళముఖుండు నిజమందిరవనీవాటిం దిరముకొల్పు..." చం. రా. ౨, ఆ. ౨౮. [(చూ. తిరముపఱుచు)

తిరముపడు. వై. అ. క్రి. (తిరము+పడు) స్థిరపడు.

తిరముపఱుచు. వై. స. క్రి. (తిరముపడు. ధా. ప్రే.) స్థిరపఱుచు, "మహాస్రగ్ధర...ఇమ్మే, దినిదోర్దండదైక పీఠిన్ దిరముపఱిచి." స్వా. ౧, ఆ. ౨3.

తిరశ్చి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతిర్యగ్జంతువు; 2. అడ్డముగాఁ బోవుస్త్రీ.

తిరశ్చీనము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డముగాఁ బోవునది; 2. వక్రము.

తిరసకరించు. వై. స. క్రి. (సం. తిరస్కార.) విడుచు. "క. హరినీదుప్రతాపాతప, మరశే బ్రహ్మాండ కర్పరావృత మగుటన్, బరులు వడఁకుదురు గొడుగులు, తిరసకరింపుదురు కంటఁ దిమిరము గప్పన్." ప్రబంధ. ౨౫౫.

తిరస్కరము. సం. విశే. (అ. ఈ. అ.) 1. తిరస్కరించునది; 2. అతిశయించునది; 3. మఱుఁగు పఱుచునది.

తిరస్కరించు. సం. స. క్రి. అనాదరము చేయు, అవమానించు. "ఉ. నన్నుఁ దిరస్కరించితి మనంబున నించుక భీతి లేక..." హర. ౬, ఆ. ౨౨.

తిరస్కరిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెర, యవనిక; 2. ఒకమంత్రవిద్య. (ఇది కలవాఁ డితరులకంటికిఁ గనపడకుండును.)

తిరస్కారము. సం. వి. అ. పుం. 1. అనాదరము, అగౌరవము, 2. మఱుఁగుపాటు; 3. నింద, తెగడుట.

తిరస్కారి. సం. విశే. (న్. సీ. న్.) 1. అనాదరము చేయువాఁడు; 2. మఱుఁగుపఱుచువాఁడు; 3. నిందించువాఁడు.

తిరస్కారిణి. సం. = తిరస్కరిణి.

తిరస్కృతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అనాదరింపఁబడినది; 2. మఱుఁగుపఱుపఁబడినది; 3. నిం

దింపఁబడినది; 4. న్యూనపఱుపఁబడినది, తక్కువ చేయఁబడినది.

తిరస్కృతి. సం. వి. ఇ. స్త్రీ.=తిరస్కారము.

తిరస్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. = తిరస్కారము.

తిరస్తు. దే. వి. రాజ్యాంగభేదము. "సీ....రాజ్యాంగములు దనర్చు. గీ. సామి ప్రెగ్గడ చెలి బొక్కసము తిరస్తుతోట పౌఁ జనఁగాను..." ఆం. భా. ద్వి. ౧౮౯.

తిరి. దే. వి. (క. త. తిరి.) 1. జట. "ఉ. నీబిగిగుబ్బచన్నులకు నీ కెలికి పెన్నెఱు లున్న శిఖికిన్, నీటుపుం బిఱుందులకు నీగొలప్రాయపుఁగన్నె కింతిరో. యా బసుమంబు కప్పురమె యీతిరి వేణికిమె పట్టుచీరలే, యా బిరుసైన పల్కులము లీతప మిష్టమనోజ భోగమే." ఉ. రా. 3, ఆ. ౧౦౬, 2. సుడి, ఆవర్తము. "చ. పొలఁతులకున్ ..వళులు పీచి పరంపర లయ్యె నిమ్న నాభులు తిరులయ్యె వాలు కలపుంజము లయ్యె నితంబబింబముల్." కవిక. ౪, ఆ. ౩౫, భార. శాం. 3, ఆ. ౩౯౯; 3. మెలి, పురి. "సీ. నలినాక్షి ననుఁ జూచి యలకలు దీర్చెదేఁ దిరివిప్ప నడపనే తేఁటినారి." పి. శకుం. 3, ఆ. ౧౬౫; 4. (చాకిబానయాటయందు గుండ్రముగాఁ గూర్చుండినబాలురలో నొకని వెనుక భాగమునఁ బెట్టి వాఁడు తెలిసికొనలేకున్న యెడల కొట్టుటకు) మెలిపెట్టినవస్త్రాదికము. "సీ. పంతంబులోఁ జాకిబానతిర్లకు నంచు బెబ్బులి తిత్తొత్తు రబ్బురముగ." చమ. 3, ఆ. ౧౦౯; 5. మెలిపెట్టినగుడ్డ చివరిభాగము. (చూ. తిరిపెట్టు.); 6. తంత్రము, దురొప్ధ; 7. క్రోధము, కలఁత. (చూ. తిరిపెట్టు). విణ. వక్రము. "సీ. పక్షులు పింగాణికన్నులు తిరిబొమల్ మిడిడేగ చారలు మిద్దెజుట్లు." ప్రబంధ. ౧౩౨.

తిరిక. దే. వి. (తిరి+ఇక) మెలిక (శ. ర. బ్రౌ)

తిరికట్టు. దే. అ. క్రి. (తిరి+కట్టు) మెలికలు తిరుగు, వంకరయగు. "సీ. కరసానఁ దిగిచినకలివెగందపుబొట్టు తిరికట్టుకొని మోము దిరిగియుండ." క్రీడా. ౨౨౬.

తిరిగట్టు=తిరికట్టు. (జడగట్టు, అల్లుకొనిపోవు) "దీర్ఘ దీర్ఘంబులై తిరిగట్టుకొనినమలు గడచి తూలాడు కెంజడలతోడ." పి. శకుం. ౨, ఆ. ౩౦, ఇట్లే: తిరులుగట్టు. విక్ర. ౫, ఆ. ౨౫.

తిరిగించు. దే. స. క్రి. (తిరుగుధా. ప్రే.) 1. మరల్చు, నివర్తించు. "ద్వి. ఎగసి వ్రేయఁగఁ జూచి యింద్రజితుండు, మొగిఁ దిరిగించె నమ్ములపెల్లి పఱపి." రం. రా. యు. ౩౬౧. పు.; 2. పరిభ్రమింపఁజేయు. "క. దయ్యాఁ దిరిగించి దేవుం, డొయ్యన వెడలించె నోరియూర్పున నమ్మైనయ్యా మిపర్యంతు వెలువడి .." హరి. ఉ ౯, ఆ. ౯౯.

తిరిగివచ్చు. దే. స. క్రి. (తిరిగి+వచ్చు) 1. ప్రదక్షిణము చేయు, వలగొను. "క. కని యక్కైలాస తటంబున నమరులు తమవిమానములు డిగ్గి జనా, ర్దను దిరిగివచ్చి కొలువఁగఁ గని వచ్చె నతండు నియమగతి నెల్లుటయున్." ఉ. హరి. ౨, ఆ. ౧౬౭; 2. చుట్టు, పరివేష్టించు. "మ. జలజాంతస్థితకర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న కేశకుల చందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్." భాగ. ౧౦, స్కం. పూ. ౪౯౫.

తిరిగొండ. దే. వి. మంగళగిరి. (బ్రౌ.)

తిరిచినాపలి. దే. వి. పురవిశేషము. "ఆ...కంచి నాఁగ నోరుఁగల్లు నాఁగఁ దిరిచినాపలి యనఁ బురవిశేషము లగు .." ఆం. భా. ద్వి. ౧౧.

తిరితీపు. దే. వి. పెనఁగుట. (చూ. తిరితీపులాడు.)

తిరితీపులాడు. (తిరితీపులు+ఆడు) పెనఁగులాడు. "ద్వి. రట్టడై తిరిగి పత్త్రంబులుగొనుచుఁ, బెట్టవచ్చినఁ గల్లపెనపులు పెనఁచి,తిట్టువారును దానఁ దిరితీపులాడి." ద్వి. హరిశ్చ. ఉ. ౪౧౨.

తిరిప. దే. విణ. బిచ్చగాఁడు. "సీ. పదునైదు దినముల బ్రదుకుకై పరివాని దినవాథు నాసించు తిరిప పేఁడె." పి. శకుం. 3, ఆ. ౧౭౦.

తిరిపగాఁడు. దే.విణ. (తిరిపము+కాఁడు) బిచ్చగాఁడు "ఆ. తిరిపగాని మిగులదీవించఁగా రాదు,వెఱ్ఱివాని మాట వినఁగరాదు." వేమన. ౨, ప్ర. ౫౪.

తిరిపగొట్టు. దే. విణ. (తిరిపము+గొట్టు) విరక్తుఁడు కాక బిచ్చమెత్తువాఁడు. (శ. ర. తుచ్ఛభిక్షుకుఁడు. బ్రౌ.) "సీ. అనిరక్తభిక్షుకుఁ దలరును బికరాల మారి బికారి బిక్షిగొట్టు తిరిపగొట్టునా..." ఆం. భా. ద్వి. ౧౭౬.

తిరిపజోగి. ద్వ. వి. (తిరిపము+జోగి) బిచ్చమెత్తు యోగి, ముష్టివాఁడు. "ఆ. తిరిపజోగిఁ దగునె దేవుఁ డనఁగ." పీర. ౧, ఆ. ౧౩౫. (శ.ర.పా.)

**తిరిపతిండి.** దే. విణ. (తిరిపము+తిండి) భిక్షాశనుఁడు, భిక్షుకుఁడు. "ద్వి. దండి దుర్వ్యాధి యువ్వండేని తిరిపపుతిండియు కాక భక్తుండు తా నగునె." పండి. ఆ. పురా. ౧౩౦. పు.

**తిరిపము.** దే. వి. భిక్షము. ముష్టి. "క. నరి సెలంత లెన్నియేనియుఁ, దిరువ్రలధనములు గడించి తెచ్చు కొనఁగ నోశ్వరలాతీ యొక్కదాస, తిరిపపుఁ బాపనికి వలచి తిరుగుట యగునే" పరమ. ౩, ఆ. ౨౪౬. ద్వి. హరిశ్చ. ద్వా. ౫౧౩. పు. విణ. భిక్షుకుఁడు, బిచ్చమెత్తుకొనువాఁడు. "సీ. కడఁ దిరిపంబవై కాంతయు నీవును దేశంబులం గాల్ల దిరిగి." కవిక. ౫, ఆ. ౧౭.

**తిరిపకూడ.** దే. వి. (తిరిపము+కూడ) భిక్షాపాత్రము. "చ. చంక సత్తికుఁడ ధరించి సరించి పెంబడిన్." వైజ. ౩, ఆ. ౬౪.

**తిరిపమెత్తు.** దే. స. క్రి. అ. క్రి. (తిరిపము+ఎత్తు) బిచ్చమెత్తు. "గీ. కొలముకొఱంత గరాసుల కలవి గాని, దొరతనము గూర్చి కడుబల్లిదుల కదేల, తిరిపమెత్తఁగఁ జేసె .." నీలా. ౧, ఆ. ౧౧౧ వేమన. ౩, ప్ర. ౨౦.

**తిరిపరి.** దే. విణ. (తిరిపము+అరి) బిచ్చమెత్తువాఁడు. "క. ఇది ధర్మం బతులీపుల, కిది మావిధి మాతాపితృప్రహీణుల కహహా,యిది కట్టడ తిరిపరులకు, నెదిరిం దరుకాఱుఁగ కునికి కేలా మాటల్." కాశీ. ౭, ఆ. ౫౨. (శ. ర. పా) దశ. ౬, ఆ. ౧౦౪.

**తిరిపెం=తిరిప.** "సీ. చెల్లరే యీజాడ శివుఁడు నీసాటియే దేశంబు తిరిగెడు తిరిపె కాఁడే." వీర. ౩, ఆ ౧౧.

**తిరిపెట్టు.** దే. అ. క్రి. (తిరి+పెట్టు, మెలిపెట్టిన వస్త్రాగ్రముచు చెవిలోఁ జొనిపి త్రిప్పు. (వా), 2. తంత్రముపెట్టు, దురోబ్భేధచేయు. (వా).

**తిరిపెట్టు = తిరిపెట్టు.** "భాస్కరుఁ లసిత వృత్తము... వనట తిరిపెట్టెన్." భార. స్త్రీ. ౨, ఆ. ౪౯. (శ. ర. పా.)

**తిరియు.** దే. స. క్రి. బిచ్చమెత్తు, భిక్షించు. "గీ. తిరిసి యేనియు సన్నంబు తెచ్చికొఁలు, రైనవిప్రుల యాఁకలి యుపమించు, పురుషుఁడు .." భార. అను. ౪, ఆ. ౨౭౨, భార. సా. ౧, ఆ. ౨౧౭.

**తిరీటము.** సం. వి. అ. న. 1. కిరీటము, 2. లొద్దుగు...

**తిరు.** వై. విణ. (సం. శ్రీః క. త. తిరు) శుభకరము; పవిత్రము. (దీనికి సమాసమునకే ప్రయోగము లుండును." ఉదా:—తిరునామము, తిరుమంత్రము, తిరుమణి. మొ.)

**తిరుఁడు.** వై. విణ. (సం. స్థిరః) స్థిరుఁడు. (శ. ర.)

**తిరుకట్టె.** ప్వ.వి. (తిరు+కట్టె) పవిత్రస్థలము లూడ్చుట కుపయోగించుచీఁపురుకట్ట, సమ్మార్జని. వైజ. ౨, ఆ. ౧౧౫.

**తిరుకణామధు.** ప్వ. వి. పాయసము. వైజ. ౨, ఆ. ౧౩౧.

**తిరుకాపు.** ద్వ. వి. (తిరు+కాపు) దేవాలయము తలుపు." పరమ. ౩, ఆ. ౨౮౩.

**తిరుకాళత్తి.** వై. వి. (తిరు+కాళత్తి) శ్రీకాళహస్తియను పుణ్యస్థలము. బస. ౩, ఆ. ౮౯౦. పం.

**తిరుకొలను.** ద్వ. వి. (తిరు+కొలను) పుష్కరిణి, మెట్లు కట్టియుండు కోనేఱు. "క. తిరుకొలను నూయి లోటయుఁ, జెఱువు మడుగు..." హంస. ౪, ఆ. ౨౧౦. (శ. ర. పా.)

**తిరుకోళము = తిరుకొలను.** శుక. ౩, ఆ. ౩౦.

**తిరుగ.** తవ్య. ద్రు. (తిరుగుధాతువుయొక్క తుమన్నాద్యర్థకము) 1. పునరర్థకము, మరల. "క. తిరుగన్ రెండేండ్లకు నీసురుచిరహారోత్తరుంబు జాడఁగ నాతున్, దొరకెన్ గనుఁగవ చేసిన, యఁరుపుణ్యము నేఁడు పెండియఁను ఫలియించెన్." కళా. ౫, ఆ. ౪, అం. భా. తృ. ౬౯; 2. విరుద్ధముగా, "మ. బహుభావల్ దిరుగంగ నాడుటలునుం బ్రామాణికత్వంబులే." కాశీ. ౬, ఆ. ౮౧; 3. వేఱుగా,మఱియున్. "క. వినుమాత్మతీర్థసంసే,వనము తెలిసి గెఱుఁగునట్టివానికిఁ దిరుగం,బనపలయుం గొ పెఱచోటుల,ను..." భార. శాం. ౫, ఆ. ౧౫౦.

**తిరుగఁబడు.** ద్వ. అ. క్రి. (తిరుగన్+పడు) 1. ఎదిరించు, ప్రతిఘటించు. "గీ. దరుజసింహనాదములు డెందములు సొరఁగఁ, దిరుగఁబడఁజొచ్చె సమరకుంజరబలంబు." ఉ. హరి. ౧, ఆ. ౧౯. ప్రబంధ. ౮౬; 2. తిరుగు,సంచరించు. "క. కడుసంధ్రివమునఁ దిరుగం,బడిరొండ రిది యేమి తెలుఁగు పందువు మిహా,ల్చెదుపైవ పెద్ది యెయ్యది,పదయంగా వచ్చుఁ దత్పకర్మానియతిన్." హరి. పూ. ౭, ఆ. ౧౨౩; 3. విపరీతముగు. "క. ఏవిధిముఖ

దము దుఃఖద,మై వేఱ దుఃఖదము సుఖదమై తిరుగఁ బడున్." నృసిం. ౪, ఆ. ౬౫. కాశీ. ౫, ఆ. ౧౫౪; 4. మరలు,వెనుదిరుగు. "క. మనమున నద్యో దిక్కులు, పసిగ్రేపు దలంచి తిరుగఁ బడె..." శై. ౨ ఆ. ౧౦౧, కాశీ. ౨, ఆ. ౧౧౩; 5. మాఱు,భిన్నమగు. "గీ. దాని విని యంత నపుడు రాధాసుతుండు, దిరుగఁబడనిమ నంబుగో ధీరవృత్తిఁ, దల్లి కిట్లను నీమాట తక్క మగున,దైన నొక్కటి చెప్పెద నవధరింపు." భార. ఉద్యో. ౪, ఆ. ౬౧.

తిరుగఁబాటు. ద్వ. వి. (తిరుగఁబడుధా.) 1. మరలుట, నివర్తనము. "సీ. దృఢసంపదల కింకఁ దిరుగఁబా టనిరొ స్తనంబులముఖములు నల్లనయ్యె." కవిరా. ౨, ఆ. ౧౭౩; 2. ఎదిరించుట. (వా).

తిరుగఁబాఱు. దే. అ. క్రి. (తిరుగన్+పాఱు)పాఱి పోవు. "ద్వి. అరథరంబున కలిఁబెలినొంది, వారిధి లోన జీవంబు లన్నియుంను,దెఱలుచు నొఱలుచుఁ దిరుగఁబాఱుచును, సొఱయుంచు నటఁ దలలెత్తి చూచుచును." రం. రా. యు. ౩౧౫. పు.

తిరుగఁబోఁత. దే. వి. (తిరుగఁబోయు ధా.)తాలింపు, కూరలు మున్నవానికిఁ జేయుసంస్కారము. "క. క్రొంబోగపుకూరవగతిరు, గంబోఁతల మెంతిజీర కంబులవలపుం, దుంబోళ్ల కాచిసిగరుల, గంబూర జగంబు వొగడఁగా నటు నుడిసెన్." రా. వి. ౨, ఆ. ౧౦౧, ఆం. భా. ద్వి. ౨౫౬.

తిరుగఁబోయు. దే. అ. క్రి. (తిరుగన్+పోయు) 1. తాలించు. (శ. ర.); 2. నంచి మొదలగువాని లోనిధాన్యాదికము మఱొకదానిలో పోయు. (వా.) [(శ. ర.)

తిరుగడ. ద్వ. వి. (తిరుగు+గడ) మఱపెట్టినగొట్టము.

తిరుగలి. దే. వి. ఔ. (తిరుగు+కలు+ఇ) పిండి మొదలగునవి విసరుశిలాయంత్రము, ఘరట్టము. వి. (తిరుగు+కలి) భ్రాంతి, భ్రమ. "క. అని గద్గదకంఠంబున, వినిపించినఁ గుంభి తాను వికవిక నగుచుం,గనుతిరుగలి కావలి మనపెట్టినచోట లేక మఱి రొం దరిగెన్." భో. ౫, ఆ. ౫౯. (కనుతిరుగలి = దృష్టిభ్రాంతి)

తిరుగవేయు. దే. స. క్రి. (తిరుగన్+వేయు) త్రిప్పు, వ్యత్యస్తముచేయు. "క. అని నిశ్చయించి హస్తంబున జలములు పూని తల్లి పొమ్మని ప్రోక్షిం,చిన మాయగోవు పడుచుం,గను గ్రుడ్లం దిరుగవేసి కాలముచేసెన్." వరాహ. ౧౦. ఆ. ౪౦.

తిరుగాడు. దే. అ క్రి. (తిరుగు+ఆడు-స్వార్థమున) 1. సంచరించు, తిరుగు. "చ...ఇది ధర్మనందను మఖాశ్వము దీనికి నై ప్రయాణ మొం,దవిమిన రాట్పుతుండు దిరుగాడెడుసేనలతోడ నంచు మన్, వినఁబడు .." జై. ౮, ఆ. ౧౨౫. యు. ౧, ఆ. ౧౩; 2. చుట్టుదిరుగు. "ఉ...ఘూ, కాసురనూకరంబు దిరుగాడె పడిన్ శరఘాతచేద నన్." హర. ౭, ఆ. ౪౬.

తిరుగు. దే. అ. క్రి. (క. తిరుగు. త. తిరుహు) 1. సంచరించు, పరిభ్రమించు. "ఆ ..అంకగిఁకము నను హంసలెల్లఁ,బిడుగట్టి తిరుగుచుండె వాతో ద్ధూత,శారదాభ్రశకలచయముఁ బోలె." భార. అర. ౨, ఆ. ౧౩, విక్ర. ౧, ఆ. ౮౬; 2. ప్రవర్తించు,మెలగు. "చ. ధనములు పాలఁ గల్గి సత తంబును నింద్రియవాంఛ నల్పుచున్, మనమున నెన్నఁడున్ సుకృతమార్గముపొంతకుఁ బోక లోభమో,హనివహబుద్ధులై తిరుగుచట్టిజనుల్ పర లోకసౌఖ్యముల్, గనుటకు నేరరు..." భార. అర. ౪, ఆ. ౧౭౬, కుచేల. ౧, ఆ. ౩౮; 3. వెనుదీయు. "క. సుతులు సమరమునఁ దిరుగక, మృతులై సద్గతికిఁ జనిన మేలిమి యస్మన్మతిఁ దలఁచె పరము క్షత్త్రచ,రిత మని యప్పటికి నగవఁ బ్రీతియ కలుగున్." భార. ఆశ్ర. ౧, ఆ. ౨౩, ఆం. భా. కృ. ౧౧౪; 4. (చుట్టు)ఆవరించు. "క. చుట్టంబులుఁ జెలులుం దన,చుట్టుఁ దిరిగియుండ ముదము సొంపెసలారన్." శైవ. ౨, ఆ. ౮౪, శైవ. ౨, ఆ. ౩౮; 5. ఎదుర్కొను, తిరుగఁ బడు. "క. పోరానిచట్టఁ బొడుచుట, వైరిబలము దిరుగ జయమొ స్వర్గమొ యగు నా,నాహూత యంత్రశస్త్ర,శారాదులచట్టఁ బ్రజను కవియింపఁ దగున్." ఆము. ౪, ఆ. ౨౫౪; 6. మరలమరల వచ్చు. "సీ. ప్రతియుగంబునకు సేపట్టణంబున కును దివ్యాభిధానంబు దిరుగుచుండు." కాశీ. 3, ఆ. ౧౦౩; 7. మరలివచ్చు. "చ. హరిహయుఁ డాగ్రహోజ్జ్వలితుఁడై యనిఁ బాఱుదిశాధి నాథులం, దిరుగుఁడు పోకు పోకుఁ డని తిట్టి యదల్చి..." పారి. ౫, ఆ. ౧౪, ఆము. ౨,ఆ. ౭౭; 8. (మఱొకదిక్కునకు) తూఱు, పరివర్తన

మొందు. "క. ఊడుకొనఁబడుమధూళిక,రొండి కలచుఁ గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్, నీడలు తిరిగియుఁ దిరుగని,జాడఁ దరు ల్వ్రాలెడు నవ్వ నాంతపువేళన్." ఆము. ౫, ఆ. ౧౩౭; 9. చుట్టు దిరుగు, గుండ్రముగా భ్రమించు. "చ. ఊరుజవ శాలియత్తురగము ల్మకచక్రనయావలంబియై, తిరు గురయంబుచేత నిడత్రివ్వక నుమ్మరిసారె చాడ్పు నన్,బరఁగె..." ప్రభా. ౨, ఆ. ౩౪, హర. ౬, ఆ. ౭౯; 10. ఏర్పడు. "సీ. కండె దిరిగి యుక్కుకంబాలతో మాఱుమలయుబాహువుల నుగ్గలికతోడ." పరమ. ౩, ఆ. ౪౭. స. క్రి. 1. పరివేష్టించు. "క. ధరలో జంబూద్వీపము, నర సన్నుత లక్షయోజనమ్ములు దానిం, దిరిగి లవణాబ్ధి యొంతయు, విరివిం గనుపట్టు లోకవిశ్రుతమహి మన్." వి. పు. ౩, ఆ ౪౫; 2. ప్రదక్షిణము చేయు. "క. ఒకమాట జలకమార్చిన, నొకమా టొకపువ్వు వాళి పునిచిన నొకమా, టకుటిలమతి గుడిఁ దిరిగిన, సకలేప్సితముల నతండు సంపాదించున్." భీమ. ౩, ఆ. ౧౬౮; 3. తప్పు, ఉల్లంఘించు. "ఆ. మాటఁ దిరుగలేరు మానధనులు." భాగ. ౧, స్కం. ౫౯౯. వి. పర్యటనము, తిరుగుట. "సీ. త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగు నాఁ బర్యట నాఖ్యయై పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౭౪.

తిరుగఁబోతు. ద్వ. విశే. (తిరుగు+పోతు) 1. తిరుగు నట్టి స్వభావము కలవాఁడు. (శ. ర.); 2. వ్యభి చారిణి "సీ. తిరుగఁబోతుల కేల దేవపూజ." దాశ. ౬౩.

తిరుగుడు. దే. వి. 1. పర్యటనము, సంచారము. ఆం. భా. ద్వి. ౧౭౪; 2. వ్యత్యాసము, మాఱుపాటు. (వ్యవ.)అందులో ఒకతిరుగు డున్నది. (శ. ర.); 3. మర. (శ. ర.); 4. ఒకరకమగుపనిముట్టు. (బ్రౌ. వా.); 5. చక్రము. "గీ. సరకు సేయదు తిరుగళ్లఁ జామపిఱుఁదు." హం. స. ౪, ఆ. ౪౩. (శ.ర.పా.); 6. ప్రవర్తనము, నడవడి. (వ్యవ.) వాఁడు చెడు తిరుగళ్లు కలవడినాఁడు

తిరుగుడుకొను దే. అ. క్రి. (తిరుగుడు+కొను) భ్రమించు, తిరుగు. (చూ. తిరుగుడుకొలుపు.)

తిరుగుడుకొలుపు. దే. స. క్రి. (తిరుగుడుకొను ధా ప్రే.) భ్రమింపఁజేయు, తిరుగఁజేయు. "ద్వి. తిర ముగా ద్వాదశాదిత్యుల నొక్క,తెరువునఁ బో వుదఁ దిరుగుడుకొలిపె." బస. ౩, ఆ. ౪౧౫.పం.

తిరుగుడుచీల. దే. వి. (తిరుగుడు+చీల) తిరుగుడు నొక్కులుం గలచీల. (శ. ర.)

తిరుగుడుత్రాడు. దే. వి. (తిరుగుడు+త్రాడు)పక్షులఁ బట్టెడిసాధనవిశేషము. "ద్వి. తిరుగుడుత్రాళ్లను దెఱఁగొప్పఁ గట్టి,యుఁరులొడ్డి జిగురుల నుసురు గాలముల." ద్వి. నల ౩, ఆ. ౩౧౯. పం.

తిరుగుడునొక్కు. దే. వి. (తిరుగుడు+నొక్కు) మేకు మొన్నగు వానిని గోసి తయారుచేసిన తిరుగుడు మర. (శ. ర.)

తిరుగుడుపడు. ద్వ. అ. క్రి. (తిరుగుడు+పడు) 1. పరిభ్రమించు. (శ. ర.); 2. కలఁతనొందు, క్షోభ పడు. "సీ. ఒరుచేతఁ జిక్కక తిరుగుడుపడక యూర్ములులేక తగువృద్ధి గలిగెనేని. గీ. ఈడు జోడని పోల్పంగ నగుఁగు మాద, మంత్రిశేఖరు తిమ్మనామాత్యవరుఁడు." చిత్రభా. పీఠి. ౧, ఆ. ౬౨; 3. చుట్టుతిరుగు. "వ...మందరాచలంబు దిర్దిరన్ దిరుగుడుపడి యమ్మహార్ణవంబుజలంబు లన్నియు దిగంతంబులం జెదరి..." వీర. ౩, ఆ. ౨౧౧.

తిరుగుడుపాటు. ద్వ. వి. (తిరుగుడుపడు ధా.)కలఁత, క్షోభము; క్షోభపడుట. "చ. వారిఁ గని దేవదూత చరణానతుఁడై యమరేంద్ర సేన నిర్జరనగరంబుపైఁ బెలుచ రాకయు నాకము వెగ్గలంబునన్, దిరుగుడు పాటుఁ జెప్పిన .." నిర్వ. ౩, ఆ. ౨.

తిరుగుడుపెట్టు. దే. స. క్రి. (తిరుగుడు+పెట్టు) బాధించు, ఓడించు. "ద్వి. గురుచక్రములఁ దిరు గుడుపెట్టుపిఱుదు."ద్వి. పరమ. ౩,ఆ. ౨౨౨. పం.

తిరుగుడుబిల్ల. దే. వి. (తిరుగుడు+బిల్ల) స్త్రీలశిరో భూషణము. (శ. ర.)

తిరుగుడుబిళ్లలత్రిప్పుళ్లు. దే. వి. బ. బాలక్రీడా విశేషము. హంస. ౩, ఆ. ౧౪౬.

తిరుగుడుతాయి. దే. వి. (తిరుగుడు+తాయి) గిఱ్ఱు మని తిరుగుచుఁ బోయి తగులుతాయి. "గీ. ప్రతి బలము వ్రేయుతిరుగుడుతాళ్లకతనఁ,గుమ్మ లొలసిన బంగారుగోడ లురలి,పడిన..." కువల. ౩,ఆ.౧౭.

తిరుగుడువడు = తిరుగుడుపడు. ద్వ. అ. క్రి. 1. కలఁతనొందు,క్షోభపడు. "గీ. మందరాచలచటుల వివర్తనమున, ఘూర్ణమానమై గాఢసంక్షోభ

మెఱుఁగఁ, దలఁకు జలనిధి నాఁ ద్రిగర్తభటులు, బలము తిరుగుడువడియె సంకులము గాఁగ." భార. విరా. ౩, ఆ. ౧౭౮, భా. రా. అయో. ౬౩౧; 2. చుట్టుతిరుగు. "వ...ఆవర్తచక్రంబులయందు గ్రాహకారకానక్రంబులు తిరుగుడువడియె..." హర. ౬, ఆ. ౯౫; 3. వెనుదీయుట. "గీ...భూపాలకోటి పెంగ్గరము వెల్లఁ, గలఁగఁ దిరుగుడువడ నోరగిలఁగఁ బెల్లగిల్లఁ దల్లడపడ రణక్రీడ జర్పె." భార. భీష్మ. ౧, ఆ. ౬౭౮; 4. స్ఖలితమగు, జాఱు. "క. అరయఁగ సంపూర్ణమునన, తిరుగుడువడుకుక్ల మనుట తెలుఁగే సంకల్పరతిం గలదే చోఁకెదఁ, జరింప కుండంగ వలయుం బంకల్పంబుల్." భార. శాం. ౪, ఆ. ౩౦౬.

తిరుగుదల. దే. వి. నివర్తనము, మరలుట. వ్యవ. వ్యాధి తిరుగుదలకోనికి వచ్చినది.

తిరుగుపడు. ద్వ. అ. క్రి. (తిరుగు+పడు) కలఁత నొందు, క్షోభపడు. "సీ. అహిరాజదామకం బడరించి మథియింపఁ బుట్టె సుగ్రానలజ్వార్తిఁ దొలుతఁ, గాలకూటము దానిగతి కోర్వఁగా లేక దేవదానవు లార్తిఁ దిరుగుపడఁగ." విష్ణు. నా. ౪, ఆ. ౬.

తిరుగుమొగము. ద్వ. విశే. (తిరుగు+మొగము) 1. గమనోన్ముఖము. (వ్యవ.) వ్యాధి కొంచెము తిరుగుమొగముగా నున్నది. (శ. ర. వా.); 2. విముఖము, వెనుదిరిగినది. "గీ. ఉచితనేపథ్య లయ్యు నవయ్యరగసతులు, విభ్ను నిజమాళికలశోభ్ను విభ్నులబ్ధి, నభికసంకేతములకు కే లరిగి యరిగి, తిరుగుమొగమైన చిక్కులతెరువు లిడిరి." పాండు. ౨, ఆ. ౧౭౪.

తిరుగువాఱు. దే. స. క్రి. (తిరుగు+వాఱు) పరివేష్టించు, చుట్టుకొను. "గీ. దివిజకామిను లీరీతిఁ దిరుగువాఱి." స్వా. ౩, ఆ. ౧౦౭, కాశీ. ౪, ఆ. ౨౦౩. [వాద్యవిశేషము (శ. ర.)

తిరుచిన్నము. ద్వ. వి. (తిరు+చిన్నము) ఊఁదెడు

తిరుచూర్ణము. మి. వి. (తిరు+చూర్ణము.) పసుపు బియ్యము చేర్చి వైష్ణవులు నొసట నుంచుకొనెడి పొడి. "సీ. నడుమీథి గలనిల్వునామంబుపట్టెలు శోభితం బగుతిరుచూర్ణ రేఖ." వైజ. ౨, ఆ. ౫, పరమ. ౩, ఆ. ౧౬౮.

తిరుచే. దే. వి. (దేవుని నూరేఁగించు) పల్లకి, వాహనము. "సీ. హరికి భూమికి నీళకధికన్యకు నూతనాంబరాభరణమ్ము లర్పణములు, చేసి శృంగారముల్ చేసి హాటకరత్నదీధితు లొప్పినతిరుచ యందు, వేంచేపు చేయించి..." వేం. మా. ౨, ఆ. ౧౧౨.

తిరుదండె. వై. వి. (తిరు+దండె) దేవునిసన్నిధియందు దీప ముంచుకజ్జ్రమిద. 'సీ. ఘనపద్మరాగమకరతోరణములు నాఁ దిరుదండెదీపముల్ తేజరిల్ల " ప్రబంధ. ౭౪.

తిరునామము. మి. వి. (తిరు+నామము) వైష్ణవులు నుదటియందు నిడుపుగాఁ బెట్టుకొనుబొట్టు. "ఉ. నల్లనిమేను నిల్వుతిరునామము పచ్చనిబొట్టు నాభిపైఁ దల్లనితమ్మియుం గలుగుదేవుఁడు..." వైజ. ౧, ఆ. ౬౯.

తిరునాము = తిరునామము. "గీ. కుఱుఁడిదుప్పటి రింగులువాఱఁ గట్టి, మృగమదంబునఁ దిరునామ దగ నొనర్చి, దివ్యగంధ మలఁది యభినవ్యపుష్ప, మాలికలు దాల్చె మదనగోపాలుఁ డపుడు." శ్రీరాధా. ౫, ఆ. ౨౫౯.

తిరునాళ్లు. ద్వ. వి. బ. (తిరు+నాళ్లు. త. తిరునాళ్) దేవోత్సవదినము, దేవోత్సవము. "గీ. బ్రహ్మ తిరునాళ్ల కరుదెంచి ఫలముఁ గాంచి, కటక కల్యాణ ఢిల్లీనికటజనంబు." రా. వి. ౧, ఆ. ౩౬, స్వా. పీఠి. ౩౯.

తిరునీఱు. ద్వ. వి (తిరు+నీఱు) శైవులు నొసట నుంచుకొనెడుగోమయభస్మము, విభూతి. (శ.ర.)

తిరుపందేరము. ద్వ. వి. (తిరు+పందేరము) దేవుని నగ లుంచుకొట్టు. "క. అరంగపతునితిరుపం, దేరంబులు తేరుముట్లు తిన్నియ లలరుం, బేరులు దీర్ఘపుఁజెంబుల్, తోరము లగుగందవడియలుం గని వారల్." విప్ర. ౫, ఆ. ౯.

తిరుపట్టెపురుచే. ద్వ. వి. మల్లసాధనవిశేషము. "సీ. ఒఱపుగఁ దిరుపట్టెపురుచ లెత్తఁగఁ బొంచముల లాడుడింకులు బోరల మెండల. గీ. బలిమి గని పట్టి..." ప్రబంధ. ౯౨.

తిరుపణ్యారము. వై. వి. (తిరు+పణ్యారము) దేవతాదులకు నైవేద్యముచేయు పిండివంట. "క. పూరలు సన్నముఁ దిరుపణ్యారముఁ బచ్చళ్లు..." వైజ. ౨, ఆ. ౧౩౧.

తిరుపతి. వి. వి. 1. విష్ణుక్షేత్రము. "ఆ. వినుము తల్లి నూటయెనిమిదితిరుపతులందు జెన్న వేంకటాచలంబు, రంగధామమును గరంబు సన్నుతిం గాంచు..." పరమ. ౪, ఆ. ౮౪, అము. ౪, ఆ. ౩౫; 2. వేంకటేశ్వరస్వామియుండు పుణ్యక్షేత్రము, తిరుమల. (వా).

తిరుపనిపిళ్లె. ద్వ. వి. (తిరు+పని+పిళ్లె) దేవాలయమందలిసేవకుఁడు. "వ... తిరుపనిపిళ్లెలు పొందలి పాల నమర్చి తెచ్చినబంగారుతీఁగె లిప్పభూరాజనాలు..." ప్రబంధ. ౧౧౨.

తిరుపాట. ద్వ. వి. (తిరు+పాట) దేవతాస్తుతిగీతము. "ద్వి. పరఁగుమహాభక్తచరితలు నాదభరితమై చనఁ దిరుపాటలు చేసి,పాడుచు నొక్కొక్క భక్తునిచరిత,వేడుకఁ బొగడు..." బస. ౪, ఆ. ౮౫౮. పం.

తిరుపు. దే. వి. (తిరుగుధా) 1. తిరుగుట, భ్రమణము. (చూ. తిరుపుగట్టు.); 2. జక్కిణి యనునాట్యవిశేషమునఁ గలయొకయంశము. "గీ. పాఁయలు కత్రము సిరములయొఱపు తిరుపు,లాగుమై సరిపెలుపు పల్లటీయుఁ గులుక,జక్కిణి నటించినను మెచ్చి కంభుఁ డిచ్చె, మానికవిమాన మొక్కటి వానరేంద్ర." సమీర. ౩, ఆ. ౨౧౬; 3. లాగుకొను. "క. దొనఁగోల గొనుటవేగంబున నరి గొల్పుటయుఁ దిరుపుఁ బొరిఁ బొరి విడుపుం, జనుటయుం దనుజాలఁ గొనుటయుఁ, ననిమిషులకునైనఁ గాంచు టరుదయ్యె ననిన్." కు. సం. ౧౨, ఆ. ౧౫౮.

తిరుపుగట్టు. దే. అ. క్రి. (తిరుపు+కట్టు) 1. (నాట్యమున) గిరగిర తిరుగు, చక్రభ్రమణముచేయు. "గీ. మెఱుఁగుమొయిదీఁగె పలగొనఁ దుఱుము వొదలఁ, జెఱప రొయ్యక్కటై లిఱిలిఱి తిరుపుగట్టె." చంద్ర. ౧, ఆ. ౧౪౧; 2. తిరుగు, భ్రమణముచేయు. "సీ. వనవుదేహముఁ గట్టె జాడుమావతులు నాఁ దిరిగినవెంటనే తిరుపుగట్టె" సిరం. ౪, ఆ. ౯౭; 3. వ్యాపించు. "సీ. కనసి దిక్కుతురాళి గవిసెనలకుఁ దార్చె దివి దన్ని పెందూళి తిరుపుగట్టె." సాంబో. ౫. ఆ. ౨౦౩.

తిరుపుగొను. దే. అ. క్రి. (తిరుపు+కొను) నాట్యమందు గిరగిరఁ దిరుగు. "క. ఇరువురు చేసిన బాణము, విరుబరులును దాఁకి తిరిగి విరుదారులకు నక్కరి యురుమొగములఁ దట్టువ,తిరుపుగొనెడు క్రమముతో సతిత్వరితగతిన్." కాశీ. ౪, ఆ. ౧౮౪.

తిరుపుటెద్దు. దే. వి. (తిరుపు+ఎద్దు) గానుఁగయెద్దు. "ఉ. ఈనలినాక్షి దాఁ దిరుపుటెద్దుఁ బ్రతోదము మోచి రొప్పుచున్, గానుఁగపట్టెమైఁ దిరుగు..." క్రీడా. ౧౦౩.

తిరుపుట్టము. ద్వ. వి. (తిరు+పుట్టము) పూజ్యాలవస్త్రము. "క. తిరుపుట్టము లుతికి చేగఁ దెచ్చెద దినమున్." వైజ. ౨, ఆ. ౧౧౫.

తిరుపులుఁగట్టు=తిరుపుగట్టు. 1. (తిరుగు, భ్రమణము చేయు.) "గీ... మిట్టి మింటవీథిఁ దిరుపులుఁగట్టికట్టి, రణహారులు రాఁగ నొకమహాద్భుత మొనఁగె." కకు. ౪, ఆ. ౮౮, 2. వ్యాపించు. "చ. మరువిఁ తెఱపు సూపుకున మాపు నొయారపుఁజూపు సూరెలం, దిరుపులుఁగట్టె." వేం. పంచ. ౪, ఆ. ౧౪౬.

తిరుప్పల్లాణి. ద్వ. వి. (తిరు+పల్లాణి. త. తిరుప్పల్) దర్భశయనము, దర్భలతో నేర్పఱిచినపాన్పు. "మ... జలధిం గాల్చదలంచెదం గపుల కత్యుద్ధత ప్రతాపంబు దిక్కులఁ జేరఁ గ్రక్కఁగ నంచుఁ బల్కుచు నతిక్రోధానురోద్ధతిం, బొలిచెం గార్ముకపాణి యత్తరిఁ దిరుప్పల్లాణి నుల్లాసియై." చం. రా. ౮, ఆ. ౩౬.

తిరుబాస. ద్వ. వి. (తిరు+బాస) దేవునిమీఁద బెట్టుకొనునొట్టు. "వ... పట్టినవ్రతంబు చెల్లకుండినం దిరుబాసగా వర్తిల్లుచుండె..." హార ౧,ఆ.౧౪.

తిరుమంజనము. ద్వ. వి. (తిరు+మంజనము) అభిషేకము; స్నానము. "వ...వరాహస్వామిముందటి మంటపంబున నుంచి పంచామృతస్నానాది తిరుమంజనంబును...ఆదరించి..." వేం. మా. ౨, ఆ. ౧౧౮, శుక. ౩, ఆ. ౧౬.

తిరుమంత్రము. వి. వి. (తిరు+మంత్రము) నారాయణమంత్రము, అష్టాక్షరి. "క. కరుణాకరుఁడై ద్వయమును, తిరుమంత్రము నున్న గాఁగ, నిజశాస్త్రములా, కరణిఁ బరాంకుశమాని,శ్వరుఁ డుపదేశించి..." పరమ. ౫, ఆ. ౧౧౯.

తిరుమజ్జనము. వి. వి. (తిరు+మజ్జనము) దేవతావిగ్రహములకుఁ జేయునభిషేకము. "చ....తో, ధన మగుమేనివానిఁ దనుఁ బ్రత్యహముం తిరు

మజ్జనంపుసేవ నలరఁ జేయువాని జనవంద్యత నొప్పెడు నొక్కనిపుత్రిన్." పరమ. ౩, ఆ. ౧౬౮.

తిరుమణి. ద్వ. వి. (తిరు+మన్ను-శ. ర.) వైష్ణవులు నొసట నుంచుకొనుధవళమృత్తిక. "క. నడుముకుఁ బోవఁ దీర్చిన, కడుఁ దోరపుఁదిరుమణియుంచు గావి వలువఁ జొప్పడఁ గంఠంబునఁ దిరుమణిపడములు ధరియించి వైష్ణవపువేషముతోన్." పరమ. ౩, ఆ. ౨౦౪, వైజ. ౩, ఆ. ౧౯.

తిరుమణిపడమము. మి. వి. (తిరుమణి+పడము. త. తిరుమణిపడం) తామరపూసలదండ. "సీ. కంఠభాగంబులఁ గమనీయగతిఁ బొల్చు తిరుమణిపడముల గరిమతోడ." పరమ. ౩, ఆ. ౧౩, ౩, ఆ. ౨౦౪.

తిరుమన్ను. ద్వ. వి. (తిరు+మన్ను) వైష్ణవులు నొసట నుంచుకొనెడిధవళ మృత్తిక. "గీ. పట్టెతిరుమన్ను బెదరుకెంబట్టు మాపు." ఆము. ౬, ఆ. ౬.

తిరుమల. ద్వ. వి. (తిరు+మల) వేంకటాచలము. "క. తిరుమలదేవరకు దిరిగి తిరిగి పొగడుచున్." పరమ. ౨, ఆ. ౨౦౭, వేంక. ౩, ప్ర. ౨౫౭.

తిరుమాల. మి. వి. (తిరు+మాల) వనమాల, అకులు పువ్వులుఁ జేర్చి కట్టినమాల. "చ...హరి వాల్చు వక్షమునందలితిరుమాల..." ప్రబంధ. ౫౯౧.

తిరుమాళిగ. ద్వ. వి. (తిరు+మాళిగ. త. తిరుమాళిహై.) (వైష్ణవభాషయందు) గృహము, పూజ్యులుండు గృహము. "సీ. హరితిరుమాళిగ గరుడధ్వజాంచలం, బొకకొంత గన్నపుణ్యుండువీఁడు." వరాహ. ౧౦, ఆ. ౧౬.

తిరుమాళిగె=తిరుమాళిగ. "సీ. తిరుమాళిగెకును రాఁ దీరదో యిన్నాళ్లవలెఁ గాదు మించె నైశ్వర్య మార." కృష్ణ. ౨, ఆ. ౪.

తిరుమాళిహ=తిరుమాళిగ. "క. తిరుకట్టె సేవఁ జేసెదఁ, దిరుమాళిహ పలికి పూసి తీర్చెద ముగ్గుల్." వైజ. ౨, ఆ. ౧౧౫.

తిరుమాళ్వ=తిరుమాళిగ. "సీ. నే మేల్కనక మున్న తా మేలుకొని దేహశుద్ధిరై తిరుమాళ్వ శుద్ధి చేయు." వైజ. ౨, ఆ. ౧౨౬.

తిరుముడి. ద్వ. వి. (తిరు+ముడి) 1. జడలుగట్టిన జుట్టు. "ద్వి. ధరరాజ్య మొల్లక తిరుముడి దాల్చి, పరము నమ్మినతిరుపాలుని బంట." బసు. ౪, ఆ. ౧౦౧౧, పం; 2. వైష్ణవజనము. "క. అనుదినము వేయుందిరుముడికిని మృష్టాన్నముల సారగింపు లిడక రూ, యనఘుఁడయిఁ యుండు ముమ్మగుఁదన పనితయుఁ దాను నట్టితాత్పర్యం బో." పరమ. ౪, ఆ. ౧౪౩.

తిరుముత్తము. ద్వ. వి. (తిరు+ముత్తము) దేవాలయము. "ద్వి. మ్రొక్కుచు నత్తిరుముత్తంబు వెడలి, చక్కఁ దర్వనఁ బాదచారియై నడవ." బస. ౬, ఆ. ౭౬౧.

తిరులు. దే. వి. (కు. సం. వ్యాఖ్య దీనికి తిరులుమరులు అని సముదాయముగనే ప్రయోగము గన్పడు చున్నది) "క. పరశుపతి ప్రకరై సుర, పురములు సాధింప నన్నపుణ్యస్త్రీ లెవ్వరు గలరు చూపు చూతాం, కురశరహతిఁ దిరులు మరులు గొలిపెడ వారిన్." కు. సం. ౪, ఆ. ౪౨ ౬, ఆ. ౧౭.

తిరువంజనము = తిరుమంజనము. వైజ. ౨, ఆ. ౧౫.

తిరువడి. ద్వ. వి. (తిరు+అడి) 1. దాసుఁడు. "క. ఇరవుకొను తెలివు దోఁచిన వెరవున దేవరకు విన్నవించితి ననినన్, దిరువడి నుడి హరువిడి మదిఁ, బరువడి రఘువీరుఁ డనియె భానుజుతోడన్." సమీర. ౩, ఆ. ౧౫౯; 2. పుణ్యస్థలము. "గీ. అట్టితిరువళ్లలో జనరు లెట్టివారు, పుండరీకాక్షు సేవించి పుణ్యమైన, యుంభయలోకసుఖోన్నతి నొందఁగలరు." శ్రీరం. మా. ౨, ఆ. ౩౫.

తిరువడికోల. ద్వ. వి. (తిరువడి+కోల) దాసరివాని దీపస్తంభము. "వ...దాసరిగుంపు వారిపాల గోపాలభిక్ష భిక్షించి భక్షింపఁ దీరకోటి నిలిపి సతోరంపుఁదిరువడికోలలరంధ్రగోళంబుల నుల్కలంబులై మంచుఁధగధగనిజగజ్జ్యోతి దీపజాలంబుల...." ఆము. ౪, ఆ. ౩౫.

తిరువరంగము. ద్వ. వి. (తిరు+అరంగము) శ్రీరంగము, పుణ్యక్షేత్రవిశేషము. "ఆ. తాను మాధుకరము మానక యొప్పటి, యట్ల వైష్ణవాలయముల కరిగి, రంగపతిఁ దిరువరంగంబకో సెల, యనుచు భిక్ష మెత్తుకొని భుజించు." వైజ. ౨, ఆ. ౧౩౨, ౫. శాలిధాన్యవిశేషము. (శ. ర.)

తిరువాముడి. ద్వ. వి. ద్రవిడవేదము. (దీనియందు విష్ణుస్తోత్రము లుండును). "క. తిరువాముడి పఠియించుచు, హరిభక్తులఁ గన్న భక్తి నడియుఁడఁ బనుచున్...." విప్ర. ౨, ఆ. ౩౦.

తిరువాయిమడి = తిరువామడి. "గీ... దండ,వత్ప్రణామంబు లిడి తిరువాయిముడిప్ర, బంధసూక్తుల వినుతు లర్పణ మొనర్చి." వైజ. ౪, ఆ. ౧౨౯.

తిరువారాధనము. మి. వి.(తిరు+ఆరాధనము`(వైష్ణవ పరిభాషయందు) దేవతార్చనము. (శ. ర)

తిరువిళక. ద్వ. వి (తిరు+విళక) దీపము. "గీ. దీపము తిరువిళకజోతి దివ్వె యనఁగ వెలయు..." వేంక. దేవ. ౨౫.

తిరువీధి మి. వి. (తిరు+వీథి) దేవుఁ డూరేఁగువీధి. "ఉ. వేంకటశైలభర్త తిరువీథుల రా నిలిచెన్..." ప్రబంధ. ౬౬.

తిరువీసము. ద్వ. వి. (తిరు+వీసము) పలుచని జీరాన్నము. "చ. వినుము రమాధిపుండు తిరువీసము నిన్నటిరేయి యారగిం,చినకఱి..." విప్ర. ౫, ఆ. ౧౨.

తిరువు. దే. అ. క్రి. స. క్రి. తిరుగు. (శ. ర,)

తిరువుగట్టు = తిరుపుగట్టు. (భ్రమణముచేయు) "గీ. భాఁవమంథమహీధరభ్రమణరీతిఁ, దెలుపుపొలుపున గిరగిరఁ దిరువుగట్టైనట్టి చేకొంతలీలావిహారలోలుఁ, డైనవాటకకటపాటీనవిభుఁడు." దశా. ౧, ఆ. ౨౨౫.

తిరోగతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మఱుఁగు పడినవాఁడు; 2. అడ్డుగా వెళ్లినవాఁడు.

తిరోధానము. సం. వి. అ. న. 1. మఱుఁగుపాటు, అంతర్ధానము, 2. ముసుఁగు, గవుసెన

తిరోభావము. సం. వి. అ. పుం. మఱుఁగుపడుట.

తిరోహితుఁడు సం. వి. చ్. పుం. 1. మృగము, 2. పక్షి. సం. విణ. (అ. ఆ. అ.) మఱుఁగుపడిన వాఁడు. శ.

తిర్యఞ్చ్. సం. విణ. (చ్. తిరశ్చ్. చ్.) 1. అడ్డముగాఁబోవునది. (జంతువు),2. వక్రము; 3. అడ్డముగా నున్నది.

తిర్యగము. సం వి. అ. పుం. కన్నుఁగవయందు చేయుచుంబనము. "సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు నధరోష్ఠమున భ్రాంత మదరఁ గన్నుఁగవఁ దిర్యగంబును గక్షదేశంబులఁ బ్రథితంబు చను బోయి నధరకంబు." హంస. ౫, ఆ. ౧౪౮.

తిర్యగ్గము. సం. వి. అ. పుం. 1. మృగము; 2. పక్షి. విణ. (అ. ఆ. అ) అడ్డముగా నడచునది.

తిర్యగ్యానము. సం. వి. అ. పుం. 1. ఎండ్రకాయ, పీత; 2 మృగము; 3 పక్షి; 4. అడ్డముగా పోవుట. విణ. (అ. ఆ. అ.) అడ్డముగా నడచునది.

తిర్లికఱ = తిరువిళక. (త. తిరువిళక్కు) 1. దేవతాగ్ర ముఖమున పెట్టుదీపము; 2. దీపము. (బ్రా.)

తిలటి. దే. వి. మత్స్యవిశేషము (శ. ర.)

తిల్లటి. దే. వి. 1. బుట్టవలె తాటియాకులతో నల్లిన మత్స్యగ్రహణసాధనవిశేషము. "గీ. కొడకు తిల్లడకొడమ ద్రొబ్బుడుపటంబు, చాఁప యొత్తిల గూడయుఁ జల్లు డూఁడు,లుంటగాలంబు తెరదీము లుసురుగాలము..." హంస. ౪, ఆ. ౧౯౪; 2. అవిరక్తభిక్షుకుఁడు. "సీ. అవిరక్తభిక్షుకుఁ డలరును బికిరాలమారి బికాసి బికారి తిల్లటిగొట్టు తిల్లటి తిరిపగొట్టు నా .." ఆం. భా. ద్వి. ౧౬౬.

తిల్లటిగొట్టు. దే. వి. (తిల్లటి+గొట్టు—స్వార్థమున) అవిరక్తభిక్షుకుఁడు. ఆం. భా. ద్వి. ౧౬౬.

తిలక. సం. వి. అ. స్త్రీ. 1. హారవిశేషము; 2. వృత్తవిశేషము.

తిలకము. సం. వి. అ. పుం. 1. బొట్టుగుఱి. 2. నువ్వుమొక్క; 3. ఎఱ్ఱగోరంటపూ. 4. పుట్టుమచ్చ; 5. నల్లగుఱ్ఱము. (శ. ర.) పుం. న. బొట్టు. న. 1. కడుపులో కుడివైపున ఎఱ్ఱగా నుండుమాంసము, క్లోమము; 2. నల్లసౌవర్చలము. విణ. అ. పుం. న. శ్రేష్ఠము. (ఈయర్థమున ఇది సమాసోత్తరపదముగా నుండును.)

తిలకాలకము. సం. వి. అ. పుం పుట్టుమచ్చ.

తిలకించు. దే. అ. క్రి. 1. కనఁబడు. "శా. నోరం జేతులు రెండు గ్రుక్కికొనుచున్ మోమెల్ల బాష్పాంబుపూరంబై తిలకింప నేడ్చుచు..." హరి. పూ. ౫, ఆ. ౧౬౦. నృసిం. 3, ఆ. ౯౬; 2. ప్రసన్నతనొందు. "క. కిలకించితరసపూరముఁ, జిలికించి కటాక్షవీక్షచే నలినాక్షుల్, తిలకించి చూచినప్పుడు, పులకించక నరులదేహములు లోహములే." వైజ. ౨, ఆ. ౨౧, విక్ర. ౧, ఆ. ౧33. స. క్రి. చూచు, వీక్షించు. "క.. పొసఁగన్, బలుకఁగ నేర్తుగదా యని,చిలుకం దిలకించి ప్రియము చిలుకం బలికెన్." విక్ర. ౬, ఆ. ౬౯, ఆం. భా. తృ. ౧౨౨; 2. గారవించు. "శా... పకవిప్రతీకకృతి సామాన్యాకృతిం బూని తా, నై పక్షి ల్పచరింప దానిఁ దిలకింపంగోరు

ధీరోత్తముల్." వసు. ఆ. ౧౧; 3. దిద్దు,పెట్టు. "సీ. తిలకంబు కస్తూరిఁ దిలకించి చొక్కెంబు జెంగులపాగతోఁ జెప్పు మీఱ గీ. ..ఒకఁడు వచ్చె..." ద్వా. ౧౧, ఆ. ౧౩౭; 4. విశు. "క. ప్రియ మొక్కటి యేఁ జెప్పెద,నయవినయ విధి మనంబునను నీవు గడుం, బ్రియముగఁ దిల కింపుము మృత్ప్రియుండవు మత్ప్రియముచేతనుఁ బ్రియ మొందఁ దగన్." హరి. ఉ. ౭, ఆ ౨౭; 5. చేయు. "చ. సలిలముఁ జొచ్చినం గనక శైలముఁ జేరిన వైరివీరులం,గెలిచిన రాజసేవఁ దిలకించిన వేదము లభ్యసించినం, గళలతెఱం గెఱింగిన ఖగత్వము దాల్చినఁ గర్మనిఘ్నతా, కలన నభావ్యమైనది గాదు వినాశము లేదు భావికిన్." భర్తృ. నీతి. ౯౯.

తిలకితము. సం. విణ. (అ. ఆ. అ.) తిలకము కలది. పాంచా. ౧, ఆ. ౧౭౨.

తిలఘాతకుఁడు. సం. వి అ. పుం. గాండ్లవాఁడు, తెలికవాఁడు.

తిలఘాతుకుఁడు. సం.=తిలఘాతకుఁడు.

తిలతండులన్యాయము. సం. వి. అ. పుం. నువ్వులును బియ్యమును గలిపినవిధము, ఒకానొకన్యాయము. (వీనికలయిక సంసృష్టి సంకరమువలెఁ గాక దీని యందు విడఁదీయుట కవకాశము కలదు.)

తిలతండులము. సం. వి. అ. పుం. 1. ఆలింగనవిశేషము; 2. నువ్వుపప్పు.

తిలతైలము. సం. వి. అ. న. నువ్వులనూనె.

తిలపర్ణము. సం. వి. అ. పుం. 1. శ్రీవేష్టము. న. చందనము. [ఆంధ్ర శ.

తిలపుష్పకము. సం. వి. అ. పుం. 1. నువ్వుపువ్వు; 2.

తిలపేజము. సం. వి. అ. పుం. పొల్లునువ్వుగింజ.

తిలయంత్రము. సం. వి. అ. న. నూనెగానుగ.

తిలలు. సం. వి. అ. పుం. బ. నువ్వులు. (ఇది తెలుఁగున నిత్యబహువచనాంతము) "క ..రమ్య తిలలు... దుహిత్రాత్మజుఁడుఁ గుతపమును దిత్ప్రప్రమదకారణముల్." హరి. పూ. ౨, ఆ. ౧౮౩.

తిలాపత్య. సం. వి. ఆ. స్త్రీ. నల్లజీలకఱ్ఱ.

తిలిత్సము. సం. వి. అ. పుం. కొండచిలువ.

తిలోత్తమ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక అచ్చెర.

తిలోదకము. సం. వి. అ. న. పితరులకు నువ్వులతోఁ దర్పణము విడుచుజలము.

తిల్యము. సం. విణ. (అ. ఆ. అ.) తిలలు పండునది. (పొలము.)

తిల్వము. సం. వి. అ. పుం. లొద్దుగుచెట్టు.

తివ. వై. స. (సం. త్రికష్) ఊఁడు. "క. తివిరి కరవాలు జేకొని,ఱవఱవ తెఱఁగంగ నత్తెఱవపైఁ జనుచోఁ, దివజడలకేయి ద్రిమ్మరి, పువ్వుఁబోఁడి యొకర్తు సెయ్యమున నడ్డంబై." అచ్చ. సుం. ౫౯. (తివజడలకేలు ద్రిమ్మరిపువ్వుఁబోఁడి = త్రిజట.)

తివాచి. దే. వి. (హిం. తివాసీ) మేలైనచిత్రాసనము. "రగడ. దుద్దుకంబళ్లు చందువలు తివాచీలు,పద్దుకుఁ గైకొన్నబలుజంబుఖానాలు." హంస. ౫, ఆ. ౩౫౬.

తివాసి = తివాచి. "చ ..మెఱుంగుబంగరపువన్నెజగాబురుసాతివాసిపై, ధరణిజతో వసించెఁ బల తల్కుఁదనాడలఁ జేతు లాచుచున్." ఉ. రా. ౬, ఆ. ౧౨౮, హంస. ౧, ఆ. ౬౯.

తివాసీ=తివాచి. "సీ. జాలవల్లికలు పచ్చలగద్దెపేటహాంబట్టుతివాసీలు వట్టివేళ్ల, సురటీలు..." రసిక. ౧, ఆ. ౬౧.

తివిపించు. దే. స. క్రి. (తివియు ధా. ప్రే.)తీయించు. "గీ ..అంతఁ గనుపట్టె దివ్యసింహాసనంబు. క. తద్భ్రాపముఁ గని నృపుఁడు ద,రిద్రుఁడు ధనరాశి గన్నరీతిం బ్రమదోన్నిద్రుఁడై తివిపింపఁగ, భద్రాసన మద్రిభంగి బరువై తోఁచెన్." ద్వా. ౧, ఆ. ౧౦౫.

తివియించు. దే. స. క్రి. (తివియు ధా.)అపహరించు. "గీ. కదళి దివియించె నగ్రాంఘ్రికంబు తొడల పెను పు .." ఆము. ౫, ఆ. ౩౦. (తివియు ధా. ప్రే) 1. త్రిప్పు, మరలించు. "క. అలరుచు లంకకు నేఁకఁ బో,వలయు నని యమాత్యభృత్య వర్గము వినఁగాఁ,బలికి నలంగడల విడిసిన, బలములఁ దివియించి దైత్యపతి పయనంబై." ఉ. రా. ౪. ఆ. ౮౭, రా. వి. ౫, ఆ. ౨; 2. పైకిఁ దీయించు, "ఉ...మదుఁగుపాంతకుఁ బోయి జలంబు ద్రావి యూ,పట్టున మీఁదఁ గాంచి యొకచారుఫలం దివి యించి యేపురన్." ద్వా. ౧, ఆ. ౨౩౯.

తివియు. దే. అ. క్రి. మరలు,వెనుకకుఁ బోవు. "ఆ... అనిసేయుట, నిలిచి తివియఁ బంచె బలము సెల్ల." భార. భీష్మ. ౨, ఆ. ౨౫౩; 2. వెనుదీయు,జంకు.

"గీ. అతివక్షో త్తమఁ డయ్యేటియందు చేంటి, కృపుఁడు తనపెంపు చాటించి కెలంకుఁ జచ్చెఁ, గాని చాలుగు తెఱఁగులచేనలకును, దివియఁ ఉంచు కయుంను నరదేవముఖ్య." భార. ఉద్యో. ౪, ఆ. ౨౭౬; 3. ఆఱిపోవు, ఎండిపోవు. "గీ. మదను దివిసినకస్తూరి ప్రాఁచి యలరు, పాయఁబాఱిన కూడు నీర్వట్టుమడుఁగు, గళితమణి యగుపొమ్మునై కానఁబడియె, దుర్విదగ్ధుండు గౌరవదూరుఁ డగుచు." పాంచా. 3, ఆ. ౨౨, వరాహ. ౧౦, ఆ. ౨౮. స క్రి. 1. మ్రింగు. "ఆ. కన్నకల్లి కన్నఁ గరుణలే దోక వేళ,పట్టిఁ బట్టి తివియఁ బార్థివేంద్ర,గండకముల కిట్టిగండము ల్గలవు..." దశా. ౧, ఆ. ౧౩౭; 2. త్రిప్పు. "మ. శరసంధానముతోన కొన్ని యడుగుల్ జౌజవ్వనంబోయి యుద్ధరణిన్ గాల్కొని ద్రోణముల్ తివియు దోర్దండంబులం జేది యేసిరి తోయల్..." స్కా. ౪, ఆ. ౧౧౧; 3. పైకిఁదీయు, తీయు. "గీ. దొనల నలుఁగులు దివియుట తొడుగుట యును, నేయుటయుఁ గాఁడుటయుఁ బయి కెగయుట కనును,గానరాకుండ వజ్రంబు గాఁగ నట్లు, పెనఁగుచుండిరి బీరంబు లినుమడింప." రసిక. ౬, ఆ. ౩౪, శంక. ౨, ఆ. ౧౨౬; 4. దించు. "శా. పట్టెం గంతబిలంబు చెయ్యి దివియన్ రాదయ్యె వారాణసీ, పట్టస్థానమునందు వ్యాసునకు శిష్యశ్రేణి ఖిల్లిఁగన్." కాశీ. ౭, ఆ. ౧౦౭. (చూ. ౧౦౬); 5. పెఱుకు, ఊడఁదీయు. "క. విను వల్లభ కన్నుందం,గనుపాపం దివియ చేర్పుగల మునిముచ్చ్చినిత తగ దిచట నుండన్..." కళా. 3, ఆ. ౧౮౮. కవిక. ౨, ఆ. ౪౬; 6. లాగు, ఆకర్షించు. "ద్వి. కన్నులారఁగ నిది కనుఁగొను చునుచు, పన్నీలవేణిపయ్యెదవాయఁ దివిసి." నవ. ౨, ఆ. ౮౧. పు "క. బలహీనుఁ డైనవానికినల వియె మోపెట్టఁ దివియ నశక్యుర్మకముఁన్." భార. ఆది. ౭, ఆ. ౨౩౨; 7. గ్రుచ్చు,నాఁటు. "గీ. మాట లేటికిఁ దాలింపుమా తకుంబు,మారుఁడిఁ గూర్చి నరోజపత్త్రాయతాక్షి,నధ్యుఁ దివియంగఁ దాఁటినవాఁడొక్కొట్టు, యూపున త్రిక్రియ కర్ణమై యుం బన్న చెపుమ." హర. ౪, ఆ. ౩౦.

తివిరించు. దే. స. క్రి. (తివురుధా. ప్రే.) త్వరపెట్టు. "చ. అని చెలి విన్నవించుటయు శాహితవాక్యము మున్న విన్నయున్నినదముకన్నఁ దిన్నువయి నీరజలోచన యున్నకోనకుం,జనఁ దివియింపఁ దలిప్రియవచస్థ్రితికన్న విరాళి నించె న,జ్జనకలికిన్ మనో జభుజబాహులతాగుణగుంభితార్థటుల్." వసు. ౨, ఆ. ౫.

తివు-తివ్వు. దే. స. క్రి. 1. లాగు. "గీ. కొప్పుఁ బట్టి తివంబోవ నక్షపశంతి, ప్రాణభయమునఁ గలఁగి..." కళా. 3, ఆ. ౧౧౭. భాగ. ౧౦, స్కం. పూ. ౪౦౨; 2. మరలించు. "చ. భవదములాకృతి ప్రతిమఁ బర్విసయప్పుడు చూపు క్రమ్మరన్,దివఁ గదలింప రాక సుదతిన్ గతచేష్టితఁ జేసె.. ప్రభా..." ౪, ఆ. ౭౩; 3. తొలఁగించు,తీసివేయు. "శా...సర్పశవమున్ సేఁ దుగ్రుఁడై పైచివాఁ,డేరితిన్ ఫణి గ్రమ్మఱం బ్రతుకునో హింసించునో కోఱలన్,రారే తాపసులార దీనిఁ దివరే రక్షింపరే మ్రొక్కెదన్." భాగ. ౧, స్కం. ౪౭౬, కళా. ౮, ఆ. ౧౯౦; 4. చేరఁదీయు. "సీ. అర్థిఁ దదారోహణాపేక్షితుం డైన ధ్రువునిఁ గనుంగొని తివక యూదరింపకుండుటకు..." భాగ. ౪, స్కం. ౨౧౯.

తివుచు. దే. స. క్రి. 1. పీల్చు. "క. రవి నృశియించును వర్షము,రవియ మగుడఁ గిరణతతుల రసమాతయఁ దాఁ,దివుచును..." భార. శాం. ౬, ఆ. ౫౯౯; 2. మరలించు, వెనుకకుఁ ద్రిప్పు. "గీ. కలయ నేతెంచి నైమభత్తావరుండు,దివుటఁ బురలత్మిపై ప్రాలుదృష్టిఁ దివిచె,నాత్మ నొక్కించు కయుఁ బరాకయ్యె చేని, ప్రాణవల్లభ తన్నేమి యనునొ యంచు." నైష. ౬, ఆ. ౧౬; 3. తొలుఁగొనిపోవు. "క...మూర్చ్ఛ, భ్రాంతుం డయ్యెన్ బలి దివి,జాంతకునరదంబు సూతుఁ డవలికిఁ దివిచెన్." దశా. ౨, ఆ. ౪౨౬; 4. లాగు, ఈడ్చు. "క. పవనజుఁగదయును నీగాం,డీవమును నటవోయె నరిగడిఁకఁ బాంచాలిం,దివిచికొని వచ్చునెడ .." భార. ఉద్యో. ౪, ఆ. ౧౯౯, ప్రభా. ౨, ఆ. ౬.

తివుట. దే. వి. (తివురు. ధా.) 1. కోరిక. "సీ. వరు చూడ్కి ముద్దియవదనంబుపైఁ బాఱి తివుటమై నునుఁగాంతితీర్థ గ్రోలు." భార. విరా. ౫, ఆ. ౩౯౫, హర. ౨, ఆ. ౬౨; 2. శ్రద్ధ. "సీ. జను యిత్రి విను మఱి సకలపదార్థప,రిజ్ఞానతత్త్వపారీణ

మగుచు, శామ్నాయవిహితకర్మాచారములు గల్గి తివుటమై వర్తించుదేవగణము." భాగ. 3, స్కం. ౯౩౯; 3. వలపు. "చ. నవకపుమావిమోకలఁ జెనంగినతీవలం జేర్కొఁ జెంపఁ బల్లవములసజ్జ లుల్లములలజ్జ లడంపఁగఁ దేటితండముల్, తివుటల ముంపఁగా సమదలీల మనోజవినోదసప్తులై." నిర్వ. ౧, ఆ. 3౬; 4. భూనిక. "ద్వి. బవరాన లంకాధిపతిపదితలలం, తివుట నొక్కమ్ముఁ ద్రెక్కంగ జేసి." ద్వి. పరమ. 3, ఆ. ౬౫2. పు. రం. రా. కిష్కిం. ౬౫. పు. క్రి. విణ. శీఘ్రముగా "గీ...వైశమున తివురు తివుట, వేగిరమున శుఱు తన శీఘ్రతా గిరీశ." ఆం. భా. ప్ర. ౭౫.

**తివురు.** దే. అ. క్రి. 1. భూను. "క. తివిరి యభోజ్యం బగుమాంసవమాంసముతోడ భోజనము: బెట్టినవాఁడవు..." భార. ఆది. 2, ఆ. ౧౧౬. ఉ. రా. ౪, ఆ. ౬౬3; 2. త్వరపడు. "క. తివురక యిం కొక్కటి విను, కవియుగాడక్ వలయుఁ గన్నుఁ గవయక్ మూయన్." స్వా. 3, ఆ. ౧౦౧. నీలా. 3, ఆ. ౯౬; 3. అనుకొను, భావించు. "క. చ్యవనుఁడు గవిజాతుఁడు న,య్యవనీశ్వరుఁ దెల్చి వరము లడుగుమ రెండిఁ, దివిరితి మనుడు నతఁడు ..."భార. అను. ౬, ఆ. ౬౦౯; 4. పేర్కొనొందు. "సీ. పడఁతి నీకరములు పట్టంగఁ దివిరి శంకించి పడంకెదు కేలు చూడు" భార. విరా. ౬, ఆ. ౪2. శుక. ౪, ఆ. ౯3; 5. మించు, అధికమగు. "గీ. ఎనఁగుసంతాపభరమున నిట్టునట్టుఁ బొరలు శయ్యాతలంబుఁ బువ్వుఁబోఁడి తివురు విరహానలంబున దివ్వెలెత్తఁ, జిత్తజాతుండు వత్తి దాల్చినవిధమున." ఉ. హరి. ౫, ఆ. ౧3౧; 6. ఇచ్ఛించు, కోరు. "ఆ. ఏమికారణమున నింద్రు ఖాండవ మగ్ని, దేవుఁ దట్టు గాల్పఁ దివిరె దీని, విప్రముఖ్య నాకు వినఁగ వేడుక యయ్యె, జెప్పుఁగఁ జెప్పు మయ్య యుద్ధచరిత." భార. ఆది. ౧, ఆ. ౬౪౬; 7. తిరుగు, సంచరించు. "గీ. తేఁప మిఱుంగఁ దల్పంబు డిగ్గి డిగ్గి, లేచలేచుచు నిట్టట్టుఁ దివిరి తివిరి, పొలఁతిచెలువంబు మాటికిఁ బొగడి పొగడి, వసుధ వ్రాయుఁచు మోము వాంచి వాంచి." కృ. శకు. 3, ఆ. ౫. రాఘవ. ౪, ఆ. ౧౧౯; 8. కోపించు. "గీ. తివిరి తీక్ష్ణ శ్రమల ఘాతనివహములను." హరిశ్చ. 3, ఆ. ౯౬. అచ్చ. సుం. ౫౧; 9. ధ్వనించు, మ్రోయు. "సీ. జానలం బీఁటలువాఱఁ దివురుచిందములోలాహలంబులకుఁ గలఁగఁబడక." భార. విరా. ౪, ఆ. ౬౬. కు. సం. 3, ఆ. 3౦; 10. మాఱుమ్రోయు, ప్రతిధ్వనించు "ఆ. ఆతనిచక్రగతుఁ లైనసద్వని పత్య, దేవుఁ జూసి నధమ దివుర వార్చె." భార. భీష్మ. ౧, ఆ. ౭౪. ఉ. హరి. ౧, ఆ. ౧౪౬; 11. ప్రవర్తిల్లు. "తరలము ..నీవు పాండవకులంబు వెలుంగఁబుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో, నవని రాజ్యభరంబు దాల్చి రయంతనుండి సుఖంబులం, దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజాల్." భార. ఆది. ౬, ఆ. ౬౬౪. విణ. శీఘ్రముగా. ఆం. భా. ప్ర. ౭౫; 13. కరుణించి. "గీ. పణిప నోపకయున్న మై మఱచి పెంటి, జెవఁగి యున్నను ప్రసవింప మొనసియున్నఁ, దవులుగొనియున్న మృగముల దివిరి యేయ, రెఱచి యాహారముగఁ గొనుజెలుపు లయిన." భార. ఆది. ౫, ఆ. ౫3; 13. దీక్షవహించు. "సీ. తివిరి సరస్వతీతీరంబునందు నిల్చెంటు:డై తప మొప్పఁ జేయుచున్న, యాదధీచికడకు నరిగి వేఁడుండు..." భార అర. 3, ఆ. 3.

**తివ్వ** దే. వి తీఁగ, లత. "ఉ. నొవ్వ యలంపఁ గూనెదవు నోర్గొకమాఱును మూయవేలొకో, తివ్వలు కాలఁ జుట్టినను దెంపఁగ లేవు తరత్నునాథ..." కేయూర. 3, ఆ. ౧౧౬.

**తివ్వు.** దే. స. క్రి. 1. ఆకర్షించు, లాగు. "శా... దృఙ్మాలంబుల్ గలయంగ విచ్చి విటమత్స్యవ్రాతముం దివ్వుచున్, రోలంబాలక వచ్చి చూచె..." కు. సం. ౧, ఆ. ౫౧, 2. తీసికొనిపోవు. "ఉ... చనుదెమ్ము లెమ్మనక్, ప్రేగరితుంబు వాపుదు నొకించుక లేవఁగఁ బూను మాను నాఁలోఁ గొద గొన్నసిగ్గునఁ జేలుల్ బలిమిం దనుఁ దివ్వఁ గోరుచున్." కళా. 2, ఆ. ౧౧2; 3. దించు. "క. ఎవ్వరికిని మోపెట్టను, దివ్వను శక్యంబు గానిదృఢకార్ముకమున్." భార. ఆది. 2, ఆ. ౬౫. భా. రా. బాల. 3౦౦; 4. మరలించు, నిగ్రహించు. "మ....లోలోన పే, తెరువుల్ వాఱుమనంబుఁ బట్టిబలిమిక్ దివ్వంగఁ దివ్వంగ దుష్టరదుశ్చాసిక యయ్యెఁ బూర్వవిధిఁ బ్రత్యక్షంబుగా, నిష్టహా పురుషుం గంటిమి..." హరి. ఉ. ౪, ఆ. ౬౭.

భార. శాం. ౧, ఆ. ౪౬; 5. ఊడఁదీయు, తీయు. "ద్వి. పగలు చూచినపొమ్ము పగలు తేఁగలము, మిగిలినకడిమి శాస్త్రయుఁ దిష్యరాని, శాలముల్ గడియ లుద్ధతి పెరుక ప్రీల, వ్రాలించు పెక్కైన బదనిక ల్గలవు." ద్వి. పరమ. ౭, ఆ. ౫౨౦. ఫ్ర. కథ. 3, ఆ. ౭౦; 6. కనిపట్టు, తెలిసికొను. "క. కడు మేటి యైనదొరచే, బడినది మాపొమ్ము పెచ్చు పదనోపిన నీ, గడ కొంత దిష్యవచ్చున్, బెడిదపు రొచచే ఘటింప నేర దొకటియున్." పరమ. ౫, ఆ. ౫౨.

తిష్య. సం. వి. ఆ. స్త్రీ. ఉసిరికచె.

తిష్యకము సం. వి. అ. పుం. పుష్యమాసము.

తిష్యఫల సం. వి. ఆ. స్త్రీ ఉసిరికచె.

తిష్యము. సం. వి. అ. పుం. 1. పుష్యనక్షత్రము; 2. పుష్యమాసము; 3. కలియుగముచె. ఉసిరికచె. విశే. (అ. ఆ. అ.) 1. శుభమైనది, 2. పుష్యనక్షత్రమునఁ బుట్టినది.

## తీ

తీ. వై. స. వ్యుత్పత్తియందు తిగశబ్దమునకు వచ్చు నాదేశము. (చూ. తీవంచ. శ. ర.)

తీంట్రము. దే. వి. దురద, కండూతి. "సీ .. తీంట్రమ్ము కసి తీట... దురద యనఁగఁ బరఁగు." ఆం. భా. ద్వి. ౧౭౯.

తీండ్ర. వై. వి. (సం. తీక్ష్ణమ్). 1. వేఁడిమి. "గీ. అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మసాలఁ, దండి యతఁ డందు నినుమడి తీండ్ర వోఁప." ఆము. ౫, ఆ. ౧౪౬; 2. తేజస్సు. "గీ... నిగమశర్మ, తీండ్రఁ బుండ్రేక్షుకోదండు తండ్రిఁ బోలి, పరమధామంబు నకుఁ బోవు పక్షమునందు." పాండు. 3, ఆ. ౧౧౦; 3. కమి. "శా... మదిన్, దీండ్ర ల్గలిగినవారి తేకరణి సేమి విద్య రాకుండునే." స్వా. ౫, ఆ. ౧౭. పాండు. ౨, ఆ. ౨౦౮; 4. ప్రతాపము. "ఉ... మీ, తండ్రి... పెక్కండ్రనిశాటులం దటిమి కాశిక దైత్యుని నుక్కడంచె నా, తీండ్ర రొయికించుకేని వలదే..." రాజ. చ. ౨, ఆ. ౧౯. సారం. 3, ఆ. ౧౯౯; 5. ఉద్వేజనము, ఓషధి విశేషము. "సీ... తీండ్ర యంచనఁగ నుద్వేజన మగు." ఆం. భా. ద్వి. ౬౬. వాండ. ౪, ఆ. ౧౦.

తీండ్రము. దే. విశే. (సం. తీక్ష్ణమ్.) 1. తీక్ష్ణము, ప్రచండము. "క. తీండ్ర మగురోషమున మీ, తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్, పేండ్రము విడువఁడు .." భాగ. ౭, స్కం. ౩౪౫. ఆం. భా. ప్ర. ౮౪; 2. కరుణము, కడు చుడి. "గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కడిరసజ్ఞుఁ, డీండ్రనరకని కిటువంటితీండ్రవయసు, తార చూపుల నేరకాంత కారిఁ దెచ్చి, యాలుగాఁ గూర్చి పాపాత్ముఁ డాయె నహహ." సురా. ౫౯.

తీండ్రించు. వై. అ. క్రి. 1. ప్రకాశించు, వెలుఁగు. "గీ. ప్రాగ్దిశాకాంత నిండుగర్భంబునందు, సూర్యుఁ డుదయింపఁ బ్రొద్దులు పొచ్చి యుండ, మొదలఁ దీండ్రించు లేతక్రొమ్మొలకయొండ, నింగియింగిలి కాన నభ్యంగ మార్చె." కాశీ. ౧, ఆ. ౧౨౪. స్వా. ౬, ఆ. ౩౯; 2. ప్రజ్వలించు. (శ. ర.) "సీ. చంద్రనిష్ఫలువోలెఁ దీండ్రించుకనుమించు లెసఁగ నొండొంటిపై నెక్కఁబాఱు." స్వా. ౪, ఆ. ౧౭. స. క్రి.- మెలిపెట్టు, దువ్వు. "సీ. చర్మ మెత్తుదుము లోకమున విలాసములఁ దీండ్రించు ధీరచమూరురిపులనైన." హ. న. ౨, ఆ. ౧౯.

తీండ్రింపించు. వై. స. క్రి. (తీండ్రించు ధా. ప్రే.) ప్రకాశింపఁజేయు. "సీ. అద్దమరేప్రొద్దు ప్రొద్దు తీండ్రింపఁ గుంచెటెకోదమకుఁ గొమ్ముచూపు." సుద. ౪, ఆ. ౨౫.

తీండ్రిలు. వై. అ. క్రి. అతిశయించు, పెరుగు. "గీ. ...విజయరామరాజు వసుంధరారమణుఁ గాంచి, తాండ్రపాపయశోపుంజుఁ దీండ్రిలంగ." రంగా. 3, ఆ, ౨౫౪. భీమ. 3, ఆ. ౫౨.

తీఁగ. వై. వి. (సం. దీర్ఘా. క. తీగె.) 1. లత, వల్లి. "గీ. కన్ను ద్రొక్కు మెఱుఁగుఁదీఁగయుండు బోలె." నైష. 3, ఆ. ౮౮. (శ. ర. పా. తీగ ముద్రి. పా.) దశ. ౯, ఆ. ౩౮; 2. స్త్రీలు మెడను ధరించునొకవిధమైనబంగారుసరి. "ఉ. శ్రోణితలేంద్రుఁ జూడ నొకకొమ్మ వడిం బయలెంచె నుల్లసద్వేణిభరంబుతో మొగపుతీఁగ వలగ్నమునం దమర్చి యొడ్డాణము తీఁగఁగా నిడి మెడన్వలగో నది చాలమిన్ గొనల్, పాణుల నుండఁగౌను మఱి బాగుగఁ గానుకపట్టు నైవడిన్." కళా. ౮, ఆ. ౧౩౯. ఆం. భా. తృ. ౫౫; 3. వీణ మొదలగువానితంతి, "సీ. తెలివివెన్నెలవెండి తీఁగలు నిగిడించు చదలుంకమ్మచ్చు బెజ్జము లనంగ." శారి. ౨, ఆ. ౩౬; 4. రొగులు దాల్చురద్రా

స్వాదికంఠమాల. "క. కేళాకౌళవ్రుడీఁగలుఁ, జేళి కలుఁ గళానములును బీజజములు దాఁ, దాలుచు దిట్టాగా మించుక్, లీలావారిఁ దోల నింక చేర్పరి యరయ్యన్." కళా. 3, ఆ. ౭౨; 5. పెలు సూలు. "ఉ. కట్టిరి సన్నపుందనుపుఁగాగిఁ గటీతటి మేటితీఁగపై, నొట్టిరి." విక్ర. ౪, ఆ. ౧౬౦.

తీఁగఁబోఁడి ద్వ. వి. (తీఁగ+బోఁడి.) మనోజ్ఞారా లగుటఁదుది; అఁదుది. "ఉ. ఈరోలదీఁగఁబోఁడిఁ గృపయుంచుక కల్గక విక్రయించు టన్యాయము మేదినీపతికి..." హరిశ్చ. ౪, ఆ. ౯౭. ద్వా. ౪, ఆ. ౨౦౩. [(శ. ర.)

తీఁగకానుగు. ద్వ. వి. (తీఁగ+కానుగు) మర్కటితీ.

తీఁగగఱిక. ద్వ. వి. (తీఁగ+గఱిక) గండాలి, మహాధూర్వతీ. (అభిధానరత్నమాల.)

తీఁగజాజి. వై. వి. (తీఁగ+జాజి) ఒకజాతిజాజితీ. (శ. ర.) [(శ. ర.)

తీఁగతుమడి. ద్వ. వి. (తీఁగ+తుమడి.) దీర్ఘమాలతీ.

తీఁగతెంపు. ద్వ. విశే. (తీఁగ+తెంపు.) తెంపులేనిది, అవిచ్ఛిన్నము. "సీ. విశ్వంబు కావ్యనివిపులక్రియా శక్తిఁ దిరుగుచున్నది తీఁగతెంపు గాఁగ." కాశీ. ౫, ఆ. ౯౪.

తీఁగనవ్వు. ద్వ. వి. (తీఁగ+నవ్వు.) దీర్ఘహాసము. "సీ. పయ్యెద దిగజార్చి పాలిండ్లు సవరించు దిన్నవాఱఁగ నవ్వుఁ దీఁగనవ్వు." క్రీడా. ౬౯. రాధా. ౫, ఆ. ౧౧౨.

తీఁగపాల. ద్వ. వి. (తీఁగ+పాల.) క్షీరాదితీ. (శ.ర.)

తీఁగపేరికల్కిమగఁడు. ద్వ. వి. వల్లీదేవిభర్త, కుమారస్వామి. ఆం. భా. ప్ర. ౪౪.

తీఁగమల్లియ. వై. వి. (తీఁగ+మల్లియ.) ప్రాఁకిప్రాఁచునొకజాతిమల్లెతీ. "మ. సొరిదిం జేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబులుం బొప్పనుం,జరులున్..." ఆము. ౧, ఆ. ౬౬.

తీఁగమల్లె. వై. వి. (తీఁగ+మల్లె) 1. ఒకజాతిమల్లియ. బ. ధాన్యవిశేషము. "సీ. బలుతీఁగమల్లె లంపారించి తిమిచాలఁ గుసుమముల్ చులుకగాఁ గూర్పలేమె." కవిక. ౧, ఆ. (శ. ర.)

తీఁగమెఱుఁగు. ద్వ. వి. (తీఁగ+మెఱుఁగు.) 1. ఊఱుము లేనిమెఱుఁగు, ఉ. విద్యుల్లత; 2. ప్రొద్దుతిరుగుడుచెట్టు. (శ. ర.)

తీఁగమోడి. ద్వ. వి. వ్రాఁతపని. (శ. ర.)

తీఁగరొలుఁగు. ద్వ. వి. (తీఁగ+ఎలుఁగు) హీనస్వరము, సన్ననిరొలుఁగు. "ద్వి. అని తీఁగరొలుఁగున నా కోమలాంగి, తనసాధుఁ జేర్కొని తా నేడ్చు కొనుచు." ద్వి. నల. ౪, ఆ. ౩౯౩. పు.

తీఁగలువాఱు. ద్వ. అ. క్రి. (తీఁగలు+పాఱు) ప్రసరించు,వ్యాపించు. "ఉ. తీఁగలువాఱుపార్శ్వశతదృష్టిఁ దగం గలయంగఁ జూచినన్." కవిక. ౬, ఆ. ౯౧.

తీఁగవిలుకాఁడు. ద్వ. వి. మన్మథుఁడు. "గీ. తుంట విల్కాఁడు మరుఁ డించువింటివాఁడు, దీఁగవిలు కాఁడు వలరాజు...,"ఆం.భా. ప్ర. ౪౫.

తీఁగవిలుతుఁడు. = తీఁగముకాఁడు. (శ. ర.)

తీఁగియ = తీఁగ. (లత,వల్లి.) "గీ. అలరుఁ దీఁగియతో నద్ది యైనయట్టి, కొమ్మ కామ్మేనువలపులు గొలుపు టరుదా." కవిజ. ౧, ఆ. ౭౮.

తీఁగె = తీఁగ. (లత,వల్లి.) "మ. జిగిమైసొంపున దమ్మిమైమఱుఁగు రాచెంగల్వచేతత్రియున్, సిగపూమొగ్గలతాయెతుల్ చిగురుకాసెం జెక్కునం జాలఁ బొల్పగుచున్ గేదఁగిరేకువంకయును జాయల్ మీఱఁగాఁ బువ్వుదీఁ,గెగుదెం దావలరాచయొంటరి కడుం గేడింపుచుం జిమ్మనన్." య. ౫, ఆ. ౭౪. అని. ౫, ఆ. ౭౦.

తీఁగెచుట్టు. ద్వ. వి. (తీఁగె+చుట్టు.) లతవలె చుట్టుకొనుట. "చ. తొలితొలి కిచ్చుధారల కెదుర్కొని తచ్చుటఁ దీఁగెచుట్టుగా నలముచు ధాత్రి వేచి పొలుపారె మలీమసబాష్పవల్లు ల,త్తొలితొలిధారకే వెఱచి తోఁచె ఘనాఘనము వానకాల్గకుం, బలరిపుఁ డాలయాధిపుల భంగికి సంకెల లాడ్చె నో యనన్."ఆము. ౪, ఆ. ౯౪.

తీఁగెతెంపు. ద్వ. విశే. (తీఁగె+తెంపు.) అవిచ్ఛిన్నము, ఎడతెగనిది. "గీ. ఇట్లు దిశలెల్లఁ దానయై యొసఁగ మెఱుఁగు, నమ్మహీరుహావరము డాయంగ వచ్చెఁ, దీఁగెతెంపుగ రజతాద్రిదిక్కునందునుండి ఖేచరమిథునంబు లొక్కొమొగిని." ఉద్భ. ౧, ఆ. ౧౩౧.

తీఁగెబచ్చలి. ద్వ. వి. (తీఁగె+బచ్చలి.) కలంబితీ. "సీ...తీఁగెబచ్చలి యనఁగఁ గలంబ్యాఖ్య యలరు." ఆం. భా. ద్వి. ౭౯.

తీఁగెమల్లె = తీఁగమల్లియ. వై. బ. (బ. ధాన్యవిశేషము.) "సీ. మండిగంత్రలు నాగమల్లెలు తీఁగె

మల్లెలు కృష్ణనీలాలు తెలుపడాలు." హంస. ౪, ఆ. ౧౭౮. ప్రబంధ. ౧౧౫.

తీఁగమెఱుఁగు. ద్వ. వి. (తీఁగ+మెఱుఁగు.) ఉఱుము లేనిమెఱుఁగు, విద్యుల్లత. "ఉ. పాదలితి పాన్పు పైఁబడినపద్మునిదేహముఁ బొంచె జీవుఁడా, చేడెలు చూడ మేఘుకును జెందినతీఁగమెఱుఁగు చాడ్పు నన్." వా. రా. ౨, ఆ. ౯౯.

తీఁగయిమ్ము. ద్వ. వి. (తీఁగ+ఇమ్ము) పొదరిల్లు, నికుంజము. "సీ. తీఁగయిమ్ముల కొమ్మి పోఁగలించుక గన్న మాళిపింఛ మటంచు మమతఁ బొందు." ముకుంద. ౨, ఆ, ౧౩౨. ఇల్లే తీఁగమెఱుపు. ప్రబంధ. ౧౯౦.

తీఁగలువాఱు. ద్వ. అ. క్రి. (తీఁగలు+పాఱు.) అధికమగు, విస్తరించు. "సీ ముదిమి తీఁగలువాఱి ముంచినకై వడిఁ గడు మేన నరములు గానిపించు." నీతి. ౯౦.

తీఁగలుసాఁగు. ద్వ. అ. క్రి. (తీఁగలు+సాఁగు) తీఁగ వలె వగు. "చ. నిడుదమఘూళికల్ నడుమనే కొని తీఁగలుసాఁగ..." అము. ౫, ఆ. ౧౨౩.

తీఁగసాఁగు. ద్వ. అ. క్రి. (తీఁగ+సాఁగు.) 1. దీర్ఘమగు, అధికమగు. "ఆ. గబ్బిగుబ్బచన్నుఁగవమీఁది పయ్యెద, జాఱఁ ద్రోచుఁ దీఁగసాఁగ నవ్వు." వి. పు. ౬, ఆ. ౧౯. య. ౫, ఆ. ౯౨; 2. నిక్కు, నిగుడు. "సీ. కడుఁ దీఁగసాఁగుచు బడుగుకొన్నడుము మిక్కిలి కృశంబుగఁ దత్తఱిలుచు నిక్కు." కళా. ౭, ఆ. ౭౬.

తీఁట. దే. వి. (క. తీటె.) 1. దురద, కండూతి. "మ. వారి కూర్మరూపమున నద్రిం దాల్చెఁ దక్పర్వత భ్రమణవ్యాజత వీఁపుఁ గీఁట శమియింపం జేయఁగా నారదా." భాగ. ౨, స్కం. ౧౪౬. అం. భా. ద్వి. ౧౭౯; 2. ఒకవిధమైన గజ్జి (శ. ర.) [దూలకీ. (శ. ర.)

తీఁటకసింద. దే. వి. (తీఁట+కసింద.) కచ్ఛుర, తేగడి

తీఁటకసివింద. దే. వి. (తీఁట+కసివింద.) కచ్ఛుర, తేగడిదూలకీ. "సీ...కచ్ఛురాఖ్యగ విరాజిలుఁ దీఁటకసివింద యన..." అం. భా. ద్వి. ౫౪.

తీఁటకోల. దే. వి. (తీఁట+కోల.) దూలగొండి, కందూరకీ. "సీ. దూలగొండి యనంగ దురద గొండి యనంగఁ దీఁటకోల యనఁ దేజరిల్లుఁ, గందూర..." అం. భా. ద్వి. ౫౪.

తీఁడిరించు. దే. అ. క్రి. ప్రకాశించు, వెలుఁగు. "గీ. తిమిరపుంజంబుఁ దలద్రొక్కి తీఁడిరించు, చంద్రకిరణకుమారకచ్ఛాయ యనఁగ." పాంచా. ౫, ఆ. ౨౫౬. కాశీ. 3, ఆ. ౨౩౪.

తీఁపురము. దే. వి. ఆగడము, అకృత్యము. "క. దాఁపురము లేక యాక్రియఁ గాఁపురములు సేయుచున్న గరితలలో నీ తీఁపురములు వాక్రుత్తురె, కాఁపుల నిపుణటువారిఁ గానవె తులువా." వెం. పంచ. ౪, ఆ. ౪౬౭.

తీకు. దే. వి. భోగము, సుఖము. "ఉ. లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి ప్రాణులం, దీకులఁ బెట్టి గొల్లెడలఁ దీపులు నూపెపెపిన్నమాయ." భాగ. ౬, ఆ. ౪౨౧. ప్రభులిం. ౪, ఆ. ౧౧౪. పు.

తీక్ష్ణ. స. వి. ఆ. స్త్రీ. 1. వసకీ, 2 దూలగొండికీ; 3. ఒకజాతిఆడవిపిల్లికీ, 4. మాచేరుకీ. సర్పవిష ముఁ బోఁగొట్టునొక లతకీ.

తీక్ష్ణకంటక. సం వి ఆ. స్త్రీ కందారికీ.

తీక్ష్ణకంటకము. సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్తకీ; 2. తుమ్మకీ; 3. గారకీ; 4. వెణుతురుకీ. పుం. న. వాఁడి యైనముల్లు. విణ. (అ. ఆ. అ.) వాఁడి యైనముండ్లు కలది.

తీక్ష్ణకందము. సం. వి. అ. పుం. ఉల్లికీ.

తీక్ష్ణగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. వసకీ; 2. తెల్లావకీ; 3. చిట్టేలకికీ.

తీక్ష్ణగంధము. సం. వి. అ. పుం. 1. మునగకీ; 2. రక్తతులసికీ.

తీక్ష్ణతండుల. సం వి. ఆ. స్త్రీ. పిప్పలికీ.

తీక్ష్ణతుండము. సం. వి. అ. పుం. దోమ, మశకము.

తీక్ష్ణదంష్ట్రము. సం. వి. అ. పుం. పులి, వ్యాఘ్రము. విణ. (అ. ఆ. అ.) వాఁడి యైనకోఱలు కలది.

తీక్ష్ణధారము. సం. వి. అ. పుం. కత్తి, ఖడ్గము. విణ. (అ. ఆ. అ.) వాఁడి యైనవాదర కలది.

తీక్ష్ణపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. కేతకి, మొగలికీ.

తీక్ష్ణపుష్పము. సం. వి. అ. న. 1. గాఢైనపుష్పు; 2. లవంగముకీ. విణ. (అ. ఆ. అ.) గాఢైనపుష్పులు కలది.

తీక్ష్ణము. సం. వి. అ. పుం. 1. మిరియముకీ; 2. పిప్పలికీ; 3. నల్లావకీ; 4. తెల్లదర్భకీ; 5. యవక్షారము. న. 1. వేడిమి; 2. కారము; 3. విషము; 4. ఇనుము; 5. యుద్ధము; 6. మరణము; 7.

అయుంధము; 8. సముద్ర పుటుప్పు. విణ. (అ. అ. అ.) 1. వాఁడియైనది; 2. చుఱుకైనది; 3. క్రూరము; 4. సఫలమైనది.

తీక్ష్ణాంశువు. సం. వి. ఉ. పు. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

తీగ. దే. వి. చెఱువుకట్టనోపలిపొలము, తోట్టు. "సీ. తోట్టు నాఁ దీగ నాఁ దోఁచుచుండుఁ దటాక పూర్వదేశాభిధ..." ఆం. భా. ప్ర. ౧౬౩.

తీడు. దే. స. క్రి. 1. వాఁడిచేయు, పదనుపెట్టు. "గీ...అయశోనిధికి నిడిరి,సానఁ దీడినమన్మథాస్త్ర ములవంటి, హరిణలోచన లమృతదివ్యాశన ములు." సాంబో. ౨, ఆ. ౫౩. నరస. 3, ఆ. ౩౧; 2. మెలిపెట్టు, త్రిప్పు. "స్రగ్ధర ..మిథ్యా, వాసాంతూరోద్గమం బాస్యమున మెఱయ నేత్రాం తముల్ గోరు బాఱన్, మీసంబుల్ గీడి పర్వెన్ వృగపరివృఢగంభీరనాదంబుతోడన్." వరాహ. 3, ఆ. ౨౦. వరాహ. ౬, ఆ. ౧౦౯; 3. చీల్చు. "ఉ. వాఁడిమెఱుంగుగోట జనవల్లభ నందనుఁ డొక్కఁ డెంతయున్, దీడెను గేతకీ దళము..." ఇందు. ౫, ఆ. ౧౧౭; 4. చిమ్ము, వెదచల్లు. "గీ. వెదకి పుష్పాలఁ జిదుముతుమ్మెదలఁ గదుము, ఫలరసంబులఁ బీల్చుఁ జిల్కలను బిల్చు, సిరులు నలఁదిక్కులను దీడి చెలులఁ గూడి,బాళి నుబ్బొంగి చంద్రమతీలలామ."ఉ. హరిశ్చ. 3, ఆ. ౧౫. కకు. ౫, ఆ. ౧౨౩; 4. (పుడ్తు) కొఱుకు. "ద్వి. వాఁడికోఱలఁ దీడి పడి నాదు గఱచి" ద్వి. హరిశ్చ. పూ. ౨౦౯౬.

తీడుకొను. దే. స. క్రి. (తీడు+కొను.) వాఁడిచేసి కొను, పదనుపెట్టుకొను. "గీ. రాజసంబున నల రాచరాచవాఁడు, దేఁటిఱెక్కలగఱి యమ్ముఁ దీడుకొనఁగ." శైవ. ౬, ఆ. ౬౫.

తీతువు. వై. వి. (సం. తిత్తిరిః.) తిత్తిరిపక్షి. 'సీ. తీతువ యనఁగను దిత్తిరి .."ఆం. భా. ద్వి. ౯౨. హంస. 3, ఆ. ౧౨.

తీతువు = తీతువ. "సీ. తను నేలుదొర చిత్తమున మెచ్చఁ దీతువుఁ జని పట్టి విట్టొక్కఁడారడేఁగ." స్వా. ౪, ఆ. ౫౮.

తీదీపు. దే. వి. (తీపు+తీపు.) 1. తీవ్రబాధ. (చూ. తీదీపుచేయు; 2. ఒఱపుక,రాపిడి. "మ. గగన ద్వీపవతీసుఁ ద్రచ్చుటకుఁ దర్ రైకొన్న తీదీపు

చేఁదగ వాటిల్లుపృథాశేశముస ప్రోత్కారంబు గావించుచి,ప్పాగభూవల్లిభూ.... జ్యోతులో నాఁగ..." లక్ష్మి. ౨, ఆ. ౭౧.

తీదీపుచేయు. ద్వ. స. క్రి. (తీదీపు+చేయు) బాధ పెట్టు. "ద్వి. సారంగధరుఁ జేరి సారమేయములు, చిఱిచిఱి నఱికట్టి చీకాకుపఱచు,తెఱఁగున వద లించి తీదీపుచేసి, ఘనతరకాలోరగము చిట్టిపట్టు, కొనుగారడీఁడులాగునఁ జుట్టి పట్టె." నవనాథ. ౨, ఆ. ౯౯ పు.

తీనియ. దే. వి. అరుఁగు, వితర్దిక. "మ. నెలతాతీనియ మేనుఁ జేర్చి కలకంఠీరత్న మేడ్చెం బదాబ్జల కాషాయవిలోచనాశ్రుకణముల్ గుప్పించి..." చంద్రా. ౫, ఆ. ౭౦. ఇందు. 3, ఆ. ౭౭.

తీపాడు. దే. అ. క్రి. (తీపు+ఆడు.) ఇంపగు. "ఉ. పోయిగముం దమకంబు పెల్లు తీ,పాడఁగ దీని వంటియొఱ పైనమిటారిని జూడ మొదులన్." విజ. ౨, ఆ. ౧౦౨.

తీపారు. దే. అ. క్రి. (తీపు+ఆరు.) ఇంపారు, మనోజ్ఞమగు. "చ. తెలినవ్వుల్ వెలిదమ్మి నెమ్మొగములుం దీపార .."హరి. పూ. ౭, ఆ. ౧౧౨. భార. విరా. ౨, ఆ. ౧౧౮.

తీపి. దే. వి. 1. మాధుర్యము, మనోజ్ఞత. "గీ. శిష్ట జనసూక్తు లవి పెడచెవులఁ బెట్టి,తెఱవ సురత ప్రియోక్తుల తీపిఁ గోరు." విక్ర. 3, ఆ. ౪౧; 2. ఇచ్ఛ, కోరిక. "క. ముదిమునిని రెండు చిక్కెను, బ్రదికెదుతీపియును విషయపతుప్పు హాయెన్." భాగ. ౯, స్కం. ౫౭౮. సుద. ౨, ఆ. ౫౮; 3. ఒకరుచి. (శ. ర.) విణ. తియ్యనిది, వ్యవ:—తీపిపదార్థము లెక్కువగా తినరాదు.

తీపు. దే. వి. 1. తియ్యఁదనము, ఒకరుచి. "మ. ఊరు వజ్రంబు శిరీషపుష్పములచే నూహించు భేదింపఁ దీ,పు రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణంబుం జిందు యత్నించు ని,ద్ధరణిన్ మూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్."భర్తృ. ౧, ఆ. ౬. పార్వ. ౫, ఆ. ౧౮౦; 2. మనోజ్ఞత. "వ... సముత్తుంగశృంగాటకనటన్మయూరంబులకోపులతీ పులఁ జూపుల నిలుపుచు..."వరాహ. 3, ఆ. ౬౪; 3. కోరిక,అపేక్ష. "శా...ఇచ్చోఁ బాసి దేహంబుపైఁ,దీపుం జీఁకటి యింతకంటె వర పొందీ యిట్లు మన్నింపవే." కాశీ. 3, ఆ. ౧౨౩; 4.

(తీయుం ధా.) యాతన,వేదన. "సీ. తెల్లగుడ్డులం జేలగిల్లి తీపులం పుట్టి దోషముల్ పొందుగఁ దొట్టగిల్ల." కవిక. ౫, ఆ. ౧౧౧. శుక. ౨, ఆ. ౨౦౫. విణ. 1. తియ్యనిది,రుచ్యము. "గీ. సారె కేళాసవపుఁదీపుఁటూరు పొలయు." ఆము. ౨, ఆ. ౬౧. విప్ర. ౫, ఆ. ౧౫; 2. ఇష్టము,ప్రియము. "సీ. నరులకు నధిప ప్రాణంబుకంటెను రూపింప నర్థంబు తీపు వినవె." భార. అర. ౬, ఆ. ౧౧౧. భార. భీష్మ. ౧, ఆ. ౧౫.

తీపుఁద్రాడు. దే. వి. (తీపు+త్రాడు) వేట కుపయోగించుసాధనవిశేషము. "వ. ఉరులు నురిగోలలు బోనులుఁ జిక్కాంబులు జిగురుఁగండెలుఁ దీపుఁ ద్రాళ్లు నొడిత్రాళ్లుఁ దలముళ్లును గొని..." కాశీ. 3, ఆ. ౪౬.

తీపులాఁడి. దే. విణ. (తీపులు+ఆఁడి) మాధుర్యము గలది. "సీ. మోవిపానక మిచ్చి మోహాదధిక తృష్ణఁ దీర్పు మిప్పుడు మోవితీపులాఁడి." బిల్హ. ౭, ఆ. ౧౩౭.

తీపులాఁడు. దే. విణ. (తీపులు+ఆఁడు) మాధుర్యము కలవాఁడు. "సీ. తేటికదుపులకును దేశికోఁ బుబ్బాడి, మోవి మరప తీర్పు తీపులాఁడు." ద్వా. 3, ఆ. ౧౨౬.

తీపులుగొను. దే. అ. క్రి. (తీపులు+కొను) వేడుక పడు. "వ. ఎప్పు డాజగదేకమాత సీతం దొడ గాంచెదనో యనుచుం జాపులు తీపులుగొనం జని..." భా. రా. సుం. ౧౩౧.

తీయ. దే. విణ. 1. తియ్యనిరుచి గలది. (గీనికిఁ గర్త ధారయమందు నిగాగమము వికల్పము.) "గీ. తీయవిలుఁ జేతుగమి దాల్చి తినియెనేని,...బట్టబయ లగు గర్వరేఖ, విషమసాయక నిచ్చేయుం విడిదలకును." వి. శకుం. 3, ఆ. ౧౯౦. చంద్రా. 3, ఆ. ౫౯; 2. మనోజ్ఞము. "ద్వి. చిలుక నవ్వులు తీయచెయ్యలు గల్గు,తెలువలు వలరాజు టీమంబు లనఁగ." రం. రా. ఉ. ౧౧౦. పు.

తీయన. దే. విణ. 1. తియ్యనిది, మధురము. "క. కమలాక్షి ప్రేక్షితోదుతసురులందురే తెలుసు తీయన గదా యనుచున్." రుక్మా. ౫, ఆ. ౧౨౨. ఆము. ౫, ఆ. ౧౦౯; 2. ప్రియము. "చ... బ్రతుకింత తీయనా..." భా. రా. యు. ౭౮౪.

తీయము. దే. వి. 1. ప్రియత్వము. "క. పీయము వారికి నిట్లు ద,పీయముగా నుండి వచ్చి విపుల శ్రమముల్, దీయ ముదం బొదవించి కడుఁ,దీయము కనుపింపఁగా యుధిష్ఠిరుఁ డనియెన్." విజ. 3, ఆ ౧౮౧; 2. మనోజ్ఞత. "ద్వి. తీయమై పద్మమేలిమి చూపువోలెఁ, దీయమై బైరమ్మ దీయమో నాఁగ." ద్వి. పరమ. ౧, ఆ. ౧౧. పు.; 3. ఆసక్తి, శ్రద్ధ. "క. ఈయంబరీషచరితము, దీయంబున విన్నఁ జదువ నీసంపన్నుం,డై యుండు..." భాగ. ౯, స్కం. ౧౫౩; 4. సాంత్వనవాక్యము, బుజ్జగింపుమాట. "సీ. సాంత్వన సంజ్ఞయై చనుఁ దీయ మనఁగను .." అం. భా. ప్ర. ౧౧౭.

తీయు. దే. అ. క్రి. 1. తగ్గు క్షీణించు. "మ... శశిబింబస్ఫూర్తి తగ్గె న్నవోత్పలకాంతుల్ రహిఁ దీసె దాఁగె విరు లంత స్వర్వారాంతమ్ములన్." విప్ర. 3, ఆ. ౪౯. సా. మచ. ౧, ఆ. ౩౦; 2. పోవు. "క. పీయము వారికి నిట్లు ద,పీయముగా నుండి వచ్చి విపులశ్రమముల్,దీయ ముదం బొద వించి కడుఁ,దీయము కనుపింపఁగా యుధిష్ఠిరుఁ డనియెన్." విజ. 3, ఆ. ౧౮౦. స. క్రి. 1. ఈడ్చు. "సీ. కదిసితో మునిగాలు గఱచి వెంబడిఁ దీయుఁ దీసి తోడకు లేవఁ దెరువు గట్టు." చంద్రా. ౨, ఆ. ౯౧; 2. కొను, పుచ్చుకొను. "చ. విటులఁ గలంచి తీయఁ దగువిత్తము లంత్తమ వారకాంతకున్." విప్ర. ౪, ఆ. ౨౩; 3. లాగు, ఆకర్షించు. "శా. చండాశివిభఘోరసాయకము చంచజ్జ్యాసమేతంబుగా, నిండారం దగఁ దీసి లోకములు ఘూర్ణిల్లంగ రామక్షితీ,శుం డాస్ఫోటన సేసె..." భా. రా. కిష్కిం. ౨౨౮. సా. ౨, ఆ. ౪౨; 4. తొలఁగించు, లాగివైచు. "గీ. చెలువపయ్యెదఁ బుజకంబుచేత నదిమి,రవికె పడ లింపఁ దిలకించి రమణుఁ డెంత, పిగ్గరిపె యందుఁ దైవటుఁ దీసినను వేగఁ,గరయుగంబునఁ జనుదోయిఁ గప్పుకొనుచు." దశా. 3, ఆ. ౭౬. పారిజా. ౪, ఆ. ౧౧౮; 5. డించు. "చ.. మరుండు కుంటవిల్, బలుఁబడి కుప్పుఁదీసె..." నీలా. 3, ఆ. ౪౪; 6. తెచ్చు. "చ. కాటుకలు దీసి యిచ్చుకము చేర్చి ప్రసంగము దీసి యప్పటప్పటికి నులించి..." విప్ర. ౪, ఆ. ౨౩. చం. రా. ౬, ఆ. ౨౭;

7. పట్టుకొను, వశపఱచుకొను. "ఉ...ఎంతయు శక్యము గానిదుర్గ మా,భూవరమాళి గాంచి యొక ర్పూటను దీసెద నంచు న్యగ్రుఁడై." కృష్ణ. 3, ఆ. ౯౯; 8. వేఱుచేయు, విడిగా నుంచు. "చ... పచనంబు చేసి యే ర్పడ మఱి యంతలో వలిథి భాగము తీసి లతాంగి భర్తకుం, గుడువఁగఁ బెట్టె..." కుచేల. ౧, ఆ. 3౪; 9. ఆలాపించు, కొన సాగించు. "గీ. రాగములం దీసి పాడుచు రమణి వచ్చె." భా. రా. బాల. ౫౫; 10. (శ్రేష్ఠసంధులను) విఱుచు. "చ. కొటికలు దీసి యుచ్చకము నేర్చి..." విప్ర. ౪, ఆ. ౨3; 11. తెఱచు. "క...చని దిగ్గనఁ దల్పు దీసి సంభ్రమ మొదవన్." విప్ర. ౪, ఆ. ౫3; 12. క్రవ్వు. ఉదా:- వాఁ డాగోయి తీసినాఁడు.

తీరము. సం. వి. అ. న. దరి,గట్టు. పుం. తగరము.

తీరితము. సం. వి. అ. న. తీర్పు, వ్యవహారాదులకు పరిష్కారము. విణ. (అ. చ. అ.) పరిష్కృతము, తీర్పఁబడినది. (వ్యాక్యేము. మొ.)

తీరు. దే. అ. క్రి. 1. కొఱవేఱు, సిద్ధించు. "ఆ. నేగ పడుట మేలె వినుము కార్యము దీరుఁ, దీరకుండు..." భార. ఉద్యో. 3, ఆ. ౨౨౦. స్వా. ౪, ఆ. ౮౦; 2. తగు. "క. తగ వెఱుఁగ లేక యిటు వలెఁ, దెగువరివై పలుక నీకె తీరెనొ..." చంద్ర. ౧, ఆ ౧౪౭; 3. శక్తికమగు. "ఉ. తీపినత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించుచాడ్పు నన్, దీరనితత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించువాఁగొఁ బెం,పార విగించి..." చంద్రా. ౨, ఆ. ౧3. ఉ. హరి. ౪, ఆ. ౨౭; 4. పరిష్కృతమగు, కుదురు. "గీ. జ్ఞాతులకు మాకు నేకార్థసంగతులకుఁ, బాలు తీరనియర్థంబు పంచి యిమ్ము." భాగ. ౮, స్కం. 3౦౫; 5. పుసెక్కు, మెఱుఁగెక్కు. "ఉ...అవారితసత్కవికల్పనావిభూ,షావహపూర్వవృత్తములు సొపలఁ దీరినకాతిరత్నముల్."వసు. ౧, ఆ. ౧౯. సా. ౨, ఆ. ౧౧3; 6. శక్యమగు. "శా. నాకేశ శ్రియనందనుఁ జేనికి మానప్రాణముల్ గావఁగా, నీకుం దీర్చును .." నిర్వ. ౮, ఆ. ౮౫. వి. 1. సౌందర్యము, అందము. 'చ. క్రొమ్ముగులంవన్నియుఁ గేరును గొప్పుతీరు..."నీలా. ౨, ఆ. ౧౯. హరి. పూ. ౯, ఆ. ౭; 2. విధము. "క. వారలజగడపుమాటల, తీ రిది నే

రేమి లేదు దేవి యనఁగ..." కువల. ౪, ఆ. ౧౮౦. వాల్మీ. ౧, ఆ ౧3; 3. హద్దు, అవధి. "గీ. అయుదేనుఁగు గున్న యొయ్యారములకుఁ, దీరు .." నీలా. ౨, ఆ. ౨౮. విణ. చక్కనిది, సుందరము. "వ...గీ రయునవరత్నఘటితకవాట దేహళివితర్దిక...కుంబులు..." ఉ. రా. ౧, ఆ. ౧3౭. హంస. ౪, ఆ. ౧౫3.

తీరుకు. దే. వి. నాట్యగతిభేదము. "గీ. కోపు లన సారు లనఁ దీరుకు లన వెలకుం, నాట్యగతిభేదములపేర్లు .." అం. భా. ప్ర. ౧3౦.

తీరుచు. దే. స. క్రి. (తీరుధా. ప్రే.) 1. సవరించు, సరిదిద్దు. "మ. అలకల్ దీరిచి ముద్దుపెట్టుకొని పర్యాటంబునన్ జంటపై, జెలుగుంబయ్యెద కొంగు జార్చి .." దశా. 3, ఆ. ౭౦. విజ. ౧, ఆ. ౫౫; 2. కావించు, చేయు. "చ...చెంతఁ బోసంగెడిగంగలో పసుం,చితమతి నిత్యకృత్యము లశేషము తీరిచి .." దశా. ౧, ఆ. ౯౨. జై. ౧, ఆ. ౧3౮.

తీరుపు. దే. వి. (తీరుధా.) 1. అందము. "వ...కను రెప్పలకప్పు దప్పు నుండి బవరికొరితీపు చూపు చూపు తీరుపుల..." ప్రబంధ. ౮౭; 2. నృత్తగీతవాద్యములు సమముగా ముగించుట. "సీ. అభినయంబులకొపు లరుదైనతీరుపుల్ వెలయఁగాఁ బద చాళివిధ మొకర్తు." ఉ. రా. ౬, ఆ. ౧3౯; 3. పరిష్కారము. (చూ. తీర్పు.)

తీరుమానము. దే. వి. పరిహారము. "గీ. అన్ని యిటు లాడఁ గాంచి మురాసురారి,రమణి దాసరితప్పు దండమునఁ దీరుఁ,దీరుమాన మటరామని తెఱవ పాదపద్మముల వ్రాలె వళి తమ్మి వ్రాలినటుల." రాధికా. ౪, ఆ. ౯౧.

తీరువ. దే. వి. విహితకృత్యము. "సీ. ఈరేడుజగములవారలఁ బుట్టించుతీరువ యేవేల్పు పారుపత్తెము.. " చంద్రి. ౨, ఆ. 3౪; 2. కాపులు పంటపొలములకు నీరు పాఱించుకొన్నందుకై ప్రభుత్వమున కొసఁగుధనము, లేక ధాన్యము మొ. (శ. ర. వా.)

తీరువడు. ద్వ, అ. క్రి. తీరు+పడు.) అందమగు. "వ...హారముక్తాకారకంబులు నఖరోరకంబులం గీటి తీరువడం జేయుచు..."స్వా. ౨, ఆ. ౫౧. రం. రా. బాల, ౭౨ వ.

తీర్చు. దే. స. క్రి. (తీరుధా. ప్రే.) 1. నెఱవేర్చు, చేయు. "సీ. దృఢవేది యాతండు దీర్చు నెంతటి పనియైనఁ గైకొని..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౨౧. కాశీ. ౫, ఆ. ౨౧౭; 2. సవరించు, సరిదిద్దు. "సీ. జడలుఁగట్టియు నింత చక్కనైనది వేణి దీర్చిన నెఱి యెంతద్రేణి యగునొ." శు. సం. ౭, ఆ. ౭. కవిక. టీ. ౨౧; 3. పరిష్కరించు, న్యాయమును నిర్ణయించు. "ఆ. ఆలిమగని పోరు సర్థవిభాగంబు, కాద మశెడునట్టివారు పుట్టు, జనులు కోరి వచ్చి సభఁ జెప్పుదురు దీనిఁ, దెలిసి నడిగి విభుఁడు దీర్పవలయు." విజ్ఞా. వ్యవ. ౧౭. భార. శాం. ౨ ఆ ౩౭౪; 4. కనుఁగొను. "క. ఇచ్చెద నని సురశైలముఁ, దెచ్చియు శోధించి విలువఁ దీర్పఁగ నడుగన్, బుచ్చుకొనఁ దిరుగ నమ్మఁగ, నచ్చటఁ గలవైశ్యులందు సభ మఁడె చాలున్." విరం. ౧, ఆ. ౪౮; 5. సమాధానపఱుచు. "క. వారివాక్యము వింటిరె యిది యిరుదెఱఁగులజనములకును హితమును ధర్మో, త్తరమును నై యున్నది యీ, వెరవున శక్యంబు మనకు వీరలఁ దీర్పన్." భార. ఉద్యో. ౧, ఆ. ౧౮. ఆము. ౩, ఆ. ౬; 6. సిద్ధింపఁజేయు. "ఆ. వేల్పు ప్రాణియందు వేడుకపడుతూర్మి, సతులకోర్కెఁ దీర్పఁ జాలి యపుడు." పారి. ౫, ఆ. ౨౩; 7. (అశ్వాదులను) శిక్షించి వశపఱచుకొను. "సీ. పెనఁగుతురకలములఁదిరుదుకనంబులఁ జలము డింపక తీర్పఁ జాలుటయును." భార. విరా. ౧,ఆ ౯౫; 8. (తిలకాదులను) చక్కఁగా నుంచు. "సీ. నిటలభాగమునందు నిడుపోఁగ తీరుగా మల్లెపూమొగ్గనామంబు తీర్చి." వైజ. ౨, ఆ. ౪౭. తీఱు. ధా. ప్రే) 1. ఏర్పాటుచేయు; నిర్మించు. "చ ..పెద్దగోల్యదీ,ర్చె నలువ యంచు నెంచి నడురేయి నిశాతమఁ జొచ్చి యచ్చటన్." దశా. ౧, ఆ. ౨౬౩. హర. ౩, ఆ. ౬౬, 2. ఒగ్గు, పన్ను. "సీ. యౌవనోద్భృగరాజిఁ దవిలింపఁ దీర్చిన మదనవాగుర లిందువదనకురులు." శైవ. ౯, ఆ. ౧౫, 3. అమర్చు. "గీ. దేవపూజోపకరణముల్ దీర్చుటకును." దశా. ౩, ఆ. ౩౪. శు. సం ౩ ఆ. ౨౪౮; 4. (ఋణము) పరిహరించుకొను. "సీ. అనుదినంబును నంతకంతకుఁ బెరిఁగెడియధికవిమున్నసయప్పు దీర్ప." భార. విరా. ౪, ఆ. ౨౦౫. హర. ౨, ఆ. ౧౧౯; 5. తొలఁగించు, పాపు. "మ. సకలస్తుత్యతపఃప్రభావనిధి యీసంబేహముం దీర్పవే." ఉ. రా. ౩, ఆ.౭౪. శైవ. ౭, ఆ. ౧౫౦; 6. కడపు. "క... తద్వనితయును మదనవేదన, దినశేషము దీర్చ యుఁగముఁ దీర్చినభంగిన్." శుక. ౨, ఆ. ౩౭౭; 7. నిరుపయోగ మొనర్చు. "క. సర్వముఖశరము గల దశ్వదర్పంబునఁ గ్రీడిఁ దొదరఁ దలఁచుచు పారిపెం,పేర్పడఁగ నదియు శాదటు, తీర్చ వలయుం వాని నెల్ల దీర్చుతరునకై." భార.ఉద్యో. ౨, ఆ ౨౭౩. కుచేల. ౧, ఆ. ౬౫; 8. చంపు. 'క. నిన్న యఱ నచ్చిపోయితి, పున్నయఱయుం జేడు దీర్చి యఁడిపెద పీగ,ర్వెన్నతి..." భార. ఉద్యో. ౪, ఆ ౩౪౧. రామా. ౮, ఆ. ౧౬౫.

తీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁబడినది; 2. స్నానముచేసినది.

తీర్తిపూడలు. దే. వి. బ. కుండలపై చేయునలంకారవిశేషములు. "గీ. తీర్తిపూడలు కలశులు త్రేట గట్లు... మొసలు గాఁగఁ, బనులు నిర్మించు గుండలపై నతండు." హంస. ౫, ఆ. ౧౩.

తీర్థకరుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధుఁడు; 2. ముని; 3. విష్ణువు. విశే. (అ. ఈ. అ.) తీర్థమును నిర్మించినవాఁడు.

తీర్థమాట. మి. వి. (తీర్థమాడుధా.) స్నానము. "చ. తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్థమాటకై, యరుగుచు . కాశీ. ౫, ఆ. ౪౯.

తీర్థమాడు. మి. అ. క్రి. (తీర్థము+ఆడు.) స్నానము చేయు. "చ. కులపుల వేగ రేపకడ పంకజదీర్ఘికఁ దీర్థమాడి సెచ్చెలులును దాను నిందుముఖి శేషవిభూషణుఁ బూజసేయు నిచ్చలు..." కాశీ.౫, ఆ. ౧౪౪. శాన్నవి. ౧, ఆ. ౧౮.

తీర్థమార్చు. మి.స. క్రి. (తీర్థమాడుధా ప్రే.) స్నానమాడించు, అభిషేకించు. "ఉ...చంద్రశేఖరుఁ దీర్థమార్చి వి,ప్రంభమునం గరాంబుజమాసంగత మంగళకాశకుంభకుం,ఖోంభితగంధసారరసయోగసుగంధనవాంబుధారలన్." కాశీ. ౬, ఆ. ౨౭౦.

తీర్థము. సం. వి. అ. పుం. న. 1. మహర్షులు స్నానాదులు చేసిననదీకటాకాదిపుణ్యోదకము; ఉదకము; 2. రేవు, ఘట్టము; 3. నూతియొద్ద నుండుతొట్టి;

4. పుణ్యక్షేత్రము; 5. యజ్ఞము; 6. శాస్త్రము; 7. ఉపాయము, మార్గము; 8. యోని; 9. స్త్రీరజస్సు; 10. అగ్ని; 11. ఉపాధ్యాయుఁడు; 12 మంత్రి; 13. పాత్రము, అర్హుఁడు.

తీర్థములాడు. వి. అ. క్రి. (తీర్థములు+ఆడు.) స్నానము చేయు. "శా... దుఃఖాబ్ధిఁ గోదావరీ వారిం దీర్థములాడి కాంచిరి జగద్వంద్యుం బురారాతి దక్షారామాధిపు భీమనాయకుఁ ద్రిలోకాప్లోపసంధాయకున్." భీమ ౪, ఆ. ౧౫౮.

తీర్థయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. తీర్థసేవకై పోవుట.

తీర్థరాజము. సం. వి. అ. పు. 1. తీర్థశ్రేష్ఠము; 2. ప్రయాగపట్టణము.

తీర్థవాసి. సం. విణ. (న్. నీ. న్.) 1. పుణ్యక్షేత్రమందు నివసించువాఁడు; తీర్థసేవ చేయువాఁడు. (శ. ర.)

తీర్థవిధి. సం. వి. ఇ. పు. తీర్థమందు చేయఁదగిన శ్రాద్ధకృత్యము.

తీర్థ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తీర్థమునందుఁ [పుట్టినది.

తీర్పరి. దే. వి. (తీర్పు+అరి.) న్యాయాధిపతి. "సీ. కోరాయములు వచ్చుకోలఁది విచారించి పదియూళ్ల కొకరిఁ దీర్పరిగఁ జేసె." పి. శకుం. ౪, ఆ. ౧౩౬. పండిత. దీక్షా. ౪౨, పు. విణ. 1. తగవరి, ధర్మజ్ఞుఁడు. "సీ... తీర్పరి తగవరన ధర్మజ్ఞుఁ డలరు." ఆం. భా. ద్వి. ౧౮౩; 2. చారుఁడు, వేగులవాఁడు. (శ. ర.); 3. కార్యకర్త "ఉ. పుంచిరతీర్పరుల్ సచివుపాలికి జేరి కృతప్రణాములై." జై. ౮, ఆ. ౫౬. ఆం. భా. తృ. ౪; 4. మనోహరము. "క. జగదంపుఁ గూటివేలుపు, తెగజడ దారిగమికాని తీర్పరిపలుకుం, బొగడిత సుబ్బెడిసామికి .." అచ్చ. భా. ౧, ఆ. ౪.

తీర్పు. దే. వి. (తీరు ధా.) 1. (సవరించుట, చక్కఁబెట్టుట.) "చ... బహుదేశవాసులం,ద ఱొకటి చేయుచో వెరవు దప్పక చెల్లుట యెట్లు గల్గెని, త్తైఱఁ గొకచాలువానిబలుఁ దీర్పునఁ గాక పొసంగఁ జేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ. ౧౪౩; 2. (వివాదము పరిష్కరించుట.) ఆ వ్యాజ్యములో తీర్పు చెప్పినారు.

తీర్వ. దే. వి. పంటపొలములకు నీరు పాఱించుకొన్నందుకై ప్రభుత్వమున కొసఁగు ధనము లేక ధాన్య ముసెయి. "సీ...సర్వమాన్యములున్,గడఁ ద్రోచి న్యాయంబు కొలు దప్పకుఁ ఊరువాగతీర్వలవల్ల వచ్చుధాన్యములు..." ఉ. హరిశ్చ. ౧, ఆ. ౬౩.

తీర్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) దాఁటఁబడుచున్నది.

తీఱమి. దే. వి. (తీఱు ధా.) 1. అక్కఱ,అవసరము. "క. వేఱొక తెఱఁగున వారలకు, మారాదక యునికి లెస్స మనకేం దుగదం,దీఱమి గలచోటులఁ దా,మీఱి కడఁగి వచ్చి పుప్పు మెయికొన వలయున్." భార. విరా. ౧, ఆ. ౧౨౯; 2. ఇబ్బంది, చిక్కుపరిస్థితి. "ఆ. ఎట్టిపుట్టములను గట్టి యాపదలను, గట్టితీఱములను ముట్టఁబడిన,వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను,కొనరఁ జూపఁ గనినజనుల కెందు." భార. అను. ౪, ఆ. ౮౯.

తీఱిక. దే. వి. (తీఱు ధా.) తీఱుబడి,అవకాశము. (శ. ర. వా.)

తీఱిపోవు. దే. అ. క్రి. (తీఱు+పోవు స్వార్థమున.) చచ్చు,గతించు. "గీ. వనము కావలి రాక్షసవర్గ మఁగె,దీర్ఘజీవాల్వ్యండు కేటితోఁ దీఱిపోయె." మొ. రా. సుం ౧౫౯.

తీఱు దే. అ. క్రి. 1. చచ్చు,మరణించు. "సీ. సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి నల్పకాలంబున నతఁడు తీఱె." భార. ఉద్యో. ౪, ఆ. ౨౬౩. కాశీ. 3, ఆ. ౧౨౪; 2. పాయు,తొలఁగు. "క ..శ్రమం,బాఱఁగ నెడఁ బరితాపము, దీఱఁగఁ బైపైచె నన్న దీపవనంబుల్." భార. ఆది. ౪, ఆ. ౧౯. స్వా. 3, ఆ. ౨౩; 3. తయారగు, నిర్మింపఁబడు. "ఉ...ఒక్కచెట్టివాఁ,డుక్కునఁ దీఱినట్లు కఠినోగ్రశరీరముతోడ మీఱి..." శుక. ౨, ఆ. ౩౫౬. ఉ. రా. ౧, ఆ. ౩౧౬; 4. ఏర్పడు,బయల్పడు. 'క. తేజాం గొలఁకులు... తీఱెం బులినములు ..' కు. సం. ౬, ఆ. ౧౧౪; 5. సాధ్యమగు. "క. కృతులు రచియింప సుకవుల, కృతు లొప్పుఁ గొనంగ నొరునికిన్ దీఱునె..." దశ. ౧, ఆ ౮౦. వేం. పంచ. 3, ఆ. ౨౦౮; 6. వీలగు, అవకాశము కలుగు. "గీ ..ఇయ్యెడఁ దడవు గాఁగ,నిలువఁ దీఱదు పోయి రావలయు మాకు." భార. ఉద్యో. ౧, ఆ ౪౨. కాశీ. ౪, ఆ. ౧౦౫; 7. ముగియు,అంతమగు. "ఉ. మీఱిన యనేకయుద్ధముల మీరు జయించుట లెల్ల నింత

తోఁ,దీఱె ననం గనుంగొనుఁడు .." ఉ. హరి. ౭, ఆ. ౨౨౮. భాగ. ౧౦, స్కం. ఉ. ౧౧౭౯; 8. పరిపోవు. "సీ. ప్రాగ్జ్యోతిషలకె తీఱు బహు జనాన్నము దీఱు నారుల కొదవుఁ బునః ప్రయత్న, గీ. ము..." ఆము. ౪, ఆ. ౧౨౬, 9. పరిహృత మగు. "గీ. దేహనాశంబుతోడన తీఱు నెల్లఁబుణ్య ములును..." భార. ఆశ్వ. ౭, ఆ. ౯౧. నీలా. ౩, ఆ. ౩౪, 10. పాడగు. "గీ. తీఱెఁ గతిపయ దినముల దేశ మెల్లఁ మళ్లె పట్టినచేని క్రమంబు గాఁగ." స్వా. ౭, ఆ. ౨౬; 11. నశించు. "గీ జ్ఞానమునఁ బూర్వకర్మసంచయము లెల్లఁ దీఱు. .." దశా. ౧, అ ౧౨౯. వేమన. ౧, ప్ర. ౪౯; 12. ఇది క్రియాపదముల కనుప్రయుక్తమై అవశ్యార్థమును గల్పించును. ఉదా.—వాఁ డాపని చేసితీఱును. (తప్పక చేయును అని భావము) వి. సంధి,పిడఁబడిక. "చ ..అది సక్కన రాజ్యము పాలు లేక తీఱున కొడఁబాటు గల్గిన నెఱుంగమి పెట్టెరె..." భార. ఉద్యో. ౩, ఆ. ౧౦౨. భార. ఉద్యో. ౩, ఆ. ౧౧౬.

తీఱుగడ. ద్వ.వి (తీఱు+కడ) 1. ముగింపు,అవసానము "గీ. అనఘ నీదేహ మంటినయట్టిపుణ్య,వశముపై పాఁకు సురలోకవాస మహిమ,దివ్య దేహంబు శాపంబుతీఱుగడయుఁ,గలిగెఁ బ్రత్యుపకృతి నీకు నెలమిఁ జేతు." చిత్రభా. ౭, ఆ. ౪౦; 2. తీఱిక, తెఱపి. (శ. ర.)

తీఱుచు. దే. స. క్రి. (తీఱు ధా. ప్రే.) పరిహరించు, ప్రతీకారముచే ఉపశమింపఁజేయు. "క...కార్తవీర్యభుభులు తండ్రిని జంపినపగ తీఱుచుకొనవలెనని .." దశా. ౬, ఆ. ౧౨౮.

తీఱుదల దే. వి. (తీఱు+తల) ముగియుట,అంతము "గీ భీమసేనుండు నేఁడు సంగ్రామమునకుఁ,దీఱుదల యగుఁగా కని .." భార. భీష్మ. ౨, ఆ. ౨౦౩. నిర్వ. ౧౦, ఆ. ౮౪.

తీఱుపడు. ద్వ. అ. క్రి. (తీఱు+పడు) తెఱపియగు. (చూ. తీఱుపాటు).

తీఱుపాటు. దే. వి. (తీఱుపడు ధా.) తీఱిక,అవకాశము. (శ. ర.) [(శ. ర. వా.)

తీఱుబడి. దే. వి. (తీఱు+బడి) తీఱిక,అవకాశము.

తీలగు. దే. అ. క్రి. (తీలు+అగు) అడఁగు,నిస్సత్తువఁ దగు. "ఉ తీలగుకంతుపెంపడిన తెమ్మెరలున్ రవిదీప్తి కల్కి హా,తాకముఁ బట్టుచుండు..." ఆము. ౨, ఆ ౬౩.

తీలు. దే. వి. అడఁగుట. (చూ. తీలుపడు.) విణ. అల్పము. "గీ. ఒకతె చెక్కులపై మకరికల వ్రాయు నొక్కతెకు మెల్ల జడ తీలు చిక్కఁదీయు,నొక్కతె యెప్పుడును గల్గి యుండుఁ గాన్య,భరము పేదనఁ గూడ దాబ్రాహ్మణునకు." నిరం. ౨, ఆ. ౨౩.

తీలుపడు. ద్వ.అ. క్రి. (తీలు+పడు)1. తగ్గు,క్షీణించు. "గీ. ఇట్టు లత్యుగ్ర మగు గ్రీష్మ మేసరేఁగి,కాల వశమునఁ దపుదానఁ దీలుపడియె." పాండు. ౪, ఆ ౧౮; 2. నశించు. "గీ. దేశకాలాంతరంబులఁ దీలుపడని,బుద్ధి సౌందర్యమొక్కఁ డద్భుతము గాక,గాత్రసౌందర్య మేరికిఁ గలుగ దనిన,దాని విని విన్నపై యుండె దమనకుండు." వేం. పంచ. ౧, ఆ. ౬౮౬; 3. దుర్బలమగు,నిస్సత్త్వమగు. "ఉ ..మేఁ,దీవ నటించు నెన్నడుము దీలుపడం గటి గుల్క .." వేం. పంచ. ౧, ఆ. ౭౮౧.

తీలువడు. ద్వ. అ. క్రి. (తీలు+పడు) అడఁగు, మఱుఁగుపడియుండు. "సీ. భూమి క్రిందుగఁ బాతెఁ బొరిఁ బొరిఁ గురువేరు తిమిరంబు గుహలలోఁ దీలువడియె." ఇందు. ౨, ఆ. ౧౬౭.

తీవ. వై. వి. (సం. దీర్ఘా.) లత,వల్లి. "రగడ. ఎవరయు ప్రాణపదంబు నాఁ దలఁ తీవ తీవ తలంగ పెట్టెను." పారి. ౪, ఆ. ౧౬. రుక్మి. ౨,ఆ. ౪౩.

తీవనవ్వు. ద్వ. వి. (తీవ+నవ్వు), తీఁగవలె మృదువుగ నుండునవ్వు,లేనవ్వు. "సీ. తియ్యతేనియ లొల్కు తీవనవ్వులతోడి తొక్కుపల్కులు విని చొక్కలేరు." కవిక. ౧, ఆ. ౩౮.

తీవఁబోఁడి. ద్వ. వి. (తీవ+పోఁడి) మనోజ్ఞాకారయైనస్త్రీ; స్త్రీ. "గీ ..వాట్లు,గావు మని వేఁడుకొనువాఁడఁ దీవఁబోఁడి." అచ్చ. యు. ౪౬౪. పద్మ. ౭, ఆ. ౮౩.

తీవయిల్లు ద్వ. వి. (తీవ+ఇల్లు) పొదరిల్లు,లతాగృహము. "క. వగ మట్టుకొనినఁ జిత్తము,వెగడొందఁగ మేను గలయ వెమ్మఁగ ధృతిపోఁ,తగల నొకతీవయింటికిఁ, దగియుండెదు చంద్రకాంతతల్పము నీరన్." భార. విరా. ౨, ఆ. ౩౦౮.

తీవంచె. ద్వ. స. (తిగ+వంచె.) సాలుగు. "సీ. ఏవేల్పు గుదకాల్పు తీవంచ మోములతులువలబలు

క్రొవ్వు దొలఁగ మాఁడె." నీలా. ౧, ఆ. ౧౨. నిరం. 3, ఆ. ౨౦.

తీవరకత్తె. వై. వి. (తీవరము+కత్తె.) 1. వేగిరపడు నది,త్వరపడునది. "చ... తా,నలఘుజవంబుతోఁ దఱుచు లార్చుచు మేదకుఁ జేరి చూచెఁ గో,నల విభునందనుం జెలిమిచానలం దీవరకత్తె లానవన్." ఇందు ౬, ఆ. ౬; 2. ధృష్టురాలు,తీవ్రస్వభావురాలు. "ఉ...రా వది యేమి రా విజయరామ యటం చిలు దూఱి బల్మిమైఁ,దీవరకత్తెవై వెనఁగి తీసుకవచ్చితి వా తలోదరీ." (అడిదము సూరకవి చాటువు.)

తీవరపడు. వై. అ. క్రి. (తీవరము+పడు) త్వరపడు, వేగిరపడు. (శ. ర.)

తీవరపాటు. వై. వి. (తీవరపడు ధా.) తొందరపడుట. (శ. ర.)

తీవరపెట్టు. ద్వి. స. క్రి. (తీవరము+పెట్టు) తొందరపెట్టు వేగిరించు. "క. వరుసొప్పుట నంతఁ గన్యా, వరణం బొసరించి మంచివైభవ మెసఁగన్, తెర గట్టించిరి వారి మది,తెలఁగట్టిరో మఱియును మరుఁడు తీవరపెట్టన్." ముకుంద. 3,ఆ. 3౮౧.

తీవరము. వై. వి. (సం. తీవ్రమ్. క. తీవరవు. త. తీవరమ్,తివిరమ్.) 1. తొందర,త్వర. "గీ— ఇంటికిని బోవ మెల్లఁగ హెచ్చరింపు,గాని పోవచ్చు మీఁదటికథలు వినుఁడు,దీవరం బేమి యని కేలు దిగిచి మగుడ." పార్వ. ౫, ఆ. ౮. అం. ప్ర. ౬౫; 2. చిరాకు కోపము. "గీ. సంధ్య యున్న శిరోవ్యథ సంభవించు,భస్మధారణ మున్నఁ దీవరము వొడము." నిరం. ౨, ఆ. ౨౫.

తీవరించు. వై. అ. క్రి. చిరాకుపడు,కోపగించు. "సీ. తమకాన భర్తుఁడు కందర్పకేళిఁ బెనంగ కొంతసేపు తీవరింప సాగు." శకాం. ౫, ఆ. ౧3. స. క్రి. తొందరపెట్టు,వేగిరించు. "వ...తను వరించి మరులునం దీవరించినయక్కన్యకు గర్భాధానంబుం బ్రసాదించిన." ఉ. రా. ౨, ఆ. ౧3౬. శకాం. ౪, ఆ. ౨౪.

తీవరుఁడు. సం. వి. అ. పుం. 1. సముద్రుఁడు; 2. చేఁపలఁ బట్టువాఁడు,కైవర్తుఁడు; 3. బోయవాఁడు,వ్యాధుఁడు.

తీవసరులు. ద్వి. వి. బ. ధాన్యవిశేషము. "గీ. తెల్ల నల్లచెన్నంగులఁ దీవసరులు." హంసు.౪,ఆ.౧౨౮.

తీవియ. వై. వి. (సం. దీర్ఘా. 1. లత,వల్లి. "సీ కార్చిచ్చు సోఁకినఁ గంది మ్లానత్వంబుఁ బ్రాపించు తీవియరూపు నొంది,యున్నట్టివనిత..." మార్క. ౧, ఆ. ౨౪౬. పార్వ. ౪, ఆ. ౭౭.

తీవిరము. దే వి. తీఁట,కండూతి. (శ. ర.)

తీవె = తీవియ. "గీ. ముదురుఁదీవెల బిగువుగా మోపుగట్టి." హర. ౧, ఆ. ౨౦.

తీవ్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. తిఁగగఱిక,మహాదూర్వ శీ; 2. కటుకరోహిణి శీ, 3. తెల్లావ శీ, 4. తులసి శీ; 5. నదీభేదము.

తీవ్రగంధ. సం. వి. ఆ. స్త్రీ. ఓమము శీ.

తీవ్రము. సం. వి. అ. పుం. 1. వాఁడిమి; 2. వేఁడిమి; 3. కారము; 4. ఇనుము; 5. తగరము; 6. అతిశయము, 7. తీరము, ఒడ్డు. విణ. (అ. ఆ. అ). 1. వాఁడిమి గలది, తీక్ష్ణము; 2. మిక్కిలివేఁడిమి గలది, అత్యుష్ణము; 3. అధికము; 4. కారము గలది, కటువు; 5. భయంకరము, ఉగ్రము.

తీసివేఁత. దే. వి. (తీసివేయుంధా.); 1. తొలఁగించుట; 2. వ్యవకలనము.

తీసివేయు. దే. స. క్రి (తీసివేయు.) 1. ఖండించు, నఱుకు. ఉదా—నీవు సాతల తీసివేయుదువా?; 2. తొలఁగించు. ఉదా—వానిని ఉద్యోగము నుండి తీసివేసినారు; 3. తగ్గించు, ఒకసంఖ్యనుండి మఱొకసంఖ్య వ్యవకలనముచేయు. (వ్యవ.) పదింటిలో ఆఱు తీసివేసిన నాలుగు మిగులును.

## తు

తుంగ. ఉభ. దే. వి. (క. తుంగ.) తృణవిశేషము.శీ "క. సరసులు చేపట్టినచో,విరసం బగుకావ్య మైన వినిపించిన సాదరణీయం బయి వెలయదె,భరఁ బువ్వులఁ దాల్చి తుంగ తలకెక్క గలిన్." దశా. ౧, ఆ. ౨౦౦. సం. వి. ఆ. స్త్రీ. 1. జమ్మి, శమి శీ; 2. తవషీరి. శీ.

తుంగకము. సం. వి. అ. పు. పొన్న. పున్నాగము శీ.

తుంగకసవు. దే. వి. (తుంగ+కసవు) తుంగగడ్డి. "సీ. మసకలిత్తులు తుంగకసవుచాఁపలు పసిఁగొయ్యలు జనకుమోకులును గలలు." చెన్న. ౨, ఆ. ౨౦౪.

తుంగభద్ర. సం. వి. ఆ. స్త్రీ. నదీభేదము. (ఇది కృష్ణానదియుపనదులలో నిది).

తుంగభద్రము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు.

తుంగము. సం. వి. అ. పుం. 1. కొండ; 2. పొన్నచెట్టు; 3. కొన; 4. కొబ్బరిచెట్టు; 5. ఖడ్గమృగము; 6. బుధగ్రహము; 7. ఉచ్చస్థానము. (జ్యోతి.) న. కింజల్కము. విశే. (అ. ఆ. అ.) 1. ఎత్తైనది ఉన్నతము; 2. పొడవైనది; 3. ప్రధానము; 4. ఉగ్రము.

తుంగముస్తియ. దే. వి. (తుంగ+ముస్తియ) తుంగ గడ్డియొక్క దుంప. "గీ... గొట్టెచెట్లు నిండెట్టుఁ దుంగముస్తియలు నీఁత,గుంజు మొదలుగఁ దిన దొరఁకొనియె జనము." కాశీ. 3, ఆ. ౧౫౧.

తుంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. పసుపుచెట్టు; 2. వాయింటచెట్టు; 3. రాత్రి. విశే. (స్. నీ. స్) 1. ఎత్తైనది, 2. పొడవైనది.

తుంగుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

తుంచు. దే. స. క్రి. (తునియు ధా. ప్రే) ఉత్తరించు, చించు. "గీ. అలవరించి చతుర్విధాహారములను, దృష్టిచేసి దుకూలము ల్తుంచి తుంచి,కట్ట నిచ్చిన.." ఉ. హరి. ౪, అ. ౧౧౫.

తుంట. యుం. దే. వి. 1. తునుక, ఖండము, శకలము. "శా. ఘంటాకర్ణుని మించుకర్మమెుకొ సాకర్మంబు మానీంద్రులం, దుంట శ్వేయుఁడె...." ఆము. ౬, ఆ. ౫౦. ఆం. భా. ప్ర. ౭౯, 2. చెఱకు, ఇక్షువు చెట్టు. (ఈయర్థము తుంటవిల్లు మున్నగు మన్మథధన్వర్థ ప్రసక్తిలోనే కన్పట్టుచున్నది.) "ఉ... గెల్వవె ముజ్జగంబు నుద్దండత నొక్క తుంటవిలు దాలిచి యుంటివె గందుతూపులన్." పసు. 3, ఆ. ౧౭౪. వై. విశే. (సం. దుష్టః. క. తుంట.) దుష్టుఁడు,తుంటరి. "వ. విశకలంబు లయినదధికుంభశకలంబులఁ బొదగని తుంటకొడుకు వెన్నఁ దింట రెఱింగి..." భాగ ౧౦, స్కం. పూ. ౩౬౦.

తుంటరి. ద్వ. విశే. (తుంట + అరి - స్వార్థమున) దుష్టుఁడు. "ఉ. తుంటరిమారుబారిఁ బడఁద్రోయక పూవుఁదావిపోలె లో,గెంటకతూర్చి నన్ను బ్రతికించి..." పె. శకుం. ౨, అ. ౨౨౭. ద్వి. హరిశ్చ. ఉ. ౬౪౯.

తుంటవిలుకాఁడు = తుంటవిలుతుఁడు. ఆం. సం. దేవ. ౧౪.

తుంటవిలుతుఁడు. దే. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. "గీ. కనకభిరత సాక్షిప్రాదంబునందుఁ, దనమనో విస్తృతి నితంబకలనునందు, వెలయ నిలుఁడంతలోఁ దుంటవిలుతుచెలువ,భంగిఁ దులకించునొక మోహనాంగి యయ్యె." ఉ. రా. 3, ఆ. ౪౨౩.

తుంటి. దే. వి. పిఱ్ఱుని తంబము. "సీ. కండూతికై రాయఁ గర్కశం బగుతుంటిఁ బీటవెట్టిన మ్రాను పెల్లగిల్ల." స్వా. ౪, ఆ. ౧౭.

తుంటికూర. ద్వ. వి. ఒకవిధ మైనకూరాకు చెట్టు "ఆ. గోఁగుకూర యాలకూర చెంచలికూర, తుంటికూర పొన్నగంటికూర .." వి. పు. ౪, ఆ. ౨౭౫.

తుండకేరి. సంచి. ఇ, ఈ. స్త్రీ. 1. ప్రత్తిచెట్టు; 2. దొండ చెట్టు.

తుండము. ఉభ. వై. వి. (సం. తోదనమ్. త. తుండం.) ఖండము, తునుక. "వ పాండవాగ్రజుం డతని కోదండంబు తుండంబులు చేసిన .." భార. ద్రో. ౨, ఆ. ౬౦ భార కర్ణ. ౨, ఆ. ౩౩౨. సం. వి. అ. న. 1. నోరు, 2. ముఖము, 3. పనిముట్టు మొన, 4 ఏనుఁగుతొండము, 5. దోమతొండము.

తుండి. సం. వి ఇ. పుం. 1. నోరు, 2. ముఖము; 3. పక్షిముక్కు. ఇ, ఈ. స్త్రీ. 1. దొండచెట్టు; 2 బొడ్డు; 3. బొడ్డు, శాఖి. న్. పుం. 1. పక్షి; 2. ఏనుఁగు, 3. దోమ.

తుండించు. వై స. క్రి. ఖండించు, నఱకు "వ... వాలంబుల నఱకియుఁ దొడలు తుండించియుఁ దొండంబుల ఖండించియు..." భాగ. ౬, స్కం. ౩౭౦. ఉ హరి. ౬, ఆ. ౧౨౯. [నాభి.

తుండిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దొండ చెట్టు; 2. బొడ్డు,

తుండికేరి. సం. = తుండకేరి. [వాఁడు.

తుండిభుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఉబ్బుబొడ్డు

తుండిలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉబ్బు బొడ్డువాఁడు, 2. వదరుఁబోతు.

తుండీరము. సం. వి. అ. పుం. దొండ చెట్టు "క. మానిత మగుగుదరసమున,మానినతుండీరఫలమెు యొుగిఁదేశకల,స్నాని మృదువై నపుడమెు,నా నద్రిజతోప్ప మోవి నయమై యొప్పున్." కు. సం. 3, ఆ. ౬౨.

తుండు. దే. వి. (క. త. తుండు.) 1. ఖండము, తునుక. "ఆ. తోఁచు శకలసంజ్ఞ తునుక తుండెము తుండె,తుండు తుంట పఱియ తుఱియ ముక్కయన.. "ఆం.భా. ప్ర. ౭౯; 2. దారుఖండము, మ్రానితునుక. "ఆ. ఇంతఁ గోమలాంగి సేలకొమ్మని మందుతుండు దెచ్చి ప్రక్కదండఁ జేర్చి,

యిట్టిభోగ మీావృ శేకాలమా దైగ, నఘభవించి రొయఱంగ వంచు భటులు." పానందో. ౨, ఆ. ౭౬. పు. పాండు. ౫, ఆ. ౨౪౫.

తుందుపడు. ద్వ. అ. క్రి. (తుందు+పడు) ప్రోడు వలె నగు,మొండియగు. "గీ. నల్లనై తుందుపడి బ్రాహ్మణత్వమునకు,దావలం బైనవెడజన్నిదములు దాల్చి." దశ. 3, ఆ. ౪.

తుండె. దే. వి. తునుక. ఆం. భా. ప్ర ౭౯.

తుండెము. దే. వి. తునుక ఖాదము. "మ . పల్లము గుత్తిమున్ రవుతుచున్ వేటారుతుండెంబులై,చెద రంగా వడివ్రేయం..." విక్ర. ౬, ఆ. ౭౯. రా. వి. 3, ఆ. ౬౪.

తుంతుర్వని. దే. వి. (క. తుంతుర్వని) తుంపర,శీక రము. "సీ. ఎలమి లేఁవరుఁగల నెలపుంతుంతు ర్వని పదములనూ క్తికాతుతలు గాఁగ." కు. సం. ౯, ఆ. ౭౨.

తుందకూపి. సం. వి. ఈ. స్త్రీ. బొడ్డు, నాభి.

తుందపరిమృజుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) బొజ్జ నిమురుకొనుచుఁ గూర్చుండువాఁడు - సోమరి.

తుందము. సం. వి. అ. న. ఉదరము,బొజ్జ.

తుంది. సం. వి. ఇ. స్త్రీ. న. 1. ఉదరము,బొజ్జ; 2. బొడ్డు,నాభి. విశే. (స్. నీ. న్.) బొజ్జ కలవాఁడు.

తుందిభుఁడు. సం. విశే. (అ ఆ. అ.) 1. పెద్దబొజ్జ కలవాఁడు; 2. ఉఱుకుబొడ్డు కలవాఁడు.

తుందిలము. సం విశే. (అ. ఆ. అ.) 1 అధికము, ఎక్కువైనది; 2. భరితము, నిండినది. "మ... నభోవాహినీ, లహరీశీకలగంధవాహీకరిఖేలన్మంజరీ సౌరభ,గ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతాసంతానముల్." స్వా. ౨, ఆ. ౪౫.

తుందిలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. పెద్దబొజ్జ కలవాఁడు; 2. ఉఱుకుబొడ్డు కలవాఁడు.

తుందుడు. దే. వి. తొందర. (చూ. తుందుడుగొను.)

తుందుడుగొను. దే. అ. క్రి. (తుందుడు+కొను) త్వరపడు,తొందరపడు. "ద్వి. త్రొక్కురా దని విని తుందుడుగొనుచు,నతుల కోపాంక మైనట్టియ సంత,పరిశిష్యముఖ్యు లేర్పడఁగ నిట్టనిరి." ద్వి పదను. ౮, ఆ. ౬౯౬. పు.

తుందుడుకు. దే. వి. (దుడుకు+దుడుకు) 1. సంతా పము,మనోవ్యథ. "చ. చులుకన నన్నుఁ గన్నపున పున్ లయపుందఁగఁ జేసి నన్నునున్, గెలుపఁగఁ బూని యున్న మునికీటములన్ విరవాది మొగ్గ పే, రలుఁగుల పాలుచేసి జయమందుదు దుందుడు కొఱనట్లుగాఁ, గొలపగ దీర్పు భోనిఁనోడ కున్ గొడుకే మదిలోఁ దలంపఁగన్." చంద్రా. 3, ఆ. ౬౨. ఉ. రా. ౬, ఆ. ౨౧౨; 2. మోసము. "క...మన కీసందడి జూణంగులః దీరు కొతుంపు డుకుల సామిసొమ్ము దోఁచకయున్నన్." ప్రబంధ. ౭౭౨; 3. కలఁత, క్షోభము. "గీ ..యుఁవరాజు తగినరీతి,దొరల భృత్యుల సఖుల నంపొఱచు బనిచి,తుందుడుకు డెందమునఁ జాల నందడింప." సా. ౨, ఆ. ౧౪౪. కకు. ౧, ఆ. ౩౫౭; 4. కంపము,చాంచల్యము. "సీ. ఘన మైనరారాపు చనుకోఁయిరాయిడిఁ దుంపీఫలంబు తుందుడుకుఁ జెంద." స్వా. ౧, ఆ. ౫; 5. అతిశయము, అధి క్యము. "చ. నడుఁకక కంసుకారణమునం దనుఁ బొందికకొకవహ్నితుం,దుడు కపు డుగ్రసేనుఁ డపఘాతము చేసి మృగేంద్రపీఠిం,గొడ వయి రక్షకుంధభృతతోయముచే నభిషేక మాడి .." సాంబో. ౧, ఆ. ౧౭౯; 6. తొందరపాటు, అనాలోచితకారిత్వము. "సీ. పెనఁగి చేపడి పించుకొనిన చేరమి పోవఁ గెలన పెన్నఁడు నిల్వఁ గలుగునొక్కొ. ప్రియ మెఱుంగక యడ్డపెట్టు తుందుడుకు వోఁ గల్యాణ మెన్నఁడు గలుగు నొక్కొ." విజ. 3, ఆ. ౭౩; 7. ఉత్కంఠ, తహతహ. "చ...మేనితోఁ,గదియఁగ గూడ కున్నను సుఖస్థితిఁ జెందెద పూర్వలోకమున్, దుది యది గా దటం చనినఁ దుందుడు కేటికిఁ బొమ్ము యింటికిన్. ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౫౩. విశే. తొందరపడి కార్యము చేయువాఁడు. అనా లోచనశీలుఁడు. "సీ. కొడుకు తుందుడుకైనఁ గోడలు దొంగైన సహజుండు తనకు నసాధ్యుఁ డైన." వేమ. ౪. ౧౨.

తుందునకలు. దే. వి. బ. (తునుకలు+తునుకలు) చిన్న చిన్న తునుకలు, అత్యల్పఖండములు. "వ .. పరిఘాఘాతంబులఁ బలకలతోడన పునుకలు తుందునకలై దూపుచెడి పడిసినచోట్లును." కలిక. ౨, ఆ. ౧౯౭.

తుంపర. వై. వి. (సం. తుషారః.) గాలిచేత చెదరి పడునీరు తున్నగువానిబొట్టు,శీకరము. "వ... అలరులయందుండియుఁ దొరంగుమకరందధారా

బృందంబు వాఁకలం గలిసి ప్రవహించుసెలయేటి నీటితుంపరలన్ దొరసి .." ఉ. రా. 3, ఆ. ౧౯౧. ఆం. భా. ప్ర. ౭౫.

తుంపిర్లు. దే. వి. బ. తూరవాన. (శ. ర.)

తుంపురు. వై. వి. (సం. తుషారః.) తుంపర,శీకరము. "సీ. కళుకులై తమ్మిపైఁ గ్రమ్మమంచునుబోలె మొగమునఁ జెమటతుంపురు లెలర్ప." య. 3, ఆ. ౧౪. రా. వి. ౨. ఆ. ౭౦.

తుంపెసలాడు. దే. అ. క్రి. 1. చలించు,కదలు. "చ. తొలతొలమాటలున్ నొసలఁ దుంపెసలాడునుంగరంపువెండ్రుకలును..." కవిరా. ౨, ఆ. ౪3. పం. శకుం. ౨, ఆ. ౧3౯; 2. క్రీడించు. "సీ. విసభుక్తిఁ గ్రొవ్వి తుంపెసలాడురాయంచకొదమ పెట్టినతెలిగ్రుడ్లనంగ." చంద్రా. ౪, ఆ. 3౬. 3. ఒప్పు. "సీ. పదపడి కలిరుబోంటుముఖఁ దుంపెసలాడి పసరు మొగ్గలరీవి పొసఁగమెరఁగె." కృ శకుం. ౧, ఆ. ౭౧.

తుంపెసలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము "వ ..ముచ్చికలు పోచ్చ నచ్చనగండ్లు వెన్నెలకుప్పలు గుజ్జెనగూళ్లు తుంపెసలు డాఁగిలిమూఁతలు..." భోజుతా. ౨, ఆ. ౯.

తుంపెసలుగునియు. దే. అ. క్రి. తుంపెసలు + గునియు) తుంపెసలాడు,చలించు. "సీ. కొలఁకులపైఁ దోఁచునిరులు నాఁ జెలువొంది నొసటిపైఁ గురులు తుంపెసలు గునియ." భాగ. ౧౦, స్కం. ఉ. ౬౪౧.

తుంబ. కం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరికతీ, 2. సొఱతీ; 3. అవు. [కాయ.

తుంబము. సం. వి. అ. పుం. 1. సొఱతీ; 2. వీణె

తుంబరము. సం. వి. అ. న. వాద్యభేదము, తంబుర.

తుంబి. సం. వి. ఇ.ఈ. స్త్రీ. 1. సొఱ, అనుగుతీ; 2. తుమ్మితీ.

తుంబిక. సం. వి. అ. స్త్రీ. 1. సొఱతీ; 2. చేఁదిసొఱతీ. [కొత్తిమిరితీ.

తుంబురి. సం. వి. ఈ. స్త్రీ. 1 ఆఁడుకుక్క,కుని; 2.

తుంబురుఁడు. సం.వి. ఉ. పుం. ఒకానొకగంధర్వుఁడు

తుకతుక. దే. వి. 1. ఉడుకులు క్రాఁగుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. "క. తనచేతకు తనబలమున్దునిమించుట కింద్రజిత్తు తుకతుక నుడికెన్." రామా. ౬, ఆ. ౨౨౫. చంద్రా. ౨, ఆ. ౨౪; 2. సంతాపము. "ద్వి. తుకతుక లేక కీర్తులు మిన్నుముట్ట,సకలరాజ్యము నొకసంయమి కిచ్చి." ద్వి. హరిశ్చ. పూ. ౧౭౯౧; 3. కోపము. "ద్వి. నీచభూములనొల్ల నీరాజ్యమొల్ల, ద్రోచిపో నిమ్మింకఁ దుకతుక మాని." ద్వి. హరిశ్చ పూ. ౧౬3౯. శుక, ౧, ఆ. ౧౪౬౯. ఈసు, అసూయ. "క. ఒకనాఁడాముని సాగరసికతాస్థలి నొంటి జపము సేయఁగఁ దనలోఁ,దుకతుకఁ దాళఁగ లేకచ,టికి సత్యాత్మజుఁడు చని నొడివెను మృదూక్తిన్." చంద్ర. ౧, ఆ.౧3౬. చంద్రా. ౨ ఆ. ౫౬.

తుకము. దే. వి. (ఉ. తుకమ్.) నారుమడి. "సీ. పొదివి మేపులఁ దోఁచుపులకాంకురంబులతుకము జాజాలపాలికలు చేసి." అని. 3, ఆ. ౭౬.

తుకాటము. దే. విశే. మిక్కిలిప్రాఁతది (శ. ర.)

తుక్కు. దే. వి. 1. పనికిమాలినగడ్డి మొదలగునది. (వా.); 2. తృప్పు,లోహదోషము. "గీ. పొలఁతి కుచయుగళంబుతోఁ బోరుటకును, గాద చక్కని సౌవర్ణకలశతతులు, నొక్కలై చిక్కుపడి చాలఁ దుక్కుపట్టి, సుత్తెపెట్లకు లోనయ్యెఁ జోద్యముగను." సీతా. ౨, ఆ. ౧౨3. విశే. పనికిమాలినది, నిస్సారము. (వ్యవ.) వాఁడువ్రాసిన దంతయు తుక్కువ్రాఁత.

తుక్కుడు దే. విశే. పనికిమాలినది, నిస్సారము. ఉదా. తుక్కుడుధాన్యము.

తుఖారము. సం. వి. అ. పుం. తుఖారదేశసంబంధమైన శ్రేష్ఠాశ్వము; గుఱ్ఱము, ఘోటకము. "గీ. అల్లదాదీశవేమక్ష్మాధినాథ, భూరినిష్ఠురధాటీవిహారచతుర,సైన్యబాసీరతుఖారశఫపుటోత్థ, వింధ్యపార్శ్వవసుంధరావిపులధూళి." కాశీ. ౧, ఆ.3౪. నరస. ౫. ప్ర. ౨౪3.

తుఖారుఁడు. సం. వి. అ. పుం. వింధ్యపర్వతమందు నివసించు ఒకజాతివాఁడు.

తుచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.

తుచ్ఛము. సం. వి. అ. న. 1. పొల్లు; 2. దుఃఖము. విశే. (అ. ఆ. అ.) 1. అల్పము, చిన్నది; 2. శూన్యము, రిక్త; 3. అసత్యము; 4. దీనము.

తుజోగు. హిం. విశే. త్వరపడువాఁడు. (శ. ర.)

తుటాయించు. దే. స. క్రి. అలక్ష్యముచేయు, నిరసించు. (శ. ర. ప్రా.)

తుటారమాడు. దే. స. క్రి. (తుటారము+ఆడు.) నిరసించు, తిరస్కరించు. "ఉ...ప్రభావతి వచ్చి యీహుడాల్, పొందినరాచవానియెడఁ గొనికటారిఁ దుటారమాడుచున్." శుక. ౨, ఆ. ౯౬.

తుటారము. వై. వి. (సం. తుత్కారః.) 1. దిట్టతనము, దార్ఢ్యము. "వ...మిటారపుటారెలం బటాలు పటాలునఁ దుటారం బడర నడిచి" అచ్చ. యు. ౩౬౩; 2. పరుషవచనము. "గీ. తొచ్చెము తుటార మనఁగను దుష్టవచన మొప్పు." ఆం. భా. ప్ర. ౧౧౪. విశే. 1. దృఢమైనది, ధైర్యము గలది. "గీ. పసిఁడిగొలుసులు జరతారుపట్టెకలును, మేలివహొంబట్టుజాలును మెడలఁగొప్ప, వెండి మువ్వలం బొదలంగ గండుమీఱి, గాఁగ వేగఁ దుటారంపుజాగిలములు." రసిక. ౧, ఆ. ౧౦౬. అచ్చ. అయో. ౩౮; 3. పరుషము, నిష్ఠురము. "వ...ఇది యొక్కఁడిమిటారిం గొనితెచ్చితి వని తుటారంపుమాట లాడుచు .." హరిశ్చ. ౪, ఆ. ౧౯.

తుటారి. వై. విశే. (తుటారము+ఇ.) 1. ధృష్టుఁడు, ధృష్టురాలు, దిట్టతనము గలది. "గీ ..రాచపుడమి, వేలుపుఁదుటారి తాపసివెంట నరుగు,చుండు సీరాము చేరీతిఁ బనుచువాఁడ." చం. రా. ౨, ఆ. ౬౫. "గీ. నన్ను సెనిరింప కట్టిదానవె తుటారి." శివలీ. ౨, ఆ. ౧౭౭. నీలా. ౧, ఆ. ౬; 2. ప్రేలరి,వదరుఁబోతు. "క. నా విని యోసి తుటారి ద,యావారిధి నధిపుఁ గూర్చి యనకు మొకటికూఁన్." ప్రభా. ౫, ఆ. ౧౬౮; 3. దుష్టుఁడు. "చ. టక్కరు లుక్కివుల్ బలుతుటారులు క్రూరులు వేషధారులుఁ, రక్కసులా ..." సమీర. ౪, ఆ. ౭౨. చంద్రా. ౪, ఆ. ౧౮౩.

తుటారించు. వై. స. క్రి. తిరస్కరించు. "దండకము. జాలినిద్దాపుకెంపుం దుటారించుకెమ్మోవిపై నంద మామందహాసంబు చెన్నొందు..." దశా ౪, ఆ. ౭౩౬. శుక. ౧, ఆ. ౩౧౪.

తుటారికత్తియ. వై. విశే. (తుటారి+కత్తియ) దిట్టతనము గలది, ధృష్టురాలు. "చ...గా,జులు గలుగల్లనఁ జాఱుచూపులచేఁ జెనువర్ణ డెందముల్, గలఁపుచు రందులన్ బొలముకాఁపరి కాఁపుఁదుటారికత్తియల్." వీలా. ౧, ఆ. ౩౯.

తుటారికత్తె = తుటారికత్తియ. (దుష్టురాలు.) "ఉ. కంతుమరాళతాపహతిఁ గ్రాఁగుచు నజ్జగవక్ష్ని కాఁడు న,క్కొంతతుటారికత్తె యరి యొగ్గులు వల్కెనో .." రసిక. ౪, ఆ ౧౪౮.

తుటారికాఁడు. ద్వ. విశే. (తుటారి+కాఁడు.) 1. దిట్టతనము గలవాఁడు; 2. దుష్టుఁడు. (శ. ర)

తుటుక్కు. దే వి (ఆమ్రేడితమున తుటుకుతుటుక్కు.) 1. గుండె అదరుటయందు దగునను కరణము. "చ... గుండియల్, తుటుకుతుటుక్కునన్ దిగులుదొట్టిన భూభుజుఁ డయ్యొ నయ్యెడన్." పాంచా ౨, ఆ. ౪౭. (శ. ర. పా.)

తుటుము. దే. వి. 1. సమూహము. "గీ. భూరిరవి రోచిఁ గాలెడుపుడమి పెడఁద,పెనముపైఁ బండు వెన్నెలపేరి యట్టు,మంట మీఱినయాఁకట మటిఁయుం మటికుఁ, బొట్ట నిండించె రేజేని పులుఁగుఁదుటుము." కాళిందీ. ౪, ఆ. ౪౭. అచ్చ. యు. ౪౪౯; 2. మల్లవిద్యాసంబంధమైనషోడశోపవీతములలో నొకటి. "వ...దండనిల్కడ కదలు తుటుము ..కరకాభువంబు లాది యాషోడశోపవీతంబులరీతులు చేర్చి..." హంస. ౧, ఆ. ౨౦౬.

తుటుములుగట్టు. దే. అ క్రి. (తుటుములు+కట్టు.) గుమిగూడు. "వ. గోపిక లోపికలు లేక తమతమ పొత్తుకత్తెలుం దారును దత్తఱంబునఁ బదుగురు నేగురుఁ దుటుములుగట్టి జిలిబిలిముచ్చటలకుం జొచ్చి .." భాగ. ౧౦. స్కం. పూ. ౪౭౦. జాహ్నవీ. ౧, ఆ. ౫౨.

తుట్టతుద. దే. వి. (తుద+తుద) చిట్టచివర, కేవలము తుద. "చ. తడఁబడ మింటితుట్టతుద హాఁక రయంబునఁ బోవుచున్..." భా.రా. అర. ౨, ఆ. ౧౪౧.

తుట్టతుది. దే.వి. (తుది+తుది.) చిట్టచివర. "ద్వి. గిరి తుట్టతుదినుండి క్రిందుఁ జూడంగ,నురగలోకము గాఁడి యుండినికి బెదరి." పండితా. పర్వ. ౩౪౯.పు.

తుట్టతుమర. దే. క్రి. విశే. బొత్తిగా, స్వల్పముగా నైనను. ఉదా:—పిల్లవాఁడు తుట్టతుమర చదువఁడు. (శ. ర.)

తుట్టియ. దే వి తుట్టె. (శ. ర.)

తుట్టు. దే. వి. (క. తుట్టిసు.) 1. నష్టి. ఉదా:— ఈవ్యాపారములో నాచేతిసొమ్ము తుట్టుపెట్టుకొన్నాను. (శ. ర. గ్రా.); 2. పీడ, బాధ. "అ.

చాలఁ జాలు పగవఁ గాలంబు గా దిది, లంక చేర రాజ్యలక్ష్మి గేరఁ,గొఱత దీఱ నెల్ల కోర్కులు సమకూరెఁ,దుట్టు వానివలన దొలఁగు లేదు." భా. రా. యు. ౨౭౯3. విణ. బాధకము, బాధకుఁడు "చ. చలువలరచ్చపట్టు జలజంబులతుట్టు విరాళికల్కిప్రోఁగులకనుతుట్టు .." రా. వి. 3, ఆ. ౮.

తుట్టుపెట్టు. దే. స. క్రి. (తుట్టు+పెట్టు.) బాధించు. "రగడ తగిలి పట్టు మనుచుఁ దిట్టుకన్నిఁ దుట్టు పెట్టె నొకత." రా. వి. 3, ఆ. ౧౧౧.

తుట్టె దే. వి 1. సమూహము, ప్రోవు. "వ. అని పని పట్టుకొని తెట్టతెరువు మొకంబులఁ గొట్టి తుట్టెలుగాఁ బెట్టి..." రా. వి 3, ఆ. ౬౫. అము ౬, ఆ. ౧౭; 2. అడ, అట్ట. "ద్వి. ముంజేగబ్బుల తుట్టె ముసుకవెండ్రుకలు, జుంజురింపఁగ విదుర్చుచుఁ జుట్టు ముసుచు." అ. మ. క ౨, ఆ ౮3. పు; 3. తేనెపెర. "గీ...తుట్టె యనఁగఁ, బెర యనఁగ క్షౌద్రపటలంబు పేరు చెల్లు" ఆం. భా ద్వి. ౨౮౦. విణ నీచము, క్షుద్రము. (చూ. తుట్టెపురుగు.)

తుట్టెగట్టు. దే. అ. క్రి. తుట్టె+కట్టు) 1. పురుగులుపట్టి ఉండలుగట్టు. (శ. ర. వా.); 2. జడలుగట్టు. "వ ..పయింబడి బెడిదము లగునిడుద మొనగోళ్ల గ్రుచ్చినఁ దామును నెదిరి మైకొని కొట్టుతరిఁ దుట్టెలుగట్టినరోమములం దవిలి తివియఁ దీరంబు గాక." చంద్రా. ౨, ఆ. ౮౪.

తుట్టెపురుగు. ద్వ. వి. (తుట్టె+పురుగు.) 1. తుచ్ఛసర్పము. "గీ...క్షుద్రాహిసంజ్ఞ తుట్టెపురు గని పల్కఁగఁ దోఁచియుండు." ఆం. భా. ప్ర. ౧౪౭. రామా. ౮, ఆ. ౪౦, 2. సర్పము. (చూ. తుట్టెపురుగుగుంపుగొంగ.)

తుట్టెపురుగుగుంపుగొంగ. ద్వ. వి. గరుత్మంతుఁడు,సర్పారి. "గీ ..గరుటాలమంతుండు గరుడి తుట్టెపురుగుగుంపుగొంగ యనఁగ గరుడున కగు..." వేంక. దేవ. ౨౦.

తుట్ర దే. వి. 1. మంచువంటితూరవాన. "గీ. తుట్ర యన మంచుఁ బోలినతూరవాన." ఆం. భా. ప్ర ౭౫; 2. ఊడ్చి రాశిగాఁ బోసినచెత్త, పెంటకుప్ప." (శ. ర. బ్రా.)

తుట్రిలు. దే. అ. క్రి. ఊటీయు, కరియు. "సీ. గుడిసె సన్నపు చక్కఁ గుడువవల్వరిఁ గొన్న గడలు దుట్రిల పడపడపడంగ." రా.వి. ౨,ఆ. ౭౦.

తుతారము. సం. వి. అ. పు. పరుషవాక్యము. "వ... వార లాడినతుతారంబులు కర్ణకఠోరంబు లగుటయు." వరాహ. ౧, ఆ. ౧3౭.

తుడుచు. దే. స. క్రి. 1. ఊడ్చు. "క వరవృక్షఁ గలసి తనయుఁలు, పరువడిఁ దుడువంగఁ గృష్ణఁ బనుచు పగళ్ భా సురరాజ్యవిభవ మొప్ప నిదురఁ జెప్పెరఁ బాచె దానిఁ దోడ్కొని తేరన్" భార. సభా. ౨, ఆ. ౨౦౦. అను. ౪, ఆ. ౫౦; 2. వస్త్రాదికముచే ఒత్తు, ఒత్తివేయు." క ..తగవే, యిట్టితెగు వచుచుఁ జెక్కులఁ, దొట్టినకన్నీరు వోవఁ దుడుచుచుఁ బలికెన్." స్వా. 3, ఆ. 3౨. ఉ. రా. ౫, ఆ 3౦౨. 3. కడుగు, ప్రాశన మొనర్చు. "సీ. పద్మనికన్నీరు పన్నీటఁ దుడువుము..." శైవ. ౨, ఆ. ౧౪౧ పారి. ౪, ఆ. ౧౬; 4. పోఁగొట్టు. "క. నిన్నుఁ గడచివతలి దండ్రులు, విని నాదుందుడుకుఁ దుడిచి విడువం గలదే, యని యే నేరికిఁ జెప్పక, చను దెంచితి ననఁగ వచ్చె శబరబలాంబుల్." కను. ౪, ఆ. ౫౮. పారి. ఉ. ౯, ఆ. ౨౯; 5. నిమురు,తడవు. "వ...కందంబుఁ జఱచి మొగంబుఁ దుడిచి .." స్వా. ౪, ఆ. ౧౧౫.

తుడుపు. దే. వి. (తుడుచుధా.) 1. తుడుచుట,మార్జనము. 'సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడుపులుము దన మార్జనసంజ్ఞ బొలుచుచుండు." ఆం. భా. ద్వి. ౧౬౦; 2. వ్రాసినతప్పును కొట్టివేయుట. (వ్యవ.) తుడుపులు లేకుండ వ్రాయవలయును. విణ. తుడుచునది,తొలఁగించునది. "గీ. పరమదాన వ్రాతపాపంబు లెల్లను గదలకుఁ దుడుపు మోకాళ్లముడుపు." ప్రబంధ. ౨౪.

తుడుపువెట్టు. దే స క్రి. (తుడుపు+పెట్టు) తుడిచివేయు. "సీ. తనదానపటిమంబు వనదాహారణమిషోద్ధురతమై నుడుపలిఁ దుడుపువెట్టు." బహు. ౧, ఆ. ౬౦.

తుడుము. దే. వి. 1. మద్దువు,వాద్యవిశేషము. "సీ. కైదువున్ విండ్లును గత్తళంబులుఁ దీర్చి బూరలుఁ దుడుములు బుగ్గిఁ గలిపి." అచ్చ. సుం. ౧౦౮. రసిక. ౧, ఆ. ౮౦; 2. సమూహము,గుంపు.

"క. నడుమెయుండె మదియును నకనిది,కదలిక నగ మువడి యొకనగం బిలఁ బడ నం,దదవులఁ గొండలఁ గ్రోఁతుల,తుమములఁ జెక్కుక్క బియ తుత్తుము రయ్యెన్." రామా. ౭. ఆ. ౧౫౭ చంద్రా. ౨, ఆ. ౭౪.

తుడ్పు = తుడుచు. (నిమురు,తడవు.) "చ. పొరిఁ బొరి నొత్తఁ గన్నులఁ గపోలయుగంబున నప్పళించు . కొర్కుచే, నురమున నున్చుఁ దుడ్పుఁ గడు నొప్పు మనోభవభూతశాంతికై." భో. ౫, ఆ. ౧౫౨.

తుణికము. సం. వి. అ. పుం. నందివృక్షము.

తుతినాగము. వై. వి. (సం. తుత్థమ్) లోహవిశేషము. (శ. ర. బ్రా.) [తెలంగ. (బ్రా.)

తుత్తి. దే. వి. 1. కంగుసీసపత్త్రముల. (శ.ర.) 2. నూఁగు

తుత్తిరి = తుత్తి. (శ. ర బ్రా.)

తుత్తుంభిక. సం. వి. ఆ. స్త్రీ. వాద్యవిశేషము. "వ... అతితుములతమ ఢమామికా తమ్మట భేరికా పటహ తుత్తుంభికా వాదిత్రగంభీరఘోషసంరంభంబు..." మను. ౬, ఆ. ౯.

తుత్తునియలు. దే. వి. బ. (తునియలు+తునియలు.) చిన్నచిన్నతునుకలు. "క. కరులును జోదులు డొల్లఁగఁ, దురగంబులు రాహుతులును దుత్తునియలు గాన్." భార. భీష్మ. ౨, ఆ. ౯౯, భా. రా. యు. ౪౯౦.

తుత్తునుకలు. దే. వి. బ. (తునుకలు+తునుకలు.) చిన్నచిన్నతునుకలు. "ద్వి. కాల్ల తుత్తునుకలు గాఁ గొట్టి కొట్టి." పండితా. పురా. ౧౦౯, పు. నవనాథ. ౫, ఆ. ౧౭౭, పు.

తుత్తుమురాడు. దే. స. క్రి. (తుత్తుమురు+ఆడు.) పొడిచేయు. "ఉ... కావకపుత్రుఁ డితండు గాఁడు... తుత్తుమురాడివచ్చునలదుర్మదు డొండు దలంపకుండుమీ." రాజ. చ. ౨, ఆ. ౩౯.

తుత్తుమురు. దే. వి. (తుమురు+తుమురు.) పిక్కుటిలి పొడి, "వ... కరిదంతంబులు నరదంబులనొగలు నొండొంటిం దాఁకి తుత్తుమురు లైనతుములంబు కతన..." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౭, ఉ. రా. ౩, ఆ. ౨౬.

తుత్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు; 2. చిట్టేలకి.

తుత్థము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. ఔష. న. అంజనవిశేషము, మైలుతుత్తము.

తుద. దే. వి. 1. చివర, కొన. "రగడ. ఎచ్చరింపఁ బోలు నీ వింతి రతిపతిఁ జగడఁ, బొదలఁ జిగురులతుదలఁ బూచియున్నది పొగడ." ప్ర్యా. 3, ఆ ౭౪, అము. 3, ఆ. ౧౭; 2. మోక్షము, (చూ. తుదముట్టు.) విశే. చివరిది, కడపటిది "సీ. చపలు గేదఁగి తూర్పుతునకొమ్మ నరవిరి యై కానుపించు పూరేకు లనఁగ." పారి. ౨, ఆ. ౩౬. అవ్య. ద్రు. పిమ్మట, అనంతరము. "చ. సుమధురమూర్తిఁ గృష్ణవిభుఁ జూడనియుండు లెటున్నసంద్రు గాని మది నొకంటఁ జేర్చి యతనిం గనుఁగొన్నతుదన్ సుధాంశుహాసము ప్రియమున్న వారు మఱి భావజు మే లనువారుఁ గల్గుటబ్రము." కళా. ౪. ౯౩.

తుదకు. దే. అవ్య. ద్రు. పిదప,దాఁక. "క... అని యుండుదు కోటికునకు నది బొం కయ్యెన్." వేం. పంచ. ౪, ఆ. ౫౩౪.

తుదచేరు. దే. అ. క్రి. (తుద+చేరు.) నెఱవేఱు,కొన సాగు. "ఉ.. ధర్మతనూజుఁడు రాజసూయవి, ఖ్యాతి వహించు నయ్యెడల వాంఛుఁడు ప్రాణము తోడ నున్న కేలా తుదచేరు నధ్వరము లావున వాఁ డొరు సేల కైకొనున్." ఉ. హరి. ౪, ఆ. ౨౯౪.

తుదమీఱు. దే. అ. క్రి. (తుద+మీఱు.) అధికమగు. "ద్వి. తదవసరమున యుధాజిత్తు ప్రేమ, తుద మీఱఁగా భరతుని మేనమామ." రం. రా. బాల. ౩౪. పు

తుదముట్టు. దే. అ. క్రి. (తుద+ముట్టు.) 1. సమాప్తమగు,ముగియు. "సీ. ఇప్పటిమునవృత్త మీకథ సర్వంబు తుదముట్ట నేమి చెప్పెదరొ యనుచు." కళా. ౫, ఆ. ౩౯; 2. పోవు, తొలఁగు. "క... వీఁడు జీవితేశ్వరుఁ డైనన్, మదిఁ గలదుఃఖం బెల్లను, దుదముట్టు నటంచు మోహదుర్దశ నొందున్." హంస. ౪, ఆ. ౭౧; 3. మోక్షమొందు. "సీ. చతురాత్మ విను మాత్మకృతము లైనట్టియు, మంగళభూతకర్మంబు లగుడి, దావాగ్నిశిఖలచే దందహ్యమాను లైనట్టిజీవులు దుదముట్టలేక, పాయక సంసారబద్ధులై యుండురు .." భాగ. 3, స్కం. ౭౫.

తు . దే. వి. (క. తుది.) 1. చివర, కొన. "సీ. మది నిగిర్చినమాట మునువ నీపెంపునఁ గునిసి నానాంటికతుదికి రాదు." భార. విరా. ౨, ఆ.

౪౫. భార. విరా. ౨, ఆ. ౧౩౪; 2. మరణము; వినాశము. "క. నీయూలం జే కూలెఁగిలెఁ,గామమ సంకల్పమునన కలిగెడు సంకల్పామర్శరహిత మగుచే, తోముద్రం దాల్తు నేను దుది యది నీకున్."భార. శాం. ౪, ఆ. ౪౫. విణ. 1. చివరిది, కడపటిది. "చ. మదనుఁడు రెండుచేతులను మార్వడ నేయఁగఁ దూపు లైదునుం, బని యయి వేఱు వేఱు పరిపాటి నవస్థలు సంఘటింపఁగాఁ, దుదిదళ రాజానందు నెడఁ దోఁచుచు నున్నది ..."నైష. ౨, ఆ. ౯౦. భార. విరా. ౧, ఆ. ౩౦౧; 2. సర్వోత్తరము, శ్రేష్ఠము. "క. ఆది విప్రున కిచ్చు టరయఁ,దుది దానంబులకు నఖిల దురితాటవులన్." భార. అను. 3, ఆ. ౧౯.

తుదితాఁకు. దే అ. క్రి. తుది+తాఁకు.) 1. కొఱవేఱు. సిద్ధించు. "గీ. నలుని దమయంతితోఁ, గూర్పఁ దలఁచి యున్న,ధాత మది యెత్తికో ల్తుదిదాఁక కున్నె." నైష. ౧, ఆ. ౪౦. భార. ఉద్యో. 3, ఆ. ౬౫, 2. ప్రసిద్ధమగు. "ఉ. దారుణకార్యవృత్తిఁ దుదితాఁకినవారును దొల్లి దుర్దశల్,సేరినచో నొకం డొకనిచేఁ జెడరై ర ..."కు. సం. ౧౦, ఆ. ౧౪౯. హరి. పూ. ౧, ఆ. ౧౦. రూ. తుదిదాఁకు.

తుదిముట్టు దే. అ. క్రి. (తుది+ముట్టు.) 1. చచ్చు, మరణించు. "క. ఇది మొదలు వాలి యుచటికిఁ బనపడి చనుడెంచెనేని భగ్నశిరుండై, తుదిముట్టు ననిమె..." అధ్యా. కిష్కిం. ౧౦౫. పు; 2. నశించు,పోవు. "ఉ. ముజ్జగ మైనఁ ద్రిప్పఁ దుది ముట్టను దా ధనకాంక్ష యెరికిన్." కవిక. ౫,ఆ. ౧౨౧, 3. కొఱవేఱు, సిద్ధించు. "వ .. నామనో రథంబు తుదిముట్ట వలయు..."భార. విరా. ౨,ఆ ౨౩౪. విప్ర. ౪, ఆ ౭, 4. ముగియు, పూర్తి యగు. "మ. హృదయాహ్లాది చతుర్థమూర్జితకథో పేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగాఁ, బదియేనింటెఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం, దుది ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్." భార. విరా. ౧. ఆ. ౭. భాగ. ౧౧, స్కం. ౬; 5. అయిపోవు,వ్యయమగు. "క. ఇది దైవవిరోధం బని,మదిఁ దా నూహించి ప్రకృతిమార్గణములు బెట్టిదముగ నేయఁగ నవి యుం, దుదిముట్టఁగ రిక్త లయ్యె దొలలు నరేంద్రా." భార. మా. ౧, ఆ. ౧౪౭; 6. వృథ మగు. "క. ఇమ్ముగఁ జెలిమి యొనర్చినఁ, గుమ్మడి పుర్వులవిధంబు కుజనులు చూడన్,సొ మ్మిత్తురు తుదిముట్టినఁ,ద మ్మిత్తురు నీతిపరులు తగుమిత్త్రులకున్." కేయూర. 3, ఆ. ౨౦౬.

తుదిరేయి. ద్వ. వి. (తుది+రేయి.) కల్పాంతము, చివరిరాత్రి. (శ. ర. బ్రా)

తునికోల. దే. వి (తూనిక+కోల - శ. ర. బ్రా) తూచుపట్టికోల, తులాదండకము. "క. మును వెండి కొండ తూఁచిన, తునికోలగదా మదీయదోర్దండము .."రామా. ౮, ఆ. ౧౨౨.

తునికోలదుడ్డు. దే. వి. (తునికోల+దుడ్డు.) గవుండ్ల వాఁడు కల్లుబుడ్డి తగిలించుకొని పోవుటకును కత్తి నూఁదుకొనుటకు నుపయోగించు తునికోలవంటి దుడ్డుకోల. (శ. ర.)

తునిమించు. దే. స. క్రి. (తునుము ధా. ప్రే.) 1. నఱికించు, ఖండింపఁజేయు. "వ...రాజునుం బఱతెంచి శూలప్రోతుం డయి యున్నమాండవ్యునకు నమస్కరించి నాచేసినయజ్ఞానంబు సహించి నాకుం బ్రసాదింపవలయు ననిన నమ్మునిం బంచుచో నది పుచ్చరాకున్న దానిమొదలు మెత్తన తునిమించినఁ దక్కుంతపార్శ్వంబునందు శూల శేషం బంతర్గతం బై యుండె." భార. ఆది. ౪, ఆ. ౨౬౮; 2. చంపించు. "ఉ...మహాగుణమే యిది నిక్క మైన నీ, మిక్కిలిమూఁక నెల్లఁ దుని మించక చావవు గాని రావణా." రామా. ౮, ఆ. ౧౦౦. రామా. ౬, ఆ. ౨౨౫.

తునియ. దే. వి. (తునియు ధా.) తునుక,ఖండము. "గీ. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి,చేతఁ గవ్వడి వడు నని చూతువేని, వాసుదేవునిచే నది వ్రయ్య లయ్యెఁ, దునియ లయ్యెను బోడి యయ్యెఁ దొరఁగు ధరణి." ఉద్యో. ౨, ఆ. ౨౭౭. ఆం. భా. ప్ర. ౭౯.

తునియించు. దే. స. క్రి. (తునియు ధా. ప్రే.) విఱుచు, త్రుంచు. "చ. అవి నడుమన్ హుతం బుగరయంబునఁ జేసి సుమిత్రపట్టి విల్లువిరళలీల నొక్కచటు లాస్త్రమునం దునియించి యొక్కటన్, వివశునిఁజేయ..."శతకం. ౪, ఆ. ౩౦. చం. రా. 3,ఆ. ౮౫.

**తునియు.** దే. అ. క్రి. 1. విఱుగు, భిన్నమగు. "సీ. కడిఁదివిల్ దునియుఁ జప్పుడు పీనులకు విందు సేయుం జెప్ప దటంచు నేత దలఁకు." ఉ. రా. ౧, ఆ. ౮౮; 2. తెగు, ఖండితమగు. "సీ. అరిగి సాత్యకి ద్రుపదాత్మజుఁ గనుఁగొని నీజిహ్వ దునియద నీశిరంబు. గీ. వగలమ .." భార. ద్రో. ౫, ఆ. ౩౬౫. విప్ర. ౪, ఆ. ౩౯; 3. చిదుఁగు, ఛిన్న మగు. "క. అఱువుడు గానిముసుంగుచు, విఱిగిన దండంబుఁ దునిసి ప్రేలెదుగోఁచిం, మఱియు లయిన కరకమునై, చుఱచుఱయై వేఁడి తెఱఁగు చూపులతో డన్." ఉ. హరి. ౪, ఆ. ౭౯. దశా. ౧, ఆ. ౧౭౮; 4. వికలమగు,చెడు. "ద్వి. కలఁగె గర్భంబులు గలఁగె ధైర్యములు, తొలఁగెఁ బ్రాణంబులు దునిసెఁ జిత్తములు." ద్వి. భార. విరా. ౨, ఆ. ౪౫ వు; 5. నశించు. "చ. ఘనుఁ డధిక ప్రయత్నమున గంగను దోడ్కొని యాభగీరథుం, డును గపిలాక్షిపావకపటుస్ఫుటకీలలభస్మరాసులై, తునిసిన తాతలం గని సుఖితుఁ డయ్యె..." జాహ్నవీ. ౯, ఆ. ౧౭౯.

**తునిసిపడు.** ద్వ. అ. క్రి. (తునిసి+పడు.) చెడు,భగ్న మగు. "గీ. తోడుతో డుతఁ గడఁకలు తునిసిపడఁగ ...ఊసురుతోడిపేసుం గయి యఁడుకుచుండె." హరి. పూ. ౮, ఆ. ౫౬.

**తునిసిపాఱు.** దే. అ. క్రి. (తునిసి+పాఱు.) తునుక లగు, పొడిమగు. (ఆదివరాహవర్ణనము.) "సీ. తుదమొదళ్లకుఁ జెక్కుఁ దునిసిపాఱఁగ మోరఁ గులశైలములు జిమ్ముఁ గొంతతడవు." భాగ. 3, స్కం. ౬౩౮.

**తునుఁగు.** దే. అ. క్రి. 1 చచ్చు, మరణించు. "గీ. మడిసె యూపాక్షుఁ డట జంబుమాలి తునిఁగె." మొ. రా. సుం. ౧౫౯; 2. తెగు, ఖండితమగు. "చ...దానిశరంబు గరంబు దాఁకినన్, దునుఁగుఁ జినుంగు ప్రీలుఁ గడుఁ దూలు జగజ్జనజన్మలక్ష్య ముల్." పాండు. ౫, ఆ. ౧౪౩; 3. విఱుగు. "క. నునుగాలి సోఁకినంతనె, తునిఁగెడు తెప్పడుము ..."రాజ. చ. ౨, ఆ. ౧౮౧. అచ్చ. అర. ౧౦౯.

**తునుక.** దే. వి. ఖండము, ముక్క. "మ.. ఇంద్రు నిలసద్బాణాలిఁ దోడ్తోన నాఁబలిదైవ్యప్ పడి సేయఁ దునుకల్ ప్రద్యోతమానాకృతిన్, శలభ శ్రేణులువోలె మూసె దెసలు .."హరి. ఉ. ౧౦, ఆ. ౧౭౪. వరాహ. ౭, ఆ. ౮౦.

**తునుచు.** దే. స. క్రి. (తునుఁగు ధా. ప్రే.) త్రుంచు, ముక్కలుచేయు. "సీ. అనుకువెన్నెల దాల్చి తునిచి సేవెలుచేసి వెన్నెలపాలకు జొన్నొనర్చి." య. ౨, ఆ. ౮౪.

**తునుమాడు.** దే. స. క్రి. (తునుము+ఆడు - స్వార్థమున.) 1. త్రుంచు, ఖండించు, నఱకు. "గీ. విరథుఁడయ్యును సురథుండు విపులచాప,హస్తుఁడై తూణమున బాణ మందుకొనఁగ, నలుక రెట్టింప నర్ధచంద్రాశుగమునఁ, గ్రీడి తునుమాడె నతని దక్షిణభుజంబు." జై. ౫ ఆ. ౭౪. భార. భీష్మ. ౨, ఆ. ౫౩; 2. చంపు. "క. కే ళ్లంగి వ్రేసిన ట్లా,త్రుళ్లడమున మోహముఁ బట్టి తునుమాడక యీ,పిల్లలఁ దునుములు కూఁకటి, వేళ్లందర్క్ మునిఁడికొనలు విఱుచుట గాదే." ప్రబోధ. 3, ఆ. 3. భా. రా. అర. ౧, ఆ. ౨౧౪.

**తునుము.** దే. స. క్రి. 1. ఖండించు,నఱకు. "క... మునినాయక వేగకడకు మాధునిఁ బొంద్రా, పని విభుని నీవు చూడఁగఁ, దునుముదు నేఁడెల్లిలోనఁ దత్తునియలు గాన్." ఉ. హరి. 3, ఆ. ౨౨, భార. భీష్మ. ౨, ఆ. ౧౭౯; 2. త్రెంచు. "క... తునుముము సంసారరజ్జు దురితవిదూరా." భార. శాం. ౪, ఆ. ౨౫; 3. చంపు. "ఎ...అర్జును ప్రతిజ్ఞయుం నభిమన్యువధకుం గ్రుద్ధుండై యర్జును డడక్షౌహిణులబలంబుల నొక్కరుండ చంపి సైంధవుం దునుముటయును..." భార. ఆది. ౧, ఆ. ౪౬, వరాహ. ౪, ఆ. ౫౩; 4. కోయు, చిదుము. "సీ. అలరులు దునుమకే యళివిలాసము వాయఁ గలఁకచే భ్రమయనీ చెలువలార." చంద్రి. ౪, ఆ. ౬౫, వసు. ౫, ఆ. ౩౦; 5. చీల్చు, చించు. "చ. తునుమఁగరానిజోళ్లు నొక తూరియుఁ బమ్మయి పోనితూపులున్." అచ్చ. యు. ౭౦; 6. చెఱచు, పోఁగొట్టు. "క. ఈగతిఁ జేర్చిన సఖుల,త్యాగము నీ కబ్బెఁ డెండు వపనీశ తనూ, వాగురయుం జన్మమరణా, ద్యోగకరం బైన తునుఁ దునుమక యున్నన్." భా. రా. ౬, ఆ. ౧౬౪, రా. వి. ౧, ఆ. ౩౬.

తునె. దే. వి. తునియ, ఖండము, కణము. "ద్వి. అని మిషల్ మిగుపెచ్చునం దిద్ద నిష్ఫ, తునె లన రిక్కలు దోఁచె నగ్రమున." ద్వి. తి. సా. ౨౯. పు.

తున్నము. సం. వి. అ. పుం. నంది శీ. ఓణ. (అ అ.అ.) 1. త్రుంపఁబడినది; 2. కొట్టఁబడినది.

తున్మాడు. దే. స. క్రి. త్రుంచు, ఖండించు. "ఆ. నిన్నుఁ బట్టి యష్టద నీఱుగ దలలు దున్మాడ వాడు శక్య మగునదియైన, జగముచేలినిండఁ జచ్చిన వాఁడవు, మున్న కాన శవము ముట్ట ననిన." నిర్వ. ౪, ఆ. ౮౮, భా. రా. అర. ౨, ఆ. ౨౦౨.

తున్మితూఁటాడు. దే. స. క్రి. (తున్మి+తూఁట+ఆడు) 1. త్రుంచిముక్కలుచేయు. "శా. లోలంబాలక యొూర్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మితూఁటాడి కెం, గేలం బట్టి కటాలున న్మెగసె .." వసు. 3, ఆ. ౧౬౯; 2. చంపు. "మ. బలిమిన్ వేవురు పార్శ్వరక్షకు లెదుర్వన్ దున్మితూఁటాడి .." జై. ౭, ఆ. ౪, 3. నశింపఁజేయు. "సీ. తలిభక్తిఁ దర్పణం బాచరించినమర్త్యుఁ డఘకోటిఁ దున్మితూఁటాడఁ జాలు." కాశీ. ౬. ఆ. ౩౯.

తున్ము. దే. స. క్రి. 1. ఖండించు, నఱకు "చ. అనఘుడు నవ్వుచున్ నృపకులాగ్రణిసింహముఁ దున్మివైచి..." కుద. 3, ఆ. ౧౬౦, 2. చంపు. "మ. వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీవిప్రున్ దురాలాపు దుర్జనుని ద్రున్మెద..." భార. అర. ౪, ఆ. ౩౫౫.

తుపాకి. దే. వి. (క. తుపాకి. త తుపాక్కి. హిం. తుఫక్కు.) మందుగుండు వేసి గట్టించి కాల్చు ఇనుపగొట్టము గలసాధన. "ద్వి. తమ్మితుపాకి కెందలిరాకువంకి..." ద్వి. నల. ౧, ఆ. ౮౭౮, సం. ఆం. భా. ద్వి. ౨౯౮.

తుపాకిగుండు. ద్వం. (తుపాకి+గుండు) తుపాకిలో నుపయోగించుగోళము. "సీ. రటితదిక్తటనట త్పటుపెటార్భటులతో ఘోరమైనతుపాకిగుండ్ల చేత." కృష్ణ. 3, ఆ. ౫.

తుపాకిత్రాడు. దే. వి. (తుపాకి+త్రాడు.) జానకిత్రాడు. "చ... పైకొను చీకటిపోఁకమూఁకచే నడరుతుపాకిత్రాటికొడిసెగ్గి యనం బొడకూపెఁ దారకల్." రాధా. ౨, ఆ. ౪౧.

తుపాకిమంది. దే. వి. (తుపాకి+మంది.) తుపాకులతో యుద్ధముచేయు సైనికనికాయము. "మ... కాలు లాండోక్కరిన్, నడవం జేరి తుపాకిమంది రొదురెక్కంబు బాఱి వేట్లాడి కాల్వడి మీఱంగ దమంధమంధిమిధి మిధ్యానంబు మిన్నందఁగన్." చంద్రా. ౬, ఆ. ౭౩, ఇట్టే: తుపాకిమూఁక. రా. వి. ౫, ఆ. ౧౫.

తుపాకీ. దే. వి. తుపాకి. 'క. కేడెము కత్తి తుపాకీ, కాడియుఁ బిండ్లమ్ము లీటెలం గొని ..." ప్రబంధ. ౭౮౨.

తుపాను. దే. వి. (క. తుపాను. హిం. తూఫాన్.) గాలివాన. (శ. ర. బ్రా. వా.)

తుపాసి. వై. వి. (సం. ద్విభాషీ. హిం. దుబాసీ. త. తుపాషి.) 1. రెండుభాషలు వచ్చినవాఁడు, ఒక భాషను మఱియొకభాషలోనికి మార్చి చెప్పువాఁడు; 2. ప్రభువు. "సీ. మన్నె తుపాసి వజీరుండు ప్రా౹౹ పనఁ బలె..." వేంక. మాన. 3౨, ప్రబంధ ౨౧౬.

తుపుక్కు. దే. వి. ఉమియుటయందు వగుధ్వని కనుకరణము. (వ్యవ.) వాఁడు తమ్మ తుపుక్కున నుమిసినాఁడు. (శ. ర.)

తుప్ప. దే. వి. చిన్నపొద, డొంక. "ఏ. ఉప్పతిల్లిన చప్పుళ్లకు వెక్కరంబై సెఁ దుప్పలం దూఱుదుప్పులును..." ఉ. హరి. ౪, ఆ. ౨౯, నీలా. 3, ఆ. ౨౮.

తుప్పదూలు. దే. అ. క్రి. (తూలు+తూలు - శ. ర. బ్రా.) మిక్కిలిచలించు. "ద్వి. జడిగొన్నభావము సాయకనివాలి, దొడరఁ దొప్పఁగఁ దోఁగి ధృతి దుప్పదూలి." నవనాథ. ౨, ఆ. ౭౯ పు.

తుప్పర. వై. వి. (సం. తుషారః.) తుంపర, శీకరము. (శ. ర. బ్రా.)

తుప్పలుదూలు. దే. అ. క్రి. (తూలు+తూలు. శ. ర. బ్రా.) కలఁగు, క్షోభనొందు. "గీ...అతఁడు వెఱచి చాల, దూరముగఁ బోయి తుప్పలుదూలియుండె." భార. శాం. ౫, ఆ. ౪౭౦.

తుప్పు. దే. వి. 1. ఉమియుటయం దగుధ్వని కనుకరణము. (ఆమ్రేడితమున తుప్పుతుప్పు.) "గీ. ఉమిసెఁ దుప్పనఁ జెంగముపై నొక్కరుండు." హరిశ్చ. ౪, ఆ. ౧౬౨. రామా. ౮, ఆ. ౧౫౦; 2. పడుటయం దగుధ్వని కనుకరణము. "క. బలి కల్పప్రదరంబున, నవనీపతి దుప్పుతుప్పు రనఁ బడి కేసెన్." కేం. పంచ. ౨, ఆ. ౨౦౨.

**తుమికి.** దే. వి. (క. తుమకి.) తిందుకము. "ఆ. చెల్ల చింత మొగలి చీకిరే నూడుగు, నిమ్మ తమ్మి తుమికి జమ్మి జమ్మి,వేగి వేము మొదలు గాఁ గల భ్రాఁకులు..." వేం. పంచ. ౪, ఆ. ౫౨౨, ఆం. భా. ద్వి. ౪౬.

**తుమురగు.** దే. అ. క్రి. (తుమురు+అగు.) విఱుగు, ఖండితమగు. "ద్వి. భీమ గానక దధిచివుఁడు ప్రయోగింపఁ,దమ వైనచక్రంబు తుమురులే పోకె." పండితా. వాద. ౨౨౮. పు.

**తుమురు.** దే. వి. అల్పరేణువు,పొడి "వ ..పలు తెఱఁగు లైనగదాప్రహతులం దునియలు పటియలు దుమురులై పిసకంబులు కత్తళంబులు ధరాతలంబునం దొరంగె." భార. కల్యా. ౨, ఆ. ౨౯౬, ఆం. భా. ద్వి. ౨౨౦.

**తుములము.** సం. వి. అ. పుం. న. 1. దొమ్మియుద్ధము, సందడికయ్యము; తాంత్ర. విణ. (అ. ఆ. అ.) సంకులమైనది, సందడియైనది.

**తుమ్మ.** దే. వి. ముండ్లు గల ఒకరకముచెట్టు, అరిమేదము. "సీ. పుదుకుమ్రాన్పలితావిపువ్వుఁ దేనియ లానుచుఁగ తేఁటి తుమ్మకొమ్మలకుఁ జనునె" సింహా. ౨, ఆ. ౭౬, ఆం. భా. ద్వి. ౪౮.

**తుమ్మి.** వై. వి. (సం. తుంబీ.) ద్రోణము, ఒకరకము కూరాకు. "మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁద గిరిసాకుం దింత్రిణీ పల్లవో,త్కరముం గూడఁ బొరంటెనూనియలతోఁ గట్టావి కట్టారగో, గిరము,..." ఆము. ౪, ఆ. ౧౩౪. ఆం భా. ద్వి. ౨౩.

**తుమ్మికి.** దే. వి. తిందుకము. "సీ.. కలివెపండులఁ దొడిపెండపండ్లఁ దుమ్మికిపండ్లు బానపండులు గంగరేనుపండ్లు." కాశీ. ౩, ఆ. ౭౯. ఆం.భా.ద్వి.౪౬.

**తుమ్మిపూరాజనాలు.** దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. తుమ్మిపూరాజనా లమ్మదుగొలిగెలు జీవుప ముక్కులు చిలుకముక్కులు..." హంస. ౪, ఆ. ౧౨౮.

**తుమ్ము.** దే. అ. క్రి. క్షుతముచేయు. "ఉ. తుమ్మిన యప్పుడుం బరముత్రొక్కఁ జరించినయప్డు వారి పానమైనరించినప్పు డశనంబు భుజించినయప్డు... వారువం దగున్." కాశీ. ౫, ఆ. ౨౦౪, భాగ. ౯, స్కం. ౧౫౫. వి. క్షుతము. "ఆ. అవులింత తుమ్ము శోషంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ,బలుకవలయు..." భార. విరా ౧, ఆ. ౧౩౭, ఆం. భా. ద్వి. ౧౨౬.

**తుమ్మెద.** దే. వి. భ్రమరము,తేఁటి. "గీ. తుమ్మెదల తోడఁ గూడినతమ్మివోలె, నెలవుగాఁ బోఁచె గిరి కన్యకమ్మొగంబు." హర. ౪, ఆ. ౮౨, ఆం. భా. ద్వి. ౨, ఆ. ౯౫.

**తుమ్మెదకంటు.** దే. వి. (తుమ్మెద+కంటు.) చంపకము, సంపెంగ. "ఉ. తుమ్మెదకంటు పూమొగడతోఁ దులదూఁగు లతాంగిముక్కు..." రామా. ౪, ఆ. ౬౬.

**తుమ్మెదమామిడి.** దే. వి. (తుమ్మెద+మామిడి) కోశామ్రము కొండమామిడి. (శ. ర.)

**తుమ్మెదరేఁపుల్లు.** దే. వి. బ. (తుమ్మెద+రేఁపుల్లు.) బాలక్రీడావిశేషము. "సీ. తుమ్మెదరేఁపుల్లు కుమ్మర సారెలు బావారుబసవన్న పత్తికాయ." హంస. ౩, ఆ. ౧౪౬.

**తురంగద్వేషము.** సం. వి. ష్. పుం. మహిషము,దున్న.

**తురంగమము.** సం. వి. అ. పుం. వేగముగాఁ బోవునది- గుఱ్ఱము. [1. గుఱ్ఱము; 2. మనస్సు.

**తురంగము.** సం. వి. అ. పుం.-వేగముగాఁ బోవునది.

**తురంగవదనుఁడు.** సం. వి. అ. పుం. కిన్నరుఁడు; ఇట్లే తురంగవక్త్రుఁడు. మొ.

**తురంగవల్లి.** మి. వి. వస్త్రవిశేషములు. "గీ...పొడలు పచ్చడంబు హరిణవల్లి హంసవళులుఁ దురంగ, వల్లిఁ బొదలును సామంతవళులు పనఁగఁ,దనరెడు పసందుపటములు గొనిరియె వెలకు." హంస. ౫, ఆ. ౩౫౫.

**తురంగసాది.** సం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు.

**తురంగారి.** సం. వి. ఇ. పుం. 1. మహిషము,దున్న; 2. కరవీరము, గన్నేరు.

**తురంగి.** సం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు. ఈ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. అశ్వగంధ, పెన్నేరు. విణ. (న్. నీ. న్.) గుఱ్ఱము కలవాఁడు.

**తురంగిక.** సం. వి. ఆ. స్త్రీ. దేవతాళము, ఆవరదంగి.

**తురక.** వై. వి. (సం. తురుష్కః.) మ్లేచ్ఛుఁడు; ఒకానొకజాతివాఁడు. "క. గోవధము సేయుతురకల, దైవంబవు నీవు...నిరకవైరీ." స్వా. ౩, ఆ. ౪౨. ఆం. భా. ద్వి. ౨౯౦.

**తురకదొగ్గలి.** ద్వ. వి. (తురక+దొగ్గలి.) ఒకజాతి దొగ్గలి. (శ. ర.)

తురకపత్తి. ద్వి. వి. (తురక+పత్తి.) ఒకజాతిపత్తిచీ. "సీ. గురిగింజ గురివెంద తురకపత్తియుం..." హంస. ౪, ఆ. ౧౦. [(శ. ర. ప్రా.)

తురకపికిలి. ద్వి. వి. (తురక+పికిలి.) ఒకజాతిపికిలిపిట్ట.

తురకబంతి. ద్వి. వి. (తురక+బంతి.) ఒకజాతిబంతిచీ. (వా.) [జాయి. (శ. ర)

తురకజాయి. దే. వి. ఔ. (తురక+జాయి.) బొంత

తురకవేము. ద్వి. వి. (తురక+వేము.) తృణనింబముచీ. (శ. ర.) హంస. ౪, ఆ. ౧౧.

తురగప్రియము. సం. వి. అ. పుం. యవసస్యము. విణ. (అ. ఆ. అ.) 1. గుఱ్ఱములకుఁ బ్రియమైనది; 2. గుఱ్ఱములయం దిష్టము గలది.

తురగము. సం. వి. అ. పుం. గుఱ్ఱము.

తురగవళ్లు. వి. వి. బ. వస్త్రవిశేషములు. 'గీ. గరుడ పచ్చలు చిత్రముల్ తురగవళ్లు ..మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు." ప్రబంధ. ౨౬౨.

తురగి. సం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు. ఈ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. అశ్వగంధ, పెన్నేరుచీ.

తురము. సం. వి. అ. పుం. వేగము. విణ. (అ. ఆ. అ.) వేగము గలది.

తురా. దే. వి. 1. మృదువై నిలువైన పక్షియీఁకల తోను రత్నములతోను గూడిన శిరోభూషణవిశేషము. (దీనిని గుఱ్ఱములకలపైఁ గూడ నలంకారముగా పెట్టుదురు.) "ఉ. హేమమున జేఁకన న్వైనఁగ ముత్యపుటొంట్లసియాడ మల్కుతో, డామెనకెట్టి కట్టినకడానిజగాజిగి హాగమీఁద నిద్దామెఱుఁగుందురా గులుక తంద్రిపిఱుందు జయంతుఁ డాశ్విక,స్తోముఁడు తోడ వచ్చె రవ జోడలరన్ వెలివాజి మీటుచున్." శశాం. ౫ ఆ. ౭. పార్వ. ౨, ఆ. ౭౦; 2. స్త్రీ శిరోభూషణవిశేషము, వాలపాశ్యాభేదము. (చూ. తురాయి.)

తురాయి = తురా. దే. వి. (క. తురాయి. త. తురాయ్. హిం. తురాహ్.) 1. మృదువై నిలువ గలిగిన పక్షియీఁకలతోను రత్నములతోడను గూడిన శిరోభూషావిశేషము. (దీనిని గుఱ్ఱములకలయందుఁ గూడ అలంకారముగా పెట్టుదురు.) "శా... కెం, పుకాన్నెంపుదురాయి దీపపడంపున్యాగెయున్ బన్నుచున్, మిన్నా లేజిని దెచ్చినన్..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౨౦; 2. స్త్రీ శిరోభూషణవిశేషము, వాలపాశ్య. "సీ ..తనరుసు వాల పాశ్యావిశేషములు మూసక తురాయి..." ఆం. భా. ద్వి. ౧౪౭. శుక. ౨, ఆ. ౩౦౫; 3. కర్ణభూషణము. "చ... తావకయవాంకుర పాండు కపోలపాళికన్, బొదలుతురాయి గాఁగ నసఁ బోఁడి ఘటించితిఁ గాదె యిచ్చటన్." రఘు. ౭, ఆ. ౧౦౬; 4. వృక్షవిశేషము. "సీ. అల్లిపువ్వులును నంద్యావర్తములు వాడగన్నేరులు తురాయి గట్టిపూలు." హంస. ౧, ఆ. ౧౯౫.

తురాయీ. దే. వి. ఖడ్గపుఁబిడికొనయం దలంకారముగాఁ గట్టిపూలగుత్తి. "వ ..పూలతురాయీల రాణించుచేకత్తులగింగిలలును .." ప్రబంధ. ౩౮.

తురాషాహుఁడు. సం. వి. హ్. పుం. - త్వరగా శత్రువుల నణఁచువాఁడు ఇంద్రుఁడు.

తురి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. నాడె, సాలెసానిసాధనవిశేషము.

తురికి. వై. వి (సం. తురుష్క. క. తుంకి) 1. తురుష్కదేశపుగుఱ్ఱము, గుఱ్ఱము "సీ ..దేశభేదవాయుబలు వారబ్బి దురికి కచ్చి యనంగఁ దోఁచుచుండు." ఆం. భా. ద్వి. ౧౯౬. భా. రా. యు. ౨౭౧, 2. వాహనము. "సీ. చాయ జక్కవ చంటి సాహేబు పావని తురికి మానిక మగుదుంత యొకటి" ప్రబంధ. ౧౯౭.

తురికీ. వై. వి. (సం. తురుష్క.) 1. తురుష్కదేశపుగుఱ్ఱము, గుఱ్ఱము. "క. శితికంఠసుతుఁడు ఖచర, స్తుతుఁడై యీయుచ్చరూపుతురికీ నాస్కంధిత ధారితక ప్లుత రేచిత వల్గితగతులఁ దరటుచేసిన నదియుఁన్." పాండు. ౧, ఆ. ౧౯౩. సాంబో. 3, ఆ. 3.

తురితము. వై. క్రి. విణ. (సం. ద్రుతమ్. త. తురితమ్. క. తురివా. హిం. తురంత్.) శీఘ్రముగా. (శ. ర. ప్రా.)

తురీన. వై. క్రి. విణ. ద్రు. (సం. ద్రుతమ్.) తటాలున, శీఘ్రముగా "పంచచామరము...బొల్తుక ల్దలిర్తు ర,చ్చర ల్మలంగలంచ మించుసంద్రు నందుఁ బుట్టుచున్, దురీన లేచునట్టిజాడ బోఁకుఁ జూప రెన్నఁగన్." య. 3, ఆ. ౭౨. కుచల. ౨, ఆ. ౧౪౩.

తురీయకము. సం. వి. న. (అ. యికా. అ.) నాలుగవది, చతుర్థము.

తురీయము. సం. వి. అ. న. నాలుగవయవస్థ, సమాధ్యవస్థ. విణ. (అ. ఆ. అ.) నాలుగవది, చతుర్థము.

తురుంజీ. దే. వి. మాదీఫలము. (బ్రౌ.)

తురుషా. దే. వి. ఒకజాతికూరాకు. (శ. ర.)

తురుఫీ. దే. వి. (హిం. తురఫీ.) గుఱ్ఱపుదండు. "ఉ. మందరధీరుఁ డన్యనృపమర్దనుఁ డాపుర మేలు రాజు ..మానోత్తమ మొక్క డెక్కి వచ్చెం దురుఫీలు కొన్ని తనచేరువ రా నుపలంబుఁ జేరఁగన్." నిరం ౪, ఆ. ౯౯.

తురుఖు = తురుఫీ. (శ. ర. బ్రౌ.)

తురుష్కము. సం. వి. అ. పుం. 1. దేశభేదము, తురకలదేశము (టర్కీ); 2. చిల్లమడ్డి, గంధద్రవ్యవిశేషము.

తురుష్కుఁడు. సం. వి. అ. పుం. తురక, తురుష్కదేశస్థుఁడు.

తుర్క. వై. వి. (సం. తురుష్కః.) మ్లేచ్ఛుఁడు, తురక. "సీ. అదె పాండవులగుడి యట దక్షిణంబునఁ గర్తారుఁ డుండు తుర్కలమసీదు." క్రీడా. ౧౪౯.

తుర్యము. సం. అ. న. బ్రహ్మము. "ద్వి. సతతంబు సురల నాశ్చర్య మొందించు, సతనితుర్యపుభక్తి నరయనికతన." ద్వి. పరమ. ౩, ఆ. ౨౨౭ పు. విణ. (అ. ఆ. అ.) నాలుగవది, చతుర్థము.

తుర్వము. దే. వి. తొఱ్ఱి. "ఆ. దోసమల్లువంటి తుర్వమం దాత్మను, జూచి యూసల నటు గోసివేసి, వాసనల్ దెలిసినవాఁడెపో బ్రహ్మంబు." వేమన. ౧, ప్ర. ౨౩౦.

తుఱంగలి. దే. వి. (క. తుఱుంగల్, తుఱుంగల్.) 1. కాంతి, ప్రకాశము. "సీ. ధూమంబు వొదివినఁ దుఱంగలిమెఱుఁగులం దలఁగి మాసినదీపకళిక పగిది." భార. విరా. ౧, ఆ. ౨౯౪; 2. అతిశయము. (చూ. తుఱంగలించు.)

తుఱంగలించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు, మెఱయు. "గీ. అవని గంపింప లలితపీతాంబరంబు, జెఱఁగు దూలఁ బత్త్రాంశులు దుఱంగలింప." భార. భీష్మ. ౨, ఆ. ౧౫౫. హరి. ఉ. ౬, ఆ. ౧౩౦; 2. అతిశయించు, అధికమగు. "సీ. నాకవిద్యాధరీనాట్యశాలలయందుఁ దూర్యత్రయంబులు దుఱంగలింప." హర. ౭, ఆ. ౧౭౦. విజ. ౩, ఆ. ౪౨; 3. ఒప్పు. తనరు. "సీ ..త్రాలెను పరలేఁ దుఱంగలించె...అలరె ననంగ, నొప్పిన న్నాటగాఁ జెప్పఁబడును." అం. భా. కృ. ౪౩.

తుఱంగలిగొను. దే. అ. క్రి. (తుఱంగలి+కొను.) 1. ప్రకాశించు. "క. మఱునాఁడ యగుట లెస్సగ, నెఱిఁగె నిచుం దపుడు వేఁడి యెదలినదీప్తుల్, దుఱంగలిగొనఁ బశ్చిమగిరి, చఱికి ననతిదూరమున విశదుఁడై తోఁచెన్." భార. సౌప్తి. ౧౬౯; 2. అతిశయించు, అధికమగు. "చ. వెఱవకు మో కుమార పదికేలవిధంబుల నైన నిన్ను నే, మఱవ మఱేడకుం జపుట మాని సుఖంబున దక్షవాటికన్, దుఱంగలిగొన్నసమ్మదముతో గమనింపుము .." భీమ. ౨, ఆ. ౧౫౫. కృ. శకుం. ౩, ఆ. ౩౬.

తుఱి. దే. వి. గుంపు, ప్రోవు. (చూ. తుఱిగొను.)

తుఱిగొను. దే. అ. క్రి. (తుఱి+కొను.) గుంపుగూడు, క్రిక్కిఱియు. "సీ. తూఱుగోలలు నాఁటి తుఱిగొని తనకుం బిపాది సమర్చనకోలపురులు ..." కు. సం. ౧౨, ఆ. ౧౪౭.

తుఱుగు. దే. స. క్రి. (క. తుఱుకు. త. తుఱు.) క్రుక్కు, బలాత్కారముగా దోఁపు. "వ. వెంగలు లగ్రుచ్చు లచ్చాలుం బట్టి నోరం జీర దుఱిగి యడవికిం గొనిపోయి యెదలు జల్లించి పసిండిగానక పీచుంగు వైచి పోయిరి..." భార. శాం. ౧, ఆ. ౨౬౩, మార్క. ౨, ఆ. ౧౦౧.

తుఱుము. దే. స. క్రి. (క. తుఱుఱు, తుఱుమ్బు.) 1. తుఱుముపీఁటలోఁ గొబ్బెరను కోరు. (శ. ర. బ్రౌ.) 2. (జుట్టు) ముడుచు, ముడివేయు. "క. నడిగోలు వట్టికొని సన్, విడువిడు మని పోవుసట్టివెరపైనను వెంబడి నేఁగెదుతలఁపునఁ గ్రొమ్ముడి యొకచేఁ దుఱుముకొనుచు నో మలరింపన్." యు. ౫, ఆ. ౧౧౭; 3. (కొప్పున పుష్పాదులు) చెరువు, పెట్టు. "రగడ. చేర్పమై నల్లయది పెఱుఁ దొలుప్రూఁ దుఱిమె." స్వా. ౩, ఆ. ౮౪. శుక. ౨, ఆ. ౪౮౬; 4. చక్కఁజేయు, సవరించు. "సీ. పుత్త్రి కానిర్మాల్యపుష్పదామంబులఁ దొఱ్ఱి కొప్పులలోనఁ దోఁపి తుఱిమి." వైజ. ౩, ఆ. ౭౦; 5. తుఱుగు, బలాత్కారముగఁ దోఁపు. "క. విలసిల్లుచు నుండఁగ మ్రుచ్చిలిపట్టి కుమారు నోరఁ జీర తుఱిమి వెంగలు లగుక్రూరులు గొందఱు .." భార. ద్రో. ౨, ఆ. ౧౯౨. వి. 1. కొప్పు, స్త్రీధమ్మిల్లము. "ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుము

జాతి నదంతటఁ జక్కఁదిద్దఁ బోఁబయ్యెదజాతి నయ్యదిరిపాటున గ్రక్కున నీవి జాతి..." విజ ౧, ఆ. ౧౦౩. అం. భా. ద్వి. ౦౪౫; 2. (పురుషుని) జుట్టుముడి, శిఖ. "సీ. పుప్వులు తుఱు మున భోగిరై తుఱుమందు పెఱ వింత లేక లేవెలుఁగుఁ గాని." వీర. ౨, ఆ. ౨౩౪; 3. పాడి. (శ. ర. బ్రా.)

తుఱ్ఱు. శే. వి. గమనవేగమందలిధ్వని కనుకరణము. (వ్యవ.) వాఁడు తుఱ్ఱునఁ బయవెళ్ళినాఁడు.

తుల. సం. వి. ఆ. స్త్రీ. 1. త్రాసు; 2. తులాదండము, 3. నూఱుపలముల పరిమాణము; 4. పోలిక,సాదృశ్యము; 5. ఒకరాశి, 6. తూఁచుట,తోలనము.

తులకరించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు,మెఱయు. "సీ. శిరిగాఁ దిరుపుగట్టి కటాల్నఁ దివురుచోఁ దొలుకరిమెఱపులు తులకరింప." దశా. ౭. ఆ. ౧, ఆ. ౨౭౬; 2. ఆనందించు. "గీ. ఆఱుమఱలు దఱ లాలించి యూమతించి, కలికితోలిమాటమి విభుండు తులకరించె." కృ. శకుం. 3, ఆ. ౯౫; 3. కలుగు, పొటమరించు. "వ...భావిపుంభావ సంభావనాకరిచయంబు సంపాదించునొంపునం బింపిల్లుమాయుంకలికికొమిరెల మొలకచనుమోసులం దులకరించిన తళుకుసిబ్బెంపుతళతళల దళముగాని యెనో యన..." వసు. ౪, ఆ. ౨౩.

తులకించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు, మెఱయు. "చ...నిశాచరనాథు పాపపుంకరుహములందుఁ గోకములకై వడి నంచలరీతిఁ దేంట్లపై,ఖరిఁ దుల కించె నిర్జరశిఖామణిమాళిఁ దనర్చుజాలికం,పుర వలు..." దశా. ౨, ఆ. ౧౨౨. ఉ. రా. ౧, ఆ. ౯౯; 2. ఒప్పు,అందమగు. "ఉ. వింద్లకు మేల్తరంబు ఘనవేణి కనుంబొమదోయి బంగరుం, గిండ్లకు మేటిసాటి తులకించుచనుంగవ..." హంస. ౧, ఆ. ౬౧; 3. కనఁబడు, ప్రకటితమగు. "చ. వకుళఫలానుకారు లయి వట్రువలై మెఱుఁగారు క్రొత్తమా,త్తికములపే రొకింత దులకింపఁగ నిర్మల హేమరత్నకర్ణికలు చలింప .." కాశీ. ౪, ఆ. ౧౪౫, శుక. ౨, ఆ. ౧౦౪; 4. కుతూహల పడు. "ఉ. గుమ్మకత్తుతెమ్మెరలకుం దులకించి వసంతవేళలన్, గొమ్మలు కానసాంతరనికుంజము లన్ జెలువార నొంటిమైఁ,బమ్మినరక్తిచే నునయు పల్లవకోటులఁ దూఱ నేల కోఁ,గొమ్మని కూడి క్రొవ్వ లపుఁ గూర్చె బళీ సుమనస్సమూహముల్." కృ. శకుం. ౧, ఆ. ౭౩; 5. ఆనందించు, సంతసించు. "ఉ. ఈవిరిఁబోఁడిఁ గైకొను మిదేటికి నందియ మంచుఁ గూరిమిన్, దేవర యానతిచ్చిన మదిం దులకించుచుఁ బెండ్లి యాడెదుఁ, రావలరాజు నన్నుచు .." య. ౪, ఆ. ౭౦.

తులకింపు. దే. అ. క్రి. (తులకించు ధా.) ప్రకాశించు. "సీ. తళుకుఁజెక్కులవానిఁ దులకింపుగలు కెంపుకలు కెంపు లోలయుంన వ్వ్రేలుకువాని." వసు. 3, ఆ. ౪౬. వి. ప్రకాశము, కాంతి. "క... వాతెఱకు నమృతమే తుల,మేతులకింపులవిసాళి మిసిమిఁ గ్రమ్మిం,చే తుల..." విజ. ౧, ఆ. ౧౧౩.

తులదూఁగు. మి. అ. క్రి. (తుల+తూఁగు.) సమాన మగు,పోలు. "చ...విందు చం,దురునును బోఁగ వెన్నెలలతోఁ దులదూఁగెడు తద్గుణంబులన్." సైవ. ౧, ఆ. ౪౮, రామా. ౪, ఆ. ౬౬.

తులన. సం. వి. ఆ. స్త్రీ. 1. పోలిక, సాదృశ్యము; 2. తూఁచుట; 3. ఎత్తుట; 4. మచింపువేయుట.

తులనము. సం. వి. అ. న. 1. తూఁచుట; 2. పోల్చుట; 3. ఎత్తుట.

తులనీయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పోల్పఁ దగినది; 2. కదలింపఁదగినది.

తులము. దే. వి. పలమునందు మూఁడవభాగము, ఒకరూపాయయెత్తు. (శ. ర.) [లించుచున్న.

తులయత్. సం. శత్రు. 1. పోల్చుచున్న; 2. కద

తులయితవ్యము సం. = తులనీయము.

తులసమ్మ. మి వి. (తులసి+అమ్మ.) తులసికోట; తులసీ దేవత. "గీ. రాదినగలు సదాచారరతియుఁ దేవ, పూజ నిత్యాన్నదానంబుఁ బూసపోట్టు, చిదురఁ జల్లినతులసమ్మచిన్నితిన్ని కలిగి కనుపట్టు నాతని కాఁపురంబు." శుక. ౨, ఆ. ౧౪౫.

తులసి. సం వి. ఈ. స్త్రీ. తోళసిశి.

తులసికోట. ద్వ. వి. (తులసి+కోట.) తులసిమొక్కకుఁ గట్టినకట్టడము. (వా.)

తులసిపోఁగులు. మి. వి. బ. (తులసి+పోఁగులు.) కర్ణ భూషావిశేషములు. "గీ. తులసిపోఁగులు పొంద లంగాఁ గలుఁగుపెట్టి, చిక్కుబాకీలు పిదప విశ్వేమ పటిచె." నిరం. ౨, ఆ. ౧౧౬.

తులసివనమాలికలు. మి. వి. ధాన్యవిశేషము. "వ... చిలుకముక్కులు మధురములు చామరాలు కెండె

ముదుపులు రాచవన్నెలు తులసీవనమాలికలు సింధు కర్పూరాలు..." ప్రబంధ. ౧౧౨.

తులాంబరము. సం. వి. అ. న. పట్టుబట్టము, దుకూలము. "ఉ. ఎల్లరు వంత మేలుకొని యుందు ముఖుల్ ముఖమజ్జనాదికం, బల్లనఁ దీర్చి తైపుగఁ దులాంబరముల్ మణిభూషణావళుల్, మల్లెసరంబులున్ బరిమళంబులు దాలిచి..." రామా. ౨, ఆ. ౧౦౬.

తులామానము. సం. వి. అ. న. తప్పుతూనిక.

తులాకూటుఁడు. సం. వి. అ. పుం. తప్పుతూనిక తూఁచువాఁడు.

తులాకోటి సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. అందె, నూపురము; 2. త్రాసుదండెకొన; 3. దశకోటిసంఖ్య

తులాదానము. సం. వి. అ. న తనయెత్తుతూనిక గల బంగారు రత్నములు మున్నగువానిని దానము చేయుట.

తులాధరుఁడు. సం. వి. అ. పుం. వర్తకుఁడు, బేహారి.

తులాధారుఁడు. సం. వి. అ. పుం. 1. త్రాసుదండె; 2. త్రాసుత్రాడు.

తులాధారుఁడు. సం. వి. అ. పుం. వర్తకుఁడు, బేహారి.

తులాబీజము. సం. వి. అ. న. గురివెందగింజ.

తులామానము. సం. వి. అ. న. 1. త్రాసునఁ దూఁచెడు తూనిక; 2. తూనికతాయి; 3. త్రాసుదండె.

తులిక. సం. వి. ఆ. స్త్రీ. ఆడుకాటుకపిట్ట, ఖంజరిక.

తులితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తూఁచఁబడినది; 2. పోల్పఁబడినది; 3. ఎత్తఁబడినది.

తులిని. సం. వి. ఈ. స్త్రీ. బూరుగుచెట్టు.

తులుకాడు. దే. అ. క్రి. (తులుకు+ఆడు.) తొణఁకు, చిందు. "ద్వి. తొమ్మిదిరసములు తులుకాడుదాని, యిమ్మడివర్ణన లెసఁగంగ ద్విగుణ, మగుసలంకారంబులనలారుదాని." పండితా. దీక్షా. ౫. పు

తులుకు. దే. వి. (క. తుళుకు.) చలనము, కదలిక. "లయవిభాతి... భ్రూ,ములుకులుకు రాచిలుక పలుకులకుఁ దమ్మెరల బెళుకులకుఁ గొన్ననలతులుకులకు కన్నెని, యలపులకు..." య. ౫, ఆ. ౧౦౪.

తులువే. దే. విశే. వేగముగలది. (దీనికిఁ గర్మధారయమందు నిగాగమము వైకల్పికము.) "ద్వి. తులువచనిగాలిచేఁ దొడిమలు వ్రిదిలి, గలగలరవములఁ గారాకు డుల్లె." ద్వి. భాగ. ౧౦, స్కం. (శ. ర.)

తులువేన. దే. వి. వేగము. (శ. ర.)

తులుచు. దే. స. క్రి. చెట్టునుండి పండు మొ. రాల్చు. (ప్రా. ధులంచు. వా.)

తులుము. దే. స. క్రి. రాల్చు. "మ. ధరఁ బాంథుల్ బెగడొందఁ ద్రిమ్మరియె భద్రశ్రీమహీభృన్నృపా, పరసాలానవపక్వశృంఖలితచంచన్నారు తేథంబు లై, పరసాలానవపత్త్రముల్ తులుముచున్..." చంద్రి. ౪, ఆ. ౩౨.

తులువ దే. విశే. 1. కుంటరి. దుష్టుఁడు. "గీ... రాధేయుఁడ్పోటితులువ లెల్లను నతనినద్బుద్ధియండ్రు." భార. ఉద్యో. ౧, ఆ. ౩౬. య. ౫, ఆ. ౧౦౪; 2. మూర్ఖుఁడు, అవివేకి. "క. మొదల విచారింపక చే,యుందు రది తుది నొప్పకున్న నుక్కఁడఁగి ముదుం,గుదురు విను తులువ లప్పను, బొదవక చెడు బూది విడిన హొంతములకరణిన్." భా. రా. యు. ౧౦౧. [(శ. ర.)

తులువకత్తి ద్వ. వి. (తులువ+కత్తి.) వంపుచురకత్తి.

తుల్యము. సం. విశే. (అ. ఆ. అ.) సాటి, సమానము

తుల్యయోగిత. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక యర్థాలంకారము.

తువర. దే. వి. 1. తుంబుర. (శ. ర.); 2. తువరభూమి, సువాసన గలభూమి (ప్రా.) "అ... తువర తుస్సినాఁగఁ దువరభూమి." ఆం. భా. ద్వి. ౪.

తువరము. సం. వి. అ. పుం. కందిచెట్టు. పుం, న. ఒగరు, ఒకరసము. విశే. (అ. ఆ. అ.) ఒగరైనది.

తువరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కందిచెట్టు; 2. అడవితొగరి తీఁగ; 3. తొగరిమన్ను, పటిక.

తువరుఁడు. సం. వి. అ. పుం. శ్మశ్రుహీనుఁడు.

తువ్వర. దే. వి. 1. తుంపర,శీకరము. "క. అవ్వనముఁ జేరి మవ్వపు, జవ్వనపుర్ రాచకొమరుఁ జల్లనిమంచుం, దువ్వరల నివ్వటిల్లెడు, పువ్వుంబొదరింట నునిచి భుజగకుమారుల్." కువల. ౪, ఆ. ౧౩౪. సుద. ౨, ఆ. ౧౦౬; 2. నీరు మొదలగువాని జల్లు. "క. మువ్వురమీఁద మరందపుఁ, దువ్వరఁ జల్లుచుఁ బరాగతోయధరంబుల్, బువ్వఁగఁ జొచ్చెం దఱుచుగఁ, బువ్వులజడివాన లేలుపులు గురియింపన్." జై. ౪, ఆ. ౨౩౪.

తుషము. సం. వి. అ. పుం. 1. ఊఁక; 2. తాండ్రచెట్టు.

తుషారము. సం. వి. అ. పుం. 1. మంచు,హిమము; 2. తుంపర, శీకరము; 3. కర్పూరవిశేషము. విశే. (అ. ఆ. అ.) చల్లనిది.

తుషితులు. సం. వి. అ. పుం. బ. గణదేవతావిశేషము.

తుష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము; 2. తృప్తి, తనివి.

తుష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోషము నొందినవాఁడు; 2. తనివి చెందినవాఁడు.

తుష్యత్. సం. శత్ర. 1. సంతోషించుచున్న; 2. తనివిచెందుచున్న.

తుస్సి = తువర. ఆం. భా. ద్వి. ౪.

తుస్సు. వై. విణ. (సం. తుచ్ఛమ్.) నీచము (చూ. తుస్సుపెంజెర. శ. ర.) [సర్పము (శ. ర)

తుస్సుపెంజెర. ద్వ. వి (తుస్సు+పెంజెర.) ఒకజాతి

తుస్సుపోవు. ద్వ. అ. క్రి. (తుస్సు+పోవు.) నీచదశ నొందు, భంగపడు. "క...తుది నీవును దుస్సు వోదు త్రుళ్లి టుతుగుమీ." భార. శాం. ౪, ఆ. ౩౯౯. [చంద్రుఁడు.

తుహినకరుఁడు. సం. వి. అ. పుం. హిమకరుఁడు,

తుహినము. సం. వి. అ. న 1. మంచు, హిమము; 2. వెన్నెల, చంద్రకాంతి; 3. కర్పూరము. విణ. (అ. ఆ. అ.) చల్లనిది. [మంచుకొండ.

తుహినశైలము. సం. వి. అ. పుం. హిమవత్పర్వతము.

తుళు. దే. వి. (క. తుళువ.) కన్నడదేశమునకుఁ బడమట నుండు దేశమందలిభాష.

తుళువ. దే. వి. (క. తుళువమ్.) 1. ఒకానొకదేశము. "గీ. ఆదిగాఁ గల్గురాజులు మేదురగతిఁ, దుళువ దొరలును బోతులు దురుసుగాఁగ, బ్రతిదినంబును ఘోర సమరణ మొనర్చి, నిలిచి పోరాడె గజపతి బలము లపుడు." కృష్ణ. ౩, ఆ. ౧౯౭; 2. ఒకానొకవంశము. "గీ. వానివంశంబు తుళువాన్వయము మయ్యె." స్వా. ౧, ఆ. ౨౨.

తూ

తూ. దే. వి. (క. తూ.) 1. ఉమియుటయం దగు ధ్వని కనుకరణము. "చ...తూ, యని పలు మాఱుఁ దూ పొడిచి యల్లనఁ బుష్పోదిరత్న పెట్టి..." విక్ర. ౭, ఆ. ౬౯; 2. ఊఁదుటయం దగు ధ్వని కనుకరణము. (చూ. తూపొడుచు.), 3. నిందార్థము.

తూఁగాడు. దే అ. క్రి. (తూఁగి+ఆడు.) ఊఁగు. "సీ. తూఁగాడుపారదంష్ట్రలదీప్తి వెలవెల్ల నగుదీధ రుచులను నతకరింప." హరి. పూ. ౭, ఆ. ౧౬౭; 2. చలించు, కంపించు. "గీ. రయమున మెఱుఁగుఁగ నొక్క_సారనము ఫాల,దేశమునయందు నాఁటించి తీవ్రశక్తి, నురము వైచినఁ దూఁగాడి యొఱఁ గఁబాఁడి, కట్టె యకృతవ్రణుఁడు దీర్చి బరకు రాము." భార. ఉద్యో. ౪, ఆ. ౩౪౪.

తూఁగించు. దే. స. క్రి. (తూఁగు ధా. ప్రే.) జరిగించు, చేయు. "గీ...ఈవాఱుఁగంటి, పెండ్లిఁ దూఁగించు టది యెంతపెద్ద మాట." య. ౩, ఆ. ౧౦౧. ఆము. ౨, ఆ. ౯౪.

తూఁగియాడు = తూఁగాడు 1. ఊఁగు. "చ. గురు కుచకుంభభారమునఁ గోమలగాత్రము తూఁగి యాడఁగా" గంధ. ౧౪౩; 2. (చలించు, కంపించు) "వ. పరివహావనర్ఘూపాసంపాతంబులం దూఁగియాడుకరళ్లచప్పుళ్లు దిక్పుటంబుల నాస్ఫోటింప." శైవ. ౭, ఆ. ౨౭.

తూఁగు. దే. అ. క్రి. 1. ఊఁగు. "మ. తమిఁ బాదీఁగెలతూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూఁగుచూ, కొమరుంబ్రాయపుగబ్బిగుబ్బెతలయుం ఘుగ్లిల్..." కళా. ౧, ఆ. ౪౨. చిత్ర. భా. ౨, ఆ. ౧౨౧; 2. చలించు, కదలు. "సీ. తూఁగెడు నునుఁగురుల్ లోలెంచుఘర్మాంబువులఁ దోఁగి నుదుటిపై మలఁగుచుండ." నిర్వ. ౭, ఆ. ౭౭. (శ. ర. పా. 'తూలెడు.' ముద్రి. పా.); తూనికపడు, తోలనము నొందు. "గీ. వినుము తుల నిడి యెత్తుచో వేయునశ్వ,మేధములకంటె సత్యంబు మిగులఁ దూఁగె" మార్క. ౧, ఆ. ౨౦౭; 4. ఓర్చు, శక్తుఁడగు. "ఉ. ఓమునుశేంద్ర నీవెనుక నుద్దవిడిం బఱతెంచు దాన నీ,శామహనీయవేగమున కంకిలి సేయక తూఁగనోపినం,గామితసిద్ధి పొందు..." భో. ౭, ఆ. ౧౭. ౯జ. పీఠి. ౨౫; 5. కూరుకు, కునికిపడు. "ఆ. మేను వ్రాసువడఁగ మీలితోన్మీలితలోచనాంబుజయుఁగఁబండ వగుచుఁ దూఁగనేల నాదులోడలపై వెమ్మని, నిదురపోదు రమ్ము నృపకుమార." విక్ర. ౨, ఆ. ౨౭. రామా. ౭, ఆ. ౧౧౭; 6. జరుగు, సాగు. (చూ. తూఁగించు); 7. వెడలు, ఉద్గతమగు. "సీ. మొఱఁగులు దూఁగెడు మృదుకరవల్లిక లల్లాడఁ జల్లు పోరాడి యాడి." నిర్వ. ౭, ఆ. ౪౯; 8. సాటియగు, తుల్యమగు. (వ్యవ:—) వారితో నేము తూఁగలేము; 9. దుర్బలమగు, నిస్సత్త్వమగు. 'శా. తూఁగెం జల్లనిగాడ్పు లేమి ఫణిసం

దోహంబు పేరాఁకటన్." పారి. ౪, ఆ. ౨౦. భార. భీష్మ. ౨, ఆ ౨౪౭. వి. తూఁగుట, కునికిపాటు. "గీ ..తూఁగు తందర యనంగ, మఱను నిద్రానికేతంబు మాతృభూత." ఆం. భా. ప్ర. ౧౪౧. విశే. ఊఁగునది (చూ. తూఁగుటుయ్యాల.)

తూఁగుటుయ్యాల. ద్వ. వి. (తూఁగు+ఉయ్యాల.) ఉయ్యాలమంచము, ఊఁగుట కనుకూలముగాఁ గట్టినమంచము మొదలగునది. "సీ. తూఁగుటుయ్యాలఁ దూఁగుచోఁ గొంత చెదరినయరవిరి వక్నుబా గట్టయుండ." కళా. ౨, ఆ. ౧౭. సైమ. ౭, ఆ. ౧౪౦.

తూఁగుటుఱ్ఱ్యాల = తూఁగుటుయ్యాల. "సీ. గుజ్జుమావ్వల నట్టుకొని ప్రేలుసునుఁడీఁగతూఁగుటుయ్యాలల నూఁగి యూఁగి." కవిరా. ౨, ఆ ౧౨౭. ఉ.రా. ౬, ఆ. ౧౭౩.

తూఁగుదవియ. ద్వ. వి. (తూఁగు+దవియ.) నిలువ్వన పాఁతినవెదురు మున్నగు నిడుపాటికఱ్ఱచివర త్రాళ్ల యాధారమున ప్రేలాడుచు ఊఁగుచు వెలుఁగు దీపము. (ఆకాశదీపము చెూ.) "క. పగటిసెగ వదలి పడమర, దిగిరాెన్ రవిమండలము వడిన్ రశ్ములు పై, నిగుడ నలవిష్ణుపదమున, దిగదిగ యని ప్రేలుతూఁగుదీవి య పోలెన్.' చంద్ర.౪ ఆ. ౫౪.

తూఁగుపలక. ద్వ వి. (తూఁగు+పలక.) కాపీపని వాఁడు గోడలమట్టము చూచుటకై ప్రేలఁగట్టిన నిడుపాటి పలక. (శ. ర.)

తూఁగుమంచేము. ద్వ. వి. (తూఁగు+మంచము.) తూఁగుటుయ్యాల. "గీ...బంగారుకోళ్ల, తూఁగు మంచముపై వేల్పుదొరయపోలె." య. ౫, ఆ. ౧౩. కాశ. 3, ఆ. ౬.

తూఁగొమ్ము. దే. వి. (తూ+కొమ్ము.) ఒకవిధ ముగుకుషిర వాద్యము. "వ. ఆ నగరంబు చెననుండి దిమ్ము రేఁగిన యట్లు తూఁగొమ్ములును దప్పెట్లును...మ్రోయ." ద్వా. ౧౧, ఆ. ౨౬.

తూఁచు. దే. స. క్రి. (తూఁగు ధా. ప్రే.) తూనిక చేయు, తోలనముచేయు. "ఆ. అవనినాథ దీని యంత నీమాంసంబు, దూఁచి కాఁకుఁ బెట్టు తోలఁగ కిపుడు." భార. అర. 3, ఆ. ౨౩౪. సైమ. 3, ఆ. ౧౬.

తూఁట. యు. దే. వి. తునక, ముక్క. "క... కృష్ణుఁ డోకయుష్మన కొ, ముక్కఁటుగ నడిచముఁ బలుకయు, దూఁటలుగా సేయ వాఁడుఁ దోలఁ గక కడిమిన్." పద్మ. ౧౦, ఆ. ౩౨. వై. విశే. (సం. దుష్ట.) తుంటరి, దుష్టుఁడు. (చూ. తూఁటరి.) [మగు. (శ. ర. బ్రా.)

తూఁటకట్టు. దే. అ. క్రి. (తూఁట+కట్టు.) ఖండిత

తూఁటరి. వై. విశే. (తూఁట+అరి - స్వార్థమున.) తుంటరి, దుష్టుఁడు. "ఉ. తూఁటరి దోచకారి పెకుదోసి యజామిళుఁ డంతమొందుచున్." భాగ. ౬, స్కం. ౧౦౨.

తూఁటవిలుకాఁడు. ద్వ. వి. (తూఁటు+విలు+కాఁడు.) తుంటవిలుకుఁడు, మన్మథుఁడు. "వ ..నొవలి చిట్టంటుఁజెమట మాటిమాటికిఁ గొనగోట మీఁటుచుఁ దూఁటవిలుకాని మోహనశక్తియుంబోలె నున్నరెుడ." పి. శకుం. ౩, ఆ. ౧౩౯.

తూఁటాడు. దే. స. క్రి. (తూఁటు+ఆడు.) శిథిలము చేయు, జర్జరితముచేయు. "మ. మృగరాజున్ గిగరాజు గుంభి మఱి గింభిన్ ద్రుంచి తూఁటాడున, త్యగరిష్ఠుల్ గల రింత..." మల్ల. శృం. ౭౩. శై; ౭, ఆ. ౪.

తూఁటికూర. దే. వి. ఒకజాతికూరాకు. "గీ...ఇటు తూఁటికూరాకుఁ జంద్రహాస, మెత్తుదుర రేల నామీఁద నింక కినుక." హరిశ్చ. ౨, ఆ. ౧౬౬.

తూఁటు. దే. వి. (క. తూతు.) బిల్లి, రంధ్రము. "సీ. తూము తూఁ టనఁగను దూపర మన గను...కగుఁ గందరంబు." ఆం. భా. ప్ర. ౧౪౫. దశా. 3, ఆ. ౧౦౩.

తూఁటుకట్టు. దే. అ. క్రి. (తూఁటు+కట్టు.) రంధ్రముపడు, తూఁటుపడు. "గీ...కమఠమువీరకంఖంబు లెల్ల, దొరలు నొత్తిరి దివి మ్రోఁతఁ దూఁటుకట్టు." భాగ. ఉద్యో. ౪, ఆ. ౧౩౧.

తూఁటుపడు. ద్వ. అ. క్రి. (తూఁటు+పడు.) రంధ్రముపడు. (బ్రా.)

తూఁటులుపుచ్చు. దే. స. క్రి. (తూఁటులుపోవు ధా. ప్రే.) రంధ్రములుపడఁజేయు. "మానిని... పెంపెక్కినసాధుజనంబులమర్మము లెప్పుడుఁ దూఱఁగ నాడుఖలుల్, ద్రొక్క ఖగంబులు ముక్కున నంగము దూఁటులుపుచ్చుచు నున్న వాఁగెన్." మార్క. ౨, ఆ. ౯౪.

తూఁటులుచేయు. దే. స. క్రి. (తూఁటులు+చేయు.) రంధ్రములు పడఁజేయు. "ఉ. తొమ్మిదియమ్ములం

దనువు దూఁటులుసేసిర నూతుఁ దీర్చి..." భార. భీష్మ. ౨, ఆ. ౨౩౨.

తూఁటులువోవు. దే అ. క్రి. (తూఁటులు+పోవు.) రంధ్రితమగు. "ఉ...నూతుమైఁ, దూఱఁ దురంగ మాంగములు దూఁటులువోవఁగ శల్యు సెమ్ములన్, గీఱ సిడంబు గాఁడఁ బరఁగించె సముజ్జ్వలచండకాండముల్." భార. శల్య. ౧, ఆ. ౧౯౭.

తూఁటువోవు = తూఁటులువోవు. భార. ద్రో. ౯, ఆ ౨౮. [తూఁడరి.,

తూఁడ వై. విణ (సం. దుష్టః.) దుష్టుఁడు. (మా.

తూఁడరి. వై. విణ. (తూఁడ+అరి - స్వార్థమున.) దుష్టుఁడు, తుంటరి. "క. వాఁ డెల్లవారు నిపూఁ, బోఁడి వలను మాను మనఁగఁ బుయిలోడక తాఁ, దూఁడరియై కటియఁబడిన, వాఁ డితనికి నేఁడు వగవ వల దనువారున్." భో. ౬, ఆ. ౧౦౮.

తూఁడి. దే. వి. ఔ. ఒకజాతిచూరాకుమొక్క. (చూ. తూఁటికూర.)

తూఁడు. దే. వి. ఔ. (త. తండు.) తామరపువ్వు మొదలగువాని కాడ, బిసము. "క. ఛందోజ్ఞాన కైనను దన, నంసన సధ్వరధురీణునకునైనను వా, నందముగ నిచ్చుటం బో, లుం దూఁడుల కట్ట మ్రుచ్చిలుట కలవోయన్." భార. అను. ౨, ఆ. ౨౪౭. ఆం. భా. ప్ర. ౧౬౯.

తూఁడులీఁగ. ద్వి. వి. తూఁడు. "చ...తూఁడులీఁ, గలపొది మ్రుచ్చిలించు టని కశ్యపసంయమి వల్కె భూవరా." భార. అను. ౩, ఆ. ౨౩౨.

తూఁడుదిండి. దే. వి. (తూఁడు+తిండి) హంస. "ఆ. తూఁడుదిండి మావు దొరవంగడంబునఁ, బుట్టి..." అచ్చ. యు. ౩౦. ఇట్లే. తూఁడుమేపుడుపుల్గు. అచ్చ. యు. ౯౮౨.

తూఁతకొమ్ము. దే. వి. (త. ఊదనకొంబు.) పిల్లఁగ్రోవి, మురళి. "ఆ. తూఁతకొమ్ము చంకఁ దోఁపిన యెద మెట్టు..." హం. పంచ. ౧, ఆ. ౯౮౮.

తూఁపర. వై. వి (సం. తుషారః.) తుంపర, శీకరము. "సీ. పన్నీటితూఁపరఁ బరఁగించుధారాగృహంబుల ఖేలవాడంబరములు." కళా. ౭, ఆ. ౩౭౦.

తూఁకణి. దే. వి. నాట్యవిశేషము. "ద్వి. డిల్లాయి తూఁకణి దేవణి జంకె." పండితా. పర్వ. ౩౭౮. పు.

తూకము. దే. వి. (తూఁగు ధా.) సమభారము. "శా. మూఁక లట్టినయోధయూథపమారుల్ మొండెంబులై రాలఁగాఁ, దూకంబు ల్వెడి లేరు లాకసమునం దూలంబులై తూలఁగా..." శై. ౭, ఆ. ౪౦. సురా. ౯౮. ౭. బరువు. (వ్యవః— అగిస్న తూక మెంత?

తూకు. దే. వి. (తూఁగు ధా.) 1. బరువు. (శ. ర.); 2. ప్రమాణము, కొలఁది. "క. వరుణుండు విప్రచిత్తియుఁ, దుర మొనరింపంగ నొక్కతూకున కార్యం, బరుదై చెల్లఁగ..." హరి. ఉ. ౧౦, ఆ. ౧౯౩; 3. సమయము, కాలము. "క. పోరులు పుట్టిన దనుజాలు, తూ రా నతఁ డంగి యలంక దొడరినతూకే, ఘోరావహకాలం బని, నారాయణుఁ డానతిచ్చినాఁ డాతనికిన్." కవు. ౯. ఆ. ౧౦౨; 4. తడవ, సారి. 'గీ...ఎద్దువేఁట, మొదలుగాఁ గలవేఁటలయెడ నెఱింగి, తిన్నఁ డొక్కొక్కతూకు వర్తింపఁ దొడఁగె." కాళ. ౩, ఆ. ౪౭. అచ్చ. కిష్కిం. ౧౪.

తూకువ. దే. వి. (తూఁగు ధా.) బరువు, భారము. "ద్వి. హృజ్జన్మభక్తుఁ డిల గుగ్గిలంబు, భావించి ధాతుకప్పడమునఁ గప్పి, కావడి తూకువగా వడిఁ దాల్చి." పండితా. పురా. ౧౯౭. పు

తూకొను దే. అ. క్రి. (తూఁకు+కొను.) 1. పూను, కడఁగు. "ఉ. మీకరుణావలోకనసమేతులఁగా ముముఁ జేయఁ జిత్తముల్, దూకొనసేని మాచనవు ద్రోచి కయ్యాఁ దగు..." భాగ. ౩. స్కం. ౯౩౦. శివధ. ౧, ఆ. ౭౧; 2. కలుగు, పొడము. "ఉ. తూలినమోముచెల్వుఁ బసఁ దూకొనుఘర్మజలంబువెల్లువం, దేలినమేను .." కవిక. ౩, ఆ. ౬౯; 3. చొచ్చు, ప్రవేశించు. "క. ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా, దురితంబున నీమనంబు దూఁకొనె..." భాగ. ౧౦. స్కం. ౬౩౧. ఆం. భా. కృ. ౧౨౨; 4. అతిశయించు, ఒప్పు. "క. ఆకరిదంతము మూఁపునఁ, గైకొని శ్రీకృష్ణుఁ డమరుఁ గంసచ్యుతికై, తూకొన్న శ్వేతధనువుం, దూకొన్నసభంబుకరణిఁ జిరవిక్రముఁడై." సాంబో. ౧, ఆ. ౧౨౯. వి. పు. ౧, ఆ. ౭౩. స. క్రి. గౌరవించు. "వ...అనూనంబు లగు విమానంబు లెక్కి చద్ది వచ్చిన సచ్చరిత్రులగుం జెప్పరానిదురు చని తూకొని తోకొనిపోవురంభాదివులు కుంభకుచలకలకలంబులును." భాగ. ౮. స్కం. ౪౯౦; 5. (తూకు+కొను.) గ్రహించు. "ఉ.

కాఁడినయమ్మచే సొలసి కంసవిరోధి శిరోధి స్రెల్గఁ జే, రూఢక మూర్ఛవోయె భుజగాంతకు తెక్కల కొక్కలాగునం, దోడుగఁ దాలవృంత ములఁ దూఁగొని చల్లనిగాలి చల్లె .." ఉ. హరి. ౧, ఆ. ౧౫౫. కవిక. ౧, ఆ. ౫౬.

తూచాతప్పకుండు. ద్వ. అ. క్రి. (తు+చ+తప్పక+ఉండు.) తు చ అనునవి సంస్కృతభాషలో వ్యర్థమైన పాదపూరకపదములు; వానినికూడ వదల కుండు-పూర్తిగా అనువర్తించు, కొంచెమైనను విడువకుండు. "మ. జన లోకోన్నత మైనకత్పురము తూచాతప్పకుండఁగ వర్ణనసేయక వశమా సి..." కాశీ. ౧, ఆ. ౭౦. విక్ర. ౧, ఆ. ౧౦౦.

తూడి. దే. వి. కపోతాంఘ్రి♣. (అభి)

తూణ. సం. వి. అ. స్త్రీ. అమ్ములపొది.

తూణము. సం. వి. అ. పు. అమ్ములపొది, నిషంగము.

తూణి. సం. వి. ఈ. స్త్రీ. 1. అమ్ములపొది; 2. నీలిచెట్టు. విణ. (న్. నీ. న్.)-తూణము కలవాఁడు-విలుకాఁడు.

తూణీరము. సం. వి. అ. పు. అమ్ములపొది.

తూదము. సం. వి. అ. పుం. 1. గంగరావి♣; 2. బూరుగు♣.

తూనరతుక్కము. దే. వి. బాలక్రీడావిశేషము. (శ. ర. బ్రౌ.) రూ. తూరనతుంకములు.

తూనిక. దే. వి (తూను ధా.) 1. (త్రాసులో) తూఁచుట, ఉన్మానము. (శ. ర.); 2. పోలిక, సామ్యము. "వ. ఉత్తరాపివాహాంబుచందంబునఁ బ్రముదితనరంబై సరసీహంసఖరంబులభాతి సాత్రితప్రష్టోదగురువిభవప్రధానంబై ననసూలికాకుచంబు పేర్మిని నిరంతరపయోవర్ధకంబై, ధనదు నిలయంబు తూనికను సంభృతమకరపద్మమహాపద్మకచ్ఛపంబై..." భా. ౯, స్కం. ౨౩౦; 3. బలము(?) "ద్వి. ఏనుంగుఁ గోల్పడె మానంబు వోలెనా, దూనిక చెడె శివద్రోహంబుఁ దగిలె." బస. ౪, ఆ. ౧౦౪. పు.

తూనికకోల. దే. వి. (తూనిక+కోల.) త్రాసుదండె. "సీ... తూనికకోల నాఁ దూసకోలయనఁ దులాదండాఖ్య యలరును..." అం. భా. ద్వి. ౩౦౦.

తూనికవేయు. దే. స. క్రి. (తూనిక+వేయు.) తూఁచు. (శ. ర. వా.)

తూనికి. దే. వి. తూనిక (చూ. తూనిక్క.)

తూనిఁగ. దే. వి. పతంగిక, ఒకజాతియీఁగ. (శ. ర.) "క. సొలయక తూనిఁగలం గొ,జ్జులఁ బెట్టితి నీవు నీచిఱుతకాలము .." భార. ఆది. ౪, ఆ. ౨౬౧. విక్ర. ౪, ఆ. ౨౮. హరి. ౨, ఆ. ౧౯.

తూనిగతానిగ. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. తూరనతుంకముల్ తూనిగతానిగ చిడుగుడు మొగ మాట చిల్లకట్టె." హంస. 3, ఆ. ౧౪౬.

తూనీఁగ. దే. వి. పతంగిక, ఒకజాతియీఁగ. (శ. ర.)

తూను. దే. అ. క్రి. తూఁగు. (చూ. తూన్చు.)

తూనిక్క. దే. వి. (తూను ధా.) (త్రాసులో) తూఁచుట, ఉన్మానము. "గీ ..నరకుఁదూఁచి పెట్టెదుచోటులఁ దూనిక్క దరపి, పూర్వభవమున లాభంబుఁ బొందినారు." భార. అను. ౫,ఆ. ౧౦౪.

తూన్చు. దే. స. క్రి. తూఁచు, తోలనముచేయు. "ఆ. సత్య మశ్వమేధశతముఁ ద్రాసునఁ బెట్టి, తూన్ప ముల్లు మూపెఁ దులకు సత్యము..." కృ. శకుం. 3, ఆ. ౧౩౮. ఆము. ౪, ఆ. ౧౫౧.

తూపరము. ఉభ. దే. వి. 1. చిల్లి, రంధ్రము. (శ. ర. బ్రౌ.); 2. గుహ,కందరము "సీ తూము తూఁటనఁగను దూపర మనఁగను ..కందరంబు." అం. భా. ప్ర. ౧౪౫ విణ. భ్రష్టము, చెడిపోయినది. "క. చూచెదవుగాక యే నిటు,చూచిన నయ్యమరతపము సొంపఱి వ్రతనిష్ఠాచరణము తూపర మగు, గోచరమై మనసు త్రిప్పకొని సోలంగన్." నృసిం. ౨, ఆ. ౭. సం. వి అ. న. యూపస్తంభముయొక్క అత్యుత మైనముందటిభాగము.

తూపరాణ. దే. వి. నీళ్లు బయటికి వచ్చుతూము, జలదారి. (శ. ర.)

తూపరాణము. దే. వి. తూపరాణ. "సీ. తూపరాణ పుటమ్ము తూ మొప్పరము జలదారి యంచనఁగను దనరును జల,నిర్గమము..." అం. భా. ప్ర. ౧౫౪.

తూపరాణి. దే. వి. తూపరాణ. "వ...గుడిలోఁపఁ తూపరాణికడ నిలిచి..." ఆము. ౬, ఆ. ౧౦.

తూపి. వై. వి. (సం. స్థూపి.) గుడిలో మూలవిగ్రహ ముందుచోటురకు మీఁద విమానమువలె ఎత్తుగాఁ గట్టినకట్టడము. (శ. ర.)

తూపు. దే. వి. అమ్ము,బాణము. "సీ. వనజాక్షిచూపులు వలరాజుతూపులు..." విక్ర. ౧, ఆ. ౧౧౯, భార. ద్రో. ౧, ఆ. ౨౫౩.

తూపురిక్క. ద్వ. వి (తూపు+రిక్క.) బాణమువంటి ఆకారము గలనక్షత్రము - శ్రవణనక్షత్రము. (శ. ర.) [శ్రావణమాసము. (శ. ర.)

తూపురిక్కనెల. ద్వ. వి. (తూపు+రిక్క+నెల.)

తూపొడుచు. దే. అ. క్రి. (తూ+పొడుచు.) 1. ఉమియు. "చ. చనునెడఁ దాని మన్మథపిశాచము సోఁకిన నొచ్చె నంచుఁ దూ,యని పలుమాఱుఁ దూపొడిచి యల్లనఁ బుల్పొడి రక్షవెట్టి .." విక్ర. ౯, ఆ. ౫౯. హరి. పూ. ౫, ఆ. ౧౮౯; 2. ఊఁదు. "క. వదనము విదుర్చుకొనుచును, దుద నాలుకయెత్తుచేతఁ దూపొడుచుక్రియన్, గడలించుదొడ లౌరఁగన్, మెదలించుం దగ్గ మ్రొగ్గ మేదినిఁ బొరలున్." ద్వా. ౧, ఆ. ౨౯౧, 3. నిరోధించు, అడ్డుకొను. "క. ఈపాటి కదల కున్నన్, గోకంబున నన్నుఁ గూడఁ గొట్టును దీనిన్, దూపొడువం గలనే యీ,కాపురము దుఃఖ మనుచుఁ బయ్యానను రాగన్." సరం. ౨, ఆ. ౧౪౦. భూ. ౧౩౯.

తూబరము. సం. వి. అ. పుం. 1. యుక్తకాలమున కొమ్ములు మొలవనియెద్దు; 2. ఒగరు, ఒకరసము. విణ. (అ. ఆ. అ.) ఒగరైనది. [మన్ను, పటిక.

తూబరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కందిపీ; 2. తొగరి

తూబరుఁడు. సం. వి. అ. పుం. ప్రాయమున మీసము గడ్డము రానిమగవాఁడు, పేడి.

తూము. దే. వి. 1. బండిచక్రమునడిరంధ్రము. (శ. ర. బ్రౌ.); 2. జలదారి, జలనిర్గమమార్గము. "మ. ఘనశృంగారరసోత్తరంగరుచిరంగద్వేణికిం బాసికంబున దండం బలుగట్టకట్టి విలసన్ముక్తాకలాపచ్ఛలంబునఁ దూ పేర్పడఁ బెట్టి కోటి గిరిజాభ్రూపుండ్రసౌభాగ్యముల్దనరం గస్తురిరేఖ దీర్చె నవకుల్యాపైఁ గరిన్ మించఁగాన్." వసు. ౫, ఆ. ౧౧౪; 3. నాలుగుకుంచముల కొలతమానము, అడకము. "క. అచ్చులఁ ద్రాసులఁ దూములఁ, బొచ్చెంబుగఁ జేసి కపటమున నమ్మెడియా, మ్రుచ్చువణిజులం..." విష్ణు. ప్రా. ౭౫. అం. భా. ద్వి. ౨౮౦; 4. సూది మొదలగువాని మొదటిరంధ్రము. "ఉ...నీవిందుధరుండ వీవి వర మిచ్చెద వేనియు సూదితూములో, నం దగ దారముం జొరఁగ నా కిపు డిమ్ము వరంబు సత్కృపన్" పరమ. ౧, ఆ. ౧౬౨.

తూముకాలువ ద్వ. వి. (తూము+కాలువ.) 1. నీరు పోవుట కేర్పఱచినకాలువ. "సీ. అఖిలావనీతలోన్నతవృష్టికిని గెంపుఁ దూలుకాలువలఁ బోఁచు నవ్వి." పాంచా. ౨, ఆ. ౧౯; 2. జలనిర్గమ మార్గములు గల కాలువ "క. కల్హారితూము కాలువ, కాల్వకములకమ్మఁదావి నపలాపించున్, సల్లలితలీలఁ దిప్పయ, వల్లభరాయప్రధానవాగ్ధంబరముల్." క్రీడా. ౭౯.

తూర. దే. వి. 1. వానబొట్టు. (శ. ర. బ్రౌ.); 2. ధార, జల్లు. "సీ. తూర జల్లనఁ గను ధారాభిధాన మా..." అం. భా. ప్ర. ౯౫; 3. మత్స్యవిశేషము; పండుచేఁప. (శ. ర.) "గీ. తూల యనఁ దూర యనఁగను దోఁచు ఝషము" అం. భా. ప్ర. ౧౫౯.

తూరనఁగోలలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. కోలకోఁతులు బిల్లగోడ్లు దూరనగోల లందలంబులు మఱి కుందికాళ్లు. గీ. నాదిగా శైశవక్రీడ లాడి రచట." వి. పు. ౯, ఆ. ౨౦౨,

తూరనతుంకలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. తూరనతుంకాలు గీరనగింజలు పిల్ల వాలంకి బిల్లగోడు. గీ...ఆది యైనశైశవక్రీడావిహారసరణి." కాశీ. 3, ఆ. 33.

తూరవెత్తు. దే. స. క్రి. (తూరన్+ఎత్తు.) పొల్లు లోనగునవి పోవునట్లు ధాన్యాదులను గాలికెగురఁ బోయు, తూరుపెత్తు. "ఆ. పాడవు చూడ మగల పొల్లలుసాళుల, పొల్లలును నిజంబపోలె నుండుఁ, గలనఁ దూరవెత్తఁగాఁ బోరనిప్పుడు,కాని చూచి రొంటుఁగఁ గాదు మున్ను." కు. సం. ౧౧, ఆ. ౪౫.

తూరము. సం. వి. అ. న. వాద్యభేదము.

తూరి. దే. వి. కడవ, మాఱు. (ఇది త్రిపూర్వకంబుగను ఏకాద్యర్థకశబ్దపూర్వకంబుగనే ప్రయోగింపఁబడును.) "సీ. పదిమాఱు లపసవ్యపాణిపల్లవము నిరుగేలులంటను నేడుతూరు, లంఘ్రిద్వయంబునయుం దొక్కమాఱు..." కాశీ. ౫, ఆ. ౧౯౫. అం. సం. మాస. ౭౨, ౭౩. సం. వి. ఈ. స్త్రీ. ఉమ్మెత్త.

తూరు. దే. అ. క్రి. కీ. (సన్నగా.) తుంపరరాలు. (శ. ర.) స. క్రి. పొల్లుపోవుటకై ధాన్యాదులను గాలికెగురఁబోయు. (చూ. తూరవెత్తు) వి.

తుచ్ఛధాన్యము, పొల్లు. "సీ. తుచ్ఛధాన్యాభిధ దోఁచుఁ దాలుతరక...గీ. తప్పు తంతర తూరు వాన్." ఆం. భా. ద్వి. ౨౩౮.

తూరుపాఱఁబట్టు. దే. స. క్రి. (తూరు+పాఱన్+పట్టు.) పొల్లుపోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయుట. (శ. ర.)

తూరుపు. దే. వి. సూర్యుఁ డుదయించుదిక్కు, ప్రాగ్దిశ. "ఉ. దయ్యము నెత్తికోలు తుది దాఁకఁగ దూఁరుపు తెల్లవాఱె తెల్వయ్యెను .." హర. ౨, ఆ. ౨౮, శై. ౧, ఆ. ౧౩౬.

తూరుపుకొండ. వ్యు. వి. (తూరుపు+కొండ.) ఉదయాచలము, పొడుపుకొండ. "సీ...పొడుపుకొం డనఁ దూరుపుకొం డన నుదయాద్రి యదురు." ఆం. భా. ద్వి. ౨౮. ఇట్లే:- తూరుపుగట్టు, తూరుపుగుబ్బలి. మొ.

తూరుపుదొర. దే. వి. (తూరుపు+దొర.) పూర్వదిక్పతి, ఇంద్రుఁడు. "క .. తూరుపుదొర మొయ్యర పుతు...అరస్, సురనాథుని పేర్ల..." ఆం. భా. ప్ర. ౮౬. ఇట్లే. తూరుపుఱేఁడు. మొ.

తూరుపెత్తు. దే. స. క్రి. (తూరుపు+ఎత్తు.) 1. గాలి కెగురఁబోయుట, గాలికి వాటముగా ఎత్తివిడుచు. "గీ. రట్టుగా నన్ను మగనాలిఁ బట్టి డాసి, తొర పెట్టో యనుచు దుమ్ము తూరుపెత్తు." శుక. ౨, ఆ. ౧౦౭, నిరం. ౮, ఆ. ౯౮; 2. (తల వెండ్రుకలు.) దులుపు, జాడించు. "గీ ఎలయుఁ సీత్కారములతోడ నీట్ల గ్రుక్కి, యంటుపంటులు పరికించి యంట్లఁ బొడిచి, గోరుముక్కుల దిగ దువ్వి తూరుపెత్తి, నెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచె." పాండు. ౩, ఆ. ౩౦; 3. పొల్లు పోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయుట. (శ.ర.)

తూర్చు. దే. స. క్రి. (తూఱు ధా. ప్రే.) 1. తూఱఁజేయు, చొనుపు. "ఉ...లోకపాలదుర్వ్యాధిక సూచికాంతరపరంపరఁ దూర్చెదు మాటిమాటికిన్, నాచెవులందు నీవుఁ దగునా..." శైవ. ౮, ఆ. ౯౧. అము. ౮, ఆ. ౧౦౯; 2. నాఁటించు, గ్రుచ్చు. "క. అమ్మాద్రిసుతుఁ డేపునఁ, దొమ్మిదివాలమ్ము లొడలఁ దూర్చిన నతిరోషమ్మునఁ గర్ణుండు..." భార. ద్రో. ౫, ఆ. ౧౫౬.

తూర్ణము. సం. వి. అ. న. త్వర, వేగము. విణ. (అ. ఆ. అ.) వడి కలది.

తూర్పాఱ. దే. వి. పవనము, తూర్పెత్తుట. "సీ... తూర్పాఱ యం చనఁగను బవన మొప్ప." ఆం. భా. కృ. ౩౨. [బట్టుట. (శ. ర.)

తూర్పిడి. దే. వి. (తూర్పు+ఇడి.) తూరుపాఱఁ

తూర్పు. దే. వి. 1. ప్రాగ్దిశ. "గీ. మగువ యాపేడ కును బచ్చకముగ దూర్పునందుఁ జూపట్టు కాంచనపార్శ్యరేఖ .." సాంబో. ౮. ఆ. ౧౬౦. భార. ఆది. ౬, ఆ. ౨౧౩; 2. ఎగురఁబోసి పుచ్చి ధాన్యాదికము పొల్లునుండి విడఁదీయుట, సద్గ్రాహణము. "సీ ..సద్గ్రాహణము తూర్పు నా వల యుఁచు .." ఆం. భా. ద్వి. ౨౩౯.

తూర్పుగుబ్బలి. దే. వి. (తూర్పు+గుబ్బలి.) ఉదయాచలము. "గీ. కలువలయచుంగు తూర్పుగుబ్బలిని బొడమె." అచ్చ. అయో. ౧౯.

తూర్పుదొర. దే. వి. (తూర్పు+దొర.) పూర్వదిక్పతి. ఇంద్రుఁడు. "గీ. తూర్పుదొరవేఁడివేలుపు దుంత రాతు, రేయినదకరిసంద్రంపుఱేఁడు గాడ్పు" భోజరా. ౧, ఆ. ౨౫. ఇట్లే: తూర్పు రాయఁడు. మొ.

తూర్పెత్తు. దే. స. క్రి. (తూర్పు+ఎత్తు.) 1. పొల్లు, పోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయుట. "గీ. సుతికి తూర్పెత్తి కడలకు బిరుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి." శివధ. ౫, ఆ. ౯; 2. గాలి కెగురఁబోయుట. "క. పెదకిలి నచ్చోఁ గానక, కద యంతటఁ బ్రొద్దువోవఁగా భయమున సొమ్మసి నింటికిఁ జని తూర్పెత్తెద నని యచ్చోటియినుము దెచ్చితి గలపన్." శుక. ౨, ఆ. ౫౬౯; 3. ఎగురఁగొట్టు, రేఁగఁగొట్టు. "ఆ. వనరుహోత్తతనయవాహినీవాచర, వరులు నవ్యమలయగిరులు గదచి, త్రోవ లంకదెసకు దుమ్ము తూర్పెత్తుచుఁ, జనిరి పెద మహేంద్రశైలమునకు." రామా. ౬, ఆ. ౩౮; 4. బాధించు, పీడించు. "ఉ. అత్తలి తోడిచెల్వ లహహో యిదిగో వలి గాడ్పు మమ్ముఁ దూర్పెత్తె వసంతుఁ డెంతయుఁ రహించఁగ వాకుల పాటుఁ జూపె .." చంద్రా. ౩. ఆ. ౯౫.

తూర్యఖండము. సం. వి. అ. పుం. వాద్యభేదము.

తూర్యము. సం. వి. అ. పుం. న. వాద్యభేదము.

తూఱ. దే. వి. పంటచేలకు నీరు పాఱించుటకై తాటి పట్టెలు మున్నగువానితోఁ జేర్పఱచినతూము.(వా)

తూఱఁబడు. ద్వ. అ. క్రి. (తూఱన్+పడు - స్వార్థమున.) తూఱు, చొచ్చు. "సీ. పాఱఁజాలక మట్టఁబడి జాడ దప్పంగఁ దొలఁగి పెన్గొందులఁ దూఱఁబడియు." నిర్వ. ౪, అ. ౭౬.

తూఱిపోవు. దే. అ. క్రి. (తూఱి+పోవు.) తప్పించుకొనిపోవు "గీ ..అయ్యక్కజాండు,పవనుచందంబు గతిఁ బట్టుపడక తూఱి, పోయెఁ దోడియాతఁడుఁ దాను భూపసింహ." హరి. పూ. ౯, అ. ౪౮.

తూఱు. దే. అ. క్రి. 1. పైఁబడు, కవియు "ఉ. చావున కోహటించక కనుపాల్వఁడు సాళ్వము దూఱినట్లు రో,షావళి గిట్టి పట్టె నవసాళ్వము విశ్వభయంకరంబుగన్." జై. ,3, అ. ౯౦. చంద్రా. ౨, అ. ౯౯; 2. అధికమగు. (ఈయర్థమున తుమున్నంతరూపమే ప్రయోగములఁ గన్పట్టుచున్నది.) "వ. అనుచు నమ్ములదెసకుఁ దూఱ వగచి దగ్గుత్తికవెట్టి మఱియును." భార. విరా. ౧, అ. ౧౮౨, జై. ౨, అ. ౮౯. అ. క్రి. స. క్రి. (క. తూఱు. త. తూరల్.) 1. చొచ్చు, ప్రవేశించు. "ఉ. వేటకొకవిల్లు పుచ్చికొనువేగము నూనన కౌరవేంద్రుమైఁ,దూఱ వృకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిం, దూఱిన యట్లుగా..."భార. భీష్మ ౨, అ. ౩౯౮, జై.౨, అ. ౬౮; 2. క్రిందినుండి చొచ్చిపోవు. "క... శా,పల్లడముక్రిందఁ దూఱని,మల్లఁడు లే రెండు ధరణిమండలమందున్." భాగ. ౧౦. స్కం. పూ. ౧౩౩౯. కాశీ. 3, అ. ౨౪; 3. ప్రార్థించు, వేఁడు. "క. కావునఁ దనయూవాస్తికి, భావమ్మున నమ్మహానుభావుఁడు ధరణీ,దేవుఁడునకగలి క్రియో, పాపల్లభు దూఱ నతనిస్వప్నమునందున్." నిరం. ౧, అ. ౭౧.

తూఱుకొను. దే. స. క్రి. (తూఱు+కొను-స్వార్థమున.) చొచ్చు, ప్రవేశించు. "సీ. పాండ్యునిమధుర లోపలను గొన్నిదినాలు కట్టె లమ్మినసుద్ది కలదొ లేదొ,వారాణసిని గొప్పసారాయికుండలోపలఁ దూఱుకొన్నది కలదొ లేదొ." పార్వ. ౪, అ. ౧౦౦. వేం. పంచ. 3, అ. ౨౬౪.

తూఱుచు. దే స. క్రి. (తూఱు ధా. ప్రే.) తూఱఁజేయు. (శ. ర.)

తూఱుదండెము. ద్వ. వి. (తూఱు+దండెము.) ఒకరకముగరిడిసాదన. (చూ. తూఱుదండెములాడు.)

తూఱుదండెములాడు. ద్వ. అ. క్రి. (తూఱుదండెములు+ఆడు.) - తూరుదండెములసాదన చేయుచు కలిసిపోవు. "సీ. తూఱుదండెములాడు తోడవుల రుచి దీపకళికలు మంగళార్తులుగఁ జేసి..."అని. 3, అ. ౭౬.

తూల. ఉ. భ. దే. వి. మత్స్యభేదము, ఝషము. "గీ. తూల యనఁ దూర యనఁగను దోఁచు ఝషము." ఆం. భా. ప్ర. ౧౪౯. సం. వి. అ. స్త్రీ. 1. ప్రత్తిళి. 2. దీపపువత్తి.

తూలఁదోలు. దే. స. క్రి. (తూలన్+తోలు) పాఱఁద్రోలు. "చ. పదటుకదేహవల్లికకుఁ బాయపునంపద కాపువచ్చినన్, నొదువులరాజకీరముల నున్నని పల్కులఁ దూలఁదోలి..." విక్ర. ౬, అ. ౪౫.

తూలఁబాఱు. దే. అ. క్రి. (తూలన్+పాఱు-స్వార్థమున.) చలించు. "శా. తూలంబాఱియు బీరువోక సురనాథుల్ చేవ మీఱన్..." కాశీ. ౨, అ. ౬౦.

తూలకము. సం వి. అ. న. దూది.

తూలగించు. సం. స. క్రి. తృణీకరించు. "ద్వి. తాలిమిఁ జెఱుపఁ బండముఁ బూని యేయఁ, దూలగించుచు వచ్చి తుంటవిల్కాఁడు." నవ. ౪, అ. ౧౬౫, పు. నవ. ౧, అ. ౫౫. పు.

తూలనాడు. దే. స. క్రి. (త. లన్+ఆడు.) నిందించు, తిట్టు. "చ. అని తనుఁ దూలనాడిన జనాగ్రణి కన్నులు విచ్చి దైత్యునిన్, గనుఁగొని...యిట్టి పరుషంబులు పల్కుట పొమ్ము రావణా." ఉ. రా. 3, అ. ౧౬౮. కాశీ. ౪, అ. ౨౧౫. ఇట్టే: తూలఁబలుకు.

తూలనాళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. దూదిచుట్ట, ఏకు.

తూలపుచ్చు. బ.స.క్రి. (తూలపోవు ధా. ప్రే.) లాఘవపఱచు, అవమానించు. "చ. ఘనభుజవిక్రమోన్నతుఁడు గౌరవకోటికిఁ బట్టుగొమ్మయు, మ్మని మెయిఁ దూలపుచ్చినమహాత్ముఁడు గర్జుఁడు..."భార. శాం. ౧, అ. ౭ ఉద్యో. 3, అ. ౨౯౮; 2. పోఁగొట్టు, హరించు. "సీ. ఇది వేల్పుజవరాండ్ర నీడ్చి మానము దూలపుచ్చునంకేతపుఁబువ్వుటిరవులు ..."రామా. ౭, అ. ౧౫౭; 3 స్రుక్కించు, నిస్సత్త్వముచేయు. "గీ. గాలికొమరుని బెక్కుంటఁ దూలపుచ్చి, నలువస్రుద్దుపసఁటులు వగలఁగ వార్చె." అచ్చ. యు. ౧౫౧.

తూలపోవు. దే. అ. క్రి. 1. తూలు,చలించు. "సీ. ఉరవడిఁ బనులు దెరలఁ దెరలఁ బైఁ బోతెంచుధూళి వెల్లడరినఁ దూలపోక." భార. విరా. ౪, ఆ. ౨౯; 2. చిన్నపోవు, అవమానమొందు. "గీ. చిన్నవోయి కొడుకులు చేయఁగలుగు, దొరలు విడివడ కరిగిరి వరుఁగ భీమ,పేటుకొడుకు నగ్గించుచుఁ దెలఁగి వారు,చెప్పు సొంపారఁ బని రాత్మ శిబిర ములకు. వ. అని యిట్లు సాలవసాఁడు ధార్త రాష్ట్రులు తూలపోవుట సెప్పిన విని..." భార. భీష్మ ౨, ఆ. ౨౫౬, ౨౫౭. కాశీ. ౨, ఆ. ౧౩౦; 3. సుక్కు,బడలు. "గీ. భావజానిచేత నొవ్వక పవనుచేతఁ, దూలపోవక యలిచేతఁ దొట్రుపడక ...గాసిగాక శకుంతలఁ గనుట మేలు." పి. శకుం. 3, ఆ. 3౫. [శము; 2. గంగరావిచె

తూలము. సం. వి. అ. పుం. న. దూది. న. 1. ఆకా

తూలాడు. దే. అ. క్రి. (తూలి+ఆడు.) చలించు. "ద్వి. గాలిఁ దూలాడెడుగడ్డంబుఁ బంక, మూల నుంచినభూతిబుట్టకాయయును." నవ. ౪, ఆ. ౧౧౯ పు. ద్వి. హరిశ్చ. ఉ. ౨౫౭౨ పం; 2. వణఁకు, కంపించు. "గీ. అలసి మేనులు దూలాడ నిలిచి రంత, నంత నయోధ్యాధముఖ్యు లాహవము దక్కి." భా. ర. విరా. ౫, ఆ. ౧౦౪.

తూలి. ఉ. భ. దే. విశే. (తూల+ఇ.) చేఁపలను బట్టి జీవించు ఒక నొకజాతివాఁడు. (శ. ర.) సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. వ్రత్తి; 2. దీపపువత్తి, 3. సాలెవానికుంచె; 4. చిత్రకారునికుంచె.

తూలించు. దే. స. క్రి. (తూలు ధా. ప్రే.) 1. తొలఁగించు, జార్చు. "సీ. పడఁతుల చెఱఁగుఁ జాలిండ్లు పెడఁదోఁప వీలఁ బయ్యెదలు దూలించుచుండు." నిర్వ. ౧, ఆ. ౫౭. భార. విరా. ౨, ఆ. ౭౪; 2. చెదరఁగొట్టు. "వ. మహాబలంబుగ వాతూలంబు తూలరాశిం బలెఁ దూలించుచు నవిరతశరాసారవర్షంబుతో..." చం. రా. ౦, ఆ. ౭౭; 3. బాధించు. "సీ. పాలచేరులు పట్టి గూలింప బలిమి నీడ్చుకొని డొంకలఁ దూఱి చుట్టఁబెట్టు." స్వా ౪, ఆ. ౪౭. భా. రా. సం. ౧౦౪; చంపు. "మ .. శంభునివిల్ ద్రుంచె వరించె సీత భృగురాముం గెల్చె గూర్చెన్ ఖరున్, దునిమెన్ మాయ మెకంబు నేలె రవిపుత్రున్ వాలిఁ దూలించె .." రామా. ౭, ఆ. ౧౯౯, ౩, ఆ. ౪౫; 5. పోఁగొట్టు,



హరించు. "శా...శా,రారంభాశరచామరాళి లము మార్గక్రాంతిఁ దూలింపఁగన్." పారి. ౩, ఆ. ౦. చిత్ర. భా. ౧, ఆ. ౫౬; 6. పడఁజేయు. "వ...చెందిరంబుధూళిఁ దూలించి .." హర. ౬, ఆ. ౧౬.

తూలిక. సం. వి. అ. స్త్రీ. 1. చిత్తరువు వ్రాయుకుంచె. 2. వ్రాసెడుకలము; 3. చిన్నయీఁక; 4. దూది; 5. నీలిచెట్టు; 6. వత్తి.

తూలికాఁడు. దే వి. (తూలి+కాఁడు - స్వార్థమున.) చేఁపలఁ బట్టి జీవించు నొకజాతివాఁడు, జాలరి. "గీ... తూలికాఁడు. జాలరి యనంగఁ గైవర్తసంజ్ఞ పరఁగు" ఆం. భా. ప్ర. ౧౪౯.

తూలికొను దే. అ. క్రి. (తూలు+కొను-స్వార్థమున.) 1. పడు. "చ. పొలయుననోకవల్లివిరి పువ్వులగుత్తుల మీఁదఁ గ్రోలుకెం,దలిరులో వాఁగ మై సదరి దండడివహ్నిశిఖాకలాపముల్, గలకొనఁ బ్రేలి తూలికొని కాలె రయంబున..." కు. సం. ౨, ఆ. ౪౫; 2. మత్తు మొదలగువానిచే ఊఁగాడు. "చ.... మెఱుంగుఁబోండ్లగు,బ్బలపయి చంద్రకాంతి జిగిపయ్యెదకొంగు తెరల్చి యొందు మై, దెలియక తూలికొంచు వలిదెమ్మెరలాహరికాఁడు త్రిప్పురన్." కువల. ౧, ఆ. ౦౦.

తూలిని. సం. వి. ఈ. స్త్రీ. బూరుగుచెట్టు.

తూలిపోవు. దే. అ. క్రి. (తూలి+పోవు.) లాఘవపడు, అవమానమొందు. (చూ. తూలిపోఁబలుకు.)

తూలిపోఁబలుకు. దే. స. క్రి. (తూలిపోన్+పలుకు.) నిందించు, "ఆ. తుట్టఁబోక నీవు తూలిపోఁబలికిన, సార మేమి తఱుఁగుఁ జక్రమునకు." ఉ. హరి. ౩, ఆ. ౧౭.

తూలియాడు. దే. అ. క్రి.(తూలి+ఆడు.)1.చలించు. "ఆ. గగనమండలమునఁ గాలాయసపుఁదేర మాల కాకుపడగ దూలియాడ" శైవ. ౭, ఆ. ౯౨; 2. మద్యపానాదులచే, ఊఁగాడు. "వ ..క్రొత్త విరియుం జెత్తమ్మివిరుల కేసరంబులవానలు గ్రోలి మత్తిల్లి యుల్లాసంబునఁ దూలియాడుకొదమ తుమ్మెదకదుపులు..." శైవ. ౦, ఆ. ౧౪.

తూలు. దే. అ. క్రి. (క. తూళు.) 1. చలించు, కదలు. "సీ.పరుషకేశజాలంబు గాడ్పునఁ దూలఁగఁ గాలాకుమానుఁడై చనుదెంచి మానుషాదుఁడు." భార. ఆది. ౬, ఆ. ౨౦౧. భార. ఆది. ౪, ఆ.

౪౨; 2. (మత్తు మొదలగువానిచే) ఊఁగాడు. “ఉ ..పొల్చు నగమ్మునఁ దూలుదు న్పురోఁ,ద్యా వముల న్మదేభములు ప్రాణములోఁడినఁగంబులోఁ,య నన్.” ఆము. ౨, ఆ.౨౪. 3. (భయముచే)కంపించు, వణఁకు. “ఉ....లోఁ, శేవగొనంగ లేక ధృతి దీలఁగ మానము దూలఁ దూలుదున్.” భా. రా. అయో. ౪౦. హర ౬, ఆ. ౬౪; 4. చెదరు. “క. పెను గాలిఁ దూలు మొగిళులొ,యన నిభములు విఱిగి విజబలావళి నడియన్.” భార. భీష్మ. ౨, ఆ ౨౧౬. ఆము. ౧, ఆ. 3; 5. తొలఁగు, పోవు. “క. తూలెమతన ప్రాణమ్ములఁ, దాలిమితోఁ గావ జేసి...”విక్రా. ప్రా. 3౨. కాశీ. ౧, ఆ. 3౨; 6. వ్రాలు, పడు. “మ...సురేంద్రుఁడు కొత్తటఁ దొట్రిల్లుచు మూర్ఛవోయి కరిపైఁ దూలె న్విపైశ న్యుఁడై.” ఉ. హరి. ౧, ఆ. ౪౬ వసు. ౬, ఆ ౧౧; 7. స్రుక్కు, కృశించు. “గీ. గాలి తూలెవు ధవళి ఘనత యణఁగె...”భీమ. ౪, ఆ. ౧౦౭; 8. దుఃఖించు. “క. ఏలయ్య భూసురోత్తమ, తూలెదు నీయట్టివారు దుఃఖాంబుధిలోఁ, దేలుదురే ...”ఉ. హరి. ౨, ఆ. ౧౧; 9. నశించు, చెడు. “ఉ. తూలు నవు స్తధర్మములు తొయ్యలి కేఁడిలు నేరకుండినన్. స్వా. ౨, ఆ. ౫3. పాండు. ౫, ఆ. ౧౪3; 10. తగ్గు, అణఁగు. “ఉ. దారుణవృత్తి నున్న నను దక్కులఁ బెట్టఁగఁ జూచెదేని నీ, పేరును బెంపుఁ దూలఁగ శపింతుఁ జామీ యిఁక నొందు పల్కునన్.”వి. పు. ౧, ఆ. ౧౪౪. ఆం. భా. తృ. ౮౮. విశే. పరుషము; దూషణము. (వ్యవః) తూలుమాట లాడకుము.

తూలించు. దే. స. క్రి. (తూలు. ధా. ప్రే.) 1. చలింపఁజేయు. “క. తూలక తూలించెఁ బవనునిఁ, దేలక తేలించె జలధిఁ దీవ్రానలునిన్, ప్రేలక ప్రేలించె నీమొద ,జాలక చాలించెఁ బ్రసవశర మా కరకల్.” కళ. ౧, ఆ. ౧౮౬; 2. చెదరఁగొట్టు. “ఉ ..భుగస్ఫుట నిశ్వసితానిలంబులం, దూలిచె దేవయానములఁ దోరము లైనభుజంగసంఘ ముల్.” భా. రా. యు. ౧3౬౮; పోఁగొట్టు, నశింపఁజేయు. “చ. అల వెనయంగ జారులవ్రాదం తరముల్ నలి నజ్జచేసె సం,ధిలుతమి బూతుసంఘ ములతేజముఁ దూలిచెఁ బుండరీకముం,డలిఁ దగ టార్చె...”సా.౧,ఆ, ౧౦౧. కవిక.౫, ఆ,౧౨౧.

తూల్చు. దే. స. క్రి. (తూలు ధా. ప్రే.) 1. జార్చు. “గీ. అద్రిశృంగము లనుశంక నధిగమింపఁ, గోరి యుండు బోలెఁ బలుమాఱు వారిధరము, లాత్మ పవ నంబుచేత నయ్యమరసతుల, పయ్యెదలు దూల్చి కుచములు బయలుపఱిచె.” కవిక. ౬, ఆ. ౭౬; 2. చెదరఁగొట్టు. “ఉ . అతతపక్షపవానిలంబు లం,భోవహపం క్తిఁ దూలములపోలికఁ దూల్పఁగ ...”పారి. ౨, ఆ. ౭౬; 3. స్రుక్కించు, బాధించు. “ఉ...కోరిచే, సింగిణివింట వెల్లిగొను చిత్రశరంబులు సూతు నొంచి రథ్యాంగకము ల్దళించుచు నిజావయవంబులు దూల్చ...”పారి. ౫, ఆ. ౧౬. చంద్రి. ౪, ఆ. ౧౧౦; 3. చంపు. “శా. అమల్లక్షితిశాఖరత్నకరదీవ్యన్మండలాగ్రాంకుమ, ద్ధామక్షేమరణాగ్రసీమ నరిగోత్రశ్రేణులం దూల్చుచు, ద్ధామశ్రాఘిమఁ గేతువుం దునుము ...”చంద్రి. ౧, ఆ. 3౭. (ఇవి రెండర్థములకు నుదాహరణము.) [మున్ను, కటిక.

తూవరి. సం. వి ఈ. స్త్రీ. 1. కందిచే. 2. తొగరి

తూష్ణింభావము. సం. వి. అ. పుం. మాటలాడకుండుట, మౌనము. [కుండువాఁడు.

తూష్ణీకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మాటలాడ

తూస్తము సం.వి. అ. న. 1. జడ;2. పాపము; 3. ధూళి.

తృ

తృంఢము. సం. విశే. (అ. ఆ. అ.) హింసింపఁబడినది.

తృంహము. సం. వి. అ. న. హింసనము.

తృభము. సం. వి. అ. న. జాజికాయ.

తృట్టు. సం. వి. ష్. స్త్రీ. దప్పి, తృష. “చ...నన విల్తుసాధననికాయము వేలముపట్టు లంగస్రావుల మటు గాన దాని విడఁగొట్టక తృట్టెకదొట్ట వీత రాగుల మని విఱ్ఱవీఁగెదరు...” పాండు. ౫, ఆ. ౧౮౨; 2. అతికాంక్ష. 3. కొల్పెరచే.

తృణకము. సం. వి. అ. న. 1. గడ్డి,పచ్చిక; 2. మిక్కిలి మాలినగడ్డిపోఁచ.

తృణకటి. సం. వి. ఈ. స్త్రీ. పూరిగుడిసె.

తృణకుటీరము. సం. వి. అ. న. పూరిగుడిసె.

తృణకేతువు. సం. వి. ఉ. పుం. వెదురుచే.

తృణగోధ. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతితొండ.

తృణగ్రాహి. సం. వి. న్. పుం. ఇంద్రనీలమణి.

తృణజలూక. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిపురుగు.

తృణత సం. వి. ఆ. స్త్రీ. 1. తృణభావము; 2. విల్లు.

తృణద్రుమము. సం. వి. అ. పుం.-కొమ్మలు లేకుండః బెరుఁగుచెట్టు—1. తాటిచెట్టు; 2. కొబ్బెరచె; 3. పోఁక; 4. మొగలిచె; 5. ఈఁతచె; 6. ఖర్జూరపుచెట్టు.

తృణధాన్యము. సం. వి. అ. న. విత్తక పండెడు గునుకు, నివ్వరి, దూసరి లోనగునది.

తృణధ్వజము. సం. వి. అ. పుం. వెదురుచె.

తృణనింబము. సం. వి. అ. పుం. 1. నేలవేముచె; 2. నేపాలనింబము చె.

తృణప్రాయము. సం. విణ. (అ. ఆ. అ.) గడ్డిపోఁచతో సమమైనది; అల్పము.

తృణబీజము. సం. వి. అ. న. శ్యామాకము, చామచె.

తృణము. సం. వి. అ. న. కిక్కిసలోనగుగడ్డి.

తృణరాజము. సం. వి. అ. పుం. 1. టెంకాయచెట్టు; 2. తాటిచెట్టు; 3. గిఱకతాటిచెట్టు; 4. వెదురు; 5. వెదురు చె.

తృణశూన్యము. సం. వి. అ. న. 1. మల్లెచె; 2. మొగలిచె. విణ. తృణము లేనిది.

తృణశూన్యము. సం. వి. అ. న. 1. మల్లెచె; 2. మొగలి చె.

తృణసార. సం. వి. ఆ. స్త్రీ. అరఁటిచె.

తృణావర్తము. సం. వి. అ. పుం. సుడిగాలి.

తృణీకరించు సం. స. క్రి. నిర్లక్ష్యముచేయుఁ. "శా... మద్వీర్యమున్, సామర్థ్యంబుఁ దృణీకరించి .." మార్క. ౮, ఆ. ౧౫౪. "మ. ప్రియ మ తీణము నాకు నీదెస మదిన్ భీతిప్రదోద్వేగసం,శయముల్ నేరఁగ నీను నీకు భువరక్షాకల్పనాబుద్ధి నిశ్చయ సంపాదిని నాదుతృప్తి నిను నశ్వవ్రాతముం జోఁక గా,లియుం రానీను తృణీకరింపు రిపుదోర్దీ లానము ల్లానమున్." భార. విరా. ౪, ఆ. ౧౫౬.

తృణ్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. గడ్డిమోపు; 2. గడ్డిమేటి; గడ్డిప్రోవు.

తృతీయ. సం. వి. ఆ. స్త్రీ. 1. తిథులలో మూఁడవది, తదియ; 2. విభక్తులలో మూఁడవది.

తృతీయకము. సం. వి. ణ. (అ. ఆ. అ.) మూఁడవది.

తృతీయము. సం. విణ. (అ. ఆ. అ.) మూఁడవది.

తృతీయాకృతము. సం. విశే. (అ. ఆ. అ.) మూఁడు చాళ్లు దున్నినది. (నేల)

తృతీయాప్రకృతి. సం. వి ఇ. స్త్రీ. 1. నపుంసకుడు, పేడి; 2. నపుంసకలింగము.

తృప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తనివి; 2. సంతోషము.

తృప్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తృప్తినొందిన వాఁడు, తనిసినవాఁడు.

తృప్ణువు. సం. విణ. (ఉ.) తృప్తిశీలుఁడు, తనివి నొందు స్వభావము గలవాఁడు.

తృప్యత్. సం. శత్ర. తృప్తినొందుచున్న.

తృప్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) తృప్తినొందింపఁబడుచున్నది.

తృప్రము. సం. వి. అ. పుం. పురోడాశము.

తృష. సం. వి. ఆ. స్త్రీ. 1. దప్పి; 2. మిక్కుటమైనయిచ్ఛ "క. దేవితృష దీర్పఁ బూనితి,వావెలఁదినవతోదరుండ నగువాతృష లీ,లావలి నీదు సరసనం, భావనమెయిఁ దీర్పకునికి పాడియె చెపుమా." భార. విరా. ౩, ఆ. ౧౧౩. (ఈ పద్యము నీరెండర్థములకు నుదాహరణము.)

తృషితము. సం. వి. అ. న. తృష.

తృషితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దప్పిగొన్న వాఁడు; 2. ఆశావంతుఁడు.

తృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. దప్పి; 2. మిక్కుటమైన ఇచ్ఛ; పేరాస.

తృష్యత్. సం. శత్ర. తృష్ణనొందుచున్న.

తృష్యము. సం. వి. అ. న. మిక్కుటమైన ఇచ్ఛ; పేరాస. విణ. (అ. ఆ. అ.) కోరఁదగినది.

తె

తె. అవ. 'ఒకఁడు, ఎవ్వఁడు' అను సర్వనామములకు వచ్చు సమాప్తివాచకప్రత్యయము ఉదా:— ఒకతె, ఎవతె. ఇం.

తెంక. దే. వి. (త. తేంకు) భయము. "సీ. మనకుల దైవ మన్నన్నన లేదేని ద్రిభువనారాధ్యుఁ డన్ తెంక లేక." కు. సం. ౪, ఆ. ౫౧.

తెంకగు. దే. అ. క్రి. (తెంక+అగు) భీతిచెందు. "ఉ. తెంకగు నోరచూపులను దేఁకువ తప్పిన యెనబానలున్, ఱంకులబ్రహ్మ యానమురరాజ్యము కొట్టు సృజించె నక్కటా." (చాటుపద్యమణిమంజరి.) [(శ. ర.)

తెంకాయ. దే. వి. (త. తేంగాయ్.) కొబ్బెరకాయ.

తెంకి. దే. వి. స్థానము,ఉనికిపట్టు. "సీ. తిరుశభూములం తెంకులుగఁ జరించిన దొడ్డచిత్రులవారుల కొల్లఁ తెండివైచి." శై. ౧, ఆ. ౪౫, పి. శతం. ౫ ఆ. ౩.

తెంకిపట్టు=తెంకి. "సీ. ఇవిగుజ్జరుమెంగంబు చిఱురాకుఁ బోఁడులఁ దాగి చెట్లఁగట్టిన తెంకిపట్టులు..." రామా. ౭, ఆ. ౧౫౭.

తెంచు. దే. స. క్రి. (తెగు ధా. ప్రే.) 1. తెగఁగొట్టు, ఊడ్చు. "ఉ...మన్నియో, గమ్మున నీ ప్రదేశమునఁ గ్రమ్మినపుణ్యజన్యజాడ్యపాశమ్ములఁ దెంపు..." పాండు. ౫, ఆ. ౧౪౧; 2. గెంటించు, పఱచు. 'శా...కలిరాజుల్ గైదువులఁ దోడ్తోఁ దాల్మి లేదీఁగలన్, వే తెంచె న్నగదేకవిక్రమ కళాపీఠుం డొగిన్." పి. శకుం. ౨, ఆ. ౧౬౧. వరాహ. 3, ఆ. ౯౨. అ. క్రి. 1. ఇది గమనార్థక క్రియలతోఁ గూడి శబ్దపల్లవమై యాగమనార్థ మిచ్చును. ఉదా.-చనుదెంచు, ఏఁగుదెందు. మొ; 2. కొన్ని క్రియలకు స్వార్థమందు ప్రయుక్త మగు. ఉదా.- తోతెంచు, అగుదెంచు. మొ.

తెందు. దే. అ. క్రి. పరుండు. "ఉ ..నెమరు పెట్టుచు నందినియట్టు సాకుచుం, బచ్చికఁ దెండి యున్నయది భామిని వేలుపుటావుఁ జూచితే." పారి. ౨, ఆ ౯౫, అము. ౫, ఆ. ౧౪౬.

తెందగ. దే. అవ్య. ద్రు. (తెగ+తెగ) అధికముగా "క...పనితలు చెలికిం,పొంద నెడ గంద మిడు తలఁ,దెందగఁ బైపైని బాలతేనియ గురిసెన్." ప్రబంధ. ౫౩౦.

తెందప్పు. దే. విశే. (తేప+తేప) అపారము, అసంఖ్యాకము. "క. అందల మందలలే కిప్పుదందలమందలయి యున్నవయ్యె మెకంబుల్, చెందామర కొలనివలెన్,జందప్పు లవేమి చెప్ప దేవుఁ డెఱుంగున్." సా. ౧, ఆ. ౬౭. (శ. ర. పా.)

తెందేప=తెందప్పు. "గీ. అందుఁ దెందేపలుగ సిరుల్ గ్రందుకొనఁగ,బుధిమి వెలసె హాలుమామియాపు దమితేఁడు." య. ౧, ఆ. ౧౬.

తెంప. దే. వి. తుప్పు. "క. తెంపలు గలయఁదవులఁ దగిలింప నిలింపాహితుల్ స్ఫులింగము లెగయన్ జొంపెసఁగఁ బావకుఁడు..." దశా ౨, ఆ. ౫౯ చెం. పంచ. ౧, ఆ. ౪౯౩.

తెంపరి. దే. విశే. (తెంపు+అరి). 1. సాహసికుఁడు. "క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యోరి పలుక కఠినోక్తుల నా,గుంపించెదు సాహసకుం, దెంపరివై పదరువాని తెలియఁగునఁ గుమతీ." భాగ. ౭, స్కం. ద్వా. ౯, ఆ. ౧౯౩. ౨౭౦; 2. శూరుఁడు. "సీ. దుఱుకరి యనఁగఁ దెంపరి యన శూరాభిధానంబు గాఁగను దనరుచుండు" ఆం భా. ద్వి. ౧౮౫; 3. క్రూరుఁడు. "ఉ. తెంపరివై పొరింపొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం, జంపితివి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౪. వేం. పంచ. ౪, ఆ. ౨౯౪.

తెంపాడు. దే. స. క్రి. (తెంపు+ఆడు) నిరసించు. "మ. తగుతే న న్నిటులాడ నీకు ననవద్యం బైన సద్వర్తనాదిగుణౌఘంబుల శుద్ధ నా లెఱుఁగవే తెంపాడ యుక్తంబె..." భా. రా. యు. ౨౩౪౯.

తెంపి. దే. వి. విధవ, వితంతువు. "గీ. పఱచు తెంపికి నిత్యసౌభాగ్యమస్తు." క్రీడా. ౭౧౪. విశే. తెగినది,ఛిన్నము. "ద్వి. చింపిగొడ్డలుచు గ్రుస్సినశరీరములు, తెంపి జన్నిదములుఁ దరలఁను జాల." పండితా. పర్వ. ౩౩౫. పు

తెంపు. దే. స. క్రి. 1. ఖండించు. (శ. ర. బ్రా.) వి. 1. తెగుట. (శ. ర.); 2. తెంచుట. (బ్రా. వా.), 3. సాహసము. "గీ. అధిప నీతనయుండు గయ్యంబు వొదుచు, తెంపు వదలక విభవంబు పెంపుమెఱసె." భార. భీష్మ. ౧, ఆ. ౧౪౨, 4. బలాత్కారము. "ద్వి ..పేద బ్రేవులఁ జూడ, బోదురే బుణము దెంపునఁ గొనువారు." ద్వి. హరిశ్చ. ఉ ౨౦౨, పం.

తెంపుబడి. దే. విశే. మూర్ఖుఁడు. "శా. చాతుర్యంబుల చొరఁ జెంద డు కులాచారంబు గోరండు... రతి తత్త్వప్రౌఢుఁడు గాఁడు భా,మా తెంపుబడియైనయావికటవర్త్మం జెప్పఁగాఁ గూడునే." దశ. ౭, ఆ. ౨౯.

తెకతెక. దే.వి. 1. ఉడుకుట, క్రాఁగుట మొదలగువానియందగుధ్వని కనుకరణము. "చ ఒకయెడఁ జక్రవాకము పయోరుహమిత్రుని వేఁడిరొండచేఁ; దాక తెకఁ గ్రాఁగు తప్పెనిరితేనియ తొక్కులఁ జల్ల నార్చి .." పారి. ౪, ఆ. ౨౨. వరాహ. ౨, ఆ. ౬౪; 2. ఎండగాయుట, పరితపించుట, మున్నగువాని కనుకరణము. "క. ఒకకొంతదవ్వు చని చని, తెకతెక నెగ లెగయు నెండతెరలం బోరలన్." రామా. ౫, ఆ. ౩౦. "గీ. చిత్తము తెకతెక నుడికె మొత్తపడియె." పరమ. ౧, ఆ. ౧౧౪.

తెకతేర. దే. క్రి. విశే. (తేర+తేర.) 1. కడు సులభముగా. "సీ. తోడియిందిరను గౌస్తుభము నవ్వేల్పుదధిపుఁడై ధరియించె నతఁడె చేకొనఁగాక తెకతేర యిదియేమి యొకరిసొమ్మె." పారి. ౪, ఆ. ౫౭; 2. వ్యర్థముగా. "గీ. ప్రాణ మేటికిఁ దెకతేర పాసిపోనఁగ." వేం. పంచ. ౩, ఆ. ౧౨౨. (శ. ర. పా.); 3. నిష్కారణముగా "గీ. ఇతని తెక్కడిసామ్రాజ్య మేల బ్రదుకు, చెడిరయెం దెకతేర యనుచుఁ గేరడము లాడె." వేం. పంచ. ౧, ఆ. ౩౬౯.

తెక్కరము. దే. వి. విలాసము. "సీ .. తెక్కు తెక్కర మెప్పె టెక్కు వేసు... హొయ లనఁగ విలాస మొప్పుచుండు." ఆం. భా. క్ర. ౧౩౯.

తెక్కలి. వై. వి. (సం. తస్కరః.) దొంగతనము. "క. కొనిపోవ రాదు తెరువునఁ, గనకము తెక్కలి ఘనంబు కాకున్నను మోపను రాదు పెద్ద హేమంబు..." కేయూర. ౩, ౩౧౭. ఆా. భా. ద్వి. ౭౯౨; 2. వంచనము. "ఉ...మహో న్నతపీఠ మలంకరించునిన్, దెక్కలిఁ దాఁకి ధాత యిలఁ ద్రెళ్లెడునట్లుగఁ జేసె..." భార. కల్యా. ౨, ఆ. ౪౦౨; 3. పొరపాటు "క. అక్కట నాగురుపుత్త్రు తెక్కలిఁ గోల్పడితి నెద్ది తెఱఁగో విప్రుం,డెక్కడి తెక్కడఁ దలఁచెను, దృక్కర ణోన్మాద మింత తీవ్రం బగునే." భో. ౪, ఆ. ౨౩౦; 4. బాధ. "ద్వి. నీసతితోఁ బొందు నీ తొంటిపెంపుఁ, బడయుము మా వింక నీపదము దప్పి నను, గడపట నీవు తెక్కలిఁ జత్తువు .." ద్వి. హరిశ్చ. ఉ. ౨౫౧౬. పుం. విశే. 1. దొంగ. "చ...అత్మ పెం,దెవు లయినన్ జలా బయిఁ దెక్కలి యైన మృగాగ్ను లైన...తీర్చు దే,లవు తను వూరకే చెడ కిల న్గృశు నొక్కనిఁ బ్రోచు టొప్పదే." ఆము. ౬, ఆ. ౩౦; 2. వంచకుఁడు. "మ. మలయం బెక్కడ నసన్మార్గంబు పాటించి తెక్కలిదైవం బిటు నాకు నీయహితము గావించునే ." కాశీ. ౫, ఆ. ౧౬౭; 3 రహస్యము. "క. కలలోన నైనఁ బురుషునిఁ,దెలియం జూడని కళావతీతిలకము తెక్కలిగర్భము దాల్చెను యని, నలుగురు విని నిందచేసి నవ్వఁగ వలసెన్." చెన్న. ౧, ఆ. ౧౩౩. వి. పు. పీ. ౪౪; 4. క్రూరుఁడు. "క. అక్కట యయ్యురు లలిం దగు, నొక్కఁడులమున్న కిప్పు డిట్టిదొసంగుల్, దెక్కలి దయ్యం బితయుం, నక్కటికము లేక యిట్లు వర్తించెనో." అచ్చ. సుం. ౧౬౮.

తెక్కలికాఁడు. ద్వ. విశే (తెక్కలి+కాఁడు.) 1. దొంగ. "తరువోజ. ధృతి దూలఁ జన నవి తిరిగి వెన్వెనుకఁ, దెక్కలికాఁడు తోతెంచి రాతనికి" భార. స్త్రీ. ౧, ఆ. ౪౩. వేంక. మాన. ౩౧. అచ్చ. బాల. ౧౫౧; 2. వంచకుఁడు. "క. హితమొనరించెద నంచున్, ధృతరాష్ట్రతనూభవునకుఁ దెక్కలికాఁడై, మృతి యొనరించెం దానును, మృతుఁడయ్యెను భ్రాతృపుత్త్రమిత్త్రయుతముగన్." భార. స్త్రీ. ౨, ఆ. ౧౩౭. చెన్న. ౨, ఆ. ౩౩.

తెక్కలికొను. దే. స. క్రి (తెక్కలి+కొను.) అపహరించు, బలాత్కారముగా వశపఱచుకొను. "క... ఒక్కరుఁడ యమృతముఁ దెక్కలికొని యూస్వాదింపక .." భార. ఆది. ౨, ఆ. ౧౦౫.

తెక్కలిగొను = తెక్కలికొను. 1. అపహరించు. "సీ. కన్నంబు పెట్టి తెక్కలిగొని యంకంబు పలువురతో నాడి బందిపెట్టి." దశ. ౬ ఆ. ౯౫; 2. చంపు. "ఉ. నిక్కము మాకుఁ జిత్తములు నీరగుచున్నవి క్రూరసత్త్వము, ల్దెక్కలిగొన్నఁ బొక్కపడదే మదిలో నినుఁ గన్నతల్లియున్." ఉ. హరి. ౨,ఆ. ౧౩౦.

తెక్కలిపాటు. వై. వి. (తెక్కలి+పాటు.) విపత్తు. "ఉ. ఎక్కడ నెల్లలోకముల నెవ్వరుఁ గోరని కోర్కి నేఁడు మా, తెక్కలిపాటుకై తెలిసి దేహము పేఁడఁగ వచ్చి కారము .." భాగ. ౬, స్కం. ౩౪౯.

తెక్కలీఁడు = తెక్కలికాఁడు. (అపహరించువాఁడు, దొంగ.) "సీ. లంకాధిపతితలలను గండకత్తెర కేవలీహృదయరాజీవహేళి. "గీ. త్రిపురవనితల యూలువు తెక్కలీఁడు." వరాహ. ౫, ఆ. ౫౯.

తెక్కు. దే. అ. క్రి. పుదించు. "క. నిద్దురకుఁ గన్ను మోడ్చును, పుద్దులిడిం దెక్కి యున్నయది గ్రోరగము, ద్విద్దహనజ్వాలావళి, నద్దినకోలలను నతని నాహుతిఁ జేసెన్." ఉద్భ. ౨, ఆ. ౧౬౧.

తెగ. దే. వి. 1. (ఎక్కుపెట్టిన.) అల్లెత్రాడు, నారి. "క. అని తెగ నిండ దిగిచి యేసిన నయ్యస్త్రంబు రోదసీకుహరంబుల్, దన మెఱుఁగుల నించుచు ..." భార. కర్ణ. ౩, ఆ. ౩౬౦. ఉ. హరి. ౩,

ఆ. ౯౩; 2. వింటినారిని లాగుట, జ్యాకృష్టి. "క. ఇది నీ తెగకోలందిది నీరవినోదము నవ్వు దధి కధరపము లగుము, ద్వివిధాటోపములకుఁ జాలవు విల్లది నూఱువేలలా వరయంగన్." భార. విరా. ౪, ఆ. ౧౦౬. రం. రా. బాల. ౬౬ పు. ౯,౭; 3. నిడుపు. "రగడ. తెల్లనిజల్లులు వింజామరములుఁ దెగ గలసవరా లేనికకొమ్ములు." కవిక. 3, ఆ. ౧౯౯. భాగ. ౧౦, స్కం. పూ. ౮౯౭; 4. విధము, రీతి. "సీ. మగమీల నగఁజాలు తెగఁ గీలు కొనువాలుకనుఁగవ కోకవింత కాంతి యొదవె." పాం. ౧, ఆ. ౯౬, 5. ఉపాయము. "ద్వి. ఎదపక నను విక్రయించి చెల్లింపు, కడఁబడుఁ గొంతైనఁ గౌశికుబాణము, కడమకు నొక తెగ గల్గు కల్లిటికి." ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౧ పం; 6. పక్షము, ఉద్ది. "గీ. సీతతోఁ గూడి రఘువీరశేఖరుండు, బాలలు స్వపక్షమున సీతపక్షమునను, జల్లుపోరాడఁ గనుఁగొంచు నరసిఁ దేలె." "క. తన తెగమగువలు రఘురాముని తెగకామినుల మించి ముంచిన..." ఉ. రా. ౬, ఆ. ౬౮, ౬౯; 7. సమూహము. "చ... తనయానవాలు రఘునాయకుఁ డెవ్వరిచేతి కిచ్చెనో, మన తెగతోఁ దలంచికొనుమా యపు డన్నియుఁ గానవచ్చెడున్." రామా. ౬,ఆ. ౭౦. 8. ప్రొవ్వు. అచ్చ. యు. ౨౩౬; 9. జాతి, కులము. "క. వినుఁ రక్కసులును వేల్పులు, ననిరొదు నీ కెందు తెగల నాథుఁడుఁ నీవునుగడ నడిపెడువారు..." య. 3, ఆ. ౧౦౭.

తెగఁగొట్టు. దే. స. క్రి. (తెగన్+కొట్టు.) ఖండించు. "గీ... గట్టు తెగఁగొట్టువజ్రమునను, జంభుసంభేద మేమి యాశ్చర్య మనఁగ." దశా. ౨, ఆ. ౪౨౨. కళా. 3, ఆ. ౧౯౧.

తెగఁగోయు. దే. స. క్రి. (తెగన్+కోయు.) 1. ఖండించు. "ఉ... మానిమానసము తద్ఘనధైర్య కఠోరశృంఖలా, సంతతి యొంతయుం గుసుమశస్త్రకలం దెగఁగోసి పైచుచున్." కళా. 3, ఆ. ౨౦; 2. తొలఁగించు. "శా. ఆయుష్మంతుఁడు నిట్టు రంగపతి కత్యంతంబు వితోత్సవ, శ్రీయోగంబులు చేయుచుం గుజనులన్ శిక్షించి వర్ణాశ్రమా, పాయంబుల్ దెగఁగోయుచున్.." కళ. ౪,ఆ.౨౩.

తెగఁజూచు. దే. స. క్రి. (తెగన్+చూచు.) చంపు. "గీ. వానిఁ దెగఁజూడదైనఁ లేని వాయుపుత్ర, నీవు గనుఁ గొన నురిశైన సీరశైన... మేను దోఁచఁ గుడు." భార. విరా. ౨, ఆ. ౨౬౯. ఉ. రా. 3, ఆ. 3౪3.

తెగఁబడు. ద్వ. అ. క్రి. (తెగన్+పడు.) సాహసించు, తెగించు. "క. మొగమున మీసము గల్గిన, మగవాఁడై తేఁ గడింది మగఁటిమి మీఱన్, దెగఁబడి పోట్లాడవలెన్, బిగువేమిర రాచముడుచ విడుకుచు నిన్నున్." అహ. ౧, ఆ. ౭౭.

తెగఁబాటు. ద్వ. వి. (తెగన్+పాటు.) సాహసము. "చ. పగతుని సాయితంపుఁదెగఁబాటునఁ దైపడి గెల్వనేర్చినన్, మగఁటిమి దూలుటే దొసఁగు మాలఁగ దానవుఁ జంపు మెచ్చెయిన్." నిర్వ. ౧౦. ౧౯. (శ. ర. పా.)

తెగఁబాఱు. దే. అ. క్రి. (తెగన్+పాఱు.) 1. సాహసించు. "గీ నీవు గెల్చినదాన్యంబు నీకు సేను, జేయఁగలదాన నేను గెల్చినను నీవు, నాకుఁ జేయంగఁ గలదాన పీకడేఁది, పన్నిదము సఱుమని తెగఁబాఱి పలికె." భార. అను. ౧, ఆ. ౧౯౦. భార. ఉద్యో. ౪, ఆ. ౨౨; 2. విజృంభించు. 'ఉ. పచ్చనివింటివాఁడు తెగఁబాఱక నిన్నుపు డింతదవ్వు రానిచ్చునె..." రాజ. చ. 3, ఆ. ౭౬. భార. ద్రో. 3, ఆ. ౭౯.

తెగగొను. దే. క్రి. (తెగ+కొను.) జ్యాకృష్టిచేయు. "గీ. అన్న కెంద్రుఁడు మఱియుఁ గెంపాఱ చూడ్కి, నిగుడ బ్రహ్మాస్త్ర మరిఁ బోసి తెగ గొనంగ." భా. రా. యు. ౨౨౧. స. క్రి. (బాణము) 1. సంధించు. "క. తెగగొని బ్రహ్మాస్త్రము రయ్యఁగదఁ జేసిన నొకటి నొకటి దార్కొని రెండున్, గగనం బంతయుఁ దేజఃస్థగితముగాఁ జేసె .." భార. ఉద్యో. ౪, ఆ. 3౪౬. వరాహ. ౧౨, ఆ. 3౪; 2. ఎక్కుపెట్టు. "వ .. కల్లం దెగగొని వాలంపవల్లిం బెల్లుగాఁ బఱపిన..." వి. కథం. 3, ఆ. ౧౧3.

తెగచు. దే. అ. క్రి. కలఁగు. "గీ. చెన్ను దఱిగిన పొగడుతో విన్ననైన,దేవయానఁ గనుంగొని తెగచి వగచి." య. 3, ఆ. ౭౨. పాండు. 3, ఆ. ౨౪.

తెగటార్చు. దే. స. క్రి. (తెగటాఱు ధా. ప్రే.) 1. వధింపఁ జేయు. "ఉ. మంటయుఁ బోలి శాత్రవ సమాజము నించుకయేనిశంక లే,కంటఁగఁ దాఁకి తెగటార్చి మహాద్భుతశక్తికాలి..." భార. విరా.

౩, ఆ. ౨౨౮; 2. చంపు. "మ. ప్రతిపక్షుం డెగ టార్చు నంగుళిశిఖాప్రస్ఫోటమాత్రంబునన్." కాశీ. 3, ఆ. ౧౯౦. ఆం. భా. కృ. ౧౨౩; 3. (ఋణము) తీర్చు. "ద్వి. మన కెవ్వ రందు సంబంధిబాంధవులు, మనయప్పు తెగటార్ప మది వేఁడునారు." ద్వి. హరిశ్చ. ౬. ౯.

తెగటార్చు. దే. వి. (తెగటార్చు. ధా.) చంపుట, హింస. ఆం. భా. ద్వి. ౨౭౮.

తెగటాఱు. దే. అ. క్రి. (తెగటు+ఆఱు.) 1. చచ్చు. "సీ. బలము నాగాయుతప్రాణసమం బగు నమ్మహోరా జట్టె యదవిచిచ్చు. గీ. వలనఁ దెగ టాఱె సేమనఁ గలదు .." భార ఆశ్ర. ౨ ఆ. ౯౬౧. మొల్ల. సు. ౧౪౯; నశించు. "క. లోకం బులు తెగటాఱఁగ, నేకార్ణవ మైనయిచట నిబ్బా లుఁడు..." భార. అర. ౪, ఆ. ౨౫౪; 3. భ్రాంతి యగు "సీ. మాకుఁ జూడంగ సొమ్మసిలి కడ్డది గాని తెగటాఱఁ జచ్చుట తెలియరాదు." వరాహ. ౧౦, ఆ. ౪౫.

తెగటు. దే. వి తుష్ట, గర్వము. (శ. ర. బ్రా.)

తెగడ. వై. వి. (సం. త్రివృతా.) ఓషధివిశేషము. "సీ... త్రిపుట కెలయుఁ దెగడ యనిన." ఆం. భా. ద్వి. ౫౭.

తెగడిక. దే. వి. (తెగడు+ఇక - స్వార్థమున.) నింద. "సీ... ఈసడింపు తెగడు తెగడిక... రోఁత రోఁచు . ఏవగింపు నా నపవాదసంజ్ఞలై యలరు చుండు." ఆం. భా. ప్ర. ౧౧౫.

తెగడు. దే. అ. క్రి. ఉపేక్షింపఁబడు. "క. మిగులఁ గడగండ్లఁ బడియున్, దెగడక దా రెల్ల నిపుడు నీ మేనల్లుం,డగుకటికేలుపుకశమున, నొగి నునుఱుల తోడ నిల్చి యున్నారు సుమీ." సీతా. ౧, ఆ. ౬౬. (శ. ర. పా. తెగయక. ముద్రి.) స. క్రి. 1. నిందించు. "క. తగువార లొరులు దెగడుట, పొగడుట యగుపలుకుపొంతఁ బోవరు .." భార. కర్ణ. ౧, ఆ. ౩౧౩. భార. విరా. ౪, ౬౬; 2. తిరస్కరించు. "సీ. కరువలి కుడియమిఁ గదలక చెన్నొందుకొమ్మఱిరి తమ్ములు నుఱుక తెగడి. గీ. తన విలోచనములు,..." భార. విరా. ౨, ఆ. ౭౩. రసిక. ౧, ఆ. ౯౦; 3. ఉపేక్షించు. "క. అల్లన తాటక... విల్లెక్కిడి యొకచిల్కు,నఁ, బ్రల్లింపుము పొలఁతి యనుచుఁ దెగడక దానిన్." అచ్చ. బాల. ౧౧౨; 4. పరిహసించు. "గీ. కాంత యొ కాంతవేళలఁ గాంతుకొమట,నగుచుఁ దెగడుచు నుడుట తగవుసూవె." కాశీ. 3, ఆ. ౬౨; 5. ఆక్షేపించు. "సీ. ఇరాన్నళ్లవలె మనసిచ్చి మాటా డవే యొందు దృష్టి యని కాళింది దెగడె." విజ. 3, ఆ. ౨౮; 6. భయపెట్టు. "క...చింతాజల నిధిఁ; దేలుచుఁ గైకేయీసఖులఁ దెగడుచుఁ గంటన్." వసు. 3, ఆ. ౧౭౧; 7. నిర్ణయించు. "క. జంభాహితుఁ దూర్వశిప్రై,రంభకుయిం గరుణ కలిమి రహిఁ దన్నటనా, జృంభణలతారతమ్యము, సంభావించుటయ కాని చాలఁడు తెగడన్." విక్ర. ౨, ఆ. ౭౭.

తెగదీయు. దే. అ. క్రి. (తెగ+తీయు.) వ్యాకృష్టి సేయు. "శా. చండాశివిషఘోరసాయకము చంచజ్జ్యాసమేతంబుగా, నిండారం దెగదీసి లోక ములు ఘూర్ణిల్లంగ రామక్షితీశుం డాస్ఫోటన చేసె .." భా. రా. కిష్కిం. ౨౨౮.

తెగదెంపు. దే. వి. (తెంపు+తెంపు.) సాహసము. "ఉ... అత్తఱిఁ జిత్తినిచిత్తవీథిలో, ధీరతఁ బూని లేని తెగదెంపు వహించుచుఁ బల్కె నల్కతో, నేరము లేనిదానికరణి న్నతి యింపున నాలకింపఁ గన్." శుక. ౨, ఆ. ౧౩౦.

తెగనాడు. దే. స. క్రి. (తెగన్+ఆడు.) 1. కఠిన ముగాఁ బలుకు. "గీ. చెలులఁ దెగనాడునీవు నీ చేత నాడు,కలిరుఁ బ్రాయంపుముద్దురాచిలుక తోడు." రసిక. 3, ఆ ౯౫. భార. ఆశ్ర. ౧, ఆ. ౯౫; 2. నశింపఁజేయు. "మ. అగసంస్తం భనమానిగాలి కటు డాయుంగాక యోర్వ్యాగ్నికిం, దెగనాడన్ వసపోనిదుర్యశపుటద్ధిన్ శక్యమా దాఁటఁగన్." చం. రా. ౬, ఆ. ౯౦.

తెగబారెఁడు. దే.విణ. (తెగ+బార+ఎఁడు.) మిక్కిలి దీర్ఘము. "క. తెగబారెఁడనఁటి మేలిమి, చిగు రాకులు వైచి జలము చికిలించుటయున్." రా. వి. ౨, ఆ. ౯౭, స్వా. 3, ఆ. ౬.

తెగవాపు. దే. అ. క్రి. (తెగ+పాపు.) వ్యాకృష్టి సేయు. "వ. అక్కర్ణుండు .. కార్ముకగుణంబున సంధించి తెగవాపినం గని .." భార. కర్ణ. 3, ఆ. ౪౧౯, భా. రా. అర. ౧, ఆ. ౨౦౯.

తెగవ్రేటు. దే. వి. (తెగన్+వ్రేటు.) నఱకుట, ఖండ నము. "ఛ. పలుకువెలందికిన్ మనికిప ట్టగుచాలంథ

పోటుదామరల్, గలిగియుఁ గ్రొత్తపల్కులు చొకాటముగా నుడువంగ నేర్చె,కల తెగ్రేటులం బడియెఁ దా నొక్కకేరుపుకాఁడె యంచు నన్నలు వను మాటిమాటికిని నవ్వుదు రచ్చటికేల వేలుపుల్." అచ్చ. బాల. ౩౯.

తెగవేయు. దే. స. క్రి. (తెగన్+వేయు.) నఱకు. "క. అసంఖ్యలసమరంబున, వాసవుఁ డా మే లనంగ వసువుల్ తుషితుల్, దాసిరి యసిధారలఁ దెగ,వేసిరి రోసమున ననురవీరులశిరముల్." ఉ. రా. ౪, ఆ. ౩౩౦, దశా. ౬, ఆ. ౯౫.

తెగించు. దే. అ. క్రి. (తెగు+ఇంచు - స్వార్థమున.) సాహసించు. "గీ. ఇవ్విధంబున నభ్యాప్తి మేందు వదన, యన్య-భోగసుఖ వేళ మబ్బె నేని,యాకసం బైన భేదించి యవల పోవ,నంతకుఁ దెగించి యున్నయయ్యవసరమున." శుక. ౪, ఆ. ౬౩.

తెగింపు. దే. వి. (తెగించు. ధా.) సాహసము. "వ.. తెగింపులు నగింపులు ..పెఅయన్..." భీమ. ౪, ఆ. ౬౦.

తెగిపోవు. దే. అ. క్రి. (తెగి+పోవు.) భిన్నమగు. "సీ. వలఁదచన్నులవారి వల్లికల్ దెగిపోవఁ బగ్గ్యెదల్ బలిమిమైఁ బట్టి తిగిచి." ఉ. రా. ౪, ఆ. ౯౩; 2. ముగియు. "ఉ . అట తెగిపోవు కతికొ..." దశ. ౪, ఆ. ౫౧, 3. విడివడు. "సీ. నగరు వెల్వడుదాఁకఁ దెగిపోయి మఱి నిల్చి తోడవిద్యాంసులఁ గూడువారు." ఆము. ౪, ఆ. ౭; 4. చనిపోవు. "క. తెగిపోయినవా రేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార మానుఁడు మీఱం దెగుదురు దడిసిన వావ్రదు..." భార. శాం. ౩, ఆ. ౩౬౯; 5. తొలఁగు. "వ ..పగవాఁడు బలవంతుం డింతన తెగిపోయెడివాఁడుగాఁ డీశ్వన మగుడంబడి యెద్దియేని కీళ్ళవం బాపాదించు .." హరి. ఉ. ౧, ఆ. ౧౪౦.

తెగియించు = తెగించు. "ఉ. ఎంతకు నేర రంత తెగియించినవారు..." శుక. ౪, ఆ. ౨౮.

తెగు. దే. అ. క్రి. భిన్నమగు, చచ్చు. "గీ. ఇంద్రులేందఱు పోరిరుద్రు లేల బ్రహ్మ, లుండుదురె తటితోఁ దెగుచున్నవారు." భార. శాం. ౪. ఆ. ౪౩౬. కాశీ. ౪, ఆ. ౫౮; 2. భిన్నమగు. "మ. బలిమిం ద్రెంపఁగఁ బోవఁ బాయవడుచుం బర్యాయభంగంబునన్, గలనా తెల్లను నంచు పోవఁ దెగి రాఁగా..." ఆము. ౪, ఆ. ౩; 3. నశించుపోవు. "చ...పండితుల్, పగతురె యున్న వారికి నవశ్యవిధేయతఁ జన్న వారికిం, దెగువగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౯౫. పార్వ. ౩, ఆ. ౪౯; 4. తొలఁగు. "గీ. పట్టి యాతనిఁ జెఱఁ బెట్టి పాండవులకు, దిగులు పుట్టింత మంతటఁ దెగక యొత్తి, వచ్చిరేనియుఁ నిర్జింప వచ్చు .." భార. ఉద్యో. ౩, ఆ. ౩౯౦; 5. పూర్తియగు. "క. ఏమని చెప్పుదు నిట్లను, జామాటయుఁ దెగక మున్న పౌత్రా యుం,చామునిపల్కియుం నప్పుడు, భూమిం బడి యుండె..." భా రా. అయో. ౨౦౩. వరాహ. ౧౦, ఆ. ౭౭. భార. ఉద్యో. ౧, ఆ. ౨౫౪; 6. సాహసించు. "చ ..పాండురాజునకు జనించితేనిఁ దగి చూపుము శౌర్యము నస్త్రవీర్య మున్." భార. ద్రో. ౩, ఆ. ౧౯౫ దశ. ౧౦, ఆ. ౯౭; 7. సాధ్యమగు. "చ. తనభుజశక్తియుంగ్ రిపులదర్పము నేర్పడఁ జూచి చూచి యొట్టును దెగకున్నఁ బోక యిది లోకముచక్కటి..." భార. విరా. ౪, ఆ. ౬౧; 8. చూఱ "మ. అవి వారిక్ మగిడించి తాన చని యిస్వాదీవి కొల్లొంటికిక్, గనకం బెత్తులు రెంటి లెక్కఁ దెగినం గైకొంచు సాగ్గోదలన్, నిరుపారంగ సువర్ణ మెత్తుకొని ." కేయూర. ౩, ఆ. ౧౭౧; 9. పరిష్కృత మగు. "క. తెగ దిప్పుడు తగ వడుగఁగ రండు దీర్చెదను బొందు .." జై. ౭ ఆ. ౨౦౯; 10. పూర్తియగు. "శా ..కాస్మీరఖండంపుఁగే, దారముల్ తెగ నమ్మఁగా జనుచె .." పాండు. ౩, ఆ. ౪౦; 11. వాఁడిగల దగు. "గీ. తెగి తెగనిచిఱు కత్తిలోఁతగ వధించు,టచిత మని యోలి నిట్టేచు చున్నయవియొ." ప్రభా. ౫, ఆ. ౧౭౪. (తెగి తెగని = కొంచెమువాఁడిగల దగు).

తెగుడు. దే. వి. (తెగు. ధా.) తెగట. (శ. ర. ప్రా.)

తెగుదల. దే వి. అంతము, ముగింపు. "గీ. ఈపునో గ్లాని తెగుదల యొద్ది చెపుమ." నిర్వ. ౯, ఆ. ౫౩, భార. అర. ౫, ఆ. ౩౪౦.

తెగుదారి. దే. విశే. (తెగువ+దారి.) 1. సాహసికురాలు; సాహసికుఁడు. "చ. ధవు నెడఁబాసి వచ్చు తెగుదారికి నా కిఁక వంత యేల..." ఉ. రా. ౬ ఆ. ౨౪౦; 2. దాత. "చ...కదుసొంపు

లంగాఁ బొగడించుకొఁజూమీ, కలఁడుగ నిచ్చు డింత తెగువారుల మైరిమి..." ప్ర.భా. ౧, ఆ. ౧౦౨.

తెగుదెంపు. దే. వి. (తెగు+తెంపు.) తీర్పు. "మ. యమపూనుం దనుఁ గృష్ణుఁ జూచి బకదాల్భ్యర్ వ్యాసకణ్వాదిసం యమి లుండం దెగుదెంపు సేయు కిటు లేలా వారిఁ బొమ్మంటివి..." జై. ౮, ఆ. ౨౧౦; 2. సాహసము. "ఉ...అత్తఱిఁ జిత్తిని చిత్త పీఠిలో, ధీరతఁ బూని లేనితెగుదెంపు వహిం చుచుఁ బల్కె నల్కతో, సేరము లేనిదాని కరణిన్." శుక. ౨, ఆ. ౧౩౦; 3. ఫలితము. "క. నాతో దని న న్నడుగుట, యీ తెగుదెంపు నకు ముగిసె నిఁక నే మనుచున్, రాతిగొడుకఁడు వాలసం, జాలకినా శ్శౌరికశిన శయముసఁ జఱిచెన్." పం. పంచ. ౪, ఆ. ౪౨౮; 4. సంబంధరాహి త్యము. ఉదా-వారికి మాకుఁ దెగదెంపు లైనవి.

తెగుబడి. దే. వి. (తెగు. ధా.) 1. తెగుట. 2. దుక్కి; 3. అమ్మకము. (శ. ర. బ్రౌ.)

తెగులు. దే. వి. వ్యాధి. (శ. ర.)

తెగువ. దే. వి. 1. సాహసము. "క. పగవఁగ నేటికిఁ బార్థుఁడు, దెగువకుఁ జొరకున్న భీష్ముఁ డాగఁ జూచి వెసం, బగ యడఁగించెద .." భార. భీష్మ. 3, ఆ. ౨౮3. శాం. ౧. ఆ. ౧౦౪; 2 దాతృ త్వము. (శ. ర.); 3. నిశ్చయము. "గీ. ఇవ్విధం బునఁ దమకమయెబు గుతెఱఁగు, లందఱును శిష్ప విని తురుసందనుండు, దగ విచారించి కార్యంబు తెగువ గాంచి, యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె." భార. విరా. 3, ఆ. ౧౧౨ భార. ఉద్యో. ౪, ఆ. ౯౪; 4. వాఁడి. (చూ. తెగువరి.)

తెగువతనము. దే. వి. (తెగువ+తనము-స్వార్థమున.) సాహసము. "గీ తగిలి కార్చిచ్చు మ్రింగిన తెగువతనము." రాజ. ౪. ౨౫.

తెగువడు. ద్వ. అ. క్రి. (తెగు+పడు.) విడివడు. "క. మృగము మ గాకము కెలంకయఁ, దెగువడి కచ్ఛపము పోక లేటకడిన..." నా. పంచ. ౨, ఆ ౨౧3. (శ. ర. పా. తెగబడి. ము ద్రి.)

తెగువరి. దే. విణ. (తెగువ+అరి). 1. సాహసికుఁడు; సాహసికురాలు. "క. తగ వెఱఁగ లేక యిట్టు పలెఁ, దెగువరివై పలుక నీకు తీరెనొ..." చంద్ర ౧, ఆ. ౧౪౨; 2. వాఁడి గలది; 3. దాత. "చ. తెగువరియై వెలుంగుభవదీయకృపాణము వైరి కోటియుం, దగణితదానకేళిరత మయ్యును జీవన మీ దటన్న లో, భగుణము లేమిటం బలె విభుల్ నృపాలుర కెల్ల జీవనం, బొగిఁ దృణవృత్తి నిచ్చు విజయోన్నత శ్రీనరసింహభూవరా." నరస. ౫, ఆ. ౮౮. (వైకెంకర్థములకు నుదాహరణము.)

తెచ్చికోలు = తెచ్చుకోలు. (కల్పితము.) "క. తెచ్చి కోల్నెయ్యముతో డుత..." శుక. 3, ఆ. ౪౭, దశా. ౯, ఆ. 333.

తెచ్చిపెట్టు. దే. స. క్రి. (తెచ్చి+పెట్టు.) కలిగించు. "వ...రుక్మిణ్యాదు లగుమహిషు లెనమండ్రకు వేర్వేఱ యనురూపగృహంబు లమర్చి యన్నిటి కిం ద్రిదివపదనంబునం గలయొప్పిదంబు లెల్లఁ దెచ్చి పెట్టి..." హరి. ఉ. ౪, ఆ. ౨౧౧. ప్ర.భా. 3, ఆ. ౪3.

తెచ్చు. దే. స క్రి. తీసికొనివచ్చు. (దీనికి తేమి, తేరమి, తేక, తేరక, తేగా, తేంగా, తెచ్చుచున్, తెచ్చుదున్, తెత్తును, తే తెమ్ము, తెండు మున్నగు రూపములు వచ్చును.) "ఉ...వాఁరిచ్చటనుండి యాతఁడను యేఁగిరి కానఁ బండ్లు తేర మీ, వచ్చు టెఱింగి లేని జనవల్లభ వారును వత్తు రింత కున్." భార. ఆది. ౪, ఆ. ౨౪, వసు. ౫, ఆ. ౨౦; 2. కల్గించు, చేయు. "క...దుష్టాచరిత మైనజనవిధి, నాచెప్పినసుగతిఁ దేదు నరకము దెచ్చున్." భార. శాం. ౪, ౧3౧. కళా. ౧, ఆ. ౭; 3. వహించు. "ఉ. ఓనిఖిలపావన యంచు నుతించుఁ గాని తాఁ, గన్నుల నీరు తేఁడు భయకంపను మేతుఁడు గాఁడు భూవరా." భాగ. ౭, స్కం. ౯3. భాగ. ౨, స్కం. ౧3౦; 4. సంపాదించు. "క. లేరకయుండఁగఁ జేరుం, దేరంగాఁ బోలియుం విధియధీనంబులు గాఁ, శారయ వి త్తంబులు పురు, షారంభాయత్తములె మహాబుద్ధి నిధీ." భార. శాం. ౪, ఆ. 3౭3. రామలిం. శ. ౧౭; 5. సంఘటించు, కూర్చు. "ద్వి. కూటువ మూఁకలు పాటియై కూడ, చాటించి తెచ్చినసభ లను సభలే." పండితా. వాద. ౧౭౬. పు.

తెచ్చుకొను. దే. స. క్రి. (తెచ్చు+కొను-స్వార్థమున.) వహించు. "ద్వి. అంత బాలలితాంగి యంతరంగ మునఁ గొంతధైర్యము దెచ్చుకొన్నది యగుచు." ద్వి. పరమ. ౫, ఆ. ౪౦3.

తెచ్చుకోలు. దే. వి. (తెచ్చుకొను ధా.) తెచ్చుకొనుట. "చ...రెండుజాములంటు నొప్పని యది లేదు డాఁగ నగుఁబోటును ప్రాణముచేటుఁ దెచ్చుకోల్." భార. కల్యా. ౨, ఆ. ౬౨. విణ. కల్పితము, తెచ్చిపెట్టుకొన్నది. (వృత్తియందం త్యాచ్చునకు లోపము) "చ. ఎలమి విమాన మెక్కి చరియించుచు నంబరవీథిఁ దెచ్చుకో,లలు కను రంభ వచ్చి పురమందలి పేడలమైఁడిబొమ్మలం, గలసి య టూరకున్న..." దశా. ౧, ఆ. ౧౬, రం. రా. అర. ౧౬౬, పు. ౨౪, పం.

తెట్ట. దే. వి. 1. రాశిప్రోవు. "క. చుట్టును బసరపు టెమ్ముల,తెట్టలఁ జూచినను మదికి దిగులయ్యెడు..." వాల్మీకి. ౨, ఆ. ౧౬; 2. సమూహము. "మ... పిట్ట తెట్టరొద సన్నక నద్దు గావింపుచున్." చంద్రా. ౨, ఆ, ౧౦౭.

తెట్టగిలఁబడు. ద్వి. అ. క్రి. (తెట్టగిలక్+పడు.) స్వార్థమున. 1. పైకి కనఁబడు. "గీ. గర్భమున నున్న ప్రజలు పెక్కుడ మగుటయు,నురక కల వాంచి వెడలంగ నుమిసి పిదప,యమునలోపలఁ బడుచొక్క యసఁ బరంబు, మిగులఁ గాఁ గెడ వగుచుఁ దెట్టగిలఁబడియె." సాంబో. ౫, ఆ.౨౩౩; 2. అలయు. "వ...అత్తటిఁ దత్తటిల్లి చిట్టాడిన గుట్టున కెట్టనం దెట్టగిలంబడి వసుధేశుండు సుప్ర లాపవిప్రలాపంబుల నిట్టనియె." సా.౨,ఆ.౧౬౯.

తెట్టగిలు. దే. అ. క్రి. 1. పైకిఁ గనఁబడు. "సీ... అంచలు గొంత,సరి గడవఁగఁ బొ ఱి మరలి బోరలు తెట్టగిల నొక్కకడ వంచి మలపు దిరిగి." ప్రభా. ౨, ఆ. ౯౨; 2. తొలఁగు. "వ...మలసి పైకొని చేకొలఁదులఁ బట్టు దప్పక నిట్టట్టు తెట్టగిలక దిట్టలై గుట్టుమట్టు లేక పీఁకఁ దాఁకుచు .." బిల్హ. ౨, ఆ. ౧౫౯; 3. అలయు. (చూ. తెట్ట గిల బడు.); 4. తేరుకొను. "వ...బెట్టునిట్టూర్పు గాడ్పులం గొట్టువడి యొట్టకేలకుం దెట్టగిలి..." రాధికా. ౪, ఆ. ౧౦౨.

తెట్టతెన్ను. దే. వి. (తెన్ను+తెన్ను.) నడిపీథి. (శ.ర.)

తెట్టతెరువు = తెట్టతెన్ను. (శ. ర.)

తెట్టె. దే. వి. 1. కల్లుండీయుఁటకుఁ జెట్టునకుఁ దగిల్చెడు ముంత. "వ...మటియుఁ నత్తాలంబు లగుతాలం బులం గిరాతజాలంబులు గీసి మోకులం గట్టిన తెట్ల కొగనుఁటి యండల నువ్వులిల్లుకల్లు..." చంద్రా. ౨, ఆ. ౧౪; 2. కలశాకారము గలిగి యుండు బొగడ. "చ. చిలికడానిజనులు చిత్తరుపుత్తడు లూడి కెంపుబొం,దికల లిడ మానికంపుమఁదెట్టుల కట్టెలు కట్టుకట్టెరయున్, బెకడపుగోళ్ల మెప్పు జెరి చిప్పలుచప్పర మొప్పుళయ్యయం,దొకట వసంత భోగగతి నొందఁగ నందు ముకుందుఁ డున్నడన్." ముకుంద. ౩, ఆ. ౨౧౪.

తెట్టియ. దే. వి. (త. తిట్టె. తిట్టు.) 1. ఇసుకదిబ్బ. "ఉ. దట్టముగా ధరాధరవితానము లొడ్డుచు మీఁద ద్రుంకులున్, మట్టలు వైచి కప్పుచు సమ స్థలి చేయుచు సూత్రయోజకుం, బట్టుచుఁ దెట్టియల్ దరులు బల్వుగఁ జేర్చుచుఁ గట్ట రాఁగడన్, మట్టుచు యోజనార్ధశతమాత్రము గట్టిరి నాఁడు వానరుల్." భా. రా. యు. ౨౪౨; 2. తేప పెర. (శ. ర. బ్రా.); 3. తృణకాష్ఠాదిభారము. (శ. ర.); 4. రాశి (శ. ర.); 5. పాలమీఁది మీఁగడవలె కొన్నిద్రవ్యములపై నేర్పడి తేలి యుండుపదార్థము. (వా.)

తెట్టు. దే. అ. క్రి. 1. గాలిచేఁ దృణాదులు నీటిపై నొకస్థలమునకుఁ జేరు. "సీ. తరఁగల నానాఁటఁ దఱచుగా నొక్కెడఁ దెట్టినమొత్తంపుఁదెట్టు వనఁగ." వాల్మీకి." ౩, ఆ. ౯; 2. చేరు. "చ. తరువులు చుట్టుచుం బుజముతట్టుచుఁ బూఁబొద రిండ్లఁ దెట్టుచున్." బహు. ౨, ఆ. ౨౭. వి. రాశి, ప్రోగు. "ద్వి. మఱునాఁడు దాఁ జని మత్స్య నాథుండు,గుఱుకొని వసియించు గుహవాకి నిండఁ, బెనురాళ్ల తెట్టుగాఁ బెట్టి చాలించి,చనక నిశ్చల భక్తిఁ జపుదెంచి యరసి." నవ. ౨, ఆ. ౧౪౧, పు. ౧ పం; 3. సమూహము. "చ. గొడుగులం దప్పఁ బట్టినను గోటగ జేరిక తెట్టువెట్టినన్." ఉ. హరి. ౪, ఆ. ౨౦౮; 4. ఆవరణము, "సీ. కంపతెట్టు లును రాకట్టుముంగిలి మల్లెసాల దేవరయుజ చవికె యొకటి." శుక. ౨, ఆ. ౪౦౮.

తెట్టువ. వై. వి. (సం. ఘట్టి) 1. సమూహము. "లయ గ్రాహి. పొట్టలును జట్టలును బిట్టు బొగిలించి బలు తెట్టులను నొంచి జముకట్టులను బోవక్,బెట్టి కడు నేనుఁగుల లొట్టియల కట్టువలఁ దెట్టువలఁ గొట్టుటయుఁ గట్టలుకతోడన్." అచ్చ. యు. ౧౬౯; 2. ప్రోవు. "వ...మొగుళ్ల తెట్టువలలో మునుఁగుపడి..." ఉ. రా. ౩, ఆ. ౪౮; 3. గాలిచే

నీటియం దొకప్రక్క చేరినతృణాదుల సమూహము. "గీ. అంచితోద్యానవాటికలందు నవవి, ఖాతి విదళితకుసుమవిభాతి యమరె, నప్పు డర యంగఁ జంద్రకరాబ్ధివెల్లి, డొంకి చనఁ దోఁచు నురువు తెట్టువ లనంగ." నృసిం. ౩, ఆ. ౧౧౦. హరి. పూ. ౫, ఆ. ౨౬; 4. స్థానము. "గీ అంగ జవ్యాధిఁ గడుప్రబ్బినట్టివిటుల, కశ్మలపూరముల తెట్టు వల్లపట్టు, హేయభాజన మెన్నిట కన్ని జూడ, వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య." వైజ. ౨, ఆ. ౪౫.

తెట్టువగట్టు. ద్వి. అ. క్రి. (తెట్టువ+కట్టు.) నీరు మున్నగువానియందు తృణాదికము గాలి కొక్కవైపునకుఁ జేరు. "సీ. క్ష్మాధరోత్తుంగశృంగఘట్టన మునఁ జొక్కులు రాలి తెట్టువగట్టె ననఁగ." వరాహ. ౭, ఆ. ౬౧.

తెట్టువగొను. దే. అ. క్రి. (తెట్టువ+కొను.) తెట్టువలు కలదగు. "వ...తనుకరువలిం గడలు విరులం దొరఁగుపుప్పొడితిప్పలం బొరలి తెట్టువగొంచు..." పాం. ౨, ఆ. ౫౨.

తెట్టువలుగట్టు = తెట్టువగట్టు. 1. నీరు మున్నగువాని యందు తృణాదికము గాలి కొక్కవైపునకుఁ జేరు. "వ...చతురంగబలంబులయవయవంబులుఁ జామరచ్ఛత్రకేతుశకలంబులుఁ గోదండాదిహేతి ఖండంబులుం గీడ్పడి పాఱునెత్తురుటేఱులఁ దెట్టువలుగట్టె." భార. ద్రో. ౪, ఆ. ౨౯౪. హరి. పూ. ౭, ఆ, ౫; 2. ప్రోగుపడు. "సీ. బెట్టుగాఁ దెట్టువల్ గట్టి పైపై నెకల్ జల్లు పిట్టూర్పుల జాడఁ జూచి." రాజ. చ. ౩, ఆ. ౧౪౬.

తెట్టువలుగొను. ద్వి. అ. క్రి. (తెట్టువలు+కొను.) తెట్టువగట్టు. "వ. తెరలి పాఱురక్తంబులును దెట్టువలుగొన్న మాంసంబులును..." కళా. ౮, ఆ. ౧౨౩.

తెట్టె = తెట్టియ. (రాశి, ప్రోవు.) "సీ...పిండు మొత్తము తెట్టె పైకము దాఁటె లొద్ద. గీ. కులము మొల్లము మొల్లమి కుట్టె వర్గు, వనఁగ వర్గము కగు..." ఆం. భా. ద్వి. ౧౦౦.

తెట్టెము = తెట్టియ. 1. ప్రోవు, "ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁ దాఁకి భీకరా,లమ్ముల తెట్టెముల్ పఱప నద్దము వచ్చి జయింతు నంద్రు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౫౬.

తెట్టెలుగట్టు. ద్వి. అ. క్రి. (తెట్టెలు+కట్టు.) ప్రోగుపడు. "వ...తెరలి పాఱురక్తంబులును దెట్టువలుగొన్నమాంసంబులును దెట్టెలుగట్టినయస్థిశకలంబులును జూపఱకు నద్భుతభయానకబీభత్సరసంబు లావహిల్లఁజేసె..." కళా. ౮, ఆ. ౧౨౩.

తెట్టెలుగొను. ద్వి. అ. క్రి. (తెట్టెలు+కొను.) ప్రోగుపడు. "వ...కొట్టుకొని నెలకట్టియల పైచిన నిట్టట్టు గదలక తెట్టెలుగొనం గూలినకాలుబలంబులును..." ఉ. హరి. ౩, ఆ. ౨౭.

తెట్టెలుపెట్టు. ద్వి. అ. క్రి. (తెట్టెలు+పెట్టు.) చిక్కనగు. "చ. స్ఫురణ మొగిళ్లపై మొదలఁ బొల్చు జలస్రుతి నాఁడునాఁటికిం, గరఁగుచుఁ బుట్టుచుండు మణికార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గ్రొన్నురువులు గట్టినట్టులు గనుంగొన నయ్యె సురేంద్రగోపముల్, గరఁగినవింటియప్పనరుకై పడిఁ దెట్టెలు పెట్టుపచ్చికన్." ఆము. ౪, ఆ. ౧౦౦.

తెడ్డు. వై. వి. (సం. తర్ణాకః. క. తుడుప్పు.) 1. కొయ్యగరిఁటె. "క. గేహముల కేఁగి భిక్షాం,దేహియనన్ బీట నొకపతివ్రత యైనన్, సౌహార్దంబుఁ దెడ్డెం,డాహారము పెట్టదయ్యె నాదినముల లోన్." భీమ. ౨, ఆ. ౯౭. "ఉ...నేఁడొచ్చెల శూ,ద్రభామినికి నువ్విదలారి ఘటంబుఁ దప్పఁగా, వచ్చెను తెడ్డు నాఁకి యుంపవాసము మాన్పి కొనంగ నేటికిన్." విక్ర. ౧, ఆ. ౧౫౦; 2. పడవనడపుసాధనవిశేషము. (శ. ర. వా.) సా: తెగించినవానికిఁ దెడ్డే లింగము, తెడ్డుండఁగాఁ జేయి కాల్చుకొన్నట్లు.

తెడ్డుమూతికొంగ. ద్వి. వి. (తెడ్డు+మూతి+కొంగ.) జలపక్షివిశేషము. (శ. ర.)

తెత్తి. దే. వి. పిశాచము. "సీ...తెత్తులు బూతములు పిసాసములు సొగదులు, కొఱవిదాలుపులు బోఁకుదులు దయ్యంబులు గాములు బూసులు గాలులనఁగఁ, దనరుఁ బిశాచాభిధానముల్..." వేంక. దేవ. ౨౪.

తెనమఱు. దే. అ. క్రి. శయనించు. "క. హత్తుకొని యొక్కకొందఱ, నత్తెరువుం గట్టఁ బనిచి యందఱు క్రియఁ దాఁ,ది త్రోకటియఁ గొని తెనమఱి, యుత్తర ముత్తర మటంచు నొకపెద్ద కడన్." ఆము. ౬, ఆ. ౭౨. (శ. ర. పా. 'కొని లేమఱి' వావిళ్ల. పా.)

తెనిఁగించు. దే. స. క్రి. తెనుఁగుచేయు, ఆంధ్రీకరించు. "క. మును సంస్కృతములఁ జెటఁగఁ, దెనిఁగించెడి చోట నేమి దెలియక యుండన్, దనవిద్య మెఱయఁ గ్రమ్మఱఁ, జనుఁ దగు సంస్కృతముఁ దెప్పఁగా రుచి యగునే." రామా. కిష్కి. ౧౬, భాగ. ౧. స్కం. ౨౧.

తెనుఁగు. వై. వి. (సం. త్రిలింగః.) (త్రినగః కి త. తెన్. దీనివ్యుత్పత్తి యింతవఱకు నిర్ధారకము కాలేదు.) శ్రీశైలము, దక్షారామము, కాళేశ్వరము అను మూఁడుశైవస్థలములమధ్య నుండుదేశమున వ్యవహరింపఁబడుభాష, ఆంధ్రభాష. "క. జనసుత కృష్ణద్వైపాయనముని వృషభాభిహితమహాభారత బంధురార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధికధీశక్తి మెయిన్." భార. ఆది. ౧, అ. ౧౬. నీలా. ౧, ఆ. ౧౬.

తెనుఁగుచేయు. ద్వ. స. క్రి. (తెనుఁగు+చేయు.) ఆంధ్రీకరించు. 'గీ...కాశికాఖండ మేను దెనుఁగు చేసెద..." కాశీ. ౧, ఆ. ౭.

తెనుఁగుఁజేయు. ద్వ. స. క్రి. (తెనుఁగు+చేయు.) ఆంధ్రీకరించు. "మ. ఒనరన్ నన్నయతిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్, తెనుఁగుం జేయుచు..." భాగ. ౧, స్కం. ౨౧.

తెనుఁగుపడు. వై. వి. (తెనుఁగు+పడు.) ఆంధ్రీకృతమగు. (చూ. తెనుఁగుపఱచు.)

తెనుఁగుపఱచు. వై. వి. (తెనుఁగుపడు. ధా. ప్రే.) ఆంధ్రీకరించు. "క. ఇది తత్త్వరహస్యార్థము, పదసంగతిఁ దెనుఁగుపఱుప బ్రాహ్మణులకు పెట్టిద మగు..." వాసిష్ఠ. ౧, ఆ. ౧౧.

తెనుఁగువాఁడు. ద్వ. వి. (తెనుఁగు+వాఁడు.) ఆంధ్రుఁడు, త్రిలింగదేశస్థుఁడు. "సీ. ఆంధ్రుఁ డాఁ దెనుఁగువాఁ డనఁ దెల్గువాఁ డన..." ఆం. భా. ద్వి. ౧౦౩.

తెన్ను. దే. వి. ౘౌ. అక్షా. 1. మార్గము, దారి. "ఉ. తెన్నున కేను గాదనను దేవర మీఱిన మిజ్జగంబునం, దన్నటికిం జిరం బగు .." య. ౩, ఆ. ౩౨, ఆం. భా. ద్వి. ౮; 2. విధము, ప్రకారము. "సీ. విషమును జేకొద్ది మెసవి త్రేఁచెడువాఁడు దీని కన్నంబు నే తెన్నుఁ బెట్టు." పార్వ. ౪, ఆ. ౯౭; 3. కుష్ఠరోగము. "సీ. మార్గకుష్ఠంబులు మనుచుండుఁ దెన్ను గా..." ఆం. భా. తృ. ౫౫.

తెన్నుండు. దే. అ. క్రి. పరుండు. "ఆ. నీరినతుము దంప నేలఁ దెన్నుండి చేవెల్వఁ గలితుఁ ద్రచ్చి యెన్నఁ గొనఁగ." కు. సం. ౮, ఆ. ౧౩౫, కాశీ. ౫ ఆ. ౨౦౭.

తెప్ప. దే. వి. (క. త. తెప్ప.) 1. ప్లవము, నావ. "మ...అంజనాపుత్రుఁ డర్క,బలు తెప్పన్ గొని కాదె దాఁటెరి విపత్పాథోధి .." ఉ. రా ౫, ఆ. ౭౮, ఆం. భా. ప్ర. ౧౫౭; 2. రాశి,ప్రోవు. "సీ. తెప్పలై కాత్తావిపుష్పలై పుష్పాక్షరల గంధ కాడి త్రోవఁ జిలుక వలదు." పరు. ౧, ఆ.౧౪౧; 3. మిట్టనేల. "సీ. నెలసమేఱులందలి తెలినీటఁ దచుపుసొం పెలసినగిరులఁ దెప్పలకుఁ జేర్చి." భార. శాం. 3, ఆ. 33౨; 4. నీటిలో నీఁదు నపుడు మనుష్యులు సాధకముగాఁ జేసికొనెడు కొయ్య. (వా).

తెప్పగట్టు. దే. అ. క్రి. (తెప్ప+కట్టు.) అధికమగు. "సీ. చప్పరింపఁగ జాతి తెప్పగట్టుకవచ్చు విమల ఫేనము సుధాసముదయంబు." చంద్రా. ౧,ఆ. ౭౫.

తెప్పదెరల. దే. క్రి. విశే. ద్రు. (తెప్ప+తెరలన్.) 1. బహుళముగా. "క...గురుం, డపాండవబల ములపైఁ, దెప్పదెరలఁ గురిసె శరతతిం దీవ్రము గాన్." భాగ. భీష్మ. ౨, ఆ. 3౮౧. భార. ద్రో. ౫, ఆ. ౧౮౧, 2. వేగముగా. "క. విందాను విందు లేక,స్యందనగతులై కడంగి సైన్యంబులు దా,రుం దెప్పదెరల నాసం,క్రందననందనుని మీఁదఁ గవిసిరి గడిమిన్." భార. ద్రో. 3, ఆ. ౧౪3, భార. అను. ౪, ఆ. 3౧౮.

తెప్పఱిల్లు. దే. అ. క్రి. తేఱు, స్వాస్థ్యము నొందు. "క. అనలుఁడు మూర్ఛమునిచి పడియున్నసఖుఁ దెప్పఱి నొయ్యన లేచె నపుడు పవనుఁడు కొమ్మిన్." కు. సం. ౧౦, ఆ. ౧౭.

తెప్పలఁదేలు. దే. అ. క్రి. (తెప్పలన్+తేలు). 1. ఓలలాడు, కేఁదులాడు. "ఉ...పూఁ, దేనియ సోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలిపల్కులన్." పాండు. ౪, ఆ. ౧౧౨. విక్ర. ౧, ఆ. ౧౯3; 2. సంతసించు. "ఉ. ఇప్పుడ మేలుగాంచెఁ బరమేశుఁడు సాగరకన్యకాంతలోఁ, దెప్పలఁ దేలుచున్నతఁ డీ యపుచూపుల నేని నొందుమైఁ, ద్రిప్పుఁడు..." నృసిం. ౧, ఆ. ౮౪, శై. ౧, ఆ. ౬౬. శకుం. ౪, ఆ. ౯౭.

తెప్పలఁదేలుచు. దే. స. క్రి. 1. ఓలలాడించు. "క. తెప్పడి దేమె లతాంగీ, యప్పురుషోత్తముఁడు నన్ను నట్లు రసాబ్ధిం, దెప్పలఁదేలిచి నీను విడ, నెప్పుడు నని యూరడించి యొందే నరిగెన్." కళా. ౬, ఆ. ౨౬౪. విక్ర. ౧, ఆ. ౧౭౯; 2. ముంచు. "గీ. కంచిఁ దెప్పలఁదేల్చె నకాలవృష్టి." హర. ౨, ఆ. ౨౨.

తెప్పలుగ. దే. క్రి. విశే. ద్రు. పుష్కలముగా, అధికముగా. "క. తెప్పలుగఁ జెరువు నిండినఁ, గప్పలు పదివేలు చేరుఁగదరా సుమతీ." సు. శ. ౨౦.

తెప్పలుగా = తెప్పలుగ. "ఉ... పిలిపించి యిచ్చెఁ బో, తెప్పలుగాఁ గరుల్ హరులు ధేనువులు .." రాజ. చ. ౧, ఆ. ౧౯, పశా ౭, ఆ. ౨౬౪.

తెప్పించు. దే. స. క్రి. (తెచ్చు. ధా. ప్రే.) 1. తెచ్చునట్లుచేయు. "ఆ. తేరుఁ బూన్పఁ బాపు తెప్పింపు దృఢకవచ, త్రాణము..." భార. విరా ౪, ఆ. ౬, హర. ౬, ఆ. ౪౯; 2. కల్గించు. "ద్వి. దీనత రప్పించి దిగులు దెప్పించి." ద్వి. హరిశ్చ. పూ. ౧౬౧౩. పం.

తెప్పిర్లు. దే. అ. క్రి. (తెప్పిఱు. ధా.) మూర్ఛనుండి లేచు. "మ... దశవక్త్రం డంత మూర్ఛిల్లి యుం, త నె తెప్పిర్లి యుగాంతకంతుహరదుర్దాంతక్రుధా వంతుఁడై." ఉ. రా. 3, ఆ. 3౭3.

తెప్పిఱిలు = తెప్పిర్లు. (మూర్ఛనుండి లేచు.) "క. పశ్చిమదిశచందంబున, నిశ్చేష్టుం డయినబాలునిం జూచుడు వాఁ, డాశ్చర్యంబుగ నపుడ పునశ్చైతన్యాగమంబునం దెప్పిఱిలెన్." నిర్వ. ౭, ఆ. ౧౧౭. భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦౦3.

తెప్పిఱు. దే. అ. క్రి. (మూర్ఛ దుఃఖము ఆయాసము మున్నగువానినుండి, తేఱుస్వాస్థ్యము నొందు. "గీ. మూర్ఛఁ దెప్పిఱి యిట్టని మొఱలువెట్టె." దశా. ౪, ఆ. ౭3. "క. చెప్పిన నప్పలుకులు విని, తెప్పిఱి సంమోదవారిధిం జంద్రముఖుల్, తెప్పలఁదేలిరి తెచ్చెలు, లప్పుడు పల్లవితహృదయలై తమకోనన్." వరాహ. ౪, ఆ. ౪౪. "క... హరు లి, త్తఱి నీటులు ద్రావక తెప్పిఱు వెట్లొకొ తత్తురనై నృథికరమూర్తీ." భార. ద్రో. 3, ఆ. ౧౬౦; 2. మేల్కాను, నిద్రనుండి లేచు. "గీ. ఓనము నిద్రించి తెప్పిఱువేళలందుఁ, గొదరి కల లేమియును లేక యడఁగినట్లు." వాసిష్ఠ. ౨, ఆ. ౭;

3. అపమఱచు. "ద్వి. అప్పుడు భయ మించుకైనను లేక, తెప్పిఱి నిద్రఁ జెందినచంద్రమతిని." ద్వి. హరిశ్చ పూ. ౨౯౦. పం.

తెప్పు. దే. వి. 1. తేలుట క్రిందఁబడుట మున్నగువానియం దగునసుకరణము. "సీ. సీయాజ్ఞ చేగిరుల్ నీటఁ దెప్పునఁ దేలె గడఁక సముద్రంబు గట్టువడియె." సిం. సార. శ. ౬౬. "గీ. వచ్చి యాత్మీయమందిరద్వారసీమఁ, దెప్పునను మోపువైచినచప్పుడు విని." శుక. ౨, ఆ. 3౪౬; 2. కబళించుటయం దగుననుకరణము. "వ... వా విప్పి తెప్పున కబళించి చప్పరింపుచు నొప్పుపొడదుప్పులును .." ప్రబంధ. ౧౯౬, 3 వెంట, వేటక. "వ... రాగమంజరి లాజియలచొప్పు దప్పి వివిధధనంబు లిచ్చుభుజంగకోటి నొల్లక తనవలచువాని సెవ్వని నేనియుం బెండ్లి యగుదు నని ప్రతిజ్ఞ చేసి మాచేత మాన్పరాకున్న యది మరులందినంబున నింక నొక్కని తెప్పునం బడిపోవం గలయది..." దశ. ౬, ఆ. ౪౪.

తెప్పున. దే. క్రి. విశే. ద్రు. 1. శీఘ్రముగా. "ద్వి. తెప్పున నిద్రఁ జెందినయటమీఁద, నప్పద్మలోచన యల్లన లేచి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౭౯. పం. వేణు. శ. ౬౭, 2. తటాలున, అకస్మికముగా. "ఉ. కావున నన్ను నిప్పు డధికం బగుసత్కృపచే మీఱఁ బ్రోవు మిందీవరనేత్ర నీ వనుచుఁ దెప్పున నాచరణద్వయంబుపై, వాలి ఱ్ఱాలి యున్న నిజవల్లభుమస్తము బాయఁద్రోచి..." రుక్మా ౪, ఆ. ౧౧౯.

తెబక. వై. వి. (సం. స్తబకః.) మొత్తము, సమూహము. (శ. ర. బ్రౌ.)

తెమడ. దే. వి. 1. శ్లేష్మము. (శ. ర. బ్రౌ.); 2. చిక్కు. "ఎ... సెట్టికొని దగలు తొట్టినం బట్టి యాకలం దెమడ వెడలించి..." కువల. ౪, ఆ. ౨౦౯.

తెమలించు. దే. స. క్రి. 1. తెమలుధా. ప్రే. కదల్చు. "వ... ఒకించుకయుం దెమలింపఁజాలక." దశా. ౨, ఆ. ౧౬౪. ఉ. రా. 3, ఆ. ౧౪; 2. లాగు. "సీ. పసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి నునుఁదీగఁ దెమలించునరిత్రాడు సొమసుకరణి." స్వా. 3, ఆ. 3౧. రంగా. ౧, ఆ. ౬౨; 3. బలాత్కారముగా లాగు, తిగుచు. "ద్వి. తెగువ మత్తేభముల్ దెమలించి తుండ, మగలించి పైకొదు నణఁచు మాష్టీలు." ద్వి. హరిశ్చ. పూ. ౧౨౯. పం. 4.

కేఁగఁగొట్టు."సీ. తెమలించి గాలియొక్కమొకంబు నైనను బలుగాలంపలఁ దీర్చి కట్టఁగలము."వరాహ ౪, అ. ౭౫.

తెమలు. దే. అ. క్రి. 1. తొట్రుపడు. "చ. పడుపున దింటిదన్నులతపర్వున ముందఱు గానరాదు మ్రాకడుగిడుచోటఁ గాద్దెమలినంతన కొనుచు బింద మయ్యెడున్." కు. స. ౯, అ. ౧౬; 2. భయపడు. "క. అతుమాలముగతుఁ దెమలక, భూతలము దలంక నలువపుత్త్రుం డెదురై, యాతెఱఁగున నసురులు నిర్ఘాతసదృశశరపరంపరలు పడిఁ గురియన్." కాశీ. ౨, అ. ౪౬. నా. పంచ. ౨, అ. ౨౯౯; 3. విడిపోవు, చెదరిపోవు "చ. తెమలనిచిమ్మచీకటిని దీపములేమిని జాపు వెట్లు దీపము గొని తెమ్ము చూపెదను భద్రముగా నివి నీవె దాచి పెట్టుము." హంస. 3, అ. ౧౦౮. విక్ర. ౧, అ. ౭౫; 4. అసత్యమగు. "చ ..ఇది యేటి మాట నల్లనియెడఁ గాపరాజ తెమలం బలుకం బని యేమి నావుడున్." భార. అను. ౧, అ. ౧౮౬, 5. కదలు. "సీ. తెగిచిన నడుగులు దెమలక త్రొమ్మప్పళించి యవ్వలికిఁ జండించి దాఁటి." ఆము. ౬, అ. ౨౨; 6. జాఱుపట్టువడు. "క. కమలజాశిర మీఁకై వడిఁ, దెమలి మహిం బడినవేళఁ ద్రినయన హాస్తం, బమరె నపేతమరాళా, క్రమణం బగు వికచరక్తకమలము భంగిన్." వరాహ. ౧౨, అ. ౧౮. దశ. ౧౧, అ. ౭౫, 7. నళించు. "చ. క్రమమునఁ గప్పె నల్లడ లగాధమహోద్ధతిఁ జిమ్మచీకటుల్, తెమలె దిశావివేకము ధీరతయుఁ బెను కల్లవారికిన్." హర. ౭, అ. ౧౭౧, వసు. ౨, అ. ౧౩౭, 8. మరలు. "చ...అపరాధవేళమును దాల్పనినీ విపు డెంత మ్రొక్కినం, దెమలదు కాంతిఁ బొందదు మదీయమనం బిఁకఁ జాలుఁ బ్రార్థనల్."నరస. ౨, అ. ౩౬, విప్ర. 3, అ. ౪౨; 9. వెళ్లు. "చ. తెమలను నిన్నుఁ బాసి సుపతీయని తీయునినీదు పెంపిక, యమృతరసోర్మియేని సమమూ..." హంస. ౧, అ. ౨౪౩; 10. బయలువెడలు. "సీ. వెడఁదగూడులనుండి వెన్నెలపులుఁగులు తె మ లె నా నేత్రాంచలముల బెళుక." ప్రబంధ. ౨౯౦; 11. ముగియు. (వా). వానికి పని తెమలుట లేదు; 12. పరిపూర్తి చేసికొను. (వా). వాఁ డెంతకును దెమలి రాఁడు. వి. ప్రవాహము. "సీ. తళుకొత్తుమిన్నేటి తెలినీటి తెమలున ముదురుబొదోవచాలు మొలవఁబెట్టి." పాండు. ౪, అ. ౨౫౦.

తెమలుచు. దే. స. క్రి. (తెమలు ధా. ప్రే.) 1. కదల్చు "చ. ప్రమదము పూని నాని రఘురాము కనుంగొను మీశరాసమున్, దెమలంప నేర్తువే యనిన ధీరుఁడు శ్రీరఘువీరుఁ డయ్యెడన్." దశా. ౭, అ ౨౦౦; 2. పెఱుకు, పెలికిలాగు "సీ... గుండె, కాయ లాడట మెయిఁ గటిరించుచు గ్రొవ్వ దెమలిచి నమలుచు కొమ్మ కయ్యాట, చవిగొని యానుచు..."భార. స్త్రీ. ౨, అ. ౯.

తెమల్చికొను. దే. స. క్రి. (తెమల్చు+కొను—స్వార్థమున.) ఆస్వాదించు. "ఉ. సమ్ముదవారిగన్గడలఁ జాలుగ మై గరుపార నిందుబింబమ్మున దృష్టి నిల్పి పయిఁ బ్రాఁకుమరీచులనూఁగుమూఁగులేఁ, గొమ్మలు పట్ట చంచుపుటకోటిఁ గదల్చి తెమల్చికొంచు సౌఖ్యమ్ము విహంగము మ్మయినయాకృతి నొందెఁ జకోరమొక్కెడన్." నిర్వ. ౬,అ. ౫౧.

తెమల్చు దే. స. క్రి. (తెమలు. ధా. ప్రే.) 1. కదలించు. "ఉ. వింటె నపూర్వ మిర్వి నొకవింటి నరుండె జయించువాఁడు ముక్కంటిమలం దెమల్చిన మగంటిమిఁ జో దిడుకాణె వింక..."చం. రా. ౫, అ. ౫౬; 2. సకలించు. "గీ. అపుడు దగ ఋజ్జగించి హస్తాంబుజమున, వలపు గీలు దెమల్చు భూవల్లభుండు" శైవ. ౬, అ. ౧౭౬; 3. దువ్వు. "గీ. విరియఁ జనుదోయి యొత్తిన పేరురంబు, నలరు మోవితీ పానవిధానకంబుఁ, దనియఁ గురులం దెమల్చియాడిన కరంబుఁ, దరుణి మెచ్చుచు నమ్మోముఁ దమ్మి యలర." హరి. ఉ. ౭, అ. ౧౨౮; 4. జాడించు. "గీ. విసము, లాదట పందఱుఁ బెటికి రొంపిపోవ నీటఁ దెమల్చి మోపుగ నమర్చి." భార. అను. 3, అ. ౨౨౩; 5. పట్టుకొను. "చ. అని కలుషించి వేదవతి యచ్చటు వాసి చనం దలంచినం, గని దశకంధరుం డదరి గ్రక్కున వేనలి పట్టి కొన్న నం, గన యొకవ్రేల వ్రేయ నది కత్తి విధంబునఁ దాఁకి కత్తిరించిన క్రియఁ ద్రెంచె వెండ్రుకలు చేతఁ దెమల్చినయంత కివ్వలన్."నిర్వ. ౫, అ. ౧౭. భాగ. ౧౦, స్కం. ఉ. ౯౮౯; 6. పట్టుకొని లాగు. "ఉ...అమ్మరో, రమ్మని కోటికోమలి కర మ్మనివార్యగతిం దెమల్చఁగన్." వసు.

౩, అ. ౧౩౦; 7. డీలుపఱుచు. "సీ. ద్రోణుని నిరువదిబాణంబులఁ దెమల్చి భీముని ముమ్మాట నొందుపఱిచి." చిత్రభా. ౭, అ. ౧౦౯; 8. ఖండించు. "ఉ. గాలికిఁ బోవువాహము నగంబుల వక్త్రములం దెమల్పఁగాఁ, జాలునువాలు..." దశా. ౨, అ. ౫౨౩. వసు. ౩, అ. ౭౯; 9. చీల్చు. "సీ సింగంబు పఱతెంచె ముంగోళ్లఁ దెమల్చి నమలి కారొప్పెరుల నమిసికొనుచు." కళా. ౪, అ. ౧౦౫; 10. మ్రింగుచు. (వా.-) వేగ పని తెమల్చి రమ్ము; 11. ఆస్వాదించు. (చూ. తెమల్చికొను.)

తెమ్మ. వై. వి. (సం. క్షేమః.) 1. తడి. "సీ. వరుణాంగనామనోవల్లీవితానంబు పలుకుఁదెమ్మలచేతఁ బల్లవింప." విక్ర. ౨, అ. ౫౭. చెన్న. ౪, అ. ౧౭; 2. పెల్ల. "సీ... తెమ్మ నాఁ బెల్లరుం జేమ యొలరు." ఆం. భా. తృ. ౪౫; 3. రాశి, "చ. పొలఁతుకఁ జూడరమ్మ గడివోమని చక్కఁదనంబు మమ్మ..."చంద్ర. ౫, అ. ౧౯౪. విణ. తడి గలది. "ఉ. కమ్మని తెమ్మ తెమ్మెరలు గ్రమ్మఁగ..." నీలా. ౧, అ. ౪.

తెమ్మలుగా. వై. క్రి. విణ. ద్రు. అధికముగా. "ఉ. చూచి కిరాతులార బలుసొమ్ములు తెమ్మలుగాఁగ నచ్చె నీ, రాచకుమారు డోఁచుఁడు..."వరాహ. ౯, అ. ౭౯. విజ. ౩, అ. ౦౫౫.

తెమ్మెర. దే. వి. (క. తెమ్బరల్. తెన్+మెర = దక్షిణపుగాలి.) 1. చల్లగాలి, మలయమారుతము. "ఉ...పొర్ణగండ్లయందుఁ జొచ్చి సుడిసి,తిరిగి వేగుఁబోక తెమ్మెర తెలఁదీఁగకొనల వంకలొత్తు ననలఁ ద్రొచు." భార. ఉద్యో. ౨, అ. ౧౧౧. ఆం. భా. ప్ర. ౫౯; 2. "సీ. చెదరినమకరికాచిత్రపత్త్రికలతోఁ బరఁగెడుపూర్పుఁదెమ్మెరలతోడ." విక్ర. ౫, అ. ౭౧. ఇందు. ౩, అ. ౧౦౭.

తెర. వై. వి. (సం. తిరః. క. తెరె. త. తిరై.) మఱుఁగుచీర, యవనిక. "చ. తెరయుంచు మేలుకట్లఁ దగు దీనియలుం తెలునొంద మేటిచప్పరమున..." భార. శాం. ౧, అ. ౧౪౭. ఆం. భా. ద్వి. ౧౫౯; 2. వేఁటకుసాధనముగా నుపయోగించు నొకరకపు జవనిక, అడ్డువల. (శ. ర.) "క. ఇటువలె వేఁటాడెడుకతిఁ,దటుకున నొకయిట్టి తెరలు దాఁటి పడెం దెంగట నుఱుక నెఱుకుదొరలార్పుటయున్ రాజులుచు దానిచొప్పునఁ జనఁగన్." య. ౨, అ. ౩౪. ఆం. భా. తృ. ౭౫; 3. మత్స్యగ్రహణ సాధనము. "గీ...చల్లి దూఁడ్యలంటగాలంబు తెర దీము లంపురుగాల,ము...ఎఱఁగుచుండు." హం. స. ౪, అ. ౧౯౪; 4. తరంగము. "క. కట్టాతలమునకలునై, దట్టపువిరవార్ధి తెరలు తరుణుల నేఁచన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౦౦. ఆం. భా. ప్ర. ౧౫౪. 5. వరుస. "క. పరిపరిధూపంబుల నర, విరుల తెరల రత్నదీపనికరంబు నూర్ణాస్తరణములఁ బొలుచు రావులఁ, బరమభూషలు నృపులు వరుస బంతులు సాఁగన్." వై. ౯, అ. ౨౦౧. వసు. ౨, అ. ౫౭౩; 6. దిక్కు. "చ... విస్ఫులింగపటుకీలలు వైదువు లీన సేనతో, వెలుపడి రాల్పులం దెరలు ప్రేలఁగఁజేయుచు నన్నిశాచరుల్." భా. రా. యు. ౯౭౩; 7. తేనెపట్టు. "రగడ. తెఱవ తెరపడిఁ బూని కదలిచి తేనితేనియపసోనవానలు, సెఱయు..."రసిక. ౪, అ. ౭౪.

తెరచీర. ద్వ. వి. (తెర+చీర.) 1. యవనిక, మఱుఁగుచీర. "క. తెరచీర పట్టి యిరువుర, నిరువంకల నిలువఁబెట్టి యింపు దలిర్పన్, సురయక్షసిద్ధకిన్నర, నరకాంతలు తమ భజించి నలిఁ గీర్తింపన్."పద్మ. ౩, అ. ౭౭. బస. పు. ౭౪, పు. ౨౨, పం; 2. వేఁటసాధనముగ నుపయోగించునొకరకపుజవనిక. 'వ.. తెరచీరప్రోఁగుచుట్టులు దొడ్డివల లేటివల కుందేటివల...' కాశీ. ౩, అ. ౪౭.

తెరచాప. దే. వి. (తెర+చాప) నౌకాంగవిశేషము. (ఇది గాలిని బోసికొని నౌకను ఎడిగా నడపును.)

తెరబొమ్మ. దే. వి. (తెర+బొమ్మ.) తోలుబొమ్మ, తెర మీఁద నాడించుబొమ్మ. "శా...ఉమపీఠిం గొండ్లియాడించె వైశ్యవ్యాధుల్ తెరబొమ్మ లట్ల నిగుడం దా నాటకాఁడుంబలెన్." పి. శకుం. ౩, అ. ౧౨౪. రం. రా. ఆం. ౧౫౯ పు. ౧౪, పం.

తెరయాఁగ. దే. వి. (తెర+ఆఁగ.) తేనెటీఁగ "క. తెరయాఁగలగతిఁ గవియుచుఁ, బొరిఁబొరిఁ గడుఁ దురులపగిదిఁ బొదువుచు సెలవై,వెరవునఁ గాకులు పికములఁ, బరువడిఁ జీకాకుపఱుచు భంగిఁ దలంపన్." భార ద్రో. ౧, అ. ౨౫౯. (వెరయాఁగల గతి. పాఠాంతరము.)

తెరల. దే. వి. కవళము, కబళము. (శ. ర. శ్రా.)

తెరలఁబడు. ద్వి. అ. క్రి. (తెరలన్+పడు.) వ్యస్థత నొందు. "చ...అన్వితయొదంబడం దగిన వాక్యము గానఁ గొంతసేపు మెల్లన వినయంబుఁ జేసి తెరలంబడి యానతితోడ నిట్లనున్." వి. పు. ౬, ఆ. ౨౨౫.

తెరలఁబాఱు. దే అ. క్రి. (తెరలన్+పాఱు-స్వార్థమున.) తొలఁగు. "మ. తెరలంబాఱెఁ గలంగి గోవులు కడున్ దీనంబులై తూలుచున్." హరి. పూ. ౬, ఆ. ౧౩౩.

తెరలించు = తెరలుచు. 1. (జయించు.) "సీ. అని లోన నీటిరాయనిగాఁపుఁ దెరలించి పెతమాట లెల్ల నీకళనఁ గాదె." య. 3, ఆ. ౯3, 2. (కలఁచు.) "ద్వి. వివిధముఖంబుల వివిధాయుధములఁ, దివిరి రాక్షసకేనఁ దెరలించి కులుకు, సతిమి కొందఱు చచ్చి రామావతోణి." రం. రా. ఉ ౭౭, పు. ౧౧, పం; 3. (నళింపఁ జేయు.) "మత్త కోకిల. యాగభోక్తయు ధర్మవక్తయు నైనదేవుఁడొనర్చనే, యాగధర్మవిభంజనం బని యద్భుతక్రమ మందు నానాగతు ల్దివినుండి కల్కుఁగ యాదవాధిపుఁ డాధవుర్యాగముం దెరలించె వంచను లైనక్రంచులు బెగ్గిలన్." సాంబో. ౧, ఆ ౧౨3. వసు. ౬, ఆ. ౯.

తెరలించుకొను. దే. స. క్రి. (తెరలించు+కొను.స్వార్థమున.) భేదించు. "వ ..వానరవరులు శిలాపాదపాదులం జెండాడి గం దడచిన దానవసేనలు కను కనిం బఱచిన నవుడుగఁజిచి కపుచరవ్యూహంబు తెరలించుకొని చొరఁబడి వజ్రదంష్ట్రుండు .." రామా. ౮, ఆ. ౫౧.

తెరలిక. దే. వి. (తెరలు. ధా.) 1. గుంపు. (శ. ర.); 2. మెలఁకువ. "సీ. కడపుఁ జేనియఁ గడుపారఁ గొని మ్రోసి తిరుగులేఁదేఁటుల తెరలికయును." హరి. పూ. ౯, ఆ. ౬౮. ద్వా. ౮, ఆ. ౨౭.

తెరలు. దే. అ. క్రి. (క. తెరళు. త. తిరళ్.) 1 నీళ్లు మున్నుగునవి సలసల కాఁగి పొంగు. "గీ నరసిపై నీరు సలసలఁ దెరలె విసిన, సకలవీథులు నిర్మలగోచ్చయము లయ్యె." పాండు. ౧, ఆ. ౧3౬. రం. రా.యు. 3౯౫, పు. ౧౧, పం; 2. పాఱు. "క. గిరిజాలలితాంగము పొరిఁబొరిఁ గనుఁగొని పొగసి యిసుకబొమ్మ జలమ్ముల్, తెరలఁగ విరిసిన గతిఁ బొది, విరిస మహేశ్వర మనంబు వికలం బయ్యెన్." కు. సం. ౫, ఆ. 3౭; 3. వయనించు. "ఆ...ఆఱు, రాజపురుషులవయన పెంక్కుబాఁడె, తెరలి చంపావతీపురి యుండటుఁ, గాంచి యాధవరులఁ గలయఁ జూచి." జై. ౮,ఆ. ౫౯; 4. తగ్గు. "గీ .. తెరలక కడవ వంచి,కట్టు పారని ధారాను మైక్య మొంది, విన్న మున్నను నొక టిగా వృష్టి బలసె." ఆము. ౪, ఆ. ౯౧. చంద్రి. 3, ఆ. ౧౨౮; 5. చెదరు. "మ. మరుదంభోరుహాక్షేత్రలంబరధునీమధ్యంబు నన్నిల్వ నిష్ఠురతత్పవయోధరావాలిజలస్తోమంబు నల్వంకలన్, దెరలన్ నాభిచయంబు లోఁగొనియె..." పారి. ౪, ఆ. ౨౮, ఉ. రా. ౬, ఆ. ౨౭౬; 6. కదలు. "సీ. తెగిచిన నడుగులు దెరలక యొండొరుఁ గ్రమ్మఱఁ దిగుచుచు .." భార. విరా. ౨, ఆ. 3౪౭; 7. పొంగు. "సీ నరసపుష్పరాగసైకతంబులు దీర్చి తేనియ కాలువల్ తెరలి పాఱు." విక్ర. ౧, ఆ. ౮౯; 8. అధికమగు. "సీ. చాన నీకెమ్మోవిపానకం బానిక తెరలెడుబలందూకు లీటి పోదు." రసిక. ౬, ఆ. ౮౯. మొల్ల. రా. యు. 3, ఆ. ౪3; 9. బయలుదేఱు. "వ...శతశృంగనివాసు లగుమునులెల్లం దెరలి వచ్చిచూచి..." భార. ఆది. ౫, ఆ. ౧౪3. భార. విరా. ౪, ఆ. ౬౨; 10. పైకి వచ్చు. "గీ. దరికొని వహించు నక్కాఁకఁ దాళలేక, తెరలి మృగములు మృగతృష్ణ కరిగి పొరుగు." ఉ. రా. ౨, ఆ. ౧౬౧; 11. సందేహించు "చ. తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్ఘమాటకై, యరుగుచు నెవ్వఁడేని మృతుఁడౌ భవితవ్యత కారణంబుగాఁ, దరువున నామనుష్యుఁడును దీర్ఘఫలం బఖిలంబుఁ గాంచి .." కాశీ. ౫, ఆ. ౪౮; 12. వెనుకకుఁ బోవు. "క ..వారలయమ్ములఁ, దెరలక భీముఁడు పటుగతిప్యందనుఁడై." భార. భీష్మ. 3, ఆ. ౧౬౦; 13. ఉడుకు. "గీ అలిగి భూమైన నలకలే దబల దాను,కోకబలమునఁ జోకినచోటఁ దోలం, తెరలి జర్జరమై పోవఁ గరకలములు, మీఁది కందంద రతి యొత్తి మోఁదుకొనియె." కు. సం. ౫, ఆ. ౯౦.

తెరలుగ. దే. క్రి. విశే. ద్రు. "క. నరవరు లయ్యారు దిక్కుల, కరిగి మహీపతులచేత నరిగొని ధనముల్, దెరలుగఁ దెచ్చినమార్గము, బరువడి కొఱఁగింపు నాకుఁ బరమమునీంద్రా." భార. సభా. ౧,ఆ.౨౨౫.

అతిశయించుచున్నట్లుగా, పొందుకొనుచున్నట్లుగా (శ. ర. పా. తెరలఁగ ముద్రితపా.)

తెరలుచు = తెరలించు. 1.(చెదరఁజేయుట.) "క. చరాచరములైన భూతజాలము లెల్లం, దరతరము యుద్ధ పటిమం, దెరలిచి పడవైతు సింధుదేశాధిపున్." భార. ద్రో. ౨, ఆ ౩౧౦; 2. (వెళ్లగించు.) "చ. కరకర పండ్లు గీటుచు శిగంబడి ముట్టెపు ముంగ ముస్తలం, దెరలిచి మేయుచున్..." చెన్న. ౨, ఆ. ౨౦; 3. (నశింపఁజేయుట). "గీ. అంబరైకూని వానిమహోబలంబు, కామదగ్నుల్యండు దెరలుపఁజాలఁ కలిగె." భార. అను. ౫, ఆ. ౪౭౫; 4. (బయలుదేఱఁదీయుట) "క. పురజనుల కెల్ల ముందటఁ, దెరలించుకొని .."జై. ౨, ఆ. ౧౦౫.

తెరలుడు. దే. వి. (తెరలు. ధా.) బయలుదేఱుట, ప్రయాణము. (శ. ర.)

తెరలువుచ్చు. దే. అ. క్రి. అతిశయముఁ కలుగఁ జేయు. "సీ. లలితంబు లగుచిత్తములచతురతలను సరసంపురసపడి తెరలువుచ్చ." నిర్వ. ౧,ఆ.౫౫.

తెరలెత్తు. దే. అ. క్రి. (తెరలు+ఎత్తు.) 1. తరంగితముగు, పొంగు. "సీ. తెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ వరుణుండు గొండిలి పరిభవింప." ఉ. హరి. ౪, ఆ. ౨౧౬; 2. అతిశయించు. "వ .. తెరలి తెరలెత్తునిరులం దెరలింప ననేకరూపంబులం దీపించుతమోరిత్రయంబునన్..." వసు. ౬, ఆ. ౯, శుక. ౨, ఆ. ౫౫౧.

తెరల్చు. దే. స క్రి. (తెరలు ధా. ప్రే) 1. (కదల్చు) "సీ. పొన్నలమకరందములం చల్లుపోరాడి తెలిమించుమల్లెమొగ్గలఁ దెరల్చి." విక్ర. ౪, ఆ. ౫౬; 2. ఊడఁదీయు. "ఉ...సి, వ్యంగులబాడ్లు డించి తగ వానికిఁ గన్నులఁగుల్ దెరల్చి యా, ముంగలఁ బొఱఁజాపుటయు .." య. ౨, ఆ. ౧౬, కళా. ౧, ఆ. ౩౮. 3. కలఁచు. "ఉ. ద్రోణునిలో శిఖాబడక ద్రోణ కుటుంబిని యున్న దింట నక్షీణతనూజశోకవివశీకృతయై విలపించుభంగి నీ.ద్రోణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు శోకపాత్కునో" భాగ. ౧, స్కం. ౧౬౫.

తెరవల. దే. వి. (తెర+వల.) మత్స్యగ్రహణసాధనవిశేషము, ఒకరకపువల. "గీ. తెరవలలు వైచి జాలరుల్ దిగిచి దానియందరదళనంబు చేసి .." భార. ఆది. ౩, ఆ. ౩౨.

తెరవాఱు. దే. అ. క్రి. (తెర+పాఱు.) తరంగితముగు, పొంగు. "చ. ద్రవిడపటుంబిపుల్ పసుపు రాచిన రన్నపుఁదాపక్రిందనంబువు తెరవాఱఁగా విదుర వోయి గరుత్తతి పచ్చవాటివన్." ఆము. ౧, ఆ. ౬౪.

తెరవేఁట. ద్వి. వి. (తెర+వేఁట.) తెరలెత్తి యీడెడువేఁట, వేఁటకాండ్రచే మృగము లొక్కచోటఁ గూడియుండునట్లుగఁ జుట్టును తెరవేసి సమకూర్చి యాడువేట. "గీ. ఆపు దసర్గ మడిగక మేఘాళి పొదువు, నచలములపైని దొడ్డిక ట్టగు మృగాళి,జాడ మాపట్టె మీఁదిపర్జన్యధన్వి, నృపున కగు తెరవేఁట యాయిత మనంగ." ఆము. ౪, ఆ. ౧౧౭, రామా. ౨, ఆ. ౨౯.

తెరవేయు. దే అ. క్రి. (తెర+వేయు.) పొంగు. "క. అని చాల ఖిన్నరాలై,మనమునఁ దెరవేయఁ బుత్రమమతాంబుధి ని,ల్చినచోట నిలువ నైఁకక, వనితామణి నగరు వెడలి వచ్చుచు నంతన్." సా. ౩, ఆ. ౭౮.

తెరువరి. దే. విశే. (తెరువు+అరి.) పథికుఁడు,బాటసారి. "క. కను బ్రమసిన తెరువరి తన,కనపాయం బైనమార్గ మరసి తగ కొఱఁగినవారు సెప్పఁగాఁ గ్రై,కొనవికరణిఁ దగినవెంటకుం జన వకటా." భార. ఉద్యో. ౨,ఆ. ౨౮౦, ఆం.భా. ద్వి. ౧౯౯.

తెరువాటీఁడు. దే. విశే. (తెరువాటు+కాఁడు.) తెరువాటుకాఁడు. (శ. ర.)

తెరువాటు. దే. వి. (తెరువు+పాటు.) దొంగలు దారికట్టి కొట్టుట, అభిగ్రహము. "సీ. భోజనాత్ములఁ దుష్టిఁ బొందించునతఁడును దెరువాటు వలనఁ దస్కరులచేతఁ,జేటొంది ధనము వాంఛించునతండు .." భార. అను. ౨, ఆ. ౫౯. "గీ. ఇట్లు బాధించి శోధించి యెందు నొక్క, పచ్చవైకంబుఁ గాన కవ్వచ్చిపోయె,నేటి తెరవాటు పస లేక దాఁటిపోయె,ననుచు వెస వారిపస మాని యవలి కేఁగె." వాల్మీకి. ౨, ఆ. ౯౬.

తెరువాటుకాఁడు. దే. విశే. (తెరువాటు+కాఁడు.) దారికట్టి కొట్టి దోఁచుకొనుదొంగ. "గీ. పాప కర్ముని గాఢ్మకబాణపాణిఁ, గ్రూరదృష్టులయొఱ చేరు గృద్ధ్రవానిఁ, జెంచు తెరువాటుకాని వీక్షించి

తరుణి, కల్లదంబున శ్రీహరిఁ దలఁచి నిలిచె." వరాహ. ౪, ఆ. ౪౩, సాంబో. ౧, ఆ. ౧౦౮.

తెరువాటుఁగొట్టు. దే. స. క్రి. (తెరువాటు+కొట్టు) దారికట్టి దోఁచుకొను. "గీ. ఇతఁడు కలుద్రాగి యాకాడె కొఱచి తెనిరొ, నిలిచి కూత్రించెఁ జండాలలలనఁ గూడెఁ, గూఁతు రమియించెఁ దెరువాటుఁగొట్టెఁ బ్రజలఁ, జెంచురాజోల సేవించెఁ జెడెనెఁ గులము." శివరా. ౪, ఆ. ౫౪, కళా. ౪, ఆ. ౨౩.

తెరువు. దే. వి. (క. తెరపు. త. తెరువు.) 1. దారి, మార్గము. "వ ..ఇట్లు పున్నగారిదగాలి పోరువు తెరువునం జనునప్పుడు..." ఉ. హరి. ౬, ఆ. ౨౮, ఆం. భా. ద్వి. ౮; 2. న్యాయము, ధర్మమార్గము. "గీ. చంద్రకిరణ ధవాప్సరోజాలిఁ బుట్టి, యట్టి పేరొంది వెలయుఁ జే నకట యిపుడు, తగ సతుల కెల్ల సామాన్యధర్మమైన, పతిమనోను కూలతఁ బాయఁ దెరువె." కళా. ౭, ఆ. ౫౫; 3. జోలి, సంగతి. "క. నుతియుం నమస్కృతియును లేక తిరిగి శుభ మశుభ మనువగం బొందక గోష్ఠి తెరువు పోర కుండుట సువ్రతము..." భార. శాం. ౫, ఆ. ౧౩౩; 4. ఉపాయము. "ద్వి. ఈకాళికునిబుణం బీకాళిలోనఁ, దీనిని తీర్పఁగాఁ దెరువు కల్పింపు." ద్వి. మారిచ. ఉ. ౧౨౦. పం.

తెరువుగట్టు. దే. అ. క్రి. (తెరువు+కట్టు.) మార్గనిరోధము చేయు. 'సీ. కదిసితో మునిగాలు గఱచి వెంబడిఁ దీయఁ దిగిచి తోఁడసి లేపఁ దెరువుగట్టు." చంద్రా. ౨, ఆ. ౯౧.

తెరువుపెసర. దే. వి. (తెరువు+పెసర.) దారిలో మొలచు పెసరతీగె. (ఇది త్రొక్కుడుచే అభివృద్ధి నొందక యుణఁగారి యుండి నిష్ఫలముగ నశించును.) "గీ. తాన నిక్కంపుఁగూరిమి గణికయందుఁ, బొరయ దిల బొర్సెనే నది తెరువుపెసర." కవిక. ౪, ఆ. ౧౭౭. (క్షణభంగుర మని భావము.)

తెరువువిడుచు. దే. అ. క్రి. (తెరువు+విడుచు.) త్రోవయిచ్చు. "వ... పాలుపవెల్లి యైన జలభూరంబు పాయం బుచ్చుచుఁ దెరువువిడువ..." కళా. ౪, ఆ. ౯౩.

తెరువువెట్టు. దే. అ. క్రి. (తెరువు+పెట్టు.) బయలుదేఱు "గీ.. అందఱును గూడి భార్గవు వాక్రుయించి, తత్క్రతుపాదపుష్టిఁ దనర్తు దట్టమైన, దేవతలమీఁది దాడికిఁ దెరువువెట్టి" భాగ. ౬, స్కం. ౨౪౦.

తెరువుసాగు. దే. అ. క్రి. (తెరువు+సాగు.) పోవు, పోఁజాలు. "గీ. ఎండపొడ దూరక పగల్లు నిర్దుగవయు, తియ్యమావుల క్రీనీడఁ దెరువుసాగ, కల్లనల్లనఁ జనుదెంచె నతఁడు భద్ర, వారణం బన సాయంసటారణంబు." వేం. పంచ. ౪, ఆ. ౨౩౧.

తెల్లిక. దే. వి. తాపము. "క. కొడుకుం గుఱ్ఱఁడు జనుఁబాలిడి నీతో రతులఁ జెనఁగ నేతెంచుచు నాకడ కేలం దాఁకించితెఁ, గడుఁ దెల్లికపుట్టె పోరలఁగా మాఱెడిన్." వేం. పంచ. ౪, ఆ. ౪౯౧.

తెల్లు = తెరలు. "గీ. కుదుపు సెగ తెల్లు నాఁగఁ జెన్నొందుఁ దాపమునకు నామంబులై..." ఆం. భా. ప్ర. ౪౯.

తెఱ = తెఱ్ఱ. (చూ. తెఱపు.)

తెఱఁగు. దే. వి. (క. తెఱంగు.) 1. ప్రకారము, విధము. "సీ ..పలు తెఱంగుల మానినుండ్లతోడ." ఆము. ౨, ఆ. ౪౩. ఆం. భా. ద్వి. ౩౦౩. భార. ఆది. ౧, ఆ. ౧౦; 2. అవస్థ. "క...అప్పుడంతి వేడికన్నీ రొలుకం, దన తెఱఁగెఱిఁగించిన విని, యనుఁగుంజెలు లెల్ల దాని కని రిట్లనుచున్." నీలా. ౨, ఆ. ౧౦౦ విక్ర. ౧, ఆ. ౧౨౦; 3. పోలిక. "క. శ్రీవల్లభుండు లక్ష్మీదేవిని మును పెండ్లియైన తెఱఁగున .." ఉ. రా. ౧, ఆ. ౨౯. ఆము. ౪, ఆ. ౧౨౧; 4. సమాచారము. "గీ. ఏను నారాక తెఱఁగెల్ల నేర్పడంగఁ జెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ." భార. ఉద్యో. ౩, ఆ. ౨౩౬. ఉ. రా. ౨, ఆ. ౨౯; 5. పక్షము, కక్ష. "సీ. వరుసతో వాదించి యిరుదెఱంగులవారి వారించి ..." భీమ. ౪, ఆ. ౧౮౯. హర. ౬, ఆ. ౧౧౨; 6. చిహ్నము, లక్షణము. "గీ. అందు బుధ్యులఁ బూజించునట్టి తెఱఁగు, నర్ధచంద్రప్రహారచిహ్నములఁ గలిమి." శైవ. ౩, ఆ. ౧౫౯. రాఘవ. ౩, ఆ. ౯౬; 7. స్వభావము. "గీ. ఇట్లు వచ్చినఁ గనుఁగొని యేను మిగుల, నుల్లమున వెఱఁగందితి నొకటివెతుక, నొకటి రాఁ బొచ్చె మాయ లీయుర్వి మహిమ, తెఱఁగు గాదుగదా యని ధృతిచలింప." కళా. ౩, ఆ. ౨౪౨; 8. పని; కర్తవ్యము. "క. విచ్చి చనకుండఁ బనులం, దెచ్చుట మునుమున్న

**తెఱఁగంటిబోనము.** ద్వ. వి. (తెఱఁగంటి+బోనము.) అమృతము. "సీ. తెఱఁగంటిబోనంబు దెచ్చినలావరి చుక్కనుదుటిపిట్టపక్కిఱేఁడు." వేంక. దేవ. ౨౦. (తెఱఁగంటిబోనంబు దెచ్చినలావరి = గరుడుఁడు.)

**తెఱఁగంటి యెకిమీఁడు.** దే. వి. (తెఱఁగంటి+ఎకిమీఁడు.) ఇంద్రుఁడు. "సీ. తెఱఁగంటియెకిమీని తేజిసొంపును గెల్చి పాఁపరాయనిపస పాఱఁ దోలి" రామ. ౩౭౧. ఇట్లే: తెఱఁగంటి దొర. సమీర. ౩, ఆ. ౯౮.

**తెఱఁగంటిమ్రాఁకు.** దే. వి. (తెఱఁగంటి+మ్రాఁకు.) సురతరువు, కల్పవృక్షము. "సీ. ధేను వెల్లను గామధేనువు లయ్యెను మ్రాఁకులు తెఱఁగంటి మ్రాఁకు లయ్యె." దశా. ౧, ఆ. ౫౮. ఇట్లే: తెఱఁగంటిమ్రాను. దశా. ౧, ఆ. ౫౮.

**తెఱఁగంటి రారా.** ద్వ. వి. (తెఱఁగంటి+రాచ+రా.) ఇంద్రనీలమాణిక్యము. "సీ. తెఱఁగంటిరారాలఁ దీర్చినకంబాలజగఁ గూఁడియున్న వజ్రంపుబోది." చంద్రి. ౬, ఆ. ౧౧౨.

**తెఱచు.** దే. అ. క్రి. బయలుపడు. "మ. వివిధామోదవిమిశ్రితానిలమొగి న్వీచెన్...నిధుల్ దెఱచె నుర్విన్ గౌరి జన్మించినన్." కు. సం. ౩, ఆ. ౩౦. స. క్రి. (క. తెఱెలు. త. తిఱ) 1. వివృతముచేయు. "క. మే నెఱిఁగి తొంటియును సంధానము చెడి కన్ను దెఱచి దారుణఫణిలిన్." స్వా. ౪, ఆ. ౮౧. "గీ. నీవు మూయంగఁ దిమిరంబు నిఖిలలోకచయముఁ గప్పిన భూతముల్ భయముఁ బొందె, నీకరంబులు ద్రోపక చీఁకటియును, దెఱచుటకు ఫాలనేత్రంబు దెఱవవలసె." భార. అను. ౪, ఆ. ౪౨; 2. వికసింపఁజేయు. "సీ. కమలాగ్రహారవాట కలికకుంచిక నాఁగ జలజాకరకరాజిఁ గలయఁ దెఱచి." విక్ర. ౧, ఆ. ౯౭. ౩.

**తెఱనోరిమెకము.** ద్వ. వి. (తెఱనోరు+మెకము.) పంచాస్యము, సింహము. "గీ. పంచముఖసంజ్ఞ పార్వతీపతికిఁ గాక, హరి యనుశబ్దవాచ్యయంబు శ్రీహరికిఁ గాక, యిట్టి తెఱనోరిమెకముల కేల యనుచుఁ, గనలి యుగ్రము లైనసింగములఁ గెరలె." రామా. ౨, ఆ. ౫౬, యు. ౨, ఆ. ౪౯.

**తెఱనోరు** దే. వి. బొ. (తెఱచు+నోరు) 1. తెఱచికొని యుండునోరు. "సీ .. తెఱనోరఁ ద్రేవుడు దీఁగెసాఁగ." కాశీ. ౬, ఆ. ౪౧, దశా. ౨, ఆ. ౬౦; 2. తెఱచికొని యుండునోరు కలది— పంచాస్యము, సింహము. "సీ. అనరానిపనిఁ గంబమయ్యెఁ దా నని కాని చఱుము తెఱనోరిసామిసైన." సాంబో. ౨, ఆ. ౧౭౯. చంద్రా. ౨, ఆ. ౪౨.

**తెఱప.** దే. వి. 1. తెఱచుట; 2. ఉపశమనము. (శ. ర.) విశే. (దీనికివృత్తియందు బహుళముగా సంస్కారణ్ణములోపించి తెఱ, తెఱ్ఱ యనురూపములు వచ్చును. ఉదా. తెఱగంటి, తెఱ్ఱనోరు. "మొ.) మఱుఁగు లేనిది, అనావృతము. "గీ. కసి డి గట్టిన కొకరింతవిసిమి నించి, నెఱసెఁ గదసావి ముదుసలి తెఱపనొంద.' పారి. ౪, ఆ. ౪౩.

**తెఱపి.** దే. వి. (తెఱచు. ధా.) అవకాశము, సందు. "ఉ. ఊఱక నరుఁడు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె సాతఁడున్, దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నాతిఁ ద్రుంచి..." భార. విరా. ౫, ఆ. ౧౪౧. ఉ. హరి. ౩, ఆ. ౬౩. భార. ఆర. ౬, ఆ. ౩౫౯.

**తెఱపిగొను.** దే. అ. క్రి. (తెఱపి+కొను) సందుచేసికొను, అవకాశము కల్గించుకొను. "క. మెఱుఁగులగువాఁడిమొద్దులు, కొఱకులు గాఁడఁగొన నగచకొరఁపడిఁ జూడన్, దెఱపిగొనుకతనఁ గాకెదఁ, బెఱనాఁ దమ్మరుశరంబు భేదించు హరున్." కు. స. ౫, ఆ. ౫౧౮. భార. ద్రో. ౨, ఆ. ౭.

**తెఱపు.** దే. వి. (తెఱచు. ధా.) 1. (మూర్ఛనుండి) తెలివినొందుట. "క. మఱియుఁ దమఁ బొదువు మూర్ఛల, తెఱపులు గైకొనుచు వారు దగఁ బోరి..." భా. రా. యు. ౭౧౪; చీలిక. (చూ. తెఱపులు చేయు.)

**తెఱపుమఱపు.** దే. వి. ఒకప్పుడు తెలివితోను నొకప్పుడు విస్మృతితోను నుంట, తబ్బిబ్బు. (శ. ర.) వ్యవ.—వాఁడు సంధివలన దెఱపుమఱపుమాట లాడుచున్నాఁడు.)

**తెఱపులుగొను.** దే. అ. క్రి. (తెఱపులు+కొను.) వికసించు, విడలు. "క. మఱపు మసఁగువడ దెద్దులు, దెఱపులుగొని విగత రెండుదెఱఁగుల

చేతం, బోఱివోవు గొమ్మనంబుల, గెఱి నిరువుర సలవరింప నేరరు రతులన్." నిర్వ. ౪, ఆ. ౭౯.

తెఱపులుచేయు. దే. అ. క్రి. (తెఱపులు+చేయు.) చీలికలుచేయు, చీల్చు. "చ... మార్గణవర్గములు వచ్చి వక్షముల్, దెఱపులుచేయుచున్ మెదలు ద్రెంచుచుఁ బొట్టలు సించుచున్..." భా. రా. యు. ౧౦౭౩.

తెఱలు. దే. అ. క్రి. (వాసన) బయలువెడలు. (శ. ర.)

తెఱవ. దే. వి. (క. తెరెవై. తెఱ+వాయి.)—గాంభీర్యము లేనిది—1. ఆఁడుది. "గీ. మెఱయు నాయాడుమాటలు తెఱవపిందు నుల్లమునకు నింపారెడునురులు గావె." భార. విరా. ౨,ఆ ౩౩౫; 2. బయలు. "సీ... తెఱవ నా బయలుచు స్త్రీ దనర్చు" ఆం. భా. తృ. ౫౪.

తెఱవాయిమెకము. ద్వ. వి. (తెఱ+వాయి+మెకము.) పంచాస్యము, సింహము. "క. మెకములఱేఁ డనఁ దెఱవా, మెకి మన సింగ మన... కరిరిపునామధేయములు..." ఆం. భా. ద్వి. ౪౧. ఇట్లే తెఱ మొగము మెకము, తెఱవాయిమెకము. సాం. ని. తిర్య. ౭౧. అచ్చ. అర. ౭.

తెఱవు=తెఱఁగు. వి. (క. తెఱవు.) 1. (న్యాయము.) "క. పిఱులెవియక నాముందఱఁ, దెఱవా యిప్పగిది నాడఁ దెఱవా మేల్ మేల్." అచ్చ. అయో. ౨౨. (శ. ర. పా.); 2. (అవస్థ) "గీ. అమ్మ నిను మింక నొకయించుకంత కదవు, నీ తెఱవుఁ జూడ నీ పేరు నీ తెఱఁగు,నడిగి పలికింప మది యున్నది..." కళా. ౩, ఆ. ౪౭.

తెఱ్ఱి=తెఱ. (వృత్తియందు తెఱపశబ్దమున కంత్య వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. చూ. తెఱవ.) మురుఁగులేనిది, అసంవృతము. "సీ. బొక్కి బొమ్మను నాఁకబొడ్డును మిడిపండ్లుఁ దెఱ్ఱినోరును బాఁచిదేఱు మొగము." ధల్లా. ౪, ఆ. (శ. ర.)

తెల. వై. వి. (సం. ధవళః - దీనియామ్రేడితరూపము తెలతెల.) ధవళిమ, తెల్లనికాంతి. "గీ. దండ కాకు లాదవెను పెలకలిరుఁబోండ్ల, కల్లులకుఁ దూర్పు తెలతెలల్ దాయుఁనపుడు." రా. వి. ౧, ఆ. ౭౭. విశే. తెల్లనిది. "క. కలయంం జీరయు నొదలును, దెలతెలగాఁ ఽడపిండి దిక్కులు గప్పన్, బలపలని పెద్కతోఁ దఁత, వెలవెలనై బ్రాహ్మణుండు విస్మితుఁ డయ్యెన్." కా. పంచ. ౫, ఆ. ౧౯. ద్వి శ. సా. ౩, ఆ. ౯౯. పు. ౩, పం. క్రి. విశే. 1. తెల్లగా. "చ. తెలతెల వేగ నప్డు .." భార. మా. ౧౪౦; 2. స్పష్టముగా. "ఉ. అందఱు గుంపులై చనఁగ వచ్చుట గొప్పని గర్గెఁ బెండ్లికో, బంధుగు లున్నవారో తెలఁ బల్కుము నావుడు .." చెన్న. ౩, ఆ. ౩౫.

తెలగా. వై. వి. (సం. త్రిలింగః.) 1. త్రిలింగదేశ మందలియొక శూద్రజాతి. (వా.; 2. ఆజాతి వారు (వృత్తియందు దీర్ఘమునకు హ్రస్వమగును) ఉదా - తెలగబలిజెలు. (శ. ర.)

తెలగాణము. వై. విశే. (తెలుఁగు+అణెము.) తెలుఁగు దేశసంబంధమయినది. "సీ. తెలగాణభూములఁ గలమన్నవారిచే .." వి. పు. ౧, ఆ. ౪౧. (శాసనములలో 'తెలుంగాణెము, అని కనఁబడుచున్నది.)

తెలకే. దే. అ. క్రి. స. క్రి. 1. మ్రొక్కు. "మ. అనలుం డంజలిచేసె నంతకుఁడు సాష్టాంగంబు గావించె మ్రొక్కె నిశాచారి ప్రచేతసుండు తెలకెన్ గేల్మోడ్చె సారంగవాహనుఁడు .." పారి. ౩, ఆ. ౭, 2. స్తుతించు. "గీ. దేవమంత్రి యె తెంచి యాదేవభూజ్యు, నలఘుఫణితుల నిట్లని తెలచెఁ బ్రీతి" హరి. ఉ. ౧౦, ఆ. ౧౫౯; 3. ప్రార్థించు. "క. అసురపతి విప్రునలుక,గాసిబడఁడె తెలచి పడసెఁ గాదె నయనముల్." భార. అను. ౫, ఆ. ౬౪, హరి. ఉ. ౫, ఆ. ౧౯౦.

తెలతెలఁబోవు. ద్వ. అ. క్రి. (తెలతెలన్+బోవు) తెలతెలవాఱు. (శ. ర.)

తెలతెలవాఱు. ద్వ. అ. క్రి. (తెలతెల+పాఱు.) 1. తెల్లవాఱు, వేగు. "క. తెలతెలవాఱెడువేళం, గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦౦౭. భీమ. ౨, ఆ. ౪౪; 2. తెల్లఁబోవు, వివర్ణమగు. "క. తొలివేల్పుల మొగములు తెల,తెలవాఱఁగఁ దల్లవాఱెఁ దెఱ పలవోముల్." అచ్చ. బాల. ౪౭.

తెలన. వై. విశే. (సం. ధవళః.) తెల్లనిది, ధవళము. (దీనియామ్రేడితరూపము తెలతెలన.) "క. చెలిమికి నిచుండు బలుకరములతోఁ జనుదేర మిన్ను ముట్టినయందయా,చలపతిః వేళ వీచిన, తెలిపి చోఁపుఁ జిగిఁ దూర్పు తెలతెల నయ్యెన్." ఉ. శా. ౪, ఆ. ౨౪౭. కాంచ. ౧, ఆ. ౧౩౯.

తెలనాకు. ద్వ. వి. (తెలన+ఆకు.) తెల్లతమల పాకు. "సీ. ఆడకుబు తోయ్యలి మడఁచి యిచ్చిన తెలనాకుఁ జీలిక చేతియందు యుండ." కళా. ౨, ఆ. ౧౭, రామా. ౪, ఆ. ౧౬౯.

తెలవాఱు. దే. అ. క్రి. (తెల+వాఱు.) ఉదయమగు. "క. కలకల పక్షులు బలుకఁగ,జలజాక్షుఁడు విస్మయమున సఖియరో యపుడే,తెలవాఱె నే నిం కొయికనిమి షమువలెఁ దోఁచెన్ విలాసవైఖరి వలనన్." దశా. ౮, ఆ. ౨. ౨౪౪, హంస. ౨, ఆ. ౯౮.

తెలాఱు = తెలవాఱు. (ఉదయమగు.) "గీ. ఆఁక టను బోఁడఁజాలవే యంగడింట,గంట తాకట్టు గా నుంచి కడుపు నిండఁ,గుడువు మిచ్చట సీడ్గిలఁబడి తెలాఱు,దాఁక నొఱలినఁ గలుగదు తగ్గ మనిన." చెన్న. ౨, ఆ. ౪౨.

తెలి. యు. దే. వి. 1. పక్వఘృతము, కాఁచిన నేయి. 'సీ. తనరును పక్వఘృతంబు తెలి యనంగ .." ఆం. భా. ద్వి. ౨౭౯; 2. జలదిపాదిదివ్యప్రమాణము. (చూ. తెలిగొను) వై. వి (సం. ధవళః) ధావళ్యము తెలుపు. "సీ .. తెలి తెల్ల తెల్లన తెలుపు వెల్ల,వెల్లన వెలి నాఁగ వెలయును శుక్లంబు..." ఆం. భా. ప్ర. ౧౦౮; 2. తెలివి, వికాసము. "ఆ. ఉఱికిమంటలోన నల్లాబు తెలి వోక, యింతయేనిఁ గుంద కిద్ధమూర్తి, దేజరిల్లనున్న ధీరవర్యునకుఁ బ్రీత్యతఁ మగ్యో శివుఁడు దయ దలిర్ప." భార. సౌ. ౧, ఆ. ౧౨౪. విణ. తెల్లనిది. "సీ. తెలిగన్నుఁగవ కాంతి బొలుపార నించుక గనువిచ్చి చూచినఁ గాదె యబల." భార. విరా. ౨, ఆ. ౪౭. ఆము. ౧, ఆ. ౮౧; 2. నిర్మలము. "సీ. సెలయేటి తెలినీటఁ జలుబంతి కుసుపాడి నీసక్రొమ్మెఱ్ఱఁ బచ్చియలు తులిమి." హర. ౭, ఆ. ౩౭, భార. ఉద్యో. ౪. ఆ. ౧౨౭.

తెలిక. వై. వి. (సం. తిలకః) 1. నువ్వులు గానుగాడి నూనెయుఁ దెలకపిండియుం నమ్ముకొని జీవించు జాతి. "చ. తెలికల మిండగీఁ డొకఁడు తియ్యనినూనెకు ..."(శ్రీనాథునిచాటువు.)?. బ.తిలలు,నువ్వులు. (శ. ర. వృత్తియం దేకవచనాంతము. శ. ర.)

తెలికదలి. ద్వ. వి. (తెలి+కదలి.) పాలసంద్రము. ".సీ తెలికదలిని గరువలిగుడుగుడిదొరకుఱ్ఱకుయి నిదురఁ గొఱలు నటియ." అచ్చ. అర. ౧౧౪.

తెలికపిండి. వై. వి. (తెలికలు+పిండి.) తిలపిష్టము. "సీ. తిలపిష్టమున కగుఁ దెలికపిండి. గీ. గానుగ పిండి యనంగ...,"సాం. ని. నామ. ౪౭, పద్మ. ౯, ఆ. ౧౧౮.

తెలికవాఁడు. ద్వ. వి. (తెలికలు+వాఁడు.) గాండ్ల వాఁడు, తిలఘాతకుఁడు. "సీ ..తిలఘాతకుం డొప్పఁ దెలికవాఁడు, గానుఁగవాఁ డన..."ఆం. భా. ద్వి. ౨౮౭.

తెలిగంటి ద్వ. వి. (తెలి+కన్ను+ఇ.) ధవళాక్షి, స్త్రీ. "సీ. దౌవ్వారికశ్రీ నిల్పుధవళాంబుజముపోల్కిఁ దెలిగంటినెమ్మోము తెల్లనయ్యె." ఉ. రా. ౨, ఆ. ౧౩౭. దశా. ౧, ఆ. ౧౯౪.

తెలిగాము. వై. వి. (తెలి+గాము.) శ్వేతగ్రహము, శుక్రుఁడు. (శ. ర.)

తెలిగిబ్బ. వై. వి. (తెలి+గిబ్బ.) శివునివాహన మైన వృషభము. "క. తెలిగిబ్బ యనఁగఁ బరఁగుచు నుండన్, శూలధరుఁ డెక్కువృషభము..."ఆం. భా. ప్ర. ౫౪.

తెలిగొను. దే. అ. క్రి. (తెలి+కొను.) ప్రమాణము చేయించు. "క. మ్రుచ్చను బట్టినమాత్రన,చెచ్చెర ద డింప కతనిచే దలిగొని వా, డచ్చైన విడువు నిక్కపు, మ్రుచ్చైనం దగినదండమును గొనవల యున్." విజ్ఞా. ప్రా కాం. ౯౧. విజ్ఞా. వ్యవ. కాం. ౧౧౪.

తెలిడాలుమెకము. ద్వ. వి. (తెలి+డాలు+మెకము.) సింహము. "క. అమ్మేడచివర కెంతయు, నెమ్మ దితో నెక్కి కదలు నెమకుచుఁ జెట్టుం, ద్రిమ్మరి తెలిడాలుమెకం బిమ్మున నొకమ్రానిక్రింద నున్ కనఁగన్." అచ్చ. సుం. ౬౭.

తెలితేజి. ద్వ. వి. (తెలి+తేజి.) ఉచ్చైశ్శ్రవము. "సీ...తెలితేజిఁ దెమ్మన్నఁ గానక తిరుగు నాది." దశా. ౨, ఆ. ౪౯. ఇట్టే: తెలిబావా. శకాం. ౨, ఆ. ౨౪.

తెలిదమ్మి. వై. వి. (తెలి+తమ్మి.) తెల్లదామర, పుండరీకము. "సీ. తెలిదమ్మివిరియింటి తెలిగంటికెంపువా తెఱపెంపు కవడంపుఁదీఁగెగుంపు." దశా. ౧, ఆ. ౧౯౭.

తెలిదమ్మికంటి. ద్వ. వి. (తెలిదమ్మి+కన్ను+ఇ.) పుండరీకాక్షుఁడు, విష్ణువు. "చ. అని తెలిదమ్మికంటి మది

నంటి పెనంగొనుకూర్మి నాడినం, గనుఁగొని .." నీలా. ౨, ఆ. ౪౦.

తెలిదీవి. వై. వి. (తెలి+దీవి.) శ్వేతద్వీపము. "సీ. తెలిదీవిపురవిమానద్దులగుమ్మ నిజవలగ్నమునఁ బూను సువర్ణఘంటి యనఁగ." ఉ. రా. ౧, ఆ. ౩౧౬. నీలా. ౧, ఆ. ౪౫.

తెలిదీవిదొర. ద్వ. వి. (తెలిదీవి+దొర.) విష్ణువు. "సీ. సనకాదులకు లేనిచనవుతోఁ దలికిచిదొరవెంగట మెలంగుమురిపె మెల్ల." చం. రా. ౨, ఆ. ౩౦. ఇట్లే: తెలిదీవిమన్నీఁడు. సాం. ని. దేవ. ౪.

తెలిపక్కము. వై. వి. (తెలి+పక్కము) శుక్ల పక్షము. (శ. ర.)

తెలిపించు. దే. స. క్రి. (తెలుపు ధా. ప్రే.) 1. లేపు, మేల్కొలుపు. "ఉ. కొందలపాటునన్ మనము గుందినఁ గంటికి నిద్రరాక సేసం దెలిపించి యప్పు పయనంబుయి చైత్యవిభుండు వోవ .." నిర్వ. ౬, ఆ. ౭౦; 2. ఎఱిఁగించు, తెలియఁ బఱచు. "వ...అది తనకుమారులఁ బిలిచి తెలి పించిన వార లిట్లనిరి..." కళా. ౪, ఆ. ౧౫౧; 3. వ్యక్తముచేయు. "ద్వి. లీలమైఁ దెలిపించు లే జవ్వనములనోలి వినోదించు చున్నయంగనల." రం. రా. ఉ. ౭౭. పు. ౨౬. పం.

తెలిపులుఁగు. ద్వ. వి. (తెలి+పులుఁగు.) హంస. "సీ. తొలకరిఁ గల్గుగువ్వలు నల్వజక్కులు తెలి పులుఁగులు...అన హంసముల పేరు లలరు..." వేంక. నిర్వ. ౯౯. ఇట్లే: తెలిపుల్గు, తెలిపిట్ట. నీలా. ౧, ఆ. ౬౦. పం. నిర్వ. ౧౯.

తెలిమల. ద్వ. వి. (తెలి+మల.) కైలాసము. 'గీ. తెలిమల యనంగ రజతాద్రి లేజిల్లు." సాం. ని. స్థా. ౫౫.

తెలిమిన్న. వై. వి. (తెలి+మిన్న.) వజ్రము, తెల్లని రత్నము. "చ. అని జనకేశ తల్పి యసఖాగ్రణి కేల్ తయిదండఁ బూని చక్కని తెలిమిన్న మెట్టి కలు గట్టినత్రోవ నగేంద్ర మెక్కె..." చంద్రి. ౨, ఆ. ౫. [(శ. ర.)

తెలిమెకము. వై. వి. (తెలి+మెకము.) సింహము.

తెలిమొదవు ద్వ. వి. (తెలి+మొదవు.) కామ ధేనువు. (శ. ర.)

తెలిమోముచక్కి. వై. వి. (తెలి+మోము+చక్కి.) గరుత్మంతుడు. సాం. ని. దేవ. ౧౫.

తెలిమ్రాఁకు. ద్వ. వి. (తెలి+మ్రాఁకు.) కల్పవృక్షము. "సీ. తెఱగంటిదొరయింటి తెలిమ్రాఁకు తొఁద ర్రొఁకె..." నీలా. ౧, ఆ. ౪౫.

తెలిమ్రాను = తెలిమ్రాఁకు. నీలా. ౧, ఆ. ౪౫.

తెలియ. వై. వి. (సం. స్థాలీ.) భోజనపాత్రము. (శ. ర.)

తెలియఁబడు. ద్వ. అ. క్రి. (తెలియన్+పడు - స్వార్థమున.) తెలియు. (చూ. తెలియఁబఱచు.)

తెలియఁబడు. ద్వ. అ. క్రి. (తెలియఁబడు ధా. ప్రే.) వెల్లడించు, తెలియఁజేయు. "సీ. పదిరెండు రాసుల బహుళార్థరాసుల ఫలమిగి మేలెల్ల తెలియఁబఱచు." సాంభో. ౨, ఆ. ౪.

తెలియు. దే. అ. క్రి. 1. ఎఱుకపడు, విదితమగు. "వ ..దేవతలకుం దెలియనట్టివి యూహలనికిం దెలియు .." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦౨. అను. ౫ ఆ. ౯౭; 2. విశదమగు, తేటపడు. "గీ. అథవ నీకంఠమూలంబునందుఁ దెలిసి, కాన నయ్యెడు నిది యేమి కప్ప సెప్ప." హర. ౬, ఆ. ౫. జై. ౭, ఆ. ౬౩; 3. మేల్కొను. "గీ...ఆఱునెలల కొకనాఁడు భోజనాదులకుఁ దెలియునాఁడు నీఁ డజయ్యుఁడు రిక్తనాఁడు దెలుపుబలిమిఁ దెలియునాఁ డీతనిబలము దూలు." భా. రా. యుద్ధ. ౭౭౬. పరామ. ౧౦, ఆ. ౬౦; తెలివి కలిగియుండు. "సీ. దేన నదీసూనుఁ డీ యస్త్రమునకు మా తెఱఁగుఁ గాన. ఆ. నతఁడు తెలిసియుండు నాతనిదెస వోక ..." భార. విరా. ౫ ఆ. ౨౧౦, 5. ప్రసన్నతనొందు. "సీ. ఆకాశ వాణివాక్యంబుచే బ్రతికి నీ కెదురుసూచిలిమి నుమ్మిన్ని నాళ్లు. గీ. అనుచు శెఁగములు దలిసి దేహములు పొంగి, బలుమఱును గౌఁగిలించుచు ." సా. ౩, ఆ. ౧౬౪. భార. భీష్మ. ౧, ఆ. ౧౦౨; వికసించు. "గీ. వెరపుతోడ వేకువ యను వెజ్జుతూర్పుసిక్కుకెం పనుమందునఁ దీర్చి నొక్కొ, తిమిరకాలాహవిమూర్ఛనము ననంగఁ, దలిని శెత్తమ్ము లొప్పలు దలిరొనంగ." హరి. భూ. ౭, ఆ. ౧౯; 7. ప్రకాశించు. "క. ఒక కను తెలియదు రాత్రుల, నొకకను పగరింటఁ దలిచినొందక యుండుచున్, ఒకకన్ను పొగలు కమ్మిన, దీఁక శౌర్యశై శివునిఁ జెంద నిచ్చించు మదిన్. పార్వ. ౪, ఆ. ౯౩; 8. తేఱుకొను,

స్వాస్థ్యము నొందు. "వ...ఇట్టితండు మూర్ఛిల్లిన మునిజనంబులును సంబరయుం నధికశోకసమాకులత్వంబు నొంది హాహాకారంబులు సెలంగఁ బొదివి రంత. "ఉ. తెలిసి భాగ్యవృందు దృఢతీవ్రనారాచ, పంక్తి గురిసి .." భార. ఉద్యో. ౪, ఆ. ౩౩౪, ౩౩౫. భార. ఆది. ౮, ఆ. ౨౩౮; 9. సముస్కరించు. "వ ..కృతకాచమండలిపాపహారునకుఁ దెలియుట శ్వేతగిరియందలి సిహాలోచనునకు వెన్నెల .." ప్రబంధ. ౭౭౦.

తెలియేఱు ద్వ. వి. (తెలి+ఏఱు.) ఆకాశగంగ. "క...తెలియే ఱన,విసువాఁ కన సొరగంగ..." ఆం. భా. ప్ర. ౫౫.

తెలిరా. ద్వ. వి. (తెలి+రాయి.) చంద్రకాంతము. "వ ..తెలిరాకట్టుసెలవులం బవ్వళించి యున్న నాయికానాయకులు..." పారి. ౨, ఆ. ౫౨.

తెలివి. దే. వి. (తెలియు. ధా. క. తిళివు. త. తెళియు.) 1. జ్ఞానము; వివేకము. "చ...దీని కేల యధికం బగు నెవ్వగ నింత నొవ్వని,త్తెలివి మనంబునం జొనుపు ధీరత సారత గూర్పు నేర్పునన్." భార. ద్రో. ౨, ఆ. ౨౧౩. "క. కల దది యూరక కానఁగ, నలఘియై శ్రుతి వాక్యసమితియర్థంబులపై, నిలిచినశ్రద్ధం గ్రమమునఁ, దెలివొందినఁ గాక యెట్టిధీమంతునకున్." భార. అను. ౫, ఆ. ౧౬౩; 2. ప్రకాశశక్తి. "చ. కనుఁగవ లెస్సఁగాఁ దెలివి గల్గినవారికిఁ గాక గ్రుడ్డికిన్, గనఁబడు నెట్లు వెన్నెలలు గాయఁగ వంకొకరూపు భాస్కరా." భా.శ. ౪౯; 3. వికాసము. "క. పురహరుఁ డసుమతి నేయఁగ, శరము శరాసనము దివ్యశరసీన యిడి యన్నరుఁడు సనుదెంచి యాకం,కరముఖకమలంబు తెలివి గాంచి ముదమునన్." భార. ద్రో. ౨, ఆ. ౩౭౫. 4. కాంతి, ప్రకాశము. "గీ. ఇనుఁడు తనదీప్తి తనచేత నిచ్చిపోయి, మఱవ కేతెంచి నిజరుచి మగుడఁ గొనినఁ,దెలివిచెడి తెల్లనయి రుసులకు జగతి, నిలుపుగతి దీపకళికలు వెలుగుచాతె." కు. సం. ౭, ఆ. ౧౭౬. య. ౨, ఆ. ౭౧; 5. (మూర్ఛాదులనుండి) తేఱుట,స్మృతి. "సీ. పలుమాఱు మూర్ఛిల్లి పలుమాఱు దెలి వొంది తనకళత్రాదులతగులు విగిలి." కవిక. ౫, ఆ. ౧౧౧. కాశీ. ౨, ఆ. ౨౦; 6. నిర్మలత్వము. "క. కలఁగినపెద్దమడుపు విను, తెలివిఁ బొరయుం జెట్టు తా నధీనుండ ట్లుగ్గలము లయినదురితంబులఁ గలఁగియుఁ దనయంతఁ దేఱు గౌరవ మొప్పన్." భార. శాం. ౩, ఆ. ౩౪, కు. సం. ౭, ఆ. ౧౫౮; 8. అంగీకారము. "సీ. సాధుచరిత్రయుఁ గాంతయు నైనయుగ్గాంధారియును జేను గాఢవినయు, మార మీ తెలి విట్లు గోరుచున్నారము..." భార. ఆశ్ర. ౧, ఆ. ౯౬. సం. భార. ఆశ్ర. ౧౧, స. ౫, 8. సున్నఁదనము. "సీ...తేట సున్నన సున్న తెలివి నునుప్ర. గీ. నిద్ద మన స్నిగ్ధతకెనంగు .." సాం. ని. స్థా. ౬౦; 9. సన్నత. "గీ. నీకు నీరలఁ దేర్పుట నెఱియు కాద,సిద్ధమెవ్వారి శలి వొందఁజేయ నేర్తు." భార. శిద్యో. ౩, ఆ. ౨౬౩; 10. సంతోషము. "వ...సకల భూతంబులమనంబులు తెలివిం బొందె .." కాశీ. ౪, ఆ. ౧౦, వసు. ౪, ఆ. ౧౦౬; 11. శాగ్రత. "సీ. తెలివిమైఁ దనకన్నఁ దఱచి దృష్టింపుఁడు వామాక్షిరుచులు తీవ్రంబు లసుదు." దశా. ౨, ఆ. ౭౯. విశే. 1. స్పష్టము. "గీ. తెలివియై మీఱు నూగారుదీప్తియొక్క." కువల. ౫, ఆ. ౧౦౯, దశా. ౧, ఆ. ౧౦౪. 2. దీప్తిమంతము, కాంతిమంతము. "సీ. తెలివివెన్నెల వెండితీఁగలు నిగిడించు పదలు కమ్మచ్చు బెజ్జము లనంగ." పారి. ౨, ఆ. ౩౬.

తెలివికత్తె. దే. విశే. (తెలివి+కత్తె.) వివేకవతి, ప్రాజ్ఞ. "సీ ..తెలివికత్తె యనంగఁ దేరుఁ బ్రాజ్ఞ." ఆం. భా. ద్వి. ౧౦౮.

తెలివికాఁడు. దే. విశే. (తెలివి+కాఁడు.) వివేకవంతుఁడు, ప్రాజ్ఞుఁడు. "సీ. తెలివికాఁ డనఁగను వెలయుచుండు నభిజ్ఞుఁడు..." ఆం. భా. కృ. ౩.

తెలివిగొను. దే. అ. క్రి. (తెలివి+కొను.) మూర్ఛాదులనుండి తేఱుకొను. "క. అటుపలె నృప నిట లాక్షుఁడు, పటుశరనివహంబుఁ జెంది బాధపడంగా, నటనమున హేల యునియెడు, కుటిలాలక వచ్చెఁ దెలివిగొనఁ జేయుటకున్." హంస. ౧, ఆ. ౮౪.

తెలివిడి. దే. వి. (తెలియు. ధా.) 1. జ్ఞానము. "గీ. తెలివి యనఁగ నెఱుక యనఁ దెలివిడి యనఁ, బరగు జ్ఞానంబు..." ఆం. భా. ప్ర. ౧౦౨; 2. తెలియఁజేయుట; 3. దృష్టాంతము. (శ. ర.)

స్పష్టముచేయు. "క. ఆరాజసుతులవిద్యా, పారగ కటుచేష్టితముల బరువడి నగ్గాంగ,ధారీధృతరాష్ట్రుల కతి,ధీరుఁడు విదురుండు చెప్పి తెలుపుచుండెన్." భార. ఆది ౬, ఆ. ౧౪, భార. శాం. ౧, ఆ. ౩౯; 3. బోధించు,నేర్పు. "క. మఱి యెఱిఁగి యెఱుఁగనొల్లని, కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే." భార. ఆది. ౪, ఆ. ౭౧; 4. మేలుకొలుపు, నిద్రనుండి లేపు. "క. కలవారెల్లను మడిసిరి, కలిగియుం లేఁడయ్యెఁ గుంభకర్ణుఁడు వీనిం,దెలుపుదునో యనుఁ గొడుకుం,జల మెదవక రిపులతోడ నరిఁ బెనఁగుదునో." భార అర. ౭, ఆ. ౯౩, శా. పంచ. ౩, ఆ. ౧౮౬; 5. ఓదార్చు. "కొండొకవగపున నేనియు, నొండొరువులఁ దెల్పనట్టియుంబిదలు చిత్తం,బొండొండ వనట ముఁచుఁగఁగ,నొం డెవ్వరుఁ దెలుప లేక యుండి రవశలై." భార. స్త్రీ. ౧, ఆ. ౧౦౦. ద్వి. హరిశ్చ. పూ. ౮౪౫, పం. వి. 1. ఊటట. (శ. ర.); 2. మేహరోగవిశేషము. (శ. ర.); 3. నమస్కారము. "గీ. వారి యొకండ జగత్కర్త యఖిలభర్త, విశ్వసంహర్త భోక్త వివేకయోక్త,తలఁపు బలుపును గొలుపును దెలుపు నతని,దెసన భావింప నగు నొందుదిక్కు వోక." నృసిం. ౪, ఆ. ౧౦౩. వై. (సం. ధవళః.) 1. ధావళ్యము, తెల్లఁదనము. "సీ. తెలుపును గప్పను వెలయంగ మెఱుఁగెక్కు తారకంబులఁ గల్కితనము దోఁదర" భార. విరా ౧, ఆ. ౨౪౫, ఆం. భా. ప్ర. ౧౦౮, 2. శ్వేతవర్ణము. "ఉ. ఇందునిభాస్య మైలోదవు కేల ధరింపవు నున్నఁగావు లీ,వెందును మానవేవు తెలుపేటికిఁ గట్టితి..." పారి. ౧, ఆ. ౧౧౫; 3. నైర్మల్యము. "ద్వి. మలుపు లేకన్నుల తెలుపు లవంగ." పండితా మహిమ ౨౭౦ వి. తెల్లనిది. "క. తెలుపు లగుచీరలను బూఁతలఁ బువ్వుల నొప్పి రాజకనయానుగుణో, జ్జ్వలమానపీయ వేషముల,లపడఁ గూడుకొని నగరి కరిగిరి స్త్రీలిన్" భార. విరా. ౫, ఆ. ౩౧౫, స్వా. ౩, ఆ. ౨౭.

తెలుపుడు. దే. వి. (తెలుపుధా.) ఎఱుక. "చ శిలలను గుప్పచప్పుడును జేతుల హేతులు త్రిక్కుచప్పుడున్, దెలుపుడు దెల్పుచప్పుడును .." రామా. ౯, ఆ. ౧౯౭.

తెలుపుడుచేయు. దే. స. క్రి. (తెలుపుడు+చేయు.) ఎఱిఁగించు. "క. తెలుపుడుచేయం గలస్వాచెలియ మనోవ్యథ శుభవ్యక్తిమ్రోమ్మున,ప్పులం కాదరింపఁ గావలె .." కవిజ. ౨, ఆ. ౬౭.

తెలుపుడుసేయు = తెలుపుడుచేయు. రుక్మి. ౧, ఆ. ౧౦౩.

తెలుపువాఱు. ద్వ. అ. క్రి. (తెలుపు+వాఱు.) తెల్లనగు. "సీ కడుపులో నొప్పారుకొడుకు నిర్మల బుద్ధి తెలుపు వాఁ గనఁగవ తెలుపువాఱె." నృసిం. ౩, ఆ. ౧౩౧.

తెలుపెక్కు. ద్వ. అ. క్రి. (తెలుపు+ఎక్కు.) తెల్లఁబడు. 1. "సీ. మగరాలచికిలి కమ్మలుదాయఁ దెలుపెక్కఁ జిక్కు లేమని యొత్తు చెలియ నడిగె" ఉ. రా. ౧, ఆ. ౧౭౪.

తెలె = తెలియ. (భోజనపాత్రము, కంచము.) "క. ఇనుపతెలెఁ బంటితెలెఁ, బెనుచేతుల నాకు పెణఁకఁ బీఁటపయిన్ భో,జన మొదరించుట తగదన్నిమును చెప్పిరి జనుల కాదిమునివరు లెల్లన్." విజ్ఞా. ఆచార. ౭౨, ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౩, ఆం. భా. ద్వి. ౨౪౪.

తెల్గువాఁడు = తెనుఁగువాఁడు "సీ. ఆంధ్రుఁ డాఁ దెనుఁగువాఁ డనఁ దెల్గువాఁ డన .." ఆం. భా. ద్వి. ౧౦౩.

తెల్చు = తెలుచే. (కనఁబడు.) "వ. పురస్కృత తిరస్కరిణీపరిసరంబుల భాసిల్లులావ్యకీజనంబుల సందుల నందంద తెల్చుచుఁ జెలికత్తియలఁ బిల్చుచు .." విప్ర. ౨, ఆ. ౬౪.

తెల్పారు = తెలుపారు. (తెల్లనగు.) "సీ. దుగ్ధార్ణవంబునందు విశాలరమణీయ మగునొక్కదీవి తెల్పారియుండు." భార. శాం. ౬, ఆ. ౩౬౫. కు. సం. ౩, ఆ. ౨౪.

తెల్పు = తెలుచు. 1. (బోధించు.) "చ. కరుణ జనించి శాత్రవుల గాండివి పాపఁగ నొల్లఁడయ్యె శేఁ,బనుపడిఁ దెల్పి యైక్యపరిభావనిరూఢము గాఁగఁ జేసినన్." భార. శల్య. ౨, ఆ. ౩౪౫; 2. (మేలుకొలుపు.) "చ...చ,ప్పరమునఁ జాల హృద్య మగుపాన్పున నూఱిడి నిద్రవోవున,గ్గురు వధకారిఁ గాంచి కడుఁగ్రోధము మోదము సంద డింప సు,స్థిరతఁ బదప్రహారముసఁ దెల్పెఁ దృణీకర ణాభిరాముఁడై." భార. సౌ. ౧, ఆ. ౧౪౭. వి.

(తెల్లఁదనము.) "చ. ఇనుఁ డొదఁగూడి...తన కాంతి మాని నన్నఁ దెల్పుఁడుఁ, జీకటి కప్పె..." కు. సం. ౯, ఆ. ౯౦; 2. (ఊటుట.) "సీ. పాల యలంక లను దెల్పులు నటించుచుఁ గ్రాలునిటకుల టాకులవిలసనంబు." మార్క. ౧, ఆ. ౧౩౪. విణ. (తెల్లనిది.) "గీ. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా సుభయభార్య, లుడుపతికి నందు నొకతె జ లొప్పె ర్తు నలుపు." శైవ. ౯, ఆ. ౧౯౪.

తెల్ల = తెల. (తెలుపు, ధావళ్యము.) "సీ... తెలి తెల్ల తెల్లన తెలుపు వెల్లన వెలి నాఁగ వెలయును శుక్లంబు .." ఆం. భా. ప్ర. ౧౦౯. విణ. (కర్మ ధారయమున నిగాగమము బహుళము.) 1. తెల్ల నిది. "సీ. ఉల్ల తెల్లనితురగో త్తము వాలంబు నల్ల చేసితిరేని .." భార. ఆది ౨, ఆ. ౩౪. ఆము. ౪, ఆ. ౧౭. భా. రా. బాల. ౩౪౯; 2. స్పష్టము. "ఉ. విష్ణుని మూలతత్త్వమును వేమఱు నయ్యయి జన్మకర్మవ్రతిష్ఠల లాచరించుటలు దేవకికిన్ వసు దేవమూనఁడై, కృష్ణుఁ డనంగఁ బుట్టి శిశుఖేలన మాదిగఁ గల్గుభావముల్, ధృష్టత నిర్వహించుటలు తెల్లగ వింటి నరేంద్ర పుంగవా" ఉ. హరి. ఉ. ౯, ఆ. ౩౦౪.

తెల్లఁటి. దే. వి. (క. తెల్లంటి, తెల్లంటు.) బహుమానము. "గీ. నీర ముంచిన సొరకాయ కాఁగసి నట్లు, పేరుకొని పైచు తెల్లంటి చీరవోలె." ఉ హరి. ౪, ఆ. ౨౯.

తెల్లఁబాఱు. ద్వ. అ. క్రి. (తెల్లన్ + పాఱు.) తెల్ల నగు; (భయాదులచే) వివర్ణతనొందు. "గీ. తెల్లఁ బాఱెను నడ చూడు తెలుప విధుఁడు." శైవ. ౯, ఆ. ౧౬౭. ఆం. భా. తృ. ౧౦౨.

తెల్లకలిగొట్టు. ద్వ. వి. (తెల్ల+కలిగొట్టు.) శాఖోటలిశీ. (శ. ర.)

తెల్లకల్వ. వై. వి. (తెల్ల+కల్వ.) కైరవము, తెల్లని కలువ. "గీ. కైరవాభిధ గాఁ దెల్లకల్వ యనఁగ, వెలయు..." ఆం. భా. ప్ర. ౧౬౪.

తెల్లకాంచనము. వై. వి. (తెల్ల+కాంచనము.) ఒక జాతికోవిదారముశీ. "సీ. తెల్లకాంచనము తుందిల మెట్టకాంచె ముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్పు." హంస. ౪, ఆ. ౧౧.

తెల్లకాకి. వై. వి. (తెల్ల+కాకి.) శ్వేతవాయసము, ధూంక్షము. (శ. ర.)

తెల్లకొక్కెర. ద్వ. వి. (తెల్ల+కొక్కెర.) బలాక. (శ. ర.)

తెల్లగగ్గెర. ద్వ. వి. (తెల్ల+గగ్గెర.) అర్జకముశీ. (శ.ర.)

తెల్లగడ్డ. వై. వి. (తెల్ల+గడ్డ.) లశునము, వెల్లుల్లిశీ. (శ. ర.)

తెల్లగన్నేరు. వై. వి. (తెల్ల+గన్నేరు.) శ్వేతకర వీరముశీ. (శ. ర.)

తెల్లగఱి. వై. వి. (తెల్ల+గఱి.)—తెల్లనిఱెక్కలు గలది—హంస. "ఉ. బంగరుబొజ్జ పల్కు బడిపై దలి పచ్చనిమేనుతమ్మిపూ, సింగపుఁబీట తెల్లగఱి చిన్నిపటాణి కడానివన్నెముం, గొంగులతండ్రి పాటబెళుకుం దొలుకానుపు చాలు మోము లె,క్కుం గలవేల్పు దనపుం గలయేం డ్లొదవించుఁ గావుతన్." పాంచాలీ. ౧, ఆ. ౩.

తెల్లగఱిక. ద్వ. వి. (తెల్ల+గఱిక.) శతవీర్యశీ (శ. ర.)

తెల్లగలిజేరు. ద్వ. వి. (తెల్ల+గలిజేరు.) దీర్ఘపత్త్రము, శ్వేతపునర్నవశీ. (శ. ర.)

తెల్లగినియ. ద్వ. వి. (తెల్ల+గినియ.) కునాభముశీ. (శ. ర.)

తెల్లగిలు. దే. అ. క్రి. జాఱు. "ద్వి. బిగువుచన్నుల జిగిబిగి కొరిఁ జూచి, తెగడి పయ్యెద లింత తెల్ల గిలంగఁ, బడపడి చాఁచిన బాహుమూలముల, నదిరిబంగరుపొడి యొదిరి పై రాల." అ. మ. క. ౨౭౯, పు. ౧౩, పం.

తెల్లగిసె. వై. వి. (తెల్ల+అగిసె.) ముతంగిశీ. (శ. ర.)

తెల్లగురిగింజ. ద్వ వి. (తెల్ల+గురిగింజ.) శ్వేతపాకిశీ. (శ. ర.) [(శ. ర.)

తెల్లగురిజె. వై. వి. (తెల్ల+గురిజె) మధుశ్రవశీ.

తెల్లగంటెన. ద్వ. వి. (తెల్ల+గంటెన) అశ్వఖుర, ఓషధివిశేషముశీ. "గీ. నల్లగంటెన పూరి తెల్ల గంటెన యుంత్ర,రేణు గబ్బిరి నంబరేణు..." హంస. ౪, ఆ. ౧౦. ('తెల్లదింటెన.') అని (శ.ర.)

తెల్లగోరంట. వై. వి. (తెల్ల+గోరంట.) సైరేయకముశీ. (శ. ర)

తెల్లచెన్నఁగులు. ద్వ. వి. బ. (తెల్ల+చెన్నఁగులు.) ఒక రకపుచెన్నఁగిధాన్యము. "గీ. తెల్లనల్లచెన్నంగులు దీవసరులు, నాదియగు పేర్లు గలఁగువ ద్ధతనియుంట, నుండు శకకోటిబారుపు లొక్కడిననుు." హంస. ౪, ఆ. ౧౨౯.

తెల్లచెఱకు. ద్వ. వి. (తెల్ల+చెఱకు.) తేజనకము శీ. (శ. ర.)

తెల్లజక్కి. ద్వ. వి. (తెల్ల+జక్కి.) ఉచ్చైశ్శ్రవము. "గీ. .. తెల్ల, జక్కి, నిక్కువీనుల మాఱుచదలు తేజి, యనఁగ నుచ్చైశ్శ్రవముపేరు లమరు సొంపు." సాం. ని. దేవ. ౧౭.

తెల్లజీనము. వై. వి. (తెల్ల+జీనము) వృత్తపత్త్రి శీ. (శ. ర.)

తెల్లజీలకఱ్ఱ. వై. వి. (తెల్ల+జీలకఱ్ఱ.) అజాజీ శీ. (శ. ర.)

తెల్లజిల్లేడు. ద్వ. వి. (తెల్ల+జిల్లేడు) అలర్కము శీ. (శ. ర.)

తెల్లటి. దే. వి. (క. తెల్లటి, తెల్లటు.) బహుమానము "క. ఇటమీఁద దివ్వరికిం దెల్లటిగా నీ విట్టు లుచిత లలనా నన్నేలుట మూఁడుజగంబుల మెచ్చుకటి యేలుట గాదె రామకథ మఱి వింటన్." భా. రా. యు. ౩౦౪. పండితా. పర్వ. ౩౫౦, పు.

తెల్లడాలుమెకము. ద్వ. వి. (తెల్ల+డాలు+మెకము.) సింహము. "క. ఓలిమెయిఁ దెల్లడాలుమెకా లిఖ్ఖులమీఁద నదరుకై వడి..." అచ్చ. యు. ౭౦౫. అం. సం. తిర్య. ౧.

తెల్లతుమ్మ. ద్వ. వి. (తెల్ల+తుమ్మ.) విట్ఖదిరము. "సీ .. తెల్లతుమ్మ యనంగ, విట్ఖదిరాఖ్యమై వెలయును..." ఆం. భా. ద్వి. ౪౦. "సీ. కమలబాంధవునితోఁ గదురుమెఱ్ఱువుపుర్వు దేవతానుజముతోఁ దెల్లతుమ్మ." చెన్న. ౫, ఆ. ౭౧.

తెల్లతేజి. ద్వ. వి. (తెల్ల+తేజి.) ఉచ్చైశ్శ్రవము. "గీ. దేవతాశ్వంబు వెలయును దెల్లతేజి, నిక్కువీనులజక్కి నా నీలకంఠ." ఆం. భా. ప్ర. ౫౬.

తెల్లదమ్మి. ద్వ. వి. (తెల్ల+తమ్మి.) పుండరీకము, తెల్లని తమ్మి. "గీ .. తెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి, తెల్లదమ్మి యనంగను దేజరిల్లుఁ బుండరీకంబు..." ఆం. భా. ప్ర. ౧౬౫. [(శ. ర.)

తెల్లదామర. వై. వి. (తెల్ల+తామర.) పుండరీకము.

తెల్లదీవి. వై. వి. (తెల్ల+దీవి.) శ్వేతద్వీపము. "ఆ. దీవులెల్లఁ దెల్లదీవులై రహిఁ గాంచె..." ఉ. రా. ౫, ఆ. ౧౦౫.

తెల్లన. వై. వి. (సం. ధవళః.) తెలుపు, ధావళ్యము. "సీ... తెలితెల్ల తెల్లన తెలుపు వెల్ల వెల్లన వెలి నాఁగ వెలయును శుక్లంబు .." ఆం. భా. ప్ర. ౧౦౯. విశే.

తెల్లనిడి. "సీ. దాహ్యదశ్రీ నిల్చుధవళాంబుజము పోల్కిఁ దెలిగంటి నెమ్మోము తెల్లనయ్యె." ఉ. రా. ౭, ఆ. ౧౩౭. దశా. ౧ ఆ. ౭౬.

తెల్లనగిర ద్వ. వి. (తెల్ల+నగిర.) వృక్షవిశేషము. "సీ. దేవదారు సిరిసెత్తిలకము తెల్లనగిర వేఁప కరివేఁప తురకవేఁప." హంస. ౪, ఆ. ౧౧.

తెల్లనాకు. ద్వ. వి. (తెల్లన+ఆకు.) లేఁతతమలపాకు. "సీ. పొరుగూరిసంతకుఁ బోవువారలచేతఁ దెప్పించు కోఁకలు తెల్లనాకులు..." శుక. ౨, ఆ. ౪౩౪.

తెల్లనార. ద్వ. వి. (తెల్ల+నార) మత్స్యవిశేషము. (శ. ర.)

తెల్లనిగట్టు. వై. వి. (తెల్లని+గట్టు.) కైలాసపర్వతము. "క. అల్లది కంటే పొనపొన, తెల్లనిగట్టు ఱత మబ్బుదేఱెనుపాలమం, దల్లెడఁ జూచిన ధరణీవల్లభ సీరాముసేన వాలుమెకంబుల్." స్వా. ౪, ఆ. ౧౬.

తెల్లనితల్లి. ద్వ. వి. (తెల్లని+తల్లి) సరస్వతీదేవి "చ... వేల్పులు బలుబాటు లోకములఁ బొల్తుక తెల్లనితల్లి పెద్దకోడలచుచు నెల్లవారుఁ బొగడం దగునల్లని వేల్పుఁ గొల్చెదన్" ద్వా. ౧, ఆ. ౨.

తెల్లనిదొర. ద్వ. వి. (తెల్లని+దొర) 1 శివుఁడు. "క. వెల్లువసెకఁ బల్లువిన మా, తెల్లనిదొర కుతుక మోవఁ దిని బ్రతుకుట నీచల్లదనంబునఁ గాదే, కల్లోలవతీమతల్లి గంగాతల్లీ." విజ. ౧, ఆ ౫౦; 2. బలరాముఁడు.

తెల్లనిమైదంట. ద్వ. వి. బలరాముఁడు. ఆం. సం. దేవ. ౨౯.

తెల్లనేలగుమ్ముడు. ద్వ. వి. (తెల్ల+నేలగుమ్ముడు) విదారి శీ. (శ. ర.)

తెల్లపులుగుడు. ద్వ. వి. (తెల్ల+పులుగుడు) శ్వేతవాకంగిని శీ. (శ. ర.)

తెల్లమానికము. వై. వి. (తెల్ల+మానికము) వజ్రము. "చ. కనఁదగుఁ దెల్లమానికపుఁగప్పుల నొప్పుడు చప్పరాలతో." య. ౧, ఆ. ౫.

తెల్లమి. దే. విశే. స్పష్టము. "క. మునలి తపియించె నవు దయ్యసికాపట్టణాల రాజయత్నమోఘం, బెసఁగ నశియించు నగు సద్దెసఁ బాఱుఁడు సుగుడి గామి తెల్లమియె కదా." స్వా. ౪, ఆ. ౯౧, సీతా. ౧, ఆ. ౫౦.

తెల్లము. దే. విశే. "క. ఇది యేమి తెలుఁగు దీనికి, మొద లెయ్యది నాకుఁ దెల్లముగఁ జెప్పుడు..." భార. ఆది. ౬, ఆ. ౨౬౫. భార. ఉద్యో. ౧ ఆ. ౧౩౫. క్రి. విశే. స్పష్టముగా. "క. ఏ దేశ మునకుండి యిట యే దేశమునకు నరిగె దీవు తెల్లము చెపుమా." దశ. ౧౧, ఆ. ౨౦. వి. పు ౨, ఆ. ౨౩౯. [(శ. ర.)

తెల్లములక. ద్వ. వి. (తెల్ల+ములక) శ్వేతబృహతి శీ.

తెల్లమొసవు. ద్వ. వి. (తెల్ల+మొసవు) కామధేనువు. "సీ. అడిగిన నొసఁగెడి యావు జేజేగిడ్డి చదలు తొడుసు తెల్లమొసవనంగ, నురగవి పేళ్లగు..." సాం. ని దేవ. ౧౯.

తెల్లమ్రాను. ద్వ. వి. (తెల్ల+మ్రాను.) కల్పవృక్షము. "క...ఈ, ఫులమ్రాను తెల్లమ్రా నన, తెలఁగును గల్పకసమాఖ్య చెప్పందికా." ఆం. భా. ప్ర. ౫౯.

తెల్లయిరుగుడు. ద్వ. వి. (తెల్ల+ఇరుగుడు.) శ్వేత పత్త్రము. (శ. ర.) [(శ. ర)

తెల్లయుప్పి. ద్వ. వి. (తెల్ల+ఉప్పి.) మా క్తికఫలశీ.

తెల్లయేనుఁగు. వై. వి. (తెల్ల+ఏనుఁగు.) ఐరావతము. "గీ. దైవతముదావళంబు చౌదంతి యనఁగఁ దెల్ల యేనుఁగు నాఁగను దేజరిల్లు." ఆం. భా. ప్ర. ౫౬.

తెల్లలొద్దుగు. వై. వి. (తెల్ల+లొద్దుగు. (శ. ర.)

తెల్లవట్టివేరు. ద్వ. వి. (తెల్ల+వట్టివేరు.) లామజ్జకము. శీ (శ. ర.)

తెల్లవస. వై. వి. (తెల్ల+వస.) హైమవతిశీ. (శ.ర.)

తెల్లవాఱు. ద్వ. అ. క్రి. (తెల్ల+వాఱు.) 1. తెల్లనగు. "క. శిర సెల్లఁ దెల్లవాఱెను, దరిమాగినతృష్ణ యొకఁడె కరుణకఁ బూాఁటెన్." భర్తృ. 3, ప్ర. ౮, దశా. 3, ఆ. ౧౦3; 2. ప్రుదియు. "సీ. కల్లబాసలచేతఁ దెల్లవాఱినచేతు లతిదిపాకసి శాఙ్గ మనుకరింప..." నిరం. ౨, ఆ. ౧౧౯. 3. ఉదయమగు. "ఉ. అద్దమరేయి భూ మినళశార్థము గుమ్మరి తెల్లవాఱినఁ, నిద్దురఁ జెందవచ్చు..." ఉ. రా. 2, ఆ. ౨3౦. నీలా. 3, ఆ. ౪౬; 4. సారహీనమగు, చెడిపోవు. (శ. ర. బ్రౌ.)

తెల్లవావిలి. ద్వ. వి (తెల్ల+వావిలి.) శ్వేతసురస శీ. (శ. ర)

తెల్లసవరము. వై. వి. (తెల్ల+సవరము.) వింజామరు. "గీ. బాలఁ తొకతె తెల్లసవరంబుఁ బూని విసరు." అప్ప. ౫, ఆ. ౧౧.

తెల్లావలు. ద్వ వి. బ. (తెల్ల+ఆవలు.) సిద్ధార్థముశీ (శ. ర.)

తెల్లుప్పి. ద్వ. వి. (తెల్ల+ఉప్పి.) మా క్తికఫలశీ. "సీ. తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన ముప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్పు." వాంగ. ౪, ఆ. ౧౧.

తెల్వి=తెలివి. 1. (వివేకము.) "చ. చెలువము విద్దెయుం గొనముఁ జేవయుఁ బ్రోడతనంబుఁ దెల్వియున్." నీలా. ౧౯౨; 2. (వికాసము) "చ ..సువర్ణబాధ మృదుభావవిశేషముఁ లొప్పు దెల్వులన్ నరి యగు రత్నపుత్త్రికయుం నక్కవికావ్యము నొక్క రూపమై." కు. సం. ౧, ఆ. 3౭; 3. (కాంతి) "మ. కుముదంబుల్ వికసించఁ గోకములు సంతోచింపఁ గామివ్రజా, శిమనంబుల్ దిలకింప నద్దెసలఁ దెల్విం జెంది రాజిలు ..." బిల్హ. ౨, ఆ. ౭౫.

తెల్విపడు=తెలివిపడు. (స్పష్టమగు). "క...ఆతఁడు వాక్య సెయిుంగనియది లేదీ, యనుభావము చూడ నడుగు మది తెల్విపడన్." కళా. ౫, ఆ. ౮౭.

తెల్వు=తెలివు (కాంతి.) "చ ..వా, తెఱగును దీనితూననము తెల్వుఁ గరంబు మనోహరంబు.." భార. ఆది. 8, ఆ. 83.

తెవ. దే. వి. సమూహము. "సీ. సొంపారు తెలిముత్తి యంపు జొంపపుటెల్లి తెవలు నిద్దంపుఁబురువులు గాఁగ." అచ్చ. బాల. ౧౯౦. (శ. ర. పా.)

తెవడు. దే స. క్రి. తిరస్కరించు. "సీ. నీలోత్పల చ్ఛాయఁ బోలుమైచాయము నవపద్మదళములఁ దెవడుమెఱుఁగుఁ, గనుఁదోయి..." భార. అశ్వ. ౬, ఆ. ౪౬.

తెవులు. దే. వి. వ్యాధి. "గీ. తెవులుగొనియున్న మృగములఁ దివిరి యేయ." భార. ఆది. ౫, ఆ. ౫3, అచ్చ. బాల. ౧౧.

తెవులుగొంటు. దే. విశే. (తెవులు+గొంటు.) వ్యాధిగ్రస్తుడు; వ్యాధిగ్రస్తురాలు; వ్యాధిగ్రస్తము. "సీ. తెవులుగొంటులకైనఁ దేర్పుదంకటము." భార. విరా. ౧, ఆ. ౧౦౧. భో. ౬, ఆ. 33.

తెవులుగొట్టు = తెవులుగొంటు. (తెవులు+గొట్టు) "సీ. తెవులుగొట్టోవయను దీరిన మేనిదో రాజ మాలినదియొ బీఱగొట్టో." చెన్న. ౪, ఆ. 3౯.

తెవులుగొను. దే. అ. క్రి. (తెవులు+కొను.) వ్యాధి నొందు. "గీ. బఱవ నోటఁ యున్న మైముఱిచి కొంటెఁ, దెగఁగె యున్నను బ్రసవింప మొదల

యఁన్నఁ, దెవులుగొనియున్న మృగములఁ దివిరి యేయ, తఱచి యాహారముగ మనుచుందు రయిన." భార. ఆది. ౫, ఆ ౫౩, శుక. ౯, ఆ. ౫౫౫.

తెవులుపడు. ద్వి. అ. క్రి. (తెవులు+పడు) వ్యాధి నొందు. "వ. కొందఱుకులటలు పలిదురవస్థఁ బొందినఁ దెవులుపడిన శృంఖలాబద్ధం బైనను బరిత్యజింతురు..." కాశీ. ౨, ఆ ౭౯.

తెవుళ్లపడు = తెవులుపడు. "గీ. విశ్వసించిన నీరు ద్రావినను నిద్ర,వోయినను జూటకొన్నను బొర్లు చున్నఁ,దెవుళ్లవడ్డను గుండెైన దిట్టచెడినఁ,జంపఁ దనుకంప కొట్టిహింస్రుండు సైన." కాశీ.౪.ఆ ౬౦.

తెవుళ్లగొంటు = తెవులుగొంటు. విజ్ఞా. ప్రా. కాం. ౧౬.

## తే

తేంకణము. సం. అ. పు. దేశవిశేషము. "గీ. తేంక ణాంధ్రకళింగాది దేశములకు" సాచి. ౨. ఆ. ౧౬౮.

తేఁకు. దే. వి. (క. తేకు, తేంగు. త. తేక్కు.) క్రకచపత్త్రము౯. (శ. ర.)

తేఁకువ. దే. వి. (తేఁగు ధా.) 1. స్థైర్యము. "క. తేఁకువ యలరఁగ వీగలిఁ,దోఁకొని చని చగల రక్ష ణోరణపుం త్తుల్, ప్రాఁకెడుఘనగృహముల న,మ్మూఁకల విడియించె రాజముఖ్యం డంతన్." భో. ౪, ౯౪; 2. భా. రా. యు. ౯౧౮. సందేహము. "ఉ. అల్లన నింతి యిట్లనియె నారసి వాసవుకల్మి లేమియుం, దల్లముగా నెఱింగికొని తేఁకువ లేకిట వచ్చుటొప్పు బా,యఁల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె .." భార. ఉద్యో. ౧, ఆ. ౧౬౫; 3. భయము. "సీ. భుజబలవిక్రమంబుల ఘనుండు,గురుఁ డట్టివానిఁ దేఁకువ లేక కదిసి కే పాంచాలురు..." భార. ద్రో. ౧, ఆ. ౯౦. భార. ౧, ఆ. ౪౯. భార. ద్రో. ౧, ఆ. ౨౮౩; 4. వివేకము, యుక్తాయుక్తజ్ఞానము. "క. వీఁకకొలఁ గ్రిడికొడుకుం, డాఁకఁగ నీకొడుకు కలఁచి కటిమి కవిసెఁ జే,రఁకలితో నున్నవారిందే,దేఁకువ సెడి చేరుకరిగెం గురు ముఖ్యా." భార. ద్రో. ౨, ఆ. ౧౯. భార. ద్రో. ౪, ఆ. ౨౫౯; ౫. మర్యాద, గౌరవము. "సీ. బోఁటికిఁ దోఁచినఁ బోలియుఁ దేఁకువ యను పొడమనఁ దెయ్యంబు పిడుకఁగ... గీ...జార బొందు బ్రాహ్మణుని కింపుసేయమి..." భార. విరా. ౨, ఆ. ౭౦. భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౭; 6. గర్వము. "ఉ. మున్నడిరైయ యమూరుఁడున్, ధీరత మీఱ నయ్యెరుల తేఁకువ మాన్చి .." కృ. శత. ౩, ఆ. ౫౬; 7. భేదము. "ఉ. అసమయం బున న్మగనియాంద్రురు కన్యలు నాక చొచ్చి ధా.త్రీసురరాజవైశ్యులను దేఁకువ సేయక రొల్ల జాతులుం, గాసిగ నొక్క పెట్టుగఁ బ్రకాశరమాన్య విభేదహీనుఁడై, యాసురవైరి పట్టెఁ గెలు లద్దము లేక మృగాయతాక్షులన్." నిర్వ. ౫, ఆ. ౯౪; 8. సంతోషము. "క. అఁకొన్న వారి రమ్మని తేఁకువ నన్నమిడువాఁడె దేవుఁడు..." ఉ. రా. ౭, ఆ. ౩౦౨. భా. రా. బాల. ౨౧౨; 9. సంకల్పము. "క. దితిజాను దఱిమి మఱియును, దితిజకులము పీఁచమడఁచు తేఁకువ మదిఁ బూనిలి కేని మమ్ము నేలుట, నతమగు..." హరి. పూ. ౪, ఆ. ౩౧; 10. బింకము. "గీ. తరుణిపొందు, వడయఁ గీడ్పడి తేఁకువ వాసఁ దలఁచు." కు. సం. ౫, ఆ. ౪౫. కు. సం. ౯, ఆ. ౧౪౫; 11. తృప్తి. "క. ఆపాపలవిహరణములు, దీపులు పుట్టింప మరగి తేఁకువ లేకాఁగోపాలకులం మఱ్ఱువ,సేయములును మఱచి యుండి రీక్షణపరలై." భాగ. ౧౦, స్కం. పూ. ౨౯౯; 12. పరిపూర్ణత. "క. అఁకలి గాదో భక్తిం, జేఁకువ గలవాఁడఁ గానొ తినవేల కృపన్." కాశీ. ౩, ఆ. ౯౯; 13 విధము. "వ...గగన పదంబు జొగిపడిన మిక్కుటంపుఁదోఁకచుక్క తేఁకువ మరకతంపుటుప్పరిగ కొణిగ దప్పి యుఁఱుకుబకదా కి పారువామిఁటారిలీరున..." చం. రా. ౩, ఆ. ౨౫; 14. ప్రసిద్ధి. "క. బలవిక్రమములఁ గడు మిక్కిలి తేఁకువ గలవు నీవు కినిసిన సురరం, గలరె నిలింపులు..." హరి. ఉ. ౧౦, ఆ. ౧౫

తేఁగు. దే అ. క్రి. (క. తేంగు.) వణఁకు. "ద్వి. పీఁగుచుఁ బూఁదేఁకఁ దోఁగుచుఁ జలికిఁ,దేఁగుచు నొదలఁ, గ్రాగుచుఁ బ్రియుల,కాఁగుచు మదిఁ జెల రేఁగుచుఁ బ్రీతి." పండితా. పర్వ. ౩౫౨.

తేఁకొట్టు. దే. వి. నారికేళము౯. (శ. ర.)

తేఁటి. దే. వి. తుమ్మెద, భ్రమరము. "గీ. వీల ప్రేలెడు తేటి యుంతేటికలుగ,సంశ్రితల సన్నగాలి పొలా సన్నగాలి, చెల్లునే రోపరవ మింక చిలుకఁ జిలుక, సొరఁ గుందింపఁ జందమా చందమామ." రామా. ౬, ఆ. ౨౫. అం. భా. ద్వి. ౯౫.

తేటికంటి. దే. వి. (తేటి+కన్ను+ఇ.) నల్లనికను ఱెప్పలు గలిగి యందమైన-స్త్రీ. "గీ. శ్రుతిపుటా ములకమృతంబుపోసి తెరఁగ, మానసాంభోజమధు నవమాకరంద మాధురులఁ దేల నీవేళ సాధురీతిఁ, దేటగీతి వచింపవే తేటికంటి." కాళిందీ. ౬, ఆ. ౧౦౩.

తేడు. దే. అ. క్రి. పండుకొను "గీ. అతివ పూర్ణేందుభీతిఁ దదళ్ళకాలఁ,జేఁడి యతఁ డంద వినుమడితీండ్రఁ దోఁకుమింటిపై నంట కా దని యుఁటిపైకిఁ, దెచ్చుకొంటి నటంచు పెక్కతిచ్చ పెడలు." ఆము. ౫ ఆ. ౧౧౬. ('తెండి' పాఠాం తరము.) కకు. ౫, ఆ. ౧౨౩.

తేగ. దే. వి తాటిటెంకనుండి బయలుదేఱి భక్ష్య పదార్థముగా నుపయోగపడు మొలక, (శ. ర. వా.)

తేగడ దే. విశే. (క. తేయ్‍గడై.) అఱిగినది. (నాణెము. శ. ర.)

తేగము. వై. వి. (సం. త్యాగః.) దానము. "సీ .. దానమాఁ బాగము పెట్టొనఁ గీగి యూ౨. గీ. పుడుకురింత పుడిగ తేగము పుడు కనఁగ." ఆం. భా. ద్వి. ౧౬౨ వేంక. మాన. ౪౮.

తేగాకత్తి. దృ. వి. (హిం. తేఘా.) చురకత్తి. (శ. ర.)

తేగుడు. దే. వి. చొల్లు. "సీ. నోరు తేగుడు గాఱ నారివేరము మీఱ సాఁకఁ బయ్యెద జాఱి యొరఁ జేర." చంద్ర. వి. ౩, ఆ. ౧౪౬.

తేజకము. సం. వి. అ. పుం. కాకివెదురు. శ. ర.)

తేజనము. సం. వి. అ. పుం. 1. వెదురు; 2. ఱెల్లు. న. 1. సానఁబట్టుట, వాఁడిచేయుట; 2. మెఱుఁగు పెట్టుట; 3. జ్వలింపఁజేయుట, రగులుకొలుపుట.

తేజని. సం. వి. ఈ. స్త్రీ. 1. చాఁగ; 2. మాచేరు.

తేజపత్రము. సం. వి. అ న. ఆకుపత్రి.

తేజము. సం. = తేజస్సు.

తేజరిలు = తేజరిల్లు. 1. (ప్రసిద్ధినొందు.) "సీ. అధిక పుణ్యప్రాప్య మైనగంధర్వజాలిని సముద్భవ మంది తేజరిలు." కళా. ౫, అ. ౧౦౪; 2. (వర్ధిల్లు.) "క... పుత్రోత్సవ మింపొనరంగఁ జేసి సూతక, దినములు వెడలించె మునము తేజరిలంగన్." సా. ౧, అ. ౪౧.

తేజరిల్లు. వై. అ. క్రి. 1. ప్రకాశించు, జ్వలించు. "సీ. త్రేతాగ్ని తెల్లను తేజరిల్లమిం జేసి క్రతు కృత్యములు నిర్విఘ్నముగ లయ్యె." భార. ఆది. ౧, అ. ౧౪౧. హరి. ఉ. ౧౦, అ. ౪౯; 2. ప్రసిద్ధి నొందు. "శా...చతుర్వక్త్రయునక్తంబునన్, నాకంబొందక తేజరిల్లె నకలాన్నత్వంబు సూచించుచున్, గాశిపట్టణమై ధవంబు .." దశా. ౧, ఆ. ౧౯౩. భార. శాం. ౫, ఆ. ౩౪౫.

తేజస్వతి. సం. వి. ఈ. స్త్రీ. 1. గజపిప్పలి; 2. చవికె; 3. పెద్దమాచేరు. విశే. (త్. స్వతీ. త్.) తేజస్సు గలది

తేజస్విని. సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దమాచేరు; 2. మాచేరు. విశే. (న్. నీ. న్.) తేజస్సు గలది.

తేజస్సు. సం. వి. స్. న. 1. ప్రకాశము; 2. ప్రభుశక్తి, ప్రభావము. 3. పరాక్రమము; 4 రేతస్సు; 5. బలము 6. శరీరకాంతి; 7. నవనీతము; 8. అగ్ని; 9. బంగారు; 10. దిట్టతనము; 11. శక్తి; 12. నీరు; 13. అన్నము; 14. ధర్మము; 15. చైతన్యము; 16. నాయకగుణములలో నొకటి; 17. మజ్జ; 18. పిత్తధాతువు అ. పుం 1. కాంతి; 2. వాఁడి.

తేజి. దే వి. (క. తేజి. త. తేసి.) 1. గుఱ్ఱము. "క. అపురితేజుల వేగ, వ్యాపారము గెలువ నోప మనసివ్విలిఁ బో చాపలవిరహితశౌఖ్యం, బాపాదిందుకొను మానవాహకిమనముల్." కాశీ. ౧, ఆ. ౨౬. వసు. ౫, ఆ. ౬; 2. మంచిజాతిగుఱ్ఱము. "ఉ. కోమటు లెల్ల నర్థపులు గుఱ్ఱము లెల్లను దేజులప్పురిన్." విక్ర. ౧, ఆ. ౯౯; 3. కవచము తొడిగిన గుఱ్ఱము. "సీ. తేజి నా నున్నకవాజియై విల సిల్లు .."ఆం. భా. ద్వి. ౧౯౭.

తేజిలు. వై. అ. క్రి. ప్రకాశించు, ఒప్పు. "ఉ. అంగుళులే దళంబులు నఖాళులు కేసరముల్ పద ప్రపీ, ఠాంగణసప్రదేవమకుటాంచితనీలమణీరుచుల్ చలద్భృంగములై చెలంగఁ గడుఁ దేజిలు కారిపదాబ్జముల్ ..." కాళిందీ. ౧, ఆ. ౧౯౨.

తేజిష్ఠము. సం. విశే. (ఇ. ఆ అ.) మిక్కిలితేజస్సు కలది. "గీ . అద్దనుజవరుని,తనువునందుండి తేజిష్ఠ తనువిలాసుఁ, డైనపురుషుండు వెడలిన నతఁడు సూచి." భార. శాం. ౩, ఆ. ౧౪౧.

తేజీ-తేజి. 1. (గుఱ్ఱము, వాహనము). "సీ. సురకిరీట ములను చుచుపదంబు లై తేయవాజి తేజీమెంటు నడవ నేర్పు." దశా. ౨, అ. ౧౧౨, హీలా. ౧, ఆ. ౩౨; 2. (మంచిజాతిగుఱ్ఱము). "క. అట్టినికి

నిప్పు ధాత్రీవల్లభుఁడసురక్తి నమరవల్లభుఁడాంరితో, నల్లనమాడం జాలెదు, తెల్లనియొకక్కత్తలాని తేజి కాయమున్." శైవ. ౬, ఆ. ౯౬. రాజ. చ. 3, ఆ. ౧౦౪.

తేజు. వై. వి. (సం. తేజః.) 1. శోభ ప్రకాశము. "క. జేజేరాజారాజా,గాజిగి జోరీ జగడి జగడఁ గాఁ జాలెదు మేల్, తే జా కీడుకత్తిక గల,జేజేక మొగిలుదారిసిగ జేజేకున్." అచ్చ. బాల. ౨౬, నీలా. ౧, ఆ. ౨3; 2. శూరత్వము. "గీ. వెలయ విరుదచ్చిరాదే జాబిలులలోన, మిక్కుటం బగు తేజాన మెఱసినాఁడ." అచ్చ. బాల. ౧౦౧, అచ్చ. యు. ౫౯; 3. ప్రభావము, మహిమ. "ఉ. అజని తేజా గల్గి యుల రారెదునయ్యేకిమీఁదు .." అచ్చ. బాల. ౧౯౬.

తేజేమాలు. వై. వి. (హిం. తేజ్.) వాఁడి. (చూ. తేజామాల్సేయు.)

తేజేమాల్సేయు. ద్వ. స. క్రి. (తేజామాలు+చేయు). పదను చేయు, వాఁడిచేయు. "సీ. మధువశంబున తేజామాల్సేయ మరుఁ డుంచు నవిరహాస్త్రరక్త శస్త్రచయము మెయి." ఉ. రా. ౬, ఆ. ౬.

తేజోమంథము. సం. వి అ. పుం. చిఱుకొల్లి.

తేజోవృక్షము. సం. వి. అ. పుం. క్షుద్రాగ్నిమంథము.

తేట. దే. వి. (తేఱు ధా. క. తిళి.,త. తేట్టై.) 1. మడ్డిగ లోనగు ద్రవపదార్థమునం దలి తేఱిన ప్రశస్తాంశము. "సీ. అలివలిన్నవిమాట లమృతంపు తేటలు ." విక్ర. ౧, ఆ. ౧౧౯. పిఙ. ౧, ఆ. ౧౪౯; 2. నైర్మల్యము. "సీ. కలికిరాయంచ ఱెక్కలమించు తెలిచాయ తెరలతేటయుం గుఱుతెఱుఁగ రాదు." ఉ. రా. ౫, ఆ. ౨౦౭. నరస. ౧, ఆ. ౬౫; 3. ప్రసన్నత "క. హరిభక్తులతో మాటలు ధర కొన్నఁడుఁ జెడనిపుణ్యధనముల మూటల్, వరముక్తికాంత తేటలు, నరివర్గంబు పోరని యరు దగుకోటల్." భాగ. ౬, స్కం. ౧౫3; 4. వికాసము. "చ. చనుఁగవయొప్పు కన్నడు మునొన్న దనంబు మెఱుంగు లీను మోము,మునుఁ గల తేట కన్నదల మాద్దును, మాటలనేర్పు..." శుక. ౨, ఆ. ౫౫౧; 5. రీతి,విధము. "సీ. అర్థచంద్రుని తేట నవఘళించులలాటకట్టిఁ దీర్చినగంగ పట్టితోఁడ." స్వా. 3, ఆ. ౭౧, శైవ. ౭, ఆ. ౧౪౬. విణ. 1. నిర్మలము. "గీ. జలజదళములఁ దేటలుఁ జవులు సైన్యయంబుకణములు వాలిచెఁ బద్మాకరములు." ఆము. ౪, ఆ. ౧౪౬, స్వా. ౪, ఆ. ౬౦; 2. విస్పష్టము. "శా...విశిష్టాద్వైతంబును దేటగాఁ దెలుపు మాటాడెన్ ప్రమాణంబులన్." ఆము. 3, ఆ. ౯, నీలా. 3, ఆ. ౫౧; 4. మనోహరము. "గీ. తేనియలసోన వెదచల్లు తేటమాట, కలికి యమృతంబుమండలో నడఁచి యుండె,నేల యిటువంటివెల్ల మా కేలతాంగి, యబ్బినను జాలు నని రెంచి రసురు లపుడు." దశా. ౨, ఆ. 3౦౨.

తేటగీతి. ద్వ. వి. (తేట+గీతి). పద్యభేదము. "ఆ. సూర్యుఁ డొకఁడు మీఁద సురరాజు లిద్దఱుదిన కరద్వయంబు తేటగీతి." కవిజనా. జాతి. ౨3.

తేటగొను. దే. అ. క్రి. (తేట+కొను.) స్పష్టమగు. "గీ. తేటగొనఁ జాడు మీశానుదిక్కునందు, బ్రాహ్మణోత్తమ రుద్రులు పారిషదులు." కాశీ. ౪, ఆ. ౧౬౫.

తేటచేలకులు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ... గుఱ్ఱపుబొఁకలు తేటచేలము లూఁదుఘుటికలు గాజుకడియములు..." ప్రబంధ. ౧౧౨.

తేటతెనుఁగు. ద్వ. వి. (తేట+తెనుఁగు). జానుఁ దెనుఁగు, మృదుమధుర మగు తెనుఁగు. "సీ... సురాభాండేశ్వరం బను,పుణ్యచరిత్రంబు భూరి మహిమ. గీ. నట్టికథ దేటతెనుఁగున నతులమృదుల, సరసమాధుర్యవాక్యము ల్పంఘటించి... విన్నవింతు." సురా. ౧, ఆ. ౭. "ద్వి. తేటదెనుంగున ద్విపద రచింతు." పండితా. దీక్షా. ౧౦,పా. ౧,పుం.

తేటతెల్ల. ద్వ. విణ. (తేట+తెల్ల.) విస్పష్టము. "సీ. అది తేటతెల్లగా నమగంగఁ దలఁచి లక్షాసాధ్వసంబులు సందడింప." కాశీ. 3, ఆ. ౬౨, అహ. ౪, ఆ. ౧3౪.

తేటతెల్లమి. ద్వ. విణ. (తేట+తెల్లమి.) విస్పష్టము. "ఆ. నిన్ను నొవ్వఁ బలికి నీచేఁ బ్రమాణంబు, గొనియెఁ గాని నమ్మకునికిఁ గాదు, తల్లి నీవు తేట తెల్లమి సేసితి,మనమునందు నలవిఁ గినియ వలదు." భా. రా. యు. ౨౪33, పా. 3, ఆ. ౧౦3.

తేటతెల్లము. ద్వ విణ. (తేట+తెల్లము.) విస్పష్టము. "గీ. దీనికొలంది యేపాటిదో దేవరకును,దెలియఁ బరికించితిర తేటతెల్లముగను." కళా. ౭, ఆ. ౧౯౭. పరాశ. ౪, ఆ. ౭.

తేటపడు. ద్వ. అ. క్రి. (తేట+పడు.) స్పష్టమగు. "ఉ. అట్టికట్టి యనిలుపట్టిచే విరథుఁడై, పోయి పోయినట్లు పోరెం గాని, మరలి కయ్యమునకుఁ జొరఁ డెట్టు లాతని, తెలుఁగు నెవ్వ నాకుఁ దేట పడఁగ." భార. ద్రో. ౪, ఆ. ౧౭౪. మను. ౨, ఆ. ౭౬.

తేటపఱుచు. ద్వ. స. క్రి. (తేటపడు ధా. ప్రే.) స్పష్టముచేయు. "ఉ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన, విబుధ జనులవలన విన్నంత కన్నంత, దెలియవచ్చినంత దేటపఱుతు." భాగ. పీఠి. ౧౮. భార. కల్యా. ౨, ఆ. ౩౯౫.

తేటిక. దే. వి. తెప్ప, ప్లవము. "సీ. తేప నాఁ దెప్ప నాఁ దేటిక యనఁ గను, ప్లవనామధేయంబు పరఁగు చుండు." ఆం. భా. ప్ర. ౧౫౭.

తేడా. దే. వి. 1. భేదము, తారతమ్యము. (వా.); 2. వెచ్చు. (శ. ర.)

తేది. వై. వి. (సం. తిథిః.) దినము. (శ. ర. బ్రౌ.)

తేదీ=తేది. (వా.)

తేనియ. దే. వి. (త. తేన్.) మధువు. "ఉ .. తేనియఁ బఱ్ఱయాఁకకతి ధీరతఁ గోల్పడి బిట్టు చొక్కి లెన్." ఎశ. ౬, ఆ. ౩౦, పాండు. ౨ ఆ. ౧౦౮.

తేనియదిండి. దే. వి. (తేనియ+తిండి.) తుమ్మెద, మధుపము. "సీ. ముఖ మంబురుహ మని ముమ్ము రంబుగ నప్పళించు తేనియదిండి కెంక లనఁగ." పాండు. 3, ఆ. ౨౦౧.

తేనీఁగ. దే. వి. (తేన+ఈఁగ.) మధుమక్షిక, సరఘ. "సీ...మధుమక్షిక తేనీఁగ జుంటీగ నా నెసంగు." ఆం. భా. ద్వి. ౯౫.

తేనె=తేనియ. "గీ. తెవుటఁ దియ్యనితమ్మిపూఁదేనెఁ గ్రోలు." సైవ. ౨, ఆ. ౫.

తేనెదిండి=తేనియదిండి. "క. ఇలఁ దనను కేతంబున, నిలిపినఁదద మెంచి చూడ నేయూర్థం బౌ, లలు తేనెదిండిగమి నగు, నలసాగరకర్ణయాన యలక లనంగన్." నరస. ౪, ఆ. ౩.

తేనెగద్ద. ద్వ. వి. (తేనె+గద్ద.) పక్షివిశేషము. (శ. ర. బ్రౌ.)

తేనెగాపే. ద్వ. వి. (తేనె+గాపే.) కాచవలయు విశే షము. (శ. ర.)

తేనెటీఁగ=తేనీఁగ. (వా.)

తేనెతల. దే. వి. (తేనె+తల.) తేనెపట్టు! (చూ. తేనెతలపడు.)

తేనెతలపడు. ద్వ. అ. క్రి. (తేనె+తలపడు.) అత్యధికమగు. "గీ. తేనెతలపడఁ బండె ధాత్రీతలంబు, పొదలి ధారణ పోఁకతోఁ బుట్టెఁ దయ్యెనన్ని వంకల దుర్భిక్ష మడఁగిపోయెఁ, బ్రస్తుతింపఁగ దగురామరాజ్యమునను." జై. ౬, ఆ. ౯. (తేనె పట్టున కాద తెలిసి తేటుండ ఈఁగలు కట్టినట్లు భూమియంతయుఁ బుష్కలముగఁ బండె నని భావము.)

తేనెతొన. దే. వి. (తేనె+తొన.) భక్ష్యవిశేషము. "గీ. తోఁచు మధుపూరితము తేనెతొన యనంగ, భక్ష్యభేదాహ్వయంబులు పార్వతీశ." ఆం. భా. ద్వి. ౨౫౬.

తేనెతొల. దే. వి. (తేనె+తొల.) శీ. భక్ష్యవిశేషము. "సీ. కలవంటకములు బూరెలఁ దేనెతొలలు చాపట్లు మండెంగ లొబ్బట్లు వడలు." కళా. ౩, ఆ. ౭౧. బ. ధాన్యవిశేషము. "వ...కందర్ప భోగులు గజవిలాగీలు కొండడీలు పుసుఁగుఁ దావులు తేనెతొలలు మోహనాలు..." ప్రబంధ. ౧౧౨.

తేనెదానిమ్మ. ద్వ. వి. (తేనె+దానిమ్మ.) తియ్య దానిమ్మశీ. (శ. ర.)

తేనెనీరు. ద్వ. వి. (తేనె+నీరు.) పలుచని తేనె. "చ...పుష్పోదుల్, ననలఁ బొనంగుక ప్రపుట నంటిరవ గ్లాని పూపుఁదేనె నీరుఁగఁ బదనిచ్చి పన్నముఁగ గ్రొన్నెలవామముఁ దీర్చి మున్ను గాన్." చను. ౧, ఆ. ౭౬.

తేనెపట్టు. దే. వి. (తేనె+పట్టు.) మధుకోశము.(వా.)

తేనెపనస. ద్వ. వి. (తేనె+పనస.) తియ్యనితొనలు గలపనసశీ. (బ్రౌ. వా.)

తేనెపెర. దే. వి. (తేనె+పెర.) మధుకోశము. "గీ. దొరయుమధుమక్షికలపిఁకఁ బరులు దాఁకఁ, దేనె పెరదాది మధుపైరి కానిపించెఁ" ఉ. రా. ౨, ఆ. ౫౦, దశా. ౪, ఆ. ౩౦.

తేప. దే. వి. 1. ప్లవము, నదులు మొదలైనవానిని దాటుటకు తేలిక యైనకఱ్ఱలతో నిర్మించినసాధనము. "సీ. తేప నాఁ దెప్ప నాఁ దేటిక యనఁ గను ప్లవనామధేయంబు పరఁగుచుండు." ఆం.

భా. ద్ర. ౧౧౪; 2. శరణోపాయము. (బసవఁడు.) "ద్వి. సత్యంబుకలను ప్రసాదంబుకోలను, కృత్యంబులానుయకృత్యాధి తేప" బస. ౨, ఆ. ౩౨, పు. ౧౦, సం. భార. అర ౪, ఆ. ౨౪౩; 3 విమోచనోపాయము. "ద్వి. రూపించి నీతోఁడఁ గోపించినట్టి, యాపాతకమునకుఁ దేప తా శుద్ధి." పండితా. పురా. ౧౮౨, పు. 4. తడవ, పర్యాయము. "క. భావమునఁ దలఁచునర్థము, నీవే చెప్పితివి తిరుగ నే నది చెప్పఁగా నెలెకా పని లేదయినా, నిటు పొంక తేప యది ఘనంబా నీకున్." పార్వ. ౨, ఆ. ౧౩౮. (దీనియామ్రేడితరూపము తేపతేప) "గీ. తేప మీఱఁగఁ దల్పంబు డిగ్గి డిగ్గి, తేపతేపకు నిట్టట్టుఁ దిరిగి తిరిగి.—" కృ. శకుం. 3, ఆ. ౫.

తేమ. వై. వి. (సం. తేమః.) తడి. "ఉ. ఇక్కడఁ గూరుచుండుటల కేరలె పెద్దలు లేచి రండు మీ, రొక్కరు వంటశాల కడుయోగ్యము మీ కది తేమ లేమి యీ, ముక్కలిపీటమీఁది యది మూర్ఖులచోటిటమే లటంచు స, ద్వాక్కులసక్కులాధికులవై దిశలం దగుచోట నుంచినన్" పాంచాలీ. ౪, ఆ. ౪౧, చంద్రా. ౨, ఆ. ౧౧. విశే. తడి గలది, ఆర్ద్రము. వ్యవ-నేల మిక్కిలి తేమగా నున్నది.

తేమగిల్లు. వై. అ. క్రి. తడిగల దగు, ఆర్ద్రమగు. (శ. ర.)

తేమనము. సం. వి. అ. న. 1. తడి; 2. తడుపుట; 3. మజ్జిగపులుసు. (శ. ర.)

తేమని. సం. వి. ఈ. స్త్రీ. ప్రొయ్యి.

తేమము. సం. వి. అ. పుం. తడియుంట.

తేమయెక్కు. ద్వ. అ. క్రి. (తేమ+ఎక్కు.) ఆర్ద్రమగు. "ఉ. నీటను దేమ యెక్కి నసి నిల్చి యొకించుక వాఁడుదేఱి..." విప్ర. ౨, ఆ. ౨౩.

తేమానము. దే. వి. (క. తేమాన. త. తేయ్మాన.) 1. వడ్డీ; "సీ. వడ్డి తేమాన మనఁగను వఱలు వృద్ధి." ఆం. భా. ద్వి. ౨౭౮, 2. ఆలస్యము. "క. మామా యిన్నియుఁ దెచ్చితి, తేమాన మిదేల పేగు దీపము వలదా, యామఁదము దెమ్ము పొమ్మన, సామందవిచారుఁ డప్పు డంగడి కరిగెన్." శుక. 3, ఆ. ౧౯౦, కళా. ౫, ఆ. ౧౪౪.

తేమ్రాను. దే. వి. నారికేళము. (శ. ర.)

తేయాకు. అన్య. దే. వి. (ఫ్రెంచి. తే.) టీఆకు (బ్రా.)

తేయు. దే. అ. క్రి. (త. తేయ్.) అఱుగు. (శ. ర)

తేర. దే. వి. 1. దృష్టిశూన్యత. (చూ. తేరకొను. 'తేట.' అని శ. ర.); 2. సంబంధములేమి. విశే. అనాయాసముగా లభించినది. (చూ. తేరసొమ్ము.) క్రి. విశే. 1. వ్యర్థముగా. "శా... నానాసుఖో, పాంతం బైనవయోనిధాన మిది యత్యూర్య తేర యీపచ్చునే." భాగ. ౯ స్కం. ౫౫౧, నృసిం. ౨. ఆ. ౯౦; 2. అనాయాసముగా. "సీ. లక్ష్మణశత్రుఘ్నులకు సహాయుండవై చని తేర తురగ తస్కరులఁ బట్టి." జై. ౬, ఆ ౨౦౩.

తేరకత్తియ. ద్వ. విశే. (తేర+కత్తియ.) సంబంధము లేనిది, అన్యురాలు. (శ. ర.)

తేరకత్తె = తేరకత్తియ. "ఉ. మఱి వారలు వశ్యులై నఁ దా, రెవ్వరి నొల్ల కొక్కటయి యింద్రుఁడు చంద్రుఁ డటుండ్రు పోటి దా, నివ్వలఁ దేరకత్తె యగు." ఆము. ౫, ఆ. ౫౬.

తేరకాఁడు ద్వ. విశే. (తేర+కాఁడు.) 1. సంబంధము లేనివాఁడు, అన్యుఁడు. "క. ఉరుబాహాబలము గల్గియు, వెఱఁడివై తేరకానివిధమున నకటా, కరుణ యెదలోనఁ దలఁపక, దురమున జమువాత నిన్నుఁ ద్రోచితిఁ బుత్రా." భా. రా. యు. ౧౮౦౧; 2. నాతఁడు. "సీ. ఆతఁడు వేటకై యరిగినచో వజ్రి దిగ్భ్రాంతి పుట్టించి తేరకాఁడు, నచునట్లు సేయ..." భార అను. ౧, ఆ. ౨౮౪; 3. విటుఁడు. "చ... కటాక్షనీలమణిరోచు లొకా నొక తేరకానికిన్, మనసిజకేళి యొక్కయుంచ నాఘనసుం గలిగించి .." శుక. ౨, ఆ. ౧౨౬.

తేరకు. దే. క్రి. విశే. 1. వ్యర్థముగా. (శ. ర.) "క. క్రూరుండై శమనుఁ డుఱక, తేరకు మద్వీరభటులఁ దెగటార్చినయ, వైరి నికర్ణ దెగఁ జూచెద .." ఉ. రా. 3, ఆ. ౩౪౩; 2. అనాయాసముగా. (చూ. తేరకుఁదేర.)

తేరకుఁదేర. దే. క్రి. విశే. (తేరకున్+తేర.) 1. వ్యర్థముగా. "మ. సమ్మాధుండు పుండరీకనేత్రులనై సగ్గిక విధ్రుమంబులకుఁ జేతఃప్రీతిఁ గావించి దానలరున్ దేరకుఁదేరగా"...వల్లభా. కృం. ౮౪; 2. అనాయాసముగా. "మ. బళిరా తేరకుఁదేర దక్కె నిటు లీబంగారుకుం దాచుఁ జం,కలు దాఁటించుచు .." పాండు. 3, ఆ. ౬౪.

తేరకొను. దే. స. క్రి. (తేర+కొను.) తెప్పవేయకుండు, తేటిపాఱు. "చ. కని యతఁ డెవ్వఁ డంచు

నడుగం బ్రజ లయ్యెజనత్వునల్లుడం,చును దగఁ జెప్పఁగా నుతిక శ్రోత్రపుటంబులఁ జొన్ని తేరకోఁగనఁగొని కుంభిగాఁ దెలిసి..." భో. ౫, ఆ. ౧౭౭. నిర్వ. ౪, ఆ. ౮౫.

తేరదిండి. దే. వి (తేర+తిండి.) శ్రమలేకుండఁ గలిగిన యనుభవము. "మత్తకోకిల. ఓరి యెవ్వరిచేతు దున్నెద పూర నింతటిదాఁక మా, వార కెవ్వరు లేమిఁ జేసి యవారితం బయి చెల్లె నీ, తేరదిండి ..." పరమ. ౫, ఆ. ౩౦.

తేరమగఁడు. దే. వి. (తేర+మగఁడు.) అంకుమగఁడు, విటుఁడు. "ఆ. కాఁపురంబుచేసెఁ గలికి ముచ్చట దీఱ, మగని పీడి తేరమగనినింట." కవిరా. ౨, ఆ. ౩౭.

తేరసి. వై. వి. (సం. త్రయోదశీ. ప్రా. తేరసా.) త్రయోదశి. "సీ. బహుళపక్ష మపరాహ్ణ ముగ్మలి యమవస తేరసి నవమాద్యతిథులఁ దుష్టిఁ, విశ్వదేవతల కిచ్చు .." భార. అను. ౫, ఆ. ౯౦౨. సం. భార. అను. ౨౩౮. స. ౮.

తేరసులు. వై. వి. బ. పదముగ్గురు "చ. వసుమతిఁ జేరుకొన్నవరువత్తురు ముప్వురి హరిప్మలాట షోడ నులనుతుండ తేరసులదక్కినభృత్యుఁడ వీరలాదిగా, ఘనఁగు మహాపుభావులకు కల్ల ననర్గళ మైనభక్తి న్నవ్వసిగొని ప్రోవుమయ్య బసవా బసవా వృషాధిపా" వృ. శ. ౧౦౨.

తేరు. దే. అ. క్రి. 1. కలుగు. "సీ. తనరు చొక్కపురాణమునిదంపతులు దమకంబులు దేర నెయ్యంబు మీఱ ననిచిన..." రాఘవ. ౧, ఆ. ౯౦. నైష. ౭, ఆ. వి. ఔ. అనా. (క. తేరు త. తేర్.) 1. రథము. "క. సారథియుం రథి గూడై యొక, తేరం గృష్ణు లతిఘోర తేజస్స్ఫురస్స్ఫారతఁ దోఁచిన నైనను, ధీరత వాటించి చూచి తెలిసెదవు బళే.' భార. ఉద్యో. ౨ ఆ. ౧౫౨. ఆము. ౫, ఆ. ౧౦౧; 2. శకటము బండి. "క. మిన్నున కూరక పోయెదు, తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డే, చిన్నికుమారుఁడు తేశే, విన్నను వున పోగనె దీని విధ మెట్టిదియో." భాగ. ౧౦, స్కం. పూ. ౨౫౩.

తేరుకాఁడు. ద్వ. విణ. రథికుఁడు, రథమునందుండి యుద్ధముచేయువాఁడు. (శ. ర.)

తేరుపూన్పరి. దే. వి. (తేరు+పూన్పు+అరి.) సారథి. "చ...మాళ్ళతిట్టకుం,గుదు రగు తేరుపూన్పరియు ..." అచ్చ. అయో. ౧౧౭.

తేరుమామిడి. దే. వి. (తేరు+మామిడి.) ఒకరకపు మామిడిచెట్టు. "సీ. తేరుమామిళ్లను చేరేళ్లఁ గడుఁ జెల్వమై యుండి .." కు. సం. ౭, ఆ. ౯౬.

తేర్చు. దే. స. క్రి. (తేఱు ధా. ప్రే.) 1. (మూర్ఛనుండి.) తెల్చు, మనస్ప్రతికిఁదెచ్చు. "సీ. శోకాగ్ని దనికిన సొగయుం నీతమ్ముల సుకున్న వాక్యామృతోపయుంక్తిఁ, దేర్పుము..." భార. శాం. ౧౮౫. వసు. ౫, ఆ. ౬౯; 2. ప్రసన్నత నొందించు. "గీ. మది నొకానొకయెడ రోష మొదవెనేని,తేర్పు గలదూతి యొకరీతిఁ దీర్ప పలయు." శుక. ౧, ఆ. ౨౫౫, 3. ఊఱడించు, ఓదార్చు. "క...ధనంజయుఁ దప్వుదు,తనుఁ దాఁ దేర్చుకొని యెల్లతరుణుల నూరార్చె .." భార. మా. ౧౦౪. ఉ. రా. ౮, ఆ. ౨౩౩; 4. తృప్తి నొందించు. "క...సతిక్, మదనమహారాజ్యభోగ మహిమం దేర్చెక్." కళా. ౪, ఆ. ౧౦౦; 5. విభాగముచేయు. "వ ..వాల్మీకి ..రామాయణం బేనుకాండంబులు నేనూరుసర్గలు నిరువదినాలుగు వేల శ్లోకంబుగాఁ దేర్చి కావ్యంబుచేసె.' వి. పు. ౪, ఆ౭౧; 6. చంపు. "ఆ. ఖరునిఁ దేర్చె వాలిఁ గడవఁ బనిచె." అచ్చ. యు. ౧౧౬; 7. పోఁగొట్టు. "చ...మనంబుకలంకలు దేర్చి కారకాం,తల సమయస్థలంబులకు దర్చి దూతిక లట్టిపెక్కులన్." పారి. ౪, ఆ. ౫౭. రా. వి. ౩, ఆ. ౮౦; 8. నిర్మల మొనరించు. "చ...తారక లంబువుఁ దేర్చునే యనన్." ఆము. ౪, ఆ. ౧౧౬. పాం. ౨, ఆ. ౪౮, 9. బాగుచేయు, "సీ. తెవ్రలం గొంటులకైనఁ దేర్చు సంకటమున కోపిముందటి యట్ల రూపుసేయు." భార. విరా. ౧, ఆ. ౧౦౧.

తేఱి. దే. వి. (తేఱు ధా.) కాఁచితేర్చినసేయి. (శ. ర. బ్రా.)

తేఱికొను. దే. అ. క్రి. (తేఱు+కొను స్వార్థమున.) కనఁబడు. "చ. తెలినునుపోఁగవెన్నెలలఁ దేఱికొనం దననీడఁ జూచి మత్తిలి మధువాని చొక్కునరతిమణి యొక్కతె నీవు నింతకున్నెలి చలి చూడవే యనినఁ జేకొనమిం గని .." రామా. ౨, ఆ. ౯౯.

తేఱిచూచు. దే. స. క్రి. (తేఱి+చూచు.) పరికించు, చూచు. "గీ. గగనమధ్యంబునకు వచ్చి ఖరకరుండు, దేఱిచూడంగరాక యుద్దీప్తుఁ డగుచు." భార. ద్రో. ౧, ఆ. ౧౪౮. భార. విరా. ౫, ఆ. ౮.

తేఱిచూపు. దే. వి. (తేఱిచూచు ధా.) ఱెప్పవేయక చూచుట. "ఉ. జాకెలు తేఱిచూపు లెకసక్కె-ములన్..." భాగ. ౧౦, స్కం. ఉ. ౨౬౫.

తేఱు. దే. అ. క్రి. (క. తేఱు.) 1. కలుగు. "ఉ .. పోయగంబుపైఁ, దేఱఁగఁ బ్రౌఢదంపతుల తీరునఁ జెంపెకలారి రిద్దఱున్." హరి. ఉ. ౭, ఆ. ౧౮౨. స్వా. ౪, ఆ. ౧౬; 2. కనఁబడు. "ఉ ఊసర వెల్లివందమున నొక్కట బీఱనగాలు దేఱఁగా" స్వా. ౪, ఆ. ౭౯. ఇందు. ౪, ఆ. ౯; 3. (మూర్ఛాభిద్రాదులనుండి) లేచు, తెప్పిఱిల్లు. "క. తేఱుదురు రిపుల నిప్పుడ, మీఱుదురును గడిఁది మూర్ఛ మెయి నిట్లున్నా,రాఱని తేజంబులతో, నీఱుకయుం గవిసి యున్న నిప్పులఁ బోలెన్." భా. రా. యు. ౫౯౨. భార. ఆది. ౨, ఆ. ౧౫౪; 4. నిర్మలమగు. "క. తేఱెం గొలకులు కేళడి, యూఱె మహీతలము .." కు. సం. ౬, ఆ. ౨౧౪. ద్వా. ౭, ఆ. ౮౯; 5. ప్రసన్నతనొందు. "క. అనిన సుదేష్ణయుఁ దత్పరిజనములు వెఱఁ బొంది యొసఁగి సాంత్వనములు సెప్పినఁ దేఱిన మజ్జనభో, జనములకుం జొచ్చె ద్రుపదసంభవ యొట్టున్." భార. విరా. ౨, ఆ. ౧౬౨; 6. వీడు, త్యజించు. "ఉ... దైవమె యిట్లు సేసిన, ద్విన్నఁదనంబుఁ జెందఁదగునే వగపేటికిఁ బామరుండవె,యున్నఁ గలంకఁ దేఱె నటఁ దర్కు-కులేశ్వర వారిమాటలన్" ఉ. రా. ౨, ఆ. ౭౦౮. స్వా. ౩, ఆ. ౨౩; 7. తృప్తినొందు. "గీ... వాతెఱచవులఁ దేఱి,విడువఁ బోయినను సుపోకమడిఁకిఁ గాను, కోమలి తెనంగి సిగ్గుచేఁ గొంతతడవు." డశా. ౩, ఆ. ౮౪; 8. చేర్పరియగు. "ఉ...అస్త్రవిద్యలఁ, దేఱిని చిన్నపాకల వధించె నిశితమనందుఁ గ్రూరుఁడై." భాగ ౧, స్కం. ౧౫౪, 9. కృతకృత్యతనొందు. "క. నీవును రా ర మ్మిప్పుడు, దేవపథం దేఱి యేఁగు దాంతము..." కళా. ౩, ఆ. ౨౨౩; 9. మురియు. (చూ. తేగడ.) వి. ప్రసన్నత "సీ. తేఱిన చేటున మీఁదఁ బ్రసన్నత..." ఆం. భా. ప్ర. ౮౦.

తేఱుకొను. దే. అ. క్రి. (తేఱు+కొను.) (రోగాదుల నుండి) స్వస్థతనొందు. (శ. ర. వా.)

తేఱుగడ. దే. వి. (తేఱు+గడ) 1. తేర్పు. "గీ. కన్ను యిందాక నే మెఱుంగదు సుమయ్య, తేఱుగడ గాఁగ మెల్లనె దిద్దుకొనుము." విజ. 3, ఆ, ౨౧౧; 2. (మూర్ఛాదులనుండి) తెప్పిఱిలుట, పునస్స్వస్థితికి వచ్చుట. (శ. ర బ్రా.); 2 అస్తమయము. "మ ..చక్రవాళంపుఁగొండ గడిన్ దేఱుకదైవ పట్టఁ దమముల్ మందేహులన్ దోలి వ్రాఁడి గడ లొక్క-న్నతియందు సత్త్వముఁ బ్రకాశింపన్..." విజ పీఠి. ౫, 4. నిర్ణయము. "ఉ. వివేకము తెల్లను వెచ్చఁబెట్టి పీఠిచ్చుట దొమ్మిగూడి కలహించినఁ దేఱుగ దేల పుట్టు .." అహ. ౧, ఆ. ౧౦౫.

తేఱుదు = తేర్పు. (శ ర.)

తేలఁజూచు. దే. స. క్రి. (తేలన్+చూచు.) 1. బాగుగాఁ జూచు. "సీ. పలికించువారి మోములు దేలఁజూచుచో వాలుఁజూపులు పూలవానఁ గురియు." కువల. ౨, ఆ. ౩౦; 2. ఉపేక్షించు. "గీ. చిన్నివయసుననుండియుం నిన్నె కోరి, యున్నను బోయమరునికి నొప్పగించి, తేలఁజూచి నన్ను నేనేల విడుతు,గోర్కె దీరంగ నీకఁ బైకొందుఁ గాక." కళాం. ౩, ఆ ౮౭.

తేలఁబలుకు. దే. అ. క్రి (తేలన్+పలుకు.) 1. తప్పిదముకా దని చెప్పు. "గీ. గడినృపులరాయబారుల యెడఁ గొలువున, సరససల్లాపములం రాజు పలుక వలయుం, గార్యఖడ్గము లనుచరు ల్గానఁ బలుక, వలయుఁ నవి మైత్రిఁ దాఁ దేలఁబలుక వలయుం." ఆము. ౪, ఆ. ౨౫౯, 2. ఒత్తకుండఁ దేలికగాఁ బలుకు. ఉదా.—తేలఁబలికినయెడల అప్పుడు అపుడగును. (బ్రా.)

తేలగింపు. దే. వి. (తేలగించు ధా.) పరిహాసపరవశత్వముచేఁ గనులు తేలవైచుట. "ఉ. మక్కువ తీవ్రలుట్టిపడుమాటలుఁ జొక్కుల తేలగింపులున్." విక్ర. ౩, ఆ. ౨౯.

తేలగిలఁబడు. ద్వ. అ. క్రి. (తేలగిలన్+పడు స్వార్థము) గర్వించు. "సీ. పరువంపుఁజనుపులపసఁ గ్రొవ్వుగొని తేలగిలఁబడువారి కోయిలలరొబ్బు." హరి. పూ. ౯, ఆ. ౭౮.

తేలగిలు. దే. అ. క్రి. 1. శ్రమనిద్రాదులచేఁ గన్నులు పైకిఁ దేరు, తిరుగుడుపడు. "క....గర్భభరము మెలఁకువఁ జెలికిఁ, దేలగిలఁ జొచ్చెఁ గన్నులు, నీలకనీనికలఁ గలికి బిగ్గలు బెడఁకన్." సుర. ౨, ఆ. ౯౪. ప్రబంధ. ౫౮; 2. జలాదులపైభాగమున నుండు. "క. అసిరథి సెల వింకనఁ, గా నేరము తేలగిలు మకరము లమీఁదఁ, మైనాకాదులు తెక్కలతో నిలుచుం గరులమీఁది దోమల కరణిన్." ద్వా. ౨, ఆ. ౧౬౩, ద్వా. ౧, ఆ. ౧౪౫; 3. గుటిటయగు "చ...వచో విలాస ములకుం జెవి దేలఁగిలంగనీక యూనన మర వాంచి .." విప్ర. ౨, ఆ. ౭౦.

తేలగిల్లు=తేలగిలు. 1. (అయాసనిద్రాదులచే గన్నులు పైకిఁ దేలు.) "సీ. తెల్లగ్రుడ్డులు తేలగిల్లి తీపులు పుట్టి దోషముల్ పొందుగఁ దొట్టగిల్లి." కవిక. ౫, ఆ. ౧౧౧; 2. (పరవశమగు.) "ద్వి. మీఱిన మదమున మెయి దేలగిల్ల." ద్వి. హరిశ్చ. ఉ ౧౩౯౩. ('తేలగిల్లఁగ' అని శ. ర. పా.)

తేలనాడు = తేలఁబలుకు. (తప్పిదము లేదని చెప్పు) "చ...అతఁ డేమియుఁ, దెలియఁడు సాదుబిడ్డఁ డని నేరుపుమాటలఁ దేలనాడి గ్రాఁ, జిలికుతు చేతఁ జక్కటులు దిద్దెద వెంకటేనంగనాచివో." సా. ౩, ఆ. ౫౫.

తేలవైచు. దే. స. క్రి. (తేలన్+వైచు.) ఆయాసము మున్నగువానిచే కన్నులు మున్నగునవి తిరుగుడుపడఁ జేయు. "మ. అతుచుఁ దెప్పలు తేల వైచుచు విశుమ్యత్కాంతయై రుక్మిణీ, తనయా మీఁదట నైన నీవ పతివై తద్ధర్మ మీఁ డేర్పుమీ." ప్రభా. ౫, ఆ. ౬, కళా. ౬, ఆ ౨౪౯. ఇట్లే తేలవేయు. వ్యవ - వాఁడు కన్నులు తేలవేసి నాఁడు.

తేలాడు. దే. అ. క్రి. (తేలి+ఆడు.) 1. (జలాదుల పైని) తేలు. "సీ. ఇల్లు మంచము లేక వెల్లిపైఁ దేలాడ శ్రీనాథుఁ డాట వాసింపకేల." చంద్రా. ౧ ఆ. ౨౩, రం. రా. యు. ౩౨౩, పు. ౨౬, పం.

తేలించు. దే. స. క్రి. (తేలుధా. ప్రే.) 1. జలాదులలోఁ బైకిఁ దేలునట్లు చేయు. "సీ. అఘటన ప్రఘటనోద్యమఁడ పాటున ఱాలు నీటిపైఁ దేలించు నేర్పు సాక్షి" ఉ. రా. ౧, ఆ. ౧౫౧; 2. సంతసింపఁజేయు. "గీ. పంత విడు నేఁడు రేపటి పత్తు ననుచుఁ, గొంత లాలించి తేలించి ప్రస్తరించి.- సావి. ౧, ఆ. ౩౦, దశా. ౨, ఆ. ౩౬౫; 3. బెల్లించు, వంచించు. "సీ. వెలయించు దేలించు బెల్లించు మూరించు పసఁగ నెక్కించు నం చనెడు మాట." ఆం. భా. కృ. ౧౨౪.

తేలింపు. దే. వి. (తేలించు ధా.) 1. వికాసము. "గీ. సొగసు తెలి వాలు నును సోగ సొంపు తళుకు, బెళుకు చికిలి యొయ్యారంపుఁ బేరె ముద్దుటు, సోలపు విడియంపుఁ దేలింపు చుఱుకు టోర, కలికి బెద రెచ్చు చూపులకలికిఁ జూచి." ప్రబంధ. ౧౦౬. విణ. దీనము. "ఉ. చంపకగంధి మోవి సరసంబుగు బిగల మటంచు పట్టితే, లింపు టెలుంగులోఁ దమి దలిర్పఁగఁ బల్కిన..." విజ. ౨, ఆ. ౧౮౫.

తేలిక. దే. వి. (తేలుధా.) లఘుత్వము. (శ. ర.) విణ. 1. లఘువు, భారము లేనిది. (శ. ర. వా); 2. మనోజ్ఞము. "చ ..ముద్దుగారుమోం, దికజిగి పాలబుగ్గలును దేలికమాపులుఁ గోమలంపుటం, గకములం గల్గి యొప్పొదవుఁగా సుతుబాల్యము తండ్రి కొంత యుఁన్." కవిరా. ౨, ఆ. ౪౭; 3. గౌరవహీనము. వ్యవ.-అతని నందఱు దేలికచూపు చూచుచున్నారు.

తేలిపోవు. దే. అ. క్రి. (తేలి+పోవు.) 1. జలాదులపైఁ గొట్టుకొనిపోవు. "వ...నెత్తురు టేరులకుయి వడిం దేలిపోవుపీనుంగులం దివిచికొని .." భార. భీష్మ. ౩, ఆ. ౬౫, 2. హానిచేయక తొలఁగి పోవు. వ్యవ -వానికి వచ్చినయాపదలన్నియుఁ దేలిపోయినవి 3. తప్పిపోవు. "ఉ. బెంగ విడంగ గొట్టియటఁ బొంటెని గానక తేలిపోయి చిత్రాంగి విచిత్రరత్నభవనాంగణ సీమను దేల వ్రాలె నా, బంగరుముద్దుఁ బావురము..." సా. ౨, ఆ. ౪; 4. ఓడిపోవు. "మత్తకోకిల...అసంఖ్యయాదవ సేనకుఁ, దేలిపోవక చక్రసద్యోద్యుధీరు లెవ్వరు పోరులన్."భార. ఆది. ౮, ఆ. ౨౦౫. (శ.ర.పా.) 5. నిష్ఫలమగు. "క. రౌద్రం బదరఁగ నేసెను, రుద్రాస్త్రం బతనిమీఁద రూఢిగ నతఁ డారుద్రుని యంశం బగుటను, రౌద్రాస్త్రము దేలిపోయె రథినం బొప్పన్." మొ. రా. సుం. ౧౮౪; 6. విష యాంతరమునకుఁ బోవు. "వ...అని పలుంబు నొకొని తేలిపోఁ బలికి..." అము. ౫, ఆ. ౬౬.

తేలియాడు. దే. అ. క్రి. (తేలి+ఆడు.) 1. జలాదులపైఁ దేలు. "మహాప్రస్థర చటులగతి జగజ్జాలముల్ దేలియాడన్." సైవ. 2, ఆ. ౧౬౧; 2. (జలాదులలో) విహరించు, క్రీడించు. "గీ. అంబికానాయకధ్యానహర్ష జలధి,మధ్యమునఁ దేలియాడెడుమనసు మనసు." భీమ. 3, ఆ. ౧౯౭. సైవ. 3, ఆ. ౧౧౭.

తేలు. దే. అ. క్రి. (క. తేల్.) 1. (జలాదుల) పైనుండు. "వ... ఈసంసారమహాంభోరాశియందుఁ గర్మచోదితము లైనజంతువులు మునుఁగుచుఁ దేలుచు .." భీమ. 2, ఆ. ౧౫౦. ఉ. రా. 3, ఆ. ౧౭; 2. స్నానముచేయు. "ఉత్సాహ. లీలమనుజాఁ డెవ్వఁడే బిబిప్పిలాకరంగిణిం, దేలి త్రికోష్టపేరుఁ ద్రిఫరమథను కళికళా,మాళిఁ బూజసేయు .." కాశీ. ౬, ఆ. ౧౭౮; 3. జలములోఁ గ్రీడించు. "శా. సంసారార్ణవసారమన్మథసుధాసారంబునం దేలఁగన్." ఉ. హరి ౯, ఆ. ౭౨. పీఠ. ౧ ఆ. ౫౪; 4. ఆయాసాదులచేఁ గన్ను. మొ. తిరుగుడు పడు. "ఉ. తేలెడుకన్నులోయి వడదేలెడుముద్దుమొగంబు .." పాండు. 3, ఆ. ౬౫. పి. శకుం. ౨, ఆ. ౧౯౬, 5. కనఁబడు. "ఉ. కెంగ ఱడంగ గెంటి యట బెంటిని గానక తేలిపోయి చిత్రాంగి విచిత్రరత్నభవ నాంగణసీమను దేల వ్రాలె నా బంగరుముద్దుఁ బావురము .." సా. ౯, ఆ. ౪, 6. మోసపోవు. "క. కాని యటు లండి కెఱఁబడు,సైన తెఱఁగు దోఁచి మాయ మగునిబ్బంగిఁ, మానసమున బుబ్బు వగయుఁ, దేనోపు బసులు బుధుండు దేలఁడు రెంట." భార. శాం. 3, ఆ. ౨౮; 7. తుష్టినొందు. "చ.. బంధురసత్కాసనావనపారణ దేల నలంచెఁ గన్నరిన్." శుక. ౧, ఆ. ౭౭; 8. కార్యసిద్ధినొందు, విజయమొందు. వ్యవ.-అవ్యవహారములో నేను దేలునుపాయము దొరికినది; 9. పరిష్కృతమగు. వ్యవ-అవ్యవహార మింకను దేలలేదు. ౬. వృశ్చికము. "క. తేలుపలె మాటి యమ్మనిపాలుఁడు పోవుటయు." సుద. ౪, ఆ. ౧౦౦, సైవ. ౬, ఆ. ౧౪౧.

తేలుకొండి. దే. వి. (తేలు+కొండి.) 1. వృశ్చికపుఁ దోఁకకొన; 2. వృశ్చికరాశి. (శ. ర.) "గీ. తేలు మొనచె ట్టసంగను దేలుకొండి,నాఁగ మను వృశ్చికాశ్వాఖ్య..." ఆం. భా. ద్వి. ౬౬.

తేలుచే = తేల్చు. (నంతసింపఁజేయు.) "మ . వలీముఖాగ్రణుల కెంతో పేద్కఁ బుట్టించి... కాకుత్స్థరత్నంబు మన్ననలం దేలిచె వారి నీడి రమికాసంబాధి నోలాడుచున్." ఉ. రా. 2, ఆ. ౨౭౮.

తేలుబాణము. మి. వి. (తేలు+బాణము.) ఒకరకపు బాణసంచు. "వ . తాటిబాణంబులు తేలబాణంబులు .. మొదలగు బాణవిద్యలపై ఖరులు చిత్రవిచిత్రంబులుగాఁ జూపుబాణకారులును..." హంస. 3, ఆ. ౨౯.

తేలుమణి. మి. వి. (తేలు+మణి.) తేలుకొండి,వృశ్చికాశి. (శ. ర.)

తేలుమీను. ద్వి. వి. (తేలు+మీను.) మత్స్యవిశేషము, చిలిచిమము. (శ. ర.) "ఉ ..ముల్, తొల్లిక తేలుమీ నిసుకదొందును బిత్తడికాసు మల్లుమీ,నల్లెయు గండె రొయ్య పర కాదిగఁ జేపలఁ బట్టి బెట్టుగన్." ప్రబంధ. ౧౯౩.

తేలుమొన = తేలుకొండి. ఆం. భా. ద్వి. ౬౬.

తేలురాసి. ద్వి. వి. (తేలు+రాసి.) వృశ్చికరాశి. (శ. ర.)

తేలువాఱు. దే. అ. క్రి. (తేలు+ వాఱు.) పుట్టు, కలుగు. "చ. అని విహరించుచున్న హృదయంబున సత్కృప తేలువాఱఁగాఁ, గనుఁగొని .." రుక్మా. ౧, ఆ. 3౩.

తేల్చు. దే. స క్రి. (తేలు ధా. ప్రే.) 1. నీటిమీఁదేలునట్లు చేయు. "సీ. విస్తారసంసారవిమరాశి దాటించుధీరునకును వార్ధిఁ దేల్చు టెంత." దశా. ౪, ఆ. ౨3౦, 2. సంతసింపఁజేయు. "గీ. ఒకతె రతిఁ దేల్చి కాఁక నొండొక తెఁ దేల్చి." ఆము. 2, ఆ. ౫౪. పారి. ౧, ఆ. ౦౫; 3. అభిషేకించు. "క. చేగాఱుఁగాడు చెఱకుం, దీఁగెరసంబునఁ బురారిఁ దేల్చక కుడువన్." హర. ౧, ఆ. ౧౮, 4. (జలాదులయందు) క్రీడింపఁజేయు. "శా. అడం బిత్రము వాడవాడ ఘనకుద్యన్నర్ధరత్నద్యుతుల్, చూడం జూడఁగ మణ్ణుకరణ తేజోరూఢది త్తేషణ, క్రీడాదుస్తరమార్గ సౌఖ్యరస వార్ధిం దేల్చుఁ దత్పట్టన, క్రోడ కోటి నటన్ను సున్నపురముల్ గొండాట కర్ణంబులే." కాశ.

౧, ఆ. ౧౮. భార. విరా. ౨, ఆ. ౩౯౦; 5. ముంచు. "చ. తెరలక వారుఁ దద్రథముఁ దేర్చిరి తూపులవెల్లి .." భార. ద్రో. ౨, ఆ. ౪౨. భీమ. ౨, ఆ. ౪౭; 6. స్నానము చేయించు. "గీ. అవని దివిజాండు మణికర్ణికాదిపుణ్య, తీర్థములయందు దేహంబు దేల్చి తేల్చి." కాశీ. 3, ఆ. ౨౨౫; 7. ప్రస్తావించు. "శా. .. పతి యెల్లి యేఁ, గానీ నీపుడేఁ దన్మనోజ్ఞగుణముల్ గానీ తదన్యాయముల్, గానీ డించిన చింత నీకతనిపైఁ గా కెవ్వరిం దేల్చెదే." ఆము. ౫, ఆ. ౫౯ 8. పరిష్కరించు. వ్యవ:– ఈవ్యవహారము శీఘ్రముగాఁ దేల్చుము, 9. వ్యక్తీకరించు. వ్యవ:– తన కాతనియభిప్రాయమింతులుఁ దేల్చినాఁడు. 10. ఒత్తరుఁడు. ఉదా– అద్రుచు ననుపదములో నకారముఁ దేల్చి పలుకవలయును.

తేవ. దే. వి. ఉత్సవవిశేషము. "గీ ..పండు ననఁగ, నుత్సవము తద్విశేషంబు లొప్పఁ దేవ,తంతు సాకము నంపు జాతర కొలు పన." ఆం. భా. ప్ర. ౧౪౩.

తేవము. సం. వి. అ. న. 1. క్రీడ. 2. ఉద్యానము; 3. పాదచారణము. "ద్వి. తేవనంబునను సొంతే వనంబునను, బావనమునిచర్యఁ బరఁగుసంయములు." రం. రా. బాల. ౫, పు. ౩౦, పం. ౯ శతం. ౨. ఆ. ౪౭.

తై

తైజసము. సం. వి. అ. న. 1. వెండి బంగారు లోనగు ధాతుద్రవ్యము; 2. నేయి. పు. రాజసగుణము. విశే. (అ. ఈ. అ.) 1. తేజస్సంబంధమైనది; 3. సువర్ణాదిధాతువికారమైనది.

తైతిలము. సం. వి. అ. పుం. 1. ఖండెగ, ఖడ్య విశేషము; 2. ఖడ్గమృగము.

తైతిలుఁడు. సం. వి. అ పుం. దేవుఁడు, వేల్పు.

తైత్తిరము సం. వి. అ. న. తిత్తిరిపక్షులసమూహము. పుం. తిత్తిరిపక్షి.

తైత్తిరీయము. సం. వి. అ. పుం. కృష్ణయజుర్వేదము.

తైత్తిరీయుఁడు. సం. వి. అ. పుం. కృష్ణయజుర్వేదము చదివిన వాఁడు.

తైరు. దే. వి. (త. తైర్.) పెరుఁగు, దధి. "ఉ. వద్దనఁ జూచి రంత చెలువల్ ...లద్దువ్రాలిడ్డెన లానవాలు చలియించుని తైరులు..." పాంచాలీ. ౪, ఆ. ౪౨.

తైర్థికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) తీర్థసేవ చేయువాఁడు.

తైలకంద ము. సం. వి. అ. పుం. ఒకరకపుకందశాఖ.

తైలకారుఁడు. సం. వి. అ. పుం. గాండ్లవాఁడు.

తైలకారిక. సం. వి. అ స్త్రీ. 1. బొద్దింక; 2. గబ్బిలము.

తైలప. సం. వి. ఆ. స్త్రీ. 1. బొద్దింక; 2. గబ్బిలము.

తైలపర్ణకము. సం. వి. అ. పుం. గండివనము శాఖ.

తైలపర్ణి. సం. ఈ. స్త్రీ. చిల్లచెట్టు. (ఇది దేవదారు బంక చేఁ జేయఁబడి సరళద్రవ మను పేరు గలది; 2 పీతచందనము. (శ. ర.)

తైలపాయిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బొద్దింక; 2. గబ్బిలము.

తైలఫలము. సం. వి. అ. పుం. గారశాఖ, 2. చువ్వమొక్కశాఖ.

తైలభావిని. సం ఈ. స్త్రీ. విరజాజిశాఖ.

తైలము. సం. వి. అ. న. నూనె. (ఇది ఏరండాది శబ్ద పూర్వక మైనపుడు తద్ద్రవ్యముచు దెలియఁ జేయును.) విశే. (అ. ఈ. అ) తిలసంబంధమైనది.

తైలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీఁచరశాఖ.

తైలసాధనము. సం. వి. అ. న. తక్కోలమ[illegible].

తైలస్యంద. సం. వి. ఆ. స్త్రీ. 1. తెల్లచాఁగశాఖ; 2. కారుకొల్లిశాఖ.

తైలాటి. సం. వి. ఈ. స్త్రీ. కందురీఁగ.

తైలి. సం. వి. న్. పుం. గాండ్లవాఁడు.

తైలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. గాండ్లస్త్రీ; 2. దీపపువత్తి.

తైలీనము. సం. విశే. (అ. ఆ. అ.) తిలలు పండునది. (పొలము.)

తైషము. సం. వి. అ. పుం. పుష్యమాసము.

తొ

తొంక. దే. వి. వాలము, తోఁక. "సీ. తొంకతోఁ జుట్టి కడంక మింటికి వైచి నిదుసాల్కుపొలదిండిఁ బుడమిఁ గెడపి." అచ్చ. యు. ౧౦౪. (శ. ర. పా.)

తొంగలి. దే. వి. (త. తొంగల్.) 1. కాంతి. "సీ. మహనీయమణిమయ మంజీరములు భూని పసిఁడి తొంగలిపచ్చపట్టు గట్టి." పద్మ. ౯, ఆ. ౨౦౧; 2. ఛత్రము. "సీ. నతులనీలాలకద్యుతి దొంగలించె నాఁగ పొ్పరి జల్లితొంగళ్ల గ్రాల." కా. సం ౯, ఆ. ౩౭. కు. సం. ౧౧, ఆ. ౭౪ . విశే. 1. వాలునది. "సీ. ధవళాక్షితొంగలి కలుదుకొప్పుల చెప్ప కప్పునుదీకటి గలియుండేర." భార. విరా.

౨, ఆ. ౩౬. స్వా. ౨, ఆ. ౩౨; 2. ప్రవించు నది. "ఉ. తొంగలిపువ్వుఁదేనియలఁ దూఁగొని మత్తిలి తుమ్మెదల్ కురుక్, బొంగుచు వ్రాల .." య. ౪, ఆ. ౧౬; 3. సాంద్రము, దట్టము. "వ...కప్పులు తొంగలులు వగఁబత్మకాలికల నొప్ప..."ఆము. ౬, ఆ. ౯౦.

తొంగలించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు. 'సీ. ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని లావణ్య మొదలినలతికథంగి." భార. విరా. ౧, ఆ. ౨౯౪, 2. జనించు. "వ ప గరకౌతుకంబు మొగంబులం దొంగలింప నరిగిరి." భార. భీష్మ. ౧, ఆ. ౯౫. ఉ. హరి. ౨, ఆ. ౭౯; 3. వికసించు. "సీ. కామినీమానమేఘశ్రేణి విరియంగఁ దొగ తెల్లుగుంపులు దొంగలింప." పారి. ౨, ఆ. ౪౯; 4. అధికమగు, అతిశయించు. "క ..ఒదలాఱుట కదఁగ నుండె నపు డచ్చట మంగలి తొంగలించు సంత్రాసమునన్." వేం. పంచ. ౧, ఆ. ౨౭౪. మార్క. ౩, ఆ. ౨౭౬, 5. (సంతసముచే) పారవశ్య మొందు. "ఆ. నీముఖాంబుజాత నిర్ముక్త హారికథా, మృతము ద్రావఁ ద్రావ మేను పొదలె, వంత మాని సీరువట్టు నాఁకలియును, దూరమయ్యె మనము తొంగలించె." భాగ ౧౦, స్కం పూ, ౧౧; 6. ఉద్గతమగు, బయలువెడలు. "చ. కని యతిభక్తిపూర్వకముగా ధరఁ జాగి నమస్కరించి లే,చి నిలిచి ఫాలభాగమునఁ జేతులు సేరిచి సమ్మదాశ్రువుల్, కనుఁగవఁ దొంగలింపఁ బులకమ్ముల సంగము విస్తరింప నృత్యనుకమలీలతోడఁ గొని యాడెడు భక్తిరసార్ద్రచిత్తుఁడై." విక్ర. ౨, ఆ. ౨౨౧; 7. విజృంభించు. "వ...ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యుపయిం గవిసిన సతండు. "గీ మూతు నొక్కచ లమ్మన స్రుక్క జేసి,యశ్వముల నాలుగింట నుృదఁగఁ జేసి,సిడము నడిమికి వెసఁ గ్రుంచె పెదఁదవాలి, దొడ్డతోపునఁ గురుసేన తొంగలింప.' భార. భీష్మ. ౨, ఆ. ౪౦, ౪౯, 8. నిక్కు. "ఉ. అన్నువకొనుకీఁగ యపియూడఁగఁ బయ్యెదఁ బిక్కటిల్లుచున్, జన్నులు తొంగలింప..." మై ౧, ఆ. ౧౩౪.

తొంగలిగొను. దే అ. క్రి. (తొంగలి+కొను.) ప్రకాశించు. "క. తొంగలిఱెప్పల మెఱుఁగులు, తొంగలిగొను మేను వదనతోయరువాంబున్, రంగారఁ దల్ప మున న య్యంగన నిద్రింపఁ జూచి యాత్మగత మువన్." షో. ౨, ఆ. ౪౬.

తొంగలిపాట్లు. ద్వ. వి. బ. నమస్కారము. "రగడ. కృష్ణ, యనుక్షేత్రములోని మధుద్విషునకు నిడ తొంగలిపాట్లని." హంస. ౪, ఆ. ౨౧౩.

తొంగలిఱెప్ప. దే. వి (తొంగలి+ఱెప్ప.) దట్టమగు వెంట్రుకలు గలకంటిఱెప్ప. "సీ. ఘనపక్ష్మసంజ్ఞ దొంగలిఱెప్ప లన మీఱు .."ఆం. భా. ద్వి. ౧౪౫. షో. ౨, ఆ. ౪౭.

తొంగిళ్లు. దే. వి. బ. 1. నీళ్లపోయుటకై చంటిపిల్లలను బరుండఁ బెట్టుటకు చాచి దగ్గరగా నుంచిన తొడలు. "ద్వి. తొంగిళ్లపై నిడి లింగమూర్తికిని, సంగన గావించు నభ్యంజనంబు." బస. ౩, ఆ. ౬౭, పు. ౧౨, పం. 2. బట్టపింజలు. "ద్వి. అంగిటి ముల్లొత్తునందంద వ్రేలఁ, దొంగిళ్లఁ గార్నీరు తోఁ ద్త్తి పిడుచు." బస. ౩, ఆ. ౬౬, పు. ౯, పం.

తొంగు. దే. అ. క్రి. (క. త. తొంగు.) 1. వంగు, వాలు. "క. అంగన యిచ్చాశక్తిచు మునిఁవెంగటికిం బాఱి పాఱి సేవలు గావింపంగాఁ బోదుపు సేఁడటు,తొంగియుఁ జూడ వతఁ డేమిపోసము సేసెన్." విజ. ౩, ఆ. ౨౯. భార. అర. ౨, ఆ. ౯౪; 2. పండుకొను,శయనించు. "ద్వి. వంగుచు వ్రాలుచుఁ దొంగుచుఁ జనుచు." పండితా. పర్వ. ౩౭౦, పొ. ౩ పం.

తొంగుండు దే.అ.క్రి . (తొంగి+ఉండు.)పండుకొను, శయనించు. "మ. కలపోయక్ దమపంచతిన్ని యలమీఁదక్ జంగము లొ్వ్వలె నిచ్చలుఁ దొంగుండెడు కన్నగాండ్రు విని .."కళా. ౪, ఆ. ౫౨. రామలిం. శ. ౦౫.

తొంట. దే. వి. 1. చర్మము, వృక్షచర్మము. "అ .. తొంట చెక్క తడప యంట త్వగాఖ్య యా." ఆం. భా. ద్వి. ౩౭; 2. వామియొక్క మొదలు. "సీ. వామియటం చన వఱలును దృణకలి తొంట యనంగఁ దన్మఖము దనరు." ఆం. భా. ద్వి. ౬౬. 3. కసవువెంటి (శ. ర. బ్రా. వా.)

తొంటచేయి. దే. వి. (తొంట+చేయి ) ఈచవోయిన చేయి. "ద్వి. ప్రాఁకుకుం డ్లూడి వెల్వడఁగ నేత్రములు, చీకిలించుచుఁ దొంటచేతులు చాల్చి." అ. మ. క. ౫, ఆ. ౨౩౪, పు. ౨౦, పం.

తొంటచేతివాఁడు. దే. వి. (తొంటచేయి+వాఁడు.) ఎడవటియగు చేయి కలవాఁడు. "గీ...నకరుండు పరఁగుఁ దొంటచేతివాఁ డన శ్రీమాతృభూత లింగ." ఆం. భా. ద్వి. ౯౨౧.

తొండ. దే. వి. సరటము, సరీసృపభేదము. "సీ... తోఁచు నూదరవెల్లి తొండ యనఁగ,సరటంబు." ఆం. భా. ద్వి. ౮౭ ఉ. రా. ౩, ఆ. ౧౪౧.

తొండపుఁద్రాడు. ద్వ. వి. (తొండము+త్రాడు.) మోటగూనతోఁకకుఁ గట్టుత్రాడు (దీనిని దొండాపుఁద్రా డందురు. శ. ర.)

తొండపుదోమ. ద్వ. వి. (తొండము+దోమ.) నిడుపు ముక్కు గల ఒకరకపు పెద్దదోమ, ఘోణి. (శ.ర.)

తొండము. వై. వి. (సం. తుండమ్.) 1. గజహస్తము "ఉ ..బా, ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచ న్గలిపించుకోయి .." స్వా. ౧. ఆ. ౪, ఆం. భా. ద్వి. ౧౯౪; 2. మోటగూనతోఁక, 3. దోమ తొండము.

తొండముక్కువడు. ద్వ. అ. క్రి. పుడఁబాఱు. "వ...పరిగ వెరిగె గసగస యొసకమెసఁగె పెస రుసురుకొనియె దవనిక పొదలె తెక్కప్రానంగు దొండముక్కువడియె " కాశీ. 3, ఆ. ౨౩.

తొండరూపురిక్క. ద్వ.వి. పుష్యమీనక్షత్రము.(శ.ర.)

తొండాడు. దే. స. క్రి. త్వరపడుచు. (శ. ర )

తొండి. దే. వి. రంధ్రము. (శ. ర.)

తొండు. దే. వి. తృణవిశేషము. "గీ. వేరు తొణ్ణంగి తొండును మారువెల్లి,కఁగురు తుంగాకు తుంగలు కలయ విడిచి."హంస. ౫, ఆ ౪౭. విణ. సోమరి, ప్రాలుమాలినవాఁడు. 'సీ. మదట తొండోరు తొండు మదల మాలుగు బోతు చండి సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవానిపే ర్లై .." ఆం భా. తృ. ౬.

తొండోరు. దే. విణ. సోమరి, ప్రాలుమాలినవాఁడు. ఆం. భా. తృ. ౬.

తొండ్లి. దే. వి. వృక్షవిశేషము. "సీ. మల్లి విరిగి తొండ్లి మల్లి తూకిబ్బెద .." హంస. ౪,ఆ.౧౧.

తొంద. వై. విణ. (సం. తుందీ.) బొజ్జ కలవాఁడు, తుందిలుఁడు. ఆం. భా. ద్వి. ౧౭౦

తొందర. వై. వి. (తొర+తొర.) (క. తొందరె. త. తొందరై.) 1. మిక్కిలిసంభ్రమము. (వా.); 2. సంభ్రమము; 3. బాధ. (శ. ర.)

తొందరచేయు. వై. స. క్రి. (తొందర+చేయు.) బాధించు. "చ. విలవిల నైర్ఋతిన్ విగతవీర్యునిఁ జేసితి వార్ధినాథునిన్, దొలఁత జయించితిన్ బవనుఁ దొందరచేసితి .." అని. ౫, ఆ. ౬. (శ. ర. పా.)

తొందరపడు. వై. అ. క్రి. (తొందర+పడు.) 1. సంభ్రమించు. (శ. ర.); 2. వేగిరపడు. (వా.)

తొందరపాటు. వై. వి. (తొందరపడు ధా.) తొందర పడుట, సంభ్రమము. (శ. ర.)

తొందళము. దే. వి. రెండుమూఁడు దినుసులకూరలు చేర్చి వండినదప్పళము. (శ. ర.)

తొందు. వై. విణ. (సం. తుందీ.) బొజ్జ కలవాఁడు తుందిలుఁడు. ఆం. భా. ద్వి. ౧౨౦.

తొంబ. దే. వి. గుంపు,మూఁక. (వా. గ్రా. అని శ. ర)

తొంబండ్రు. ద్వ. స. బ. తొంబదిమంది. (తొంబది మహన్మహత్యర్థకరూపము.)

తొంబగిలు. దే. అ. క్రి. గుమిగూడు. "లయగ్రాహి. సుబరము గావలసి తొంబగిలి దానవకదంబము సహాయముగఁ బంచి త్రిదశుల్ దుగ్ధాంబునిధిఁ ద్రచ్చి యమృతంబుఁ గొనఁజాలునమయంబు దొరకించితి ముదంబున ముకుందా." అప్ప. ౪, ఆ. ౨౫౭.

తొంబడి. ద్వ. స. (తొమ్మిది+పది.) తొమ్మిదిపదులు. "సీ ..మద్ర, పతిమేన నతఁడు తొంబదితూపు లడరించి యేసె .." భార. కర్ణ. ౧, ఆ ౧౧౪.

తొంబనూఱు. ద్వ. స. (తొమ్మిది+నూఱు.) తొమ్మిది వందలు. "గీ. తొంబనూఱును దొంబదితొమ్మిది యునను, జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి." భీమ ౬, ఆ. ౬౮.

తొకతొక. దే. వి. జలాదు లుడుకునపుడు కలుగు ధ్వని కనుకరణము. "వ...బాడబానలంబునం దొఁకతొక నుడుకు నీరునుం గలసి నభంపచంబై..." హర ౬, ఆ. ౫౯. విణ. 1. స్పష్టము గానిది. (మాట) "చ. తొకతొకమాటల న్నొనలఁ దుంపె సలాడెను నుంగరంపువెంట్రుకలును గల్గి యుం బొదవ్వఁగా సుతుబాల్యము తండ్రి కెంతయుఁన్." కవిరా. ౨, ఆ. ౪౭; 2. తడఁబడునది. (మాట) "క. ఒకలాగున మాటలు తొకతొకలై తడ లంగఁ జొప్పు దుడిదుడి కుందే,నొకఁడ చనఁ

దొడఁగెఁ గన్నులు,వెకలించుక చూడసాఁగె ధీతి దలిర్పన్." నిరం. ౪, ఆ. ౭౭.

తొక్క. వై. వి. (సం. త్వక్. క. తొక్కు.) 1. చెట్టు మున్నగువానిపట్ట. (శ. ర.); 2. చర్మము తోలు. "గీ. తొడవనంబు కళాయంబు తొక్క తోలుచ ట్టనఁగఁ జర్మ మలరు .." ఆం పదా. నర. ౭౦

తొక్కట. దే. వి. బాధ, ఒత్తుడు. "సీ. మది నున్న వనజాతియొక కప్పుపైకి వెల్వడె నాఁగఁ జన్నొద ల్నులుపు మీఱ,ఠిక్క రాయనిఁ బాయఁ గొక్కట గల్గిన ట్లొక్కట మైకార్శ్య ముప్పతిల్ల." శశాం. ౫, ఆ. ౧౭౧.

తొక్కటపడు. ద్వ. అ. క్రి. (తొక్కట+పడు) బాధపడు. "గీ. దైన్య మాకార మయినచాడమున నున్న,వానిఁ దమయన్నఁ గనుఁగొని వారు వెఱఁగు. పడి భయంపడి తొక్కటపడి కటకట,పడి దిగుల్పడి వడఁకుచు భక్తిఁ జేరి." ఉ. రా. ౬, ఆ. ౨౦౫.

తొక్కటపాటు. వ్య. వి. (తొక్కటపడు ధా.) బాధ. "చ. వలఁదపిఱుందుభారమున వారనితొక్కట పాటు మీఱఁగా, నిలవయి సాఁగి మ్రొక్కి యిల యీశ్వరి నిట్లని యెంచె ధీరతన్." ఉ. రా. ౭, ఆ. ౪౩౪.

తొక్కటము = తొక్కట. (ఒత్తుడు.) "క. తామరస నేత్రవీథుల,తో మొనసి జయింపలేక తొక్కట మున నెం,తో మలకలఁ బడి స్రుక్కుచు,పేమఱు కప్పులుల త్రాఁగి వేఁగుచు నుండెన్." రసిక. ౨, ఆ. ౭౯. (శ. ర. పా.)

తొక్కిస. దే. వి. మల్లబంధవిశేషము. (శ ర.)

తొక్కు. దే. స. క్రి. సలింపఁజేయు. 'చ. తోలి తోలి యెల్లపాపములు దొక్కుచుఁ బల్కెడు నట్టితియ్యపు, బలుకుల నచ్యుతాహ్వయముఁ బల్మరుఁ జేర్కొను..." నృసిం. 3, ఆ ౧౪౯. వి. (క. త. తొక్కు.) ఉప్పును కారమును జేర్చి జోటిలోఁ నలఁగఁగొట్టిన మామిడికాయముక్కలు మున్నగువానిముద్ద. "వ. పచ్చళ్లూరుఁబిం డ్లూరుఁగాయలు మామిడి తొక్కులు .."వాంస. ౧, ఆ. ౧౦౫, వైజ. 3, ఆ. ౭౦. విణ. 1. అవ్యక్తమధురము. (పలుకు.) "సీ. తాలిమి రస సేవ సోలి ముద్దాడురాచిలుక నా పెదఁదొక్కుఁ బలుకు లొప్పె." కు. సం. 3, ఆ. ౭౪, 2. స్రుక్కఁబడినది, పనికిరానిది. "ఉ. అక్కటికాత్మ పుండు గన వారని తెమ్మని కూఁకు చేతికిం,తొక్కుడు పాఱ యీయ...దిశాంతము నంపు వచ్చి ౧, ల్తొక్కులు నామొగంబున గదుర్చుచు గొన్ని తృణాగ్రఖాదముల్." శుక. 3, ఆ. ౪౧౦.

తొక్కుడు. దే. వి. (తొక్కు ధా. క. తొక్కు.) ఒత్తుడు, సమ్మర్దము. "ద్వి. తొక్కుడు ఘనమంచుఁ దొలఁగి నిల్చుదురు,నిక్కి చూచుదు మిట్టు లెక్కఁ జూచుదురు." పండితా. మహిమా. ౨౪౨ పు.

తొగ. దే. వి. 1. కలువ. "సీ. కటికచీఁకటితిండికర ములగిలిగింత చెవ్వాఁడు తొగకన్ను నవ్వఁ జేసెను." ఆము. ౧, ఆ. ౯౯. రుక్మా. ౪, ఆ. ౧౩౭; 2. కష్టము, బాధ. "ద్వి తొగలు పెట్టింతుము దుష్టాసురుల, తొగలు జానకి యింక తొలఁ గంగ వైచు." రం. రా. యు. ౨౯౩. పు. ౨౯. పం 3. గుంపు,సమూహము. 'చ...ఎమ్మెలచెలి మిన్నకన్నుఁగవ మీఱ్ దొగల్ దొగలం గలంచు..." ప్రబంధ 3౧౯; 4. రీతి. "గీ. తొగలగములబ్రదుకు తొగలు రాజిల్లఁగఁ,గడలి మిన్ను ముట్టి కడలుకొనఁగఁ,బొడిచె శీతకరుఁడు." భాగ ౧౦, స్కం పూ ౧౨౯౫ (శ.ర పా.) బహు. ౫, ఆ. ౫౯; 5. పక్షివిశేషము. "సీ. కైజా కక్కెర గువ్వ కిల్లెడు గీరజ మాడెలు తొగ గిజిగాఁడు కొరడు." సుచ. 3, ఆ. ౧౯౪.

తొగకంటి. దే. వి. (తొగ+కన్ను+ఇ) స్త్రీ. "క. జగములయేకిమీఁద నినుం,బొగడఁగఁ బనిమాల్ల నోళ్ల ప్రౌఢయుఁ బలుకుం, దొగకంటియుఁ జాల నిచోఁ,పగనే పెఱవార లెన్నఁదగువా రనఁగన్." ఆచ్చ. బాల. ౭౪, అచలా. ౨, ఆ. ౭౩.

తొగకొమ్మతొలఁగుబావ. ద్వ. వి. సూర్యుఁడు. వేంక. దేవ. ౧౨.

తొగచెలి దే. వి. (తొగ+చెలి.) చంద్రుఁడు "చ. పగడఁపుఁదీఁగలో తళుకుబంగరు బొమ్మలో... తొగచెలితున్కలో పరునితుంపులో...ఆటచేడి యల్" నీలా. ౧, ఆ. ౪౦.

తొగచెలితాయి. దే. వి. (తొగచెలి+తాయి.) చంద్ర కాంతశిల. "చ. తొగచెలితాలిజోలి హిమ తోయము జిల్కఁ గిరీటిపచ్చతా, నిగనిగలు...." చం. రా. 3, ఆ. ౧౧౩.

తొగటవాఁడు. దే. వి. ఒకజాతి నేఁతకాఁడు. "సీ. తోఁచుఁ దద్భేదముల్ తొగటవాఁ డనఁగను

సాటిఁ దనంగను సాటె యనఁగ." ఆం. భా. ద్వి ౨౮౩. హంస. ౨, ఆ. ౧౨.

తొఁగడు. దే. వి. లోపలి కణఁగుట. "ద్వి. తొఁగ డించుకయు లేక తోరముల్ గాక,మిగుల వట్రు వలునై మించు పెందొడలు." రం రా.యు. ౩౧౫. పు. (శ. ర.) ("తొఁగలించుకయు లేక..." అని ముద్రిత పా.)

తొఁగదొర. దే. వి (తొఁగ+దొర.) చంద్రుఁడు. "చ. తొఁగదొరచాయతమ్మివలెఁ దూలి ముడుం గఁగఁజేసె మూఁకలన్." అచ్చ. భా. ౪, ఆ. ౭౨

తొఁగచెచ్చెలి. దే. వి (తొఁగ+చెచ్చెలి.) చంద్రుఁడు. "క. బలములు గెలుపుసలాపులు సలుకలు బంత ములుఁ దలఁప నంతంతకు మిక్కిలిగాఁ బోరఁ దొడంగిరి, తొలివేలుపుఱేఁడు రాచతొఁగ చెచ్చెలి యున్." అచ్చ. యు. ౫౦౮.

తొఁగపగదాయ. ద్వ. వి. సూర్యుడు. ఉ. హరిశ్చ. ౩, ఆ. ౧౦౨.

తొఁగమైలు. దే. వి. (తొఁగ+మైలు) చంద్రుఁడు. "ఉ. కేలను బోటువాలు దులకింపఁ దలం దొఁగ మైలుమైనిసా,బాలున సాలు...కల్లసామికిన్." చెన్న. ౩, ఆ. ౭౮

తొఁగర. వై. వి. (సం. తువరి) ఒగరు. "సీ. ఒగ రసఁ దొఁగ రసఁ దగుచు గషాకంబు.." ఆం. భా. ప్ర. ౧౦౪.

తొఁగరా. ద్వ వి. తొఁగ+రా) చంద్రుఁడు. "క. నగరాట్కుచపలుసిరి జిగి,నగరా మగరాల జనులు నగరా మొగగూం,తొఁగరా పగరా.." బహు ౫, ఆ. ౫౬. ఇట్లే. తొఁగరాజు. య. ౪, ఆ. ౧౧.

తొఁగరి. వై. వి. (సం. తువరీ.) 1. కందిచెట్టు; 2. అడవికందితీఁగ; 3 సురాష్ట్రదేశపుమన్ను.(వ్యు.)

తొఁగరించు. దే. అ. క్రి. అనురాగమొందు "క. నగుచుఁ జాఱవ నీ రిడ మదిఁ,తొఁగరింపఁగ మగఁడు కేల దోయిలి వట్టన్,దిగి కుచ్చిలి విడువలంపన్ బిగిదడిమొలకూలుతోటి పెంపునఁ బట్టెన్." అచ్చ భా. ౩, ఆ. ౪౩. పు.

తొఁగరు. దే. వి. 1. ఎఱుపు,రాగము. "ఉ. ఇంగిలికంబు నం దడిసి యొత్తుకసీసపురంటేమో యనన్,నింగి గరుత్పరంపరల నిగ్గున లేఁ దొఁగ రెక్క..." ఆము. ౪, ఆ. ౧౦; 2. ఎఱ్ఱనూలు. (శ. ర.) విశే. ఎఱ్ఱనిది. "క. అగలుం గుంకుమపువ్వును, తొఁగరుం జేలలును నీతుఁ ద్రోవం గలవే" పాండు. ౪, ఆ. ౯, కాశీ. ౧, ఆ. ౧౨౩.

తొఁగరుకొను దే. అ. క్రి. (తొఁగరు+కొను.) ఎఱ్ఱ నగు. "చ. నగకయె యుండనిమ్ము వచనమ్ములు పల్కక యుండనిమ్ము కన్దొఁగరుకొనంగనిమ్ము..." గంధ. ౧౯౨.

తొఁగరుకొల్పు. దే. స. క్రి. (తొఁగరుకొను ధా. ప్రే.) ఎఱ్ఱపడఁజేయు. "చ. గిరికొనుగోపురాగ్రపరికలిత పంకజరాగరశ్మిఁ గట్టెఱ యగుచాయఁ బొల్చు దివసేంద్రుఁడు పశ్చిమింటఁ బోవుచో,మఱచి విధాత పాటలిమమధ్యమసంధ్యకుఁ జేయ లేనియా, కొఱతయుఁ దీర్పకోఁ దొఁగరుకొల్పినకై వడిఁ బట్ట ణంబునన్." ఆము. ౨, ఆ. ౧౮.

తొఁగరుమోముపులుఁగు. ద్వ.వి. (తొఁగరు+మోము+పులుఁగు.) చిలుక. వేంక. తిర్య. ౧౦౧. ఇట్లే: తొఁగరుముక్కుపులుఁగు. ఆం. నా. తిర్య. ౧౪.

తొఁగఱేఁడు. ద్వ. వి. (తొఁగ+ఱేఁడు.) చంద్రుఁడు. "సీ. తొఁగఱేనిపరివార మగుతారసంఘంబు శంఖ రింఖన్మణిఁ జూప" చం. రా. ౩, ఆ. ౨౦. ఇట్లే: తొఁగలఱేఁడు. ఉ. రా. ౪, ఆ. ౧౭౩.

తొఁగలగాదిలి. దే. వి. చంద్రుఁడు. "సీ. పొఁగడొందు మొగమొందుఁ దొఁగలగాదిలివిందు జిగిలేఁగవుఁను దీవ మొగులుత్రోవ." నీలా. ౧, ఆ. ౫౬.

తొఁగలవిందు. దే. వి. (తొఁగలు+విందు.) చంద్రుఁడు. "సీ. సేలతాలుపురాచమాలిగాదిలికందు దొనఁగు చీకటిచాలు తొఁగలవిందు." అచ్చ. బాల. ౭.

తొఁగలుపెట్టు. దే. స. క్రి. (తొఁగలు+పెట్టు.) బా ధించు. "ద్వి. తొఁగలుపెట్టింతుము దుష్టారిసతులఁ, దొఁగలు జూనికి యింకఁ దొలఁగంగవైచు." రం. రా. యు. ౨౮౩ పు. ౨౮. కు.

తొఁగసూఁడు. దే. వి. (తొఁగ+సూఁడు.) సూర్యుఁడు. "మ తొఁగసూఁ దల్గినఁ దమ్మిముద్దియకుఁ జేఱు ల్సాచి నిద్దంపుమేల్జిగి గన్పట్టుమడుంగుదువ్వలువ లిచ్చెం గూర్మి.." అచ్చ. అయో. ౪౩.

తొఁగసూఁడుజా. ద్వ. వి. (తొఁగసూఁడు+జా.) సూర్యకాంతశిల. "సీ. చిలువమైపరిపచ్చపలుకల కోతను తొఁగసూఁడుజాజిగి దూలములను." ప్రబంధ ౫౬౬. నీలా. ౩, ఆ. ౪౦.

తొఁచ్చియము=తొఁచ్చము. (శ. ర.)

తొచ్చెము. వై. వి. (సం. తుచ్ఛమ్.) తుచ్ఛవచనము. "వ ..రఘువరులనచ్చరితోచ్చయంబు లుచ్చరింపుదుఁ దొచ్చెంబుల బొచ్చుసేయుచు .." రామా. ౫, ఆ. ౧౯౯. ఆం. భా. ప్ర. ౧౧౪. విణ హీనము. (చూ. తొచ్చెముచేయు.)

తొచ్చెముచేయు. ద్వి. స. క్రి. (తొచ్చెము+చేయు.) హీనపఱచు, తక్కువచేయు. "వ. అమ్మౌక్తికశ్రీయు నచ్చోట నచ్చవెన్నెలఁ దొచ్చెముచేసి యొసఁగునిసుకదిన్నెలపై నున్నయది యట్లగుటం జేసి ." పాండు. ౨, ఆ. ౧౫౩.

తొటతొట. దే. వి. నీరు పువ్వులు మొదలగునవి రాలుటయందలిధ్వని కనుకరణము. "క. కటకట తొటతొట రాలెడు, బొటబొట చినుకుల ధరిత్రి బోడసట్టువడక్, సొటసొట నానట సోలుచుఁ, దటతట పడు చాతకముల దైన్యము వాపెన్." వైజ. ౨, ఆ. ౭౮౬, వరాహ. ౧౦, ఆ. ౧౨౫.

తొట్ట. యు. దే. విణ. స్థూలము. "సీ. అత్యంతగాఢదంతాగ్రపీడనమునఁ దొట్టవాతెఱ జొత్తు గట్టి కడఁగ." శైవ. ౪, ఆ. ౭౬. వై. విణ. (సం. దుష్టః) దుష్టుఁడు. (చూ. తొట్టరి.)

తొట్టగిలఁబడు. ద్వి. అ. క్రి. (తొట్టగిలన్+పడు.) తొట్రుపడు. "క. పెట్టకపో నని యాఁకటఁ, దొట్టగిలంబడుచుఁ బడుచు దురదుర జని పే, నట్టింటఁ గూరుచుండిన, గొట్టునమం జాల కమ్ర గేహిణి ఖేలిన్." పాండు. ౪ ఆ. ౧౬౫.

తొట్టగిల్లు. దే. అ. క్రి. అతిశయించు. "సీ. తెల్ల గ్రుడ్డులు తేలగిల్లి ఱెప్పలుపుట్టి దోషముల్ పొందఁగఁ దొట్టగిల్లి" కవిక. ౫, ఆ. ౧౧౧.

తొట్టరి. వై. విణ. (తొట్ట+అరి.) దుష్టుఁడు. "ద్వి కొట్టిన నింటిలోనికి నుర్కుఁ డనుచుఁ దొట్టరు లిరువురఁ బట్టి తెం డనుచు." పండితా. దీక్షా. ౪౩. పు; పర్వ. ౩౫౮, పు.

తొట్టి. దే. వి. (క. త. తొట్టి.) 1. నోరు వెడల్పును అడుగు సన్నము నైనగంపవంటిపాత్రము. "చ... క్రొమ్ముడుఁగున శేఁగుభద్రకరిమాడ్కి బుధన్వఁడు చొచ్చి బిట్టుగా, నుడికెడినూనెతొట్టి బలియుర్ హరిదాసులు సత్యసంపదన్." శై. ౪, ఆ. ౨౩౩; 2. నీరు నిలుచుటకు గట్టినకుండు. "గీ. గర్భమంటపిఁ గడిగినకలశజలము, లొనితాతొట్టి నిండి కాలువఁగ జాగె." ఆము. ౬, ఆ. ౯; 3. చెట్టుతొఱ్ఱ "గీ...తొట్టి,తొట్రు, తొఱ్ఱ తొఱ్ఱట యనఁ బోఁచు గోట,రమ్ము..." ఆం. భా. ద్వి. ౩౯; 4. గాలిచే నీటిపైఁ గొట్టుకొని వచ్చుతృణాది సమూహము. "సీ. ఉత్ప్లుకయవసాదికోత్కరమై పిలసిల్లుఁ దొట్టి నాఁ దొట్టు నాఁ దొట్టు యన." ఆం. భా. ప్ర. ౧౫౭.

తొట్టించె. దే. స. క్రి. (తొట్టుధా. ప్రే.) స్రవింపఁజేయు. "ద్వి. దట్టించి కట్టించి దర్పంబు బలము, పట్టించి రక్తంబు వాఁకఁ దొట్టించి." అ. మ. క. ౧, ఆ. ౬౪, పు. ౧౯. పం.

తొట్టికట్టు. దే. వి. కత్త్య,రాజగృహముయొక్క అంతరువు. "సీ. దరముఁనోఁ జెఱగంటికొరచు గెల్చిన నాఁటికెలు వ్రాసినతొట్టికట్టు దాఁటి." య. ౪, ఆ. ౭౭౪.

తొట్టినోరు. దే. వి. (తొట్టి+నోరు.) తొట్టివంటి నోరు. "సీ. చెలువ నీళిగిగోము గలమోము మఱి వాఁతొట్టినోరను ముద్దువెట్టఁ దగుశౌ." హంస. ౧, ఆ. ౬౧.

తొట్టిమంచెము. ద్వి. వి. (తొట్టి+మంచెము.) ఊయెల మంచెము. "శా. నీతస్తావవిజృంభితోజ్జ్వల హిమానీశుభ్రసౌధంబులో, నాలోలం బగుతొట్టి మంచెమున నొయ్యం జేర్చి జోకొట్టి యుయ్యాలో జొంపల యంచు నూఁపుదురు శుద్ధాంతాబ్జపత్రాక్షు లా,బాలుం బాలశశాంకశేఖర కృపాపారీణు గారాముసన్." ఉద్భ. 3, ఆ.౫౪.

తొట్టియ = తొట్ట్రె (శ. ర.)

తొట్టియల. దే. వి. ఊయల. "వ.. అపూర్వవైభవంబున నున్నయొక్కరాజాను నతనియగ్రభాగంబునఁ బసిండితొట్టియలలోపలఁ బొత్తులలో నున్నయొకచక్కనిబాలికనుం జూచి ." కళా. ౫,ఆ.౨.

తొట్టిలు. దే. అ. క్రి. (తొట్టుధా.) వెలికిలు. "వ... సిస్పుఁ ద్రొక్కినచందంబున బట్టిపడి తొట్టిలం బడిన పులుఁగుగాథంబున సిట్టట్టు జరలిపోఁగూడక..." సా. 3, ఆ. ౨౯.

తొట్టు. దే. అ. క్రి. 1. వ్యాపించు "గీ. జనము లానందమునఁ దేల జగము లెల్లఁ దొట్టి నిండారు వెన్నెల నిట్టవొడిచె." సర్వ. ౬, ఆ. ౫౫,రామా. ౧, ఆ. ౧౩౬; 2. ప్రవహించు. "మహా సద్ధర... శత్రుపీరప్రబంధుల్, దునుముం దచ్ఛోణితంబుల్

దొరఁగి మడువులై తొట్టె నయ్యర్ధరూమిన్." భార. అర. ౫, ఆ. ౪౨౧, హంస. ౨, ఆ. ౬౪; 3. ప్రవించు,కాఱు. "శా. ఏ,లా వాడేజ వ నంబు నేత్రముల నేలా తొట్టా బాష్పంబు లే, లావై వర్ణిలము దోఁచె దేహమున..." వరాహ. ౨, ఆ. ౫౪, భో. 3, ఆ. ౬౭; 4. ఎగఁదట్టు. "క. దేవానదిలోపల స్నానార్థు లొనరించు చుర్ను నది రొంతఁగి ధరి త్రీవిభుఁడు వేయిచేతుల, నావాహినీనీరు దొట్టుకట్టుగఁ జేసెన్." వి. పు. ౬, ఆ. ౧౯౭, వరాహ ౧౦, ఆ. ౪౮; 5. నిండుకొను. "వ... అనఘ హిమసలిలములు నెలచలువ దొనలఁ దొట్టి జలజాలు దాలుగొని వెల్లువలై ..." వసు. ౨, ఆ. ౧౭, పారి ౪, ఆ. ౬౬, 6. నాఁటు, గ్రుచ్చుకొను. "ఉ. తొట్టినబాణముల్ దొలఁగఁ ద్రోచి ప్రియం బొదవంగ దోయిటం,బట్టె కవోష్ణ శోణితము భామలు దొరుచు గ్రోలి క్రోలి .." భా. రా. యు. ౨౨౧3; 7. పడిపోవు. "సీ. కరములు దునిసినమారుపు దప్పినవారుఁ బొట్టలు చీలినఁ దొట్టువారు." భా. రా. యు. ౧౪౯౪, 8. కలుగు. "సీ. పడిరైదు నంజలు పరువెత్తి చనలేక దగదొట్టి పెదవులు డిసుపువారు." పి.శకుం. 3, ఆ. ౧౦౫, హంస. ౨, ఆ. ౧౫౧; 9. కూడుకొను, చేరు. "ఎ ..ఒక్కొక్కపట్టునం దొట్టిన తెట్టువలు విలయసలిలమధ్యంబునం దేలుచు ..డ ఘట్టితమధుకైటభనిశాట మస్తకమస్తిష్కపరంపర నవుకరింప .." వరాహ. ౧౦ ఆ. ౬౨ 10 ముసరు. "చ. తొడరి చరాచరప్రకృతితో జగమింతయు వార్ధిఁ దొట్టిన,ప్పుడు లలితాబ్జపీఠమునఁ బొల్పుచతుర్ముఖు .." భార. అర. ౪, ఆ. ౨3౮

స. క్రి. 1. పట్టుకొను. "గీ. క్రేపు వాపోవఁ బట్టి లంకియుఁ దార్పి,నో లవియఁ గొట్టి మెడ నొక్కటుండు గట్టి,గిడ్డి పెడలించెఁ దలత్రాడు లేఁ దొట్టి, మారి పెడలించువడువున మూణవడుఁడు." పాండు. ౫ ఆ. ౨౪౫; 3. వహించు. "క. అరులసిరావారలవీ, వ్రతనారుణజియంటి నొదలఁ దట్టి నరము లున్నతమై తోఁచఁగ మరణే, ప్సితమతి నయ్యలల దొట్టి పెద్దరు నార్చెన్." మార్క. ౮, ఆ. ౧3౯ భా. క. ౨౭; 3. త్రొక్కు. "చ. పరువులు పెట్టచుం బిలుకఁ బుట్టమా ఋపోదిరిప్పఁ దొట్టుచున్."బసవ. ౨, ఆ. ౨౭; 4. ఎదిరించు. "ఉ ..మేరు నిట్టట్టుగ డోల్లు భుజవలయ మల్లలనాడు సురాసురాదులం,దొట్టి జయింపఁ జాలునృపసూర్జటి శక్క చిక్కుడి గల్లు .." భా. రా. అర. ౧, ఆ. ౭౨; 5. మొదలుకొను. (ఈయర్థమున నిది క్త్వార్థకరూపము తోనే యుండును.) "క. వనకేళీకౌతుకమున, జలియించు శర్మిష్ఠఁ దొట్టి సఖులెల్ల ముదం,బునఁ గొలిచి రాఁగ విభవమున,దన కమరఁగ దేవయాని తద్వనమునకున్." భార. ఆది. 3, ఆ. ౧౫౪, భార. ఆది. ౧, ఆ. ౧౪, భార. ఆది. 3, ఆ. ౯౬.

వి. 1. చెఱువు క్రిందిపొలము. "సీ. తొట్టు నాఁడీఁగ నాఁటోఁచుచుండుఁ దటాకపూర్వదేశాభిధ." ఆం. భా. ప్ర. ౧౬3, 2. మల్లబంధవిశేషము. "వ కల్లంబున దొట్టును ..నృసింహంబును నను ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి." హంస. ౧, ఆ. ౨౦౬. ప్రబంధ. 3౮; 3. తెట్టువ. "సీ. ఉత్ప్లుతయవసాదికో త్కరయె విలసిల్లుఁ దొట్టి నాఁ దొట్టు నాఁ దొట్టువ యన." ఆం భా. ప్ర. ౧౫౭; 4. సంబంధము. (చూ. తొట్టుపడు.)

తొట్టుకొను. దే. అ. క్రి. (తొట్టు+కొను స్వార్థమున.) 1. వ్యాపించు. "క. తొట్టుకొని సంజకెంపు పుష్పట్టిన రీతిఁ బాసి సితగభస్తి నెపురుకోనట్టె పిరి ఐచ్చుటకునై పట్టినకెంబట్టుదిడ్డీపాలకిఁ బోలెన్." రామా. ౨, ఆ. ౯౨; 2. అధికమగు. "గీ. ఒక విధంబునఁ జతురాస్యు నొద్ద కేఁగి,కడుఁ బ్రయత్నంబునో మొక్కలిడి ప్రయాస,మునఁ గరంబులం ముకుళించుకొని మెంగంబు,లెత్తి దగదొట్టుకొన వార లిట్లు లనిరి.' ఉ. రా. ౫, ఆ. ౧౧3.

తొట్టుతొట్టున. దే. వి. చుక్కలు మొదలైనవి రాలుటయందగుధ్వని కనుకరణము."గీ.తొట్టుతొట్టునఁ దారకల్ బిట్టు డుల్ల,బిట్టదొర కొరికట్టడి కుట్టి పడిరొ.' బసవ 3, ఆ. 3.

తొట్టున. దే. అవ్య. దు. అకస్మికముగా. "వ... అనుపున్నంతలో నొట్టుపెట్టినగతి వాన దొట్టున వెలిసిన .. ' శుక. 3, ఆ. ౨౬౧. వి. పడుట యందగుధ్వని కనుకరణము. "క అట్టిహరి పట్టి కోలం, దొట్టున యంత్రంబుపడినదొర లాక్ష్మధరణా, మెట్టెరి..." పాంచా. ౨, ఆ. ౭౧.

తొట్టుపడు. ద్వ. అ. క్రి. (తొట్టు+పడు.) తడఁబడు. "క. ప్రాజ్ఞుఁడు రమించు నొక్కెడఁ, బ్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతిఁ బరఁగఁగఁ జేయుం, బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ, బ్రాజ్ఞుఁడు కలహమునఁ దొట్టుపడక తొలఁగున్." భార. శాం. ౫, ఆ. ౫౬౫.

తొట్టువ = తెట్టువ. "వ ..తొండంబు లెత్తి తిరుగండ్ల కరణి నురుపడిం దిరుగుచు నొండొంటిం దాఁకు కరులపరిసరప్రదేశంబునం దొట్టువగట్టి పొల్చు తోడి యాఘకికణరాసులుంబోలెఁ గానుపించు రుధిరపలల కంఠబిలాస్త్రాక కీకసపేశశాటంబుల చేర్పున కూర్పాంబులనేర్పున నేర్పరింపుచు .." కళా. ౮, ఆ. ౧౧౦, ఆం భా. ప్ర. ౧౫౩.

తొట్టె. దే వి. 1. నేయువాఁడు నూలుకిండె నుంచుకొనుపనిముట్టు, నాడె. "సీ. తొట్టెరాడె యనంగఁ దురిపేరు విలసిల్లు..." ఆం. భా. ద్వి. ౨౯౬; 2. ఉయ్యాల. "ఉ. ఓగుణాలార యెక్కు డిడి యుయ్యెలతొట్టెల నింక నిత్తటిం, జాగొనరింపు లేల ఘని సంతసమొప్పఁగఁ దల్లి నొక్కెడి, వ్యాగమనూనదామమయమై చెలువొందెడు తొట్టె మంచి పే,పేగము పీరభద్రప్రభుపీపరుతో నొకతొట్టెలోపలన్." చెన్న. ౫, ర, ఆ. ౩౮౮.

తొట్టెల. దే. వి. ఉయాల. "చ...క్రిందరఁగల్ గదలించుకల్వతో,ట్టెలలఁ గుమారుఁ బొఁదుకు ఘటించి భజించునదీలలామకో, మలకుముగగ తాళికులము ఖరవంబున జోలపాడుచున్." వసు. ౩, ఆ. ౨౭.

తొట్రగిల్లు. దే. అ. క్రి. తడఁబడు. "సీ. తొట్రిలుట యనంగఁ దొట్రగిల్లుట యన స్ఖలనసమాఖ్యలై వెలయుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౩.

తొట్రించు. దే. స. క్రి. తడఁబడఁజేయు. "సీ. తొట్రించి గొర్దలోఁ దొడేలు పొచ్చిన ట్టీగబ్బి తెళ్లి నట్టిట్టు నేయు." సా. ౧, ఆ. ౯౨.

తొట్రిలంబడు. ద్వ. అ. క్రి. (తొట్రిలన్+పడు. సంధి)మించు, తొట్రుపడు. "చ .. పొగలబున నక్రులు పెల్లిగొల్పఁ దొట్రిలంబడు జల్లనం జెదరు డెందము గూడఁగఁ దెచ్చు నన్నుఁ గేవలమును మట్ట కెవ్వరికి వచ్చు ననున్..." భార. విరా. ౨, ఆ. ౧౦౪.

తొట్రిలు. దే. అ. క్రి. 1. తడఁబడు. "మ...ఆ కనిపజ్జం దగఁ దాను కేఁగెఁ బదపద్మంబుల్ పొరిం దొట్రిలన్." భార. ఆర. ౭, ఆ. ౨౧౯. భార. విరా. ౪, ఆ. ౮౦; 2. వ్యాపించు. "ఉ. పట్రువ గుబ్బలుం దొగరువాతెఱయుం జిఱునవ్వువెన్నెలల్, దొట్రిలుముద్దుమోమును .." విజ. ౨, ఆ. ౪౬.

తొట్రిల్లు = తొట్రిలు. (తడఁబడు.) "మ...లోచన పద్మంబులబొమ్మ ధార లెసఁగన్ సంభ్రాంతిఁ బాదద్వయంబును దొట్రిల్లఁగఁ బాఱ గోపికలు నుద్భ్రాంత్రలై తోఁ జనన్."హరి. పూ. ౫, ఆ. ౨౪౬.

తొట్రు. దే. వి. 1. స్ఖలనము,తడఁబడుట. "సీ. తిరుగు నాఁగను జేరుపాటు నాఁ దొట్రుపాటనఁగను దొట్రు నాఁగ .. స్ఖలనసమాఖ్యలై వెలయుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౩; 2. తొఱ్ఱికోటరము. "గీ ..తొట్టె, తొట్రు తొఱ్ఱ తొఱ్ఱట యనఁ దోఁచుఁ గోటరమ్ము..." ఆం. భా. ద్వి. ౩౮; 3. చిన్నకంప. "ద్వి తొఱ్ఱటి శిశువు తోలీర్చినవృక్ష, పాతంబు గలిగె నుత్పాతంబు గాదె, మనువులు పసులకాల్మడి కుప్ప చఱిచెఁ,దోడువు దొట్రుచు గడుదూరంబు లయ్యె." ఆ. మ. క. ౧, ఆ. ౪౪, పు. ౨౩. పం.

తొట్రుకొను దే. అ. క్రి. (తొట్రు+కొను.) 1. తడఁబడు "సీ. కురుకేరు గొన వచ్చి కుంతలస్తబకసిస్తులవిలాస శ్రీలఁ దొట్రుకొనుచు." సాంబో. ౧, ఆ ౧౬౪. కవిక. ౪, ఆ. ౧౬౦. పు. 2. కలియు. "గీ. వలపు గాడుపు లూమ్పులఁ గలసి వెలయఁ, దుమ్మెదలు గుంతలమ్ములఁ దొట్రుకొనఁగ." పి. శకుం. ౨, ఆ ౧౩౫.

తొట్రుగొల్పు. దే. స. క్రి. (తొట్రుకొనుధా. ప్రే.) తడఁ బడఁజేయు. "సీ. తొట్రుగొల్పెడుశైత్య తోడిప్రేమం బ నసపత్యుఁ దయ్యును నన్యభార్యఁ గైకొనక..." భాగ. ౯, స్కం. ౭౧౬.

తొట్రుపడు. ద్వ అ. క్రి. (తొట్రు+పడు.) తడఁబడు. "సీ. మాటలాడఁ దలంచి మఱచిపోయెడివారు నడవఁ బోవుచుఁ దొట్రుపడెడువారు." కాశీ. ౩, ఆ. ౪౧, కాశీ. ౭, ఆ. ౯౦.

తొట్రుపాటు. ద్వ. వి. (తొట్రుపడు ధా.) తడఁబాటు. "సీ. తెగ దంతకంతకు మిగిలిన నింతిఁ

బహువుల నడుమ దొట్రుపాటు వెరసి." భార. విరా. ౨, ఆ. ౧౦౬. నిర్వ. ౪, ఆ. ౪౦.

తొట్రులుపడు. ద్వ. అ. క్రి. (తొట్రులు+పడు) తడఁబడు. "క. ఏమను శాపభయమున వి,మానము డిగి వచ్చి మెయిసమస్తము సోఁకం,గా నెరఁగి యమ్మునీశ్వరు,తో నల్లన యిట్టులంటిఁ దొట్రులు పడుచున్." దశ. ౪, ఆ. ౯౯.

తొట్రువు = తొట్రు. (చూ. తొట్రువుగొను.)

తొట్రువుగొను. దే. అ. క్రి. (తొట్రువు+కొను.) తొట్రుపడు. "ద్వి. తొలఁగక కలఁగక తొట్రువు పడక." పండితా. పర్వ. ౫౨౨, పొ. ౧౩, పం

తొట్ల. దే. వి. ఉయ్యాల. "శా . జోల ల్పాడి యూడింతు రా,లావణ్యాంబునిధుల్ వధూమణులు తొట్లం బెట్టి రాజాత్మజన్." పాంచాలీ. ౧, ఆ. ౫౩, విప్ర. ౧, ఆ. ౭౫

తొడ. దే. వి. (త. తొడై.) గజ్జెకు మోఁకాలికి నడిమిభాగము, ఊరువు. "గీ. తునిసి తొలఁగిన జోదులతొడలు సామ,జములకరములు నొండొంటి చందములు గ,నుఁగొనఁగ వింత లగుచును సంగ రాంగ,ణంబు రమణీయమును భీషణంబు నయ్యె." భార. కల్య. ౧, ఆ. ౧౬, ఆం. భా. ద్వి. ౧౩౫.

తొడఁకు. దే. అ. క్రి. నీరు మున్నగునవి యొలుకు, తొనఁకు. "గీ. నిగుడు నాయువు తొడఁకని నిండు కుండ." చంద్రా. ౧, ఆ. ౫౭.

తొడఁగు. దే. అ. క్రి. (క. తొడగు. త. తొడంగు.) 1. ప్రారంభముచేయు. "మ .. అమహీశుఁ డశ్రం డీకార్యంబు సేయంగ నేల తొడఁగెఁ నృపు లెట్లు గల్గి రిల యెల్లం గైకొనం గ్రమ్మఱన్." భార. శాం. ౨, ఆ. ౬౬; 2. మొదలుకొను. "వ... పాడ్యమిం దొడంగి పదునాలుగు దివసంబు లొక్కొక్కగింజగాఁ దూమెఁడువడ్లు పను కూర్చి..." భార. అర. ౬, ఆ. ౧౧౫, భార. విరా. ౧, ఆ. ౬; 3. యత్నించు. "చ. అదియును నెల్లభంగి వెర వారసి చూచితి నొండు లేదు బె,ట్టిదుఁ డగువాఁడు గన్నమిడి డెప్పర మేమియు లేక యుండ నం;పెద నని భూసురేనిఁ దగఁ జేకొని కోర్కి- తొడంగు దీనికిన్, మదవునిచేత నమ్మగువ మానము దూలకయున్న గ్రక్కునన్." దశ. ౬. ఆ. ౧౩౧, భార శాం. ౬, ఆ. ౫౫౦.

తొడకు. దే వి. పశువ్యాధివిశేషము. "ద్వి. తలనొప్పి తొడకు వాతము కల్లవాఁపు, నలదొబ్బ తెవులును నాదిగా నెన్నఁ, గలపసరాలరోగములకు నెల్ల." నవనాథ. ౧, ఆ. ౪౧, పు. ౫, పం.

తొడకొడుకు. దే. వి. (తొడ+కొడుకు.) వైశ్యుఁడు, ఊరుసంభవుఁడు. "సీ. తొడకొడుకు తెగవాఁగ దాపుఁబుట్టువు బచ్చు చేరి సెట్టి యనఁ బూరు జన్ముఁడను .." వేంక. మాన. ౨౬.

తొడతొక్కుడు. దే విశ. (తొక్కుడు+తొక్కుడు) సమ్మర్దము. వ్యవ-జనులు తొడతొక్కుడుగా నున్నారు. ఆతొడతొక్కుడు లోని కేఁగుట కష్టము.

తొడపాసెము. ద్వ. వి. పరిహాసమునకు పాసె మని యూరించుచు పిల్లలతొడను నలుపుట. (వా.)

తొడపుట్టువు. దే. వి. వైశ్యుఁడు. (శ. ర)

తొడబెల్లము. దే వి తొడగిల్లట (శ. ర.)

తొడయు. దే. స. క్రి. 1. కడుగు, ప్రక్షాళించు. "వ .. పెండ్లిదోరలు సుగంధోదకములఁ జేతులం దొడసి వార్చి .." నైష. ౬, ఆ. ౧౪౦, కాశీ. ౪, ఆ ౧౭౩; 2. తుడుచు. "సీ. అన్యంబు దొడసి నీ రంఘ్రిల శిరమునఁ బ్రోక్షించి యొక్క సంపుటము మట్టి." భార అను ౩, ఆ. ౨౮౪, మార్క ౩. ఆ. ౨౩౬; 3. తోము. "గీ. కనకు పోవఁ దొడసి కడిగినకనకంపుఁ, బ్రతిమవోలె నొప్పి నతివమేను." కు. సం. ౭, ఆ ౪౦; 4. నశింపఁజేయు. "స్రగ్ధర. తుంచెం జక్కాడె మోఁచెం దొడసెఁ గెడపె నత్యుద్ధతిం గాశి కాపుగా పంచక్రోశిధరిత్రీపరిధిఁ గరిమన్ బ్రత్య నీకుండు హేలా,సంచారోదగ్రధంగిన్ జలము గొని పవిసాధనప్రాట్పభాఖుల్." కాశీ. ౬, ఆ. ౧౭౬; 5. స్పృశించు. "సీ .. పాణి. గీ. కల్ల వంబున వానన మల్ల సల్లఁదొడయుచును .." భార. స్త్రీ. ౨, ఆ. ౭౪.

తొడరాడు. దే స. క్రి. (తొడరు+ఆడు.) ధిక్కరించు, మీఱు. "చ విజపదనామితాసితపణికచ నీలవిభాతివాహన, ద్విజవరబర్హిబర్హవికటిం దొడరాడి .." కు సం. ౧౨, ఆ. ౨౦౪.

తొడరిక. దే. వి. అనుసరణము. (శ. ర.)

తొడరు. దే. అ. క్రి. 1. కలుగు. "చ. కడఁగి కుమారు పేరురము గబ్బిగు నుబ్బిరు దొంగలింపఁగాఁ,

బొడిచె.. అమ్మహాపురుషుడెందము గాఢ్రున నం దొలింతయుఁ బ్, దొడరకు నొ॥ప..." నృసిం. ౪, ఆ. ౧౧౪, హరి. పూ. ౭, ఆ ౨౩౬; 2. ప్రారంభించు. "క. డొరక గొండక పలుఁపురఁ,తో రవ మెఱగంగఁ బలుకఁదొడరక గొ దుదిఁ బ్, జేరుప గలనాగరికులు ,దారు గనిసి పలుకఁవలయు ధరణీశుఁ డన్." భార. విరా. ౧, ఆ. ౧౨౭; 3 యత్నించు. 'సీ. కురుకులవృద్ధు నిర్మలచిత్తు గాంగేయుఁ జంపి రాజ్యము సేయ నమ్మించి, తొడరినపాండు పుత్త్రులకును వైవాటుఁ దొడ ర్చ్య.." భార భీష్మ ౧ ఆ ౬౦, భార. ఉద్యో. ౪, ఆ. ౨౦౩; 4. తొట్రుపడు. "క. ఏచినపొదలఁ బడల్పడఁ,ద్రోచుచు మూర్ఛకును నల్లఁ దొలఁగుచు దిక్కుల్, చూచుచుఁ దొడరుచుఁ ద్రెళ్ళుచు,గేచుచు లలితాంగి స చలించుచు నని గెన్." భార. ఆర. ౨, ఆ. ౮౬ భార. ఆది. ౬, ఆ. ౧౬౦; 5. సక్తమగు, తగులుకొను. "క. అర యఁగ విషయము లెంతయు, దురంతములు వాని యందుఁ దొడరినఁ జేటుం,బొరయు దురు దొడర కున్నం,బరమసుఖ యుమ్మహాసుభావులకు నగున్." భార. శాం. ౪, ఆ. ౩౧౦, 6. ఎదిరించు. "క కడునధికతోడఁ దొడరిఁ బొడిచిన నోడినను బురుషపురుషగుణం జేఁప్పడుఁగాక హీసు నొడు చుట, కడఁదిరె .." భార సభా. ౧, ఆ. ౧౨౩, స. క్రి. 1. ఎదిరించు. "క. మనపిటన గె పయ్యన్ ర్జునకు పగివింటివారిఁ జూడఁగ లోకం,బున నెందు లేమి తెల్లం,బవమానము లేదు దొడర నగుచే వాసిన్." భార. ఉద్యో ౯, ఆ ౧౬౭ భార. విరా. ౧, ఆ. ౭౪, 2. అనుసరించు. "సీ. కడఁగి జన్నపుఁదిండ్లు దొడరఁ బ్రమ్మపుప్రోడ కట్టలగవితోడఁ గూడి యాడు." నీలా ౧, ఆ. ౭౭, కుచల. ౧, ఆ. ౮౦, 3. పొందు. "వ. ఇట్టిగిది నరిచి రాముఁడు కడ లేనిసిరులు దొడరి కడలి కడగాఁ గలపుడమి కడ పేరె .." య ౩, ఆ. ౩౯, హరి. ఉ. ౯, ఆ. ౧౮౯, 4. రమించు కలియు. "క. జనని దొడానహాహా, తునిఁ గొబ్బుఁ బట్టి తెచ్చి తుఱిమిందఁ డగున్." సా ౨, ఆ. ౨౪౧; 5. ధిక్కరించు, మీఱు "చ .. దేవారుచివైభవమున్ నవవల్లికారుచిం, దొడరుచితంబుచక్రములతో గెలివాలుమెఱుంగుఁ గొప్పుఁ జెన్నడ మెరయుంగఁ దద్గగనవైవలిబిం దగఁ జొచ్చి రందఱున్." పారి. ౪, ఆ. ౨౮; 6. ధరించు, తాల్చు. "గీ. చక్రవర్తిరూపంబులఁ జక్రధరుఁడు, తొడరి త్రేతాయుగంబున దుష్ట శిక్షణంబు గావించి శిష్టలోకంబు నెల్ల,లీలధర్మంబు మెఱయఁ బాలించుచుండు." వి. పు. ౪, ఆ. ౬౧; 7 పట్టుకొను. 'ఆ .. శత్రులు,నపహరించె నొకహయగ్రీవుఁ డనుదైత్యభటుఁడు దొంగఁ దొడరఁ బరల వశమె." భాగ. ౮, స్కం. ౭౧౪; 8. అవలంబించు, ఆచరించు. "గీ. దురితకరముల యని వానిఁ దొడరకుండవలదె లెస్సగ నెఱిఁగిన వచ్చు దొలఁగ." భార. శాం. ౫, ఆ. ౬౦౦. హరి. పూ. ౨, ఆ. ౧౫౨.

తొడరుపు. దే. వి. యత్నము. "ఆ. దైవ మిట్టు గలఁ చునే వీరి మది పుష్పిపుండి ఘోర మైనయుద్ధము నను, దొడరపలయు నట్టితొడరుపు గావించి, కొనిరి చీకురాజుకొడుకు లేచి." భార. కల్యా. ౧, ఆ. ౩౪౯ (శ. ర. పా) భార. అశ్వ. ౧, ఆ. ౫౭, విణ. మొదటిది. "ద్వి. తొడలపై నున్న యాతొడరువ్రకొడుకుఁ, దొడిబడఁ గడఁబడఁ ద్రోసి యగ్రమున. ద్వి. భాగ. (శ. ర. పా.)

తొడవు. దే. వి. (తొడు ధా.) భూషణము, నగ. "సీ. కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి తొడ వులు తొడవవా తొడవు తొడవ" భాగ. ౧, స్కం. ౨౬౮. అం. భా. ద్వి. ౧౪౭.

తొడసోఁకు. దే. అ. క్రి (తొడ+సోఁకు) రమించు. "గీ. వానికై చంద్రరేఖ యన్నారవనిత ముచుపు తొడసోఁకుఁడియు మోహమందు." శుక. ౨, ఆ. ౬౪.

తొడి. దే. వి. (తొడు. ధా.) 1 భూషణము. "క. విడువఁ దగు నతి చలించిన, విడువంగా రాదు ప్రాణపతుఁ గులసతికిన్, బడఁతికిఁ బతిభక్తికదా, తొడి వాయఁగ జన్న వికచతోయజనేత్రా." రుక్మా. ౪, ఆ. ౧౧౭; 2. కత్తి మున్నగువానికి వేయుపొన్ను. (బ్రౌ.) 3. త్వర,సంభ్రమము. (దీనియామ్రేడితరూపము తొడితొడి.) "శా... గా, యింటం బుట్టెద వచ్చుఁ గంటుఁడు తొడిన్ హింసించె నీయన్నలన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౪. "క. తొడితొడిఁ గంసుఁడు దేవకి

కొడుకుల నార్యుర వధింప..." భాగ. ౧౦, స్కం. పూ. ౫౬; 4. బాధ. (చూ. తొడిఁబడు.)

తొడిఁబడు. దే. అ. క్రి. (తొడిన్+పడు.) 1. తొట్రుపడు. "చ. నడు మడచు...అడుగిడుచోటఁ గాల్దొ మలినంతన కొనుకు భిందమయ్యెడుం, దొడిఁబడఁ జేయుఁ మావలన దోసము లే దని చెప్పఁ డాసె నా, గడుబెడఁగొందు గాంత తెలిగన్నులు పీచుల వాసి దేసిరై." కు సం ౯ ఆ ౧౬; 2. బాధపడు. "చ...నీ వదనసరోజసౌరభ మవారణ నన్నును గ్రోలనిమ్ము పెట్టెదఁ దగు కామతూపులఁ దొడింబడకుండఁగఁ గావు మిత్తతిన్" భార. విరా. ౨, ఆ. ౧౨౧; 3 చలించు. "క. నందనవనవాసము తన, డెందముఁ గుందింపఁగాఁ దొడింబడి తానున్, నందనవనవాసము విభుఁ, డొంద రఘూత్తముఁ బాసి యుండం గలఁడే." రామా. ౫ ఆ. ౯౧. (శ. ర. పా.); 4. చెవరు "క వడ్డింపఁగ కౌఁగిలి దొడిఁబడ్డ వెసన్ వంటకంబు పాయ నిడఁ దగున్." విజ్ఞా. ఆచా. ౭౯; 5. తొందరపడు. "క. రాసుతుఁ డని తొడిఁబడఁ డగి, గాసిని బెట్ట కడియూపఁ గాచుక మన మీ, మోసాల నున్న నెక్కడ, మోసా లానో యటంచు ముంచినభీతిన్." సా. 3, ఆ. 3౪, కళా. 3, ఆ. ౫౨; 6. శీఘ్రముగాఁ బోవు. "ఉ. సుందరి రాజనందనునిఁ జూచిన చూపుల వజ్జఁ బోయి నా, డెందము పూవుఁదూఁపులఁ దొడింబడి మన్మథరాగవార్ధిలోన్, డించె .."దశ. 3, ఆ. ౧౩౧. ఇంద. ౪, ఆ. ౬౭, 7. వ్యాపించు "క. తొడగివతొడవులగిత్తులు, తొడిఁబడి చీకట్లు దూలఁ దూలఁగఁ దనప్రైఁ, దొడరినహస్తము వోఁకినఁ, బడఁతుక మేల్కాంచి చూచి భయకంపితరై." సా. పంచ. 3, ఆ. ౧౯౪.

తొడికాల్లపడు. ద్వ. తొట్రుపడు. "ద్వి. తురగంబు గూలుచోఁ దొడికాల్లపడుచు,నరుగ నోపక దీను లైనరాహుతులు."ద్వి. భార. విరా. ౧, ఆ. ౧౨, ౨.

తొడికించు. దే. స. క్రి. (తొడుకు ధా.) పట్టించు, పట్టుకొనఁజేయు. 'ద్వి. దుష్టోరగ్నమునఁ దొడికింత మనుచు." బస. ౬. ఆ. ౪౭౩. పం.

తొడికిపట్టు. ద్వ.స. క్రి. (తొడికి+పట్టు.) ఒడిసి పట్టు. "సీ. నడు మింత యని కేలఁ దొడికిపట్టిన ధాత యంగుళిరేఖ లబ్జాస్యవళులు."నైష. ౨, ఆ.౧౫.

తొడికలు. దే. స. క్రి. (తొడుకు ధా.) 1. ఒడిసి పట్టుకొను. "చ. తడయక మందుతైలపరిత ప్తకటాహము కేలందామరం, దొడికిలిపట్టి రావాంఘ్రివిధుం గళింపచివరీలఁ జూప...సుధన్వుఁడు పొచ్చెపట్టుగా, నుడికెడినూనెలొట్టి బలిమిన్ హరి దాసులు సత్యసంపదన్." జై. ౪, ఆ. ౧౩౩; 2. దొంగిలించు. "ద్వి. పడుచు పాపముచేసి మృడునోగిరములు,దొడికిలి తిను శివద్రోహి వీఁడనుచు."బస. ౪, ఆ. ౪౯, పం.

తొడికొను. దే. స క్రి. (తొడుగు+కొను.) "చ .. వెసఁ బాదుకల్ దొడికొంచు వియచ్చరవాహినీ కన,త్కనకసరోజగంధవహకౌతుకుఁడై వినువీథి కేఁగుచున్." విక్ర. ౬, ఆ. ౧౭.

తొడితెచ్చు. దే. స. క్రి. వెంటఁ దీసికొని వచ్చు. "క. తడవాబోయిరి దైత్యులు పొడగని యూర్వశి తొలఁగి పోనేల నిను,దొడితెమ్మని మారా జదె, బడిబడి వచ్చెదరు వేగ పనివిను మనినన్." ఉ. హరి. ౧, ఆ. ౫౫, కృష్ణ. ౪. ఆ. ౨౧.

తొడిమ. దే. వి. ఆకు పూవు మొదలగువానితల నుండెడికాడ, వృంతము. "ఆ.......పక్వఫలము దొడిమఁ బాయు,పగిది గుణచయంబుఁ బాసి యతఁ,డయంబు నచలమును నిరామయంబును నగు, పదముఁ జెందు శుద్ధభావ మెసఁగ."భార. అను. 3, ఆ. 3౧౨. అం. భా. ద్వి. 3౯.

తొడియు. దే. స. క్రి. (క. తొడిసు.) (బాణాదులు.) గుచ్చు,నాటు. "క. పుచ్చినకన్నులు గ్రమ్మఱ, వచ్చుచు దేహంబు తొడిసి వ్రచ్చిన పుండుం, జెచ్చెరఁ దేఱును భక్తులకచ్చెరువుగ శివునిమహిమ నతిశీఘ్రమునన్." శివ. సా. ౧౯౯.

తొడివెంద. దే. వి. ఫలవృక్షవిశేషము. "సీ...కలిజె, పుడులుఁ దొడివెందపండ్లుఁ దుమ్మికపండ్లు జాన పండులు గంగరేనుపండ్లు" కాళ ౬, ఆ. ౬౯.

తొడు. దే. స. క్రి. (క. తొడు.) 1. (సొమ్ములు మున్నగువానిని) ధరించు. "సీ. కట్టంగఁ దొడఁ బూయఁ బెట్టఁ గొఱంత లే కానంద మందెదు సర్థులందు. 'నిర్వ. ౧, ఆ. ౩౮, భార. ఆది. ౯,ఆ. ౧౨౪; 2. (బాణము) సంధించు. "ఉ. వెండియు నేనుబాణములు వే తొడి ధర్మజు నొవ్వ నేయ .."భార. భీష్మ. 3, ఆ. ౪౦. భార.భీష్మ. ౨,ఆ. ౨౦౯. వి. పట్ట. "సీ...తొడుపట్ట తోలు

తెక్క...గీ. అంట క్వగాఖ్య యగా .."ఆం.భా. ద్వి. ౩౭.

తోడుకు. దే. అ. క్రి. తెగించు. "ద్వి. తోడవులకై తెంపుతోఁ బ్రాణములకుఁ,దోడికి ముద్దులకట్టిఁ దునుమ నేమిటికి." ద్వి. పారిజా. ౨. ౨౩౬. స. స. క్రి. 1. త్రావు. "సీ. అందంద వతో గుహాములు దింపులుకోవఁ దోడుకనిచ్చుట యెట్లు దుగ్ధరసము." కాశీ. ౪, ఆ. ౧౮. పాండు. ౩, ఆ. ౬౭; 2. పట్టుకొను. "సీ. బెడఁగారు గాహిఁ దోడుకనే నూగారు,తోడు పొల్లఁ గాక కాఁ దోడుకు మనిన." పాండు. ౫, ఆ. ౧౮౪. రాజ చ. ౬, ఆ. ౨౭౧. వి. 1. ఆవు. 'గీ. పుకమి యీనిన తెఱఁగున నడరుకకని,తోడుకులం జల్లమిగ తెక్క యిడఁగరాదు."నీలా. ౧, ఆ. ౫౦ అచ్చ. బాల. ౮౪; 2. వృషభము. "మ. కడవాలున్ ఘటియింపు మాచు దికిఖుల్ ప్రార్థింప నక్వహ్ని యయున్,దోడుకుంద త్తడిజోడు తేజము సుధాఁగో వాహినీవారి నిల్పుదు .." చం. రా. ౩ ఆ. ౬; 3. దొంగమేఁత. "క. తోడుకు దినఁ బోవుక నరమ,బడిః బోకుము .." భో. ౬, ఆ. ౩౪, 4. గోమహిష్యాదులు,పశువులు.' సీ. గోమహిష్యాదులనామనుల్ కని తోట్టు తోడుకు కసరకు గా నమరు .." ఆం. భా. ద్వి ౨౬౧.

తోడుకుసామి. ప్వ. వి. (తోడుకు+సామి.) శివుడు. వేంక. దేవ. ౫.

తోడుకొను. దే. స. క్రి. (తోడు+కొను.) 1. తోడు గుకొను. "క. పాలుఁ జెప్పులు తోడుకొని,దేవ శివాలయములోనఁ ద్రిమ్మరుపాపుల్." శివ పా. ౧౯౧, 2. వెంటఁదీసికొను. "చ. కడువెర వేవి నేఁ బ్రకమగర్భవతిన్ నతిఁ బుట్టి నింటికిఁ,దోడు కొని వచ్చుచో నిచట దున్సవా మైనప్రసూతి వేదనం,బడియెడు .." విక్ర. ౮, ఆ. ౩౫.

తోడుగఱ. దే. వి. ముండ్లకంపమోపు. "క. కడి కంట జెపుడుఁ దఱుఁగక,కడి గఱగఁగ పడికుఁ దఱిఁగి గాసిన్ బుదమిన్,బడినఁ గనరాక మాచపుఁ దోడుగఱలై రట్టె రుజాలతో కేము దున్." స్వా ౩, ఆ. ౧౩౧.

తోడుగట్టి. = తోడుగఱ. "సీ...తోడుగట్టి యీడిక సుడుము కంపుయనఁ దనర్చును గంటకాది భారము..."ఆం. భా. ద్వి. ౩౮.

తోడుగు. దే. స. క్రి. 1. (వింటబాణము) సంధించు. "వ ..ఏడుబాణంబు లొక్కటఁ దొడిగి .." భార. ఆది. ౫, ఆ. ౨౩౪. చంద్రా. ౧, ఆ. ౭౦; 2. ప్రయోగించు. "క. వారుణవాయువ్యంబుల, నారాయణమీఁదఁ దొడిగె నరపతిశరముల్, ఘోరశిఖివజ్రశరవి,స్ఫారతఁ దద్దీప్తి మాపెఁ బద్మేక్షణుఁడున్." హరి ఉ. ౧, ఆ. ౧౫౩. భార. భీష్మ. ౩, ఆ. ౧౨౫; 3. భూషణాదులు ధరించు. "వ . అయ్యా మదీయధర్మపత్ని యాభరణంబులు దొడుగ నవసరంబై యాంగ్నయది మద్వచనంబున వాసి నిల్పించుకొమ్మనిన."భార. ఆది. ౧, ఆ. ౯౬. ఉ. రా. ౨, ఆ. ౧౦౧; 4. (భూషణాదులు) ధరింపఁజేయు. "గీ. నీలకు మణీవిభూషణపాళిఁ దొడిగి .." ఉ. రా. ౧, ఆ ౪౪. వి. 1. ఆభరణము. "క. ఉడురాజముఖుల కెల్లను, దొడు గయ్యెడు గాకఁ దొడుగు దొడుగఁగ నేలా,దొడుగలు దొడిగినఁ గొఱఁ తవి,యుడు రాజోత్తమసుఁ జూడ నొక్కటె వచ్చెన్." వీర. ౩ ఆ. ౧౪౭; 2. కవచము. "సీ. తొడుగులు సడలి కుత్తుక విండి మిక్కిలి వెడరూపులై పడ్డ వీరభటులు." జై. ౨, ఆ. ౭౮. (శ. ర పా.); 3. బాణము. (శ. ర.), 4. గవుసెన,దిండ్లు మున్నగువానికప్పు. (శ. శ.); 5. ముండ్లకంప మోపు. 'గీ. కంప తొడు గిడ్చిన ట్లేఁదుగానఁ జన్నఁ,దెరు వెఱుఁగుచు .." స్వా. ౪, ఆ. ౫౪.

తొడుపు. దే. స. క్రి. (తొడుగు ధా. ప్రే.) ధరింపఁ జేయు.. 'సీ నవకుసుమంబుల నానావిధంబుల తొడవులు రచియించి తొడిపి వేడ్క." కు. సం. ౪, ఆ. ౧౧౫. వి. 1. గదాదండాదులకు వేసెడి యినుపపొన్ను. "సీ. అను నఁ దొడుపన కాంచోళికాదిదండాగ్రసందేయాఖ్య యలరు చుండు" ఆం. భా. ద్వి. ౨౦౨; 2. కవచము. (శ. ర.), 3. చెప్పినది మరలఁ జెప్పుట. (శ. ర.); 4. ఒకరకమైన కత్తి. "గీ. పాలబుడిగలు వడిసెల ప్రాఁతమెట్లు,మలకు మందులపొడి బుఱ్ఱ మస్ను మట్లు,తోలుకుళ్లాయి తొడుపును దొడ్డికంకు,చుట్టుచదిరెయుఁ గొమరొప్పు సొలయుం నతఁడు." హంస. ౨, ఆ. ౭౫.

తొడుపుఁగత్తి. ద్వ. వి. (తొడుపు+కత్తి.) చేతికిఁ దగిలించుకొను నినుపతొడుగు గలకత్తి,ఖడ్గవిశే

షము. "వ. తొడుపుఁగత్తులు విసవిస ఁసరుచు...నఱకులాడురవ్రతులును గలిగి . దారుణంబయినయారణంబున .." శశాం. ౫, ఆ. ౨౧. శుక. 3, ఆ. ౧౫౮.

తొడుపు=తొడుగు. (భూషణాదులు) ధరించు. "క. కుడువను గట్టను బాయను, దొసువను బోఁ బనుచుఁగాక తొలుత మైన సొరం,గొడుకును బనుచుట కెవ్వఁడుఁ,గడఁగును నాయట్టిపాపకర్ముఁడు దక్కన్." భార ద్రో. ౨, ఆ. ౧౪౨. రాజ. చ ౨, ఆ. ౧౬౯.

తొడుసు. దే. వి. 1. సంబంధము. "ఆ. విష్ణుదేవుచేత వెస మాలి పస మాలి,కడుసు మాలి యొడలి తొడుసు మాలి,పొలియు బలిమిఁ జేరెఁ బూర్వస్థితికి ముప్పు,లేమి మాల్యవంతుఁ డోమహాత్మ." రామా. ౭, ఆ. ౭3. పాండు. ౫, ఆ, ౧౭౪, 2. విచారము. "చ. నడుఁకక కంసుకారణమునం దడఁ బొందినశోకవహ్నితుఁడుడు కపు డుగ్రసేనుఁ డసహనాతముచేసె మృగేంద్రపీఠికిం,దొడ పయి రత్నకుంభభృకతోయముచే నభిషేక మాడి ప్రాఁ దొడుసులు మాన కీలుపుగుఁ దోయజనాభుని కూర్చువారికిన్." సాంబో. ౧, ఆ. ౧౬౯, 3. శ్రమ, బాధ. "గీ. కండ్రికరమునఁ బెనిమిటి తరమునందు, వీసమంతయుఁ బుణ్యంబుఁ జేసి యెఱుఁగ,వార్ధకంబున నింకేల వట్టితొడుసు,కృష్ణ దర్శింపకున్న నాకేమి చిక్కు" జై. ౨, ఆ. ౧౦౯. దశ. ౬, ఆ. ౧౭౬, 4. దోషము. "చ . అసరసులఁ గూడి చారుగతి నద్వితయుల్ భజియింపఁ బాదవి,స్ఫురణ ఘటింపుచుఁ దొడుసు పుట్టక యుంజ్జ్వలధారచే నుదా,వారణము చేయుచున్నకవి నారసి మాడు మరాళగామినీ." వేం. పంచ. ౪, ఆ. ౧౧3.

తొడ్గు=తొడుగు. 1. (ప్రయోగించు.) "సీ. అక్కుమారుఁడు ఒరహాసాభిరాముఁడై భల్ల మొక్కటి దొడ్గి విల్లు దునిమి." భార భీష్మ. ౧, ఆ. ౨౫౪; 2. (భూషణాదులు ధరించు.) 'సీ. గురుపల్లి కేడ యక్కుండలంబులు తొడ్గుదివస మీదివస మతిక్రమింప." భార. ఆది. ౧, ఆ. ౧౧౫.

తొత్తడి. దే. వి. దాసి. "ద్వి. తొత్తడిసంపద తొలఁగెఁ దక్షణము." బస. ౪, ఆ. ౨౯౨, పం.

తొత్తఱికము. దే. వి. (తొత్తు+ఱికము.) తొత్తుఁదనము. (శ. ర)

తొత్తు. దే. వి. (క. తొత్తు.) 1. దాసి,దాసి. "ఉ. తొత్తులువోలెఁ దక్కుదురు దొప్పలుకోరలు ముక్తిభామినుల్." కాశీ. ౨, ఆ. ౪౯, దశా. ౭, ఆ. 3; 2. లంజె,ఆఁడుటాలు; వేశ్య. "సీ. కల్లిదంద్రులఁ జాపి ధన మెత్తికొనిపోయి చెలఁగి తొత్తులఁ బొత్తుగలయుఁవారు." దశా. ౧౦, ఆ ౧౦౫, భాగ. ౬, స్కం. ౬౦.

తొత్తుపడుచే. దే. వి. (తొత్తు+పడుచు.) దాసి. "సీ. పడఁలు దీర్చినతొత్తుపడుచుల నిష్టాగ్నితృప్తి నొందఁగఁ జేసి యిండ్ల కనిచి." శుక.౧ ఆ.౧౪౯.

తొత్తులమాఁ) దే. విణ. తొత్తులయిండ్లకుఁ బోవు స్వభావము గలవాఁడు. "ఉ...వాఁడు రో, తొత్తులమాఁగిరియై గృహము ద్రొక్కక యొక్కక ఁనిఁ బూనికన్, గుత్తకు నంచు నుంచుకొనెఁ గోకలు సాకలు జోక నీయఁగన్." నిరం. ౨, ఆ. ౪౭.

తొన. దే. వి. తొల (శ. ర.) విణ. (క. తుక్తై.) రక్షకము. "గీ...తోడు దొన యైనచుట్టంబు దొరకు టెట్లు.' జై. ౧, ఆ. ౧౦౫.

తొనఁకు. దే. అ. క్రి. 1. పొంగు. "చ. కదలిక యల్ గడుం దొనఁకి కట్టడికట్టలు దాఁటి పాఱఁగా." అచ్చ. యు. ౧౬౨; 2. ఒప్పు. "సీ. జలజాక్షీ కావ్యంబుఁ జదువునోఁ బాంచాల గతిచోట బావాటక్రమము దొనఁకు."అని. ౨, ఆ. ౭౬. వి. తొట్రుపాటు. "క...ఉల్లాసములఁ బలు, తొనఁకు పొరఁగ నరికిఁ దొలఁగఁ దోలినరథముల్."భార కర్ణ. ౧, ఆ. ౧౧౦. (శ.ర. పా.)

తొన్నుంను. దే అ. క్రి. శయనించు "సీ...పన్నుండెఁ దొన్నుండెఁ బవ్వళించె,-త్తమిల్లెఁ బరుండెఁ ననఁ దగు శయనించె ననుట కు..." వెంక. మాన.౪౭.

తొపారము. దే. వి. డేగలముఖమునకుఁ గట్టెడితోలు గంత. "‘. టోరములు దీసి చెంచులుఁ మోరల వేసినతొపారములు పీడిచి ను,న్నారఁగను దువ్వి తెక్కల,నారజముగ డేగవేట లాడిరి వేడ్కన్." భాను. ౨, ఆ. (శ. ర.)

తొప్పు. దే. వి. 1. ఎఱ్ఱనిది. "గీ. మేనికుంకుమరాగంబు మెలఁకతొప్పు, మోవితాంబూలరాగంబు మొగిననాసి,చారుతర మయ్యె..." కు. సు. ౨,

ఆ. ౮౪. నిర్వ. ౮, ఆ. ౮౦; 2. మిక్కిలి. అధికము. (చూ. తొప్పలు దొరలు.) క్రి. వి శే. అధికముగా. (చూ. తొప్పఁదొరఁగు.)

తొప్పఁదొరఁగు. దే.అ. క్రి. (తొప్పన్+తొరఁగు.) మిక్కిలి స్రవించు. "వ..తొప్పఁదొరఁగుపుప్పొడిం గలిసి యొప్పెడివిప్పొంగలసరోవరంపుటెసుకతిప్పలను .." పి. శకుం. 3, ఆ. ౨౬3.

తొప్పఁదోఁగు. దే. అ. క్రి. (తొప్పన్+తోఁగు.) మిగుల మునుఁగు. "సీ. ధూత్కార మొనరించు ద్రుమిచండపలిమేను దొండొంటు తుప్పరఁ దొప్పఁ దోఁగ." కాశీ. ౬, ఆ. ౧౭౮, కు. సం. ౧౧, ఆ. ౨౦౨.

తొప్పఁదోఁచే. దే.స.క్రి. (తొప్పఁదోఁగు. ధా. ప్రే.) ముంచు. "స. బభ్రువ దనేకబాణాఖులం గౌశికునంగంబు నొప్పించిన నయ్యమవీరుని నాతండు సాంద్రశరవృష్టిం దొప్పఁదోఁచుటయు .." హరి. ఉ. ౨, ఆ. ౪౬, హరి ఉ. ౮, ఆ. ౨౧౪.

తొప్పనఁదోఁగు = తొప్పఁదోఁగు "ద్వి. హరధిక్తని కరదయామృతవృష్టి, పగిఁని కుటియుఁ దొప్పనఁ దోఁగి తోఁగి." బస. ౨, ఆ. ౧౬౮, ౯౦.

తొప్పర. దే. వి. తృణవిశేషము శీ. "గీ. తొప్ప రంట్రింత సాలువ యుప్పుగడ్డి... మొదలుగాఁ బూరి రవులింపఁ బొదలు వెదలు." ప్రబోధ ౨౦౧.

తొప్పఱ దే. వి. (త. తొప్పఱై.) సంక్షోభము, కలఁత. (చూ. తొప్పఱఁబెట్టు.)

తొప్పఱఁబెట్టు. దే. స. క్రి. (తొప్పఱన్+పెట్టు.) బాధించు. "మ. వెఱ నిట్లంబుధివాహినందవులు దోర్వీర్యంబు సాలించి యంతఁ జాఱంగ నిశాచరేంద్రుఁడు జయోత్సాహంబునన్ వెన్ను డిన్ దఱుమంగాఁ బ్రజ జేయువిచుచు సముద్యద్వేగుఁడై తోఁచి తొప్పఱఁబెట్టెన్ శరజాలమున్ బిఱుదఁ గుప్పంగూర నాఁటించుచున్." నిర్వ. ౫, ఆ. ౮౮.

తొప్పఱలాడు. దే. స. క్రి. (తొప్పఱలు+ఆడు.) కలఁచు, క్షోభింపఁజేయు. "సీ. చిక్కఁజేయుగఁ గూల్చ సింహపోతకములఁ దోలి తొప్పఱలాడుఁ గ్రోలుపులుల." పి. శకుం. ౨, ఆ. ౧౨.

తొప్పఱిల్లు. దే. అ. క్రి. (తొప్పఱ ధా.) ఒఱఁగు. (శ. ర.)

తొప్పఱు. దే. అ. క్రి. ఒఱగు. (శ. ర.)

తొప్పలు దొరలు. దే. వి. బ. (తొప్పలు+దొరలు.) కోటానఁగోట్లు. "ఉ ..విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మనిపూవుగుత్తులన్, బత్తిరిఁ బూజచేసి నుతిపాతములన్ శవణించువారికిన్, దొత్తులుతోఁ జెదక్కుదురు తొప్పలుదొరలు ముక్తిభామినుల్." కాశీ. ౨, ఆ. ౪౯.

తొప్పి. దే. వి. (త. తొప్పి.) టోపి. (శ. ర.)

తొప్పు. దే. వి. (క. తొప్పను.) చేగులతో నోరు బాదుకొనుటయం దగుధ్వని కనుకరణము. (దీని యామ్రేడితరూపము తొప్పుతొప్పు.) "క.వ్రే లెడు వెంట్రుక లిరుగడఁ, దూలఁగఁ దలయూఁచుఁ దొప్పుతొప్పన మోమంగేల నడిచికొను నెలవుల, లాలలు తొరఁగంగ నన్నలా యని యొఱలున్." ఉ హరి. ౪, ఆ ౩౦౨

తొబక. దే విశే. విత్తులు రానిది. (మిరెపకాయలో నగునది. శ. ర.)

తొమ్మండ్రు. దే. స. బ. తొమ్మిదిమంది. (తొమ్మిదికి మహన్మహత్త్వర్థకరూపము.) "సీ. తొమ్మండ్రు కొడుకులఁ దొలిచూలుపులఁ జేయఁ బొడమించునేచేవ బొడ్డుదమ్మి." ఉ. హరి. ౨, ఆ. ౧౪౪.

తొమ్మందుము. ద్వి వి. (తొమ్మిది+తూము.) తొమ్మిది తూములు. "సీ.. తొమ్మందు మనంగ నవాఢకీ నామ మొప్పు." ఆం. భా. ద్వి. ౨౭౧.

తొమ్మనూఱు. దే. స. (తొమ్మిది+నూఱు.) తొమ్మిది వందల. "ఉ. పొచ్చెము నొంద దీనదుమఁ బోయినయేఁడులు తొమ్మనూటిపైనచ్చుగ నేఁడు మీఁద నెలలాఱు దినంబులుమూఁడు నేఁటితోన్." వి. శు ౨, ఆ. ౨౩౯. నిర్వ. ౮, ఆ. ౮౪.

తొమ్మన్నూఱు = తొమ్మనూఱు. (శ. ర.)

తొమ్మాడు. దే. వి నాశము వ్యవ—దానిని తొక్కి తొమ్మాడుచేసినాడు. (శ. ర.)

తొమ్మిది. దే. స. బో. ఎనిమిదియు నొకటి. "క. అది సూతనందనుఁడు తొమ్మిది శరములఁ దునుము టయు .." భార. ద్రో. ౪, ఆ. ౨౩౪. స్వా. ౪, ఆ. 3.

తొయ్యలి. దే. వి. (త. తైయల్.) స్త్రీ, ఆఁడుది. "సీ మించి తావులు గ్రమ్ముమంచిగందమ్మున నట కలి యుడియెఁ దొయ్యలి యొకర్తు." య. ౪, ఆ. ౮౫.

తొర్యాలి = తొయ్యాలి. "చ ..తొ,ర్యాలివలుకుల్ వినంగఁ బొదరిండ్లకుఁ గోయిలవిందు చేరె..." అహల్యా. ౨, ఆ. ౯౦

తొర. వై. వి. (సం. త్వరా.) 1. వేగిరపాటు. "ఉ. అంకటిలోన నీకఁ దుదయాద్రిపయిం బొడతెంచు పద్మినీ,కాంతు...కనుంగొని పం డటంచు వి,భ్రాంతి వహించి యూఁకటితొరల్ రవిపై కెగసెన్..." ఉ. రా. ౫ ఆ. ౯౭; 2. ఆపద, "ఉ . భూనిక వేను వైకొని ప్రభుత్వము గానఁబడంగ నిల్పి రొ,వ్వానికిఁ లోఁగ కెంతతొర వచ్చినఁ గాచెద నిన్నుఁ గూరిమిన్." హరివ ౪, ఆ. ౧౦౮.

తొరఁగించు. దే. స. క్రి. (తొరఁగు ధా. ప్రే.) 1. వైచు. "మ. నరకుం డొందుశరాసనంబు గొని యన్యస్యందనం బెక్కి వే,తొరగించెన్ శరముల్ మురారిపయి వైదున్..." ఉ. హరి. ౧, ఆ. ౧౭౧. భాగ. ౧౦, స్కం. ఉ. ౫౫౩; 2. పడఁగొట్టు. "క. శరములు బలుగడి నిగుడుచుఁ, బరువడి నయ్యాతుధాన భటముక్తశిలా, తరుశస్త్రపరంపర వెసఁ, దొరఁగించుచు వారిఁ దోన తుదముట్టిడెన్." భా. రా. అర. ౧, ఆ. ౨౨౪; 3. వర్షింపఁజేయు. "చ. చిటిపొటిముబ్బు లాకసపు సీమ...తటిల్లతా,కుటిలతఁ గొంచెపాటి చినుకుల్ దొరఁగించె ధరాతలమ్మునన్." శుక. ౨, ఆ. ౩౪౦. భా. రా. యు. ౫౨౬.

తొరఁగు. దే అ. క్రి. 1. పడు. "గీ. దివిజపతి నీకు నిచ్చినశక్తిప్రశక్తి,చేతఁ గవ్వడి పడు నని చూతు లేని,వాసుదేవునిచే నది వ్రయ్యలయ్యెఁ, గునియ లయ్యును బొడియయ్యెఁ దొరఁగు ధరణి." భార. ఉద్యో. ౨, ఆ. ౨౭ ౨. స్వా. ౨, ఆ. ౫౫; 2. స్రవించు "క. క్షతములఁ బెల్లు దొరఁగుచో, నెత్తధారలు మదమఁగా విసిగ్గశకరియా,కృతిఁ గవిసె యతం డేసెను,శతముఖసుతుఫాలతలము శాతశరమునన్." భార. విరా. ౫, ఆ. ౧౯౯. పాండు. ౧, ఆ. ౧౧౭; 3. వర్షించు. "ద్వి. ధారుణీపతి గాధితనయహస్తమున,ధారవోసినజల ధారకు ముత్తు,తొరఁగెఁ బువ్వులవాన తోడనే మ్రోసె, సురదుందుభులు..." ద్వి. హరివ. పూ. ౧౪౪౦; 4. ప్రవహించు. "సీ. కరుణారసము వొంగి తొరఁగెడుచాడ్పున శశిరేఖ నమృతంబు జాలువాఱ." భార. విరా. ౧, ఆ. ౧౨. విక్ర. ౧, ఆ. ౯౫; 5. లోఁబడు. "ఆ. దైవయోగమునకు దట్టినమేలుకీ,డ్లనుభవింప కెట్టు లరుగ వచ్చుఁ,గాన కార్య లోకగతి నుండుదురు సుఖ,దుఃఖములకు మనము దొరఁగనీక." కుచేల. ౩, ఆ. ౧౯, 6. (పుష్పాలు ఎన్నగునవి) రాలు. "క. ఘనపవనానిలచలితా, వనిరుహములవలనఁ దొరఁగు వరపుష్పచయం,బు .." భార. ఆది. ౨, ఆ. ౭౯. నిర్వ. ౧౦, ఆ. ౧౪౬. స. క్రి. పీడు,త్యజించు. "ఉ. ..అలపార్శ్వమఁ బట్టు కొవంబు పట్టె సా,రంగధరుండు నేయము దొరంగు మదిం జనుదేర..." సా. ౨, ఆ. ౭౧౮. హరి. ౪, ఆ ౩౨. [(వా.)

తొరపడము. దే. వి. వడ్రంగి బెజ్జములు చేయుసాధన

తొరపడు వై అ. క్రి (తొర+పడు.) వేగిరపడు. "ద్వి ..బంతిఁ,గూర్చున్నశశధరార్కుల కమృతంబు,మార్చి తా నిట రాక మసలె నటంచుఁ, దొరపడుచున్నదైత్యులకు..." విష్ణు. ఉ. ౪, ఆ. (శ. ర.)

తొరపణము = తొరపడము. (వా.)

తొరలించు. దే. స. క్రి. చల్లార్చు. (శ. ర)

తొరలు. దే. అ. క్రి. 1 కలుగు. "వ...పయోధరంబుల నంటుచు విశదాంశుకాంతస్థితి దొరలంగ నతివిపులపులినజఘనారోహంబుల నుత్పలపత్త్రంబుల దెఱపుచు..." వసు. ౬, ఆ. ౧౪౦. సా. ౨, ఆ. ౧౪౦; 2. మార్కొను. "ద్వి. తర మెఱుంగక రామధరణీశుతోడఁ,దొరలితే భస్మమై త్రుంగెదు గాక." రం. రా. సుం. ౨౫౧ పు. ౭, పం, 3. చేరు,కూడు. (చూ. తొరలించు); 4. మాఱు. (చూ. తొరల్చు.)

తొరలుచు = తొరల్చు.

తొరల్చు. దే. స. క్రి. (తొరలు ధా. ప్రే.) మార్చు. "ఉ. అయతికాని కీడు మకరాలయముఖ్యము లాతఁ దర్థతృష్ణాయుతుఁడై నిజోర్వి నగునన్నిటిఁ దద్ధనముల్ తొరల్చి రా,జాయతనంబుఁ జేర్చు మఱియట్టి దసహ్యము గాన నొంటిగాఁ,డే యతిథి కారి కావలసిం నిందుకతిన్నను వాఁడె రూపఱున్." ఆము. ౪, ఆ. ౨౧౮.

తొరతొరి. దే. అవ్య. క్రి. విశ. త్వరగా. (శ. ర.)

తొరుఁగు = తొరఁగు. దే. అ. క్రి. 1. రాలు. "క. వనలక్ష్మి మాధవాగతి,ననువుగఁ బాటిట జలక

మాడుటకై ముందనువున నలుగిడఁగా నుర్లిన చిక్కని మనంగ ధరఁ దొరఁగెఁ గారాకుల్." చంద్ర. ౩, ఆ ౧౦౬. వాల్మీకి. ౩, ఆ. ౬౩, ౨. "క...సుగంధము గలవిరిపోన సురపథంబున దొరుఁగన్." రాఘవ. ౧, ఆ. ౬౯; ౩ ప్రవహించు. "సీ. శృంగాగ్రదళితవైరించాండగళితా వరణధార లన నిర్ఝరములు దొరుఁగ." దశా. ౨, ఆ. ౨౦౦, ౪. జాఱు. "వ...ఖలీనంబుల పీనినంబు లైనఫేనంబులు దొరుఁగ నిరుగడలఁ గదలు కొనుకర్ణచామరంబు లిసుమడింప..." ఉ. హరి. ౪, ఆ. ౨౮౩. స క్రి. వీడు,త్యజించు. "గీ. దుస్స్థుఁడై యుండియును నొప్పు దొరుఁగ కున్న, యన్న కేశ్వరుఁ గనుఁగొని .." భార. శల్య. ౨,

తొరుఫు. దే. స. క్రి. తొరలించు. (శ. ర.)

తొర్లించు. దే. స. క్రి. (తొరుగధా. ప్రే.) వేడి నీళ్లు చన్నీళ్లు కలిపి చల్లార్చు (శ. ర.)

తొర్లుగట్టె. గ్రా. వి. (తొర్లు+కట్టె.) గొల్లవానియొద్ద నుండుపశువులను దోలు పోడు గైనవెదురుకఱ్ఱ. "సీ. తొర్లుగట్టెయుఁ జలద్రుప్ప చిల్కుడుగుంజ పూజెబిందెలు వెన్నపూసచట్టి." హంస ౨, ఆ. ౭౫.

తొర్లుగోవి = తొర్లుగట్టె. (తొర్లు+కోవి.) "ఆ. తూఁకకొమ్ము చంక దోఁపినయెడయొట్టి,తొర్లుగోవి ధూళిధూసరితములైనకురులు నమర శాకస్మికంబుగా,మందచుండి యింటిమొగఁడు వచ్చె." వేం. పంచ. ౨, ఆ. ౫౯౯.

తొఱ. దే. వి. (క. తొఱె) ౧. చెట్లయం దేర్పడెడు పెద్దరంధ్రము,కోటరము. "క. తొఱలోపల నొక యెద నొక,యఱగా నొసరించి చిగురుటాకు లడుగునం,బఱచిన నది గడుమెత్తని,పఱపుగ నచ్చోట వాఁడు బట్టెం గనియెన్." భో. ౪, ఆ. ౧౭; ౨. రంధ్రము. "సీ. తో ల్గగ్గి తొఱ లేక తోముగ నసుపైన,కరుకాష్ఠమున దంతధావనంబు, వదనసంశుద్ధికై పలుమఱుఁ గావింపఁగ .." కాశీ. ౫, ఆ. ౨౦౫.

తొఱఁగించు. దే. స. క్రి. (తొఱఁగుధా.) వీడు త్యజించు. "క. అది యొండె భక్తి యొవతే,సద విష్ణైకభిరువృత్తిఁ ప్రియాలాభదశన్ మెయి దొఱఁగించుచుమాదనన యది శాశ యయున్న యదినై శేకముల్." ఆము. ౫, ఆ. ౯౧.

తొఱఁగు. దే. అ. క్రి. జాఱు, స్రవించు. "చ .. చెఱకులం,దొఱఁగెడుఘర్మముల్ కనదుదగ్రపటిచేఁ గుడిచెన్ నయంబుగన్." దశా. ౨, ఆ. ౩౧౬. స. క్రి. వీడు,త్యజించు "క. సురవరులఁ దొఱఁగి తన్నున్,వరియించితి నన్నుఁ బుత్త్రవతి నేలాగా చెచ్చెర విడిచె .." భార. ఆర. ౨, ఆ. ౨౦౯ హైమ. ౪, ఆ. ౧౨౪. వి. విడిచదుట. 'గీ. ఏఱ్పడాఁటులలోఁ దొఱఁ గెఱఁగఁ బడునె." ఉ. హరి. ౪, ఆ. ౩౦౯.

తొఱఁగుచొచ్చు. దే. అ క్రి.(తొఱఁగు+చొచ్చు.) (పసులు) తప్పించుకొనిపోవు. "క. పుంటిమొదవు లాఁబోతులు,సురశమ నకు విడిచి తెఱఁగు చొచ్చినయవియుం,బరిదిచ్చిన బెదరినవి యవి,సరి మేసిన బందగొనుట చన దధిపతికిన్." విజ్ఞా. ప్రా. ౧౩.

తొఱఁగుపోవు = తొఱఁగుచొచ్చు. "గీ. తొఱఁగు పోకుండ మెకములు గఱవకుండఁ,బాడి దఱఁగక యుండ నాపాటిగొల్ల,లిచ్చ మెచ్చ నీదృష్టికి నెక్కఁ గడపు,వరయ కేర్తుము నన్నేలు ధరణినాథ." భార. విరా. ౧, ఆ. ౧౭౯. సభ. ౧, ఆ. ౯౦, పు. ౨౩, పం.

తొఱలు దే. వి. తొఱ్ఱ, కోటరము. "చ. జరఠకపిత్థరంధ్రములు సాలబిలంబులగాధ నింబకో,టరములు మట్టిమ్రానితొఱటల్ పెనురావులతొఱ్ఱలు .." వేం. పంచ. ౩, ఆ. ౨౭౯. ఆం. భా. ద్వి. ౭౯.

తొఱటము = తొఱట. "క తిరుగాడుచుండఁగాఁ గని,కరము భయభ్రాంత మగుచుఁ గరిపరకర్త్రాం,తరవివరములోనికి నొక,తొఱటము గలి బరట మంత దురదురఁ దూరెన్." కేయూర. ౨, ఆ. ౧౦౧

తొఱటలువాఱు. దే. అ. క్రి. (తొఱటలు+వాఱు.) రంధ్రములుపడు. "క... పెద్దపులిచీమలు వెలువడి పడిఁ జీలిచె శరీరస్థ మెల్లఁ దొఱటలు వాఱన్." జై. ౭, ఆ. ౧౦౧. [(శ. ర.)

తొఱతేనె. దే. వి. (తొఱ+తేనె.) పుట్టతేనె.

తొఱవు = తొఱఁగు. (శ. ర.)

తొఱద్రొక్కు. దే. వి. (త్రొక్కు+త్రొక్కు.) గట్టి త్రొక్కుడు. "వ. వెఱచఱచి కఱచుకొనెఁ దఱిని నుడికినతొఱద్రొక్కునం గుక్కలచేఁ జిక్కటి ర్తైనయుంబులమూలంబు..." ఉ. హరి. ౪, ౬. ౨౦.

తొట్టి. దే. వి. 1. చెట్టునం దేర్పడు పెద్దరంధ్రము. ఆం. భా. ద్వి. ౨౮; 2. వృక్షవిశేషము. "గీ. .. సీకాయ ముద్ర తొట్టి,వెలఁగ ... మొదలుగా జగతిఁ గల్గు,కంప లన్నియుం వేకేఁగఁ గడచి కడచి." హంస. ౪, ఆ. ౯.

తొట్టిఁబులుఁగు. దే. వి. (తొట్టి+పులుఁగు.) గుడ్లగూబ. "సీ. చిర్తలు నొకధూర్తు నిందించుఁ గాకేమి త్రోవలఁ గూయదే తొట్టిఁబులుఁగు." నీతి. ౬౫.

తొట్టితేనియ. దే. వి. (తొట్టి+తేనియ) చెట్టుతొట్టిలోఁ బట్టిన తేనెపట్టుయొక్క తేనె తొట్టితేనె. "గీ. పుట్టతేనియ పెరతేనె పుటఁజూన్న, తొట్టితేనియ గల వందుఁ దోఁచి తోఁచి." కా. శ. 3, ఆ. ౬౮.

తొట్టి. దే.వి. 1. ముందఱిపండ్లు లేనినోరు. "ఆ. డోఁకనీరు దెలఁచి నేశమూ టాయిటి,మూచి యొండ పసుపు దొట్టియక్కఱంబు మేను .." ఆము. ౬, ఆ. ౬౨; 2. రంధ్రము. "ఆ. తొత్తుతోడి పొందు తొట్టిపెసలమూట, ముచ్చుతోడిపొందు వచ్చు నింద,కల వరింతిపొందు కలతోడఁ దీఱు రా..." వేమన ౨, ప్ర. ౩౪.

తొట్టివాఁడు. దే. వి. (తొట్టి+వాఁడు.) పండ్లూడిన వాఁడు, పలితదంతుఁడు. 'సీ ..పలితదంతాభిధ తొట్టివాఁ డన .." ఆం. భా. ద్వి. ౯౨౧.

తొట్టు. దే. వి. 1. ఆవు "సీ. అరణోచ్చారణోద్ధతులయ్యె నీతొట్టుకంతవాలంకృతు లేణగర్భిణులకు." పాండు. ౫, ఆ. ౨౪౦, 2. గోమహిష్యాదికము 'క. తొట్టులఁ గాచిననందుని. పుట్టిపెరిగితా మృతంబు ..' భాగ. ౧౦, స్కం. పూ. ౬౩౩. ఆం భా. ద్వి. ౨౬౧.

తొట్టుపట్టు. దే. వి. (తొట్టు+పట్టు.) గోష్ఠము. "ఆ. ఘనభుజుండు నరుఁడు దనతొట్టుపట్టుల, విక్రమించి..." భార. ఆది. ౮, ఆ. ౨౧౦. భార. అర. 3, ఆ. ౧౧౦.

తొల. దే. వి. 1. పనసపండు మున్నగువాని తొన. "సీ...దళమెక్కుపనస పెందొలలతోడ." ఆము. ౨, ఆ. ౭౩, చంద్రా. ౬, ఆ. ౯౦; 2. కాంతి. (తొలఁకు యొక్కయంతిమవర్ణము లోపింపఁగా మిగిలినరూపము.) "గీ...హిమవంతు శాలీకమన్నఁ జేసి,తొలయుం నగవుపు మొగమునఁ దొంగలింప." వీర. ౧, ఆ. ౧౬౭.

తొలఁకఁపాఱు. దే. అ. క్రి. (తొలకన్+పాఱు—స్వార్థమున.) చిందు. 'సీ. చీరలు మురిపించ సీరంబు కేలోకో యిల రాల నటునిటుఁ దొలఁకఁ బాఱ." శ్రీ. రం. మా. ౧౦, అ. ౩౨.

తొలఁకాడు. దే. అ. క్రి. (తొలఁకు+ఆడు.) 1. తొనఁకు, ఒలుకు. "సీ. ముక్తలు తొలఁకాడు ముద్దియమలుకు లయ్యుపమాస్త్రమంత్ర బీజాక్షరములు. విక్ర. ౬, అ. ౨౭; 2. ప్రకాశించు. "సీ. తెలిమోముపైఁ బ్వి తొలఁకాడుచాయలో మెలరారు కనుఁగవ మెఱుగు లడరు." కు. సం. ౮, ఆ ౯, నైష. ౪, ఆ ౬౨; 3. అతిశయించు. "వ. అనవుడు సమ్మదంబు తొలఁకాడఁగ .." సర్వ. ౭, ఆ. ౧౩౨, భార. శల్య. ౧, ఆ ౩౩౬.

తొలఁకించు. దే. స. క్రి. (తొలఁకు ధా. ప్రే.) అతిశయింపఁజేయు, పెంచు. "క. లేయెండవేఁడి యయ్యెం, బోయజమండమున కింపు దొలఁకించు క్రియన్, నీ వలఁక పరుస నయ్యును,నాయెడఁ దకు పేర్కొ నేయుం నళినదళాక్షీ." నైష. ౮, ఆ. ౪౬.

తొలఁకు=తొనఁకు. దే అ. క్రి. 1. చలించు. "చ. తొలకరిమించు కందొగలతోఁ గలతోయజకారహారకాంతులఁ దగునవ్వక్రొన్ననలతో నలతోరపుగుబ్బచన్నులన్, దొలఁకెడికొమ్మచంచలకతో లకతోఁ దగుమేచికాలికన్, దుల యగుకొప్పుగేనఁగులతోఁ గులతోయదవేణి మించెనన్." ఉ. రా. ౬, ఆ. ౧౧౭, ప్రభా. ౨, ఆ. ౪౧; 2. అతిశయించు. "ఆ. . మత్స్యరాజతనయుఁ డెలమి,నొలఁక నొగలఁ బగ్గములు గట్టి చలి వాసి, కెల్లఁ దెచ్చి యరద మెక్కుటయును." భార. విరా. ౫, ఆ. ౨౧౦, య. ౪, ఆ. ౧౩౮; 3. ప్రకాశించు. "సీ. కుఱుమాపుకడిమెఁపుఁగోకలోఁ దొలఁకెడు కంపమాననితంబ కాంతిసొంపు." కళా. ౪, ఆ ౧౦౫, వసు. ౪, ఆ. ౭౮; 4. జనించు, ఒయలు కేఱు. "గీ. అని సునందమరందబిందద్వదిక మాధు, రీధురీణరసశ్రాధి రీతిగలుగఁ, బలుకపలుకుల కలరి యక్కలికి పలికెఁ,బులక మొలకలు జొమ్మెనఁ దొలఁక నవుడు" ఇందు. ౨, ఆ. ౮౬, పారి. ౧; ఆ. ౫౬; 5. ప్రసరించు. "గీ. పలువ

మీఁదికిఁ దోలఁబసువర్ణ పులినగురునితంబ ప్రభా పరంపరలతోఁడ, నమరుప్రాయంపుసాపుచిత్రముగఁ దాల్చె." కళా. ౪, ఆ. ౧౨౨, బహు. ౧, ఆ. ౧౦; 6. ఒలయు. "సీ వికచసీరజపత్త్రనుకరందరస భాతిఁ బసనిదూపులఁ గృపారసము దోలఁక." వి.క్రి. ౨, ఆ. ౫౭, పారి. ౫, ఆ. ౫౭; 7. పొంగు. "లయహారి ..కలమీఁదన్, పఱలుసుర నది దోలఁకి కెఱఁ జిటుకులను గురియ..." కు. సం. ౨, ఆ. ౧౦౦; 8. వ్యక్తముగు. "గీ తోలఁకు సిగ్గున వాల్చూపు జెరుకుఁ జూపు." దశా. ౨, ఆ ౧౯౬. వి. 1. చలనము. "చ. కదుఁ జెరుమంట లైనయుదకంబుతోలంకున వారిబిందువుల్, మిడిసి సమీపభూజములమీఁద జెసం బడి మాడుచుండ చెక్కు డురభసంబులోఁ బిబియుతోలలకై పడి భంగ సంగతిన్, బొదమినఫేనముల్ మెఱసె బోరనఁ జల్లినవిప్పులో యనన్." వి. పు. ౭, ఆ. ౧౬౫; 2. తరంగము. "చ వారిదేవతల్, తోలఁకుల కేలఁ దాచ విడి తోమఁ గలం కడఁగెన్..." ఆము. ౪, ఆ. ౧౪౬, ప్రబంధ. ౨౮.

తోలఁగఁద్రోయు. దే. స. క్రి. (తోలఁగన్ + త్రోయు.) 1. పోఁగొట్టు. "ఆ. కేలియందుఁ బడిన తూల పట్టుగుఁ బొత్తగములు త్రిపథగావగాహనమున, దురితములపు దోలఁగఁద్రోయుట కెన్నిభంగులను గంగపాటి గలశ యొండు." జాహ్నవీ. ౧, ఆ. ౧౯; 2. తుడుచు. "సీ. తనుపునఁ బైకొన్న తాప మజ్జనచేసి తోరఁగెడుగన్నీరు తోలఁగఁద్రోచి." వి.క్రి. ౧, ఆ. ౧౫౮, 3. విడిచిపెట్టు. "క. తేవించి రొకటి నొల గంధ్రోపక జంబీరసముతోఁ నూని యతోఁ, గావు బెట్టినకిటిమద్రావలయము లనుకృత మధురరసఖండంబుల్." నైష. ౬, ఆ. ౧౨౭

తోలఁగఁబాఱు. దే. అ. క్రి. (తోలఁగన్ + పాఱు - స్వార్థమున.) తోలఁగు. "క. బలమతి ధ్రువుఁ దహితునిదోర్బలవిభవము సైఁబలేకబరిభవదైత్యా, కలనమున కోర్చి కతులు,చెలఁగఁ దోలఁగఁ బాఱె దేవసేలు గలఁగన్." హరి. ఉ. ౧౦, ఆ. ౫౮.

తోలఁగఁబెట్టు. దే. స క్రి. (తోలఁగన్ + పెట్టు.) విసర్జించు. "గీ. తనము గావించు వెడలె పత్సర సహస్రములు మహాదేవుఁ డంత నాథూమిధరకు, మారి గౌరి సనుగ్రహింపఁగఁ దలఁచి,తొంటితన లాంఛనంబులు తోలఁగఁబెట్టె." వరాహ. ౧, ఆ. ౧౬, నైష. ౬, ఆ. ౧౩౯.

తోలఁగవైచు. దే. స. క్రి. (తోలఁగన్ + వైచు.) పోఁగొట్టు. "కా ..నపుంసకజన్మ మవశ్యభోగమై, వాఁడిమి గల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మ భావ్య మెవ్వాఁడును తేర్పునే తోలఁగవైవఁగ నోర్వక పోవవచ్చునే." భార. విరా. ౧, ఆ.౨౩౮.

తోలఁగించు. దే. అ. క్రి. విడిచిపెట్టు. "సీ. రాగ భేదముల స్వర్గముఁ దోలంగించి లయతాళశుద్ధి కెంతయుఁ దలిర్స." కళా. ౨, ఆ. ౩౩. స. క్రి. (తోలఁగుధా. ప్రే.) 1. తుడుచు. "చ. వదలిన ద్రిండు గొంటిగతి వాటముగా బిగియించి మోముసన్, జెదరినఘర్మ వారిఁ గొనచేలమునన్ దోలఁగించి పీఁపునన్,బోదు లమరించి మించి బలుముష్టికరాసనమున్ ధరించి..." జై. ౨ ఆ. ౮౬; 2. పోఁగొట్టు. "సీ. పారసీకునకు దుర్భరమానవత్త్వంబు తోలఁగించె మానవదుర్గ సీమ." పారి. పీఠి ౧౩, పారి. ౧ ఆ. ౬౦, దశా. ౨, ఆ. ౬౩.

తోలఁగు. దే. అ. క్రి. (క. తొలంగు. త. తొలై.) 1 అపసరిల్లు, తప్పుకొను. "సీ. పాయు తొలంగు మం చాయకవేత్రహస్తులమొత్త మేలాగో తోఁడ రాదు." భార. విరా. ౧, ఆ. ౧౮౬, నైష. ౭, ఆ. ౧౩౦; 2. దూరమగు. "క. ఏర్పడ లోకప తురకు వెలార్పక లోకంబునకుఁ దొలంగక కుదురై,తేర్పున మనఃపవనములు, గూర్ప క యోగీశ్వరుం దగుచు యొబ్బుంగిన్." శివ. ఉ. ౧, ఆ. ౧౭౨. జై ౪ ఆ. ౮౭, 3. జాఱు. "గీ...అన్యవిదళలుపు, దొలఁగె సలిలంబుచేత విఘూత మగుచు." భార. ఆది. ౪, ఆ. ౧౨౨, దశా. ౨, ఆ. ౩౫౮; 4. ఓసరిల్లు, ప్రక్కకేఁగు. "గీ. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగ నుతికి,కెంపు దకొఁత్త వాలుతోఁ గ్రేళ్లవాఱు, నావ్రోఁదరుపై .." భార. భీష్మ. ౨, ఆ. ౭౦, హరి. ఉ. ౩, ఆ. ౧౨౯; 5. తప్పు,మరలు. "చ. సమరము బంబున్ సవనసైంధవమున్ గొని పత్తు బాహుగర్వమున విరోధి గెల్చికొని రాక తొలంగితినేని బ్రాహ్మణీ, గమనము చేయఁగోరి నజభున్యజా దున్, బుధుతేళలం గల,ప్రభువఁ బరిత్యజించెడు దురాత్ముఁడు బోయెదుద్రోవఁ

బోవుదుస్. శై. ౩, అ. ౧౦, శై. ౪, అ. ౮౫; 6. చెడు. "క...దురితము కావించి తొలఁగు దుష్కరమునకున్." ఆము. ౩, అ. ౪౯; 7. వెడలు. "క. దుర్వాసుఁ డటుల శాపము,సర్వారముగా నొసంగి తొలఁగిన..." దశా. ౨, అ. ౪౫. విప్ర. ౩, అ. ౭౮; 8. తప్పు,మాను. "క. తప్పుల నిప్పు డడఁచితివి, తొలఁగుము హింసాపరులకు దుఃఖప్రాప్తుల్." భార. ఆది ౪, అ. 9. పోవు,నశించు. "క. లలి గంగాస్నానంబునఁ, దొలఁగం గలపాతకము చతుర్దశభువనం,బులు గూడి చేయఁజాలవు,తొలఁదిరొ గంగాతిశయము గుణరత్ననిధీ." కాన్నవి. ౩, అ. ౭౨. కాశీ. ౯, అ. ౧౦౦. స. క్రి. వీడు,త్యజించు. "చ. వేద మెల్ల వేల పరమవైష్ణవ ముచు దొలంగితి వేమి నరేంద్రనందనా." వి పు. ౨, అ. ౧౧౦.

తొలఁగుడు. దే. వి. తొలఁగుట. అపసరణము. "సీ. తొలఁగు డనంగను దలఁగు డనంగను నపసరణాఖ్యలై యలరుచుండు." ఆం. భా. ద్వి. ౨౨౪.

తొలఁగుడుపడు. ద్వ. వి. (తొలఁగుడు+పడు.) అపసరిల్లు. "వ. ఇట్లు వెనుకముందట నుభయపార్శ్వంబులఁ దృషార్దితంబులై యరుగుచెంచు నేనుంగుగములం గానక తెఱుఁగుదప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తం బైనచిత్తంబు గాకుండుటం జేసి తానును దనకరేణుసమూహంబును నొక్కతెరువై పోవుచు." భాగ. ౮, స్కం. ౩౮.

తొలఁకు. దే. అ. క్రి. స్నానముచేయు. "గీ శంఖపుష్కరిణిని గ్రుంకి చక్రపుష్కరిణి మునిఁగి దేవతాపుష్కరిణిఁ దొలంచి." హంస. ౪, అ. ౨౦౯. స. క్రి. (తొలఁగు ధా ప్రే.) 1. నశింపఁజేయు. "గీ. ..అలమేలుమంగామనోవిభుండు, దొలఁచు జన్మాంతరానంతదుష్కృతములు" రా. వి. ౧, అ. ౩౮. చంద్ర ౧, అ. ౯౯; 2. కడుగు. "చ. మదమున సోమకాసురుఁడు ముచ్చిలి యచ్చలమారఁ గొన్న ప్రాఁజదువులు తెచ్చి తజ్జలరసాంద్రతరాంత్రము లంట నంటులల్,గదురు తొలంగఁ గీర్తి యఘగంగఁ దొలంచి విధాతృవిస్ఫుర,ద్వదనసరోజగంధలలితంబులు చేసి లిగా జగన్నిధీ." పాండు. ౨, అ. ౯౫. శైవ. ౮, అ. ౧౯౩; 3. ముంచు. "సీ. మంగళతీర్థసంపర్క మానందించి యమృతవాటికను దేహమునకు దొలఁచి." వాల్మీకి. ౨, అ. ౩.

తొలకరి. ద్వ. వి. వర్షాకాలము. "చ. ఫలిక లలాటలోచనుఁడు ప్రస్ఫుటభంగి మునిప్రజంబుతోఁ, దొలకరిమేఘఘోషములతోఁ బురణించునమంచితధ్వనిస్." హర. ౪, అ. ౪౫. చం. రా. ౩, అ. ౮. వసు. ౩, అ. ౧౯.

తొలకరించు. దే. అ. క్రి. 1. వర్షించు. "గీ. కరసమకరందమత్తషట్చరణతరుణ, కలకలోన్నిద్రమై నవకులకుజంబు,మాటున వసించి పల్కునమ్మంత్రిఁ జూచి,పలుకుపలుకున నమృతంబు దొలకరింప." సుద. ౯, అ. ౪౨; 2. జనించు. "సీ. తొలకరించు మొలకనిగ్గులచేత సుడివడి కదకొత్తుమాత్రు తోడ." విక్ర. ౮, అ. ౮౨; 3. వెదచల్లు. "గీ. కళుకుజాళ్వామెఱుంగులం దొలకరించు,తీఁగ ధరియించె గళమునఁ దీఁగబోఁడి." ఇందు. ౯, అ. ౮౩; 4. మీఱు, అతిశయించు. "సీ. అలఁతఁ బొపెడునవ్వటమృతరపుఁదేటల చిలుకరింపులఁ ద్రేవు తొలకరింప." అని. ౩, అ. ౯౯. హంస. ౨, అ. ౨౧.

తొలకరిదొర. ద్వ. వి. (తొలకరి+దొర.) ఇంద్రుఁడు. (చూ. తొలకరిదొరబిడ్డ )

తొలకరిదొరబిడ్డ. ద్వ. వి. (తొలకరిదొర+బిడ్డ.) ఇంద్రతనయుఁడు,అర్జునుఁడు. "క. ..సుభద్ర వచ్చె,నైలియులం వేయాఱులు నిరుచెంతలఁ గొలువన్,దొలకరిమెఱుపో యిది యని,తొలకరిదొర బిడ్డ వెలుఁగుతోడం జూడన్." విజ. ౨, అ. ౯౮.

తొలకరిమెఱుపు. ద్వ. వి. (తొలకరి+మెఱుపు.) 1. వర్షాకాలపుమెఱుపు; 2. మల్లయుద్ధగతిభేదము. "వ. విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధంబును తొలకరిమెఱుపును... సర్వాంగశంబును మొదలుగాఁ గల పదిరెండుగాయమానంబులును .." ప్రబంధ. ౭౮.

తొలకరిసూఁడు. ద్వ. వి. (తొలకరి+సూఁడు.) వర్షాకాలవిరోధి, హంస. (శ. ర.)

తొలకు. దే. వి. మృగమునవెనుకటికాలిమొదటిభాగమునకును ప్రక్కకును నడిమిభాగము, ఉపరంధ్రము. "ద్వి ..ముత్తియములు,తొలకులు రత్నబిందువులైనపోదలు." రం. రా. అర. ౧౭౨, పు. ౨౩, పం. (శ. ర.) బస. ౭, అ. ౩౯, పం.

తొలటు. దే. వి. తొలుటు,తోటరము. "ఆ. భూసురాడి యంత భుజగంబు లో నున్న వెలఁగ మ్రాని వెడఁద తొలట జూపిదీనఁ జేయి వెట్టి లోన నున్నది పుచ్చికొమ్మనుచుఁ బలుక చెప్పె." కేయూర. ౪, ఆ. ౭౪.

తొలతేనె. దే. వి. (తొల+తేనె.) పుట్టతేనె. "క. కుందనపురవలు గుప్పెడు,కుందిలపుంజమ్ముఁగవయుఁ గొలతేనెలతోన్, విందులొనరించుపలుకులఁ, జందురుని బోలుమోము సకియకె యమరున్." హంస. ౨, ఆ. ౧౮౨.

తొలసి. వై. వి. (సం. తులసీ.) 1. తులసిచెట్టు. "సీ. వక్షస్థ్సలమునఁ బద్మాక్షమాలిక కర్ణబిలమున నులి వాడుతొలసియొప్పు." జై. ౭, ఆ. ౧౯౭. నీలా. ౧, ఆ. ౧౦౯, 2. తులసిపేరు "ఆ. పవలు లేక నీవిశాలవక్షస్థ్సలిఁ దొలసితోడఁ గూడఁ దోయజాక్ష,మనుపు మనుచు కెపుడు మాకాంత నీపాద,కమలరజముఁ గోరఁ గాదె కృష్ణ." భాగ. ౧౦, స్క. పూ. ౯౯౧.

తొలి, దే. వి. బొ. 1. ముందు, పూర్వము. (దీనిత్రామ్రేడికము తొలితొలి. "చ. తొలితొలి పద్దపేరుగులఁ ద్రొక్కుచు కొండొరుమీఱి జూచు స్వర్గరిక గడంగి .." విప్ర. 3, ఆ. ౧౦. నృసిం. 3, ఆ ౭౯. ఆం. భా. కృ. ౭3, 2. రంధ్రము. "సీ. కొప్పరింపఁగ మింటఁ గ్రొవ్వాడి రోమముల్,చొచ్చి వెళ్లినతొలుల్ చుక్కగుంపు." చంద్రా. ౧, ఆ. ౭౫. ఆము. ౪, ఆ. ౧౭౮, 3. కోటరము,తొఱ్ఱ "సీ. తొలుగాలి తొఱ్ఱ గాఁ దరుకోటరం బొప్ప .." సా. ని. సా. ౫౯, విశ. మొదటిది. (చూ. తొలివేల్పు మొ.)

తొలిక. దే. వి. రంధ్రము. "క. పలుచని కొత్తురుమడుపులఁ,దొలికెన్ రక్తమిపలయములు పాకరణవీరులు దూఱఁగ రవిబింబము,తొలిక్రై రుచి దూలనీడ దోఁచినమాడ్కిన్." కవిక. ౨, ఆ. ౧౯౨. (శ. ర. పా. తొలుక్రై. ముద్రి.)

తొలికూటమి. దే. వి. (తొలి+కూటమి.) ప్రథమసమాగమము. "గీ. ఆలిమరలు దీఱ లాలించి యామలించి కలికితొలికూటమి కభుండు తులకరించె." కృ. కము. 3, ఆ. ౫౦.

తొలిగట్టు. ద్వ. వి. (తొలి+గట్టు.) ఉదయగిరి. "శా. ఆందోళింపఁగఁ జేసి ముందు రజతాచల ర్యంబు లంకేశ్వరుం,డెందున్ దుర్జయుఁ డింద్రుఁడు డోరయుంచో సేమెంచునో వాఁడు సొం, పొందం గానుక లిత్తునంచుఁ దొలిగట్టుక్కుం తతో కత్తుమేల్,చందాకెంపుతెఱుంగునం దనరె భాస్వద్బింబమున్ దూరప్పనన్" ఉ. రా. ౪, ఆ. ౨౫౨. ఇక్లే. తొలికొండ. శశాం. ౪, ఆ. ౧౨౫.

తొలిచదువులు. దే. వి. బ. (తొలి+చదువులు) వేదములు. "రగడ అచ్యుగ నినుఁ దెలియవు తొలి చదువులు." ఉ రా. ౭ ఆ. ౯౨. సాం ని. మాన. ౨.

తొలిజాతియొడయఁడు. మి. వి. బ్రహ్మ. 'సీ. .. తొలిజాతియొడయఁడు పలుకులదణి. గీ తమ్మిగద్దియదళవాయి తాత బొమ్మ ..అనఁ బరగజాను పేర్లు శ్రీ వేంకటేశ." వేంక. దేవ ౬.

తొలిజాతివారు. మి. వి. బ. బ్రాహ్మణులు. "సీ .. నేలవేల్పులు తొలిజాతివారు ..నాఁగ బ్రాహ్మణులను నామము లగు." సా. ని. మాన. ౨.

తొలిజేజే. దే. వి (తొలి+జేజే.) రాక్షసుఁడు. "మ. శివభూజానియమంబు మాని తొలిజేజేపెద్ద మాహిష్మతీ,ధవుఁ డాతండు బలి కనంబడెను..." ఉ. రా 3, ఆ ౨౨3. అచ్చ బాల. ౧౭.

తొలిదిక్కు మి. వి (తొలి+దిక్కు.) తూర్పు. "ద్వి. ఆక్కలింపులు వాయు వెక్కు నూర్పులు, ముక్కుపట్టుట తొలిదిక్కు చూచుటలు." పండితా. దీక్షా. ౫౮.

తొలిదేవర. ద్వ. వి. (తొలి+దేవర.) 1. రాక్షసుఁడు. "చ. తెలివను జాపకున్నఁ దొలిదేవరప్రేవులు ప్రోవులై పడన్,బెఱికెద..." అచ్చ. కిష్కిం. ౮3; 2. బ్రహ్మ. "ఉ...భారతీ,దేవిముఖంబుఁ జూచి తొలిదేవర సాదరవీక్షణంబునన్." ఉ. రా. ౬, ఆ. ౨౦౦.

తొలిపన్నగము. మి. వి. (తొలి+పన్నగము) ఆదిశేషుఁడు. "సీ. ..పన్నగంబులు తొలిపన్నగంబులయ్యె. గీ ..కీర్తిసాంద్రరుచులు,మించి లోకత్రయం బాక్రమించుకతన." దశా. ౮, ఆ. ౫౮.

తొలిపలుకులు. దే. వి. బ. (తొలి+పలుకులు.) వేదములు. (చూ. తొలిపలుకుఁగొనలు.)

తొలిపలుకుఁగొనలు. దే. వి. బ. వేదాంతములు-ఉపనిషత్తులు. "గీ...తొలిపలుకుఁగొనలఁ, గాంచి మించినజడదారిగముల కైనఁ గనఁబడఁగ రాక యుండుర న్గంటి నేఁడు." అచ్చ. అర. ౧౧౨.

తొలిమబ్బు దే. వి. (తొలి+మబ్బు) తొలకరి మేఘము. "గీ. విల్లు దాటిగంటివి ల్గాఁగ వింటి మ్రోఁత లుఱుములుగఁ గల్గుమెఱుఁగులు మెఱుఁగుఁ దీవియలుగ నెఱరాచతొలిమబ్బుపోలుసుడిండి, కొండపై నంకుజడివాన గురియుచుండె." అచ్చ. యు. ౫౧౦.

తొలివేలుపు. దే. వి (తొలి+వేలుపు.) 1. రాక్షసుఁడు. "సీ. తొమ్మండ్రుకొడుకులఁ దొలివేలుపులఁ జేయఁ బొడమించు జేదేవుబొడ్డుఁదమ్మి." ఉ. హరి. ౨, అ. ౧౪౪. సాం. ని. దేవ. ౧౯, 2. విష్ణువు. 'సీ. తొలివేల్పుఁ జిందంపుఁదోరం పురవళిచేఁ గర్తరంధ్రములఁదుఁ గ... చెప్పుడు." ఉ రా. ౭, అ. ౨౧౪.

తొలివేల్పుపగతుఁ. దే వి. బ దేవతలు. "సీ... జేజేలు తొలివేల్పుఁపగతురు పఱుఁజఓల్లు, మేటులు ...అనఁగ సురాళిక్కి లా..."సాం. ని దేవ. ౧౮.

తొలు. దే. విణ. వృత్తియందు తొలుతశబ్దమున కంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. ఉదా: తొలువేదువు, తొలుదీవి. మొ

తొలుఁబల్కులు. దే. వి. బ. (తొలుత+పల్కులు.) వేదములు. దశా. ౫. అ. ౧౧౫ పారి. 3. అ. ౨౦.

తొలుకడ. ద్వ వి. (తొలుత+కడ.) తూర్పుదిక్కు. "సీ. తొలుకడ రాతాపసలు గెబ్బునర్తిజేఁ డెద్దడి గుఱురు కాఱిర్ణ ప్రొద్దు." అచ్చ. కిరి. ౮.

తొలుకబ్బము. ద్వ. వి. (తొలుత+కబ్బము.) ఆది కావ్యము, రామాయణము. "సీ. తొలుకబ్బ మొకటఁ గోర్కు లాసంగ పత్రి)ము లొనరించి ప్రజసీమ మొందు..."సమీర. ౭, అ. ౭౯.

తొలుకరి. దే. వి. వర్షాకాలము. "సీ నటియించు నవ్వరఁబటీలాలకలమేని మెఱుఁగులు తొలుకరి మెఱుఁగులు గను." దశా. ౭, అ. ౧౮. వసు. 3, అ. ౧౫. అం. భా. ప్ర. ౮౬.

తొలుకరించు. దే. అ. క్రి. వర్షించు. "గీ. తరుపఁ దేనియ సుడువులఁ దొలుకరింపఁ గలికిమాపులం పీచులఁ బలుకరింప, సొలపునవులు నందియుల్ గిలుకరింప." చంద్రా. 3, అ. ౬౨.

తొలుకాడు. దే. అ. క్రి (తొలుకు+ఆడు స్వార్థము.) అతిశయించు. "సీ ప్రవహించు నెచ్చోటఁ బరిపూర్ణ కంపఁ దొలుకాడుచు నపారదుగ్ధనదులు." కాశీ. ౨, అ. ౨౦. భాగ. ౬. స్కం. ౫౦౪.

తొలుకారు. ద్వ. వి. (తొలుత+కారు తొలుశబ్ద మునుత్వమున కత్వమును కారుశబ్దమునకు 'కరి' యనురూపమును వైకల్పికముగా వచ్చును. చూ. తొలుకరి; తొలకరి.) వర్షాకాలము. "ఉ. కన్నులు గండుమీలు దొలుకారుమెఱుంగులు గాముబాణముల్." విక్ర. 3, అ. ౪౯. కు. స. ౧౧, అ. ౧౩౫.

తొలుకు. దే. అ. క్రి. అతిశయించు. "గీ. పులియు మొదలగుమెకములు కలఁక తొలుకఁ, జెదరి నలుదిక్కులకుఁ బాఱి నదరి బెదరి'.' ఉ. రా. 2. అ. ౪౦౮. విజ. ౨, అ. ౧౬౧.

తొలుకొను. దే. అ. క్రి. (తొలుత+కొను.) మొదలగు, ప్రారంభమగు. "క. తొలుకొని కుక్కుట రవములు, చెలఁగుడు .."కు సం. ౮, అ. ౧౮౪.

తొలుకోడి. ద్వ. వి. (తొలుత+కోడి.) తెల్లవాఱు జామున మొదట కూయుకోడి. "ద్వి. తొలుకోడి కూయంగ బలువిడి నేఁగి."బస. ౪, అ ౧౬౪. పు.

తొలుగట్టు = తొలిగట్టు. "ఉ ..కే, గన్నియతేనె మేను తొలుగట్టుతుసం బొదవెం గ్రమంబునన్." వసు. ౬, అ. ౬.

తొలుగొలము. ద్వ. వి. (తొలుత+కొలము.) బ్రాహ్మణ వంశము. "క. అత్తొలుగొల మలరులసర, మెత్తిన క్రియ .. ఉదాత్తం బయ్యెన్." పాండు. ౪, అ. ౨౬౬.

తొలుగొరు. దే. వి. (తొలు+గొరు.) ఐరావతము. "చ ..తెల్లనితొలుగొరు నెక్కిన యిలాధర వైరియొచుమ్ము .."చంద్రి. ౨. అ. ౯.

తొలుచు. దే. స. క్రి. 1. రంధ్రము చేయు. "సీ. ఇరుమొయిఁ దొలిచి బెట్టిలఁ దూఱనవియఁను నలువురఁ జేవుర నాటునవియు." భార. విరా. 3, అ. ౧౬౧. ఉ. రా. 3, అ. 3౨3; 2. ఖండించు. "క. పులుం మేయఁ గానసాంతర, ములం దూరు నిఱికు మోహామునఁ జనఁ

బాల్గొల్ల లోనంగ నసిధేనువు విను, తులకలలఁ దొలంచు నసంతదోస్త్రంభమునన్.” కళా. ౧, ఆ. ౧౯. హరి. ౧, ఆ. ౧౪౮; 3. నాఁటు. “గీ. కాఁడె గ్రుస్సెను దొలిచెను నాఁడె ననఁగ, నాఁటె ననుమాట కర్థమా నాగభూష.” ఆం. భా. కృ. ౧౨౨.

తొలుత. దే. వి. క్రి. అవ్య. ముందు, పూర్వము. (సమాసమున దీనియంత్యాక్షరము కొన్నియెడల నిత్యముగాను కొన్నియెడల వికల్పముగాను లోపించును.) “గీ.. ఏనికదిండివార్వమ్ము దొలుత, గాఁగఁ దా చెక్కి నన్నుఁ దాఁకకయ దీని, కటి విభాగంబు చెక్కి రాఁగలవె యబల,వెనుక మర గొమ్ము నూఁతగాఁ గొనుచు ననియె.” కళా. 3, ఆ. ౬౨. హర. ౨, ఆ ౬౦. విశే. ముందుది, పూర్వపుది. “వ. తొలుతటిపొలయములుక యెడలం జనించినవియోగశిఖి...”పారి. ౧, ఆ. ౫౨. రాఘవ. ౪, ఆ. ౫౪.

తొలుదీవి. ద్వి. వి. (తొలుత+దీవి.) జంబూద్వీపము. “సీ...కల్యాణపరంపరలతొలుదీవి ”పను. ౧, ఆ. ౯౪.

తొలునాఁడు. దే. వి. (తొలుత+నాఁడు.) పూర్వదినము. “గీ. చెలఁగి తొలనాఁడు తరవాయిఁ జెప్పినట్టి, గొల్లపన్నంబు లేకరు విడి...”రా. వి. ౨, ఆ. ౭౫

తొలునీటిరిక్క. ద్వి. వి. (తొలుత+నీటిరిక్క.) పూర్వాషాఢానక్షత్రము. (శ. ర.)

తొలుపక్కము ద్వి. వి. (తొలుత+పక్కము.) శుక్లపక్షము (శ. ర.)

తొలుపలుకులు. దే. వి. బ. (తొలుత+పలుకులు.) వేదములు. “క. మలవిల్లఁ జిలువనారియుఁ, బులుఁగుపిడము జోదు ముల్కి పుడమియరదమున్, దొలుపలుకు వారువంబులుఁ, జెలఁగఁగఁ దిగపోల్చి గూలిచినబలియుఁ నకున్.” అచ్చ. బా. ౨౨

తొలుపుట్టువు. దే. వి. (తొలుత+పుట్టువు.) పూర్వజన్మము. “క. తొలుపుట్టువు నీనోముల, ఫలమెట్టిదయో...”పి. శకుం. ౪, ఆ. ౭౧.

తొలుప్రాఁకు. దే. వి. (తొలుత+ప్రాఁకు.) ఊరుఘ్నము, నిదుకొయ్య. “క. ఇంతకు మూలము దృష్టా, తంతులతయు పత్ని నినుము దానికి నదరం, గాంతాజనంబు దొలుప్రాఁకింత రొటిఁగి కృష్ణ దొఱఁగు టిచ్చు విముక్తిన్...” భా. ర. శాం. ౪, ఆ. ౨౯౩.

తొలుబాము. ద్వి. వి. (తొలుత+బాము.) పూర్వజన్మము. “సీ. దుఃఖంబుఁ బొమ్మని త్రోవ సుఖంబు రమ్మని తెచ్చికొని వశమయ్యె వానిఁ, దొలుబామునందలిదుష్కృతంబును సుకృతంబు హేతువులుగఁ దగిలి చేయు.”భార. శాం. ౧, ఆ. ౧౦౫.

తొలుమినుకులకడలు. ద్వి. వి. బ. (తొలుమినుకులు+కడలు.) ఉపనిషత్తులు. “వ. తొలుమినుకుల కడలం గనరానిరూపేనిం బలుదెఱఁగులం బొగడి ..”య. ౩, ఆ. ౩౧.

తొలుమినుకులు. దే. వి. బ. (తొలుత+మినుకులు.) వేదములు. “క ...తొలుమినుకులు ప్రామినుకులు దొలుపలుకులు ప్రాఁబలుకులు పెనుమినుకులు నా,వెలయున్ శ్రుతులకును బేర్లు ..” ఆ. స. దేవ. ౪౧.

తొలుమేను. దే. వి. (తొలుత+మేను.) పూర్వజన్మము. “సీ. తొలుమేనఁ జేసినదుష్కృత శక్తియో ..”భార. అర. ౨, ఆ. ౧౧౩.

తొలురిక్క. ద్వి. వి. (తొలుత+రిక్క.) అశ్వినీనక్షత్రము. శ. ర.)

తొలురిక్కకాల. ద్వి. వి (తొలురిక్క+కాల) అశ్వయుజమాసము. (శ. ర.)

తొలువేలుపు. దే. వి. (తొలుత+వేలుపు.) 1. రాక్షసుఁడు. “సీ. తొలువేలుఁపుల వేలుపులపనుల్ గొనుచేఁ...”స్వా. ౫, ఆ. ౪౭; 2. బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు.

తొలుసంజె. ద్వి. వి. (తొలుత+సంజె.) ప్రాతస్సంధ్య. “సీ. ఒకదీవిఁ దొలుసంజె. యున్మేషమునఁ బొందు నుడుయించు మఱుసంజె యొందుదీవి.”కాశీ. ౧,ఆ. ౧౨౯. ఆము. ౪, ఆ. ౧౫.

తొల్కరి = తొలుకరి “చ...శోధన భుక్తివేళ దొల్కరి సమయంబు పేరెలమిఁ గైకొనఁడుం దుష్ఖోక్తప్రసస్యముల్.”శైవ. ౬, ఆ. ౧౨౧.

తొల్కరించు = తొలుకరించు. “చ. జలజాక్షు నొజ్జ యయి సజ్జగమోహములఁ దొల్కరించుఁ దొల్పలుకులమాధురిన్ జిలుకఁ బాడి...”శివత. ౧, ఆ. ౬.

తొల్కాడు = తొలుకాడు. "సీ. సకలవైభవములు సముకూరుఁ దనయింటఁ దొల్కాడుకోర్కుల తోడఁ గూడి." భాగ. ౬, స్కం. ౫౦౪. పండితా. పురా. ౧౦౭. పు.

తొల్కారు = తొలుకారు. "ఉ...లిరం బగురూపుఁ జెందుతొల్కారు మెఱుఁగుటీవకళఁ గాంచిన చిత్తరుబొమ్మయాన కృంగారిణియై సుధాసర సిఁగా నటి సేయఁగ వచ్చు కెచ్చెలిన్." హంస. ౧, ఆ. ౬౪.

తొల్పదువులు=తొలిచదువులు. "చ ..తొల్పదువులగుచున్న కుంభులం, బలుమఱు చేయుచందమున బంగరుటుంది ను లగ్గడింపఁగన్." పాండు. ౨ ఆ ౩౨.

తొల్చు=తొలుచు. "ద్వి. ఎమ్ములు దక్క మున్నిడి తొల్చి తొల్చి,గ్రమ్మన భక్షింపఁగా లెక్కగొనక." పండితా, దీక్షా. ౩౬. పు. ఉ. రా. ౩, ఆ. ౩౨౩.

తొల్పంది. దే. వి. (తొలుత+పంది.) ఆదివరాహము "గీ ..తొల్పందియున్నసై వానిఁ జేతికో[illegible]న మన్ను దాల్పవే కోరి నీవు" అచ్చ. బాల. ౧౫౩. అచ్చ. బాల ౪౬.

తొల్లి. దే. వి. భూ. 1. పూర్వము,ముందు. "వ... కృష్ణద్వైపాయనుం డను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామ ధర్వంబులుగా విభాగించి .." భార ఆది. ౧, ఆ. ౩౯. సైష. ౩, ఆ. ౧౨౬; 2. రంధ్రము. "చ వఱపున మేను లెండఁ దమవారియెడం బెడఁబాసి జీవముల్, దొఱఁగి ధరిత్రి డిందిపడి దుర్దశఁ గాలము వేచియుండఁగా, నుఱుకుగు వానఁ బ్రాణములు నొయ్యన సూర్కొన మన్ను దొల్లి సేద్రెంబఁ గనుపట్టు దర్దురతతిన్ గని యుండ్యము మొప్పఁ జేయఁగన్." శా. పంచ. ౨, ఆ. ౧౪౪. (శ. ర. పా.)

తొల్లిక. దే. వి. 1. త్రవ్వుట కుపయోగించు పాఱ వంటిచిన్నయినుపకుదిమొట్టు. "చ. భయ మును తొల్లికన్ కమలభావవసుంధరఁ బెల్లగించి .." కాశీ. ౪, ఆ. ౧౨౨; 2. మత్స్యవిశేషము. "సీ. మిసికల్లారుఁజూ లేటమీను తొల్లిక బాలిగొరక మాపురముకు గుంటముక్కు." హంస. ౪, ఆ. ౧౯౭.

తొల్వేలుపు = తొలువేలుపు (రాక్షసుఁడు.) "సీ. కూళతొల్వేలుపు కూటువ గుటుంపుటడవుల మేటి పయ్యెర యసంగ" అచ్చ. బాల. ౬౩. అచ్చ. యు. ౪౫.

తొవ = తొగ. (కలువ.) "చ. వనజము లుల్లసిల్లఁగఁ దొవల్ మొగుడన్." మార్క. ౭, ఆ. ౧౨౩. ఆం. భా. ప్ర. ౧౬౪.

తొవకంటి. దే. వి. (తొవ+కన్ను+ఇ.) స్త్రీ. "సీ. తొవకంటికుఁదలీంద్రుఁ డితండు గాఁ దైవ సమరభోగిగుల మే లదయుకున్న." చంద్రా. ౩, ఆ. ౧౧౩. చంద్ర. ౨, ఆ. ౯౦.

తొవర. వై. వి. (సం. తువర) ఒగరు. (శ. ర.) విశే. వెగటురుచి గలది,ఒగరుగలది. "సీ. చివుళ్లుఁ గసి నొత్తి తొవరాకు గుత్తుక డొక్కొని కోటుల వెక్కుచుండు." కు. సం. ౫, ఆ. ౧౬౨.

తొవరాయఁడు. ద్వ. వి. (తొవ+రాయఁడు.) చంద్రుఁడు. "చ. అపుడు రణోత్సుకం డగుచు కాంబుజ సాయకుకంటి సన్నఁ గీరపటలి చల్లగాడ్పు తొవ రాయఁడు..." చంద్రి. ౨, ఆ. ౭౭.

తొవరి = తొగరి. (శ. ర.)

తొవరిమ్రాను. ద్వ.వి. (తొవరు+మ్రాను.) తొగరుచెట్టు. "గీ. తొవరిమ్రా నసఁ దువరిక దోఁచుఁబడును." ఆం. భా. ద్వి. ౭౨.

తొవరు = తొగరు. (వఱపు.) "గీ. కావి జాళిలిన యెఱుపు జేవురు తొవరు,రవఁగ రక్తాఖ్య వెలయు..." ఆం. భా. ప్ర. ౧౦౮. సాం. ని. స్థా. ౬౦. విశే. ఎఱ్ఱనిది. "సీ...తొవరుఁ బట్టములఁ గెంపువులఁ దాల్చి." అచ్చ. యు. ౩,౨౩.

తొవలరాయిడికాఁడు = తొవలసూఁడు. ఆం. సం. దేవ. ౧౭.

తొవలసూఁడు. ద్వ. వి. (తొవలు + సూఁడు.) సూర్యుఁడు. "గీ. పొదుపుమలనుండి పడమటి కడలి కరుగఁ,బవలు నలుజాములును బట్టుఁ దొరలసూఁడు, కత్తదులకు..." నీలా. ౧, ఆ. ౩౦.

తొవవిందు. దే. వి. (తొవ+విందు.) చంద్రుఁడు. "లయగ్రాహి. కోరి తొవవిందు తనకోరికిగి యాళ చన కోరి యని చేరెదుచకోరియు..." కళా. ౩, ఆ. ౧౦౫.

తొస్స. దే. వి. ఉచ్చారణలోపము. (శ. ర.)

తొస్సి. దే. విశే. పండ్లులేనిది,బోసి. (శ. ర.)
తొళక. దే. విశే. పలుచనిది. (శ. ర.)

తో

తో. దే. ప్ర. ద్రు. ఒకానొకతృతీయావిభక్తి ప్రత్యయము. 1. ఇది క్రమముగా సహార్థము, తుల్యార్థము, కరణార్థము, షష్ఠ్యర్థము నిచ్చును. "క. అమృతముతో నుద్భవమై..." భార. ఆది. ౨, ఆ. ౨౭. "సీ. తారక మందారతారాచలం బులతో రాయుచెవ్వనిచారుకీర్తి." క్రీడా. ౧౪. "సీ. సాంగంబు లగుచుండ సకల వేదంబులు చదివె వసిష్ఠుతో..." భార. ఆది ౪, ఆ. ౨౯౮ "చ. మనమున నీవు గోరునృపమన్మథులో నిచుఁ బెండ్లిసేయ నీ జనకుఁడు సంభ్రమించె .." కవిక. 3, ఆ. ౯౯; 2. వెంబడి. "క. మన మొకయేవుర మీయుం,గనయుం దో నరుగుదేరఁగా .." భార. విరా. ౧, ఆ. ౯౯, 3. కొలది. "సీ. సవినయం బునఁ దనశక్తితో గురునకు దక్షిణ యిచ్చి యాతండు వనుప." భార. శాం. ౫, ఆ. ౧౩౯, 4. వలన. "మత్తకోకిల .. .శౌర్యముతో,వేద మంగయుక్తంబుగాఁ జదివె ధనంజయునితో ధను, ర్వేద మిమ్ముగ నభ్యసించెను .." భార. ఆది ౮, ఆ. ౨౨౮; 5. వెనువెంటనే. "క. ఉద్యతులై కవలును ధృష్టద్యుమ్నుఁడుఁ గడఁగఁ దోన సౌభద్రుండున్,మాద్యద్గతిఁ గవిసెండు ....." భార. భీష్మ. ౧, ఆ. ౨౩౮. (ఇట్లే ఇతరార్థములనూహించునది.)

తోఁక. దే. వి. 1. వాలము, పశుపక్ష్యాదులపుచ్ఛము. "క. వీఁక సెడి ఘనగదాహతిఁ,దోఁకయుఁ గద లింపలేకదుస్సహపీడన్,మ్రోఁకరిలఁబడియె నేలను, బోఁకోర్వక దిగ్గజంబు సుడిముడి గొంచున్." భాగ. ౮, స్కం. ౩౬౭. అము. ౬, ఆ. ౨౧. "సీ. పాతాళలోకంబుపాతున శేషుండు వెల యంగ ముప్పదివేలయోజనంబుల వెడలుపునకు దోఁకఁ జుట్టఁగాఁ జుట్టుక యుండు .." భాగ. ౫, స్కం. ౨, ఆ. ౧౨౨.

తోఁకగుంజ. ద్వ. వి. (తోఁక+గుంజ.) ఆఁదోఁకగా చేర్పుడు స్తంభము. (శ. ర. బ్రా.)

తోఁకచిచ్చు. ద్వ. వి. (తోఁక+చిచ్చు.) నిప్పులు రగిలించినపిడుకలచాలు. (శ. ర. బ్రా.) "గీ. తోఁకచిచ్చున నార యుద్ధురతఁ గృష్ణరాయ బాహుప్రతాప జాగ్రన్మహాగ్ని." స్వా. ౧, ఆ. ౩౭. అము. ౧, ఆ. ౩౭.

తోఁకచుక్క. ద్వ. వి. (తోఁక+చుక్క.) ధూమకేతువు. "గీ. దేవనిభురాజ్యగర్వతమోవినాశ, సూచకం బయి పడుతోఁకచుక్క యనఁగ." దశా. ౨, ఆ. ౨౧.

తోఁకపీఁకుడు. దే వి. (తోఁక+పీఁకుడు.) తోఁకపీఁకు చున్నట్లు వెనుకకులాగుట,వెనుదీయుట. వ్యవ.- ఈవ్యవహార మేమియు దేల లేదు; తోఁకపీఁకు డుగా నున్నది.

తోఁకపీఁకుడుగాఁడు. దే. విశే. (తోఁక+పీఁకుడు+కాఁడు.) వెనుకకు లాగువాఁడు,వ్యవహారము తెము లనీక నాన్చువాఁడు. (బ్రా.)

తోఁకపురుగు. ద్వ. వి. (తోఁక+పురుగు.) తోఁక గలచిన్నపురుగు. (చూ. తోఁకపుర్వు.)

తోఁకపురువు = తోఁకపురుగు. (చూ. తోఁకపుర్వు.)

తోఁకపుర్వు = తోఁకపురుగు. "చ. హరిఁ బరమేశ్వరుం బ్రభు సమస్తజగత్ప్రియుఁ గీడువల్కుఁడు, న్నరుఁడవు నీదుజిహ్వ కలుప్రయ్యలు వాయదు నోరఁ బెల్లుగాఁ, దొరఁగవు తోఁకపుర్వులు .." హరి ఉ. ౬, ఆ. ౧౪౫. (శ. ర. పా. 'తోఁకప్రువ్వులు' ముద్రి.)

తోఁకమిరియము. ద్వ. వి. (తోఁక+మిరియము.) వాలమరిచము,తోఁక గలమిరియము. (శ. ర. బ్రా.)

తోఁకొను. దే. అ. క్రి. (తోఁక+కొను.) వెనుక నుంచుకొను, వెంటఁబెట్టుకొను. "ఉ. తోఁకొని పోయె నంత నొకతొయ్యలి యయ్యోలనాగ నట్లు పేరాఁకలిగొన్నబెబ్బులి రయంబునఁ గృష్ణమృగార్భకంబుపై,నీఁకయొలర్పఁ బెల్లడరి వ్రేయఁ గలిన్ .." భో. 3, ఆ. ౨౭౯. ౪, ఆ. ౭౪.

తోఁగఁదోఁచు. దే. అ. క్రి. (తోఁగన్+తోఁచు.) ప్రత్యక్షమగు. "గీ. ఇత్తెఱంగున పలుగొని యెదుర నతని,మండలాభ్యంతరమునఁ గాంచి మఱియుఁ జేసి, నాలుగుప్రదక్షిణంబు లీలలఁ దోఁగఁ దోఁచెనో చక్రి యని నారదుఁడు నటింప." కళ. ౨, ఆ. ౯౬.

తోఁగిందు. దే. స. క్రి. (తోఁగు ధా. ప్రే.) ముంచు. "గీ. వెండియును కొత్త నామీఁద వెండికొండ, మించి సెలయేటినీటఁ దోఁగించఁ దొడఁగునపుడు విరాళిశుక్రప్రశార్థ మొదవు, పూర్ణకుంభంబు

పాల్పుఁ దెల్పుచుఁ దెలంగు" రామా. ౭, ఆ. ౧౭౦.

తోఁగు. దే. అ. క్రి. 1. మునుఁగు. "ఉ. లేఁగి చకోర దంపతులఁ బ్రేల్చినకల్మషపంక మిందులోఁ, దోఁగినఁగాని పాయ దని తోయజబాంధవుఁ డిట్లు చేసెనో, నాఁగ .." భో. ౨, ఆ ౯౮. "క. ఈగంగాదితీర్థము, లీఁగంగా నీవు పకసమిద్ధాంబువులన్, దోఁగెడు వారల గసగన, గ్రాఁగెడు గంగార సింధుకల్లోలములన్." పాండు. ౧, ఆ. ౬౫౦; 2. కడిఁగిన. "గీ. . శోణితమునఁ, దోఁగి యతఁడొప్పెఁ దలిరాకు దఱఁగలించు, పెఱయుచవ పారిజాతంబు తెఱఁగు దాల్చి." భార భీష్మ. ౨, ఆ. ౪౩. "ఉ. ..లేఁబియపోనవానలన్, దోఁగుచు ..." కళా. ౩, ఆ. ౧౫, 3. ప్రవించు. "గీ జాఱుసికల తోఁగుచెమట శ్రమగుఁ జూడ." దశా. ౪, అ. ౪౭, 4. మిశ్రమగు "క. ఊఁగెడుకల్లును విసమునఁ దోఁగినపంటకముఁ గుత్సితుం డగుమంత్రిన్, లోఁగక యుత్సాహించిన, చోఁగలుగు నఖాడ మైనసుఖ మెవ్వరికిన్. వేం. పంచ. ౧ ఆ. ౩౪౩; 5. తాను. "ఉ. అంకట నొక్కచెంబు కడు నగ్గలికం బని పందిపోటుపైఁ, జెంత నుఁ బోవఁ జూచుటయుఁ జెంద ఱఁ గొమ్మల నెత్తఁ బంది నిం, తింతలు చెక్కలై కడఁ బయింబడి నొంచెఁ బిడేవ దానిక్రొ, వ్వంతయుఁ గాఱి కాఱి యచటాఱుక నేలను దోఁగునట్లుగన్." య. ౨, ఆ. ౯.

తోఁచిగాఁడు. దే. వి ఒకరకపుడేగ. "సీ. పొదదూఱు నొక పేటిపూరేటి వెలికిఁ బోఁ దోలి కైకొను నొక్కతోఁచిగాఁడు." స్వా. ౪, ఆ. ౫౮.

తోఁచే, దే. వి. చండాలుఁడు, మాలవాఁడు. ఆం. భా. ద్వి. ౨౮౯.

తోఁచు. దే. అ. క్రి. (సానుస్వార మని చిన్నయసూరి, శ. ర. కాని, నిర్ధారక ప్రయోగములు కానరావు.) 1. గోచరమగు. (నేత్రమునకు శ్రవణమునకు మనస్సునకుఁ గావచ్చును.) "క. అచ్చట నంతర్హితుఁడై, యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటి యొల్లిటికోనన్." భార విరా. ౫, ఆ. ౩౦౧. ఆము. ౪, ఆ. ౧౧. శైవ, ౬. ౫౮. భార. శాం. ౪, ఆ. ౧౪౦ 2. స్ఫురించు. "క. తోఁచినపగ రచియింపకెదఁ, దోఁచనిచోఁ జెలువగట్టుదోరతోడై వ్యాయూఁచకయె యూనటీయఁగఁ, దోఁచదపాథ్యంబు కవన గోరణిపట్లన్." ప్రబంధ. ౨౫. భార. భీష్మ. ౩, ఆ. ౧౫౬; 3. పుట్టు. "క. మిాతం డ్రికి నేమృత్యువు, నై తోఁచినవాఁడ..." భార. ద్రో. ౫, ఆ. ౧౨౮; 4. కలుగు "సీ.... తులసిదండకు వాడు దోఁపకుండ." హర. ౬, ఆ. ౪౫, 5. బయటపడు. "క. తులువా నీకులము గుణము తోఁచెం బ్రజకున్." భార. ద్రో. ౪, ఆ. ౨౮౯; 6. వచ్చు. "క.... వేసవి, కై పునడలఁ దోఁచెఁ గారుకాలము నక్మై పాండు. ౪, ఆ. ౧౯. స అ. క్రి. (తోఁగు ధా. ప్రే.) 1. ముంచు, స్నానము చేయించు. "సీ.... ప్రణవాగాఖ్యంబునందు దేహంబు దోఁచి." కాశీ. ౩, ఆ. ౮౯; 2 కడుగు. "చ పవరుహామిత్రబింబ మను పర్తులలాక్షికపట్టికం బయో, ధినదు ముఁ దోఁచి ..." పారి. ౨, ౪౩; 3. మిశ్రముచేయు. "చ. ద్రవ మయి యున్న క్రొత్తవారికాళమన శ్శిలలం గరంగి పల్లవమునఁ దోఁచి మేనికి యలంకరణం బొనరించె గౌరికిన్." హర. ౪, ఆ. ౮౪.

తోఁట. దే. వి. 1. ఉపవనము. "గీ. నాఁటె మందార తరువులు తోఁటలందు." భీమ. ౫, ఆ ౮౭; 2. గృహారామము. ఆం. భా. ద్వి ౩౪; 3. తపోవనము. "గీ. . ఒక్కకవిసి తోఁట, గాంచి .." య. ౯, ఆ ౫౦; 4 ఉద్యానవనము. "గీ. తోఁటఁ బగ లుండి మల్లెలు దుఱిమి .." ఆము. ౨, ఆ. ౭౦

తోఁటకాఁపు. దే వి. (తోఁట+కాఁపు) తోటమాలి, తోఁటకాపాడువాఁడు (శ ర. వా)

తోఁటకూర. ద్వ. వి. (తోఁట+కూర.) మారిషము, ఒకజాతికూరాకు, (దీనిభేదములు ఎఱ్ఱతోఁట కూర, పెరుఁగుతోఁటకూర, చిలుకతోఁటకూర, కొయ్యతోఁటకూర మొ) "మత్తకోకిల . కట తోఁటకూరకుఁ జంద్రహాసముఁ దెత్తురే." పిస. శకుం ౩, ఆ. ౩.

తోఁటపోఁక. ద్వ. వి. (తోఁట+పోఁక.) భూపూగము, ఒకజాతిపోఁక. (శ. ర.)

తోఁటమాలి = తోఁటకాఁపు. (వా.)

తోఁటమాలె = తోమాలె. (శ. ర.)

తోఁటమొల్ల. ద్వ. వి. (తోఁట+మొల్ల.) కుందము (శ. ర.)

తోఁటవాఁడు = తోఁటమాలి. "ఆ. కోరి తోఁట వాఁడు కుసుమఫలంబులు,కోయునట్లు..." భార శాం. ౨, ఆ. ౩౦౦.

తోఁటా. హిం. వి. ఒకవిధ మగుమందుగుండుసామా న. ('తూటా' అని వాడుక.)

తోఁటి = తోఁచ. (చండాలుఁడు.) "క నాఁటి కయిదేండ్లవాఁడన,మాట విని కృతాంబుఁ దలఁచి మానసమున న,త్తోఁటులమీఁదను బాదులు,గీటి కొనుచు దుష్టబుద్ధి కృత్రిమబుద్ధిన్." జై. ౮, ఆ. ౭౧. ఆం భా. ద్వి. ౨౮౯.

తోఁటీఁడు = తోఁటవాఁడు. (శ. ర. బ్రౌ.)

తోఁడు. దే. స. క్రి. 1. నీళ్లు మొ చేఁద మొ. తో డైతీయు. (వా.); 2. పెఱుకు. 'గీ. వాఁడి గోర్గాండిఁ గన్నులు దోఁడిరైన." భీమ. ౬, ఆ. ౯౯. కళా. ౫, ఆ, ౧౨౩; 3. బలాత్కారముగా నపహరించు. వ్యావ ...వానివద్దఉ నున్నసొమ్ము కరడు తోఁడివేసినారు; 4. నూలుపోగు తీసి చుట్టు. "గీ. నూలు తోఁడును వేడ్క నవ్వాలుఁ గంటి." హంస ౧, ఆ. ౭౨.

తోఁడుఁబోతు. దే. వి. (తోఁడు+పోతు.) కంపు చేయుట,కార్పాణము. (శ. ర.) విణ. కంపుచేయు వాఁడు,కార్పాణికుఁడు. "చ. కలువలవిందు కన్నడిమికందు కెపంబున కేఁడు బూఁదిలోఁ, గలయుమనోజుమేనియెముకలలో గలికువ్వరపేర నీచేరన్,గిలుబుచుఁ దోఁడుఁబోతుగతి గిట్టన వానిఁ బిస సిఁ జేసితా,లలవయిఁ బాపువెట్టి వెతలం బఱకం దగునా సమీరణా."చంద్రా. ౫,ఆ ౧౦౪.

తోఁడుకొను. దే. అ. క్రి. (తోఁడు+కొను) చుట్టు కొను,బాధనందు. వ్యవః నరములు తోఁడుకొని పోవుచున్నవి.

తోఁడుడు. దే. వి. (తోఁడు. ధా.) తోఁడుట,నూలు తీసి చుట్టుట. ఆం. భా. ద్వి ౨౬౯.

తోఁడెలు = తోఁడేలు. "క. . తోఁ,డెలు మొద లగువానిఁ గొన్నిటిని కేట కరుల్." స్వా. ౪, ఆ. ౫౦.

తోఁడేలు. దే. వి. అడవికుక్క,వృకము. "క. ఇవి తోఁడేళులభంగిన్,గవియుఁ బురుషు .." భార. శాం. ౩, ఆ. ౪౨౩.

తోఁప. దే. వి. చిక్కఁగాఁ గాఁచినయంబలి,సంకటి. ఆం భా. ద్వి ౨౫౬.

తోఁపించు. దే. స. క్రి. (తోఁచు ధా. ప్రే.) కను కఱచు. "మ...అర్ధశ్రేణి దోఁపించు పెం,పలరన్ ..." మల్ల. నీతి. ౩౬

తోఁపిక. దే. వి. (తోఁచు. ధా.) తోఁచుట. (శ. ర.)

తోఁపు దే. వి. 1. ప్రమదవనము.ఉద్యానము. "సీ. .. తోఁపు,నాఁగను బ్రమదవనాభిధ .." ఆం. భా. ద్వి. ౩౪; 2. తోఁట,వృక్షపంక్తి. "ఉ. మామిడితోఁపునం దనరుమల్లిని .." చం. రా. ౭, ఆ. ౩౩. అచ్చ, బాల. ౧౯౯; 3 ఎఱుపు రంగు. "సీ ధ్వాంతజాలము మీఁద దండెత్తుభాను మంతునివెలిగొల్లెనతోఁ కునంగ." ప్రభా. ౫, ఆ. ౫౯; 4. ఎఱ్ఱబట్ట. "సీ. అరుణవస్త్రంబు తోఁ పనఁ దోఁచుచుండు .." ఆం. భా. ద్వి. ౧౫౪; 5. నల్లతుమ్మచెక్క. ఆం. భా. తృ. ౫౫. 6. బూరె. మొ. వానిపూఁతపిండి. (శ. ర. వా.); 7. (తోఁచు ధా.) కానఁబడుట. "క. తననోఁపు భవనిరాసం,బునకుం గారణము..." భార. అను. ౧, ఆ, ౩౧౨; 8. జన్మము. "క. అనఘ యను యనులోమమునఁ దోఁ, పును బ్రతిలోమమున లయము వొందుటయుఁ గ,ల్గును .." భార. ఆను. ౪, ఆ. ౧౮౪; 9. సంకల్పము. "సీ... తోఁచుతోఁపుల కెల్లఁ దోడ్తో నడంచి..." భార. అశ్వ. ౧, ఆ. ౨౦౨. విణ. ఎఱ్ఱనిది "సీ. క్రొత్త దంబుల కెంపు క్రొత్తదంబులరంగు నిగికిఁ దోఁపు వన్నియలు నింప" య. ౧, ఆ. ౩. రసిక. ౪, ఆ. ౯౪.

తోఁబుట్టినవాఁడు. దే. వి. (తోన్+పుట్టిన+వాఁడు.) సోదరుఁడు. భార. ఆది. ౬, ఆ. ౧౯౭. ఇట్లే:- తోఁడఁబుట్టినవాఁడు. మొ.

తోఁబుట్టు. దే. వి. (తోన్+పుట్టు.) సోదరుఁడు; సోదరి. అచ్చ. బాల. ౭. స్వా ౨, ఆ. ౪౩. ఇట్లే తోఁబుట్టుగు, తోఁబుట్టువు, తోఁడఁబుట్టినది, తోఁడఁబుట్టువు. మొ. విణ. సాటియైనది,సదృశము. "వ . చుక్కలచక్కఁదనంబునకుఁ దోఁబుట్టైన హయలవణాపాణిపల్లవిశ్రీ ప్తంబు లైనవచ్చకప్పు గంబులుకులును .." భీమ. ౫, ఆ. ౧౨౦. ఇట్లే: తోఁడఁబుట్టువు. "ఉ... వడి నైనెఁ దీవ్రవిర్ధా

తమలోఁదఁబుట్టు వరఁగాఁ దగుపుజ్జ్వలశక్తి ద్రుక్య్యైన." భార. అర. ౫, ౨౮౩.

తోకము. సం. వి. అ. న. అపత్యము, బిడ్డ.

తోకొను. దే. అ. క్రి. (తోఁడు+కొను.) తోడ్కొను, వెంటఁబెట్టుకొను. "క. సాకారణమున బుద్ధిఁబూఁ, జేకొంతయు నరకగతికి నేఁగెడు వానిం, దోకొని పోయెద నని శుభ,లోకంబున కరిగెఁ ద్రిదశ లోకస్తుతుఁడై." భార. అర. ౩, ఆ. ౨౧౦. నిర్వ. ౭, ఆ. ౧౪.

తోక్మము. సం. వి. అ. పుం. 1. క్రొత్తమొలక; 2. పచ్చనిరంగు. న. 1. కలిమి; 2. మేఘము. విణ. (అ. అ. అ.) పచ్చనిది. [3, ఆ. ౧౪౬.

తోచిదులు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. హంస.

తోటి. దే.వి. (తోఁడి యనుదాని యపభ్రంశరూపము?) 1. వినోదము,వేడుక. "ఉ. ..తోటికిఁ జూచు వార లిది దుర్వ్యసనం బన నమ్మవచ్చునే." ద్వా. ౧౦, ఆ. ౧౦౧; 2. (త. తోట్టి.) చండాలుఁడు, మాల. "క. నాఁటికయి దేండ్లవాఁ డను,మాట విని కృతంబుదలఁచి మానసమున న,త్తోటులమీఁదను బాదులు, గీఁటుకొనుచు దుష్టబుద్ధి కృత్రిమ బుద్ధిన్." జై. భా. ౮ ఆ. ౬౧. ఆం. భా. ద్వి. ౨౮౯.

తోఁడ. దే. ప్ర. దు. తృతీయావిభక్తిప్రత్యయము. "వ ..అర్జునుచేత సుప్రతీకగజంబుతోడన భగదత్తుచావును..." భార. ఆది. ౧, ఆ. ౪౬. (ఇది యపాదానపంచమ్యర్థమునను, అలుక్సమాసమున 'ఇ' వర్ణాంతముగను, సహ శీఘ్రము గా మొదలగునర్థములతోను బ్రయోగింపఁబడును. దీనికి 'తోన' యనురూపముఁ గొందఱు ప్రయోగించియున్నారు.) "సీ. ప్రావృడ్ఘనని కోడఁ బాసిన బిడ్డలై .." కవిక. ౨, ఆ. ౬౦. (అపాదాన పంచమి.) "క. గురుతరపక్షములతోడికులగిరివో లెన్." భార. ఆది. ౨, ఆ. ౪౨. (అలుక్సమాసమున 'ఇ' వర్ణాగమము.) "గీ. స్తంభగతరత్న పుత్త్రిక దనదుపోఁటి,యని విలోకించి తోడ మాటాడ కునికి." రామా. ౪, ఆ. ౧౫౮. "ఉ. నిను నమ్మి యుండినఫలం బిదె తోడన దగ్గె..." పారి. ౧, ఆ. ౧౨౫. "శా. తోనం దిమ్మయవీర రాఘవముఖుల్ తోఁబుట్టులై..." దశా. ౧, ఆ. ౫౫.

తోదంటు. దే. వి. (తోడు+అంటు.) చేమిరి,తోడు కొనుటకై కాచి చల్లార్చినపాలలోఁ గలుపఁబడ్డది. "క. తగఁ దోదంటునఁ బా లింపుగఁ దెరుఁ గయి నది యభోజ్యం బగునే." ద్వా. ౧, ఆ. ౨౬. శుక. ౧, ఆ. ౧౪౯. [3. బాధించుట,

తోదనము. సం. వి. అ. న. 1. పొడుచుట; 2. చీల్చుట;

తోడా. దే. వి. 1. హస్తభూషావిశేషము. (శ. ర.) 2. బిరుదచిహ్న మగునాభరణవిశేషము. (వా.)

తోడి. దే. వి. 1. ఒకానొకనపుంసకరాగము. "సీ... తోడి వరాళి ." హంస. ౫. ఆ. ౧౨౪; 2. సోదరుఁడు. "చ. అనిమిషనాథుతోడి యని యప్పుడు గంటి ననంతు నాద్య ." భార. శాం. ౫, ఆ. ౪౦౫. (అనిమిషనాథుతోడి = ఉపేంద్రుఁడు.) వి. తోడన్ అనుదానివృత్తియందలి రూపము. ఉదా:-తోడికోడలు, తోడియల్లుఁడు, తోడివాఁడు మొ.

తోడిక. దే. విణ. (తోఁడు+ఇక స్వార్థమున.) జంటయైనది. "సీ. హేమకుంభసభూలి యెమ్మె డించిన రీతిఁ దోడిక నవ చన్నుదోయితోడ." ఉద్భ. ౨, ఆ, ౧౭౪. (తోడికె అపముద్రి.)

తోడికోడలు. దే. వి. (తోడన్+కోడలు.) యాఁత, మగనితోఁ బుట్టినవానిభార్య. హైమ. ౭, ఆ. ౯.

తోడిచూలు. దే. వి. (తోడన్+చూలు.) తోడఁ బుట్టువు. "క. అకసముతోడిచూ లన .." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౯౨.

తోడిజోడు. దే. విణ. (తోడన్+జోడు.) సమానుఁడు, సాటివాఁడు. "గీ. అతనిపుత్త్రుఁడు గుణనిధి యనెడువాఁడు, దర్పకునితోడి జోడు సౌందర్యరేఖ." కాశీ. ౪, ఆ. ౭౯. ౫, ఆ. ౧౬౫.

తోడితెచ్చు. దే. స. క్రి. (తోడన్+తెచ్చు.) 1. తీసికొనివచ్చు. "క. రామాజ్ఞ లేకయే నను, దీమసమున నిందుఁ దోడితెచ్చితొ..." ఉ. రా. ౬, ఆ. ౨౬౨; 2. బంధించి కొనివచ్చు. "ఆ. కన్న మిడఁగ రాత్రి కన్నచో ముచ్చులఁ, దోడి తెచ్చి కేలు త్రుంచివైచి, వాఁడికొలుఁ దిగిచి వారిఁ జంపుట రాజధర్మ మనుచు నాత్మఁదండి చెప్పె." విజ్ఞా. ప్రా ౯౯.

తోడితెప్పించు. దే. స. క్రి. (తోడితెచ్చు. ధా. ప్రే.) రప్పించు. "ఆ. దేవ యతనిఁ దోడి తెప్పింపు..." భాగ. ౧౦, స్కం. ఉ. ౯౬.

తోడిది. దే. విశే. (తోడన్+అది.) 1. సాటిది. "క...న,స్నేయబలలతోడిదిగాఁ, జేకొఁ దలంచి తివి తప్పు సేసితి గంటే." భార. విరా. ౨, ఆ. ౩౩౯; 2. విడువకుండునది. "గీ. వానితోడిద లోకమై యేను పోవ,నైతి .." భార. ద్రో. ౨, ఆ. ౧౪౩; 3. అనుసరించునది. "చ. ఘనభుజ యొల్లచుండమునఁ గాలమతోడిద..." భార. శాం. ౫ ఆ. ౩౯౫; 4. సంబంధమైనది. (జోలి, ప్రసక్తి అని సూ. ని.) "వ...వీరితోడి దేమి .." భార. ఆది. ౬, ఆ. ౧౯౫. ౩, ఆ. ౧౪౮.

తోడిదొంగ. దే. వి. (తోడన్+దొంగ.) ఒక దొంగతో నుండుమఱియొక దొంగ. "క...నా తోడిదొంగలై తిరి మీరున్." ప్రభా. ౫, ఆ.౮౧.

తోడిపీడ. దే. వి (తోడన్+పీడ.) అనుసరించుపీడ. అనుయాయి. "వ...అద్దేవునితోడిపీడయుం బోని నరసామర్థ్యుండగుమహాపురుషుని..." భార. భీష్మ. ౨, ఆ. ౨౬౨. విశే 1. విడువనిది. "సీ. నెఱి లేక నీతోడిపీడవై గెడఁగూడి కరఁగినస న్నేక యొరవు సేసి." కు. సం. ౫, ఆ. ౧౨౩; 2. సహాయమైనది. ఇట్లే తోడునీడ.

తోడిపొత్తు. దే. విశే. (తోడన్+పొత్తు.) సహవాసము, మైత్రి. "సీ. అంత దేవాహితులు... అమర్త్యులతోడిపొత్తింతియ చాలు నింకేల యనుచు." భార. ఆది. ౨, ఆ ౨౧.

తోడియల్లుఁడు. దే. వి (తోడన్+అల్లుఁడు.) షడ్డకుఁడు, జగిలెండు. ఆం. శ. ౪౭.

తోడివాఁడు. దే. విశే. (తోడన్+వాఁడు.) 1. సాటివాఁడు సమానుఁడు "గీ. తోడివారలు నవ్వ..." పాండు. ౩, ఆ. ౩౬, 2. తోడ నున్నవాఁడు. "క...తోడివారి వీక్షించి..." నైష. ౩,ఆ. ౬౭.

తోడు. దే. వి. బొ. 1. సాహాయ్యము. "క. ఆఁడివి యేటిమాటలు, నీతోడగు టొల్లఁ బొమ్మనిన ..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౪౦; 2. సోదరుఁడు. "గీ తోడివారలు నవ్వ నాతోడ .." పాండు. ౩ ఆ. ౩౬; 3. సోదరి; 4. ఆన,ఒట్టు. "క. నీతోడు నీసమానులు, భూతావలిలోన నెందుఁ బుట్టరు .." హరి. ఉ. ౮, ఆ. ౪౯. భాగ. ౧౦, స్కం. పూ. ౭౭౪; 5. చేమిరి, తోడంటు. ఆం. భా. ద్వి. ౨౪౯. స. శ. ౪౪. విశే. 1. సహాయము. "సీ...దైవంబు తోడయ్యె ..." భార. భీష్మ. ౧, ఆ. ౬౦. భార. ఉద్యో. ౪, ఆ. ౨౫౮; 2. సహాయుఁడు. "ఉ...నారాయణభట్టు...తోడయి నిర్వహింపఁగన్." భార. ఆది. ౧, ఆ. ౨౫; 3. సహాయురాలు. "క. నాతోడులార మీకులి, మీతోడే పనులయెడల మేలే యనుదుర్, నాతోడిదె నాతోడిదె తాతా పే లనుచు నదిరి తరుణులు వరుసన్." భాగ. ౯, స్కం. ౧౮౪.

తోడుఁబాలు. ద్వ. వి. (తోడు+పాలు.) 1. పాలు పిఱుకుటకుముందు పాత్రలో నుంచుకొంచెమునీరు. (శ. ర. వా. శూన్యపాత్రలో పాలు పిఱుకరు.); 2. పాలకుతోడు. (బ్రా.)

తోడుకొను. దే. అ. క్రి. (తోడు+కొను.) తోడు పెట్టినపాలు గడ్డకట్టి పెరుగగు. (శ. ర. బ్రా. వా.) స. క్రి. (తోడు+కొను.) వెంటఁబెట్టుకొను. "గీ ..తనయుని దోడ్కొనుచు వైష్ణవ పరిషత్తు గొలువ నరిగి." ఆము. ౬, ఆ. ౯౩.

తోడుచల్ల. దే. వి. (తోడు+చల్ల.) పాలు తోడుకొనుటకై కలుపుమజ్జిగ. (శ. ర. వా.)

తోడుత. దే. ప్ర. ద్రు. తోడ. "ఉ ..బౌద్ధకృతము తోడుతన్ సమరధర్మము వీవర పుచ్చి .." శై. ౧, ఆ. ౫౬. క్రి. విశే. ద్రు. వెంటనే. "శా... అత్తోడుతన్, ...రాంచత్సరులై తనర్చు .." చంద్రా. ౪, ఆ. ౧౭౧.

తోడుతో. దే. క్రి. విశే. ద్రు. వెంటనే. "గీ. వ్రాసె నొక్కలతాంగి క్రొవ్వాఁడిగోర, వర్ణములు తోడుతో మషీవర్ణములుగఁ,బసిఁడి గేదంగిఱేకునఁ బ్రస్ఫుటముగ, మదనలేఖంబు నర్మమర్మంబు మెఱయ." నైష. ౩, ఆ. ౯౯. భార. భీష్మ. ౩, ఆ. ౧౦౩.

తోడుతోడ. దే. క్రి. విశే. ద్రు. (తోడన్+తోడన్.) 1. వెనువెంట. "గీ. అన్నరుఁడు దోడుతోడ నైదాఱునిశిత,కాండములఁ ద్రుంచి కటుసాయకత్రయంబు, సొనిపె..." భార. కల్యా. ౧, ఆ. ౨౧౭; 2. క్రమక్రమముగా. "క. ఈమెయి నిజజనకుభుజో,ద్దామబలము దోడుతోడఁ దఱుఁగుటయుం రథ,స్తోమంబుఁ దాను నశ్వ,త్థామ వెనుదాఁకెఁ బాండుతనయునితోడన్." భార. విరా. ౫, ఆ. ౧౩౯.

తోడుతోడుత. దే. క్రి.విశే. ద్రు. (తోడుతన్+తోడుతన్.) వెనువెంట. "గీ...పేన, తోడుతోడుతఁ

బొంగారి చూడ నొప్పె." భార. భీష్మ. ౨, ఆ. ౧౧౮.

తోడుదొంగ = తోడిదొంగ. రాఘా. ౧, ఆ. ౯౪.

తోడుదొన. దే. విశ. (తోడు+దొన.) జానట, సహాయము. "క. తోడుదొన లేనియప్పటి, క్రీడె కొలంది యట్టిది .." భార ఉద్యో. ౩, ఆ. ౪౭౭.

తోడునీడ = తోడినీడ. వి. (కూడనుండుఛాయ, అను యాయి.) "వ...అతనితోడునీడలుం బోని తన పుత్త్రులం దలంచి .." భార. ఉద్యో. ౩, ఆ. ౧౯౨. విశ. 1. (కూడనుండునది.) "క. నీవెంటఁ దోడునీడై, నే వచ్చెద..." వి. పు. ౬, ఆ. ౩౨; 2. (రక్షకుఁడు) "క...పనికలకుం దోడునీడ వల్లభుఁ డెకదా." రామా. ౭, ఆ. ౩౭, 3. (సాటియైనది.) "సీ... ధూమకేతువులకుఁ దోడునీడ. గీ. లు..." శివరా. ౪, ఆ ౧౪.

తోడుపడు. ద్వి. అ. క్రి. (తోడు+పడు.) సాయపడు. "గీ. భీష్మునకుఁ దోడుపడువారి బెట్టు దాఁక. భార. భీష్మ. ౨, ఆ. ౩౮.

తోడుపాటు. ద్వి. వి. (తోడుపడు. ధా.) 1. తోడగుట. "చ. నృపతులు పొచ్చి పోరుచుడ సెయ్యురు బంధులుఁ దోడుపాటు నీ,చపుఁబనియే..." భార. ద్రో. ౪, ఆ. ౨౮౦; 2. అండ, 'క...కృపుచు, ద్యాభీతవిక్రమముతోడుపాటు గలంగఁగన్." భార. శల్య. ౧, ఆ. ౨౭౯.

తోడుపెట్టు. దే. స. క్రి. (తోడు+పెట్టు.) 1. తోడుగాఁ జేయుఁ. (చూ. తోడువెట్టు.) 2. చేమిరిపెట్టు. (వా.)

తోడువచ్చు. దే. అ. క్రి. (తోడు+వచ్చు) సాయమగు. "గీ. అట్టివీరుండు దోడు రా..." ఉ. హరి. ౪, ఆ. ౨౨౦.

తోడువడు = తోడుపడు' "ఆ ..కౌరవపతి ద్రిగర్తనిబలంబుఁ బనిచెఁ దోడువడఁగ." భార. ద్రో. ౪, ఆ. ౧౦౬.

తోడువెట్టు = తోడుపెట్టు. (తోడుగాఁజేయుఁ.) "వ...ఇద్దఱు శిష్యులం దోడువెట్టి..." పిన. శకుం. ౭, ఆ. ౮౩.

తోడుపోవు. దే. అ. క్రి. (తోడు+పోవు.) 1. సాయమగు. "వ...నే నాశశంబునకుఁ దోడుపోయిన వాఁడ..." వెం. పంచ. ౧, ఆ. ౪౮౧. 2. సాటియగు. "ఉ. రాతికిఁ దోడుపోయినది రాసుతు డెందము .." సా. ౨, ఆ. ౯౮.

తోడుసూపు. దే. అ. క్రి. (తోడు+చూపు.) 1. సాయమగు. "క...ద్రుపదుఁడు,గడువేఁడుకఁ దోడుసూపెఁ గాంతేయులకున్." భార. ఉద్యో. ౧, ఆ. ౨౨౧. స. క్రి. ప్రసరింపఁజేయు. "శా. ... ఆదిత్యుం డిటుఁ దోడుసూపు ..మయూఖౌఘమున్." నైష. ౧, ఆ. ౧౯.

తోడెము. దే. విశ. అల్పము. "సీ. నైకంబు కొంచెము సన్నంబు తోడెము...గీ...అనఁగను గొలలు నల్పము..." ఆం. భా. తృ. ౧౬. (వి. 'కొంచెము' అని శ. ర. బ్రా.)

తోడ్కొను = తోడుకొను. (వెంటఁగొను.) "మ... అకన్యఁ దోడ్కొని తెచ్చెన్." భార. ఆది. ౪, ఆ. ౧౯౧.

తోడ్త = తోడుత. చంద్రి. ౧, ఆ. ౧౦౪.

తోడ్తో = తోడుతో. 1. (శీఘ్రముగా.) "మ... తోడ్తో నారయఁ బంచినన్." ఉ. రా. ౩, ఆ ౨౯౦; 2. (క్రమముగా.) "సీ. వరుణుఁ డాదిగఁ గలవసువులు దోడ్తోన పుట్టుచు నన్న ..." భార ఆది. ౪, ఆ. ౧౭౧.

తోడ్తోడ = తోడుతోడ. (శీఘ్రముగా.) "సీ. తోడ్తోడ చిత్తాబఁ దొరయుపుష్పాడి కేఁచి కమ్మఁ పేనియ పోన గడలుకొలిపె." కృ. శకుం. ౧, ఆ. ౮౧.

తోడ్పడు = తోడుపడు. (సాయమగు.) "క... అనికి నివి తోడ్పడు నే." భార. ద్రో. ౭, ఆ. ౧౦౧.

తోడ్పాటు = తోడుపాటు. (సాయము.) "గీ. నీకు నాలావు తోడ్పాటు లేక యుండవలయు..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౯౯.

తోతెంచు. దే. అ. క్రి. (తోఁచు+తెంచు. స్వార్థము.) 1. కనఁబడు. "క. కేతనకపిభయదంబై, తోతేరఁగ......" భార. కర్ణ ౩, ఆ. ౮౪, 2. క్రమ్ము. "మ...సంతతో,ద్ధతసంవర్తవలాహకంబులు వెసన్ దోతెంచు దిక్భిత్తులన్." భార. అర. ౪, ఆ. ౨౪౬; 3. పుట్టు. "క. ఈతెరువునఁ జరియించుచు,నేతెఱఁగున నైనఁ దప్పె నేనియుఁ గురుపుం,డాతతనాకసుఖముగఁ గనఁ,దోతెంచు ను మగఁడ నద్బుధులవంశమునన్." భార. శాం. ౭, ఆ. ౬౨౮; 4. వినఁబడు. "క. చూడ మది యేమి క్రొత్తయొ,తో తా మిట యుపలిసమితి

కోలాహలముల్, తోతెంచె నంచు భూపతి, చూళలతాగృహము వెడలి చూడం జూడన్." రాజ. చ. ౨, ఆ. ౧౯౭; 5. వచ్చు. "క. అతఁడు గనుఁగొని భయపడి, తోతెంచిరి మనుజు..." సాంబో. 3, ఆ. ౯౯; 6. ప్రత్యక్షమగు. "మ. మతి నైవస్వతుచేఁ దలంపఁబడి యమ్మత్స్యంబు తోతెంచె .." భార. అర. ౪, ఆ. 33౭ స. క్రి. (తోడు+తెంచు.) 1. తీసికొనివచ్చు. "సీ. అటు గాన ననుఁ గోరినట్టిచక్కనిచిన్నవానిఁ దోతెంచి నావాంఛఁ దీర్పు." శుక. ౨, ఆ. ౫౦, 2. తీసికొనివెళ్లు. "గీ... వాగ్భవు యపుడు, మఱియు నొకమానవేంద్రు సమక్షమునకు, నిందుబింబాస్యఁ దోతెంచి యుట్టు లనియె." శైవ. ౫, ఆ. ౧౦౧.

తోతెచ్చు. దే. స. క్రి. (తోడు+తెచ్చు) తీసికొని వచ్చు. "క. నానోదరి నీమాత్రం జూతడు రప్పింపు మనుడు సుదతియుఁ బుత్త్రిక్, దోతెచ్చి యంకపీఠిక, జేకొ మోదమున నిల్ప చెన్నలరారన్." ఉద్భ. ౪, ఆ. ౨౧౬.

తోత్రము. సం. వి. అ. న. 1. ఏనుఁగులఁ బొడిచెడి బరిగోల; 2. పసులను దోలుములుకోల.

తోదనము. సం. వి. అ. న. 1. నొప్పించుట, 2. నొప్పి, 3. పసులను దోలుములుకోల. విణ. 1. (అ.ఆ.అ) నొప్పించునది, 2. (అ. ని. అ.) నొప్పింపసాధ్యమైనది.

తోదు. దే. వి. పరుపకట్టు. (శ. ర. బ్రా.)

తోదోపాడు. దే. స. క్రి. (తోదోపు+ఆడు.) 1. చొచ్చు. "మ. కనఁగాఁ జిత్రము గాఁగఁ జేవు రణరంగక్షోణియం దున్నశత్రునృపాలావళి యర్కమండలముఁ దోదోపాడుచున్ దాఁటె .. ..." రామ. ౪౨౩; 2. పరస్పరము తోసికొను. (చూ. తోదోపులాడు.)

తోదోపు. దే. వి. (తోపు+తోపు.) మిక్కిలి త్రోయుట. "ఉ. ఆపగిదిన్ ఘటించి యమరాసుర సైన్యము లంత చెంతయున్ గోకము లగ్గలింప నెలకొల్పగడంబునఁ జేరి చేరి తో,దోపుల మీఱి ..." శశాం. ౫ ఆ. ౧౯.

తోదోపులాడు = తోదోపాడు. (చొచ్చు, ప్రవేశించు.) "క. అపాలఁతికలఁపు వలపున, డాపక తోదోపులాడుటయుఁ గరితీపుం జూపుల కోపుల కేపుల, నైపుల నైపులక లెసఁగె భావము గరఁగన్." శశాం. ౨, ఆ. ౭౭; 2. (పరస్పరము తోసికొను.) "ద్వి. తోదోపులాడుచుఁ దొలఁగక యంత." ద్వి. పరమ. 3, ఆ. ౧౬౬, పు.

తోనిగాఁడు. దే. వి. మగడేగ. (తోనిగాడు శ్యేన విశేష మని శ. ర.) ఆం. భా. ద్వి. ౯౦.

తోపాటు. దే. క్రి. విణ. తోడ,సహా. (అవ్య 'వలె' అని శ. ర.) "సీ. తనపుత్త్రితోపాటు చనుబాలొసంగుచుఁ గూరిమితోఁ బెంచె గొన్నినాళ్లు. గీ. అత్తసుతుఁ డంచుఁ బరసుతుఁ డంచు మదిని, భేద మింతయుఁ లేక సమ్మోదమునను, బ్రేమ నిరువుర నొకరీతిఁ బెంపుచుండె, నొక యాయమసాటి యొంటైనఁ గలదె." బ్రహ్మో. ౨, ఆ. ౭౯౦. వి. (తోడు+పాటు.) సాయము.

తోపారము. దే. వి. డేగకనుమఱువు. ఆ. భా. ద్వి ౯౦.

తోపి. దే. వి. టోపికుల్లాయి. (శ. ర. బ్రా.)

తోపు. దే. వి. త్రోపు. (చూ. తోదోపు.)

తోమము. దే. వి. (తోము. ధా.) తోముట. "వ. పిడుకకొలపంబు తోమకంబునఁ బుటపుటనై .." ఆము. ౪, ఆ. 3౫.

తోమరము. సం. వి. అ. పుం. న. 1. చల్లకోల; 2. ఇనుపగుదియ, 3. వృత్తవిశేషము.

తోమాలిక. ద్వ. వి. (తోఁట+మాలిక.) తోమాలియ. "గీ. రంగవిభునకు విప్రనారాయణుండు, చేయుఁ దోమాలికలకుఁ జాంపేయకములు, వేసవి యొసంగె." .. వైజ. ౨, ఆ. ౧౪౧.

తోమాలియ. ద్వ. వి. (తోఁట+మాలియ.) వనమాల, ఆకులు పువ్వులు కూర్చి కట్టినపెండె. "సీ. వైచుఁ దోమాలియ వైజయంతీకాంతిపలయితవక్షశ్శవాటునకును." పాండు. ౪, ఆ. ౨౦.

తోమాలె = తోమాలిక. 1. (వనమాల.) "సీ. బాహామధ్యంబునఁ బవడంపుఁజివురులఁ బచ్చలతోమాలె యచ్చుపఱిచి." శైవ. ౭, ఆ. ౧౧౨; 2. (మాలిక.) ఆం. భా. ద్వి. ౧౬3.

తోము. దే. అ. క్రి. మఱికి పోవ రుద్దు. "సీ. నిగనిగఁగాఁ దోమి నిండుబోనముదొంతి భోజనశాలలోఁ బొసఁగఁ జేర్చి." హర. ౨, ఆ. ౧౨౨.

తోముడు. దే. వి. (తోము. ధా.) తోముట. ఆం. భా. ద్వి. ౧౬౦.

తోయకామము. సం. వి. అ. పుం. నీటిప్రబ్బలి. విణ. (అ. ఆ. అ.) దప్పి గొన్నది; నీరు కోరునది.

తోయకుంభము. సం. వి. అ. పుం. నాచు చె.

తోయగర్భము. సం. వి. అ. పుం. కొబ్బరి చె. విణ. (అ. ఆ. అ.) లోపల నీరు గలది.

తోయగాఁడు. దే. విణ. (తోయము+కాఁడు.)- విధము గలవాఁడు-ప్రవర్తకుఁడు. "క. పలుతో యంబులజగములఁ బలుతోయములందు ముంచి భాసిల్లెడియా, పలుతోయగాఁడు పల్లవ, లలనాకర తోయములఁ జెలంగుచుఁ దడిసెఁగాన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౯౭.

తోయజము. సం. వి. అ. న. పద్మము.

తోయదము. సం. వి. అ. న. నెయ్యి. పుం. మబ్బు. విణ. (అ. ఆ. అ.) జలము నిచ్చునది.

తోయధరము. సం. వి. అ. పుం. మబ్బు. విణ. (అ. ఆ. అ.) నీటిని ధరించునది. [తోయనిధి మొ.

తోయధి. సం. వి. ఇ. పుం. సముద్రము. ఇట్లే

తోయధిప్రియము. సం. వి. అ. న. లవంగము చె.

తోయపిప్పలి. సం. వి. ఉ. స్త్రీ. నీటిపిప్పలి, లాంగలి చె.

తోయపుష్పి. సం. వి. ఉ. స్త్రీ. కలిగొట్టు చె.

తోయము. ఉభ. దే. వి. 1. విధము. "క పలుతో యంబుల జగములఁ, బలుతోయములందు ముంచి భాసిల్లెడియా, పలుతోయగాఁడు..." భాగ. ౧౦ స్కం. పూ. ౧౯౭; 2. పర్యాయము. "వ. .. రెండవమాఱు జగజ్జనంబులో నొకఁ డొసాతలగత యయినభూమి నెత్తుచు యజ్ఞేశుం డయి వరాహ దేహంబు దాల్చె మూఁడవతోయంబున నారదుం డనుదేవర్షి యై కర్మనిర్మోచకం బైనవైష్ణవ తంత్రంబు సెప్పె నాలవపరి..." భాగ. ౧ స్కం. ౬౩; 3. పక్షము. "క. చెలరేఁగి రెండు తోయంబుల పేరంటాండ్రు చిత్రముల నెంతయు వేడ్కలు మీఱఁ జల్లులాడిరి." కళా. ౭, ఆ. ౭౦; 4. తఱి. "క. తోయములు రెమ్ము మాకే, తోయము వేటాడ నెరవు దొరకదు..." భాగ. ౧, స్కం. ౪౫౯; 5. పరిజనము. "క.. దప్పి జనించెను, దోయమువారలును లేరు ..' భాగ. ౧, స్కం. ౪౫౭. విణ. ఏకకంఠ్యము, ఒక్కకంఠము గలది. "దండకము . రుద్రుండు శర్వాధిపుల దంచు సామ్నాయసంఘాత మామ్రేడిత ప్రక్రియన్ దోయమై యాతనిం జెప్ప..." కాశీ. ౭, ఆ. ౭3. సం. వి. అ. న. 1. ఉదకము, నీరు; 2. పూర్వాషాఢ.

తోయముక్కు. సం. = తోయముచము.

తోయముచము. సం. వి. చ్. పుం. నీరు.

తోయరాశి. సం. వి. ఇ. పుం. సముద్రుఁడు.

తోయరుహము. సం. = తోయజము.

తోయలి = తొయ్యలి. "క. తోయలి తనతనువు కాచటఁ దొఱఁగెనో యకటా." హరి. రా. ను. 3౫.

తోయవల్లి. సం. వి. ఈ. స్త్రీ. కాఁకర చె.

తోయశూకము. సం. వి. అ. పుం. నాచు చె.

తోయు = త్రోయు. (చూ. తోపు.)

తోయేశము. సం. వి. అ. పుం. శతభిష. న. పూర్వాషాఢ.

తోరణ. సం. = తోరణము.

తోరణకట్టు. మి. స. క్రి. (తోరణ+కట్టు.) 1. తోరణముకట్టు. "క. ఇలమీఁదికి డిగి వేలుపుఁ, గొలఁకులు మణికంధరునిశపోవనమున కింపలరఁ జనిరి కమచూడ్కులు, తోలంకగ నీలోత్పలములఁ దోరణకట్టన్." కళా. 3, ఆ ౭; 2. వరుసఁజేయు. "సీ. ప్రణుతింప నతఁడు తోరణకట్టు పరసీమ లనురీతి నూత్నతోరణము లెసఁగ." కృష్ణ. ౨, ఆ. ౪౧; 3. తిరస్కరించు. "సీ. కమలకోరిక చక్రకనకకుంభములసౌష్ఠవముఁ దోరణకట్టు." వరాహ. ౪, ఆ. ౧౪౯. అ. క్రి. అలముకొను. "సీ. కంధరపటలసంకాశంబు లగునంధకారముల్ తోరణకట్టె దిశల." హరిశ్చ. 3, ఆ. ౩౦. దశా. ౧, ఆ. ౧౧౦. ఇట్లే తోరణముకట్టు. "దండకము...గాఢలీలాఘనౌఘంబు మోఘంబుగా మేఘపీథిన్ ధరాధ్రోజగద్ధోరణిన్ దోరణల్ గట్ట..." పాండు. ౪, ఆ. ౭౭.

తోరణము. సం. వి. అ. పుం. న. 1. బహిర్ద్వారము; 2. మంగళార్థము గుమ్మము మొ. వానికిఁ గట్టెడు మామిడాకులు మొ. వానిదండ. "చ. ఇతఁడు తపస్వివేషధరి విశేంద్రుఁడ తప్పదు గాక యుంన్న నాఁ, డితఁ డరుదేరఁ దోరణము లెల్లెడలందు సమర్చి పేర్చి సట్టతులకుపర్వకార్ముకచయప్రథ నింగి నలంకరించునో..." రామా. 3, ఆ. ౪; 2. రాజమార్గము లందలంకారార్థము కట్టుపత్త్రపుష్పాదులదండ. "గీ. ఘనతరఫలాసతాఖండ కదళిక

లును,గిరరాజీకృత సజీవతోరణములు." వసు. ౧, ఆ. ౧౫౧.

తోరమల్లి. దే. వి. వజ్రమువలె తెల్లగా నుండునల్ప మణివిశేషము. (శ. ర. బ్రా.)

తోరము. వై. విణ. (సం. స్థూలమ్.) 1. లావైనది ఆం. భా. కృ. ౫౫; 2 అధికము. "ఉ...దు, ర్వ్యాసుఁడు వాసుదేవుఁ గని వైరము తోరము చేసినాఁడు..." ఉ. హరి. ౪, ఆ. ౨౭; 3. దట్టము. "సీ. తోరంబురాఁ బచ్చతోరణంబులు గట్టి..." కనక. ౬, ఆ. ౧౯౯; 4. బలిష్ఠము. "క. ఆరెండుబలములందును దోరంబై యున్న యట్టితోఁచెం బొండు,త్మారమణసుతులలమునర, నారాయణు లునికిఁ జేసి నాకుం జూడన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౪౦, 5. సుందరము. "క. తోరపుఁగన్నుల వేవుర,తో రహిఁ శక్రిష్ట కొలువఁ దులకింపుచు సిం,గారపుఁదోఁటకుఁ జనియెన్,గార వమున దేవయాని .." య. ౪, ఆ. ౧౪. వి. (సం. దోరః) వ్రతసూత్రము. "సీ. పసిఁడి తోరముతోడిబాహు వల్లన నెత్తి సాఁకెకుఁ బోడల పైఁ జాఁచి చాఁచి." స్వా. ౭, ఆ. ౭౭. బ కృపాణీరేఖలు. ఆం. భా. ద్వి. ౨౧౪.

తోరహత్తము. వై. వి. ఒకానొకమల్లబంధము. "సీ. ఉపతాయిలోఁ దనకొడవినతోరహత్తము సూవి ప్రేయక .." భార. విరా. ౨, ఆ. ౧౫. హర. ౭, ఆ. ౭౩.

తోరహత్తించు. వై. స. క్రి. (తోరహత్తు ధా. ప్రే.) పూర్ణముగాఁజేయు, తృప్తిపొందించు. "గీ. పాంచా రంగండు శక్తిఁదల్పదృలీల, కిష్టఫలసిద్ధిఁ దోర హత్తించు నింతి." పాండు. ౨, ఆ. ౨౭.

తోరహత్తు. వై. అ. క్రి. (తోరము+హత్తు.) పూర్ణ మగు, సమృద్ధమగు. (చూ. తోరహత్తించు.) విణ. సమృద్ధము,పూర్ణము. "మ.. ఉచితంబుల్ ద్రవ్యముల్ తోరహత్తులుగాఁ గూర్చి..." రామా. ౩, ఆ. ౧౫. అచ్చ. యు. ౨౩౧

తోలనము. సం. వి. అ. న. 1. పైకెత్తుట; 2. తూఁచుట.

తోలము. సం. వి. అ. పుం. న. 1. తూనిక, 2.తులము.

తోలాడు. దే. స. క్రి. (తోలు+ఆడు. స్వార్థమున.) తఱుము;పాఱద్రోలు. "సీ.. తోలాడెఁ గొన్ని శార్దూలములను." వి. శకుం. ౨, ఆ. ౧౫.

తోలు. దే. స. క్రి. 1. (పశురథాదులను.)నడపించు. "చ...మును దోలె నతండు రథంబు బల్విడిన్." భార. భీష్మ. ౨. ఆ. ౨౫౦. ప్రభా. ౨, ఆ. ౩౧; 2. వెడలఁగొట్టు. "చ...పురంబున నుండఁగనీక తోలి .." విక్ర. ౬, ఆ. ౧౬౬; 3. పాఱఁజేయు. "క...అర్జునుండు ..,గర్జారాద్రముగఁ దోలెఁ గౌరవబలమున్." భార. భీష్మ. ౨, ఆ. ౧౧౫, 5. కొన్నితుమున్నంతముల కనుప్రయుక్తమై ప్రేరణార్థము నిచ్చును. ఉదా:-పోఁదోలు, వెడలఁదోలు,తోలఁగఁదోలు మొ. వి. బో. ఆసా. 1. చర్మము. "క. అవిరళవిషఫణిదంష్ట్రలు,కువచజా వజ్రమయతనువుపయితోలును నో,పవ భేదింపఁగ ..." భార ఆది. ౫, ఆ. ౧౭౬. "మ.... జింకతోలున నాచ్ఛన్నుఁడవై ..." ఆము. ౩, ఆ. ౨౯, 2. పాముకూసము "క. తోలు దిగ విడిచి నాగము,లీలఁ బొలుచుమాడ్కి..." భార. శాం. ౪, ఆ. ౩౬౭; 3. పట్ట,బెరడు. "సీ. తోల్గగ్గి తోలు లేక తోమంగ నను వైనతరుకాష్ఠమున వితథావనంబు." కాశీ. ౫, ఆ. ౨౦౫.

తోలుక. దే. వి. (తోలు+ఉక. స్వార్థమున.) తోలు, బెరడు. ఆం. భా. ద్వి. ౩౭.

తోలుదాలుపు. దే. వి. (తోలు+తాలుపు.) కృత్తివాసుఁడు శివుఁడు. ఆం. సం. దేవ. ౬.

తోలుపు. దే. వి. (తోలు ధా.) తోలఁబడుట."ఉ... పాకశాసనుం,డాలమునోటమిం గదిసి యంతకపాళికు చేరయూక్తుఁడై,తోలుపులం బడెన్..." ఉ. హరి. ౧, ఆ. ౭౧.

తోలువాయిదము. ద్వ. వి. (తోలు+వాయిదము.) చర్మవాద్యము,ఆనద్ధము. (శ. ర.)

తోవ. దే. వి. 1. కలువ. "చ.. చెంగలువలఁ దోవ కాములును..." కుం. సం. ౫, ఆ. ౧౩౭; 2. త్రోవ,దారి. (వా.)

తోషకుఁడు, సం. విణ. (అ. శిశా. అ.) 1. సంతోషపడువాఁడు; 2. సంతోషపెట్టువాఁడు; 3. తృప్తిపడువాఁడు; 4. తృప్తికలుగుచువాఁడు.

తోషణము. సం. వి. అ. న. 1. సంతోషము; 2. తృప్తి. విణ. 1. (అ. ఈ. అ.) సంతోషసాధనమైనది; 2. (అ.ఆ.అ.) సంతోషము కలిగించునది.

తోషము. సం. వి. అ. పుం. 1. సంతోషము; 2. తృప్తి.

తోషించు. సం. అ. క్రి. సంతోషించు. "సీ. పరమ పావని యందు బంధువుల్ తోషింప నిత్యవ్రతా చారనియతిఁ బూని." కృ. శ. కుం. టీకి. ౧౫౧.

తోషితుఁడు. సం. విశే. (అ. అ. అ.) 1. సంతోష పఱుపఁబడినవాఁడు; 2. తృప్తిపఱుపఁబడినవాఁడు.

తోష్ట. సం. విశే. (ఋ. త్రే. ఋ.) 1. సంతోషించు వాఁడు; 2. తృప్తినందువాఁడు.

తోసిరాజను. మి. స. క్రి. (తోసి+రాజు+అను.) చదరంగమున గుఱ్ఱము మొదలగువానిని వేసి కాక బంటును తోసి రాజు తప్పుకోవలయు నను; బంటు చేత రాజును వెనుకకుఁ ద్రోసివేయు; నిరసించు; ఓడించు. "చ. కలికిముఖారవింద మలకల్వల రాయనిఁ దోసిరాజనున్." విజ. ౧, ఆ. ౩౭.

తోస్తానము. దే. వి. తోలుసంచి. "వ. చంకల త్రేలెడుతోస్తానంపుఁదిత్తులు..." ప్రబంధ. ౬౦౧.

తౌ

తౌ = తవు. (భ. ర.)

తౌటిపాము = తవుటిపాము. (శ. ర.)

తౌర్యత్రికము. సం. వి. అ. న. నృత్తగీతవాద్యము.

తౌలము. సం. వి. అ. పుం. తులారాశి. న. త్రాసు.

తౌలు = తవులు. (తగులు, అనుసరించు.) "చ...సు, స్థిరు నిను మావిభుం డను మతిన్ వెను దౌలెద మాదటంబునన్." రాఘవ. 3, ఆ. ౪౧.

తౌలువడు = తవులువడు. (శ. ర.)

తౌల్యము. సం. వి. అ. న. సామ్యము. (శ. ర)

త్య

త్యక్త. సం. విశే (ఋ. క్రీ. ఋ) త్యజించువాఁడు.

త్యక్తము. సం. విశే (అ. ఆ. అ.) విడువఁబడినది.

త్యక్తవ్యము. సం. విశే. (అ. ఆ. అ) విడువఁదగినది.

త్యజనము. సం. వి. అ. న. 1. విడుచుట; 2. ఇచ్చుట.

త్యజించు. సం. స క్రి. 1. విడుచు. "క...మిన్నె నను ద్యజింతు నన్‌గా, జానకి నెడఁబాయు టెంత..." ఉ. రా. ౬, ఆ. ౨౧౯; 2 ఇచ్చు. "చ. అసురగురుండు గైకొనియె నంబుజలోచనుఁ దారఁ దారకా,రమణిముఖుం ద్యజించె నుడురాజును భామిని కట్టఁగేలకున్." కాశీ ౪, ఆ. ౨౨౪.

త్యజితము. సం. విశే (అ. ఆ. అ.) త్యాజితము,విడి పింపఁబడినది. "మ. విస్ఫూర్జద్భుజశక్తిభుజత్యాజితాశేషనరేంద్రవర్గ మతిమత్సంభావ్యసర్గా..." హరి. ఉ. ౫, ఆ. ౨౪౧.

త్యజియించు. సం. = త్యజించు. (విడుచు.) ఉ. రా. ౧, ఆ. ౨౨౦.

త్యా

త్యాగము. సం. వి. అ. పుం. = త్యజనము.

త్యాగి. సం. విశే. (న్. నీ. న్.) 1. విడుచువాఁడు; 2. ఇచ్చువాఁడు; 3. శూరుఁడు.

త్యాజకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) త్యక్త.

త్యాజ్యము. సం. విశే. (అ. ఆ. అ.) వర్జ్యము,విడు వఁదగినది.

త్ర

త్రంపి. దే. వి. దాలి,తంపి. "క. అనలత్రంపి పెట్టి వ్రాదయం బటుగాఁగున యోగవాసనా,భ్యాసపు నీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి .." ఉ. హరి. ౪, ఆ. ౧౭. స్వా. ౪, ఆ. ౬౦.

త్రచ్చన. దే. వి. (త్రచ్చు. ధా.) 1. చిలుకుట. (శ. ర.); 2. తఱిమెనఁబట్టుట. (శ. ర.)

త్రచ్చు. దే. స. క్రి. 1. తరుచు,మథించు. "శా .. గీర్వాణులుం బూర్వగీ,ర్వాణవ్రాతము నబ్ధిఁ ద్రచ్చునెడ .." భార. ఆది. ౨, ఆ. ౧౨; ౧౩; 2. తఱిమెనఁబట్టు. "సీ. నఱుము నిస్సందేహ తయు నొక్క మురువుగ ద్రచ్చివేసినయట్లు తనరుటయుఁను." పాండు. ౧, ఆ. ౭౧. హరి. పూ. ౧ ఆ. ౧౫౫; 3. ఒరపెట్టు. "వ .. కల్లి కొయ్యలు త్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చు పెరుఁగుచిచ్చులు .." స్వా. ౪, ఆ. ౬౦; 4. మేయు. "చ...... తమతమయిచ్చఁ బచ్చికలు ద్రచ్చి వెసం జనుహోమధేనుసం,ఘములకు గోప బాలకులకై పడి..." వాల్మీ. ౧, ఆ. ౩౪; 5. నఱుకు. "చ. అనలము దోఁచునే తరువునందు... తగఁ ద్రచ్చినఁ గాక..." భార. శాం. ౪, ఆ ౧౭౯. [కులము; 4. కీర్తి.

త్రప సం. వి. అ. స్త్రీ. 1. సిగ్గు; 2. కులటు; 3.

త్రపిత. సం. విశే.(ఋ. త్రీ. ఋ.) సిగ్గుపడువాఁడు.

త్రపితము. సం. విశే. (అ. ఆ. అ.) సిగ్గు గలది.

త్రప్షుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి తృప్తి కలవాఁడు.

త్రపుటి. సం. వి. ఈ. స్త్రీ. చిట్టేలకి చె.

త్రపులము. సం. వి. అ. న. తగరము.

త్రపువు. సం. వి. ఉ. న. 1. తగరము;2.సీసము

త్రపుసము. సం. = త్రపులము.

త్రస్త. సం. విణ. (బు. స్త్రీ. బు.) 1. తర్పిత; 2. త్రసిత.

త్రస్న. సం. వి. ఆ. స్త్రీ. బ్రహ్మబిందువు, కల్ల.

త్రమ్ము. దే. స. క్రి. దుమ్ముచేయు. (శ. ర. బ్రా.) వి. దుమ్ము. (శ. ర. బ్రా.) విణ. వ్యర్థము. "సీ. పిత రుణంబుణము దీర్పకున్నను జెందని దౌర్భాగ్య శీలుండో త్రమ్ము త్రమ్ము." రాఘవ. ౧, ఆ. ౪౭.

త్రయము. సం. వి. అ. న. మూఁడింటిసమూహము

త్రయి. సం. వి. ఈ. స్త్రీ. 1. మూఁడు వేదములు; 2. త్రయము. భార. ద్రో. ౨, ఆ. ౩౨౫; 3. కుటుంబము గలయాఁడుది, (పురంధ్రి); 4. మంచిమనస్సు గలస్త్రీ; 5. ఏఁడుగుకాలిదంకెల. [త్రయీతనువు.

త్రయీతనుఁడు. సం. వి. ఉ. పుం. సూర్యుఁడు. ఇట్టే.

త్రయీమయుండు. సం. వి. అ. పుం = త్రయీతనుడు.

త్రయోదశము. సం. విణ. (అ. ఈ. అ.) 1. పదుమూఁడవది; 2. పదుమూఁడు ఎక్కువగాఁ గలది. (ఇది తెనుఁగున సమాసపూర్వపదముగానే యుండును. ఉదా:- త్రయోదశశతము మొ.)

త్రయోదశి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు పదుమూఁడవతిథి.

త్రవు = త్రవ్వు. (మా. త్రవుకోల.)

త్రవుకోల = త్రవ్వుకోల. (శ. ర.)

త్రవ్వటము. దే. వి. (త్రవ్వు. ధా.) త్రవ్వుట. "సీ. త్రవ్వటంబులకటెః ద్రవ్వటంబులు వెట్టఁ దగినట్టి కట్టుగుద్దలి గడించి." కళా. ౪, ఆ. ౭౮.

త్రవ్వటించు. దే. స. క్రి. త్రవ్వు. (శ. ర. బ్రా.)

త్రవ్వించు. దే. స. క్రి. (త్రవ్వు. ధా. ప్రే.) 1. త్రవ్వఁజేయు. "సీ. అగడితలీఁతనీ రలవడఁ ద్రవ్వించి......" ఉ. హరి. ౨, ఆ. ౯౭; 2. పలికించు. "సీ. ఎవ్వరి నేసుద్ది త్రవ్వించి యిచ్చుట నేశాస్త్రముకల్మి యొటిఁగికొనెనొ." కళా. ౬, ఆ. ౧౫౬.

త్రవ్వితండము. దే. విణ (త్రవ్వి+తండము.) చేతులతో లెక్కించి యిచ్చుటకాక రాశిగా నున్న సువర్ణాదికము సాధనాంతరములతోఁ ద్రవ్వి రాసులుగా నిచ్చినది, అసంఖ్యాకము, లెక్కలేనిది. "చ. కొడుకులు కూఁతులుం గలిగి సుఖము లేనికవిందుఁ బల్లకీల్గాడుగులుఁ ద్రవ్వితండముగఁ గూరిమితో మనుఁ జెక్కులేం డ్లొగిన్." య. ౪, ఆ. ౧౫౦. (శ. ర. పా.)

త్రవ్వితండములు = త్రవ్వితండము. 1. (అసంఖ్యాకము.) "సీ. మోహసంపదలు గాశిత్రమున యందుఁ ద్రవ్వితండంబులై నివ్వటిల్లు." కాశీ. ౨, ఆ. ౫౦. ('త్రవ్వితండంబులై' అనుముద్రి. భార. అశ్వ. ౧, ఆ. ౬౨; 2. (అతిసమృద్ధము; మిక్కిలి తృప్తి నిచ్చునది.) "సీ. అనఘ మరుత్తుండు యజ్ఞంబు సేసి మహాధనరాసుల నవనిసురుల కిచ్చి వారలు గడు నెక్కుడై యుండుటఁ ద్రవ్వితండంబులు దమగృహముల, నిడికొని వెలిఘన మొల్లను విధియఁగా నిమ్మైన నెలవున నిడుదు నుండి .." భార. అశ్వ. ౧, ఆ. ౧౫.

త్రవ్వు. దే. స. క్రి. 1. ఖననము చేయు, గ్రుచ్చు. "సీ .....చక్కఁ బ్రాఁక, రానిలిప్పలు చారఁ ద్రవ్వుచు..." హరి. ఉ. ౧, ఆ. ౯౩. "శా. కొండల్ త్రవ్వినమచ్చు కత్తులగలిగ్ గొమ్ముంగొనల్ మూంప .." ఆము. ౪, ఆ. ౧౫౫; 2. పెల్లగించు; నశింపఁజేయు. "సీ ..నగరంబు గంగలోనఁ, ద్రవ్వి వైచెద నని .." ఉ. హరి. ౧, ఆ. ౯. "ఉ. అవ్వసు ధేశ్వరుం డతివహస్తము పట్టినఁ బట్టి ధైర్యముం, ద్రవ్వెదు కన్నులం గొని యదల్పి వదల్పఁ గరంబు చయ్యనన్." కేయూర. ౪, ఆ. ౨౧, 3. పూర్వోత్తరము లెత్తిచెప్పు. గొప్పలుచెప్పు. "ఉ. గాసటవీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువారికిన్." నృసిం. పీఠి. ౯, 4. పలుకు. "ఉ... ముచ్చటల్, త్రవ్వుచు నొక్కకోమలి పరాకున నుండఁగ .." వైష. ౬, ఆ. ౧౧౩; 5. పొందు, సంపాదించు. "గీ. ఏల పర్వతపర్వణ మిట్లు సేయు, దీన నీ వేమి త్రవ్వితి దానిఁ జెపుము." భార. స్త్రీ. ౨, ఆ. ౧౬౨.

త్రవ్వుకోల. దే. వి. (త్రవ్వు+కోల.) గుద్దలి. (శ.ర.)

త్రసత్. సం. శత్ర. భయపడుచున్న. "ఉ...... దానవుం డత్రసదంతరంగుఁ డయి..." హరి. ఉ. ౪, ఆ. ౧౫౬.

త్రసనము. సం. వి. అ. న. 1. భయము; 2. ఉద్వేగము. విణ. (అ. ఆ. అ) భయపడినది.

త్రసము. సం. వి. అ. న. 1. అడవి; 2 జంగమప్రాణిసమూహము విణ. (అ. ఆ. అ.) జంగమము, తిరుగునది.

త్రసరేణువు. సం. వి. ఉ. స్త్రీ. సంజ్ఞాదేవి, సూర్యపత్ని. పుం. ముప్పదిపరమాణువులకొలది.

త్రస్తము. సం. విణ. (అ. ఆ. అ.) భయపడినది.

త్రస్తరి. దే. వి. 1. పరిహాసము. ఆం. భా. ప్ర. ౧౩౯. విజ. 3, ఆ. ౨౭; 2. క్రిందు. "సీ. కర్ణజోలా మూర్తికచ్ఛాయ లేఁగ్రాఁచుసురువారరుచులఁ ద్రస్తరికిఁ దన్న." ఆము. ౨, ఆ. ౩౫; 3. వెకస. "ఉ. తూఁగొని ముందటం దటుమఁదుస్పహరాగ భరంబుదంబునన్, జేకొని త్రస్తరిం దిగుచుసిగ్గున ముంగలికిం బిఱిందికిం, బోకడ రాకడల్ వశము పోవక మన్మథుఁ డానవెట్టిన,ట్లాకలకంఠి నిల్చె నచలాకృతిఁ జిత్తరుబొమ్మకై వడిన్." కృ శకుం ౨, ఆ. ౫౭

త్రస్తరించు. దే. అ. క్రి. 1 పరిహాసమాడు. "సీ తావిఁ భరుచిలోఁడఁ ద్రస్తరించెడుమేనుఁ బసిఁడి ముంజియుఁ దగుపట్టుగోడుగు." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౨౫3; 2. అతిశయించు "చ. కొప్పువెం, గలువలవల్పుఁ జన్నుఁగవకస్తురితావియుఁ ద్రస్త రింప నం,దలరొద మీఱ .." స్వా. ౩, ఆ. 3౧
స. క్రి. 1. క్రిందుచేయు,నిరసించు "సీ. గిరిగరుత్తండన క్రీడాసమారంభదంభోళిరుచిఁ తమఁ ద్రస్తరించి." పి. శకుం. 3, ఆ. ౯3; 2. అభిఘారము చేయు. "మ .. పాత్రంబులన్,సురధేన్వాజ్యముఁ ద్రస్తరింపఁ దొడఁగెన్ దూర్వాంకురాగ్రంబులన్." వార. ౬, ఆ ౧౧౩.

త్రస్నువు. సం విణ. (త్రి.) భయశీలుఁడు.

త్రస్యత్. సం. = త్రసత్.

త్రస్స. వై. వి. సం. త్రప్సా.) బ్రహ్మబిందువు,వేద శాస్త్రాదు లభ్యసించునపుడు నోటినుండి రాలు తుంపర. "సీ. బ్రహ్మబిందువు మీఁదఁ ద్రస్స యనంగను..." ఆం. భా. ద్వి ౧౩౫ శ్రీరం. మా. ౬, ఆ. ౨౪.

## త్రా

త్రాఁచు. దే. వి. నాగుఁబాము,ఫణి. "సీ. స్ఫటల మీఱ వాంతమై శ్వేతమై నట్టిత్రాఁ చొక్కటి చుట్టియుండు" ఆము. ౪, ఆ. ౧౯౯ ఆం భా ప్ర. ౧౭౩.

త్రాఁచుపాము = త్రాఁచు 'గీ.. నొప్పింపఁ బడిన త్రాఁచు,పాము పగ సాటి తెగటార్చు భంగి....' భార. స్త్రీ. ౨, ఆ, ౬౧.

త్రాగించు = త్రావించు. (చూ. త్రావించు.)

త్రాగు. దే. స. క్రి. 1. పానముచేయు. "ఉ...నలిలంబు దప్పివోఁ,ద్రాగినవారికి..." హైమ. ౨, ఆ. ౭౧; 2. మ్రింగు. "గీ ..ఎంతమీఁ దెంతమీఁదఁ ద్రాగు." కు. సం. ౪, ఆ. ౬౬; 3. పీల్చు. (ఉదా:-పొగ త్రాగు ను.)

త్రాగుడు. దే. వి (త్రాగు. ధా.) పానము. "చ... చిట్టకంపుఁద్రాగుడుఁ గని యున్నలన్ నగరి కొందఱు పాంథుఁ బ్రపాప్రపాలికల్." ఆము ౨, ఆ. ౫౯.

త్రాడు దే. వి. టా. 1. రజ్జువు. "ద్వి. త్రాడును బామును రజతంబు శుక్తి,చూడికిఁ గొరడును జోడుండు దలియ కున్న..." పండితా. దీక్షా. ౫౨, పు; 2. దారము. "ఉ. మూడిపిటిందిత్రాటి క్రియ .." విక్ర. ౨, ఆ. ౩౨; 3. జంద్యము. "ద్వి. పురహరార్చకులకు ముక్కుత్తుకేలుఁ,భర కత్తుఁ గూడుకే త్రాటిమాలలకు." బస. ౩, ఆ. ౩౩౭కుం; 4. మంగళసూత్రము. "గీ పంచవదనుని కను శేవురించెనేని, తత్క్షణమునంద తమయాంత్ర త్రాణ తెగవె." కాశీ. ౩, ఆ. ౬౦; 5. కిరణము. "గీ. నిడుపుఁద్రాణ్లాని బయల కొవ్వెడు దిరుగు చుఁ,బొసఁగ మబ్బ్వెద్దు మున్వ్యసములఁ జెలఁగుచు,వెలుఁగు లెల్లెడఁ గాంచుచు నలసునిర్ణ,యేట కాఁ దప్పు డెంతయుఁ దేటమీఱె." అచ్చ. అయో. ౪౨.

త్రాడుదాలుపు. దే. వి. (త్రాడు+తాలుపు.) పాశి, వరుణుఁడు. "సీ. త్రాడుదాలుపు మేలిరతనముల్ గొని తెచ్చు .." అచ్చ. సు. ౪౧.

త్రాడువడు. ద్వ్య. అ. క్రి. (త్రాడు+పడు.) 1. త్రాడగు; 2. బలహీనమగు. "సీ. పాథోధివల్లభు పాశ వల్లిక తల్లి దర్పంబుఁ దిగఁద్రావి త్రాడువడియె." భీమ. ౪, ఆ. ౧౦౩. (రెండర్థములకు నుదాహరణము)

త్రాడువాఱు. దే. అ. క్రి. (త్రాడు+పాఱు.) 1. పురికొను; 2. ధైర్యమొందు. (వా.)

త్రాణ. వై. వి. (సం. ద్రవిణమ్.) 1. బలము,శక్తి. "శా. త్రాణల్ తప్పి త్వగస్థిమాత్రులగుచున్ దైన్యంబు నొందన్..." వి. పు. ౨, ఆ. ౧౫౬; 2. జాగ్రత్త,మెలఁకువ. "గీ. భువనసమ్మోహనాకాంక్షఁ బువ్వుఁదవిల్తు, పొన్నుమెట్టియ నెత్తమ్మి పూవు నడుమఁ,త్రాణమై డాఁచినఁగఁగట్టాడిము

త్రి, శంఖముంగర విలసిల్లె సజ్జముఖి." సుద. ౫, ఆ. ౧౪౪; 3. గౌరవము, మర్యాద. "వ...పురాణంబులఁ ద్రాణలు సెఱచియుం .." నైష. ౬, ఆ. ౮౮.

త్రాణము. సం. వి. అ. న. 1. రక్షణము; 2. కలుఁగానుగు చె. విణ. (అ. ఈ. అ.) 1. రక్షణసాధనమైనది. (ఉదా:- తనుత్రాణము, శిరస్త్రాణము మొ. ; 2. (అ. ఆ. అ.) రక్షింపఁబడినది; 3. రక్షించునది.

త్రాత. సం. వి. ఋ. (ఋ. త్రీ. ఋ.) రక్షకుఁడు.

త్రాతము. సం. వి. అ. న. రక్షణము. విణ. (అ.ఆ.అ.) రక్షింపఁబడినది.

త్రాపుషము. సం. విణ. (అ. ఈ. అ.) త్రపువుచేఁ జేయఁబడినది.

త్రాయంతి. సం. వి. ఈ. స్త్రీ. కలుఁగానుగు చె.

త్రాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ) రక్షకుఁడు.

త్రాయమాణ. సం. వి. ఆ. స్త్రీ. కలుఁగానుగు చె.

త్రావించే. దే. స. క్రి. (త్రావు. ధా. ప్రే.) త్రాఁగఁజేయు. "క. కడయుక యబ్బ్బాది కుత్తు ద్రావించి రొగిన్." భార. ఆది. 3, ఆ. ౧౧౪.

త్రావికొను. దే. స, క్రి. (త్రావు+కొను స్వార్థమునం.) త్రావు. దశ. ౪, ఆ. ౬౪.

త్రావు = త్రాగు. 1. (పానముచేయు.) "క. ఈ వాయుపుత్త్రుఁ డాజిన్ ద్రావుదునే దుస్ససేనురక్తం బనియెన్." భార. ఉద్యో. ౪, ఆ. ౯౫; 2. (పీల్చు; మ్రింగు.) "సీ. గళిమ్రుచ్చిలఁగ వేచుగాలిఁ ద్రావఁగఁ బాముఁ నిడినకై వడిఁ గాలికదియుమమర." పారి. ౫ ఆ. ౭౬.

త్రావుడు = త్రాగుడు. "చ. తనచెలులిండ్లయం దపప త్రావుడు త్రావుచు..." పాండు. 3, ఆ. ౧౯.

త్రాసకుఁడు. సం. విణ. (అ. సికా. అ.) 1. భయ పెట్టువాఁడు, 2. భయపడువాఁడు.

త్రాసనము. సం. వి. అ. న భయపెట్టుట. విణ. (అ ఆ. అ.) భయపెట్టునది.

త్రాసము. సం. వి. అ. న. 1. భయము; 2. భయపెట్టుట; 3. ఒకానొకమణిదోషము. రత్న. ౧౪.

త్రాసితము. సం. విణ. (అ. ఆ. అ.) భయపెట్టఁబడినది. భార. విరా. ౫, ఆ ౬.

త్రాసు. దే. వి. తుల, తూఁచుసాధనము. "సీ. త్రాసులుం బోనిచిత్తంబులతోడుకు బ్రతివాదములేఁ బక్ష ముడిగి." భార. శాం. ౨, ఆ. ౩౭౫. ఆం. భా. ద్వి. ౩౦౦.

త్రాస్యమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భయ పెట్టఁబడుచున్నవాఁడు.

## త్రి

త్రి. సం. విణ. (ఇ.) మూఁడు. (ఇది తెలుఁగున సమాసపూర్వపదముగానే యుండును. ఉదా:- త్రిజగము, త్రివిక్రముఁడు మొ)

త్రింశత్తమము. సం = త్రింశము.

త్రింశత్తు. సం. వి. త్. స్త్రీ. ముప్పది యనుసంఖ్య. విణ (త్.) ముప్పది.

త్రింశము. సం. విణ. (అ ఈ. అ.) ముప్పదవది.

త్రిక. సం. వి. ఆ. స్త్రీ. నూతిగిరక.

త్రికంటకము. సం. వి. అ. పుం. 1. ములువెముదుచె; 2. పెద్దపల్లేరు చె; 3. మత్స్యవిశేషము. విణ. (అ. ఆ. అ.) మూఁడుముండ్లు గలది.

త్రికకుత్తు. సం. వి. ద్. పు త్రికూటపర్వతము.

త్రికటుకము. సం. వి అ. న.-మూఁడుకారపువస్తువులు-సొంటి, పిప్పలి, మిరియాలు.

త్రికటువు. సం వి. ఉ. న. త్రికటుకము.

త్రికము సం. వి అ. న 1. మూఁడింటిసమూహము; 2. మూఁడుదారులు కలియుచోటు; 3. ముడ్డిపూస; 4. సొంటి-పిప్పలి-మిరియాలు; 5. కరక తాడికాయుసిరికలు. పుం పెద్దపల్లేరు చె.

త్రికరణములు. సం. వి. అ. న. బ. మనోవాక్కాయములు.

త్రికాష్ఠి. సం వి. ఇ న. త్రిక్కటి.

త్రికూటము. సం. వి అ. పుం. ఒకానొకపర్వతము.

త్రికేతువు. సం వి. ఉ. పుం, చిలుక (శే. ని.)

త్రికోణము. సం. వి. అ న. 1. త్రిభుజక్షేత్రము; 2. లగ్నమునకు పంచమనవమస్థానములు; 3 మోక్షము; 4 యంత్రవిశేషము; 5. భగము, అఁడు గుఱి, (ఈయర్థము తెలుఁగునను కలదు చూ. చంద్ర. వి. ౨, ఆ. ౫౩; ౫౪.) విణ. (అ.ఆ.అ.) మూఁడుకోణములు గలది. ఉదా:- త్రికోణమండపము.

త్రిక్క = తిక్క. (పిచ్చి.) ఆం. భా. ప్ర. ౧౩౬. అవ్య. = తక్క. (వినార్థకము.) ఆం. భా. కృ. ౬౯.

త్రిక్కటి. వై. వి. (సం. త్రికాక్షి.) 1. ఆయుధవిశేషము. (శ. ర.); 2. మూఁడుకఱ్ఱలతోఁ జేసిన చట్రము. "గీ. కోలదాపునఁ ద్రిక్కటిఁ గూడియున్న,గచ్చుచేసి చిత్రంపుగద్దెపలక." క్రీడా ౧.౨౫.

త్రిక్కు. దే. అ. క్రి. తక్కు,మిగులు "క. నీవింతయలంగ కేటికి,నావంతయుఁ జేరఁజన మనఃఖేదము నొ,కావంత ద్రిక్కకుండఁగ,లావంతులు మత్పుతులు గలరు పగదీర్పన్." భార విరా ౨, ఆ. ౧౬౧. భార. సౌ. ౧, ఆ. ౭౦౫ వి. త్రిప్పు, బాధ. "ఉ. క్రంగునం,ద్రిక్కులు పెట్ట నొల్లఁ జనకే యన..." భా. రా. యు. ౭౬౬. భాగ. ౬, స్కం. ౧౩౭.

త్రిగర్త సం వి. అ. స్త్రీ. కాముకి.

త్రిగర్తము. సం వి. అ. పుం. జాలంధరదేశము.

త్రిగుణ. సం. వి. ఆ. స్త్రీ. మాయ.

త్రిగుణము. సం. వి. అ. న. ప్రధానము. విణ. (అ. ఆ. అ.) 1. మూఁడుగుణములు కలది; 2. మూఁడురెట్లు కలది.

త్రిగుణాకృతము. సం. విణ. (అ. ఆ అ.) మూఁడుచాళ్లు దున్నినది. (పొలము.)

త్రిగుణి. సం. వి. ఈ. స్త్రీ. మారేడు చె.

త్రిజగత్తు. సం. వి. త్. న. స్వర్గమర్త్యపాతాళములు.

త్రిజగము. సం = త్రిజగత్తు. (సమాహారార్థవివక్షలేనపుడు కర్మధారయము. ఉదా.-త్రిజగములు.)

త్రిణయనుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి,శివుఁడు. కాశీ. ౨, ఆ. ౧౫౦; ౫, ఆ. ౨౩.

త్రిణేత్రుఁడు. సం = త్రినేత్రుఁడు. (వాచ)

త్రితయము. సం. వి. అ. న. మూఁడింటిసమూహము.

త్రితయి. సం. వి. ఈ స్త్రీ. త్రితయము.

త్రిధా. సం. అవ్య. (త్రేధా అనియుండ నగు.) మూఁడువిధములుగా. (తెలుఁగున సమాసపూర్వపదముగనే యుండును.) "శా. ప్రఖ్యాతం బనమిశ్రబంధమున సుకావ్యద్యం బనంగాఁ ద్రిధా, వ్యాఖ్యాతం బగువస్తువందు మఱి యథ్యాహార ము జేయఁగాఁ,బ్రఖ్యాతం బితివృత్తమైనకృతి చెప్పన్ వక్తకున్ శ్రోతకున్,విఖ్యాతిం గలిగించు..." పి. శకుం. ౧, ఆ. ౨౪.

త్రిదండము. సం. వి. అ. న. 1. మూఁడుదండములు. 2. మనోదండవాగ్దండకర్మదండము లనుమూఁడుదండములు; పుం. మనోదండాది యగుసన్న్యాససాశ్రమము.

త్రిదండి. సం. వి. న్. పుం. 1. మూఁడుదండములు ధరించుసన్న్యాసి; 2. మనోదండాదిగలసన్న్యాసి.

త్రిదశాలయము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. మేరువు.

త్రిదశుఁడు సం. వి. అ. పుం.-త్రిదశపరిమాణవయస్కుఁడు—జన్మసత్తావినాశములను మూఁడవస్థలే కలవాఁడు - వేల్పు.

త్రిదళము. సం. వి. అ. పుం. మారేడు చె. విణ. (అ. ఆ. అ.) మూఁడుదళములు గలది.

త్రిదివ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకనది; 2. ఏలకి చె.

త్రిదివము సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. ఆకాశము. న. సుఖము.

త్రిదివేశుఁడు. సం. వి. అ. పుం. త్రిదశుఁడు,వేల్పు.

త్రిదివౌకసుఁడు. సం. వి. స్. పుం. త్రిదశుఁడు వేల్పు.

త్రిదోషము. సం. వి. అ. న. వాతపిత్తశ్లేష్మములవలనఁ గలుగుదోషములు.

త్రిధాముఁడు. సం. వి. న్. పుం. 1. అగ్ని; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. వ్యాసుఁడు; 5. యముఁడు.

త్రిధార. సం. వి. ఆ. స్త్రీ. గంగ.

త్రినయనుఁడు. సం. = త్రిణయనుఁడు.

త్రినేత్రుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి,శివుఁడు. ఇట్లే- త్రిలోచనుఁడు మొ.

త్రిపతాకము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. న. మూఁడురేఖలు గలనొసలు.

త్రిపథగ. సం. వి. ఆ స్త్రీ. గంగానది.

త్రిపద. సం. వి. ఆ. స్త్రీ. మూఁడుపాదములు గలది.

త్రిపది. సం వి. ఈ. స్త్రీ. 1. = త్రిపద; 2. ఏనుఁగుకాలికిఁ గట్టుత్రాడు.

త్రిపాఠి. సం వి. న్. పుం. వేదమున పదక్రమసంహితలను జదువువాఁడు.

త్రిపాత్తు. సం. వి. ద్. పుం. 1. పరమేశ్వరుఁడు; 2. విష్ణువు. విణ. (అ. ఆ. అ.) మూఁడుకాళ్లు గలది.

త్రిపుండ్రము. సం. వి. అ న. నొసట పెట్టుకొను విభూతి మున్నగువానిమూఁడురేఖలు.

త్రిపుట. సం. వి. ఆ. స్త్రీ. 1. తెగడ చె; 2. సన్నఏలకి చె; 3. మల్లె చె.

త్రిపుటము. సం. వి. అ. పుం. 1. బాణము; 2. సెనగలలో నొకరకము; 3. ఏడక్షరముల కాలము గల యొక తాళము; 4. తీరము; 5. పల్లేరు శ.

త్రిపురము. సం. వి. అ. న. మయనిర్మితము లగు మూఁడుపురములు.

త్రిపురాంతకుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు ఇట్లే; త్రిపురదహనుఁడు మొ.

త్రిప్పట. దే. వి. (త్రిప్పు ధా.) 1. తిరుగుడు,భ్రమణము. "గీ. పాంచతరిత్రాటఁ ద్రచ్చునిర్బంధమునకు,నోర్చి త్రిప్పట నొందినయుత్తముండు." రాజ. చ. ౨, ఆ. ౪౭; 2. త్రిమ్మట,పర్యటనము. "క. ఇటువలె వెదకితియుం దమ త్రిప్పట గురువిరహితులమంత్రపఠనం బెటు లట్టిటువటమై పోఁ జొచ్చినఁ,గటకటపడి..." రామా. ౬, ఆ. ౫౪. ఆం. భా. ద్వి. ౧౭౪.

త్రిప్పటము దే. వి. (త్రిప్పు ధా.) తిరుగుడు. "వ .. వినోదంబునకు బేతాళబాలికలు త్రిప్పు త్రిప్పటంపుఁబల్లలచందంబున .." వరాహ. ౫, అ. ౩౮.

త్రిప్పరి. దే. విశే. (త్రిప్పు+అరి.) త్రిమ్మరి. (శ.ర.)

త్రిప్పికొను. దే. అ. క్రి. (త్రిప్పు+కొనుస్వార్థమున.) కలఁగు,క్షోభపడు. "ఆ. అలరుమొగములోన నభిమన్యుఁ డేలొకో,యెదురు రాఁడు నాకు నెట్టి వార్త, చెవులు పోఁడునొక్క చేవెట్టి కలఁచిన,భంగిఁ ద్రిప్పుకొనఁ దొడంగె మనము." భార. ద్రో. ౨, ఆ. ౨౩౦.

త్రిప్పియాడు. దే. స. క్రి. (త్రిప్పి+ఆడు. స్వార్థమున.) త్రిప్పు,తిరుగఁజేయు. "ఆ. ఎత్తి త్రిప్పియాడి యిలతోడ వ్రేసి పాదములఁ జదువఁజాడి దారుణాస్త్రతతులు నిగుడఁ బవనతనయ శిఖండిసాత్యకులు సొలయ్యఁ దాఁకి రతిరయమున." భార. శల్య. ౧, ఆ. ౩౧౭.

త్రిప్పు. దే. స. క్రి. (తిరుగు. ధా. ప్రే.) 1. మరలుచు,మగుడఁజేయు. "చ. అపుడు సుబుద్ధిసైన్యముల నన్నియు నొక్కమొగంబుగా నమర్చి పురికిఁ గానికల్ మగుడఁ ద్రిప్పి..." జై. ౫, ఆ, ౧౬౩; 2. సంచరింపఁజేయు. "ఉ. పిఁడికెన్ని దేశములఁ బెండెఁ ద్రిప్పునొ..." శుక. ౩, ఆ. ౫౭౭; 3. విసరు. "త్రిప్పె లతాంగి యోర్తు లాంచిత తాలవృంతము..." వైజ. ౨, ఆ ౧౪౦; 4. గిరగిరఁ దిరుగఁజేయు. "మ...త్రిప్పు శాట్నంపుగుంద్రలు నా..." ఆము. ౪, ఆ. ౧౫౨; 5. సాచీకరించు. "సీ ..మెడఁ ద్రిప్పి..". స్వా. ౪, ఆ. ౪౨; 6. కలఁచు. "చ...మదిఁ ద్రిప్పుచున్నయది..." ప్ర.భా. ౩, ఆ. ౪. అ. క్రి. 1. వికారముకలుగు. వా:-కడుపులోఁ ద్రిప్పుచున్నది; 2. ఇటునటు కదలు. వా:-ఆమె త్రిప్పుకొనుచు వచ్చుచున్నది. వి. 1. తిరుగుట,సంచరించుట. "ద్వి ..అమ్మాయమృగము,త్రిప్పుల నడపులఁ ద్రిమ్మరి యలసి" ద్వి. హరిశ్చ. పూ. ౭౨౦, పం; 2. అనుభవము,కడుపు. "క...ప్రజ్ఞానరహితుండు గామాంధీనతమెయిఁ గర్మనమిలి త్రిప్పునఁ జిక్కున్." భార. శాం. ౫, ఆ. ౩౨౬; 3. చేష్ట, నియోగము. "చ. మును విదురుండు చెప్ప నతి మూర్ఖమనోగతి రైయనయానుయో,ధనుచరితంబు గీ దశలధా త్రిజనంబులకుం బొనర్చు నా,శన పునిదానిఁ గొంద అవిచారులు పాటిగఁ బట్టరైరి నా,కుచు మదిబారి కెట్టటుల కుత్సితమయ్యె విధాత త్రిప్పునన్." భార. శల్య. ౧, ఆ. ౩౬; 4. కష్టము, శ్రమ. "గీ ..ఈ త్రిప్పు లేటికిఁ గమలవదన." భార. విరా. ౨, ఆ. ౫౭; 5. సాచీకరణము. "ఉ. పాటలు మోము త్రిప్పులును..." హంస. ౩, ఆ. ౭౬.

త్రిప్పుకొను. దే. అ. క్రి. (త్రిప్పు+కొను.) చిక్కువడు,బాధలందు. "గీ. ఊర్ధ్వలోకనివాసులయుల్లములును,నధికభయమోహవివరంబు లయ్యె ననిన, నల్పధారుణీనాథసైన్యములు కలఁగి,త్రిప్పుకొని కల్లడిల్లుట చెప్ప నేల." హరి. ఉ. ౨, ఆ. ౨౪: (రూపాం. త్రిప్పికొను.)

త్రిప్పుకొలుపు. దే. స. క్రి. (త్రిప్పుకొను. ధా. ప్రే.) 1. కలఁచు,క్షోభింపఁజేయు. (చూ. త్రిప్పుకొల్పు), 2. మరలించు, పోఁజేయు. "సీ. అల్లన యూఁదెదు నప్పు డక్కుమ్ముష్టి తెఱఁతావి ధైర్యంబు ద్రిప్పుకొలుప." భార. అను. ౧, ఆ. ౪౮. (ముద్రి. పా. 'త్రిప్పికొలుప' శ. ర. పా.)

త్రిప్పుకొల్పు = త్రిప్పుకొలుపు. (కలఁచు.) "చ... ఇత్తెఱంగు హృదయముఁ ద్రిప్పుకొల్పె..." దశ. ౧౦, ఆ. ౧౫౬.

త్రిప్పుడు = త్రిప్పట. (తిరుగుడు, భ్రమణము.) "సీ....ఒకఁడు త్రిప్పెడు త్రిప్పు డో అపుడిగె." కళా. ౪, ఆ. ౯౩.

త్రిప్పుడుగొను. దే. అ. క్రి. (త్రిప్పుడు+కొను) పరిభ్రమించు,తిరుగు. "ఉ...జటాటవిన్ద్రిప్పుడు గొన్న నిర్ఝరనదీమణి .." శివ. ౪, ఆ ౨౦౯.

త్రిప్పుడుత్రాడు = తిరుగుడుత్రాడు. "ద్వి. తెగనీలి మబ్బులం త్రిప్పుడుత్రాళ్లౌ" ద్వి. నల. 3, భా. ౨౩౪, పు.

త్రిప్పుడుపుడుక. దే. వి. (త్రిప్పుడు+పుడుక.) రాట్నపు మాలుకదురు. "క....త్రిప్పుడు,పుడుకయుమం గలంగురాట్నములం గైకొనుచున్." శుక. ౨, ఆ ౪౧౯.

త్రిప్పుత్రాడు. దే. వి (త్రిప్పు+త్రాడు.) తరిత్రాడు (శ. ర.)

త్రిప్పులాడు. దే. అ. క్రి. (త్రిప్పులు+ఆడు.) తిరుగు, ఇటునటు సంచరించు. "చ...పల్మఱు మేనము త్రిప్పులాడెడిన్."హంస. ౫, ఆ.౨౪3.

త్రిఫల. సం. వి. ఆ. స్త్రీ. కరక తాడి ఉసిరికలు.

త్రిభండి. సం వి. ఈ. స్త్రీ. తెగడ చె.

త్రిభద్రము. సం. వి. అ. న.-దంతక్షతము, ఆలింగనము, మర్దనము వీనివలన సుఖ మిచ్చునది-రతి సంభోగము.

త్రిభుజము. సం. వి. అ. న. గణితక్షేత్రవిశేషము.

త్రిమార్గ. సం. వి. ఆ. స్త్రీ. గంగ. (వై. వి.)

త్రిమ్మట. దే. వి. (త్రిమ్మరు. ధా.) 1. పర్యటనము, సంచారము. "సీ...మున్ను హాలధరుండు తీర్థయాత్ర రొనర్చుత్రిమ్మటమై వచ్చి..." పాండు. ౨, ఆ. ౧౪౦. భార. విరా. 3, ఆ. ౯౫; 2. పరివర్తనము జరగుట. "క. యుగముల త్రిమ్మటఁ గాలం,బగణేయంబై చనంగ..." హరి. ఉ. ౯, ఆ. ౫౨; 3. అపద,కష్టము. "క. విగు వెదలి సీల యూడిన,నగచరుబీజంబు లిఖిక నా నొ!ఁ గదుర్,వెగడొంది బొబ్బలు పెట్టుచుఁ,దగిరోన్ మర్కటము వాని త్రిమ్మట వింటే." నా. పంచ. ౧, ఆ. ౯౨; 4 పరిశ్రమము,పరిపాటు. "ఉ... కడుఁ ద్రిమ్మటచే శ్రమమందినారు కాఁ, బోలును..." కళా. ౪, ఆ. ౧౦౯; 5. నడవడిక, ప్రవర్తనము. "గీ...నీదు,తరుణి కొలఁ గాని త్రిమ్మటఁ దిరుగఁ బొచ్చె. చెన్న. 3 ఆ. 3౭౪.

త్రిమ్మటకాఁడు. దే విశే. (త్రిమ్మట+కాఁడు.) త్రిమ్మరి, తిరుగుఁబోతు. "క...అర్ధరథుం డాధృతవర్మ్యుడు చిన్ననాఁడు త్రిమ్మటకాఁడై,కులటీజనక శ్స్త్రాత్ర,తతి పరిశ్రమము లేక పాలఁ దగుటన్." భార. ఉద్యో. ౪, ఆ ౨౬3.

త్రిమ్మరి. దే. విశే (త్రిమ్మరు ధా) 1. త్రిమ్మటకాఁడు. (శ. ర.); 2. యథేచ్ఛముగాఁ దిరుగువాఁడు; యథేచ్ఛముగాఁ దిరుగునది."పంచ. ఏర త్రిమ్మరి." విప్ర. ౪, ఆ. ౯౯. "క. . తప్పతి త్రిమ్మరి యని యెల్లవారుఁ దగఁ దెగడుచుండఁగాన్." భో. 3, ఆ. ౯౨; 3. దుష్టుఁడు. "ఉ...అధ్వరక్రియా,దేవతపుష్కృతుల్ చెఱుపఁ ద్రిమ్మరు త్రిమ్మరి..." ప్రబోధ ౪, ఆ. ౨౫.

త్రిమ్మరీఁడు. దే. విశే. (త్రిమ్మరి+ఈఁడు.) త్రిమ్మటకాఁడు. "ఉ. తుమ్మెద త్రిమ్మరీఁడు .." వసు. 3, ఆ. ౧3౮.

త్రిమ్మరు. దే. అ. క్రి. 1. తిరుగు,సంచరించు. "ఉ. అధ్వరక్రియా దేవతపుష్కృతుల్ చెఱుపఁ ద్రిమ్మరు త్రిమ్మరి..." ప్రబోధ ౪, ఆ. ౨౫; 2. మెలఁగు; ఉండు. "ఉ ...పక్ష్యభావుక,స్వప్నములఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై .." పారి. ౧, ఆ. ౫౫. స. క్రి. చుట్టివచ్చు. "ఉ...ఈక్షణాదు త్రిమ్మరి వత్తుఁ ద్రివిష్టపంబులన్." భార. ఆది. ౨, ఆ. ౧౧౫.

త్రియంబకుఁడు. సం. = త్ర్యంబకుఁడు. పండితా. పర్వ. 3౨౦, పు.

త్రియామ. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపుచె; 3. నీలి చె; 4. యమున.

త్రిరాత్రము. సం. వి. అ. పుం. 1. యజ్ఞవిశేషము; 2. మూఁడురాత్రులు; 3.మూఁడురాత్రులతోఁ గూడినమూఁడుదినములు.

త్రిలవణము. సం. వి. అ. న. సైంధవవిడరుచకములు.

త్రిలింగము. సం. వి. అ. పుం. శ్రీశైలదక్షారామ కాళేశ్వరము లనులింగములమధ్య నున్న దేశము, తెలుఁగు నాఁడు. విశే. (అ. ఆ. అ.) మూఁడు లింగములు గలది.

త్రిలోకి. సం. వి. ఈ. స్త్రీ. మూఁడులోకములసమాహారము.

త్రిలోచనుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి,శివుఁడు.

త్రివత్సము. సం. వి. అ. పుం. మూఁడేండ్లకోడెదూడ.

త్రివర్గము. సం. వి. అ. పుం. 1. ధర్మార్థకామములు; 2. సత్త్వరజస్తమోగుణములు; 3. స్థితివృద్ధిక్షయములు; 4. త్రికటుకము; 5. త్రిఫల.

త్రివిక్రముఁడు. సం. వి. అ. పుం. మూఁడు లోకములను మూఁడడుగులచే నాక్రమించిన విష్ణువు.

త్రివిష్టపము. సం. వి. అ. న. తృతీయవిష్టపము, స్వర్గము.

త్రివృత. సం. = త్రివృత్త.

త్రివృత్త. సం. వి. అ. స్త్రీ. తెగడ చె.

త్రివృత్తము. సం. వి. అ. పుం. రత్నభేదములలో నొకటి. రత్న. ౪౦.

త్రివృత్తు. సం. వి. త్. పుం. 1. యజ్ఞము; 2. యజ్ఞోపవీతము; 3. మూఁడుపేటల మొలనూలు. స్త్రీ. త్రివృత్త. విణ. (త్.) మూఁడురెట్లు అయినది.

త్రివేణి. సం. వి. ఈ. స్త్రీ. 1. గంగానది యమునా సరస్వతులతోఁ గలయుచోటు; 2. యమునా సరస్వతులతోఁ గలిసినగంగానది.

త్రివేణిక. సం. = త్రివేణి.(యమునాసరస్వతులతోఁ గలిసినగంగానది.) "చ. జలరుహరాగనీలమణిసంగతహీరమయంపుఁ బాత్రలో,జలరుహనాభపాద జలజాతంబులు భక్తిప్రసిద్ధి వారిధారలఁ గడిగెన్ దివాకరుఁడు రాణి యొసంగఁగఁ దన్మణిప్రభా, కలనఁ ద్రివేణికాజలముకై పడి పాత్రజలంబుకై పడిన్." కాళిందీ. ౫, ఆ. ౧౧౬.

త్రిశంకువు. సం. వి. ఉ. పుం. 1. హరిశ్చంద్రుని తండ్రి; 2. చాతకము; 3. పిల్లి; 4. మిడుత.

త్రిశిఖము. సం. వి. అ. న 1. త్రిశూలము; 2. కిరీటము. పుం. మారేడు చె.

త్రిశుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. త్రికరణశుద్ధి. "ఉ .. త్రిశుద్ధిగ నమ్ము భారతీ..." (పోతనచాటువు.)

త్రిశూలము. సం. వి అ. న. ఒకానొకయాయుధము, ముమ్మొనవాలు.

త్రిశూలి. సం వి. న్. పుం. శివుఁడు.

త్రిషవణము. సం. వి. అ. న. 1. మూఁడుసవనములు; (1. ప్రాతస్సవనము; 2. మాధ్యందినసవనము; 3. సాయంసవనము.); 2. మూఁడుకాలములు. (1. ప్రాతఃకాలము; 2. మధ్యాహ్నకాలము; 3. సాయంకాలము.)

త్రిష్టుప్పు. సం. వి. భ్. స్త్రీ. ఛందోవిశేషము.

త్రిసంధ్యము. సం. వి. అ. న. మూఁడుసంధ్యాకాలములు.

త్రిసీత్యము. సం. విణ. (అ. ఆ. అ.) మూఁడుసారులు దున్నినది.

త్రిసూత్రము. సం. వి. అ. న. బ్రహ్మసూత్రము, జన్నిదము. పుం. వైదూర్యవిశేషము. (శ. ర.)

త్రిస్రోతస్సు. సం. వి. స్. స్త్రీ. గంగానది.

త్రిహల్యము. సం. = త్రిసీత్యము.

త్రిహాయణి. సం. వి. ఈ. స్త్రీ. మూఁడేండ్లపెయ్య.

## త్రు

త్రుంగు. దే. అ. క్రి 1. తునుక లగు. "మ. తురగస్యందనవారణప్రకరముల్ త్రుంగన్ విజృంభించె దన్." భార. ద్రో. ౫, ఆ. ౩౩౯; 2. రాలు. "క...చుక్కలు త్రుంగఁగన్." పె. శకుం. ౧, ఆ. ౨౪౦; 3. అంతమగు. "సీ. యుగము ద్రుంగెడు నాఁడు జగములు వొలియించునంతకమూర్తిపై నింత యగుచు." భాగ. ౬, స్కం. ౩౧౮. నీలా. ౩, ఆ ౧౭.

త్రుంగుడు. దే. వి. (త్రుంగు ధా.) 1. ప్రళయము. ఆం. భా. ప్ర. ౯౮; 2. వినాశము. (చూ. త్రుంగుడువడు)

త్రుంగుడువడు. ద్వ. అ. క్రి. (త్రుంగుడు+పడు.) 1. చల్లాఱు,శాంతించు. "క. కామోపభోగసుఖములు,వేమాఱును బురుషుఁ డనుభవించుచునున్నం,గామంబు శాంతిఁ బొందదు,ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడువడునే." భాగ. ౯, స్కం. ౫౯౧; 2. నశించు,రూపఱు. "సీ. తండ్రిసద్గుణసముదయము ద్రుంగుడువడ మెలఁగుపుత్త్రుఁడు హీనుఁడు..." మార్క. ౨, ఆ. ౩౪౦.

త్రుంచు. దే. స. క్రి. (త్రుంగు ధా. ప్రే.) 1. తునుకలుచేయు. "గీ. అనిమిషారాతి విల్లెత్త నగజ త్రుంచె." కాశీ. ౬, ఆ. ౨౪౫; 2. నఱకు. "సీ. తుత్తుమురులుగా బిట్టు త్రుంచి త్రుంచి." భార. విరా. ౫, ఆ. ౩౫; 3. తెగఁగొట్టు. "చ... నారిఁ ద్రుంచి .." భార. విరా. ౫, ఆ. ౧౪౧; 4. చంపు. "చ. విజయుఁడు వారి నెల్ల నొక వ్రేల్మిడిఁ ద్రుంచియు..." భార. విరా. ౫, ఆ. ౧౭౪; 5. చించు. "గీ . దుకూలముల్ త్రుంచి త్రుంచి కట్ట నిచ్చిన .." ఉ. హరి. ౪, ఆ. ౧౧౫; 6. విభజించు. "గీ. శిష్య శిల్లను నాత్మీయశిష్యజనుల,కంత బహుమార్గములఁ ద్రుంచి యనుమతింపఁ,బెక్కుశాఖలు గలిగి యీపృథివిలోన, నిగమ మొప్పారె భూసురనివహ మందు." భాగ. ౧, స్కం. ౭౩.

త్రుంపు. దే. వి. (త్రుంచు. ధా.) 1. ముక్క, శకలము. "గీ. త్రుంపు లైనదామరములఁ దునుక లైన తొడవులును గల్గి సురరమణ్యుగ్ర మయ్యె." జై. ౫, ఆ. ౧౯౨; 2. మేలివస్తువు. "క. త్రుంపుల గని వగసీ పీసాం పెడలిన పేదమానిసుల వెంటఁ గట్టా, దుంపలుఁ గూరలు నమలుచుఁ, గంపలఁబడి తిరుగనేల కైకొను మమ్మన్." అచ్చ. అర. ౬౦

త్రుంపుడు. దే. వి. (త్రుంచు ధా.) త్రుంపు, శకలము. (శ. ర. బ్రౌ.)

త్రుళ్ళు. దే. వి. 1. గర్వము ఆం. భా. ప్ర. ౨౩౩. పాండు. ౫, ఆ ౧౦౮; 3. చిలుము. ఆం. భా. ద్వి. ౨౮౦.

త్రుటనము. సం. వి. అ. న. తెగుట. భార. విరా. ౪, ఆ. ౨౭౬.

త్రుటి. సం వి. ఇ. ఈ. స్త్రీ 1. తామరతేకునందు తీక్ష్ణ ముగుసూది దిగునంతటికాలము; 2. లేశము, 3. సంశయము, 4. చిట్టేలకి చె.

త్రుటితము సం. విణ (అ. ఆ. అ.) తెగినది.

త్రుట్టియ = త్రుట్టె. (శ. ర.)

త్రుట్టె. దే. వి. గుంపుపోగు. (చూ. త్రుట్టెలుఁగట్టు)

త్రుట్టెలుఁగట్టు. దే. అ. క్రి. (త్రుట్టెలు+కట్టు.) గుంపుగు, దగ్గఱఁగూడ చేరు. "ఉ. త్రుట్టెలుఁగట్టి నిద్రలు మరుద్భగధీశకులంబు వేల్కనన్." పాండు. ౫, ఆ. ౨౪౯.

త్రుప్పు. దే. వి. 1. అయోమలము, ఇనుపకిట్టము. ఆం. భా. ద్వి. ౨౮౦; 2. కాలుష్యము, దోషము. "గీ అప్పటప్పటికిని జిహ్వాగ్ర త్రుప్పు దుల్ల." స్వా ౨, ఆ. ౧౧; 3. దారిద్ర్యము, లేమి. "గీ సక్కవుల త్రుప్పు దుల్చువసంత వేళ." జై. ౧, ఆ. ౪౫.

త్రుప్పుడు. దే. వి. 1. రోమము. ఆం. భా. ద్వి. ౧౪౬; 2. తునుక. "చ... కత్తురగరథధ్వజాళి నొక త్రుప్పుడు రాలదు .." భార. విరా. ౫, ఆ. ౨౩౯; 3. కాలుష్యము. "వ.. త్రుప్పుడ్లు దుల్లి త్రుళ్లి గంతు లిడుగబ్బిటబ్బులల..." స్వా. ౪, ఆ. ౩౭.

త్రుమ్ము. దే. వి. దుమ్ము. ఆం. భా. ద్వి. ౨౨౦.

త్రువ్వ. దే. వి. 1. తువ్వ, దూద; 2. గిత్త. "క. త్రువ్వఁట బాబాకలపై, పువ్వఁట .." చాటువు.

త్రుస్సు. దే. వి. నీర్లు చిమ్ముటయం దగుధ్వని కనుకరణము. "ఉ. ఘట్టితరూఢతిం గరిముఖంబునఁ జీరిచి గోత్రమీనదిం, బుట్టినసత్ప్రవాహంబుల పూరముఁ ద్రుస్సన నూఁదుచున్..." భీమ. ౫, ఆ ౧౧౬.

త్రుళ్ళగించు. దే. అ. క్రి. త్రుళ్ళు; మిక్కిలి వ్యాపించు. "గీ. దోర్ద తామూలదీప్తులు త్రుల్లగింప." వరాహ. ౯ ఆ. ౧౩౯.

త్రుళ్ళగింత. దే. వి. (త్రుళ్ళగించు ధా.) ఎగనిపాటు. "సీ. కుంతలమ్ములత్రుళ్ళగింతలు సడలిరఁ గొమ్మోవి చుంబన క్రీడ కెలయ." విక్ర. ౪, ఆ. ౨౨౬.

త్రుళ్ళగింతలువెట్టు. దే. అ. క్రి. (త్రుళ్ళగింతలు+పెట్టు.) 1. గంతులువేయు, దుముకు. "వ ..బలిష్ఠంబు లగుతెర్యక్కాఖలపై ద్రుళ్ళగింతలువెట్టుచు..." భో. ౫, ఆ. ౧౯; 2. ఎక్కువ ప్రసరించు, మిక్కిలి వ్యాపించు. "సీ. దోర్మూలరోచులు త్రుళ్ళగింతలు వెట్టఁ దివ్వటమైఁ దుఱుములు దిద్దుకొనుచు." హరిశ్చ. ౨, ఆ. ౧౨౨. 'సీ. త్రుళ్ళగింతలు పెట్టు తొడలదీప్తులతోన చనుదోయిమించులు చౌకళింప." విక్ర. ౮, ఆ. ౩౭. ('త్రుళ్ళమింతలు' అని అపముద్రి. ఈయపముద్రితపాఠముచే శ. ర. సూ. ని. లు గ్రహించుట చింత్యము. చూ. విక్ర. ౪, ఆ. ౨౨౬.)

త్రుళ్లాట. దే. వి. (త్రుళ్లాడు ధా.) క్రీడ, గొండ్లి. ఆం. భా. ప్ర ౧౪౦.

త్రుళ్లాడు. దే. అ. క్రి. (త్రుళ్లు+ఆడు స్వార్థమున.) 1. ఎగిరిపడు. (చూ. త్రుళ్లిపడు.); 2. నర్తించు. "సీ. బవసీలజవనిక పాటల విల్లాంద్ర రమణఁ ద్రుళ్లాడించురంతుకత్తు." క్రీడా. ౧౭౬.

త్రుళ్లింత. దే. వి. 1. త్రుళ్లు, గంతు. "సీ తోరంపుఁ జనుపోయి త్రుళ్లింతల నిడంగ .." కళా. ౪, ఆ. ౯౬; 2. గర్వము. (శ. ర)

త్రుళ్లిపడు ద్వ. అ. క్రి. (త్రుళ్లి+పడు.) 1. దుమికి పడు. "క. నీమాటకు దుర్యోధనుఁ, డాపెంపుఁ బాఁ ద్రుళ్లిపడక యవుఁ గాక ని న్నాఁ, డేమేమిఁ గొంక యక్కట, భూమిఁ దొలుఁగాగ కేని యుంత పుట్టదు మున్నో." భార. కల్యా. ౨, ఆ. ౩౭౧; 2. ఉలికిపడు. "సీ. ఎటు చేలునో యని యెమజ్ఞాచెలి త్రుళ్లిపడఁ గ్రుంకి పాదంబు లొడియుఁనదియఁ." ఉ. హరిశ్చ. ౩, ఆ. ౩౮. 3. కదలు. "సీ. నీదుకు రాలతోఁ బెరుఁగువాఁగదుపులో బల్ల నల్లదలందుఁ ద్రుళ్లిపడఁగ." శుక. ౩, ఆ. ౩౦.

త్రుళ్లియాడు = త్రుళ్లాడు. 1. (గంతులువేయు.) "గీ. త్రుళ్లియాడెడుకుక్కెదపిల్ల లనఁగఁ,బొలుచు కాలఁకుకచూపులు చెలువ మమర" య. ౪, ఆ. ౩౮; 2. (చెలరేఁగు.) "సీ. ఇరువంకలందున విరులచేవియఁ గ్రోలుదొరలు పొదాంబునఁ త్రుళ్లియాడ." హరి. ఉ. ౬, ఆ. ౯౭.

త్రుళ్లు. దే. అ. క్రి. 1. ఎగిరిపడు, మిడిసిపడు. "సీ. చిగురుఁబొదల్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ ద్రుళ్లు చన్నులనొప్పుమళ్లపేరు." కళా. ౪, ఆ. ౧౦౯; 2. ఉబ్బొంగు,ఉత్సాహమందు. "సీ. దుగ్ధపానంబులఁ ద్రుళ్లుపెయ్యలనోరినురువులు..." హరి. ఉ. ౯ ఆ. ౧౬౪; 3. గర్వించు,పొగరెక్కు. "క.... కుడిచీవుమ దున్నపోద త్రుళ్లు టుడుగుమీ." భార. శాం. ౪, ఆ. ౩౯౭; 4. ధైన్యపడు; "మ...పౌ,ష్కరసైకస్థలి నుండి కాపరముననే గన్గావ కాపుత్పరం,బర రాఁ ద్రుళ్లెద వేల..." పా. ౨, ఆ. ౧౧౨; 5. చెలరేఁగు. "చ ..కుంథ జాడు . నొంపఁగాఁ,దలఁకుడు పీనిఁ బార్థునకుఁ దాఁగడుఁ గూర్చుట కొంత త్రుళ్లినన్." భార. ద్రో. ౨. ఆ. ౪౯ వి. 1. మిడిసిపాటు,ఎగిరిపాటు. (శ. ర.); 2. గర్వము,పొగరు. "మ. దనుజవ్రాతము త్రుళ్లడంచి .." భార. ఉద్యో. ౧, ఆ ౧౩౦. భార. అర. ౬, ఆ. ౧౯౩.

త్రుళ్లుఁబోతు. దే విశే.(త్రుళ్లు+పోతు.) పొగరుఁబోతు, గర్వి. "ఆ. త్రుళ్లుఁబోత నీవు తూలి పోక బలికిన, శూర కేమి తఱుఁగుఁ జక్రమునకు." ఉ. హరి. ౩, ఆ. ౧౭.

త్రుళ్లుపిండి. ద్వ వి. (త్రుళ్లు+పిండి) పోఁటకము కని పించినప్పుడు పోలేరమ్మకు కొట్టిపెట్టెడుపిండి. (శ. ర.)

## త్రె

త్రెంచికొను. దే. స. క్రి. (త్రెంచు+కొను స్వార్థమున.) ఖండించుకొను. "గీ. నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న,పుణ్యు జమదగ్ని నందనుఁ బోడుగఁ బట్టి,కుదులకుండంగఁ దలఁ ద్రెంచి కొనుచుఁ జరి..." భాగ. ౯, స్కం. ౪౫౭.

త్రెంచు. దే. స. క్రి. (త్రెగు. ధా. ప్రే.) 1. నఱకు. ఖండించు. (చూ. త్రెంచికొను.); 2. తెగఁ జేయు,ముక్కలుచేయు. "సీ. ముక్కముక్కన వంఘి)పాశముల్ పెరఁ ద్రెంచి దేగకంటకముఁ మింటికిని విడిచి." స్వా. ౪, ఆ. ౧౦౩.

త్రెంపు = త్రెంచు. (కోయు.) "గీ. అంచమున నీవి కంకంబుఁ ద్రెంపి విడుఁడు." కాశీ. ౩, ఆ. ౧౯౨. వి. తెంపు,తెగువ. "ఆ. అరయఁ గర్మరూప మగునవిద్యాజన్మ,మైనహృదయబంధనాదిల తల, నప్రమత్తయోగ మనుమహాఛురికచేఁ, ద్రెంప వలయు నంత త్రెంపుతోడ." భాగ. ౯, స్కం. ౧, ఆ. ౫౦.

త్రెక్క = తెక్క. (చూ. తెక్క.)

త్రెక్కొను. దే. అ. క్రి. (త్రెగు! త్రెక్క!+కొను.) 1. కలఁగు,క్షోభించు. "గీ. పెక్కుమాఱులు తెర వీచి త్రెక్కొనంగ,వదలి వారిధిలోపల నైవ .." భా. రా. యు. ౧౩౯౭; 2. అధికమగు,మిక్కుట మగు. "క...త్రెక్కొనుఁ గొలంబు రణము తెరు వ నొల్లన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౭౪. అను. ౯, ఆ. ౬౭. స. క్రి. 1. కలఁచు. "ఉ. ..నిరు న్నదికాపవాక్యముల్, త్రెక్కొన నాగ్రహం బడుపలేక కుమారునిఁ దన్ను..." జై. ౯, ఆ. ౧౬౯. నిర్వ. ౯, ఆ. ౧౨౨; 2. చంపు. "ఉ. అక్కట తండ్రి లేనికము నప్పెయిఁ,బెంచినతాత కొమ్మెయిం,ద్రెక్కొనఁ గాదు .."భార. భీష్మ. ౩, ఆ. ౩౦౫; 3. వశింపఁజేయు. "మ... ఈపాపంబు నిన్ ద్రెక్కొనున్." భార. అర. ౬, ఆ. ౧౯౨; 4. ఉ్రాగు;మ్రింగు. "క...బడ బాగ్ని దళం,బై జలనిధి ద్రెక్కొనియెడు, నోజన్..." భార. విరా. ౯, ఆ. ౯౭. మార్క. ౬, ఆ. ౧౬౪.

త్రెక్కోలు. దే. వి. (త్రెక్కొను. ధా.) త్రెక్కొనుట. (చూ. త్రెక్కోలుగొను.)

త్రెక్కోలుగొను. దే. అ. క్రి. (త్రెక్కోలు+కొను.) చంపు. "గీ. దుష్టభుజగంబు లందొద తోలి కఱచెఁ, గ్రూరమృగచయ మెల్లఁ ద్రెక్కోలుగొనియె. వి. పు. ౬, ఆ. ౩౧౯.

త్రెగు = తెగు. (శ. ర.)

త్రెడ్డు = తెడ్డు. 1. (గరిటె.) "గీ. క్రివికాలాంబ బంగారుత్రెడ్డునందు,నమృతపాయస మిడునట్టి సభ్యాగతులకు." భీమ. ౨, ఆ. ౧౧౯; 2. (పడవ నడపుసాధనము.) "చ. కవికవితాబ్ధిలోన ముఖ

గజస్వర మొందయు జివ్వాత్రెడ్డు వృతృవయుఁడు కీలికాఁడు..." శివరా. ౧, ఆ. ౬.

త్రయ్యు. దే. అ. క్రి. తెగు, ఖండితమగు. "మ... త్రెస్సి నారాయణో, స్ఫురదోర్దండదివిము క్తచక్ర నివారిత నాకద్విషన్మస్తక్రప్రతతుల్ ఘోరరణం బునం బడియె .." భార. ఆది. ౨, ఆ. ౨౪. "క. అనిలసుతుం డంతన పేఁల్కని పిల్లుదు నతని వజ్రఘనకాయమునఁ బొం,దినలతి కాలాలమెల్లను త్రెస్సె మృణాళకాళలతికలపోలెన్." భార. ఆది. ౫, ఆ. ౧౭౨.

త్రవ్వస. దే. వి. చక్కన, సౌందర్యము. (శ. ర.)

త్రెవ్వు. దే. అ. క్రి. 1. తెగు. "క. ఇవి దుస్సహము ప్రేక్షం,దవిలి నగము త్రెవ్వి పోయి తక్కిన యవి..." భార. ఉద్యో. 3 ఆ, ౧౧౬. కాశి ౭, ఆ. ౯౪, 2. విడిపోవు. "క. కవ్వడి యొక్కఁడ కంటిరె,జివ్వనఁ జేరుద మితండు సేద్పడఁగా విం,దవ్వరుఁ గడంగ లే రిది,త్రవ్వి చడినధనము లెత్తి గిలిమి లోఁ దెల్లన్." భార. వి. ౧౮౧; 3. అంతమగు. "ఉ. త్రెవ్వనిమాయలో మునిఁగి తేలెడువిూలము గానె యీశ్వరా." కవిక. ౬, ఆ. ౧౮౨.

త్రెళ్లించు. దే. స. క్రి. (త్రెళ్లు. ధా. ప్రే.) పడఁ గొట్టు కూల్చు. "క. విల్లెక్కిడి యొకచిల్కునఁ, ద్రెళ్లింపము పొలఁతి .." అచ్చ బాల. ౧౧౨. శ్రీరం. మా. ౫, ఆ. ౩౭.

త్రెళ్లు. దే. అ. క్రి. 1. కడిచచ్చు. "గీ. కన్నియల తోన నాడుచు నున్నదానిఁ, బాదమరి కలమై యొక్క నున్న గాలు,గలచెఁ గన్నియ లందఱు వెఱచి పఱచి,యఱచుచుండఁ బ్రమద్వర యవనిఁ ద్రెళ్లె." భార. ఆది. ౧, ఆ. ౧౪౭. భార. సభా. ౨, ఆ. ౬౯; 2. విఱుగు. "సీ. ..దిక్చక్రవాళంబు ద్రెళ్లిపడఁగ." కాశి. ౫, ఆ. ౧౩౦; 3. పడు రాలు "పుచ ..త్రెళ్లెఁ దార లాతె నగ్ని..." దశా. 3, ఆ. ౧౯౮.

త్రే

త్రేంచు. దే. అ. క్రి. త్రేనుచు,ఉద్గారించు. "గీ.... అమ్మునీశ్వరుఁడు,గడుపుఁ దడవికొనుచుఁ గఱ్ఱసఁ ద్రేంచినసుర జీర్ణమగుత్యు నాతఁడంబు." భార. అర. ౨, ఆ. ౩౪౫. స్కా. ౬, ఆ. ౨౮.



త్రేంపు దే. వి. (త్రేఁచు. ధా.) ఉద్గారము,త్రేన్పుట. "గీ. భుక్త గొన్నట్టివారి త్రేఁపులు పొసంగె." కువల. ౨, ఆ. ౧౦౭.

త్రేగుడు. దే. వి. తేగుడు,చొంగ. "చ...నోరఁ ద్రేగుడు దొరగంగ కొంకయును గ్రుస్సి..." హరి. పూ. ౬, ఆ. ౪౩.

త్రేణి దే. విశే. సుందరము,అందమైనది. "సీ. జడలు గట్టియుం దాత చక్కనైనది వేణి దీర్చినకొలఁ దెంత త్రేణి యగునో." వ సం. ౭, ఆ. ౭.

త్రేత. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకయుగము; 2. మూఁడగ్నులు. (గార్హపత్యము,దక్షిణాగ్ని,ఆహవనీయము.)

త్రేనుచు = త్రేఁచు. (శ. ర.)

త్రేనుపు = త్రేఁపు (శ. ర.)

త్రేన్చు = త్రేనుచు. "ద్వి. త్రేన్పకపోదుకే దేవ యే ననుడుఁ,ద్రేన్పఁగ నైనను దొలఁచి తే దనుచు." బస ౭, ఆ. ౬౮౩.

త్రేన్పు = త్రేఁపు. (శ. ర. బ్రా.)

త్రేవుడు = త్రేగుడు. "గీ. ఏవముగ బొమ్మపై నిండఁ ద్రేవు డొలుక." దశ. ౬, ఆ. ౧౫౯.

త్రై

త్రైగుణ్యము. సం. వి. అ. న. 1. మూఁడుగుణములు కలిగియుండుట; 2. మూఁడుగుణములధర్మము; 3. మూఁడురెట్లు; 4. సత్త్వరజస్తమోగుణముల సమాహారము; 5. శైత్యసౌగంధ్యమాంద్యము లను మూఁడుగుణములు.

త్రైమాతురుఁడు. సం. వి. అ. పుం. కౌసల్యాకైకేయీ సుమిత్రలకొడుకు లక్ష్మణుఁడు.

త్రైయక్షము. సం. విశే. అ. ఈ. అ.) త్ర్యక్షసం బంధి,శివసంబంధమైనది. "శా. త్రైయక్షానికు ధూళి మూత్రకరమధ్యాదేవి వీక్షింపుమా." శైవ. ౮, ఆ. ౧౯౪.

త్రైరాశికము. సం. వి. అ. న. గణితమున ప్రమాణ రాశి,ఫలరాశి, ఇచ్ఛారాశి యనుమూఁడురాసుల నాధారముగాఁ జేసికొని లెక్కించువిధము [ము.

త్రైలోక్యము సం. వి. అ. న. త్రిలోకములసమాహార

త్రైవిధ్యము సం. వి. అ. న మూఁడువిధములుగా నుండుట. [సంబంధమైనది.

త్రైష్టపకము. సం. విశే. (అ. ఆ. అ.) త్రిష్టప

త్రైష్టపుఁడు. సం. వి. అ. పుం. దేవత,వేల్పు.

## త్రొ

**త్రొక్కట.** దే. వి. (త్రొక్కు. ధా.) తొట్రుపాటు. "గీ. అటు లిటులు చూచి వారి త్రొక్కటలం చూచి." సావి. ౧, అ ౧౭. అచ్చ. సుం. ౭౧. అచ్చ. పీఠి. ౨౪.

**త్రొక్కటపడు** = తొక్కటపడు (శ. ర.)

**త్రొక్కటపాటు** = తొక్కటపాటు. (శ. ర.)

**త్రొక్కటము** = తొక్కటము. (చూ. తొక్కటము.)

**త్రొక్కటలాడు.** దే. అ. క్రి. (త్రొక్కటలు+ఆడు.) తొట్రుపడు "ద్వి. ఎక్కడ నున్నవాఁ డేఁ డేఁడి యనుచుఁ, ద్రొక్కటలాడుచుఁ ద్రోయఁగ రాక, కప్పియుండిన ప్రజ గడకుఁ బోఁ ద్రోలి." ద్వి. శ. సా. ౨, భా. ౭౨, పు. ౫, పం.

**త్రొక్కడ** = త్రొక్కట. (చూ. త్రొక్కడపడు.)

**త్రొక్కడపడు.** ద్వ. అ. క్రి. (త్రొక్కడ+పడు) తొట్రుపడు. "చ. అడుగడ మున్న నీవు నిఖిలావని తండ్రి యొసంగియుండఁ ద్రొక్కడపడ నేటికి..." చం. రా. ౪, అ. ౪౨.

**త్రొక్కిడి.** దే. వి. (త్రొక్కు. ధా.) త్రొక్కట. (చూ. త్రోపుద్రొక్కిళ్లు)

**త్రొక్కిళ్లు.** దే. వి. బ. (త్రొక్కు. ధా.) 1. బాలక్రీడావిశేషము. "గీ పిండ్లిళ్లు త్రొక్కిళ్లు బేడిస తిరుగుళ్లు నచ్చనగండ్లు..." పాండు. ౫, అ. ౧౫౫. 2. త్రొక్కుడులు.

**త్రొక్కు.** దే. అ. క్రి. 1. నడచు. "గీ. కలపదంబులు ద్రొక్కఁ బిశాచగణము." దశా. ౨, అ. ౪౩౫; 2. పాదముతో నడుము. "క...భూ, చాయకుఁ జను మరలి పట్టుతో, పాయత్తకఁ ద్రొక్కఁ బడ్డయహిగతిఁ గవిసెన్." భార. విరా. ౫, అ. ౨౦౬; 3. వర్తించు. "చ. ధర్మువున గొంకి తయుం దొలఁగఁ ద్రొక్కమి యొంకయు మేలు.." భార. శాం. ౧, అ. ౪. స. క్రి. 1. సందర్శించు. "సీ. అతడు నానాదివ్యదేశముల్ ద్రొక్కనీ మగసాలి పరిపోల్పఁ దగదు విధవ." కాశీ. ౨, అ. ౮౩, 2. అణఁచు. "క... పాపములగమి కాలం, ద్రొక్కెదవు నీవ.." పారి. ౧, అ. ౫౦; 3. ప్రసరింపఁజేయు. "క. కనుగడ లెడ్డెలఁ ద్రొక్కఁగా నునుఁగెంపుల్." కళా. ౪, అ. ౧౦౩; 4. (తోటిలో పోసి.) దంచు. "చ...కాఁపుఁగుఱ్ఱఁ, తులు తెలియావనాళములు ద్రొక్కఁగ..." పాండు. ౧, అ. ౧౫౫; వి. 1. త్రొక్కుడు, త్రొక్కట. "ఉ. గొరెలు త్రొక్కునం బ్రిదిలి పుండలిధర్త యొసంగ..." నృసిం. ౩, అ. ౩౬. హరి. పూ. ౪, అ. ౧౬; 2. ఒత్తుడు; అతిశయము. "క వెల్లి యగువగల త్రొక్కున..." ఉ. హరి. ౫, అ ౧౬౬. భార. కర్ణ. ౧, అ. ౩౧.

**త్రొక్కుడు.** దే వి. (త్రొక్కు. ధా.) 1. త్రొక్కట; దర్శనము. "సీ. పీని త్రొక్కుడు గారవించు ప్రాగ్గిరికి సహింపఁజాలుట భారమే దవాగ్ని." వరాహ. ౪, అ. ౨౩; 2. ఒత్తుడు (చూ. త్రొక్కుడు పడు.); 3. పకురతము. (పక్షిరత మని శ. ర.) ఆం. భా. ద్వి. ౧౭౮. విశ. త్రొక్కుడుపడునది. (చూ. త్రొక్కుడుబల్లు మొ.)

**త్రొక్కుడుఁగమ్మి.** ద్వ. వి. (త్రొక్కుడు+కమ్మి.) కడపక్రిందిపలక, శిల. (శ. ర.)

**త్రొక్కుడుపట్టె.** ద్వ. వి (త్రొక్కుడు+పట్టె.) త్రొక్కుడుఁగమ్మి. (శ. ర) బ. సాలెవాఁడు నేయునపుడు త్రొక్కెడుచెక్కలు. (శ. ర.)

**త్రొక్కుడుపడు.** ద్వ. అ. క్రి. (త్రొక్కుడు+పడు.) ఒత్తిడినందు. "క. జనియించు మొదలు వాయని, తనుజీవము లక్కటా వితానిత ప్రీతివస్తునికూఢ లాభ...ంభించుచుఁ ద్రొక్కుడుపడి విభ్రమములుగాఁ దలఁచున్." చంద్రా. ౪, అ. ౧౮౧.

**త్రొక్కుడుపలక.** ద్వ. వి. (త్రొక్కుడు+పలక.) 1. సాళ్లపనివానికాలిక్రిందిపలక. (శ. ర.); 2. సాలెపనివానికాలిక్రిందిరాట్నపుఁబలక. "క. పడితారము చెవులుం ద్రొక్కుడు పలకయు..." శుక. ౧, అ. ౪౨౦.

**త్రొక్కుడుపాటు.** ద్వ. వి. (త్రొక్కుడుపడు. ధా.) ఒత్తుడు, రాయిడి. "సీ. కాపాయపటములు కటి కటంబుల నూడి త్రొక్కుడుపాటుచే దునియ చుండ." దశా. ౧, అ. ౧౭౯.

**త్రొక్కుడుబిల్ల.** ద్వ. వి. (త్రొక్కుడు+బిల్ల.) బాలక్రీడావిశేషము. (శ. ర. ఒంటికాలితో నడచి వెళ్లి త్రొక్కి యది గీసినగీతమీఁద పడకుండఁ ద్రోయుచు నాడెడియాట. వా.)

**త్రొక్కుడుబొమ్మ.** ద్వ. వి. (త్రొక్కుడు+బొమ్మ.) రాట్నమునందలియొకానొకసాధనము "క...త్రొక్కుడుబొమ్మయునుం ద్రిప్పుడుపుడకయునుం

గలుగురాట్నములు గైకొనుచున్." శుక. ౨, ఆ. ౪౨౦.

త్రొక్కుడువడు = త్రొక్కుడుపడు. 1. (తొట్రుపడు.) "వ...చిక్కులచెయ్యిఁ ద్రొక్కుడుపడి .." పారి. ౨, ఆ. ౫౯; 2. (అదుముడుపడు.) "ఉ. త్రొక్కుడువడ్డభోగిగతి మ్రోఁగి..." కవిక. ౨, ఆ. ౧౩౪.

త్రొక్కులాడు. దే. అ. క్రి. (త్రొక్కులు+ఆడు.) 1. కలఁగు. "గీ... మీరలు చేసినకర్మఫలము,లను భవింపుఁడు మఱి త్రొక్కులాడ నేల." శివధ. ౪, ఆ. ౫౪; 2. ఒకదాని నొకటి మించు "క...అబ్ధిబోల్పకవతి మనంబున,సబ్బురమును భయముఁ ద్రొక్కులాడఁగ నుండెన్." శుక. ౨, ఆ. ౨౫౩.

త్రొక్కువడు = త్రొక్కుడువడు. (కాలియదుముడు నందు.) "ఆ. పాము ఫణమునందు బలిమి మోపక యున్నఁ,దోఁక యేమి సేయుఁ ద్రొక్కువడియు." సాంబో. ౫, ఆ. ౬౪. హరి. పూ. ౬, ఆ. ౧౨౯.

## త్రో

త్రోచిపుచ్చు. దే. అ. క్రి. (త్రోచి+పుచ్చు. స్వార్థము.) 1. విడిచిపెట్టు. 'గీ. బలిమి మున్నేల తెచ్చి తిప్పడఁటి మగుడఁ, ద్రోచిపుచ్చంగఁ దగునయ్యె .." భార. ఉద్యో. ౪, ఆ. ౩౦౯; 2. నిర్లక్ష్యముచేయు "క. పలుకకయె త్రోచిపుచ్చినఁ, బిలిచి పిలిచి నోరు నొచ్చి పెల్కురఁ గని .." జాహ్నవీ. ౪, ఆ. ౪౨.

త్రోచు. దే. అ. క్రి. 1. పైఁబడు "ఉ. త్రోచిరి పీఁక వానరులు దూలిరి రక్కసు లింక నీవు వేవే చననిమ్ము తేరు శరవృష్టిని ముంచెద శత్రుసేనలన్." భా. రా. యు. ౬౫౭; 2. అతిశయించు. "ఉ. త్రోచిన శోకవేదనలతోఁ దగుమారక నీ ముఖాబ్జముఁ జూచినయప్పు డెల్ల మది చుఱ్ఱునఁ దీరనిలజ్జ పెంపునన్." జై. ౧, ఆ. ౯౯; 3. వడి గలుగు. "క. ఆచీకటి నొక్కండును,ద్రోచి చనఁగ రామి..." విక్ర. ౫, ఆ. ౧౯౭; 4. స్రవించు "క. ఈచందంబునఁ దెబ్బలు,వేచియుఁ బైఁ బూఁచి లాఁచి వ్రేసియుఁ బైపైఁ,ద్రోచు రుధిరమునఁ బడిసిరి,పూఁచిన మోదుగులతోఁ డఁబుట్టు లనంగన్." ఉ. హరి. ౩, ఆ. ౭౩. స. క్రి. 1. ఉపేక్షించు. "సీ...ధర్మంబునఁ బెడవాయఁగాఁ ద్రోచి కేదారుద్ధదుర్వృత్తి వఱగి." హరి. పూ. ౩, ఆ. ౯౮; 2. నశింపఁజేయు. "సీ. సాధుసమ్మతముగా సామజంబు నిశందు గాచినాఁ డీకఁడు ద్రోచినాఁడు." ఉ. హరి. ౨, ఆ. ౧౮౦; 3. గెంటు. "ద్వి. తన్ని యంతటఁ బోక తలఁ బట్టి యీడ్చినన్ను నుద్ధతిఁ ద్రోచె నగరంబు వెడల." ద్వి. హరిశ్చ. పూ. ౮౫౭ పం.; 4. తప్పించుకొను. "ఉ . ఎడ సొచ్చిన విఘ్నవిశేషముల్ ధృతిం ద్రోచుచు .." భార. అను. ౫, ఆ. ౨౨౬; 5. దాఁటు. "గీ. అచమూరువు యూథంబుఁ ద్రోచి పఱచె." పాండు. ౫, ఆ. ౧౫; 6. విడుచు. "ద్వి నీచభామల నొల్ల నీరాజ్యమెల్లఁ, ద్రోచి పో నిమ్మింకఁ దుకతుక మాని." ద్వి. హరిశ్చ. పూ. ౧౬౩౯, పం; 7. నిరాకరించు. "క .. ఈఁ,బో మ్మని త్రోచిన..." వి. పు ౬, ఆ. ౨౫౨, 8. పడవేయు. "ఉ...కృశానుకీలలం, ద్రోయుఁడు వీని నంచుఁ గమదుష్టమునస్కులఁ బంచె నల్వురన్." నృసిం. ౪, ఆ ౫౦; 9 దృఢపఱచు. "ఉ...సహాయులై,యూర్ధ్వులు ద్రోచి చెప్ప .." నిర్వ. ౪, ఆ ౭౬.

త్రోటకము. సం. వి. అ. న. 1. నాటకమందలి గర్భసంధికిఁ గలయంగములలో నొకటి; 2. ఒకానొక రూపకము. విణ. (ఆ. టీ. అ.) త్రుంచునది.

త్రోటనము. సం. వి. అ. న. త్రుంచుట.

త్రోటి. ఉభ. దే. వి. బెదరింపు. "క. లాటపతి యెవ్వఁ డాతని,పోటేటివి వానితోడి పొందేమి టికిం,బీటికి మాటికి నీక్రియఁ, ద్రోటికిఁ బడనేల వెడలఁ దోలుఁడుపీరిన్." దశ. ౪, ఆ. ౨౮. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1 పక్షిముక్కు; 2. ఒకరకపుఁ జేఁప; 3. చేకు చె.

త్రోద్రోపు. దే. వి. (త్రోపు+త్రోపు.) మిక్కిలిత్రోపు. (చూ. త్రోద్రోపులాడు.)

త్రోద్రోపులాడు. దే. స. క్రి. (త్రోద్రోపులు+ఆడు.) మిక్కిలిత్రోయు. అ. క్రి. స. క్రి. ఒకరినొకరు త్రోసికొను. "సీ. జిగిధగద్ధగ యనుబిగువుఁ జన్నుల మీఁదఁ గ్రమ్మించుసరులుగాద...' ద్వి. శ. సా. ౧, భా. ౨౨, పు. ౭. పం.

త్రోపడు. దే. అ. క్రి. (త్రోపు+పడు.) త్రోయఁబడు. "సీ త్రోపడి యిరులు పటాపంచలై పాఱె..." స్వా. ౩౮, ౨౩. ఉ. హరి. ౪, ఆ. ౧౯౯.

త్రోపనంగొలది. దే. విణ. (త్రోపు+కొలది. శ. ర.) ఉభయభ్రష్టుఁడు; ఉభయభ్రష్టురాలు. "ఉ .. వనితా నీవలితోడఁ గూడవలతే నాకేల ఏకేల నీకని నన్యాయనిరుద్ధుఁ డుష్ణరుచి కన్నెంక్ వెలార్తినిఁ తో,యిన శాతందు కులాభిమానఘనుఁడై యేయూరి కేత్రోవయం,చనుమానించినఁ ద్రోపనం గొలది చేయంజాలిచే క్రమ్మఱన్." ఉ. హరి. ౫, ఆ. ౧౬౧. (శ. ర. పా.)

త్రోపరి. దే. విణ. (త్రోపు+అరి.) త్రోయువాఁడు. ఆం. భా. తృ. ౧౦. అచ్చ. సుం. ౧౧౯.

త్రోపాటు. ద్వ. వి (త్రోపడుధా.) త్రోపడుట.(శ ర.)

త్రోపాడు. దే.అ క్రి. (త్రోపు+ఆడు.) 1.త్రోయుచు ద్రోయఁబడుచు నుండు. "క...చెలితోఁ, ద్రోపా డుచుచుండె నబల తోరపులజ్జన్." విక్ర. ౪. ఆ. ౨౧౮, నిర్వ. ౧౦, ఆ. ౪౫ స. క్రి. 1. త్రోయు. "మ. మగఁడం గీచకుఁ బట్టి వాఁడుచు బలోన్మాదంబునన్ బాహాగ,ర్వగరిష్ఠుం డగువాహిడింబరిపుఁ దీవ్రక్రోధుఁడై పట్టి బెట్టుగఁ ద్రోపాడఁగ..." భార. విరా. ౨, ఆ. ౩౪౩. పారి. 3, ఆ. ౧౫; 2. అనుసరించు. "క. మీ పాడినవారిచందము, లేపాడిగఁ దలఁప వచ్చు నిటఁ దేవతులం, గాపాడినవాఁ డచుఁగై,త్రోపాడిఁ దన్నుపలచి తొయ్యలులారా." అము. ౫, ఆ. ౪౦; 3. ఒరసికొను. "మ . త్రోపాడఁజన్నల్." సా. 3, ఆ. ౪౪.

త్రోఁచిమి. దే. స. క్రి. (త్రోచుధా. ప్రే.) 1. వెడలఁ గొట్టు. "క. దూతం ద్రోపించి భుజా,స్ఫోకబలం బమర వెడలి..." భా. రా. బాల. ౭౨౮; 2. గెంటించు. "క. ద్వైపాయనముని వెడలం,ద్రోపిం చినకొలఁగాఁడు ధూర్జటి .." భీమ. ౪, ఆ. ౧౩; 3. త్రోచునట్లుచేయు. "క. అపవనజా ..గంగ వడుచున్నఁ, ద్రోపించె' సురూధనుండు దురిత కరుండై." భార. ఆది. ౫, ఆ. ౧౭౧.

త్రోపు. దే. వి. (త్రోచుధా.) 1 గెంటు. "క. ఆమాపు వలఘత్రోపున, భామాపుష్పాస్త్ర భూమిపతిఁ జేరుట కొరాదు యరుదేర .." శుక. 3, ఆ. ౧౫౫, 2. తూల్చుట. "సీ. భూతసాఘాతంబుఁ జేతచేతర మైనకకటంబుత్రోపును జరణనిహతి." భార. సభా. ౨, ఆ. ౪౧; 3. ముందుకేఁగుట. "ఆ...బల్, త్రోపు లేదిమీను..." భార. శాం. ౫, ఆ. ౫౭౮.

4. యుద్ధము. "క. చెలిమియును సంభావణమును, బలిమి వివాహంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమయుం, తలవారితోన తగు..." భార. ఉద్యో. ౨, ఆ ౪౬ 5. నిషేధము. "క...నాలికి నిది యే,లా మేటికలం పచుత్రో,పేమియు లే దొపి వినుము హితవచనంబుల." భార. అశ్వ. ౨, ఆ. ౬; 6. విడుచుట. "క...మర్జుని నిలఁ,దడయక యొఱక మెయిఁ ద్రోపు తగుమా చెందున్." హరి. పూ. ౫, ఆ. ౨౪౦; 7. శేషము, మిగులు. (చూ. త్రోవఘ.)

త్రోపుడు. దే. వి. (త్రోచుధా.) 1. త్రోపు (శ. ర.); 2. చిత్రిక. ఆం. భా. ద్వి. ౨౦౧.

త్రోపడుపెట్టు. దే. స. క్రి. (త్రోపుడు+పెట్టు.) చిత్రికతో నునుపుచేయు. (శ. ర. బ్రౌ.)

త్రోపత్రోపాడు దే స. క్రి. (త్రోపు+త్రోపు+ఆడు.) ఒకరి నొకరు రాచు; ఒకరి నొకరు గెంటుకొను. "సీ భూపాలవర్గంబు త్రోపుత్రోపాడుచు గిరికొని రెండుపక్కియల నడవ." రాజ. చ. 3,ఆ.౧౬౩, స్వా. ౫, ఆ. ౭౧, ఇట్టే, త్రోపుత్రోపులాడు పండితా. పర్వ. ౨౯౭, పు ౭, పం.

త్రోపద్రోక్కుళ్లు. దే. వి. బ. (త్రోపు+ద్రొక్కుళ్లు.) త్రోపాడుటలు, త్రోసికొనుటలు. (చూ. త్రోపు ద్రొక్కుళ్లవాఱు)

త్రోపుద్రొక్కుళ్లవాఱు. దే.అ. క్రి. త్రోపుద్రొక్కుడు+ పాఱు.) త్రోపాడు, త్రోసికొను. "ద్వి. తొడ లూఁడికొనుచును ద్రోపుద్రొక్కుళ్లు, వాఱుచు .." ఎడలఁ,బాఱుచు .." పండితా. పర్వ. ౭౬౨,

త్రోపులాడు = త్రోపాడు. [పు. ౯, పం.

త్రోపువడు ద్వ అ. క్రి. (త్రోపు+పడు.) 1. గెంటం బడు; పోవు. "చ...మహాత్మ యే,యనుపునఁ దృష్ట త్రోపువడు .."భార. శాం. ౫, ఆ. ౩౭౨; 2. నరకు గొనఁబడకపోవు, నిర్లక్ష్యము చేయఁ బడు. 'క...పలికిన నప్పులుకు త్రోపువడ మని పలికెన్." భార. అను. ౨, ఆ. ౨౭౦, మార్క. ౫, ఆ. ౪౧.

త్రోపుచేయు. ద్వ. అ. క్రి. (త్రోపు+చేయు.) నిరాక రించు, నరకుగొనకపోవు. "క...ఎవ్వరునునుం దగ నాడిన నతఁడు ద్రోపుచేయక ననుఁ గైకొను టయిఁగఁ జెప్ప నాతుం గరుణన్." భార. అశ్వ. ౧, ఆ. ౪౩, భో. ౨, ఆ. ౯౬.

త్రోము=తోము. (సూ. ని.)

త్రోయించు. దే. స. క్రి. (త్రోయుధా. ప్రే.) త్రోయఁ జేయు, గెంటించు. "మ ..దానిన్ మెడం, దవులం గట్టి ఖనీథిఁ ద్రిప్పి వడి నాతం దట్టిఁ ద్రోయింప..." చంద్రా. ౯, ఆ. ౭౭.

త్రోయు. దే. స. క్రి. 1. వెల్లగించు. "శా .. త్రోయంగఁడు కోటమేడలు వడన్ ద్రెవ్వుండు డాయుండు .." ఉ. హరి 3, ఆ. 3౨; 2. తొలఁగించు "చ...కర్ణపాళి పైనలకలుఁ ద్రోయఁ చున్...." స్వా. ౯, ఆ ౬౭; 3 పడఁగొట్టు. "గీ. ఆకియుఁ బాత్రయుఁ దేఁ బావి యాంత్ర వల్లిఁ, గోలగ్గా ర ద్రోయుఁ దక్కుజముతోడ, నొరగి .." ఆము. ౬, ఆ. ౨౭; 4. విరసించు. "ఉ...త్రోయుఁ జిల్మంచుఁ బసిండి...' ఆము. ౧, ఆ. ౧౬; 5. కదపు, జరపు "క...గుట్టు తప్పక యుండన్, ద్రోయుఁడు దివసములు .." కళా. ౬, ఆ. ౧౪3.

త్రోలు. దే. స. క్రి. 1. తఱుము. "గీ. తొలఁగ కేడ పొచ్చు మానవాదులసుశర్మ, యోధులను బాఱఁ ద్రోలి .." రాఘవ. ౪, ఆ. ౧3౯; 2. చంపు. "సీ. నరవృగాకృతిపై జనశ్లాఘ వ్రాలి ప్రహ్లాదు కేలితి పలలాశిఁ ద్రోలి." వరాహ. ౧, ఆ. ౯౨, 3. నడపించు. "ఉ. దిట్టల నీఁతగాంత్ర జడధిం బడఁ ద్రోలియు ..వెదకించిరి వారిఁ బల్మియున్." కళా. ౬, ఆ. ౧౦౬.

త్రోవ. దే. వి. (త్రోచు ధా )1. దారి. ఆం. భా. ద్వి. ౭; 2. పద్ధతి. "ఉ. నన్నయభట్ట తిక్కకవి నాథులు చూపినత్రోవ పావనంబు..." హరి. పూ. ౧, ఆ. ౪౦; 3. ఉపాయము. "గీ ..అధిక, దుఃఖములఁ బొందకుండెడుత్రోవ గలదె" వి. పు. ౪, ఆ. ౧౦౪; 4. గతి. "క. నీ మేనల్లుఁడు గావునఁ, గాముఁడు నీకరణి దుండగము చేసెకదా, మామకఘోరాగ్నిశిఖా, స్తోమాహుతి యయ్యె వానిత్రోవయె నీకున్." శకాం. ౯, ఆ. ౯౭; 5. జోలి; సామీప్యము. "ఆ. పద్మనయనుమీఁది భక్తియోగం బెల్లమును భక్తియోగ మనుచు మొదలెఱుంగు, వారి వారి వారి వారిఁ జేరినవారి, త్రోవ దలఁడు వలదు దూతలార." భాగ. ౬, స్కం. ౧౯౧, వరాహ. ౬, ఆ. ౭౯.

త్రోవడు. ద్వ. అ. క్రి. (త్రోవ+పడు) శోధించు, వెదకు. "గీ పడఁతితనువల్లిఁ జేసి త్రోవడినతావిఁ గనకగర్భుండు పువ్వువాసనలఁ జేసెఁ, గాక లేకున్న నీసొంపు గలుగు టెట్లు." మల్హ. ౧, ఆ ౭౯.

త్రోవపెట్టు. దే. అ. క్రి (త్రోవ+పెట్టు) దారి యిచ్చు దారిచూపు "ఉ ..కావల లేనియుఁ ద్రోవపెట్టెదన్." కవు ౨, ఆ ౯౬, ఆము. ౯, ఆ. ౧౧౭.

త్రోవరి. దే. విశే. (త్రోవ+అరి.) 1. దారితెలిసినవాఁడు. శ. ర ; 2. దారినడచువాఁడు. సాం. ని. దేవ. ౧౮

# త్ర్య

త్ర్యంబక. సం. వి. అ స్త్రీ. పార్వతి.

త్ర్యంబకుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

త్ర్యక్షము. సం. వి. అ. పుం. కొబ్బెరకాయ. విశే. (అ ఆ. ఇ.) మూఁడక్షరములు గలది.

త్ర్యక్షుఁడు. సం = త్ర్యంబకుఁడు.

త్ర్యబ్ద. సం. వి. అ స్త్రీ మూఁడేండ్లపిల్ల; మూఁడేండ్ల పెయ్య.

# త్రా్య

త్రా్యహణము. సం. వి. అ. పు. పక్షి.

# త్రు్య

త్రు్యషణము. సం. వి. అ. పుం. సొంటి పిప్పలి మిరియాలు.

# త్రూ్య

త్రూ్యషణము. సం= త్రు్యషణము.

# త్వ

త్వంగత్. సం. శ. త్ర. చలించుచున్న. "శా. భంగాకీర్తిమషీమలీమసతను ప్రత్యర్థి సేనాభట, త్వద్గత్రిం దుక కాననాంతరములన్ వర్తిల్లు నత్యుల్లసద్భంగిన్ .." సైమ. ౯, ఆ. ౧౨౧ ('త్వగి గతే కమ్పే' కవికల్ప.)

త్వక్కు. సం. వి చ్. స్త్రీ. 1. తోలు; 2. చెట్టుపట్ట; 3. దాల్చినచెక్క; 4. స్పర్శేంద్రియము.

త్వక్సారము. సం. వి. అ. పుం. వెదురు.

త్వగ్గంధము. సం. వి. అ. పుం. నారింజ. [పట్ట.

త్వచము. సం. వి. అ. న. 1. చెట్టుపట్ట; 2. లవంగపు

త్వచిసారము. సం. = త్వక్సారము.

త్వద్. సం. సర్వ. నీయొక్క అని.

త్వర. సం. వి. ఆ. స్త్రీ. తొందరపాటు.
త్వరణము. సం. వి. అ. న. తొందరపడుట.
త్వరపడు. మి. అ. క్రి. (త్వర+పడు.) తొందర పడు. ఉ. రా. ౧, ఆ. ౫౪.
త్వరమాణము. సం. విణ. (అ. ఆ. అ) తొందరపడు చున్నది. పాండు. ౫, ఆ. ౨౩౭.
త్వరి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. త్వర.
త్వరితపడు = త్వరపడు. "క...విన్నుఁ జూడఁ దద్దయు వేడ్కన్, ద్వరితపడుచున్నవారలు, త్వరితము సం. వి. అ. న. త్వర. విణ. (అ. ఆ. అ.) త్వర గలది. హరివిక్రమ నీరవశోదరాదులు పెరిమన్. హర. ౭, ఆ. ౧౯౮.
త్వష్ట. సం. వి. ఋ. పుం. 1. విశ్వకర్మ; 2. ద్వాద శాదిత్యులలో నొకఁడు; 3. వడ్లవాఁడు. విణ. (ఋ. స్త్రీ. ఋ.) చెక్కువాఁడు.
త్వష్టము. సం. విణ. (అ. ఆ. అ.) చెక్కఁబడినది.

త్వా

త్వాదృక్కు. సం. విణ. (క్) నీవంటివాఁడు.
త్వాదృశుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నీవంటివాఁడు.
త్వాదృశము. సం. = త్వాదృక్కు.
త్వాదృక్షుఁడు. సం. = త్వాదృశుఁడు.
త్వాష్ట్రము. సం. విణ. (అ. ఈ. అ.) త్వష్టృసంబంధ మైనది. [సంజ్ఞాదేవి.
త్వాష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిత్రానక్షత్రము; 2.

త్వి

త్విట్టు. సం. వి. ష్. స్త్రీ. 1. కాంతి; 2. కిరణము; 3. మంట, 4. వాక్కు.
త్విష. సం. వి. ఆ. స్త్రీ.=త్విట్టు.
త్విషాంపతి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.
త్విషి. సం. వి. ఇ. పుం కిరణము.

త్స

త్సరుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఖడ్గయుద్ధమందు నేర్పరి.
త్సరువు. సం. వి ఉ పుం. కత్తిపిడి.

థ

థ. సం. వి. అ. పుం. కొండ. న. 1. రక్షణము; 2. మంగళము; 3. భయము.

థు

థుత్కారము. సం. వి. అ. పుం. ఉమియుట మొ. వానియందుఁ జేయుధ్వని.

థూ

థూత్కారము. సం.=థుత్కారము. "సీ. థూత్కార మొనరించుచుఁ దొందంబు ముక్కున శీకరాసారంబుఁ జిలుకు చుండి." కాశీ. ౨, ఆ. ౫౩.
థూత్కృతము. సం. వి. అ. న.=థూత్కారము.
థూత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. థూత్కారము.

ద

ద. ఉభ. ఒకానొకయక్షరము. దే. రమ్ము అనుటకు వాడుసంకేతాక్షరము. "చ. కరము ల్సాఁచి కమిన్ 'ద, యింవ,' యని రాగం బొప్పఁగాఁ జేరఁదా,మరమోహమందలిరావిరేక తులకింపన్ జేరి...సారంగధరుండు ముద్దుగురియం బో తం డ్రి యుప్పొంగఁగన్." సా. ౧, ఆ. ౫౦.
దంగు. దే. అ. క్రి. బియ్యము మొదలగునవి నైత వుడు పోవునట్టు నలఁగు. (శ. ర. బ్రా.)
దంగుడు. దే. విణ. (దంగు. ధా.) ఉదా:-దంగుడు బియ్యము. (శ. ర. బ్రా.)
దంగుళ్లు. దే. వి. బ. చేబియ్యము,అక్షుణ్ణతండులములు. "సీ. అక్షుణ్ణతండులావ్యయము చేరుళ్లు నా దంగుళ్లు నాఁగను దనరుచుండు." ఆం. భా. ద్వి. ౨౮౮. పార్వ. ౨, ఆ. ౨౩.
దంచేనము. దే. వి. (దీనికిఁ గొన్నియెడల వృత్తియందు మువర్ణలోపము. 1. పెద్దఘరంగి. (శ. ర.); 2. గుండ్లనుపయోగించుయంత్రము. "సీ. తగు శిలా యంత్రము దంచన మనఁగను..." ఆం. భా. ద్వి. ౨౧౦. హరి. ఉ. ౨, ఆ. ౧౬.
దంచు. దే. స. క్రి. (దంగు. ధా. ప్రే.) 1. దంగఁ జేయు,ధాన్యాదులను పొట్టుపోవునట్లుగా నలఁ గఁజేయు. "చ. వాలమున వచ్చుధాన్యముల నప్పటివప్పుడు దంచుకొఁగ రోఁకలిఁ గయి కొంటి..." దశా. ౮, ఆ. ౫౬; 2. ధ్వంసము చేయు. "స్రగ్ధర...విఘట్టించి దంచెన్,ద్రుంచెన్ ...కరిసురప్రత్యనీకుండు హేలా,సంచారోద గ్రభంగిన్ జలముగొని వనసౌధవప్రాట్టవీథుల్." కాశీ. ౬, ఆ. ౧౭౬; 3. నలఁగఁద్రొక్కు. "క. దంచున్ జరణాంచలములఁ, గించుఁదనం బంచు మఁదలకించున్ ముంచున్,మెంచున్ విదళన చుంచూ,చంచచ్చంచూపుటస్ఫుటాఘాతములన్." రామా. ౫, ఆ. ౧౯౮; 4. నలిపుఁజేయు,పోఁ గొట్టు. "ఉ దంచె నకం ద నేఁబనసంబులఁ జేసిన

పాతగోఘముల్." కాశీ, ౨, ఆ. ౧౦౮. దా. స. ౬౦.

దంట. యు. దే. వి. జంట, కవ, ద్వయము. "సీ.... దోయి బోదు,జంట జమిలికవ దంట యమడ యన ద్వంద్వమై పరగును .." ఆం. భా. ద్వి. ౭౧౦. "గీ. ప్రోవవే యని దైన్యంబు భూని విప్రు,డింతి వెనువెంట దంటగా నేగ దొడఁగె." సురా. ౫౭. విశే. జంటయైనది. "గీ. కలదు నాపాద మస్తకాంగములయందు, మించి కటిలీలఁ దరళితో దంచితమగు,యుఁ పతిలావణ్యము ను గన్నుఁగవయుం నతను,దంటమీఁలదెక్కియ మనఁ దనరుఁ జూడ" ప్ర భా. ౨, ఆ. ౬౨. వై. విశే. (సం. ధృష్టః.) 1. సమర్థుఁడు,సిట్టతనము గలవాఁడు. "సీ.మాయా మృగమువెంట మగఁడు పోవఁగ దంటమఱంది నంపిననాఁటిమొండితనము." కృ. శకుం. పీఠి. ౫౦. ఆం. భా. తృ. 3; 2. ధూర్తురాలు. "శా. ఏ కాలి న్నినువంటిదంట గలదే యిద్ధాత్రిలో నంచు వి, భ్రాజన్నాభధురంధరుండు నృపుఁ డుగ్రవ్యగ్రరో షాత్ముఁడై." శుక. ౧, ఆ. 3౧౨; 3. ప్రౌఢ. "గీ. తెరయుచాళితిబంధంబుటరిదిపటము,లగరు సాంబ్రాణిధూపంబు పొగలునూఁడి,గమ్ము లొనరించుఁ ల్పొమ్మగమియుఁ గల్గి,వెలయఁపడకింట నాదంట కిభునిజాట." శశా. 3, ఆ. ౧౦౩.

దంటగొను. దే. అ. క్రి. (దంట+కొను.) కవియు, మిళితమగు. "గీ. దైత్యుమెఱుఁగుఁదూపులు దళిత ములుసేయఁ,దత్తనూజచూపులు ఫలితములుచేయఁ, నుడుటుఁదనమును పలపుకొండొంటితోడ,దంట గొని క్రమ్మ కొమ్మయిఁ దాల్చె నతఁడు" ప్ర భా. ౪, ఆ. ౭౯.

దంటతనము. ద్వి. వి. (దంట +తనము.) 1. సామర్థ్యము. "ఉ. వింటిరె కృష్ణరాయపృథివీపతి యచ్చట కార్యలీలచేఁ,గంటకు లౌదురుష్కులఁ గకావికలై చనఁజేసె కొంతయుఁ,దంటతనంబు మీఱ..." కృష్ణ. 3, ఆ. ౭౦. భా. రా. యు. ౧౪3౦; 2. ధార్ష్ట్యము. "గీ. రమ్ము నావెంటఁ గొంతదూరమున నుండి, దంటతనమున నను వెన్నంటి చూడు,నీవుఁ గైకొన్కఁ జేసెద నేఁడు దానిఁ,దత్తనూజాలకంఠరక్తంబుఁ గ్రోలు." శుక. 3, ఆ. ౭౭౯. చూ. ౭౭౭.); 3. ధార్ష్ట్యము, గర్వ్యాళితనము. "క. తొలతొలఁగు తొలఁగు మనుచుల్,దలతలతల మనుచు పట్టిదంటతనంబుల్, వలదు వల దనుచుఁ బల్కఁగఁ,గలకంఠుల కపుడు మిగులఁ గలహము మునుఁగన్." రాజ. చ. 3, ఆ. ౪౫. సమీర ౬, ఆ. ౧౬౫.

దంటపడు. ద్వి. అ. క్రి. (దంట+పడు.) దంటగొను. (బ్రా.)

దంటపోరు. దే. వి. (దంట+పోరు) ద్వంద్వయుద్ధము. "సీ. దంటపోరఁ దగు ద్వంద్వయుద్ధము..." ఆం. భా. ద్వి. ౭౭౯.

దంటమోములదేవర. ద్వి. వి అగ్ని. "గీ. దంటమోములదేవర దనివిదీఱ, బుగులుకొని మెక్కఁ దద్ద యబ్బురము గాఁగ." అచ్చ. యు. ౭౮౦. ఇట్టే. దంటమోములసామి మొ.

దంటు. వై. వి. (సం. దండః. క. దంటు.) 1. కొన్నలోనగువానికాడ. "వ ..విషవిస్ఫురద్భుజంగములనల్లదిక్ గబళించి గొంటకుండ దంటు చప్పరించు గతిం జప్పరించుచు .." స్వా. ౪, ఆ. 3౭. ఆం. భా. ద్వి. ౭౭; 2. పూలి,అల్పతృణము. (చూ. దంటుకొను., సా: చొప్పదంటుప్రశ్న = అర్థములేని ప్రశ్న.

దంటుకొను. ద్వి. అ. క్రి. (దంటు+కొను.) పూరి కఱచు. "సీ. చేఁబల్మి చేఁ గ్రమ్మి చిమ్మివైతుము గదా నోరు దంటుకొనంగ నీఁటె మొనల." కృష్ణ. 3, ఆ. ౧౮.

దండ. యు. దే. వి. 1. సమీపము, దగ్గఱ. "ఉ... తాంబూలము తావి బుగ్గురని ముంచుకొనం జెవి దండఁ బల్కెనన్" కళా. ౪, ఆ. ౧౦౯, యు. 3, ఆ. ౧౬; 2. ప్రాపు,ఆధారము. "ఉ. కోరికల కసింహాసనముల్ మఱి సింహమె కాక దండపెం,పారఁగ జంబుకం బగునె యబ్ధిపరీత వసుంధరణీ, భారము బూని కీర్తిరమ బాయని యాతని కొందుఁ బ్రాపు కా,శిరమునందు దేవగణసేవ్యుఁడు శంభుఁడు గాక మర్త్యుఁడే." హరిశ్చ. ౪, ఆ. ౯౭, చంద్రా. ౨, ఆ. ౪౫; 3. స్థానము, చోటు. "గీ. విపుల సుకృతములకుదండ వెండి కొండ. భాగ. ౪, స్కం. ౧3౪; 4 వైపు, పార్శ్వము. "సీ వెనుదండ నడ్డండ పేదండ కొండలముల్ సమనమందరయానసరణి నడప." దశా. ౨, ఆ. ౧౯, భాగ. ౧, స్కం. ౪౫3; 5. అండు, సత్తమిబిభక్త్యర్థకము. "క. ఆవంత జడలపండను,

లేదాఁడు కొలంకఁ గోరిన .." వి. పు ౧, ఆ. ౧౩౬, చం. రా. ౭, ఆ. ౬౧; 6. ఎద్దుముడ్డిమీఁద ముల్లుఁగోలతోఁ బొడువఁగా నేర్పడుబొరుసు. (శ. ర.)
దై. వి. (సం. దండికా.) హారము, మాల. "గీ. ఇప్పుడూదండఁ గైకొని చెలిమి నేర్తు." పార. ౪, ఆ. ౪౦, వి పు. ౧, ఆ. ౧౩౬. (సం. దండః. క. దండె. త. దండై.) 1. బాహువు. "గీ. అలివదన్నులు చక్కని లగుట కేమి నందియము బిగి దండలచాయ నిగిడి,చెక్కులై యుండ పొంపునఁ జెక్కుటిల్లి, వలిపెపయ్యెద యమచిన్ని వలచు దగుల" య ౪, ఆ. ౪౪, శుక. ౨, ఆ. ౪౫౩; 2. మల్లవిసాధనము. 'సీ. తగినట్టిమాష్టిని దండపోల్కి మెఱుంగు మెఱుఁగుకైవడి బిస మీటినగటి." ప్రబంధ. ౧౪౧; 3. కైదండ, హస్తావలంబనము. "గీ. తమ్మికేలుందఁ బెఱకేల దండయిచ్చు, వేము లడిపెదుకేఁ జాపులేమ తోఁద" ఆము. ౧, ఆ. ౧౭; 4. భుజబలము "గీ. దండ గల్గినబుద్ధిమంతుండు దనకు,బలిమికలిమియుఁ గొనసాగవలెనె నెనిశత్రువ్రజముణాఁడఁ జిచ్చు రెచ్చరికతోఁడఁ, గడమవెట్టక కడముట్ట నడప వలయు." ప్రబోధ ౫, ఆ. ౪; 5. ముష్టి యుద్ధాదిమగతి; మల్లయుద్ధవిశేషము. "వ .. పాదలికదండ యడుగడుగుపాదలికదండ మప్రైశ నుచు కుక్కుటపుదండ మొదలుగాఁ గలవిరెండు దండలును .." ప్రబంధ. ౪౫, ఆ. భా. ద్వి. ౨౦౫.

దండక. సం. వి. ఆ. స్త్రీ. దండకారణ్యము.

దండకడియము. దై. వి. (దండ+కడియము) భుజవలయము, కేయూరము. "మ. పులితోల్కాసెల నంట దోపిన బెంబుల్ నాలిపూఁద పళ్ళెంబులు బల్పింగపుఁ జాంచు దండకడియంబుల్ ..." సా. ౧, ఆ. ౬౩.

దండకడెము = దండకడియము. "ద్వి. మొలనీలి కాసెలు మోటకత్తులును దలముట్ట బదనికదండక డెంబు." ద్వి. హరిశ్చ. పూ. ౫౬౫. ప.

దండకము. సం. వి. అ. పుం. న. ఒకానొకవృత్తము. (ఛందః); 2. అరణ్యవిశేషము; 3. దేశవిశేషము. విణ. (అ. డికా. అ.) దండించునది.

దండకవిలియ. ద్వ. వి. ప్రాఁతలెక్కల పుస్తకట్ట. (శ. ర)

దండకవిలె = దండకవిలియ. (గ్రా.)

దండగోల. ద్వ. వి. (దండ+కోల.) ఆధారము,ప్రాపు. "ఉ ..నీ పటుదండగోలగుచు నిల్చినఁ జాలు నగస్త్యమూర్తియై, యావృతకేతనం దరితుహీన బలాంబుధి నోరఁబట్టెదన్." కై. ౧, ఆ. ౧౦౦.

దండచేయి. ద్వ. వి. (దండ+చేయి.) సందిలి,ప్రకండము. "గీ. దండచేలాపు గలిగట్టి పండువెదురు, తండముల..." చంద్రా. ౨, ఆ ౬౧.

దండచేరు. ద్వ. వి. (దండ+చేరు.) వీనుఁగు లుమన్నగువానిని వశముచేసికొనుటకై యుపయోగించుతోరము. 'సీ అలుగునేసుంగుకై యలుఁగుఁ బూనఁగ నేల యండనీదండచే రుండెనేని." చంద్రా. ౨, ఆ. ౪౩.

దండధరుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు; 2. యముఁడు. విణ. (అ. ఆ. అ.) 1. కఱ్ఱను దాల్చువాఁడు; 2. దండనము చేయువాఁడు.

దండన. సం. వి. అ. స్త్రీ. 1. దండించుట; 2. దండుగు విధించుట.

దండనము. సం. వి. అ. న. 1. దండించుట; 2. దండుగు విధించుట.

దండనాయకుఁడు. సం. వి. అ. పుం 1. సేనాధిపతి; 2. రాజు; 3. నేరస్థులకు శిక్ష విధించు అధికారి.

దండనిల్కడ. ద్వ. వి. మల్లయుద్ధములోని యొకానొక మెలఁకువ. "వ. దండనిల్కడ కదలుమటు కలయఁ మెలఁకువ... మొదలగు విత్తము లెఱింగి." ప్రబంధ. ౪౫.

దండనీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కామందకీయాద్యర్థ శాస్త్రము 2. శిక్షవిధించుట, న్యాయపాలనము.

దండనీయుఁడు. సం. విణ. (అ ఆ. అ.) దండింపఁ దగినవాఁడు.

దండపడు. ద్వ. అ. క్రి. 1. సమీపించు. (శ. ర.);2. ఎద్దుముడ్డిమీఁద ముల్లుకోలతోఁ బొడుచుట వలన బొరుసుగా నేర్పడు. (శ. ర.)

దండపాటు ద్వ. వి. (దండపడు. ధా.) సమీపించుట. "చ. బలములపాటు దాయతలపాటును జాలెదు దండపాటుకోల్తల గాఁడఁబాటు లెస్స యని లక్ష్మణుఁ డన్నయనఁగ్ఞ గాంచి .." రామా. ౪, ఆ. ౯౪.

దండపాణి. సం. వి. ఇ. పుం. 1. యముఁడు; 2. కాశీక్షేత్రమందలి యొకానొక దేవత.

దండపారుష్యము. సం. వి. అ. న. అతికఠినముగా దండించుట.

దండపాశికుఁడు. సం. వి. అ. పుం. చోరోపద్రవము లేకుండ పట్టణమును గాపాడెడియధికారి.

దండపెట్టు. మి. స. క్రి. ప్రహరించు,కొట్టు. "గీ. చూచినప్పుడె విలు పాణిపైచి సరస,తామరస భీమతరగదా దండ మెత్తి, దండహత్తి మనో జుండు దండపెట్టె, నమ్మహాదేవు నెమ్మది రిమ్మ కొదవ." శుక. ౨, ఆ. ౪౫౩.

దండప్రణామము. సం. వి. అ. పుం. సాష్టాంగనమస్కారము. భార. అను. ౨, ఆ. ౩౧౫.

దండము. ఉ. భ. దే. వి. నమస్కారము. "వ... శివా నీకు నవాంజలి భవా నీకు నభివాదనంబు పాండురంగా నీకు దండంబు .." భీమ. ౩, ఆ. ౨౧౧. ఆం. భా. ద్వి. ౧౪౫. సం. వి. అ. పుం. న. 1. కఱ్ఱ,లగుడము; 2. చెట్టుబోదె,ప్రకాండము; 3. వీణదండె; 4. కవ్వము,మంథనదండము; 5. దమనము,అడఁచుట; 6. దండించుట,రాజశిక్ష; 7. దండుగు,జరిమానా; 8. రాజు శత్రువుల యెడఁ బ్రయోగించు చతురుపాయములలో నొకటి (ఇది వధించుట, ధనముహరించుట, పీడించుట యని మూఁడువిధములు.); 9 సేన,దండు; 10. అడ్డముగాఁ దీర్చినవ్యూహము; 11. బార, ఒకానొకమానము; 12. అభిమానము, 13 దేహము; 14. మగగుఱి; 15. గుఱ్ఱము; 16. సమూహము; 17. ఘటిక,గడియ.

దండయత్. సం. శత్రు. దండించుచున్న.

దండయమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ) దండించుచున్నవాఁడు.

దండయాత్ర సం. వి. ఆ. స్త్రీ. 1. రాజాదులు శత్రువులపై దాడివెడలుట,యుద్ధయాత్ర; 2. పెండ్లియందలియూరేగింపు.

దండయిత. సం. విణ (ఋ. త్రి. ఋ.) దండించువాఁడు.

దండయితవ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దండింపఁదగినవాఁడు.

దండలాసకము. సం. వి. అ. పుం. నృత్యవిశేషము, కోలాటము. "సీ. కుండలీప్రేరణీదండలాసకముఖ్య నృత్యంబు లచ్చరల్ సలుపుచుండ." కవిరా. ౧, ఆ. ౧౯౪.

దండలాస్యము. సం. వి. అ. న. నాట్యభేదము. "సీ. జంభారిమ్రోల నచ్చరలట్లు గణికాంబుజాస్యలు దండలాస్యములు సలుప." ఉ. రా. ౩, ఆ. ౨౫౬.

దండవాది. సం. వి. న్. పుం. 1. దండనమును పలుకువాఁడు, ప్రాడ్వివాకుఁడు; 2. ద్వారపాలకుఁడు.

దండవాలధి. సం. వి ఇ. పుం. ఏనుఁగు.

దండవాహి. సం. వి. న్. పుం. తలారి, ఆరకుఁడు.

దండవిధి. సం. వి. ఇ. పుం. శిక్షాస్మృతి,దండనమును గుఱించి యేర్పఱచినశాసనము.

దండసిలు. దే. అ. క్రి. 1. ఇఱుకుకొను. "గీ. వెనుక ముందటిసమ్మర్దమునఁ గరంబు, దండసిలి మధ్యమున నున్నధరణివిభుఁడు." నైష. ౪, ఆ. ౧౨౫; 2. అణఁగు,అదుముడుపడు. "సీ. దండకూకాధీశు తలలు దండసిలంగఁ దాటించుచే కాలధర మహేశ." కాశీ. ౭, ఆ. ౭౯.

దండసిల్లు = దండసిలు. (ఇఱుకుకొను.) "చ. మగువ కుచద్వయంబునదుమం బసి రాయిడి దండసిల్లి..." నైష. ౩, ఆ. ౧౪౯.

దండహస్తుఁడు. సం. వి. అ. పుం. 1. ద్వారపాలుఁడు; 2. యముఁడు, 3. బ్రహ్మచారి; 4. సన్న్యాసి.

దండాట. ద్వ. వి. (దండ+ఆట.) డేగాట. (శ. ర)

దండాడించు ద్వ. స. క్రి (దండ+ఆడించు.) పెండ్లియైదవనాఁడు వధూవరుల నెత్తుకొని యాటాడించు (వా.)

దండాడింపు. ద్వ వి. (దండాడించు. ధా.) పెండ్లిలో నైదవనాఁడు వధూవరుల నెత్తుకొని ఆడెడుఆట, డేగాట. (బ్రా. వా.)

దండాదండి. సం. అవ్య. పరస్పరము దండములతోఁ గొట్టుకొనుచుఁ జేయుయుద్ధము.

దండారము. సం. వి. అ. పుం. 1. బండి మొదలగు వాహనము; 2. కుమ్మరిసారె; 3. మదపుటేనుఁగు; 4. విల్లు.

దండాసనము. సం. వి. అ. న. యోగాసనభేదము.

దండాహతము. సం. వి. అ న. మజ్జిగ,కాలశేయము.

దండి. ఉ. భ. దే. వి. 1. ప్రకాశము. "ఉ. చండకరాన్వయాంబునిధి చంద్రుఁడు భూరమణుండతండు దా,గుండియవాఁడు వేలుపులఁ గోటుల సంఖ్యల భూతధాత్రిపై, నుండఁగ నీక కాశిపురి నొక్కఁడు రాజ్యము సేయు టెట్టు లీ,దండికి మెచ్చినారము ప్రకాశహీనుఁడు భూమి

పాలుఁడే." కాశీ. ౫, అ ౩౦౦; 2. శౌర్యము, పరాక్రమము. "గీ. కదఁగి హస్తంబులను రెండు కడల నున్న రెండుకలలును వెనఁ బట్టి దండి మెఱయ, నడిమికర మెక్కి కడుఁ గఠినంబులైన, పాదఘట్టనములచేతఁ బగులఁ దన్ని." వి. పు. ౭, అ. ౧౬౫. సమీర. ౧, అ. ౬౧; 3. ధైర్యము. "వ...అవ్వేల్పు రాకొమరుండు .. మేకల్ల చెయ్యులఁ గొఱఁత దస్సినం గొండవడుపున దండి విడువఁడయ్యె..." అచ్చ. భా. ౪, అ. ౫౯. భా. రా. బాల. ౪౧౨; 4. విధము, రీతి. "సీ. కొట్టిపైచినకలల్ గట్టలై కాటుక కొండలదండిని మెండుచూడ." దశా ౬, అ. ౧౩౭. విణ. 1. ప్రతాపవంతుఁడు (శ. ర.); 2. పరాక్రమవంతుఁడు, శౌర్యవంతుఁడు. "గీ. తగునె యర్జున యీపెంటికనము నీకు, దండివై లెమ్ము మనకుఁ జేవటిమి కంచి" భార. భీష్మ. ౧, అ. ౧౯౨, అచ్చ. యు. ౩౭౩, 3. పూర్ణము. "ద్వి. వామనత్వము దాల్చి వచ్చి యధ్వరము, భూమి మూఁడడుగులు పొసఁగంగ నడిగి, రెండడుగులనే ధరిత్రియు దివియు, దండిగాఁ గొలిచి యాధన్యు బంధించి" ర. రా. బాల. ౩౦, పు; 4. గొప్ప, పెద్ద. "ఉ. దాఁటకమాన రిక్కడలి దాశరథుల్ తమదండిమూఁకతో." రామా. ౭, అ. ౭౬, హరి. ఉ. ౨, అ. ౩౨, సం. వి. న్. పుం. 1. సన్న్యాసి, భిక్షువు, 2. ద్వారపాలకుఁడు; 3. యముఁడు; 4. ఒకానొకసంస్కృతకవి, 5. దమనముని. విణ (న్. నీ న్.) 1. దండము గలవాఁడు; 2. దండించువాఁడు.

దండించు. సం. స. క్రి. శిక్షించు, దండన చేయు. "క. దండధర యిట్టిదారుణ, దండమునకు నేమి దుష్కృతము జేసితి నుగ్రుండ వయి తగనిదండము, దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే నన్నున్." భార. ఆది. ౪, అ. ౨౯౯, మార్క. ౩, అ. ౧౩౭.

దండింపించు. సం. స క్రి. (దండించు ధా. ప్రే.) శిక్షింపఁ జేయు. "వ . తప్పుఁజెప్పలేని భూపాలు సన్నిధిం బెట్టి నిజంబు దెలిపి దండింపింతు ననిన." కాశీ. ౪, అ. ౯౯.

దండిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దండము, కఱ్ఱ; 2. హారవిశేషము; 3. త్రాడు, రజ్జువు; 4. వాద్యభేదము.

దండితనము. దే. వి. (దండి+తనము - స్వార్థమున.) 1. శౌర్యము, పరాక్రమము. "ఉ. దండితనంబు నీయెడన తక్కొనె నాదన మైత్రి పెన్పు మిం, గొండొకమాట దక్కము రణోత్సవానం బొనరింపు గ్రక్కునన్." భార. విరా. ౪, అ. ౩౭, భార. భీష్మ. ౧, అ. ౩౭; 2. గొప్పతనము, ఆధిక్యము. "వ ..వేల్పుఁ జెట్టుపూదండల దండితనంబున మెండుకొని..." ఉ. రా. ౪ అ. ౧౬౩, ఉ. రా. ౪, అ, ౧౩౮. [వాఁడు.

దండితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) శిక్షింపఁబడినవాఁడు.

దండియ = దండె. (వీణ.) "గీ...పిడపఁ జేతిదండియ యటు వెట్టి .." హరి. ఉ. ౩, అ. ౩౩, నృసిం. ౧, అ. ౮౧. (శ. ర.)

దండియము. వై. వి. (సం. దండికా.) వస్త్రములు ఎండవేయుట మొదలగువానికై అడ్డముగా కట్టు కఱ్ఱ, మొ. "వ . పులుం గెఱింగి ..పాండురంగాయతనంబు మధ్యరంగంబుఁ జొచ్చి యచ్చట నిచ్చం దనయిచ్చ నుండు దండియంబు పైవ్రాలన్." పాండు. ౪, అ. ౪౩౭.

దండివాఁడు. దే. వి. (దండి+వాఁడు.) బలాఢ్యుఁడు. "సీ. బలుఁవిడి యనఁగను బల్లిదుం డనఁగను దండివాఁ డన బలాఢ్యుండు చెలఁగు." ఆం. భా. తృ. ౧౧.

దండు. యు. దే. స. క్రి. (ధనాదికమును.) సంపాదించు. "మ ..కానరే యీజపా, కలనాథంద్ర మునీంద్రు నంచుఁ బొగరెక్కన్ శక్రసామ్రాణిదంటలివన్, దాఁటుచుఁ దన్మనోధనము దండన్ దండ జేతేరఁగన్." చంద్రా. ౩, అ. ౯౮, వై. వి. (సం. దండః.) 1. సేన. "చ. పొలుపుగఁ జంద్రశేఖరుతపోవన మంగజచక్రవర్తిదో, ర్బలమున ముట్టి చూఱకొనఁ బంచిన దండొకొ నాఁగ..." కు. సం. ౩, అ. ౧౦౭, ఆం. భా. ద్వి. ౨౧౦; 2. సమూహము. "గీ. తాండవం బాడె మిన్నేటితరఁగదండు." హర. ౭, అ. ౮౦, అచ్చ. బాల. ౧౫౨; 3. దండయాత్ర. "వ...వారలు ప్రియంబునం బనిపూని వెడలి దండు సాటించి తగువారల కెల్ల జాటించిపుచ్చిన..." భార. ఉద్యో. ౪, అ. ౧౩౬, చం. రా. ౫, అ. ౩౪.

దండుఁడు. సం. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. రాజు; 3. సూర్యునిప్రక్క నుండువారిలో

నొకఁడు. (దండుఁడు, పింగళుఁడు, మాఠరుఁ డను వీరు ముగ్గురు. సూర్యుఁడు దైత్యులకు వర మీయకుండ చూచుటకు రుద్రాగ్ని యనుటలు క్రమ ముగా పంపుచుండువారమని లో వర్తింతురు.); 4. ఇక్ష్వాకుపుత్త్రుఁ డగుసూర్యవంశపురాజు.

దండుకదలు. ద్వ. అ. క్రి. (దండు+కదలు.) దాడి వెడలు, దండెత్తు. "సీ. గర్వించి సర్వసుసర్వ సామ్రాజ్యంబు గైకొందునని దండుకదలఁ దలఁచి." వరాహ. ౧౧, ఆ. ౧౨౨, కళా. ౭, ఆ. ౨౪౯.

దండుగ. వై. వి (సం. దండః.) 1. అధికారి అప రాధివలన అపరాధపరిహారముగా పుచ్చుకొను ధనము, జరిమానా. "గీ. దండు వన దండు గనఁ గను దండమునకుఁ, బలినిధిగఁ దీయఁనట్టి ద్రవ్యంబు పరఁగు .." ఆం. భా. ద్వి. ౨౯౦, శుక. ౨. ఆ. ౫౧౮; 2. రాజు ధనవంతుని బలాత్కారము చేసి పుచ్చుకొనుధనము. "ద్వి. కలవారిఁ గని దండుగలు వెట్టె నృపుఁడు" విష్ణు. పు. 3, ఆ. (శ. ర.); 3. నష్టము. వ్యవ-సా కావ్యవహార ములో దండుగ వచ్చినది.

దండుగయాసాము. దే. వి. (దండుగ+ఈనాము.) అనవసరముగా బాధించినదానికి ప్రతిఫలముగా నిచ్చుభూమి. (బ్రౌ. వా.)

దండుగు = దండుగ. (అపరాధపరిహారముగా పుచ్చు కొనుధనము,జరిమానా.) "క. కొంకక యేనూరు దండుగుం గొనవలయున్." విజ్ఞా. ప్రా. ౧౫౯.

దండుచేయు. ద్వ. అ. క్రి. (దండు+చేయు.) దండెత్తు,దాడిచేయు. "గీ. ఒక్కొకదినంబు శమ యింటియొద్దివారిఁ, దలఁచికొన్నట్టు డొదవుసం కాశధరము,పూనకుండుట యెట్లు భవానిపతియు, వానిఁ బూని ధరం దండుచేసెనేని." రా. వి. ౨, ఆ. ౯౯.

దండుడిగ్గు. ద్వ. అ. క్రి, (దండు+డిగ్గు.) సేనలతో గూడి బసచేయు. "చ....ఇల యెల్లను ముంచి రసాతలంబుపై, విడియఁగ దండుడిగ్గినపవిద్యు దురుస్తనయిత్నులో యనన్." ఆము. ౪,ఆ.౧౨౫.

దండుదారి = దండుబాట. (బ్రౌ.)

దండుదిగు = దండుడిగ్గు. "గీ. దండుదిగినాఁడు భండ నోద్దండుఁ డగుచు." దశా. ౫, ఆ. 3౯.

దండుదివియ. వై. వి. దీపపుసెమ్మె. (శ. ర.)

దండునడచు. ద్వ. అ. క్రి. (దండు+నడచు.) దాడి వెడలు, దండెత్తు. "ద్వి. కైకొని యింక నిక్ష్వాకు వల్లభుఁడు,సాకారికై దండునడచుచున్నాఁడు." రం. రా. కిష్కిం. ౨౧౯, పు. [(శ. ర. బ్రౌ.)

దండుబాట. వై. వి. (దండు+బాట.) ఘంటాపథము.

దండులంజె. వై. వి. (దండు+లంజె.) దండుతోఁ బోవువ్యభిచారిణి, బజారి "సీ...తగు బజారి యనంగ దండులంజె." ఆం. భా. ద్వి. ౧౨౭.

దండువ. వై. వి. (సం. దండః.) అపరాధపరిహార ముగా పుచ్చుకొనుధనము. "చ. వణిజులుం తప్పు చేసినను వారలఁ దండువఁ బెట్టఁ బంచి..." దశ. ౬. ఆ. ౧౧౧.

దండువచ్చు. ద్వ. అ. క్రి. (దండు+వచ్చు.) యుద్ధ మునకు వచ్చు. "ఉ. ఇంటికిఁ బొమ్ము క్రమ్మరఁ జెలీ నిలు నిన్నిలుచేర్చి వత్తునో,వెంటనె దండు వచ్చెనహా వేగమె రా మఱి యేల యందువో." రా. వి. ౨, ఆ. ౫౮.

దండువిడియు. ద్వ. అ. క్రి. (దండు+విడియు.) 1. సేనలతోఁ గూడి బసచేయు. "గీ. దండువిడిసె బలీంద్రుఁ డక్కొండదండ." దశా. ౨, ఆ. ౫౬. కువల. ౧, ఆ. 33; 2. దాడివెడలు,దండెత్తు. "గీ. జానకీనాథ యిటు లద్దశాననుండు, వి త్తవిభు వీటిపై దండువిడిసెనపుడు." ఉ. రా. 3, ఆ ౨.

దండువు. వై. వి. (సం. దండః.) అపరాధపరిహార ముగా పుచ్చుకొనుధనము. "క. కావఁ గొని పోయి యేమఱి, గోవుల దాఁ జెఱిచెనేని గొల్లఁడు పతి కిల్,గోవులవెల యరువం దగు,భూవరునకుఁ గొంత దండువును బెట్టఁ దగున్." విజ్ఞా. ప్రా. ౧౧. పి. శకుం. ౪, ఆ. ౧౭౫.

దండువెట్టు. ద్వ. స. క్రి. (దండు+పెట్టు.) దండించు, శిక్షించు. "ద్వి. పెద్దనాగయగారి వెడఁగుబచ్చి లివో,దసగణసింగయ్య దండువెట్టితివో." పండితా. మహిమ. 30౬. పు.

దండువెడలు. ద్వ. అ. క్రి. (దండు+వెడలు.) దాడి చేయు, దండెత్తు. "గీ...అలరువింటి, గొనయ మెక్కించి పలరాజు కినుక మీఱ, విరహిజనము లపై దండువెడలె నపుడు." పారి. ౨, ఆ. ౫౯, ఆము. ౪, ఆ. ౨౬3.

దండువోవు. ద్వ. అ. క్రి. (దండు+పోవు.) దం డెత్తు. "ఉ. పంచశరుండు పాంథజనులంథన

బంధురబుద్ధి దండువో, సెంచఁగ..." సమీర. ౧, ఆ. ౧౨౫, శుక. ౨, ఆ. ౨౦౮.

దండె. వై. వి. (సం. దండికా.) 1. కిన్నెర; 2. తంబుర. (శ. ర. బ్రా.) "వ...మృదంగంబు పాంగం బావజంబు దండె తాళంబు మురుమ కిన్నెర పన్నగాశి వీణె ముఖవీణె వాద్యగ్రోలు డోలు .." ఆము. ౪, ఆ. ౩౧౫; 3. పల్లకీబొంగు. "ద్వి. వల నొప్పు దండెల వజ్రాలమించు, దోలఁకాడుచున్న యాందోళిక లేవి." ద్వి. పారిజా. ఉ. ౨౨౭, కం. కళా. ౭, ఆ. ౧౪౪; 4. త్రాసుకోల, తక్కెడకఱ్ఱ. (శ. ర.), 5. వీణె. "వ...తంబురలు కిన్నెరలు రావణహస్తంబులు .. పిల్లఁగ్రోవులు దండెలు డక్కలు .." ప్రబంధ. ౬౦౫, 6. దండాకారముగా నుండువాద్యవిశేషము. "ఉ. మేళము ఘుమ్మనన్ శ్రుతిసమేతమునన్ జతగూర్చి మద్దెలల్, దాళము లావజంబులును దండెలు జంగులు నొక్కమ్రోఁతగా." శ్రీరం. మా. ౪, ఆ. ౧౫౩, 7. కడుగు నేల రాచుకొనకుండ మగ్గపుగుంత కెదుట అడ్డముగా పాఁతినకొయ్య. "సీ. పరిపరి తచ్చులు చవుకుండ యాండిక చీరె దప్పలు దండె సావెత్రోవి." హంస. ౨, ఆ. ౧౧, 8. వీకపుకడవమీఁద నడ్డముగా నుంచి కట్టెడు కొయ్య. (శ. ర.), 9. ఆయుధవిశేషము. "వ. భారతీదేవిముక్కు నడిమి గాలి పంధ్యంబు చేసి జముని పెడ దండె తగిల్చి యదిలియధరపల్లవంబు చక్కడంచి .." కాశీ. ౭, ఆ. ౯౫.

దండెత్తు. ద్వి. అ. క్రి. (దండు+ఎత్తు.) దాడిపెడలు, యుద్ధమునకుఁ బోవు. "మ. కనలోఁ బొంచ్చిన శాంకరజ్వరముపై దండెత్తఁ గల్పించె నద్దను జారాతి ప్రతిజ్వరంబు..." ఉ. హరి. ౬, ఆ. ౯౭, దశ. ౧౧, ఆ. ౧౧౯.

దండెపుఁబీటలు. వై. వి. బ. (దండెము+పీటలు.) గడబీల తగుల్చుటకు దండెకు నడుమ గ్రుచ్చిన రంధ్రము గలకొండుపీటలు. (శ. ర.)

దండెము. వై. వి. (సం. దండికా.) 1. వస్త్రము లెండవేయుటకు ముస్సగానికై అడ్డముగాఁ గట్టెడుకఱ్ఱ. మొ. "గీ. ఉదికినపుడుంగుడోవతు లంచినట్టి, దండె మాపాసనము కేయుండు మమర." హంస. ౧, ఆ. ౧౫౧; 2. గరిడిసాధనములలో నొకటి. "సీ. దండెము ల్దోసిటకండెము లంభుజాకాండమ్ములను సాసకత్తు లమర." కళాం. ౨, ఆ. ౧౬.

దండోరా హిం. వి. (డప్పువాయించుచుఁ జేయు.) ప్రకటనము. (బ్రా. వా.)

దండోరావేయు. హిం. స. క్రి. డప్పువాయించుచుఁ బ్రకటించు. (బ్రా. వా.)

దండ్యమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దండింపఁబడుచున్నవాఁడు.

దండ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దండింపఁదగినవాఁడు, 2. దండింపసాధ్యమగువాఁడు.

దంతకము. సం. వి. అ. పుం. 1. పల్లు; 2. కొండకొన.

దంతకాష్ఠము. సం. వి. అ. న. పలుదోముపుడక.

దంతక్షతము. సం. వి. అ. పుం. పలునొక్కు, కొఱుకుటవలనిగాయము.

దంతచ్ఛదము. సం. వి అ. పుం ఓష్ఠము, పెదవి.

దంతధావనము సం. వి. అ. న. 1. పలుదోముట, 2. పలుదోముపుడక. పుం. 1. పొగడచెట్టు; 2. చంద్రచెట్టు.

దంతపుష్పము. సం. వి. అ. న. 1. కుంకుమ, మొల్లచెట్టు; 2. ఇందుగుచెట్టు.

దంతబీజము. సం. వి. అ. పుం. దానిమ్మచెట్టు.

దంతభాగము. సం. వి. అ. పుం. ఏనుఁగుదేహమున ముందటిభాగము.

దంతము. సం. వి. అ. పుం. 1. పల్లు, దశనము; 2. ఏనుఁగుదంతము, 3. కొండనడిమిప్రదేశము; 4. పొదరిల్లు.

దంతమూలీయము. సం. వి. అ. పుం. దంత్యాక్షరము. (ఌ. త. థ. ద. ధ. న ల. స. అను వర్ణములు.)

దంతపల్కము. సం వి. అ. న. కుంటెయిగురు, పలుకుదురు.

దంతవేష్టము. సం. వి. అ. పుం. 1. పలుకుదురు; 2. ఏనుఁగు దంతమునకు వేయుపొన్ను; 3. పలుఁగుఱుపు.

దంతశఠ. సం. వి. అ. స్త్రీ. పులిచింత, చాంగేరిచెట్టు.

దంతశఠము. సం. వి. అ. పుం. 1. నిమ్మ, జంబీరముచెట్టు; 2. వెలఁగ, కపిత్థముచెట్టు; 3. నారింజ, నారంగముచెట్టు; 4. చింత, అమ్లముచెట్టు; 5. పుల్లన.

దంతాదంతి. సం. అవ్య. ఒండొరులు పండ్లతో కఱచుచు చేయుయుద్ధము.

దంతాయుధము. సం. వి. అ. పుం. పంది, సూకరము.

దంతాలయము. సం. వి. అ. న. నోరు.

దంతావళము. సం. వి. అ. పుం. ప్రశస్తమైనదంతములు కలది - ఏనుఁగు.

దంతి. స. వి. న్. పుం. 1. ఏనుఁగు; 2. కొండ. స. స్త్రీ; వృక్షవిశేషము, జాంబవతి యను చెట్టు. శ్రీ. కాంస. ౪, అ. ౯, విణ. (న్. నీ. న్.) దంతములు కలది.

దంతియ. = దంతె; (శ. ర.)

దంతురము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిట్టపల్లమైనది, నిమ్నోన్నతము; 2. మిట్టపండ్లు కలది.

దంతురితము. సం. విణ. (అ. ఆ. అ.) నిమ్నోన్నతముగాఁ జేయఁబడినది.

దంతె. వై. వి. (సం. దండకః.) 1. మిద్దెటింటి కడ్డముగా వేసెడుపట్టె. "మ. దలమా నీలపుఁగాల దూలములపైఁ దార్కొన్నసున్నంపుఁబం, తెలఁ దాపించినకెంపుటిట్టికలసందిం బొంది రా వజ్రగా,రెలఁ జెన్నొనొకగట్టిచప్పరములోఁ జేరాచరాతిన్నెపైన్." ఏకా. ౪, అ ౪౯; 2. స్తంభము మీఁదిపీఁట. "సీ. పటికంపుగుండుఁగంబము తళతళరుచుల్ దరిఁ జేర్చుదంతంపుదంతెలు .." రా. వి. ౫, ఆ. ౧౫; 3. నేల చదునుచేసెడు అచ్చుకట్టు, కృషిసాధనవిశేషము. "సీ. గుంటకనాఁగను గొఱ్ఱు నా దంతె నా పాఁపట మనఁగను బరఁగును గృషి, సాధనభేదము..." ఆం. భా. ద్వి. ౨౩౩. (సం దంతీ.) వృక్షవిశేషము. "గీ...దంతె యనంగను దంతిమచున." ఆం. భా. ద్వి. ౬౦. [౪౧౧. (బ్రౌ.)

దంతెనము. వై. వి పెద్దదూలము. వి. పు. ౭౦, అ.

దంత్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దంతమునందు పుట్టినది. (వర్ణాది.); 2 దంతములకు హితమైనది. (దంతచూర్ణాది.)

దండడి. దే. వి. (క. దంవళి.) దొమ్మి, సంకులసమరము. "సీ. అలరు దండడి దొమ్మి యన సంకులరణాఖ్య..."ఆం. భా. ద్వి. ౭౨; 2. సాంద్రత, ఆధిక్యము. "మ వడినక్షేత్రచయంబులం దొరఁగు దుర్వారోద్యతాసారముల్, ఏడగండ్లుం బెరయంగఁ దీవ్రవిసరద్వాతూలముల్ గూడి దండడి దోడ్తోడ ప్రవృద్ధిఁబొంద బలువై..." హరి. పూ. ౭, అ. ౧౬౪. భార. విరా. ౨, అ. ౬౦; 3. సమ్మర్దము, రాపుడు. "చ. గిరిపుహారస్థితంబులగుకేసరులుర్వి పడిఁ జేర్చునప్పుడో,ధరకటుగర్జలం దలఁకి దండడి నున్నవి యున్నచోన యెచ్చెరువుగ గండియ ల్వాగిలి చేష్టిత మేమియుం లేక యుండె .." హరి. పూ. ౭, అ. ౧౭౦. విణ. అధికము; తఱచైనది. "సీ. కడఁగి ధర్మము తోడ నడచుచు నే మిట్లు దండడిదుఃఖంబుఁ బొందుటయుంచు, నేపున నెప్పుడు పాపంబు చేయుచు ధృతరాష్ట్రజులుసుఖోన్నతు లగుటకుం." భార. అర. ౪, అ. ౧౬౯. క్రి. విణ. ద్రు. 1. అధికముగా. "క. శిరము లలాటంబును గంధరమును బాహువులు నురము దండడి వ్రయ్యన్." భార. విరా. ౫, అ. ౧౦౭. హర. ౭, అ. ౪౫, 2. శీఘ్రముగా. "ద్వి ..ప్రాణాలు రెండును, దండడిఁదాఁకుచు" పల్నా ౯౯, పు. (బ్రౌ.)

దండడించు. దే. అ. క్రి. 1. అధికమగు, సాంద్రమగు. "సీ. తలఁపులసందడి దండడించిన శాల్మిశిదలుశిరఃకంపగతుల బెరయ. 'భార. అర. ౭, అ. ౨౦. శై. ౧, అ. ౭౩; 2. కలఁగు. "ఉ. ఝల్లన గుండె తల్లడిలి చానరో యల్లద తెల్లవారెనా, యుల్లము దండడింపఁ గుకురోయని కూయఁగఁ జొచ్చెఁ గోళ్లు .." అహ. ౫, అ. ౧౨౨.

దండడిపడు. ద్వి. అ. క్రి. (దండడి+పడు ) కలఁతనొందు. "క ..అతనిఁ గనినంతనె నా,డెందము గబీలు మనియెన్, దండడిపడువానిదీనదశ యేమందున్." అహ. 3, అ. ౧.

దండడిపెట్టు. దే. స క్రి. (దండడి+పెట్టు.) సమ్మర్దము కలిగించు, రాయిడిపెట్టు. "ఉ. ముందర రాజుఁ బుచ్చి బలముల్ గలయంబడి గోవ్రజంబులన్, దండడిపెట్టకుండ విరుదల్ నడిపింపఁగఁ బంచి .." భార. విరా. ౪, అ. ౧౧౪.

దండన. వై. వి. మాయ; జాలము. (శ. ర. బ్రౌ.)

దండనకత్తియ. వై. విణ. (దండన+కత్తియ.) మాయ చేయునది. (శ. ర )

దండనకాడు. ద్వి. విణ. దండన+కాఁడు.) మాయ చేయువాఁడు. (శ. ర.)

దండనచేయు. ద్వి. స. క్రి. (దండన+చేయు.) వంచించు, మోసగించు. "క....కొంపలుపుం గూరలొసఁగి కొండలు కదళీ, దండనచేయుచు గెంటుచుఁ, గొండలఁ దిట్టుచును వెళ్లఁగొట్టుచుఁ గడకన్." చంద్ర. వి. ౧, అ. ౭౦.

దళనము. సం. వి. అ. న. భేదించుట. విణ. (అ. ఈ. ఆ.) భేదించుటకు సాధనమైనది.

దళము. ఈథ. యు. దే. వి. 1. ఆధిక్యము. "సీ. దశకంఠుండు పేడిమి దళము చూపఁగ లేఁడు వద్ధబంధుఁడు దపింపఁగ వెఱఁడు." భా. రా. యు. ౧౫౭౯. విద్యా. ప్రా. ౩౭; 2. సమూహము. (చూ. దళముకొను.) విణ. 1. అధికము. "చ. బిలముఖమంక్తి సిద్ధరణిభృత్పతి వారిధి నిర్భరభ్రమిన్, దళముగ ముస్సు ద్రావిపసుధారసధారగుణంబునం జామి..." స్వా. ౫, అ. ౫౧. శుక. 3, అ. ౨౫౧; 2. సాంద్రము, నిబిడము. "ఉ...ధరాపరాగముల్, దప్పటమైన చీకటి దళంబయి చూడ్కులు గప్పు..." భా. రా. యు. ౬౫౨; 3. పూర్ణము, సమృద్ధము. "గీ. అతనికై ధార వోసితిఁ బ్రాణ మెల్ల, నట్టిప్రాణేశ్వరునితోడ నలిగియుంటిఁ, జేయఁగల దేమియో యమ్మచెల్ల నాకు, దళముగాఁ జాల వోయమ్మ దైవబలము." గంధ. ౧౧౨. ఆము. 3, అ. ౧౧. వై. వి. (సం. దళః. క. దళవు.) సేన. (చూ. దళవాయి. మొ.) సం. వి. అ. పుం. న. 1. భాగము, పాలు; 2. సగము, అర్ధము; 3. ఖండము, తునుక; 4. భేదించుట, విదళనము; 5. ఆకు; పత్త్రము; 6 పుష్ప దళము, ఱేకు; 7. సైన్యము. "మ...ఆత్మమూల బలముల్ జాఱ దళాడంబరం, బఱుగన్..." వసు. ౧, అ. ౪౫. ఉ. హరిశ్చం. 3, అ. ౧3.

దళముకొను. దే. అ. క్రి. (దళము+కొను.) 1. అధికమగు. "గీ. దర్శనప్రీతి వారిపైఁదగులు మీఱ, వలనియర్కిలిమనమున దళముకొనఁగ." భార. అను ౨, అ. ౨౮3. ఉ. రా. ౫, అ. ౫౧; 2. గుమిగూడు. "గీ. లలితకలకంఠకోలాహలంబు లెసఁగ, దళముకొని రెండుగెడలఁ గాదంబకోటి, గొల్వ రాచిల్కపాంథ జీగుట్టమెక్కి, దర్పకుఁడు పాంథజనులపై దండువెడలె." ఉ. రా. ౪, అ. ౧౫౬.

దళముకొలుపు. దే. స. క్రి. (దళముకొను. ధా. ప్రే.) 1. అధికముచేయు, హెచ్చించు. "గీ. తనపెదవి పాంథ్యరాగంబు దళముకొలుప." ఉ. రా. ౫, అ. ౧౫౪; 2. సాంద్రమొనర్చు, దట్టముచేయు. "సీ. బరువుసొబ్బాయి(?) తతరిరంభణంబునఁ దనువల్లిఁ బులకలు దళముకొలుప." విక్ర. ౪, అ. ౨౨3; 3. నిండించు, పూరించు. "గీ. నవవిధం బైనహరి భక్తి నలువుమెఱసి, దళదళలఁ గీర్తినన్భూర్తి(?) దళముకొలిపి." పరమ. 3, అ. 3౪.

దళమెక్కు. దే. అ. క్రి. (దళము+ఎక్కు.) దళసరి కలుగు. "సీ...దళమెక్కుపసనడెందొలలతోడ." ఆము. ౨, అ. ౭3. దళ. ౯. అ, ౯.

దళపతి. యు. దే. వి. (దళము+పతి.) ధాన్యవిశేషము. (బ్రా.) వై. వి. సేనాధిపతి. (శ. ర.)

దళవాయి. వై. వి. (దళము+వాయి.) 1. సేనాధిపతి. "ఉ. వాలుగడాలువానిదళవాయి వసంతుఁడు చైత్రయాత్రకై..." శశాం. ౨, అ. ౧౧౨. వై. ౮, అ. ౧౬; 2. సంకరికి సహాయుఁడై దైవయుండౌద్యోగి. (శ. ర.)

దళసంచు. దే. వి. (దళము+సంచు.) దళముజాతి. (శ. ర.)

దళసరి. ద్వ. వి. (దళము+సరి.) గొప్పతనము. "వ...నందయగోపాదులైన గోపగోపికాజనంబులు హరి దళసరి యెఱుంగక..." భాగ. ౧౦, స్కం. పూ. ౬౪3. విణ. 1 సాంద్రము, పలుచనకానిది. "దగడ. కడుదళసరి కర్పూరము హస్తయుగముల చాల్పుచు." చమ. ౧, అ. ౬౭; 2. కఱచు. (వ్యవ.) అబట్టనేత దళసరిగా నున్నది.

దళాఢకము. సం. వి. అ. పుం. 1. తనంతటఁ బుట్టిన నువ్వుచెట్టు; 2. నాచు, పృశ్నిణి(?); 3. గైరికము; 4. నురుఁగు; 5. అగద్ర, కందకము(?); 6. నాగకేసరముణి(?); 7. మొల్ల, కుందము, 8. దిరిసెనము, శిరీషము; 9. సుడిగాలి; 10. ఏనుఁగుచెవి.

దళారున. దే. విణ. హఠాత్తుగా, అకస్మికముగా. "ఉ...వ్రాల్గంటిమెఱుంగుఁజూపులు దళారున వచ్చె మహాద్భుతంబు గాన్." కువల. ౨, అ. ౯౧.

దళించు. సం. స. క్రి. 1. విఱుచు. "సీ. భువనాధికుఁడవైన కవిరతోద్ధతి... దళించిన బాహుబలమె సాక్షి." ఉ. రా. ౧, అ. ౧౫౧; 2. చేల్చు. "కు ..శౌరిచే, సింగిణివింట వెల్లిగొను చిత్రశరంబులు నూతు నొంచిర,ధ్యాంగకము ల్దళించుచు నిజావయవంబులఁ దూల్చు ..."పారి. ౫, అ. ౧౬; 3. వఱకు, తునుకలుచేయు. "గీ. మునలముల మోది కరవాలముల దళించి." కవిక. ౨, అ. ౧౫౪.

దళింపఁబడు. ద్వ. స. క్రి. (దళింపన్+పడు.) ఖండింపఁబడు, త్రెంపఁబడు. "మ...దళింపంబడియెం

దళ్రగ్రహిత గాత్రో త్పల్లకాళిక్యమున్." పాండు. ౨, ఆ. ౧౦౩.

**దళితము.** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఖండింపఁబడినది; 2. వికసించినది; 3. ఇటునటు చిమ్మఁబడినది; 4. భగముగాఁ జేయఁబడినది, అర్ధీకృతము.

**దళియించు.** సం. స. క్రి. వేయు, కొట్టు. "క. బలుఁడు రథంబును దురగంబులఁ గాకుఁడు సూతునముచి భూరిశరములన్, దళియించి యింద్రుసంగరములు సించిరి మించి యతఁడు మూర్ఛ మునుఁగన్." దశా. ౨, ఆ. ౪౨౯

దా

**దా.** దే. విశే. (దాపలయొక్క లుప్తరూపము ఈ. ఇది సమాసపూర్వపదముగానే ప్రయోగింపఁబడును.) ఎడమ, సవ్యము. ఉదా: దాకాలు. మొ.

**దాండము.** సం. వి. అ. న. 1. కఱ్ఱల మోపు; 2 ఆయుధవిశేషసంఘము. విశే. (అ. ఈ. అ.) దండము నకు సంబంధించినది.

**దాంతము.** సం. వి. అ. పుం దమనము ఈ. విశే (అ. ఈ. అ.) 1. అణఁచఁబడినది; 2. బహిరింద్రియముల నిగ్రహించినది; 3. క్లేశాదులను సహించినది. (అ. ఈ. అ.) దంతములకు సంబంధించినది

**దాంతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. బ్రహ్మచర్యాదితపఃక్లేశము నోర్చుట; 2. కర్మేంద్రియనిగ్రహము.

**దాంపత్యము.** సం. వి అ. న. భార్యాభర్తృభావము.

**దాంభికము.** సం. వి అ. పుం. కొంగ, బకము.

**దాంభికుఁడు.** స. విశే. (అ. ఈ. అ) దంభము గలవాఁడు.

**దాఁక.** దే. అవ్య. క్రి. ఎంతవఱకు, పర్యంతము. "ఉ. తేపుట భీమలింగముగుఱించి జపం బొనరించి నిచ్చలుఁ, మాపటిదాఁకఁ దీర్థముల మజ్జనమాడుచు నుండువాని..." భీమ. ౨, ఆ. ౯౧, నీలా. ౨, ఆ. ౫౨.

**దాఁకొను.** దే అ. క్రి. (దాఁగు+కొను-స్వార్థమున.) మఱఁగుపడు, కనఁబడకుండు. "ఉ. మించిన యూపులేనుఁగులమీఁదికిఁ జంగున దాఁటి యాదలన్, చించినగోళ్లలోఁ దవిలి చిందినముత్తెము లెల్లఁ జట్టుపై, ముంచునఁ జేరి దాఁకొనిన మాటికి నమ్ముఁ ద్రవ్యత్రవ్వ యుచ్చెంచు కొలంత లేఱుదురు సింగపుఁబాద లెంతెంగి యచ్చటన్." యు. ౨, ఆ. ౩౭.

**దాఁగనమ్రుచ్చులు.** దే. వి. బ. దాఁగిలిమూఁతలు.(శ.ర.)

**దాఁగర.** దే. వి. వరుగులు మొదలగునవి ఎండఁబెట్టు తట్టుప్రదేశము. "గీ. వరుగులో దాఁగరయు కొండవలసినట్లు." ఉ. హరి. ౪, ఆ. ౫౪, శుస్న. ౨, ఆ. ౨౦౪.

**దాఁగిలిమూఁతలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము, గుప్తక్రీడ. (శ. ర) "ఉ. దాఁగిలిమూఁతలాడు తఱిఁ దానొకకొంజెగురాకుజేఁబులేఁ, దీఁగపొదన్నిల కన్నమఱి తెచ్చెద నంచు..." పార్వ. ౨, ఆ. ౨౦, అని. ౩, ఆ. ౬౭.

**దాఁగిలిమ్రుచ్చులు.** దే. వి. బ. బాల్యక్రీడావిశేషము, దాఁగిరిమూఁతలు. "ఉ. చేతులు వ్రేసి పాతియుంను శెప్పెర దాఁగిలిమ్రుచ్చు లాడితిమున్." వి పు. ౭, ఆ. ౨౯౯, వి. పు. ౨, ఆ. ౨౦౨.

**దాఁగిలు.** దే. అ. క్రి. దాఁగు, కనఁబడకుండు. "క. బలవంతుతోడఁ బగయును, బలహీనునితోడఁ జేయు బాధుకత్వము దాఁగిలి ధన మిచ్చియు నూరక, కలహమునకుఁ గాలు ద్రవ్వఁగా రాదు సుమీ." వి. పు. ౪, ఆ. ౨౪౩.

**దాఁగు.** దే. అ. క్రి. మఱుఁగుపడు, తిరోహితమగు. "ఉ...కల్ల తెల్వితో, కేవలవంత దాఁగఁ జరియించిన డాఁగమిఁ జూచి కొవ్వగన్." ఆము. ౫, ఆ. ౧౫౫.

**దాఁగుడుమూఁతలు.** దే. వి. బ. దాఁగిలిమూఁతలు, బాల్యక్రీడావిశేషము. "సీ. పైఁడిమెట్టిక లెక్కపై రేఁగి చేఁతగట్టాడు దాఁగుడుమూఁత లాడియాడి." య. ౩, ఆ. ౫౫

**దాఁగురించు.** దే. స. క్రి. 1. దాఁచు; 2. వంచించు. (శ. ర.)

**దాఁగురింత.** దే. వి. (దాఁగురించు. ధా.) దాఁగురించుట. (శ ర) వి. బ. దాఁగురుమూఁతలు. "చ...దాఁగురింతలన్, గలకలనవ్వుచుం జెలఁగు కల్లరి వేలుపుసామిఁ గొల్చెదన్." అచ్చ. భా. ౧, ఆ. ౧.

**దాఁగురుమూఁతలు.** దే. వి. బ. దాఁగిలిమూఁతలు. (శ. ర.)

**దాఁగురుమ్రుచ్చులు.** దే. వి. బ. దాఁగిలిమూఁతలు. "వ...కదిసి విశంకటకోటరపుటీరంబుల దాఁగురుమ్రుచ్చులాడు కిన్నరకన్యకల..." వరాహ. ౧౨, ఆ. ౪౫.

దాఁచు. దే. స. క్రి. (దాఁగు ధా. ప్రే.) 1. మఱుఁగు పఱచు, కనఁబడకుండఁజేయు. "చ...మృద్ధన కరరాజ్యసంపదలు దాఁచక సర్వము నీకు నిచ్చి తిన్." హరిశ్చ. 3, ఆ. ౨౦, వరాహ. ౯, ఆ. ౪౫; 2. పదిలపఱచు, భద్రముగానుంచు. "ఉ... రెండుకండ్లు నీవప్పరమేశుచేఁ బడసి యందొకఁ డిచ్చి యొకండు దాఁచుకో,నిప్పుడు కాన వచ్చెఁ జనునే యిటు వాచవకేయ..." విక్ర. 3, ఆ. ౨౧

దాఁటడుగుపరువడి. దే. వి. మల్లబంధవిశేషము. "వ. ఎడమడుగుపరువడి కుడియురుగుపరువడి కదలు పరువడి దాఁటడుగుపరువడి...మొదలైన పదు నాలుగు విసరులమర్మంబు జూపి .." హంస. ౧, ఆ. ౨౦౬, ప్రబంధ. ౭౮.

దాఁటడుగుమొన. దే. వి. మల్లబంధవిశేషము. "వ .. చాటడుగుమొన దాఁటడుగుమొన యరవిూట మొన...అదిగాఁ గలపదిరెండు మొనలు .." ప్రబంధ. ౭౮, హంస. ౧, ఆ. ౨౦౬.

దాఁటరి. దే.వి. (దాఁటు+అరి.) కప్ప. "సీ ..దాఁటరి చలికాఁపు కప్ప యనఁగ భేక మొప్పు .." సాం. ని. తిర్య. ౮౩.

దాఁటవేయు. దే. స. క్రి. (దాఁటన్+వేయు.) తప్పించుకొను; వదలుచుకొను. (బ్రా. వా.)

దాఁటించు. దే. స. క్రి. (దాఁటు ధా. ప్రే.) దాఁటఁజేయు, ఎగురఁజేయు. "మ. హరి దాఁటించెఁ బురోపకంఠమున .." క. కి. ౧, ఆ. ౫౩.

దాఁటు. యు. దే. అ. క్రి. 1. మీఁదిదుముకు, మీఁది కెగురు. "క...కృతవర్ష్మ నిబేరిపైకి లంఘించె,చెచు కల్యాఁడు గిరికి దాఁటుసింగముభంగిన్." భార. భీష్మ. ౧, ఆ. ౨౮౫. ఉ. హరి ౧, ఆ. ౪౬; 2. (కాలము) కడచు, జరుగు. "వ...పదు నాలుగు సంవత్సరములు దాఁటునంతకుఁ బురు షుండు బాలుండు .."భార. ఆది. ౪, ఆ. ౨౭౧. హర. ౭, ఆ. ౧౧; 3. ప్లుతగతిభేదముతో పరు వెత్తు. "సీ జోడనపడి యచ్చో నిబ్బరపుఁబర్వు నను దాఁటఁదొడఁగె గంధర్వకులము." దశా. ౨, ఆ. ౬౦. స. క్రి. 1. కడచు, అతిక్రమించు. "మ...అద్ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దం డించి బ్రహ్మాండమున్." కాశీ. ౧ ఆ. ౫౩. ఉ. హరి. ౨, ఆ. ౩౭; 2. మీఱు, ఉల్లంఘించు. "వ. తనభార్యకుం గలశివభక్తి విశ్వాసంబులును జంగమారాధననిష్ఠయుఁ దనయాజ్ఞతి దాఁటమియు ...ఎఱింగి." హర. ౨, ఆ. ౬౫. దశా. ౨, ఆ. ౧౧౮; 3. తరించు. "చ...పాయక చలదూర్మి కానికర మైనమహోదధి దాఁటవచ్చు..."భర్తృ. నీతి. ౪. నీలా. ౨, ఆ. ౪౧. వి. 1. లంఘనము, ఊఱుకు. "ఉ...ము ప్లవమంజులసౌఖ్యరసంబు నిక్కలం,దాఱుచుఁ గోరికల్ గొఱది దాఁటులం వైవఁగ..."హరి. ఉ. ౭, ఆ. ౧౮౨; 2. అశ్వ గతిభేదము. "గీ . ప్లుతగతిభేదంబు జంగ గంతు, దాఁటు...నాఁ దనరు..."అం. భా. ద్వి. ౧౯౮. వై. వి. (సం. దండః.) సమూహము, గుంపు. "సీ. రాయంచదాఁటులు ప్రోయుఁ లేఁదేఁటులం గృహాపరోరుహములఁ గెలిచలుడు." విక్ర. 3, ఆ. ౧౦౫. వరాహ. ౮, ఆ. ౧౬.

దాఁటుకట్టు. ద్వ. అ. క్రి. (దాఁటు+కట్టు.) గుమి గూడు. "గీ. చినుకుతోఁ గూడుకొని గాలి చెలఁగఁ జూచి, దాఁటుకట్టుచు మృగములు దాఁటు చుండ." శా. పంచ. ౨, ఆ. ౧౯౪.

దాఁటుకొను. దే. అ. క్రి. (దాఁటు+కొను.) అంద కుందు; ఎగురు. "వ...అల్లాలపాదంబును నబ్బాల కలం పెఱింగి యొగడియుం దప్పఁ గ్రుంకియు దాఁటుకొనియు..."శైవ. ౨, ఆ. ౪౬. కాశీ. ౧, ఆ. ౧౧౨.

దాఁటుడువల. దే. వి. (దాఁటుడు+వల.) వాల భేదము, ఒకరకమువల. "క. మెడవల సన్నపువల త్రోపుడువల డొంకవల మింటముక్కిడివల దాఁ, టుడుపల సింగితమనుపుడు, లెడవల మండెవల లాదు లెసఁగెడివలలున్." హంస. ౪, ఆ. ౧౦౫.

దాఁటువడు. దే. అ. క్రి. (దాఁటు+పడు.) దూర మగు. "క. వేఁటమెయి వచ్చి నృపు మ్రాఁకో టికిఁ జిట్టాట్ల నంటి పోయినపిదపన్, దాఁటువడుం గులమునకును, మాటయుఁ గల్యానకు వచ్చు మాను లచేతన్." పి. శకుం. 3, ఆ. ౮౮. ద్వ. అ. క్రి. గుమిగూడు. "క. పదియును బదియేనుచు నిరువది యును ముప్పదియు దాఁటువడి నిత్యంబున్, గొద గొని తిరిగి వధింపఁగఁ,గదలఁగఁరాదయ్యె గొల్లగమి కేచోటన్." హరి. పూ. ౬, ఆ. ౮.

దాట్లమారి. దే. వి. వ్యభిచారిణి, స్వైరిణి. "క. ఇది దాట్లమారి యగు నని, పదపడి మఱునాఁడె య్యొంటిపాటున మేకో,లాదవింపఁ జూసియుంటు,

దుద గానని ప్రేమ దానితో రమియించెన్." శుక. 3, ఆ. ౧౨౪.

దాఁపన. దే. వి. (దాఁగు. ధా.) దాఁచుట, గోపనము. (శ. ర.)

దాఁపరము. దే. వి. (దాఁగు. ధా.) దొంగిలించుట. (చూ. దాఁపరించు మొ.)

దాఁపరి. దే. విశే. (దాఁపరము+ఇ.) వంచకుఁడు, మోసగాఁడు. "క. విరితేనె మేపరులకున్, హరి నీలపు నరుల కిరుల కజ్జాక్షిరుల్, గురులై పెదవిలంతుని బెడ, గుజులై తగుకెమ్మిపురుల కొక దాఁపరులై." చం రా. 3, ఆ. ౭౪.

దాఁపరించు. దే స. క్రి. దొంగిలించు, అపహరించు. "గీ. ముద్దులాఁ డయి ప్రేఁతల మొఱఁగి పాలు, వెన్నలును దాఁపరింపంగ." హరి. ఉ. ౫, ఆ. ౨౭.

దాఁపరీఁడు. దే. వి. (దాఁపరము+ఈఁడు.) దొంగ, చోరుఁడు "సీ. పీఁటపే మందలో వెన్నలు దొంగిలి పర్పించి మెక్కినదాఁపరీఁడు." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౪౯.

దాఁపలికము. దే. వి. (దాఁపన+ఇకము.) దాఁపురము, గోపనము. (శ. ర)

దాఁపించు. దే. స. క్రి. (దాఁచు ధా. ప్రే.) దాఁచునట్లుచేయు. "గీ. బొక్కసమువారిచేత నాభూషణంబు, లపుడు దాఁపించి రతిరహస్యంబు గాఁగ, వైష్ణవులమీఁద ముచ్చు లన్ వాదు మోపి." పరమ. 3, ఆ. ౫౫.

దాఁపు. దే. స. క్రి. (దాఁచు. ధా. ప్రే.) దాఁపించు. "ద్వి. ఆకద వచ్చినయప్పుడే మున్న, దాఁచినధన మిచ్చి తగుఁ బత్నిఁ గావ." ద్వి. హరిశ్చ పూ. ౨౩౮. పు. వి. దాఁచుట, దాపరము "వ ..ఇంక దాఁపేల కోడెగానితోఁ దక్కరబిక్కరలాడు కుంటూ కులుకనున్నావె..."మృ. వి. ౨,ఆ. ౪౫.

దాఁపుడు. దే. వి. (దాఁచు. ధా ) దాఁచుట, గోపనము. (శ. ర.) విశే. దాఁచుకొనఁబడునది. "సీ. ఇపుడు గా కిది యుండి యే మందుఁ జొపుచేఁ గట్టినదాఁపుడు పట్టుకొక." పార్వ. ౫, ఆ. ౨౧౭.

దాఁపురము. దే. వి. (దాఁచు. ధా.) 1. దాఁచుకొనుట, గోపనము. "గీ. ఇంతి సిగ్గుగదా యని కొంతదాఁకఁ, దలఁపు డాఁచి లోలోఁ గుమారిలఁగ వచ్చు, నదియుఁ గాకేను లాఁతినే యకట నీకు, రమణి నాపట్టునను దాఁపురంబు వలదు." కళా. ౬, ఆ. ౨౫౮. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౪౦; 2. దాఁచినసొమ్ము. "మ...కావలయుం బేర్కొని వచ్చి కొంపోదు నేఁడిది నీపెట్టియ నాదుదాఁపురముగా నిం దుండని మ్మన్నియున్." సా. ౨, ఆ. ౮౫; 3. దాఁచుకొనుట, నిలువచేయుట. "క. అతిసంచయఫల మిది పోరతిపోఁటి వలదు దాఁపురం బన నగుచుం, బతికి నతి వలికె దాఁపక, గత మేమీ ధాన్య మొదుగుగాలే దింటన్." వేం. పంచ. ౪. ఆ. ౧౧౦. 4. రహస్యము. "చ ..నీకుఁ దనకల్గినదాఁపుర మిాశ్వరుండు బాహిరముగఁ జేసెఁ జూడు .."కను. ౧, ఆ. ౨౨౧; 5. దాఁచుకొనుచోటు. "వ .. బుధులకు నవనిధులదాఁపురంబును విపులవిజయలక్ష్మికిఁ గాఁపురంబును...అగునాపురంబునకు..." రామా. ౧, ఆ. ౧౫౩. విశే. దాఁచఁబడినది, గుప్తము. "ఉ . ఎవ్వరికిన్. బజ్జకుఁ జేరనీక తన భావములోపల దాఁపురంబుగా, సజ్జకుఁ జేరియుండె నృపచంద్రుఁడు సాంద్రవియోగవేదనన్." పి. శకుం. ౨, ఆ. ౧౬౭.

దాక. యు. దే. వి. వెడలుపునోరు గలచిన్నకుండ. (శ. ర. వా.) వై. వి (సం. ద్రాక్షా.) ద్రాక్ష. "సీ దాకతీవను బూవుదండ చేరిచి మెడ యుఱి యంగ నురి బిగియించుదాన." రసిక. ౪, ఆ. ౩౫. ఆం. భా. ద్వి. ౫౭.

దాకలి. దే. వి. (దాయు+కలు.) కాఁచి సాగఁగొట్టెడి యినుము బంగారు లోనగువాని కాధారముగా నుంచుకొనెడియినుపదిమ్మ. "ఉ. దాకటిమీఁదఁ బెట్టి బెడిదంబుగ సమ్మెటవేయ..." రత్న. ౨౬. వసు ౨, ఆ. ౩౨.

దాకల్లు. దే. వి. (దాపు+కల్లు.) బండికంటికడకమ్మి, నేమి. (శ. ర.)

దాకొను. దే. అ. క్రి. (దాపు+కొను.) 1. సమీపించు. "క. తగువారిఁ బిలిచి యిదిగో,లగనము దాకొనియె .."అచ్చ. అయో. ౮, రామా. ౫, ఆ. ౨౮౨; 2. ఆవరించు, చుట్టువాఱు. "ఉ... పురంబు సర్వముం, దాకొని కాచుచున్న కుముదప్రముఖుల్ సకతంబు గొల్వఁగాన్." పరమ. ౧ ఆ. ౩౬. స. క్రి. ఎక్కు, అధిరోహించు. "ఉ. కుంభకుంభకోణ యగుకొండలమండలనాథు

కట్టివా,మూంకము దాకొనక్ ఘణఘణారవఘూరిక పాలమాలికా, లంక్పృతు లోంక్పృతుల్ నొదువులా గదరన్..." పాండు. ౨, ఆ ౧౯౨. కవిరా. 3, ఆ. ౧౧.

దాకొలుపు. దే. స. క్రి. (దాకొను ధా. ప్రే.) చేర్చు. "చ. అనివిరవాంబుఁ జేరలత నాశ్రిత చంద్రశిలాకలాబుమిూ,వ నొరుగుచుర్ సఖం దిగిచెః దన్ని శిరోదిశకై శ్రదంకముం,దనకుఁ దలా డగాఁ గొనఁగఁ దజ్ఞత బోటియుఁ దల్కిరియా ప్రవ,ర్తనకుఁ వదీశు దాకొలిపి తా. దనయుంటికిఁ బోయె నవ్వుచున్." ప్రభా. ౫, ఆ. ౧౫౫. రామలిం. 3౧.

దాక్షాయణి. సం. వి. ఈ. స్త్రీ. 1. అశ్విన్యాదులలో నొకటి; 2. సతీదేవి, 3. పార్వతి, 4. కద్రువ, నాగమాత; 5. వినత. గరుడమాత, 6. అదితి దేవ మాత; 7. దితి,రాక్షసమాత; 8. భూమి; 9. లక్ష్మి.

దాక్షాయ్యము. సం. వి. అ. పుం. గ్రద్ధ.

దాక్షి. సం. వి. ఇ. పుం. దక్షునిసంతతి. ఈ. స్త్రీ. 1. దక్షునికూఁతురు; 2. పాణినితల్లి.

దాక్షిణాస్యము. సం. వి. అ. పుం. కొబ్బరికాయ.

దాక్షిణాత్యుఁడు. సం. వి. (అ. ఆ. అ) దక్షిణ దేశపువాఁడు. భార ఆది. ౫, ఆ. ౭౮.

దాక్షిణ్యము. సం. వి. అ. న. 1. కనికరము; 2. సామర్థ్యము; 3. నేర్పు; 4. అనుకూల్యము; 5. దక్షిణదిక్సంబంధత్వము, 6. దక్షిణనాయకభావము.

దాక్షేయుఁడు. సం. వి. అ. పుం. పాణిని.

దాక్ష్యము. సం. వి. అ. న 1. నేర్పు, 2. సామర్థ్యము; 3. ఋజుత్వము.

దాఖల. హిం. వి. (హిం. దాఖిల్.) నివర్తనము, రుజువు (బ్రౌ. వా.)

దాఖలు. హిం. వి. కాకితము ఇచ్చి యిచ్చినట్లు పుస్తకములో వ్రాయించుకొనుట.

దాగలి=దాకలి. (శ. ర.) ('దాఁగలి' అని కొందఱు.)

దాదకము. సం. వి. అ. పుం. దంతము.

దాడి. ఉభ. వై. వి. 1. (సం. దాఢికా.) గడ్డము, శ్మశ్రువు. (శ. ర.), 2. (సం. ధాటీ. క. గాడి.) శత్రుజయార్థమై దండెత్తిపోవుట, దండయాత్ర. "ఉ. కందువ నెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడువారు..." భార. విరా. 3, ఆ. ౧౨౩, హరి. పూ. 3, ఆ. ౧౨౬; 2. ఉద్ధతము, ఔద్ధత్యము. "చ. కలిరుజిరావజీరులలందాడికి నోడి కదంక దక్కి.." నీలా. 3, ఆ. ౧౪. చం. రా. ౫, ఆ. ౨౬. సం. వి. ఈ. స్త్రీ. 1. దానిమ్మచెట్టు; 2. దానిమ్మపండు.

దాడింబ. వై. వి (సం. దాడిమః.) "దండకము... దాడింబపండ్ల స్వాదంబించు పాలిండ్లపై .."దశా. ౪, ఆ. ౨౩౬, ఆం. భా. ద్వి. ౫౦

దాడింబము. సం. వి. అ. పుం. దానిమ్మచెట్టు.

దాడికాఁడు. ద్వ. వి. (దాడి+కాఁడు.) 1. వేగుల వాఁడు. "చ. ఇది చనుదాంచెఁ జైత్రుఁ డని యుల్లవనంబులకున్ బ్రమోదముల్, పొదలఁగ మేలివార్తఁ గొని బోరన వచ్చినదాడికాఁ డన, న్మృదువనదేవతాముఖసమీర మెదుర్కొన నుల్ల సిల్లె నిం,పొదవఁగ దక్షిణానిల మనూనమనోహర ఖేలనంబునన్." నృసిం. ౨, ఆ. ౬౦; 2. దండెత్తువాఁడు "చ. తిమిరపుదాడికాఁడు చనుదేరఁ దొడంగెను నా కెదుర్పఁగా, సమయము కాదు. ..."విప్ర. 3, ఆ ౨3, కేయూర. ౪, ఆ. ౨౭.

దాడిగొను. ద్వ అ. క్రి. (దాడికొను) ఒకదానివెంబడి నొకటి వచ్చు. "తన్వీవృత్తము. పాడి పనో దంబులు సలిపిన గోపాలుఁ దటాచుచు భీతనసఖాన్యల్, దాడిగొనన్ విశ్వవిరమణముతోఁ దన్వినిఁ జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్." అప్ప. ౪, ఆ. ౨౩౬ పు.

దాడిచేయు. ద్వ. అ. క్రి (దాడి+చేయు.) దండెత్తు. "వ...పదుసనిమిసవమాఱు దాడిచేసి శత్రులం దోలి విజయంబు చేకొంటి .." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౫౯.

దాడినిమ్మ. వై. వి. దాడిమచెట్టు. "మత్తకోకిల. పూచె నిమ్మలు దాడినిమ్మలు పొన్నలున్ సురపొన్నలున్." యు. ౪, ఆ. ౭. [పాఱిపోవు. (బ్రౌ.)

దాడిపఱచు. ద్వ. అ. క్రి. (దాడి+పఱచు.) పరుగెత్తు,

దాడిపోవు. ద్వ. అ. క్రి. (దాడి+పోవు.) దండెత్తు. "ద్వి ..అతనిపై దైత్యులపోక,కల పుచు వారిపై దాడిపోఁ దగునా." రం. రా. యు ౨౮౯, పు. ౨౦, సం. ఇట్లే:-దాడిపోవు. భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౧.

దాడిమ. వై. వి. (సం. దాడిమః) దాడిమముచెట్టు. "రగడ. దాడి దాడిమగమికిఁ జేరఁగఁ దగునా తగు నాడ కరిగెఁ గీరము." చంద్రి. ౪, ఆ. ౬౩.

దాడిమపుష్పము. స. వి. అ. పుం. ముంటపోదుగుచెట్టు.
దాడిమప్రియము. సం. వి. అ. పుం. చిలుక, శుకము.
దాడిమము. సం. వి. అ. పుం. న. 1. దానిమ్మచెట్టు; 2. ఏలకిచెట్టు. న. దానిమ్మపండు.
దాడిమి. సం. వి. ఈ. స్త్రీ. 1. దానిమ్మ; 2. ఏలకిచెట్టు.
దాడిమ్మ. వై. వి. (సం. దాడిమః.) దానిమ్మచెట్టు. సాం. ని. స్థా. ౫౭.
దాడియాడు. ద్వ. స. క్రి. (దాడి+ఆడు.) 1. ముట్టడించు. (మార్కం. ను. శ. ర.) "ద్వి. ఈడంబోవక యింద్రుం డీమునపీడు, దాడియాడుచు వస్తుతలిం గొల్లవిడిచి." ద్వి భాగ. ౭, స్కం. (శ ర.) 2 కొల్లగొట్టు. (ప్రా.)
దాడివచ్చు. ద్వ. అ. క్రి. (దాడి+వచ్చు.) దండెత్తివచ్చు,యుద్ధమునకు వచ్చు. "శా. దేవా రక్కసుం డొక్కరుం డలిలోద్రేకంబునన్ దాడిరా." వరాహ. ౧౧, ఆ. ౧౨.
దాడిపెట్టు ద్వ. అ. క్రి. (దాడి+పెట్టు.) దండెత్తు దాడివెడలు. "వ...హిరణ్యాక్షుండు ..తన్ను నెదిరి కదనంబు సేయం జాలినయరివీరుని గానక భూలోకం బెల్లం గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవిముఖు లయినబర్హిర్ముఖులం గనుంగొని..." భాగ. 3, స్కం. ౬౧3, భార. కర్ణ. 3, ఆ. 3౫౬. [3. సమూహము.
దాఢ. సం. వి. ఆ. స్త్రీ. 1. దంష్ట్రకోఱ; 2 ప్రార్థన;
దాణా. వై. వి. (సం. ధాన్యమ్. హిం. దానా.)అశ్వాదులకుఁ బెట్టు ఉలవలు లోనగునాహారము "చ.... ఏతతిఁ గలలోనసున్ బడెడుదాణా యొఱుంగను..." హంస. ౫, ఆ. ౪౧.
దాణము. దే. వి. శుల్కము,సుంకము. (శ. ర.)
దాణుధోడ. దే. వి. మల్లవిద్యావిశేషము. "వ... అశ్వారుండు...దాణుధోడ ఝాటు నివిమొదలయిన పదునాలుగు విసరులమర్మంబులు జూచి. ..." హంస. ౧, ఆ. ౨౦౬.
దాత. సం. విశ. (బు. స్త్రీ. బు.) 1. దానముచేయువాఁడు, ఇచ్చువాఁడు; 2. ఖండించువాఁడు; 3. శుద్ధిచేయువాఁడు.
దాతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. శుద్ధమైనది; 2. త్రుంపఁబడినది.
దాతవ్యము. సం. వి. అ. న. దానము. "క. వినుపృథివియును సరస్వతియును గోవును దానవిధికి నొక్కండె కలుగా, వినియుండుదు వీనింబోలిన దాతవ్యములం బొండు లే వని విందున్." భార. అర. ౨, ఆ. ౪౧౧. విశ. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁదగినది. భార. అను. ౨, ఆ. 3౬౭; 2. శోధింపఁదగినది.
దాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఖండించుట; 2. శుద్ధి.
దాతికట్టు. దే. వి. (దాయి+కట్టు) చెక్కుడుప్రాణికి ఊఁతగా క్రింద నుంచుబల్ల లోనగునది,ఉద్ధనము. (శ. ర.)
దాతు వై. వి. (సం. ధాతుః). గైరికాదిధాతువు. "మత్తకోకిల. తమ్మిపూసలపేరు నెట్టినిదాతు బొట్టును జూడ నం,గమ్ముపైఁ దగుసొమ్ముగా... చెం చరుదెంచినన్." ద్వా. ౯, ఆ. ౯.
దాత్యూహుడు. సం. వి. అ. పు దాత,ఇచ్చువాఁడు.
దాత్యూహము. సం. వి. అ. పుం.. 1 వానకోయిల, చాతకము, 2. గుండెగిజిగాడు; 3. నీరుకాకి; 4. మేఘము,మబ్బు.
దాత్రము. సం. వి. అ. న. కొడవలి, లవిత్రము.
దాదాపు. దే. వి. (దాపు+దాపు.) మిక్కిలి సమీపము. (శ. ర. వా.)
దాది. వై. వి. సం. ధాత్రీ. (క. దాది. త. తాది.) పెంపుడుతల్లి,ఉపమాత. "గీ. పతి కళావతి యను గాదిఁ బద్మనయన, దమనసహోదరి గారాపుదాది కూఁతు నంతికమునకు రప్పించి .." సైవ. ౯, ఆ. ౫౪, దశా. ౪, ఆ. ౧3౯.
దాదిలి. వై. వి. (సం. ధాత్రీ.) దాది. ఉపమాత. "క. తాదృశపురహర్మ్యములకు, దాదిలి యగును దినకరసుధాకరతేజః, ప్రాదుర్భావని దానమహాదిధితి తెలియఁ దరమె యూసథమహిమల్." కళ. 3, ఆ. ౧౪.
దాదుంగ. దే వి. (దాయి+దుంగ ) దాతికట్టు,ఉద్ధనము. (శ. ర.) [కల్పితదానము.
దానకము. సం. వి. అ. న. 1. అల్పదానము; 2.
దానము. సం. వి అ. న ఈవి, ఇచ్చుట. (దశదానములు. గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము, వస్త్రదానము, ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము లవణదానము; షోడశమహాదానములు - గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్ర

క్షీరదానము, రథదానము, గజదానము, అశ్వదానము, భాగదానము, మహిషీదానము.); 2 గజకపోలమదము; 3. పాలనము; 4. ఖండనము, 5. శుద్ధి; 6. రాజ్యాంగసంబంధిచతురుపాయములలో నొకటి. (ఇది పంచవిధములు-తనకుఁ గల ధనమునంతయు నిచ్చుట, ఎక్కడనేని ధనము తీసికొన్నచో దానికిఁ దా ననుకూలుఁడై యుండుట, అపూర్వవస్తువుల నిచ్చుట, ఇతరులధనముఁ బుచ్చుకొనఁ బ్రవర్తింపఁ జేయుట, అప్పుతీర్చుట.)

దానవుఁడు. సం. వి. అ. పుం. దనుసంతతివాఁడు-తొలివేల్పు, రాక్షసుఁడు.

దానవురాలు. సం. వి. రాక్షసస్త్రీ. రక్కసి. "క. అది వేళ ముడిగి దైత్య, ప్రవరునియంతిపురమునకుఁ బదముచుఁ దానవురాండ్రు వలుకుపలుకుల్ ..." రామా. ౬, ఆ. ౧౪౧.

దానవేయుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

దానశౌండుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి యీవి కలవాఁడు, వదాన్యుఁడు.

దాని. సం. విణ. (న్. నీ. న్.) 1. మదము గలది. (గజము.), 2. దానముచేయువాఁడు, దాత. "ఆ...కౌరవవాన్వయంబు, వెలుఁగుచుండఁ బుట్టె పిరాగ్రగణ్యుండు, పంతతార్థదాని శంతనుండు." భార. ఆది. ౪, ఆ. ౧౪౦.

దానింబ. వై. వి. (సం. దాడిమః.) దానిమ్మశీ. "క... గరగర శాబల్వరుసల్, గరగర దానింబవిత్తుగమి నదలించున్." కృష్ణ. ౪, ఆ. ౬౩.

దానిమ్మ. వై. వి. (సం. దాడిమః.) దాడిమశీ. "సీ .. నందనవనమందుఁ గ్రందన శరజాజా పొలుపొందు దానిమ్మపూ వనంగ." కృష్ణ. ౪, ఆ. ౧౦౫. పాం. ని. స్థా. ౫౭.

దానీయము. సం. వి. అ. న. దానము. విణ. (అ.ఆ.అ.) 1. ఇయ్యఁదగినది. (ధనాదికము.); 2. దానపాత్రము.

దానువు. సం. వి. ఉ. పుం. 1. సుఖము; 2. వాయువు; 3. యజమానుఁడు. విణ. (ఉ.) 1. పరాక్రమవంతుఁడు; 2. దాత. [చేయించుట.

దాపనము. సం. వి. అ. న. ఇప్పించుట, దానము

దాపరము. దే. వి. (దాయు. ధా.) 1. ప్రాప్తి (శ. ర.); 2. దాఁచుట, మఱుఁగుపఱుచుట. (చూ. దాపరముఁజేయు.)

దాపరముఁజేయు. దే. స. క్రి. (దాపరము+చేయు.) మఱుఁగుపఱుచు, గోపనమొనర్చు. "మ. ఉరులజ్జాభరగవ్వారంబునను రాగోద్వృత్తికి వేల దాపరముం జేసెద మర్మముం దెలియంజూపజ్జ వృథా కాదె..." కాళింది. ౬, ఆ. ౨౮.

దాపరించు. దే. అ. క్రి. ప్రాప్తించు. (శ. ర. వా.) స. క్రి. చేకూర్చు. "శిశిక. తతిని సద్గురుసుతుల దాపరించినసమయము, పెంతిమె నాగపురంబు పెక్కలించినవిజయు." అప్ప. ౪, ఆ. ౩౩౩.

దాపల. దే. వి. ఔ. ఎడమవైపు. "వ...వలపటఁ గృపాశ్వత్థామలును దాపటఁ గృతవర్మమద్రేశ్వరులును వెనుక బాహ్లికసోమదత్త భూరిశ్రవసులును .." భార. భీష్మ. ౧, ఆ ౧౦౩. కాశీ. ౩, ఆ. ౯౯.

దాపలించు. దే. స. క్రి. 1. ఎడమవైపుగా నుంచు. "వ ..బకవైరి దాపలించి తిరిగినం జెరఁగినఁ యీరసంబున నుల్లసితుండై యాభూవల్లభుండు ..." భార. శల్య. ౨, ఆ. ౨౬౭; 2. ప్రాప్తింపఁజేయు. కు. సం. ౨, ఆ. ౩౮౧.

దాపించు. దే. అ. క్రి. (దాయు. ధా) సమీపించు. (శ. ర.) [(ధనాదికము.)

దాపితము. సం. విణ. (అ. ఆ. అ.) ఇప్పింపఁబడినది.

దాపితుఁడు. స. విణ. (అ. ఆ. అ.) దండితుఁడు, దండుగుగొనఁబడినవాఁడు.

దాపు దే. స క్రి. (దాయు. ధా.) చేర్చు. "క. తను వారిం బిల్చినవైశమ చని వారందఱుఁ గొలను మేపరిశల్గుమొగర్ దాపిన పెనుతాయి మొగిం బడఁ గన్ను లొని కేఁగి కడంకన్." అచ్చ. యు. ౪౪౬. వి. సమీపము, చేరువ. "సీ. డాకాలిగండపెండారంబుదాపున బొమ్మలై వైరిభూభుజాలు వ్రేల." కాశీ. ౧, ఆ. ౪౫; 2. ఆధారము; అవలంబము. "ఉ...మానసోగతులు నిర్భరకార్ష్యము నొందె నింక నెప్పటున నేము ధన్యులము ప్రాపును దాపును నీవు గల్గుటన్." హరి. ఉ. ౧, ఆ. ౧౪౫. హంస. పూ. ౪, ఆ. ౧౬.

దాపుకొను. దే. స. క్రి. (దాపు+కొను.) ఆశ్రయించు, అండగొను. "వ. ఇట్లరుగుదెంచి ప్రాంతరత్నస్తంభంబు దాపుకొని సఖీజనంబులమరుపున లజ్జావనతవదనారవింద యగుసుందరిం గదచి..." కవిక. ౩, ఆ. ౨౦౫.

దాపురమగు. దే. అ. క్రి. (దాపురము+అగు.) ప్రాప్తించు, దాపరించు. "గీ. కారణం బన్నిటికి నల్లపాదుపమె కదా యదెక్కడ దాపురమాయెఁ దనకు." సా. ౨, ఆ. ౧౪౫.

దాపురము. దే. వి. (దాతృ. ధా) ప్రాప్తి. (శ. ర.) "ద్వి. నీరఁ జిచ్చెగయింపనేర్చినతల్లి, యెచ్చట నుండి నీ విటదాపురముగ, వచ్చితి చొచ్చితి వాస మీ ననుచు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౦౧, పం.

దాప్యము. సం. విశే. (అ. ఆ. అ.) ఇప్పింపఁదగినది.

దాప్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దండ్యుఁడు, దండుగ గొనఁదగినవాఁడు.

దామని. సం. వి. ఈ. స్త్రీ. 1. పెక్కుపలుపులు గల నిడివిత్రాడు, దామెన, 2 పఱపు.

దామము. సం. వి. న్. పుం. న. 1. దామెనత్రాడు, పెక్కుపలుపులు గలనిడివిత్రాడు; 2 త్రాడు, రజ్జువు, 3. పాలు పితుకునపుడు పసులకాలికిఁ గట్టెడిత్రాడు, బంధము, 4. దండ, మాల, 5. పసులఁ గట్టెడుపలుపు.

దామర. దే. వి. 1. ఉరిత్రాడు. "చ. ఎలమి మనోజలుబ్బుఁ డెలయించిన జక్కవదీము పెట్టి పేర్చెలుఁగునఁ బిల్చి చూడ్కిఁ గదియించి యెదుర్కొని మేను మేను నిశ్చలగుణసంగతిం బెనఁచి చక్రము దామరతోఁ జేర్పఁ దక్కలకలకంఠకోలె విహగంబులు పీడెఁ గులాయకూటముల్." వసు. ౪, ఆ. ౧౩౭; 2. మండలాకారమగుకుష్ఠము. (శ. ర.)

దామాషా. హిం. వి. (హిం. దామాశాహి.) సరియైన పంపకమైన భాగము.

దామెన. వై. వి. (సం. దామనీ.) పెక్కుపలుపులు గలనిడివిత్రాడు, త్రాడు. "గీ. దక్షునల్లుండు పెడల సూత్రములు గట్టి, యూపములసూత్రములతోడ నుద్ధిచేసి, దామెనలు గూర్చి నడిపించెఁ దరళరంబె, పీగభద్రుండు పశువుల వెల్చునట్లు." కాశీ. ౭, ఆ. ౭౭. భాగ. ౬, స్కం. ౧౩౯.

దామెనకొయ్య. ద్వ. వి. (దామెన+కొయ్య.) దామెన కట్టుస్తంభము. "గీ. తలుగు లూడ్చి పెయ్యల కల్లఁ దల్లిచన్ను, గుడువ విడుచుఁ గొన్నిటి నలుగడలఁ ద్రోలునుఱక దామెనకొయ్యలు పెఱికి పాఱ, వైచుఁ గావళ్లు నుట్లను ద్రచ్చి తెంచు." హరి. పూ. ౫, ఆ ౨౦౬.

దామెనత్రాడు. ద్వ. వి. (దామెన+త్రాడు.) దామెన. "ఉ. చనుమా చూతము నీ తెఱం గనుచు నుత్సాహంబుతోఁ దల్లి దామెనత్రాటన్ వెసఁ ఱోటితోన ముడు బల్మిన్ గట్టినన్ .." హరి. ఉ. ౪, ఆ. ౨౩౫.

దామెనవేఁట. ద్వ. వి. (దామెన+వేఁట.) అచ్చటచ్చట దామెనలు గూర్చి చేయువేఁట, మృగయావిశేషము. "సీ. దీమాలవేఁటలు దామెన వేఁటలు తెరవేఁటలును పేర్పు తెరలికలును." ద్వా. ౮, ఆ. ౨౨.

దామోదరుఁడు. సం వి. అ. పుం. 1. విష్ణువు, 2. కృష్ణుఁడు; 3. బుద్ధుఁడు (కేశుఁడు.) "ద్వి. వెలయు ననంగుఁ గావించె నంగజుని, వెలుఁగనిపురములు వరిఁగించె బెట్టు చెనసి దామోదరుఁ జేసె దామోదరుని విధి పాలుసేసెను విధిఁ బట్టి" బస. 3, ఆ. 23, పు.

దామ్యత్. సం. శత్రు. 1. అణఁచుచున్న; 2. దండించుచున్న.

దాయ. వై. వి. (సం. దాయాదః. క. దాయ) 1. జ్ఞాతి, సగోత్రుఁడు. "ఆ. అనఘ పితృపితామహప్రపితామహపూజనములు శిష్టపూర్వకముగఁ, జేసి ఎలయు నియతి దాయ దోడ్గినజన్ని, దంబుతోడ భక్తిధామ మగుచు." భార. అను. 3, ఆ. ౧౯౯. ఆం. భా. ప్ర. ౧౧౬; 2. శత్రువు. "మ. ఎట్లయినన్ మేలగు దాయ గెల్వు మను శేంద్రా యంచు బోధించినన్." ఉ. రా. ౨, ఆ. ౨౩౧. భార. ద్రో. ౪, ఆ. ౩౧౨.

దాయఁగట్టు. దే. స. క్రి. (దాయన్+కట్టు.) బంధము వేయు. (శ. ర.)

దాయకుఁడు. సం. వి. అ. పుం. జ్ఞాతి, దాయాదుఁడు. విశే. (అ. యి. ఆ.) 1. ఇచ్చువాఁడు; 2. ఖండించువాఁడు; 3. శోధించువాఁడు.

దాయభాగము. సం. వి. అ. పుం. 1. దాయములోని భాగము; 2. పిత్రాదిధనమును బంచుకొనుట, దాయవిభాగము.

దాయము. ఉభ. దే. వి. (క. దాయ. త. దాయం.) 1. గవ్వలాట జూదము మున్నగువానియందలి పందెము. "సీ. ఒకదాయ మాడిన నున్న దాయుం బాడు మనక వాటులు రెండు గొని చెలంగి." ఉ. హరి. 3, ఆ. ౧౭౮. పండితా. పురా. ౧౨౫.

పు; 2. విపత్తు, ఇడుమ. "ద్వి. పడి నుక్కు దాయము వచ్చుచో ధైర్యముడిగిన దైన్యంబు నొందిన నగర" ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౧, ౪. క్రీడావిశేషము. "సీ. దాయాలు సొగటాలు దాట్ల్రాయి చదరంగమును బోటురాట్లను మూఁకపాఁప" హంస. 3, ఆ. ౧౪౬, బ్రహ్మో. 3, ఆ. ౩౦. సం. వి. అ. పుం. 1. దానము, ఈవి; 2. అరణము, వివాహకాలమునఁ గన్య కిచ్చుధనము; 3. వివాహకాలమునందు అల్లున కిచ్చుకట్నము, 4 పంచుకొనఁదగినతండ్రి మున్నగువారిధనము; 5. నాశము, లయము; 6. ఖండించుట; 7. ఎత్తిపొడుపు, 8. ఇయ్యఁదగినధనాదికము, 9. తావు, స్థానము; 10. శుద్ధి, స్వచ్ఛత.

దాయపడు. ద్వ. అ. క్రి. (దాయము+పడు.) కష్టపడు. (చూ. దాయపఱుచు.)

దాయపఱుచు. దే. స. క్రి. (దాయపడు. ధా. ప్రే.) కష్టపెట్టు, బాధించు. "క. మాయరవి నేల క్రుంకఁడొ, కో యను నిట్టేల కడసెనో యనుఁ గ్రుంకం, బోయెడుఁ జూ యిప్పుడ యను, దాయపఱిచె నను మనోజతాపము పేర్మిన్." భార. విరా. ౨, ఆ. ౩౧౨.

దాయాద. సం. వి. అ. స్త్రీ. 1. దాయాధికారిణి, జ్ఞాతి; 2. కూఁతురు.

దాయాది. సం. వి. న్. పుం. 1. దాయాదుఁడు, జ్ఞాతి; 2. పుత్రుఁడు. ఈ. స్త్రీ. 1. దాయాధికారిణి; 2. పుత్రిక. విణ. (న్. సీ. న్) దాయము ననుభవించువాఁడు.

దాయాదుఁడు. సం. వి. అ. పుం. 1. దాయాధికారి, జ్ఞాతి; 2. పుత్రుఁడు.

దాయాద్యము. సం. వి. అ. న. జ్ఞాతిత్వము.

దాయి. ఉభ. దే వి. ఇ. (దాయు ధా.) 1. సమీపము. "ఉ. అతరళాక్షి డెందమున నారటమొందుచు నేమిసేయుదుర్, రాతిరిఁ దోడువోయినది రాకుతుడెందము మెత్త గాదు దా, దాతిరి వచ్చియుండ నీకఁ దాలిమి చెల్లునె మారుఁ డంటిమా, ఘాతకుఁ డోర్వరాదు సముఖంబున నేటికి రాయబారముల్." సా. ౨, ఆ. ౧౬; 2. దాకలి. "చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్, హరునయనాగ్ని కొలిమి యంగాధిపుకోఱలు పట్టుకార్లు దిక్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసంహరణగుణాభిరాముఁ డగుమైనము భీమునఖడ్గసృష్టికిన్." భీమునచాటుధార. (శ. ర.), 3 చెక్కడు మ్రానిక్రింద ఊఁతగా నుండుకొనుదుక్క, ఉద్ఘనము. "ద్వి. భామిని నప్పుడ పడఁగొట్టి రెండు, చేతులఁ గట్టి డాచేతఁ దా బట్టి, దాయిపై నిడి బాడిసయుంగత్తి పూఁచి" పండితా. పురా. ౯౬, పు. ప్రబంధ. ౪౪, సం విణ (న్. సీ. న్) ఇచ్చువాఁడు, దాత. (ఇది సమాసాంతముగనే యుండును.)

దాయు. దే. అ. క్రి 1. కలుగు, జనించు. "ద్వి. తగవును ధర్మంబు దలపోసి మాని, పగ దాయ నదొప్పె యమై నల్క వొడమి" రం. రా బాల. ౬, పు. ౧౩, ప., 2 తగులు, లగ్నమగు. "క. భూపాల మెఱుఁగుఁబోఁడుల, చూపులకుఁ బాయునీమనోజు గట్లగుటన్, మాపిన్నది యుసురు వింతల, చూపుల నరగంట వెలుచుచు న్నిను జూచున్." నైష. ౯, ఆ. ౬౭, స క్రి. అ. క్రి. సమీపించు "ఉ. తక్కులకూలవాలములు దాయుదురే తరుణీజనంబులన్" విక్ర. 3, ఆ. ౭౯, వరాహ. ౬, ఆ. ౧౭

దార. ఉభ. యు. దే వి. 1. బాట, దారి. "క. ఓరమణి నీమువిక్కులు, దారల నగు మోవి పంచదారల నగు..." ప్రబంధ. ౬౩౭, కువల. ౨, ఆ. ౧౧౯. వై. వి. (సం. ధారా. క. దారె.) నీటికాలువ, ధార. "రగడ. తమ్మిపువ్వుల మీఁదిజలములదార తారకయుండఁ జల్లుము." పారి. ౪, ఆ ౧౬. ప్రబంధ. ౬౩౭; 2. ధారాపూర్వకముగా నిచ్చుట, దానము. "ద్వి ..విప్రుల కవని వల్లభులు దగిన దానము లీరో ధనమియ్యఁ గొనరో, పగఁగొని యీరీతిఁ బట్టి యడిచిమి, దారలెక్కల కుపై తరువులు వెట్టి, దారల నమ్మించి ధనములు గొనిడి కఠిన చిత్తులు లేరు..." ద్వి. హరిశ్చ. ఉ. ౪౨౯, 3. క్రమము రీతి "గీ. తప్పునాడక తొల్లింటిదార చెడక." ఉ హరి. 3, ఆ ౧౨౪. (శ. ర. పా. దారిచెడక. ముద్రి.); 4. కవిత్వాదుల అవిచ్ఛిన్నగతి. "మత్తకోకిల. దారతప్పక చెప్పనేర్తు వుదారవాక్చతురత్వ మోహనోరసాంగఁ ప్రబంధ మొక్కటి యొక్కచోటనె. .." సమీర. ౧, ఆ ౧౯౧, సం. వి. అ. పుం. బ. అ. స్త్రీ. పెండ్లాము, భార్య. "కా...ని స్నానితో,

దారిఁ దొంగిలి తంచు నిష్ఠురగతిఁ దండించి ఖండింప మున్ను కట్టైనను దాఁటివచ్చు నలుకఁ నేఁ డెల్లి శాంతింపుమా." మొ. రా. సు. ౬౭.

దారకము. సం. వి. అ. పుం. ఊరఁబంది.

దారకర్మము. సం. వి. న్. న. పెండ్లి, వివాహము.

దారకుఁడు. సం వి. అ. పుం. 1. పుత్త్రుఁడు; 2. బాలకుఁడు విణ. (అ. రి కా. అ.) చీల్చువాఁడు.

దారణ. దే వి. (క. దారణె. త. తారగై.) 1. కొనుట,క్రయము.' "గీ కొనుట దర దారణ యనంగ మనుచు గ్రయము."ఆం. భా. ద్వి. ౨౬౭; 2 (ధాన్యాదుల) వెల, మూల్యము. "క. ప్రాలేదుమానికెలకుం,డైలము మాసోఁడు పురమ్ము దారణగలుగఁ, బ్రాలనరి తైల మడిగిన,జాలియ యగుఁ గాని నీకుఁ జము కే లబ్బున్." కేయూర. ౨, ఆ. ౧౦, కై ౬, ఆ ౯.

దారణము. సం వి. అ. న. 1. చీల్చుట; 2. ఇందు పకాయ. విణ. (అ. ఆ. అ.) చీల్చునది. (అ.ఈ. అ.) చీల్చుటకు సాధనమైనది.

దారదము. సం. వి. అ పుం. పాదరసము. పుం. న. 1. విషభేదము, 2. ఇంగిలీకము; 3. సింధుదేశము.

దారపరిగ్రహము. సం. వి. అ. పుం. పెండ్లి, వివాహము. "క. ఘోరవ్రతములు సలుపుచు, దారపరిగ్రహము సేయఁ దా నొల్లక సంసారపునర్భవభీతి న,పారవ్యామోహపాశ బాధచ్యుతుఁడై." భార. ఆది. ౨, ఆ. ౧౮౦. (దారపరిగ్రహము సేయఁ = పెండ్లియాడుటకు) ఇట్లే దారగ్రహణము. మొ.

దారబందము. వై. వి. (సం ద్వారబంధః. క. దారబందవు) ద్వారబంధము. "వ. ..బరగం ద్రోచిన దారబందములును..." ఉ. హరి. ౧, ఆ. ౫౩, ఆం. భా. ద్వి. ౨౧.

దారము. జే. వి. (క. దార.) 1. నూలిత్రాడు,సూత్రము "సీ....తనరు సూత్రము త్రాడు దార మనఁగ." ఆం. భా. ద్వి. ౨౯౫, 2. చేత్రాడు, త్రాడు. "ద్వి. తామటి యొకఁడు లేఁ డామల్లినాథ, దార మొసంగరా ధర్మాత్ములార." పండితా. పర్వ. ౩౮౫. పు; 3. నాలుగుకాసులనాణెము. కాకణి చతుష్టయము. "సీ. కా సనఁగాను గాకణి పేరు విలసిల్లు...దమ్మ మనంగను దార మనంగను దచ్చతుష్టయసంజ్ఞ దనరుచుండు." ఆం. భా. ద్వి. ౨౭౮, వై. వి. (సం. ద్వారమ్.) ద్వారము. (చూ. దారబందము.)

దారవోఁత. ద్య. వి. (దారవోయు. ధా.) ధారపోయుట, "మ తలఁపు గర్జుఁ డపార్థదాతయె యపాత్రత్యాగిమూర్ఖుఁ డాబలి వ్యర్థంబుగ గల్పకంబు ఫలియింప న్మేఘుఁడుం దారవోఁ, తల మాత్రంబు ధనం బొసంగఁడుగదా తద్దానము న్మెత్తునే .." దశా. పీఠి. ౬౮.

దారవోయు. ద్య. స క్రి. (దార+పోయు.) 1. దానముచేయు. "క. అని కృతనిశ్చయుఁడై యు, ద్దనుజమణికి దారవోసెఁ దనపుత్త్రి మయుం,డ నలఁదినసన్నిధి నతఁడుఁ, దనరుచుఁ బాణిగ్రహణము దగ నొనరించెన్."ఉ. రా. ౨, ఆ. ౨౯౧. స్వా. ౫, ఆ. ౭౯, 2. పెట్టు. "గీ. శాంతి పుంభావ మొందినసౌష్ఠవమున, బంటినడిమికి నేతెంచి భవనభర్త, తపసులకు భక్తి నన్నంబు దారవోసె." కాశీ. ౭, ఆ. ౧౯౬; 3. (ఇచ్చుటకై) సంకల్పించు. "క...విప్రులకుఁ,ధేనువులం బదికేలను, మానసమున దారవోసె మఱి యిచ్చుటకున్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౧౩; 4. వివాహార్థ మిచ్చు, పెండ్లిచేయు. "చ. అని శుభలగ్నమునందుఁ గమలాసనుఁ డత్రియు సమ్మతింపఁగాఁ, దనయాల నిర్వదేడ్వురను దక్షుఁడు వేడుక దారవోసె న, త్యనుపమవైఖరిఁ,గువలయాప్తునకున్..." కళాం. ౫, ఆ. ౧౩౬.

దారి. ఉభ. వై. వి. (సం. ద్వారమ్. క. దారి.) 1. త్రోవ,మార్గము. "చ . వెఱచి కాననభూమికిఁ బిటిఁ బాఱి దారి జడత నిద్రలోఁ గలవరింపు...." నైష. ౫, ఆ. ౧౩౩. ఆం. భా ద్వి. ౨౯; 2. రీతి, విధము. "సీ. తనదర్శనస్ఫూర్తి తనదర్శనస్ఫూర్తికరణి శ్రీధామైకగరిమఁ బూన...తన దానచాతురి తనదానచాతురిదారిఁ బ్రఖ్యాతివర్ధన మొనర్ప." కళాం. పీఠి. ౫౮, ఇందు. ౮, ఆ. ౩౧; 3. స్థానము,ప్రదేశము. "వ...ఒక్కరొండ వాలివిరోధం బైన విలవెలం బాఱుచు నొక్కచాయ రాకమిత్రత్వంబు చాలకుండిన వెండు వడుచు నొక్కదారి గణవై పరీత్యంబయిన..." శుక. ౨, ఆ. ౧౬౦. ఇందు. ౮, ఆ. ౭, 4. పార్శ్వము, వైపు. "చ. చరణములందుఁ బావలాకజవ్వని భూనుప జాదురంబు లిద్ధయువురు

చిక్కటూరు లిరుదారులయుం దిద..." చం. రా. ౧, ఆ. ౫౫; 5. సూత్రధారుఁడు. "సీ... దారి నాఁ దగు సూత్రధారకుండు." ఆం. భా. ద్వి. ౧, ఆ. ౧౦౭. విణ. (సం. ధారీ.) ధరించువాఁడు. (ఇది కర్తృవాచకమగుపదముగానుండఁగనే కన్పట్టుచున్నది.) ఉదా. జడదారి, మాయదారి. సం. విణ. (ఇ. ఈ. ఇ.) చీల్చువాఁడు, పగుల్చువాఁడు.

దారించు. సం. స. క్రి. చీల్చు, భేదించు. "మ. తన దంభోళి మహస్థలిం బెరసియుఁ దారింపలేకుండుటన్, హనుమంతుం డను పేర మీఱు నని..." సమీర. ౩, ఆ. ౧౦౪.

దారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. ఆఁడుపిల్ల; 3. ఱంకుటాలు, కులట.

దారికట్టు. ద్వ. వి (దారి+కట్టు.) మూలికావిశేషము, మార్గమును నిరోధించు మహిమ గలమూలిక. "క. ఇదిదారికట్టు మొదక,ట్టిది కాంతావశ్యకరణ మిది నీమది కిం,పొదవించు నోనరేశ్వర,బలిలం బని తెల్పి కొన్నిబదనిక లొసఁగెన్." శుక. ౧, ఆ. ౫౪, కువల. ౫, ఆ. ౫౬.

దారికాఁడు ద్వ. వి (దారి+కాఁడు.) దారిలో సహాయముగా వచ్చువాఁడు. "ద్వి. నలి దారికాండ్రునై నడపించుఁ బ్రేమ." పండితా. పర్వ. ౩౬౭. పు.

దారికొట్టు. ద్వ. అ. క్రి. (దారి+కొట్టు.) దారిలో నాపి దోఁచుకొను. (బ్రా. వా.)

దారితము. సం. విణ. (అ. ఆ. అ) చీల్పఁబడినది.

దారిద్ర్యము. సం. వి. అ న. లేమి, బీదతనము.

దారుక. సం. వి. ఆ స్త్రీ కఱ్ఱబొమ్మ.

దారుకము. సం. వి. అ. పు దేవదారువృక్షము.

దారుకీటము. సం. వి అ. పు. కఱ్ఱను దొలుచు పురుఁగు, ఘుణము.

దారుకుఁడు సం. వి అ. పుం. శ్రీకృష్ణునిసారథి.

దారుగపాలు. దే వి. మల్లవిద్యావిశేషము. "వ. ఝూటుధాణు కపాలు దారుగపాలు ధాణు ధారు. మొదలగుపదు నాలుగువిసరులు .." ప్రబంధ. ౭౦.

దారుణము. సం. వి. అ. పుం 1. భయానకరసము; 2. చిత్రమూలము...; 3. క్రూరకృత్యము. "వ... ఇట వారణావతమ్మున వారల్ల నిట్టిదారుణంబు దుర్యోధనకారితంబు గా నెఱింగి కోపించి..." భార. ఆది. ౬, ఆ. ౧౬౧; 4. నాశము, చావు. "క...వీరల, కారణమున నెగులంపుట్టు కౌరవ్యులకున్." విణ. (అ. ఆ. అ.) 1. పరుషము. (మాట మొ.); 2. క్రూరము, కనికరములేనిది; 3. భయంకరము, భీషణము; 4. వాఁడియైనది, తీక్ష్ణము. (ఖడ్గాది.); 5. దుస్సహము. "వ. దాని ధృతరాష్ట్రుండు దాన ననుభవించుం గాని మీ రీదారుణంబుఁ జూడక వీరి విడిచి తపోవనంబున కరుగుం డని చెప్పిన..." భార. ఆది. ౫, ఆ. ౧౬౦, ౧౬౧.

దారుధాణు. దే. వి. మల్లవిద్యావిశేషము. ప్రబంధ. ౭౦.

దారున. దే. క్రి. విణ. ద్రు. 1. శీఘ్రముగా. "వ... అంత నిక్కడ నాశ్రమపదంబున శకుంతలయుం దారున వచ్చినవిప్రునివలన రాజు తనజన్మప్రకారం బడిగినవిధంబును..." పి. శకుం. ౧, ఆ. ౧౦౯, చంద్రి. ౧, ఆ. ౧౩౬; 2. కటాలున, ఆకస్మికముగా. "చ. చని చని యొక్కచో నతఁడు చాలఁగ నక్కజ మందుచుం గనుం,గొనఁ దమమేఘరంబిఁ బొదిగొన్నఘనావళిలోన నుండి దా,రున నుదురైరి వైభవనిరూఢిఁ జెలంగెడికొండ లంగనల్..." కళా. ౩, ఆ. ౭౩, కళాం. ౩, ఆ. ౭.

దారుపుత్రి. సం. వి. ఈ. స్త్రీ. కఱ్ఱబొమ్మ.

దారువు. సం. వి. ఉ. పుం. శిల్పి. పుం. న. కఱ్ఱ, కొయ్య న. దేవదారువృక్షము.

దారుహరిద్ర. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిపసుపు.

దారుహస్తకము. సం. వి. అ. పుం. కొయ్యతెడ్డు.

దార్ఢ్యము. సం. వి. అ. న. దృఢత్వము.

దార్దురము. సం. వి. అ. న. 1. నీరు; 2. లక్క; 3. దక్షిణావర్తశంఖము విణ. (అ. ఈ. అ.) దర్దురసంబంధమైనది.

దార్వండము. సం. వి. అ. పుం. నెమలి.

దార్వటము. సం. వి. అ. న రహస్యగృహము.

దార్వాఘాటము. సం. వి. అ. పుం. వడ్రంగిపిట్ట.

దార్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. మ్రానిపసుపు; 2. బెండతీ; 3. దేవదారువృక్షము; 4. పసుపు.

దార్వీక. సం. వి. ఆ. స్త్రీ. 1. బెండతీ; 2. మ్రానిపసుపు; 3. మ్రానిపసుపున వండిన అంజనవిశేషము.

దార్ష్టాంతము. సం విణ. (అ. ఈ. అ.) ఉపమేయము దృష్టాంతముతో వివరింపఁబడినది.

దాలము. సం. వి. అ. పుం. కోద్రవధాన్యము. న. శెట్టు తొట్టెలో నుండు తేనె.

దాలి. ఉభ. దే. వి. పాలు కాచుట లోనగువానికై అగ్ని ముట్టించినపిడుకలప్రోవు; అగ్నికుండము. "సీ. పిటకయంత్రాభిధ వెలయు దాలి. గీ. యనఁగఁ దంపి యనంగ..." ఆం. భా. ద్వి. ౭౪౦, వేం. కంచ. ४, ఆ. ४౫౫. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. పొట్టుతోఁ గూడినధాన్యము, కమిధాన్యము. (పెసలు,మినుములు. మొ.); 2. దేవదాలీలతిక.

దాలిగుంట. ద్వ. వి. (దాలి+గుంట.) దాలివేయుట కుపయోగించుగుంట. "గీ...దుబ్బుతోలు పిడు కలకుప్పల దాలిగుంత, కనర నిరతంబు వెలయు నాతనిగృహంబు." శుక. ౧, ఆ. ४౦౦.

దాలితోఁక. దే వి. (దాలి+తోఁక.) తోఁక ఆకార ముగా నుండుదాలి. "చ. పెనిమిటి చేనిపాటుపడి పేర్చు కమ్మంబున నింటి కేఁగుదెంచినతటి దాలి తోఁకపయిఁ జేర్చినకాఁగులనీరు మజ్జనం,బున కమ రించి..."శుక. ౧, ఆ. ३३౫.

దాలిమము. సం. = దాడిమము.

దాల్చిని హిం. వి. సుగంధద్రవ్యవిశేషము. (శ. ర.)

దావ. దే. వి. తగవు. (శ. ర.) "ద్వి ..నీ సకల రాజ్యంబు, గోడుగుడువఁ బుచ్చుకొని యొకజిట్టి, త్రాడుగా మరువనిదావలఁ దెనఁచి." ద్వి. హరిశ్చ. పూ. ౦౦, పు. ౧౦౭౬, పం.

దావంతము దే వి. దుఃఖము "ద్వి. దైవమా యీ దూఱు తెచ్చెంపు మనుచు, దావంతమున మదిఁ దల పోయుచుండె." ద్వి. శ. సా. ౧, భా. ३४, పు.

దావము. సం. వి. అ. పుం. 1. అడవి; 2. కార్చిచ్చు; 3. బాధ.

దావరము. దే. వి. చౌర్యము. 'సీ. దావర మనఁగను దావా యనంగను మ్రుచ్చిమి యనఁగను మ్రుచ్చిలి యన, గీ.. చౌర్యంబు చెల్లు." ఆం. భా. ద్వి. ౭౯ २.

దావరి. దే. విశే. పిరుఁడు. "క. దేవరఁ గొలిచెద ననపుడు, నీబిధమున జేత నుడుఁగఁ దెవ్వఁడును గదున్, దావరి కాఁబోలును వీఁ,డేటిరుఁడు మలయు ననుచు వ్యాపరయం బలరన్." పోత. ౫, ఆ. (శ. ర.)

దావరీఁడు. దే. విశే. (దావరి+ఈఁడు - స్వార్థము.) పిరుఁడు. "ఇంద్రవజ్రము. కుఱంగటం గ్రచ్చొదు మచ్చికంపుగ్, పెఱుంగుకోఁకల్ గొని మిఱుచాకన్, వెఱుగు పి దొందఁగ వ్రేటు లోనక, దరిం బడం గొట్టిన దావరీఁడా" అచ్చ. భా. ४, ఆ. ౭४.

దావళి. దే. వి. మడికై ధరించు కంబళవస్త్రము. "సీ. దావళి మడి పట్టుతోవతి దేవపూజాపేటి గల మూట .."ఇందు. ౧, ఆ. ౧౧౫.

దావా. దే. వి. 1. చౌర్యము. ఆం. భా. ద్వి. ౭౯౭; 2. (హిం దావా.) తగవు, వ్యాజ్యము. (శ ర. బ్రౌ. వా.)

దావాదారుఁడు. దే. విశే. (దావా+దారుఁడు.) దావాచేసినవాఁడు. (బ్రౌ.)

దావికము సం. విశే. (అ. ఈ. అ.) దేవికానది యందుఁ బుట్టినది.

దాశపురము. సం. వి. అ. న. కయివడిముస్తె.

దాశరాత్రికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. దశ రాత్రసంబంధమైనది; 2. పదిరాత్రులు జరుగునది. (యజ్ఞాదికము.) [యాదవుఁడు.

దాశార్హుఁడు. సం. వి. అ. పుం. 1. కృష్ణుఁడు; 2.

దాశుఁడు. సం. వి అ. పుం. 1. జెస్తవాఁడు, ధీవ రుఁడు; 2 భృత్యుఁడు.

దాసకాఁడు ద్వ. వి. (దాసము+కాఁడు.) సేవకుఁడు, దాసుఁడు. "సీ. భాండీరులకు గన్నఁ బ్రాణంబు లొసఁగుచు దాసకాంద్రను గన్న నాసపడుచు." మల్హ. ३, ఆ. ౧౦.

దాసనచెక్క. దే. వి. (దాసనము+చెక్క.) జపా వృక్షత్వగ్భాగము. (ఇది ఔషధములం దుపయో గింతురు. బ్రౌ. వా.)

దాసనము. దే. వి. 1. జపావృక్షము. "గీ. స్ఫటికశిల యందుఁ గలయంగఁ బ్రతిఫలించు, దాసనపుఁ బూవు కెంజాయకరణి వొలె" ఉద్భ. ३, ఆ. ౭౦. భీమ. ౧, ఆ. ౭౯; 2. జపాపుష్పము "క. ఎఱసంజదాసనంబుల, తెఱఁ గర్యెను..." ఉ. హరి. ౧, ఆ. ౭४.

దాసమయ్య. వై. వి. (దాసము+అయ్య.) దాసుఁడు, సేవకుఁడు. "సీ. వణ్ణవతిశ్రాద్ధచయ మారఁ బెట్టు శంకరదాసమయ్య భక్తప్రతతికి." అను. ४, ఆ. ४३.

దాసము. వై. వి. (సం. దాస్యమ్.) సేవ. (చూ. దాసమయ్య.)

దాసరయ్య. వై. వి. (దాసరి+అయ్య.) 1. కాఁపేలు. "క. వలఁ జిక్కక చని మృగ మిప్పులఁ జిక్కెను దాసరయ్య వలవనిజాలిన్, దలఁకంగ నేల నే డీ, కోలఁదికిఁ గూరయ్యె ననుచుఁ గొని పోవుకటికిన్." నా. పంచ. ౨, ఆ. ౨౧౨; 2. విష్ణుభక్తుఁడు. "ఆ. అని తపీయదాస్య మంగీక రించె నద్దాసరయ్య యచట నాసరోజలోచన యును మ్రానిఁ జేవ చొచ్చినగతిఁ బ్రవేశ మంది ప్రతిదినంబు." వైజ. ౨, ఆ. ౧౧౪; 3. ముని. "క...అయ్యనిరోధ కపుఁదిండిదాసరయ్య దలిపినన్." అచ్చ. అయో. ౧౬.

దాసరి. వై. వి. (సం. దాసేరః క. దాసరి.) 1. విష్ణుభక్తుఁ డగుశూద్రుఁడు, విష్ణుభక్తుఁడు "గీ. వాద మే మాయె నన్ను భూవరునికడ, పాత మా దాసరికిఁ గన్గి బ్రతికె ననెను, వారు .." ఆము. ౪, ఆ. ౭, అం. భా. ద్వి. ౨౮౫, 2. భిక్షుకుఁడు. (చూ. దాసరిబుట్ట.)

దాసరికొయ్య. ద్వ. వి. (దాసరి+కొయ్య.) మత్స్య విశేషము. "సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱమీ నులస ముచ్చెంగి చేపిస జెల్ల చాఱ మీను." హంస. ౪, ఆ. ౧౮౭.

దాసరిగాఁడు. ద్వ. వి. (దాసరి+కాఁడు-స్వార్థమున.) కాఁపేలు. (శ. ర.)

దాసరిపాము. ద్వ. వి. (దాసరి+పాము.) సర్పవిశే[షము. (శ. ర.

దాసరిపిట్ట. వై. వి. (దాసరి+పిట్ట.) శామాలపిట్ట. (బ్రౌ.)

దాసరిబుట్ట. వై. వి. (దాసరి+బుట్ట.) భిక్షమెత్తుకొను బుట్ట. "ఉ. పేదరి యేమటన్న విలువెల్వఁడఁ జాలఁడు చేతనంటి మా, దాసరిబుట్టయుం స్మదు కదావళిదట్టియుఁ గానికాసపో, కేసరిమధ్య నీ ప్రతిన గెల్చె .." వైజ. ౩, ఆ. ౯౪.

దాసానము. దే. వి వృక్షవిశేషము. "సీ. తాంత్ర చందన మేపె దాసాన మెట్టిదాసానము చిందుగ చాలఁజొన్న." హంస. ౪, ఆ. ౧౧.

దాసాని. దే. వి. దేశవిశేషము. "ఉ. హురుమంజి పల్ల మింపైనఖలీనమున్ బిరుదుటందియగజ్జెల పేరుఁ బూని దాసానిపటానిఁ దెచ్చెఁ గుహి కానికి రాతెఱఁగంటిచెటికిన్." రా.వి. ౨.ఆ. ౪౬.

దాసి. సం. వి. ఈ. స్త్రీ. 1. పరిచారిక, పనికత్తె; 2. కాకిగొండలి; 3. నల్లగోరంటి; 4 పచ్చ గోరంటి.

దాసికత్తె. మి. వి. (దాసి+కత్తె-స్వార్థమున.) పరిచారిక, దాసిజాతిస్త్రీ. "సీ. చేరెలఁ గనుఁగొన్న వాల్మీఁ జూపుడు దాసికత్తెల గన్నఁ దార సిలుచు." మల్హ. 3, ఆ. ౧౦.

దాసు. సం. వి. అ. పుం. (ఇది వృద్ధాదులలోనిది.) భక్తుఁడు. "ఉ...విష్ణుదాసెక్కుడిభక్త గాఁగ వృజినయించె నజుఁడు .." హంస ౧, ఆ ౭౯.

దాసుఁడు. సం. వి అ. పుం. 1. భృత్యుఁడు, వెలఁకు గొన్నపనివాఁడు; 2. భక్తుఁడు; 3. శూద్రుఁడు; 4. జ్ఞాని; 5. దానపాత్రుఁడు; 6. జాలరి; 7. వృత్రాసురుఁడు; 8. దస్యుఁడు.

దాసేయుఁడు. సం. వి. అ. పుం. 1. దాసుఁడు; 2. జాలరివాఁడు. విణ. (అ. ఈ. అ.) దాసిఁ బుట్టినవాఁడు.

దాసేరుఁడు. సం. = దాసేయుఁడు.

దాష్టికము. దే. వి. (క. ధాష్టిక.) అధికారమందలి దిట్టతనము. "ఉ. వారు దివాణ మాట బలవం తుల రింకటి కెన్నఁగా జమీందారులు మీర లట్లగుట దాష్టిక మెల్లను వారిపొమ్ము ....." రంగా. ౨, ఆ. ౨౩౧.

దాస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఈయఁ బడఁబోవునది; 2. భవిష్యత్కాలమున నీయఁ బడునది.

దాస్యము. సం. వి. అ. న. సేవ, దాసత్వము.

దాస్రము. సం. వి. అ. న. అశ్వినీనక్షత్రము.

దాహకము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. చిత్ర మూలము. విణ. (అ. కా. అ.) 1. దహించు నది, కాల్చునది; 2. తాపము కల్గించునది.

దాహనము. సం. వి. అ. న. కాల్పించుట.

దాహమిచ్చు. ద్వ. స. క్రి. (దాహము+ఇచ్చు.) దాహశాంతికొఱకై యుదకాదుల నిచ్చు. "వ...తక్కువపడ నొకపూట కిన్ని దాహం బిచ్చువారును గలరే యని యనేకప్రకారంబుల బోధించి..." సాసంద. ౫, ఆ. ౧౩.

దాహము. సం. వి. అ. పుం. 1. కాల్చుట; 2. దేహ మునఁ గలుగు సంతాపము; 3. కాఁక, వెట్ట; 4. దప్పిక. (ఈయర్థము సంస్కృతనిఘంటువు లలోఁ గనఁబడదు.) "చ...దప్పిగొన్న కర్త్యనకు మనోహరాంబువులు గ్రోలక ముందున దాహ మాఱునే." శై. ౯, ఆ. ౨౩౪. దశా. ౨, ఆ. ౧౩౬.

దాహారి. వై. వి. (సం. దాహీరః.) విష్ణుభక్తుఁ డగు శూద్రుఁడు, విష్ణుభక్తుఁడు. "వ...కహాకహ నవ్వి యద్దాహారికి సురద్రోహి యిట్లనియె." ఆము. ౬, ఆ. ౩౧. (శ. ర. పా.) ఆం. భా. ద్వి. ౨౮౫.

దాహస్థలము. సం. వి. అ. న. శ్మశానము, వల్లకాఁడు.

దాహి. సం. విశే. (స్. నీ. న్.) 1. కాల్చునది; 2. తాపము కల్గించునది; 3. తాపము కలది.

దాహ్యము. సం. విశే. (అ. ఆ. అ.) కాల్పఁదగినది.

దాళా. దే. వి. 1. తక్కెడలోని పెద్దతగ్గు. (శ ర.) 2. (నెయ్యి నూనె మొదలగునవి తీయుపాత్రలనుగాని అవి యుంచి యున్న పాత్రలనుగాని) పరియొత్తుతాలను దడతట్టనుంచి తూఁచుట. (శ.ర.)

దాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. సొగసు లోనగువాని కుప్ప; 2. దేవదాళీలత.

దాళిమి. సం. వి. ఈ. స్త్రీ. 1. దానిమ్మచెట్టు; 2. విలకిచెట్టు.

దాళిమ్మ. వై. వి (సం. దాడిమః.) దాడిమచెట్టు. (శ. ర.)

దాళీతుఁడు. దే. విశే. కార్యకర్త, పనిచేయు వాఁడు. (శ. ర.)

దాళు. దే. వి. వర్ణలేశము. "ఎ. రస మెక్కి యీ శెలు రయమున బలిసెఁ, బసుపు దాళెక్కి యేర్పడఁ బల్చ లగుచు." భాగ. ౧౦, స్కం. (శ.ర)

దాళువా. దే. వి. సస్యవిశేషము, శరదృతువు మొదలు కాని నీటిపైనాధారముగఁ బండుపల్లపుపంట. (శ ర.) ఖ. ధాన్యవిశేషము. "సీ. రామబాణాలు రెక్కలు వెన్నముద్దలు జిల్మబుడుతలు దాళువాలు." హంస. ౪, ఆ. ౧౨౮. ప్రబంధ. ౧౧౯.

దాళువాళించె. దే. అ. క్రి. ఒప్పు, ప్రకాశించు. "వ ..దాళువాళించు సన్నసున్నంబుచేత లేఁత వెన్నెలలు నెమ్మించు క్రొమ్మించులుం గల మేడ లును .." పి. శకుం. ౧, అ. ౮౬.

దాళ్వా = దాళువా. (శాల్యంకురము.) "సీ. ఒకపరి మింగలివాయొంట్లు దాళ్వావెక్కు నిద్దంపుఁ జెక్కులసీడఁ జూడు." దశా. ౮, ఆ. ౧౩.

ది

ది. దే. ప. సంబంధముఁ దెలుపునపు డనుప్రయుక్తమగు 'అది' శబ్దముయొక్క ఆద్యక్షరము లోపింపఁగా మిగిలినరూపము. ఉదా:—నాది, నీది వానిది మొ. "ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన, దేవరాజ్యమహిమఁ దివిరి నీవు." భార. అ. ౪, ఆ. ౩౬, హరి. ఉ. ౨, ఆ. ౧౬౫.

డించు. దే. స. క్రి. (దిగు. ధా. ప్రే.) 1. తగ్గించు, దిగఁజేయు. "గీ తెగువ సాగ్రహబుద్ధియుం డించవైతి." భా. రా. యు. ౨౨౦౩; 2. అవరోహింపఁజేయు, క్రిందికి చేర్చు. "గీ. ఈ చెలువ నన్నుఁ జేరిన వింత నెపుడు, బొమ్మ డించక యుండు ముదమ్ము మీఱ." దశా. ౨, ఆ. ౨౩౪. ఉ. రా. ౧, ఆ. ౨౮; 3. చెడఁగొట్టు, భ్రష్టము చేయు. "చ. సడి కొడిగట్ట లేనికనుచాటు మెలంకువ లీఁగఁబోండ్లకున్, గడుపులు డించ నింకులకుఁ గాంతవశీకరణార్థమంత్రముల్, నొడువఁగ..." శుక. ౨, ఆ. ౨౪. చిత్రభా. ౮, ఆ.

డించుకొను. దే. స. క్రి. (డించు+కొను.) చెడఁగొట్టుకొను, భ్రష్టముచేసికొను "ఉ. సిగ్గొకయింత లేక వెలచేడియకై వడి ధర్మకీర్తులన్, బొగ్గులు సేసి జారుతశిఁ బొంది కటా కడు పేల సేసికొం, టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము డించుకొమ్ము .." భాగ. ౯, స్కం. ౩౭౮.

డిందెన. దే. వి. గిరికర్ణిచెట్టు. "సీ. తెల్ల డిందెన పువ్వుఁ దెచ్చి తద్రస మిడి కలిపె పువ్వులు గోసి నలిచి కడిది." కాశీ. ౩, అ ౧౧౦. ఆం భా. ద్వి. ౫౬.

డిండర. దే వి. (డిండు ధా.) నాఁగలి కడ్డుగా వేసెడికఱ్ఱ, తిర్యగారోపితదారువు. "సీ. డిండర నాఁగను దిర్యగారోపితదారువు .." ఆం. భా. ద్వి. ౨, ఆ. ౩౩.

డిండీఁడు. దే. విశే. (డిండు+ఈఁడు.) కాసె గట్టిన వాఁడు. (శ. ర.)

డిండు. దే వి. 1. తలగడ. "ఉ...పెద్దడిండుపైఁ బోలుచు నల్లడ బైగడి చూచుచుఁ గ్రమ్మఱఁ గన్నుమూయుచున్..." చెన్న. ౫, ఆ. ౧౩; ప్రబంధ. ౬౦౫; 2. దట్టి, కాసె. "చ. పసుపుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పగ డిండుగట్టి నూ,తన మగుబర్హిబర్హకృతదామము నెట్టెము సుట్టి..." హరి. పూ. ౬, ఆ. ౧౭౯; స్వా. అ ౪. ౩౩. 3. కచ్ఛభేదము, కుచ్చెల. "సీ. కటిమీఁద జాఱిన కనక సూత్రంబుతోఁ బీతాంబరము డిండు బిగియఁ దిగిచి." హరి. పూ. ౫, ఆ. ౯; 4. మొలఁగుచిక్కు లోనగునవి యంటించెడు రాక్షసునివాని పావతిరుగుడుకొయ్య. (శ. ర.); 5. చుట్ట. "సీ. నడుచుట్టి పట్టెపా లిడి తాలిఁ లొనర్చి కదలు కొల్చిన గొప్పజడలడిండు." శుక. ౨, ఆ. ౩౨; 6. అతి

గయము, ఆధిక్యము. "ద్వి. రాద మొత్తము దెక్కు రాజువరియుక్కు, గోచయుంబులదిండు కోమట్ల మొండు." ద్వి. తి. పా. ౧, ఆ. 3, ౖ; 7. దీపము. "ఉ...అ,దారిని దానుఁ జేరసము దాల్తు నటంచుఁ దలంచి లంక కెం,లే రఘునాథుదూత సరణిన్ కెల కన్నడె దిండుకై పడెన్." చం. రా. ౭, ఆ. ౨౭, (చూ. సం. చం. రా. సుంద. ౧౯, శ్లో); 8. మాలువడుకురాట్నపుకదురునకు నూలుఁగానగు వానితో నేర్పఱచుపిడి. "క. పడిదారముచెవులుం ద్రొక్కుడుకులకయుం దిండుకదురు .." శుక. ౨, ఆ. ౪౧౯.

దిండుపడు. ద్వ. అ. క్రి. (దిండు+పడు.) సొమ్మసిల్లు, మూర్ఛపోవు. (బ్రౌ.)

దిండిమము. దే. వి. భేరీమృదంగాదివాద్యధ్వనివిశేషము. "వ...నిస్సాణంబులధణంధణలు ధమామీలదిండిమ్ములు విజయశంఖంబుల ఘుమంఘుమలు..." ప్రబంధ. ౭౦౦.

దింపు. దే. స. క్రి. (దిగు. ధా. ప్రే.) 1. ఆఁచు, పోఁగొట్టు. "వ .. మొల్లలతావులఁ గొల్లలాడు భ్రమరదంపతులయింపుసొంపులు దింపుసాపెంగల పంపదలకు..." ఉ. రా. ౬, ఆ. ౨౪; 2. వీడు, విడుచు. "సీ. వికత భైరవకరాహతిఁ దలంకని నాఁటిపద్మగర్భు ప్రతిభాభరంబు. గీ. సత్యభామాధిపతి చేతఁ జలన మొందిన, బలిమి దింపని నాఁటి కల్ప ద్రుమంబు, వితరణంబుచు దనయంద వెలయ వెలయు, మూరయన్న ప్రధానకంఠీరవుండు." ఉద్భ. ౧, ఆ. 3౦; 3. క్రిందఁబెట్టు. వ్యవ:– సామిత్తిమీఁదిగంప దింపుము. వి. 1. వ్రేలుట, లంబనము. (శ. ర.); 2. కొబ్బరి మున్నగుచెట్ల నుండి కాయలు కోసి క్రిందవైచుట. వ్యవ:— కొబ్బరితోఁటలో చాలదింపులు దింపినారు.

దింపులకుఁదెచ్చు. దే. స. క్రి. (దింపులకున్+తెచ్చు.) తిరస్కరించు. "వ .. ధనుర్ధరులవంపు దింపులకుఁ దెచ్చుకొమరు గలకనుబొమలుచు .." చం రా. 3, ఆ. ౯౦.

దింపులువోవు. దే. అ. క్రి. (దింపులు+పోవు.) వ్రేలాడు. "సీ. అందంద వటోరుహాములు దింపుట వోవఁ దొడుకనిచ్చుట రొట్టు దుగ్ధరసము." కాశీ ౪, ఆ. ౧౦.

దిక్కుమము. సం. వి. అ. పుం. ఏనుఁగుగున్న, కరభము.

దిక్కుమొకము. వై. విణ. భయాదులచే దిక్కుతోఁచక పాఱిపోవువాఁడు. "ఉ... మేని గాడ్పుచే, నక్కుట సుగ్గులయ్యె జలదాళివిమానము లిందు వీడిచే, కొక్కుడిపద్మజాండ మని యేఁగిరి దిక్కుమొకంబులై సురల్." సమీర ౨, ఆ. ౧3౪.

దిక్కుమొగము = దిక్కుమొకము. "ఆ. ఒక్కమొగము గాక యుంతికిరి సైనికుల్, దిక్కుమొగము గాఁగఁ జిక్కిభటులు, మ్రొక్కి రీటియులు దటుక్కునఁ బడవైచి, యక్కిరీటియెదుట నాఁగఁ గలరె." విజ. 3, ఆ. ౧౫౭, (శ. ర. పా.) రామా. ౭, ఆ. ౧౪౦.

దిక్కరి. సం. వి. న్. పుం. దిగ్గజము.

దిక్కామొకము = దిక్కుమొకము. "సీ. పోయిన పోకలై పోయిరి సిద్ధులు దిక్కామొకములైరి దిగధిపతులు." పారి. ౫, ఆ. 3౭.

దిక్కామొగము = దిక్కుమొగము. "గీ. గబ్బిమెకములు దిక్కామొగంబు లయ్యె." రా. వి. 3, ఆ. 3౬, అం. భా. తృ. ౯.

దిక్కు. సం. వి. శ్. స్త్రీ. 1. దెస, దిశ; 2. మార్గము, పద్ధతి; 3. దంతక్షతము; 4. రక్షకుఁడు, శరణము, ఆధారము. "సీ. జగదుద్భవస్థితిక్షయహేతు వెవ్వఁడా,దేవాదిదేవుండు దిక్కు నాకు." పాండు. ౫, ఆ. ౧3౯-౧౪౦; భా. రా. అయో. ౧౬౪, 5. ఎడ,విషయము. "క. ఎక్కువ తక్కువమాటలు, నుక్కివములు కొందఁ గీడు లొందించుటలుం, బెక్కు దనయన్నదమ్ముల, దిక్కుల నన్నియుచు నైనఁ దేజము చేయున్." భార. శాం. ౨, ఆ. 3౫౯. హరి ఉ. 3, ఆ. ౨౨3; 6. వైపు, పక్షము. "ఆ. ఇట్లు దళితమె సేని యిప్పుడ యీఁకఁ డే,దిక్కువారి నెల్ల నొక్క యొత్తు, గాఁగఁ బిలుకుమార్చి..." భార. ద్రో. ౫, ఆ. ౧౯౬. హరి. పూ. 3, ఆ. ౧౨౪; 7. స్థానము, నెలవు. "క. రక్కసులగురువు గురునకు, వెక్కస మగుమతికి నిరవుపెరపుల కెల్లన్, దిక్కు సుడి కెక్కులేగురుఁ, జొక్కు దివిన్ బటులు గదు నుచుక్కనఁ బొడిచెన్." విప్ర. 3, ఆ. ౪౭, భాగ. ౬, స్కం. 3౩౯.

దిక్కుబిళ్లలు. మి. వి. బ. బాలక్రీడావిశేషము. (బ్రౌ.)

దిక్కుమాలు. మి. అ. క్రి. (దిక్కు+మాలు.) రక్షకహీనమగు; దుష్టిపతినందు. క"...కాశం,బుల

సఖావఁగ నిదుదనిదుర్వనొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడుగదే." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౬౨. భాగ. ౮, స్కం. ౬౧.

దిక్పతి. సం. వి. ఇ. పుం. = దిక్పాలుఁడు.

దిక్పాలుఁడు. సం. వి. అ. పుం. 1. దిక్కులనేలిక లలో నొకఁడు. (ఇంద్రుఁడు మొ. ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, నైరృతుఁడు, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు. వీరు క్రమముగా ప్రాగాదిదిశల కధిపతులు.; 2. దిక్కుల యేలికలలో నొకఁడు (సూర్యుఁడు మొ. సూర్యుఁడు, శుక్రుఁడు కుజుఁడు, రాహువు, శని, చంద్రుఁడు, బుధుఁడు, గురుఁడు. వీరు క్రమముగా ప్రాగాదిదిశల కధిపతులు )

దిగ. దే. వి. జూదమాడుట కుపయోగించు పాచికల మీఁది మూఁడ్రావిశేషము. "సీ. మేటిజూదరి యన వాటమై తివుటమై నాడుచుండుదు నే నహర్ని శంబు, వృష్టి యేమఱక సందియం జాగరంబుసు దిగయును గరయు నాఁ దేటపడిన, యచ్చులకోవ నేయుచై చ్చనఁ గైకొని మాటలాడిన యట్ల వేటు గలుగ." ద్వా. ౧౦, ఆ. ౮౮.

దిగంబరుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. క్షపణ కుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. దిక్కులే వస్త్ర ముగాఁ గలవాఁడు, దిస్సమొలవాఁడు; 2. దరి ద్రుఁడు.

దిగఁగాఁచు. దే. అ. క్రి. (దిగన్+కాఁచు.) కృశించు, దిగకాఁచు. "క. మగువలు గరగరనై తగు, మగవానిం జూచి పీఁడు మగఁ డైనఁగదా, తెగు దుఃఖం బనుకొంచుం, దిగఁగాఁచుదు రెపుడు సొమ్మది న్యగ మిగులన్." శుక. 3, ఆ ౫౧౬.

దిగఁదన్ను. దే. స. క్రి. (దిగన్+తన్ను.) దిగ విడుచు. "చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నిన చీరలం గౌఁగిలింతలం, బగఁగొని యడ్డగింపఁగఁ బెనుల్చినహారములన్..." వేం. పంచ. ౪, ఆ. ౩౦౯. ఇట్లే దిగఁ దాఁచు. నైష. 3,ఆ. ౨౯౫.

దిగఁదీయు. దే. స. క్రి. (దిగన్+తీయు.) 1. దిగఁ దుడుచు. (శ. ర. ప్రా); 2. నిరుత్సాహపఱచు. వ్యవ:—అతఁ డూఁపని చేయకుండ వానిని దిగఁ దీసినాఁడు.

దిగఁదుడుపు. దే. వి. (దిగదుడ్చు ధా.) దృష్టి దోషాదిపరిహారార్థము ఉప్పు మిరపకాయలు మున్నగువానిని-చుట్టుత్రిప్పుట. వ్యవ:—ఎన్ని దిగఁదుడుపులు పెట్టినను లాభించలేదు.

దిగఁదుడ్చు. దే. స. క్రి. (దిగన్+తుడ్చు.) - దృష్టి దోషాదిపరిహారార్థము ఉప్పు లోనగువానిని చుట్టు త్రిప్పు. "ద్వి. క్రమ్మన భసితంబుఁ గలయంగఁ జల్లి ముమ్మారు దిగఁదుడ్చి ముట్టె నంతటను." బస. ౬, ఆ. ౧౬౯. పం.

దిగఁద్రావు. దే. స క్రి. (దిగన్+త్రావు.) 1. విడుచు, పరిత్యజించు. "సీ. చదువులు విడిచి యాచారంబు దిగఁద్రావి..." దశ. 3, ఆ. ౯, భార. అను. ౫, ఆ. ౩౩౮; 2. డిగ్గు. "క. కన్నంతన తనయేలిక, దున్న దిగంద్రావి రథపదోలాయితహ, కోన్నత వక్షస్థలుఁడై, యన్నలినాక్షునకు వంచె నాత్మ శిరంబున్." హరి. పూ. ౬, ఆ. ౧౯౪.

దిగఁద్రోచు. దే. స క్రి. (దిగన్+త్రోచు.) విడుచు. "గీ. కలఁక యొంతయుం దిగఁద్రోచి చెలువ మెసఁగఁ, జేర వచ్చిన ప్రియభామ గారవించి." పారి. ౨, ఆ. ౧౫.

దిగఁబట్టు. ద్వ. స. క్రి. (దిగన్+పట్టు.) క్రిందికి లాగు (ప్రా)

దిగఁబడు. ద్వ. అ. క్రి. (దిగన్+పడు ) 1. (బురద మున్నగువానిలో) కూరుకొను "గీ. పంకమున గొరిజ దిగఁబడఁ బఱవలేవుమన్న లివ్వేళ రేగటిమన్ను లందు." స్వా. ౪, ఆ. ౨౦, ఆము. ౪, ఆ. ౩౫; 2. అడఁగు, క్రుంగు. "క... పాతాళమునకు దిగఁ బడ నయ్యచలముఁ జరణాంగుష్ఠమున నల్లఁగతి నదిమెన్." భా. రా. అర. ౧, ఆ. ౮౪, ఉ.రా. ౨, ఆ ౧౭౩; 3. మునుఁగు. "వ...శంబరుం డను రాక్షసుండు దనమాయాబలంబునం గామ రూపియై వచ్చి కొనిపోయి సముద్రంబులో వైచి తనగృహంబునకుఁ జనియె నంత నాశాబకుండు జలధిజలంబున దిగంబడ నొడిసి యొకమహా మీ నంబు మ్రింగె." భాగ. ౧౦, స్కం. ఉ; 4. ఓడు. "ఆ గొంతికడుపునందుఁ గొడుకుఁ జాలై నీవు, దోఁకుండవై తి తోఁచినట్టిపిండ మెడలి యైనఁ బిదప దిగంబడ,దయ్యె నింత పుట్ట దట్టు లైన." భార. కర్ణ. 3, ఆ. ౬౬; 5. పోవు, తొలఁగు. "చ...ఇప్పు డస్త్రైస భయంబు దిగంబడ నీవు పోయి పార్థునిఁ గని సింహనాదమున రోదసి నింపుము మాకు నింపుగన్." భార. ద్రో. ౪, ఆ.

౧౩౫. పాండు. ౪, ఆ. ౧౬౬; 6. మాను, నిలుచు. "ఉ. కారణ జైనకర్మములు కాక దిగం బర పెన్నిగొండులం,దూరిన చింతవారలకు..." భా. ౯. ౩౩; 7. మిగులు,తప్పిపోవు. "క. వెలఁది కటి పేర విల నొక,పులినము దిగఁబడియె సింధు పులినపుఁబంక్తిన్, నలువ యది పడఁగఁ గాదే, తెలియుట కం దంచపదము తిరముగ నిలిపెన్." ఆము. ౫, ఆ. ౯౯. [(గ్రా.)

దిగఁబాటు. వ్య. వి. (దిగఁబడు ధా.) శేషము, మిగులు.

దిగఁబాఱు. దే. అ. క్రి. (దిగన్+పాఱు.) 1. జాఱిపోవు తగ్గు. "గీ. కాంతి దిగఁబాఱ బ్రాచీముఖాంబు నందుఁ, బద్మినీముఖారిశశిప్రాభి కదలె .." కవిక ౪, ఆ. ౭౩; 2. దిగజాఱు, మీఁదినుండి క్రిందికి జాఱు. "సీ.. వెళ్లఁబెట్టునో పూర్ణవిధుకాంతి మొగ మున దిగఁబాఱునో పైడి తెలివి శేష." నిరం. ౪, ఆ. ౯౧, ౯౩.

దిగఁబెట్టు. (దిగన్+పెట్టు.) 1. విడుచు. వ్యవ:- బాలుని బడిలో దిగఁబెట్టి వచ్చినాను; 2.మిగుల్చు. వ్యవ-వాఁడు డొకపం డైన దిగఁబెట్టకుండ తిని వేసినాఁడు.

దిగఁబోఁత. దే. వి. (దిగఁబోయు ధా.)మట్టట, క్రిందికి దిగుట. (వ్యవ ) వానికి పొంగు దిగబోఁతలోనికి వచ్చినది.

దిగజాఱు. దే. అ. క్రి. (దిగన్+జాఱు.) 1. క్రిందికిఁ బడు,చ్యుతమగు. "క. నగుచాయల ముకుముక్యము, జిగిలోఁ బలుగంట్లు నిండి చెన్నుసగారెం,దగు మోము చంకువలసం,దిగజాఱుచు నుండు మేలు దివ్యాన్న మనన్." కాళిందీ. ౬, ఆ. ౧౯౦. నిరం. ౨, ఆ. ౭౯; 2. జాఱిపోవు. "గీ. పువ్వు దామంబు దిగజాఱి భూమిఁ బడియె" దశా. ౨, ఆ. ౨౦, నిరం ౨, ఆ. ౭౯; 3. కాఱు,స్రవించు. "వ ..అశ్రుధారా ప్రవాహంబులు ..జాఱు వామెఱుంగుఁబయ్యెదమీఁదికి దిగజాఱి..." ఉ రా. ౬, ఆ. ౨౬౬. వరాహ. ౧౧, ఆ. ౪౮; 4. పోవు; తగ్గిపోవు. "రగడ. ఇగురుఁబోం డ్లెన్నరై రీవులును గీవులును, దిగజాఱ విడిచి రటు కీవులును వావులును." రాసుచ. ౨, ఆ. ౬, వ్యవ:-వానికి పొంగు దిగజాఱినది; 5. క్రుంగు,దిగఁబడు. "సీ. ఎలుకలు ద్రవ్వినయింటిచందంబున దిగజాఱి నీ మేను మిగుల డస్సె." వాసిష్ఠ. ౧, ఆ. ౬౬.

దిగటము. దే. వి. (దిగు ధా.) నిలువు? "క. గడగడ నొడలు వడంకఁగ, దడదడ దడదుచు గుండె తల్లడ మందన్,బడిబడి వడ్డము దిగటముఁ,బడిబడి మ్రొక్కుచును బాహి పాహి యనంగన్." దశా. ౨, ఆ. ౧౧౮.

దిగదాటు. దే. అ. క్రి. (దిగన్+దాటు.) దిగు, క్రిందికి వచ్చు. "సీ. కాంచి యాఁదంతుఁడు గ్రమ్మన దిగదాటి వెనుకొనునంతఁ గవఁపుట్టఁ, గొచ్చె నయ్యురగము .." భార. అశ్వ. 3, ఆ. ౧౦౫. (చూ. ౧౦౪.)

దిగదిగ. దే వి. 1. వివరుట మెఱయుట లోనగు వానియం దగునసుకరణము. "గీ. అజ్జరుచిః దూర్పు దిగదిగ యంచు మెఱసె" (శ. ర.) స్వా. ౪, ఆ. ౬౦; 2. నిక్కించుట మొదలగు వానియం దగు ననుకరణము. "ద్వి. మృగములు నిక్కించి మెడ లెత్తి చెవులు,దిగదిగ నిక్కించి దిశ లాలకించి." పవ. ౧, ఆ. ౫౦, పు. క్రి. వీణ శీఘ్రముగా, వడిగా. "క...లేఁ, జిగురురుటాకులు పెట్టిరి,దిగ దిగ నర్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్." భీమ. ౨, ఆ. ౧౨౮, ఆము. ౬, ఆ. ౯౪.

దిగద్రొబ్బు. దే. స క్రి. క్రిందికి త్రోయు,గెంటు. "వ. అని పలికినవాఁడుకుచు ధిక్కరించి మున్మున్ చేయక రక్కసులతోఁడు తనతోడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి .."భాగ. ౭, స్కం ౧౮౪.

దిగనాడు. దే. స. క్రి. (దిగన్+ఆడు.) 1. విడిచి పెట్టు, త్యజించు. "వ. అని విదురుండు ధృత రాష్ట్రునకు విరక్తిమార్గం బుపదేశించిన నతండు ప్రజ్ఞాచక్షుండై సంసారంబు దిగనాడి..."భాగ. ౧, స్కం. ౩౧౬, ౩౫౮. కాశీ. 3, ఆ. ౭౩; 2. తిరస్కరించు. "సీ. చల మూని యలమేనుఁ గులమూడు దిగనాడి మగతాలతిగనేలఁ దగుదు కొగడి." సీలా. ౧, ఆ. ౪౫.

దిగమోపు. దే. స. క్రి. (దిగన్+మోపు.) దిగ దుడుచు. "చ...కోర్కిచే, సురమున నుంచుఁ దుద్దుఁగడు నొప్పు మనోభవభూతకాంతియై, యురుదుగ రతిపూజ యుభలాంగములన్ దిగ మోపుచాడ్పునన్." భో. ౫, ఆ. ౧౫౦.

దిగమ్రింగు. దే. స. క్రి. (దిగన్+మ్రింగు.) పూర్తిగా మ్రింగు; హరించు. "ఉ. కడతేఱఁగ నిత్తునని యింక వారలన్,మిక్కిలి కత్తి మీఱ దిగమ్రింగెద

నంచుఁ బరిష్ఠింపఁగన్." దశా. ౨, ఆ. ౩౩౨, సా. ౨, ఆ. ౧౬౪.

దిగవిడుచు. దే. స. క్రి. (దిగన్+విడుచు.) విడిచిపెట్టు,త్యజించు. "క. తగసుమహైశ్వర్యోదయ, మగుగృహము బ్రబలనిద్ర నందినభార్య దిగవిడిచి యొక్కఁ డేనియు,జగతీశుఁడు సకలవిరతుఁడయ్యెనందున్." భాగ. ౪, స్కం. ౪౦౭, హరి. పూ ౫, ఆ. ౨౨౨

దిగవైచు. దే. స. క్రి. (దిగన్+వైచు.) 1. విడుచు. "క. చెప్పెడి దే మిఁక నొకచో, దెప్పర మగునుక్కుచేత దిగవైచిన వే,తప్పూకొని కదలకుండెడు, కప్పులితీరునను దేరు గదలక నిలిచెన్." శుక. ౨, ఆ. ౧౧; 2. పడవేయు. "గీ. చచ్చినవి యున్న యని తాను జంపు టుడిగి, వటముక్రింద నన్నిటి దిగవైచువాఁడు." కేయూర. ౩, ఆ. ౭౦.

దిగపన. దే. క్రి. విణ. ద్రు. దిగువగా. "గీ. భూసురులఁ ద్రోవ వేమి మహాసురారి,యిప్పు డేటికిఁ ద్రుంప నేం డ్లైగనశ్రైన బుద్ధి దిగవచ్చెనో పో మహేమి." సిం. నార. ౧౧౯.

దిగాలుపడు = దిగాల్పడు. (బ్రౌ.)

దిగాలు. దే వి. వ్యాకులత. (చూ. దిగాల్పడు.)

దిగాల్పడు. ద్వ. అ. క్రి. (దిగాలు+పడు.) వ్యాకులపడు. "ఉ. భూసురవర్యనందనుఁడు బుద్ధికిఁ దోఁచినయట్ల పల్కెఁ ,గ్యాసుఁడు కానరామికి దిగాల్పడి దిక్కులు చూచి .." చెన్న ౩, ఆ. ౧౪౯

దిగిపించు. దే స. క్రి. (దిగు ధా. ప్రే.) దిగఁజేయు, దింపు. "ఉ. అందలిసెట్టు లందఱు దయామతిసన్ దిగిపించి యోడఁ గానం దమయొద్దఁ బెట్టుకొని .." దశ. ౧౦, ఆ. ౫౯. ('దిగితెచ్చి' పాఠాంతరము.)

దిగు. దే. అ. క్రి. 1. మీఁదనుండి క్రిందికి వచ్చు, అవరోహించు. "క. బృందారకపథమున దిగి, యిందీవరపత్త్రనేత్ర యిరువంకలవ్వారుం దమకతమక రార, యిందనఁగా రెండుపీఁట్లయెడమున విడిసెన్.' హర. ౬, ఆ. ౧౦౧. ఆము. ౪, ఆ. ౩౫. 2. (పెఱుతావులనుండి)వచ్చు, "చ...సింహభూధర, ప్రభులిరువాళ్లకుం దిగుసురప్రకరంబు...స్వా." ౧, ఆ. ౩౭, శుక. ౧, ఆ. ౮౭; 3. జాఱు,దిగఁబడు. "గీ. కడుపు దిగనంచుఁ దారులు కలఁగఁబడఁగ." భాగ. ౧౦. స్కం. పూ. ౬౨; 4. క్రిందికి జాఱు. "గీ. కట్టి తోఁడి పూస జైకుపి కొకుకమునఁ, గొనదిగఁగ నీలిపుట్టంబు ముసుఁగుపెట్టి..." హర. ౬, ఆ. ౧౧౯; 5. (ప్రయాణమై పోవుచు దారిలో) విడియు. (శ. ర); 6. చొచ్చు, ప్రవేశించు. "ఉ. అవ్వసుధాసుధాశనకులాభరణం బలిరమ్యమైనయా, జవ్వన మాజవంజవవికాలసుఖానుభవైకయోగ్యమై, నివ్వటిలన్ విరక్తిసరణిం దిగె నిందుముఖుల్ రతిచ్ఛచే,నువ్విళులూరు డెందముల నోలిఁ జెవుక్కురటంచు నుండఁగన్." విప్ర. ౧, ఆ. ౮౧, ఆము. ౫, ఆ. ౨౧; 7. (చెట్లకు పిందెలు మున్నగునవి ) పుట్టు, ఉత్పన్నమగు. "ఆ. పనసపండ్లు దిగినపజిగ స్వప్నము గన్న, కాటిగ నొసఁగి వెఱఁటపఱచు టొప్పు." ఆము. ౪, ఆ. ౨౭౪; 8. తగ్గు. "సీ. సాంద్రచంద్రికయుజ్జ్వలభావములు దిగ నరుణోదయప్రభాస్ఫురణ లెడుగ." విక్ర. ౨, ఆ. ౧౦౭. ఉ. హరి. ౩, ఆ. ౧౨౫; 9. గ్రుచ్చుకొను. వ్యవ:-కాలిలో ముల్లు దిగినది.

దిగుచు. దే. స. క్రి. (దిగు ధా. ప్రే.) గ్రుచ్చు. "క...ఆట్టివారలఁ, గొఱుల దిగిచి చంపు టొప్పుఁగువలయపతికిన్." విజ్ఞా. ప్రా. ౯౬.

దిగుజాతి. ద్వ. వి. (దిగుడు+జాతి) హీనజాతి, తక్కువజాతి. "గీ. అలు పతిభక్తి స్త్రీపుంసపాళివాని, యతివశిత్వము దిగుజాతు లగ్రజాతి, ననుసరించుట .." ఆము. ౪, ఆ. ౨౭౭.

దిగుడు. దే. వి. పల్లపుప్రదేశము "ద్వి. కొమరుదలిర్ప చెక్కుళ్ల దిగుళ్లఁ. దమతమపతులహస్తములూఁదికొనుచు..." పండితా. పర్వ. ౩౪౩. పు. విణ. (దిగు ధా.) 1. పల్లమైనది, అనతము. వ్యవ –ఎగుడుదిగుడు నేలపై నడచుట కష్టము; 2. హీనమైనది, తక్కువది. "క. ఇటువంటివి యిట లెక్కుడు, నిటదిగుడుని యెంచ కన్ని యేనిదియును నొక్కటి యొకనాఁటిద కాదోక, త్రుటి గీతఫలంబు నొసఁగుదునె యిమ్మెయిన్." ఆము. ౬, ఆ. ౬౦. [(శ. ర.)

దిగుదల. ద్వ. వి. (దిగుడు+తల.) క్రిందిభాగము.

దిగుమతి. దే. వి. (దిగు. ధా.) 1. ఓడ మొదలగువానిలో నున్న సరకును దింపుట. (శ. ర. బ్రౌ. వా.); 2. పరదేశమునుండి స్వదేశమునకుఁ దెచ్చుకొనుట. (బ్రౌ. వా.)

దిగుమతిచేయు. దే. స. క్రి. (దిగుమతి+చేయు.) పర దేశమునుండి సరకులందెచ్చు. తెచ్చు. (బ్రా. వా.)

దిగులు. దే. వి. (క. దిగులు.) 1. (గుండె) అదరు, దట. "ఆ. తలఁకు పుట్టెఁ గొంత గొలఁదికి మీఱె నెంత, గాటు దోఁచె మట్టుపాటు దొరకె, వెలుఁగు పాటు దనికె సొలసాడె నొవ్వు సొవ్వగలు వగల నీకె దిగులు వొదివె." భార. విరా. ౨, ఆ. ౧౦౬. నైష. ౫, ఆ. ౩౮; 2. అధైర్యము, భయము. సీ. పులిపోటు జలదరింపు దిగులు వెఱ కల్కు... ఊదిల యటన సభ్యతి యగు." ఆం. భా. ప్ర. ౧౩౩.

దిగులుకొను. దే. అ. క్రి. (దిగులు+కొను.) భయ పడు. "క...క్రొన్ననగుంపులకు దిగులుకొని మదిఁ బొగులున్." కువల. 3, ఆ. ౮౩

దిగులుపడు. ద్వ. అ. క్రి. (దిగులు+పడు.) భయ పడు. "ఆ. ఘోరభంగిఁ దోరణారూఢుఁడై యార్చె, గగన మగల జగము దిగులుపడఁగ." రామా. ౬, ఆ. ౨౦౧. వరాహ. ౨, ఆ. ౧౨౪.

దిగులుపఱచు. ద్వ. స. క్రి. (దిగులుపడు ధా. ప్రే.) దిగులుపడఁ జేయు, భయపెట్టు. (బ్రా.)

దిగులుపాటు. ద్వ. వి. (దిగులుపడు ధా.) భయము (శ. ర.)

దిగుల్లు. దే. వి. గుండె యదరుటయం దగునను కరణము. "క. అని తెలియం బలికి గుండియ దిగుల్లనఁగన్." రాజ. చ. 3, ఆ. ౨౧౮.

దిగువ. దే. వి. (దిగు. ధా.) క్రిందిభాగము. "గీ. లలిత రుచివక్త్ర శశిమండలంబు దిగువ, దండి మీఱుపయో ధరమండలంబు." కాళిందీ. ౬, ఆ. ౧౩౮. భార. స్త్రీ. ౧, ఆ. ౧౫౮. విశే. క్రిందిది. "వ...గదా యుద్ధంబున నాభికి దిగువ యగు శరీరభాగంబు నొప్పించుట ధర్మంబు గాదు..." భార. శల్య. ౨, ఆ. ౨౯౫.

దిగువలోకము. ద్వ. వి. (దిగువ+లోకము) సప్త పాతాళములలో నొకటి, అధోలోకము. "క. నాకంటె మిగులుబిటు పీ, లోకమునన కాదు దిగువ లోకంబులఁ బై, లోకముల వెదకఁ బోయిన, నీకుం బడయంగవచ్చునె వారిజాక్షి." నిర్వ. ౬, ఆ. ౩౧.

దిగువాటు. ద్వ. వి. (దిగుడు+పాటు.) దిగువ, క్రింది భాగము. "క. మినుకు మిను కసెడిమింటన్, బొన బొన నలకెల్లమున్నుబొంతన దిగువాటున నద కలదో లేదో, యనుమాత్రము గాఁగఁ గంటివా నృపకనయా." పా. ౧, ఆ. ౧౨౪.

దిగువాయి. దే. విశే. (దిగు. ధా.) తక్కువది, నూన్యము. "ఆ. దీని లయినవారి దిగువాయిగాఁ జూచి, పరము గవక మాకఁ బడును చేను." వేమన. 3, భా. ౧౨౬.

దిగువాఱు. దే. అ. క్రి (దిగుడు+పాఱు.) 1. కాఱు, ప్రవహించు. "వ...దృక్కోణంబులం దిగువాఱు కన్నీరు కర్ణద్వయాగ్రోశంబులు నిండి..." స్కా. 3, ఆ. ౯. కాశీ. ౫, ఆ. ౧౬౩; 2. మీఁది నుండి క్రిందికి పడు. "ఉ. రంగుగ నొక్క రొక్కరిశిరంబులయం దలఁబ్రాలు వోసి ర,య్యంగ మరీచినవ్యమణులై దిగువాఱఁగ నవ్వధూవరుల్." అని ౧, ఆ. ౧౦౧. విష్ణు. పు. ౧, ఆ. (శ. ర.); 3. నిండిపొరలు. "క. ప్రాలొక్కటఁ గొని దానవ, శైలము దిగువాఱఁ బోయుఁదానను నీకుం, బోలిన ప్రాలం గొలువుము..." కేయూర. ౨, ఆ. ౧౩. కువల. ౨, ఆ. ౧౦౮.

దిగ్గజము. సం. వి. అ. పుం. అష్టదిక్కులలో నుండు నేనుఁగులలో నొకటి. (ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము. ఇవి యష్టదిగ్గజ ములు.)

దిగ్గన. దే క్రి. విశే. ద్రు. 1. శీఘ్రముగా. "క... పొమ్ము దిగ్గన ననుడున్." భార. ఆశ్వ. ౪, ఆ. ౨౮౧. కాశీ. ౪, ఆ. ౫౪; 2. తటాలున. "గీ. అనుచు దైన్యంబు నొందెడు వాననంబు, తోడ దిగ్గన లేచి యల్లోయజాక్షి, చరణపీఠంబుకడఁ జక్కఁ జాగి మ్రొక్కి యున్న..." భార. విరా. ౨, ఆ. ౨౨. ప్రబంధ. ౪౦.

దిగ్గనాడు. దే. స. క్రి. (దిగ్గన్+ఆడు.) విడుచు. "సీ. పర్యాయఁ దివసీక పట్టు వింతకు మున్ను సిగ్గ నేనంగలి దిగ్గనాడె." కవిక. ౪, ఆ. ౧౩౮.

దిగ్గాఱు. దే. అ. క్రి. (దిగ్గన్+కాఱు.) కృశించు. "క. గుగ్గిలపుఁబొల్లు గొని తా, మగ్గిన రగులుకొను రీతి నతివేగముగా, బగ్గుమన మరుఁడు దిగులున, దిగ్గాఱె గిరీంద్రకన్య తేఁకువ దప్పన్." పార్వ. 3, ఆ. ౫౯.

దిగ్గియ. వై. వి. (సం. దీర్ఘికా.) నడబావి. "గీ. తనివి మొత్తంబు రేపాడి తానమాడి, దిగ్గియలచేరు

వలను బూదియల లందు, కాలమున..." ఉద్భ. ౧, ఆ. ౫౬. సా. ౧, ఆ. ౧౧౨.

దిగ్గు. దే. అ. క్రి. మీఁదినుండి క్రిందికి వచ్చు, అవరోహించు. "గీ. దేవనిర్మిత మైనట్టిదిగ్గియఁ గవి, దిగ్గి యగణితవిభవముల్ దేజరిలఁగ." సా. ౧, ఆ. ౧౧౨. స. క్రి. పైనుండి క్రిందికి వచ్చు, అవరోహించు. "గీ. చేరి యరదంబుఁ దద్గృహద్వార సీమ, దిగ్గి యరుదెంచి ప్రణమిల్లి..." రామా. ౧, ఆ. ౭౩. వి. 1. భయముచే గుండె యదరుట కనుకరణము. "ఆ. శూల మెత్తికొని కరాళవృత్తి, నడఁచి కన్మొగముఁ బొడిచె నింద్రుఁడు, దేవతలమనంబు దిగ్గనంగ." నిర్వ. 3, ఆ. ౩౦; 2. లేచుటయం దగునను కరణము. "మహాస్రగ్ధర... ఉద్యద్ఘనశక్తిఁ ద్రిప్పఁ గొండల్ గడగడ వణఁకం గల్పక్రాంతిఁ జనితామర్త్యాంతకాల స్మరహరుక్రియ సాక్షాని గ్గంచు లేవన్." శశాం. ౪, ఆ. ౧౪౩.

దిగ్గుడు. దే. విశే. తక్కువది, న్యూనము. "చ. ఎవ్విధిన్, దలిసిన నీడు గాఁ గలఁడె దిగ్గుడుమా కవిశ్రేణి నీయుచున్.." రామా. ౧, ఆ. ౧౩౯ నరస. 3, ఆ. ౧౩౦.

దిగ్గున. దే. క్రి. విశే. ద్రు. శీఘ్రముగా. "క. అగ్గజగామిని కాముని, యగ్గలికకు బెగ్గడిల్లి యాళిజనముఁ గన్, దిగ్గునఁ గనుఁ మొఱఁగి కదుల్, సిగ్గున నేకాంతపవనసీమకుఁ జనియెన్." విక్ర. ౧, ఆ. ౧౨౬.

దిగ్గోలు. దే. వి. కోయుపైరునకు ముందుపైరు (శ.ర.)

దిగ్దర్శనము. సం. వి. అ. న. 1. పద్ధతిమాత్రము చూపుట; 2. దిక్కులను జూపుయంత్రము.

దిగ్ధము. సం. వి. అ. పుం. 1. చమురు; 2. అగ్ని. విశే. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది, లిప్తము, 2. పూయఁబడినవిషము గలది. (అమ.)

దిగ్భ్రమ. సం. వి. అ. పుం. ఒకదిక్కును మఱొకదిక్కుగా గ్రహించుట, దిగ్భ్రాంతి, భ్రాంతి. "ఉ... నాకెదిరి పోర మదీయధనుర్విముక్తనానావిధ మార్గణోగ్రగహనంబున దిగ్భ్రమఁ బొందకున్నెయున్, బోవఁగఁ బోలు నీ కనుచుఁ బూరుకులోత్తముఁ దాఁకె వీఁకతోన్." భార. ఆది. ౪, ఆ. ౨౦౫.

దిగ్భ్రమము. సం. = దిగ్భ్రమ. (ఇట్లే దిగ్భ్రాంతి, దిఙ్మోహము. మొ.)

దిఙ్నాగుఁడు. సం వి. అ. పుం. కాళిదాసునకాలికుఁడును కుందమాలానాటకకర్తయు నగునొకకవి.

దిఙ్మూఢుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దిగ్భ్రమ నొందినవాఁడు.

దిచ్చరి. వై. వి. (సం దిక్చారిణీ.) వ్యభిచారిణి. "క. తెచ్చి కుసుమాలమూలఁ, జొచ్చిన బోఁటిఁ గోగసి యొగసి చూడఁగ నపుడా, దిచ్చరి హెచ్చరికఁ బ్రియుం, గ్రుచ్చి రతిక్రియల సొంపుగులుకుచు నుండెన్." వేం. పంచ. ౧, ఆ. ౫౯౬, ౭౯౦.

దిచ్చరించు. వై. అ. క్రి. వెల్వడు. "సీ. మోము వాంచిన నేమి మొలకనవ్వులకాంతి చెక్కుటద్దములపై జిరువాఱెఁ, జాదకుఁడిన నేమి సొబగు తెప్పలమించి లేఁటవాల్మెఱుఁగులు దిచ్చరించె." క్రీడా. ౯౫.

దిచ్చు. దే. విశే. జూదరి; మాయలాఁడు. "ఉ...వీ, రెచ్చెముఁ జూడ కాఁచుచు నోడుచు నిర్ధనుఁడౌచు నున్నయూ, దిచ్చున కెల్లకాలము నలిద్రవిణం బొసఁగం దలంపుమా" ద్వా. ౧౦, ఆ. ౧౫౯. ౧౦, ఆ. ౪౦.

దిచ్చుమొగము. ద్వ. విశే. (దిచ్చు+మొగము.) అదృశ్యము. (శ. ర. బ్రా.)

దిట. వై. వి (సం. దృఢమ్.) 1. దార్ఢ్యము, శక్తి. "క. దిట చెడి యాఁగబడె దైత్యుఁడు..." భాగ. 3, ఆ. ౭౯౦; 2. ధైర్యము. "గీ. బ్రమసి దిట తప్పి నివ్వెఱపడియె ధాత." కాశీ. ౫, ఆ. ౨౬౭. ప్రబోధ. 3, ఆ ౧౯.

దిటదేఱు. దే. అ. క్రి. (దిట+తేఱు.) సమర్థమగు, గడిదేఱు. "చ...దిన మొకవింత గాఁగ దిటదేఱె వధూమణి కేళిచాతురిన్." సింహ. ౪, ఆ. ౪.

దిటము. వై. వి (సం. దృఢమ్) 1. ధైర్యము. "గీ. అతిశరాభిన్నితావృతస్వాంత యగుచుఁ, గొంత దిట మూని యున్నయనంతరమున." రసిక. ౪, ఆ. ౨౯. శశాం. ౪, ఆ. ౪౩; 2. దార్ఢ్యము, శక్తి "చ. దిటమున రెడ్డి పాటునడి తెచ్చి యుదంగను గూటిప్రొద్దునం, గటికటితె వెన్నముద్దగలు..." శుక. ౨, ఆ. ౩౩౪; 3. అతిశయము. 'సీ. రథచక్రనేమి ఘుర్ఘురరావములు కేకుకుకుటాకృతులకు దిటము తెలుప."

"గీ. కొనర కొఱఁగనితారిమి కదురుపా టెఱుఁ
గనిదిట్టంబు నిలుక డెఱుఁగనియనము." చంద్రా. ౬,
ఆ. ౧౪౮. విశే. 1. ధ్రువము,నిశ్చితము. "సీ...
దేహికి మరణంబు దిట్ట మగుచు." శివధ. ౫, ఆ.
౮౩; 2. స్థిరము,శాశ్వతము. దండకము...సద్భో
గినీపట్టముల్ దిట్ట మానట్టుగా నే ప్రసాదించి
తద్వార రాబించి..." భోగినీదండకము.

**దిట్టాడు.** దే. అ. క్రి. (దిట్ట+ఆడు.) అతిశయించు,
ఎక్కువగు. "శా. దేవా కయ్యముతోడి వేడుక
మదిన్ దిట్టాడుమర్త్యుండు నేత్రోవం జేతుల
తీఁట వుత్తు నని కోరున్...." ఉ. హరి. ౫,ఆ. ౭౧.

**దిడ్డి.** దే. వి. 1. పాలకీ మున్నగువానికి వేయుతెర
"ఉ...పైఁడిపాలకీ, నవ్వు పుఁబోఁడి నుంచి
మెఱుఁగారెడుబంగరువ్రాఁతపచ్చడం, బొప్పుగ
దిడ్డి పై చిరొని యుబ్బు మెయిం గొనిపోయె నింటి
కిన్." పరమ. ౨, ఆ. ౩౮, రామా. ౨, ఆ. ౯౨.
విశే. చిన్నద్వారము గలది. "చ...నగరుఁ
జొచ్చిరి లోపలిదిడ్డి త్రోవచేన్." య. ౫, ఆ
౧౫౧. "ద్వి. తిరుగుచున్నట్టి దిడ్డివాకిళ్ల, సురు
చిత్తు లుండు దుర్గాక్కకోటి." రం. రా.
యు. ౩౦౩, పు ౨౫. పం.

**దితము.** సం. విశే. (అ. ఆ. అ.) నఱకఁబడినది,ఛేదింపఁ
బడినది.

**దితి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. దైత్యులతల్లి, కశ్యపుని
భార్య. ఇ. స్త్రీ. నఱకుట,ఖండనము.

**దితిజాఁడు.** సం వి. అ. పుం. రాక్షసుడు. (ఇక్లో. దితి
సుతుఁడు. మొ.)

**దిత్స.** సం. వి. అ స్త్రీ. ఈయవలయు ననుకోరిక,
దానేచ్ఛ.

**దిత్సువు.** సం. విశే. (ఉ.) ఈయఁగోరువాఁడు, దాన
శీలుఁడు.

**దిదృక్ష.** సం. వి. అ. స్త్రీ. చూడవలయు ననుకోరిక.

**దిదృక్షువు.** సం. విశే. (ఉ.) చూడవలయు ననుకోరిక
గలవాఁడు.

**దిద్దు.** దే. స. క్రి. 1. (విద్యాదులను) నేర్పు; శిక్షించు.
"గీ. మఱిత నేఁటిమేలు కొదవ లే దందు నీ,
యనఘుచరితు దిద్దు మనుచుఁ జనియె,జాంబవతియుఁ
దొక్క సంవత్సరముదాఁకఁ,బాట నేర్పు మునికిఁ
జాటవమున." కళా. ౨, ఆ. ౩౫, ౩౬. య.
౧, ఆ. ౩౯; 2. చక్కఁబఱచు. "శా. అలీలన్
రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱున్ గేలిఖి,
న్నాలంకారము లొక్క రొక్కరికి నిం పొన
ట్లుగా దిద్దుదున్." కళా. ౩, ఆ. ౧౭౦. ఆము.
౪, ఆ. ౩౫; 3. అలంతు. "క. నునుపగుచ్ఛగమద
పంకంబునఁ దీనియ దిద్ది కప్రపుంబొడి ప్రుగ్గుల్,
నినిచి..." రసిక. ౪, ఆ. ౮౪; 4. సవరించు,
సమర్థించు. "ఉ...అన్యపతిపాలికిఁ బోయెద
వేమొ పొమ్ము నీ,యిచ్చకు వచ్చినట్లు రమియింపు
మెంకానొకమాట పుట్టినన్,సెప్పలి లేదు బంతి
యను చేర్పున దిద్దుకొనంగఁ జాలితిన్." శుక. ౨,
ఆ. ౯౭; 5. (అప్పు) తీర్చు. "ఉ. ఏయెడ కేల
బోవు నతఁ డెవ్వరికైనను చిక్కవాఁడె తా,
నాయన మీకు నీవఱకు నచ్చినయప్పుట దిద్ది తా
సుఖో,పాయత నున్నవాఁడు..." వై జ. ౪, ఆ.
౧౬; 6. మార్చు, తప్పులులేకుండఁ జేయు. "క...
తప్పొప్పు మదిన్, భావించి దిద్దకుండను,
దేవానాంప్రియుల మ్రొక్కి తెలతుఁ గుకవులన్."
రామవ. పీఠి. ౫, (శ ర. పా.); 7. నియోగించు,
అనతిచ్చు. "గీ. ఆసఘు జాత్యభిమాన దేహాభిమాన,
లేశములు దాసురాలికి లేవు మాధు,కరము నల
వాటె మీవంటిఘనులు దిద్దు,పనులు సేయుంట కంటె
శుభంబు గలదె." వై జ. ౨, ఆ. ౧౧౦; 8.
త్రవ్వు. "మ. తసశృంగారవనంబులోన గిరిపొంతం
జక్కఁగా దిద్ది తీర్చినవూఁ దేనియయేటి కాలువ
దరిన్...." పారి. ౧, ఆ. ౩౧; 9. ఎఱుఁగు,
కనిపెట్టు. "క. తదుపాయము దిద్దుటకున్, మది
నెన్నఁబ్రభావఘనులు మఱి లేరు .." కళా. ౩,
ఆ. ౫౬; 10. సెలవేర్చు. "ద్వి. అట్టివా రెవ
మంద్రు సకలకార్యములఁ,బట్టున దిద్దఁ దీర్పను
జాలి కొలువ." రం. రా. బాల. ౧౦, పు.; 11.
(నేర్చుకొనుటకై) వ్రాసి యిచ్చినయక్షరములపై
వ్రాయు. "సీ. గద్దించి పడిఁ దిట్టి దిద్దుమంచును
వ్రేలు వెట్టింప నచట నేఁ బెట్టకుందు." కాంచ.
౩, ఆ. ౧౪౨; 12. విభూతి మున్నగువవి పెట్టు
కొను. "సీ. తిగరేక లేర్పడ దిద్దినదొసలిసుస్వాలి
బూదిబొట్టురంగులు సెలంగ." నీలా ౧,ఆ. ౬౦.

**దిద్దుకొను.** దే. స. క్రి. (దిద్దు+కొను.) చక్కఁబఱచు.
"క. విను వల్లభ కస్తుండం, గనుఁ బొలం దివియ
చేర్పు గలమునిమ్రుచ్చి,వనిత తగ దిచట

సుందరా, మనుకను దిద్దుకొనవచ్చునే యొకబ్రైనన్." కళా. ౩, ఆ. ౧౯౯.

దిద్దుగడ. (దిద్దు+గడ.) దిద్దుపాటు. "మ. మిముబోం ట్లాడుమది పల్కుదిద్దుగడకున్ మే లందురే..." అచ్చ. భా. ౧, ఆ. ౪౧.

దిద్దుడు. దే. వి. (దిద్దు. ధా.) దిద్దుగడ, దిద్దుపాటు. (శ. ర.)

దిద్దుపాటు. ద్వ. వి, 1. సవరించుట; 2. శిక్షించుట. (శ. ర.)

దిద్దుబడి. దే. వి. (దిద్దు+బడి.) దిద్దుపాటు. (శ. ర.)

దిద్దుబాటు = దిద్దుపాటు. (బ్రౌ. వా.)

దిద్దుపడు. ద్వ. అ. క్రి. (దిద్దు+పడు.) శిక్షణ పొందు; నేర్చుకొను. "గీ. దేవకులనాథ నాయొద్ద దిద్దుపడిన, పోలంతి యొన్నటికిని నన్నుఁ బోలఁ గలదె." వాల్మీ. ౩, ఆ. ౩౭.

దిధక్ష. సం. వి. ఆ. స్త్రీ. కాల్పవలె ననుకోరిక. "క... లంకాపురీదిధక్షాదీక్షా, రూక్షప్రతాపుఁ గంటే, సాక్షాల్లయసమయపవనసఖు సామీరిన్." రామా. ౭, ఆ. ౧౯౭.

దిధక్షువు. సం. విణ. (ఉ.) కాల్ప నిచ్ఛ గలవాఁడు

దిధిషువు. సం. వి. ఊ. స్త్రీ. 1. మాఱుమనువు చేసి కొనినస్త్రీ; 2. చెల్లెలికి పెండ్లియై తనకు పెండ్లి కాని స్త్రీ. ఉ. ఊ. పుం. మాఱుమనువు చేసికొన్నస్త్రీ మగఁడు.

దిధీర్ష. సం. వి. ఆ. స్త్రీ. ధరింపవలె ననుకోరిక. "మాలినీ. ధరణిధరదిధీర్షాధః కృతాహార్యవర్గా" సైమ. ౪, ఆ; ౧౪౩. ౬, ఆ. ౧౪౬; 2. పోషింపవలె ననుకోరిక.

దినకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దినక్షయము. సం. వి. అ. పుం. 1. తిథితగ్గుట; 2. సాయంకాలము. (ఇట్లే. దినపాతము.)

దినకోరు. వి. వి. (దినము+కోరు.) రోజుకూలి, దిన భృతి. "గీ... దినకో రనంగ, పెలయుం దినరోజు ..."అం. భా. తృ. ౩౨.

దినగోరు. వి వి. (దినము+కోరు.) దినభాగము, దిన మున కొకనికి వచ్చుపాలు. "సీ. తివుటఁ జొక్కుల తేని దినగోరు పెనఁగిరి పండ్లు దుల్పిరి కల్పపాద పంబు." సైమ. ౭, ఆ. ౭౧.

దినచర్య. సం. వి. ఆ. స్త్రీ. నిత్యకృత్యము, ప్రతి దినముఁ జేయుపని.

దినచల్వలు. వి; వి. బ. (దినము+చల్వలు.) దినమున కొకటిచొప్పున ఉపయోగించు చలువచేసిన వస్త్రములు. "క. నిద్దంపుమేలిసొమ్ములు, దిద్దినకస్తూరి బొట్టు దినచల్వలునై, ప్రౌఢ్రోకసింగారముతో, ముద్దియ చనుదేర మిగుల మోహాతురుఁడై."విజ. ౨, ఆ ౧౪౪.

దినపతి. సం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు; 2. వారాధి పతి, సూర్యచంద్రాంగారకబుధగురు శుక్రశను లలో నొకఁడు; 3. జిల్లేడుచెట్టు. (ఇట్లే: దినపుఁడు. మొ.)

దినబత్తెము. వి. వి. (దినము+బత్తెము.) రోజుకూలి, దినదినము నిచ్చుబత్తెము. "ఉ...వసుధామర నిష్ఠురోక్తు లేలా వచియింప నీకు మొదలన్ దిన బత్తెము నే నొడంబడన్, నీవు గురుప్రయోజనము నమ్మి నొనర్పఁగ వచ్చి తిమ్మెయిన్." హరిశ్చ. ౪, ఆ. ౧౯౨.

దినమణి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు. "క. అపర్వత మెక్కుఁడు గజరూపం బగుతిమిర మణఁచి లోహిత కాంతి, వ్యాపితకరనఖరుండై, దీపించె మృగేంద్రు కరణి దినమణి కణఁకన్." ద్వా. ౫, ఆ. ౭౪. (ఇట్లే దివామణి. మొ.)

దినము. సం. వి. అ. పుం. న. పగలు, దివసము. (దీని భాగములు పదునేను. 1. రౌద్రము; 2. శ్వేతము; 3. మైత్రము; 4. శారభటము; 5. సావిత్రము; 6. విజయము; 7. గాంధర్వము; 8. కుతపము; 9. రౌహిణేయము; 10. విరించము; 11. సోమము; 12. నిర్ఋతి; 13. మాహేంద్రము; 14. వరు ణము, 15. భటము.); 2. అఱువదిగడియల కాలము, రోజు; 3. తిథి; 4. ప్రతిదినము. "శా... హేరాళంబుగా నద్రికన్యాకాంతుని భజియించు నిత్యనియతిం దక్కాలపూజాక్రియా, భ్రాజిష్ణు త్వమునన్ జపించు దినముం బంచాక్షరీమంత్రమున్." విప్ర. ౧, ఆ. ౨౦.

దినముఖము. సం. వి. అ. న. వేకువ, ప్రభాతము.

దినరోజే. వి. వి. (దినము+రోజు.) రోజుకూలి. "సీ. పగటిగ్రాసంబు దప్పక యుండ దినరోజు మాదిరి నొంటరి బోదుమూఁక." రా. వి. ౫, ఆ. ౧౩. ౫, ఆ. ౩౨.

దినవహి. వి. వి. జమాఖర్చు. "చ...లో,ధినకర చంద్రదీధితులపంక్తి జమాఖరుచుల్ గణించి

యుం,తనుకొని కాల మర్గణముఁ దప్పుడు తీర్చి లిఖించినట్టియా,దినవహి లెక్క వ్రాలనంగఁ దెల్పఁగఁ జొక్కులు పర్వ నత్తఱిన్." హంస. ౧, ఆ. ౧౪౨.

దినవారము. వై. వి. ఉత్తరక్రియలు, శ్రాద్ధాదికర్మ. (శ్రా. వా.)

దినవెచ్చము. వి. వి. (దినము+వెచ్చము.) దినదినమును జరిగెడివ్యయము. "సీ. దినవెచ్చమునకునై తనమేనఁ గలసొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువ వైచు." పాండు. 3, ఆ. ౧౬. పీఠి. ౪౯.

దినసరి. దే. వి. సస్యవిశేషముఁ. "వ. దినసరి సరియయ్యో సంభాప లేపుద వ్వెఁ గర్పూరభోగి బాగు చెడె .." విష్ణు. సా. 3, ఆ. ౧౦౧ విష్ణు. పు. 3, ఆ. (శ. ర.) బ. ధాన్యవిశేషము. (శ. ర.)

దినసరులు. దే. వి. బ. 1. దినచర్య "చ. వినఁడు ప్రమోదలీలఁ బృథివీపరు లంపినరాజకార్యపుం, దినసరులన్ జను ల్మనవి దెల్పుకొన న్మఱుమాట పల్కఁడు..." ఇందు. ౨, ఆ ౨౦౯; 2. దినచర్యవ్రాయుపుస్తకము; ఉత్తరము. "క. ఘనతర భేదోపాయం,బునకుం దగినట్టియుత్తరఁ బుట్టించి రయం, బొనరఁగ రాయలపేరిటి, దినసరు లాపత్రియులకుఁ దేటపడంగన్." కృష్ణ. 3, ఆ. ౧౦౪.

దినాంతకము. సం. వి. అ. పుం 1. సాయంకాలము; 2. చీఁకటి.

దినాంతము. సం. వి. అ. పుం. సాయంకాలము. (ఇట్టే: దినాత్యయము. మొ.)

దినాగమము. సం. వి. అ. పుం. ప్రాతఃకాలము. (ఇట్టే దినాది. మొ.)

దినారి. వై. వి. (సం. దీనారః.) బంగారము, పైఁడి. "ఉ...ఒకనాఁ డొకచోట సుబుద్ధి గాంచెఁ బెం, పొంద దినారిటంకముల నుంచినకాంచనకుంభ మట్టియా,కుందన మొక్కచోట నిడి కూర్చిన కోమటిఁ జేరి చెప్పినన్." నా. పంచ. ౧, ఆ. ౫౦. (శ. ర. పా )

దినిక. సం. వి. ఆ. స్త్రీ. దినబత్తెము.

దినుసు. దే. వి. 1. ప్రకారము. "సీ. వెనుగట్టు లను చెట్టుకొనునట్టు కనుపట్టు చనుకట్టుపుటముల దినుసు చూపు." పార్వ. ౫, ఆ. ౧౪౫, 2. రకము, జాతి. "గీ...తీపదరులు, నాది యుగపేట గలుగుప ద్లతనియింట, నుండు శతకోటిపుట్లు లొక్కటక్క దినుసు." హంస. ౪, ఆ. ౧౨౮. ప్రభులిం. ౧. విశే. సమము, తుల్యము. "సీ తాఁబేలు కడుపుఁ దలఁగ్రుక్కుకొనిరోఁ బో తెలుపమీఁ గాళ్లతో దినుసుగాక." అచ్చ. అర. ౨౨. బ. అపరాలు. "సీ. కాయధాన్యంబుల కణజములున్ మియ్య పుగరిసెలు దినుసులు గలకొటార్లు" హంస. ౨, ఆ. ౨౭౯.

దినుసుమీఱు. దే. అ. క్రి. (దినుసు+మీఱు.) నిరుపమాన మగు. "సీ. తెలిగంటిదొర లెల్ల దినుసు మీఱినలెంక లలరువిల్తాల్పు ముద్దులమఱంది." అచ్చ. బాల. ౬.

దినుసువచ్చు. దే. అ. క్రి. (దినుసు+వచ్చు.) సరిపోలు, సాటియగు. "సీ. కంటి కింపగురేఖ గల్గియుండుటఁ జేసి మినుకుఁగాటుక కొంత దినుసు వచ్చు. గీ. విశదకమలాక్షినునుపొగ వెండ్రుకలకు." విజ. ౧, ఆ ౩౫.

దినుస్సు = దినుసు. (వస్తువు) "చ. పయిఁబయిఁ బండు కొల్చు విరిపైఁడియుం గట్టిదినుస్సు...అన్నవిలిర్ణి వెచ్చపోవఁగా." కళా. ౬, ఆ. ౧౫.

దిన్న. దే వి. వృక్షవిశేషము. "సీ. సంపాలి తాడియుం కరభుఁడు దిన్నయుం నలుఁడు మల్లియు..." అచ్చ. యు. ౩౩౨. (దిన్న. శ. ర. పా.)

దిప్పకాయ. దే. విశే. కొంటెవాఁడు. "ద్వి. తలపోయ నీతుమ్మెదలు కూడగొట్టు, మలయమారుతము ద్రిమ్మరి దిప్పకాయ." ద్వి. పరమ. 3, ఆ. ౨౪౭, పు.

దిబ్బ. వై. వి. (సం. ద్వీపః.) 1. దుర్గద్వారమున వాటముగా నేర్పఱిచినమట్టిదిబ్బ, హస్తినఖము. "గీ. తిన్న దిబ్బ యనంగ హస్తినఖ మొప్పు." ఆం.భా. ద్వి. ౯౧; 2. కొండ, పర్వతము. "చ. పులుగుల కల్పలోకనకపుంజిగిదిబ్బలొ దానిగుబ్బలో..." శకుం. ౪, ఆ ౬౪. హంస. 3, ఆ. ౨౦; 3. ఉన్నతభూమి; మట్టిమున్నగువానికుప్ప. (శ. ర. వా.); 4. ద్వీపము. "గీ...నేరేడుదిబ్బకుఁ జొట్టు వాఱు, తీరుచెదర్పారు మున్నీరు తెలుపు గాంచి." కవిరా. ౪, ఆ ౬౩. (నేరేడుదిబ్బ = జంబూ ద్వీపము.)

దిబ్బచూపు. ద్వ్య. అ. క్రి. (దిబ్బ+చూపు.) దిబ్బగా నేర్పడు. "వ...అప లడుగుపడిరొ సొటి వియత

దిబ్బచూపె నిద్ర చదియఱ్ఱు .." కాశీ. 3, ఆ. ౨3.

దిబ్బడ. దే. వి. శైత్యాదికముచేత ముక్కు చెవులందు కలుగుబాధావిశేషము. (చూ. దిబ్బడవేయు.)

దిబ్బడము దే వి. 1. మూఁకుడు. (శ. ర.); 2. దిబ్బడ. (బ్రౌ.)

దిబ్బడవేయు. దే. అ. క్రి. (దిబ్బడ+వేయు.) శైత్యాదికముచేత ముక్కుచెవులం దొకవిధ మగుబాధ పుట్టు. (వ్యవ:-)చెవులు దిబ్బడవేసినవి; ముక్కు దిబ్బడ వేసినది. (బ్రౌ. వా.)

దిబ్బెము. వై. వి. (సం. దీపః.) దీపము. (చూ. దిబ్బె మెత్తు.)

దిబ్బెమెత్తు. ద్వి. అ క్రి. (దిబ్బెము+ఎత్తు.) దీప మెత్తి ప్రమాణము చేయు. "సీ. దిబ్బెమెత్తఁగ వచ్చు నబ్బురం బగుకల్మి మేరమీఱటినరీతి మెలఁగఁ దనుచు." పాండు. ౧, ఆ. 33.

దిమాకు. హిం. వి. 1. గర్వము; 2. అధికారము; 3. ధైర్యము.

దిమికిట. దే. వి. డుడుము మున్నగువాద్యములధ్వని కనుకరణము. "సీ. కటపెటదిమికిటధ్వను లోలిఁ బుట్టింపఁ జాలుగుమ్మెట చంక వ్రేలుచుండ." క్రీడా. ౨౨౯.

దిమిదిమి. దే. వి. మద్దెలమ్రోఁత కనుకరణము. "ద్వి. దిమిదిమి యనుచు మద్దెలమ్రోయఁ బాట,లమర నారీమణు లాడుచందమున, ఘుమఘుమ మనుచు మేఘుండు గర్జింప." రం. రా. కిష్కిం. ౨౧౯. పు. (శ. ర. పా.)

దిముకు. దే. వి. మద్దెలమ్రోఁత, మృదంగరవము."సీ.... దిముకు నా మృదంగరవము వెలయు .." ఆం. భా. ప్ర. ౧౨౧.

దిమ్మ. యు. దే. వి. 1. తెలివి,స్పృహ. (చూ. దిమ్మ దిరుగు.); 2. భ్రాంతి, పొరబాటు. (చూ. దిమ్మ గొను.) వై. వి. (సం. ద్వీపః.) 1. దిబ్బ; ప్రోవు. "గీ. తమ్మికొలఁకుల నోలాడి కమ్మపూవుఁ,గొమ్మలు గదల్చి కపురంపుదిమ్మ లెక్కు." అచ్చ. రా. బాల. ౧౨౧. కాశీ. 8, ఆ. ౨88; 2. స్తంభము మంచపుఁగోడు మొదలగువానిక్రింద నుంచు రాయి,కఱ్ఱమున్నగువానిఖండము. వ్యవ-స్తంభము క్రింద దిమ్మ సరిగా లేదు; 3. కంసాలి బంగారు మున్నగువానిని సాఁగఁగొట్టుట కుపయోగించు ఇనుపముక్క. వ్యవ:-బంగారపురేకు దిమ్మమై సాఁగఁ గొట్టుచున్నాఁడు; 4. ఇటుక మున్ను మొదలగువానితోఁ గట్టుస్తంభము. (వ్యవ:) దిమ్మ లమై పాక వేసినారు.

దిమ్మగొను. దే. అ. క్రి. (దిమ్మ+కొను.) పొరఁబడు, భ్రాంతినొందు. "గీ. వారి వీరిని నన నేల వీరి వారిఁ,గలగలపు చేయుచున్ననవలయుఁ గాక,తెలఁ గెఱుంగక యపు డట్టు దిమ్మగొంటి,తలఁపఁ దన నుండి రానట్టితప్పు గలదె." రాధికా. 3, ఆ. 89.

దిమ్మడుచు. దే. అ. క్రి. (దిమ్మ+అడుచు ) దిబ్బడ వేయు. "వ . గుంటలంబడినకన్నులు దిమ్మడుచు కర్ణంబులు గలిగి..." దశా. ౨, ఆ. ౫3. సానందో. ౨, ఆ. ౨౫.

దిమ్మదిరుగు. దే. అ. క్రి (దిమ్మ+తిరుగు.) స్పృహ తప్పు, వివశతనొందు. (అసాధ్యసాధనము.) "గీ. అొమ్ము గాఁడిన సౌమిత్రి దిమ్మదిరిగి, పుటమెగసి నేలవ్రాలు జాలి బోరమోవఁ,బడఁగ నిమేష శైత్య యాధివ్యథలు, ధరణిఁతలఁ దాల్చె మేలు కృతజ్ఞ రాలు." రామా. ౮, ఆ. ౧౨౦; 8, ఆ. ౨౬౬.

దిమ్మపడు. ద్వ. అ. క్రి. (దిమ్మ+పడు.) స్తంభించు, వివశుఁడగు. "ద్వి. నదులు వేగము మాని నలి నట్టె నలిచె, గదలవీవక సదాగతి దిమ్మపడియె, విను తేరితురగంబు లేఁగక నిలిచె, ఘనుఁ డైనహరి వాంశికత్వంబుఁ జూచి." సిం. భాగ. ౨, ఆ. ౨౯.

దిమ్మరించు. దే. దే. స. క్రి. ఎక్కువగాఁ బోయు, ద్రిమ్మరించు. (బ్రౌ. వా.)

దిమ్మిస. దే. వి. 1. (నేల) చదును. (శ. ర.); 2. నేల చదునుచేయుం సాధనవిశేషము. వ్యవ.-ఆగది దిమ్మి సతో చదును చేసినారు.

దిమ్ము. దే. వి. 1. సమూహము గుంపు. "వ...కోలలు గుప్పలు గూర నాఁటినవిలువున గతాసులై యమ్ములదిమ్ములుంబోలె వ్రాలుదానవులును..." భా. రా. అర. ౧, ఆ. ౨౦౫, రసిక. 3, ఆ. ౫౧; 2. మాంద్యము,జడత్వము. "మ. అనిలం గాలిన కాలమున్ చెవులలో నంటించినట్టైన నూ,నిన పెందిమ్మున బొమ్మసిల్లి మగుడన్ వే లేచి..." సా. ౨, ఆ. ౯౯, ద్వి. హరిశ్చ. పూ. ౧౨౫౬. పం; 3. గర్వము,మదము. "గీ. పాడిదప్పిరి నృప కులు బలిసెఁ గొండె,ము...,క్రమ్మె దుర్వ్యసనంబులు దిమ్ములేఁగ." వరాహ. 8, ఆ. 3౧; 4.

తల మున్గుగువానియందలి బాధాదిశేషము. "గీ. తుత్తెందలదిమ్మరోద తలది తైయగర్వ." ఇందు. ౩, ఆ. ౧౨, విజ. ౨, ఆ. ౧౯౬; 5. గొప్పధ్వని కనుకరణము. "చ. అరుదుగ వాద్యవిద్య విరుదం దినవాయిదకాయి లత్తతీక్ గరములం రెండు సొక్కనరిగా మురజంబులం మట్టి దిమ్మనక్, మొరయఁగఁ జేసి .." వై జ. ౧, ఆ. ౧౨౩; 6. గొప్పధ్వని. "ఉ. ఆయుధువాత్మజత్త నొక యమ్మున దిమ్మునఁ గూలఁజేసి..."రామా. ౫, ఆ. ౩౨౬, ద్వా. ౧౧, ఆ. ౨౩.

దిమ్ముగొను. దే. అ. క్రి. (దిమ్ము+కొను.) బాధనొందు. "సీ. శ్రీకృష్ణుచేఁ గొనుచిలుకపలుకులు విని గుమ్ము గుమ్మని చెవుల్ దిమ్ముగొనఁగ...." రాధికా. ౨, ఆ. ౨౦.

దిమ్మకట్టు. స్వ. అ. క్రి. (దిమ్ము+కట్టు.) దిమ్మదిరుగు "క. మంత్ర్యాన నోరున కెత్తురు గ్రక్కుచుఁ దల దిమ్మవట్టఁ గడుచీనకతో." వి. పు. ౬, ఆ. ౧౮౨.

దిమ్మువడు. ద్వ. అ. క్రి. (దిమ్ము+పడు.) డిందుపడు. "గీ....దిమ్మువడియె ననఁగ డిందు,పడియె ననుట దోఁచు..." ఆం. భా. కృ. ౧౧౬.

దిమ్మెట = దిమ్ము. (చూ. దిమ్మెట్టుపడు.)

దిమ్మెట్టుపడు. ద్వ. అ. క్రి. చెవుడుపడు. (బ్రా. వా.)

దిమ్మెత్తు. దే. అ. క్రి. (దిమ్ము+ఎత్తు.) బాధనొందు. "మ. తల దిమ్మెత్తెను మోపు మోచుక్రియ డెం దం బేమిం వెక్కెత్తినట్టుల కానంబడె..." సావి. ౨, ఆ. ౧౦౧. పు.

దిమ్మె. దే. వి. 1. తామరదుద్దు. (శ. ర.); 2. రాళ్లు మొదలగువాని చిన్నగుట్ట. "గీ...వలపు,గ్రమ్మ నిమ్మగుకపురంపుదిమ్మెకుమ్ము." నీలా. ౨, ఆ. ౩౨, 3. కొయ్యబిరడా. (శ. ర.); 4. మద్దెలయంచు. "ద్వి. సంధించి బంధించి సప్తతాళములు, బంధు రగతులం తప్పకయుండ శ్రుతులు,...పరిపాటిగా దిమ్మెపై రాతఁ బొడిచి,కరవేగమున వాద్యకౌశల్య మెసఁగ." ప్రభులిం. ౨, ఆ. ౨౬. పు.

దిమ్మెసు. దే. వి. బాతిపనివానిపనిముట్టు. (శ. ర.)

దిరదిర. దే. వి. తిరుగుటయం దగుననుకరణము. "గీ. ధరణి దిరదిరఁ దిరుగుచందమునఁ దోఁచె." ఉ. రా. ౬, ఆ. ౨౩౫.

దిరిసెన = దిరిసెనము. (బ్రా.)

దిరిసెనము. వై. వి. (సం. శిరీషః) శిరీషముశీ. "గీ.... పస్ను,విరిగి సోమింద గున్నంగి దిరిసెనంబు,మొద లంగాఁ గల్గుబహువిధభూరుహములు." హంస. ౪, ఆ. ౧౧, చంద్ర. ౫, ఆ. ౮౫.

దిరిసెము. వై. వి. (సం. శిరీషః.) శిరీషముశీ. "ఉ.... కుదిసీశ్వరులమానసముల్ దిరిసెంపుఁబూవులంబ్." కాశీ ౫, ఆ. ౩౦౫, ఆం. భా. ద్వి. ౪౯.

దిర్దిర. దే. వి. తిరుగుటయం దగుననుకరణము. "ఉ. అమ్ముని యల్లి చూచుడును సాతుణమాత్రన గోత్రధారుణి. ధర్త్రిష్ములు ప్రయ్యనయ్యనుడు దక్కఁగ నంబుధు లింక మూఁడులో,కమ్ములు దిర్దిరందిరుగు..." భార. ఆది. ౪, ఆ. ౩౮, రామా. ౪, ఆ. ౩౯.

దిలాసా. హిం. వి. హెచ్చరిక, ధైర్యము.

దిలీరము సం. వి. అ. న. పుట్టగొడుగు, శిలీంధ్రముశీ.

దిల్ల. దే. వి. పిఱికితనము, అధైర్యము. (బ్రా.) విణ. బలహీనము. (చూ. దిల్లపడు.)

దిల్లపడు. ద్వ. అ. క్రి. (దిల్ల+పడు.) బలహీనపడు. "క. ఉల్లము జల్లన దేహము, దిల్లపడఁగ ధృతి దలంక దెప్పర మొందన్." భా. రా. అర. ౨, ఆ. ౨౫౬.

దివటీ. వి. వై. (సం. దీపయష్టిః.) ఇనుపకోలకు గుడ్డలు చుట్టి యంటించుదీపము, కరదీపిక. "సీ. దీవటీ దివ్వటి దివటి పంజనఁగను గరదీపికాఖ్యలై పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దివము. సం. వి అ. న. 1. ఆకసము; 2. పగలు; 3. వనము; 4. స్వర్గము. "చ. దివమునసుండి దేవ తలు దివ్యములైననిజాంశజన్మముల్, భువిఁ గలిగించి..." ఉ. హరి. ౧౦, ఆ. ౩౧౪.

దివసము. సం. వి. అ. పుం. న. 1. పగలు; 2. దినము; అహోరాత్రకాలము.

దివస్పతి. స. వి. ఇ. పుం. స్వర్గాధిపతి, ఇంద్రుఁడు.

దివా. సం. అవ్య. పగలు. (దీనికిఁ దెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు.)

దివాంధము. సం. వి. అ. పుం. గ్రుడ్డిగూబ,ఉలూకము. విణ. (అ. ఆ. అ.) పగటివేళ గ్రుడ్డియైనది.

దివాకరము. సం వి. అ. పుం. 1. కాకి; 2. జిల్లేడుశీ; 3. ప్రొద్దుతిరుగుడుపువ్వు.

దివాకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దివాకీర్తి. సం. వి. అ. పుం. 1. మంగలి, నాపితుఁడు; 2. మాలవాఁడు, చండాలుఁడు; 3. గ్రుడ్లగూబ, ఉలూకము. [శా.

దివాటనము. సం. వి. అ. పుం-కాకట్ఁ ద్రిష్టరునది—

దివాణము. వై. వి (సం. దేవాయతనమ్.) 1. కొలువు కూటము, సభాస్థానము. "ఉ. పాండుఁడు దివాణము శోభిల్లఁగ నించినఁ జేరెదు కుర్వుదాంధ్రు లెల్లఁ బోఁడిమి మాన్చి..." ఆము. ౨, ఆ. ౮౮; 2. రాజభవనము "చ. చదువులపుట్టినిండ్లు శమసంపదయిక్కలు పుణ్యలక్ష్మికిన్, మొదలిదివాణముల్ ...భూసురోత్తముల భూరిపవిత్ర శరీరవల్లరుల్." పాండు. ౧, ఆ. ౧౦౯. ద్వి. శ. సా. ౧, ఆ. ౩౭. పు.

దివానిశము. సం. వి. అ. న. రేయుంబవలు, అహోరాత్రము. "ఉ...తొయ్యలియుఁ శశియుఁ దివానిశం, బయ్యెడ నుండి రిట్లు మదనాహవమోహవశానురక్తులై." శశాం. ౩, ఆ. ౧౧౪.

దివాను. హిం. వి. మంత్రి.

దివాభీతము. సం. వి. అ. పుం. 1. గ్రుడ్లగూబ, 2. కలువకొలను.

దివాభీతుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

దివారాత్రము. సం. వి. అ. న. రేయుంబవలు. అహోరాత్రము. "వ. ఇట్లు ధృతరాష్ట్రనకుం గయ్యంబు తెఱంగు వినియోగించి గంగాసూతనందనునకు నారెండు తెఱఁగులవారి దివారాత్రప్రవర్తనంబులు గనునట్లును ..వరం బిచ్చి .." భార. భీష్మ ౧, ఆ. ౨.

దివాలా. హిం. వి. (హిం. దివాలా. బెంగాలీ. దేవులియ.) 1. వ్యవహారమందలి నష్టముచే సర్వసంపద పోవుట. (చూ. దివాలాతీయు.); చేసిన యప్పులు చెల్లింపలేనిస్థితి. (వ్రా.)

దివాలాతీయు. దే. అ. క్రి. (దివాలా+తీయు.) వ్యవహారమందలినష్టముచే సర్వధనమును పోఁగొట్టుకొను. (వ్రా. వా.); 2. చేసినయప్పులు తీర్పలేక పోవు. (వ్రా. వా.)

దివి. సం. వి. ఫ్. స్త్రీ. (అంధ్రనామ సంగ్రహమునఁ దద్భవము.) 1. స్వర్గము. "గీ. కృష్ణరాయలతో దివి కేఁగలేక, బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు." పెద్దనచాటువు; 2. ఆకాశము. "గీ...వింగి దివి మొగులుందారి గాడ్పుకం ద్రవ నభ మొయ్య..." అం. నం. దేవ. ౩౧; 3. దినము, పగలు. ఇ. పుం. పాలపిట్ట.

దివిజుఁడు. సం. వి. అ. పుం. వేల్పు. దేవత.

దివిదారికొమ్ము. ద్వ. వి. రెండిట్టికొమ్ములు జతగా చేర్చి చేసిన ఆయుధవిశేషము, సింగోట. "సీ. జింక కొమ్ములు రెండు చేర్చి యగ్గి లకుర్చి డాకేలఁ బూన నొడ్డగనఁ బోదువ, సంగతి గలయది సింగోట యనఁగను దివిదారికొమ్ము నాఁ దేజరిల్లు." అం. భా. ద్వి. ౨౦౬.

దివిదార్కొమ్ము=దివిదారికొమ్ము. "కం. చను సింగోట దివిదార్కొమ్మన శృంగయుగళిక సమాఖ్యలం గా .." ఆంధ్రపదపారిజాతము. ౫౭.

దివియ. వై. వి. (సం. దీపికా.) దీపము. "చ. నవవికచారవిందరుచి నవ్వెడు కన్నులచాయ చుక్కలన్, దివియల మాయఁ జేయ నలు దిక్కుల మ్రొక్కులపేర మోడ్పుచు యాదవకరశైరవంబుల కతంబునఁ గంటి మురారిభాస్కరున్." ఉ. హరి. ౪, ఆ. ౧౮౦, అం. భా. ద్వి. ౧౬౪; 2. కరదీపిక, దివటీ. "క...దివియలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్" సా. ౩, ఆ. ౨౭.

దివియకంబము. వై. వి. (దివియ+కంబము.) దీపస్తంభము "సీ. సప్తపాతాళనాగేంద్రచంద్రముఖులు, ఫణమణిజ్యోత్స్న దివియకంబము లగుదురు." భీమ. ౩, ఆ. ౬౨, విక్ర. ౬, ఆ. ౧౩౮.

దివియకోల. ద్వ. వి. (దివియ+కోల.) దివటీ. "చ. కడుఁ బెనుమంట లైనయుదకంబు తొలంకున వారిబిందువుల్, మిడిసి సమీపభూజములమీఁద వెస బడి మ్రండుచుండ రెక్కడురథసంబుతో దివియకోలలకై వడి భంగసంగతిన్, బొదమినఫేనముల్ మెఱసె..." వి. పు. ౭, ఆ. ౧౬౫.

దివియలవాఁడు. ద్వ. వి. (దివియలు+వాఁడు.) దీపము పట్టుకొనువాఁడు. "క...దివియలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్." సా. ౩, ఆ. ౨౭.

దివివెలయాలు. మి. వి. దేవవేశ్య. "సీ. దివివెలయాలికై జగుసన్నదమ్ములం దగ్రజుఁడా ల్గొత్తిక్క నట్టిజంత." చం. రా. ౨, ఆ. ౭౪.

దివిషదుఁడు. సం. వి. ద్. పుం. వేల్పు, దేవత.

దివు. దే. అ. క్రి. దిగు, తప్పు. "క.. భువికి, త్రిగనలరం గలరు ద్రోవ దివ దక్రమతన్." రాఘవ, ౨, ఆ. ౯౯.

దివె. వై. వి. (సం. దీపికా.) దీపము. "ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగుదివె లిక్కడఁ గేతకిగంధవైభవం, బిక్కడ భూరిగర్జితములు..." భర్తృ. ౨, ఆ. ౯౩, అం. భా. ద్వి. ౧౬౪.

దివెకంబము. వై. వి. (దివె+కంబము.) దీపస్తంభము. "చ...తుఱుఁ,కటఁ బడిగంబుఁ గంచుదివెకంబము గల్గినపట్టెమంచ ము,త్కటరుచి నించ మించురతిధామము..."శుక. ౪, ఆ. ౨౨, ప్రబంధ. ౬౦౫.

దివెగూఁడు. ద్వ. వి. (దివె+గూఁడు.) దీపముంచు గూఁడు. "సీ. తెల్లజిల్లెడువేఱు విల్లారిదివెగూఁడు గాజుటద్దము కావ్యకరపటంబు.' బహు. ౫, ఆ. ౧౪౯.

దివెదారికొమ్ము. ద్వ. వి. (దివె+దారి+కొమ్ము.) దారులదీపస్తంభము, గరుడగంబము. "సీ. దివెదారి కొమ్ము దోల్తిత్తియు జోడమ్ము మెడమీఁది మొగలాకు గొడుగు దనర." ఆము. ౬, ఆ. ౬.

దివెల. వై. వి. (సం. దీపావళీ.) దీపావళ్యమావాస్య. "క. ఎడలేదు దివెల నడుమ కా,గడుచున్ మీపురముఁ జేరఁగా లేము .." చెన్న. ౩, ఆ. ౧౬౪.

దివెలపండువ. ద్వ. వి. (దివెల+పండువ.) దీపావళి పండువ. "క. ఓయప్ప నీవు బావయ్యఁ,బాయక నాతోడ దివెలపండువ కిటు ర,మ్మా-" చెన్న. ౩, ఆ. ౧౫౧.

దివోదాసుఁడు. సం. వి. అ. పుం. రిపుంజయుఁ డను మనువంశపురాజు.

దివౌకసము. సం. వి. స్. పుం. 1. పక్షి; 2. వానకోయిల,చాతకము.

దివౌకసుఁడు. సం. వి. స్. పుం. వేల్పు, దేవత.

దివౌకుఁడు = దివౌకసుఁడు.

దివ్య. ఉభ. వై. వి. (సం. దీపికా.) దీపము. (చూ. దివ్వాఱుపుఁబువ్వు.) సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక, ఆమలకి♣; 2. పెద్దజీలకఱ్ఱ♣; 3. కరక,హరీతకి♣.

దివ్యచక్షువు. సం. వి. స్. పుం. 1. కోఁతి, మర్కటము; 2. అలౌకికవస్తుగ్రహణసమర్థమైనజ్ఞానము. విణ. (స్) 1. దివ్యదృష్టి గలవాఁడు; 2. గ్రుడ్డివాఁడు,అంధుఁడు; 3. మంచికన్నులు గలవాఁడు.

దివ్యజ్ఞానము. సం. వి. అ. న. అతీంద్రియజ్ఞానము.

దివ్యనది. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ.

దివ్యప్రబంధము. సం. వి. అ. న. వైష్ణవప్రామాణికమగుద్రావిడవేదగ్రంథము. "మ...దివ్యప్రబంధయుతాఖ్యల్..." ఆము. ౧, ఆ. ౫౬.

దివ్యము. సం. వి. అ. పుం. 1. గుగ్గిలము♣; 2.యవటు♣; 3. ఉత్పాతభేదము; 4. లవంగము♣; 5. హరిచందనము♣; 6. తత్త్వనిర్ణయార్థ మొనర్చు పరీక్షారూప దివ్యప్రమాణము. (ఇది. తులాదివ్యము, అగ్నిదివ్యము, జలదివ్యము, విషదివ్యము, కోశదివ్యము, అనిపంచవిధము.); 7. గంగాజలము. (ఇది. ధారాజము, కరకాజము, తౌషారము, హైమము అని చతుర్విధము ) విణ. (అ. ఆ.అ.) 1. స్వర్గమునఁ బుట్టినది; 2. స్వర్గసంబంధమైనది; 3. ఆకసమునఁ బుట్టినది; 4. ఇంపయినది, మనోజ్ఞము; 5. ప్రకాశించునది; 6, లోకాతీతము.

దివ్యవాణి. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశవాణి, అశరీరవాణి. "చ ..అని దివ్యవాణి దా,నినిత ధరాధినాథునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్." భార. ఆది. ౪, ఆ. ౧౦౬.

దివ్యస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. 1. దేవతాస్త్రీ; 2. అచ్చర, అప్సరస. మొ.

దివ్వాఱుపుఁబువ్వు. ద్వ. వి. (దివ్య+ఆఱుపు+పువ్వు.) దీపమార్పునొక జాతిపురుగు. "గీ. గువ్వ గ్రద్ద దివ్వాఱుపుఁబువ్వు గూబ యిల్లు సొచ్చిన శాంతి చేయింపవలయు." భార. అను. ౪, ఆ. ౧౯౯.

దివ్యుఁడు. సం. వి. అ. పుం. 1. వేల్పు, దేవత; 2. యముఁడు.

దివ్యోపపాదుకుఁడు. సం. వి. అ. పుం. దేవత,వేల్పు.

దివ్వటి. వై. వి. (సం. దీపయష్టిః) కరదీపిక, దివటీ. "సీ. నలువంకలను నిండి నవరత్నమణికాంతి కొదలేక దివ్వటు లెసఁగ మెసఁగ."ఉ. రా. ౬,ఆ.౪౪.

దివ్వటీ=దివ్వటి. "సీ. పాటుకోన్నతకాంత పాటలద్యుతి మించుదివ్వటీ శ్వేతవేళ్ తేజరిల్ల." కృష్ణ. ౪, ఆ. ౧౧౬, విజ. ౩, ఆ. ౧౦౨.

దివ్వటీఁడు. ద్వ. వి. (దివ్వటి+ఈఁడు.) దీపము పట్టుకొనువాఁడు. "ద్వి. బాలవారిని దివ్వటీలను బల్లు గొలలవారిని గుడిపూజరులను." బస. ౩, ఆ ౫౧౦, పం. ౨, ఆ. ౪౬౬. పం.

దివ్విటి=దివ్విటీ. (గ్రా. వా )

దివ్విటీ. వై. వి. (సం. దీపయష్టిః.) కరదీపిక,దివటీ. "గీ. పరుండిపడి దివ్విటీలు చేబట్టి రగులం,గొలుపు

సంతతిలోన సక్కొటిదివ్విటీలు గూడినమాడ్కిఁ గడించియుంటు, లాక్షతనుకాప మెదరింప నవని విభుఁడు." చెన్న. ౫, ఆ. ౧౭.

దివ్వియ. వై. వి. (సం. దీపికా.) దీపము. ఆం. భా. ద్వి. ౧౬౪.

దివ్వియకంబము. వై. వి. (దివ్వియ+కంబము.) దీప స్తంభము. "క. అయ్యె యపుఁ గాక యంచును, దియ్యమెసఁగ రాజు జూచి దివ్వియకంబం, బియ్యకొని..." విక్ర. ౬, ఆ. ౪౦.

దివ్వె. వై. వి. (సం. దీపః.) దీపము. "క. నవ్వులు సల్లాపంబులు, నివ్వటిలన్ బంధుమిత్రనివహంబులతో,బువ్వంబులు భుజియించిరి, దివ్వెలు వలు దిక్కులందుఁ దేజము లెసఁగన్." బ్రహ్మో. ౪, ఆ. ౨౧౦. ఆము. ౨, ఆ. ౧౭, విణ. ప్రకాశవంతము. (బ్రా.)

దివ్వెకంబము. వై. వి. (దివ్వె+కంబము.) గీప స్తంభము. "గీ. గంటు మాటలు గొని దివ్వెకంబ మింత, యొనయఁ గూర్చుండి యాభ్యర్ణి మేంచవదన." శుక. ౪, ఆ. ౩౧, విక్ర. ౬, ఆ. ౩౮.

దివ్వెకోల. ద్వ. వి (దివ్వె+కోల.) కరదీపిక, దివ్వటీ. "ద్వి. అలిల కొలువిదయ్యంబుల దివ్వెకోలలవారిఁ గాఁ గొని గస్తు దిరిగి." ద్వి. హారిశ్చ. ఉ. ౧౬౬౭. పం.

దివ్వెచమురు. ద్వ వి. (దివ్వె+చమురు.) ఆముదము. "గీ...ఆముదమ్ము దివ్వెచమురనంగ నేరండ తైలము దలిర్చు" వేంక. మాన. ౭౨.

దివ్వెటీ. వై. వి. (సం. దీపయష్టిః.) కరదీపిక, దివటీ. "గీ. ఆదరుచ్చేటులరొదల బ్రహ్మాండ మగల,నెందుఁ జూచిన దివ్వటీ లే వెలుఁగ..." దశా. ౭, ఆ. ౧, ఆ. ౨౫౧.

దివ్వెనకోల. దే. వి. కాష్ఠదీపిక. "సీ. జంజామ దుందురు బురుదు దివ్వెనకోల యనఁ గాష్ఠదీపికాహ్వయము లమరు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దివ్వెల. వై. వి. (సం. దీపావళిః.) దీపావళ్యమావాస్య. "క. మాదాయాదులు బంధువు, లాదివ్వెల కాత్మసుతల నల్లుండ్రను సప్రమోదమునఁ బోడి తెత్తురు..." చెన్న. ౩, ఆ. ౧౬౩.

దివ్వెలపండుగ. ద్వ. వి. (దివ్వెల+పండుగ.) దీపావళి పర్వము. "క. ఒండొరులతోడ దివ్వెలపండుగ యిడె వచ్చె నింకఁ బదిదినములకున్, పండుదు రరి నెలఁ గజ్జపుఁటుండలు మాయింట నచుడు కొక్కఁ డు పలికెన్." చెన్న. ౩, ఆ. ౧౧౫.

దివ్వెలయమాస. వై. వి. (దివ్వెల+అమాస.) దీపావళ్యమావాస్య. "ఉ. మాసరివారు దివ్వెలయమాసకు నల్లర నాఁడుబిడ్డలన్, వాసి యొసంగఁ దోకొనుచు వచ్చుచు నుండిరి..." చెన్న. ౩, ఆ. ౧౪౪.

దివ్వెలెత్తు. ద్వ. అ. క్రి. (దివ్వెలు+ఎత్తు.) దీపములు పెట్టు. "గీ. దినమునను సంజకడ యంచు దివ్వెలెత్తు." శుక. ౨, ఆ. ౫౬౧.

దివ్వెసుడి. ద్వ. వి. (దివ్వె+సుడి.) 1. గోడయందు గిపము పెట్టుగూఁడు. (శ. ర.); 2. దీపము పెట్టుకొనుటకై కొయ్య మొదలగువానితో చేసినసాధనము. (బ్రా.)

దిశ. సం. వి. ఆ. స్త్రీ. దిక్కు, కడ.

దిశత్. సం. శత్రు. 1. ఇచ్చుచున్న; 2. ఉపదేశించుచున్న; 3. ఆజ్ఞాపించుచున్న; 4 నిర్దేశించుచున్న.

దిశ్యమానము, సం. విణ. (అ. ఆ ఆ.) 1. ఇయ్యఁబడుచున్నది; 2. నిర్దేశింపఁబడుచున్నది; 3. ఆజ్ఞాపింపఁబడుచున్నది; 4. ఉపదేశింపఁబడుచున్నది.

దిశ్యము. సం. విణ. (అ. ఆ. అ) 1. దిక్కునందున్నది; 2. దిక్కునందుఁ బుట్టినది.

దిష్టము. సం. వి. అ. న. 1. భాగ్యము; 2. ఆదేశము, ఆజ్ఞ; 3 నిర్దేశము. పుం. 1. కాలము, సమయము; 2. మ్రానిపసుపు. విణ. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁబడినది; 2. ఆజ్ఞాపింపఁబడినది; 3. నిర్దేశింపఁబడినది; 4. ఉపదేశింపఁబడినది; చెప్పఁబడినది.

దిష్టాంతము. సం. వి. అ. పుం. 1. మరణము, చావు; 2. భాగ్యనాశనము.

దిసంతడుచు. దే. స. క్రి. (దిసంతు+అడుచు.) నిందించు. "మ. అదిగో తల్లిఁ గడుం దిసంతడిచియూ రాద్యంతముం బైపయిం, పెదకొలువ్వరఁ బంచి .." పరమ. ౩, ఆ. ౨౭౧ సితిపీ. ౮౨. (ఇట్లే: దిసంతులడుచు.)

దిసంతు. దే. వి. నింద, అపవాదము. "సీ... దిసంతుపడి కోయి కోఁత... అపవాదసంజ్ఞయై యలరుచుండు." ఆం. భా. ప్ర. ౧౧౫.

దిసంతుకొట్టు. దే. స. క్రి. (దిసంతు+కొట్టు.) నిందించు, దూఱు. "ఉ. పట్టఁగ లేమి కొండొరుల

బల్లముం గాల దిసంతుకొట్టుచున్." కళా. ౩, ఆ. ౧౦౩.

దిసమొల. ద్వ. వి. (దిస+మొల.) వస్త్రవిహీనమైన మొల. (చూ. దిసమొలవాఁడు.) విశే. దిగంబరుఁడు, నగ్నుఁడు. "వ. రుద్రా నీవు భద్రదేవద్రుమాటవీవాటియందు దిసమొలదూఁబున దిండిమిండలజంగంబవై ..." భీమ. 3, ఆ. ౨౧౦. ఆం. భా. తృ. ౧౨.

దిసమొలవాఁడు. ద్వ. విశే. (దిసమొల+వాఁడు.) దిగంబరుఁడు, వస్త్రహీనమైన మొల గలవాఁడు. (శ. ర.)

దిసమొలవేల్పు ద్వ. వి. (దిసమొల+వేల్పు.) 1. శివుఁడు; 2. కాలభైరవుఁడు. "చ. దిసమొలవేల్పు సాహిణపుఁ దేజులు పోషక గేహరక్షకుల్." కవిరా. ౨, ఆ. ౧౨. (శ. ర. పా. 'జసమొలవేల్పు.' మాంద్రి. పా.)

దిసించు. దే. అ. క్రి. కనఁబడు, గోచరించు. "చ. మునుమును పెండు లేని ప్రియముల్ నపరించి యొకింత లోఁగినన్ వెనుక దిసించి చూడ రవసిన్ మగవారల నమ్మర దు .." సాపి. ౧, ఆ. ౧౫. సా. ౨, ఆ. 3౧. స. క్రి. మీఱు, అతిశయించు. "గీ. కులుకుఁజెక్కులు కసిఁడియాకుల దిసింపడ జిన్నిగుచములు వోఁకలచెన్ను మీఱ." ముకుంద. ౧, ఆ. ౭౯, పు.

దిసె. వై. వి (సం. దిశా.) దిక్కు, కడ. "ఆ. పాంచజన్యరవముఁ బాడమహాశబ్ద, రవముఁ జెలఁగె దిసెలు సెవులువడఁగ." భార. అర. ౧, ఆ. ౧౮౦? (ఈ పాఠము విచార్యము.)

దిస్టి. వై. వి. (సం. దృష్టిః. క. దిష్టి.) 1. "సీ చూడ్కి, పారువ దిస్టి చూపు వీక్షణము లొప్పు ..." సాం. ని. మాన. ౧౫; 2. కసరు దృష్టిదోషము. (బ్రౌ. వా.) (వ్యవ:-) పిల్లవానికి దిష్టి తగిలినది.

దిస్టికొట్టు. ద్వ. వి. (దిస్టి+కొట్టు.) దృష్టిదోషము కలుగఁజేయు. (వ్యవ.) అందఱు వచ్చి పిల్లవానికి దిష్టికొట్టినారు.

దిస్టితీయు. ద్వ. అ. క్రి. (దిస్టి+తీయు) దృష్టిదోషముపోవుటకై మిరపకాయలు మొదలగునవి దిగఁదుడుచు. (వ్యవ:) పెండ్లికడ దిష్టితీసి పోసిన బాధ తగ్గును

దిస్టిపిడుత. ద్వ. వి. (దిస్టి+పిడుత.) దృష్టిదోషము తగులకుండుటకై సున్నపుబొట్లు పెట్టి సస్యాదుల యొద్ద నుంచుపిడుత. (వ్యవ:) ఆపాదుదగ్గఱ దిష్టిపిడుత తగిలించుము.

దిస్టిబొమ్మ. ద్వ వి. (దిస్టి+బొమ్మ.) సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకై మనుష్యరూపముగ చేసి యుంచుబొమ్మ. (వ్యవ.) అపొలములో దిష్టిబొమ్మ యున్నది.

దిస = దిస్స.

దిస్స. వై. వి. (సం. దిశా.) దిక్కు. (దీనికివ్యస్తముగా ప్రయోగము లేదు. చూ. దిస్సమొల.)

దిస్సమొల. ద్వ. వి. (దిస్స+మొల.) వస్త్రహీనమైన మొల, దిసమొల (చూ. దిస్సమొలవేల్పు.)

దిస్సమొలవేల్పు. ద్వ. విశే. (దిస్సమొల+వేల్పు.) వస్త్రవిహీనమైన మొల గలదేవుఁడు. "గీ. వీటిపెద్ద తలారి నిస్సాటికలికి, దిస్సమొలవేల్పు పార్వతీదేవి పట్టెఁ, గాలభైరవుఁ గుఱ్ఱుకరగణపరివృఢుఁడు, ననుచరించిరి ముసలు నాకౌకసులును." కాశీ. ౨, ఆ. 3౧. రామా. ౨, ఆ. ౨౧.

దిస్సు. దే. వి. 1. నవ్వుటయందగుధ్వని కనుకరణము. "సీ. పర్యేద దిగజార్చి పాలిండ్లు కుచరించు, దిస్సువాఱఁగ నవ్వుఁ దిఁగెనవ్వు." క్రీడా ౩౯; 2. పాము బుసకొట్టుటయందగుధ్వని కనుకరణము. "గీ. ఉగ్రతిమి శిరోరంధ్రవిష్వ్యాత మగుచు, కాగయుఁ సలిలౌఘ మది యెందు మిగుల నొప్ప, నబ్ధిపేరిటి కుండలితాంగభోగి, దిస్సురన్ దనరదగ యొత్తెనో యనంగ." కళా. ౪, ఆ. ౧౯౫. (శ. ర. పా.)

దిహాల్. సం. శత్రు. పూయుచున్న.

దిహ్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) పూయఁబడుచున్నది.

దీ

దీ. దే. అవ్య. పంజకాండ్రు కోట్టేళ్లను పోట్లాటకై ప్రేరించుమాట. "చ...బగ్గునఁ దాఁకెడుఁ జాడు సెట్టి టిట్టిభ దిదిదీ యనంగను గడించినదర్భము లీయురభ్రముల్." క్రీడా. ౨౨౮.

దీకు. దే. వి. 1. ప్రేరణ, పురికొల్పుట. "క. వీనపుడు ధర్మపాశాధీనుఁడవై కొడుకునకు దీకొనరింపం, గా నేరకున్న మెయిమెయిఁ, బోనద్యోగాక యుంకఁ జొమ్మా యుచటన్." భార. విరా.

౫, అ. ౯౧; 2. భ్రమ, భ్రాంతి. "ఉ. లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి ప్రాణులన్, దీపలఁ బెట్టి యెల్లెడల దీవులు దూపెడివిష్ణుమాయచేఁ, దేకమతిం దరించితి..." భాగ. ౬, స్కం. ౪౨౧.

దీకొను. దే అ. క్రి. (దీ+కొను.) ఉత్సహించు, స్పర్ధపడు "క. దాశొని ఖడ్గాఖడ్గి నొ, కాశకచాకచినొ బాణాబాణలమునసో, నీ కెద్ది యిష్ట మనికిన్, దీకొనుమా యొకట మెచ్చితిమి నృపతనయా" రామా. ౫, అ. ౧౪౯. భాగ. ౬, స్కం. ౪౦౦. స. క్రి. అంగీకరించు. "ఉ. ఈకొలఁగాని కార్యమిటు లెవ్వఁడొకో యనుమానశత్రుఁడై, నీకుఁ బ్రియంబుగాఁ బలికె ..గీసుమో కాదన కీదృశ మెవ్వఁడేనియున్." భా. రా. అర. ౨, అ ౧౪. అ. క్రి. స. క్రి. 1. (ప్రాణ్దిష్ట పారిణోనొండొంటిని) దాఁకు. "గీ. తిరుగఁబడి కురుమతగరుల్ దీకొనుగతి." ప్రబంధ. ౭౬; 2. ఎదిరించు, మార్కొను. "ఉ. తెంపెసఁగారఁగా మనల గొని యున్నది యొక్కలేమ..." కాశీ. ౬, అ. ౨౩౩. రామా. ౩, అ. ౧౪౫.

దీకొలుపు. దే. స. క్రి. (దీకొను ధా. ప్రే. 1. పురికొలుపు. "క. నగుఁ దన్నపాటు గఱఁగొని, దిశిభనిభద్విపము నలుక దీకొలుపుచు బెట్టగుశక్తి వైవ ..." జై. ౬, అ. ౧౪౨; 2. ఎదుర్కొనఁజేయు." "క...వారణతిలకంబు నెక్కి వడి బువభునిపై, ఘోరగతిఁ గాలసంప్రుఁడు, ధీరాటోపంబుతోడ దీకొలుపుటయున్." భా. రా. యు. ౬౭౩. వరాహ. 3, అ. ౫౪.

దీకోలు. దే. వి. (దీకొను ధా.) డీకొనుట. (శ. ర.)

దీక్ష. సం. వి. అ. స్త్రీ. 1. యజ్ఞాదికర్మలయందు అవలంబించునియమము; 2. పట్టుదల; 3. మంత్రోపదేశము; 4. ఉపనయనసంస్కారము.

దీక్షణము. సం. వి. అ. న. 1. దీక్ష; 2 దీక్షపూనుట.

దీక్షించు. సం. అ. క్రి. దీక్షపూను. "క. వేయేఁడుల వ్రతమునకై, ధీరయోగము సిద్ధి నొంద దీక్షించి మనశ, కాయవచోనియమము నిరపాయంబుగఁ గొడఁగి రురుతపస్సాధనమున్." హరి. ఉ. ౧౦, అ. ౧౬౭. హరి. ఉ. ౬, అ. ౨౦.

దీక్షితాయని. సం. వి ఈ. స్త్రీ. దీక్షితునిభార్య.

దీక్షితుఁడు. సం. విణ. (అ. అ.అ.) 1. యజ్ఞాదికర్మలయందు దీక్ష వహించినవాఁడు; 2. తలఁచినకార్యమును నిర్వహించుటకై పట్టుదలఁ దాల్చినవాఁడు; 3. పట్టాభిషిక్తుఁడు; 4. హవిర్యాగము మున్నగు శ్రౌతకర్మల నాచరించినవాఁడు.

దీక్షిష్యమాణుఁడు. సం. విణ. (అ. అ. అ) దీక్ష పొందనై యున్నవాఁడు. "గీ. ఈవు దీక్షిష్యమాణుఁడ విద్ధమహిమ." కాశీ. ౭, అ. ౫౭.

దీటు. దే. స. క్రి. 1. సరిచేయు, చక్కఁజేయు. "చ. తిలకము దిద్దుచున్ గురులు దీటుచు... అద్దముఁ జూచె నొకర్తు వేడుకన్." నృసిం. ౨, అ ౭౬. హంస. ౧, అ. ౨౧౭; 2 ఆకర్షించు, లాగు. "మ. అతిశీఘ్రంబుగ శార్ఙ్గ మెక్కిడి గుణంబాభీలతం దీటుచున్." ఉ. రా. ౨, అ. ౫౬; 3. (దంతములు మొ.) కొఱుకు. "మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు కంపింపఁగా, రదములన్ దీటుచుఁ గత్తిరించినవెవుల్ రాజిల్ల..." భాగ. ౧౦, స్కం. పూ. ౬౧౭. భా. రా. యు. ౩౨౬; 3. ఊఁపు, చలింపఁజేయు. "పంచచామరము.ఛటచ్ఛటాతరంగపంక్తి పాఱఁ జేటిదీటఁగా" ఉ. హరిశ్చ. ౨, అ. ౧౨౭. వి. విధము, రీతి. "ఆ. పొన్నపువ్వుదీటు పోల్పులోకులమాట, నోటుచేసి వేల్పుబోటినాభి, విస్తరిల్లె..." రసిక. ౬, అ. ౧౦౦. విణ. సాటి, సమానము. "ఉ...నీ,కేసురలైన దీటగుదురే..." ఉ. రా. ౨, అ. ౧౯౯. బిల్హ. ౧, అ. ౧౦౪. క్రి. విణ. తిన్నఁగా, సూటిగా. "క...దిటమింతయుఁ విడక యతఁడు దీటుగఁ గదుముం,దటికిఁ జని..." నీలా. 3, అ. ౬౪.

దీటుకట్టు. దే. అ. క్రి. (దీటు+కట్టు) నిండు. "వ... దేవదుందుభిధ్వానంబు రోదసీకుహరంబునం దీటుకట్టె .." నైష. ౬, అ. ౨౯.

దీటుకొను. దే. అ. క్రి. (దీటు+కొను.) 1. నిండు. "గీ. అంతకంతకుఁ గదిసి సైన్యములు సుట్టు, ముట్టి శస్త్రాస్త్రసంచయమున నభంబు, దీటుకొనునట్లు సేయు..." భార. విరా. ౫, అ. ౩౪; 2. వ్యాపించు. "మ...అస్త్రశస్త్రచయశుంభద్దీప్తిజాలంబు సర్వదిశాభాగములందు దీటుకొన..." దశ. ౨, అ. ౯౭. భార. కర్ణ. 3, అ. ౩౨౨; జనించు, కలుగు. "క...విధి,త్రివ్వుల కప్పురు●పాటు దీటు

కొనంగన్." దశ. ౨, ఆ. ౯౩. స్వా. ౫, ఆ. ౩౧; అతిశయించు. "మ ..కని రోమస్ఫురణంబు దీటుకొన హుంకారంబు గావింప..." శై. ౫, ఆ. ౯౭; 5. ఒప్పు. "ద్వి. ద్విగుణార్థ భావముల్ దీటు కొనంగ, దేట తెలుంగున ద్విపద రచింతు." పం డితా. దీక్షా. ౧౩, పుట. స. క్రి. సరిచేసికొను. "వ అప్పు డప్పుతంగపుంగవుండు . మించి చం చూపుటంబు గీటుకొని దాటుచూ ని శతకోటిసఖసఖ ముఖలోటిం బరిపాటిం దదంగంబు భంగంబుఁ గావించి .."రామా. ౫, ఆ. ౧౯౯.

దీటుకొలుపు. దే. స. క్రి. (గీటు+కొను ధా.) 1. కలి గించు, పుట్టించు. "వ ..హాసకుసుమంబులు సాంద్ర తరచంద్రికాకందంబులం గీటుకొలుప..."ఆము. ౪, ఆ. ౭౫; 2. నిందఁజేయు. "గీ. దేవదుందుభు లుడుపీథి గీటుకొలుప, నమరు లందంద పుష్పవర్ష ములు కురియ, దక్షవాటంబు జొచ్చెఁ గౌతమత నూజ." భీమ. ౪, ఆ. ౧౯౩. నృసిం. ౧, ఆ. ౭౫, 3. ప్రయోగించు. "సీ...సచరాచరం బైన జగము లెల్ల. గీ. నొక్కమొగమై కదంగినఁ జిక్కు పఱచు, దివ్యబాణజాలంబుల దీటుకొలిపి." భార. ఉద్యో. ౪, ఆ. ౨౨౯. భా. రా. యు. ౧౬౨౧.

దీటుకొల్పు = గీటుకొలుపు. (అతిశయింపఁజేయు.) "శా. స్నిగ్ధాప్తాకదకుంభిదీప్తిరవి నాశ్లేషింప శుభ్రాంబుద, స్రగ్ధావళ్యముఁ గేలిఁబెట్టు శిఖర ప్రాంశుచ్ఛటాశోభల్, సుధాంభోనిధి గీటు కొల్పఁగ సుధాంధోనాకోదండసమ్యగ్దామాశ్ర యతోరణద్యుతులు నేత్రానందముం జూపఁగన్." ఉద్భ. 3, ఆ. ౪.

దీటుపడు. ద్వి. అ. క్రి. (దీటు+పడు.) పోలు, సమాన మగు. (చూ. దిటుకఱచు.)

దీటుపఱచు. ద్వి. స. క్రి. (గీటుపడు ధా. ప్రే.) పోల్చు, ఉపమించు. "సీ...వాణి నీమెకు దటు పఱుప వచ్చు." పరతత్త్వ. ౧, ఆ. ౩౭.

దీటువచ్చు. దే. అ. క్రి. (దటు+వచ్చు.) సాటియగు, సమమగు, "సీ. లచ్చికోడలికన్నులకు దీటువచ్చునీ లోత్పలకరపంక్తు లొనరఁ దాల్చి." ఉ. రా. ౪, ఆ. ౧౫౩. ముకుంద. ౩, ఆ. ౭౭. స. క్రి. పోలు. "చ ..వనజదళాక్షుఁ దత్తనయుం వాని విరోధిని వానిమిత్రుఁ దా, కెనయగు దీటువచ్చు మఱి యెంతయు సాటగుఁ జూడ జోడగున్." రామా. ౯౯౨.

దీదివి. సం. వి. ఇ. పుం. స్త్రీ. న. అన్నము. పుం. 1. బృహస్పతి; 2. భక్ష్యము; 3. స్వర్గము; 4. అగ్ని.

దీధితి. సం వి ఇ. స్త్రీ. 1. కిరణము; 2. కాంతి; 3. వ్రేలు, అంగుళి.

దీను. సం. వి. ఆ. స్త్రీ. ఆడెలుక, మూషిక.

దీనము. సం. వి. అ. పుం. న. 1. సురపొన్న*; 2. మొగలి*; 3. నందివర్ధనము*.

దీనారము. సం. వి. అ. పుం. 1. ఒకజాతిబంగారు నాణెము; 2. బంగారునగ.

దీను. దే వి. ఔద్విదము,మనోజ్ఞత. (చూ. గీనుమిగులు.)

గీనుమిగులు. దే. అ. క్రి. ఒప్పు. "గీ. కాన నదియ శరణ్యమై గీనుమిగులు, నైహికాముష్మికాకాంక్షు లగునరులకు." పాండు. 3, ఆ. ౧౩౨. ౨, ఆ. ౧౪౪.

దీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. బీద, దరిద్రుఁడు; 2. దుఃఖితుఁడు; 3. భయపడినవాఁడు; 4. జాలి గొలుపువాఁడు, శోచనీయుఁడు; 5. దర్ప ముడి గినవాఁడు.

దీపకము. సం. వి. అ. పుం. 1. గీపము; 2. ఓమము; 3. వేటకాఁడు పక్షిమృగాదులను బట్టుటకై మెంచినపక్షిమృగము లోనగునది, గీమము; 4. మయూరశిఖ, నెమిలిజుట్టుచెట్టు. న. 1. రాగ భేదము. (సంగీ), 2. అలంకారభేదము. (అలం.) ణ (అ. సికా. ఆ.) 1. ప్రకాశింపఁజేయునది; 2. రగులుకొలుపునది; 3. విశదపఱచునది, వివ రించునది; 4. జఠరాగ్నిని వర్ధిల్లఁజేయునది, గీపన కారి, 5. గీపము కలిగించుటయందు చేర్పరి.

దీపకంబము. మి. వి. (గీపము+కంబము.)దీపస్తంభము. "ద్వి. అపరంజ్యోతిస్వరూపంబునకును, దీపకం బంబు లెత్తించినయట్లు." బస. ౧, ఆ. ౯, పు. పండితా. పర్వ. ౩౫౧, పు.

దీపనము. సం. వి. అ. న. 1. ప్రకాశింపఁజేయుట; 2. రగులుకొలుపుట; 3. జఠరాగ్నిని వృద్ధిచేయుట; 4. కుంకుమము. పుం. 1. మయూరశిఖి*; 2. కసింది*, 3. నీరుల్లి*; 4. మెంతికూర*; 5. ఓమము; 6. చిఱుబొద్ది*. విణ. (అ. ఈ. అ.) 1. రగులుకొలుపునది; 2. జఠరాగ్నిని వర్ధిల్లఁ జేయునది; 3. ప్రేరేచునది, ఉద్దీపకము.

దీపము. సం. అ. పుం. 1. దివ్వె, దీపిక. "క. నీపుణ్య తనువులనన, యాపుత్త్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పెన్, దీపంబులన నొండొక, దీపము ప్రథవించినట్లు తేజం బెసఁగన్." భార. ఆది. ౪, ఆ. ౯౦. హంస. ౩, ఆ. ౧౦౮; 2 మయూరశిఖి.

దీపవృక్షము. సం. వి. అ. పుం. వృక్షాకారముగా నుండుదీపస్తంభము. "ద్వి. శ్రీపర్వతునకు చెచ్చెర నివాళింప, దీపవృక్షంబు లేతెంచుభావమున .." పండితా. పర్వ. ౩౬౨, పు.

దీపశత్రువు. సం. వి. ఉ. పుం. మిడుత, శలభము

దీపశిఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. దీపపుకొన; 2. కాటుక, కజ్జలము.

దీపారాధనము. సం. వి. అ. న. దీపము వెలిఁగించి భగవంతుని సేవించుట.

దీపావళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఆశ్వయుజమాసమునందలి యమావాస్యపండుగ; 2. దీపములపంక్తి.

దీపి. సం. విశే. (న్. నీ న్.) 1. రగుల్చునది; 2. ప్రకాశించునది; 3. దీపనకారి.

దీపించు. సం. అ. క్రి. 1. అతిశయించు, హెచ్చు. "గీ... అత్యంతకలకలంబు, చాల దీపించె నోయింటి ప్రాలువేళ." కాళిందీ. ౫, ఆ. ౧౨౪. భాగ. ౩, స్కం. ౧౧౪; 2. ఒప్పు. "క. ఆముఖ్యవరిశోరంగను, ధీమణి దీపించె వంశతిలకం బగుచున్." పాండు. ౧, ఆ. ౩౬; 3. ప్రకాశించు; మెఱయు. "సీ. నాసీరమై వచ్చునలినబాంధవుటుక్కయంబు పై దీపించునద్ద మనఁగ. గీ... వేగుఁజుక్క వొడిచె." స్వా. ౩, ఆ. ౫౪. భార. శాం. ౪, ఆ. ౭౫; 4. (ప్రసిద్ధమై) ఉండు. "గీ. బ్రహ్మతీర్థంబనఁ దండపాణియాశఁ, గులశిఖరిపుత్త్రి దీపించుఁ గలశతీర్థ, మేనుబారల నిడుపున దీపు మిగిలి, యదియ యమృతామవాదేవి కాస్పదంబు." పాండు. ౨, ఆ. ౧౪౪. స. క్రి. (కాంతి) కలుగఁజేయు "ద్వి. దిక్కుల కెల్లను వెలిపి దీపించు, చుక్కల గమికాడు చూపట్టె మింట." రం రా. సుం. ౨౪౩, పు. ౧౪, పం.

దీపిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దీపము, దివ్వె; 2. చిన్న దీపము; 3. దీపమువలె నీతి మున్నగువానిని విశదపఱచు గ్రంథము. ఉదా:-నీతిదీపిక. మొ.

దీపితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. రగుల్పఁబడినది; 2. కాల్పఁబడినది; 3. ప్రకటింపఁబడినది; 4. ప్రకాశింపఁజేయఁబడినది 5. ప్రేరేపఁబడినది. "క. ఆపార్థుఁడు గోపానల,దీపితుఁడై ..." భార. ద్రో. ౧, ఆ. ౨౫౩.

దీపిలు. దే. అ. క్రి. ప్రకాశించు. "శా. పైపై దీపిలునాతపంబు లనుసోపానంబులే ప్రాపుగా, భూపోత్తంసము మేదిలోద విదిన్ తో..." గాథే. ౪, ఆ. ౭౮. పు.

దీపురము. వై. విశే. (సం. దీప్రమ్.) ప్రకాశించునది. "క. అపురమున నొకఁ డుండును, గాఁ ప్రరముఁ గలిశిసెట్టిగణదాసుఁ డనన్, దీపురము గాఁగ నయ్యాల,కాపురమున ధనదుఁ డుండుఁ గలిఁ గడు వేడ్కన్." హంస. ౫, ఆ. ౯౩.

దీప్తము. సం. వి. అ. న. 1. ఇంగువ; 2. బంగారు. పుం. 1. సింహము; 2. నిమ్మ. విశే. (అ.ఆ.అ.) 1. ప్రకాశించినది; 2. కాలినది; 3. మండినది; 4. చెలరేఁగినది.

దీప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రకాశము, వెలుఁగు; 2. బయలుపడుట, అభివ్యక్తి; 3. లక్క; 4. కంచు; 5. (దేహాదుల) కాంతి.

దీప్యము. సం. వి. అ. న. 1. ఓమము; 2. జీలకఱ్ఱ; 3. రుద్రజటి. విశే. (అ. ఆ. అ.) 1. దీపమున కనుకూలమైనది; 2. జఠరాగ్నిదీపనమున కనుకూలించునది.

దీప్రము. సం. వి. అ. పుం. అగ్ని. విశే. (అ. ఆ.అ.) 1. ప్రకాశించునది; 2. మండునది.

దీమము. వై. వి. (సం. దీపకః.) 1. పక్షిమృగాదులను వశపఱచుకొనుటకై వేటకాఁ డుంచుపక్షిమృగాదికము. "క. బలవద్రిపులు ప్రయోజనములకై లోఁబడుట గల్గుఁ బోలముల సేఁతం,గులదీమంబులఁ జిక్కఁ దగిలి కొట్టన పట్టువడిన క్రియఁ జతురమతీ." భార. శాం. ౩, ఆ. ౨౭౯, భా. రా. బాల. ౮౩; 2. దోసలో నెరగా నుంచు పదార్థము. "గీ. మగల కొలయించుమరునిదీమంబు లనఁగ." శుక. ౧, ఆ. ౭౧, విక్ర. ౧, ఆ. ౭౯; 3. ఎర యుంచినబోను. "సీ. ఒకమరి దీమంబు లొడ్డి పాదులు దీర్చి బహువిహంగంబులఁ బట్టి తెచ్చి." కాశీ. ౩, ఆ. ౪౭, ద్వా. ౮, ఆ. ౨౨; 4. (సం. ధామ.) గృహము. "సీ. ధామిల్లు గృహసంజ్ఞ దీమ దీమం బిల్లు గే మనంగ." ఆం. భా. ద్వి. ౧౩.

దీమసము. దే. వి. 1. ధైర్యము. "గీ. ఎట్టిలో నెట్టి దీమస మెట్టికెరవ...." హరి ఉ. 3, ఆ. ౯౪. ద్వి. హరిశ్చ. ఉ. ౧౮౪, పం.; 2. ఉపాయము. "ఉ...అందుఁ బో,నొల్ల ననంగరా దచటి కూరక పోవను రాదు నేన్ను నం,ధిల్లఁగ దీనిఁ బాపికొను దీమస మెట్టిదియొక్కొ దైవమా." భార. విరా. ౨, ఆ. ౯౧, పాండు. 3, ఆ. ౧౩౮.

దీము. వై. వి. (సం. దీపకః.) 1. పశుపక్ష్యాదులను వశపఱచుకొనుటకై వేఁటకాఁ డేర్పఱచుపశు పక్ష్యాదికము. "మ. తరుణిం బ్లల్లియొఱఁ గుచంబు లనుపం దచ్చైభక్ష్యము ల్దీములై, పెరరేఁప జను దెంచెఁ గాక రవిగీస్త్రిం గ్రుంకి పాతాళగ,హ్వర ముం దూఱినవాని నీయదుకుద్రాళ్లా తెచ్చు సా దీర్ఘత,చ్ఛిరశ్మిష్టిం గనుసట్టికైత్య మలరించెన్ నూతులం దత్తఱన్." ఆము ౨, ఆ. ౬౬. స్వా ౪, ఆ. ౨౭; 2. బోనుంగో ఎరగా నుంచుపదార్థము. "గీ. ..ఎట్టివారికైన,నొరుల నొకవ్రేలి మీఁడి దిరుల్ మరులుగొలిపి, దివియచే దేవి నీ యట్టిదీము గలుగ." కు. సం. ౬, ఆ. ౧౭. నైష. 3, ఆ. ౯౨; 3. మత్స్యగ్రహణసాధన విశేషము. "గీ...చల్లు దూఁడు,లుంటగాలంబు తెర దీము లునురుగాల,ము..." హంస. ౪, ఆ. ౧౮౪. (సం. ధామ.) 1. గృహము. ఆం. భా. ద్వి. ౧౩; 2. స్థానము, నెలవు "ఉ. తామరతు దుపట్టుకొని ధాత యధోముఖుఁడై చరాజనన్, పోమరిపాటు ఖిలియుంను జూచెనె కాని సరోజ మూల మీ,ముస నున్న దాచుఁ గను తేఁకువ బాలక నాళ మూూతగాఁదొ మొదలింటియట్ట నిజధామసరోజముః జేరెఁ జింతతోన్." శ్రీరం. మా. 3, ఆ. ౧౩౦.

దీముకొను. దే. అ. క్రి. (దీము+కొను.) నెలవుకొను (చూ. దీముకొల్పు.)

దీముకొల్పు. దే. స. క్రి. (దీముకొను ధా. ప్రే.) నెల కొల్పు. "సీ. కాత్రవోత్కరజయోత్సాహసాహస మున ధీమార్జునులపోల్కి దీముకొల్పి." రంగా. ౧, ఆ. ౩౧.

దీర్ఘ. సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న, పృశ్నిపర్ణి చె.

దీర్ఘగతి. సం. వి. ఇ పుం. లొట్టియ,ఉష్ట్రము.

దీర్ఘగ్రీవము. సం. వి. అ. పుం. 1. లొట్టియ,ఉష్ట్రము; 2. ఒకజాతికొంగ.

దీర్ఘచ్ఛదము. సం. వి. అ. పుం. చెఱకుచె.

దీర్ఘజంఘము. సం. వి. అ. పుం. 1. లొట్టియ,ఉష్ట్రము. 2. కొంగ,బకము.

దీర్ఘజిహ్వము. సం. వి. అ. పుం. పాము,సర్పము.

దీర్ఘదర్శి. సం. వి. న్. పుం. 1. పండితుఁడు; 2. గ్రద; 3. ఎలుఁగుబంటి. విశ. (న్. నీ. న్.) 1. దూరాలోచన గలవాఁడు; 2. రాఁగలకార్యముల నెఱింగినవాఁడు; 3. దూరమం దున్నదానిని చూచునది.

దీర్ఘదేహి. సం. వి. ఈ. స్త్రీ. పందికొక్కు, మూషిక.

దీర్ఘనాదము. సం. వి. అ. పుం. 1. కుక్క; 2. కోడి; 3. శంఖము; 4. ఘంట. విశ. (అ. ఆ. అ.) 1. దూరముగా వ్యాపించుధ్వని కలది; 2. చాలకాల ముండుధ్వని కలది.

దీర్ఘనిద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. చాలకాలము పోవు నిద్ర, 2 చావు, పెద్దనిద్దుర.

దీర్ఘపత్రము. సం. వి. అ. పుం. 1. పెద్దనీరుల్లి చె; 2. ఒకరకముదర్భ చె; 3. తాడిచెట్టు; 4. తెల్లగలిజేరు చె; 5. నల్లతుమికి చె; 6. ఇక్షుభేదము చె.

దీర్ఘపర్వము. సం. వి. న్. పుం. చెఱకు చె.

దీర్ఘపాదపము. సం. వి. అ. పుం. 1. పోఁక చె; 2. తాటిచెట్టు; 3. కొబ్బెర చె.

దీర్ఘపాదము. సం. వి. అ. పుం. రాబులుఁగు.

దీర్ఘపృష్ఠము. సం. వి. అ. పుం. సర్పము,పాము. విశ. (అ. ఆ. అ.) నిడు పైనవీఁపు గలది.

దీర్ఘము. సం. వి. అ. పుం. 1. ఒంటె ,ఉష్ట్రము; 2. ఒకరకము తెల్లు చె. విశ. (అ. ఆ. అ.) 1. దూరమైనది. (ఉదా॥ దీర్ఘదర్శి. మొ.,; 2. నిడుదయైనది, 3. ఎత్తైనది, రెండుమాత్రలకాల ముచ్చరింపఁదగినయచ్చు.(అ. ఈ మొ.వ్యతి.హ్రస్వము.)

దీర్ఘమూల. సం. వి ఆ. స్త్రీ. 1. తీఁగతుమడి చె; 2. తెటకసిందచె; 3. ప్రేంకణము చె.

దీర్ఘమూలము. సం. వి. అ. పుం. 1. ఒకజాతి మారేడు చె; 2. చాగ చె; 3. వట్టివేరు చె.

దీర్ఘవక్త్రము. సం. వి. అ. పుం. ఏనుఁగు. విశ. (అ ఆ. అ.) నిడుద యైనముఖము కలది. [పొంగురు చె.

దీర్ఘవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. లక్క; 2. పెద్ద

దీర్ఘవృంతము. సం. వి. అ. పుం. దుండిగము చె.

దీర్ఘసూత్రుఁడు. సం వి. అ. పుం. తలఁచినపని చిరకాలమునకుఁ గాని చేయనివాఁడు,చిరక్రియుఁడు.

దీర్ఘిక. సం. వి. ఆ. స్త్రీ. నడబావి, దిగ్గియ.

దీర్ణము. సం. వి. అ. న. 1. భయము; 2. చీలిక, విదారము. విణ. (అ. ఆ. అ.) 1. భయపడినది; 2. చీల్పఁబడినది. [(చూ. దీలపోవు.)

దీల. దే. వి. (దీలు. ధా.) బలహీనమగుట, డిల్లపడుట.

దీలపోవు. దే. అ. క్రి. (దీల+పోవు.) డిల్లపడు,బలహీనమగు. "మ. తత్కోకిల ..వాతభూతదవానల, జ్వాలకున్ వనరాశివేల కసంఖ్యాయాదవసేనకున్, గీలపోవక చక్కనయ్యెదుధీరు లెవ్వరు పోరి లోన్." భార. ఆది. ౮, అ. ౨౦౫.

దీలు. దే. అ. క్రి. 1. డిల్లపడు,బలహీనమగు. "సీ. అలిమ మిక్కిలి దీలె నాలుసింకఁగ నేల చల్లఁగాఁ బన్నీరు చల్లరమ్మ." య ౫, అ. ౧౧౫. (శ. ర. పా. 'తూలె.' ముద్రి.) 2. ఊడిపడు,ఊడు. "మ. .. కంపితదరీ సైన్యము వ్రాలె బాహువులు త్రస్నాంగములై రాలె నం,గదములే దెలెఁ గిరీటములే..." కువల. ౭, అ. ౧౪౬. విణ. బలహీనము. (శ. ర.)

దీలుపడు. ద్వ. అ. క్రి. (దీలు+పడు.) బలహీనమగు; కృశించు. "ఉ...అనికి స్థలమూదయఁ డెత్తివచ్చినన్,దీలుపడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్." పారి. ౧, అ. ౧౩౫. భీమ. ౪, అ. ౧౦౮.

దీలుపాటు. ద్వ. వి. (దీలుపడు ధా.) బలహీనత. "గీ...పండ్లుగుల్చుచు దీలుపాటుఁ,బ్రకటదైన్యంబుఁ దోఁచ లోభంబు వచ్చె." నైష. ౭, అ. ౫౨.

దీవటి. వై. వి. (సం. దీపయష్టిః.) కరదీపిక. "సీ. ..పవమానసూనుండు పగలు దివటీఁ బూని స్వప్రతాపంబు సాక్షాత్కరింప." దశా. ౭, అ.౨, అ.౧౭౩

దీవటీ=దివటి. "సీ. దివటీ దివ్వటి దివటి పం జనఁగను గరదీపికాఖ్యలై పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దీవన. దే వి. ఆశీర్వాదము. "క. అనుజులుఁ దానును మునికా,ననమున నవ్వేది యొక్క నమధికవీర్యం, బున నొప్పి బ్రాహ్మణులదీవన లెసఁగఁగ ధర్మసుతుఁడు వాసవలీలన్." భార. అర. ౩, అ. ౧౨౩. దశ. ౧౨, అ. ౯౧.

దీవనఁబ్రాలు. దే. వి. బ. (దీవన+ప్రాలు.) శుభాక్షతలు. "గీ. జగము గెల్వంగ దండెత్తుమగనిమీఁద, లీల రతిచల్లు దీవనఁబ్రాలనంగ." పారి.౨,అ,౩౬.



దీవనము. దే. వి. 1.ఉద్దేశము,అభిప్రాయము. "క. కోత్తలకు వెనుకరై వెనుఁ, బోవుచునున్నాఁడు గడుఁ బోవకయుండం, బోవలయు నడ్డపడికొను, దీవన మెదఁ గలిగెనేని దేవర కడఁకన్." భార. విరా. ౩, అ ౧౩౭; 2. ఉపాయము. "క...తదయుక యింకన్, గావింపు కొఁజకకార్యము, దీవనము నాతలంపు దీర్పెద నేఁడున్." దశ. ౬, అ. ౧౨౭.

దీవి. వై. వి. (సం. ద్వీపః) 1. నీటినడిమిదిబ్బ,ద్వీపము. "ఉ. ఓమనికాలలాను లవణోదధిచక్రపరీత మైన యూ,దీవికి రాజజంబువు ప్రదీపితలాంఛనము..." నైష. ౫, అ. ౭౯, ఉ. రా ౫, అ. ౨౦౫; 2. లంక,రావణునగరము. "ఆ. అనుచు దానిచంద మంతయుం బరికించి,యుక్కరుండు పనుల సోఁకు లేఁదు,మరల దీవి కరిగి మంటిపాటి కోటలుఁగట్టి చేసి మూఁకఁ గాపువెట్టె." అచ్చ. యు. ౪౩౭.

దీవించు. దే. అ. క్రి. (శుభమును) కోరు. "క. అనవుడు జయలక్ష్మిం జే,కొను మని దీవించి యింతయుం గేకయసం, దన నన్నుఁ దడవుఁ పదయం, బున నొయ్యెద నని లతాంగి పనిచెం బ్రీతిన్." భార. విరా. ౨, అ. ౨౯౦. స. క్రి. ఆశీర్వదించు. "వ. అయ్యుద్యానమునందు...అతిత్వరితగతిం జని పాండ్య మహారాజుం గాంచి దీవించి గృహీతసత్కారుండై యిట్లనియె." భార ఆది. ౧, అ ౯౪. రామా. ౬, అ. ౧౨౧.

దీవిపుట్టువు. ద్వ. వి. (దీవి+పుట్టువు.) ద్వైపాయనుఁడు, వ్యాసుఁడు. "వ...కవ్యడియినుమను మునికి దీవిపుట్టువుకడఁ జదువరి యిట్లనియె." అచ్చ. భా. ౩, అ. ౩౬. పు.

దీవియ. వై. వి. (సం. దీపికా.) దీపము; కరదీపిక. "క. బలురక్కసు లెత్తినకత్తులతో దీవియలు బలియ దుందుభు లలియన్,వెలిఁ బ్రహారి దిరుగు చుల్లరఁ,జాలకఁగఁ గిరిరించి నగరు చొచ్చి కడంకన్." రామా. ౬, అ. ౧౧౨. భార. భీష్మ. ౨, అ. ౩౪౨.

దీవియకంబము. వై. వి. (దీవియ+కంబము.) దీపస్తంభము. "క. దీవియకంబంబునకును,జీవము గల్పించి కథలు చెప్పించుంగా...." విక్ర. ౬, అ. ౧౪౧.

దీవిరాయఁడు. వై. వి. (దీవి+రాయఁడు.) రావణుఁడు. "గీ ..అంత నత్తెఱఁ గంతయుఁ దాల

శించి, దీనిరాయఁడు తద్దయుఁ దిగులు పొందె." అచ్చ. యు. ౪౩౩, ఇట్లే: దీవితేఁడు మొ.

దీవె. వై. వి. (సం. దీపః.) దీపము. "ఉ. ఆజనిదీవె యక్షయమహానిధిఁ జాపునవాంజనంబు నా, రూఢికి వచ్చి తోడుపడ నోపినబంధుఁడు...." కళా. ౨, ఆ ౩౬, ఆం. భా. ద్వి. ౧౬౪.

దీవెన. దే. వి. (దీవించు. ధా.) ఆశీర్వాదము. "చ.. అతిహర్షమునం గొని తృప్తి నొంది దీవెన లొనరించి రవ్విభుని పేరఁ బవిధంబుల సన్నుతించుచున్." కళా. ౫, ఆ. ౧౫౬, శైవ. ౩, ఆ. ౧౦౭.

దీవెనకోలు. దే. వి. నమస్కారము. "రగడ. వృష పురస్థలిని విడియు వృషాశ్రయదేవుని కిదుగో దీవెనకోలన." వాంస. ౪, ఆ. ౨౧౩.

దీవెనుడి. ద్వ. వి. (దీవె+నుడి.) దీవ మించుసాధన విశేషము. "సీ. విను కేమ ప్రాలుమాలిన దీవెనుడి గాక కొసిన రెండుగుగ్గిళ్లగాక." విప్ర. ౫, ఆ. ౧౯.

దీవ్యత్. సం. శత్రు. ప్రకాశించుచున్న. "మ. బలవిధ్వంసివరంబునం గొనినదివ్యన్నారుశాస్త్రంబుచే ..." హర. ౬, ఆ. ౧౪౯, ౧౩౮

దు

దు. దే. అవ్య. 1. యుష్మదస్మదాత్మార్థకములకు షష్ఠీ సమాసమునం దుత్తరపదము పరమగునపుడు వికల్పముగా నగుఆగమము. "క. నీమకులమునకుఁ దగఁగఁ బ్రతోదముఁ గొని రక్షముఁ గడపఁ దొడఁగుము ..." భార. ఆది. ౬, ఆ. ౫౪, భార. శాం. ౩, ఆ. ౪౯౬; 2. వ్యతిరేకార్థమున అమహత్కర్తృకము లగు ధాతువులకు వచ్చు ప్రథమపురుషైకవచన ప్రత్యయము. "క. అతివచఃకార్పణ్యం, బాలేమకు చెవ్వల సోఁకదు .." ఆము. ౧, ఆ ౬౩; 3. తద్ధర్మాద్యర్థమున "వు" "రు" మొదలగు ప్రత్యయములు పరమగునపుడు ధాతువుమీఁద వచ్చెడియాగమము." ఉదా:-వండుదువు, వండుదురు మొ.

దుఃఖపడు. వి. అ. క్రి. (దుఃఖము+పడు) నొగులు, బాధనొందు. "సీ. శుకశారికలుఁజూడి శోకస్వరంబులఁ బలవింపఁ దొడఁగెఁ దాపంబు గదిరి. గీ. మానసములు దుఃఖపడె మధుమాధవములు." హర. ౩, ఆ. ౮౯, దశా. ౪, ఆ ౧౦.

దుఃఖపఱుచు. వి. స. క్రి. (దుఃఖపడు ధా. ప్రే.) దుఃఖపెట్టు, విచారమునొందఁజేయు. "గీ. బాపురే విధి నను దుఃఖపఱుపఁ దగునె, యనుచు దూఱుచుఁ దనుఁ దిట్టికొనుచు పగల, డెంద ముందంద యెరియ సాక్రందనంబు, సేయుచును వచ్చి యామిత్రశేఖరుండు." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౨౮౧.

దుఃఖపాటు. వి. వి. (దుఃఖపడు ధా.) దుఃఖపడుట. "ఉ .. ఏసటులు బుద్ధులు సెప్పినభంగియుం గులాచారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ, కౌరవజాతికిం దలిసెఁ గాద గదాధర నీదుసన్నిధిన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩; ౨౫౭. భా. రా. కిష్కిం. ౩౦౩.

దుఃఖపెట్టు. వి. స. క్రి. (దుఃఖము+పెట్టు.) దుఃఖ పఱుచు. (శ. ర.)

దుఃఖము. సం. వి. అ. న. వ్యథ బాధ. విశే. (అ.ఆ.అ.) దుఃఖకరము, బాధకము.

దుఃఖాంతము. సం. వి. అ పుం. 1. ముక్తి; 2. కష్టముల ముగియుట. విశే. (అ. ఆ. అ.) దుఃఖ మంత మందుఁ గలది, దుఃఖముతో ముగియునది.

దుఃఖాయమానము. సం. విశే. (అ. ఆ. అ) దుఃఖించుచున్నది. "వ .. ద్రౌపదిం జూదనోపక లజ్జితులయి దుఃఖాయమానమానసు లయి తలలు వాంచి యున్న పాండవుల వైక్లబ్యం బుపలక్షించి సంతసిల్లి దుర్యోధనుండు .." భార. సభా. ౨, ఆ. ౨౧౨. భార. అర. ౨, ఆ. ౪౬.

దుఃఖి. సం. విశే. (పు. స్త్రీ. న.) దుఃఖము గలవాఁడు.

దుఃఖించు. సం. అ. క్రి. దుఃఖపడు, నొగులు. "శా. దుఃఖింపం బనిలేదు పొమ్ము బలసందోహమ్ములం దెమ్ము చేతఃఖేద మ్మెడలంగ రమ్ము..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౭౬. మార్క. ౧, ఆ. ౨౬౦.

దుఃఖితము. సం. వి. అ. న. దుఃఖము, వ్యథ. విశే. (అ. ఆ అ.) దుఃఖము నొందినది.

దుంక = దుంకము. (గ్రా.)

దుంకము. దే. వి. రంధ్రము "గీ. బడిలి యన దుంకమన రంధ్ర మడరు..." ఆం. భా. ప్ర. ౧౪౫.

దుంగ. దే. వి. మ్రానిమొద్దు, స్థూలదారుఖండము. "సీ ...దుంగయనంగను స్థూలదారు, ఖండంబు పేరగు..." ఆం. భా. ద్వి. ౩౮.

దుండగము. వై. వి. (సం. దుండుకః.) 1. దౌష్ట్యము, దుర్మార్గత. 'సీ. దుండగంబునఁ బాలగుండాడ వికలితవృత్తిఁ గల్పకవాటి పీటఁబోరు." వరాహ. ౧౦, ఆ. ౫౧. ప్రభా. ౧, ఆ. ౧౦౫; 2. దుష్ట

కార్యము, చెడుపని. "సీ...ఇటువంటిదుండగములు,మాని కాలప్రాప్తు లైనవారల నిర్నిమిత్తంబు మిక్కిలి మీఱు కొగ్గు,చేయువారలఁ గాంచి వధింపఁ దస్యులతోఁ బోవకుడు..." వరాహ. ౭, ఆ. ౭౫; 3. కీడు, ఆపద. "ఆ. ద్రుపదుపీటిలోన ద్రౌపదికయ్యము రేఁచె, ఋషులఁ బట్టి విరటుపట్టణమున, మఱియుఁ జెన్నులేవు మార్తాండతనయుఁడు, దొడరి మనకుఁ జేయుఁదుండగములు." జై. ౧, ఆ ౯౨. శ్రీరం. మా. ౪, ఆ. ౧౦౫; 4. ధూర్తకృత్యము, కొంటెతనము. "ఆ. పెద్దతోలితోడ బిగువుదామెనతోడఁ, బడినవద్ధిచెట్లనడుమ మద్దులైనతొక్కఁ బలుకులాడుచు నిలుచున్న, కపటబాలుదుండగములు చూచి." ౫. పు ౬, ఆ. ౧౪౦; 5. తప్పు, అపరాధము. "గీ ..తప్పిదంబాగడంబు, దుడుకు నేరము నేరమి దుండగంబు, తప్పునఁగ నపరాధము తనరు నభవ." ఆం. భా. ద్వి. ౧౯౧. నిరం. ౪, ఆ. ౧౫.

దుండగాయ = దుండగీఁడు. (బ్రా. వా.)

దుండగాడుతనము. వై. వి. (దుండగాయ+తనము.) దౌష్ట్యము. (బ్రా. వా.)

దుండగించు. ద్వ. అ. క్రి. దుండగముచేయు, అల్లరిచేయు. "ద్వి. మెండిలు మెండిలు దుండగింపంగ." పండితా. పర్వ ౩౯౬, పు. ..'దుండరింపంగ'-ముద్రి. పా.) [(శ. ర.)

దుండగీఁడు వై. విణ.(దుండగము+ఈఁడు )దుష్టుఁడు. "శా. తల్లిం జంపిన దుండగీనికి దయాదాక్షిణ్యములున్నే." చం. రా. ౩, ఆ. ౧౪౨ ఉ. రా. ౭, ఆ. ౩౯౨.

దుండతికము. వై. వి (సం. దుండుకః.) దుండగము.

దుండి. దే. వి. 1. దొరసాని. (శ. ర.); 2. ప్రేయసి. "గీ. ఖంత యిటు లల్లియుండ రా జంత నచట, నరసిచెంత విసాగ్రంబు నరసి కొంత, మగని కందించుకొనిప్రేమ గని తనదు, దుండియొదఁ దగులెంచి యందుండి యపుడు."సా. ౨,ఆ. ౧౫౨; 3. స్త్రీ."సీ. వనధిఁ గ్రోలినమానికినుక చేఁ దసియుండుఁ దానును బొలదిండి యైనదుండి." చం. రా. ౨, ఆ.౭౫. విణ. పెద్దపొట్టగలది, తుందిలము. (బ్రా.)

దుండికము. వై. వి. (సం. దుండుకః.) పెనుమ్రాను, దుండుకముష్. "సీ...దుండిల మనఁగను దుండిక మనఁ దగు దుండుకంబు." ఆం. భా. ద్వి. ౪౯.

దుండిలము. వై. వి. (సం. దుండుకః.) దుండికముష్. ఆం. భా. ద్వి. ౪౯.

దుండు = దుంగ. (వా.) వాఁడుదుండులాగున్నాఁడు.

దుండుకుఁడు. సం. విణ (అ. ఆ. అ.)దుష్టచిత్తుఁడు.

దుండుగ. దే. వి. పెనుమ్రాను, దుండుకముష్. "గీ... పొలఁబు,దుండుగల మళ్లయారులఁ దూలి రాదు, చిక్కనేతాల పాడఱుపఁ జెనుచు." అము. ౬, ఆ. ౧౩. హంస. ౪, ఆ. ౧౦.

దుండుబలి. దే. విణ. సోమరి. "సీ...చండి సోమరి వలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవానిపే రై..."ఆం. భా. తృ. ౬.

దుంత. దే. వి. దున్న, మహిషము. "సీ దుగ్గమ్ము కాఱ పోతుల లోమనేయుఁమీ తోలిముద్దగా విత్తు దుంత యొకటి." యు. ౨, ఆ. ౩ ఆం. భా. ..వ ౨౬౪.

దుంతరాతు. ద్వ. వి. (దుంత+రాతు.) మహిషవాహనుఁడు, యముఁడు. "గీ. తూర్పుదొర వేఁడి వెలుపు దుంతరాతు, కేయునదకరి సంద్రంపుఱేఁడు గాడ్పు." భోజరా. ౧, ఆ. ౨౫ (ఇట్లే: దుంతబావిీవచేరుఁడు. మొ.)

దుంతపయూతికాఁడు = దుంతరాతు. (బ్రా.)

దుండిలము. వై. వి. (సం. దుండుకః.) పెనుమ్రానుష్. "క . ధరణీరమణుం, దత్తలము వైవఁ గని యది, తుత్తుమురుగఁ బొడిచె రేఁతదుండిలముక్రియన్." ద్వా. ౮, ఆ. ౩౭.

దుండుడుకు దే. వి. (దుడుకు+దుడుకు ) 1. గర్వము, ఉద్ధతి. "ఉ. దుండుడు కాఱ శాత్రవుల దోర్బల సంపదఁ జక్కుచేసి ధాత్రిం దనబాహుపీఠమునఁ దిన్ననఁగ నిల్పి .."నిరం. ౪, ఆ. ౮౦; 2. మిక్కిలి. తొందఱ. "క. పడఁతుక నతఁ డీగలి లోఁ,బడఁ జేసుక మురిపె ముట్టిపడఁ గడుఁ దమి దుం,డుడు కొనరింపఁగఁ గోరిక,లదరఁగ రతిసేన రతుల కాయత్తంబై." హంస. ౫, ఆ. ౧౩౮, 3. మిక్కిలి తడఁబాటు. "క. వినుఁ గడచినఁ దలిదంద్రులం, విని నాదుండుడుకుఁ దుడిచి విదుకు గలకే,యుని యే నేరికిఁ జెప్పక, చనుదెంచితి ననఁగ వచ్చె శబరబలమ్మున్." కళ. ౪, ఆ. ౫౮; 4. ఇక్కట్టు, కష్టము. "సీ . విశ్వసింపక మానుసో నాకుఁ గడవంగరానిదుండుడుకు పుట్టె."వరాహ. ౬,ఆ. ౩.

దుందుభి. సం. వి. ఇ. స్త్రీ. పాచికయందలి బిందుత్రికద్వయము, ఇత్తిగ. పుం 1. భేరి; 2. విష

భేదము; 3. ఒకానొకరాక్షసుఁడు; 4. వరుణుఁడు; 5. ఒకానొక సంవత్సరము.

దుందుమము. దే. వి. చక్రాకారపుదివిటీ. (శ. ర.) "సీ. ఎన్ని గాఢాంధకారభయాధములకు దుందుములై మహోద్ధురత నిగుడు." సాంబో. ౨, ఆ. ౧౯. కళా. ౮, ఆ. ౧౦.

దుందురు. దే. వి. దివ్వియకోల, కాష్ఠదీపిక. "సీ. జంజము దుందురు నురుడు దివ్వియకోల యనఁ గాష్ఠదీపికాహ్వయము వెలుఁగు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దుందుఱు. దే. వి. జంజాటకట్ట. (శ. ర.)

దుంప. దే. వి. 1. మూలము, కందము. "దండకము .. కోరాకులంక్ దుంపలంక్ మెక్కి." నీలా. ౨, ఆ. ౪౧. హరి. ఉ. ౧౦. ఆ 3౦౦; 2. గెనుసుగడ్డ. (వా); 4. వేరు,మూలము. "సీ. వేరన దుంప నన వెలయు మూలము .." ఆం. భా. ద్వి. 3౭; 4. నాఁగేటిగొడగ, కూటకము. (శ. ర.)

దుంపకూర. దే వి. (దుంప+కూర.) కూరవండుకొనుటకుఁ బనికివచ్చుదుంప. (బ్రా. వా.)

దుంపనాగులు. ద్వ. వి. బ. (దుంప+నాగులు.) సర్పవిశేషము. "సీ. కూఁకవేటులు చిల్లుగులియలు త్రాఁచులు పెరజాలు గుజ్జపుఁబెరజా లచటఁ. గీ. గలవు తక్కినకట్లపోతులును దుంప, నాగులును." ద్వా. ౮, ఆ. ౧౦౦.

దుంపనాశనము. మి. గ్రా. వి. (దుంప+నాశనము.) సమూలనాశనము, సర్వనాశనము. వా—నిన్ను దుంపనాశనము చేస్తాను. (బ్రా. వా.)

దుంపబచ్చలి. దే. వి. (దుంప+బచ్చలి.) ఉపోదకి, మట్టుబచ్చలికీ. "సీ...దుంప. గీ. బచ్చలి యన నుపోదకి పరఁగుచుండు. ఆం. భా. ద్వి. ౭౨.

దుంపరాష్ట్రము. ద్వ. వి. (దుంప+రాష్ట్రము.) రాస్నావిశేషము; ఒకానొక మందుదినుసు. (శ. ర. బ్రా.)

దుంపరాష్ట్రకము = దుంపరాష్ట్రము. (బ్రా.)

దుంబోడి. దే వి. (దుమ్ము+బోడి.) మెంతి జీలకఱ్ఱ చేర్చి చేసిన మెత్తనికూరపిండి. (శ. ర.) "క. క్రొం బొగవుఁగూరవగ తిరుగంబోఁకల మెంతి జీలకఱ్ఱల వలపుం, దుంబోళ్లకావి..." రా. వి. ౨,ఆ. ౧౦౧.

దుకాణము. దే. వి. అంగడి. "చ. తొలకరిమించుఁ దీవగతి దోఁప దుకాణముమీఁద నున్నయు, య్యాలిపలపేటితోఁ దమలపాకులబేరము లాడఁబోయి ..." శ్రీనాథునిచాటువు.

దుకూలము. సం. వి. అ. న. 1. సన్ననివస్త్రము; 2. తెల్లనివస్త్రము; 3. పట్టుబట్ట, క్షౌమము.

దుక్క = దుంగ. (వా.)

దుక్కి. దే. వి. 1. దున్నుట, కృషి. "సీ. కందకంబులు ద్రవ్వ గట్టిగా క్లిగ్గించి దుక్కులు దున్నించు చోఁట లవును." రామలిం. శ. ౯౪. హంస. ౫, ఆ. 3౫; 2. నాఁగేటిచాలు. "గీ. దుక్కిలో నుండి మసటాచలితక్క లేవి, యక్కఱకుఁ బట్టి నట్టియాయువుఁగుఁబట్టెఁ, బెండ్లియాడఁగ సీత యంచు పిన్న యితఁడు, చూడఁగదరమ్మ కన్నులవాడు దీఱ." లవు. ౪, ఆ. ౮౨. వి. పు. ౪, ఆ. ౧౮3; 3. దుక్కి మునుఁగుటకుఁ దగినవర్షము. (వ్యవ) రెండుదుక్కులవర్షము కురిసినది.

దుక్కికైదువు. దే. వి. (దుక్కి+కైదువు.) నాఁగలి, హలము. "సీ. ఇలగదా దుక్కికైదువుసంకురవతమ్మి కంటివాల్గెరలు బొక్కసము లయ్యె" ముకుంద. ౧, ఆ 3౪. పు. (ఇట్టే దుక్కివాలు.

దుక్కిచాలు దే. వి. (దుక్కి+చాలు.) నాఁగటిచే దున్నఁగా నేర్పడినరేఖ. "సీ. రెండవదుంత లేకుండెఁ గా కినమూతి రొంపిలో దుక్కిచా ల్నింపినాఁడె." రా. వి. ౧, ఆ. ౫౧.

దుక్కిటెద్దు. దే. వి. (దుక్కి+ఎద్దు.) దున్నుట కుపయోగించువృషభము. "సీ ..కోరినయన్ని దుక్కిటెద్దుల బల్మితోఁడ నిచ్చు." నీలా. ౧, ఆ. ౪౯. వెం. పంచ.౧, ఆ. ౫౭౭. [చేను. (బ్రా. వా.)

దుక్కిపొలము. దే. వి. (దుక్కి+పొలము.) దున్నిన

దుక్కిపోతు. దే. వి. (దుక్కి+పోతు.) పొలము దున్ను దున్నపోతు. (బ్రా. వా.)

దుక్కిమచ్చు. దే వి. (దుక్కి+మచ్చు.) కర్షకుఁడు, హాలికుఁడు. "సీ...దుక్కిము చ్చనఁగను దోఁచుచుండు. గీ. హాలికాభిధ..." ఆం. భా. ద్వి. ౨౦౯. ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౫.

దుక్కివాలుదాలుపు. దే. వి. హలాయుధుఁడు, బలరాముఁడు. ఆం. సం. దేవ. ౭౯.

దుక్కెద్దు = దుక్కిటెద్దు. "సీ... దుక్కెద్దు దేశాంతర మరిగినట్లగును..." భో. ౨, ఆ. ౧౬.

దుగ. వై. వ. (సం. ద్వికమ్. క. దుగ.) రెండు. "మ... ఇ, త్రిగ బారా దుగ యంచుఁ జిల్కరొక

ఉండ్డీకింపఁ మాదవృష్ణులన్." కళా. ౩, ఆ. ౧౩౧.
ఆం. భా. ద్వి. ౩౦౫.

దుగపోయుదుండగేఁడు.ద్వ.వి. అన్ని. వేంక. దేవ. ౧౬.

దుగలము. దే. వి. రెండుబేడలు, వరహాలోఁ బదాఱవ పాలు. (శ. ర. బ్రా.) "సీ. దీనారమందు ద్వాత్రింశదంశం బైన బేడ యంచనఁగను వెలయుచుండు. గీ. దుగల మంచనఁగఁ దద్ద్విగుణంబు విలసిల్లు..."ఆం. భా. ద్వి. ౨౭౩.

దుగా. వై. స. (సం. ద్వికమ్.) రెండు "ఉ ..వినోద లీల బా,రా వది దచ్చి యిత్తిగ దుగా యని పన్నిద మగ్గడించుచున్." విరం. ౨, ఆ. ౨౨.

దుగానా. హిం. వి. రెండుదండప్రణామములు.? "ఆ. చవుకమ్ములకావి గొనక రోజా లుండి కేఁటివులక మల్లెతెల్లవిరుల, చందు చూచి విరహ జనుకాంతమై దుగా,నా యొనర్చె నుత్తరాయణమున." సాంబో. ౨, ఆ. ౧౦౩.

దుగిణుఁడు. వై. వి. (సం. ద్రుహిణః.) బ్రహ్మ. "ఆ. బమ్మ తాత నలువ తమ్మిమాలి దుగిణుఁ, డనఁగ బ్రహ్మపేరు లబ్బ మాఱి."ఆం. భా. ప్ర. ౩౯.

దుగుణము. వై. స. రెండు. "సీ దుగుణంబు చేసిన తోడతే మూఁ డని వారించి లే దని పలుము చేసి." ఉ. హరి. ౩, ఆ. ౧౨౨.

దుర్గ. వై. వి. (సం. దుర్గా.) శక్తి, పార్వతి. "ఆ. సత్తి సామితల్లి చండి యమ్మిక దుగ్గ,యనఁగ నీపెలంత యలరు నభవ."ఆం. భా. ప్ర. ౪౦, య. ౨,౫౩.

దుగ్గాని. వై. వి. (దుగ+కాని.) నిష్కవిశేషము. (రెండు దమ్మిడీలు. శ. ర.) "సీ....టంక మనఁగ నిష్కాఖ్యయంబు. గీ. తద్విశేషాభిధలు గాను దగును డబ్బు,లనఁగ దుగ్గాను లనఁగ దుడ్లనఁగ జగతి." ఆ. భా. ద్వి. ౨౭౯.

దుగ్గి. వై. వి. (సం. దుర్గా.) పార్వతి,శక్తి. "సీ. దుగ్గిదేవమ్మపఁ దొలుబోన మని కాని త్రుంతుము జముఁ డెక్కుడుంతసైన "సాంబో. ౨, ఆ. ౧౬౯.

దుగ్గు. దే. వి. చూర్ణశాకము,తొక్కు. "సీ. చూర్ణ శాఖాభిధ కొట్లిల్లు దుగ్గు నా...."ఆం భా. ద్వి. ౨౪౮. విణ. రూపము చెడినది కృశము. (శ. ర,

దుగ్ధ. దే. వి. (క. దుగ్ధ.)అసూయ;ద్వేషము.(బ్రా వా.)

దుగ్ధము. సం. వి. అ. న. 1. పాలు; 2. పాలుపిదుకుట, దోహనము. విణ. (అ. ఆ. అ.) 1. పిదుకఁబడినది; 2. నింపఁబడినది.

దుగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. చిఱుపాలకి.

దుఘము. సం. విణ. (అ. ఆ. అ.) (ఇది ఉపపదసమాసాంతముగనే యుండును) 1. పూరించునది; 2. ఇచ్చునది. ఉదా:-కామదుఘము. మొ.

దుట్టుపు. దే. వి అజశృంగిక. 'సీ. దుట్టుపు దుట్టువు జొట్టు పనంగను ద్వంద్వ వఠాఖ్యలై తనరుచుండు." ఆం. భా. ద్వి. ౬౧.

దుట్టువు=దుట్టుపు. ఆం. భా. ద్వి. ౬౧.

దుడదుడ. దే. వి. మంచె మొదలగువానిని వేగముగా యెక్కుటయం దగుధ్వని కనుకరణము. 'చ. దుడదుడ మంచె యెక్కి నొకదొడ్డమిటారపుఁగత్తె కూఁతురున్." వీధి. ౩౦.

దుడిదుడి. దే. వి ఏనుఁగులు మొదలగునవి త్వరితముగా నడచుటయం దగుధ్వని కనుకరణము. "ద్వి. అడవి యేనుఁగులు నీరాస నీనదికి దుడిదుడి వచ్చి కత్తో యంబు దొదరి..." రం. రా. అర. ౧౬౩. పు. ౨౦, పం. నిరం. ౪, ఆ. ౬౬.

దుడుకఁడు. దే. వి. పిల్లవాఁడు,బాలుఁడు. "సీ... బాలక నలువురివాఱు, పాప పాపఁడు దుడ్డె వడుచన దుడుకఁడు బుడుత నల్ల కొడుకు బొడిగలేఁత,చిన్న పిన్న చిఱుత యనఁ జెలఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౧౮, భాగ. ౭, స్కం. ౨౫౩.

దుడుకడుచే. దే. అ. క్రి. (దుడుకు+అడుచే.) మునుఁగు. "క. అడుగులపైఁ బడు లేచు,బడుఁ గ్రమ్మఱ లేచు నిట్లు భక్తిక్ మును కాఁ,బొడఁగనిన పెంపుఁ దలఁచుచు, దుడుకనిమహిమార్థి నడుఁడు దుడుకడిచె నృపా." భాగ. ౧౦, స్కం. పూ. ౫౪౬.

దుడుకు. దే. వి. 1. దుష్టత్వము. "ఉ. అందఱుఁ జూచి యింతదుడుకా యని దూఱఁగ..." వి.పు. ౭, ఆ. ౯, శుక. ౩, ఆ. ౨౯; 2. ఉద్ధతి. "ద్వి. మహేంద్రుత యొక్కడునవిఁ గావింతు,విఁ దగు దుడుకు గావింపఁగ రాను." ద్వి. శ. సా. ౨, భా. (శ. ర.) భాగ. ౧౦, స్కం. పూ. ౨౮౯; 3. తొందర, త్వర. "ఉ...పంతము దీఱ నోటుకై,కా యను పేర యిట్లు దుడుకా యనుఁ బాయఁగఁ గోరికా యతున్." అచ్చ. అయో. ౯౦; 4. పెద్దఱికము,దుశ్చర్య. "క. అవార్త లెల్ల నారదు,చే వీని విఁ దెంతదుడుకుచేసె నటంచున్." దశా. ౧, ఆ. ౨౪౯. భాగ. ౧౦, స్కం. పూ.

౧౨౧౭. ౯౫. దుష్టము. "క. ఈదుడుకుఁ గోలెఁ గొని చని,విరాదిట్టతనంబు లెల్ల మెఱయఁగ నిపుడా, గాదనక తోఁకఁ గాలిచి..." అచ్చ.సుం. ౧౬౪; 2. వేగము కలది,సత్వరము. "గీ...వడి చేయుం కటివేల్పు గొడుకుదుడుకు,టంప జడివాకసోనల యులజడికిని,మిగుల నావ నోడి యూఁకనమ్మించుఁ బోఁడి." నీలా. 3, ఆ. ౧౫.

దుడుకుచేయు. దే. అ. క్రి. (దుడుకు+చేయు.) తొందరపడు. "సీ. దుడుకుచేసినను బుద్ధులు చెల్లు నొకవేళ మక్కువ మద్దిచ్చు నొక్కవేళ." రాధా. ౨, ఆ. ౩౦, హంస. 3, ఆ ౭౪.

దుడుకునడక. దే. వి. (దుడుకు+నడక.) దుష్ప్రవర్తనము. "వ ...కదలిరాముద్దుకొడుకు మేనల్లుని దుడుకునడకల మిడుకులకు సొగులుపడి .." ఇందు ౪, ఆ. ౩౭.

దుడదుడ = దొడదొడ (బ్రా. వా.)

దుడ్డు. యు. దే. వి. 1. ఒకరకమురాగినాణెము. "సీ. టంక మనఁగ నిష్కవ్యాయంబు. గీ. తద్విశేషాభిధలుగాను దగును డబ్బు,లనఁగ దుగ్గాను లనఁగ దుడ్డనఁగ జగతి." ఆం. భా. ద్వి. ౨౩౭. శుక. 3, ఆ. ౧౧౫; 2. ధనము. (వ్యక.-)దుడ్డులేనిచో ఏపనియు జరుగదు. వై. వి. (సం. దడః) లావుకఱ్ఱ;కఱ్ఱ. "ద్వి దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁదిి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౩,పం."ద్వ... గొఱ్ఱెల కాచికాచి,యులరుచుఁ జేతి దుడ్డటు పాఱవైచి." కుండికా. మహిమ. ౪౦, పు; 2. గద, "గీ. గుదె యనఁగ దుడ్డనంగను గదకుఁ బేర్లు." ఆం. శే. ౧౭; 3. ముద్గరము,గుదుపము. "గీ. గుదె గుదియ దుడ్డు గుదుపము గుదుప యనఁగ,ముద్గరము..."ఆం. భా. ద్వి. ౨౧౬. విణ. 1. పోటు కాఁడు. "క. దుడ్డునకుఁ బోయునట్లొక,త్రిద్దు డుకుంబోయునుబుఁ దెచ్చి యతనిచే,నిద్ద నడిచి కడి కనలెడి,గ్రుద్దులు తెలియంగఁ దెఱచికొని కమఁగొనుచున్." భో. 3, ఆ ౭౨. (శ.ర పా.); 2. లావైనది,స్థూలము. (చూ. దుడ్డుఁగఱ్ఱ)

దుడ్డుఁగఱ్ఱ. ద్వ. వి. (దుడ్డు+కఱ్ఱ.) లావుకఱ్ఱ. (శ. ర. బ్రా.)

దుడ్డుగోల. ద్వ. వి. (దుడ్డు+కోల.) లావుకఱ్ఱ (శ. ర.)

దుడ్డుముంగ. దే. వి. వృకువిశేషము. హంస. ౪,ఆ౭.

దుడ్డె. యు. దే. వి. బాలకుఁడు. (విణ. అని శ. ర.)"క. దుడ్డెలు రా కటు పసలిరి,జడ్డున నుద్యానరటుంచుఁ జుమదెంచి గురుం,డొడ్డెన యడవినిఁ బోఁడఁగని, దొడ్డున మన్నించు టెఱుఁగుదువు గద మనలన్." కుచేల. ౨, ఆ. ౯౧. వై. వి. (సం. ధూర్తః.) విటుఁడు; విటి. (చూ. దుడ్డెకాఁడు. దుడ్డెతనము.)

దుడ్డెకాఁడు. ద్వ. వి. (దుడ్డె+కాఁడు స్వార్థము.) "చ. ఆటువలె సేఁగుచుండి మగఁ డత్తయు మామయుం నింట లేమి వెల్పటికి పాంకారుసం జని గుబాదల పీథులవెంట జంటలై,చిటిలినభ్రాఁక గంధముల సిస్తగుపాగల నిండుచెల్వొదు,భృటుల విభూషణావళుల బాగుగ నేఁగెదుదుడ్డె కాంద్ర లోన్." హంస. ౫, ఆ. ౧౬౦.

దుడ్డెతనము. ద్వ. వి. (దుడ్డె+తనము.) విటీత్వము. "గీ. పసిమిఁ జెల్కొదుముంజేతిపచ్చ లమర,దుడ్డెతనమునఁ దిరుగు నారెడ్డిసాని." హంస. ౪, ఆ. ౧౩౭.

దుత్త. దే. వి. 1. చిన్నకుండ. "గీ. కడవ ముంత గరిగ దుత్త పిడుత గురిగి" హంస. ౫, ఆ. ౧౧; 2. పాలకుండ. "సీ. దుత్త యనంగను దుగ్ధభాండం బొప్పు..." ఆం. భా. ద్వి. ౨౪౭; 3. చాఁకుబడినచోటనవ్రేలి చూపుడువ్రేలి నడిమికొలఁత, ప్రాదేశము. "చ...లేటివెంటఁ బడి దుత్తెడు మేరన పట్టువేగదం,తులఁ గని మెచ్చి లేనగవు తోడ నభీష్టములెల్ల నిచ్చుచున్." వరాహ. ౪, ఆ. ౭౬.

దుత్తాయి. దే. వి. చిన్నచొక్కా,కూర్పము. "సీ... కూర్పాఖ్య యులయును దుత్తాయి యరచట్ట కుప్పసం బాగి కుబుస,మనఁగ..."ఆం. భా. ద్వి. ౧౫౬.

దుత్తూరము. ఉభ. దే. వి. కపటము. (శ. ర. బ్రా.) సం వి. ఆ. పు. ఉన్మత్తకః.

దుత్తె. దే. వి. తాళము. (బ్రా.)

దుద్దు. దే. వి. 1 తామరపువ్వులోనిదిమ్మె, కర్ణిక. "గీ. పొలుచు. గర్ణిక దుద్దు నా ముద్దె యనఁగ." ఆం. భా ప్ర. ౧౬౬; 2. చెవికమ్మ,కర్ణిక. "సీ. కర్ణిక దుద్దనఁగాఁ జెలఁగు .." ఆం. భా. ద్వి. ౧౪౭; 3. తాటియాకుచాబుమీఁది చంద్రిక. (శ. ర.); 4. వ్రాఁతకుఁ బనికివచ్చుతాటియాకులకట్ట. "చ.... రాయసపుటార్యులగంటము లావుదుద్దులున్, వద లక మోసి చూచి నొకపట్టునఁ బొట్టకు లేక

తక్కుచున్." వాంచ. ౪, ఆ ౩౦; 5. ఆవశ్యము. "ఆ. తనుకు ననుకు దుద్దు తటపట తపతప, నట హంలిక్కా నా నవక్య మథవ." ఆం. భా. ప్ర. ౧౯౯; 5. అతిశయము. (చూ. దుద్దెక్కు); 6. మూలస్థానము. "ద్వి. జపసమాధులప్రొద్దు తపములదుద్దు . శివభక్తి శిఖరంబు శ్రీనగేంద్రంబు" పండి. పర్వ. ౩౧౩. పు.; 7. మోసము (చూ. దుద్దుపెట్టు.)

దుద్దుకంబళి. దే. వి. (దుద్దు+కంబళి) ఒకవిధమైన దట్టపు జేబకంబళి. "గీ. సన్నజాదపు సేఁతమాచంబు దుద్దుకంబడిఁ బఱచి నిద్దురకుఁ దూలు, మగనిఁ గూర్కాకు మనుచు నమ్మాయలాడి" వేం. పంచ. ౪, ఆ. ౪౫౬. హంస ౫, ఆ. ఇక్లే దుద్దుగంబడి, దుద్దుగొంగడి. మొ. (బ్రౌ.)

దుద్దుపెట్టు. దే. స. క్రి. (దుద్దు+పెట్టు.) మోసగించు. "ఉ. అత్తలమామలన్ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, జిత్తుల దుద్దుపెట్టుచును జీటికిమాటికి నన్ను జేరఁగావల్తురు .." దశా. ౯, ఆ. ౩౫౫. సా. ౨, ఆ. ౧౧౪.

దుద్దెక్కు. దే. అ. క్రి. (దుద్దు+ఎక్కు.) అతిశయించు. "ద్వి. పెద్ద యాశ్రమదంబు భీతియుం భక్తి దుద్దెక్కి తనలోనఁ దొట్రిల్లనంగ." బస. ౧, ఆ. ౫౮౬, పం.

దుద్రుమము. సం. అ. పుం. పచ్చనీరుల్లి.

దునీఁడు. దే. వి. (దుని+ఈఁడు.) ఱేఁడు, ప్రభువు. "సీ. కథలందముల నేఁగ గలవేలుపుదునీలు సమయము లేక మోసలచు గాయు." పార్వ. ౧, ఆ. ౧౮. సాం. వి. దేవ. ౩.

దును. దే. స. క్రి. దున్ను. "సీ. ఇందుఁ బుట్టినజను లెల్లను దుదిఁ ద్రిదివంబున కరుగంగవలయుం నని మనంబునఁ గోరి యన్నరపతి దున్నంగ నింద్రుఁడు కనుదొంచి యేల యుంచటఁ, దునియెద వనిన..." భార. శల్య. ౨, ఆ. ౨౧౫. "మ. హలికుం డెంతయు నోజతో దునఁగ సీరాగ్రంబునం జోఁకి ప్రాణులనేకంబులు సచ్చు..." భార. అర. ౫, ఆ. ౫౭.

దునుకు. దే. వి. 1. బాధ. (శ. ర.) "మ. తనఘోర ధ్వనికిం గలంగఁబడుకత్తైన్యంబు దైన్యంబునన్, దును కొందం బరిఘుంబు పై విసరుచున్ దుర్వారుఁడై..." ఉ. హరి. ౫, ఆ. ౨౨౫; 2. భయము. "క. అనిలజు సారథియును గురుతనయుని రథచోదకుఁడు నకుని సాతనినిం, గొని యుల్లంబుల బలితపు, దునుకు వోరఁగ నవిఁ దొలఁగఁ దోలిరి రథముల్." భార కర్ణ. ౧, ఆ. ౧౧౦.

దుసి దే. వి. చిన్నసేన. (చూ. దుసెదారి.)

దుసెదారి. ద్య వి. (దుసె+దారి) అల్పసేనాపతి. "చ ..మన్నివారలు దుసెదారులున్ దొరలు రాజులు మంత్రులు మిత్రబాంధవావళులుం బురోహితుల్ పనులవార లనేకులు నిండి యుండఁగన్." సా. ౩, ఆ. ౧౫౭. ప్రబంధ. ౨౧౦.

దుసెసరి = దుసెదారి. (కూరుఁడు. బ్రౌ)

దుసే = దుసె. (చూ. దుసేదారి.)

దుసేవారి = దుసెదారి. "సీ. ఈవాజారము వెంత వెంతయుం భేటికై చేరి నిల్వనిమసేవారు లెవ్వరు ..." ఆనంద. పీఠి. ౧౬౬. ప్రబంధ ౨౧౬.

దున్న. దే. వి. (దున్ను ధా.) 1. మహిషము. "ఉ. కాలునిదున్న నంది నయి గంటలు దున్నక మంటి నామహా, కాలునివంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటినా, హాలికులు .." ఆము. ౪, ఆ. ౧౨౪. ఆం. సం. తిర్య. ౧౦; 2. పురుషమృగము, పశువులలో మగది. "క. కన్నంతన తనయేలిక, దున్న దిగంబ్రావి .." హరి. పూ ౭, ఆ. ౯౪. (పిరికదున్న = మగయెనుఁగు.) బస. ౪, ఆ. ౯౧, పం.

దున్నపోతు. దే. వి. (దున్ను ధా.) దున్న, మహిషము. "సీ. చదువుచుండెడివేళ సభలోనఁ గూర్చుండి దున్నపోతులకొడు కొన్నుఁదప్పు." వేణు. శ. ౩౬. (ఇట నిందార్థకము.)

దున్నించు. దే స. క్రి. (దున్ను ధా. ప్రే.) దున్నఁజేయు. "గీ. జనకజననాయకుఁడు యాగశాల గట్టుచోట దున్నింప..." ఉ. రా. ౩, ఆ. ౧౩౦.

దున్ను. దే. స. క్రి. దుక్కిచేయు. "వ ..దానిఁ గురుం డనురాజు దున్నుటం జేసి దానికి గురుక్షేత్రం బనునామంబు గలిగె .." భార. శల్య. ౨, ఆ. ౨౧౪, ౨౧౫. [జేయుందున్ను.

దున్వత్. సం. శత్రు. 1. తపించుచున్న; 2. తపింపఁ

దుపటము. దై. వి. (స. ద్విపటీ.) దుప్పటి, రెలగల సన్నపువస్త్రము. "క. శిరసుకడి యొత్తి దుపటపుఁ, జాటిసిల్లా గట్టి వారిపిలయము నెదలెన్." ల. వి. ౫, ఆ. ౩౬.

దుప్పటము. వై. వి. (సం. ద్విపటీ.) 1. ఉత్తరీయము. "ఉ. బంగరుదుప్పటంబు వలెవాటుగ గొప్పు..." చమ. 3, ఆ. ౬౬. వరాహ. ౪, ఆ. ౪౯; 2. సన్ననివస్త్రము. "గీ. ఒకచకోరాక్షి నిజకరద్యుతులు మీఁదఁగప్పి చంద్రికవన్నియ గాఁగ దుప్పటమునఁ దడిసెనొత్తె .." వరాహ. ౪, ఆ. ౧౨౪. బ్రహ్మో ౧, ఆ. ౨౦; 3. కవచము. "గీ. తనరఁ జేర్లు తనుత్రాణమునకుఁ గత్తళంబు జోడు శిరాదుప్పటంబు బొందళం బనఁగ .." ఆం. సం. స్థా. ౨౯. సాం. ని. మాన. ౪౫.

దుప్పటి. వై. వి. (సం. ద్విపటీ.) 1. వస్త్రము. "గీ .. విష్ణుండు వచ్చెఁ, బత్తికలి కొక్క పైఁడిదుప్పటి చెఱంగు, దూలఁగా బిట్టు వాగెలఁ దోలుకొనుచు." వరాహ. ౯, ఆ. ౧౧౪. ఉ. రా. ౯, ఆ. ౯౯౦; 2. కప్పుకొనుటకు పక్కమీఁదఁ బఱచుటకు నుపయోగించుమందకబట్ట, నిచోళము. "చ బటువులు తాపికాపటువుపుష్పకలాదముమీఁదఁ జల్వదుప్పటి పయిఁ జప్పరంపుఁజిగి బంగరుప్రాఁతకురాళముస్ ..." శుక. ౪, ఆ. ౨౬. ఆము. ౪, ఆ. ౩౫.

దుప్పటీ = దుప్పటి. 1. (ఉత్తరీయము.) "గీ. తమ్మి దోఁదమ్మిజోడుసాదనలవారువు, ప్రాఁతపనిదుప్పటీ వలెవాటు వైచి." కువల. ౨, ఆ. ౪; 2. (వస్త్రము.) "గీ. మిసిమిబంగారుతళుకులమేలిదుప్ప, టీచెఱంగులు .." ఉ. రా. ౬, ఆ. ౨౦.

దుప్పి. దే. వి. 1. మచ్చలు గలహరిణము, పృషతము. "సీ..పృషతాఖ్య యనఁదగు దుప్పి యనంగ..." ఆం. భా. ద్వి. ౧౫ స్వా. ౪, ఆ. ౨౧, 2. పెద్దదుప్పి, రామము. "సీ. దుప్పి. గీ. యనఁగ రామంబు చను..." ఆం. భా. ద్వి. ౧౫. (మృగవిశేషవాచకములు మృగసామాన్యవాచకములుగా కవులు వ్యవహరించియున్నారు.) "చ ..ఒకదుప్పికిం గవియఁ బ్రేలి భయజ్వరతప్తచిత్తమై." "గీ. ఆచమూరుమృగయూథంబుఁ ద్రోఁచి పఱచె" "ఉ. ఆరురు పీఁగలిం బఱచి .." పాండు. ౫, ఆ ౧౪, ౧౫, ౧౬. మార్క. ౫, ఆ ౨౩౧.

దుబారా. హిం. వి. రెండుమారులు విణ. వ్యర్థము; అమితమైనది. (వ్యయము. 'దూబరా' అనియు వాడుక.)

దుబాసి. వై. వి. (సం. ద్విభాషీ.) భాషాంతరము చేయువాఁడు, రెండుభాషలువచ్చినవాఁడు. (చూ. దుబాసితనము.)

దుబాసికుఁడు. వై. వి. (సం. ద్విభాషీ?) దుబాసి. "క. ఆరాయబారి వచ్చిన, దూరాగమనంబుఁ జూచి దోడ్తో నడిగెన్, సీరాశ సేమి కత మని, గోరుందొర తనదుబాసికులమూలమునన్." రంగా. ౨, ఆ. ౧౧౮.

దుబాసితనము. వై. వి. (దుబాసి+తనము) భాషాంతరముచేయు ఉద్యోగము. "గీ. కుంఫిణిదుబాసితన మిాయ పొంపు మీఱి, రహిఁ దెలుఁగ మీఱి యానందరంగశౌరి." ఆనంద. పీఠి. ౬౮.

దుబాసీ. వై. వి. (సం. ద్విభాషీ.) దుబాసి. "క. మూసావారిదు, బాసీ లక్ష్మణసమాఖ్యుఁ బరఁగు నతఁడు..." రంగా ౨, ఆ. ౮౧.

దుబ్బ. దే. వి. 1. ఆఁడుగుతి "సీ...పాఁకులఁ గను తొఱ్ఱు పత్త బయ్యె, మఱునిల్లు దుబ్బన మదనమందిర మొప్పు..." సాం. ని. మాన. ౧౯. వెంక. మాన. ౪౨; 2. పాత్రవిశేషము. "సీ. త్రొర్లు గట్టియుఁ బల దుబ్బ చిల్కుడు గుంజ పూలబిందెలు వెన్నపూసచట్టి." హంస. ౨, ఆ. ౬౫.

దుబ్బు. దే వి. తృణమూలము. "సీ..నలు నన నలరు కుప్ప. గీ. తృణము దుబ్బనఁగా మూల మెసఁగు..." ఆం. భా. ద్వి. ౬౮.

దుమగతికేతు. వై. వి. (సం. ధూమకేతుః.) అరిష్టమును సూచించునక్షత్రవిశేషము, తోఁకచుక్క. "సీ. దుమగతికేతు నా ధూమకేతువు దోఁచు." ఆం. భా. ప్ర. ౯౮.

దుమదుమ. దే. వి. కోపాదులు కలిగినప్పటి చేష్టావికారమున కనుకరణము. (చూ. దుమదుమలాడు.) విణ. 1. బాగుగా తడిసినది. "క. తనుపొటఁ జినుకుచినుకుల దుమదుమగాఁ దడిసినట్టిదువ్వలు వలతో, ఘుమఘుమ యను పరిమళబృందముతో ..." కళా. 3, ఆ. ౮౮. "క. మదగజదాన ధారల, దుమదుమలై యున్న పెద్దత్రోవల గోడన్, రమణీయమయ్యె నప్పురి..." భాగ. ౯, స్కం. ౩౨౨; 2. కలిసినది, కోపగించినది. "చ. అమృతరసంబు లంటిపడ నాలిఁ జేసినది లోఁపలన్, దుమదుమగా వచోమహిమ దోఁచఁగ గీతముఁ బాడుచున్న..." నిరం. ౨, ఆ. ౩౦.

దుముదుములాడు. దే. అ. క్రి. కోపాదులవలనఁ జిరచిరలాడు. (బ్రౌ. వా.)

దుమాదూళి. వై. విణ. విశేషోత్తమము, ఒక్కుమ్మడి. "మ. కడిసెన్ గారెనుపోతు లేదు లిలిగన్ ద్రుగ్గన్ వృకవ్రాతముల్, గడు తుల్ చిక్కెగజాళి చొక్కె నపుడశ్వార్కన్ దుమాదూళిగన్." సా. ౧, ఆ. ౧౦౭.

దుమారము. దే. వి. 1 దుమ్ము. "గీ. అనుచు నిందించి వలవంత యినుమడింప, నవ్వరారోహవిదళితవాల్లకముల, కమ్మపుప్పొడిపైదుమారమ్ము రేఁచు,మలయమందరపవనుపై నలుక వొడమె."స్వా. 3, ఆ ౪౯, ౫, ఆ. 3౮; 2 (ఆకాశమున వ్యాపించు) పెద్ద దుమ్ము, పెంధూళి. "చ. తెలిపువు నీటివర్షము లుదీర్ణములై యొనరంగ నర్తిలిన్, మలయుచుఁగుఁ జొచ్చెఁ బుప్పొడిదుమారము లెల్లెడల న్నిరంతరా, కలన వహించి దట్టమయి కానఁగనయ్యెను మొగ్గ దూరతం, గలఁగెడు దంపతిప్రతతి,గాంచుమహోష్మపుటూర్పుగాడ్పులున్."కాళిందీ. ౪, ఆ. ౨౧. చంద్రా. ౨, ఆ. ౨౮.

దుమాలు. దే. విణ. సమూలము. (శ. ర.) "ద్వి. కొండొక సీపులోఁ గొట్టెదుమాలు,బెండుగా నాకాద్రబృందంబుకలలు."ద్వి. భాగ. ౬, స్కం. (శ.ర.)

దుమికించు. దే. స. క్రి. (దుముకు ధా. ప్రే.) (అశ్వాదులను) ఊటికించుచు నడిపించు. "క ..రాజు వేడుకతోడన్,గోడా దుమికింపఁగ జత,గూడిరి భటు లెల్ల భటులగుమి వెనుకొనియెన్." ఉ. రా. ౭, ఆ. 3౯౯. దశా. ౨, అ. ౧౯.

దుమికియాడు. దే. అ. క్రి. (దుముకు+ఆడు.) (గుఱ్ఱము.) వల్గితగతితో పోవు. "సీ. గందురానిగ్గు చౌకాటంపుమోముట్టు తొగరీఁకలకటాణి దుమికియాడ." ఉ. హరిశ్చ. 3, ఆ ౧3౧.

దుము. దే. వి. దుమ్ము. (శ. ర.)

దుముకు. దే. అ. క్రి. 1. ఊఱుకు. "మ ..కరిణీఘాలంబుపై సింహ మూర్భకమయ్యుఁ దుముకున్ స్వభావమిది శూరశ్రేణికిన్..." మల్లభూ. నీతి. 3౦, చంద్రి. ౪, ఆ. ౯౪; 2. పడు,వ్రాలు. "చ. చెమటలు దొప్పఁదోఁగుజిగిచెక్కులు పువ్వులు రాలమూపులం, దుమికెడికొప్పులు న్నొసటఁ దుంపెసలాడెడుచేరుచుక్కలున్." రా. వి. 3, ఆ. ౮౮; 3. ఉట్టిపడు. "గీ. దూదిపాటలఁ దేనియల్ దుముకుచుండ..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౨౪, వి. 1. గంతు,ఊఱుకు. "క. దుముకులు వైచుచు నారయా సమయంబుల జలము లెత్తి చల్లుచు వలల,క్రమలీల వైవ .."వేం. పంచ. ౧, ఆ. ౬౧౮; 2. మల్లవిద్యావిశేషము. ప్రబంధ. ౭౮౪.

దుముకులాడు. దే. అ. క్రి. (దుముకులు+ఆడు.) గంతులువేయు. (శ. ర.)

దుముక్కు. దే. వి. ఊఱుకుటయం దగుధ్వని కనుకరణము. "గీ ముక్కు గొఱికికొని దుముక్కునఁ దన సేన,సరస కుఱికె రామచంద్రుఁ డాంచె." రామా. ౮. ఆ. ౧౪౮.

దుముదారు. దే వి. 1. (అశ్వాదుల) గతివిశేషము. "సీ. మూపురంపు గఱికి సెఁపరిముకుమచ్చ కత్తడి పడి దుముదారుఁ జూపు." ఉ. హరిశ్చ. 3, ఆ. ౧3౧; 2. ముందటిసైన్యములకు రక్షకముగా వెనుక నుండుసేనానాయకుడు. "గీ....సరస మన్నీలు దుముదార్లు చతురవితత, సకలసేనాపతులై నడపింపరమణఁ జెలువొంద రాజమార్గమున వచ్చె,రమ్యగుణశాలి శ్రీకృష్ణరాయమౌళి." కృష్ణ. ౨, ఆ. ౧౪౯; 3. సేన,దండు. "సీ ... ఏసిక్కుఁ జూచిన చెలదేటిదుముదారులు .." శశాం. ౪, ఆ. ౬౪, స్వా. 3, ఆ. ౭౪. విణ. ఒక్కుమ్మడి, సంకులము. "గీ.హైమనర్గముల దోలి గంధాంధభద్రకరులఁ గాలాడి దుముదారుగా హయాళిఁ,జేరుపకు నూకి భటులకుఁ జేయి పిచ్చి, యధ్యమిత్రీయ దేవసైన్యంబుఁ గదిసె." దశా. ౨, ఆ. ౪౭౬. "క. వారలసేనలపై దుము,దారుగను మురాసురుండు తనయులు దానుం ఘోరునఁ బోరొనరించెను..." సత్య. సాం. ౪, ఆ. ౧౧౧. (బ్రౌ)

దుముదుము. దే. విణ. (దుము+దుము.) దుమ్మయినది, భిన్నాభిన్నమయినది. "క కల్లి నిచు వెలించుచు,వి ల్లే రెత్తించుకొనెడు వెలిబొమ్మల నీ, కల్లరిరక్కసిజంకల, త్రుళ్లడఁతును వనము వెలిక దున్ దుముదుము గాన్."రామా. ౬, ఆ.౧౯౯. (శ. ర. హ.)

దుమ్మరము. దే. వి దుమ్ము. "సీ. ఒసపరి మైఁ గ్రమ్ము కుసుమపరాగము మైఁజల్లుకొన్న దుమ్మరముగాఁగ." సుదంశా. ౨, ఆ. ౧౨౬.

దుమ్మురమూతు = దుమ్మాడు. "సీ. కమ్మపుప్పొడిలోన దుమ్మురం బాడించి చలువగొజ్జంగినీటఁ జల్లుకొలిపి." రాధికా. 3, ఆ. ౧3౦.

దుమ్మాడు. దే. అ. క్రి. (దుమ్ము+ఆడు.) ధూళి చల్లుకొను. "గీ. కొమ్మ లందఱు రతనంపుసొమ్ము లూడ్చి సూనరజములు సోఁకినసొలపు మేను లమరగంటలు దీసి దుమ్మాడినట్టి, మదురిమద మేనుఁగులరీతి సరసిఁ గొలఁగ." కృ. శకుం. ౨, ఆ. ౧౬౨.

దుమ్ము. దే. వి. 1. ధూళి,పరాగము. "సీ. పువ్వుఁ బుప్పొడిదుమ్ము పొవరె నిప్పొదలఁ సిద్ధాళి లెపుడు వసించునేమొ." ఉ. రా. 3, ఆ. ౬౫, ఆము. ౪, ఆ. ౧౧; 2. ఎముక. "సీ పొట్టలు చట్టలు బొమ్మలు దుమ్ములు మోవులు ప్రేవులు పొలలు దలలు." అచ్చ. యు. ౧3౫. (ముద్రి. పా. 'బొమ్మలు.' శ ర. పా)

దుమ్ముదూళి ద్వ. వి. (దుమ్ము+దూళి) పిండిపిండియైనది, ఛిన్నాభిన్నమైనది. "ఉ. కొన్నిటిహస్తముల్ పదియుఁ గొన్నిటికొమ్ములు దుమ్ముదూళి గాఁ, గొన్నిటికుంభము ల్వగుల .." భార. భీష్మ. ౨,ఆ. ౨౧౧.

దుమ్ములగొండి. దే. వి. (దుమ్ములు+గొండి) —ఎముకలు తినుజంతువు–మృగవిశేషము, కొర్నవగండు. (శ. ర. బ్రౌ.)

దుయ్యముడి. దే. వి. (దుయ్య+ముడి) సులభముగా నూడఁదీయఁ దగుముడి, పోఁటుముడి. "సీ. జారి లాలుపసిండిపరిపెణల్ సడలించి కట్టెదల్ దుయ్య ముడిఁ గట్టువారు." చంద్ర. ౨, ఆ. 3౨.

దుయ్య=దూయ. (చూ. దుయ్యముడి.)

దుయ్యు. దే. అ. క్రి. 1. వెడలు. "వ...విన్న శపి యింపు నే మెంతవార మని యుపచారోక్తులు పలుకుచు దుస్సి పోయిరి..." భో. ౭, ఆ. ౯౪; 2. (బాణము మొ.) రంధ్రము చేసికొని పోవు. "క. పిరుద్దుమిధునమేళన్నదై రతిపతి యేయ దుస్సి వారికిద్దుతిఁ బై బా రెగయఁ బొటమరించిన, సారసములమైన లసంగ నన లబి మించెన్." ఆము. ౫, ఆ. ౧౧౫. స. క్రి. 1. త్రెంచు. "గీ. పూసద్రాడు దుయ్యు లేమ పొలఁతిమెడఁపు, బెరువు పా లింట నేడ్చినదిద్దకైన, మిడువ లే డెల్లదాసను జెడిలి మొల్లఁ,కోయితిమి ప్రాలు గల పట్టి పుట్టఁబట్టి." హరి. పూ. ౫, ఆ ౨౧౯; 2. (ఒఱుపుండికత్తి. మొ.) పైకితీయు. "క. అని మరుబాణములు బడలేనని కైదువు దుస్సి దాటు సాయకములలెస్, వెనఁగునల యుటియ చేసురి, యసులిమి బలిమి విడిపించి యను నసురక్షిన్." సా. ౭, ఆ. ౭3౬, సీతావి. 3, ఆ. ౪౪.

దురంగి. దే. వి. (హిం. దురంగీ.) రెండురంగులు కలిసినరంగు. "వ .. మేల్దురంగిచందువలు......" శకాం. ౪, ఆ. ౭౦౨. (బ్రౌ.)

దురంతము. సం. వి. అ. పుం. దుఃఖకరమైనపర్యవసానము. విశ. (అ. ఆ. అ.) 1. తుదిలేనిది, అనంతము; 2. దుఃఖముతో ముగియునది; 3. దాటరానిది.

దురటిల్లు = దురపిల్లు. భా. శాం. ౨. ఆ. ౧౦౯. ౫, ఆ. ౭౮3. ఉ. రా. ౮, ఆ. ౯౪.

దురతిక్రమము. సం. విశ. (అ. ఆ. అ.) 1. అతిక్రమింపరానిది; 2. దాటరానిది; 3. గెలువరానిది, 4. నివారింపరానిది.

దురత్యయము. సం. విశ. (అ. ఆ. అ.) 1. నాశములేనిది; 2. దాటరానిది.

దురద. దే. వి. (శ. ర.) 1. కండూతి. "గీ. దూల జిల నవ నవ గాఁడు దురద యనఁగఁ,బరఁగుఁ గండూతి..." ఆం. భా. ద్వి. ౧౭౯; 2. కసరు. (శ. ర.)

దురదకంద. ద్వ. వి. (దురద+కంద.) కసరు గల కంద, మహాకందము*. (శ. ర)

దురదగొండి. దే. వి. దూలగొండి*. "సీ. దూలగొండి యనఁగ దురదగొండి యనఁగఁ దీటకోవెల యనఁ బేజరిల్లుఁ గండూర..." ఆం. భా. ద్వి. ౫౪.

దురదగోవెల. దే. వి. దూలగొండి*. (శ. ర.)

దురదపెట్టు. దే. అ. క్రి. (దురద+పెట్టు.) దురద కల దగు. (వ్యవ) కాలు దురదపెట్టుచున్నది.

దురదుర. దే. క్రి. విశ. ద్రు. వడిగా, శీఘ్రముగా. "చ...దు,ష్టరకరమూర్తియై ప్రవృథమై త్యుఁడు గన్నుల నిప్పు లొల్కఁగా, దురదురవచ్చి శాంకరిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్." భాగ. ౧౦, స్క౦. పూ. ౧౧౪౨, రుక్మి. ౫, ఆ. ౪౬.

దురదృష్టము. సం. వి. అ. న. దౌర్భాగ్యము, అదృష్టహీనత.

దురపిలు. దే. అ. క్రి. 1. శోకించు, దుఃఖించు. "ఉ. అయిపాటి కంతఁ గడు నల్లుచు పట్టినభూ

దధాభిధా,ణాచిచిత్రతం దురపిలంగ వియోగద
హత్యమున్, జాపుడుఁ జేర వేడు వివశుం గయి
తోఁ తశోరవృత్తిఁ జైత్యాపుడుఁ గట్టుకొన్నగత
భాగ్యత సా లిది పాట్లు పొచ్చెలీ." ప్ర. భా. ౫,
ఆ. ౧౮౩; 2. పరితపించు. "క. నరుని శరీరమున
జరా,తరుణి ప్రవేశించి ప్రజ్ఞఁ దరలించుఁ జామీ,
పరకాంతగృహముఁ జేకొని, దురపిలఁ నిల్లాలి పెరలఁ
ద్రోచినభంగిన్." వాసిష్ఠ. ౧, ఆ. ౧౨౩.

దురపిల్లు = దురపిలు. 1. (శోకించు, దుఃఖించు.) "క. గురుసుతుఁడు పాండవులకున్, గర మల్గును వారిఁ బొదువఁగా నతఁ డీప్రా,ద్దురవడిఁ గదియును బోయెద, దురపిల్లకు మయ్య మది విధూత కళంకా." భార. శల్య. ౨, ఆ. ౩౮౫. దశ. ౧౦, ఆ. ౧౫౯; 2. (పరితపించు.) "గీ. ద్రుపద నందన పరిభవదుఃఖమునకు, నల్లమున దురపిల్లుచు నున్నదరసి, వేఁడినిట్టూరుపో యన .." భార. విరా. ౬, ఆ. ౨౩౪; 3. (కలఁకనొందు.) "ఉ...సాయనంబు చే,పెట్టి కలంచినట్లు దుర పిల్లెడు..." శై. ౬, ఆ. ౫౫. భార. ద్రో. ౪, ఆ. ౨౬౪. వి. (వ్యథ, దుఃఖము.) "సీ... వందురు దురపిల్లు కొందలంబు. దలుపు నోవి యనంగ చను వ్యథ..." ఆం. భా. ప్ర. ౧౫౦.

దురభివేశము. సం. విణ. (అ. ఆ. అ.) చొర శక్యము కానిది. "శా. ప్రాంతాది ప్రవిభాగబోధరహిత ప్రాగ్ద్వారమునుం గాకర, స్వాంతత్రాసకరంబు నై దురభివేశం బైనయాలోను నిశ్చింతుండై పటికీలు వట్టికొని చొచ్చెన్ భీమఁ డత్యుగ్రతన్." భార. విరా. ౨, ఆ. ౩౨౪.

దురము. వై. వి. (సం. ఉదరమ్.) 1. యుద్ధము. "క. అరివీరుల ఘోరం బగు, దురమున వధియించు జేల దోసం బయ్యెన్." భార. శాం. ౧, ఆ. ౧౧౨. ఉ. రా. ౧, ఆ ౧౫౫; 2. వేగము. "చ. రమణి క్రమక్రమంబున దురంపువగన్ నటి యించె వింతగా." శకాం. ౩, ఆ. ౧౧౦.

దురమెక్కు. ద్వ. అ. క్రి. (దురము+ఎక్కు.) విజృంభించు, చెలరేఁగు. "సీ. పరసాని దొరసాని హరి పెక్కు దురమెక్కు వగ వింత జోడైన వగపుఁ జాపు." శకాం. ౩, ఆ. ౧౧౨. [ఆ. ౧౩౬.

దురవస్థ సం. వి. ఆ. స్త్రీ. చెడ్డస్థితి. భార. విరా. ౩,

దురవాపము. సం. విణ. (అ. ఆ. అ.) పొందరానిది.

దురస్తు. హిం. వి. బాగు; మరమ్మతు. (వ్రా.)

దురస్తుచేయు. మి. స. క్రి. బాగుచేయు, మరమ్మతు చేయు. (వ్రా.)

దురా. దే. వి. దురాయి, ఆజ్ఞ. (చూ. దురాపెట్టు.)

దురాకృతము. సం. వి. అ. న. అకృత్యము, చెడ్డపని.

దురాగ్రహము. సం. వి. అ. పుం. 1. చెడ్డపట్టుదల, చలపాదితనము. "అ. ఏను ధార్తరాష్ట్రహిత మాచరించుట,కై పెనంగి చెవుల కప్రియంబు, లైన నిన్నిమాట లాడిన నాబుద్ధివిని దురాగ్రహంబు విడువవలయు." భార. కర్ణ. ౨, ఆ. ౩౭; 2. చెడ్డకోపము. విణ. (అ. ఆ. అ.) చెడ్డ ఆగ్రహము గలది. [గలవాఁడు.

దురాత్ముఁడు. సం. విణ. (న్. నీ. న్.) చెడ్డమనస్సు

దురాధర్షుఁడు. సం విణ. (అ. ఆ. అ.) 1. ఎదిరింప రానివాఁడు; 2. వినయము లేనివాఁడు.

దురాపము. సం. విణ. (అ ఆ. అ.) 1. పొందరానిది; 2. చేరరానిది.

దురాయి. దే. వి. ఆజ్ఞ, శాసనము. "సీ. జగదధిష్ఠాన భాస్వజ్జ్యోతి యగువాఁడు బ్రహ్మాదు లదరు దురాయివాఁడు." కృష్ణ. ౧, ఆ. ౨.

దురారోహ. సం. వి. 1. బూరుగుచెట్టు; 2. శ్రీవల్లిచెట్టు.

దురారోహము. సం.వి.అ.పుం. 1. కష్టముతో ఎక్కుట; 2. కొబ్బెరచెట్టు; 3. తాడిచెట్టు; 4. ఖర్జూరముచెట్టు; 5. తొండ, సరటము. విణ. (అ. ఆ. అ.) ఎక్కుటకు శక్యము కానిది. భార. అర. ౩, ఆ. ౭౫.

దురాలభ. సం. వి. ఆ. స్త్రీ. తీఁటకసిందచెట్టు.

దురాలభము. సం. విణ. (అ. ఆ అ.) పొందరానిది.

దురాలాపము. సం. వి. అ. పుం. 1. చెడ్డమాట; 2 తిట్టు

దురాలోకము. సం. విణ. (అ. ఆ. అ.) చూడ శక్యము కానిది.

దురాపెట్టు. దే. స. క్రి. (దురా+పెట్టు.) శాసించు, ఆజ్ఞాపించు. "క. సుదురా జిగిక్రొన్నెలచెన్ను దురాగత మనుచు దేంట్లచు దురాపెట్టున్న దురా యని ముంగురు లెన్నదురా పొటిపేణి జీవనదు రాజసమున్." శకాం. ౩, ఆ. ౪౭.

దురాశ. సం. వి. ఆ. స్త్రీ. పేరాస.

దురాసదము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొంద రానిది; 2. ఎదిరింపరానిది; 3. చొరరానిది.

దురితము. సం. వి. అ. న. 1. పాపము; 2. కష్టము, బాధ. "క. వెతలంబొడ గాఢపీడం, బడి నుడివడి

రూాని నొత్తువడి యొకభంగిన్, విదలఁగ గ్రహభూతము లప్పుడు దొడఁగి యనేకదురితములు గల్పించున్." భార స్త్రీ. ౧ ఆ. ౩౭. దశ. ౨, ఆ. ౭౬. విశే. (అ. ఆ. అ.) 1. పాపమును గలిగించునది; 2. పాపముతోఁ గూడినది.

దురిష్టము. సం. వి. అ. న. 1. శాపము; 2. ఒకనికి కీడుగావించుతలఁపుతోఁ జేయుయజ్ఞము, అభిచారక్రతువు.

దురీన. దే. క్రి. విశే. ద్రు. కటాలున, అకస్మికముగా. "పంచచామరము . పొల్తుక ల్దలిర్త రచ్చరల్ మలం గలంచ మించుసంద్రు నందుఁ బుట్టుచున్దురీన లేచునట్టిజాడపోఁకఁ జూచి రెన్నఁడున్." య. ౩ ఆ. ౭౧.

దురుక్తము. సం. వి. అ. న. చెడ్డమాట. విశే. (అ. ఆ. అ.) పరుషముగాఁ బలుకఁబడినది

దురుక్తి. సం. వి. ఇ. స్త్రీ. చెడ్డమాట.

దురుత్తరము. సం. వి. అ. న. 1 చెడ్డయుత్తరము; 2. కష్టముతో దాఁటుట. విశే (అ. ఆ. అ.) 1. దాఁటరానిది; 2. బదులు చెప్ప శక్యము కానిది.

దురుపదములు. మి. వి. బ. (దురుసు+పదములు.) త్వరగా వేయుపాదవిన్యాసములు. "గీ. దురుపదంబులు సొక్కమై పికులు వోసఁగ, సరిగ విరుఁగేలఁ గుంచియల్ సవదరించి, పెక్కువగ జక్కణికొప్పు ద్రొక్కనొక్క, చక్కనిమిటారి ..."దశా. ౭, ఆ. ౧, ఆ. ౨౮౭.

దురువరము. దే. వి. నీచజాతి. "సీ. పొసఁగినమన విధంబులవారటుండఁగా దురువరంబులవారిమురువు హెచ్చె." శుక. ౧, ఆ. ౪౦.

దురుసు. దే. వి. 1. వేగము, తొందర. "సీ. దురుసుగా వెడలెడి విరుసులభూపులు భూనభోంతరములఁ బొదివికొనఁగ." దశా ౭, ఆ. ౧, ఆ. ౨౫౩. ఉ. రా. ౫, ఆ. ౨౩౯; 2. కాఠిన్యము. "ద్వి...ఇంత, దురుసు సైరాసుట నీకొపంబు గాదు." విష్ణు. పూ. ౨, ఆ. (శ. ర.) ఉ. రా. ౮, ఆ. ౧౧౧; 3. విధము, రీతి. "వ...చట్టంబున వెగయు నాళాశబాణంబుల దురుసున.. ' ప్రబంధ. ౭౮౮. విశే. 1. కఠినము, గట్టిది. "సీ. దారుశిలాయంత్ర కలికొమ్మకొమ్ములఁ దొరఁబు గావించి దురుసుకేయ." ఉ. రా. ౪, ఆ. ౨౭౪. ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౩, 2. విరువు పడలనిది. "సీ. దురుసుగాఁ జై కొఁ ద్రోసి కట్టినవాలుచనుదోయి బిగిచూపు బంటరవికె." దశా. ౮, ఆ. ౩౭౮; 3. క్రూరము. "గీ. దురుసుదండధనలతో ధర యేలు దొరఁ గన్న హింసాపరుం దని యెంచ రతని." ఉ. రా. ౬, ఆ. ౧౯౮. శుక. ౪, ఆ. ౩౧; 4 అధికము, హెచ్చైనది. "క. పరహితుఁడు మిన్నుఁ గనుఁగొని,దురుసౌ వికమీఁద వాహరూరల్ నిజముం, దరు లెదురెదురే చూతురు .."శుక. ౨, ఆ. ౩౪౫. ఇందు. ౨ ఆ. ౫.

దురేషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. చెడ్డకోరిక; 2. శాపము.

దురోదరము. సం. వి. అ. న. 1. జూదము; 2. పందెము, 3. పాచిక, అక్షము.

దురోదరుఁడు. సం. వి. అ. పు. జూదరి.

దుర్గ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. నీలిచెట్టు; 3. నల్లపిచ్చుక.

దుర్గతి. సం. వి. ఇ. స్త్రీ 1. దౌర్భాగ్యము, దుస్థితి; 2. పేదఱికము; ౩. ఆపద; 4. నరకము; 5. చెడుత్రోవ. విశే. (ఇ) దుర్మార్గుఁడు. "క. క్రతుఫలములు వడయఁగ దుర్గతులకు దొరకొనదు తీర్థగమనంబునఁ దత్క్రతుఫలము లందుదురు దుర్గతులును నిది మునులమతము కౌరవవృషభా." భార. అర. ౨, ఆ. ౨౪౩.

దుర్గతుఁడు. సం విశే. (అ. ఆ. అ.) 1. దీనుఁడు; 2. బిద, దరిద్రుఁడు, 3. ఆపదనొందినవాఁడు.

దుర్గమము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పోవుటకు కష్టమైనది; 2. పొందుట కష్టమైనది; 3. తెలిసికొనుట కష్టమైనది, బోధపడనిది. "వ...కాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపభోగ్యంబును వనభ్యస్తశాస్త్రంబునుంబోలె దుర్గమంబును...నర్తనాగారంబుమఖభాగస్థలంబు సేరి..."భార. విరా. ౨, ఆ. ౩౨౫. (ఇది మొదటియర్థమునకు నుదాహరణము.)

దుర్గము. సం. వి. అ. పుం. న. 1. వనపర్వతప్రవాహాదులయందు కిష్టముగా నుండుత్రోవ; 2. కోట; 3. ఒడుకొడుకుభూమి; 4. కష్టము, ఆపద. "సీ. బంధబంధపునకై ఘోరదుర్గముల లోపాముద్ర యలజడిపాలు గాదె."భార. విరా. ౨, ఆ. ౨౩౪. భార. శాం. ౬, ఆ. ౨౯౯.

దుర్ఘటము. సం. విణ. (అ. ఆ. అ.) ఘటింపరానిది.

దుర్ఘోషము. సం. వి. అ. పుం. 1. దుష్టధ్వని; 2. ఎలుఁగుబంటి. విణ. (అ. ఆ. అ.) దుష్టమైనధ్వని కలది. [జనుఁడు.

దుర్జనుఁడు. సం. వి. అ. పుం. ఖలుఁడు,దుష్టుఁ డగు

దుర్జయుఁడు. సం. విణ. (అ. ఆ. అ) గెలువ శక్యము గానివాఁడు. "వ...ఇట్లు దుర్జయుం డగునర్జునుండు సైన్యంబు దైన్యంబు నొందించుచు .." భార. విరా. ౫, ఆ. ౧౩౩.

దుర్జాతము. సం. వి. అ. న. 1. కష్టము, అపద; 2. అయుక్తత. విణ. (అ. ఆ. అ.) 1. చెడ్డపుట్టుక గలది; 2. అనుచితము.

దుర్జ్ఞేయము. సం. విణ. (అ. ఆ. అ) తెలిసికొన శక్యము గానిది.

దుర్ణయము. సం. వి. అ. పుం. దుర్నీతి. "క. కర్ణుండు రేఁచి పెట్టఁగ,దుర్ణయపరు లైనశకుని దుశ్శాసను లీ,నిర్ణయమె మే లనఁగ నీ,కర్ణములకు నింపు సొట్టు కార్యవచనముల్." భార. ఉద్యో. ౨, ఆ. ౨౪౮. విణ. (అ. ఆ. అ) దుర్నీతి కలది,దుర్నీతితోఁ గూడినది. "క. కర్ణునిసారథిసైనను,నిర్ణయమున నేను బార్థునిం గావెద న్వాదుర్ణయవిచారు సెమ్మెయిఁ,గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్." భార. ఉద్యో. ౧, ఆ ౧౧౨.

దుర్దమము. సం. విణ. (అ. ఆ. అ.) అడఁపరానిది. "చ. మసబల మెంత యింతయు సమగ్రసముద్యమదుర్దమంబుగా,మునుమును గూర్చి .." భార. విరా. 3, ఆ. ౧౦౯.

దుర్దాంతము. సం. వి. అ. పుం. 1. దూడ; 2. కలహము. విణ. (అ. ఆ. అ.) 1. గర్వించినది; 2. అడఁపరానిది. భార. విరా 3, ఆ. ౧౪౨.

దుర్దినము. సం. వి. అ. న. 1. మబ్బు క్రమ్మినదినము, 2. చెడ్డదినము; 3. కటికచీఁకటి, అంధకారము; 4. వర్షము. "శ్లో. ద్విషాం విషహ్యకాకుత్స్థ స్తత్ర నారాచదుర్దినమ్, సన్మంగళస్నాతఇవ ప్రతిపేదే జయశ్రియమ్." రఘువంశము. ౪, సర్గము. ౪౧. శ్లో.

దుర్దురూఁటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాస్తికుఁడు. (ఇది కర్మధారయసమాసోత్తరపదముగనే యుండును. ఉదా.-మీమాంసక దుర్దురూఁటుఁడు = నాస్తికుఁడైన మీమాంసకుఁడు.)

దుర్దైవము. సం. వి. అ. న. దురదృష్టము,దౌర్భాగ్యము.

దుర్ధరము. సం. వి. అ. పుం. 1. పాదరసము; 2. నరకవిశేషము; 3. నల్లజీడిచెట్టు. విణ. (అ. ఆ. అ.) 1. ధరింపరానిది; 2. భరింపరానిది.

దుర్ధర్ష. సం. వి. ఆ. స్త్రీ. నల్లయుప్పిచెట్టు.

దుర్ధర్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎదిరింపరానివాఁడు; 2. దరి చేర రానివాఁడు.

దుర్ధి. సం. విణ. (ఈ) దుష్టబుద్ధి కలవాఁడు (వ్యతి. సుధి.)

దుర్ధీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)=దుర్ధి.

దుర్నయము. సం.=దుర్ణయము.

దుర్నామ. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుజలగ.

దుర్నామము. సం. వి. న్. న. 1. చెడ్డపేరు; 2. మూలవ్యాధి. విణ. (న్ ఆ, మ్నీ, న్.) చెడ్డపేరు కలది.

దుర్నిమిత్తము. సం. వి. అ. న. 1. అపశకునము; 2. దుష్టహేతువు.

దుర్నీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. చెడ్డనడవడి, 2. దుష్పరిపాలనము. విణ. (ఇ). చెడ్డనడవడి కలవాఁడు.

దుర్నీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుర్నీతి గలవాఁడు.

దుర్నిరీక్ష్యుఁడు. సం. విణ (అ. ఆ. అ.) 1. చూడ శక్యము గానివాఁడు; 2. తెలియ శక్యము గానివాఁడు. "వ...కృపాచార్యభీష్ములు పార్థబాణపాతప్రకారంబులు ప్రణామసుశలప్రశ్నంబులుగా నంతరంగంబులం గనుంగొని సంతసిల్లిరి ధనంజయుండును దక్కినవారికి దుర్నిరీక్ష్యుం డగుచు నమ్మోహారంబుడస నవాదరంబు చేసి గోవుల పజ్జం బోవుచుండె .." భార విరా. ౪. ఆ.౨౫౪.

దుర్బలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొలఁది బలము కలది; 2. బక్క,కృశము; 3. శిథిలము, బిగి లేనిది.

దుర్భగ. సం. వి. ఆ. స్త్రీ. 1. మగఁ డొల్లనియాఁడుది; 2. గయ్యాళి, ధూర్తస్త్రీ.

దుర్భగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అదృష్టహీనుఁడు, దురదృష్టవంతుఁడు; 2. అందము లేనివాఁడు. [లేమిడి.

దుర్భిక్షము. సం. వి. అ. న. 1. కఱవు,క్షామము; 2.

దుర్మంత్రము. సం. వి. అ. పుం. 1. చెడ్డమంత్రము; 2. చెడ్డయాలోచన; చెడ్డసలహా. "వ...కర్ణశకుని

దుర్మంత్రంబు వట్టి గాంగేయునివచనంబు లప్రమాణంబులు చేసి..." భార. విరా. ౫, ఆ. ౩౬౭.

దుర్మతి. సం. వి. ఇ. పుం. ఒకానొకసంవత్సరము. స్త్రీ. చెడ్డబుద్ధి. విణ. (ఇ) 1. దుష్టబుద్ధి గలవాఁడు; 2. మూఢబుద్ధి గలవాఁడు.

దుర్మనసుఁడు. సం. విణ. (స్). 1. చెడ్డమనస్సు గలవాఁడు; 2. వ్యాకులమైన మనస్సు గలవాఁడు.

దుర్మనుఁడు. సం. = దుర్మనసుఁడు.

దుర్మరణము. సం. వి. అ. న. (విషభక్షణాదులచేఁ గలుగు) చెడ్డచావు, అకాలమృతి.

దుర్మరము. సం.=దుర్మరణము. [కాఁడు 2. శత్రువు.

దుర్మిత్త్రుఁడు సం. వి. అ. పుం. 1. దుశ్చరితపుచెలి

దుర్ముఖము. సం. వి. అ. న. దుష్టమైనముఖము. పుం. 1. గుఱ్ఱము; 2. ఒకానొకసంవత్సరము (దుర్ముఖి అని వాడుక.)

దుర్యశము. సం. వి. స్. న. దుష్కీర్తి,అపకీర్తి. "వ.... నీవు నంగనల నంగనాపూర్వుల నంగనాభిధానుల నంగనాకారులకు వధియింపకుండ వ్రతంబు పూనినవాఁడం గావున నంగనాపూర్వుం డగు శిఖండి నాకు ఖండనంబునం గోదండపాండిత్యంబు మెఱసి నను జంపను నోంపనుఁ గడంగితినయేని నింతకంటెను దుర్యశంబు గలదె ." భార. ఉద్యో. ౪, ఆ. ౪౦౦ [గానిది.

దుర్లక్ష్యము. సం. విణ. (అ. ఆ. అ.) చూడ శక్యము

దుర్లభము. సం. వి. అ. పుం. 1. కచోరముశీ; 2. గంట్లకచోరముశీ. విణ. (అ. ఆ. అ.) 1. పొంద శక్యము గానిది; 2. అతిప్రశస్తము; 3. ప్రియము.

దుర్వచము. సం. విణ. (అ. ఆ. అ.) చెప్ప శక్యము గానిది.

దుర్వర్ణము. సం. వి. అ. న. 1. వెండి, 2. నూఁగు దోసకీ; 3. కుష్ఠభేదము. పుం. చెడ్డరంగు. పుం. న. దుష్టమైనయక్షరము. విణ. (అ. ఆ. అ.) 1. చెడ్డ రంగు కలది; 2. చెడ్డయక్షరములు గలది.

దుర్వసము. సం. విణ. (అ. ఆ. అ ) వసింపరానిది.

దుర్వహము. సం. విణ. (అ. ఆ. అ.) మోయ శక్యము గానిది.

దుర్వాదము. సం. వి అ. పుం. 1. అపకీర్తి; 2. అప్రియములు పలుకుట; 3 నింద,అపవాదము; 4. అశాస్త్రీయ మైనవాదము.

దుర్వారము. సం. విణ. (అ. ఆ. అ ) వారింపరానిది.

దుర్విదగ్ధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. గర్వితుఁడు; 2. మూర్ఖుఁడు "వ. అనిన విని కీచకుండు...కల పోఁతలకుం జొచ్చి దుర్విదగ్ధుండు గావున నమ్ముగ్ధకుం దనసన్నిధిఁ గామవికారంబు పుట్టుట గలుగ భావించుచు..." భార. విరా. ౨, ఆ. ౧౨.

దుర్విధుఁడు. సం. విణ. (అ. ఆ. అ ) 1. దరిద్రుఁడు; 2. దుర్జనుఁడు; 3. నీచుఁడు, అధముఁడు; 4. మూర్ఖుఁడు.

దుర్వినీతుఁడు. సం. విణ. (అ. ఆ అ.) 1. వినయము లేనివాఁడు; 2. విద్యలయందు శిక్షితుఁడు గాని వాఁడు; 3. చెడ్డనడవడి కలవాఁడు.

దుర్విపాకము. సం. వి. అ. పుం ఈజన్మముననో పూర్వజన్మముననో చేసినకర్మములయొక్క చెడ్డ ఫలము, చెడ్డఫలము.విణ. (అ. ఆ. అ.) చెడ్డఫలము కలది.

దుర్విభేదము సం. విణ. (అ. ఆ. అ.) భేదింపరానిది. "వ.. ప్రతిపక్షదుర్విభేదప్రమాణ విచార్యమాణ పదార్థమీమాంసకగోష్ఠీవివాదనాదంబులకుం జేసి మ్రోయుచు .." భార. ఆది. ౪, ఆ. ౨౨.

దుర్వివేకము సం. వి. అ. పుం అజ్ఞానము, వివేకము లేమి. "గీ. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు, పరసతీసంగమము ధర్మపథ మునందుఁ,బరఁగువారలు పరిహరింపంగ గనియు,వినియుఁ దెలియని యది దుర్వివేక మగుట." భార. విరా. ౨, ఆ. ౬౯.

దుర్విషహము సం. విణ. (అ. ఆ. అ.) సహింప రానిది. "మ. జలదాకారత నొంచె జే రితఁడు పర్జన్యాకృతిం బొల్చె దో,ర్బలతీవ్రారినిదాఘదుర్విషహగర్వస్ఫూర్తి నిర్మూర్తి గాన్." భార. విరా. ౪, ఆ. ౧౫౧, భార. ద్రో. ౧, ఆ. ౩౪.

దుర్వేదము సం. విణ. (అ. ఆ అ.) 1. తెలిసికొన రానిది; 2. పొందరానిది.

దుర్హృదుఁడు. సం. వి. ద్. పుం. పగవాఁడు. విణ. (ద్) చెడ్డమనస్సు గలవాఁడు.

దులదుల. దే వి. 1. వెడలుట మొదలగువానియందలి శైఘ్ర్యానుకరణము. (సంధి)ముము అని శ. ర.) "క తెలతెలనయ్యెను దిక్కులు,పలుకుల నుడుగ ణము మాయఁబోలెను బక్షుల్,కలకలనఁ గూయఁ జొచ్చెను,దులదులఁ దుమ్మెదలు తమ్మితుటుముల వెడలెన్." వాంప. ౧, ఆ. ౧౩౭. యు. ౪, ఆ. ౨౨; ?. పొడి (చూ. దులదులనగు.)

దులదులనగు. దే. అ. క్రి. (దులదుల+అగు.) పొడి యగు. "గీ. కాలి దులదులనై పిండిపోలె రాలి, నట్టియుండేట్లు గలవు నీ వారగింప." కాశీ. 3, ఆ. ౫౮. పద్మ. ౯, ఆ. ౨౨౬. [ కాఁ బేలు.

దులి. సం. వి ఇ. పుం మని. ఇ, ఈ. స్త్రీ. ఆఁడు

దులుచు = దులుచు. (బ్రా.)

దులుపు. దే. స. క్రి. 1. దులుచు, రాల్చు; (ప్రక్కల నంటుకొన్నగింజలు మొదలగునవి.) ఊడిపడఁ జేయు. "గీ. గాడె కెలిచి చూచి కలదియ్య మున్నియుఁ,దెగిన నందుఁ జొచ్చి తిరుగువాఁడు, దుడిచి దులిపి యొక్కదోసెఁ డుండినఁ దెచ్చి, వారిజాక్షి వండి వారమోపె." భో ౬, ఆ ౧౯౫. (శ. ర. పా.) "గీ. ఆగదాదండ ముద్దండ మగుచుఁ దాఁకి, తోఁకవెండ్రుక లైనను దులు పదయ్యో." దశా. ౧, ఆ ౨౯౯; 2. జాడించు విదిలించు. "సీ. జడముడు లీడ్చిన సవరగా ముడు చుచు జలుఁగువన్నియలబొంతలు దులుపుచు." చెన్న. ౫, ఆ. 3౨౯; 3. మేలుకొనఁజేయు. "శా. మూలం గూర్కెడుపాఁపకన్న దులుపన్ మూర్ధాభిషేకంబునన్." పి. శకుం. ౨, ఆ. ౧౧౪; 4. నిందావాక్యములు పలుక. వ్యవ:—వానిని పట్టుకొని బాగుగా దులిపి విడిచిపెట్టినారు. (బ్రా. వా.)

దులుము. దే. స క్రి. సంఘటించు, కూర్చు (బ్రా.)

దువ. వై స. (సం. ద్వ.) రెండు. (శ. ర.)

దువారము. వై. వి. (సం. ద్వారమ్.) వాకిలి, ద్వారము. "సీ. కదళికాస్తంభముల్ కనకకుంభంబులు దల దువారంబులఁ దగులుపఱచి." రసిక. ౬, ఆ. ౧౯౯. అచ్చ. అయో. ౧౦.

దువాళము. దే. వి. వేగమున అంత మేరయు సమముగా పాఱెడిఅశ్వధార;ప్లుతము. "సీ....దువాళ మన దు. గీ. వాళి యనఁగను బ్లుతముగా వఱలుచుండు." అం. భా. ద్వి. ౧౯౭. నిరం. ౨, ఆ ౧౯.

దువాళి. దే.వి. 1.అశ్వధారావిశేషము, ప్లుతము. "శా. స్వచ్ఛాయన్ సుముఖున్ సహస్రకరుఁ గొల్వం బెట్టి పేలాడిపాళ,కేచ్ఛన్ గోడిగ లైయి దువాళిఁ జనిరొండ్..."వరాహ. ౫, ఆ. ౯౦; 2. పరుగు. "క. పాలికుఁడు నీవా యనుచుం, జలివిడిచి ప్రకాశ మెసఁగ శయములఁ గాళ్లం,బిలిపిల పెదు రుగఁ బఱచిన, నలగాడిదయున్ దువాళి నటిలికి వచ్చెన్." కేం. పంచ. 3, ఆ. ౫౦; 3. బోయలు పాలకీ మోయుచు పలుకుమాటలలో నొకటి. "వ...బెస్తలు ..పదిలము మించదుగు దువాళి ...అన విని సంకసిల్లి కంసారి .."ప్రబంధ.౬౦౫.

దువాళించు. దే. అ. క్రి. 1. ప్రసరించు. "మ... కొలువుం జాలించి తాఁ బోయె భూపురవీథుండు మనంబు హేమవతిపై బాళిం దువాళింపఁగన్." హంస. ౧, ఆ. ౭౭. నీలా. ౨, ఆ. ౪౯; 2. వేగమునొందు. "శా. సంపెంగ ల్పరు వంది క్రొవ్విరులచే శంపాలతాలక్ష్మి నొందింపం బాద పము ల్ఘనంబు లయి పూఁదేనె ల్దువాళించి వృష్టిం పన్ వల్విరి చల్లి .."పి శకుం. ౨, ఆ. ౧౨౭. స. క్రి. 1.(అశ్వాదులను)ప్లుతగతివిశేషముతో నడి పించు, దువాళము చేయించు; పరుగెత్తించు. "ఉ ..భామాయించిన నేల గ్రక్కదల నిట్టటుగా వడిఁ ద్రొక్కుచున్ దువాళించిన గట్టు గు ట్టనక లెక్కకు మిక్కిలిదవ్వు వాఱుచున్." య. ౧, ఆ. ౯౨. వరాహ. ౫, ఆ. ౧౧౯; 2. ప్రస రింపఁజేయు, వ్యాపింపఁజేయు. "మ...మించుల్ దువాళించు క్రొమ్మెఱుఁగుంజెంద్రికకావిపట్టు సుర భూమీజార్పితం బిచ్చె .."వసు. ౫, ఆ. ౯౪. కాశీ. ౨, ఆ. ౬.

దువాళిసేయు. దే. స. క్రి. (దువాళి+చేయు.) పరు గెత్తించు, తఱుము. "శా. ప్రాలేయంబు దువాళి సేసిన భయభ్రాంతంబులై యూష్మముల్, వాలా యంబుగఁ బ్రాఁకె నంధ్రపనితావతోజశైలాగ్ర ముల్." క్రీడా. ౪౯. ప్రబంధ. ౭౪౨.

దువ్వ. దే. వి. ధూళి దుమ్ము. "శా. ప్రొవ్వుల్ గాఱుచు నీచుకంపు తఱచుర్ రోఁతై తఱిం బాసి పెల్,దువ్వన్ బ్రుంగినగర్దభాస్థిఁ దినుచున్..." మల్లభూ. నీతి. ౯. అం. భా. ద్వి. ౨౭౯; 2. పుష్పాడి, పరాగము. "చ...వచ్చెఁ గ్రొవ్విరి రవదువ్వచాల్ గొని దివిన్ మలయాచలవాతపోత ముల్."చంద్రా. ౪, ఆ. ౯౦. అవాన్యా. ౨, ఆ. ౧౧; 3. కణము, పలుకు. "చ. కపురపుఁదక్క దువ్వల సగంబున కెక్కువ గాఁగ కూర్చి గంధ పొడిమి తాఁ దావులు కనంబడఁ జేర్చిన నర్మభస్మము ..."పార్వ. ౨, ఆ. ౫.

దువ్వటము. వై. వి. (సం. ద్విపటీ.) విలువగలదన్ని వస్త్రము. "సీ. బంగారునరిగంచురంగు నుగ్గడితంపుఁ

చిలిదువ్వటము చెళచెళల నీన." ఘటికా. ౨, ఆ. ౧౬. బహు. ౫, ఆ. ౧౧౯.

దువ్వలువ. వై. వి. (దువ+వలువ.) 1. విలువగల సన్నని వస్త్రము. "గీ. వనితయొక్కర్తు మేలుదువ్వలువ దెచ్చి. సొరిది గట్టంగ..." కాళిందీ. ౫. ఆ. ౯౫. పారి. ౨, ఆ. ౧౨; 2. వస్త్రము "సీ. వైష్ణవి తోలుదువ్వలువ ముడిచె." హర. ౪, ఆ. ౭౬. (తోలుదువ్వలువ = చర్మాంబరము.)

దువ్వాటము. దే. విశే. డోలాందోళితము, ఇటునటు పాలుపోనిది. (ముకున్న. బ్రా.)

దువ్వాళి. దే. వి. పరుగు. "ద్వి. బారుగా నిలిచిన పారసీకము ల,వారశాంబులును దువ్వాళి సేసేర." ప్రభు. ౫, ఆ. ౧౪౩, పు.

దువ్వి. వై. వి (సం. ద్వీపి.) 1. పెద్దపులి. (శ. ర); 2. చిఱుతపులి. "సీ. దవ్వులు లేచులు చివ్వంగు లడివపుమెకములు సవరపుమెకము లిర్లు." రసిక. ౧, ఆ. ౧౬.

దువ్వు. రూం. దే. స. క్రి. జాట్టు. 1. చిక్కుదీయు, చక్కఁజేయు. "గీ. చెలువ చిత్రాళి పాళిగాఁ జికురభరము, సరసత ధరించెఁ జంపకచ్ఛాయ డాయ, ననుదు నఖరోచు లంకట నలరుచుండఁ, గొవ్వు దువ్వెను గోవిందుఁ డొవ్వ మీఱ" కాళిందీ. ౬, ఆ. ౫౯. అము. ౫, ఆ. ౩౭, ౭. వాత్సల్యముతో స్పృశించు, నిమురు. "క. అన సార మెఱుఁగ సేర్చితె తనయా యని చుంచు దువ్వి తద్దయు ప్రేమ ముున..." దశా ౪, అ. ౧౫౬; 3. (పలపుచే) స్పృశించు, పుణుకు. "గీ అమరికకు మెచ్చి కెమ్మోవి యాన నిచ్చు, నాని కల నిచ్చు సరిపల్కు మని యడల్చు,గేళిఁ బద లితె పని నవ్వుఁ గేల దువ్వు, బాల గిటితోన్న బాళి పుంభావకేళి." కళాం. ౩, ఆ. ౧౧౨; 4. బుజ్జగించు, మంచిమాటలాడు. వ్యవః—వానిని దువ్వి తనపనిఁ జేయించుకొనుచున్నాఁడు. వై. వి. (సం. ద్వీపి.) 1. పెద్దపులి. "అ. ఈశువరము చేత నివ్వఁడే నిప్పాట, నూరుఁ డైన దువ్వ జూచి నక్క, యొదలు గాల్చుకొన్నవదువున మీ రంతసావుమాటలాడ లజ్జ గాదె." ఉ. హరి. ౪, ఆ. ౧౬౫; 2. చిఱుతపులి. "సీ...ఒకదువ్వ వైర మెత్తి, గీ. కలువ వచ్చిన నమ్మునికరముఁ బాఱు,తెంచె నాముక్క..." భార. శాం. ౩, ఆ. ౯౨.

దువ్వెన. దే. వి. (దువ్వు. ధా.) దువ్వుట కుపయుక్తమైనసాధనము, కంకతిక. "క...కుంతలము దీర్పఁగఁ గొను, దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్" స్వా. ౩, ఆ. ౨. కువల. ౪, ఆ. ౧౩౭.

దుశ్చరము. సం. వి. అ. పుం. 1. ఎలుఁగుబంటి; 2. కప్పచిప్ప, శంబూకము. విశే. (అ. ఆ. అ.) 1. చేయరానిది; 2. చొరరానిది; 3. దుష్టముగా చరించునది.

దుశ్చేష్టితము. సం. వి. అ. న. తప్పుపని, దుండగము. విశే. (అ. ఆ. అ.) దుష్టమైనచేష్ట కలది.

దుశ్చ్యవనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు. "సీ. పొమ్ము దుశ్చ్యవన నీపోయెడుతెరు వన్న నాతండు నవ్వుచు నతనిఁ జూచి." భార. శాం. ౪, ఆ. ౩౯౨. [సాధ్యము కానిది.

దుశ్శకము సం. విశే. (అ. ఆ. అ.) అశక్యము,

దుశ్శకునము. సం. వి. అ. న. అపశకునము.

దుష్కరము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చేయుటకు శక్యము కానిది, 2. చేరి కందనిది. "చ...ఇట్టి మీకు దుష్కరముగ నూతిలోఁ బడిన కాంచనవీటఁ గొనంగనేర కొం,డొరులమొగంబు సూచి నగుచుండఁగఁ జన్నె యుం పాయహీనతన్." భార. ఆది. ౫, ఆ. ౨౧౦.

దుష్కీర్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ) అపకీర్తి గలవాఁడు. "ఉ...దుష్కీర్తను గొల్లచేటులును గిట్టి హరించు ననండె తొల్లి భర్తార్తిహరుండు నాఁ బరఁగునంబుజనాభు జగద్ధితంబుగన్." భార. అర. ౭, ఆ. ౭౯౪.

దుష్ట. సం. వి. ఆ. స్త్రీ. 1. దుష్టస్త్రీ; 2. లంజె.

దుష్టము. సం. వి. అ. న. దోషము. విశే. (అ. ఆ. అ.) 1. చెడ్డది; 2. అధమము, తక్కువైనది; 3. దోషముతోఁ గూడినది; 4. దుడుకైనది, దుండగము గలది.

దుష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. దోషము; 2. చెడుట.

దుష్పాకము. సం. వి. అ. పుం. దుష్ట మగుపాకము, అధికపాకము ? "ఉ...వీతాంకమునఁ దిలాపదర పోసుఖంబుల కిచ్చ నొంది దుష్పాకము లాచరించి తుది బాధలఁ బొందితి నేమి చెప్పుడిన్." సానందో. ౨, ఆ. ౨౭.

దుష్పక్షము. సం. వి. అ. న. కృష్ణము. "క. విధురేఖామాత్రపుఁ జం,ద్రునియట్టులజీవుఁ డకనిదుష్పక్షముఁబో,లినయజ్ఞానము..." భార. శాం. ౫, ఆ ౧౩౦.

దుష్పత్రము. సం. వి. అ. పుం. 1. దుష్టమగు పత్రము; 2. నల్లకచోరము. విణ. (అ. ఆ. అ.) చెడ్డ యాకులు గలది.

దుష్పథము. సం. వి. అ. పుం. అధర్మము, అన్యాయము. "వ ..దుష్పథవర్తను లగుదుర్యోధనాది కుమారుల వారించి .." భార. భీష్మ ౧, ఆ. ౧౨. భార. అర. ౩, ఆ. ౭౪.

దుష్ప్రారంభము. సం వి. అ. పుం. దురుద్యమము, దౌష్ట్యము. "క. కౌరవసభఁ దానాడిన, గౌరవవాక్యములు కార్యఖడ్గక్రమవా,క్ప్రాగములు సురోధకుడు,ప్రారంభము నల్పవచనబద్ధలెఁ జెప్పెన్." భార. ఉద్యో. ౪, ఆ. ౧౦.

దుష్ప్రీతి. సం. వి ఇ. స్త్రీ. 1. దుష్ట మగుప్రేమ, కూడనిప్రేమ; 2 అసంతుష్టి.

దుష్వ్యల్. సం. శత్ర. చెడుచున్న, నీచులగుచున్న. "ఉ... ఉచితంపుఁబలుల్ దగఁజేయఁ గాక దుష్వ్యత్పరివారయోగ్యపరిచారముపైఁ జనునట్టిదానవే." భార. విరా. ౨, ఆ. ౯౩.

దుసరులు. దే. వి. బ. అతిశయము. (చూ. దుసరులు వాఱు.)

దుసరులువాఱు. దే. అ. క్రి. (దుసరులు+పాఱు.) శ్రేష్ఠమగు, అతిశయించు. "ద్వి. మిసిమిసిలంపులు మేసి తాఁ గ్రొవ్వి, దుసరులువాఱి గంతులుగొను లేళ్లు." నవ. ౧, ఆ. ౪౭, పు.

దుసికిలఁబడు. ద్వ అ. క్రి. (దుసికిలన్+పడు.) జాఱు. "క. కలకంఠకమ్రగాత్రలు, గలవాటకుఁ జవులుం దెలుపఁ గలకంఠమునన్, బెళుకంటఁ జెలఁగఁ జెలి బం,తులఁ గొంటఁ బయంటచెఱఁగు దుసికిలఁ బడియెన్." బహు. ౪, ఆ. ౩౨.

దుసికిలఁబాఱు. ద్వ. అ. క్రి. (దుసికిలన్+పాఱు. స్వార్థమున.) జాఱిపోవు, నళించు. "చ. దుసికిలఁ బాఱు చీఁకటులు దూఁగొనుచుండెడు కీలుగం టుపైఁ బసపాసరించి .." హంస. ౪, ఆ. ౫౫.

దుసికిలు. దే. అ. క్రి. (దుసుకు ధా.) 1. జాఱు. "గీ...కెంగేలఁ జెఱకువిల్లుఁ, బూవుటమ్ములు దుసికిలి భూమిఁ బడిన,గుగుడఁ డెంపునఁ గైకొను మరునిఁ జూచి." పార్వ. ౩, ఆ. ౩౭. నిరం. ౨, ఆ. ౨౧.

దుసుకు. దే. అ. క్రి. జాఱు. "చ ఒసపరి గబ్బిగుబ్బ గవయుబ్బునఁ గొనసిరూడఁ గ్రమ్మెడిన్, దుసికి పిఱుందుపై నరులు తుంపెసలాడ..." ముకుంద. ౩, ఆ. ౨౪౩. వి. ఊదుటు, ఔన్నత్యము. "సీ. ఉసికొల్పి పంచించి దుసుకులచపుడోయి చేనంటు..." రాధికా. ౧, ఆ. ౧౨౪.

దుస్తరము. సం. వి. అ. పుం. ఆపద. "చ...ఇట్టి దుస్తరం,బునఁ దగులావు సేయ మముబోఁటులు లేరె చలంబు డింపు మీ,వని పలితోడఁ జెప్పి సరిదార్ఢ్యముఁ దప్పుడు ప్రాధవంబునన్." భార. భీష్మ. ౩, ఆ. ౧౩౮. విణ. (అ. ఆ. అ.) 1. తరింప శక్యము గానిది, దాఁట రానిది; 2. మీఱ రానిది.

దుస్తు. దే. వి. 1. వస్త్రము, బట్ట. "సీ. శుభశోభనముల దుస్తు లొసంగ వెన్క-ముందులకు నట్టెలు సేయఁ గలరు గాక." చంద్రా. ౩, ఆ. ౪౫; 2. అందము. (శ. ర) విణ. అధికము. "శా. అస్తోకక్రతు హోమధూమములచాయల్ తీర్థకుండంబులన్ దుస్తైతోఁపఁగఁ జూచి .." చంద్రా ౩, ఆ. ౭౯.

దుస్త్యజము. సం. విణ. (అ. ఆ. అ.) విడువఁ గూడనిది.

దుస్సంచరము. సం. వి. అ. పుం. చెడ్డసంచారము. విణ. (అ. ఆ అ.) సంచరింప సాధ్యము కానిది. "క. ఇరువాఁగునకుం గయ్యము,కర మద్భుతభంగి నమరెఁ గరిహయసుభట, స్ఫురితాంగశకలచయదం,తురమై ధరిత్రి దుస్సంచర గాన్." హరి. పూ. ౪, ఆ. ౧౩౯. రూ. దుస్సంచారము.

దుస్సర. దే. వి. సుదర్శనలత. "సీ. దుస్సర యనఁగ సుదర్శనలతపేరు దనరుచుండు." ఆం.భా. ద్వి.౩౫.

దుస్సాధము. స. విణ. (అ. ఆ. అ.) సాధింప శక్యము గానిది. "శా. నాకుఁ బరమోత్సాహంబు సంధిల్ల దుస్సాధం బైనవిరుద్ధకార్య మిటు లాసన్నంబుగా సంఘటిం,తే..." భార. విరా. ౨, ఆ. ౨౭౫, ౪, ఆ. ౨౦౩.

దుస్స్థము. సం. వి. అ. పుం. 1. కోఁడి; 2. కుక్క. విణ. (అ. ఆ. అ.) 1. నిలుకడ లేనిది. 2. ఆరోగ్యము లేనిది; 3. చెడ్డస్థితిలో నుండునది.

దుస్స్మరము. సం. విణ. (అ. ఆ. అ.) స్మరింప శక్యము గానిది.

దుహిత. సం. వి. ఋ. స్త్రీ. కూఁతురు, పుత్త్రిక.

దుహిలీ. దే. వి. వస్త్రాభరణవిశేషము. "ద్వి. తోరంపు వజ్రాలదుహిలీలడాలు, పేరంపుఁ గెంపులపిడివీఁదఁ దిరుగఁ, గరపద్మమున మించుగ మెఱుంగుచ్చు, సురటువట్రువ గాలి సుడియంగఁ ద్రిప్పి" నవనాథ. ౧, ఆ. ౬౩, పు.

దూ

దూఁకలి. వై. వి. ఔ. (సం. దుఃఖమ్) బాధ. "క. అఁగొంటి కిన్ని దినములు, పోఁకంతయు భిక్ష పెట్టఁ బుట్టకయుండెన్, ఆఁకటిదూఁకట కలఁగితి, కేఁకట వాయంగ భిక్ష లిడిరొద రండీ." భీమ. ౨, ఆ. ౧౨౪. ద్వి. శ. సా. ౧, ఆ ౩౦, పు.

దూఁకు. దే అ. క్రి. ఉఱుకు, గంతువేయు. "చ .. చెట్టి వగ దూఁకొని మింటికి దూఁకె దూఁకినన్, గెలువు కపుత్త్ర యీయసుర గెల్వకమున్న..." కళా. ౫, ఆ. ౧౯౦. దశా. ౪, అ. ౨౩౨.

దూఁకుడు. దే. వి. (దూఁకు ధా.) 1. అశ్వగతివిశేషము, వల్గితము. "సీ. చౌకళింపఁగను దూఁకుడనంగను వల్గిత మ్మగుచు .." అం. భా. ద్వి. ౧౯౯; 2. త్వర తొందర. వ్యవ.—నీవు దూఁకుడు తగ్గించుకొనవలెను. విణ. ఎగుడుదిగుడు. (శ. ర.)

దూఁకొను. దే. అ. క్రి. (దూఁటు+కొను.) 1. కలుఁగు, జనించు. "చ. శిలలు గరంగెఁ దర్వులను జేపఱెఁ బల్లవలక్ష్మి తత్క్షణం, బుత్తులఁ గలబొమ్మలం గరము దూఁకొనె జీవితమచ్ఛికంబుగన్." ఉద్భ. ౨, ఆ. ౧౫౩. పరమ. ౫, ఆ. ౨౦౬; 2. అతిశయించు. "క .. రమా వరుఁ డంబుదగంభీరము, ధురభావలఁ బల్కెఁ బ్రియము దూఁకొనుచుండన్." భాగ. ౪, స్కం. ౭౦౪; 3. తలఁచు, భావించు. "ఉ. మీకరుణావలోకనపమేతులఁగా మముఁ జేయఁ జిత్తముల్, దూఁకొనెనేని... దానను శుభం బగు మీఁదిమదీయజన్మముల్." భాగ. 3, స్కం. ౫౩౧; 4. లోనికిఁజొచ్చు, "చ. దుసికిలఁబాఱు చీఁకటులు దూఁకొనుచుండెడు కీలుగంటువై, బన పొసరించు..." హంస. ౪, ఆ. ౪౦. స. క్రి. 1. పొందు, ప్రాపించు "మ...మమ్ము మాదురితం బింతయుఁ బాప్పె మీఁద శుభముం దూఁకొందు మే మారయన్." భాగ. 3, స్కం. ౫౭౯. హరి. ఉ. ౬, ఆ. ౧౦; 2. ఆవరించు. "చ. పొగ సొగయంగ ముద్దుచెలిపొందికకాటుకకంటికొనలన్, దిగిరొదునశ్రుబిందులయఁ దీర్ఘరుచుల్ దలపించు నీలపున్, జిగిదీఁగ గాంచుముత్తియపుఁజిప్పల లోపలనుండి వచ్చుపే, తుగుణము లైనముక్యములు దూఁకొనుకప్పుకొఱుంగు పొంగుసన్." కాళిందీ. ౫, ఆ. ౧౩౦; 3. స్వీకరించు, గ్రహించు. "చ. అహిమరుచిప్రతాపుఁ డగుసాహుకవాహుఁడు బ్రహ్మదత్తుకై, దుహితృశతంబు నీ నతఁడు దూఁకొని వారిఁ గ్రమంబునం గరగ్రహణముసేయ..." భా. రా. బాల. ౩౨౨. [వా.)

దూఁటు. దే వి అరఁటియూచ, దవ్వ. (శ. ర. బ్రా.

దూఁటిపుచ్చు. దే. స. క్రి. (దూఁటి+పుచ్చు) తిరస్కరించు. "సీ. తేఁటిమొత్తము నేపు దూఁటిపుచ్చఁగ నొప్పుకమనీయనీలాలకములు చూచి." పి. శకుం. ౨, ఆ. ౧౪౦.

దూఁటు. దే. అ. క్రి. 1. చొచ్చు, ప్రవేశించు. "చ. జలనిధిలోన దూఁటి కులశైలము మీఁటి ..." దా. శ. ౩౩, 2. తప్పించుకొను. "శా. తానే దొంగిలి గిన్నె శిష్యవరుచేతం బంచి చౌర్యంబు బై, లైనం దూఁటి చనంగ నేరమిని..." విప్ర. ౫, ఆ. ౬౨. సా. ౧, ఆ. ౧౦౨. స క్రి. 1. పొడుచు. "వ. తల్లులం దూఁటి కుడుచుతరకి దూడలు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౧౯౬. దశా. ౨, అ. ౩౨౪; 2. దాఁటు, లంఘించు. "గీ. ఏడుపాతాళములు దాఁటి యిలయుఁ దూఁటి, యంబరము దాఁకె నవ్వనుణాంబుధార" కాశీ. ౫, ఆ. ౧౩౯. వి. పొడవు. "సీ పొడుగుదూఁటులు మాని యొదిగి క్రేపులగుంపు జననీనికాయంబుచాటుఁ జేర." శుక. ౨, ఆ. ౩౪౨.

దూఁటుకట్టు. దే. అ. క్రి. (దూఁటు+కట్టు.) నిండు, వ్యాప్తమగు. "సీ. కంఖాణతురగరింఖాఖురాజిత కుమాధూళి నభ్రోక్షంబు దూఁటుకట్టు." వరాహ. ౫, ఆ. ౨౭. కు. సం. ౧౨, ఆ. ౧౪౦.

దూఁటుకొను. దే. అ. క్రి. (దూఁటు+కొను.) ఎగురు, వ్యాపించు. "వ ... వానివదనవిశ్వాసపవనంబు భువనంబున ధూమదహనజ్వాలాభీలంబై సంవర్త రంబున కొక్కమాఱు వెలువడి భూనభోంతరం బెల్లను నిరంతరపిశితాశనజాటులంబు దూఁటుకొనం జేయు." భార. అర. ౪, ఆ. ౩౯౪.

దూఁపిడి. దే. వి. (దూయు+పిడి.) మాలు తోడు నపుడు చీడు తగిలించుటకు నిలిపెడికఱ్ఱ మమర్చిన కొయ్య." (శ. ర.)

దూగము. దే. వి. 1. కలుదూఁకుము. (శ. ర.); 2. ధాన్యాదులలో నుండుదుమ్ము. (బ్రా. వా.)

దూగిలాట. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. గోట ద్రోద్ధుకాయ గొబ్బిళ్లు మోపిళ్లు నీగపోగిన బంతి దూగిలాట." హంస. 3, ఆ. ౧౪౬.

దూచి. దే. వి. బాలక్రీడావిశేషము. 'సీ. దూచియుఁ జాబిల్లి బూచి కన్నులకచ్చి గుడుగుడుగుంచాలు కుందెనగిలి." హంస. 3, ఆ. ౧౪౬.

దూడ. దే. వి. 1. పశుశిశువు, లేఁగ. "చ. అలయక లేడి దూడగుమి నాఁగెడుక్రొల్వులులన్ వధించు..." ఉ. రా. ౭, ఆ. ౪౧౭. సా. పంచ. ౫, ఆ ౧౧; 2. ఇది నిందయందు మనుష్యశిశువులకుఁ బ్రయుక్తమగును. "సీ. పడుచుదూడలచేత పనియాశపీ కేల యనసూయఁ దోఁతేరఁ బనుపరమ్మ." కువల. ౨, ఆ. ౨౬ బ. పశువులు. "క. తలిదండ్రులయనుమతి దూడలఁ గాయఁగఁ బూని ..." చెన్న. 3, ఆ. 3౧.

దూడలపోలిగాఁడు. దే. వి పక్షివిశేషము. (బ్రా.)

దూడపాల. దే. వి. (దూడ+పాల) గోపిక, వృక్షవిశేషము. "సీ...దూడపాల యన గోపికాఖ్యయై పరఁగుచుండు .." అం. భా. ద్వి. ౫౭.

దూదుగ. దే. వి. వృక్షవిశేషము. (బ్రా.)

దూత. సం. వి. అ. పుం. 1. రాయబారి. "క. తన కడకు వచ్చి మొగమోడనివాఁ డగుదూత పల్కుటకుఁ గోపింపంజనదు .." భార. శాం. ౨, ఆ. 3౭౯. శశాం. ౪, ఆ. ౨౦౦; 2. కుంటెనకాఁడు. "గీ. అనిలుఁ డనుదూత వోయి తోడ్కొనియుం వచ్చె ... అతిపరిక్రాంతుఁ డైనయుయూతి నంత." భార. ఆది. 3, ఆ. ౧౫౬.

దూతము. సం. వి. అ. న. పరితాపము.

దూతి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాయబారము చేయుం స్త్రీ; 2. కుంటెనకత్తె.

దూతుఁడు. సం. = దూత. (రాయబారి.) "చ. అనుటయుం దేవదూతుఁడు రయంబున నిర్జరనాథుపాలికిం జని తెలియంగఁ జెప్ప..." భార. స్వర్గా. ౨౯. భార. శాం. ౨, ఆ. 3౭౯.

దూత్యము. సం. వి. అ. న 1. రాయబారము; 2. దూతధర్మము.

దూది. దే. వి. విత్తు తీసిన ప్రత్తి, తూలము. "శా... పీచౌ గాద్పు దాఁకఁ దిశల్, దూదుల్ దూలిన యట్లు తూలుటయుం నింద్రుం డాదిగా దిక్పతుల్." రామా. ౯, ఆ. ౯౧. స్వా. ౪, ఆ. ౯౯.

దూదిదబ్బ. దే. వి (దూది+దబ్బ.) తోలు దళసరిగా నుండుదబ్బ. (శ. ర.) [(శ. ర. బ్రా.)

దూదినిమ్మ. దే. వి. (దూది+నిమ్మ) మాతులుంగము.

దూదిమడుఁగు. దే. వి. (దూది+మడుఁగు.) భక్ష్యవిశేషము. "సీ. అప్పడాలకొటారు లమృతఫలాదులు వడలకుప్పలు దూదిమడుఁగు గిరుట." శ్రీరం. మా. ౬, ఆ. ౧౧౦.

దూదేకు. దే. వి. (దూది+ఏకు) తురకలలో నొక జాతి; ఆజాతివాఁడు. "గీ. ఎనుగు బిజారి సాఁగ దూదేకువాఁడు." అం. భా. ద్వి. ౨౯౪.

దూనము. సం. విశే. (అ. ఆ. అ.) 1. సంతాపము నొందినది; 2. బడలినది, పరిశ్రాంతము.

దూప. దే. వి. 1. దప్పి, తృష్ణ. "క. అద కొలను దూర్పుదెసః కొన్నొదవెడు నట కేఁగి దూప యుడుగఁగఁ దెలినీరు దగఁ గ్రోలిటు రమ్మా..." అచ్చ. యుం. ౪౧౫. అం. భా. ద్వి. ౨౬౦; 2. శ్రమము. "సీ. వికటంపుటెలుకలవిసరున నుబ్బొంగు తుప్పరడెందంబు దూపడంగ." హరి. ఉ. ౫, ఆ. ౧౪౯; 3. పరితాపము; "గీ తనయునుఁగుఁగూన చెఱినుంటఁ ఎఁడచి వెతలఁ, దూలు సేలపొలంతుకదూప యడఁప, మొగిలుకడవల జేజేలు ముంచినించు, వలిచదలువాఁకసీ రన వాన లెసఁగె." అచ్చ. కిష్కిం. ౬౨.

దూపటించు = దూపటిల్లు. (బ్రా)

దూపటిలు. దే. అ. క్రి. 1. దప్పిగొను. "ద్వి. కడు దూపటిలి యుదకంబులు గ్రోలఁ, దడయక యచ్చోటిదరి కేఁగుదెంచి .." నవనాథ. 3, ఆ. ౨౦౯. పు. రామా. ౬, ఆ. ౨౪౯; 2. శ్రమపడు, అలసటనొందు. "వ... పతులప్రార్థనంబులం బుంభావసురతాడంబరంబునకుం దోడుసూపి దూపటిలి..." స్వా. 3, ఆ. ౨౯. రామా. ౯, ఆ. ౧3౫; 3. పరితపించు. "వ. విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి విసికి విసిమాలి వెసరి యలసి యూరటఁ బొంది సొలసి జాఁకించి తూలి దూపటిలి యుల్లంబునఁ గ్రోధం బుద్భవించిన." భీమ. ౨, ఆ. ౧౦౧.

దూపటిల్లు = దూపటిలు. (దప్పిగొను.) "చ...ను, స్థిరముగ దూపటిల్లె మునిశిష్యుఁడు సేదు భవ

క్కమండలాం,తరకమనీయ దివ్యజలధారల శీవముం బ్రోతువేని.." కంచిశరభకవి హారిశ్చంద్రో పాఖ్యానము. 3 ఆ. ౧౦౫. (బ్రౌ.)

దూపట్టు. దే. అ. క్రి. (దూప+పట్టు.) అలయు, శ్రమపడు. 'సీ. దూరంబు వచ్చిన వారిట సైన్యంబు ప్రజలెల్లఁ జాల దూపట్టినారు." వి శతం. ౧, ఆ. ౧౨౩.

దూపము. వై. వి. (సం. ధూపః.) పొగవేయు సుగంధ ద్రవ్యము. "సీ. తఱచుగాఁ బెట్టినతావి దూపపుఁ బొగల్ గుంపులై మెలఁగుమొగుళ్లు గాఁగ." య. ౪, ఆ. ౧౫౩.

దూపాడు. దే. అ. క్రి. ఆటించు. (బ్రౌ.)

దూపాత్రి. వై. వి. (దూపము+అత్రి.) దూపముపెట్టు పాత్రవిశేషము. (శ. ర. బ్రౌ.)

దూపించు. యు. దే. అ. క్రి. అలయు,శ్రమనొందు. "క. క్రేపుఁ దలఁచి కసిమేయుచుఁ,జేపిన పాల్గలయు నొందచేఁ బొంగజనుల్,దూపింపమి కఱుఁ దంకిన,యూపాగా యనఁగ నదుల నంచలు మెఱసెన్." ఆము. ౪, ఆ. ౧౬౮. వై అ. క్రి ధూపము వేయు. "ద్వి. అగలు దూపించిన నల రులు దుఱిమి,మృగమదపంకంబు మెయినిండ నలఁది." నవనాథ. ౨, ఆ. ౭౪. పు.

దూపిడు. దే. స. క్రి. (దూప+ఇడు.) అలయించు, శ్రమపెట్టు. "ద్వి. తొమ్మిదియమ్ముల దూపిడ్డవానిఁ, గొమ్మని గిరియెత్తుకొని వైచె నతఁడు." రం. రా. యు. 3౫౫.

దూపిలు. దే. అ. క్రి. 1. దప్పిగొను. "ఉ...తాపస పుత్త్రుఁ డాశ్మవి,ద్యాసముదగ్రులై నక్షలిచంద్రులు దూపిలి యుండ వారలన్,గాసిలకుండఁ గుండ సుదకంబుల ముంపఁగ .." రామా. ౨, ఆ. 3౬. చమ. 3, ఆ. ౧౨౮; 2. అలయు,శ్రమనొందు. ఉ. దూరము పోయి యెండఁ బడి దూపిలి వచ్చిన ప్రాణనాథునిన్,ద్వారకవాటగేహములదాఁక నెదురొక్కని నిర్ధమార్చి యుపారము పెట్టి..." కాశీ. ౨, ఆ. ౮౧; 3. పరితపించు. "గీ బెదరుఁ గన్నీరు నించు దూపిలుఁ గృశించుఁ,బంచశరఘోరశరచూత భల్లభగ్న,మానసాంభోజ యగుచు నమ్మంజువాణి." రసిక. ౪, ఆ. ౮.

దూపుకొను. దే. అ. క్రి. దూపించు. (బ్రౌ.)

దూబ. దే. వి. 1. నపుంసకుఁడు,మందుఁడు. "సీ. పంద యనంగ దూబ యనంగఁ జేడి నా మంద నామం బుగాఁ జనుచు .." ఆ. భా. తృ. ౪౫; 2. అప లక్షణము. "సీ. అవలక్షణాభగాఖ్య లలరు దూబ యనంగ..." ఆం. భా. తృ. ౪౫; 3. ఆఁడు గుఱి, భగము. ఆం. భా. తృ. ౪౫; 4. దిబ్బ, ఎత్తుప్రదేశము. "సీ ఎలమావిజొంపముల్ బలసిన కొత్తమ్మికొలనితోఁపలిదూబ నెలమిఁ బొదలి." కు. సం. ౫ ఆ. ౧౪౮. విణ అధముఁడు. "సీ. ధృతికి నెదంబు నెప్పెడిదూబ వేదనింపకఁడు విమోహి పాతంబు గనుట. గీ. మాచి పెశకంధరుఁడు శల లూచి మఱితఁ" ఉ. రా. 3, ఆ. 3౨౫.

దూబఱ. దే. విణ. వ్యర్థము; అధికము. వ్యవ — గా బఱఖర్చు చేయరాదు.

దూబఱతిండి (దూబఱ+తిండి.) 1.ఎక్కువగా వెచ్చించి తినువాఁడు. "సీ ఓగు దూబఱతిండి యోాచవాఁ దపలక్షణములాఁడు గోలప్రాత్యము బజారి." హంస ౫, ఆ ౧౧3. ద్వి. భల్లా. ౨, ఆ 3౮. పు. 2. అశ్రమముగా లభించినతిండి తిని జీవించువాఁడు, తేరదిండికాఁడు. "వ...రుద్రా నీవు భద్రదేవద్రుమాటవీ వాటియందు దిసమొల దూబఱతిండిమిండజాలవై ... భిక్షాటనక్రీడను నటించితి .."భీమ. 3, ఆ. ౨౧౧.

దూబూచి. ద్వి. వి. (దూయు+బూచి. 'దోబూచి' అని బ్రౌ వా.) 1 బాలుర నాడించుటయం దశెడు మాట కనుకరణము. "గీ కనుమొఱంగి చెలుల్ మఱుఁగున నడంగి,తొంగి చూచి దూబూచి యన్నం గికాకి,కన్నగఁ గుమారఁ గొఁగిట గార వించి." సా. ౧, ఆ. ౪౯. 2. బాలక్రీడావిశేషము. (శ. ర.) "సీ. పచ్చగాజినుఁగుఁగ్రొంబనులసోఁరణ గంద్ర బుడిబుడిఁ బొదవి దూబూచు లాడి." చంద్రా. ౧, ఆ. ౪౭.

దూముడి. దే వి. (దూయు+ముడి.) కొఱముడి. "ఉ. కంగులదాల్ చెలంగుఱవికల్ సడలించి చెఱంగులంగరన్, రంగు లినుంగువల్వలు తెర ల్చుచుఁ బావడదూముడిన్ గళల్, సింగపుఁజిన్ని కౌనులను శిక్కగదించి బిగించి కాంతు లు,ప్పొంగెడి పేసులం దుదుటుభూములు గొబ్బి దొలంగఁ జేసినన్." ఉ. హరిశ్చ. 3, ఆ. 3౪.

దూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తపించుచున్నది; 2. తపింపఁజేయఁబడుచున్నది. "వ. ఇవ్విధంబున మదనవేదనాదూయమానమానసుం డగుచు నిట్లని వితర్కించు." భార. విరా. ౨, ఆ. ౨౯౪.

దూయించు. దే. స. క్రి. (దూయు ధా. ప్రే) దూయఁజేయు వా-చాఁకు గుచ్చుచున్నాను.

దూయు. దే. అ. క్రి. 1. రంధ్రముపడు. "ఆ. వజ్రముఖుండు దివ్యశరమున ఘననితంబుబాహు దూయ నేయఁ బాలకెల్లి,గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప..." భాగ. ౧, స్కం ౨౬౧. 2. చొచ్చు, తటాకించు "గీ తూకొనెను వచ్చెఁ జొరఁ బాతెఁ దూఱె దూసెనన దటాకించె నన మాట కర్థమగును." ఆం భా. శ్రీ. ౧౨౨; 3. వెళ్లు. "ఆ ..కల్లపనులు చెప్పక యొండొరుల్ గాసి రింద్ల కాకు దూసిట్లు" రుక్మి. ౧, ఆ. ౧౧౧; 4.(బాణము మొ.) నాఁటి వెడలు. "చ. చతురుల లోన కొంతయును జాణ వటంచును నేను గొఁగిలించితి నిటు మాఱుమో విడఁగఁ జెల్లునె యో రసికాగ్రగణ్య యద్భుత మగునట్టి ంగరపుబొం గరపుంగవఁ బోలునీకుచ,ద్వితయము బొమ్మ నాఁటి యలభీఁపున దూసె నటంచుఁ జూచితిన్." (కూచిమంచితిమ్మకవిచాటువు.); 5. రాచుకొని పోవు. వ్యవ.—తలకొయి వానిప్రక్కనుండి దూసి కొనిపోయినది; 6. చాకు మొ. అల్లు వా —చాకు దూయుచున్నాఁడు, 7. గుప్పిలితోఁగోయు. వా:—చింతాకు దూయుచున్నాఁడు.

దూయుతీఁగ. ద్వ వి (దూయు+తీఁగ )సువర్ణవలత. "సీ. దూసర యనంగ దూయుతీఁగ యనంగ దుస్పర యనంగ సువర్ణవలత పేరు దనరుచుండు." ఆం. భా. ద్వి. ౬౧.

దూయుముడి. దే. వి. (దూయు+ముడి ) జాఱుముడి. 'సీ. బ్రహ్మాస్త్రబాధంబు కట్టుఁదోరపుదూయు ముడియొ యనాయాసమునను విడుప." రామా ౭, ఆ. ౭.

దూరదర్శి. సం. వి. న్. పుం. 1. పండితుఁడు; 2. గ్రద్ద. విణ. (న్. నీ. న్.) 1. దూరమందలి వానిని జూచువాఁడు; 2. దూరాలోచన కలవాఁడు.

దూరనగోలలు. దే, వి. బ. బాలక్రీడావిశేషము, దూరనతుంకాలు. (బ్రౌ.)

దూరపాతనము. సం. వి. అ. న. దూరమునుండి పడఁగొట్టుట?. "క. శస్త్రప్రకారనిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాతనాఖిలుఁడు వర్చస్త్రాసితరిపుఁడు ధనుశ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసదృశుఁడు శక్తిన్." భార. విరా. ౧, ఆ. ౬.

దూరము. సం. వి. అ. న. 1. దవ్వు, 2. దవ్వైన సున్నది.

దూరించు. సం. స. క్రి. దూరముగాఁ జేయు, లేకుండఁ జేయు. "క. ధారాధరగళదురురస,ధారానిర్ఘరము నంకుఁ దత్త్వజ్ఞాలకుల్, దూరించెను సమవిషమా, కారస్థానములు రూపకం బొక్కటి గాన్." కాళిం. ౪, ఆ. ౬౩. శుక్లా. ౪, ఆ. ౭౩.

దూరితము. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగాఁ జేయఁబడినది, పోఁగొట్టఁబడినది. "చ. ప్రతిహతరాగరోపభయుఁ బంకరుహప్రభవప్రభావు దూరితదురితుల్ మునీశ్వరవసిష్ఠు వసిష్ఠుమహామునిన్...." భార. ఆది. ౭, ఆ. ౮౩.

దూరీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగాఁ జేయఁబడినది.

దూరీభూతము. సం. విణ. (అ. ఆ అ.) దూరమైనది.

దూర్యము సం. వి. అ, న. 1. మలము, విష్ఠ; 2. గంట్లకచోరముళీ.

దూర్వ. సం. వి. ఆ. స్త్రీ. గఱికపోఁ.

దూఱనాడు. దే. స. క్రి. (దూఱు+ఆడు.) నిందించు. "క. ఈకరణి దూఱనాడి న,యాకృష్ణమృగంబు పల్కు,లు ..తనమనంబు కొఱఁతయుం జేయన్." స్వా. ౬, ఆ. ౮౨. శుచల. ౪, ఆ. ౧౮౦.

దూఱు. దే. స. క్రి. నిందించు. "క. కీడాడితనంబు వెట్టుచు, దూఱం బని లేదు నిన్ను." భా. రా. యు. ౨౨౨౯. వరాహ. 3, ఆ. ౪౭, 1. నింద, అపకీర్తి. "గీ. అనుజ తనుజాలుఁ జెలులు వియ్యములు సదుగుమాలి పోదురు నీకుఁగా మనుజనాథ, దొరకుఁ గులనాశనుం డనుదూఱు మేలె." భార. ఉద్యో. 3, ఆ. ౩౪౧. హరి. ఉ. ౬, ఆ, ౧౭౬; 2. తగవు. (చూ. దూఱుచెప్పు, దూఱు చేయు.) విణ. నింద్యము, గర్హింపఁదగినది. "ఉ.... దూఱగుఁజాఱుడిచావుమాన్పఁగాఁ, జూచుట మేలు ..." దశ. 3, ఆ. ౧౪౦.

దూఱుచెప్పు. దే. అ. క్రి. (దూఱు+చెప్పు.) తగవు పెట్టు. "గీ. అమరపతిఁ బొల్యానను వచ్చి సుమతి

రుండు, గులంబుఁ బాలింద్దగ దూ్యాళితలిరుబోండ్ల, యూరజపు బేరజపుఁ జే.త లపుడు జూపి, కచ్చుకొని దూఱుచెప్పంగ వచ్చుకరణి" చంద్రా. ౩, ఆ. ౨౭.

దూఱుచేయు. దే. అ. క్రి. (దూఱు+చేయు) తగవు పెట్టు. "ఉ. ఎవ్వరిఁ గీడుపల్కితిమొ యెవ్వరిఁ జూడఁగ నాడినారమో, యెవ్వరి దూఱుచేసితిమొ యెవ్వరి మేలు సహింపమైతిమో..." మల్హ. ౧, ఆ. ౪౧. పు.

దూఱుదుంకములు. దే. వి బ. కాలక్రీడావిశేషము. "సీ. వస్త్రోజములు జాఱి వ్రాలిపో మీఁగాళ్ల కడదాఁక దూఱుదుంకంబులాడ." విప్ర. ౪, ఆ. ౧౯.

దూఱుదుంకెనలు. దే. వి. బ. కాలక్రీడావిశేషము. "సీ. తొంగలిఱెప్పల దూఱుదుంకెనలాడుపోలు జూపులు మరు మేలుకొల్పు." విక్ర. ౮, ఆ ౧౦౧.

దూఱఁబడు. ద్వ. అ క్రి. (దూఱు+పడు.) నిందింపఁబడు. "వ. కావున సత్యవ్రతనిష్ఠుం డగుయుధిష్ఠిరుండు శాంతగుణుం దగువాఁడు గాని దూఱుపడ నర్హుండు గాఁ డని పెండియు ని ట్లనియె." భార. విరా. ౨, ఆ. ౧౮౨;

దూఱెక్కు. దే. అ. క్రి. (దూఱు+ఎక్కు.) నింద నొందు, అపకీర్తినొందు. "ఉ...బంధుసువ్రజ్ఞనంబు లాదిక్కున నున్నవారు గణుతింపక సంపదకై వధించి దూఱెక్కుట దోష మందు టను నీదురవస్థల కోర్వవచ్చునే." భార. ఉద్యో. ౩, ఆ. ౧౩.

దూల. దే. వి. దురద, కండూతి. "గీ. దూల జిల నవనవ గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి ..." ఆం. భా. ద్వి. ౧౨౯.

దూలగొండి. దే. వి. కండూర, వృక్షవిశేషము. "సీ. దూలగొండి యనంగ దురదగొండి యనఁగ దీఁట కోపెల యనఁ దేజరిల్లుఁ, గండూర .." ఆం. భా. ద్వి. ౫౪.

దూలగోపెల. దే. వి. దూలగొండికి. "సీ. మామెన యును శేలమామెన యటికమామిడి దూలగోపెల పేఁకపేరయు. గీ. నాకు..." కాంచ.౪, ఆ.౧౦.

దూలగొను. దే. అ. క్రి. (దూల+కొను.) దురద పెట్టు; కండూతికలదగు. "ద్వి. తూటుగట్టిన కన్ను దూలగొన్కన్ను." పండితా. మహా. ౧౦౯. పు.

దూలపోతు. దే. వి. పాముకుఁడు. ఎప్పుడును దూల గలవాఁడు అని (శ. ర.) "గీ ..పాముకుండు, దూలపో తన బిలసిల్లు దురితదూర." ఆం. భా. ద్వి. ౧౨౨.

దూలము. వై. వి. (సం. స్థూలమ్) ఇంటిగోడలపై అడ్డుగా వేయు పెద్దకఱ్ఱ. "క. విమలమణిమయము లగుదూలములం గంబముల గోడలను వేదులఁ గుట్టిమములఁ బుట్టినప్రాకారములను గర మొప్ప చుండ రచియించె సభన్." భార. సభా. ౧, ఆ. ౧౧. దశా. ౪, ఆ. ౪౯

దూషకుఁడు. సం. విణ. (అ. షి. కా. అ.) 1. తప్పు చేయువాఁడు; 2. నిందించువాఁడు, 3. దుష్టుఁడు.

దూషణ. సం. వి. ఆ. స్త్రీ. దూషించుట, దూషణము.

దూషణము. సం వి. అ న. 1. నిందించుట; 2. ఆక్షేపించుట, ప్రతివాదముచేయుట; 3. తప్పు, దోషము; 4. పాపము; 5. భంగపఱుచుట. విణ. (అ. ఆ. అ.) 1 భంగపఱుచునది, అవమానపఱుచునది; 3. నిందించునది: 3. తప్పుచేయునది.

దూషణీయము. సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁదగినది.

[చెఱుచుచున్న.

దూషయత్. సం. శత్రు. 1. దూషించుచున్న; 2.

దూషయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ) 1. దూషించువాఁడు, 2. చెఱుపువాఁడు.

దూషించు. సం. స. క్రి. 1. నిందించు. "సీ... దూష్యులఁ దుదిదాఁక దూషించు." భార. అర. ౬, ఆ. ౧౫౭; 2. వీడు, త్యజించు. "వ... ఒక్కనికారణంబునఁ గులంబున కెగ్గగునేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబు..." భార. సభా. ౨, ఆ. ౧౯౯.

దూషిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కంటిపుసి; 2. కుంచె, తూలిక; 3. సాలెపురుగు.

దూషిత. సం. వి. ఆ. స్త్రీ. చెఱుపఁబడినస్త్రీ. "సీ... మనసంబులోఁ బద్ధహితప్పమాలికయును బోలె మదరాక్షి దుర్జనుకతమున దూషిత గాక యున్న..." భార. అర. ౬, ఆ. ౨౦౧.

దూషితము. సం. వి. అ. న. తప్పు. విణ. (అ. ఆ. అ.) 1. చెఱుపఁబడినది; 2. నిందింపఁబడినది; 3. అంకు మోపఁబడినది, అభిశస్తము.

దూషితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁదగినది.

దూష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁ బడుచున్నది.

దూష్యము. సం. వి అ. న 1. గుడారము, డేరా; 2. వస్త్రము; 3 విషము; 4. చీము. విణ. (అ. ఆ. అ.) 1. నింద్యము; చేయరానిది. "క. విను ప్రద్యుమ్నాదిభవ, త్తనయులయెడ నైన శేకతంబున కేకా, నినమున నుండుట దూష్యం,బది యొఱుఁ గుము సకులచరిత లతిమృష్ణరముల్." భార. అర. ౫, అ 3౨౦, 2. చెఱుపఁదగినది.

దూష్యుఁడు. సం. వి. అ. పు. రాజద్రోహి, రాజద్రోహ ఘాతకుఁడు. విణ. (అ. ఆ. అ.) దుఃషింపఁదగిన వాఁడు. "సీ. రాజ్యాపదస్థుం డరాజ్యాపదస్థులఁ, బహుబలాఢ్యుఁ డపఘబలుల, విపుణార్థవంతుండు విగతార్థపార్థుల. నవసరం బెఱిఁగి వాఁ డక్రమ మున, దూష్యులఁ దుదిదాఁక దుషించు .." భార. అర. ౬, అ. ౧౫౭.

దూసర. దే. వి. సుదర్శనలతశీ. "సీ ..దూసర యనఁగ, దూయఁతీఁగ యనంగ దుస్సర యనఁగ సుదర్శన లతపేరు దనరుచుండు." ఆం. భా. ద్వి. ౬౫.

దూసరి. దే. వి. 1. అపవాదము. (చూ. దూసరి కాఁడు.); 2. తృణవిశేషము. (శ. ర.) బ. ధాన్య విశేషము. "సీ...తృణధాన్యములు చెలంగు,గను కఱ దూసరుల్ గొలివె లనంగను .." ఆం. భా. ద్వి. ౨3౯.

దూసరికాఁడు. దే. విణ. (దూసరి+కాఁడు.) అప వాదము వేయువాఁడు. "ఆ. దోసకారి యైన దూసరికాఁడైనఁ, బగతుఁడైన వేదబాహ్యుఁడైన, పట్టిలేని పేదవానికిఁ దగు గీవి, ధనికునకు నొసఁగఁ దగదు వేమ." వేమన. ౨౫౬౧.

దూసరిబియ్యము. దే. వి. (దూసరి+బియ్యము ) అడ వినో పండుధాన్యవిశేషము. "వ...ఒడిసెప్రాలు దూసరిబియ్యంబు నివ్వరివడ్లు గుపుకు లాదరు లాదిగాఁ గలుగువన్యధాన్యంబులు..." పి. శకుం. 3, ఆ. ౧౨.

దూసలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ...లేట చలములుం జూఁదుగుటికలు గాజుకడియములు శాటిపుసుమలు దూసలు భీమగుడెలు చేడాకు చిలుకలు గుజ్జరులు .." ప్రబం. ౧౧౨.

దూళి. వై. వి (సం. ధూళిః) రేణువు పరాగము, దుమ్ము. "క. ఆదూళితోడఁ గుడిచిన,నీదుర్లప్పంబు

పత్ని నిది యొఱిఁగెదుసం,వేదనకు పూర్వపుణ్యాప లోదయమునఁ గలిగె..." భార. అను. ४, అ. ౫౦. మార్క. ౬, అ. ౧౦౭.

దృ

దృంభువు. సం. వి. ఊ. స్త్రీ. పాము,సర్పము. "కా. జంబూగ్వీపములోన నొంతయుఁ బ్రశస్తం బైన గిరిగొనట,దృంభూపుఁడలజాటకోటరపుటీభృత్స్వ ర్ధునీచికా,లంబిస్వన్న నవేందుకందళసుధాలంకార వాగ్వైఖరి, జాబూకావ్యము చేసెదన్ బుధజన శ్లాఘానిరాఘాటకన్." వై. ౧, అ. ౧౦. పు. 1. వజ్రాయుధము. 2 సూర్యుఁడు; 3. యముఁడు; 4. రాజు.

దృక్కు. సం. వి. శ్. స్త్రీ. 1. కన్ను; 2. చూపు, దృష్టి; 3. బుద్ధి.

దృఢగాత్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పటికబెల్లము, కండచక్కెర, 2. దృఢశరీరము గలస్త్రీ.

దృఢనీరము. సం. వి. అ. పుం. కొబ్బెరకాయ.

దృఢము. సం. వి. అ. న. 1. ఇనుము; 2. అతిశయము అధిక్యము. విణ. 1. కఠినము, గట్టిది; 2. పూనిక విడువనిది,పట్టు గలది; 3. బలము గలది; 4. లావైనది,స్థూలము.

దృఢీకరణము. సం. వి. అ. న. దృఢపఱచుట.

దృఢీకరించు. సం. స. క్రి. దృఢపఱచు, నిశ్చయించు "క...మేనక కొంతసేపు యోజన,ప్రకటించి దృఢీకరించి పచరించి వెసన్." సావి. ౧, అ. 3౨.

దృఢీకారము. సం. = దృఢీకరణము.

దృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఆదరింపఁబడినది.

దృతి. సం. వి. ఇ పుం. స్త్రీ. 1. కొలిమితిత్తి; 2. తోలు; 3. చేఁప; 4. మేఘము.

దృప్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. హర్షించిన వాఁడు; 2. గర్వించినవాఁడు.

దృబ్ధము. సం. వి. అ. న. 1. భయము; 2. గ్రుచ్చుట, గ్రథనము. విణ. (అ. ఆ. అ.) 1. భయపడినది, భీతము; 2. గ్రుచ్చఁబడినది,గ్రథితము.

దృబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. గ్రుచ్చుట, గ్రథనము.

దృశ. సం. వి. ఆ. స్త్రీ. కన్ను.

దృశానుఁడు. సం. వి. అ. పుం. 1. ఉపాధ్యాయుఁడు; 2. ఆచార్యుఁడు; 3.బ్రాహ్మణుఁడు; 4.సూర్యుఁడు; 5. లోకపాలకుఁడు.

దృశి. సం. వి. ఇ,ఈ. స్త్రీ. 1. కన్ను; 2. శాస్త్రము; 3. ప్రకాశము; 4. చూపు, దృష్టి.

దృశించు. సం. అ. క్రి. కనఁబడు, ప్రత్యక్షమగు. "ఉ. ఆతప మిచ్చ మెచ్చి శివుఁడు .. జగ దద్భుతభంగి దృశింప నమ్మధుం, డాతతభక్తియుక్తుఁడై నుతియించె ననేకరీతులన్." ఉ. రా. ౭, ఆ. ౩౬. [చున్నది.

దృశ్యమానము సం. విణ. (అ. ఆ. అ) చూడఁబడు

దృశ్యము. సం. వి అ. న. కనఁబడువస్తువు. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁదగినది; 2. కంటికిం పయినది, 3. తెలిసికొనఁదగినది.

దృషత్తు. సం. వి. ద. స్త్రీ. 1. రాయి; 2. సన్నెకల్లు.

దృష్టము. సం. వి. అ. న. 1. రాజునకు తనబలము వలనఁ గాని పగవారివలనఁ గాని పుట్టుభయము; 2. దర్శనము, చూపు; 3. సాక్షాత్కారము; 4 దృష్టాంతము. "చ ..మీ రెఱుంగరె యనంతఫలప్రద మన్నదానమే, తెలుపఁగ నేల వేఱె యొక దృష్టము చెప్పెదఁ జిత్తగింపుఁడా." భో. 3, ఆ ౨౭౫. ౧, ఆ ౧౭౨ విణ. (అ. ఆ. అ) 1. చూడఁబడినది; 2. అనుభవింపఁబడినది; 3. తెలియఁబడినది. "వ ..ఇవ్విధం బెఱుంగుదో యెఱుంగవో యని దృష్టంబు గావించుటకై..." హరి. ఉ. ౨, ఆ. ౧౩౨.

దృష్టరజ. సం. వి. ఆ. స్త్రీ. సమర్తాడినపడుచు.

దృష్టాంతము. సం. వి అ. పుం 1 ఉదాహరణము, 2. శాస్త్రము; 3. చావు; 4. ఒకయర్థాలంకారము. నరస. ౫, ఆ. ౧౫౫-౧౫౬.

దృష్టాంతీకరించు. సం. స. క్రి. ఉదాహరించు. "వ. ఓరాజవదన రాజపాణిగ్రహణంబు దృష్టాంతీకరించి పలికిన నీసుభాషితంబులకు నర్థం బెయ్యది..." శైవ. ౯, ఆ. ౬౫.

దృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. కన్ను; 2. చూపు, చూచుట, 3. అభిప్రాయము; 4. ప్రకాశము; 5. ఎఱుక, జ్ఞానము; 6 దృష్టిదోషము. "సీ. తెలియఁజూచినయెడల దృష్టి తాఁకునో యని పేదక్రిందుగఁ జూడ వెఱతు నిన్ను" సా. 3, ఆ. ౧౦౦. భార. అని. ౮, ఆ. ౧౦౬; 7. మెప్పు. "గీ...నాపాటిగొల్లలిచ్చు మెచ్చు నీదృష్టికి నెక్కఁగదుపు నరయ నేర్తు..." భార. విరా. ౧, ఆ. ౨౭౯.

దృష్టించు. సం. స. క్రి. 1. చూచు. "క. శతవర్షంబులనుండి నేఁ, డీతి వర్షము లేక తన శిథిలంబగుచో, నతివృష్టి మించె జలనిధి గతి దృష్టించితి నె ముజ్జగంబులు మునుచున్." దశా ౧, ఆ. ౧౭౩. శైవ. ౭, ఆ. ౧౬౦; 2. పరిశీలించు, పరికించు. "ద్వి. దృష్టికి దాఁటిన తేజంబువాఁడు దృష్టించి చూచినఁ దెలుపగువాఁడు." బస ౧౪౫. పు.

దృష్టిదండ. మి. వి. (దృష్టి+దండ.) దృష్టిదోషము తగులకుండుటకై వేయుదండ. "ఉ...పూదెల గొల్సుచు బెద్దగంటసిం, గారపుదృష్టిదండ మెడగజ్జల పేరులు నంద లొప్ప .." హంస. ౫, ఆ ౯౬.

దృష్టిదీయు. మి అ. క్రి. (దృష్టి+తీయు.) దృష్టి దోషపరిహారార్థము దిగుచు. మొ. చుట్టుద్రిప్పు. "చ. వల నగునబ్జరూపములఁ బాత్రము జ్యోతి యుఁ గాఁగఁ జేసి యువ్వలపులజేనితండ్రి మొగ వాకిఁ వాసిగ దృష్టిదీసినన్." రాధికా. ౨, ఆ. ౫౩.

దృష్టికట్టు. మి. అ. క్రి. (దృష్టి+కట్టు.) కనుకట్టు. "క. ఒకనరునివిక్రమము మాటికిఁ బొగడెద వింత కడుఁ గడిందిగ మనయేలికడఁ గలయోధవీర, ప్రకరము నీకేల దృష్టికట్టదు చెపుమా." రాఘవ. ౪, ఆ. ౫౭.

దృష్టిపిడుత. మి. వి. (దృష్టి+పిడుత.) సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకు సున్నముతోను మసితోను బొట్లు పొడిచి తగిలించుపిడుత. "సీ. నగలపేరింటేసున్నపుబొట్లతో దృష్టిపిడుతలచందాన పీను లొప్పు." చంద్ర. వి. ౧, ఆ. ౬౮.

దృష్టిబొట్టు. మి. వి (దృష్టి+బొట్టు.) దృష్టిదోషము తగులకుండుటకై పెట్టుకొనుబొట్టు. "మ. తొలుగెం పన్నలఁ గింపుమై నలఁది తోడ్తో భ్రాద్రికాతన్వి గ్రొన్నెలయబ్బపని దానమార్పు ముఖ గన్నిరుబ్బైనా నూత్నరత్నులు మించెన్ పిదపన్ విరుద్ధ సలిలంబుల్ పర్వె నా వెన్నెలల్ సలువొందెం బయి దృష్టిబొట్టనఁగఁ జిహ్నాం బొప్పు నీల ద్యుతిన్." చంద్ర. ౪, ఆ. ౭౩.

దె

దెంగు. దే. స. క్రి. సంభోగించు. చంద్ర. వి. ౨, ఆ. ౪౯. వి. సంభోగము. క్రీడా. పీఠి. ౫౩. పు.

దెంచేనము = దంచేనము. (రోటలు మున్నగునవి బద్దలుగొట్టుట కుపయోగించు ఆయుధవిశేషము.)

"సీ. క్వథితతైలములఁ బక్వముసేయఁబడువారు దెంచనంబుల వ్రేయఁ ద్రబ్బువారు." కవిక. ౫, ఆ. ౧౧౩.

దెందము. దే. వి. దొందము, మరపు. "ఉ ..విప్రుమార్తుఁగా, దెందమునం దలంచితివొ దెప్పర మప్పని..." దశా. ౨, ఆ. ౨౯.

దెపగుఱ. దే. వి. (బాణములు.) తాఁకుటయం దగు ధ్వని కనుకరణము. "చ. అపుడు యుగంధరో జ్జ్వలకరాసనముక్త శరప్రధానముక్, దపగుఱఁ దాఁకి వక్షములఁ ద్రెంచి దొనల్ దగటార్ప..." చంద్రా. ౬, ఆ. ౧౦౬.

దెప్పము. దే. వి. బాణాముల కెదుటఁ నిల్పినకృత్రిమ లక్ష్యము. "చ. అలికులవేణి తెప్పయిడ కానర పాలుఁడు చూచుచుండె నిశ్చలమతిఁ గాము తూపులకు జానుగ నిల్పినదెప్పమో యనన్." పాడ. ౮, ఆ. ౪౫. భో. ౭, ఆ. ౭౦.

దెప్పరము. దే. వి. 1. ఆపద. "క. దెప్పర మప్పుడు పాగ్రణి, కెప్పాటను గలుగనేర దెందును..." భా. రా. అర. ౨, ఆ. ౭౧. భా. రా. కిష్కిం. ౨౬౭; 2. దురుక్తి, చెడుమాట. "చ. పరమసతి వ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిగాఁ దలంచి దెప్పరములు పల్కఁగాఁ దగునె .." భార. సభా. ౨, ఆ. ౨౫౫, 3. అతిశయము, ఆధిక్యము. "గీ. దినదినంబును గసికాటుచెనకువలన, దప్పితీఱని తమకంబు దెప్పరంబుఁ, బాద సమకట్టి జారుఁ డపాయుఁ దసలి, శెత్తుకొనిపోవ నిందందు నెదరు వేచె." పాండు 3, ఆ. ౭౨; 4. విధము, రీతి. "వ ..ఉఁతలు గ్రమ్మినలీలను పొంగుపాటినచరి యను వలలువేసినపొందికను సుడిగాలిపీచుదెప్ప రంబున..." ప్రబంధ. ౭౮౮. విశే. 1. అధికము. గొప్పది. "ఉ. దిగ్గన వచ్చె శంకరుఁడు దెప్పర మైనవడిం జెమర్చుచున్." హర. ౧, ఆ. ౨౧. రంగా. 3, ఆ. ౧౩౧; 2. విషమము. "క.... అరులతెఱం, గరయుచు వా రెదురునడచునట్టి దయిన దెప్పరపుం దెరువున దప్పిం, బొరసినయెడ విడియుచోటఁ బొడుచు టురవగున్." భార. శాం. 3, ఆ. ౪. భో. ౫, ఆ. ౯౮, 3. అపకారము, అనర్థదాయకము. "ఉ...విప్రుమార్తుఁగా, దెంద మునం దలంచితివొ దెప్పర మప్పని నన్ను విన్న గో, నిందభృశాబ్జరోచిరరవిందభవాదులు దల్లడిం పరే" దశా. ౨, ఆ. ౨౯. హర. ౨, ఆ. ౫౧.

దెప్పరించు. దే. స. క్రి. ఆపదనొందించు, చంపు. "చ...చంద్రిణి నేక్రియ వాంఛదీరనే, పరిణయ మాడు నాకుటిలభావునినేక్రియ దెప్పరింతు నే, సరణిఁ ఘటించునో శరభసాళవమూర్తి." చెన్న. ౫, ఆ. ౧౪౨.

దెప్పరిలు. దే. అ. క్రి. బాధనొందు. "క. అప్పుడు సాందీపుని మన, చొప్పరయుచు వచ్చి వాసపోఁకు నను వలిం. దెప్పరిలుటఁ గని ఖేదం, బుప్పతిలం బలికె .." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦౦౩. (శ. ర. పా. 'తెప్పిఱిలంబలికె' అని ముద్రి.)

దెప్పతికము. దే. వి. (దెప్పరము+అతికము.) బాధ. "క. పటుకెంచి కరిమదముసే, డ్డెఁ దొందం బెత్తి వ్రేయ దెప్పతికమునం, గొఱసంది దాఁకి సేలకు, నొఱఁగినసింగంపుఁగొదమయె పృమరంగన్." నిర్వ. ౧౦, ఆ. ౨౯.

దెప్పు. దే. స. క్రి. 1. నిందించు. "ఆ. వాలుఁగన్నుఁ గవయుం పలిచన్నుఁగవయుఁనే, కాని యొండు రూపు గాన రాక, యిగురుఁబోఁడి యుండె నీకఁ జిక్కనయవస్థ చెప్పనేల విధిని దెప్పనేల." రామా. ౬, ఆ. ౧౩౬. చంద్రా. ౪, ఆ. ౧౮౯; 2. ఎత్తిపొడుచు. "వ... మోమోటము లేక చల్లరపు వాకుల దెప్పి చెప్పి సరబదుల్ చేరువారును..." ప్రబంధ. ౭౮౮. కాశీ. ౪, ఆ. ౧౨౫.

దెబ్బ. దే. వి. 1. వేటు, పెట్టు. "క...సేనొక, దెబ్బం బరిమార్తు ధరణి నొబ్బునఁ గూలన్." దశా. ౨, ఆ. ౪౨౪; 2. గాయము, గంటు (వ్యవ:–)అతని దెబ్బకు మందు రాచి రమ్ము; 3. నష్టము. (వ్యవ:-) ఆవ్యాపారమున దానికి పెద్దదెబ్బ తగిలినది.

దెబ్బగొను. దే. అ. క్రి. (దెబ్బ+కొను.) కొట్టు. "క. గబ్బున నెదిరించిన నొక, దెబ్బగొనుచు." శివరా. ౪, ఆ. ౮౧.

దెబ్బలాడు. దే.అ.క్రి. (దెబ్బలు+అడు.) 1. యుద్ధము చేయు,పోరు. "సీ. పరిదెబ్బలాడుచో జాంబవం తునిగ్రుస్సు కోరెక్కలోఁ గుట్టు పోరెనొక్క." సిం. నార. 33, 2. తగవులాడు, కలహించు. (వ్యవ:—)ఆసోదరు లెప్పుడును దెబ్బలాడుకొను చుందురు.

దబ్బసలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. నివ్వరుల్ దబ్బసల్ నీరుకావులు గాజుకప్పెరల్ కురువ డాల్ కంటసరులు." హంస. ౪, ఆ. ౧౨౮.

దబ్బాటు. దే. వి. (దబ్బ+ఆటు.) బలిష్ఠమైనవాన. (శ. ర.)

దబ్బు. దే. వి. శీఘ్రము. "సీ. కటిసూత్రమే పాటి గట్టి కాసెడ యని దబ్బున మొలత్రాడు ద్రెంచె నొకతె." వృ. వి. ౨, ఆ. ౬౨.

దెస. వై. వి. (సం. దిశా.) 1. దిక్కు. "సీ. కణవ వీణావేణురణితానుసారమై రసగీతరవ మెల్ల నాసల నెసఁగె." భార. ఆది. ౭, ఆ. ౧౭౨. భార. ద్రో. ౨, ఆ. ౫౭; 2. వైపు, పార్శ్వము. "క తెరు వి మ్మని యటు లడుగుము, నరభిసగతి నుదక మిరు దెసలఁ బాయఁ గదుఁ, బరుపునఁ బోవఁగ నయ్యెడుఁ,దరుణీ యరుగు మఱికాలు తడి గాకుం డన్." భో. 3, ఆ. ౨3. వసు. ౧, ఆ. ౬; 3. శరణము. "చ. జితదనుజాన్వయుండు యదు సింహుఁడు వెన్నుఁడు మట్టి నిన్ బగి,తుకలలుఁ జేయ నాకు దెస గల్గు టెఱింగెదు గాక యత్త ఱన్." భార. ఆర. ౬, ఆ. ౧౮౫. భార. అశ్వ. ౨, ఆ. ౧౬౧; 4. చోటు, ప్రదేశము. "గీ. అట్టికలధౌతశిఖరిఁ బుష్పోపచయము, సేయుఁ వేడుకఁ బొదరిండ్లచాయలందుఁ, దిరుగుచుండి యొకానొకదెసఁ ద్విపాంబు, దళముగా వాక మెలఁచినబలమునందు." స్వా. ౪, ఆ. ౭౮. కు. సం. ౧౦, ఆ. ౧౫౭; 5. పక్షము, తెగ. "క ... ఇది కల్యాణాభ్యుదయనిధానము మా కని,హృద యంబులఁ దలఁచుచుండి రిరుదెసవారల్." హర. ౬, ఆ. ౧౦౭. భార. భీష్మ. 3, ఆ. 3౧; 6. పంచమీవిభక్త్యర్థకము, (వలన). "గీ. రాజవర రాజుదెసఁ బ్రతిగ్రహము విషము." భార. అను. 3, ఆ. ౨౧౫. భార. విరా. ౨, ఆ. ౧౦౮; 7. సప్తమీవిభక్త్యర్థము. (దీనికాయామొదల మీఁద, విషయము, ఎడ మొ. అర్థములు వచ్చును.) "ఉ. ఎక్కుడిమాట గొల్లతన మించుకయేనియుం లేదు నీదెసన్." భార. విరా. ౧, ఆ. ౨౮౧. హైమ. 3, ఆ. ౧౨. (సం. దశా.) 1. అవస్థ,స్థితి. "క. కీచకుఁడు ప్రేటుపడి తన, నీచపుదెస యొరు లెఱుంగ నేరక యుండన్, లేచి..."భార. విరా. ౨, ఆ. ౧౩౦; 2. దుర్దశ, దురవస్థ. "క. ఈ దుస్స్వప్నము కతమున, నీదుర్దశకంటె నింక నేదెస యగునో." మార్క. ౧, ఆ. ౨౪౦. భార. విరా. ౧, ఆ. ౧౮౨; 3. విధము రీతి. "క ..నీకెస్తెంగ, మీదెస సొంపెడలి యుంట కెటు లోర్వఁగనగున్." అచ్చ. యు. 3౯౫. దశా. ౧, ఆ. ౧౫౪.

దెసకట్టు. ద్వ. వి. (దెస+కట్టు.) చోరసాధనవిశేషము. "సీ. మూలఁదోరణము బట్టమొలత్రాటికుఱువాఁడి కైదువు దెసకట్టు కావుబొట్టు." వేం. పంచ. 3, ఆ. ౧౯౯.

దెసచెడు. ద్వ. అ. క్రి. (దెస+చెడు.) దిక్కుమాలు, గతిలేకుండు. "వ ..నరనారాయణులపారపరాక్రములై యసురవీరులఁ బెక్కండ్రం జంపిన నుక్కడంగి దెసచెడి యసురులు...సముద్రంబు సొచ్చిన .." భార. ఆది ౨, ఆ. ౨౫. ఉ. రా. ౧, ఆ. ౨౮౫.

దెసపడు. వై. అ. క్రి. (దెస+పడు) 1. దుస్స్థితి నొందు. "క. వడి నొడిసి పట్టుకొని దెస,పడ నొడలుం దొడలు బడలు పడ నొక్కి మదం, బడర దిగమ్రింగి వలసిన,కడ కరిగెన్..."వేం. పంచ. 3, ఆ. 3౭౫; 2. బాధపడు. "క. ఈ దుర్భిక్షార్ణవమున, నేదరియుం జేర లేక యిదిగో దీకా,కై దెసపడుచున్నారము, వైదలి యిఁక నెన్నిపాట్లఁ బడుదుమొ మీఁదన్." విష్ణు. నా. 3, ఆ. ౧౮౬.

దే

దే దే. వి. గుఱ్ఱము లోనగువానిని దోలుటయం దగు ననుకరణము. "శా. రా జుదగ్ బలువైనవేఁట తమిచే రాగిల్లి కెంగేలిపై,నేజా ద్రిప్పుచు లాగి వాగె బలిమిన్ దే యంచు నొత్తుమడిన్,దేశీఁ దోలిన..." య. ౨, ఆ. ౨౭.

దేంద్ర. దే. వి. సాలీలలో నొకతెగవాఁడు, తంతు వాయభేదము. "సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన నేతకాఁ డనఁగను నేతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్...దేంద్ర యనంగను తేంద్ర యనఁగ." ఆం. భా. ద్వి. ౨౮3.

దేఁకు. దే. అ. క్రి. పిఱ్ఱలతో జరుగు. (శ. ర.)

దేదీప్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశించునది. "ఆ. తేజ మప్రమేయ దేదీప్య మానమి,ర్వికృతిమహిమ దుర్నిరీక్ష్య మయ్యె." భార. భీష్మ. ౧, ఆ. ౨౧౧.

దేవము. వై. వి. (సం. ధ్యానమ్.) ధ్యానము. "ఆ. దాన మొనఁగుకన్న దేవంబు మఱి హెచ్చు,దేవ మొనఁగుకన్నఁ దెలివి హెచ్చు, తెలివికన్న దాన దగ జేసినది హెచ్చు..." వేమన. ౧, భా. ౨౨.

దేబె. దే. విశే. 1. మూర్ఖుఁడు అధముఁడు. "సీ. దేబెలఁ గనుఁగొన్న వాఁబల్కఁ జూపుచు దాసి కత్తెలఁ గన్నఁ దారసిలుచు." మల్హ. 3, ఆ. ౧౦; 2. వికృతము. "ద్వి...వయసు,దిగిపోయి పల్లిక దేబెరూపమున, పగమాలి బ్రతికి యెవ్వరి నుద్ధరింప." ద్వి. శ. సా. ౨, ఆ. ౬౯. పు.

దేయము. సం. విశే. (అ. ఆ. అ.) ఈయఁదగినది.

దేరిజ. దే. వి. ఒకవిధమైనగుడారము. "ఉ. పంత ములో హంటాహంటిని బాణాలలోకులఁ జొచ్చి సైన్య మిం,తింతలు గాఁగ ఖడ్గహతిఁ ద్రెంచెడు దేరిజత్రాణ్ణ మీర లీ,చెంతని యుండి కన్గొనుఁడు ..." కృష్ణ. 3, ఆ. 3౯. కువల. ౨, ఆ. ౨౪.

దేరిజము. దే. వి. ఒకవిధమైనగుడారము. "క .. అతఁడు దేరిజపుఁద్రాణ్ణ దగఁగొని వెసన్." కృష్ణ 3, ఆ. 3౬

దేరిజా. దే. వి. ఒకవిధమైనగుడారము. "మ. చల మొప్పన్ మరుపాదుపాహిజగముల్ సాధింప దండెత్తి మ,త్తిలి బ్రహ్మాండపుఁగెంపుఁ డబ్కా ఱురుకాదేరీజా లెత్తింప వాదలియస్తాచలపూర్వ శైలశిఖరస్తంభాగ్రభాగంబులం, గలమాణిక్యపుబి ళ్లలో యనఁ దగెం గంజాత్తచంద్రాకృతుల్." భాను. ౪, ఆ. ౫౪.

దేవ. సం. వి. అ. స్త్రీ. మెట్టతామరతీ. బు. పుం. మగనిసోదరుఁడు, దేవరుఁడు.

దేవకన్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అప్సరస; 2. దేవతాకన్య.

దేవకీయము. సం. విశే (అ. ఆ. అ.) దేవసంబంధమైనది, దివ్యము.

దేవకుఁడు. సం. విశే. (అ. విశా. అ.) 1. ప్రకాశించువాఁడు; 2. దేవతాతుల్యుఁడు; 3. జూదమాడువాఁడు; 4. క్రీడించువాఁడు.

దేవక్రియ. సం. వి. అ. స్త్రీ. ఇరువదినాలుగుస్త్రీరాగములలో నొకటి. (సంగీ.) "సీ. దేవక్రియాం దోళి దేవగాంధారియుం గౌళ గుండక్రియాశంకర ..." హంస. ౪, ఆ. ౧౨౩.

దేవఖాతము. సం. వి. అ. న. 1. గుహ; 2. అఖాతము; 3. కోనేరు.

దేవగణిక. సం. వి. అ. స్త్రీ. స్వర్వేశ్య. అప్సరస.

దేవగాంధారి. సం. వి. ఈ. స్త్రీ. ఇరువదినాలుగుస్త్రీ రాగములలో నొకటి. హంస. ౫, ఆ. ౧౨౩.

దేవగృహము. సం. వి. అ. న. 1. గుడి; 2. రాచనగరు.

దేవటుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) శిల్పి.

దేవత. సం. వి. అ. స్త్రీ. 1. వేలుపు; 2. దేవత్వము; 3. జ్ఞానేంద్రియము.

దేవతరువు. సం. వి. ఉ. పుం. 1. రావి, అశ్వత్థము; 2. కల్పవృక్షము; 3. రచ్చమ్రాను.

దేవతాడి. మి. వి. దేవతాళము, డావరదంగితీ. "సీ. డావరదంగి నా దేవతా డన...దేవ. గీ. తాళ నామంబు..." ఆం. భా. ద్వి. ౫౧.

దేవదత్తము. సం. వి. అ. పుం. 1. ఆవులింతను గలిగించునొకఉపవాయువు; 2. అర్జునునిశంఖము. విశే. (అ. ఆ. అ.) 1. దేవతలచేత నీయఁబడినది; 2. దేవతలకు సమర్పింపఁబడినది.

దేవదారి. మి. వి. దేవదారువుతీ. "గీ. దేవదారి యనం జను దేవదారు." ఆం. భా. ద్వి. ౪౨.

దేవదారు. సం. వి. ఉ. న. ఒకానొకవృక్షము.

దేవదారువు. సం. వి. ఉ. పుం. ఒకానొకవృక్షము.

దేవదేవుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు.

దేవధాని. సం. వి ఈ. స్త్రీ. ఇంద్రపురి, అమరావతి.

దేవన. సం. వి. అ. స్త్రీ. 1. జూదము; 2. క్రీడ; 3. సేవ, కొలువు; 4. విలాసము, పరిదేవనము.

దేవనము. సం. వి. అ. పుం. పాచిక. న. 1. క్రీడ; 2. జూదము; 3. వ్యవహారము; 4. తేజిదీప్తి; 5. గెలువవలెనను ఇచ్ఛ, జిగీష; 6. పొగడ్త, స్తుతి; 7. విలాసము, పరిదేవనము; 8. తామరపువ్వు, పద్మము; 9. గతి, గమనము.

దేవనాగరి. సం. వి. అ. స్త్రీ. దేవభాషాలిపి.

దేవపతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

దేవపథము. సం. వి. అ. పుం. 1. ఆకాశమండలిఛాయాపథము; 2. దేవయానము, అర్చిరాది మార్గము.

దేవపర్ణము. సం. వి. అ. న. మాచిపత్రితీ.

దేవబ్రాహ్మణుఁడు. సం. వి. అ. పుం. దేవపూజవలన జీవించువాఁడు,పూజారి.

దేవభవనము. సం. వి. అ. న. 1. దేవాలయము,గుడి; 2. స్వర్గము; 3. రావితీ.

దెబ్బసలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. నివ్వరుల్ దబ్బసల్ నీరుకావులు గాజాకప్పెరల్ కురువడాల్ కంటసరులు." హంస. ౪, ఆ. ౧౨౯.

దెబ్బాటు. దే. వి. (దెబ్బ+ఆటు.) బలిష్ఠమైనవాన. (శ. ర.)

దెబ్బె. దే. వి. శిక్యము. "సీ. కటిసూత్రమే పాటి గట్టి బొంకడ యని దెబ్బన మొలత్రాడు ద్రెంచె నొకతె." మృ. వి. ౨, ఆ. ౭౨.

దెస. వై. వి. (సం. దిశా.) 1. దిక్కు. "సీ. పణవ వీణా వేణురణితాతుచారమై రసగీతరవ మెల్ల దెసల గొసఁగె." భార. ఆది. ౭, ఆ. ౧౭౨. భార. ద్రో. ౨, ఆ. ౫౭; 2. వైపు, పార్శ్వము. "క తెరువి మ్మని యటు లడుగుము, పరధనగతి నుదక మిరు దెసలఁ బాయఁ గడుఁ, బరువునఁ బోవఁగ నయ్యెడుఁ, దరుణీ యరుగు మణికాలు కడి గాకుండన్." భో. ౩, ఆ. ౨౩. వసు. ౧, ఆ. ౬; 3. శరణము. "చ. జితదనుజాన్వయుండు యదుసింహుఁడు వెన్నుఁడు మెట్టి నిన్ బరి,తశకలుఁ జేయ నాకు దెస గల్గు టెఱింగెదు గాక యత్తఱిన్." భార. అర. ౬, ఆ. ౧౯౫. భార. అశ్వ. ౨, ఆ. ౧౬౧; 4. చోటు, ప్రదేశము. "గీ. అట్టికలధౌతశిఖరిఁ బుష్పాపచయము, సేయుఁ వేడుకఁ బోదరిండ్లచాయలందుఁ, దిరుగుచుండి యొకానొకదెసఁ దృణంబు, దళముగా వాతమొలచినబలమునందు." స్వా. ౪, ఆ. ౭౯. కు. సం. ౧౦, ఆ. ౧౫౭; 5. పక్షము, తెగ. "క... ఇది కల్యాణాభ్యుదయనిధానము మా కని,హృదయంబులఁ దలఁచుచుండి రిరుదెసవారల్." పార. ౬, ఆ. ౧౦౭. భార. భీష్మ. ౩, ఆ. ౩౧; 6. పంచమీవిభక్త్యర్థకము, (వలన). "గీ. రాజవర రాజుదెసఁ బ్రతిగ్రహము విషము." భార అను. ౩, ఆ. ౨౧౫. భార. విరా. ౨, ఆ. ౧౦౯; 7. సప్తమీవిభక్త్యర్థము. (దీనికాయాయెడల మీఁద, విషయము, ఎడ మొ. అర్థములు వచ్చును.) "ఉ. ఎక్కుడిమాట గొల్లతన మించుకయేనియుఁ లేదు నీదెసన్." భార. విరా. ౧, ఆ. ౨౯౧. హైమ. ౩, ఆ. ౧౨. (సం. దశా.) 1. అవస్థ,స్థితి. "క. కీచకుఁడు ప్రేటుపడి తన, నీచపుదెస యొరులెఱుంగ కేరక యుండన్, లేచి..." భార. విరా. ౨, ఆ. ౧౩౦; 2. దుర్దశ, దురవస్థ. "క. ఈ దుస్స్వప్నము కతమున, నీదుర్దశకంటె నింక నేదెస యగునో." మార్క. ౧, ఆ. ౨౪౦. భార. విరా. ౧, ఆ. ౧౯౨; 3. విధము రీతి. "క...నీ కిప్పింగ, మీఁదన సొంపెడలి యుంట కెటు లోర్వఁగఁగున్." అచ్చ. యు. ౩౮౫. దశా. ౧, ఆ. ౧౫౪.

దెసకట్టు. ద్వ. వి. (దెస+కట్టు) చోరసాధనవిశేషము. "సీ. ముల్లుదోరణము బట్టమొలత్రాటికుఱువాఁడి కైదువు దెసకట్టు కావుబొట్టు." వేం. పంచ. ౩, ఆ. ౧౮౮.

దెసచెడు. ద్వ. అ. క్రి. (దెస+చెడు.) దిక్కుమాలు, గతిలేకుండు. "వ ..నరనారాయణు లపారపరాక్రములై యసురవీరులఁ బెక్కండ్రం జంపిన నక్కడంగి దెసచెడి యసురులు...సముద్రంబు సొచ్చిన .." భార. ఆది ౨, ఆ. ౨౫. ఉ. రా. ౧, ఆ. ౨౯౫.

దెసపడు. వై. అ. క్రి. (దెస+పడు.) 1. దుస్థితి నొందు. "క. పడి నొడిసి పట్టుకొని దెస,పడ నొడలుం దొడలు బడలు పడ నొక్కి ముదం, బడర దిగమ్రింగి వలసిన,కడ కరిగెన్..." వేం. పంచ. ౩, ఆ. ౩౭౫; 2. బాధపడు. "క. ఈ దుర్భిక్షార్ణవమున, నెవరియుం జేర లేక యిది నో చీకా,కై దెసపడుచున్నారము, వైదలి యింక నెన్నిపాట్లఁ బడుదుమొ మీఁదన్." విష్ణు. నా. ౩, ఆ. ౧౯౬.

## దే

దే దే. వి. గుఱ్ఱము లోనగువానిని దోలుటయం దగు ననుకరణము. "శా. రా జాడన్ బలుపైనవేట తమిచే రాగిల్లి కెంగేలిపై,నేజా ద్రిప్పుచు లాగి వాగె బలిమిన్ దే యంచు నొత్తుమడిన్,దేఁజేఁ దోలిన..." య. ౨, ఆ. ౨౭.

దేంద్ర. దే. వి. సాలీలలో నొకతెగవాఁడు, తంతువాయభేదము. "సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన సేతకాఁ డనఁగను సేతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్...దేంద్ర యనంగను జేంద్ర యనఁగ." ఆం. భా. ద్వి. ౨౯౩.

దేఁకు. దే. అ. క్రి. పిఱ్ఱలతో జరుగు. (శ. ర.)

దేదీప్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశించునది. "ఆ. తేజ మప్రమేయ దేదీప్యమానవి,ర్వికృతిమహిమ దుర్నిరీక్ష్య మయ్యె." భార. భీష్మ. ౧, ఆ. ౨౧౧.

దేసము. వై. వి. (సం. ధ్యానమ్.) ధ్యానము. "ఆ. దాన మొనఁగుకన్న దేసంబు మఱి హెచ్చు, దేస మొనఁగుకన్నఁ దలివి హెచ్చు, తెలివికన్న సాస దగఁ జేసినది హెచ్చు .." వేమన. ౧, భా. ౨౨.

దేబె. దే. విశే. 1. మూర్ఖుఁడు అధముఁడు. "సీ. దేబెలఁ గనుఁగొన్న వాలమ్మిఁ జూపుచు దాసి కత్తెలఁ గన్నఁ దారసిలుచు." మల్హ. 3, ఆ. ౧౦; 2. వికృతము. "ద్వి...వయసు,దిగిపోయి పల్లిక దేబెరూపమున, వగమాలి బ్రతికి యెవ్వరి నుద్ధరింప." ద్వి. శ. సా. ౨, ఆ. ౬౯. పు.

దేయము. సం. విశే. (అ. ఆ. అ.) ఈయఁదగినది.

దేరిజ. దే. వి. ఒకవిధమైనగుడారము. "ఉ. పంతముతో హంటూహంటిని బొంఁజాలలోపలఁ జొచ్చి సైన్యము మింతలు గాఁగ ఖడ్గహతిఁ ద్రెంచెడ దేరిజత్రాళ్లు మీర లీ,చెంతనె యుండి కన్గొనుఁడు ..." కృష్ణ. 3, ఆ. ౩౬. కువల. ౨, ఆ. ౭౪.

దేరిజము. దే. వి. ఒకవిధమైనగుడారము. "క .. అతఁడు దేరిజపుఁద్రాళ్లు దగఁగోసి వెసన్." కృష్ణ 3, ఆ. ౩౬

దేరిజా. దే. వి. ఒకవిధమైనగుడారము. "మ. చలమొప్పన్ మరుపాదుసాహిజగముల్ సాధింప దండెత్తి మ,త్తిలి బ్రహ్మాండపుఁగెంపుఁ డక్కురుకా దేరిజా లెత్తింప నం దలియస్తాచలపూర్వశైలశిఖరస్తంభాగ్రభాగంబులం, గలమాణిక్యపుబిళ్లలో యనఁ దగెం గంజాప్తచంద్రాకృతుల్." భాను. ౪, ఆ. ౫౪.

దేవ. సం. వి. ఆ. స్త్రీ. మెట్టతామరశీ. ఋ. పుం. మగనిసోదరుఁడు, దేవరుఁడు.

దేవకన్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అప్సరస; 2. దేవతాకన్య.

దేవకీయము. సం. విశే. (అ. ఆ. అ.) దేవసంబంధమైనది, దివ్యము.

దేవకుఁడు. సం. విశే. (అ. వి కా. అ.) 1. ప్రకాశించువాఁడు; 2. దేవతాతుల్యుఁడు; 3. జూదమాడువాఁడు; 4. క్రీడించువాఁడు.

దేవక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ఇరువదినాలుగుస్త్రీరాగములలో నొకటి. (సంగీ.) "సీ. దేవక్రియాందోళి దేవగాంధారియుఁ గౌళ గుండక్రియాహార ..." హంస. ౪, ఆ. ౧౨౩.

దేవఖాతము. సం. వి. అ. న. 1. గుహ; 2. అఖాతము; 3. కోనేరు.

దేవగణిక. సం. వి. ఆ. స్త్రీ. స్వర్వేశ్య. అప్సరస.

దేవగాంధారి. సం. వి. ఈ. స్త్రీ. ఇరువదినాలుగుస్త్రీ రాగములలో నొకటి. హంస. ౫, ఆ. ౧౨౩.

దేవగృహము. సం. వి. అ. న. 1. గుడి; 2. రాచనగరు.

దేవటుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) శిల్పి.

దేవత. సం. వి. ఆ. స్త్రీ. 1. వేలుపు; 2. దేవత్వము; 3. జ్ఞానేంద్రియము.

దేవతరువు. సం. వి. ఉ. పుం. 1. రావి, అశ్వత్థము; 2. కల్పవృక్షము; 3. రచ్చమ్రాను.

దేవతాడి. మి. వి. దేవతాళము, డావరదంగిశీ. "సీ. డావరదంగి నా దేవతా డన...దేవ. గీ. తాళ నామంబు..." ఆం. భా. ద్వి. ౫౧.

దేవదత్తము. సం. వి. అ. పుం. 1. అవులింతను గలిగించునొకఉపవాయువు, 2. అర్జునునిశంఖము. విశే. (అ. ఆ. అ.) 1. దేవతలచేత నీయఁబడినది; 2. దేవతలకు సమర్పింపఁబడినది.

దేవదారి. మి. వి. దేవదారువుశీ. "గీ. దేవదారి యనం జను దేవదారు." ఆం. భా. ద్వి. ౪౭.

దేవదారు. సం. వి. ఉ. న. ఒకానొకవృక్షము.

దేవదారువు. సం. వి. ఉ. పుం. ఒకానొకవృక్షము.

దేవదేవుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు.

దేవధాని. సం. వి ఈ. స్త్రీ. ఇంద్రపురి, అమరావతి.

దేవన. సం. వి. ఆ. స్త్రీ. 1. జూదము; 2. క్రీడ; 3. సేవ, కొలువు, 4. విలాసము, పరిదేవనము.

దేవనము. సం. వి. అ. పుం. పాచిక. న. 1. క్రీడ; 2. జూదము; 3. వ్యవహారము; 4. జిగి దీప్తి; 5. గెలువనిచ్ఛ, జిగీష; 6. పొగడ్త, స్తుతి; 7. విలాసము, పరిదేవనము; 8. తామరపువ్వు, పద్మము; 9. గతి, గమనము.

దేవనాగరి. సం. వి. ఆ. స్త్రీ. దేవభాషాలిపి.

దేవపతి. సం. వి ఇ. పుం. ఇంద్రుఁడు.

దేవపథము. సం. వి. అ. పుం. 1. ఆకాశమండలిఛాయాపథము; 2. దేవయానము, అర్చిరాదిమార్గము.

దేవపర్ణము. సం. వి. అ. న. మాచిపత్రిశీ.

దేవబ్రాహ్మణుఁడు. సం. వి. అ. పుం. దేవపూజవలన జీవించువాఁడు,పూజారి.

దేవభవనము. సం. వి. అ. న. 1. దేవాలయము,గుడి; 2. స్వర్గము; 3. రావిశీ.

**దేవభూతి.** సం. వి. ఇ. స్త్రీ. గంగ.

**దేవభూయము.** సం. వి. అ. న. దేవత్వము. శైవ. ౨, ఆ. ౭౬.

**దేవభోజనము.** సం. వి. అ. న. అమృతము.

**దేవమణి.** సం. వి. ఇ. పుం. 1. విష్ణువుపక్షమందలి రత్నము,కౌస్తుభము; 2. సూర్యుఁడు, 3. గుఱ్ఱము మెడయందలిసుడి; 4. దేవతలలో శ్రేష్ఠుఁడు; 5. శివుఁడు; 6. చింతామణి.

**దేవమాతృకము.** సం. విశే. (అ. ఆ. అ.) వాననీళ్ల చేత పండెడుసస్యము గలదేశము. (వ్యతి. నదీమాతృకము)

**దేవమానము.** సం. వి. అ. పుం. 1. గర్భము కలిగినది మొదలు ఎనిమిదవమాసము; 2. దేవతామానము ననుసరించినమానము.

**దేవము.** సం. వి. అ. పుం. 1 క్రీడ, ఆట; 2. పాదరసము. న. ఇంద్రియము.

**దేవయజనము** సం. వి. అ. న. యజ్ఞముచేయుస్థానము,వేది.

**దేవయజ్ఞము.** సం. వి. అ పుం. గృహస్థులు నిత్యము చేయవలసినహోమరూప మగుయజ్ఞము. (ఇది పంచమహాయజ్ఞములలో నొకటి.)

**దేవయానము.** సం. వి. అ. పుం. అర్చిరాదిమార్గము. న. విమానము.

**దేవర.** వై. వి. (సం. దేవః.) 1. దేవుఁడు. "సీ. కన్నులు చల్లఁగాఁ గనుఁగొందు నేను మిమ్మిరువుర దేవిదేవరను బోలె." శైవ. ౨, ఆ. ౧౬. శుక. 3, ఆ. ౪౯, 2. ప్రభువు రాజు. "క. కైవడిమెకములఁ గ్రుమ్మెడి కైవడి మాయావచేవ కసఁబోయెదుగా,దేవర మాదేవరవలె,వేవేగ మెసామి కేఁటవిచ్చేయవయా." సా. ౧, ఆ. ౨౯. య. ౫, ఆ. ౧; 3. యుష్మదర్థకము. (ఇది గొప్పవారియెడనే ప్రయుక్త మగును. దీనిక్రియ కబహువచనరూపం బుండును.) 'మ. మొదలం దేవర యానతిచ్చితిర మేమం జిత్త మందెంతుము......" హర. ౨, ఆ. ౧౩౧. భార ఉద్యో. ౨, ఆ. 3. విశే. శ్రేష్ఠుఁడు. (ఇది పురుషులయెడనే ప్రయుక్తము.) "ఉ. రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటపకంప వప్పది.గ్రాజను నో భయంకరుఁడు రాజులదేవర రాజరాజు......" కాశీ. ౧, ఆ. ౪౨.

**దేవరవారు.** ద్వ. వి. (దేవర+వారు) = దేవర. (యుష్మదర్థకము.) "చ...మీరు త్రిలోకవేదులీ,దృశమహిమంబు మీకె తగు దేవరవారికవేద్య మెద్ది యీ,దిశలఁ జరించు పేరు గలదేవఋషుల్ మిముఁబోల రెవ్వరున్." రంగా ౧, ఆ. ౭౬.

**దేవరుఁడు.** సం. వి. అ. పుం. మగనితోఁబుట్టినవాఁడు.

**దేవలుఁడు.** సం వి అ. పుం. 1. పూజారి; 2. ధార్మికుఁడు; 3. నారదుఁడు; 4. మగనితోఁబుట్టినవాఁడు.

**దేవళము.** వై. వి. (సం. దేవాలయః) కోవెల,దేవాలయము. "క. కౌలేయక మిట్లనియెను,గాలాంజనమను గిరిపైఁ గలదేవళముం,బాలింప నితనిఁ బనుపుము..." ఉ. రా. ౭, ఆ. ౨౧. హంసవి. ౧, ఆ. ౬౨.

**దేవళ్లపెట్టె.** వై. వి. (దేవళ్ల+పెట్టె) దేవతార్చనపుఁబెట్టె,దేవవిగ్రహము లుంచుపెట్టె. "సీ. నట్టింట దేవళ్లపెట్టెఁ బెట్టినతిత్తిఁ గొట్టించి వీసఁ బంది గూడు సేసె." శుక. 3, ఆ ౫౦.

**దేవవర్త్మము.** సం వి. న్. న. 1. దేవతలమార్గము. 2. ఆకాశము.

**దేవవాణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆకాశవాణి,ఆకాశాదులనుండి వినఁబడుదేవతలవాక్కు; 2. సంస్కృతభాష.

**దేవవాహనుఁడు** సం. వి. అ. పుం. దేవతలకు హవిస్సును గొనిపోవువాఁడు - అగ్ని.

**దేవశిల్పి** సం. వి. న్. పుం. విశ్వకర్మ.

**దేవసభ.** సం. వి. అ. స్త్రీ. 1. దేవతలసభ,సుధర్మ; 2. రాజసభ; 3. జూదమాడుచోటు.

**దేవసాయుజ్యము.** సం వి. అ. న. దేవుఁడగుట,దేవభూయము.

**దేవాంగి.** సం. వి. న్. పుం. బట్టలు నేసి జీవించునొక జాతివాఁడు, సాలెవాఁడు. (శ. ర. బ్రా.)

**దేవాజీవి.** సం. వి. న్. పుం. పూజారి.

**దేవాజీవుఁడు.** సం వి. అ. పుం. పూజారి.

**దేవానాంప్రియము.** సం. వి అ. పుం. మేఁక.

**దేవానాంప్రియుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) యజ్ఞములయందు దేవతలకు ప్రియమగుపశువువంటివాఁడు; బ్రహ్మజ్ఞానము లేక యాగము చేసి దేవతలకుఁ బ్రియముచేయఁజాలువాఁడు-మూర్ఖుఁడు. "క. ఈవిధి నక్షిప్తసిద్ధికి,దైవతకవి నులిరొయువర్పి

కవుల్భవ్య మదిస్,భావించి దిద్దకుండఁగ,దేవానాం ప్రియుఁల ప్రెక్క తెలఁగు గుకవులన్." రాఘవ. ౧, ఆ. ౫.

దేవాయుధము. సం. వి. అ. న. 1. దేవతలఆయుధము; 2. ఇంద్రధనుస్సు, 3. రాయి, రక్ప లో నగునది. "సీ. పస లేదు నిల రోయి పాతకులారనిదేవాయుధంబులు ఱుగావువారు." ఆము. ౭, ఆ. ౧౩. [దేవళము,గుడి.

దేవాలయము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2.

దేవి. సం. వి. ఈ. స్త్రీ. 1. దేవతాస్త్రీ, 2. దేవపత్ని; 3. పార్వతి; 4. సరస్వతి, 5. పట్టపురాణి; 6. ఆఁడుఊరఁబిచ్చుక,చటక; 7. చాఁగలి.

దేవిత. సం. విణ. (బు. త్రీ. బు.) 1. ప్రకాశించువాఁడు; 2. క్రీడించువాఁడు; 3. జూదరి.

దేవిడీ. హిం. వి. 1 కోటగుమ్మము; 2. రాచనగరు. (శ. ర.)

దేవు. దే. స క్రి. 1. వెదకు. "సీ. మందసంబులు దేవి మాడువుల్ పొడఁగని కొత్తడంబులు చూచి ....." అచ్చ. సు. ౯; 2. నీళ్లు పాల్లమన్నగువానినుండి ఎదవి తీయు. "శా. ఆరంగాఁగినపాలమీఁగడల హస్తాబ్జంబులం దేవి లీ,లారమ్యంబుగఁ దోడిబాలురకు నెల్లం బెట్టి తానుం గొనున్." హరి. పూ. ౫, ఆ. ౨౦౪.

దేవుఁడు. సం. వి. అ. పుం. 1 దేవత. (ఈయర్థమున బహువచనము లేదు.; 2. ఇంద్రుఁడు; 3. మేఘుఁడు; 4. ప్రభువు; 5. ఈశ్వరుఁడు.

దేవురించు. దే. అ. క్రి. దైన్యమునొందు. 'సీ. దేవురించుచు వాజ దేబెదుమొగమును బడఁబాఱుచుండెదుబడుగటోడలు."హరిశ్చ. ౪, ఆ ౧౦౩; 2. విలపించు. (చూ. దేవురింపు.)

దేవురింపు. దే. వి. (దేవురించు. ధా.) 1. దీనుఁడగుట, దేవురించుట; 2. విలపించుట,పరిదేవనము. "సీ.. దేవురింపనఁగను దేవు రనఁగఁ. గీ. బరఁగుఁ బరిదేవనము." ఆం. భా. ప్ర. ౧౧౬.

దేవురు. దే. వి. దైన్యము. "క. ఈవిఱిదవుకను రోఁకల,దేవుర్లం బడితి ....." పం. పంచ. ౪, ఆ. ౪౩౨. ఆం. భా. ౧, ఆ. ౧౧౬.

దేవురుగొట్టు. దే. విణ. దీనుఁడు. (శ. ర వా)

దేవులాడు. దే. స. క్రి. 1. వెనఁగులాడు?. "వ .. ఒకటొకటి మచ్చరంబునఁ బెచ్చుపెరుఁగుచు దేవులాడ నాడసొచ్చి నడుములు గండ్రింపుచు గుండ్రింతలుపెట్టునవియు .. చకోరంబులు..." శ్రీరాధా. ౪, ఆ ౧౦౩; 2. వెదకులాడు. (శ. ర.)

దేవేరి. దే. వి. రాజమహిషి, భార్య. "క. అవిభువనంతరఁబ ధ,రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా,దేవియుఁ దుభమతి తిరుమల, దేవియుఁనుం దనకుఁ గూర్చుదేవేరులు గాన్."స్వా ౧, ఆ. ౩౩. ఆం. భా. ద్వి. ౧౦౫.

దేవేశ్వరుఁడు. సం. వి. అ. పుం. దేవతలకధిపతి, ఇంద్రుఁడు. "సీ. సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోరతపము సేయుఁచు నున్నఁ దత్తపమున, కెంతయుం వెఱచి దేవేశ్వరుఁ డప్సరోగణములలో నగ్రగణ్య యైన,దాని మేనక యనుధవళాక్షిఁ బిలిచి......కగిము. ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన,దేవరాజ్యమహిమఁ దివిరి నీవు,గావు మనిన .."భార. ఆది. ౪, ఆ ౩౬.

దేశకుఁడు. సం. విణ. (అ. శికా. అ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. ఉపదేశించువాఁడు.

దేశము. సం. వి. అ. పుం. 1. చోటు,ప్రదేశము; 2. అనేకపట్టణములుగ్రామములు గలభూభాగము. (దేశములు. ౫౬. అంగము, వంగము, కళింగము, కర్ణాటము, కేరళము, కామరూపము, గౌడము, వనవాసము, కుంతలము, కొంకణము, మగధము, సురాష్ట్రము, మాళవము, లాటము, భోటము, వరాటము, శబరము, కుకురము, కురువు, అవంతి, పాండ్యము, మద్రము, సింహళము, ఘూర్జరము, పారశీకము, మిథిలము, పాంచాలము, శూరసేని, గాంధారము, బాహ్లికము, హైహయము, కౌశలము, సాల్వము, పుండ్రకము, ప్రాగ్జ్యోతిషము, మత్స్యము,చేది, బర్బరము, నేపాళము, గౌళము, కాశ్మీరము, కన్యాకుబ్జము,విదర్భము, ఖురసాణము, మహారాష్ట్రము, కోసలము, కేకయము, అహిచ్ఛత్రము, త్రిలింగము, ప్రయాగము, కరహాటకము, కాంభోజము, భోజము, చోళము, హూణము, కాశి. దేశములు మఱియు ననేకములు గలవు; వానిలో నివి ముఖ్యములు. శ. ర.); 3. భాగము.

దేశరూపము. సం. వి. అ. న. 1. న్యాయము, పాడి; 2. ప్రశస్తదేశము.

దేశి. సం. వి. ఈ. స్త్రీ. 1. సంగీతవిశేషము. (సంగీతములో నేటి భేదము మార్గము.) "ద్వి. లాలిత శుద్ధసాళగములు బెరయఁ గ్రాలుచు దేశిమార్గంబులు వెలయ." బస. 3, ఆ. ౯౩౩. పు; 2. ఇరువదినాలుగు స్త్రీరాగములలో నొకటి. "సీ. దేశాక్షి ఘూర్జరి దేశి తోడి. గీ. వెలయు నారాయణియుఁ జతుర్వింశతివిధములను దనరారు స్త్రీరాగములును మఱియు." హంస. ౫, ఆ. ౧౨౩; 3. దేశభాషాకవిత్వము. "క. మును మార్గకవిత లోకంబున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుంగు నిలిపిరి.." కు. సం. ౧, ఆ. ౨౩; ౧, ఆ. ౨౮; 4. నాట్యవిశేషము. "మ. శనివారోత్సవ వేళఁ గన్గొనిరి యాస్థానంబునన్ రాజనందనయుం దానును దేశిమార్గమున గంధర్వాప్సరో నృత్తముల్." కా శి. 3, ఆ. ౧౯. కాశీ. ౬, ఆ ౯౭; 5. తెనుఁగుదేశమున వాడఁబడునొక భాష. 'గీ. వెలఁది చిగురల్లి వేనలి వేనవేలు, నాఁగఁ జనుగబ్బములు దేశిగామకములు, వీనఁ జెప్పెనకవితల వినుచు మెచ్చు." కావ్యా. ౯, ఉ. ౧౭. ద్వా. ౧, ఆ. 3౨. విణ. (న్. నీ. న్.) 1. దేశము కలవాఁడు; 2. దేశకుఁడు.

దేశికషు. సం. వి. ఉ. పుం. ఒకానొకస్వరస్థాయి. బస. 3, ఆ. ౯౦. పు.

దేశికుఁడు. సం. వి. అ. పుం. 1. గురువు; 2. బాటసారి, పథికుఁడు. [౯, స్కం. ౧౬౭.

దేశిని. సం. వి. ఈ. స్త్రీ. చూపుడువ్రేలు, తర్జని. భాగ.

దేశీయము. సం. విణ. (అ. ఆ. ఆ.) దేశమందుఁ బుట్టినది, దేశమందైనది.

దేశ్యము. సం. వి. అ. న. (వాదమున) పూర్వపక్షము. విణ. (అ. ఆ. అ.) 1. దేశమునఁ బుట్టినది, దేశమందైనది; 2. దేశమునకుఁ దగినది; 3. ఉపదేశింపఁదగినది.

దేష్టృ. సం. విణ. (ఉ.) 1. దాత, ఇచ్చువాఁడు; 2. శుద్ధిచేయువాఁడు; 3. లొంగనిది, దుర్దమము

దేసము. వై. వి. (సం. ద్వేషః.) పగ, వైరము. "గీ. కూడు పగ జేసి మనఁగఁ బొల్చును విరోధనామములు..." సాం. ని. మాన. 3౧.

దేసి. యు. దే. విణ. అందమైనది, మనోహరము. "ఉ. వాసవగా శివాగమము వర్ణనకెక్కఁ ద్రయీ సదర్థముల్, జేసిగ శాస్త్రశిష్యులకుఁ దెల్పుచు ..." కు. సం. ౪, ఆ. ౧౬. పండితా. దీక్షా. 3౫౭. పు. వై. వి. (సం. దేశీ.) = దేశి (సంగీతవిశేషము) "ద్వి. దేసియు మార్గంబు దీటుకొనంగ; ..తుంబురు నారదాదులు బ్రీతిఁ బాడ ..." పండితా. పర్వ. 3౭౭. పు.

దేసిక. వై. వి. (దేసి+క-స్వార్థమున.) సంగీతవిశేషము. "ఉ. దేసిక కాకిమార్గములఁ దిన్ననిరీతులఁ బాడిపాడి యా,శ్వాసము నొంది..."హర.3, ఆ ౬౨.

దేహకరుఁడు. సం. వి. అ. పుం. జనకుఁడు, తండ్రి.

దేహకుఁడు. సం. విణ. (అ. హీకా. ఆ) పూయుంవాఁడు. [2. తోలు, చర్మము.

దేహకోశము సం. వి. అ. పుం. 1. ఱెక్క, పక్షము;

దేహత్యాగము. సం. వి. అ. పుం. చావు, మరణము.

దేహధారణము. సం వి. అ. న. 1. దేహముదాల్చుట; 2. జీవనోపాయము; 3. మనుగడ, బ్రదుకు.

దేహధారి. సం. విణ. (న్. నీ. న్.) దేహము ధరించినవాఁడు, ప్రాణి. [పూయుంట.

దేహము. సం. వి. అ. పుం. న. శరీరము, మేను. పుం.

దేహయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. జీవనోపాయము; 2. చావు, మరణము.

దేహరము దే. వి. (క. దేహము = దేహళి.) నివాసము. "చ. విలసితకీర్తిశాలి యగువీరమహేశ్వరు దేహరంబు శ్రీనిలయమునం ద్రిసంధ్యమును నిర్మల సౌధసువర్ణజాలకంబుల వెడలున్...మంగళధూపధూమముల్." కాశీ. ౧, ఆ ౪౯.

దేహళి. సం. వి ఇ, ఈ. స్త్రీ. ఇంటిగడప, గృహావగ్రహణి.

దేహి. సం. వి. న్. పుం. 1. జీవుఁడు; 2. ప్రాణి. విణ. (న్. నీ. న్.) 1. దేహము గలవాఁడు; 2. పూయుంవాఁడు.

దేహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూయఁదగినది; 2. శరీరమునకు హితమైనది.

దై

దైతేయుఁడు. సం. వి. అ. పుం. దితిసంతతివాఁడు-రాక్షసుఁడు.

దైత్య. సం. వి. ఆ స్త్రీ. కల్లు, సుర.

దైత్యారి. సం. వి. ఇ. పుం. 1. వేల్పు; 2. విష్ణువు.

దైత్యుఁడు. సం. వి. అ. పుం అసుర, రాక్షసుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. దితిసంబంధమైనవాఁడు; 2. దితిసంతతివాఁడు.

దైనికము. సం. విశే. (అ. ఆ. అ.) 1. దినమున నుండునది; 2. దినమందలిది.

దైన్యపడు. మి. అ. క్రి. (దైన్యము+పడు.) విచారించు, దీనతనొందు. "చ...అలిమాటలు విని యన్నుఁబట్టి నకటా తెగటార్తురె యంచు నామె పెద్దలఁ గని పుత్త్రమోహమున దైన్యపడెన్..." సా. 3, ఆ. ౭౦. చెన్న. సీ. ౧. ఆ. ౨౭.

దైన్యపాటు. మి. వి. (దైన్యపడు ధా.) దీనత్వము. "సీ. వినుము పాపముల కెల్లను నధిష్ఠానంబు లోభంబ యది కామలోలతయును, క్రోధంబు మత్సరద్రోహంబులును బరధనదారవాంఛలు దైన్యపాటు...కలిగించి."భార. శాం.3, ఆ. 3, ౯౯.

దైన్యము. సం. వి. అ. న. 1. దీనత్వము, దారిద్ర్యాదులచేతఁ గలుగుదురవస్థ; 2. పేదఱికము; 3. బలహీనత; 4. హీనత్వము, నైచ్యము.

దైర్ఘ్యము. సం వి. అ. న. దీర్ఘత్వము, నిడుపు.

దైవజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. 1. సోదకత్తె, సోదె చెప్పునది; 2. బల్లి. (శ. ర.)

దైవజ్ఞుఁడు. సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు,జ్యోతిశ్శాస్త్రము తెలిసినవాఁడు; 2. త్రికాలవేది,భూతభవిష్యద్వర్తమానము లెఱిఁగినవాఁడు.

దైవతము. సం. వి. అ న. 1. వేల్పు, దేవత; 2. దేవతాసమూహము.

దైవప్రశ్నము. సం. వి. అ. పుం. 1. శుభాశుభకర్మఫలము తెలియఁగోరుట; 2. జోస్యము; 3. ఆకాశవాణి; 4. సోద.

దైవము. సం. వి. అ. న. 1. అదృష్టము, భాగ్యము; 2. వేల్పు, దేవత. దశా. ౨, ఆ. ౨౪౧. పుం. వివాహభేదము. విశే. (అ. ఆ, ఈ. అ.) 1. దేవసంబంధమైనది; 2. దేవునినుండి వచ్చినది; 3. ఆకాశమునఁ బుట్టినది.

దైవసాక్షి. సం. క్రి. విశే. దైవము సాక్షియగునట్లుగా. "క...దైవసాక్షిఁ బ్రతినలువట్టన్." దశ. ౯, ఆ. ౧౪.

దైవాకరి. సం. వి. ఇ. పుం. 1. శని; 2. యముఁడు; 3. సుగ్రీవుఁడు; 4. కర్ణుఁడు. ఈ. స్త్రీ. యమునానది.

దైవాఱించు. దే. స. క్రి. (దైవాఱు ధా. ప్రే.) పొంగిపొరలఁజేయు. "క. దైవాఱించితి, భువనముల ననింద్యకీర్తి భూమామృతమున్."భా. రా. యు. ౨౩౩౬.

దైవాఱు. దే. అ. క్రి. 1. అతిశయించు, అధికమగు. "క...కొమ్మమెకపుఁబోటరి యత్తావునఁ దరలి మెల్లమెల్లనఁ, జరి రొమ్ముకచోఁ మిగులసంతసము దైవాఱన్." అచ్చ. సుం. ౨౪. రూ. దైలువాఱు. ఘటికా. ౨, ఆ. ౧౯౦; 2. ఒప్పు. "మ... భూవరసేనాజన మాయితం బగుచు దైవాఱన్ రణోత్సాహతన్." చంద్రి. 3, ఆ. ౧౦౬; 3. పొంగిపొరలు. "వ. దైన్యరసంబు మొగంబుల నిండి దైవాఱన్ .." రం. రా. యు. (శ. ర) "గీ. సాటిరూమున రసముదైవాఱఁ గొలిచి, కొమరుజంగంబునకు నిచ్చెఁ గోర్కెతీఱ." హర. ౧, ఆ. ౨౩.

దైవికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. దేవతలకు సంబంధించినది; 2. దైవవశమునఁ గలిగినది.

దైవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) దేవసంబంధమైనది.

దైశికుఁడు. సం. వి. అ. పుం. ఉపదేశించువాఁడు, దేశికుఁడు.

దైహికము. సం. వి. అ. పుం. ప్రాణిద్యూతము, పొట్టేలు కోడి మున్నగువానితో నాడుద్యూతము. విశే. (అ. ఈ. అ.) 1. దేహసంబంధమైనది; 2. దేహభవము.

దొ

దొంకెన. దే. వి. అయుధవిశేషము. "ద్వి. వడిగొని యడిదాన వైచి కందాసఁ, దుడుచురాతులు కత్తి దొంకెనఁ బొడిచి, పోటుగంట్లను తూఁటి పోవుసద్భటులు."ద్వి. హరిశ్చ. పూ. ౧౩౪. పం.

దొంగ. దే. వి. (దొంగు ధా.) 1. చోరుఁడు. "సీ. ప్రామినుకులదొంగఁ బాతాళపుహరంబుఁ జోఁకఁ బాఱి చీఱినచోఁ పీవ." పారి. ౧, ఆ. ౪౯. స్వా. 3, ఆ. ౭౪; 2. అరఁటిపువ్వులలో నుండు గట్టికాడ. (శ. ర.) విశే. వంచకము. ఉదా:— దొంగనిద్ర. (ఇది కొన్నిపట్ల విశేషార్థముల నిచ్చును. ఉదా:—దొంగకూడు = త న్నెరు లెఱుఁగకుండఁ బోయి కుడుచుకూడు.

దొంగగొడ్డు = దొంగమేఁతమేయుపసరము.

దొంగసేల = మోసము చేసి యపహరించిన సేల.

దొంగబీగము = మాఱుతాళము.

దొంగమాట = అసత్యవాక్యము, కల్పితవాక్యము.

దొంగమేఁత=పసరము తప్పించుకొనిపోయి పొలములందు మేసెడిమేఁత. [వ్యాపించెడుబుగుక.

దొంగయిసుక = క్రింద నీళ్లు తెలియకుండ మీఁద

దొంగరేయి = దొంగిలించుట కనుకూల మయినయర్ధ రాత్రము. (శ. ర.)

దొంగరోగము = దొంగవలె దాఁగియుండి స్పష్టముగాఁ దెలియనిరోగము కొ. ఇట్టే యితరము లూహించునది.

దొంగతనము. ద్వ. వి. (దొంగ+తనము.) చౌర్యము, దొంగిలించుట. "గీ...విను మెంతవారికైన, దొంగతన మున్నయప్పుడె దొడరు భయము." దశా. ౧, ఆ. ౨౭౬.

దొంగపని. దే. వి. (దొంగ+పని.) 1. చౌర్యము. (శ ర వా.); 2. సరిగా చేయనిపని. (వా.)

దొంగమేపు. దే. వి. (దొంగ+మేపు.) లంపు. "గీ. లంపు నా దొంగమేపు చెలంగు నధిప."ఆం. భా. తృ. ౩౫.

దొంగర్కము. దే వి. (దొంగ+ఱికము.) "మ దుర మ్ముల్ దుర్గము రాయబారము మఱిన్ దొంగ ర్కముల్ వైద్యమున్ .." కాశీ. ౪. ౧౧౭.

దొంగఱికము. దే. వి. (దొంగ+ఱికము) చౌర్యము, దొంగతనము. "క. రంగప్పసొమ్ము మేము తిన, గను సుతుల మయి పుట్టినారము నిజమైనం గలదే మావలనను, దొంగఱికంబులును వింత ద్రోహము లెందున్." విప్ర. ౫, ఆ. ౧౮.

దొంగసొమ్ము. ద్వ. వి. (దొంగ+సొమ్ము.) దొంగి లించి తెచ్చినసొమ్ము. "శా...దొంగసొమ్ములకునై యిట్టేల ప్రాల్మాలితే." విప్ర. ౫, ఆ. ౩౫.

దొంగిలించు. దే. స క్రి ముచ్చిలు, అపహరించు. "సీ. సీధుపానక్రీడఁ జెంగల్వపూచాయ దొంగి లించెడుకన్నుదోయివాఁడు." పి శకు. ౧, ఆ. ౫. కు. సం. ౭, ఆ. ౧౦౪.

దొంగిలు. దే. స. క్రి. 1. దొంగిలించు, దొంగ తనముచేయు. "వ ..ఉదరపూరణమాత్రంబు దొంగిలినవానిం దండింపక..."భాగ. ౭, స్కం. ౪౪౫. చంద్రా. ౪, ఆ. ౧౩౮; 2. వంచించు మోసగించు. "ఉ. ఎక్కడి కేఁగు దెంచితి వహీన విహారదిశిక్ష నీకు నేఁ,జక్క నొనర్చెదం దెలుఁచఁ జంపితి దొంగిలి మున్నదితయులన్, రక్కసులన్ ..."పాండు. ౫, ఆ. ౧౦౭.

దొంగు. దే. అ. క్రి. 1. దాఁగు. (శ. ర.); 2. అప హరించు, ముచ్చిలు. (చూ. దొంగిలించు.)

దొండ. వై. వి. (సం. తుండీ.) ఒకరకముతీఁగ, బింబిక. "గీ. సకలదిశలకుశాఖోపశాఖ విడుచుఁ, బొదలి ఫలియించుదొండయుఁ బోలి ప్రబలి ..." ప్రభా. ౧, ఆ. ౧౬. ఆం. భా. ద్వి. ౬౦.

దొండపండు. ద్వ. వి. (దొండ+పండు) బింబ ఫలము. "చ ..తెలిగన్నులు శ్రీసతియింద్లు వా తెర,ల్నిజముగ దొండపండ్లు .."శశాం. ౨, ఆ. ౨౧. నీలా. ౨, ఆ. ౨౭.

దొండముక్కుపడు. ద్వ. అ. క్రి. దొండపండువలె గింజకొన తెల్లఁబడు-బాగుగాఁ బండు. "వ... గసగస యొసకమెస గె, పెస రుసురుకొనియె దవ నిక పొదలె, జొక్క ప్రాసంగు దొండముక్కువడియె ..." కాశీ. ౩, ఆ. ౨౩. శివరా. ౪, ఆ. ౧౯.

దొండి. దే. వి 1. చిల్లి, రంధ్రము. "సీ. జలశాకభవ శివాదులఁగూడ భ్రమయుట దుర్గంధ మగుసుచ్చ దొండికాగద." వేంక. ౯౬, ఆం. భా. ప్ర. ౧౪౫; 2. ఆఁడుగుఱి. "సీ. చిరిఁగినదొండి బత్తేఁ తకు వెఱచునా వెస నూత్న బాలిక వెఱచుఁగాక." వేణు. ౪. ౨౪.

దొండిపోవు. దే. అ. క్రి. (దొండి+పోవు.) చిల్లి పడు. "సీ పోర మారుఁను రేల పోసికొనెదవురా తోరంపునీ మేను దొండిపోను "బిల్హ. ౨, ఆ. ౬౪.

దొండు. దే. వి. మత్స్యవిశేషము. హంస.౪,ఆ ౧౮౭.

దొంతర ద్వ. వి. (దొంతి+తరఁగ.) 1. ఒకదానిపై నొకటిగా నుంచినవస్తువులవరుస. "క. వెన లలసా మణి బంగరు, వెసలలదొంతరలు డించి వినయము మది కిం,పొస గఁగఁ గంకణరసములు, పొసఁగఁగ నారసి రసాన్నములు వడ్డింపన్." విజ. ౨, ఆ. ౧౫౨. ఆం. భా. ద్వి. ౩౪, 2. వరుస, పరం పర. "గీ. సంతసంబునఁ బంటవలంతి వేల్పు, దొంత రగ సన్నకటివేల్పు వింత లెల్ల,మంతనంబునఁ దలఁ చుచు నంతఁ బొగిలి. నీలా. ౧, ఆ. ౧౦౧. విజ. ౧, ఆ. ౪౮.

దొంతరలుగొను. ద్వ. అ. క్రి. (దొంతరలు+కొను.) దొంతులుగాఁ జేరు."...పదతాడనంబు గావించు కించువెలయాంధ్ర చరణనఖకాంతులపై దొంత రలుగొను..." ఉ. రా. ౪, ఆ. ౧౬౩.

దొంతరముద్దు. దే. వి. (దొంతర+ముద్దు.) చుంబన విశేషము. "గీ. ముద్దు నాఁగను జుంబనం బొప్పు

చుండుఁ, బొల్పుచుండును దొంతరము ద్దనంగఁ, దద్వితీయంబు." అం. భా. ద్వి. ౧౮౦.

దొంతి. దే. వి. 1. ఒకదానిపై నొకటిగా నుంచిన వస్త్రవులవరుస. "సీ. పోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతు లని తలంచు" భాగ. ౮, స్కం. ౨౪౫. అం. భా. ద్వి. ౩౪; 2. వరుస, పరంపర. "సీ. పరపాన్న పానముల్ శాకపాకంబులు వింతవింతగఁ జేసి దొంతి నునిచి." శశాం. ౩, ఆ. ౫. నృసిం. ౪, ఆ. ౧౪౧. విణ. 1. ఒకదానిపై నొకటిగా నున్నది. "క. కరసరసిరుహాంబుద నొక, సరసిరుహం బమర వదనసరసిరుహమునన్, బరిమళవశమున మోహిన, ధరణీధరతనయ దొంతితామరఁ జూపెన్." ఉ. హరి. ౫, ఆ. ౭౦. 2. అధికము. "క. మొదలఁ గుల మెల్లఁ ద్రుంచుట, యదయత గురులయెడఁ గల్లలాడుట యది శాకిదియును జేయఁ దలంచినఁ, గొదలే దీవేళ దొంతికోల సిద్ధించున్." జై. ౧, ఆ. ౭౯.

దొంద. వై. వి. (తుందీ) స్థూలకాయుఁడు, తుందిలుఁడు. "సీ. దొం దన దొందు నా దొద్దు నాలంవనాఁ దుండిలనామమై తోఁచుచుండు." అం. భా. ద్వి. ౧౨౦.

దొందడి. ద్వ. వి. (దొందు+దడి.) 1. సంఘర్షము, ఒత్తిడి. "ఉ...ఇద్దఱున్, దుర్జయశత్రుసైన్యముల దొందడి సేయుచుండొక్క..." భార. ద్రో. ౪, ఆ. ౧౨౯. భార. కర్ణ. ౨, ఆ. ౩౫౪; 2. వేగము, త్వర. "ఆ. రాజుకొడుకుఁ జూచి రాజీవదళనేత్ర, రాజవదనఁ జూచె రాజుపట్టి, దొంగకామఁ దంత దొందడిఁ జిగురాకువాలు వెలికి యుండి వారి మొత్తె." భాగ. ౯, స్కం. ౭౬. ప్రబంధ. ౪౮౮. విణ. సంకులము. "క. ఇందాక నీ వొనర్చిన, దొందడిపని మెచ్చ నేతు దొదరి తిపుడు లా,వుం దాల్మియుఁ జూపి కదా,యొందుఁ బొగడుగనుట నిలువు మిందుక యూఁబెన్." హరి. ఉ. ౮, ఆ. ౧౯౬.

దొందడించు. దే. అ. క్రి. కలిసిపోవు. "సీ. తాగి రాలంకారజూత్తికములు నక్రుబిందువు లేర్పడుప రాక దొందడించు..." హరి. పూ. ౯, ఆ. ౧౫౩.

దొందము. వై. వి. (సం. ద్వంద్వమ్.) ద్వంద్వరోగము, వాతపిత్తశ్లేష్మములలో నేరెంటిప్రకోపములుకలిసినను గలిగినరోగము. "సీ. ద్వంద్వరోగంబు నివ్వటిలం దొంద మనంగ..." అం. భా. ద్వి. ౧౨౫.

దొందు. వై. వి. (సం. ద్వంద్వమ్.) జత. (శ. ర.) విణ. (సం. తుందీ.) 1. స్థూలకాయుఁడు. అం. భా. ద్వి. ౧౨౦; 2. స్థూలము. "వ...కొందఱు దొందుమేనుల నిటునటు కదలలేక చీరికందుల బొందికను..." ప్రబంధ. ౪౮౮.

దొంపు. దే. వి. 1. చేను. "సీ. లేఁతనివ్వరిదొంపు లేఁజిపిల్లల కింపు గాఁచియుండెద నంచుఁ గదలె నొర్త." కృ. శతం. ౩, ఆ. ౩౩; 2. వేరుపురుగులో ఱుకుటవలన మోవు లెండుట. (శ. ర.)

దొంబరి. దే. వి. దొమ్మరవాఁడు. "వ...శంబరారి యనుదొంబరి విడంబంబునం దూఱి సంబరంబునం బన్నినవలయంబు లనం బొలుచునవలగ్నంబుల విలగ్నంబు లగునొడ్డియాణంబుల..." వరాహ. ౧౧, ఆ. ౭౯.

దొంబులిగొట్టు. ద్వ. వి. (దొందు+పులి+గొట్టు.) వ్యతిరేకలక్షణచే పిఱికి, భీరువు. (రెండుపులులను గొట్టువాఁ డని శబ్దార్థము.) "గీ. పంద కోఁచ, పిఱికి దొంబులిగొట్టన భీతుఁ దభవ." అం. భా. ద్వి. ౨౨౧.

దొగ్గలి. దే. వి. రక్తబొమ్మము ... "చ ..దొగ్గలి పొన్నగంటి దే,దరి..." హంస. ౪, ఆ. ౧౩౨. అం. భా. ద్వి. ౭౩.

దొగ్గుడు. దే. వి. వ్యాకులము. (చూ. దొగ్గడుకొను.)

దొగ్గడుకొను. దే. అ. క్రి. (దొగ్గుడు+కొను.) వ్యాపించు. "వ...మంటల గెంటించి యగ్గి దొగ్గడుకొన మొదలంటఁ బొదివి యొదవునీతున్న యగ్గికోలజగ్గు బొగ్గయ్యె నంత." అచ్చ. భా. ౫, ఆ. ౮౬.

దొటదొట. దే. వి (నిప్పులు మొ.) రాలుటయందగుధ్వని కనుకరణము. "చ. దొటదొట రాలంబి న్న వి నీ తోరపునిప్పులవాన లొక్కటన్." పాండు. ౨, ఆ. ౫. ద్వి. నల. ౨, ఆ. ౬౩౮.

దొడదొడ. దే. వి. 1. (నీరు మొ.) కాఱుటయందగుధ్వని కనుకరణము. "ద్వి. దొడదొడ నోట కాఱుచు గ్రక్కుకొనుచు." రం. రా. యు. ౩౪౫౬; 2. మంచె మొదలగువానిని వేగముగా కెక్కుటయందగుధ్వని కనుకరణము. "చ. దొడదొడ

మంచె రొమ్ము నొకదొడ్డమిటారపు రెడ్డికూఁతురున్." ఏథి. ౩౦. విణ. 'దొడదొడ' యనుధ్వని కలది. "క. ఉడువీథిఁ గొండశిలలై, విడు వేగసిన వడువు దోఁప విట్టెగసి పడిన్, బెడతల గుప్పునఁ దన్నినఁ, బడియెం దొడదొడలు గాఁగఁ బదిమకుటంబుల్." రామా. ౭, ఆ. ౨౪౩.

దొడవ. దే. విణ. నీచుఁడు. "క. మగక్రోఁతి యైన దొడవఁ, దగునే కన్నియ దొడంగ ధరణీశునకున్." పాండ. ౭, ఆ. ౯౦.

దొడిదొడి. దే. వి. జనులు వేగముగా నడచుట మొదలగువానియం దగుధ్వని కనుకరణము. "క. దొడి దొడి పెడలెదుమీ రెక్కడఁబోయెద రెవ్వ రేమి కార్యం బని చే,నడిగిన నూరక దురదుర నడిచిరి నామాట వినివినిచందమునన్." వరాహ. ౧౦, ఆ. ౮౧. కువల. ౩, ఆ. ౩౫.

దొడ్డ. దే. విణ. 1. పృథువు, గొప్పది. "గీ...కడుదొడ్డ లగుచుఁ, దొడఁమె మొగ్గలగము లగ్గి బొబ్బలట్లు." ఆము. ౨, ఆ. ౫౬. భాగ. ౧౦, స్కం. పూ. ౮౩; 2. కఠినము, గట్టిది. "గీ. సిడము నడిమికి బెనఁ ద్రుంచె వెడఁదవాలి, దొడ్డతూపునఁ గురుపతి దొంగలించు." భార. భీష్మ. ౨, ఆ. ౪౯; 3. ప్రశస్తము. "సీ...సాత్యకి వానిగుణము బాణాసనంబుఁ, దులిమె నంతట వాఁడు దొడ్డ కోదండంబుఁ గొని కరంబుల నొంచె కినిమునుముని." ఉ. హరి. ౩, ఆ. ౫౪, 4. కష్టము, దుస్సాధ్యము. "వ...ఇప్పురముపావని తపోవనంబులు దాసి గాసి కోర్చి ప్రాణంబులు ధరించుట దొడ్డను వారును..." ఉ. రా. ౮, ఆ. ౮౧; 5. మనోజ్ఞము. "గీ. అట్టియెడఁ బట్టి కెదురుగా నరిగి పురికిఁ, దోడుకొని తెచ్చి రతనపుదొడ్డనగ రొ,కటి విడిది చేసి..." చం. రా. ౩, ఆ ౧౦౫.

దొడ్డకొంచెము. దే. వి. హెచ్చుతగ్గు. "సీ. దొడ్డ కొంచెము లేక తుద కెట్టివరసైన ననువున నిచ్చు..." చిత్ర. భా. ౪, ఆ. ౧౨౦. హంస. ౧, ఆ. ౧౦౧.

దొడ్డతనము. ద్వ. వి. (దొడ్డతనము.) గొప్పతనము, ఘనత. "క...దీన నగుదొడ్డతన మేదియొకో." భో. ౫, ఆ. ౯౦. వరాహ. ౫, ఆ. ౧౦౦.

దొడ్డపని. దే. వి. (దొడ్డ+పని.) ఘనకార్యము. "చ. పలునవిహీనవృత్తి నడుసన్న పరాశరుఁ డాది యైనయ, య్యల యలరాయిపంటిహృదయంబులు నీరుగఁ జేయుపూవిలుకున కెంత దొడ్డపని... బాలురచిత్తము మెత్తచేయఁగన్." పాండు. ౫, ఆ. ౨౧౨.

దొడ్డవయసు. ద్వ. వి. (దొడ్డ+వయసు.) పెద్దదనము, ప్రౌఢవయస్సు. "గీ దొడ్డవయసున శితాంశుఁ డొడ్డగిల్లెఁ, దఱపిచంద్రాతపము నేల చఱచి కాయ." భీమ. ౨, ఆ. ౪౬.

దొడ్డవాఁడు. దే. విణ. (దొడ్డ+వాఁడు.) ఘనుఁడు. కువల. ౪, ఆ. ౧౦౬.

దొడ్డి. వై. వి. (సం. ద్రోణీ) 1. పసులు మేయుబీడు. "వ ..నలుదెసలం బొడువుగా నమర్చినబలితంపు ములువెలుంగులం గరంబు జతనంబులై యొప్పు పెనుదొడ్లం గ్రమంబునం బ్రమోదంబున వేఁకువం బోకు మేసి వచ్చి .." హరి. పూ. ౫, ఆ. ౧౪౨; 2. పసులకొట్టము; పెరడు. "సీ. పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు దొడ్డిఁ బెట్టిన వేల్పు గిడ్డి కాఁపు" స్వా. ౧, ఆ. ౬౬. హరి. పూ. ౬, ఆ. ౨౫; 3. ఇల్లు. (చూ. దొడ్డివేల్పు.)

దొడ్డికట్టు. ద్వ. వి (దొడ్డి+కట్టు.) చుట్టుకోలారము, నడుమబయలును చుట్టును కట్టడములును గల యిల్లు. "సీ. దొడ్డికట్టై యున్నతోరంపుటీరంబుఁ జొరఁ జొప్పి వెనువెంటఁ దిరిగి తిరిగి." భా. రా. అర. ౨, ఆ. ౫౧. ఆము. ౪, ఆ. ౧౧౫.

దొడ్డికాళ్లు. ద్వ. వి. బ. (దొడ్డి+కాళ్లు.) వంగటికాళ్లు, ఎడముగా నుండుకాళ్లు. "గీ. దొడ్డికాళ్లను నల్లనిచెడ్డయొడలు,గలిగి.." హరిశ్చ. ౪, ఆ. ౧౬౮.

దొడ్డికాళ్లవాఁడు. ద్వ. విణ. ప్రజ్ఞాఁడు, వంగటి కాళ్లవాఁడు. "సీ...తోఁచుచు బ్రజ్ఞాండు దొడ్డి కాళ్ల,వాఁ డన..." ఆం. భా. ద్వి. ౧౨౨.

దొడ్డికొను. ద్వ. అ. క్రి. (దొడ్డి+కొను.) విందు, కొలువుకొను. "ఆ. విని విరించునకును వినతుఁడై ధర్మవ్రతుండు పలికె మందము దొడ్డికొనఁగ." కేన. ౪, ఆ. ౨౦.

దొడ్డిపట్టు. ద్వ. వి. (దొడ్డి+పట్టు.) గోష్ఠస్థానము. "గీ. దొడ్డిపట్టుల నిల్వక త్రోవ నెవరి, కాదిరి కొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె,తఱపులను బొడ్చుచును .." నీలా. ౨, ఆ. ౪౩.

దొడ్డివల. ద్వ. వి. (దొడ్డి+వల.) ఒకవిధమైనవల, జాలవిశేషము. "గీ. లేటివలలును మేటితుందేటి

వలలు, కెలంకవలలును నవదండవలలు డొడ్డి వలలు... మొదలుగఁ గలిగినవలలు." య. ౧, ఆ. ౧౧౦. శాళి. 3, ఆ. ౪౫.

డొడ్డివేల్పు. ద్వ. వి. (డొడ్డి+వేల్పు.) ఇలువేల్పు, కులదైవము. "సీ. గెలుపుపేరువఁటిరఁ గినిసిన కప్పుదైదువ రావనెంచు మాడొడ్డివేల్పు." ప్రబంధ. ౧౫౦.

డొడ్డు. దే. వి. మాలిన్యము, కాలుష్యము. "ఆ. మెంద మనవు గురునిముఖ్యకరుణచేత, లొమ్మిదిస్థలముల డొడ్డు వాయ .." వేమన. ౧, భా. ౨౯౯; 2. ఆధిక్యము. "మత్త... మీ కొకఁ డెడ్డియోక్,గోరి చేసెద నందు డొడ్డును గొంచెముం దలపోయకుం, డేరి కిందు నసాధ్యమైనది యిత్తు ను త్తములార. ..."నా. పంచ. ౧, ఆ. ౪౬౫. పరత త్వ. ౧, ఆ. ౬౯; 3 ఘనకార్యము. "గీ...క్రీడి బ్రతికించు దే డొడ్డు కేశవునకు." జై. 2, ఆ. ౨౫. చం. రా. ౨, ఆ. 3౫. విణ. 1. ప్రశస్తము, శ్రేష్ఠము; శ్రేష్ఠురాలు. "వ ..క్షణభంగురమై చను మేటిభాగ్యముం, దలఁకుదె డొడ్డుగా జగతిఁ దావకకీర్తులు మానసంబునన్." చెన్న. ౪, ఆ. ౧౦౧. భాగ. ౧౦. స్కం. ఉ. ౨౨౪; 2. అధికము, గొప్పది. "కరలము...అద్యసన్న ము డొడ్డుసై, అదఁగి కారణకార్యరూపము సైనయా సకలంబు నీ,కదుపులోనిదె గాదె పాపఁడఁ గాక నీ మఱి యెవ్వఁడన్." భాగ. ౧౦, స్కం. పూ. ౫౫౭.

డొడ్డుకట్టు. ద్వ. వి (డొడ్డు+కట్టు.) పెద్దచాఱ. "ద్వి. అడ్డంపుముక్కర యసిరూడునడుము, డొడ్డుకట్టులచీర తూఁగులెమ్మెదయు." పండితా. దీక్ష. ౪౫. పు.

డొడ్డుపాఱు. దే. అ. క్రి. (డొడ్డు+పాఱు.) అధికమగు. (శ. ర.)

డొత్త. దే. విణ. ప్రేలాడునది. (శ. ర.)

డొత్తు. దే. స. క్రి. తన్ను. "ద్వి. భోరున దూటి తిట్టున క్రొత్తి డొత్తి,కూరత మెదడు ముక్కుల గ్రుచ్చి మ్రింగ." అ. మ. క. ౫, ఆ. ౨౬౩. పు.

డొద్ద. దే. వి. కొల్ల, దోఁపిడి. "సీ. తొఁలగి పొం దడి యూన డొద్దకుఁ జొచ్చినఁ దల లేటి యుర్విక బలి రొమనత్తు." భార. మా. ౮౭౫. పండితా. పురా. ౧౧౪. పు.

డొద్దకత్తె. ద్వ. విణ. (డొద్ద+కత్తె.) కొల్లపెట్టునది. (శ. ర.)

డొద్దకాఁడు. ద్వ. విణ. (డొద్ద+కాఁడు.) కొల్లపెట్టువాఁడు. "సీ. కని కని మానినీజనమనోధనములు తొలితొలి గిలుబాడుడొద్దకాఁడు." ద్వా. 3, ఆ. ౧౭౫. ఉ. హరి. 3, ఆ. 3౪.

డొద్దగొను. దే. స. క్రి. (డొద్ద+కొను.) కొల్లగొట్టు, దోఁచు. "గీ. తక్కుఁగలయింతిగముల సాదస్యు లదరి,పట్టుకొని యేచి వీడెల్ల బన్నపఱఁగ, డొద్ద గొని .." భార. మా. ౧౭౮. శేయూర. ౪, ఆ. ౧3౪. (ఇట్లే: డొద్దలుగొను. పండితా.పురా. ౯2. పు.)

డొద్దయిచ్చు. దే. స. క్రి. (డొద్ద+ఇచ్చు.) కొల్లగా నిచ్చు, అంతయు నిచ్చు. "సీ. శశిరవిగ్రహణ స్నానాదికము లెల్ల దొరలవాకిండ్లకే డొద్దయిచ్చి ..." అము. ౫, ఆ. ౬౯.

డొద్దలాడు. దే. స. క్రి. (డొద్దలు+ఆడు.) కొల్లగొట్టు, దోఁచు. "మ. కరమూలంబున మించుఁ బొంచు లిడి కాంతుం గ్రోలఁ గప్పారుముం, గురు లర్థిం గబళించు వాతెఱమెఱుంగుల్ డొద్దలాడున్...ధాత్రీకుచాద్యుల్-వెసన్." శేయూర. ౪, ఆ. ౧౭.

డొద్దలుపుచ్చు. దే స. క్రి. (డొద్దలుపోవు ధా. ప్రే.) కొల్లపుచ్చు. "ఉ. నిద్దము లైనభూషణ మణిప్రకరద్యుతు లన్ని దిక్కులం, డొద్దలుపుచ్చి తల్లిచనుదోయి నడిం దలకట్టు మించఁగా, ముద్దులం చూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీద నాడు గా,ముద్దుగ నేకునిం దలఁచి మ్రొక్కెద నీకృతి కార్యసిద్ధికిన్." ద్వా. ౧, ఆ. ౫.

డొద్దలుసేయు. దే. స. క్రి. (డొద్దలు+చేయు.) కొల్లగా నిచ్చు, అంతయు నిచ్చు. "ఉ. పెద్దల నర్థులక్ హితులఁ బెద్దగ నందఱిఁ గూర్చి యర్థముల్, డొద్దలు సేసి దానవిరతుం డనఁ జెలమి సిక్కుకుండఁగన్." ద్వా. 3, ఆ. ౯౫.

డొద్దపోవు. దే. అ. క్రి. (డొద్ద+పోవు.) కొల్లపోవు. (శ. ర.) [ఆం. భా. ద్వి. ౧౨౦.

డొద్దు. వై. విణ. (సం. తుండీ.) స్థూలకాయుఁడు.

డొన. వై. వి. (సం. తూణమ్.) 1. అమ్ములపొది. "గీ. మరల డొన బొచ్చి రఘువీరవరుశరంబు, శరము డొన సేరు టెందు సాజంబు గాదె."

రామా. ౫, అ. ౨౯౯. భార. ఉద్యో. ౨, అ. ౧౩౦; 2. (సం. ద్రోణీ.) కొండమీఁదినీటిగుంట, నీటితోఁ గూడినకొండమీఁదిపల్లము. "ఆ. దుర్గ మంపుఁజోటు దొనదొన గుహాగుహా,యాది గాఁగ కొండ నరసి యఁరసి." భార. విరా. ౩, అ. ౯౨. రామా. ౫, అ. ౨౯౯; 3. (సం. ద్రోణిః.) తొఱ్ఱు; మడుగు. "ద్వి. ఖనికడి మున్నులోపలి నీళ్ల నమ్మి,దొనసీళ్ల తెగఁగొట్టుదురె వెఱ్ఱులైన." ద్వి. శ. సా. ౧, అ. ౨౯. పు; 4. ఈఁద్రవాఁడు కత్తు లుంచుకొనుడుపొది, తోలుసంచి. "క. మోపుచు నిచ్చెనయును దాఁటాకులబందంబు మెత్తనగుపడదోలుఁ, జోకగుకత్తులదొనయుంచు, దూకంబునఁ బూని నిల్చెఁ దొయ్యలి యెదుటన్." సురా. ౫౯.

దొనదొన. దే. వి. ఈఁగలు, మునురుటయం దగు ధ్వని కనుకరణము. "ఆ. తనువుమీఁద ముసరి దొనదొన నీఁగలు, వేగిరంబె పెద్దరోగమునను." వరాహ. ౯, అ. ౪౯. ఆము. ౬, అ. ౧౭.

దొనయుప్పు. ద్వ. వి. (దొన+ఉప్పు.) సంధరి దేశ మందలి 'రుమ' యనుపేరిగలదియందు కట్టెలవలనఁ గలుగుఉప్పు, రౌమకము. (చవుటియుప్పు అని కొందఱు. శ. ర.)

దొన్నియ. వై. వి. (సం. ద్రోణీ.) దొన్నె. "సీ. చేపట్టు కేసి మ్రొల్చి వర గల్గినచిగురరటియాకులదొన్నియలు ఘటించి."ఘటికా. ౨, అ ౧౫.

దొన్నె. వై. వి. (సం. ద్రోణీ.) నీళ్లు మొ. త్రాగుట కుపయోగించుదొప్ప, పత్త్రచషకము. "గీ. పత్త్ర చషకంబు దొన్నె దొప్పన మను భవ." అం. భా. ద్వి. ౨౪౪.

దొప్ప. దే. వి. దొన్నె, పత్త్రచషకము. "సీ. నునుఁ దోఁకపొత్తిఁ గుట్టినదొప్పగమితోడ రంభాదళాల పర్ణమ్ము వఱచి." ఆము. ౧, అ. ౪౬. అం. భా. ద్వి. ౨౪౪.

దొప్పలుగట్టు. దే. అ. క్రి. (దొప్పలు+కట్టు.) మడుఁగులు గట్టు. "క. తిరుగక విఱుగక యాభీకర మేమను లాహవంబు గావింపంగా, నరి కెంటి పడును నెత్తురు, దొరఁగెం బ్రవహించి నిండె దొప్పలుగట్టన్." వేం. పంచ. ౧, అ. ౨౩౩.

దొప్పు. దే. వి. పడుట మొదలగువానియం దగుధ్వని కనుకరణము. "ద్వి. వివి రుద్రుఁ డతికోపమున కాత్మఁ దగుచుఁ, దప్పక చూచుడుఁ దరణికరుఁ ధరణి,దొప్పునఁ బడి శివస్తుతులు చేయుచును." పండితా. దీక్షా. ౩౯. పు.

దొప్పదొప్పు. దే. వి నో రడిచికొనుటయం దగు ధ్వని కనుకరణము. "క. ప్రే లెడుపెండ్రుక లిరుగడఁ,దూలఁగఁ దలయూఁచు దొప్పదొప్పన నోరుం,గేలనడిచికొను నెలవుల,లాలలు దొరఁ గంగ నన్నలా యని యెలుఁగున్" ఉ. హరి. ౪, అ. ౩౦౭.

దొబ్బ. దే. వి. 1. గడ్డకట్టిననెత్తురు. "సీ. పొలను దొబ్బల నుబ్బుపులుల పెన్బొబ్బలఁ గదలియుఁ బలుమాఱు గలఁగి పోరల" య. ౧, అ. ౧౧౬. దశా. ౪, అ. ౨౩౨; 2. మాంసఖండము. "సీ. తారసించినచోట దారునఁ జొరఁబాఱి యొకటి రెంటిని దొబ్బ లురల నడుచు." స్వా. ౪, అ. ౪౨. ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౦౯ పం

దొబ్బు. దే. స. క్రి. 1. సంభోగించు రమించు. (గ్రా.); 2. దొంగిలించు, అపహరించు. (వ్యవః-) వి. బ. నింద, ఉపాలంభము. (చూ. దొబ్బులు పెట్టు.)

దొబ్బులుపెట్టు దే. స. క్రి. నిందించి బుద్ధిచెప్పు.

దొమ్మ. దే. వి. పశురోగవిశేషము. (శ. ర. వా.)

దొమ్మడోలు. దే వి. అశ్వగంధ, పెన్నేరుశీ. "సీ. పెన్నే రనంగను బెన్నె రనంగను దొమ్మడో లనఁగను దోఁచు నశ్వగంధ..."అం. భా. ద్వి. ౬౩.

దొమ్మర. దే. వి. గడకట్టి యాడి జీవనము చేయు నొకజాతి. ఉదా:—దొమ్మరవాఁడు, దొమ్మరది. (శ. ర.)

దొమ్మరి. దే. వి. (దొమ్మర+ఇ.) దొమ్మరవాఁడు; దొమ్మరది. "వ...కొందఱు దొమ్మరులగుఱుతున నహాశ యని బడిఁదిఁగెల వెంబడి నెగఁబ్రాకు వారును .." ప్రబంధ. ౪౯౯. అం. భా. ద్వి. ౨౯౪. "క. దొమ్మరికొమ్మఁ దగులు్కొని ద్రిమ్మరి ననులోకనిందఁ బ్రక్షుమము..."చెన్న. ౯, అ. ౩౦౩.

దొమ్మరీఁడు. దే. వి. (దొమ్మర+ఈఁడు.) దొమ్మరి. "సీ. అంతట చామయ్య యనుదొమ్మరీల పేఁకరి కనవీడును దాను గదలి." చెన్న. ౨, అ. ౨౦౩.

దొమ్మి. వై. వి. (సం. తుములమ్.) 1. అందఱుఁ గలియఁబడి చేయుయుద్ధము, సంకులసమరము. "ఉ. అంధకశాలకేయమహిపాదులు దైత్యులు

వింపఁజేయు. "సీ. పఠియించువారికిఁ బ్రాతిభస్ఫుర
ణంబు దొరకించుఁగా చాటుకోటకములు." కాశీ.
౪, ఆ. ౨౫౫. శృ. శకుం. ౭. ఆ. ౧౨.

దొరకించుకొను. దే. స. క్రి. (దొరకించు+కొను.)
1. పట్టుకొను. "సీ. దుర్యోధనాదులు దొరకించు
కొనువేళ విశ్వరూపముఁ జూపువింత యేల." సిం
హార. శ. 3౬. వృ. వి. 3, ఆ. ౫౦; 2 సంపా
దించు. "సీ. భూని తా నిచటికి రా నొక్కకొఱ
మున గురునాజ్ఞ దొరకించుకొనుట యొప్పును."
ప్రభా. 3, ఆ. ౧౨౪.

దొరకు. దే. అ. క్రి. 1. చిక్కు, లభించు. "గీ.
పెక్కు లేటికి విందొక్కటక్కులాఁడి, యిపుడు
దొరకినఁగద యున్న యిం పౌనర్పు." ఉ. రా.
౪, ఆ. ౧౬౨. అము. ౪, ఆ. ౧౨౩; 2. కలుగు,
సంభవించు. "గీ ..సీతోడ నదరి పొరసిగ్గు గది
రెడు నైన నిష్ఫలవృత్తి, పొరయవలసెను దల
పోటు దొరకుకతన." భా. రా. యు. ౨౦౯౬.
రాఘవ. ౨, ఆ. ౯౧; 3. వీలగు, సాధ్యమగు.
"క... పాతాళమహాలోకముకంటెను లోఁకెం,
తో కల దావరిఖ యొఱుఁగ దొరక దొకరికిన్."
భాగ. ౧౦. స్కం. పూ. ౧౫౯౩. దశా. ౭,
ఆ. ౧౧౨; 4. పట్టువడు. "ఆ. చిక్కుపడియె
దొరకెఁ జేపడె నగపడెఁ, దవిలెఁ బట్టువడియె
దగులువడియె, నబ్బె నన గృహీత మయ్యె ననం
దగు..." ఆం. భా. కృ. ౧౧౫. వి. లభించుట,
ప్రాప్తి. "గీ. గాజుఁబూస నిరీక్షింపఁ గదఁగువాని,
కరయ నవపద్మరాగంబుదొరకు కాఁగ." ఉద్భ.
౨, ఆ. ౧౦౯.

దొరకుపడు ద్వ. అ. క్రి. (దొరకు+పడు-స్వార్థ
మున.) చిక్కు, వశమగు. "క. ఆరుదెం దన నిక
టంబున, కరిగిన దధికర్షుఁ దంష్ట్రిహతి నారెం
టికిన్, దొరకుపడఁ బట్టుకొని కంధర విరియం
గొఱికి చంపి తగ భక్షించెన్." వేం. పంచ. 3,
ఆ. ౧౩౩.

దొరకుపన్నాసి ద్వ. వి. (దొరకు+పన్నాసి.)నమ్మించి
మోసపుచ్చి దొంగిలించుకొనిపోయెడిదొంగ. "గీ.
యతి ననుచు వేషభావల నటవటించి,పొంచి తటి
కేచి కన్నియఁ గొంచు నరిగె, దొరకుపన్నాసి
యనమాట నిరము గాఁగ, నర్జునుం దద్దిరా యెంత
దురనుఁడు." విజ. ౩, ఆ. ౧౬౧.

దొరకొను. దే. అ. క్రి. (దొరకు+కొను-స్వార్థ
మున.) 1. లభించు, చిక్కు. "చ...అరదంబు
దగం గడకుంగ కావ్వరుం, దొరకొనకున్నఁ దా
నికనిఁ దోడ్కొని వచ్చినవాఁడు చూడఁగన్."
భార. విరా. ౪, ఆ. ౬౬. భార. శాం. ౫, ఆ.
3౬౬; 2. సంభవించు, కలుగు. "ఉ. పుత్త్రుల
కేల భేద మగు భూపతి యేనును నీవు నాప్పనీ,
పుత్త్రుఁడు నుండఁగా సహితముగా భయముగా
దొరకొన్న .." భార. సభా. ౨, ఆ. ౧౩౩.
కాశీ. ౬, ఆ. ౧౩౯; 3. సాధ్యమగు. "క.
క్రతుఫలములం బడయఁగ దుర్గతులకు దొర
కొనదు .." భార. అర. ౨, ఆ. ౨౪౨. భార.
ఆది. ౪, ఆ. ౧౯౯; 4. కాలువేయు, సిద్ధించు.
"క తనవగచినకార్యముఁ దొరకొనుటకు ధృత
రాష్ట్రపుత్త్రకుఁడు పొంగి పురోచనుఁ బిలిపించి
... నెయ్యమున నిట్టనియెన్." భార. ఆది. ౬, ఆ.
౧౩౬. భార. శాం. ౧, ఆ. ౫౦; 5. తోఁచు,
స్ఫురించు. "క. కురువంశము ద్రుంచుటకుం,జోరఁ
జాలక నామనంబు నుడి పడియెడు నే,వెరవుకు
దొరకొనదు గదే, పరసీరుహనాభ పొందు సంపా
దింపన్." భార. ఉద్యో. ౪, ఆ. ౯౬; 6. సిద్ధ
పడు, లొంగు. "క. చని మదనాగ్నిజ్వాలలు,దను
కఁగ నిట్టూర్పు గాడ్పు దందడి నిగుడం,దను నూరా
ర్పఁగ సఖి దొరకొనమికి వెనుబడుచుఁ గీచకుం
డాసలితోన్." భార. విరా. ౨, ఆ. ౬౦.

దొరకొల్పు. దే. స. క్రి. (దొరకొను ధా. ప్రే.)
దొరకొనఁజేయు, సంపాదించు. "క. సుర లోక
మహాధ్వర మ్మాచరింపఁ దలంచి ద్రవ్యసంపద
మిగులం, దొరకొల్పి." భార. సౌ. ౨, ఆ. ౧౧౬.
దశ. ౬, ఆ. ౯౪.

దొరకోలు. దే. వి. (దొరకొను ధా.) లభించుట,ప్రాప్తి.
"మ ..నీయాజ్ఞం బ్రవర్తిల్లఁగా, దొరకో
లప్పమె యెల్లకార్యముల సంతోషంబ మాబుద్ధు
లన్, శరణం బాదలందు నీవ యనువిశ్వాసంబు
భాసిల్లఁగన్." హరి. పూ. ౬, ఆ. ౧౪౦. భార.
ద్రో. 3, ఆ. ౧౯౫.

దొరకోలుపన్నాసి. ద్వ. వి. నమ్మించి మోసపుచ్చి
దొంగిలించి పోయెడిదొంగ. "గీ. వేసములు వేసి
నమ్మించి వెనుక నాఁచుకొనిన దొరకోలుపన్నాసి

యునఁగ నెలయుం." ఆం. భా. ద్వి. ౨౯౧ ప్రబంధ. ౭౯౪.

దొరపు. దే. స. క్రి. (దొరయు ధా. ప్రే.) 1. కలుగఁ జేయు. "సీ. ఘరసినచో షల్లదొరపుదేవత్వ మీ యరిభేదిమాట నవ్యాప్యకంబొ." చంద్రి. ౫, ఆ. ౧౦౪; 2. ఉంచు. "వ ..మంజీరశింజారవంబులు కర్ణగ్రాని మాన్పనొరదొరపిన పలదొరపపరువంపుఁ గైదువు తెఱఁగున..." చంద్రి. ౪, ఆ. ౧౦౭.

దొరయించు. దే. స. క్రి. (దొరయు ధా. ప్రే.) 1. కలిగించు. "సీ. చికిలి మాపులవాని సిరిమించు దొరయించు దొరయించు కాంచనాంబరమువాని." వసు. 3, ఆ. ౪౬; 2. ఉంచు. "క. ధరకాగమపర్యంతము, ధరణీపాలకుని మేను తైలద్రోణిన్, దొరయింపఁ దత్ప్రధానుల, నరుంధతీప్రాణబాధుఁ డాజ్ఞాపించెన్." చం. రా. ౪, ఆ. ౭౬.

దొరయు. దే. అ. క్రి. 1. తగులు, అంటుకొను. "చ. అలరు మెఱుంగుటోడఁ గడు నర్మిలి నాకెదురేల రాత్రి చేతులు పచరించుచుం దనువుధూళి మెయిం దొరయుంగ నేల తన్నెలమిని గౌఁగిలించుకొనవు .." మార్క. ౧, ఆ. ౨౫౧; 2. సమానమగు, సాటియగు. "మ ..రాజీవనేత్రుతో, దొరయంగా శరుఁ డెట్టివాఁడును సమర్థుండే..." వరాహ. ౧, ఆ. ౧౩౯. భార. కర్ణ. ౧, ఆ. ౨౫౧; 3. కలుగు, జనించు. "గీ. జనల దొరలక నిటువంటి జనులు దొరయఁగలరె పరులింక నతనితోఁ గలని కెదుర." దశా. ౧, ఆ. ౨౩౭. ఉ. రా. ౧, ఆ. ౨౭౨; 4. జరుగు, ప్రవర్తిల్లు. "మ..గంభీరాప్సరోనృత్యముల్, దొరసెం గన్నులపండువై జనులు సంతోషించి ఘోషింపఁ గన్." విక్ర. ౧, ఆ. ౧౭౦. రామా. 3, ఆ. ౧౧౭; 5. ఒప్పు, శోభిల్లు. "చ. హరి కిరుగేలఁ దామరలయందును జక్రము పాంచజన్యముల్, దొరయుఁగలిన్..." రామా. ౧, ఆ. ౭౨. కళా. ౧, ఆ. ౧౭; 6. చిక్కుకొను, సంసక్తమగు. "క. మరుఁ డనుమేటికిరాతుఁడు, వరధనముగ ముగ్ధమతుల జనవివాగముల్, దొరసి పడ నడఁప వొగ్గిన, యురులందు మీ సంయమీంద్ర యుండిదలఁ దలఁపన్." వాసిష్ఠ. ౧, ఆ. ౧౧౯; 7. తగు. "చ. నరసుతు నిష్ఠ హేంద్రగిరినాథు వరింపుము రూపసంపదన్, దొరయు నితండు నీకు..." శైవ. ౫, ఆ. ౧౩౨. రాఘవ. ౨, ఆ. ౯౫; 8. ఉండు. "సీ. పులకలు నిండారఁ బొడమిన దేహంబు ధూళిధూసరితమై దొరయుచీపు." హంస. ౨, ఆ. ౧౦౭. రా. వి. ౫, ఆ. ౯; 9. పచ్చు. "సీ...సరిదొరల్ సంధింప దొరయుచేళ." శుక. ౧, ఆ. ౨౫౩. స. క్రి. 1. పోలు. "క. అరయఁగ నాలుగువిధములఁ, బరఁగుఁ జతుష్పాదవృత్తిఁ బరఁగినగోవృష్, దొరయుచు నందొకఁ డెడలిన, నరపర సద్ధర్మవర్తనము గుంటువడున్." భార. అను. ౪, ఆ. ౨౭౫. కాశీ. ౪, ఆ. ౧౦౧; 2. తాఁకు, స్పృశించు. "వ ..మరందధారాబృందంబువాఁకలం గలసి ప్రవహించు సెలయేటి నీటితుంపరల్ దొరసి మందగతులం దిరుగుమందపవనంబుల్ దార్కొని..." ఉ. రా. 3, ఆ. ౯౯౧; 3. (ముక్కుతో) పొడుచు. "శా. శ్రీరాధాధర బింబముం దొరయుం గాచిల్కన్ నిజోరస్థ్సలీ, రారాజన్మణి కాంతి రాఁ బిలిచి..." ఉ. రా. ౧, ఆ. ౧; 4. చొచ్చు, ప్రవేశించు "మ. అని బోధింపఁ గలంకదేఱి రఘువంశాంభోధిచంద్రుండు తన్మునిసామ్యా ప్రసన్నదృష్టిఁ గని సమ్మోదంబు వాటిల్లె నీయనవద్యోక్తి హారముల్ దొరసి యున్నా నాల్గునాల్గయ్యె భూజనసంరక్షణ మెల్లి కైన ఘటియించన్ బోఁదగున్ వేడుకన్." ఉ. రా. ౬, ఆ ౩౫౧.

దొరలకయుండు. దే. అ. క్రి. (దొరలక+ఉండు.) ఊరకొను, ఉదాసీనుఁడగు. "క. ఇరువదియేడులు తనపాల, మొరఁడు గుడుచు చునికి దొంతిఁగి యుఁ స్నేనియుఁ దా, దొరలకయుఁ స్నేనియుఁ దత్పరిభోగము గుడిచినతని పాలై పోవున్." విజ్ఞా. వ్యవ. ౪౬. శ్లో. పశ్యతోఽబ్రువతో భూమేః హాని ర్వింశతివార్షికీ. యాజ్ఞ. వ్యవ. ౨౪.

దొరలించు. దే. స. క్రి. (దొరలు ధా. ప్రే.), 1. రాలుపడు. "సీ. భానూష్మభీతి ముక్కడచిన చుక్కలభంగి దొరలి వేసవగాలిఁ దరుల నుంచు." స్వా. ౫, ఆ. ౪౦. కవిక. ౪, ఆ. ౧౧౧; 2. తిరుగు, పరిభ్రమించు. "క. మరలన్ గర్భము జన్మము, మరణము నిరయమును మఱియు మఱియును నటు నిరంతరసంసృతిచక్రంబున, దొరలి నరుండొందు సర్వతోదుఃఖములన్." కవిక. ౫, ఆ. ౧౧౬; 3. కలుగు, సంభవించు. "సీ. వెల వెలం

గఁడు పైరిపీరులఁ బోఁడగన్న బెట్టుదు భోంకేరము దొలలునొ యని." మొ. రా. బాల. ౨౦. అచ్చ. యు. ౪౩౫; 4. కలియు,కూడు. "గీ. ద్రోహు లగువేలుపులలోన దొరలి యున్న, పనియుండొక్కచంద్రరుద్రులఁ బాఱ విడిచె." కాశీ. ౭, ఆ. ౭౫. ద్వి. పారిజ. పూ. ౧౫౬౪. పం: 5. అతిశయించు. "మ. మదనమనోహరాంగమణి మండన నీగురువాన యంచుఁ బ్రేమ దొరల విన్నవించి నృపుకున్ననఁ గాంచి..."శుక.౧, ఆ.౩౪౦.

దొరల్చు. దే స. క్రి. (దొరలు ధా.ప్రే.) 1. కలుపు. "సీ. నిగరంపుమోవి తేనియలతోన దొరల్చి చెలువలిచ్చిన సంకసించుఁ గొన్ని." వేం. పంచ. ౪, ఆ. ౨౪౧; 2. మార్చు. ఒకదానికిమాఱుగా చేయు. "ఉ. ఆయలికాని కీతు మమరాలయముఖ్యములాతఁ దర్థకృష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం దొరల్చి రాజాయతనంబుఁ జేర్చు..." ఆము. ౪, ఆ. ౨౧౭.

దొరవచ్చు. దే. అ. క్రి. (దొర+వచ్చు. సాటియగు, సమానమగు. "సీ. దొరవచ్చు ననవచ్చుఁ దోయజాక్షునియూర్తి కఖిరాములత్మసమగ్రమహిమ." భీమ. ౧, ఆ. ౧౦౬. భోజరాజీ. ౨, ఆ. ౩౪.

దొరవి. దే. వి. కొలను. "క. క్రీడి వెఱఁగంది కనుఁగొనఁ,గేడించుచు నొండుదొరవికిం జని యచటన్,జూడ భయంకర మగుచును, గోడిగ తద్రూపమడిగి క్రోల్పులి యయ్యెన్." జై. ౫, ఆ.౯౭

దొరసాని. ద్వ. వి. (దొర+సాని) రాజ్ఞి, రాణి. "గీ. సామి మాదొరసాని సాష్టాంగముగను, తావకీనపదాంబుజద్వంద్వమునకు వినుతులను జేసి నా వని విన్నవించె, నన్యు లింకెవ్వరును లేర యవల వినుము."(?) ౬, ఆ. ౧౦౫. శకాం. 3, ఆ. ౧౧౨. అం. భా. ద్వి. ౧౦౭.

దొరసెము. దే. వి. నిరుటికి వెనుకటిసంవత్సరము. "చ. దొరసెమునందు చుట్టుకొని తోరణకట్టె నురోవిభాగముల్, నిరుడు పయోజకోశరమణీయతఁ దాల్చెను వర్తమానవత్సరమున నొప్పె హేమకలశంబులబాగున ముందటేటికిన్, గరినిభయాన దన్నుఁగవ కౌఁగిలిపట్టులం గాకయుండునే" క్రీడా. ౨౭౭.

దొరాదొర. దే. వి. పెద్దదొర. "సీ. చేకొన్నయది మొదల్ వెలఁగి భర్తకు దొరాదొర తెల్ల న్యవ శుతై పరఁగువాఁడ."ఆనంద. పీఠి. ౭౩. రాధికా. ౧, ఆ. ౩౨.

దొరుగండి. దే. వి. (దొరువు+గండి.) నిండినసీళ్ల వెలుపటికిఁ బోవుటకై యేర్పఱచినదొరువుతూము. "సీ. మదువులు పసులకాల్వ డీఁ బుచ్చి దొరుగండిప్రంతలు పెనుటొంపిప్రంక లయ్యె." హరి. పూ. ౬, ఆ. ౫.

దొరువు. దే. వి. 1. సడబావి, ఒకవిధమైనచెలమ. "క. తిరుకోశము నూయి లోటయుఁ, జెఱువు మడువులొండుకుంట చెలమ మడియ కో,నేఱు బుగ్గ వాఁగు దొన తల చెరిగుండము కాల్వ డిగియ బావి దొరువులన్."హంస. ౪, ఆ. ౨౧౦. రాఘవ. ౨, ఆ. ౬; 2. కొలను,చెఱువు. "గీ. తోఁచె హరిణాంకబింబంబు నాఁచుతోడి, దొరువుగతి నంబరము మడికరణి నుండె." వరాహ. ౪, ఆ. ౧౪౭.

దొరువుపట్టెడ. దే. వి. గంతయొద్దులతోఁకక్రింద తగిలించెడుపట్టెడ. (శ. ర.) ఎద్దుముడ్డికితగిలించెడు పట్టిక. (బ్రౌ.)

దొఱయు. దే. అ. క్రి. కలియు, కూడు. "చ. ఎదురుగ వచ్చి పాండ్యధరణీశ్వరుఁ డర్జునుఁ గాంచి పేఁడుగా, సుదినము మీరు రాఁ గలుగుశోభన మెన్నఁడు గల్గఁ బ్రోలికిం,బదఁ దని యుద్ధతిం దొఱసి భద్రగజంబుల నెక్కి వచ్చిరి .."విజ. ౧, ఆ. ౧౫౫. శుక. ౧, ఆ. ౪౭౬. స. క్రి. 1. పొందు, ప్రాపించు. "చ. ఉఱికి తొలంగ దాఁటియును మారక తోఁకలువట్టి దవ్వుగాఁ, బఱపియుఁ గొమ్ము లూడి పెడఁబాయఁగఁ ద్రోచియుఁ గేల లీలమైఁ,బఱిచి కలంగఁజేసియును జంపఁగ నొల్లక గోవ్యరూపకన్, దొఱసినరాక్షసాంగనలఁ దోలె నతండు నిమేషమాత్రలోన్." హరి పూ. ౬, ఆ. ౭౯. (దొఱఁగిన. అముద్రి.) చంద్రి. ౩, ఆ. ౪౫; 2. రమించు. "క. గొఱకై బ్రాహ్మణకన్యక, దొఱసినశూద్రుండు ప్రీతితో నొక్కటియై, కొఱవక పుట్టించినయా,జఱభికిఁ బుట్టిన యతండు చండాలుఁ డగున్."విజ్ఞా.అచా. ౧౩౯.

దొలుక. దే. వి. గుల్ల, అంతస్సారహీనమైనవస్తువు. "క. పలుచని పొత్తుసుమదుఁగులఁ,బొలిచెన్ రథనేమివలయములు రణపాత్రధరులు దూఱఁగ రవిబింబము, దొలుకై రుచి మాలి నీడఁ దోఁచిన మాడ్కిన్." కవిక. ౨, ఆ. ౧౯౩.

దొలంచు. దే. స. క్రి. దొరలించు. "సీ...అన్యోన్య సంఘట్టనారవంబు, లెసఁగంగ సంగ్రామ మేర్పడఁ జేయక యక్షముల్ దొలిచి రసనక్రమమున." భార. సభా. ౨, ఆ. ౧౪౭.

దొలుపు. దే. స. క్రి. దొరలించు. "ఉ. కమ్మని యూర్పుగాడ్పు చలకప్రకుచమ్ములపైఁక యూఁకగా, కెమ్మోయి ఘర్మముల్ దొలుప..." పాంచా. ౫, ఆ. ౨౮. శ్రీరం. మా. ౬ ఆ. ౮౭.

దొల్చు. దే. స. క్రి. పొడుచు; రంధ్రము చేయు. "చ. వడిఁ దలఁ ద్రొక్కి ముక్కున నవారణఁ గన్నులు దొల్వఁ బొల్పుబల్విడిఁ దమకించువాయసములీల మదీయసమీపవర్తియై, యుసురుగక కీడు నాకుఁ గడు నుగ్రముగా నొనరించె .." హరి. పూ. ౮. ఆ. ౬౭. నరసి. ౧, ఆ. ౬౪.

దొల్లు. దే. అ. క్రి. దొరలు. "ద్వి. లాలాసుధార పొల్లసిదమై చంద్రు పోలిక ముఖబింబమును తేజరిలఁగ, దొల్లుబండియును దైత్యుని ప్రక్క నేల, డొల్లంగఁ దన్ని..." ఆ. మ. క ౧, ఆ. ౨౮. పు.

దొసఁగు. దే. వి. 1. హాని, చిక్కు. "క. అసురుల కమృతము పోయుట, పొసఁగదు పాములకుఁ బాలుపోసినమాడ్కిన్, గొసఁగగు నంచును వేఁబోక, దెసఁ గూర్చుండఁగఁబెట్ట దేవాహితులన్." భాగ. ౮, స్కం. ౩౧౬. భర్తృ. ౧, ప్ర. ౯౦; 2. పాపము. "సీ. దోస మనఁగను దొసఁగు దొసఁగు నాఁ గనటు నాఁ బాపంబుగాఁ దనర్చు." ఆం. భా. ప్ర. ౯౮; 3. విఘ్నము, ఆటంకము. "గీ. కవదొనలు పూని వెంట లక్ష్మణుఁడు నడవ, రామభద్రుండు నావెంట రా నియోగ, మొసఁగితివ యేని రాకాసిదొసఁగు మాని, యవభృథస్నాతనగుదు నోయధిప వినుఁడు." చం. రా. ౨, ఆ. ౬౧. అచ్చ. కిష్కి. ౭; 4. బాధ, పీడ. "ఆ. కొలఁకల లోని కల్లకోర్కులు సమకూరెఁ, దుట్టువానె నింక దొసఁగు లేదు." భా. రా. యు. ౨౨౫౨. భార. ఉద్యో. ౪, ఆ. ౫౫; 5. సంబంధము. "సీ. చదువుతోడిదొసంగు చాలించె మునుమున్న తీర్థమాడెద నన్నతెక్క్వ వదలె." రుక్మా. ౪, ఆ. ౧౦౨.

దొసవు = దొసఁగు. (శ. ర.)

దో

దో. సం. వి. న్. పుం. న. బాహువు. "ఉ...తదీయ దంతములు దోల నమర్చినఁ జూడనొప్పి రా,చెంగటఁ గాలదండములు చేరిన యున్న యుదద్వ్యాంబనన్." వి. పు. ౭, ఆ. ౪౦౭.

దోఁకిన దే. వి. దోఁకుట. (శ. ర.)

దోఁకు. దే. అ. క్రి. ఇంకు, తగ్గు. "సీ. ఉద్వేల మగుచుఁ బెల్లుబ్బెదు రాగవార్ధులు లేశమైనను దోఁకవయ్యె." వి. శకుం. ౩, ఆ. ౨౧౯. స. క్రి. నేలను ఎదురుగా తొక్కు. (శ. ర. వా.)

దోఁకుడు. దే వి. (దోఁకు ధా.) దోఁకిన, దోఁకుట. (శ ర.)

దోఁకుడుపాలు. దే. వి. (దోఁకుడు+పాలు.) దోఁకు నట్టిపాలు, తవుగోల. "గీ. పరఁగుఁ దవుగోల దోఁకుడుపాలు నాఁగ." ఆం. భా. ద్వి. ౨౩౦.

దోఁకుడుబార. దే. వి. బాలక్రీడావిశేషము, గూఢమణి. (శ. ర.)

దోఁగాడు. దే. అ. క్రి. (దోఁగు+ఆడు.) బిడ్డలు నేలపైఁ జేతు లాని మోకాళ్లతో నడచు, ప్రాఁకు. "క. బోరగిలి పొట్టజేరలు, జేరిచి దోఁగాడి లేచి నిలుచుచుఁ బడుచున్, నేరమినలెనే మేనక, నోరిక చిచ్చక్రీ కొంత కొనసాగించెన్." పార్వ. ౨, ఆ. ౧౭.

దోఁగియాడు. దే. అ. క్రి. (దోఁగి+ఆడు.) ప్రాఁకు. "గీ దోఁగియాడంగ నేర్చె దైత్యులు కృశించి, తొంటిమద మేది మేదినిఁ గుంటువడఁగ." రామా. ౩, ఆ. ౧౪౩. చంద్రా. ౧, ఆ. ౪.

దోఁగు. దే. అ. క్రి. 1. (పేని)తో లొలియు, చర్మము ఊడు. "సీ...చెక్కుఁ బోయినవాఁడుఁ బ్రక్కలెముకలు విరిసినవాఁడును మెఁగము దోఁగిన వాఁడునై నొచ్చి .." రామా. ౮, ఆ. ౧౩౭; 2. ప్రాఁకు. "వ...నొచ్చియుఁ జొచ్చియుఁ దెరలియుఁ బొరలియు దోఁగియు డాఁగియు... కృతాంతుసన్నిధికిం బోయిరి." శివరా. ౪, ఆ. ౮౩.

దోఁగురు. దే. వి. చౌర్యము, దొంగతనము. "సీ. దోఁగురు నాఁగను దోఁకడ మనఁగను దోఁప్రుడు నాఁగను దోఁపు నాఁగ, దొంగిలిక మనంగ దొంగతన మనంగఁ జౌర్యంబు చెల్లు..." ఆం. భా. ద్వి. ౨౯౨.

దోఁచు. దే. స. క్రి. 1. కొల్లగొట్టు. "సీ...పుశక్షలి యుగ్రులైన. గీ. రాక్షసులు దోఁచికొనుటయు రాజసూను లఖిలదిశలఁ జెల్లాచెదరైరి భీతి." హరి. పూ. ౨, ఆ. ౧౭. పరమ. ౪, ఆ. ౨౦౦; 2. దొంగిలించు. "ఉ...నేఁ డిది ప్రొద్దు దోఁచుకో,"

నిక్కడి వాటు మంచు మది కొంచఁగ వారికి నక్కడక్కడన్." శాకు. ౪, ఆ. ౬౬. య. ౪, ఆ. 3; 3. (అధికముగా మోసముచే) గ్రహించు, పుచ్చుకొను. "సీ. అన్నదాతల మంచు యాయజూకుల మంచు దొరలచే రూకలు దోఁచువారు." దశా. ౧౦, ఆ. ౧౦౫. కళా. ౧, ఆ. ౧౫; 4. లాగు, ఆకర్షించు. "గీ. వల్కలంబులు దోఁచిన వంగువారఁ, శెలలుపోయినవారలఁ జేరువారు." ఉ. హరి. ౧, ఆ. ౧౦౭. రాఘవ. 3, ఆ ౭౦; 5. అపహరించు. "క. ప్రాణముల కెక్కు డెగునా,ప్రాణేశ్వరి దోఁచికొనియె .." భా. రా. కిష్కిం. ౧౦౭.

దోఁటమ్ము. ద్వ. వి. (దోఁటి+అమ్ము.) దోఁటివలె వంపైనఅలుఁగు గలబాణము, కర్ణి శరము.(శ ర)

దోఁటి. దే. వి. అందనిపండ్లు మొదలగువానిని కోయుటకుపయుక్తముగా వంకరచిల్లదోఁపినకోల, చివర వంకరగా చిన్నకట్టిముక్క కట్టినగడ. "రగడ. గుమగుమనివాసనల గేఁదగి కొమ్మ కొమ్మకు నందె దోఁటికి." పారి. ౪, ఆ. ౧౬. భా. శ. ౧౦౫.

దోఁటిముక్కర. దే. వి దోఁటివలె వంపయిననాసాభరణము. (శ. ర)

దోఁపరి. దే. విణ. (దోఁపు+అరి) 1. దొంగ, తస్కరుఁడు. "సీ దొంగ తెక్కలికాఁడు దోఁపరి ముచ్చు జారకాఁడనఁగఁ దస్కరుఁడు వెలయు." ఆం. భా. ద్వి. ౭౯౧, 2. కొల్లకాఁడు. (శ. ర.)

దోఁపిడి. దే. వి. (దోఁపు+ఇడి.) 1. దోఁచుకొనుట, అపహరించుట, 2. కొల్ల. (శ. ర.) బ. బాలక్రీడావిశేషము. "సీ. పెంచులదేరి దోఁపిళ్లు గాలిపటంబు సరిబేసి పుటచెండు చాకిమూట." హంస. 3, ఆ. ౧౪౬.

దోఁపిడికాఁడు. దే. విణ. (దోఁపిడి+కాఁడు.) 1. దొంగ; 2. కొల్లకాఁడు. (శ. ర.)

దోఁపిడియాటలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. తూరనతుంకముల్ దోఁపిడియాటలు..." ప్రబంధ. ౬౩.

దోఁపు. దే. స. క్రి. (పుష్పాదులను తలలో) పెట్టుకొను, చొప్పించు. "ద్వి. తెలిమోము లరదోఁచఁ దిగిచినకావి, జిలుఁగుమునుంగులోఁ జెంగల్వరేకు, లొనపరిగా దోఁపి యున్నకల్హారకుసుమగంధంబు లాగుబ్బగా నొలయ." ద్వి. హరిశ్చ. పూ. ౯౭.

కం. చిత్రభా. ౫, ఆ. ౫౯. వి. 1. కొల్ల, దోఁపిడి. "గీ. కలది మాయూరక నిప్పింతుఁ దొలఁగుఁడొకటి, యాఁడుదానిఁ జేనంటుఁ దనుచుఁ బెద్ద, తనము నభిమానమును దాపు గనఁగఁ బలికి, నిలిచి దోఁపిచ్చువారునై తొలఁగి రపుడు." ఆము. ౬, ఆ. ౭౭. దశా. ౯, ఆ. ౪౧౦; 2. పూర్ణానకము, సర్వస్వము నిచ్చుట. "గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు, కోపుకోపున దొరలెల్ల దోఁపు లొసఁగ." వైజ. ౧, ఆ. ౧౨౯. దశా. ౯, ఆ. ౪౦౯.

దోఁపుకాఁడు. దే. విణ. (దోఁపు+కాఁడు.) 1 దొంగ; 2 కొల్లకాఁడు. (శ ర.)

దోఁపుచూరు. దే. వి. (దోఁపు+చూరు.) అరుఁగులు ముున్నగువానికి జల్లుకొట్టకుండుటకై తాటియాకులు మున్నగునవి దోఁపి వెంచినచూరు, అంతశ్ఛది. "సీ. దోఁపుమూరనఁగను దోఁచు నంతశ్ఛది..." ఆం భా. ద్వి. ౨౧

దోఁపుడు. దే. వి (దోఁపు ధా.) 1. దోఁచుకొనుట; 2. కొల్ల. (శ. ర)

దోఁపుడుకాఁడు. దే విణ. (దోఁపుడు+కాఁడు.) 1. దొంగ, 2. కొల్లకాఁడు. (శ. ర)

దోఁపుడుపడు. ద్వ. అ. క్రి. (దోఁపుడు+పడు.) కొల్లగొట్టబడు "సీ. శివదూరుసంభివబహువైశ్యకోటికా తురులచే నిల్లు దోఁపుడుపడుట." సిం. నార. ౪౮.

దోఁపుపోవు. దే. అ. క్రి. (దోఁపు+పోవు.) నులిపడు. "ఆ. దోఁపుపోయె ననుట దోఁచు నులివడెననంగ .." ఆం భా. తృ. ౧౧౬.

దోగ్ధ సం. వి. ఋ. పుం. 1. గొల్లవాఁడు; 2. దూడ; 3. స్తుతించుచు కవిత్వముచెప్పి ధనము సంపాదించి జీవించుకవి; 4. పనిపాటులు చేసి ధనము సంపాదించి దానిచే బ్రదుకువాఁడు. విణ. (ఋ. గ్ధ్రి) ఋ.) పాలు పిదుకువాఁడు.

దోగ్ధ్రి) సం. వి. ఈ. స్త్రీ 1. పాఁడియావు; 2. గొల్లది; 3. పాలిచ్చుదాది.

దోణము. దే. వి. 1. భుజములకు బలము వచ్చుటకై త్రిప్పెడుకట్టెవానియుపకరణవిశేషము; 2. ప్రానుకరముగాఁ జేల్చుటకై యక్కడక్కడఁ జెక్కిన కొయ్య మేకులను దిగఁగొట్టుడుపకరణవిశేషము. (శ. ర.)

దోదసి. వై. వి. (సం. ద్వాదశీ.) శుక్లమందలిచంద్రుం డవతిథి, ద్వాదశి. (శ. ర.)

దోదుమి = దోదుమ్మి. (శ. ర.)

దోదుము = దోదుమ్మి. (చూ. దోదుముదారి.)

దోదుముదారి. దే. వి. (దోదుము+దారి) ఆయుధ విశేషము; ఖడ్గవిశేషము. "సీ. కలువకొప్పెలికాని బలిమిఁ గావరఁజేసు చికిలి దోదుముగారి చెడఁగఁ జూచి." చంద్రా. 3, ఆ. ౧౧౭.

దోదుమ్మి. దే. వి. ఆయుధవిశేషము, ఖడ్గవిశేషము. "గీ. మోపెమున నైదు తూపులపాదుపాఁ, తమ్మి దోదుమ్మిఁ గొంది .." ఉ. రా. ౭, ఆ. ౪౧౬.

దోదుమ్మిదారి. దే. వి. (దోదుమ్మి+దారి) దోదుముదారి. "గీ తిమ్మనగపాలు చికిలిదోదుమ్మిదారి, బలిమిఁ జెగటారి సురపురప్రాంగణమున, వఱలెఁబుకటారి రాహుత్తవరులచేతఁ, గీలుసీలు - వడిముల గోడి చెలిమి." కుపల. ౧, ఆ. ౩౯.

దోదూయమానము. సం. విణ. (అ. ఆ. ఆ.) 1. మిక్కిలి తపించుచున్నది, 2. మిక్కిలి తపింపఁ జేయుచున్నది.

దోదూయ్యమానము సం విణ. (అ. ఆ. ఆ.) మిక్కిలి తపింపఁ జేయఁబడుచున్నది.

దోధూయమానము. సం. విణ. (అ ఆ. ఆ.) 1. మిక్కిలి కదలుచున్నది, 2. మిక్కిలి కదల్చుచున్నది.

దోధూయ్యమానము. సం. విణ. (అ. ఆ. ఆ.) మిక్కిలి కదల్పఁబడుచున్నది.

దోనమ్ము. ద్వ. వి. (దోసి+అమ్ము.) చిన్నబాణము. "సీ. దోనమ్ములం చన నల్పశరములు .." అం. భా. ద్వి. ౨౧౩.

దోని. వై. వి. (సం. ద్రోణీ.) 1 దోన, నీరు నిలుచుట కేర్పఱచినపల్లము. "సీ. కటికంపుదోనులఁ గరఁగుగొజ్జెంగపూనీటిబల్జక్కెర ద్రాఁటి దాఁటి." రసిక. ౨, ఆ. ౭౧. ద్వి. తి సా. ౧, ఆ. ౯. పు; 2. అరిణ, ఎత్తుడునీరు పోయుటకై తొలిచి కాలువమొదట నుంచు కాటిమ్రాను మున్నగునది. "వ...అయ్యేతఁబు ముంగిసమ్రానికి నెదురునకు నంటఁగట్టినవాఱుకరవశం బాఘ్రాణించి దోనిం బడి చని..." హంస. ౧, ఆ. ౧౯౭; 3. నీరు పాఱుట కేర్పఱచిన చిన్నకాలువ, తోడ. "గీ. క్షైర వములకు వెన్నెలనీరు పఱచుటకు దాని చేర్చినకటికంపుదోనులఁగ." పారి. ౨, ఆ. ౩౮. భాను. 3, ఆ. ౪౬. విణ. చిన్నది. (చూ. దోనమ్ము.)

దోనె. వై. వి. (సం. ద్రోణీ.) 1. చిన్నపడవ, ద్రోణి, 2. కాష్ఠాంబువాహిని. "గీ. ద్రోణి యుగు దోనె యనఁగను .." అం. భా. ప్ర. ౧౫౭; 3. జీలగడుగు పాసిసాధనము. (శ. ర.), 4. పాతె వాఁడు చాఁపు చుట్టెడుమ్రాను. "సీ. కుంచెమగ్గపు గుంత గూటంబు పగ్గంబు పడఁటెద్రొక్కుడుపట్టె పలక దోనె" హంస. ౨, ఆ. ౧౧.

దోనెడొగ్గు. ద్వ. అ. క్రి. (దోనె+డొగ్గు.) క్రిందికి మోకరించుకొను. "సీ. కరఘాతకుతదల్లకుటుఁ గొమ్ముకొనఁ జిమ్ముతమి దోనెడొగ్గి చాదంతె డిగియె." వసు. ౫, ఆ. ౬.

దోమ. దే. వి. మశకము. "క అనీరధి చెల వింత నఁగా నేరము తేలగిలుమకరములమీఁదఁ, మైనా కాదులు తెక్కలతో నిలుచుం గరులమీఁది దోమలకరణిన్." ద్వా ౨, ఆ. ౧౬౩. ఉ. రా. 3, ఆ. ౩౦౪.

దోమటి. దే. వి. అన్నము "సీ. దోమటిఁ దొడుగునే ప్రేమఁ గోకిలములు పాటలసంగారకపల్లవములఁ." చంద్ర. 3, ఆ. ౧౧౩. వా. పంచ. ౪, ఆ. ౭౪౧.

దోమతెర. ద్వ. వి. (దోమ+తెర.) దోమలు చొరకుండ మంచముచుట్టు వేయువలగుడ్డ, చతుష్కి. "ఉ ..క్రమంబున ఘూర్ణకంకమై, నుప్పతిలంగ దోరుతెర లుప్పర మెత్తిరి..." అము. ౫, ఆ. ౧౦౪.

దోము. దే. వి. 1. ఆహారము దేహమున పట్టక పసులు పాఱుకొనుట (శ. ర.), 2. కడుపువాపు, ఉదరశోఫము. "సీ ఔదరశోఫమై యలరు దోము." అం. భా. ద్వి. ౧౨౬.

దోయము. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. "సీ. అచ్చనగండ్లు దోయాలును దాఁగిలిమూఁతలు నాలుగుమూలలాటు." దశా. ౮, ఆ. ౮౧. ఇందు. ౨, ఆ. ౧౪౩.

దోయి. వై. వి. (సం. ద్వయీ.) 1. జత, జోడు. "క. నీయుపదేశముఁ దనచే, దోయిలులువుఁ దోడు గాఁగ ద్రోణుఁ గడచి...సైన్యము.. పఱపఁగఁ జేసెన్." భార. ద్రో. ౨, ఆ. ౨౭౧. కాళిందీ. ౫, ఆ. ౧౨౩. అం. భా. ద్వి. ౧౦౦; 2. కలయిక, పొంగక్యము. 'గీ. మన్నఘాతినపురకంత్ర

మానసులును, నగుచు కేళాసనాసీను లైరి తగ వధూవరులు సౌఖ్యరసములదోయి వోలె." దశ. ౪, ఆ; ౫౬; 3. సామ్యము, పోలిక. "ఉ. ఎక్కడిదోయివో యలమృగేక్షణ మేసికి నక్కడానికిన్." విజ. 3, ఆ. ౧౪. విణ. సహాయము, తోడు. "సీ. యమునాజలానీల మాచిమ్ముచీఁకటి పెల్లును జగ మెల్ల నల్లనైన, నీరదమయి గానరాదని హరి లక్ష్మి దోయి గా నమృతాబ్ధిఁ బాయకుండ." ద్వా. ౪, ఆ. ౧౦౨.

దోయికట్టు. ద్వ. అ. క్రి. (దోయి+కట్టు) రెండుభాగములుగా చీలు "వ .. తక్కినవారును దమలోన దొరయుంభంగి దోయికట్టిరి." హరి. పూ. ౬, ఆ. ౯౨.

దోయిడి. దే. విణ. (దోఁచే ధా.) రిక్త,శూన్యము. "గీ. అనిన వృషకేతుఁ గనుఁగొని యనిలసుతుఁడు, పలికిహారము తురగసంబంధమైన, ప్రతిన లెన్నని ధర్మసంభవునిఁదెదుర, మనము దోయిడి చేతుల మగుడు టెట్లు." జై. ౨,ఆ ౧౫. శేష. ౫,ఆ. 3౧.

దోయిలి. వై. వి. ఔ. (సం. ద్వయీ.) 1. దోసిలి, అంజలి. "క. పువ్వులదోయిటికయ్యం, బవ్వనితావరుల నలంత నందించెఁ గడున్." కాళిం. ౫, ఆ. ౧౨౫. భార. స్త్రీ. ౨, ఆ. ౮, 2. నమస్కృతివిశేషము. "వ ..అయోధ్యయందలి రఘూద్వహునకు దోయిలి మధుర నున్నబాల కృష్ణునకు సాఁగిలి .." ప్రబంధ. ౮౮౦.

దోయిలించు. వై. స. క్రి 1. దోసిలితోఁ బట్టుకొను. "క. ఆసమభయభక్తు లలరఁగఁ, గుసుమంబులు దోయిలించి కోమలి నించెన్...మృదుని యడుగులపైఁదన్." పార. 3, ఆ. ౬౪. నైష. ౬, ఆ. ౧౦౨, 2. (చేతులను, జోడించు, అంజలిగాఁ గూర్చు. "వ...అద్దేవికి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె." భాగ. ౬,స్కం. ౪౧౮. అచ్యు.యు. ౫3.

దోయిలితీర్చు. ద్వ. అ. క్రి. (దోయిలి+తీర్చు.) నమస్కరించు. "రగడ. ఒకర్తుగ నుండుయ ఘోరకష్టలము యథోక్తకారుకు దోయిలి తీర్చుచు .." హంస. ౪, ఆ. ౨౧3.

దోర. జే. వి. 1. రాశి. (శ. ర.); 2 దోంతర,ఉత్పుంజి "ఉ...గద్యపద్యముల్, దొరలు పేర్చినట్లు మడిదోఁగఁగఁ జేయుట...' మార్క. పీఠి. ౫, అం భా. ద్వి. 3౪; 3. పండఁబాఱినకాయ. "వ... పిందెలకు నందమ్మును గాయలకు సోయగంబును, దోరలకు గౌరవంబును, పండులకు మెండును గలిగించి పలాయితహేమంతంబుగ వసంతం బర్యోదయమ్యెడ." ఉద్భ ౧, ఆ. ౮౮. విణ. 1. ఎఱ్ఱఁబాఱినది. "ఉ. కన్నులదోరచాయ లలితంబున లేఁతమరు...కల్లునట్లుగాఁ,గన్నియ నిన్నెఁ గూడి రతికాంక్షలు మీఱి సుఖించు టెన్నఁడో." చంద్ర. ౪, ఆ. ౧౧౧. రం. రా. ఉ. ౯3 పు; 2. ఒఱఁగినది. (చూ. దోరగల్లు.)

దోరగలు = దోరగల్లు. (చూ. దోరగలువడు.)

దోరగలువడు. ద్వ. అ. క్రి. (దోరగలు+పడు.) ఒడ్డగెడవగు. "క. నగులువడి యపుడు వడి సెడి, గగనమణిరథంబు దోరగలువడి నిలిచెన్." కాశీ. ౧, ఆ. ౧33.

దోరగల్లు. దే. వి. (దోర+కల్లు.) ఒకప్రక్క క్రిందికొఱఁగి మఱియొకప్రక్క పైకి లేచి యుండుట, ఒడ్డగెడవు. "చ. కనుఁగవ దోరగల్లులవికారపుఁజూపులఁ గోపుకానుతో,దనె వికమెక్కుసాలుకతడంబడుమాటల ..' శుక. 3, ఆ. ౧౧౯. విణ. ఒడ్డగెడవైనది. "సీ. ఒకదిక్కు దోరగల్లొఱఁగి పైబడుదునో యొలఁగి కమ్ములు ప్రోయ నిలచలింప." హరి. పూ. ౫, ఆ. ౧౬౨.

దోరగల్లుపడు = దోరగలుపడు. "ఆ. సాంధ్యనటనచండచండీశుకుదహాతి,ధరణిచక్ర మొఱఁగి శరధిగ్రుంగ, దోరగల్లుపడియె భూరథేతరభాగ,చక్రమనఁగ నపుడు శశియుఁ దోఁచె." స్వా. ౫, ఆ. 3౫. పి శకుం. 3, ఆ. ౨౮౯.

దోరగాయ. దే వి. (దోర+కాయ.) పండఁబాఱినకాయ. "గీ. కల్పవృక్షాలఁ గలదోరగాయఁ గుడఁగోసి యిట తెచ్చి నిల్పినవాసి యనుచు." పార్వ ౨, ఆ. ౧౨౦. భాగ. ౮, స్క. ౪౪౬.

దోరగించు. దే. స. క్రి. దోరగిల్లఁజేయు. (శ. ర.)

దోరగిలఁబాఱు. దే. అ. క్రి. (దోరగిల్+పాఱు.) పండఁబాఱు. "వ...దోస దోరగిలంబాఱె." కాశీ. 3, ఆ. ౨3.

దోరగిలు. దే. అ. క్రి. ఎఱ్ఱఁబాఱు. "క...శశిపైఁ, గినిసి కనుంగొనలు దోరగిల నిర్దయుఁడై." వరాహ. ౬, ఆ. ౪౯. హ. న. ౪, ఆ. ౪.

దోరణపుఁగమ్మి. వై. వి. (దోరణము+కమ్మి.) ద్వారము మీఁదియడ్డకమ్మి (శ. ర.)

దోరణపుఁబట్టె. వై. వి. (దోరణ+పట్టె.) కపిలెబల్ల క్రిందియడ్డపట్టె. (శ. ర.)

దోరణపుసాటిరిక్క. వ్య. వి. (దోరణము+సాటి+రిక్క.) అనూరాధానక్షత్రము. (శ. ర.)

దోరణము. వై. వి. (సం. తోరణమ్.) 1. మంగళార్థము ద్వారములు లోనగువానికిఁ గట్టుమామిడాకులు లోనగువానిదండ, తోరణము. "సీ. తోరంపుముత్యాలదోరణంబులకాంతి చొక్కమౌచుక్కలదొక్క మాప." దశా. ౧, ఆ. ౨౯౧. య. ౪, ఆ ౧౫౪; 2. బహిర్ద్వారము. "సీ .. దోరణ మనంగ నవ్వు బహిర్ద్వారము .." ఆం. భా. ద్వి. ౨౧.

దోరపండు. దే. వి. (దోర+పండు.) పండఁబాఱిన కాయ. "చ. క్రమమునఁ బిందెలును బసరుఁ గాయలుఁ గాయలు దోరపండులుగ, గమిసీపండులుం గెలలుగట్టి తదున్నతశాఖలన్నియున్." హరి. పూ. ౬, ఆ. ౧౨౨. శుక. ౧ ఆ. ౩౭౭.

దోరపాక. దే. వి. (దోర+పాక.) ఓరపాక. "సీ. దోరపాకసఁగను బాదలి యంచఁగఁ బరఁగుచుండు, భిక్షధఃకృతగృహాభిధ..." ఆం. భా. ౨, ఆ. ౧౬.

దోరము. యా వై. వి. (సం. ద్వారమ్) ద్వారము (శ. ర.) సం. వి. అ. పుం. తోరము, వ్రతాదులందు చేతికిఁ గట్టుకొనుదారము.

దోరవాఱు. దే. అ. క్రి. (దోర+వాఱు.) ఎఱ్ఱఁబడు. "ద్వి. పరిపక్వమై దోరవాఱి కన్నులకు,నరుదైన పరుఁగులు నప్పడంబులును." ఆ. మ. క. ౫, ఆ. ౨౪౦.

దోరసి. సం. వి. అ. న. ఆయుధవిశేషము? "చ... నిశాచరేశ్వరుఁడు క్రిందుగఁ దాఁకి రణంబునందడిం, దొడిఁబడ నేసెఁ దీవ్రతరదోరసినిం దను సీడఁబోక తో,అదమున బిట్టు గిట్టినమఱంది నెఱంగక దుర్మదాంధుఁడై." నిర్వ ౫, ఆ. ౭౭.

దోరు దే. అ. క్రి. 1. చచ్చు. "మ... లింగముల్, కడగొట్టక మనుబిడ్డ గంటుగోరు జంకల్ బద్ద దోరెం గిటుల్,మడిసెన్ గాలెదుపోతులు .." సా. ౧, ఆ. ౧౦౭, ఆం. సం. మాన. ౫౩; 2. వ్రాలు. (చూ. దోర్చు.)

దోరువా. వ్య. వి. (దోరు+వాయి) పక్షివిశేషము. "సీ. కొంగలు బూరేళ్లు కన్నెలేళ్లు నెమళ్లు లావుక దోరువాల్లకుముకులును" రసిక. ౧, ఆ. ౬౭.

దోరెము. దే. వి. డేగలకుఁ గట్టెడుత్రాడు. "వ .. బర్హిబర్హనిబద్ధాగ్రంబులై కొమరారు దోరెపుఁ ద్రాళ్లతోడన్ దిరుగుడుల వెడంగువడి..." స్వా. ౪, ఆ. ౫౮, ప్రబంధ. ౫౩౩.

దోర్గ్రహము. సం. వి. అ. పుం. 1. బాహువులు పట్టుకొనుట; 2. రోగవిశేషము. విణ. (అ. ఆ. అ.) 1. బాహువులతో పట్టుకొనునది, 2. బలిమి కలది.

దోర్చు. దే. స. క్రి. (కల.) 1. ఇటునటు కదల్చు, కంపించు. "క. ఇలఁ జదికిలఁబడి పలుమఱుఁ,దల దోర్చుచు విశ్రుతమగుపదనమున నాలా,జలములు లీఁగెలుసాఁగఁగఁ,బలుకు నతం డాలిగుటిచి పరిచితరక్తిన్." పాండు. ౩ ఆ. ౯౨. భార. స్త్రీ. ౧, ఆ. ౯౭; "గీ....దొంతులు చేరి నాయి, దోర్చ నేర్చెఁ గాక వి యమి సేర్చ నేర్చు." కు. సం. ౧, ఆ. ౯౯.

దోర్మధ్యము. సం. వి. అ. న. 1. బాహువులమధ్య భాగము, 2. మోచేయి.

దోర్మూలము. సం. వి. అ. న. చంక,కక్షము.

దోల. సం వి. ఆ. స్త్రీ. 1. అండోళిక,అందలము, 2. ఉయ్యాలతొట్టి, 3. నీలచెట్టు, 4. ఊఁగుట; 5. ఉయ్యాల,దోలనయంత్రము; 6. డోలి,ఉయ్యాలవంటియానము.

దోలము. సం. వి. అ. పుం. 1. ఊఁగులాట, 2. పల్లకి, 3. ఉయ్యాలతొట్టి.

దోలి సం. వి. 1. డోలి; 2. ఉయ్యాల.

దోలిక. సం. = డోలిక.

దోవతి. దే. వి. మగవారికట్టుబట్ట, పరిధానము. "క. కొడపీడెడు దోవతియును, బెడకలచేతుల..." ఉ. హరి. ౨, ఆ. ౭, భాగ. ౧౦, స్కం. ఉ. ౪౬౮.

దోవి. దే. వి. ఎఱ్ఱనివస్త్రము. "సీ. కటికటిపాటకపటముగోఁ బచ్చచెఱఁగు వల్వపుదోవి రంగు నిల్పు." రా. వి. ౫, ఆ. ౭౯.

దోష. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. భుజము.

దోషకము. సం. వి. అ. పుం. ఆవుదూడ,గోవత్సము.

దోషగ్రాహి. సం. విణ. (న్. నీ. న్.) దోషములనే గ్రహించువాఁడు,తప్పు లెంచువాఁడు.

ధీతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రాగఁబడినది, పీల్పఁబడినది; 2. అనాదరింపఁబడినది; 3. ఆరాధింపఁబడినది.

ధీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పీల్చుట, త్రాగుట; 2. అనాదరము; 3. ఆధారము; 4. వ్రేలు.

ధీమంతుఁడు. సం. వి. త్. పుం. 1. బృహస్పతి; 2. విద్వాంసుఁడు. విణ (త్. మతీ. త్.) శ్రేష్ఠమైన బుద్ధి కలవాఁడు.

ధీయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధరింపఁబడుచున్నది; 2. పోషింపఁబడుచున్నది.

ధీర. సం. వి. స్త్రీ. 1. ధీరురాలు; 2. స్పష్టముగా చెప్పక వ్యంగ్యముగా భర్తయందలికోపము ప్రకటించునాయిక.

ధీరము. సం. వి. అ. న. కుంకుమపువ్వు. విణ (అ. ఆ. అ.) 1. గంభీరము. (ధ్వని. మొ.); 2. మందము. (గాలి మొ.)

ధీరలలితుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధనాయకులలో నొకఁడు; ధీరుఁడును కళాసక్తుఁడునగు నాయకుఁడు, మృదుచిత్తము కళాసక్తియుఁ గలిగి సమస్తభోగములు ననుభవించుచు నిశ్చింతుఁడై యుండునాయకుఁడు. (అలం.)

ధీరశాంతుఁడు. సం. వి. అ పుం. చతుర్విధనాయకులలో నొకఁడు, ధీరుఁడును శాంతుఁడు నగు నాయకుఁడు.

ధీరాధీర. సం. వి. ఆ. స్త్రీ. తప్పుచేసిననాయకునియందలికోపమును వ్యంగ్యముగాను అవ్యంగ్యముగాను ప్రకటించునాయిక.

ధీరుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధుఁడు, 2. బలిచక్రవర్తి; 3. సముద్రుఁడు; 4. చిదాత్ముఁడు. విణ. (అ. ఆ అ.) 1. ధైర్యము కలవాఁడు; 2. నిర్వికారచిత్తుఁడు, 3. పండితుఁడు, 4. స్వతంత్రుఁడు, స్వైరుఁడు; 5. బలము కలవాఁడు; 6. మూర్ఖుఁడు; 7. సాహసవంతుఁడు, తెగువ గలవాఁడు; 8. వినీతుఁడు, సుశిక్షితుఁడు.

ధీరోదాత్తుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధనాయకులలో నొకఁడు, ధీరుఁడు నుదాత్తుఁడు నైన నాయకుఁడు.

ధీరోద్ధతుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధనాయకులలో నొకఁడు, ధీరుఁడు నుద్ధతుఁడు నైన నాయకుఁడు.

ధీవరము. సం. వి. అ. న. ఇనుము.

ధీవరుఁడు. సం. వి. అ. పుం. 1. జాలరి, కైవర్తుఁడు; 2. బుద్ధిమంతుఁడు.

ధీవుఁడు. సం. వి. న్. పుం. 1. శిల్పి; 2. జాలరి; 3. దేవుఁడు. విణ. (న్. వరీ. న్.) ఆలోచన కలవాఁడు; యుక్తిమంతుఁడు.

ధు

ధుంధుమారము. సం. వి. అ. పుం. 1. పట్టుపురుగు; 2. ఆరుద్రపురుగు; 3. కఱదూమము; ఇంటిపొగ.

ధుతము. సం విణ. (అ. ఆ. అ.) 1. కదలింపఁబడినది; 2. ఎగురఁగొట్టఁబడినది; 3. విడువఁబడినది, త్యక్తము.

ధుత్తూరము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త.

ధుని. సం. వి. ఈ. స్త్రీ. నది.

ధున్వత్. సం. శత్రు. 1. కదలుచున్న; 2. కదలించుచున్న.

ధుర. సం. వి. ఆ. స్త్రీ. భారము, బరువు.

ధురంధరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాఁడిని మోయునది; 2. బరువు మోయునది. (ఎద్దు, గుఱ్ఱము మొ.)

ధురంధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కార్యభారము వహించువాఁడు; 2. శ్రేష్ఠుఁడు, అగ్రేసరుఁడు.

ధురీణము. సం. వి. అ. పుం. 1. ఎద్దు, వృషభము; 2. గుఱ్ఱము.

ధురీణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. బరువు మోయువాఁడు; 2. కార్యభారము వహించువాఁడు; 3. అగ్రేసరుఁడు, శ్రేష్ఠుఁడు.

ధుర్యము. సం. వి అ. పుం.=ధురీణము. విణ. (అ.ఆ.అ.) వహించునది. "క. సూర్యోదయావసరమున, దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా ధుర్యగతి నడచె..." భార. విరా ౪, ఆ. 3.

ధుర్యుఁడు. సం.=ధురీణుఁడు.

ధువనము. సం. వి. అ. న. కదల్చుట. పుం. అగ్ని. విణ. (అ. ఆ. అ.) కదల్చునది.

ధూ

ధూంక్ష్ణ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లకాకి.

ధూకము. సం. వి. అ. పుం. 1. వాయువు; 2. కాలము; 3. కామిలారోగము.

ధూకళి. దే. వి. నృత్యవిశేషము. "ద్వి. లలియం ధా వంబు ధూకళియుం ఝుంకళియుం, మఱియుం దేవరయు విభ్రమమును రేఖయుంను, గోఱయుంగ నీరీతి నృత్యంబు సలుప..." బస. 3, ఆ. ౨౨. పు.

ధూతము. సం. విణ. (అ. ఆ అ.) 1. విడువఁబడినది, త్యక్తము; 2. అదల్పఁబడినది, భర్త్సితము; 3 పీవనతో విసరఁబడినది; 4. తిరస్కరింపఁబడినది; 5. తర్కింపఁబడినది; 6 కంపితము; వణఁకింపఁబడినది. "శా. క్రోధం బత్రతికారమై హృదయముం గుందింప నత్యంతచిం, తాధూతాత్ముఁడనైనవాఁడ .." భార. విరా. ౨, ఆ. ౨౬౫.

ధూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కదల్చుట; 2. వణఁకించుట; 3. పీవనతో విసరుట.

ధూననము. సం. వి. అ. న. కదలించుట, చాలనము. పుం. వాయువు. విణ. (అ. ఆ. అ.) కదలించునది.

ధూనము. సం. విణ. (అ. ఆ. అ.) కంపితము, కదల్పఁబడినది.

ధూపనము. సం. వి. అ. న. 1. ధూపము వేయుట, పొగవేయుట; 2. సంతాపము కల్గించుట.

ధూపము. సం. వి. అ. పుం. 1. సుగంధిద్రవ్యముల నుండి వచ్చుపొగ; 2. పొగకు సాధన మగుసుగంధిద్రవ్యము విణ. (అ. ఆ. అ.) 1. పొగ వేయునది. 2. సంతాపముకలిగించునది.

ధూపాయితము. సం.=ధూపితము.

ధూపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధూపము వేయఁబడినది; 2. తపింపఁజేయఁబడినది.

ధూమకేతనము సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. తోఁకచుక్క.

ధూమకేతువు. సం. వి. ఉ. పుం. ధూమకేతనము.

ధూమధ్వజుఁడు. సం. వి. అ. పుం. అగ్ని.

ధూమము. సం. వి. అ. పుం. 1. పొగ; 2. ఆవిరి; 3. తోఁకచుక్క; 4. అజీర్ణపుత్రేనుపు.

ధూమయోని. సం. వి. ఇ పుం. 1. మబ్బు, మేఘము; 2. తుంగముస్తె. ౘ.

ధూమలము. సం. వి. అ. పుం. నలుపుకలసినయెఱుపు, పొగవన్నె. విణ. (అ. ఆ. అ.) పొగవన్నె కలది, ధూమ్రము.

ధూమవేధి. సం. వి. న్. పుం. లోహాదులను సువర్ణముగా మార్చుఔషధవిశేషము. "వ ..పంచలోహాయుతంబై యొప్పునప్పాదమిశ్రితకొలఁపుచవికెం దనచేలిధూమవేధి యనునౌషధంబుచేత శుద్ధసువర్ణంబు గావించి..." భో. ౧, ఆ. ౫౩.

ధూమాయితము. సం. విణ. (అ. ఆ. అ.) ధూమము కలది.

ధూమి. సం. విణ. (న్. నీ. న్.) ధూమము కలది.

ధూమిక. సం. వి. ఆ. స్త్రీ. పొగమంచు.

ధూమ్య. సం. వి. ఆ. స్త్రీ. ధూమసమూహము.

ధూమ్యాటము. సం. వి. అ. పుం. కాఁకటిమూఁకపక్షి.

ధూమ్రకము. సం. వి. అ. పుం. లొట్టియ, ఉష్ట్రము.

ధూమ్రపత్త్ర. సం. వి. ఆ. స్త్రీ. పొగాకు ౘ.

ధూమ్రము. సం. వి. అ. పుం. 1. పొగవన్నె; 2. కాఁకటిమూఁకపిట్ట. విణ. (అ. ఆ. అ.) పొగవన్నె కలది.

ధూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదల్పఁబడుచున్నది; 2. వణఁకింపఁబడుచున్నది.

ధూర్జటి సం. వి. ఇ. పుం. బరువైనజటలు గలవాఁడు-శివుఁడు.

ధూర్తకము. సం. వి. అ. పుం. వంచకము, నక్క.

ధూర్తము. సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్త ౘ; 2. చోరకము ౘ. న. 1. బిడలవణము; 2. ఇనుపతుప్పు.

ధూర్తు. సం.=ధూర్తుఁడు. (వంచకుఁడు,టక్కరి.) "ద్వి. వేవేగ నాలోవివేకి వెల్ల మాన్పుమని వేఁడుకొనుటయు నవ్వటుధూర్తుమనసులో వేతొక్క మతము చింతించి." ద్వి. హరిశ్చ.ఉ.౧౦౩౩ పం.

ధూర్తుఁడు. సం. వి. అ. పుం. 1. వంచకుఁడైనవాఁడు, శఠుఁడు. (అలం.); 2. శివుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. వంచకుఁడు; 2. జూదరి; 3. హింసకుఁడు.

ధూర్వహము. సం.=ధురంధరము.

ధూర్వహుఁడు. సం.=ధురంధరుఁడు.

ధూళి. సం. వి. ఇ,ఈ. స్త్రీ. దుమ్ము.

ధూళించు. సం. స. క్రి. చిలుకు, ద్రవించు. "క. కాళాంజి భూషా నొకపలి, నాళికదళాతమ్రామోలనతేనియలన్, ధూళించుపువ్వుగుచ్ఛము, దాలుచునుద్యానదేవతయునుం బోలెన్." సాంబో. ౧, ఆ. ౧౮౧.

ధూళిఁగలపు. మి. స. క్రి. (ధూళిఁగలయు ధా. ప్రే.) దుమ్ములోఁ గలపు; నశింపఁజేయు. "గీ. దొరతనము నీతినియమంబు ధూళిఁగలపు, నంగనాజనులతోడఁ దైనట్టివాఁడు." దశా. ౫, ఆ. ౧౪౮.

ధూళీగలయము. వి. అ. క్రి. (ధూళిన్ + కలయు.) దుమ్ముతోఁగలయునటించు. "సీ. ఊరక విరఁబడు మారవారాచంబు దుండగంబునఁ దన్ను ధూళిఁ గలయ." వరాహ. ౪, ఆ. ౨౧.

ధూళిక. సం. వి. ఆ. స్త్రీ. పొగమంచు, కుజ్ఝటి.

ధూళిధ్వజుఁడు. సం. వి. అ. పుం. ధూళి జెండాగా గలవాఁడు - వాయువు, గాలి.

ధూసరము. సం. వి. అ. పుం. 1. బూడిదవర్ణము; 2. గాడిద; 3. లొట్టియ; 4. పావురము. విణ. (అ. ఆ. అ.) బూడిదరంగు కలది.

ధూసరితము. సం. విణ. (అ. ఆ. అ.) బూడిదరంగు కలదిగాఁ జేయఁబడినది. "మ ..కృతాంతాకారు నిశ్వాసధూ, మశిఖాధూసరితోగ్రదుర్గతరుగుల్మ ప్రాతు పారిద్రవర్ణశరీరుఁన్." భార. అర. ౪, ఆ. ౧౦౫. విరా. ౨, ఆ. ౧౫౬.

ధూసరీభూతము. సం. విణ. (అ. ఆ. అ.) ధూసరవర్ణము కలది అయినది. "సీ. భూరేణుధూసరీభూతవిగ్రహంబులఁగా..." భార. అర. ౧, ఆ. ౨౧౦.

ధూసరుఁడు. సం. వి. అ. పుం. గాండ్లవాఁడు, తెలికవాఁడు.

## ధృ

ధృతము. సం. వి. అ. న. 1. పతనము, పాటు; 2. ఉనికి, స్థితి; 3. తాల్పుట, ధారణము; 4. గ్రహణము, పట్టుకొనుట. విణ. (అ. ఆ. అ.) 1. ధరింపఁబడినది; 2. పట్టుకొనఁబడినది, గృహీతము.

ధృతరాష్ట్రుఁడు. సం. వి. అ. పుం. 1. దుర్యోధనాది కౌరవులతండ్రి; 2. సర్పవిశేషము; 3. రాజు; 4. ఒకానొకగంధర్వుఁడు.

ధృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. తాల్పుట, ధరించుట; 2 గ్రహించుట, పట్టుకొనుట, 3. ధైర్యము; 4. స్థిరత్వము; 5. సంతోషము; 6. సుఖము; 7. విష్కంభాదియోగములలో నొకటి. (జ్యోతి.); 8. ఒకానొకఛందస్సు; 9. మాతృకాభేదము. పుం యజ్ఞము.

ధృత్వుఁడు. సం. వి. న్. పుం. 1. విష్ణువు; 2. బ్రాహ్మణుఁడు. విణ. (న్. నీ. న్.) 1. బుద్ధిమంతుఁడు, 2. ధరించువాఁడు.

ధృష. సం. వి. ఆ. స్త్రీ. మిరియ్యాకుపొన్నశి.

ధృషువు. సం. వి. ఉ. పుం. గుంపు, సంఘాతము. విణ. (ఉ) 1. ప్రగల్భుఁడు, దిట్ట; 2. సమర్థుఁడు, దక్షుఁడు; 3. నేర్పరి, నిపుణుఁడు.

ధృష్ట. సం. వి. ఆ. స్త్రీ. కులట, అంకుటాలు.

ధృష్టి. సం. వి. ఇ. స్త్రీ. దిట్టతనము, ధార్ష్ట్యము.

ధృష్టుఁడు సం. వి. అ. పుం. శృంగారనాయకులలో నొకఁడు, తప్పుచేసియుం జంకనివాఁడును బెదరింపఁబడియు సిగ్గునొందనివాఁడును, చేసినతప్పు ప్రత్యక్షముగా కనఁబడుచున్నను అసత్యమాడువాఁడు నగునాయకుఁడు. (అలం.) విణ. (అ. ఆ. అ.) 1. ప్రగల్భుఁడు, దిట్టతనము గలవాఁడు; 2. సిగ్గులేనివాఁడు, 3. కనికరము లేనివాఁడు, నిర్ఘృణుఁడు; 4. గర్వితుఁడు, అహంకారము గలవాఁడు.

ధృష్ణి సం. వి. ఇ. పుం. కిరణము.

ధృష్ణువు. సం. విణ. (ఉ) 1. ధృష్టుఁడు; 2. కంచుకి.

ధృష్యము. సం. = ధర్షణీయము.

## ధే

ధే. దే. వి. గుఱ్ఱము మొదలగు జంతువులను తోలుట యందలిధ్వని కనుకరణము. "క. నింగికి ధే యని కదలిం, చెం గడుపడి గలుగుతనదు సింగము..." కళా. 3, ఆ. ౭౫, శై. ౪, ఆ. ౭౭.

ధేనుక. సం. వి. ఆ. స్త్రీ. 1. లేఁగటియావు; 2. ఆఁడేనుఁగు; 3. పార్వతి.

ధేనుకము. సం. వి. అ. పుం. 1. చీరపేను; 2. రతిబంధవిశేషము.

ధేనువు. సం. వి. ఉ. స్త్రీ. 1. ఆవు; 2. లేఁగటియావు.

ధేనుష్య. సం. వి. ఆ. స్త్రీ. 1. తాకట్టుపెట్టినపాఁడియావు; తాకట్టుపెట్టినపాఁడిబఱ్ఱె (బాకీవడ్డ యావు అని కొందఱు. శ. ర.)

## ధై

ధైనుకము. సం. వి. అ. న. 1 ధేనుకలసమూహము; 2. రతిబంధవిశేషము. విణ. (అ. ఈ. అ.) ధేనుకాసంబంధమైనది.

ధైర్యము. సం. వి. అ. న. 1. ధీరత్వము; 2. నిర్వికారచిత్తత; 3. గాంభీర్యము; 4. ధృష్టత్వము, అవినేయత. మేఘ. ౧, స. ౪౦. శ్లో.

ధైవత్యము. సం. వి. అ. న. పేరు.

## ధో

ధోరణము. సం. వి. అ. న. 1. ఎక్కఁదగు ఏనుఁగు లోనగువాహనము; 2 అశ్వాదులగతి. పుం. కూంస.

ధోరణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. పంక్తి, పరంపర; 2. రచనాపద్ధతి.

ధోరితము. సం. వి. అ. న. వి. చంపుట, వధము; 2. గతి.

ధౌ

ధౌతము. సం. వి. అ. న. 1. ప్రక్షాళనము, కడుగుట; 2. శుద్ధిచేయుట; 3. వెండి. విణ. (అ. అ. అ.) 1. కడుగఁబడినది, ప్రక్షాళితము; 2. పరిశుద్ధము చేయఁబడినది; 3. తెల్లగాఁ జేయఁబడినది.

ధౌరంధర్యము. సం. వి. అ. న. ధురంధరత్వము. కాశీ. ౫, ఆ. ౧౮౫. శైవ. ౨, ఆ. ౭౯.

ధౌరితకము. సం. వి. అ. న. అశ్వ్కాందితముకంటె నధికమై చతురమైనయొకయశ్వధార, అశ్వగతిభేదము.

ధౌరితము. సం.=ధౌరితకము.

ధౌరేయము. సం.=ధురీణము.

ధౌరేయుఁడు. సం.=ధురీణుఁడు.

ధౌర్త్యము. సం. వి. అ. న. వంచన,ధూర్తత్వము.

ధ్మా

ధ్మాత. సం. విణ. (ఋ. త్రి. ఋ.)=ధ్మాయకుఁడు

ధ్మాతము. సం విణ. (అ. అ. అ.) 1. ఊఁదఁబడినది; 2. కాల్పఁబడినది, దగ్ధము; 3. ఉదికినది.

ధ్మాతవ్యము. సం. విణ. (అ. అ. అ.) 1. ఊఁదఁదగినది; 2. ఉడికింపఁదగినది.

ధ్మానము. సం వి. అ. న. 1. ఊఁదుట; 2. ఉబ్బుట; 3 కాల్చుట. భార. ఆది. ౧, ఆ. ౧౧౧.

ధ్మానీయము. సం.=ధ్మాతవ్యము

ధ్మాపనము. సం. వి. అ. న. 1. ఉడికించుట; 2. కాల్పించుట.

ధ్మాపితము. సం. విణ. (అ. అ. అ.) 1. ఊఁదింపఁబడినది; 2. ఉడికింపఁబడినది; 3. కాల్పింపఁబడినది.

ధ్మాయకుఁడు. సం. విణ. (అ. యి క. అ.) 1. ఊఁదువాఁడు; 2. ఉడికించువాఁడు.

ధ్మాయమానము. సం. విణ (అ. అ. అ.) 1. ఊఁదఁబడుచున్నది; 2. ఉడికింపఁబడుచున్నది.

ధ్యా

ధ్యాత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. ధ్యానించువాఁడు; 2. చింతించువాఁడు.

ధ్యాతము. సం. విణ. (అ. అ. అ.) 1. ధ్యానింపఁబడినది; 2. చింతింపఁబడినది.

ధ్యాతవ్యము. సం. విణ. (అ. అ. అ.) 1. ధ్యానింపఁదగినది; 2. చింతింపఁదగినది.

ధ్యానము. సం. వి. అ. న. 1. పరమాత్మనుచింతించుట, అద్వితీయవస్తువునందు అవిచ్ఛిన్న మగునంతఃకరణవృత్తిప్రవాహము; 2. చింతించుట, తలపోయుట.

ధ్యానించు. సం స. క్రి. ధ్యానముచేయు, తలపోయు. "సీ తనహృదయాకాశమునఁ బిశాచముల నుంచి ధ్యానించి ..గీ. వీరవర్గమంబుఁ గావించె విస్మయముగ." ఉ. రా. ౨, ఆ. ౧౬౭.

ధ్యానితము సం. విణ. (అ. ఈ. అ.) ధ్యానముచేఁ గలుగునది. స్వా. ౬, ఆ. ౮౨.

ధ్యానీయము. సం.=ధ్యాతవ్యము.

ధ్యామము. సం. వి. అ. న. 1. దవనము*; 2. కామంచిగడ్డి *.

ధ్యాయకుఁడు. సం. విణ. (అ. యిక. అ.)=ధ్యాత.

ధ్యాయత్. సం. శత్ర. ధ్యానించుచున్న.

ధ్యాయమానము. సం. విణ. (అ. అ. అ.) ధ్యానింపఁబడుచున్నది.

ధ్యాయి. సం. విణ. (న్. నీ. న్.) ధ్యానముచేయువాఁడు. "మాలిని. తపరితవిహిత గాఢధ్యాయి ప్రమోదవాదా." భార. అను. ౪, ఆ. ౪౫౧ "ఉ...విష్ణుహూపాయ నమశ్శివాయ యని పల్కుడుభక్తజనంబు వైదిక,ధ్యాయిత నిచ్చ మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్." భార. విరా. ౧, ఆ. ౧. (ధ్యాయిత=ధ్యానము.)

ధ్యే

ధ్యేయము. సం. విణ. (అ. అ. అ.) ధ్యానింపఁదగినది. భార. సభా. ౧, ఆ. ౧౦౬.

ధ్రి

ధ్రియమాణము. సం. విణ. (అ. అ. అ) 1. ధరింపఁబడుచున్నది; 2. ధరించుచున్నది.

ధ్రు

ధ్రువ. సం. వి. ఆ. స్త్రీ. 1. గీతివిశేషము; 2. స్రుగ్భేదము, యజ్ఞపాత్రభేదము; 3 గుబ్బపువుడి; 4. గుబ్బపువుడి యుండుచోటు; 5. మంచియిల్లాలు, సాధ్వి; 6. ముయ్యాకుపొన్న*.

ధ్రువము. సం. వి. అ. పుం. 1. ధ్రువనక్షత్రము; 2. విష్కంభాదియోగములలో నొకటి. (జ్యోతి); 3. మోడు; 4. గతి; 5. తాళవిశేషము; 6. శాఖ, శరాలి; 7. మట్టిశి; 8. ఒకరకపుగుబ్బపు

కుడి; 9. యజ్ఞపాత్రభేదము. న. 1. ఆకాశము; 2. కర్మము; 3. నిశ్చయము.

ధ్రువుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4 అష్టవసువులలో నొకఁడు; 5. ఉత్తానపాదుని కొడుకు.

## ధ్వ

ధ్వంసకుఁడు. సం విణ. (అ. సీ. అ.) 1 ధ్వంసమగువాఁడు, నశించువాఁడు; 2. భ్రష్టుఁడు; 3. ధ్వంసము చేయువాఁడు.

ధ్వంసనము. సం. వి. అ. న. 1. నాశము; 2. నశింపఁజేయుట; 3. భ్రంశము.

ధ్వంసనీయము. సం. = ధ్వంసయితవ్యము.

ధ్వంసమానము. సం. విణ. (అ. ఆ. అ.) నశించుచున్నది.

ధ్వంసము. సం. వి. అ. పుం. 1. నాశము; 2. భ్రంశము. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయునది.

ధ్వంసయత్. సం. శత్రం. ధ్వంసము చేయుచున్న.

ధ్వంసయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయుచున్నది.

ధ్వంసయితృ. సం. విణ. (బు. త్రీ. బు.) నశింపఁజేయువాఁడు.

ధ్వంసయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయఁదగినది.

ధ్వంసితృ. సం. విణ. (బు. త్రీ. బు.) 1. నశించువాఁడు; 2. భ్రంశమునొందువాఁడు.

ధ్వంసితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. భ్రంశము చేయఁబడినది; 2. నశింపఁజేయఁబడినది.

ధ్వంస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయఁబడుచున్నది.

ధ్వంస్యము. సం. = ధ్వంసయితవ్యము.

ధ్వజము. సం. వి. అ. పుం. న. 1. టెక్కెము, పతాక; 2. ధ్వజస్తంభము; 3. గురుతు, చిహ్నము; 4. గర్వము; 5. కుంచముకోడు, ఖట్వాంగము; 6. కుగగుణి. పుం. 1. చెట్టు; 2. తాడిచెట్టు.

ధ్వజి. సం. వి. న్. పుం. 1. తేరు, రథము; 2. కొండ; 3. పాము; 4. నెమిలి; 5. గుఱ్ఱము; 6. బ్రాహ్మణుఁడు. విణ. (న్. నీ. న్.) 1. జెండా పట్టుకొని పోవువాఁడు; 2. గురుతు కలవాఁడు.

ధ్వజిని సం. వి. ఈ. స్త్రీ. 1. సేన; 2. సేనాభేదము.

ధ్వజుఁడు. సం. వి. అ. పుం. కల్లు అమ్మెడివాఁడు, శౌండికుఁడు.

ధ్వనత్. సం. శత్రం. ధ్వనిచేయుచున్న.

ధ్వననము. సం. వి. అ. న. 1. ధ్వనిచేయుట; 2. వ్యంగ్యము. (అలం.); 3. అవ్యక్తధ్వని.

ధ్వనము. సం. వి. అ. పుం. 1. శబ్దము; 2. అవ్యక్తధ్వని.

ధ్వని సం. వి. ఇ. పుం. 1. శబ్దము, చప్పుడు; 2. వ్యంజనావృత్తితో తోఁచెడియర్థము; 3. వ్యంగ్యప్రధానకావ్యము. (అలం.)

ధ్వనించే. సం. అ. క్రి. శబ్దించు, మ్రోయు. (శ.ర.)

ధ్వనితము. సం. వి. అ. న. 1. శబ్దము; 2. మేఘగర్జనము, ఉఱుము. విణ. (అ. ఆ. అ.) 1. మ్రోసినది, ధ్వనిచేసినది; 2. వ్యంజితము, సూచితము. (అలం.)

ధ్వన్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వనిచే తెలుపఁబడుచున్నది, సూచితము.

ధ్వస్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాశము నొందినది; 2. భ్రంశము నొందినది.

ధ్వస్తి. సం. వి. ఇ. స్త్రీ. = ధ్వంసము.

## ధ్వా

ధ్వాంక్షము. సం. వి. అ. పుం. 1. కాకి; 2. కొంగ, బకము.

ధ్వాంక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1 ఆఁడుకాకి; 2. కారుకొల్లికి.

ధ్వాంక్షుఁడు సం వి అ పుం. 1. భిక్షుకుఁడు; 2. వడ్రంగి, తక్షకుఁడు.

ధ్వాంతము సం. వి. అ న. చీఁకటి, అంధకారము.

ధ్వానము. సం. వి. అ. పుం. ధ్వని..

## న

న. ఊ. థ. ఒకయక్షరము. దే. అవ్య. 1. ఉదంతములకును ఋకారాంతములకును ఏకత్వమున కు కైకయి ప్రత్యయములు పరమగునపు డాగమముగా వచ్చును. "క, సీవిజయోత్సాహమునను..." భార. ఆది. ౨, ఆ. ౧౦౬. "చ...విధాత్రుననైనను నేరఁబోలునే" భార. ఆది. ౧, ఆ. ౧౯. "చ ..అట్టికర్ణునకయి నీవు నేటికి మనోవ్యథ ..."భార. శాం. ౧, ఆ. ౩౮; 2. కంటె అందు వర్ణకములు ద్వితీయైకవచనమును పరమగునపుడు ఉదాత్తజడవాచకములకు ఆగమముగా వచ్చును. "చ...శక్రుతురకతంబునకంటె సురుండు లేండు ..." భార. ఆది. ౪, ఆ. ౯౩. "చ. అనఘ గృహస్థధర్మమునయందు..." భార. అను. ౧,

౪౩. "మ. అనురాగంబునఁ బొందుచుండె నొకఁ డేకాంతప్రదేశంబునన్." దశ. ౧౦, ఆ. ౧౦; 3. పక్షిప్రభృతిపురుషులయందు ఉదంతజడవాచకములకు వచ్చు ఆగమము. "చ ..శౌచ రపాకరంబునవిధంబున..." భార ఆర. ౬, ఆ. ౧౯. "క...భిన్నకుంభమునఁగో,యము లట్టు ల యధ్రువంబు లగు .." భార. ఆది ౨, ఆ. ౧౩౪; 4. గుణవాచకములగు నల్ల ఎఱ్ఱ మున్నగు శబ్దములకు భావార్థమున వచ్చుతద్ధితప్రత్యయము ఉదా:—నల్లన, ఎఱ్ఱన. మొ; 5. కొన్నిధాతువులమీఁదవచ్చుకృత్ప్రత్యయము ఉదా:-గడన, దట్టన మొ.; 6. భూతకాలక్రియకు విశేషణవివక్ష యందు వచ్చుప్రత్యయము. ఇది పరమగునపుడు తుదియుకారమున కికార మాదేశ మగును. "ఉ. పంపినకోపమున్ ..."భార. విరా. ౨, ఆ. ౧౩౯. ప్ర. ద్రు. 1. ఉదంతజడవాచకములకు వచ్చు సప్తమీవిభక్త్యేకవచనము. "చ ..అన్యులన్, మన మునసేరియుం దలఁప .." భార. ఆది. ౪, ఆ ౧౩౪; 2. ఉదంతజడవాచకములకు వచ్చుతృతీయైకవచనము. (ఒక్కొకచో ఆజడవాచకమున కును గానఁబడుచున్నది.) "సీ. గమనవేగంబున ద్రుమలతాజాలసంచాలన సేయుచు .." భార ఆర. 3, ఆ. 3౧౨. "ఉ. ఏపున గిట్టి యేనుఁగున సేనుఁగు వైచుచు..." భా. రా. యు ౯౮౦; క్రియలకు చేదాద్యర్థమందు వచ్చును. (ఇది పరమగునపుడు తుదియుకారమున కికార మాదేశముగా వచ్చును.) "చ. తెగ మొనవెత్తిపోవఁ బగఁ దీర్పఁగ వచ్చినఁ గ్రొర్య మెందు .." భార. ఉద్యో. 3, ఆ. ౨౧; 4. క్రియావిశేషణత్వవివక్షయందు కొన్నిమొదల నుదంతముల కను ప్రయుక్త మగును. "వ...కుంతిని ప్రియపూర్వకంబున సంభావించి..." భార. ఆది. ౫, ఆ. ౧౫౨. సం. వి. అ. పుం. 1. మౌక్తికము; 2. విఘ్నేశ్వరుఁడు; 3. ధనము; 4 బంధము; 5. యుద్ధము; 6. బుద్ధుఁడు విణ. (అ. ఆ. అ.) 1. బలువనిది; 2. శూన్యము. అవ్య. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.) 1. భిన్నము, వేఱైనది. ఉదా—నాస్త్యుష్ణము, నాతిశీతము మొ; 2. అభావము, లేమి. "శా...రాజ్యము నిత్యమున్ సతతమే కాయంబు నాపాయమే." భాగ. ౮, స్కం. ౫౮౨.

నంటు. దే. స. క్రి. సేలను కోరాడు. (శ. ర.)

నంగ. = నంగనాచి. (శ. ర.)

నంగనాచి. దే. వి. వర్ణ-చిలుక. విణ. సాహసకృత్యము లొనరించియు నైపకేమియుఁ దెలియనిదానివలె నటించువాఁడుది. "చ...నిక్కము గాఁగను నాతఁ డేమియున్, దెలియఁడు పాదుబిడ్డఁ డని సేరుపుమాటలఁ దేలపాడి గ్రాదిలిచుకుచేతఁ జక్కటులం దిద్దెద వెంకటినంగనాచివే." పా. 3, ఆ. ౫౫. స్వా° 3, ఆ. ౨౮.

నంగి. దే. విణ 1. ముక్కుతో పలుకఁబడునది. (మాట. శ. ర.); 2. అస్పష్టము. (మాట.) వ్యవః- నంగినంగిమాటలుపలుకకుము.

నంగు. దే. అ. క్రి. ముక్కుతో మాటలాడు. (శ.ర.)

నంచు = నంజు. (చూ. నంచుకొను.)

నంచుకొను = నంజుకొను (నంచు+కొను.) (కూరలు లోనగువ్యంజనములు తిను.) "గీ. ఖండరసగుంభితార్ద్రకశకలములును, సర్షపామ్రాదిశోభసంశకలంబునంచుకొంచు నొకించుకం దించఁ బోక, లోపలికిఁ దించెఁ దాపనద్వివిధయము." బహు. ౪ ఆ. ౫౦.

నంజ. దే. వి. 1. మాగాణిభూమి. (శ. ర ప్రా.); 2. (నంజు-ధా.) నంజుకొనువస్తువు, ఉపదంశము. "వ ..కెంజిగురాకు మోవినంజలు జవిగొనుచుఁ గ్రోలి సోలి .." పారి. ౨, ఆ. ౫౨. దశ. ౧౦, ఆ. ౧౮.

నంజుకొను. దే. స. క్రి. (నంజు+కొను.) 1. కూరలు లోనగువ్యంజనములుతిను; ఆస్వాదించు. "ఉ... గుజ్జువెన్నెలల నంజుకొన నచ్చికలఁ బుజ్జగింపుచుఁ గూరిమిమీఱఁ జేరి..." ఘటికా. ౨, ఆ. ౧౪౬; 2. తిను, భుజించు. "వ. బాహ్లీకదేశమునవారు గోమాంసంబు నంజుకొని మద్యపానంబు చేసి..." భార. కర్ణ. ౨, ఆ. ౧౦౯.

నంజలి. దే. వి. సంకోచము. (చూ. నంజలిపడు.)

నంజలిపడు. ద్వ. అ. క్రి. (నంజలి+పడు.) సంకోచించు, వెనుదీయు. "క. రంజిలి తామును మున్నుగ, నంజలిపడ కిచ్చెనొ నయముగ వారుం, గొంజక యిత్తురు..." కుచేల. ౧, ఆ. ౧౦౮.

నంజు. దే. అ. క్రి. భక్షించు; నంజుకొను. "సీ. కార్తెఁ బాయస మజ్జిగద్భుతాకార మాషములు మాంసంబు నంజంగఁ గలుగు, నన్నంబు..." భార. అను. ౨, ఆ ౩౭౮. భాగ. ౧౦. స్కం. ఉ. ౬౮౩. వి. 1. కూర, పచ్చడి మొదలగువ్యంజనము. "ఉ... నాలుగు సైదునంజులుఁ, లప్పల తోడఁ గ్రొంబెరుఁగు లక్షణవక్షులయి-ట తూకకున్." క్రీడా. ౧౩౭; 2. విషము. "ఉ. నాలుక బంతి ప్రేలఁబడి నంజునఁ దోఁగి..." స్వా. ౫, ఆ. ౫౦.

నంజుకొను = నంజికొను. (కూర లోనగువ్యంజనములను తిను; ఆస్వాదించు.) "ఉ. వెన్నెలగుజ్జు నంజుకొని వెన్నెలప్రోత్రు భుజించి...చకోరదంపతుల్..." కాశి. ౪, ఆ. ౯౩. కళా. ౬, ఆ. ౧౨౭.

నంజుడు. దే. వి. (నంజుధా.) 1. మాంసము. "క. శశవర్ష దుష్కరతకు,స్కృతి నంజుడు దినమి నగు సుకృతము .." భార. అను. ౪, ఆ. ౨౯౯. భో. ౩, ఆ. ౨౦౩.

నంజుడుదిండి. దే. వి. (నంజుడు+తిండి.) రాక్షసుఁడు. "క. కదయొదయులఁ దతిమెదునం,జుడు దిండులు మిమ్ము మునుకఁ జూతురె..." అచ్చ. సుం. ౧౫౫. వి. మాంసము తినువాఁడు. (క. ర.) ఇట్లే:-నంజుడు మేపరి అచ్చ. యు. ౩౭౭.

నంటు. దే. వి. 1. స్నేహము. "గీ. తొలుదొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళ యొసంగి,నంటు గావించు టెల్లఁ దనసాధయుచలి, జనకనూదాహసాహాయ్యమునకుఁ గాక, కానవా వారి కెవ్వారిఁ గమలవైరి." పరి. ౪, ఆ. ౩౬. ఉ. హరివ్ర. ౪, ఆ. ౪౫; 2. సంపర్కము, సంబంధము. 'సీ. రేలెల్ల నమృత మరీచినంటున నంటఁగరఁగి నిర్మలకరయాూర్తురులఁ దొరఁగి." పరి. ౨, ఆ. ౨౧; 3. శ్రద్ధ. "గీ. కడునొయూరంబు లైన నీనడలకరణి, నడుపఁగ నెఱుంగ నంచు నో నంటుతోఁడ, నంచతోఁదల నడిపించి పెంప నెల." సా. ౨, ఆ. ౨౦౦; 4. బంధువు; ప్రియుఁడు. "మ. తోవకుందూరపు నంటు రేమగుచ పొందుం బూర్వపక్షంబు .." పరి. ౪, ఆ. ౧౭౯. కళా. పీఠి. ౩౩.

నంటుకత్తె. ద్వ. విశే. (నంటు+కత్తె.) ప్రియురాలు. "గీ. నంటుకత్తెలు తమతమయనంబు పుష్పితించఁ గాఁడినవగఁ జెప్పుకొందు మించియక్కికవులల్లు మందులయొంటికాంద్రు." కుచల. ౨, ఆ. ౧౧౪.

నంటుకాఁడు. దే.విశే.(నంటు+కాఁడు.) ప్రియుఁడు, వలపుకాఁడు. "చ. అటువలె నంటుకాఁడు చనినంత కెలంత దురంతచింతచేఁ, బోటుపోట బావ్వముల్ దొరుఁగఁ బొక్కుచు..." శకుం. ౪, ఆ. ౨౭ శుక. ౩, ఆ. ౨౩.

నంత. సం. విశే. (బు త్రి. బు.) 1. నమస్కరించువాఁడు; 2 వంగువాఁడు

నంతవ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁదగినవాఁడు; 2. భూజింపఁదగినవాఁడు.

నంద. సం. వి. ఆ. స్త్రీ. 1. మృణ్మయపాత్రము, ముంత; 2. సంపద, కలిమి. 3. మగనిపోదరి, ఆఁడుబిడ్డ; 4. ఆనందము; 5. తిథివిశేషము, పాడ్యమి, షష్ఠి, ఏకాదశి అనుతిథులలో నొకొ యొకటి; 6 దుర్గామూర్తిభేదము.

నందకము. సం. వి. అ. పుం 1. విష్ణుఖడ్గము; 2. కత్తి; 3. కప్ప; 4. ఆనందము. విశే. (అ. దిశా. అ.) 1. సంతోషించునది; 2. సంతోషపెట్టునది.

నందన. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు. అ. పుం. ఒక సంవత్సరము.

నందనము. సం. వి. అ. పుం. 1. కప్ప; 2. యజ్ఞసాధనవిశేషము. న. 1. ఇంద్రునియుద్యానవనము; 2. ఉద్యానవనము; 3. సంతోషించుట; ఆనందము. విశే (అ. ఆ. అ) 1. సంతోషించునది; 2. సంతోషపెట్టునది; 3. (అ. ఈ. అ.) సంతోషమునకు సాధనమైనది.

నందనుఁడు. సం. వి. అ. పుం. కుమారుఁడు కొడుకు.

నందము. సం. వి. అ. పు 1. హర్షము, సంతోషము; 2. కప్ప; 3. కుబేరునినవనిధులలో నొకటి.

నంది. సం. వి. న. పుం. 1. కుమారుఁడు, కొడుకు; 2. నందికేశ్వరుఁడు; 3. శివునివృషభము; 4. మఱ్ఱి; 5. కలువాన్వి. ఇ. పుం. స్త్రీ. ఆనందము. పుం. నందికేశ్వరుఁడు. విశే (న. ని. న.) 1. ఆనందించువాఁడు; 2. ఆనందింపఁజేయువాఁడు.

నందించు. సం. అ. క్రి. 1. సంతోషించు, ఆనందించు. "క. అందఱు హరిదాసుఁ బ్రణయు,న్నంది మనోజ్ఞాంచు లబ్ధబంకానలునై, నందించిరి..." హరి. ఉ. ౪, ఆ. ౨౫౫. భా. రా. కిష్కి. ౨౬౩. స. క్రి. 1. స్తుతించు, పొగడు. "క.

నందిజనంబులు లోకములందును బరిశిష్టకర్ము లగు భూపతులక్, నందించుట వశ్యంబైనం దగదు నుతింప శిశుజనంబులకౌదిన్." భాగ. ౮, స్కం ౪౪౧, ౪౫౨; 2. కటాక్షించు, కరుణించు. "గీ. ఒకడుఁ డివ్వడు నందించిరొ తలంప నర్థి నిందించిరో మత్క్యతికదండమునకు నలోచకుందిరో యనుచు వంశ యాత్మ లగుచు వివేకించి యంతలోన."భాగ. 3, స్కం. ౫౩౭.

నందిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇంద్రుని కేళీవనము; 2. మంత్; 3 మగనిసోదరి, ఆడుబిడ్డ; 4. తిథివిశే షము, నంద.

నందికుఁడు. సం. వి. అ. పుం. శివపార్శ్వచరుఁ డగు దేవకుఁడు, నంది.

నందిని. సం. వి. ఈ. స్త్రీ. 1. కూఁతురు; 2. ఆడు బిడ్డ, మగనిసోదరి; 3. కామధేనువుకూఁతురు; 4. గంగ; 5. దుర్గ; 6. కరకశే; 7. ఏలకితే.

నందివర్ధనము. సం. వి. అ. పుం. 1. పక్షాంతము (అమా వాస్య లేక పూర్ణిమ.); 2. స్వర్గము; 3 ఒక తొకపూలచెట్టు. (దీనిపూవులు శివప్రీతికరములు.) "సీ. బొండుమల్లె లశోకములు మంకెనలు నంది వర్ధనములు విరవాదివిరులు." ఉ. రా. 3, ఆ. ౨౦౧. సానందో. 3, ఆ. ౫౬.

నందివృక్షము సం. వి. అ. పు వృక్షవిశేషము.

నందివాహనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

నందుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు, పరమాత్మ; 2. కృష్ణుని పెంచినతండ్రి.

నంద్యావర్తము. సం. వి. అ పుం న. నందివర్ధనముశే.

నంబరు. ఆం. వి. సంఖ్య.

నంబి. దే. వి. 1. వైఖానసుఁడు, వైఖానసమూత్రాను సారముగ విష్ణ్వాలయమునఁ బూజకీయుండువాఁడు. "ఆ. పద్మనయనుఁ దతనియనంబుఁ దూఁగింపు, మనుచు నంబితోడ నానతిచ్చె." ఆము. ౨, ఆ ౧౪. ద్వి. పరమ. ౬, అ ౫౩౪. పు; 2. శివా ర్చకుఁడు, దేవలుఁడు. "గీ. తమ్మలి యనఁదంబళి యనంగఁ నంబి నాఁ దనరుచుండు, దేవలుని పేరు..." ఆం. భా. ద్వి ౨౧౪. శుక. 3, ఆ. ౪౪౨; 3. దైవభక్తుఁడు. "ఉ. నంబి శివార్థము న్మనుసమ్మిక శంక యొకింతయేని చిత్తంబున యందు లేక వనితామణియారువు దాపుఁజేసి తీక్ష్ణంబగుక త్తి పోవ .."హార. ౨, ఆ. ౧౧౬;

4. భగవంతుఁడు. "చ. ఇతరులు నీవు నీదె... గురుంగుడినంబిశ్రీపాపలంబికిన్."ఆము.౬,ఆ.౪౯.

నంబెరుమాళ్లు. దే. వి. బ (నంబి+పెరుమాళ్లు.) శ్రీ రంగ నాయకులు. "ఉ నంబెరుమాళ్లు చిత్తమొక నాఁడు ప్రసన్నతఁ జేసి..." చమ. ౧,ఆ. ౧3.

నకనక. దే. వి. 1. ఆఁకలితో నున్నపుడు కడుపులోఁ గలుగుబాధ కనుకరణము. (చూ. నకనకఁబడు.); 2. కృశత్వము, కార్శ్యము. "వ...ఇప్పుడూ మొగ్గలం బోనిముగ్గలం దగ్గలిక మూపుకమ్మపంజుల వజ్రపుంజకచకలనకనకలు పీడుకొని .." స్వా. 3, ఆ. ౨౮; 3 బడలిక, అలయిక. "గీ. ఉదర గతపద్మనాభతల్పోరగేంద్ర, జనితపూత్కృతియ లో నాఁగ నిమడించె, నొడలియలనక నకనక లొదవఁ బొదలు, బెట్టునిట్టూర్పు లాచంద్రబింబ ముఖి." రామా. 3, ఆ. ౯. ఆ. ౯౦. 1. సన్న నిది కృశము. "సీ ఒకవిలాసిని నకనకనైనకొను గంపింపంగ నంటె నుపెంగమాకు." వరాహా. ౪, ఆ. ౧౭౪. కవి. ౬, ఆ. ౦౪; 2. కలఁతనొంది నది, క్షుబ్ధము. "క. ఒకమొగము గాక దివిజాలు, లికమకగొని వైరులెల్ల డీకొనఁ దమ్ముం,బికపికలై నకనకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను ఖిలిన్." భాగ. ౬, స్కం. ౨౫౬; 3. అలసినది, బడలినది. "వ . పువ్వుల రువ్వుచుఁ గ్రొవ్వుల నవ్వుచు వికవిక నగుచు నకనక నగుచుఁ దలకల మునుచు గొలకొల మనుచు . విహరించిరి .." రా. వి 3, ఆ. ౧౧౪; 4 మందము. "సీ. నక నకలై నకొన్నదల యొక్కలతాంగి చొక్కపుఁ జెంగల్వసురటి విసరె." ప్రబోధ ౫, ఆ. ౫౯.

నకనకఁబడు. ద్వ అ. క్రి (నకనక+పడు.) ఆఁకలిచే బాధనొందు, కృశించు. "క. తక్కపడుపు పెను తకుక్, జడిసెఁ గలిమింత నొల్లక, కడుపులు నక నకఁబడఁగఁ గౌరవముఖ్యా." భార. శాం. 3, ఆ. ౫౦౮. ఆము. ౬, అ ౫౨.

నకనకలాడు. దే. అ. క్రి. (నకనకలు+ఆడు.) 1. ఆకలిచే బాధపడు వ్యవః-నీనికడుపు నకనకలాడు చున్నది. (శ.ర.); 2.కృశమగు."ద్వి. నకనకలాడు చున్నడు మువ్వె జికిలి,పికిలిపూదండ తుంపెనలాడు చుండ." అ. మ క. ౧, ఆ. ౪3 పు.

నకనకలుగుడుచు. దే. అ క్రి. (నకనకలు+కుడుచు.) అలయు. "సీ. నడుము లేదీనియు నకనకల్ గుడువ

...నింపుచుఁ దగు మోపులు మోసి మోసి." కళా. ౪, ఆ. ౧౭౬. [(వ్యతి-అకలం, మాతృక.)

నకలు. హిం. వి. ఒకదానిని చూచి వ్రాసినది, ప్రతిక.

నకాషి. దే. విణ. (హిం. నకాశీ.) నకిషీపని చేసినది. "చ. నకిషిపనిపట్టెమంచమునఁ జాయనకాసిలివాసిపై ..." హంస. ౧, ఆ. ౭౫.

నకిషీ. దే. వి. హిం. (నకాశీ.) చెక్కడపుఁబని "చ...వింతనకిషీ గలమంచము మించుమంచిచెం, గలువలపాన్పుపై నృపశిఖామణి నందనుఁ డుండు నంతటన్." ఇందు. ౬, ఆ. ౧౨౬.

నకీబు దే. వి. వేత్రధరుఁడు, చోపుదారుఁడు. "వ. ఇట్లతివైభవంబున సకలరాజాధిరాజులు నదురుగాఁ గొని భేటికి వచ్చునెడ నకబునగరివాకిలి నీవు ముందు పోను ముం దని చొరవసేయం బోయి యచ్చటినకీబులం మహాలు దార్లచే నిలువరింపఁబడి వెలవెలఁ బోయి..." ఆనంద. పీఠి. ౧౧౫, ౧౧౬. వరాహ. ౧౦, ఆ. ౫.

నకులము. సం. వి. అ. పుం. ముంగి

నకులి. సం. వి. ఈ. స్త్రీ 1. ఆఁడుముంగి; 2 కోడిపెట్ట; 3. కుంకుమపువ్వు.

నకులుఁడు. సం. వి. అ. పుం 1. పాండవులలో నాలవవాఁడు; 2. కొడుకు; 3. శివుఁడు.

నక్క. దే. వి జంబుకము. "సీ. కుడిగాడ్పు తేరి నల్పుట్టఁ జుట్టలువెట్టెఁ గడిఁదిమాటలు వెళ్లఁ గ్రక్కె నక్క." ఉ. రా ౬, ఆ. ౨౩౫. భీమ. ౪, ఆ. ౩౩. విణ. చిన్నది, క్షుద్రము. (చూ. నక్కదోస.)

నక్కకొమ్ము. దే వి. (నక్క+కొమ్ము.) వనమూలికా విశేషము. "ఆ. ఒక్కయెఱుకువాఁడు నక్కకొమ్ముతు నిక్కి గోరజంబు జాన్నుఁ జాఱుపువ్వ... కాను కిచ్చి కరయుగంబు మొగిచి." స్వా ౪, ఆ. ౧౪. [(బ్రౌ.)

నక్కజిత్తులు. దే. వి. (నక్క+జిత్తులు.) మోసములు.

నక్కతోఁక. దే. వి (నక్క+తోఁక.) తృణవిశేషము. 'చ. గుఱుకుఱు పోఁటి చిప్పరయం గోఁగడయూదర నక్కతోఁకయుఁన్" ప్రబంధ. ౨౦౦. హంస ౫, ఆ. ౪౪.

నక్కతోఁకపొన్న. దే. వి. నేలపొన్నచెట్టు. "సీ .. నేలపొన్న, నా నక్కతోఁకపొ న్నన...రూఢికెక్క." ఆం. భా. ద్వి. ౫౫.

నక్కతోఁకవియ్యము. దే. వి. ధాన్యవిశేషము. (శ.ర.)

నక్కదోస. దే. వి. (నక్క+దోస.) చిన్నదోస, క్షుద్రోర్వారుకము. "ఆ...పుచ్చకాయ నక్కదోసకాయ వట్రువపొరకాయ గాదు శ్రాద్ధకర్మములకు." వి. పు. ౪, ఆ. ౨౭౪. ఆం భా. ద్వి. ౬౧.

నక్కనరము దే. వి. ఒకదినుసుపేరు. (శ. ర.)

నక్కనేరెడు. దే. వి. (నక్క+నేరెడు.) కాకినేరెడు. (శ. ర.)

నక్కమోరు. దే. వి. (నక్క+మోరు.) కుదురని కంటి. "సీ. మందుమాఁకిది గండమాల మాన్పఁ గలండె చక్కఁజేయఁ గలండె నక్కమోరు." రామలిం. ౪. ౬౩.

నక్కరేను. దే. వి. (నక్క+రేను.) గజనిమ్మల కుచము. "గీ...లకుచాఖ్యకమ్మరే ననఁగనక్క, రే ననఁగ వెలయును .." ఆం. భా. ద్వి. ౪౫.

నక్కవిరిగి. దే. వి. (నక్క+విరిగి.) క్షుద్రశేలువు. "సీ. క్షుద్రశేల్వాఖ్య యగుచు నక్కవిరిగి నా ..." ఆం. భా. ద్వి. ౪౫.

నక్కిల్లి. దే. వి. ఇ. (నక్కు+కిల్లి - శ. ర.) అంకిల్లి, దాడకిల్లి. (చూ. నక్కిల్లిపడు.)

నక్కిల్లిపడు. ద్వ. అ. క్రి. (నక్కిల్లి+పడు.) దాడకిల్లిగ దలకుండు, నిరుత్తరుఁడగు "సీ.... ధరణీశ రాజులో ధరణీసురులో. ఆ. రొక్క దవ్విన విధియుం నక్కిల్లిపడియున్న, నతనితోడ..." భార. అను ౫, ఆ. ౩౪౫ బస. ౬, ఆ. ౯౭౫. కం.

నక్కు. దే. అ. క్రి. ఒదుగు, దాఁగు. "ఉ. నాలితనంబు నేర్చుకొని నక్కుచు నక్కుచు వాడవాడ నేలాలవలీలతావలికెలంకులనుం డిటు వచ్చివచ్చి దం,భోళియుఁ బోలె మీఁదఁ బడిపోయెడు ..." రామా. ౭, ఆ. ౪౭. వి. 1. మ్రానియకుడు. ఉదా:—ఇది నక్కదూలము. (శ. ర.); 2. బంగారు నగలకుఁగా నడుమ కనుపట్టెడునిగ్గు. "ఆ. నక్కుటెక్కుఁ జెక్కు జాఁకుకచెక్కులు, మించుసంచు మించుమెలఁతమేను." చంద్రా. ౪, ఆ. ౧౪౫. బస. ౪, ఆ. ౩౫౪. పం; 3. (బంగారు) కునుక, ఖాడము. "ద్వి. పేదుక పుడిఁ దులం కాడ పేరేసి, మాదలయొత్తుగాఁ గూడ ఖండించి, యున్న జంగమకోటి కొక్కొక్కనక్కు, నెన్నగా సర్పణసేసి మ్రొక్కుదును." బస. ౫, ఆ. ౩౦౩. పరస. ౫, ఆ. ౧౧౩; 4. జాఁగటికజ్జు. (శ. ర.)

నక్కెర. దే. వి. కంది, తొగరిశ. (శ. ర.)

నక్కెలు. దే. వి. (నక్క+ఎలు.) వృక్షవిశేషము. (శ. ర.)

నక్తంచరము. సం. వి. అ. పుం. గ్రుడ్లగూబ. విణ. (అ. ఈ. అ.) రాత్రియందు తిరుగునది.

నక్తంచరుఁడు. సం. వి. అ. పుం. 1. రేద్రిమ్మరి, రాక్షసుఁడు; 2. దొంగ.

నక్తంచారి. సం. వి. న్. పుం. = నక్తచారి.

నక్తందివములు. సం. అవ్య. బ. రేయుంబవల్లు. "దండకము...సురాధ్ప్రశస్తుల్ మహాశక్తి నక్తందివంబుల్ ప్రవేశించియున్నారు..." భోగినీదండకము.

నక్తకము. సం. వి. అ. పుం. 1. చినిఁగినబట్ట; 2 తుండుగుడ్డ; 3. నల్లగ్రుడ్లగూబ.

నక్తచారి. సం. వి. న్. పుం. 1. గ్రుడ్లగూబ; 2. పిల్లి; 3. రాక్షసుఁడు; 4. దొంగ. విణ. (న్. ఈ. న్.) రాత్రి తిరుగువాఁడు.

నక్తమాలము. సం. వి. అ. పుం. కానుగుశ.

నక్తము. సం. వి. అ. న. 1. రాత్రి. "గీ. సోమవారవ్రతం బతిశుభద మగుచు, నొనరు నుపవాసయుక్తుఁ డౌనసఘుమతికి, నక్తము ననేకభుక్తి యొనర్చునేని, శివుఁడు సుప్రీతుఁ డగు నిజం బవని నాథ." శివ. ౩, ఆ. (శ. ర.; 2. రాత్రిమాత్రము భోజనముచేయువ్రతము. "సీ. భానువారంబునఁ బ్రారంభ మొనరించి క్రమమున భానువారంబు లేడు, నక్తంబు నియతితో నడపి యేడవ వారమున యథాశక్తి జాంబూనదమున, రవిఁ జేసి రక్తవస్త్రద్వయంబును జుట్టి..." వరాహ. ౧౨, ఆ. ౧౧౧.

నక్రము. సం. వి. అ. పుం. భూమిపైఁ జరింపనిది. 1. మొసలి, కుంభీరము; 2. మకరరాశి. న. 1. ద్వారబంధమునకుఁ బైనుండుఅడ్డకమ్మి; 2. ముక్కు, నాసిక.

నక్షత్రపంక్తి. సం. వి. ఇ. స్త్రీ 1. ఇరువదియేడు ముత్యములు గ్రుచ్చినయొంటిపేటహారము; 2. ఇరువదియేడుపద్యములతో చేర్పఁబడినక్షుద్రప్రబంధవిశేషము. "సీ...నక్షత్రపంక్తి యిరువదియేడు..." అప్ప. ౧, ఆ. ౧౩౪.

నక్షత్రమాల. సం. వి. ఆ. స్త్రీ. = నక్షత్రపంక్తి.

నక్షత్రము. సం. వి. అ. న. నశింపనిది. అశ్విని మొదలిక్క. (ఇవి యిరువదియేడు. అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి. అభిజిత్తు అనువే రొకనక్షత్రము గలదు. మంత్ర. అభిజిన్నామనక్షత్రమ్, ఉపరిష్టాదషాఢానాం, అవస్తాచ్ఛ్రోణాయా.); 2. చుక్క, తార; 3. ముత్యము; 4. ఇరువదియేడుముత్యములహారము, నక్షత్రమాల.

నక్షత్రేశుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

నఖంపచము. సం. విణ. (అ. ఆ. అ.) గోరువెచ్చనిది.

నఖక్షతము. సం. వి. అ. న. గోటినొక్కు. [క్షతము.

నఖన్యాసము. సం. వి. అ. పుం. గోటినొక్కు, నఖ

నఖము. సం. వి. అ. పుం. న. గోరు. నఖమను సుగంధద్రవ్యము. పుం అంశము, భాగము.

నఖముఖము. సం. వి. అ. న. నఖాగ్రము.

నఖరము సం. వి. అ. పుం న. 1. గోరు, నఖము; 2. ఆయుధవిశేషము.

నఖరాయుధము. సం. వి. అ. పుం. నఖములే ఆయుధముగాఁగలది—1. సింహము; 2. పులి; 3. కోడి.

నఖాంకము. సం. వి. అ. పుం. నఖక్షతము.

నఖానఖి. సం. అవ్య. ఒకరి నొకరు గోళ్లతో గిల్లికొనుచు చేయుపోరు.

నఖాలి. సం. వి. ఇ. పుం. 1 నత్తగుల్ల, క్షుద్రశంఖము; 2. గోళ్లవరుస, నఖపంక్తి.

నఖి. సం. వి. న్. పుం. 1. సింహము; 2. పులి. 3. నఖమను గంధద్రవ్యవిశేషము. విణ. (న్. నీ. న్.) 1. పెద్దనఖములు కలది; 2. ముండ్లుకలది. (వృక్షాది.)

నగ. దే. వి. 1. భూషణము. "సీ. నగనాడెములు చూచినావుగాద కుబేర యాకిరీటము వెల యేమిచేయు." పార్వ. ౫, ఆ. ౧౫౧ నృసింహశ. ౩౧; 2. లోహపాత్రము. (శ. ర.); 3. దూది మొదలగువానికంట్లుపురుగు. (శ. ర.); 4. పిద్దాల జోడు. (శ. ర.)

నగజ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

నగధరుఁడు. సం. వి. అ. పుం. గట్టుతాలుపు, విష్ణువు.

నగము. సం. వి. అ. పుం. గమనము లేనిది. 1. కొండ; 2. చెట్టు. 3. ఏడు అనుసంఖ్య.

నగరము. సం. వి. అ. న. పట్టణము, పురము.

నగరాలు. దే. వి. బ. 1. పోరులు. "ఉ...దొంగ చేరానకుఁ బాలుపడ్డ నగరా నగరాలు దురాత్మ నావృడున్." వెం. పంచ. ౧, ఆ. ౪౧౧; 2. ఆంధ్రదేశమందలి క్షత్త్రియులలో నొక తెగవారు.

నగరి. సం. వి. ఈ. స్త్రీ. నగరము.

నగరు. దే వి. దు. (బ. నగరులు, నగర్లు, నగళ్లు, నగళ్లు.) 1. అంతఃపురము; రాజభవనము. "క. మానవపతి వ న్నెక్కుడి,దానవు నీ వనియొ నేని ద్రౌపదికడ న,మ్మానంబు వదలి మెలఁగుదు, మానగరుల నృత్యగురువ ననఁగలవాఁడన్." భార. విరా. ౧, ఆ. ౯౦. "గీ. కమలనాభుఁడు కక్ష్యాంతరములు గడచి, యలబలమఁ లేనినగ రిల్లు నరసి చూచి." పారి. ౧, ఆ. ౧౦౫; 2. సభాగృహము, కొలువుకూటము. "క...రాజతనయానుగుణో, జ్జ్వలమానసీయ వేషము,లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్." భార. విరా. ౫, ఆ. ౩౧౫. శుక. ౩, ఆ. ౩౫౬; 3. గుడి, దేవాలయము. "గీ. నగరిలోఁ గూడ నేకాత్రనాథుమంచె, గంధిఁ దప్పులఁ జేర్చె నగాలవృష్టి." పార. ౨, ఆ. ౨౨. అము. ౪, ఆ. ౩౫.

నగవరి. దే. విశే. (నగవు+అరి.) 1. నవ్వుకలవాఁడు (శ. ర.); 2. పరిహాసకుఁడు. "క. నగవుల నవివ్వ పోఁడిమి, నగుబాటుగఁ జేయనేర్పు నగవరి యంతన్, నగుమొగముతోడ మెల్లన, నగుమొగములనతులఁ జూచి నగ జేర్చె నృపా." భాగ. ౧౦, స్కం. పూ. ౭౯౩.

నగవు. దే. వి. (నగు ధా.) 1. నవ్వు, హాసము. "సీ. నగవులు నురువులు నడలు రాయంచలు..." నీలా. ౨, ఆ. ౧౪. నైష. ౪, ఆ. ౧౪౦; 2. పరిహాసము, పరియాచకము. "క. కదనంబరంబు పోటులు, చదురుల నగవులను బ్రొద్దు జరిగినఁ గేళి,నదనము ...కదలుటయు..." స్వా. ౬, ఆ. ౪, భార. అర. ౫, ఆ. ౩౧౧; 3. వింత, ఆశ్చర్యము. "క. ఈబలముపట్టె చూడ మృగాజకమంట కప్పు ద్రువ్వులంట యందుఁ బ్రజల్, పూజింప వాని కెల్లన్, రాజట యొకకప్పు యట్టినగవులు గలవే." కేయూర. ౩, ఆ. ౭౫౮. విశే. పరిహాస పాత్రము. "అ...నాదుపతులఁ, బుద్ధిశీలయు తలఁ జోకాడ్పు కొన్నట్టి, నాకుఁ బుత్త్ర లనుట నగవు కాదె." కళా. ౬, ఆ. ౪౫.

నగవుటీగ. దే. వి. (నగవు+ఈగ.) పరిహాసమున కిచ్చినధనము. "సీ. మఱుపునఁ గొన్నపొ మ్మఁట గొన్నలంచంబు తగదివాఁ డిచ్చిననగవుటీగ. గీ. మగుడ నీకుంట యింతయుఁ దగవు గాదు." విజ్ఞా. ప్రా. ౨౮.

నగవులాడు. దే. అ. క్రి. (నగవులు+ఆడు.) నవ్వు. "ఉ. అప్పుడులాడుచున్ నగవులాడుచు పోరలు చాఁచి చాఁచి..." చంద్రా. ౨, ఆ. ౬.

నగవైరి. సం. వి. ఇ. పుం. గట్టుదాయ, ఇంద్రుఁడు.

నగారా. హిం. వి. పెద్దఢంకా. "సీ. కదలికదర్లు చప్పుడుల నాఁడిసేయుఁగొప్పనగారాలతుంబురములు." రంగా. ౧ ఆ. ౧౫౬.

నగించు. దే. స. క్రి. (నగు ధా. ప్రే.) 1. నవ్వునట్లుచేయు, నవ్వించు. "చ. పెలికిలి సెజ్జమీఁదఁ గడువి పుగుకన్నులచాయ లొప్పఁ జెక్కులి గిలిగించి ప్రేఁకలు నగింపఁగ నుండుట యాది గాఁగ ..." హరి. పూ. ౮, ఆ. ౧౩౪. వరాహ. ౪, ఆ. ౧౬౧; 2. సంతసింపఁజేయు. "ఉ....విసుంచి వ్రాయించి తనుక్ నగించి రొలయించిన ప్రేయసి నల్లదించి మోదించి...మించినవిరించి మమ్ముం గరుణించి ప్రోవుతన్." వాల్మీ కి. ౧, ఆ. ౪; 3. పరిహాసింపఁజేయు. "చ ..చెప్పినయదిపో కవిత్వ మనిపించు నగించటు గాకయుండినన్." వెం. పంచ. ౧, ఆ. ౧౮.

నగింపు. దే. వి (నగు ధా.) నవ్వించుట. "వ... తెగింపులు నగింపులు నింపులు సొంపులు..." భీమ. ౪, ఆ. ౬౦.

నగిపించు. దే. స. క్రి. (నగు ధా. ప్రే.) నవ్వించు. "మ...బాలుకతుదన్ ముక్కంటికొమ్మా విలాసిని యే నక్కైద నంచు బ్రహ్మ నగిపించెన్ మేలు మాటల్ పలిన్." కళా. ౫, ఆ. ౫౯.

నగియించు = నగించు. (వికసింపఁజేయు.) "సీ. ముత్తెంపుటెకులంతులు మొనయుం జేయుమువాఁడు తమ్ముల నగియించుతక్కు తేఁడు." కాళిందీ. ౫, ఆ. ౨౩.

నగు. దే. అ. క్రి. 1. నవ్వు, హసించు. "వ... రాచూలిం జూచి చెలులు గలకలం జే చఱచి

నగిరి." శైవ. ౨, ఆ. ౪౫. పారి. ౧, ఆ. ౧౦౧; 2. ఆనందించు. "క. అని పంటవలంతి కేశే, చిని పించిన నాలకించి ప్రేంకలమేల్వాం,డెన లేని కార్కు లెదలా, ననలొత్తంగ నతని జూచి నగుచుం బలికెన్." నీలా. ౨, ఆ. ౩౩; స. క్రి. 3. పరిహసించు, గేలిసేయు. "చ. నగియును గొంకు నందు వచనంబు నధర్మువునందుఁ జిత్తముం,దగు లదు నాకు నెన్నఁడును..." భార. ఆది. ౭, ఆ. ౨౫౨. కాళిందీ. ౬, ఆ. ౬౬. వి. పరిహాసము. "చ. మృగమదచిత్రకానుగతి మేలగుఫాలము పిల్లతేఁటికిం, దగు లగుకేతకీదళము దా నగనం చొగి కొంచి కొప్పుపొ,రగపడు తేఁటిగుం పెడసి యాడెడునందపుఁదేఁటిపిల్లలన్నగు నగు గాదు ముంగురులు నవ్వుచుఁ దోయరువాకపత్రలోచనా." కాళిందీ. ౬, ఆ. ౬౬ ౨౮౬. అచ్చ బాల. ౧౧౨.

నగుఁడు. సం. వి అ. పుం. సూర్యుఁడు

నగుఁబాటు. ద్వ. వి. (నగు+పాటు.) అపహాస్యత, నింద. "గీ. యజ్ఞభవుఁడౌనుఁ డైనయహల్య మొదలు,సేర మొనరించె ననిన చో సేర్చి నడువ, నొకరితరహూనె మగవారలార్వ్వవలయుఁ,గానిచో వట్టినగుఁబాటు గాదె మీకు." శకాం. ౪, ఆ. ౨౦. భార. అర. ౬, ఆ. ౩౦. విణ. ఎగతాళి చేయఁదగినది, అపహాస్యము. హాస్యాస్పదము. "ఉ... ఇట్టనుం,భావితుఁ డైనవానితలపాటర యక్ నగుఁబాటు గాదె రామావనినాథ తమ్ములకు..." నిర్వ. ౧౦, ఆ. ౧౧.

నగుపించు. దే. స. క్రి. (నగు ధా. ప్రే) నవ్వించు. "క. తెప్పించి తొడుగు మీ పని, యొప్పించిన నిట్టునట్టు నొఱవలుగా మైఁ గప్పుకొని యాబృహన్నల, యప్పుడు నగువించె నచటియబలాజనమున్." భార. విరా. ౪, ఆ. ౩౯. కాం. ౬, ఆ. ౨౧౭.

నగుసేయు. దే. స. క్రి. (నగు+చేయు.) అపహసించు. "చ. వదన మపత్రపాలిమిరబంధతఁ గాంచినఁ జిహ్నచీఁకటిం, జిదిమెడుచందమూను నగు సేయక యుండునె." కాళిందీ. ౬, ఆ. ౭౭.

నగౌకము. సం. వి. వ. పుం. 1. పక్షి; 2. కాకి; 3. సింహము; 4. శరభమృగము.

నగౌకసము. సం. = నగౌకము.

నగ్న. సం. వి. ఆ. స్త్రీ. 1. దిసమొలయాఁడుది; 2. రజస్వలకానిపడుచు. (పది పండ్రెండుసంవత్సరములవయసు కలది.)

నగ్నిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దిసమొలయాఁడుది, దిగంబరస్త్రీ; 2. సమర్తాడనిపడుచు, కన్యక.

నగ్నుఁడు. సం. వి. అ. పుం. 1. దిగంబరసన్న్యాసి; 2. దిగంబరబౌద్ధుఁడు; 3. బట్టువాఁడు; 4. వేదమభ్యసించియు వేదమార్గమును విడిచి యపమార్గమున వర్తించువాఁడు; వేదదూషకుఁడు. "ఉ. ధీమతిఁ జిన్ననాఁ డఖిలదేవతలన్ భజియించి ఋగ్యజుస్సామము లభ్యసించి బహుశాస్త్రపరాయణుఁడై మహీసురుం, డేమియు బుద్ధిలేక శ్రుతు లెంతయు నింద యొనర్చు వానిఁ బో,పామరుఁ డైన నగ్నుఁ డని పల్కిరి వేదవిదుల్ మునీశ్వరా." వి. పు. ౪, ఆ. ౨౮౦. "ఆ. వేద మభ్యసించి వేదమార్గంబులు, విడిచిపెట్టి దుర్వివేకబుద్ధి, బహుమతముల నడుచుపామండుఁడే నగ్నుఁడు..." వి. పు. ౪, ఆ. ౨౮౧.

నచికేతసుఁడు. సం. = నచికేతుఁడు.

నచికేతుఁడు. సం. వి. న్. పుం. 1. ఉద్దాలకునికొడుకు, నాచికేతుఁడు; 2. ఒకానొకఅగ్నిహోత్రుఁడు.

నచ్చిక. దే. వి. (నచ్చు ధా.) నమ్మిక. "క. నిను గిలి సాహితీమో,హనవాణులు చెవులువట్టి యాడింపంగాఁ,గని యుండి కాముకుఁడఁ గా,నని పల్కిన నాకు నచ్చి కొను నృపాలా." విజ. ౧ ఆ. ౯౦. వసు. ౩, ఆ. ౧౧౯.

నచ్చికము. దే. వి. కొంకి, లోపము. "క. అకటా నన్నితఁ డేలిన, నొకటా నచ్చికము లేక యుండఁగవచ్చున్." విజ. ౧, ఆ. ౬౭. రామ. ౧౭౮.

నచ్చు. దే. అ. క్రి. 1. ప్రియమగు. ఇష్టమగు; రుచించు. "చ...అలరితాంగి నాకు నచ్చినచెలి ..." మార్క. ౫, ఆ. ౨౦౯. భీమ. ౧, ఆ. ౩౦; 2 నమ్మకము కలుగు. "క. నీవింక నేటిపుండియు, నావచనము లాదరించి నచ్చినమదితో, దేవతల కైన దొరకని,యావారుణిసేవ సేయు మతులితభక్తిన్." వి. పు. ౮, ఆ. ౩౯. నిర్వ. ౭, ఆ. ౬౫; 3. లగ్నమగు, సక్తమగు. "గీ. అట్టినీయందు నాచిత్త మనవరతము, నచ్చియున్నది నీయాన నాకు లేదు,కరుణఁ జూడుము కంసారి ఖలవిదారి." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౦౨. స. క్రి.

1. నమ్ము, విశ్వసించు. "వ...కీచకనివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక యెన్ని చెప్పిన నన్నింటికి నన్ను చెప్పి నిర్బంధించినం బెద్ద చెనంగ నొల్లక నామనంబున నన్నవ్వరికి నేమి సేయ వచ్చు నని విరాళావు నచ్చి మాతునింటికి నురకుం బోయిన." భార. విరా. ౨, ఆ. ౧౬౩. ఆం. భా. కృ. ౩, ఆ. ౧౩౩; 2. పీడించు, బాధించు. "గీ. శాసనము చొచ్చి శార్దూలఖడ్గ మూక,రక్షప్రముఖజంతుసంతతి ద్రచ్చి నచ్చు,సార సంబున మృగవేషధారి యైన, యతికులస్వామిం గూలనేసితివి నీవు." వరాహ. ౨. ఆ. ౪౯; 3. ఎఱుగు. "ఉ...కౌంతేయుల మన,మెలమి కలిమి నచ్చి యిట్లు లేమజ నగునే" భార. విరా. ౩, ఆ. ౧౦౩. వి. మాంద్యము, ఆలస్యము. "క. జడ కుచ్చును బెండెపెచ్చును, నడనచ్చును గచ్చు లేనినలు వకుమేనున్." చంద్ర. వి. ౧, ఆ. ౬౧; 2. బాధ. (శ. ర.)

నచ్చుకాఁడు. దే. విశ. (నచ్చు+కాఁడు.) 1. మందుఁడు, అలసుఁడు; 2. బాధకుఁడు, పీడించువాఁడు. (శ. ర.)

నచ్చుకుప్ప. దే. విశ. (నచ్చు+కుప్ప.) బాధకుఁడు. (శ. ర.)

నచ్చుగొట్టు. దే. విశ. (నచ్చు+గొట్టు.) బాధించు స్వభావము గలవాఁడు (శ. ర.)

నచ్చుపెట్టు. దే. స. క్రి. (నచ్చు+పెట్టు.) తొందర పెట్టు, బాధించు. (శ. ర.)

నజరు. హిం. వి. కానుక. "క అని యిట్లు సకలజన ములుఁ,గొనియాడ ననర్ఘ్యరత్నఘోటకమదవా,రణ భూషణాంబరంబులు, ఘనమోదము మీఱ నజరు గైకొని వేగన్." ఆనంద. పీఠి. ౧౧౧, రంగా. ౨, ఆ. ౯౪.

నజ్జు. దే. వి. చిన్నముక్క. నలి. "చ. ఒకపెనుఁ బాఁపతోఁడు చలమొప్ప రసాతలసీమనుండి జో, రకముల భూతధాత్రికి మరల్ చిదికిన్ బగదీఱ నట్టుగా, మెకమెక పాటుతోడ నిను బ్రింగకపో రాదటం త్రిలోకకంటకుఁడవు గాన నీయొడలు నజ్జుగఁ జేసి కురంగలాంఛనా." స్వా. ౩, ఆ. ౩౯. ప్రబంధ. ౧౯౬. విశ. మిక్కిలి నలఁగినది. "ఉ. వాడినకేను నజ్జయినవాతెఱయుం గడు విప్పుఁబాటులోఁ, గూడినచెక్కుఁగంబు..." నవీర. ౩, ఆ. ౨౪౬. (దీనియామ్రేడితరూపము నజ్జునజ్జు. కవిక. ౪, ఆ. ౧౯౧.)

నజ్జుచేయు. దే. స. క్రి. (నజ్జు+చేయు.) నలఁగఁ గొట్టు, ముక్కముక్కలుచేయు. "చ అల వెన యంగ జారులహృదంతరముల్ నలి నజ్జుచేసె నంధిలుకమి బుతుసంఘముల తేజముఁ దూలిచె ..." సా. ౧, ఆ. ౧౦౧ (ఇట కలఁకనొందించె నని భావము.) "సీ. రథ్యసారథికేతురథికాంగనిర్ద ళనప్రౌఢిఁ దేరులం నజ్జుచేసి" మార్క. ౯, ఆ. ౧౦౪. (ముద్రి. పా. 'నగ్గుచేసి' అని. శ.వి. పా.)

నటకుఁడు. సం. = నటుఁడు.

నటత్. సం. (శత.) నాట్యముచేయుచున్న. ఆని. ౪, ఆ. ౪౨.

నటన. సం. వి. ఆ. స్త్రీ. విలాసము, నటనము. "ద్వి. బొట్టు మిక్కిలి నొఱపుగ నవరించి, నటనగాఁ జిన్నారివాడుంబు దీర్చి." ద్వి. పరమ. ౨, ఆ. ౫౪. పు.

నటనమిగులు. మి అ. క్రి. (నటన+మిగులు.) విల సిల్లు, అధికముగా నుండు. "సీ. అర్థంబు కాశి పురాంగణంబునయందు నానాప్రకారమై నటన మిగులు." కాశి. ౨, ఆ. ౫౦.

నటనము. సం. వి. అ. న. 1. నాట్యము; 2. అభిన యించుట, నర్తనము; 3. కపటప్రవర్తనము; 4. విలాసము. "క. అటు లున్నకొమరుఁ బ్రాయపుఁ, గుటిలాలకఁ జూచి మదనగుంఫితమాయా,నట నంబో యది గంగా,ఘటనంబో యని విచారఘట నాకయుఁడై." విజ. ౧, ఆ. ౬౬.

నటనీయము. సం. విశ. (అ. ఆ. అ.) నటింపఁదగినది.

నటము. సం. వి. అ. పుం. 1. దుండిగముజ్జ; 2. అశోకముజ్జ; 3. కిక్కసజ్జ.

నటవాలు. దే. వి. అశ్వగతివిశేషము. (శ. ర.)

నటాంతిక. సం. వి. ఆ. స్త్రీ. సిగ్గు, లజ్జ.

నటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె, నట్టువరాలు; 2. సూత్రధారునిభార్య యగునర్తకి; 3. వేశ్య; 4. కాకిదొండజ్జ.

నటించు. సం.అ. క్రి. 1. నాట్యముచేయు, నర్తించు. "క...దివి దివిషజ్జలజముఖులు దెలిసి నటింపన్." స్వా. ౪, ఆ. ౧౯౯. ఇందు. ౨, ఆ. ౨౩౫; 2. కపటముగా ప్రవర్తించు. "సీ. పతిసమ్ముఖ మ్మునఁ బలుమాటల నటించుసరసీజాసనురాణి సాటి

యుగుణా." ఇందు ౧, ఆ. ౧౧౨; 3. ఉండు, వర్తించు. "శా. నీకవ్యాపకమై సమస్తగతమై హేవాకమై శ్రీకరం,బై...పరమార్థతత్త్వము నటించుఁ నిత్యశుద్ధస్థితిన్." వి. పు. 3, ఆ. ౩౩౫; 4. తోఁచు. "క. పతయూథతురగనిభృతోన్నత కర్ణద్వయమునందునం గెంపులమేల్పతకమమర రవికిరణాం, బలిరయమున నచుకపచ్చునను నటిం పన్." కువల. ౨, ఆ. ౪౦ స. క్రి. 1. అభిన యించు, నిజముగా లేనిలక్షాదికము నున్నట్లు కనఁ బఱచు. "చ...పుల్మఱు పొరుగిండ్ల కేఁగు నొక మట్టున నిల్వదు చంటిపోఁదమ్ముం,జెఱఁ గెడలించు వైశికపుసిగ్గు నటించుచు జార ధారుణిన్." శై. 3, ఆ. ౨౮. భార. ద్రో. ౧. అ. ౯౫; 2. అను సరించు. "మ. మును తన్ గూడినసీల్లకున్ నిజ గుణంబుల్ పొలిదున్ పాలు గ్రాఁగుపెరన్ వాని నటించి యజ్ఞలము గ్రాఁగున్..." మల్లభూ. నీతి ౬౬.

నటితి. సం. విణ. (బు. త్రి. బు.) నటించువాఁడు.

నటితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నటించినది; 2. నటింపఁబడినది; 3. నటనము.

నటిలి. సం. వి. ఇ. స్త్రీ. నాట్యము.

నటియించు. సం.=నటించు. (అభినయించు) "సీ. భుటి లత్వ దులకల భుటియించి వనితలై నటియించు శశికళాపటుల మనఁగ... గీ. అలరుదురు... అచటి చక్కనిమిటార్లమరుచేలి చిక్కటార్లు." శకాం. ౨, ఆ. ౨౨; 2. (నర్తించు, ఆడు.) "క. నిటలంబునఁ గుటిలభ్రూ,భుటి నటియింపంగ మొగ మిగుర్పఁగ మేనం, జొటచొట కెత్తురు గాఱఁగ ..." వరాహ. ౨, ఆ. ౧౨౭.

నటుఁడు. సం. వి. అ. పుం 1. నర్తకుఁడు, నాట్యము చేయువాఁడు; 2. అభినయించువాఁడు, 3. ఒక జాతివాఁడు.

నటేశ్వరుఁడు. సం వి. అ. పుం. శివుఁడు. (ఇట్లే: నటరాజాదులు.)

నట్ట. దే. వి. పాదిక,సారె. "ఉ. నట్టలు రెండుఁ దాన జతనంబునఁ జేకొని యున్నయిందులం, గట్టి నృపాలు సారెలకుఁ గాలిడ నెందును జోటులేక యున్నట్లుగఁ జేసి..." భో. ౫, ఆ. ౧౩౦.

నట్టకనడుము. దే. వి. (నడుము+నడుము.) సరియైన మధ్యము. (చూ. నట్టకనడురేయి.)

నట్టకనడురేయి ద్వ వి. (నట్టకనడుము+రేయి.) సరియైన అర్ధరాత్రము. "క. కట్టి కనమాఱుగా నీ, దిట్ట గృహస్తంభమునఁ బ్రతిష్ఠించి నరుల్, మిట్టాడనియాబెడిదపు నట్టకనడురేయి మబ్బునం జెలి చనియెన్." వేం. పంచ. ౧, ఆ. ౨౭౯.

నట్టకోఁతి. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. నాల్గు కంబాలాట నట్టకోఁతి." హంస. 3, ఆ. ౧౪౬.

నట్టడవి. ద్వ. వి. (నడుము+అడవి) అరణ్యమధ్యము. "క...నీపాదంబుల్, పట్టికొనఁగ వచ్చినమము, నట్టడవిని డించి పోవ న్యాయమె కృష్ణా!" భాగ. ౧౦, స్కం. పూ ౧౦౭౪. చం. రా. ౭, ఆ. ౬.

నట్టనడుము. దే. వి. (నడుము+నడుము) సరియైన మధ్యము. "చ. మలచపువేణి నట్టనడుమున్ దగి చేలికిఁ దున్క చిక్కె..." ఉ. రా. 3, ఆ. ౧౨౩. భీమ. ౪, అ. ౧౧౦.

నట్టనడురేయి=నట్టకనడురేయి. విప్ర. ౪, ఆ. ౬౭.

నట్టాడు. ద్వ. అ. క్రి. (నట్టువ+ఆడు-శ. ర.) 1. నాట్యముచేయు, నర్తించు. (శ. ర.); 2. చలించు. "క...మిఱుమిఱుమాడ్కల్, నట్టాడునడుముఁ దేనియ, లుట్టెడుమోవియును మనము నూరిం పంగన్." భాగ. ౯, స్కం, ౬౦౮; 3. ఇటు నటు తిరుగు. వ్యవ:— వాఁడు నట్టాడుచుండగాఁ జాచితిని.

నట్టించు. దే. అ. క్రి. నటించు, ఆడు. "వ...దారపు లుతుంబోలె నట్టించి పనిఁ దిరుగుపెరవరులునుం బోలె మసల కలవడి..." ఉ. హరి. ౪, ఆ. ౨౭౬.

నట్టిల్లు. దే. వి. ప్రా. (నడుము+ఇల్లు.) గృహమధ్య భాగము. "గీ. వినుతదానంబు లొనరించి యనుఁగుఁ జెలులు,యట్ల నట్టింటఁ బగవారి నాదరించి, నగర దైవతముల నర్చనానువృద్ధిఁ,దనిపె సుతజన్మదిన మున ధరణిభుఁడు." ఉద్భ. ౪౮, పాండు. ౪, ఆ. ౧౬౭.

నట్టు. యిం. దే. అ. క్రి. అడ్డు, అఁగు. వ్యవ:— వాఁడు చదువుచు నట్టుచున్నాఁడు. వి. 1. అలస్యము. వ్యవ:— ఏల నట్టు చేసెదవు, వేగపొమ్ము. (శ. ర.); 2. ఆటంకము, అభ్యంతరము. (చూ. నట్టుపడు); 3. తృణవిశేషము, గడ్డికగడ్డి. ఉదా:— తుందురునట్టు, గడ్డికనట్టు. (బ్రా.); 4. గడ్డికవలె విస్తార మగట, కుక్కించుట. "గీ. ఇట్టిబెట్టగుపెట్టుకు నట్టుఁ జెంది, బడలఁ బడలేఁకుఁ

డాలిచెఁ జంద్రమాళి." ధర్మ. ౨, ఆ. ౭౬; 5. మార్పు, వికృతి. (చూ. నట్టువడు.); 6 సస్య రోగవిశేషము. (శ. ర.); 7. గృహము, నివాస స్థానము. "గీ. కట్టుకొని గొల్లప్రేఁతలనట్టులందు, గుట్టు లరయుఁచు మెలఁగునప్పట్టి..." నీలా. ౧, ఆ. ౭౫, ఆం. భా. కృ. ౪౫; 8. స్థానము, ప్రదేశము. "సీ. పొదరింటిపట్టులఁ జదరంపు నట్టులఁ బంతుగా గోరంటజాతు లాడు." ఉ. హరివం. 3, ఆ. ౧౫, అచ్చ. యు 3, ఆ. ౨౭; 9. పొలము, క్షేత్రము. "ఉ. పూని వసంత పాలికుఁడు పొంగెడురాగరసంబుచేఁ గడున్, కానుజనాళిమానసపునట్టులు దున్నిమనోజకందళిం, గానఁగఁ జేసి .." చంద్ర. ౯, ఆ. ౧౦౩; 10. దేశము. "గీ. అతఁడు దరుగనియూను నతని చేత, నడుగఁబడనిమానవుఁడును నతఁడు చొరని, కోఁటయును జూడ లేదు మందునకునైన, నగవు గా దిది నిక్క మానట్టునందు." భో. ౨, ఆ. ౫' 11. ఇంటిపట్టు, గృహప్రదేశము. "గీ. నట్టు నా గేహతద్దేశనాను మెసఁగు." ఆం. భా. కృ. ౪౫, వై. వి. (సం. నటః) 1. నటుఁడు, నర్తకుఁడు. "వ. అనుచుఁ దలంగి పోక యిట్టు నట్టుం జొట్టు పెట్టాడు చిట్టిపడుగుల వానట్టు నగవుచుం గోటుంబుఁ గడుర నదలించుచు..." ప్రభా. ౧ ఆ. ౧౦౭, ఆం. భా. ద్వి. ౧౭౮; 2. నాట్యము. (చూ. నట్టాడు.)

నట్టుకొట్టు. దే. అ. క్రి. (నట్టు+కొట్టు.) 1. అల సించు. (శ. ర.); 2. సంకోచించు, వెనుదీయు. "క. పలికిన నినుఁ గాదన భీతిలి యిటునటు నట్టు కొట్టు తెలివతెలఁగు భూతలవిభుఁడు చూచి యిదియే, మలిమంతల తెలుపు మను మనడి గెఁ గొంటొరిన్." కళా. ౭, ఆ. ౯౦. పరమ. 3, ఆ. ౨౮. స. క్రి. ఆటంకపఱచు, నిరోధించు. "రగడ. తగిలి పట్టు మనుచుఁ దిట్టుం దన్నిఁ దుట్టు పెట్టె నొకతె, మగుడి పెట్టు కాని యొట్టు మాన్ప నట్టుకొట్టె నొకతె." రా. వి. 3, ఆ. ౧౨౧,

నట్టుకొను. దే. అ. క్రి. (నట్టు+కొను.) కలుకొను వికసించు. "ద్వి. కొఱవిదయ్యము నట్టుకొని యుఁన్నకరణి, మన్నభేతాళవటొర్వీరుహంబు." ద్వి. హరిశ్చ. పూ. ౨౦౦౮, పం. హర. 3, ఆ. ౧౫

నట్టుగుఁడు. వై. వి. (సం. నటః.) నట్టువకాఁడు, నట్టువుఁడు. (శ. ర.)

నట్టుపడు. ద్వ. అ. క్రి. (నట్టు+పడు.) నిరుద్ధమగు. (చూ. నట్టుపఱచు.)

నట్టుపఱచు. ద్వ. స. క్రి. (నట్టుపడు ధా. ప్రే.) ఆటంకపెట్టు, నిరోధించు. "గీ. నట్టదవికాన న న్నిట్టు నట్టుపఱిచి, గొట్టుమిట్టాడ నేటికి..." కృ శతం. ౨, ఆ. ౭౪.

నట్టుపులుఁగు. ద్వ. వి. (నట్టు+పులుఁగు) నాట్యము చేయుపక్షి, నెమలి. (శ. ర.)

నట్టువ. వై. వి. (సం. నర్తకః.) 1. నటుఁడు, నటి. "క. ఇరువురు నేసినబాణము, లిరుబరులును దాఁకి తిరిగె నిరువెసలకు నక్కరి యిరుమొగముల నట్టువ,తిరుపుఁ గొనెడుక్రమముతో నతిత్వరిత గతిన్." కాశీ. ౪, ఆ. ౧౮౧. దశా. ౧, ఆ. ౨౪౬; 2. నాట్యము. "వ. మఱియు విరిలేనియ లాని పూని మత్తిలి తత్తరంబునం దిరుగుతేఁటి మొత్తంబులయొఱకలనన్నం గరువలి గట్టి నట్టువ గఱప నామనిరాణెనికడ నాడులీవపాతరల ముందఱ..." య. ౪, ఆ. ౧౩.

నట్టువద్రొక్కు. దే. అ. క్రి. (నట్టువ+త్రొక్కు.) నాట్యముచేయు, చలించు. "చ. కొనలను ముంగురుల్ చెదర నాలొక్కని ముక్కెరడాలు మోవిపై, పెనఁ గొనసాఁగఁ జన్నుఁగవ నిక్కుచు నట్టువ ద్రొక్కు హారముల్,మునరి పెనంగులాడ నగు మోము చెమర్ప నొకర్తు..." జాహ్నవీ. ౧, ఆ. ౧౪౬

నట్టువకాఁడు. ద్వ. వి (నట్టువ+కాఁడు.) నర్తకుఁడు, ఆటకాఁడు. "సీ. పంచాంగమయ్యకుఁ బాగ సమర్పించు నట్టువకానికిఁ బెట్టు మురువు." హంస. ౫, ఆ. ౧౩౪.

నట్టువడు. ద్వ. అ. క్రి. (నట్టు+పడు.) వికారము నొందు. "వ...పెన్నులచేత నట్టువడినమణిపట్టె మంబులు తుడిచి..." ఉ. హరి. 3, ఆ. ౧౩౫.

నట్టువపక్కి. వై. వి. (నట్టువ+పక్కి.) నాట్యము చేయుపక్షి - నెమిలి. "క. కొక్కును నట్టువ పక్కియు, నెక్కుడులంగ నమరుకొమరులిక పురు మోహిలన్,నిక్కుచు నాడఁగ నెలమిన్,జొక్కుడు వేలుపులరాయ నోకుడురాయా." అచ్చ. యు. ౫౮౮. (ఇక్లీః నట్టుపిట్ట నెం.)

నట్టువకాఁడు. ద్వ. వి. (నట్టువ+వాఁడు.) నటుఁడు, నట్టువుఁడు. "సీ. బండలు బూతులు బరిహాసకులు నట్టువా రాదిగాఁ గలవారు దక్కఁ, జెలువారి యూలు తాఁ బ్రియుఁడు వారింపంగఁ బదుతోడఁ బల్కఁగఁ బణవశతము." విజ్ఞా. ప్రా. ౧౧౬.

నట్టువుఁడు. వై. వి. (సం. నర్తకః.) నాట్యముచేయు వాఁడు, నర్తకుఁడు. "మ...నాలిగాఁవ్వుల పేరం గలనట్టువుల్ గఱకు గోపుల్ చూపు లేఁదీవపా, త్రల కయ్యారునిర్భూలము త్రిపురుల్ దాల్పంగ నిచ్చం గడున్." య. ౪, ఆ. ౧౨, ఆం. పదా. నర. ౨౯.

నట్టువొజ్జ ద్వ. వై. వి. (నట్టువ+ఒజ్జ) నృత్యము నేర్పువాఁడు, నాట్యోపాధ్యాయుఁడు. "గీ... ఇన్ని తెఱఁగుల క్రమము సేయింతుఁ జతుర, తావిహీనము లైనపాత్రములనైన, నట్టువొజ్జనై మెలఁగుదు నగధులందు." భార. విరా. ౧, ఆ ౨౪౨.

నట్టెండ. దే. వి. (నడుము+ఎండ.) తీక్ష్ణముగా కాసిన యెండ. "మ...నట్టెండల్ వెనం గాయుచే, నవులన్...." పి. శకుం. ౨, ఆ. ౧౧౨.

నట్టేము. దే. వి. భిక్షాపాత్రము. "ద్వి. కప్పెర నట్టెంబుఁ గక్షపాలయును, నొప్పుగా బిగిసిన యోగపట్టెయును."ద్వి. పరమ. ౨, ఆ. ౯౬. పు.

నట్టేఱు. దే. వి. (నడుము+ఏఱు.) నదీమధ్యము. "సీ. నట్టేట దాశకన్యకకు నుద్వాహులాటి జాలిఁ బొందిన పరాశరునిరాలి." శైవ. ౭, ఆ. ౧౫౧. విప్ర. ౪, ఆ. ౪౪.

నట్యా. సం. వి. ఆ. స్త్రీ. నటులసమూహము.

నట్లొట్టు. దే. వి. బ. జలధార లోనగునవి నిరంతరముగా పడి ఉడిగినవెనుక అచ్చోట నిలిచి నిలిచి పడెడుబొట్టు; మూరునుండి పడునీటిబొట్టు. "సీ. నవమాలికలతేనె నట్లొట్టుపడుచోట మాణిక్య దీపముల్ మలయుచోట."స్వా. ౩, ఆ. ౧౧౧. ఆం. భా. ప్ర. ౭౫.

నట్వాలు. దే. వి. అశ్వగతివిశేషము. (శ. ర)

నడ. దే. వి. (నడచు ధా.) 1. నడక, గమనము. "సీ లలితంబు లగుమట్టియలచప్పుడింపార నంచకైవడి నడ నల్ల వచ్చి "భార. విరా. ౨, ఆ. ౬౪. స్వా. ౧, ఆ. ౭౬; 2. అశ్వగతివిశేషము. "చ. జవమున భంజళిక్ మురళిఁ జౌకముఁనక్ నడ నైదు ధారలన్...,రూఢికెక్క యాహవజయశీలముల్ గలుగునశ్వము లెన్నఁగఁ జెప్ప లక్షణిన్." భా. రా. ౫౦ల ౩౦.

నడక. దే. వి. (నడచు ధా.) 1. గమనము. "గీ. ఇపుడు ఘటికాద్వయం బయ్యె నిచ్చుఁడు పొడిచి, దవ్వు చాల దిచ్చోటికి దక్షవాటి, కేవలము మంచినడనైనఁ గిసవెల్తి, రెండుజాములు నిట నూరకుండ నేల" భీమ. ౪, ఆ. ౪౬; 2 ప్రవర్తనము, నడవడి "క...ఈ, యనుచితపునడక నాయువు, కొనసాగమి కొందు నీకుఁ గొఱగాదంటిన్." రామా. ౬, ఆ. ౧౬౧. పండితా. పురా. ౯౨. పు; 3. జీవనోపాయము, వృత్తి. "సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి." ఆం. భా. ద్వి. ౨౨౮.

నడకొండ దే. వి. (నడ+కొండ.) నడక గలకొండ. "వ...నడచునడకొండగమియును బోనిగజరాజితో రాజు రథారూఢుండై..." భార. భీష్మ. ౧, ఆ. ౧౩౦, ౨. ఆ. ౨౪౦.

నడకోలఁకు. దే. వి. (నడ+కోలఁకు.) దిగుడుబావి. "క. ఒడికపుఁదననొలగున కెక్కుడు చెన్నులు గలుగఁ జూచి కొల నాయన్నల్, నడకోలఁకు లంచు వారికిఁ, గడువేడుకఁ దప్పితాబి కానుకఁ జేసెన్." య. ౩, ఆ. ౫౭.

నడగఁడు. దే. వి. (నడచు ధా.) అశ్వవిశేషము; అశ్వము, గుఱ్ఱము. "క. ఆలోనఁ జంద్రహాసుఁడు, మేలంకనుచు నపుడు తత్సమీపనరేంద్ర,హకాశిత ముఖుఁడై నడగని,బోలెమునఁ గదల్చి నగరముఁ బ్రవేశించెన్." జై. ౯, ఆ. ౭౯. ద్వా. ౩, ఆ. ౧౪౧.

నడగొండ. = నడకొండ. స్వా. ౪, ఆ. ౪౭.

నడగొట్టు. దే. అ. క్రి. (నడ+కొట్టు.) నిలుచు, ఆఁగు. "క. పోక నడగొట్టితేనియు, రాకింతుఁ జామీమొగంబు రాచట్టుపయిక్, శ్రీకాశిక నిందించిన, నీ కింతట నేల పోవు నీచచరిత్రా." భీమ. ౨, ఆ. ౧౫౩.

నడగోట. ద్వ. వి. (నడ+కోట.) నడక గలకోట. "సీ. రంగదుత్తుంగతరంగసంఘాతంబు నడగోటల తెఱంగు నడుపుచుండ." శ్ర. భా. ౧, ఆ. ౬౪.

నడచియాడు. దే. అ. క్రి. (నడచి+ఆడు.) ప్రవర్తించు, ఉండు. "సీ. ధర్మంబు కాశికాస్థాన

మధ్యంబున శాల్గాపాదంబుల నడచియాడు." కాశీ. ౨, ఆ. ౫౦.

నడచు. దే. అ. క్రి. 1. గమనముచేయు, చరించు. "వ...మార్తాండుండు కొంత ప్రక్కం జిక్కి కదలిమొగయక్కలిం దగులఁబడినబోగుమం బోలె కాదుర నడవ మఱలం బఱవలేక చీకాకుపడి యున్నవాఁడు .." కాశీ ౨, ఆ. ౯౮. ఉ. హరి. ౬, ఆ. ౬౬; 2. నడచుకొను, ప్రవర్తించు. "క. ఇది చెప్పినట్లు చేయుఁడు, మిది కందినయట్లు నడతు మిది కల్యాణాభ్యుదయవిధానము మా కని, హృదయంబులఁ దలఁచుచుండి రిరుదెసవారల్." హర. ౬, ఆ. ౧౦౭. అము. ౪, ఆ. ౨౨౮; 3. వెడలు. "క. సేనమొగ మొకఁ డైనం,బాని మహీశ్వరులు నీకుఁ బోడిచెదరే దుర్గాని యని కాద యాకని,తో నడచుట కొల్లనైతి దురమున కధిపా." భార. ఉద్యో. ౪, ఆ. ౨౪౪. కాశీ. ౧, ఆ. ౧౨౬; 4. చెల్లు. "క. దేవా క్రమ క్రమంబునఁ, బావనులై వృష్టి కలుగు ప్రజలకర లీల, గైవల్యంబున కేఁగెదు,పావలిచే మాకు నడవ వధికారంబుల్." వరాహ. ౧౦, ఆ. ౧౭; 5. కొనసాగు, సిద్ధించు. "గీ. నామూలంబునఁ గార్యంబు నడవ దేమి,సేయువాఁడ .."భార. ఉద్యో. 3, ఆ. 3౨౬; 6. జరుగు. "క. మున్నొ క్కపట్టణంబున, సౌవర్ణరిమిటారి జేర్పు కూర త్వము సై, కొన్నదియై నడచినకథ, చెన్నుగ విని పొమ్ము కడువిచిత్రము కొమ్మా." హంస. ౨, ఆ. ౧౭౭; 7. (గ్రాసము) కడచు, సాగు "గీ. తగిన వేషంబు దనుఁ దాన పొగడుకొనమి, నొచ్చియుఁ ను గీడుపలుకమి యిచ్చి వగవకునికి దన కెంత నడ వకయున్న లక్షముఁ దప్పకుండుట నడవడి కొప్ప సేయు." భార. ఉద్యో ౨, ఆ. ౪౫; 8. ఉండు. "సీ. ఇఁకఁ గావు మఖ్యింతు నే నోయఖండదయా సముద్రుండ నాయందుఁ గరుణ,నడవఁగట్టి పగలు వడఁగించిలే నేమి చెప్ప నమోఘవాంఛితుఁడ నగుదు." రాఘవ. ౪, ఆ. ౭౧; 9. కదియు. "ఆ. స్వచ్ఛ)కవికురంబవనశిఖ మేఘనా,దాభి ధానుఁ డాబలాఢ్యుమీఁద, నడచి దుర మొనర్చి ..."రాఘవ. ౪, ఆ. ౨౧౬.

నడజోదు. ద్వ. వి. (నడ+జోదు.) కాలిబంటు, పదాతి. "వ...అడిదంబులఁ బోడిపోడిగా నడుచు నడజోదుభటులును..."ఉ. హరి. ౪, ఆ. ౨౯.

నడక. దే. వి (నడచు ధా.) 1. నడవడి ప్రవర్తనము. "సీ. కామపాలాఖ్యుఁడై గరిమ సర్వ జ్ఞుఁడై నరవరోచిత నైంసనడక రొంటెఁగె." నరస. ౧, ఆ. ౭౦. కళా. 3, ఆ. ౮౧; 2. జీవనోపాయము, వృత్తి. "సీ. నడక యనంగను నడక యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి." ఆం. భా. ద్వి. ౨౨౮.

నడకాడి. ద్వ. వి. (నడ+కాడి.) నడక గలకాడి. "క. పోడిమియును బోడియునై యుల, నడకాడిం బోలి..." ప్రబోధ. 3, ఆ. ౨౦.

నడతెంచు. దే. అ. క్రి. (నడచు+తెంచు.) 1. వచ్చు. "సీ. అనుగునఁ బడక రత్నాకరంబునఁ దేలి నడతెంచుజీవరత్నంబు లనఁగ. గీ ..ముద్దు, చిలుకునచ్చరచిలుకలకొలుకు లపుడు, కదలి పెలం పడి వచ్చుశృంగార మమర." దశా ౨, ఆ. ౭౪౫. భా. రా. యు. ౫౦; 2. పోవు. "చ...దిగంత భాగములు పగుల్పఁగా నెదురుగా నడతెంచిరి వైరికోటికిన్."హరి. ఉ. ౯, ఆ. ౧౬౪. ప్రభా. ౧, ఆ ౫3; 3. సంచరించు, తిరుగు. "చ... భూరిపరాక్రమశాలి భీష్మనక్కజముగఁ దాఁకి యుద్ధిన పకంపితు లై నడతెంచుకల్యకుంభజకురు రాజు లచ్చెరువుపాటు భయంబును బొందఁ జేయుమి." భార. భీష్మ. ౨, ఆ. 33.

నడతెగు. దే. అ. క్రి. (నడ+తెగు.) నడక తెగిన దగు, డయ్యు, ఆలయు. "వ...మందకును దూరం బుగా వచ్చితిమి నడగఁడు నడతెగె మానిసి మట్టె చిట్టాడనియాఁడిట్టడవి కట్టు చనచేర్తు .." పి. శకుం. ౨, ఆ. ౮.

నడదివియ. ద్వ.వి. (నడ+దివియ.) కరదీపిక,కాగడా. "సీ. నడదివియలు నేసె నగరికి మాణిక్యమకుట ముల్ భూనివమనుజపతుల."భార. విరా. ౫, ఆ. 3౨౦ సభా. ౫, ఆ. ౭౧.

నడదీఁగె. ద్వ. వి. (నడ+తీఁగె.) నడక కలతీఁగె. "ద్వి. నడదీఁగెలో యన నవకంపు·గాంతి, కడు నొప్పు మేనులు భువనితంబములుఁ, చిఱుతనవ్వులు తీయమెయ్యలు గల్గు, తెఱవలు పలరాజాదీకుంబు లవఁగ." రం. రా. ఉ. ౧౧౦. పు.

నడదీవ. = నడలేఁగె. "చ... భూమిభృత్తనయ ప్రసూనగుచ్ఛములు దాలిచి లేఁజిగురుల్ ధరించి వచ్చి నడదీవవోలె నలిచెం దరుణేందుకిరీటునన్నిధిన్." హర. 3, ఆ. ౯౭.

నడపందిరి. దే. వి. (నడ+పందిరి.) ప్రయాణకాలమందు రాజాదుల కుపచారమునకై పరిచారకులు మోసికొనిపోవుపందిరి. "ద్వి. ఉడువీథి గప్పి నమున్నతలీల, నడపందిరులు వెలిగొడుగులు దనర." బస. ౨, ఆ. ౧౬౨. పం.

నడపాడు. దే. అ. క్రి. (నడపు+ఆడు.) నడచు, తిరుగు. "క. కూర్చుండు నురమునం జన, నేర్పును విద్దంబు సేయ చేర్చుచు ప్రీతిం, దార్చుచుఁ దప్పటడుగు లాడఁ, గూర్చు జననిచెట్టపట్టుకొని నడపాడున్." ద్వా. 3, ఆ. ౪౯. కు సం. 3, ఆ 3౨.

నడపించు. దే. స. క్రి. (నడచు ధా. ప్రే.) 1. నడవఁజేయు, చరింపఁజేయు "సీ. భూరియఁ గట్టియల్ నీరుచు గలపథంబున నీవ నడపించుభూరికీర్తి." ఉ రా. ౪, ఆ. ౧౪౬. శైవ. ౪, ఆ. ౭; 2. ప్రవర్తిల్లఁజేయు. "గీ ..నీయభ్యనుజ్ఞ ననుమతింపుము ..రాజు నడపింప నెట్లు ధర్మంబు నడచు." కాశీ. ౬, ఆ. 3౧.

నడపీనుఁగు. దే. వి. (నడ+పీనుఁగు) నడచుశవము. "ఆ... అర్థంబు నున్వె సకలధర్మకారి, యొడమె లేనివాఁడు నడపీనుఁ గనుసమాప్తి వినమె దాని నూఁదవలదె." భార. శాం. ౧, ఆ ౭౯. కు. శ. ౪3.

నడపు. దే. స. క్రి. (నడచు ధా. ప్రే.) 1. గమనింపఁజేయు, నడవ జేయు. "ఆ. మూలబలముతోడ మోహరంబుగఁ దీర్చి, సుమతిసుతుఁడు సైన్యసమితి నడపె." విక్ర. ౫, ఆ. ౭౪. ఉ రా. ౨, ఆ. 3౨౯, 2. ప్రవర్తిల్లఁజేయు. "వ. భూజ్యాలయం బెల్లఁ బూజ్యండవై వేదచోదితవిధానంబులయందు విప్రసహాయుండవై భువనంబుల నడపు మని శుక్రగురుండు వైశ్వానరుం బ్రార్థించి." భార. ఆది. ౧, ఆ. ౧౪౪. హరి పూ. ౧, ఆ ౧౦3; 3. జరుపు, సాగించు. "సీ. వెలివెలివస్తువుల్ విడిచె బోనరుఁడు కర్తృత్వం గాడె శరీరయాత్ర, నడపువాఁడది మోక్షంబు కాలేరదు..." భార. శాం. ౧, ఆ. ౭౪. అను. ౪, ఆ. ౧౯౦; 4. ఆచరించు, అనుష్ఠించు. "గీ. వరుస నడపిరి పేరశైవవ్రతంబు." హర. ౨, ఆ. ౧౧౯. భార. అను. ౪, ఆ. ౪౦౭; 5. పోషించు. "చ. పడసిరి నిమ్మహాత్ముల నపాయము నొందకయుంటఁ జెంచుచున్, నడపు మటంచు నన్ను మునినాథుఁడు మీాజనకుండు పంచి .." భార. ఆది. ౭, ఆ. 3౦౫. చంద్ర. ౪, ఆ. ౯౬; 6 సమకూర్చు. "క. కోదండ్రకు సొమ్ములు, కోకలు ననులేపనములు కొదయించుక యుండ్, లేక ప్రవర్తిల నడపె నృపాకులతం గొమరుడెంద మలరారుటకై." కళా. ౬, ఆ. ౭౧. వి. 1. గమనము, నడక. "సీ. అల్లఁదనంబున యనువు మైకొనఁ జూచు నడపు కాంతికి వింత తోడవు గాఁగ." భార విరా. ౧, ఆ. ౨౪౫. ఉ. హరి. ౫, ఆ. ౫౭; 2. ప్రవర్తనము. "ద్వి. నడచె నీశ్వరుఁ బ్రసన్నతఁ జేయఁబూను, నడపెట్టి దని చూచు నడచినయట్టు." పండితా. పురా. ౯౨. పు.

నడపుకొను. దే. స. క్రి. (నడపు+కొను.) పోషించు. "గీ. ఆరమరలులేక మీాయుపాధ్యాయునవెకు, నడపుకొనువార లెవ్వ రున్నారుగనుక." విప్ర. ౪, ఆ. ౬౫.

నడబావి. దే. వి. (నడ+బావి) నడచిపోవుటకు మెట్లేర్పఱచినబావి, దిగుడుబావి. "సీ. విమలంబులై నతూరుములు నూటికొంటెఁ బరికింప నొకనడబావి మేలు." కృ. కథం. 3, ఆ. ౧౧౭. తపతీ. 3, ఆ ౯.

నడమామిడి. దే. వి. (నడ+మామిడి.) నడక కల మామిడి. "క. కలయఁగ గరములఁ జరణంబుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం, దలి రొసఁగిన నడమామిడి, చెలువునఁ బఱతెంచె భీముపేరుఁ దచటికిన్." భార. భీష్మ. 3, ఆ. ౨౨3.

నడయాడు. దే. అ. క్రి. (నడ+ఆడు.) 1. సంచరించు. "చ...కొమ్మమాత్రమా, యులరెడుముద్దుగుమ్మ నడయాడెడుబంగరుబొమ్మ గాక..." దశా. ౨, ఆ. 3౧౫. "సీ. నడయాడుకొండలపడుపున వేదండకాండంబు లొండొండ మెండుకొనఁగ." కృష్ణ. 3, ఆ. ౭౭; 2. పీచు. "క... ప్రాణులపై నడయాడెం బలుసెకలగాడు పక్కాల మునన్." సమీర. ౨, ఆ. ౯3. దశా. ౨, ఆ. 3౭౯; 3. ఉండు, నివసించు. "క. వచ్చెగద ఖేదము నకీక, నిచ్చట నడయాడఁ గూడ దెట

కేనితము నేవచ్చెద రమ్మటులైన, న్విచ్చలవిడి నడవవచ్చు వెఱవకు మదిలోన్." శుక. 3, ఆ ౯౧౦౨; 4. చలించు. "ద్వి ..నరులు, నడయాడు చున్నకిన్నరవరుల్ నడవ..." అచ్చ. యు. ౨౪౮. పు.

నడవ. దే. వి. 1. తలవాకిటికిని నడిమివాకిటికిని నడిమి చోటు, ఆళిందము. వ్యవ-వాఁడు నడవలో నున్నాఁడు, 2. సేతువు. "గీ. నడవ గావించు చున్నయన్నలునిసేతు, కర్మకౌశల మీక్షించు గగనచరుల, కనిమిషత్వంబు చరితార్థ మయ్యె నపుడు." భా. రా. యు. ౨౯౨; 3. మార్గము. "ఆ ..మార్గంబు,తెరువు త్రోవ దారి తెన్ను సరవి,చదుప నడవ చొప్పు జాడ డొంక యనంగఁ, బొలుచుచుండు..." ఆం. భా. ద్వి. ౮. "వ... కూలినబావి తెఱంగున నడవ లేక..." కవిక. ౪, ఆ. ౧౧౩.

నడవడి. దే. వి. 1. గమనము, నడక. "సీ. నడవడి గలదివ్యనాగదంతములట్టు...గీ...తెలసి రన్న లువు రంత." చం. రా. ౨, ఆ. ౯౩. సీతారా. ౧, ఆ ౧౮౦; 2. ప్రవర్తనము. "చ. నడవడి మంచిదైనను జనంబులు పెద్దఁగఁ జూతు రాత నిన్, నడవడి చక్కఁగానినరు నచ్చినచుట్టము లైనఁ జేర నీ,కెడ గలుగంగఁ జూలుదురు .." నా. పంచ ౧, ఆ. ౧౦౬. భార. ఉద్యో ౨, ఆ. ౩౯; 3. ధర్మము, న్యాయము 'గీ. మఱియు మఖములు మహితకర్మములుఁ దంత్రములును నడవళ్లు శాస్త్రములుఁ దఱియు,ముఖచతుష్కము నందునఁ బొడమె ననిన" భాగ. 3, స్కం, ౨౮౭. భార. శాం. ౨, ఆ. ౨౯౭, 4. జీవనో పాయము, వృత్తి. "సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి." ఆం. భా. ద్వి. ౨౬౮.

నడవడిక. దే. వి. ప్రవర్తనము. (శ. ర.)

నడిపించు. దే. స. క్రి. (నడుచు ధా. ప్రే.) నడపించు. "సీ...తురగచయము. ఆ వాల్గుసాయకముల నడిపించి సారథి, నొక్కమార్గణమున నుబ్బణంచి, యార్చుటయును ద్రోణుఁ డలిగి .." భార. ద్రో. ౪, ఆ. ౭.

నడికట్టు దే. వి. (నడుము+కట్టు.) కాసె, దట్టీ. 'సీ అరచట్టమయి కుంకుమాంబువునడికట్టు చెంగావిమై జిగిఁ జిలికీయ." రా. వి. 3, ఆ. ౧౨౯. దశా. ౧౦ ఆ. ౧౧౨.

నడికట్టుత్రాడు. దే. వి. ఏనుఁగు మొదలగువానినడు మునకుఁ గట్టెడుత్రాడు. "క...కద్వేదండము నడి కట్టుత్రాళ్లఁ దగ బంధించెన్." కళా. ౮, ఆ. ౮౬.

నడికలను. దే. వి. (నడుము+కలను) యుద్ధరంగము యొక్కనడిమిభాగము. "వ ..నడికలన నాటి వారిఁ దలంచుకొని .."ఉ. రా. ౪, ఆ ౨౮౧.

నడికిరే. ద్వ. వి. (నడుము+రే.) అర్థరాత్రము. "సీ. అకఁటుదు దద్భావ మరయంగ మదిఁ గోరి రూపించి యొకపరి రేప వత్తు,నని పోయి నడికిరే యగ్గిలోఁ జనుదెంచు..."భా. రా. అర ౭, ఆ. ౩౨౨. స్వా. ౧, ఆ. ౯౬.

నడికిరేయి. ద్వ. వి (నడుము+రేయి ) అర్ధరాత్రము. "గీ. ఈనడికిరేయి నొంటిమై యింతదూర,మేమి కార్యంబు మదిఁ గోరి యేఁగుదెంచితి..."హార. ౭, ఆ. ౧౨౩.

నడిగండి. దే. వి. (నడుము+గండి.) ఆఁడుగుఱి, గూని "సీ. తొడపల్చ నగునింతినడిగండి కడుఁ బెద్ద రిక్తుసిమనసుకోరికలు పెద్ద.' వేణు.శ. ౨౦.

నడితల దే. వి. (నడుము+తల ) శిరోమధ్యము. "చ. నడితల నూరుజానుజఘనప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ, బిడుగులఁ బోలుపెన్గవలఁ బెట్టుగ వ్రేయుచు..." భాగ. ౧౦, స్కం. ఉ. ౭౩౬. హరి ఉ. ౨, ఆ ౬౧.

నడిలి. దే. వి. ప్రవర్తనము (బ్రా. శ. ర)

నడిపించు. దే. స. క్రి. (నడుచు ధా. ప్రే.) 1. గమ నింపఁజేయు. "గీ ఘల్లుఘల్లునఁ బెండెంబు గండు మీలు,గదల నల్లన నడిపించి పొదివి తెచ్చె,కొచ్చె లులపింతు యుంవతి నాన్పుకలికడకు." స్వా. ౬, ఆ. ౯, 2. జరిగించు, సాగించు. "గీ. అనినఁ జిఱు నవ్వు నవ్వి యజ్జనవరాగ్రగణ్యుఁ డతనికిఁ గట్టు వర్గంబు లొసఁగి, మంచి దటుపలెనే నడిపించు కొంద,మంచు వీడ్కొల్ప నాతైత్యుఁ డరుగుట యును "కువల. ౨, ఆ. ౧౦౪; 3. తోలు. "క. అరదము దశముఖుమీఁదం, బరువడి నడిపింపు మేగ మాతలి యనుచున్."ఉ. రా. ౪, ఆ. ౩౩౪.

నడిప్రొద్దు. ద్వ. వి. (నడుము+ప్రొద్దు.) మధ్యాహ్నము. "క. కరికలభంబులు నిర్ఘర, ఘరిదంబులు పేల్చి చిమ్మి శ్రమ మఱఁజేయం,గ రథంబు నిలిపి

యుష్మూరి, తెరువున నడిప్రొద్దు ప్రొద్దు శిరమై నిలుచున్." రామా. ౧, ఆ. ౧౩౩.

నడిమికట్టు. దే. వి. (నడుము+కట్టు.) నడుమునకు కట్టుకొనెడికట్టు. "సీ. కటిమండలంబునఁ గరకంచు పుట్టంబు మడఁచి కట్టినమేలినడిమికట్టు." హర ౨, ఆ. ౯౩.

నడిమిలోకము. ద్వ. వి (నడుము+లోకము.) భూలోకము. "గీ. కారణాంబేమి నడిమిలోకమున నుండి, నరపతులు రాను మునువోలె నాకమునకు." శైవ ౩, ఆ ౭.

నడిరాతిరి. ద్వ. వి. (నడుము+రాతిరి) నిశీథము. "సీ ..నడిరాతిరి యనఁ, నడిరేయి యనఁగ..." నిశీథాఖ్య దగు .." ఆం. భా. ప్ర. ౭౪

నడిరేయి. ద్వ..వి (నడుము+రేయి.) అర్ధరాత్రము. "ఉ . కొక్కొరోకోయని కూయుఁడే యకఁడు కుక్కుటమై నడిరేయి గౌతము ప్రేయసిఁ బొందఁగోరి .."శైవ. ౭, ఆ. ౭౯. భార. సౌ. ౨ ఆ.౩.

నడివ్రేలు. దే. వి. (నడుము+వ్రేలు.) నడిమివ్రేలు, మధ్యమ. "గీ. నడివ్రేలన మధ్యమ నగడు .." ఆం. భా. ౭౨ ౧౩౯.

నడుఁకఁబడు. ద్వ అ. క్రి. (నడుఁకక్+పడు స్వార్థమున.) నశించు. "వ ..సోదాసజన పాపతాప త్రయచయమ్ముల నడుగక నడుఁకఁబడఁజేయు నడుగుతండంబులును .." ఘటికా. ౨, ఆ. ౬౫.

నడుఁకు. దే. అ క్రి. 1. ఒణఁకు, వణఁకు. 'గీ .. అధిపసుతుఁడు, నడఁకి నడఁకి చాల్లలన నడిచి కట్టెఁ, బాణిపద్మద్వయంబునఁ బసిఁడియుంచ." శైవ. ౧, ఆ. ౧౦౨. భాగ. ౬, స్కం. ౩౫; 2. లొంగిపోవు. "గీ. బ్రతుకఁ దలఁచేని విషము నాపనుపు సేసి, చక్ర మాదిగ విడిచి మత్స్యంజ్ఞ యుండెగి, నడఁకి చను దెమ్ము నాశరణమ్ము పొరఁగ." హరి. ఉ. ౬, ఆ. ౧౯౦; 3. వడఁకు, కంపించు. 'గీ. అమరుల్హిత హేషితములు ఘుమితఘు,నాసమాస్ఫాలితంబులజడికి నడఁకి,కుల కుధరమండలము కలఁగుండువడియె." వసు. ౨, ఆ. ౧౫౨; 4. భయపడు; వెనుదీయు. "క. వెలి వార లధికభీతిక్, విఱిగి చనిరి భీష్ముఁ డేచి వీర రథికులం,దఱఁ జూచి రాచకొడుకుల, నటు మూడెడు భీముఁ డిట్లు నడుకం దగునే." భార. భీష్మ. ౨, ఆ. ౨౩౭. శాం. ౨, ఆ. ౧౪౪; 5. నశించు. (చూ. నడుఁకఁబడు.); 6. బాధపడు. "చ ..సుకుమారమూర్తులక్, గడుసుఖులైన వారలను గట్టెఁడినై వెసఁ గట్టి త్రోచిరిక్,నడుఁకుచు వార లెవ్విధమునక్ దురపిల్లుచు నున్నవారొకో." వి. పు. ౫, ఆ. ౧౬౩. వి. భయము; కంపము. వ్యవ.-నన్ను చూడఁగనే వానికి నడుఁకు పుట్టినది. (శ. ర.)

నడుఁకొత్తు. దే. అ. క్రి. (నడుఁకు+ఒత్తు.) భయము లేకుండు, నిర్భయుండగు. "సీ. దేవర మావ్యూకే తెంచిరి వారిలో నడుఁకొత్తి కొంతసైన్యము వధించి. గీ. సగనహారిఁ గొంచు పొగసె నద్దివిక నొక్కఁడు .."జై. ౨, ఆ. ౪౧, ౩, ఆ. ౯౦.

నడుఁగు. దే. అ. క్రి. వడఁకు, కంపించు. "క. వాలు పయి నడచున ట్లబ్బాలిక నడునడుంగి భయమున నియమాభీలఁ దగుపలికిఁ బవళుల్, శేలును సేమఱక పరిచరించుచు నుండెన్." భార. ఆది. ౨, ఆ. ౧౫౬, ౫, ఆ. ౨౧.

నడుకొన. దే. వి. (నడుము+కొన.) నడిమిప్రదేశము. "వ...ఒక్క మోహరంబుగా నమర్చి యందగ్ర భాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామసౌబలుల నునిచి నడుకొన శల్యు నిలిపి యన్నరేంద్రుండు వెన్ను దన్ని నిలుచునట్లు చేసె నవుటయు..."భార. ద్రో. ౫, ఆ. ౧౪౨. భార. విరా. ౪, ఆ. ౭౪.

నడుగడ్డ. ద్వ. వి. (నడుము+గడ్డ.) ద్వీపము, నలుదిక్కుల జలము గలభూభాగము. "సీ. కావేరి నడుగడ్డఁ గాపురంబుండుచు దివసాంతమున నిటఁ బిరిగివత్తు." కసు. ౧, ఆ. ౨౧౫. భోజ. ౫ ఆ. ౩౪౬.

నడుగాలు దే వి. (నడుము+కాలు.) గడ్డములశరీరలాఘవమునకై వెనుక కాళ్లకును ముందుకాళ్లకును గట్టెడుసాధనము. "గీ. కట్టుఁగొయ్యలతో నడుగాళ్లతోడ..పంచవర్ణ రజ్జువులతోడ బహుళమందురలు జనించె." వరాహ. ౪, ఆ. ౧౧౪

నడుగుంట ద్వ. వి. (నడుము+గుంట.) తలనడిమి కల్లము, బ్రహ్మరంధ్రము. "సీ. చము రూర నడుగుంట నిమురుచుఁ దలయంటి యంగంబులెల్లఁ గక్కుంగ దీటి." చంద్రా. ౨, ఆ. ౩.

నడుచు. = నడచు. 1. గమనముచేయు, సంచరించు. "చ. అడిగితి నొక్కనాఁడు గమలాసనుతేరిక

వారువంబసై, నడుచుచు..." శైశు. ౨, ఆ. ౫౮. ఆము. ౧, ఆ. ౫౬; 2. వెడలు,పోవు. "సీ. నగశాసనోనాథునగరికి నడుచువా రెడపక క్రొన్నెల ముడుచువారు." భల్లా. ౨, ఆ (శ.ర.) భీమ. ౨, ఆ. ౧౦౧; 3. ప్రవర్తించు, నడచుకొను. "వ. ఇంత విచారించి రుచించినట్లు నడుపుము." ఆము. ౬ ఆ. ౩౧; 4. కలుగు,పుట్టు "క. కామం బనుపురుషార్థము, సామము వినియు నిది దక్క నలినానన యేసేమియు నెఱుంగఁ జెపుమా,యేమిట నది నడుచు సిద్ధి యొప్పెయిఁ బొందున్." దశ. ౫, ఆ. ౨౬; 5. అనుభూతమగు, భుక్తమగు. "క...మన్నవజీర్ణము, నడుచు ముఖాసాలు గాక..." ఉ. హరిశ్చ. ౧, ఆ ౬౬. 6. సరిపడు, అనుకూలించు. వ్యవ:-ఆమం దాతనికి నడువదు; 7. చేరు, అందు. "సీ. పని గల్గి యుండినఁ దనకు మంత్రులకు లేఁజిగురుబోఁడుల చేతఁ జెట్టు నడువ." శుక. ౪, ఆ. ౧౦౧.

నడుజాము. ద్వ. వి. (నడుము+జాము.) అర్ధరాత్రము. "ద్వి. వారక నడుజాము వచ్చి పేఁడి నను, కోరినధనములు కొండు కొం డచుచు" ద్వి. హరిశ్చ. ఉ. ౪౭౫. పం.

నడుతల. దే. వి. (నడుము+తల.) శిరోమధ్యభాగము. "సీ. నడుతల యందంద పిడికిట మెదళులు గలఁగంగఁ బొడిచి మోఁకాల నురుము,దాఁకింప.." హరి. పూ. ౯, ఆ. ౧౩౪. మార్క. ౩, ఆ ౩౪౮. ఇట్లే: నడుదల, నడుకొత్తి. భార. స్త్రీ. ౧, ఆ. ౯౮. ఉ. రా. ౩, ఆ. ౨౬.

నడుదిన్నె. దే. వి (నడుము+తిన్నె.) ద్వీపము. "గీ. ద్వీపమున కగు నడుదిన్నె దీవి యనఁగ." వెంక. మాన. ౪౬.

నడుదెస. ద్వ. వి. (నడుము+దెస.) మధ్యప్రదేశము. "క. వెలయఁ బెనుబైలు నిమధా,చలకూటము నందు నడుదెసన్..." వరాహ. ౧౦, ఆ. ౧౩౫.

నడునడు. దే. వి. వడఁకుటయం దగునను కరణము "సీ...భండనమున, వారిహేతిచ్ఛత్ర వాహన ధ్వజములు నఱికిన నడునడు నడఁకి వారల భయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి..." భార. ద్రో. ౨, ఆ. ౨౦౬. భార. ఆది ౨, ఆ. ౧౫౬.

నడునీరు. దే. వి. (నడుము+నీరు) నీటినడిమిభాగము. "క. వననిధినడునీటఁ గలము, మునిఁగిన బెగ డందుచిత్తములం గలిగినతజ్జనులక్రియ నున్న వేసలు .." భార. ద్రో. ౧, ఆ. ౨౬.

నడుపాడు. దే. అ. క్రి. (నడుపు+ఆడు.) నడుచు, సంచరించు. "సీ. నడుపాడ నేర్చినవవకంపునునుఁ దీఁగమెరిపెంబుఁ బూనినవిరులరొత్తు." కేయూర. ౪, ఆ. ౩౦.

నడుపు దే. స. క్రి. (నడుచుధా. ప్రే.) 1. ప్రవర్తింపఁజేయు. "క. పెక్కండ్రు గూడి సమయం, బొక్కటి కల్పించి నడుపుచుందురు రేనిన్, నిక్కముగా నాసమయము, దక్కక దాని చెల్లించుట యను ధర్మము పలికెన్." విజ్ఞా. ప్రా. ౩౮; 2. ఆచరించు,చేయు. "సీ. శైజంబు.లగునిత్యనైమిత్తికంబులు నడుపుచో బ్రహ్మార్పణంబు చేసి" కాశి. ౧, ఆ. ౨౩. శుక. ౪, ఆ. ౨౬; 3. పోషించు. "క. ఇడ నని విడువం జెల్లుకొ, నడుపవలయుఁ జేర్చినట్లు నమ్మకయొ కృపన్.' ఆము. ౪, ఆ.౨౩౩; 4. తోలు. "గీ. అమరవిభు తేరు మాతలి యపుడు నడిపె." ఉ. రా. ౪, ఆ. ౩౨౧. వి. గమనము, నడక. 'గీ. మురిపముల నుజ్జగించిన ముగుదనడుపు, కలికిచూపుల వీడ్కొన్నకన్నుఁగవయు." ఉ. హరి ౧, ఆ. ౧౪. కళా. ౬, ఆ ౨౫౦.

నడుమంతరము. మి. వి. (నడుము + అంతరము - శ. ర) 1. కౌను, అవలగ్నము; 2 మధ్యకాలము. (చూ. నడుమంత్రము.) విశ. మధ్యకాలమునఁ గలిగినది. "గీ. చక్రభావనచేఁ గాంచి శక్తిఁ దనకుఁ,బ్రాపు గలుగుటనో లేమిఁ బాపుకొనియొ, వెలఁది నడుమంతమాత్రనే విఱ్ఱవీఁగె, నహహ నడుమంతరపుఁగల్మి కది నిజంబు." అని. ౩, ఆ. ౧౦౦. (విశేష్యవిశేషణార్థముల కిదియే యుదాహరణము.)

నడుమంత్రము పు. వి. (నడుము+మంత్రము ?) 1. కౌను, అవలగ్నము. "క. నడుమంత్రము కుచభారము, నడుమంత్రము సైఁకుదు..." శృంగార రసాలవాలము. ౨, ఆ. (శ. ర.); 2. మధ్యకాలము. "మ. నడుమంత్రంబున లక్ష్మిఁ దెచ్చుకొని యన్యాయంబునన్ మూర్ఖుఁ డెవ్వఁడు వారిన్ దొడరంగఁ బోయి మడియున్..." ఉ. రా. ౨, ఆ. ౮. విశ. మధ్యకాలమునఁ గలిగి

నది. "చ. అతివకుచంబులం౯ మెఱుఁగుటారును వేనలియం౯ ధరాధిపో న్నతియు నహీనభూతి కలనంబు ఘనాభ్యుదయంబు నిక్క డొందిరి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు నిట్టవీఁగె దుర్౯,క్షితి నటుగాదె యొక్కొకరికి౯ నడుమం త్రపుఁగల్మి కల్గినన్." విజ. ౧, అ. ౩౪. వి. పు ౭, అ. ౧౫౬.

నడుమ. దే. వి. ఔ. (వృత్తియందు వికల్పముగా 'నడి, నడు' అగును.) 1. కౌను, అవలగ్నము. "సీ. ఘనమైనరారాపుచనుదోయిరాయిడి నిఱుపేదనడిమికి వెఱపుఁ జూప." కాశీ. ౧, అ ౯౦. సి. శతం. ౨, అ. ౮౦; 2. మధ్యభాగము, మధ్యప్రదేశము. "చ...ఎదిర్చినదుస్ససేనువిశ్, నడిమికిఁ ద్రుంచి గాండీవగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల..."భార. కర్ణ. ౧, అ. ౨౦౨ భార. ఆది. ౬, అ. ౮౧; 3. మధ్యకాలము. "క. అనఘా యీ యజ్ఞమువిధి, ననాథబుత్విక్ప్రయోగసంపూర్ణం బయ్యెను గడచన నేరను నడుమన యుండుగను భూసురోత్తమరిత్తమునన్." భార. ఆది. ౨, అ. ౨౦౯. కళా. ౫, అ. ౩౨. విశే. మధ్య నుండువాఁడు; మధ్య నుండునది. "ఆ. పూర్వదత్తయైనభూమి నెవ్వఁడు పుచ్చుకొనియె నతఁడు తనదుకులమువారి, నిరువదొక్కతరము నరకవాసులఁ జేయుఁ,దాను నడుమ గాఁగ ధర్మనిరత."భార. అను. ౨,అ ౩౬౫. విక్ర. ౮,అ.౯౫.

నడుముకట్టు. దే. అ. క్రి. (నడుము+కట్టు.) సిద్ధపడు. వ్యవ-ఆకార్యమున కందఱు నడుముకట్టి పనిచేయవలయును.

నడుముకొను. దే. అ. క్రి. (నడుము+కొను.) సన్నద్ధమగు. "లయవిభాతి. కదలుకొనురౌద్రమునఁ గదఁగి సమరోత్సవము వెదపదకయుండ నొగి నడుముకొని శక్తిం,దద,లడక పేర్చి పడి నడుగులిమువేగమున .." భా. రా. యు. ౧౮౪౩.

నడుముదాఁకు. దే. స. క్రి. (నడుము+తాఁకు.) ఎదిరించు, ఎదుర్కొను. "శీ. నల్లచీమలబారు నడుము దాఁకినవీఁక నున్నదీచెలువంపుఁగన్నుఁదోయి." విజ. ౨, అ. ౧౦౬.

నడురాతిరి. ద్వ.వి. (నడుము+రాతిరి.) అర్ధరాత్రము. "ఉ. అతరళాక్షి యొక్కలియ యానడురాతిరి పెక్కుమోసలల్, వేకటియంగఁ దూరి..." వాసిష్ఠ. ౪, అ. ౧౭౭.

నడురే. ద్వ. వి. (నడుము+రే) అర్ధరాత్రము. "క. అవృష్ణివరుం డాత్మజు, నావిర్భావం బెఱింగి యంతర్గృహముం౯, వేవేగఁ జొచ్చి నడురే, యావనజాప్తుండు పొడిచినట్లై యుండన్." హరి. పూ. ౫, అ. ౧౧౮. ఆము. ౧, అ. ౧౮౪.

నడురేయి. ద్వ. వి. (నడుము+రేయి.) అర్ధరాత్రము. "క. నడురేయి సంధ్యలందును, నడపఁగ నోడుదు రశక్తనరులు..." భార. ఆది. ౭, అ. ౩౯.

నడులేఁత. దే విశే. (నడుము+లేఁత.) మిక్కిలి లేఁత ముదురు కానిది.

నడ్కురేయి = నడికిరేయి. (అర్ధరాత్రము) "ఉ. ఒక్కటఁ జిక్కటిల్లి యిరులో యన నో యను నడ్కురేయిఁ బెం,పెక్కినకోపునం బురి మహేశ్వరధామముఁ జొచ్చి." ఉద్భ ౨, అ. ౧౩౭.

నడ్డి. దే. వి. నడుము, అవలగ్నము. "గీ పెటికయే చాలు నానడ్డి విఱుగఁ జేయ,దానిపైఁ దాను నెక్కి నింతయును గాక..."శుక. ౩, అ. ౪౦౬. విశే.చప్పట."ద్వి. నరసినగడ్డంబునడ్డినాసికయు." నళ. ౩, అ. ౪౩౧.

నడ్డిగుంట. ద్వ. వి. (నడ్డి+గుంట.) నడ్డిక్రిందగుంట, కుకుందరము. (శ. ర.)

నడ్తి = నడిలి. (శ. ర.)

నడ్మ=నడుము. దే. వి. (మధ్యభాగము.) "గీ...వారలకు మనకుఁ, బొసఁగుచే నడ్మఁ బెట్టినఁ బూరిగాలు" ఉ. హరి. ౫, అ. ౧౫౯. (శ. ర. పా.)

నద్య. సం. వి. ఆ. స్త్రీ. కిక్కసపామి.

నద్వంతము. సం. విశే (త్. ద్వ. తీ. త్.) కిక్కసకసవు అధికముగాఁ గలది. (దేశము.)

నద్వలము. సం. విశే. (అ. ఆ. అ.) = నద్వంతము.

నతము. సం. వి. అ. పుం. నందివర్ధనముశీ. విశే. (అ. ఆ. అ.) 1. నమ్రము, వంగినది; 2 నమస్కరించునది; 3. వంకరైనది; 4 అణఁగినది; లోఁతైనది. "మ ..నతనాభి౯ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్." స్వా. ౪, అ. ౨౫.

[illegible]. సం. వి. ఇ. స్త్రీ. 1. వంగుట; 2. వంపు వంకర; 3. నమస్కారము, మ్రొక్కు. "గీ. సత్త్వగుణమున హరివై రజస్తమోగుణముల శంభుఁడ వగు నీకు నతి విరించి." కాశీ. ౨, అ. ౫.

నత్త. దే. వి. క్షుద్రశంఖకీటకము. "గీ. నత్త నాఁ జెలఁగు క్షుద్రశంఖకీటంబు..." ఆం ఛా. ద్వి. ౭౨.

నత్తగుల్ల. ద్వ. వి. (నత్త+గుల్ల.) క్షుద్రశంఖము, కీటకవిశేషము. "సీ...నత్తగుల్ల చుట్టుడుగుల్ల కురిమిండ ..గీ. అది కొంఱగాసిజాతువులు .." హంస. ౪, ఆ. ౧౮౬.

నత్తి. దే. వి. తడఁబడుచు మాటలాడుట కలవ్యాధి విశేషము. (వ్యవ.)

నత్తివాఁడు దే. వి (నత్తి+వాఁడు) నత్తి కల వాఁడు, లోహలుఁడు. "సీ.. నత్తి వాఁ డన లోహలవాచక మగు." ఆం భా. కృ. ౧౨.

నత్తు. దే. అ. క్రి. తడఁబడుచు మాటలాడు. శ ర.) వి. ముక్కుపోఁగు, నాసాలంకారవిశేషము. "ఉ. కెంపులఁ జేసె మోవి ముసుఁగెంపుచొకాటపునత్తు ముత్తెపుం, గుంపులఁ జెక్కుటద్దములఁ గూర్చిన కస్తురిప్రాతగంబురా, సొంపొనరించె...ఇంతికిన్ ..." ముకుంద. ౨, ఆ. ౧౯.

నదపతి. సం. వి. ఇ. పుం. సముద్రము.

నదము. సం. వి. అ. పుం. 1. పడమరగా పాఱెడి యేఱు. (సింధువు, శోణము, భిద్యము, బ్రహ్మపుత్రము, భైరవము, దామోదరము. మొ. నదములు. పడమరగా పాఱెడివానిలో నర్మదానది తప్ప తక్కినవి నదములు, తూర్పుగా పాఱెడివి నదులు.)

నది. సం. వి. ఇ. ఈ స్త్రీ. ఏఱు, అనుదకు మీఱి పాఱెడియేఱు.

నదిసుతుఁడు. సం. వి. అ. పుం. భీష్ముఁడు. "క. మద మున రణమొనరించిరి, నదిసుతగురుకర్ణశల్యనాగ పురీశుల్." భార. ఆది. ౧, ఆ. ౯౯.

నదీదోహదము. సం. వి. అ. పుం. ఏఱుదాఁటుటకై పడవవాని కిచ్చుకూలి, ఓడకేవు.

నదీమాతృకము. సం. విశే. (అ. అ. అ.) ఏటిసీళ్ల చేత పండెడుపైరు కలది.

నదీముఖము. సం. వి. అ. న. ఏఱుసముద్రముతో కలియుచోటు. [వరుణుఁడు.

నదీశుఁడు. సం. వి. అ. పుం 1. సముద్రుఁడు; 2.

నద్ధము. సం. వి. అ. న. ముడి, బంధము. విశే. (అ. అ. అ.) 1. కట్టఁబడినది, బద్ధము; 2. కూర్పఁబడినది; 3. పైకెక్కఁబడినది, ఉద్వృత్తము. (సిక్కినది అని కొందఱు.)

నద్ధి. సం. వి. ఇ. స్త్రీ. కట్టుట, బంధించుట.

నద్ధ్రీ. సం. వి. ఈ. స్త్రీ గుఱ్ఱమునకు కట్టెడువాఱు, టంగువాఱు.

నన. దే. వి. 1. పువ్వు, పుష్పము. "మ. వనితల్ నవ్వఁగఁ గౌఁగిలింపఁ గన నిశ్వాసింప గానం బొనర్ప నవల్ బలుకన్ ముఖాసవము గూర్పన్ దన్ను నంటన్ననల్, మొనపుల్ బొన్న ...మావియఁన్." రామా. ౧, ఆ. ౧౯౦. పారి. ౪, ఆ. ౧౬, 2. చిగురు, పల్లవము. (చూ. ననలెత్తు.), 3. మొగ్గ, కోరకము. "క. గురివెందఁ జైత్రుఁ డొందఁగఁ, గర మలుకన్ మావి యపుడు గఱచిన నునువాతెరమీఁదఁ గానఁగుఁబలు,వరుస యన న్ననలు కల్లవముపై మొనసెన్." పారి 3, ఆ ౪౮. అము. ౫, ఆ. ౧౧౩; 4. అంకురము, మొలక. (చూ. ననలెత్తు.)

ననంద సం వి. ఆ. స్త్రీ. మగనితోఁబుట్టిన స్త్రీ, ఆఁడుపడుచు.

ననఁబోఁడి. దే. వి. (నన+పోఁడి) పువ్వువలె మనోజ్ఞరాలగు స్త్రీ, స్త్రీ. "చ పురుషుఁడ జెంచి చూడ ననఁబోఁడివి గావు .." బ్రహ్మో. 3, ఆ. ౨౬౧. నీలా. ౧, ఆ. ౭౯.

ననఁబోణి = ననఁబోఁడి "సీ. నుడువుల ననఁబోణి జడియకు మని వెన్నెలఱచుప్రాణేశు రిచ్చపడి చూచె.' దశా. ౨, ఆ. ౫౫. [(శ. ర.)

ననకారు. ద్వ. వి. (నన+కారు.) వసంతకాలము.

ననతేనియ. దే. వి. (నన+తేనియ) పూఁదేనె, మకరందము. "సీ. నునుఁగావిజిగి మోవి ననతేనియల బావి..." నీలా. ౧, ఆ. ౫౬.

ననసీరు. ద్వ వి. ఓ. (నన+నీరు.) పూఁదేనె, మధువు. "సీ. ననసీట గుప్పలించెను గళావతి యొత్తు జిగి మోవి బీటిక లెరయకుండ." భాను. ౨, ఆ ౭౪.

ననయు. దే. అ. క్రి. 1. పూచు; 2. చిగిరించు.(శ.ర.)

ననలెత్తు. దే. అ: క్రి. (ననలు+ఎత్తు.) 1. మొలకలెత్తు. "గీ. పడినగించల ననలెత్తి పండె ధరణి." ఉ. రా. ౫, ఆ. 3౧౮; 2. చిగిరించు, పల్లవించు "సీ. గంధర్వకలకంఠకంఠులు స్థాణుపుల్ ' ననలెత్త మధురగానంబు సేయ." దశా. ౨, ఆ. ౨౮౮ కృ. శకుం. ౧, ఆ. ౭౧.

ననలొత్తు నే. అ. క్రి. (ననలు+ఒత్తు.) అంకురించు, పుట్టు. "చ...శోకుతుండు తృత్పిఱుతికి లేత

నవ్వు ముఖపద్మమునన్ ననలొత్త ..” హ. వరాహ. ౧, ఆ. 3. పు.

ననవిలుకాఁడు. దే. వి. (నన+విలు+కాఁడు.) పువ్వు ధన్వుఁడు, మన్మథుఁడు. “చ. ననముకాఁడ మన్మథ యఁబాణవధూవధపాతకంబు నిన్ గొని మునిఁగించె...” శైవ. ౨, ఆ. ౧3౫.

ననవిలుకానన్న. దే వి. బ్రహ్మ. వేంక. దేవ. ౬.

ననవిలుకానిపోరు. దే. వి. షో. ఆసా. మన్మథక్రీడ, సురతము “చ...ఇద్దఱు నేరకాంక్షలో, నన విలుకానిపోరునఁ బెనంగెడువేళ నిశేశ్వరుం డొగిన్.” హంస. 3, ఆ. ౧౦3.

ననవిల్తుఁడు. దే వి. (నన+విల్తుఁడు.) పువ్వుధన్వుఁడు మన్మథుఁడు. “సీ. ననవిల్తుశాస్త్రంపుమిచుకు లావర్తించుకుని వెన్నగోడఁ బెట్టినవి మాకు.” స్వా. ౨, ఆ. ౪3 భీమ. 3, ఆ ౨౭౧.

ననాంద. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుఁబడుచు.

ననుఁబ్రాయి. దే. వి. (నాను+ప్రాయి.) బాగుగా నుడు కనిచివ్వ్యము. (చూ. ననుఁ బ్రాయిచూపు.)

ననుఁబ్రాయిచూపు. దే. అ. క్రి. (ననుఁబ్రాయి+చూపు) సరిగా నుడుకకుండు, నడిమిపలుకగు. “సీ. పదుములు నులియక ననుఁబ్రాయిచూపక .. గీ...స్వాదుతర మైనచొక్కపుటోదనమ్ము.” సాంబో. ౫, ఆ. ౭౯౫.

ననుఁబ్రాయివడు. ద్వ. అ. క్రి. (ననుఁబ్రాయి+పడు.) ననుఁబ్రాయియగు. “క. బిరు సింత గాక నడిమికి, మురియక ననుఁబ్రాయివడి నిముడఁబాఱక యే, బెరికిరాఁగను లేక మిక్కిలి, గరగర నగుచేయఁ బాలకలమాన్నంబుల్.” జై. ౮, ఆ ౧౯౮.

ననుచు. దే. అ. క్రి. 1 భ్రమించు. “చ. తరుణుల కాఁగిటన్ ననుచుతమ్ము వృథా విరుతెత్తి చేసి మోహపరులుగఁ జైత్రుఁడు ..” ఆము. ౫, ఆ. ౧౨౬. శైవ. 3, ఆ. ౪౮, 2. చిగిరించు, చిగుర్చు “ఆ. పీచి ననిచి భ్రూచి కాచి పండిన ..” యు. ౧, ఆ. 3౭; 3. మొగ్గయెత్తు. “గీ ..కోరకితం బొప్పు ననిచిన దన.” ఆం. భా. ద్వి. 3౫, 4. వికసించు “చ. అనిన మహాప్రసాద మిపుడానతి యిచ్చితిరే కదా యిఁకం, గనఁబడఁ జెల్ప నేమిటికిఁ గార్యముఖంబున స్వామిచిత్తమేఁ, ననుచు నదేల కావలసినన్ దనుజున్ వధియింపఁజాలరే, ననుఁ గరుణావలోకనమునన్ ఘనుఁ జేయఁగఁ గాక వచ్చుటల్.” కువల ౨, ఆ. ౪౪. ఆం. భా. కృ. ౧౦౧; 5. అనురాగమొందు, ప్రీతినొందు. “క. ననిచినప్రియుఁడవు భర్తవు, ననుననుబంధుఁడవు నాకు ..” భా. రా. కిష్కిం. 3౪౦. భీమ. ౨, ఆ ౫౭; 6. అతిశయించు. “వ...ననిచిన కుతుకంబునం గరుటనటనపరిచయంబునం గాని పిక్కొక్కింపరా దని వితర్కించి ..” విప్ర. ౨, ఆ. ౮౫. అచ్చ బాల ౭3; 7. ఇంపగు (శ. ర.); 8. అంకురించు, జనించు. “చ. అనఘుఁడు యాజ్ఞవల్క్య గురునంఘ్రులకుం బ్రణమిల్లి నామదిన్, ననిచినభక్తితోఁ బలికినాఁడను...” వి పు. ౪, ఆ. ౮౭. పాండు. ౧, ఆ ౧౪౫.

నసుపు. దే. స. క్రి. (నచుచు ధా. ప్రే.) వికసింపఁ జేయు. “సీ. కళలీను సెలకూన కాదేని యాచాన నయనోత్పలంబుల నచుపు బెట్టు.” దశా ౨, ఆ. 3౦౬. వి. 1. అనురాగము. “క...ననుపునఁ జని రతనివేణుగానంబునకున్.” వి పు ౭, ఆ. ౨౭౮. దశ. ౬ ఆ. ౧౮౦; 2. ఇంపు, ఒప్పు. “ఉ. చామనిమేనులున్ ననుపుఁ జల్లెడుమోములలోనఁ గల్గుబల్గోములు మానపుంబోదవులుం బిడికింట నడంగు గొనులున్.” శుక. ౨, ఆ. 33౧. విశే. 1. అధికము. “గీ మనములో నిండియున్నది ననుపుఁగూర్మి, యింక లజ్జాభయమ్ముల కెడము గలదె” నైష. ౭ ఆ. ౧౯౧; 2. అనురాగము కలవాఁడు. “క. అని యొడఁబడుటయుం నమ్ముని, యనురాగము చెంగలింప నంబురుహానిభాననతోడి సురతసుఖముల, ననుపై పెక్కుడులు నటనంబులు చేసెన్” వి. పు. ౨, ఆ. ౨౨౦ ప్రబోధ. ౨, ఆ ౬౯.

ననుపుఁగత్తె. ద్వ. విశే. (ననుపు+కత్తె) 1. ప్రియురాలు. (శ. ర.); 2. విటురాలు. (శ. ర.)

ననుపుకాఁడు. దే. విశే. (ననుపు+కాఁడు.) వలపుకాఁడు, విటుఁడు. “సీ. ననుపుకాఁడైన వేల్పు కాగ నాగముఁ గూడి మహిమఁ గోల్పడియెనే మంద కర్ణి.” స్వా. ౨, ఆ ౭3. ఉ. రా. ౪, ఆ ౧3౬.

ననుపువడు. ద్వ. అ. క్రి. (ననుపు+పడు.) అనురక్తమగు “వ...మార్గాంతరంబుల వెదకుచుం బెక్కుదినంబులు ననుపువడియుండు చెదరు గలిగిన నొండొక్కనిం గూడుకొనునది స్వభావగుణంబు ..” కవిక. ౪, ఆ. ౧౨౦.

నసువు. దే. వి. 1. ఒప్పు, ఇంపు. "సీ. మొగలివాకిలిఁ దాటి దిగువ శాక్వరరాజనగరిపై వెన్నునినసువుఁ జూచి." భీమ. ౧, ఆ. ౧. నరస. ౨, ఆ. ౯౯; 2. అందము. "ద్వి నసువు మిటారుల సాలిచేష్టలకు, మనశాగ్గివలచు దుమారంబుసేయు." రం. రా. యు౧; 3. నర్మవచనము "చ ..పెచ్చెలుల్, నసువులు వల్కఁ గన్గొనల నవ్వ్యథరాగుత మమ్మఁ బ్రోవు తన్." వైజ. ౧, ఆ. ౨. చిత్రభా. ౨, ఆ ౬౫.

నన్న. దే. విణ. కుఱుచ. (శ. ర.)

నన్నడుము. దే. వి. ఔ. (నడుము+నడుము) సరియైనమధ్యభాగము. "గీ నడచురవి తేరు మింటి నన్నడుముచక్కి, బ్రగ్గనఁగఁ దాఁకె వింధ్యపర్వతముచరుల" కాశీ. ౧, ఆ. ౧౩౨.

నప్పు = నసువు. వి. (అనురాగము.) "చ. నయమున భీతి వాపి మది నప్పునఁ దేఁకువ వాపి .." శు. సా. ౯, ఆ. ౧౪౭. విణ (అనురక్తుఁడు.) "చ.. తమి దీటివశ నిమురవోయి నప్పుబోణాగు లత్తటిన్." కువల. ౨, ఆ. ౧౧౦.

నప్పుకాఁడు = నసువుకాఁడు. (విటుఁడు.) "సీ చని చూడఁగల్గినఁ జాలుఁ జేయుచు నప్పుకానిగాఁ బూనిలుకానిసైన." య. ౧, ఆ. ౧౩. జామ్నవీ. ౪, ఆ. ౩౪.

నప్ప్రాయి = నఱఁబ్రాయి. "సీ. రాగిలోహాండి నప్ప్రాయి లేకుండఁగ వండి దించినయివ్వర్వాంట కంబు." కాశీ. ౩, ఆ. ౧౨౧.

నపుంసకము సం వి అ. న. 1. నపుంసకలింగము; 2. నపుంసకలింగశబ్దము.

నపుంసకుఁడు. సం. వి అ. పు. న. పేడి, మందుఁడు.

నప్త. సం. వి. ఋ పుం 1. మనుమఁడు, కొడుకు కొడుకు కూఁతుకొడుకు; 2. ప్రపౌత్త్రుఁడు, మునిమనుమఁడు.

నప్త్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. కొడుకుకూఁతురు; కూఁతుకూఁతురు మనుమరాలు.

నఫా. హిం. వి. లాభము.

నఫీరి. దే వి. (హిం నఫీరీ.) ఒకవిధమైన ఊఁదెడి వాద్యము. (మి బ్రౌ.)

నఫిరిచేయు. దే. స క్రి. (నఫిరి+చేయు.) బాకాము. ఊఁది ప్రకటించు; చాటు. "క. మూనయంత నాశమాసనమానం గ్రొంకార మొక్కవాంఛ మొనర్చెన్, మానిను లటరా జలభుగ, సేనల కెంతిఁగింప నఫీరి సేసె నసంగన్." చంద్ర. ౪, ఆ. ౨౮.

నబాబు. దే. వి. (హిం. నవాబ్.) 1. మహమ్మదీయ ప్రభువు. "చ. అపుడు శ్రీగాకుళాఖ్యపురమందు వసించునబాబుగారు .." రంగా. ౧, ఆ. ౧౧౮; 2. ప్రభువు. "సీ. ఆర్కాడు మొదలైనయట్టి కర్ణాటకసుబకు నబాబుగాఁ బ్రబలుశక్తి. గీ... విజయానందరంగఘనునకే కాక యొరులకుఁ గలద ధరను." ఆనంద. పీఠి. ౧౦౮.

నభము. సం. వి. స్. పు. 1. వర్షాకాలము; 2. ముక్కు, ఘ్రాణము; 3. బిసతంతువు, తామరతూఁటిదారము; 4. తమ్మపడిగము; 5. నరసినతల, పలితశీర్షము స్. అ. పుం. శ్రావణమాసము. స్. అ. న. 1. ఆకాశము. "చ ..బంధురతరభంగి నల్గడలఁ దోఁచె నభోదితసాంధ్యతారకల్." సాఘందో. ౫, ఆ. ౧౩౪; 2. మేఘము. విణ. (అ. ఆ. అ.) 1. కాంతి లేనిది; 2. నక్షత్రములు లేనిది; 3. హింసకము, హింసించునది.

నభశ్చరము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. సూర్యాదిగ్రహము. విణ. (అ. ఆ. అ.) ఆకాశమున సంచరించునది.

నభశ్చరుఁడు. సం. వి. అ. పు. 1. వేల్పు, దేవత; 2. విద్యాధరుఁడు.

నభస్యము. సం వి. అ పు మేఘముల కనుకూలమైనది. భాద్రపదమాసము.

నభస్వంతుఁడు. సం. వి. త్. పు. గాలి, వాయువు.

నభోమణి. సం వి. ఇ. పు. సూర్యుఁడు.

నభ్రాట్టు. సం. వి. జ్. పు. కారుమబ్బు, నల్లని మేఘము విణ. (జ్) ప్రకాశించనిది.

నమత్. సం. (శత్రు.) 1. వంగుచున్న; 2. నమస్కరించుచున్న.

నమతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంగినది, నమ్రము; 2. వంకరైనది, కుటిలము; 3. పొట్టిది, హ్రస్వము.

నమతుఁడు. సం. వి. అ. పు. 1. నటుఁడు; . ప్రభువు; 3. సూర్యుఁడు.

నమనము. సం. వి. అ. న. 1. వంగుట, నమ్రమగుట; 2. నమస్కారము, మ్రొక్కు. విణ. (అ. ఆ. అ.) 1. వంగునది; 2. వంచునది; 3. మ్రొక్కునది; 4. మ్రొక్కించునది.

నమసీయుఁడు. సం. = నమస్యుఁడు.

నమయత్. సం. (శ.త్రు.) 1. వంగుచున్న; 2. నమస్కరింపఁజేయుచున్న.

నమయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంచుచున్నది; 2. నమస్కరింపఁజేయుచున్నది.

నమలఁబెట్టు. దే. స. క్రి. (నమలక్ + పెట్టు.) నమలించు. "సీ. భూపాలనందన ప్రత్తెంచి నీ కవి నాశమ్ము యుంచకార నమలఁబెట్టి." దశ. ౬, అ. ౧౨౫.

నమలి. దే. వి. (త. జమలి. క. నవల్.) మయూరము. "ద్వి. నాకాధినాథుఁడు నమలియై జముఁడు, కాకరూపం బైనఁ గడు భీతి నొంది." రం. రా. ఉ. ౩౦. పు. ౧౬. పు. ౩౯. పు. ౧౬. పం.

నమలు. దే. స. క్రి. 1. తిను, భక్షించు. "ఆ. బ్రదికి యున్న ఁ జేఁ దపంబున విద్యయు, బాధికొనఁగ నేర్తుఁ జాతకంబు, నట్టు లగుట జీవితాధార మైనయా, సంజ డివ్వ దెట్లు నమల కుడుగ." భార. శాం. ౩, అ. ౨౯౩. భార. అర. ౫, అ. ౩౩; 2. (తినఁదగుపదార్థమును) దంతములతో నలఁగునట్లు చేయు. "ఆ. నమలి మ్రింగఁ గేలఁ జమరి మొగంబునఁ, బూసికొనఁగ..." కు. సం. ౧౦, అ. ౧౬౨, ౪, అ. ౪౫౩; 3. ఆస్వాదించు. "క. విని చెవుల మట్టి గ్రోలం, గని కన్నుల నమలి నాలుకను మూర్కొని ముక్కున ..." కు. సం. ౬, అ. ౭౬, భా. రా. బాల. ౭౦.

నమసము. సం. వి. అ. పుం. 1 బెత్తము, వేత్రము; 2. నమస్కారము.

నమసితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అర్చితుఁడు, 2. నమస్కరింపఁబడినవాఁడు.

నమసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనుకూలుఁడు.

నమస్కరణము. సం. వి. అ. న. వందనము.

నమస్కరించు. సం. స. క్రి. వందనముచేయు, ఎఱఁగు. "గీ. విష్ణుఁ బ్రభవిష్ణు నచ్యుతు విగుణు సగుణు, హరిఁ జతుర్వ్యూహు నవ్యయు నభవుఁ బరము, గొలిచెద మచిత్తముల నావహించి హర్షమగ్నులగుచు నందంద నమస్కరించి." మార్క. ౧, అ. ౧౦౬. [నము.

నమస్కారము. సం. వి. అ. పుం. చేమోడ్పు, వంద

నమస్కారి. సం. వి. ఈ. స్త్రీ. ముడుఁగుఁదామరకీ. విణ. (స్. పీ. స్.) నమస్కరించువాఁడు.

నమస్కార్యము. సం. విణ. (అ. ఆ. అ.) నమస్కరింపఁదగినది. "వ... సౌరభేయాదులం బాకములా సను నిర్దేశించినట్టివై సురాసురప్రముఖనిఖిలజనంబులకు నమస్కార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు..." భార. అను. ౩, అ. ౫౨.

నమస్కార్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నమస్కరింపఁదగినవాఁడు. "క... అలోలురు బో, ధనులు నమస్కార్యు లద్రిధర విను నాకున్." భార. అను. ౨, అ. ౧౩౪.

నమస్కృతి. సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము.

నమస్కృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁబడినవాఁడు; 2. పూజింపఁబడినవాఁడు.

నమస్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. నమస్కారము; 2. పూజ.

నమస్యితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁబడినవాఁడు; 2. పూజింపఁబడినవాఁడు.

నమస్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ) 1. నమస్కరింపఁదగినవాఁడు; 2. పూజింపఁదగినవాఁడు; 3. నమస్కరించువాఁడు; 4. పూజించువాఁడు.

నమస్సు. సం. వి. స్. న. నమస్కారము. "గీ. నత మృడాదికసుమనస్సునకు నమస్సు." ఆము. ౬, అ. ౯౯.

నమాజు. హిం. వి. మహమ్మదీయులదైవప్రార్థనము. "సీ. పాశ్చాత్యులనమాజుపై బుద్ధిపుట్టినో మానుల జపముపై మనసు రోసి." సిం. నార. ౮.

నమించు. సం. స. క్రి. నమస్కరించు. "ఉ... వా, ల్మీకిఁ దలంతు వ్యాసుని నమింతు నుతింతును గాళిదాసునిన్." శశాం. ౧, అ. ౧౮.

నమిత సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. వంచువాఁడు; 2. నమస్కరింపఁజేయువాఁడు.

నమితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంగినది; 2. వంపఁబడినది; 3. నమస్కరింపఁబడినది.

నమిలి. దే. వి. మయూరము. "క. కలవాణి యొకతె చెవి కింపు లరింపుచు మేఘరంజి యని జలదశ్రీ, గలిగొలిపి పొదవీథుల, నలిఁ దా నాడించె ప్రోది నమిలికొదములన్." శ్రీరాధా. ౪, అ. ౧౨౨, భీమ. ౩, అ. ౨౮.

నముచిసూదనుఁడు. సం. వి. అ. పుం.-నముచి అను అసురను జంపినవాఁడు ఇంద్రుఁడు.

నమురు. దే. వి. ఆము, మదము. "వ... జలగ్రహంబు లొండొండ నంటుసంటుగ నొరసి... కలహంబు నకుఁ దిమురుచు నమురు గవిసి యున్నట్టున్నటి

తొలకులు ద్రిప్పిచేయుచటులవాలఘాతంబుల .." క్రీరం. ౧, ఆ. ౧౩౨.

నమూదు. హిం. విశే. కనుకూచుచబడినది. వ్యవ:— అపాలముతెక్కలతో నీపేర నమూ ౖ నదా?

నమూనా. హిం. వి. మాదిరి వ్యవ:— శుభలేఖకు నమూనా వ్రాసిపెట్టుము.

నమేరువు. సం. వి. ఉ. పుం. సురపొన్న చె. (దీనికి రోహదము స్త్రీహాసికము.)

నమోనారాయణ. నమూనా. (వా)

నమోవాకము. సం. వి అ. పుం. 1. నమో అని పలుకుట, వాగ్రూపనమస్కారము; 2. నమస్కారము, వందనము. "క. వాకిటికి వచ్చునతులకొ గైకొని వినయావలోకగతి నలరించున్, శ్రీకార్య పరులకు నమోవాకం బొనరించి వికచవదనాంబుజయై." ఘటికా. ౨, ఆ. ౨౨.

నమ్మకము. దే. వి. విశ్వాసము. వ్యవ — వాకు నీపై నమ్మకము లేదు.

నమ్మదుంప. దే. వి. గొట్టిగడ్డ, కశేరుకముచె. (శ. ర.)

నమ్మి. దే. వి. మయూరము, నెమలి. "లయగ్రాహి. నమ్ములంబొల్పులు ఘనమ్ము లని నై జవదనమ్ములను బొంగి నటనమ్ములఁ దగక్ యాసమ్ములకు లోఁగి పులినమ్ములను హంసమిథునమ్ము లలిమందగమ నమ్ము లను రా..." చంద్రా. 3, ఆ. ౯౬, కు. సం 3, ఆ. ౨౫౦.

నమ్మించు. దే. స. క్రి. (నమ్ము. ధా. ప్రే.) విశ్వసింపఁ జేయు. "శా...మచ్చికం గదిసి నమ్మించుం దనుం బట్టఁబోఁ, బాయంక్ బిట్టలయించు దొ దిగుచు నప్పాటక్ మృగం బీగలిన్." రామా. ౫, ఆ ౧౬౩, భార. ఆది. ౫, ఆ. ౫౬.

నమ్మిక. దే. వి. 1. విశ్వాసము. "గీ ప్రజకు నమ్మిక గా నిమ్ముఁ బట్టబద్ధుఁ, జేసెఁ గావి పసంటుడి శెల్లసీందు" దశ. ౮, ఆ. ౫౧, హరి. ఉ. ౪, ఆ. ౧౮౮; 2. నమ్మకము గలిగించువాక్యము; ప్రమాణము. "ఉ. నాకు మనంబు నిండ నొకనమ్మిక సేయుము..." శివరా. 3, ఆ. ౪౯, దశా. ౪, ఆ. ౧, ఆ. ౧౩౪.

నమ్మిగ. దే. వి. నమ్మకము, విశ్వాసము. "క. తగు మాట లాంవి చేయుంచగు నవి కై కొను నె యున్నఁడై వడ గొడుకున్, మగఁటిమి గలఁ దని యెదునమ్మిగఁ జూచుచుఁడు విషము ప్రింగెవ యునిన్." భార. ఉద్యో. ౧, ఆ. ३౧౫, హరి. పూ ౫, ఆ. ౨౨౨.

నమ్మినవాఁడు. దే. విశే. (నమ్మిన+వాఁడు.) 1. ఆశ్రితుఁడు. "సీ. నమ్మినవాఁ డన వచ్చినవాఁ డనఁ జనవరి యనఁగను దనరు వాప్పుఁడు..." అం. భా. ద్వి. ౧౮౪; 2. విశ్వసించినవాఁడు "ఉ...హరిం బలి సేయుటకున్ విన్, నమ్మినవారి కెప్పుడును వాశము లేదుగదమ్మ యూశ్వరీ" భాగ. ౧౦, స్కం. పూ. ౧౪౪౨, సీలా. ౧, ఆ. ౪.

నమ్ము. దే. స క్రి. 1. విశ్వసించు. "సీ ..ఇతని మాటలు నమ్మబెట్టు లనక." ఉ. రా. ౧, ఆ. ३౦౬, భార. ఆది ౪, ఆ. ३౦; 2. ఆశ్రయించు. "సీ. నమ్మితి మన్న కొంతటిదరిద్రుల నైన శ్రీలచే శేల్వొందఁ జేయుకయ్య." దశా. ౧, ఆ. ౪౧.

నమ్యమానము. సం. విశే. (అ. ఆ అ.) 1. వంగఁ బడుచున్నది; 2. నమస్కరింపఁబడుచున్నది; 3. పూజింపఁబడుచున్నది.

నమ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁదగినవాఁడు; 2. పూజింపఁదగినవాఁడు; 3. వంపఁదగినవాఁడు.

నమ్రము సం. విశే. (అ ఆ. అ.) 1. వంగినది,నతము; 2 అడఁకువ గలిగినది, విధేయము; 3. మ్రొక్కినది; 4. లోఁతైనది లోపలికి అణఁగినది.

నమ్రితము. సం. విశే. (అ. ఆ. అ) నమ్రముగాఁ జేయఁబడినది.

నయ. దే. వి. మనోజ్ఞత, అందము. "సీ నయ కల శ్రేష్ఠమట్టియలఁ బిల్లాం డ్లిడి పాయపట్టముఁ బెట్టె: జై నొకర్తు." ఆము. ౬, ఆ. ౧౨౮.

నయగారము. దే. వి. (నయము+గారము.) 1. మృదుత్వము. "క. ప్రియమై రమణీయమణీ, మయమై యతిచిత్రభిత్తిమంటప నయమైనయ మైనచిలుక పలుకుల,నయగారముగం జెలంగినయగారముగన్." సా. ౧, ఆ. ౧౩౫; 2. సొంపు, మనోజ్ఞత. "సీ. తెలిమాటనయగారముల కొన్ని కొనియాడె గొఱిగె నేల కప్పురపులపకంబు." చంద్రా. 3, ఆ. ౧౦౩; 3. విలాసము. "సీ. పలుకుఁదీయములకు కెలి గొడుసులు గానె నయగారములలోనివగపుకొనలు." రామా. ౨, ఆ. ౪౮. 3; 4. ప్రియవాక్యము. "ఆ. నక్కవినయ కులకు నయగారములఁ బల్కి,

నయన కల్లభవము కూడఁబెట్టు." వేమన. ౧, అ. ౪౮; పాండు. ౩, అ. ౪౩; 5. అలంకారము, వగ. "చ...అన్యపాలందిం, గలయఁ దలంచి చేసిన నయగారము గీల్కొనఁ జేసి చేర నిర్మల గుణశాలి రైనకుశమండలజాళి సమిరాశభూమి కిన్." శుక. ౧, అ. ౩౪౩. విశే. కపటమైనది. "ఉ. ఈనయగారపుఁబ్రియము లీవన లీవెంగ మిచ్చుమాట లేలా..." పారి. ౧, అ. ౧౨౫, శుక. ౨, అ ౧౮౭.

నయగారి. దే. విశే. (నయగారము+ఇ.) మార్దవము గలది; మనోహరము. "ద్వి. నయగారిమాటల నటనచూపులను బ్రియముల నయములఁ జెల్లించి పొంచి." అ. మ. క. ౩, అ. ౧౭౮. పు.

నయగారితనము. ద్వ. వి. (నయగారి+తనము.) మనోహరముగా మాటలాడుట. "నీ నయగారితనమున నాథుఁ డాశ్లేషింప లోఁగక యెదురొత్తి కౌఁగి లించు." చంద్రా. ౩, అ ౧౫౦.

నయత్. సం. (శత్రు). 1. కొనిపోవుచున్న; 2. నడపించుచున్న; 3. పొందించుచున్న.

నయనచ్ఛదము. సం. వి. అ పుం. కంటిరెప్ప.

నయనము. సం. వి. అ. న. 1. కొనిపోవుట; 2. యాపనము, జరపుట; 3. ప్రాపణము, పొందించుట; 4. కన్ను, నేత్రము.

నయని. సం. వి. ఈ స్త్రీ. కంటినల్లగ్రుడ్డు.

నయనించు. సం. అ. క్రి. (దృష్టిని.) నిలుపు. "ఆ. నాసికందు దృష్టి నయనించుయోగికి, వాసిగన్ను లేల వసుధలోన." వేమన. ౧౩౩౬.

నయనీయము. సం = నేతవ్యము.

నయనోపాంతము. సం. వి. అ. పుం. కడకన్ను, అపాంగము.

నయపీఠి. సం. వి. ఈ. స్త్రీ. జూదమాడుపలక.

నయమానము. సం. విశే. (అ. ఆ. అ) పొందించుచున్నది.

నయము. ఉభ. దే. వి. 1. అందము, మనోజ్ఞత. 'గీ. సొంపగు వలపును గొలుపునిత్యలఁపుఁజెలువు, నగవు మక్కిల శోభించునయము జెలువు." య ౧, అ. ౭౪, కవిరా. ౫, అ. ౧౩౩; 2. రీతి, విధము "గీ...శిబిరంగతి మాంధాతృనయమునను యు, యాతికరణి దిలీపునియట్లు..." పాండు. ౧, అ. ౪౨, ప్రభా. ౨, అ. ౩౪; 3. లాభము. "గీ. నయము పేదకు నరిఁ గోరునను కొనంగి, ప్రబలఁ జేసిన నర్థధర్మములు పెరుఁగు." ఆము. ౪, అ. ౨౩౬; 4. నేర్పు, కౌశలము. "క. కదనజిత నయమున మెయిమెయిఁ, గదియించి లతాంగి చిక్కఁ గౌఁగిటఁ జేర్పం, గదలనిచిత్తము గలిగియు, మదనేమియు లేక యతఁడు మ్రాసై యుండెన్." భార. అను. ౨, అ. ౧౪, పారి. శీతి. ౫; 5. అనృతి. "చ....ముగ్ధ యొక్కతె నిశాటునిచే నవకంపుఁదీఁగెఁ దాఁ, సినయిలగొమ్మగుత్తిగుని చేరి నయంబునఁ బట్టి కోయఁ జాఁచిన..." నిర్వ. ౮, అ. ౩౬, భార. భీష్మ. ౩, అ. ౧౭౦; 6. స్వస్థత. "గీ. నయ మొకిందుక రైనఁ గానంగ రాదు, చలువమందులవైశ్యంబు సంఘవిలక, నిమఁడు గుడిచిన నీరయ్యో నింటి చేసి, నంతకంతకు నంతాప మగ్గలించె." పి. శకుం. ౩, అ. ౪౪. విశే. 1. అందమైనది. "క. ప్రియమై రమణీయమణీ, మయమై యలిచిత్రభిత్తిమంటప నయమై, నయమైనచిలుకపలుకుల, నయగారమునం జెలంగి నయగారమునన్." సా. ౧, అ. ౧౩౬, కుచేల. ౧, అ ౨౩; 2. మృదువు, సుకుమారము. "చ... చెక్కులం, దొలఁగెడుఘర్మముల్ దనదుదుప్పటిచేఁ దుడిచెన్ నయంబుగన్." దశా. ౨, అ. ౩౧౬; 3. చౌక. (శ. ర.); 4. మేలైనది. "ద్వి. కల్మికోటీరమాట నయం బయి..." ని. పు. ౨, అ. (శ. ర.) ప్రబంధ. ౬౨; 5. సులువైనది. (శ. ర.) సం. వి. అ. పుం. 1. కొనిపోవుట, తోడ్కొనిపోవుట; 2. నడపుట; 3. పొందించుట; 4. నీతి; 5. ధర్మము, పాడి; 6. ద్యూతవిశేషము; 7. పాచిక. న. సాంత్వనము, అనునయము. విశే. (అ. ఆ అ.) 1. కొనిపోవునది; 2. నడపునది; 3. పొందించునది; 4. న్యాయమునుండి తొలఁగనిది.

నయించు. సం. స. క్రి. 1. నడుపు, ప్రవర్తిల్లఁజేయు. "చ...బుధ్వియాశ్, జనము లక్తమార్గము ప్రకటనకు నక్క నయించి వేదవాక్యవిహిత వృత్తిమై నభినవాభ్యుదయం బొనరించిరి .." భార. అశ్వ. ౪, అ. ౧౧౪. భార. శాం. ౧, అ. ౧౦౮; 2. ఉపాసించు, సేవించు. "వ...శర్మి శంకరుండు రుద్రుం దుమాపతి యనుపేక్కం జరఁగునద్దంతదేవుని నకులధర్మంబున నయించు భూపాలుం డైహికాముష్మికసిద్ధులం బొందు."

భార. శాం. ౩, ఆ. ౧౨౦; 3. పొందించు. "మ...అమలజ్ఞానత దానధర్మరతి సత్యశాంతి నిర్మత్సరత్వములన్ యజ్ఞతపోనయాయలఁ గడున్ దర్పించుధాత్రీసురో, త్తము కంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థప్రాణవాక్కర్మముల్, సమతన్ నిన్ను నయించెనేని నిజవంశ శ్రీకరుం డౌఁ దుదిన్." భాగ. ౭, ఆ. ౩౫౧; 4. చేయు, కావించు. "క. రథికులపైఁ దరు లావున, పథికులు కపు లెత్తఁ బున్నఫలములు రాలెన్, బ్రథమాధిదేవతకు నవి, ప్రథమసపర్యలు నయించెఁ బార్థివుఁ డనఁగన్." రామా. ౭, ఆ. ౨౮౨.

నర. దే. వి. 1. ముదిమిచే వెండ్రుకలు తెల్లనగుట, పలితము. "క. అలయక యేండ్లు గడుం బె, క్కులు జీవించుట నర గలుగుటయుం దగు వృద్ధులలక్షణమే జ్ఞానము, గలఁడేనిన్ బాలుఁ డయినఁ గడు వృద్ధు మహిన్." భార. అర. ౩, ఆ. ౨౪౮; 2. ముదిమిచేఁ దెల్లఁబాఱిన వెండ్రుక. "క...అవ్విభు, తల నొకనర యున్నఁ జూపి తరళాక్షి యనున్." మార్క. ౭, ఆ. ౧౩౮. విశ. ముదిమిచేఁ దెల్లఁబాఱినది. "ఉ. వేసలిపాట పాట నరవెండ్రుకతోఁ దిలకండుకాన్వయ, శ్రీ నటియింప...ఒకమంజులభాషిణి వచ్చె వీథికిన్." కాశీ. ౭, ఆ. ౧౫౯. కళా. ౩, ఆ. ౮౩.

నరంగము. సం. వి. అ. న. 1. మగగుఱి; 2. మొగము లేచు బొటిమ.

నరంజి = నరాజి ! "సీ. చెలిమితోఁ దామరచెలిపట్టి యనిచిన బలునరంజి యొక్కచెలంవ భూన." య. ౧, ఆ. ౮౮.

నరకఁడు. వై. విశ. (సం. నారంగః.) మోటువాఁడు, మొద్దు. "గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కడి రసజ్ఞుఁ, డింద్రనరకని కిటువంటితీంద్రవయసు, బోఁటుచూపులకొఱహింతకారిఁ దెచ్చి, యూలుగాఁ గూర్చె పాపాత్ముఁ డాయె నహహా." సురా. ౫౯, శుక. ౨, ఆ. ౩౪౬; 2. దుష్టుఁడు, క్రూరుఁడు. "క...నను, నిచ్చల్, నిరసింతువు రోగివి గన, నరకా నీవాకె తాఁకె నాకుం జూడన్." హంస. ౩, ఆ. ౨౩౪.

నరకము. సం. వి. అ. పుం. న. నిరయము, పాపఫలము లనుభవించులోకము. (నరకములు. 21. తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము, పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రతాపనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్త్రము, తాపనము.)

నరగ. దే. వి. (హిం. నగారా.) వాద్యవిశేషము, భేరి. (శ. ర.)

నరగజము. దే. వి. భేరి, వాద్యవిశేషము. "గీ. తుమమనంగను దమముకు నా గిడియ యనఁగ, నరగజంబునఁ దద్భేదనామము లగు." ఆం. భా. ప్ర. ౧౨౬.

నరద. దే. వి. బీఁట, పగులు. (వ్యవ.)

నరదము. సం. వి. అ. న వట్టివేరు.

నరనారాయణులు. సం. వి. అ. పు. ద్వి. ధర్ముని కుమారు లగునిద్దఱుఋషులు. (వీరిలో నరుఁ డర్జునుఁడుగాను నారాయణుఁడు కృష్ణుఁడు గాను నవతరించి రని పురాణప్రసిద్ధి.)

నరపు. దే. వి. పలితము, ముదిమిచే వెండ్రుకలు తెల్లనగుట. "ఆ. అవనిరాజ్యసుఖము లనుభవించుచుఁ బెద్ద, కాల మున్నఁ జెంపకడలఁ దుండి, కలయ నరపు వచ్చి గడ్డంబు మీసలు, గప్పెఁగోరుబాగు కానవచ్చె." కవి. ౪, ఆ. ౨౪, ఆం. భా. ద్వి. ౧౧౮. విశ. ముదిమిచేఁ దెల్లనైనది, నరసినది. (వృత్తియందు ఉత్వమున కత్వాదేశము.) "సీ. వింజామరము విచ్చి వ్రేలవైచినమాడ్కి నాలొందునరపుగడ్డంబుతోడ." పి. శకుం. ౨, ఆ. ౨౮, విక్ర. ౨, ఆ. ౧౧౬.

నరబలి. సం. వి. ఇ. పుం. దేవతలకు వేయు మనుష్యరూప పశుబలి.

నరభుజుఁడు. సం. వి. జ్. పుం. రాక్షసుఁడు.

నరము. ఉ. భ. వై. వి. (సం. నాలమ్. త. నరము. క. నర.) 1. నాడి. "క. ఇరువురును నందు చూడక, వెర వెడలినయాగ్రహముల వ్రేసిన గదలొం, డొరులమెదలకొలఁకుల బల్నరములు దాఁకుటయుం వా రిలం బడి రధిపా." భార. శల్య. ౧, ఆ. ౧౮౦. ఆం. భా. ద్వి. ౧౩౨; 2. తీగనాడి. "గీ...బీఱు, నరము నాఁగను దగుఁ దీగనాడి..." ఆం. భా. ద్వి. ౧౩౨. సం. వి అ. పుం. గుఱ్ఱము. న. 1. రామకర్పూర మనుతృణము; 2. నీరు, ఉదకము.

నరమేధము. సం. వి. అ. పుం మనుష్యుని యజ్ఞపశువుగాఁ జేసి జరుపుయాగ విశేషము.

నరయు. దే. అ. క్రి. ముదిమిచే వెంట్రుకలు తెల్లనగు. "చ. నరసినవెంట్రుకల్ జనపనారతెఱంగున విప్రమౌళికిన్." శేష. ౧, ఆ. (శ. ర.) హర. ౨, ఆ. ౪౮.

నరవ. దే. వి. కొండత్రోవ. "వ ..మురువులై సింగపు జంగిలి కిరవులై విరువు లగునరవలం గరువలి మేపుడు దొరఁకొడగలరంగులు తొంగలించి మీఁదికిం బచరించె నన మించుకలిరుప్రాఁకులంత .." యు. ౨, ఆ. ౪౦, ఆం. భా. ద్వి ౯.

నరవండు. దే. వి. ఓషధివిశేషము. "సీ. కుప్పి మూర్య క్రాంత ముష్టాదు నరవండు గాడిదగడపర కర్ణి కొమర" హం. వ. ౪, ఆ ౧౦

నరవాహనుఁడు. సం. వి. అ పుం. కుబేరుఁడు.

నరసింగము. మి. వి. మల్లవిద్యావిశేషము, ముప్పది రెండు విన్నాణములలో నొకటి. "సీ...నర సింగము సరిచిత్రరము కిల్లి ..గీ...నాఁగఁ జెన్న లరుచుండు, ముప్పదియుఁరెండు విన్నాణములకుఁ జేర్ప." ఆం. భా. ద్వి. ౨౦౯.

నరసింహుఁడు. సం. వి. అ. పుం. 1. నరసింహరూపుఁ డగువిష్ణువు; 2. నరులలో శ్రేష్ఠుఁడు.

నరాంగము. సం.=నరంగము.

నరాజి. వై. వి. (సం. నారాచః.) కత్తి, ఖడ్గము. "సీ...కరవలి నరాజి పిరంగి యడిదమన ఖడ్గ నామమై యలరుచు నుండును..." ఆం. భా. ద్వి. ౨౧౪, కృష్ణ. ౪, ఆ. ౪౨.

నరాధిపుఁడు. సం. వి. అ. పుం. రాజు. (ఇట్లే. నర దేవుఁడు. మొ.)

నరాశుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

నరి. ఉభ. దే. వి. మర్యాద, హద్దు "ద్వి. పెరిమెఁ బోనిమ్మని ప్రియము గావింప, నరి మీఱి పల్కెడు నన్యత్తుచందమున." ద్వి. పరమ. 3, ఆ. ౧౨౨, పు. 3, ఆ. ౧౫౬. పు. సం. వి. ఈ. స్త్రీ. నరుని భార్య.

నరిడి. దే, వి. పశువ్యాధివిశేషము; గుండెయుబ్బరము. "ఆ. నరిడి పుష్టి కప్పనాపురు కడుపూఁద యుదురు ద్రిక్క యనఁగ నదరి మఱియుఁ, బావుల తెన్నియుని..." హరి. పూ. ౬, ఆ. ౪౫.

నరియఁడు. దే. వి. సర్పవిశేషము. "సీ. నరియఁడు పెరు వాఁగ గరుడియుఁ బాలయు పెదకునుండియుఁ వచ్చి కుడిని నిలిచె." ఉ. రా ౬, ఆ. ౨౩౫.

నరియకొక్కు. దే. వి. సర్పవిశేషము. "గీ. కలవు తక్కినకెట్టిపోతులును దుంప, నాగులును గొంటి గాఁడులు నరియకొక్కులు..." ద్వా. ౮, ఆ. ౯౮.

నరియు. దే. అ. క్రి. 1. మ్లానమగు, వాడిపోవు. "క. సురకుంజరములకొమ్ములు, మురిసెన్ దొండములు విరిసె మోములు నరిసెన్, బోరిఁబోరి నఖలాంగంబులు, పెరిసెం జిత్తంబు లురిసె విరిసె జగంబుల్." లక్ష్మీ ౪, ఆ. ౪౮. (శ. ర. పా. 'విరిసెన్.' ముద్రి.); 2. నరయు. (శ. ర.)

నరుఁడు. సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. మగవాఁడు; 3. అర్జునుఁడు; 4. ఒకఋషి (నరనారాయణులలో మొదటివాఁడు.) బ. పదాతులు, కాల్బలము. "మ. కరులం గూల్చుచుఁ దేరులన్ నరకుచున్ గగ్గిల్లి ఘోటమ్ములన్ నరులన్ గొత్తుటఁ దేల్చుచున్ దొరల నానారూపఖండంబులై, తొరఁగం జేయుచు." భార. ద్రో. ౫, ఆ. ౩౦౩.

నరుదకన్ను. దే. వి. పశువులనేత్రరోగవిశేషము. "ద్వి. నరుదకన్నును నీరునాలుకచేర్పు, గురుసు దెవులు .." నవనాథ. ౧, ఆ. ౪౧. పు.

నరువు=నరవు (శ. ర.)

నరేంద్రుఁడు. సం. వి. అ. పుం. 1. నరశ్రేష్ఠుఁడు; 2. రాజు; 3. విషవైద్యుఁడు, పాములవాఁడు; 4. భూతవైద్యుఁడు, పిశాచములను బోఁగొట్టువాఁడు.

నర్కు=నఱకు. (ఖండించు.) (ఖండించు.) "ద్వి. వీఁగుదెంచినకాళ్ల నిల నర్కివైచి, కౌఁగిలింపఁగఁ గోరుకరములు దునిమి." పండితా. పురా. ౧౪౪. పు.

నర్తకము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; 2. మయూరము, నెమలి.

నర్తకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె; 2. ఆఁడేనుఁగు; 3. ఆఁడునెమలి; 4. గువ్వగుత్తికశీ.

నర్తకుఁడు. సం. వి. అ పుం. 1. నటుఁడు; 2. శివుఁడు; 3. రాజు; 4. కీర్తిసంచారకుఁ డగునటుఁడు, చారణుఁడు; 5. (రంగులువేయువానికి వేశ్యయందు పుట్టిన) సంకీర్ణజాతివాఁడు. విశే. (అ. ఆ. అ.) నాట్యమాఁడువాఁడు. [యూరము.

నర్తనప్రియము. సం. వి. అ. పుం. నెమలి, మ

నర్తనప్రియుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. విణ. (అ. ఆ. అ.) నాట్యమం దిష్టము కలవాఁడు.

నర్తనము. సం. వి. అ. న. నృత్యము.

నర్తకుఁడు. సం.=నర్తకుఁడు.

నర్తము. సం. వి. అ. పుం. నృత్యము, ఆట. విణ. (అ. ఆ. అ.) నర్తించునది, ఆడునది.

నర్తయిత. సం. వి. ఋ. పుం. నాట్యగురువు, నట్టువ యొజ్జ. విణ. (ఋ. త్రీ. ఋ) నర్తింపఁ జేయు వాఁడు, ఆడించువాఁడు.

నర్తించు. సం. అ. క్రి. 1. నర్తనముచేయు. (శ.ర.); 2. ఎగురు. "మ. కలువంకన్ మలయానిలాంచల ముచే నర్తించుభృఙ్గధూళితో...సుఖ కరంబుల్ కేలికాంతారముల్." వరాహ. ౪, ఆ ౧౧౬.

నర్తితము. సం. విణ (అ. ఆ. అ.) 1. నర్తించునది, ఆడునది, 2. నృత్యముచేయింపఁబడినది, ఆడింపఁ బడినది.

నర్తిలు. సం. అ. క్రి. నటించు, కదలియాడు. "ఉ. అందముల్ వెలుంగ మణిహారము లక్కున నర్తిలంగ మేల్పెంగరులారువిరేక నొసలన్ మస లంగ... సారసలోచన క్రీడసేయఁగన్." రుక్మి. ౧, ఆ. ౮౫.

నర్తిల్లు = నర్తిలు. "మ ..వతంసస్ఫురలిన్, నవలీలన్ వన మాల యుజ్జ్వలరుచిన్ నర్తిల్ల .." హరి. పూ. ౮, ఆ. ౧౧౨.

నర్తువు. సం. వి. ఊ. స్త్రీ. నటి.

నర్దనము. సం. వి. అ. న. 1. అర్పుట; 2. కూఁత. విణ. (అ. ఆ. అ.) 1. ధ్వనిచేయునది; 2. అఱచు నది, బొబ్బరించునది.

నర్దము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అర్చునది,బొబ్బ రించునది; 2. ధ్వనిచేయునది, మ్రోఁగునది.

నర్దితము. సం. వి. అ. న. 1. అర్పు బొబ్బ; 2. శబ్దము, మ్రోఁత. పుం పాచికల వేయుఁవిధము లలోఁ నొకటి. విణ. (అ. ఆ. అ.) మ్రోఁగినది

నర్మకము. సం. వి. అ పుం. 1. గడ్డము, చిబుకము; 2. చనుమొన, మాచుకము.

నర్మకుఁడు. సం. వి అ. పుం. 1. కేలమాడువాఁడు, పరిహాసకుఁడు; 2. కాముకుఁడు.

నర్మద. సం. వి ఆ. స్త్రీ. ఒకనది. (వింధ్యపర్వతమునఁ బుట్టి పడమట ఆరేబియా సముద్రములో పడు చున్నది.)

నర్మదుఁడు. సం. వి. అ. పుం. నర్మసఖుఁడు. విణ. (అ. ఆ. అ) 1. పరిహాసము చేయువాఁడు; 2. వినోదము నిచ్చువాఁడు.

నర్మము. సం. వి. న. న. 1. వినోదము, క్రీడ; 2. పరిహాసము, కేలము, స్త్రీపురుషులపరస్పర పరి హాసము.

నర్మర. సం. వి. ఆ. స్త్రీ. 1. గుహ, దరి; 2. కొలిమి తిత్తి, భస్త్ర; 3. ముట్టుడిఁగిన ఆఁడుది.

నర్మిలి. దే వి. అపేక్ష, అర్మిలి. "ఉ...నీయతఁ డెండ్లియాడఁగా, నాయమ నాకుమారునకు నర్మిలి హత్తఁగ నర్తవాలిచే, నాయువు గల్గి వాఁడవు నటంద్రు శుభం బగు దీన నెంతయున్." విజ. ౩, ఆ. ౧౨౬.

నర్యము. సం. విణ. (అ. ఆ. అ.) నరునకు హితమైనది.

నఱకించు. దే స. క్రి. (నఱకుధా. ప్రే.) నఱకఁ జేయు, ఖండింపఁ జేయు. "వ...శాత్రవభూపా లుండు యదువీరునగరంబు కలంచుట వికటంబుగా వలుదటంకంబుల నఱకించియు..." ఉ. హరి. ౩, ఆ. ౩౬.

నఱకు. దే. స. క్రి. 1. ఖండించు, తెగఁగొట్టు. "గీ. అలిప యాతఁ డొండుకోదండ మందికొన్న, నఱకె వేఱ విల్లెత్తిన విఱుగఁ జేసె."హరి. ౧, ఆ. ౧౬౫. వరాహ. ౯, ఆ. ౧౪; 2. చంపు, సంహరించు. "క. వెఱవారికల్లఁ దరమిడి, నఱకుదుఁ బాండు క్షితీశనందనులను రూపఱఁజేయం జేయాదదు ..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౫౦. భార. భీష్మ. ౨, ఆ. ౩౯; 3. పోఁగొట్టు, తొలఁగించు. "మ...దైత్యాంతకుం దుర్గతిన్, నఱకెం దత్తిమి రంబు..."ఉ. హరి. ౨, ఆ. ౪౯. వి. కత్తిదెబ్బ, క్షతము. (చూ. నఱకుపడు.)

నఱకుడు. దే. వి. నఱకు, కత్తిదెబ్బ. (చూ. నఱకుడు పడు.)

నఱకుడుపడు. ద్వ. అ. క్రి. (నఱకుడు+పడు.) ఖండిత మగు "ద్వి. పరవాళి మొదలంట నఱకుడువడిన, తరువున ట్లొరగినదశకంఠుఁ జూచి." రఘ. రా. ఉ. ౮౮. పు.

నఱకుపడు. (నఱకు+పడు.) 1. తొలఁగు, నశించు. "గీ. సాగరమునీరు చేరుట నైలకులము, తెలవ యిచ్చుట చీకటి నఱకుపడుట,..." ఉ. హరి. ౨, ఆ. ౫౬; 2. ఖండితమగు. "గీ. అరటి

కంబము రెట్టు సరి యనవచ్చు నీధవళాయతాక్షి యందంపుఁ దొడల" "గీ...ఫలకాలంబె నఱుకు వడుట, వరుస లగువార లొక్కెండు రెఱుఁగ లేక...." సురా. ౩౨, రామా. ౬, ఆ. ౧౦౧.

నఱుము. దే. విశే. కృత్రిమ మైనకపటము గల. "గీ. ఇంక నెన్నండు దయఁ బరమేశ్వరుండు, గన్ను దెఱచునొ యని దన కున్నరూపు, నెఱయఁ జెప్పిన విని చేలు చఱచికొనుచు, నఱుము పాఱుండు ప్రక్కలు విఱుగ నగుచు." శు. సం. ౪, ఆ. ౧౯.

నఱిమిఱి. దే. వి. వికాసము. "ద్వి. నంపనపనకరుల్ నఱిమిఱి విఱిచి, తంపంద బాధించి కపాలసాయములు." రం. రా. ఉ. ౩౦౦. పు.

నఱుకాడు. దే. స. క్రి. (నఱుకు+ఆడు.) (శత్రువులను.) సంహరించు. "సీ. రాజులమంచు బొఱ్ఱలు తిరిరినఁ గాద,యని మొనలో నఱుకాడవలయు." వేఱు. ౫౪.

నఱుకు = నఱుకు. దే. స. క్రి. ఖండించు. "క... ఓడితి పోపో, పిఱికి యని పలికి సుఱుముఁగ, నఱికెం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్." భార. ద్రో. ౧, ఆ. ౧౪౩. భాగ. ౬, స్కం. ౩౪౦. వి. 1. కత్తిదెబ్బ. "సీ. కొంగవాల్ నఱుకు లంగళులఁ బట్టుక జబ్బ లంటఁ గుట్టిన వెజ్జ నరయువారు." ఆము. ౬, ఆ. ౭౫; 2. శస్త్రవిద్యావిశేషము. "వ...లో వెలి గజ్జనముకు చూరణ నఱుకు మొదలగునఱుకులఁ దగులాగనుంగొని..." హంస. ౧, ఆ. ౨౦౬. అ. భా. ద్వి. ౨౦౫.

నఱుకుడు = నఱకుడు. (చూ. నఱుకుడుపడు.)

నఱుకుడుపడు. ద్వ. అ. క్రి. (నఱుకుడు+పడు.) ఖండితమగు "క. పదుకలలు తఱుచున బడుదు, వడుచేతులు...చుస్త్రిముఖవిధటులకుఁ గలిగెన్." ఉ. రా. ౪, ఆ. ౨౯౨.

నఱుకువియ్యము. దే. వి (నఱుకు+వియ్యము.) వనుఁ ద్రొయ్యనరిగా నుడుకని వియ్యము. (శ. ర.)

నఱుకులాడు. దే. స. క్రి. (నఱుకులు+ఆడు) ఒకరి నొకరు నఱుకుకొను. (శ. ర)

నఱుక్కు. దే. వి. గుండె యదరుట కనుకరణము. "క...మున్విరిగొని రొమ్ముపగతో, నప్పాఱుడు జూచి గుండియ నఱుక్కనఁగన్." చంద్రా. ౩, ఆ. ౨౫.

నఱుపో. దే వి. అల్పత్వము. "క. ఈల్లమున నఱుపోఁ జూపుని, కల్లడమున నడుగుపోయి కడఁబడ..." అచ్చ. అర. ౫౨. విశే. అల్పము. "క. నఱుపో మెయి పూని యాన, బ్బుఱపొలఁతుక లోనఁ దూఱి పరువడి వెలికిన్, బఱచి కటాలన దాని, బఱియులు గావించి యెలమి బరఁగం జనియెన్." అచ్చ. కిష్కిం. ౧౦౪.

నఱుమాడు. దే. స. క్రి. (నఱుము+ఆడు.) పొడిచేయు. "క. పెఱవార లధికభీతిన్, విఱిగి చనిరి భీష్ముఁ డేచి వీరరథికులం దఱుఁ జూచి రాచకొడుకుల, నఱుమాడెను భీముఁ డిట్టు నడుమకం దగునే." భార. భీష్మ. ౨, ఆ. ౨౩౪.

నఱుము. దే. స. క్రి. పీడించు. "కళిక మఱియుఁ బెఱుచు వెఱచు నఱిచుమధుని: గూల్చినట్టి హరికి, నఱిమి తఱిమి చఱిమి నుఱిమి శత్రుగెల్చినవిశకరికి." అప్ప. ౪, ఆ. ౩౨౪. వి. నలి, పొడి. "చ ..అస్త్రఘట్టనన్, నఱు మగురూపులుం బృథురణాంబున నగ్గలమయ్యె నయ్యెడన్." శు. సం. ౧౧, ఆ. ౧౩౦, భార. ద్రో. ౩, ఆ ౨౧౦.

నఱువు. దే. వి. పొడినలి. "వ ..కుత్తుము క్లయిన యత్తళంబులును నఱువు లైనమైమఱువులును నందఃఖ చెడినబిందంబులును..." శై. ౫, ఆ. ౨౦.

నఱ్ఱ. దే. వి. 1. పాలు పిదుకనీయనియావు, పెంకి యావు. "సీ. నఱ్ఱలనైనను నలువైన వెరవున ముట్టె యంటఁగఁ బట్టి కట్టి పిదుప. గీ ..నేర్తు..." భార. విరా. ౧, ఆ. ౧౦౧; 2. ప్రయాణము చేత బండి మొ. వానికి పూన్పఁదగినయెద్దు, పెంకి యెద్దు. "క. గుఱ్ఱములపరువు మెచ్చని, నఱ్ఱలఁ గట్టినరథముల నంద ప్రముఖుల్, గుఱ్ఱలయార్పులు సెలఁగఁగ, దొఱ్ఱులగమి పెటునంటఁ దోలిరి లేళ్లా." భాగ. ౧౦, స్కం. పూ. ౯౯౪, నవ నాథ. ౧, ఆ. ౩౦. పు.

నల. ఉ. థ దే. విశే. నల్లనిది. (చూ. నలమేనిదొర.) సం. వి. అ. పుం. ఒకానొక సంవత్సరము.

నలఁక. దే. వి. 1. నలఁకువ. (శ. ర.); 2. కేఱుపు. వ్యవః—నాకంటిలో నలక పడినది.

నలఁకన. దే. విశే. (నలఁగుధా.) అల్పము, సూక్ష్మము. "సీ. నలఁకనై తోఁచుకొన్నడుమించు సోగారు మాటున నొక్కింత మఱుఁగుపడఁగ." కావ్యా. ౩, ఆ. ౩౪.

నలఁకువ. దే. వి. (నలఁగుధా.) 1. అదన, ఇడుము. "వ. కావున నలంక నలఁకువలకు విలంకదె యగుట దాని విడువవలయు .." య. 3, ఆ. ౮౮. ద్వి. మారిచ్చ. భూ. 3౬౯. పం; 2. శ్రమ, ప్రయాస. "క. ఏచుఁగుపల్లము వాజికి, నేచుఁగు నకు మాయముపల్లమ మిడి పల్లింపం, బూని యది పొంకపడమికి, నానావిధవిహృతి నొకఁడు నలఁకువఁ బొందెన్." సాంబో. ౧, ఆ. ౧౨౧౩; 3. బాధ, పీడ. "వ ..పశుశిశుదాసదాసీజనంబులఁ దినవారింగా మెలఁగించి నలంకువలం దోలంగించుచు .." పాండు. 3, ఆ. ౨౪, చంద్రా. ౪, ఆ. ౭౮.

నలఁగించు. దే. స. క్రి. (నలఁగుధా. ప్రే.) పీడించు, బాధించు. "సీ. విమలసంధ్యారాగ సముదితనవ చంద్రు నలఁగించు రాహుమండల మనంగ." భాను 3, ఆ. ౬, రాఘవ. ౪, ఆ. ౨౧౯.

నలఁగు. దే. అ. క్రి. 1. నలియగు, ముక్కలగు. "ఉ. ఆవనజాక్షి కాఁకఁ బొరలాడ నలంగినసొమ్ముఁ జేరలున్, జెలిన మూడ్చి యూడ్చి .." ఆము ౭, ఆ. ౧౭౭; 2. పీడితమగు. "చ. పొదివి నభోవిహారమునఁ బువ్వనుబోలె నలంగకుండ న, మ్మనసమానుఁ బట్టికొని .." ఉ. హరి. ౭, ఆ. ౧౯౦; 3. ముడుతలుపడు. "సీ. బలుకట్ల దద్దు లేర్పడుభుజార్గలలతో నలఁగినచలువదువ్వలువ తోడ" ఉ. రా. ౭, ఆ ౨౦; 4. నశించు, చెడు. "సీ. ధూమంబు పొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు నలఁగి మాసినదీపకళికపగిది." భార. విరా. ౧, ఆ. ౨౯౪. ఉ. హరి ౨, ఆ ౨౮౧; 5. శ్రమపడు; బాధనొందు. "చ ..ఇపుమపొట్లకుఁ జొచ్చి నలంగి కంచు కొక్కుడు తమకంబుతోడఁ దల ద్రుచ్చి కవ్వుగిటఁ గూర్చె నంకటన్." ?. ౪, ఆ. ౯౯, వి. పు. ౧, ఆ. ౯౦౧.

నలఁగుడు. దే. వి. పీడ, బాధ. "వ ..గంతులిడు గచ్చి జెబ్బులులనలఁగుడుల..." స్వా. ౪, ఆ.3౬.

నలఁగుడుపడు. ద్వ్య. అ. క్రి. (నలఁగుడు+పడు.) బాధపడు, పీడనందు. "క. అయ్యిందుముఖులచేఁ బడి, రాయిడిఁబడి నలఁగుడుపడి రావణుఁడు పడెన్, గాయము నొచ్చినఁ దొలఁగును, పాయము మఱి లేక యొకటె పాటిఁ గఱచినన్." ఉ రా. ౭, ఆ. ౨౨౧.

నలఁగుడుపెట్టు. దే. స. క్రి. (నలఁగుడు+పెట్టు.) బాధించు. "చ. అలయక నిట్లు ద్రిమ్మరుచు నద్దశకంధరుఁ డూర్ధ్వలోకముల్, నలఁగుడుపెట్ట కొంచి ..." ఉ రా. ౭, ఆ ౨౮౬. (శ. ర. పా. 'నలఁకువఁబెట్టు.' ముద్రి. పా.)

నలఁచు. దే. స. క్రి. (నలఁగు ధా. ప్రే.) నలఁగఁజేయు. "ఆ. మందు నలఁచి కన్నులం దిడి ముక్కునఁ, బిడిచి చెవులఁ బోసి .." దశ. ౭, ఆ. ౯౯; 2. బాధించు. "మ. గెలిచెం బార్థ నరేంద్రులం బఱచె నాగ్నేయావనీనాథులన్, నలఁచెన్ దక్షిణరాజపంక్తి .." ఉ. హరి. ౭, ఆ. ౧౬; 3. చంపు, నశింపఁజేయు. "ఉ. పిడక వచ్చి నాయెదుర నూరక ప్రేలెదుపీని ముక్కు త్రిధా, బాడబకీలలన్ నలఁచి పాఱఁగవైచెద నంచు నుగ్రుఁడై." రాజ. చ. 3, ఆ. ౭౬; 4. కలియఁ గలుపు, మెదుపు. "గీ. అనుచుఁ దనపాదమున నున్నయట్టిమన్ను, నలఁచి యుండఁగఁ జేసి..." పరమ. ౧, ఆ. ౧౮౯.

నలఁత. దే. వి. (నలఁగుధా.) 1. పురాణించినరోగము. (బ్రౌ.); 2. అల్పరోగము. (వ్యవ) ఇంకను అతని నలఁత తగ్గలేదు. విణ. అల్పరోగము గలవాఁడు. (వ్యవ) వాఁ డింకను నలఁతగనే యున్నాఁడు.

నలఁపు. దే. స. క్రి. (నలఁగుధా. ప్రే.) 1. నలఁగఁజేయు, మృదితముచేయు. "గీ. అలిగి భూవైన నలఁపలే దలల దాను." కువల. ౭, ఆ. ౭౬౯. భార. అను. ౪, ఆ. ౮; 2. బాధించు. "ఉత్సాహము...ఘనాతిచండకాండవృష్టి న్నలంపవచ్చు జగదజేయుదండచుండుమా,యన్న బ్రాహ్మణవర విరచితాంజలి యగుభక్తితోన్." రాఘవ. ౨, ఆ. ౧౦౭, విప్ర. 3, ఆ ౭౬.

నలకీలము. సం. వి. అ. పుం. మోఁకాలు.

నలకూబరుఁడు. సం. వి. అ. పుం కుబేరునికొడుకు.

నలదము. సం. వి. అ. న. 1. వట్టివేరు, ఉశీరము; 2. పూఁదేనె, మకరందము.

నలము. సం. వి. అ. పుం. కిక్కిసకసవువు. "క. నల సారము సంసారము..." భార. ఆది. ౬, ఆ ౨౪౮. (తృణమువలె నిస్సారము అని భావము.) న. తామరపువ్వు, పద్మము.

**నలమేనిదొర.** దే. వి. కృష్ణుఁడు, విష్ణువు. "సీ. లీలమై కూలంబుఁ గేలఁ బూనినవాఁడు నలమేనిదొర ఘూఁవు గలుగువాఁడు." కృష్ణ. ౧, ఆ. ౨.

**నలవడు.** దే. అ. క్రి. (నలఁగు+పడు.) నలఁగు. "చ...విూరు వేగఁ జని యచ్చటికూరుల వారి తోడుతన్, నలవడఁ జెండి పీచము లణంచి సనుం బ్రముదాత్ముఁ జేయుఁడీ." హిర. ౪, ఆ. ౪౯.

**నలి.** ఉభ. దే. వి. 1. పొడి "ద్వి. నలి యైన మాంస ఖండములు మొండెములు, గలిగి లోకైకభీకర మయ్యె రణము." రం. రా. అర. ౧౬3. పు. ఆము. ౧, ఆ. 3౬; 2. ఎండుగడ్డి, శుష్క తృణము. "సీ...నలి యవ నలం సన నలరు శుష్క. గీ. తృణము." అం. భా. ద్వి. ౭౬, 3. చిఱుదిండి. "సీ ..నలితిండి యొప్పను నలి యనఁ దగు..." అం. భా. తృ. ౪౫; 4. ఒప్పు, అందము. అం. భా. తృ. ౪౫; 5. ప్రేమ, అనురాగము. "సీ. ..మాది మోహకల శీల దీపలఁ జెన్నొందుతోఁటలకడ నలితోఁడఁ జెంది. గీ... కేలినలిపెను నీదగులీల మఱువ, నావశంబె..." భార. శాం. 3. ఆ. 33౨; 6. ఉత్సాహము. "మ. విను సే దర్పుమఁ దన్యసైన్యముల సర్వాంగాల్పుచుక్ ప్రేతభూ, తనికాయంబులం మాంసభక్షణము రక్తముస్వైరపానంబుచేసి నలిం గ్రాలఁగఁ గ్రీడ సల్ప .." భార. ద్రో. 3, ఆ. ౧౫; 7. లాఘవము, నేర్పు. "క. ఉరగాంగన నలిఁ బట్టెను, గరుడుని క్రియ శక్తి పట్టి క్రమ్మఱ వైచెన్, నరసుతుఁడు శల్యసూతుని ..." భార. ద్రో. ౧, ఆ. ౧౭౬; 8. శక్తి, సమర్థత. "ద్వి. సాకేల రాముఁడు సాకేల సంధి, సాకేమిటికి కేఁడ నలి దూలి యొకని." రం రా. కిష్కిం. ౨౧౦, పు 9 బాధ. (చూ. నలిపెట్టు) విణ. సన్ననిది. "కవిరాజవిరాజితము. కరములఁ గంకణముల్ మొరయన్ నలికౌ నసియాడ ..." భాగ. ౧౦; స్కం. ఉ. ౪౯౯. క్రి. విణ ము. 1. అత్యంతము మిక్కిలి. "క. నరి సైద్రే దేయఁగ నన్నరుఁ దండఱ రెంటరెంట నలి నొప్పించెన్." భార. ద్రో. ౧, ఆ. ౨౪౧; 2. తగునట్లుగా, యుక్తముగా. "ఆ. సాదు ప్రశ్నము లకు నలి నుత్తరము లిచ్చి, వారిఁ గొనుము నీకు వలసినట్లు." భార. అర. ౭, ఆ. 3౯3; 3. నిశ్చలముగా. "ద్వి. సదులు వేగముమాని నలి నట్టె నిలిచెఁ, గదల వీవక నదాగతి దిష్టపడితో." సిం. భాగ. ౨, ఆ. ౨౯. సం. వి. ఈ. స్త్రీ. 1. గువ్వగుత్తికతీ; 2. మణిసిల [వా)

**నలికండ్లపాము.** దే. వి. నలికేఁచు, రక్తవృశ్చిక. (శ.ర.

**నలికము.** ఉభ. దే. వి. సన్నఁదనము, తనుత్వము. "ద్వి. పాదమై నయట్టిమూఁపులును జానువులు, గడచుచేతులు నలికము కలవడుము." నవనాథ. ౨, ఆ. ౧౦3, పు. విణ. సన్ననిది; అల్పము, చిన్నది. "క...ఎంతయుఁ బొన్నారుఁ గడు నలికమై సుమమారికి మధ్యంబు సింహమధ్యము వోలెన్." కు. సం. 3, ఆ. ౫౧. "ద్వి. నలి కంపుఁబూపలై నలి నొగరెక్కు, కాయలై .." నవనాథ. ౧, ఆ. ౧౧, పు. సం. వి. ఆ. మ. ధనుస్సు లోనగువానికవచము.

**నలికిరి.** దే. వి. నలికండ్లపాము. (శ. ర.)

**నలికేఁచు.** దే. వి. నలికండ్లపాము. (శ. ర)

**నలిగులి.** దే. విణ (నలి+గులి.) 1. మిక్కిలి నలఁగినది, అతిమృదితము. "సీ. తోరంపుగోరిజల త్రొక్కున నొదలెల్ల నలిగులియై సర్పబాధఁ డొదుగ." హరి. పూ. ౪, ఆ. ౧౬; 2. బ్రద్దలైనది, బీటలువాఱినది. "క...దిక్కులు, నలిగులిగా నతఁడు సింహనాదము చేసెన్." భార. భీష్మ. 3. ఆ. ౧౧౭; 3. క్షీణించినది, తగ్గినది. "క. కలియుగమున ధర్మంబును, నలిగులి యగు నని సుధీజనంబులవాక్యంబుల విందు..." హరి. ఉ. ౯, ఆ. 3౫.

**నలిగొట్టు.** దే. విణ. సన్నమగునది. "ద్వి. అడవికి నీ వేఁగునపుడు గన్నీరు, వెడలెడు నీవాలు పెద్ద కన్నులును, విన్ననై పెనవులు వితిచి దైన్యమున, నన్ను రక్షమని పిల్చునలిగొట్టుపలుకు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౭౬, పం.

**నలిగొను.** దే. అ. క్రి. (నలి+కొను.) ఉత్సాహపడు. "ద్వి. వలపటిదెస సుమావరథత్రరాజి, నలిగొన సింహాసనస్థులఁ జేసి." పండితా. వాద. ౧౭౬, పు.

**నలితిండి.** దే వి. చిఱుదిండి. (చూ. నలితిండికాఁడు.)

**నలితిండికాఁడు.** దే. విణ. (నలితిండి+కాఁడు.) "సీ ..పోమరి నలితిండికాఁడు, దుండుబలి యునంగఁ దోఁచుఁ దాల్మిలేనివానిపే రై..." అం. భా. తృ. ౬.

నలినము. సం. వి. అ. పుం. సారసపక్షి. న. 1. పద్మము, తామరపూవు; 2. నీరు

నలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతీఁగ, పద్మిని; 2. తామరకొలను; 3. తామరతంపర, పద్మసమూహము; 4. నది; 5. గొబ్బెరపి, 6. వృత్తభేదము. (ఛందస్సు)

నలిపెట్టు. దే. స. క్రి. (నలి+పెట్టు.) బాధించు "రగడ. బిటుపాటుల నీచే నలిఁ బెట్టుదు, బిట పాటుల నీచే నలిపెట్టుదు." శశాం. ౨, ఆ. ౧౧౮. దశ. ౪, ఆ. ౮౨.

నలిబలి. దే. విశే. క్షతము, గాయపడినది. "సీ. ఈ మోవి యంటకమీఁద నా మోము మునిపంటిమూకచే నలిబలి గాకయున్న." శుక. ౩, ఆ. ౫౪.

నలియు. దే. అ. క్రి. 1. నలఁగు, పొడియగు "ఉ. కొన్నిటఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటి వీపులు పిండుపీఁచుగా, నన్నిటి భీముఁ డద్భుత గదావలి చేసిక పేట లాడఁగన్." భార. భీష్మ. ౨. ఆ. ౨౧౧. హరి. ఉ. ౧, ఆ. ౧౦౧; 2. చిఱుఁగు, ముక్కలగు. "వ...ఎమ్ములు నలియఁ బొడిచియు..."ఉ. హరి. ౩, ఆ. ౧౭౦. శైవ. ౭, ఆ. ౧౩౦: 3. నలఁగు, మృదితమగు. "మ... శిరోజాతముల్, బలిమిం బట్టి వెసంబడం దిగిచి లీలన్ వక్షముల్ హస్తముల్, నలియం బెట్టుగఁ గుప్పిగంటులుగొని విన్నాణంబు గావించినన్." వి. పు. ౭, ఆ. ౪౧౪; 4. చచ్చు. (చూ. నలిసిపోవు.); 5. చిదుకు. "సీ. క్రతురక్షకులఁ దాఁకి ...బలిమి సదస్యుల నలియ మోఁది." కు. సం. ౨, ఆ ౬౫.

నలిరేఁగు. దే. అ. క్రి. (నలి+రేఁగు.) విజృంభించు. "క...కాంపిల్యనగరమున జను లెల్లన్, నలిరేఁగి యార్చి కౌరవ, బలసుభటులఁ బొడిచి రాజి బయలంపడంగన్." భార. ఆది. ౯, ఆ. ౭౨. ౭, ఆ. ౧౦౮.

నలిసిపోవు. దే. అ. క్రి. (నలియు+పోవు.) చచ్చు. "సీ. ఈఁగలు పడ మూఁగు నీడేర పెంటైన నల్లులు జనియించి నలిసిపోవు." నీతిసీ. ౫౮.

నలుఁగిడు, దే. అ. క్రి. (నలుఁగు+ఇడు.) ఉద్వర్తనము చేయఁ, తలంటుకొనునప్పుడు మాలిన్యపోవుటకై దేహమున పిండి మొ. రాచి నలుచు. "సీ. చాలి రొూర్తు పుంటకు నలుఁగిడె భసితావలి ప్రదేహము హైమవద్దీప్తి పెంపును." దశా. ౬, ఆ. ౨౭. స్వా. ౫, ఆ. ౫౬.

నలుంగు = నలఁగు. (కృశించు, తగ్గు.) "క. అని తలఁచి కదలి కలితయ, దినముల నమజపురి చేరు తెరువున దన్నేన్, దనువు మిగుల పేదయై నలిఁ, గినమానముకంథె మిగులఁ గృశమై యుండెన్." కేయూర. ౩, ఆ. ౩౧౧. వి. (తలంటుకొను నప్పుడు మాలిన్యపోవుటకై దేహమునకు రాచు పిండి. మొ.) "సీ. అలఁదు నలుంగు దేహమున వేణ్ణి ల్గార్చుఁ దడిదొయిత్తు మెత్తనిధవళవస్త్రమున..." కాశీ. ౪, ఆ. ౧౧; 2. ఉద్వర్తనము, తలంటుకొనునప్పుడు దేహమున మాలిన్య పోవుటకై పిండి రాచి నలుచుట, "మ. అలమున్నానెఁ దలంటు గందము నలుంగందంబు చన్నీటిచే, జలకంబున్ ..."దశా. ౫, ఆ. ౯౯. ఆం. భా. ద్వి. ౧౬౦.

నలుఁగుడు. దే. వి. (నలుఁగు ధా.) బాధ. (చూ. నలుఁగుడుపడు.)

నలుఁగుడుపడు. ద్వ. అ. క్రి. (నలుఁగుడు+పడు.) "క. నీమగని నంధుఁ జేసిన, నామాటల్ విను మతండు నలుఁగుడుపడ రాదోమగువ యతని కన్నము, ప్రేముంబునఁ గంచ మరసి పెట్టుము దిన మున్." శుక. ౩, ఆ. ౩౬౩.

నలుఁగుపెట్టు దే. స. క్రి. (నలుఁగు+పెట్టు.) నలుచు, ఉద్వర్తనము చేయు. "సీ. పసుపుతోఁ గూడఁ గప్రము చాల మేదించి నలుఁగుపెట్టెను కూర్మి మెలఁత యొూర్తు." య. ౪, ఆ. ౮౮. శైవ. ౮. ఆ. ౯౬

నలుకాలు. దే వి. (నాలుగు+కాలు.) నాల్గుకాళ్లు. "క ..ధర్మము పొదలి చరించుఁగాత మహి నలు కాలన్." హరి. పూ. ౪, ఆ. ౧౮౫. హరి. పూ. ౪, ఆ. ౧౩౫. ఇట్లే: నలుగాలు. కావ్యా. ౫, ఆ. ౩౦.

నలుకు. దే. వి. (నలియు. ధా.) ముక్క. "గీ... కలబందనలుకుల భక్షణమునఁ, బ్రాణములు నిల్పి కొనుచుఁ దపంబుచేసె." సీమం. ౧, ఆ. ౨౭.

నలుగంబాలాట. ద్వ. వి. బాలికా క్రీడా విశేషము. "మ...కనుమూసికంత నలుగంబాలాట లోనైన ఖేలనముల్..." కళా. ౬, ఆ. ౨౦౨.

నలుగడ. ద్వ. వి. (నాలుగు+కడలు.) నాలుగు దిక్కులు. "గీ. బలము లిదియేమి నలుగడఁ బొఱఁ

"జొప్పు." భార. ద్రో. ౫, ఆ. ౩౨౯. కు. సం. ౬, ఆ. ౧౪౩. ఇట్లే: నలుఁగడలు. శైవ. ౮, ఆ. ౧౨.

నలుఁగాలిది. దే. వి. (నలుఁగాలు+అది.) నాలుగుకాళ్లు గలజంతువు, చతుష్పాత్తు. "గీ. అనిన నలుఁగాలి వాఁ గోవును నరేడు,శబ్దముల మంత్రమును లోహ జాతిఁ గాంచ,నమును మనుజుల విప్రుండు సమధి కత్వ,భాజనము లంద్రు వేదప్రపంచవిదులు." భార. శాం. ౧, ఆ. ౭౧, ఆశ్వ. ౪, ఆ. ౧౯౧.

నలుఁగురు = నలువురు. (అందఱు.) వ్యవ:— ఆమాట నలుఁగురును చెప్పుకొనుచున్నారు.

నలుఁగేలు. దే. వి. (నాలుగు+కేలు.) నాలుగుచేతులు. "చ. సరసపుటల్కఁ దీర్చుకతఁ శార్ఙ్గుఁడర్మిన నందకాబ్జసం, భరణగుణాప్తి నన్నుదుముపైఁ గటిపై జడపై గళంబుపై,హరి నలుఁగేలుఁ బైకొన. ..." పారి. పీఠి. ౫.

నలుచు. దే. స. క్రి. (నలియు ధా. ప్రే.) మర్దించు, మృదితముచేయు. "గీ. కోతిఁ దెచ్చితి ననఁబోయి కొఱవిఁదెచ్చి, నాఁడ ననవుడు ముక్కులు నలుచుకొనిరి, కొలువువారెల్ల నపుడు ముక్కునను నగుచు." దశా. ౭, ఆ. ౨, ఆ. ౯౮.

నలుజాములు. ద్వి. వి. (నాలుగు+జాములు.) నాలుగు జాములు. "గీ. పొదుపులనుండి పడమటికడలి కరుగఁ, బవలు నలుజాములును బట్టుఁ దొవల నూఁడు, కత్తడుల కని..." సీరా. ౧. ఆ. ౩౪.

నలుతూము. దే. వి. (నాలుగు+తూము.) నాలుగు తూములు, ద్రోణము. (చూ. నల్తూము.)

నలుదిక్కు. ద్వి. వి. (నాలుగు+దిక్కు.) నాలుగు దిక్కులు. "క...శివుఁడు...న, ల్దిక్కుఁ దిరిగి నిలిచి యూపులించుచు నుండెన్." ఉ. హరి. ౬, ఆ. ౧౬౮. ఇట్లే: నలుదిక్కులు." శైవ. ౩, ఆ. ౮౮.

నలుదెసలు. ద్వి. వి. (నాలుగు+దెసలు.) నాల్గు దిక్కులు. "వ...తారు దిగ నిమ్ము లేక బిమ్మిటి గొని నలుదెసలుం జూడ .." ఆము. ౪, ఆ. ౩౫.

నలుపలము. ద్వి. వి. (నాలుగు+పలములు) "సీ. . నలుపలం బనఁ బలుపలము దనరు." ఆం. భా. ద్వి. ౨౬౮.

నలుపు. దే. స. క్రి. (నలియు ధా. ప్రే.) నలుఁగఁ జేయు, మర్దించు. "రగడ. నలిపిన్నై వకే నవకలి కావలి యలినీలాలక యది మాకావలి." రాజ. చ. ౨, ఆ. ౧౫౮. వి. 1. నీలవర్ణము. "సీ. పాలు పారునారుల నలుపులోఁదనుగూడ నలుపు చమ్మైన లందు నాఁటుకొనఁగ." విక్ర. ౧, ఆ. ౧౬౬. శైవ. ౫, ఆ. ౧౨౮; 2. కళంకము, దోషము. "గీ. ఇంతనాఁడు కరగ్రహవంతురాఁగఁ, జేసి తోడ్కొని వచ్చితి చెప్పినట్టు, చేయుచుంటిని గోత్రంబు మీయనుజ్ఞ, నలుపు నా కేయొదల శైనఁ దెలుపఁగలరె." నిరం. ౨, ఆ. ౫౫. విణ. నల్లనిది, కృష్ణము. "గీ. జోత్యకృష్ణ నాఁగఁ దమిస్ర . నా నుభయభార్య, లుదుపతిఁ నందు నొకతె దలోప్పెర్తు నలుపు,తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁబోలుఁ, దెలుపు నలుపును నగుమేను తెలఁత యితఁడు." శైవ. ౮, ఆ. ౧౮౪, హర. ౬, ఆ ౬.

నలుపుగింజెనదాల్పు. దే. వి. బలరాముఁడు. వేంక. దేవ. ౨౧.

నలుపెక్కు. దే. అ. క్రి. (నలుపు+ఎక్కు.) నల్ల వాఱు, నల్లనగు. "గీ. రోమరాజి తమాలవల్లీమ తల్లి,పగిది నలుపెక్కె మెఱసె నాభిదేశి నడుమ ..." వరాహ. ౩, ఆ. ౩. జాహ్నవీ. ౧, ఆ. ౮౭.

నలుఁబది. దే. స. (నాలుగు+పది.) నాలుగుపదులు. కృష్ణ. ౨, ఆ. ౭౩.

నలుమడి. దే. వి. నాలుగురెట్లు. (చూ. నలుమడించు )

నలుమడించు. దే. అ. క్రి. నాలుగురెట్లగు, చతుర్గుణ మగు. "ఆ. ప్రీతి నలుమడింప భీముఁ గపల నా, లింగనంబుచేసి..." భార. విరా. ౫, ఆ. ౩౪౧, కవిక. పీఠి. ౩౯. స. క్రి. నాలుగురెట్లు చేయు, చతుర్గుణితముచేయు. (చూ. నలుమ డించుకొను.)

నలుమడించుకొను. దే. స. క్రి. (నలుమడించు+కొను- స్వార్థమున) చతుర్గుణితముచేయు, నాల్గురెట్లు చేయు. "ఆ. అస్థి గలిగి హీన మగుజంతువై నఁ ద, ద్విగుణవృత్తి వలయుఁ బ్రగుణజంతు, పునకు నలుమడించుకొనునది.. నరమాత్ర, హింస యష్ట గుణకృతిమఁ బోయు." భార. అను. ౩, ఆ. ౨౯౭.

నలుమాఱు. దే. వి. (నాలుగు+మాఱు.) నాలుగు పర్యాయములు. "క. కలయుఁగ సంబుద్ధ్యంత,,

ముల నురుగుగ వలయుం నందముగ జయజేజో, జ్వాలతోవాదిపదంబులు, నలి నిడుచతురుత్తరంబు నలుమాత్రైనన్.” కావ్యా. ౪, ఆ. ౩౮.

నలుమోములపాదుసా. ద్వి. వి. బ్రహ్మ. వేంక.దేవ.౬.

నలువ. ద్వి. వి. (నాలుగు+వా) చతుర్ముఖుఁడు, బ్రహ్మ. “సీ. నలువ ముఖాబ్జమ్ములు కేళిగృహములు తఱచుటద్దంబు నక్కులుమనను. గీ. ఎపుడు నేసేవి కాదేవి...మూలకస్వాంతవీథి, నిండు కేడుక విహరించుచుండుఁగాత.” శైవ. ౧, ఆ. ౫, ౪౦. భా. ౧, ఆ. ౩౯.

నలువచోలి. ద్వి. వి. సారసుఁడు. దశా. ౪, ఆ. ౬౦. (ఇట్టే. నలువపట్టి. మె.)

నలువతమ్ముఁడు. ద్వి. వి. (నలువ+తమ్ముఁడు.) మన్మథుఁడు. “గీ. నలువతమ్ముఁడు ముక్కంటి గెలువ కొంచి.” ప్రబంధ. ౪, ఆ. ౮౩.

నలువతూపు. ద్వి వి. (నలువ+తూపు.) బ్రహ్మాస్త్రము. “సీ. నలువతూపు పరిహారిసి బలిమిమై నద్దోషకారి రక్కసుమేలిగానిమీఁద, నేసిన...” అచ్చ. యుద్ధ. ౨౬౭. [అర. ౨౬.

నలువచేడి. ద్వి. వి. (నలువ+చేడి.) హంస. అచ్చ.

నలువపాగా. ద్వి. వి. (నలువ+పాగా.) హంసల సమూహము. చం. రా ౩, ఆ. ౮.

నలువప్రోలు. ద్వి. వి. (నలువ+ప్రోలు.) సత్యలోకము “గీ. లలి నిరాహారులే యుండునలువప్రోలు, బలసి నిదదారు లుండుమెఱలువప్రోలు.” అచ్చ. బాల. ౩౧.

నలువబాబా. ద్వి. వి. (నలువ+బాబా.) హంస. “సీ. పాలసంద్రము లయ్యె నోలి నే ర్లవ్వియు నలువబాబా లయ్యెఁ ఖలుఁగు లెల్ల.” అచ్చ అయో. ౨౦, అచ్చ. కిష్కిం. ౬౯.

నలువరాణి. ద్వి. వి. (నలువ+రాణి.) సరస్వతి, వాణి. “గీ. నలువరాణి మదాత్మలో నెలయుఁ గాత.” స్వా. ౧, ఆ. ౫. రాజ. చ. ౩, ఆ. ౯౨.

నలువంక. దే. వి. (నాలుగు+వంక.) నాలుగుదిక్కులు. “మ....నలువంకన్ ములయాచలాంచలముచే నర్తించుధూళిలోఁ, గొలఁదుల్ మీఱు ఫలావళుల్ మెసవుచున్ గ్రమ్మావులం బల్కుచు, లక్కలలో...” వరాహ. ౪, ఆ. ౧౧౬.

నలువంద్రు. ద్వి. వి. బ. (నలువదికి మహన్మహాత్యర్థకరూపము.) నలువదిమంది. “క...కేలి దుర్గయాడు లైనదానవులు నలువంద్రు పుట్టిరి...” భార. ఆది. ౩, ఆ. ౬౩.

నలువందు. దే. అ. క్రి. (నలువు+అందు) ఒప్పు. “సీ. నాలుగువాకిళ్ల నలువంద వేడుకల్ నవరించు ముత్యాలచవికలైన.” రామా. ౬, ఆ. ౧౨౮.

నలువది ద్వి. స. ఓ. (నాలుగు+పది.) నాలుగు పదులు. “సీ. వెనుఁ జేర్చి నలువది వేలయుతోహిణుల్ నడచు వేగంబునఁ బడమి వడక...” ఉ. రా. ౪, ఆ. ౧౩౩.

నలువదఱువది. ద్వి. స. ఓ. (నలువది+అఱువది.) నూఱు. “సీ. నలువదఱువదిజన్నములు చేసిన ప్రోడ.” వేంక. దేవ. ౧౪.

నలువదుగురు. ద్వి. స. (నలువదికి మహన్మహాత్యర్థకరూపము:) నలువదిమంది. “సీ. భద్రమతి యను విప్రోత్తముఁ డొకండు. అతనికిభార్య లార్వురు నంపసు లిన్నూటనలువదుగురు.” దశా ౫, ఆ. ౧౦౬.

నలువమరు. దే. అ. క్రి. ఒప్పు. “సీ....గాయక సంగీతగాంధర్వగానముల్ ద్విజవరాశీర్వాదవేద ఘోష. గీ. నలువమరు వజ్రసింహాసనప్రదీప్త కారదానక్తుఁడై ..” ఉ. హరిశ్చ. ౬౦.

నలువారు. దే అ. క్రి. (నలువు+అరు.) ఒప్పు. “సీ. పరిణయించు డెన్నఁడో పరమనోమోదంబు నలువార రాజకన్యాలలాము.” చంద్రి. ౪, ఆ. ౩.

నలువు దే. వి. 1. అందము, సౌందర్యము. “సీ. ఎలదుమ్మెదలదిమ్ము వెలిఁ జిమ్ముచెలువమ్ము గలవేణి కొంత నలువు మీఱె” పారి. ౧, ఆ. ౫౬, హరి. పూ. ౮, ఆ ౮; 2. సామర్థ్యము, శక్తి. “వ...పలచుట్టునం జెట్టు దండగొని నిలువ నలువు గలపుళిందులఁ గొందఱ నిలిపి ..” స్వా. ౪, ఆ. ౩౭, రం. రా. ఉ. ౭౬. పు; 3. విధము, రీతి. “చ. నలువ మెంగంబు లెట్టు సృజనప్రథమావసరం దలిర్చు నన్నలువున సిద్ధసాధ్యనరనాగ సురుద్వరయోగిమండలీ, కలకలగుంఫితంబు లయి కాంచనచారువులైన నాల్గువా, కిలుల వెలుంగు చున్నతనికేతనరాజమునం బ్రసన్నుఁడై.” పాండు. ౨, ఆ. ౩౭. దశా. ౫, ఆ. ౧౧౫. విశే. 1. చక్కనిది, ఒప్పదమైనది. “సీ. నల్లులైనను నలువైన కెంపున మొట్టె యుంటఁగఁ బట్టి కట్టి విడుచు. గీ...నేర్తు...” భార. విరా. ౧, ఆ ౧౦౧; 2.

శ_క్తికలది, సమర్థము. "చ...నరపాల నిజాంబ పమిళ్ళి గ్రియుండనై, నలుపుగ నర్జునచ్ఛిద యొన ర్పంగ వచ్చితి నంచు రాముండున్" దశా. ౬, అ. ౧౧౯.

నలుపొందు. దే. అ. క్రి. (నలువు+ఒందు) ఒప్పు. "సీ. నలువదనంబుల నలువొందుశివు౦ డెందుఁ గలిగె నంచు విరించిఁ గఱిరి మునులు." దశా. ౧, అ. ౨౨, ఉ. రా. ౭, అ. ౧౪౩.

నలుసాల. ద్వ. వి. (నాలుగు+సాల.) నాలుగిండ్ల బవంతి, చతుశ్శాలము. "సీ. కనుతెప్ప లరవంచి కర్ణాంతములు దాఁట నలుసాల నృత్యంబు దొలుకఁ జూచి .." నిరం. ౧, అ. ౫౦, ఆం. భా. ద్వి. ౧౪.

నలుసు. దే. వి. (నలుఁగు.) 1. సూక్ష్మతృణము. "సీ...నలి యన నలు సన నలరు సూక్ష్మ. గీ. తృణము." ఆం. భా. ద్వి. ౭౬; 2. తృణము మున్నగువాని లేశము, రేణువు. "చ. సురలకు గుండె కల్లడము సూరులడెందములో నిక్కొల్లు ఖే,చరకలి కంటిలో నలుసు..." భా. రా. యు. ౨౪౧౯.

నల్గడ=నలుగడ. "మ ..వారిద, ప్రకటుల్ సాల్పడి నల్గడం జెదరఁగాఁ బాఱెన్ మనోవేగుఁడై, పక గేంద్రుండు .." భార. ఆది. ౨, అ. ౯౧. ఉ. హరి. ౩, అ. ౫౮.

నల్గడలు = నలుగడలు. ఉ. రా. ౨, అ. ౧౪౮.

నల్తుము. ద్వ. వి. (నాలుగు+తూము) నాలుగు తూములు. "సీ. చతురాఢకీసంజ్ఞ చను నల్తు మనంగ..." ఆం. భా. ద్వి. ౨౭౧.

నల్దెస=నలుదెస. హరి. ఉ. ౨, అ. ౧౨౮.

నల్పుదేఱు. దే. అ. క్రి. (నల్పు+తేఱు.) నల్లనగు. "ఉ. మిక్కిలి నల్పుదేఱుబలు మేనులు జాంజారు గడ్డముల్...వస్త్రాలు చూడ వింతయౌన్." ఇందు. ౨, అ. ౪౬.

నల్పది=నలుపది. "గీ. భటులు వెయ్యింటి కొన్న నిర్వదియుఁ నాల్గు, వేలుగా లక్షయర్వదివేల ప్రజలుఁ, జెల్లు నల్పదిలక్షలజేత మనఘ." కృష్ణ ౨, అ. ౭౩.

నల్మఱు. దే. విణ. (నాలుగు+మఱుఁగు.) నాలుగు రెట్లు గలది, చతుర్గుణము. "సీ. ముమ్మఱు పుష్క రంబునకు నల్మఱు వంపును నిది యనఁ దగుఁ బ్రకట మహిమ." పాండు. ౩, అ ౧౩౭.

నల్ల. యు. దే. వి. 1. నెత్తురు, రక్తము. "సీ. బలు పచ్చిపొలమునుండి సెలవులవిగజాఱు నల్లనాలుక సాఁచి నాకికొనుచు." ఉ రా. ౭, అ. ౧౨౦. అము. ౪, అ. ౧౯౩; 2. రక్తవిశేషము, గట్టి పడిన నెత్తురు. "సీ. రక్తవిశేషంబు రాజిల్లు నల్ల నా .." ఆం. భా. ద్వి ౧౩౭. వై. వి. (సం. నైల్యం. త నల్లం.) 1. నలుపు, నీలవర్ణము "గీ. అమ్మహాశ్వాఘు ధవళదేహంబునందు,నల్ల గలిగిన నీ విప్పు నాకు దాసి, వగుము మఱి యందు నల్ల లేదయ్యెనేని, నీకు నే దాసి నగుదుఁ బన్నిదము నాకును." భార. ఆది. ౨, అ. ౩౭, భార. అశ. ౧, అ. ౨౬౬; 2. కళంకము. "వ. కని కద్రువ వినతం జూచి చూడవె యల్ల యతిధవళం బైన యశ్వంబునందుఁ బూర్ణచంద్రునందు నల్లయుం బోలె వాలప్రదేశంబునందు నల్లయై యున్నది." భార. ఆ. ౨, అ. ౩౧; 3. తప్పు, దోషము. "గీ అహహ యలచంద్రుఁ డనువాఁ డహంక రించి, రోహిణీదేవి నొల్లక రోసి యుండుఁ, బాపిన తని క్షయవ్యాధిబాధితునిగఁ, గిఱిసి శపియించనే నల్లఁ గనిన నోర్వ." కాశీ. ౭, అ. ౫౧; 4. బొగ్గు. "సీ అళిసమూహంబు నల్లలు మందపవనుండు చర్మభస్త్రిక మావిచయము తలిరు, టాకు జొంపములు తీవ్రానలజ్వాలలు ." ప్రబంధ. ౪౪, ఆం. భా. ద్వి. ౨౪౨. విణ. నల్లనిది, కృష్ణము. (దీనికి వృత్తియందు వికల్పముగా నిగాగమము.) "సీ. ఉల్ల తెల్లనియురగోత్తము వాలంబు నల్ల సేసితిరేని నాకు దాసి, యగు మరి వినత..." భార. ఆది ౨, అ. ౩౪, భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౭౦.

నల్లఁబాఱు. ద్వ. అ. క్రి. (నల్ల+పాఱు.) నల్లనగు. "గీ ..లజ్జించె ననఁగ మొగాలు నల్ల,బాఱుగురువిందపూసలపేరు వైచు."వరాహ. ౨, అ ౧౧౫, ౩, అ. ౪.

నల్లకచోరము. ద్వ. వి.(నల్ల+కచోరము.) చోరముపే. (శ ర.)

నల్లకాచి. వై. వి. (నల్ల+కాచి.) ఒకరకము మొక్క. "సీ. కామశీలుగు మెట్టదామర కెట్టిసెనఁగ జంబరము కాఁచి నల్లకాఁచి."హంస. ౪, అ. ౧౦.

నల్లగగ్గెర. ద్వ వి. (నల్ల+గగ్గెర.) కంబరము పే. (శ. ర.)

నల్లగఱిక. ద్వి. (నల్ల+గఱిక.) నీలదూర్వ. (అభిధాన రత్నమాల.)

నల్లగల్వ. ద్వి. వి. (నల్ల+కల్వ.) నీలోత్పలము, ఇందీవరము. "చ. అవనిజచూపులన్ రవికులాగ్రణిపై జిగి నల్లగల్వలన్, కువలయనేత్రసఖ్యలు రఘుప్రభుచూపులఁ దెల్లగల్వ లెక్కువ యయి నిండె నీట మను గోపికపువ్వులకంటె రెట్టిగా." ఉ. రా. ౩, అ. ౯౧౦, ఆం. భా. ప్ర. ౧౩౫.

నల్లగింటెన. ద్వి. వి. (నల్ల+గింటెన.) నీలపుష్పి. "సీ. నల్లగింటెన పూలి తెల్లగింటెన యుత్తరేణు గుబ్బిరి సంబరేణు..." హంస. ౪, అ. ౧౦. (శ. ర. పా.)

నల్లగినియ. వై. వి. (నల్ల+గినియ.) గినియ. (శర)

నల్లగిసియ. వై. వి. (నల్ల+అగిసియు.) ఆకసి. (శ.ర.)

నల్లగురిగింజ. ద్వి. వి. (నల్ల+గురిగింజ.) కృష్ణగుంజ. (శ. ర.)

నల్లగూబ ద్వి. వి. (నల్ల+గూబ.) కృతమాలకము. (శ. ర.)

నల్లగెనుసు. ద్వి. వి. (నల్ల+గెనుసు.) కృష్ణాలువు. (శ. ర.) [(శ. ర.)

నల్లగోలిమిడి. ద్వి. వి. (నల్ల+గోలిమిడి.) నీలదూర్వ.

నల్లగోరఁట. వై. వి. (నల్ల+గోరఁట.) ఆర్తగళము. (శ. ర.)

నల్లగ్రుడ్డు. ద్వి వి. (నల్ల+గ్రుడ్డు.) కంటిగ్రుడ్డులోని భాగము, కనీనిక. (శ. ర.)

నల్లచీమ. ద్వి. వి (నల్ల+చీమ.) మర్కటపిపీలిక. (శ. ర.)

నల్లచెన్నఁగులు. ద్వి. వి. బ. (నల్ల+చెన్నఁగులు.) ధాన్యవిశేషము. "గీ. జిలితోఁగలరాజనమ్ములు నలవరులును, జెల్లనల్లచెన్నంగులు దీవసరులు నాది యగుపేరు గలవడ్లు .."హంస. ౪, అ. ౧౨౮.

నల్లచెఱకు. ద్వి. వి. (నల్ల+చెఱకు.) నిజమయినచెఱకు గాక దానివలె మధురరసము గలఒకరకము తెల్ల, అనిశుపు. (శ. ర.)

నల్లచేమ. ద్వి. వి. (నల్ల+చేమ.) ఒకజాతిచేమ, కృష్ణాలుకము. (శ. ర.)

నల్లచ్చికాఁడు. ద్వి. వి. (నల్ల+లచ్చనము+కాఁడు.) పక్షివిశేషము. "సీ... నల్లచ్చికాఁడును జల్లపిట్ట. గీ. యనఁగ నిట్టని పక్షిభేదాఖ్య లలరు." ఆం. భా. ద్వి. ౯౮.

నల్లచీలకఱ్ఱ. వై. వి. (నల్ల+చీలకఱ్ఱ.) ఒకరకముచీలకఱ్ఱ కుమలిక." ఆం. భా. ద్వి. ౨౪౯.

నల్లతీఁగె. వై. వి. (నల్ల+తీఁగె.) సర్పాక్షి. "గీ... సర్పాక్షి ప్రబలు నల్ల, తీఁగె నా..." ఆం. భా. ద్వి. ౫౯, హంస. ౪, అ. ౧౦.

నల్లతుమికి. ద్వి. వి. (నల్ల+తుమికి.) ఒకజాతితిందుకము, కాకతిందుకము. (శ. ర.)

నల్లతెగడ. వై. వి. (నల్ల+తెగడ.) ఓషధివిశేషము, కాలమేషిక. (శ. ర.)

నల్లతోఁగ. ద్వి. వి. (నల్ల+తోఁగ.) నీలోత్పలము, నల్లకలువ. "సీ. కస్తూరి వ్రాసినకరణి మీసల నల్ల తోఁగరేకుల జయించుమొగము మెఱయ." పి. శకుం. ౨, అ. ౮౦.

నల్లత్రాఁచు. ద్వి. వి. (నల్ల+త్రాఁచు.) కృష్ణసర్పము. "గీ. నల్లత్రాఁచులు మేనుల నెల్ల నిండఁ, దగిలికొని వానరులపోఁక మొగులుఁదీవ, లలమినను మేరు శృంగంబులట్ల యుండి, కేని సౌవర్ణ బాణంబు రాసుతుండు."రామా. ౮, అ. ౨౧౪.

నల్లదట్టిసబిల్ల. ద్వి. వి. చోరసాధనవిశేషము. ప్రబంధ. ౭౫౯.

నల్లదాసరిగాఁడు. ద్వి. వి. (నల్ల+దాసరి+కాఁడు.) తాఁబేలు. "సీ. తామే లనంగను దాఁబే లనఁగ నల్లదాసరిగాఁ డనఁ దగుఁ గమఠము." ఆం. భా. ప్ర. ౧౩౧, అము. ౫, అ. ౪౧.

నల్లదేవర. వై. వి. (నల్ల+దేవర.) కటివేల్పు. విష్ణువు. "సీ. నల్లదేవర మోచినాఁడు నాఁ డని కాని మలఁతుము గరుటాలమంతునైన." సాంబో. ౨, అ. ౧౭౯. నరస. ౫, అ. ౨౨.

నల్లద్రావరి. దే. వి. (నల్ల+త్రావరి.) రాక్షసుఁడు. "శా. ..వ్రేపల్లెలోఁ, గాలం గోడిసు నల్లద్రావరి నడంగం జేయుమే శ్వేత్రిటరీ." అచ్చ. భా. ౩, అ. ౧౧౧.

నల్లద్రావుడు. దే. వి. (నల్ల+త్రావుడు.) రాక్షసుఁడు. "గీ . పూతన యను పేర నదరుబెరసు, నల్లద్రావుడుఁబడఁతి మత్తిల్లి చేరి..." నీలా. ౧, అ. ౭౨, అచ్చ. అర. ౧౨.

నల్లన. వై. వి. (సం. నైల్యం.) కృష్ణవర్ణము. "సీ... నల్లన నల్పు కప్పు కం దనఁగను నొప్పుఁ గృష్ణ, వర్ణంబు..." ఆం. భా. ప్ర. ౧౦౮. విణ. నల్లనిది, కృష్ణము. "సీ. మేరుశృంగములపై మేఘ

ముల్ దిగుడీతి నాతిచూడకములు నల్ల నయ్యో." ఉ. రా. ౨, ఆ. ౧౩౪, దశా. ౨, ఆ. ౨౨౦.

నల్లనయ్య. వై. వి. (నల్లని+అయ్య.) కృష్ణుఁడు, విష్ణువు. "సీ. మాయచే నిన్నుఁ గ్రమ్మఱ నుండఁ జేసినో నలుకొందుమీయయ్య నల్లనయ్య." ఇందు. ४, ఆ. ४౯.

నల్లనాఁగు. వై. వి. (నల్ల+నాఁగు.) కృష్ణసర్పము, నల్లత్రాఁచు. "సీ.కన్నులు మిణుఁగురుల్ గ్రమ్మఁగా మ్రోఁగుచు బుస్సుకుచో వేఁడిపొగలు నిగుడఁ, బ్రల్లదంబునఁ ద్రొక్కి నల్లనాఁగులు నాఁగ పెంజెర లును బొట్టపెంజెరలును." ద్వా ౯, ఆ. ౧౦౦.

నల్లనైదువ. ద్వ. వి. (నల్లని+ఐదువ.) పార్వతి. చూ. (నల్లనైదువగేస్తు.)

నల్లనైదువగేస్తు. ద్వ. వి. (నల్లనైదువ+గేస్తు.) శివుఁడు. "సీ. నల్లనైదువగేస్తు నాపుత్తుకదంట కత్తికంటివలంతి మిత్తిగొంగ...గీ ..శంకరుని నామధేయముల్ వేంకటేశ." వేంక. దేవ. ౫.

నల్లపక్షి = నల్లప్రజ. (నల్ల+పక్షి.) 1. కిరాతకసంఘము; 2. కోకిలలసమూహము. "చ. కలరవ మూను నల్లపజ కప్పుక రా వెనువెంట రాజమంజలి నడ తేరఁ జైత్రబలసాధునిఁ గూడి..." చంద్రి. ४, ఆ. ౯౫. (ఉభయార్థములకు నదియే యుదాహరణము.) [శ. ౫౨.

నల్లపని. ద్వ. వి. (నల్ల+పని.) రతి, సంభోగము. రాజ.

నల్లపాము. ద్వ. వి. (నల్ల+పాము.) కృష్ణసర్పము. "సీ.... హరినీలసోపానసరణికాఁబోలును బగటు చున్నది నల్లపాఁపపేరు." ప్రభా. ౧. ఆ. ౬౩.

నల్లపూస. ద్వ. వి. (నల్ల+పూస.) నల్లనిగాజుపూస. (వివాహములో నాగవల్లిసమయమున వరుఁడు వధువుమెడలో సౌమంగల్యమునకై నల్లపూసల పేరు కట్టును.) "శా...దురా, చారాగ్రేసరుఁ డాధరాసురుఁడు కాంతున్ నల్లపూసాదిగా, నారామామణిసొమ్ము నాఁచికొని వేశ్యావాటి కేఁగెన్ నృపా." నిరం. ౨, ఆ ౧౦౬, రాజ. చ. ౨, ఆ. ౬౯.

నల్లపేటిపండు. ద్వ. వి. నల్లనిచర్మము గలతాటి పండు. "సీ. తాళీవనము మించుఁ దఱచు నున్న తమునై పెరిఁగి యందలి నల్లపేటిపండ్లు, కస్తూరి కాలిత్తకుచరాంగనాధుర స్తనకుంభసఖ్యంబుసలుపు నొప్పుడు." వరాహ. ౧౦, ఆ. ౧౨౯.

నల్లప్రజ. మి. వి. (నల్ల+ప్రజ.) కిరాతసంఘము. "ఉ. కొమ్ములు మ్రోయ మంటికములుల్ వెనుఁ బోరుకలంగఁ బార్శ్వభాగమ్ముల నల్ల నల్ల ప్రజ గ్రమ్ముకొనన్ వెస జాగిలంపుమొ, త్తమ్ములు ముంగల న్నడువ దర్పు మెలర్పఁగఁ జెంచుపాళిగాఁ, డమ్మనుజేంద్రుకొల్వునకు నచ్చెఱువందఁగ వచ్చెఁ జెచ్చెఱన్." శుక. ౧, ఆ. ౨४४. ఆము. ౬, ఆ. ౭౬.

నల్లబలుసు. ద్వ. వి. (నల్ల+బలుసు) వృక్షవిశేషము. "సీ. బండచింతయుఁ నల్లబలుసు సురభి చీకి రేను కూఁకుడు సిమ్మి ప్రేంకణమ్ము."హంస. ४, ఆ.౧౧.

నల్లబల్లెడ. ద్వ. వి. (నల్ల+బల్లెడ.) వృక్షవిశేషము. "రగడ. నల్లబల్లెడలతో నడగారడవిథంగి .." పి. శకుం. 3, ఆ. ౨౨౫.

నల్లమందు. ద్వ. వి. (నల్ల+మందు.) అభిని. "గీ నల్లమందును గంజాయిఁ గల్లుఁబోతుఁ, విచ్చుకల మెక్కి..." చంద్ర. వి. ౨, ఆ. ౬౪.

నల్లమముఁగు. ద్వ. వి. (నల్ల+మముఁగు) మిక్కిలి లోఁతు గలమడుఁగు. (శ. ర.)

నల్లముసురు. ద్వ. వి. (నల్ల+ముసురు.) మేఘములచే చీఁకటి కలుగునాఁటిముసురు. "ద్వి. మొగులు గార్గ్రమ్ముచు ముంచె నల్లదల ముంచి నల్లద నల్ల ముసురుగాఁ బట్టె."ద్వి. పరమ. ४, ఆ. ౨౯౦. పు.

నల్లమేఁకతప్పు. వై. వి. జారత్వము. "సీ. బలభేది గౌతముభార్య నహల్యఁ మించి చేయఁడె నల్ల మేఁకతప్పు." ప్రబోధ. ౧, ఆ. ౫౦. నల్లమేఁక= చింబోతు. దీనికి కాను మెక్కువ.)

నల్లలందియు. ద్వ. అ. క్రి. (నల్లలు+తీయు.) (బొగ్గులు. మొ.) దిగదుడుచు "ఉ...గ్రహంబు వెన్కఁ గనుపట్టఁగ నల్లలుదీసి యంతటన్."కువల. ४, ఆ. ౨౧౭.

నల్లపడు. వై. అ. క్రి. (నల్ల+పడు) నల్లనగు. "క.. చను మొనలు నల్లపడియెన్..." స్వా. 3, ఆ. ౧౧౯.

నల్లవలుపదాల్పు. ద్వ. వి. బలరాముఁడు. "సీ. నల్ల వలువదాల్పుఁ దెల్లనిబలుదీవిఁ గన్నులుచెవులుంగాఁ గలుగుతేని" రామ. ౨౧౩.

నల్లవేల్పు. ద్వ. వి. (నల్ల+వేల్పు) కృష్ణుఁడు, విష్ణువు. "చ. పొలుపుగ నల్లవేల్పుమమఁబొక్కటి తామర పువ్వుముద్దుగో, దలిచెలువంబుఁ జూచి పొగడక

ముఖరుంకజ మొక్క లెట్టు నా,కలనను నందు ..." చిత్ర భా. ౧, ఆ. ౪.

నల్లవా. దే. అవ్య. ఓహో. "ఉ. నల్లవా నిక్కమాడె నృపనందనుమూందట ద్రోణుఁ డొక్కఁడున్." భార. విరా. ౩, ఆ. ౯౯. (అట్లే: నల్లవో. భార. విరా. ౫, ఆ. ౧౩౬)

నల్లసేనము. ద్వ. వి. (నల్ల+సేనము.) ఒకజాతిదాన్యము. "గీ. నల్లసేనపుగుండులు నడచినట్లు, మంపుగొని మే యెఱుంగక మలసి మలసి, ..మన్నెఁ, బోతు లెడచొచ్చె..." ఉ. హరి. ౪, ఆ. ౨౬, ద్వి. పరమ. ౭, ఆ. ౫౧౪. పు.

నల్లి. దే. వి. (నల్ల+ఇ.) మత్కుణము. "గీ. వెలఁగి యాశ్రేను మశకంబు చీమ నల్లి, యల్ప మను బుద్ధి హింససేయంగఁ దగదు, వానివ్రాదయం బులం దున్న వాఁడు, జీవుఁ, డాతఁ డల్పుండె యితరజీవాత్మకంటె." కాశీ. ౬, ఆ. ౭౯, ఆం. భా. ద్వి. ౮౮.

నల్లింద. దే. వి. వృక్షవిశేషము. "వ ..మణియును వెదపిచ్చి పినపిచ్చి నల్లింద నుల్లింద యిప్ప కప్పుర మద్ది .. మొదలగు పెక్కు తెఱంగులమ్రాఁకులు. ..." పి. శకుం. ౨, ఆ. ౧౪.

నల్లిక. దే. వి. నటకండ్లపాము, రక్తపుచ్చిక. "సీ .. నల్లి పెంచన నలికిరి యన మిండ యుంచనఁ గను మీఱు రక్తపుచ్చి .." ఆం. భా. ద్వి. ౮౭.

నల్లిల్లు. దే. వి.— హోమధూమముచే పవిత్రమైన గృహములు గలది-అగ్రహారము. "ఆ. నంద నుండు వనమ్ము నల్లిల్లు విధి సుర,గృహము చెఱువు పేలుకృతి యనంగ జగతి వెలయు సప్తసంతాన ములు..." కేయూర. ౧, ఆ. ౮, భార. సభా ౨, ఆ. ౧౨౧. పి. శకుం. ౧, ఆ ౧౬.

నల్లె. దే. వి. చతురంగుళపరిమాణము. "క. నేలకు నల్లెడఁబొడవునఁ, గ్రాలుచు మును మెఱయుం గురునిరథచక్రము ల,క్కాలంబున సమరజయ, శ్రీలోకము తొలియ నంటసిలఁబడియె నృపా." భార. ద్రో. ౫, ఆ. ౩౧౭. శ్లో. ఉన్నపూర్వం రథః పృథ్వ్యాశ్చతురంగుళముచ్ఛ్రితః, బభూవైవంచలేనోక్తే తస్యవాహాః స్పృశన్మహీమ్. సం. భార. ద్రో. ౯౧, వ ౫౫. కవ ౫, ఆ. ౮౧.

నల్లెరు = నల్లేరు. (శ. ర.)

నల్లేరు. దే. వి. ఒకదినుసుతీఁగ, వజ్రవల్లి. "సీ. వజ్ర వల్ల్యాఖ్యయై పఱలు నల్లే రన..." ఆం. భా. ద్వి. ౭౦, హంస. ౪, ఆ. ౧౦. సా. నల్లేరుపై బండిసాగినట్లు (నిరాతంకముగా.)

నల్వ = నలువ. "ఉ. కేలంపువేఁడు నల్వయును నెన్నుఁడుఁ గొల్వఁగ మందుఁగొండరా, చూలిని గూడి వేడుకల బొక్కుడు లే కిలకాల్యఁ గొల్చె దన్." నీలా. ౧, ఆ. ౧, ప్రబోధ. ౧, ఆ. ౫.

నల్వగుర్రము. ద్వ. వి. (నల్వ+గుర్రము.) బ్రహ్మాండము. "చ. బగ లిరు లెల్లెడన్ గలియఁబర్వెనె సంద్రము లింకఁబాఱవే, రగులదె నల్వగుర్రముగమి రాముని కింఁకకీడు గల్గినన్." అచ్చ. అర. ౪౮.

నల్వజక్కి. ద్వ. వి. (నల్వ+జక్కి.) హంస. "సీ... నల్వజక్కులం తెలిపులు, గులు ..హంసముల పేరులు..." వేంక. తిర్వ. ౯౯.

నల్వము. సం. వి. అ. పుం. నాలుగువందలమూరల పరిమాణము.

నవ. ఉభ. దే. వి. దురద, కండూతి. "గీ. దూల జిల నవ గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి. ..." ఆం. భా. ద్వి. ౧౧౯. సం. వి. అ. స్త్రీ. ప్రత్తిచెట్టు. విశే. బ. (న్) తొమ్మిది. (తెలుఁగున సమాసపూర్వపదముగానే యుండును.) ఉదా:— నవరత్నములు. మొ.)

నవఁత. దే. వి. (నవయుధా.) 1. శ్రమ, కష్టము. "ద్వి. పట్టంబు సామీదిభక్తితో మాని, నార చీరలు జడల్ నవఁతమై దాల్చి, నారాక గోరు చున్నదమకుమహుండు," రం రా. అర. ౧౫౩. పు. ౨౩. పం. రం. రా. ఉ. ౧౩౩, పు. ౨౪, పం.; 2. ఉయరోగము. "సీ...ఉయము నవఁత నాఁగ విలసిల్లు .." ఆం. భా. ద్వి. ౧౨౭౩. నాశము. "ద్వి. తెపులును నవఁతయుఁ దీవ్ర వేద నయు, నవఁతయు లేనిప్రాణంబులు గాన .." రం. రా. కిష్కిం. ౨౩౧. పు.

నవకము. ఉభ. దే వి. మృదుత్వము. "గీ. నవకిరిమ సుమంబుల నవకమునకు, నన్నదమ్ములఁ బోని పీయడుగు దమ్ములు..." శైవ. ౪, ఆ. ౭, హరి. ఉ. ౪, ఆ. ౨౫౦; 2. అందము, ఒప్పు. "సీ. నన లంతరమునొంది నవకంబుతోఁ గూడఁ బలసి లేఁదావులకలిక లయ్యె" పి. శకుం. ౨, ఆ. ౧౨౬. విశే. 1. మృదులము, కోమలము,

"క. మల్లు తలిరాకువనవకళ్లు, బల్లవములతోడ ..." ఆము. ౪, ఆ. ౧౯౫. స్వా. 3, ఆ. ౭౯; 2. సుందరము. "సీ. ధవళకరచ్ఛాయ నవకంబు లై నవచ్ఛదరాలు విపులవక్షమున వైచి." వరాహ. ౩, ఆ. ౪౦. నిర్వ. ౮, ఆ. 3౨. సం. వి. అ. న. తొమ్మిది.

నవకమెక్కు. దే. అ. క్రి. (నవకము+ఎక్కు.) సుందరమగు. "సీ ఆళికులంబులకవ్వ గలయంత యయిన బిచ్చి నాటువోసినభంగి నవకమెక్కి." భార. విరా. ౨, ఆ. ౫౨.

నవకారిక. సం. వి అ. స్త్రీ. 1. క్రొత్తపెండ్లికూఁతురు, నవోఢ; 2. నూతన మగుకారిక; 3. నూతన మగు కృతము.

నవక్షారము. సం. వి. అ. పుం. నవాసారము. (శ. ర.)

నవగోళ. దే. వి. గొప్పగుడారము. "సీ...నవగోళ యనఁగను గొప్పగుడార మై యొప్పుచుండు." ఆం. భా. ద్వి. ౧౫౯.

నవగ్రహములు. సం. వి. అ. పుం. బ. సూర్య చంద్రాంగారక బుధ బృహస్పతి శుక్ర శని రాహు కేతువులనుతొమ్మిది గ్రహములు.

నవత్. సం. (శతృ) నూతనమగుచున్న. "చ...అన్న వదరవిందచక్రమిథునంబు లనవ్యానవకాంగళాగ్నిచే,రవులుకొనంగ..." శివరా. 3, ఆ. ౧౨౨.

నవతము. సం. వి. అ. పుం. 1. కంబళము; 2. ఏనుఁగుమైని బఱచుకంబళి. విశే. (అ. ఈ. అ.) తొంబది యగునది.

నవతి. సం. వి. ఇ. స్త్రీ. తొంబది. విశే. (ఇ) స్త్రీ. తొంబదియగునది. [౧. ఆ. ౪౦

నవద్వయము. సం. వి. అ. న. పదునెనిమిది. శైవ.

నవద్వారము. సం. వి. అ. న. దేహము. విశే. (అ. ఆ అ.) తొమ్మిదిద్వారములు కలది.

నవధాతువులు. సం వి. ఉ. పుం. బ. తొమ్మిదివిధము లగుధాతువులు. (బంగారు, వెండి, ఇత్తడి, సీసము, రాగి, తగరము ఇనుము, కంచు, కాంతలోహము.)

నవనము. సం. వి. అ. న. స్తోత్రముచేయుట.

నవనవమగు. దే. అ. క్రి. (నవనవ+అగు.) కోమల మగు. "క. నవనవమగు శాష్పేనులు .."చము. 3, ఆ. ౧౦౮.

నవనవలాడు. దే. అ. క్రి. (నవనవలు+ఆడు.) కోమలమగు, మృదువగు. "ద్వి. నాఁటికి నాఁటికి నవనవలాడు, తనువున కొంగొంతతన పుష్పిల్లు, వనిత కంతంత జవ్వన మంకురించె." పృ. వి. ౧, ఆ. ౮.

నవని. సం. ఈ. స్త్రీ. వెన్న, నవనీతము.

నవనీతకము. సం. వి. అ. న. 1. నెయ్యి; 2. వెన్న.

నవనీతము. సం. వి అ. న. వెన్న. విశే. (అ. ఆ. అ.) 1. క్రొత్తగాఁ దీయఁబడినది; 2. క్రొత్తగాఁ బొందింపఁబడినది.

నవనీయము. సం. విశే. (అ. ఆ. అ ) నుతింపఁదగినది

నవప్రసూత. సం. వి. అ. స్త్రీ. క్రొత్తగా ప్రసవించినస్త్రీ, పురుటాలు

నవప్రసూతి. సం. వి. ఇ. స్త్రీ = నవప్రసూత.

నవఫలిక. సం. వి అ. స్త్రీ. 1. క్రొత్తగా రజస్వల యైనపడుచు; 2. క్రొత్తగా పెండ్లి యైనబాలిక, నవోఢ.

నవమము. సం విశే (అ. ఈ. అ.) తొమ్మిదవది.

నవమల్లిక. సం. వి. అ. స్త్రీ. విరజాజితీఁగ.

నవమాలిక. సం. = నవమల్లిక.

నవమి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు తొమ్మిదవతిథి.

నవము. సం. వి. అ. పుం. 1. స్తోత్రము; 2. ఎఱ్ఱగలిజేరు, విశే. (అ. ఆ. అ.) 1. క్రొత్తది; 2. లేఁతది.

నవయించు. దే. స. క్రి. (నవయు ధా. ప్రే.) బాధపెట్టు. "చ. ఎలఁబోఁటివోని కేని నవయించియు ...కుదిఁ దపంబున నయ్యేడిదేమి సెప్పుమా." కు. సం. ౭, ఆ. ౪౧.

నవయు. దే. అ. క్రి. 1 (రోగాదులచే) కృశించు, చిక్కు, "క. నాగాయుతసత్త్వుఁడు, దిఙ్నాగాయతహస్తుఁ డనిలనందనుఁడు మహోద్వేగాత్ముఁ డగుచు దస్సిన, నాగము క్రియ నుండఁబుట్టు నవసి వనమునన్." భార. అర. ౫, ఆ. 330. "సీ. వెతలు నిట్టూర్పులవేఁడిమి నవసిన యధర పల్లవము కారాకుఁ బోల." భార. అర. ౭, ఆ. ౨౮. వరాహ. ౭. ఆ. ౫౨, 2. క్షీణించు, తగ్గు. "క. మందలము నవయ నరి కోది, గుండెవసింహ సనంబు లుర్విక్ విసమే." ఆము. ౪, ఆ. ౨౧౯; 3. కష్టపడు, శ్రమపడు. "సీ. వసుమతీ రాజ్యంబు వలనవిరసులై మునివృత్తి నత్యుగ్రవనములోన, నవ యుచుఁ బాండుభూనాథనందను లున్నవా రని విని .."భార. అర. ౧, ఆ. ౧౨౨; ౪, ఆ. ౧౯౫.

నవరత్నములు. సం. వి. అ. న. బ. 1. మౌక్తికము, మాణిక్యము, వైడూర్యము, గోమేధికము, వజ్రము, విద్రుమము, పుష్యరాగము, మరకతము, నీలము అను తొమ్మిదివిధములగు రత్నములు; 2. ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంకువు, బేతాళభట్టు, ఘటకర్పరుడు, కాళిదాసుడు, వరాహమిహిరుడు, వరరుచి అను విక్రమార్కుని యాస్థానపండితులు.

నవరసములు. సం. వి. అ. పుం. బ. శృంగార వీర కరుణా ద్భుత హాస్య భయానక బీభత్స రౌద్ర శాంతములు అను తొమ్మిదిరసములు.

నవరసు. దే. వి. ఒకవిధ మగుబంగారునాణెము, కాసు. విణ. శ్రేష్ఠము; శ్రేష్ఠురాలు. "క. కేళిక కెవ్వతె నవరసా, యాలేమం బిలువు మనిన యధికార్యర్థో, త్తాలబ్ధిబో నరసా, స్మేలఝుళంఝుళిత కింకిణీ నిక్వణయై." బహు. ౫, ఆ. ౭౨.

నవరాత్రములు. సం. వి. అ. న. బ. తొమ్మిదిరాత్రులు (1. వసంతనవరాత్రములు. చైత్రశుద్ధప్రతిపత్తు మొదలు తొమ్మిదిరాత్రులు; 2. గణపతినవరాత్రములు. భాద్రపదశుద్ధచతుర్థి మొదలు తొమ్మిదిరాత్రులు; 3. దేవీనవరాత్రములు ఆశ్వయుజశుద్ధ ప్రతిపత్తుమొదలు తొమ్మిదిరాత్రులు.)

నవరు. దే. వి. రాజగృహము. బ. నవళులు, నవళ్లు. "క. వివిధోత్సాతంబులకున్, నవళులలోఁ దోఁచు చేడునఁ బోడ్తో శాంతివిధానంబున నిరసన, మవును బురోహితునిచేత ననవద్యముగన్." భార. శాం. ౨, ఆ. ౩౦౮.

నవల. దే. వి. 1. ఆఁడుది. "క. అన్నవలముద్దు మోమును..." విక్ర. ౫, ఆ. ౪౩. (శ. ర. పా. 'అన్నాతి' ముద్రి. పా.); 2. (Novel) గద్య కథాకావ్యవిశేషము. (వా.)

నవలా. దే. వి. స్త్రీ. "క. పెండిచుం బహువిధవిహరణ, పాండిత్యము సెలపి సెలపి బదలిక నవలా, కిందు తలిరాకుఁ బానుపుఁ, దండంబున నిదురసలుపు తదవసరమునన్." రామా. ౨, ఆ. ౧౦౧ శకాం. ౧, ఆ. ౨౩.

నవశ్రాద్ధము. సం. వి. అ. న. మరణదినము మొదలు కొని బేసిదినములందు చేయఁదగిన శ్రాద్ధభేదము.

నవాతు. దే. వి. శర్కరాభేదము. "సీ. శర్కరాభేద పంజ్ఞలు నవాతు జామోజా పులకండ మనఁగను గోలుపు కాంచు." ఆం. భా. ద్వి. ౨౫౧. విజ. ౩, ఆ. ౫౬.

నవాబు = నబాబు. (చూ. నవాబుతనము.)

నవాబుతనము. ద్వ. వి. (నవాబు+తనము.) రాచ ఱికము; మహమ్మదీయ రాజత్వము. "వ...పుదు చ్చేరి నున్నరణాసాహేబునకు నవాబుతనం బిప్పించి..." ఆనంద. పీఠి. ౧౦౪.

నవారు. హిం. వి. పట్టెడ, పట్టెమంచమునకు నేయు పట్టెడ. "సీ. తగటిరుమ్మా తాపుతా నవారు కసీదు సిస్తులందరుచీటిలస్తరీలు." హంస. ౫, ఆ. ౩౫౦. ఆం. భా. ద్వి. ౧౭౪.

నవాసారము. వై. వి. (సం. నవక్షారః.) ఒకదినుసు ఉప్పు. (శ. ర.)

నవి. దే. వి. కరగోఁడపెట్టుటకు విడుపున త్రవ్వి యొత్తినమట్టిపల్లము. (శ. ర.)

నవిత. సం. విణ. (బు. త్రి. బు.) నుతించువాఁడు.

నవితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁదగినది.

నవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి క్రొత్తది నవతమము.

నవీనము. సం. విణ. (అ. ఆ. అ.) క్రొత్తది, అధునికము.

నవీయము. సం. విణ. (న్. యసీ. న్.) నవతరము, రెండింటిలో క్రొత్తది.

నవుకరి. హిం. వి. కొలువు, సేవ.

నవుకరు. హిం. వి. సేవకుఁడు, కొలువుకాఁడు.

నవురు. దే. విణ. నిమ్నము, పల్లము. "సీ...పల్లము నవురుఁ బల్లనఁగ నిమ్నంబు దనరు." ఆం. భా. ప్ర. ౧౫౮.

నవుడుకొట్టు. దే. అ. క్రి. మిణకరించు. "ద్వి. అని యిట్లు దేవేంద్రుఁ డాడినమాట, వినియును విననట్లు విస్మయం బంది,చ్యవనుఁ దూరకయుండె శార్యాతవుండు, నవుడుకొట్టెను నీట్లు నమరేఁ గర్వ్యుండు." ద్వి. మారిచ్చ. పూ. ౨౧౭. పం.

నవుబత్తు. దే. వి. చర్మవాద్యవిశేషము. "సీ...రాజా బహాదరు, మొదలైన బిరుదులు ముఖ్య మాతెల్ల జెండా నవుబత్తును ఢక్క యాదిగలిగినరాజ చిహ్న లొసంగఁబడె..." రంగా. ౧, ఆ. ౧౧౭.

నవురు. దే. విణ. మృదువు, మెత్తనిది. (శ. ర.)

నవోఢ. సం. వి. అ. స్త్రీ. క్రొత్తగా పెండ్లియైన బాలిక.

నవోద్ధృతము. సం. వి. అ. న. వెన్న. విణ. (అ. ఆ. అ.) క్రొత్తగా ఎత్తఁబడినది.

నవ్యము. సం. వి. అ. న. స్తుతి. ఎఱ్ఱగలిజేరుశీ. విణ (అ. ఆ. అ.) 1. నుతింపఁదగినది. 2. క్రొత్తది, ఆధునికము.

నవ్వారు. దే. అ. క్రి. (నవ్వు+అరు) నవ్వుతో ఒప్పు. "ఉ. ఠారెడు పైఁటలోఁ గులుకు జక్కవ గుబ్బలతో మిటారిన,వ్వారెడు మోముతో..." దశా. ౨, ఆ. ౩౫౦.

నవ్వించు. దే. స. క్రి. (నవ్వుధా. ప్రే.) నవ్వునట్లు చేయు. "గీ. విభుఁడు పరిహాసమాడి నవ్వించుఁ గాని..." హైమ. ౭, ఆ. ౧౭౩. స్వా. ౫. ఆ. ౯౪.

నవ్వు. దే. అ. క్రి. 1. హసించు, హాసముచేయు "చ...నిమురమూవి నవ్వ సురపొన్న ముఖాం బుజ మెత్తెఁ జంపకం,బు . పూచు..." పారి.౪, ఆ. ౧౦. రామా. ౨, ఆ. ౧౦౦; 2. సంతోషించు, ఆనందించు. "క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని నవ్వుచు రాముఁ డవల వింశతి భుజుఁడున్, ధనవిభుఁడును బోరినవిధ, మనఘా వినవలతుఁ దెల్పు మని యడుగుటయున్." ఉ. రా. ౨, ఆ. ౩౩౨; 3. అపహసించు, మేలమాడు. "గీ. బహువిధంబులఁ బగతురఁ బర వనమున, నిత్తెఱంగునఁ గలఁగుక్రం దెల్ల నోర్చి నిల్చి గెల్చిన నర్కిర్తి నొగడుఁగాక, దవ్వు దవ్వుల విట్టైన నవ్వ కెట్టు." భార. విరా. ౪, ఆ. ౭౨. భార. ఆశ్ర. ౧, ఆ. ౧౩౦. స. క్రి. 1. పోలు. "గీ. మవ్వఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక..." విజ. ౧, ఆ.౮౪. స్వా. ౬. ఆ. ౧౪; 2. పరిహసించు, మేలమాడు. "చ. వనిత యొకర్తు...హరిఁ జూచెఁ గేకిసలుగొట్టుచు బోటులు దాని నవ్వఁగన్." పారి. ౩, ఆ ౧౨. దశా. ౨, ఆ. ౪౧౮. వి. 1. హాసము, నగవు. "ఉ...శాకిని పల్కెడు శాస్త్రవాగ్విభం,వాది దురుక్తుల న్విసఁగఁ బండితమాళికి మోముఁ దామరం,బ్రోదిగ నవ్వఁ దేనియలు పుట్టును రూపక మంగళం గొనన్." కాళిందీ. ౧, ఆ. ౩౮. ఆము. ౨, ఆ. ౨౦; 2. పరిహాసము, మేలము. "క. అన్నరకము కాకిక మగు హైన్యము పనితలయొదను వెండ్లి నవ్వున పుట్టి వచ్చిన

సర్వధనముఁ జెడుచో, విను మని పాడంబుగాడు విమలచరిత్రా." భార. శాం. ౩, ఆ. ౪౩౮; 3. వింత, ఆశ్చర్యము. "క. ఒకటి గలదు వత్తురు వే,శోకగర్భంబునకు మృతులు సుక్కిన మా న, క్కకు నేటిబుద్ధి పీనుఁగు,నకు బ్రదుకఁదె గలుగు నిట్టినవ్వులు గలవే." భార. శాం. ౩, ఆ. ౩౭౬.

నవ్వఁబాటు. ద్వ. వి. (నవ్వు+పాటు) 1. అప హాస్యత. నింద. "గీ. సాకతంబున వచ్చిన నవ్వఁ బాటు, మాటువడఁ జేసి నీకూర్మి మగనిఁ దెత్తు." ఉ. హరి. ౫, ఆ. ౧౪౧. ఉ. హరి ౧, ఆ. ౧౮౭; 2. మేలము, పరిహసింపఁబడుట. "గీ. నాఁడు గోమంతనగమున నన్ను దాఁకి,గదిసి చూచినవాఁడవు గాక నీవు, నాఁటివాఁ డన నేమను నవ్వఁబాటు,గాదె యిట్లంట యీ వికర్కంబు వలదు" హరి. ఉ. ౨, ఆ. ౨౮.

నవ్వుకొను. దే. అ. క్రి. (నవ్వు+కొను.) నవ్వు. "చ...మాటమాట జగడంబులు చూచి యతండు పోయినన్, గలకల నవ్వుకొంద్రు తమకాళల మాతఁ దెఱుంగలేమికిన్."శుక. ౨, ఆ. ౩౩౭.

నవ్వుటాల. దే. వి. (నవ్వులాటపదమునకు వర్ణ వ్యత్యయముచేఁ గలిగినరూపము.) 1. పరిహాసము, మేలము. "ఉ. నావుడు నవ్వుటాల కనిసం బవనాత్మజ యింత యేటికిన్......సీ,చేవయు లావు నీవు మును చేసినభంగులు నే నెఱుంగనే." భార. ఉద్యో. ౩, ఆ. ౬౧. హైమ. ౨, ఆ. ౧౫౯; 2. లీల, అలవోక. "మ...రామస్వామి కానవ్వుటా, లటు లోకృత్మునఁ దక్కర ద్వయము వ్రయ్యంజేసె ....."అధ్యా. అర. ౬౮. పు.

నవ్వుపఱచు. ద్వ. స. క్రి. నవ్వఁబాటునొందఁ జేయు. "ఉ ..అయుక్తద,ర్పత్మున నిక్కు నవ్వు పఱుపన్ నమకట్టై నితండు విప్రవం,శమ్మునవారి నెల్ల..." భార. ఆది. ౭. ఆ. ౧౭౯.

నవ్వులఁబెట్టు. దే. స. క్రి. (నవ్వులన్+పెట్టు) పరిహసించు. "ఉ. ఇవ్విధ మెల్ల నొప్పులల కేర్పడఁ జెప్పిన దిట్టమాళనై, నవ్వులఁబెట్టి యందఱు వినం గడునామునఁ ద్రక్టరాంచు..." రసిక. ౪, ఆ. ౧౦.

నవ్వులబండి. దే. విణ. నవ్వెడుస్వభావము గలది. (శ. ర.)

నవ్వులాట. దే. వి. (నవ్వులు+ఆట.) పరిహాసము, కేలి. "ఉ. మోదముతో సుభద్ర చెలిముద్దుల గందకలంబునందు సా, మోదనికాశకర్దమము బొందుగ నించెను నవ్వులాటకై, పీడుకపోలభాగమున నిండి తొలంకెడు లేటమిన్నరా, కా దివుడే నొసంగు నికరాంతులు మేలె యటన్న కైవడిన్." కాళిందీ. ౫, ఆ. ౧౩౫, విప్ర. ౪, ఆ. ౭౧.

నవ్వులఁబడు. ద్వి. అ. క్రి. (నవ్వులు+పడు) పరిహాసమునొందు, నవ్వులపాలగు. "సీ. దీని దగ్గఱఁ జేల దీని కోడఁగ నేల పరులచే నవ్వులఁబడఁగ నేల." మొ. రా. బాల. ౭౫.

నశకము. సం. విణ. (అ. ఆ. అ.) నశించునది.

నశించు. సం. అ. క్రి. నాశమొందు. "దండకము. ...లోకముల్ లోకబీజంబులున్ నిత్యసంకోచుండై నీమహాదేహముం దుల్లసించు న్వశించు న్నశించున్..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౩౩. మార్క. ౧, ఆ. ౭౮.

నశిత. సం. విణ. (బు. త్రి. బు.) నశించువాఁడు.

నశియించు = నశించు. "వ...అనావృష్టిదోషంబున జగంబు నశియించు..." మార్క. ౨, ఆ. ౧౮౬.

నశ్యత్. సం. (శత్ర) నశించుచున్న.

నశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నశింపఁదగినది.

నశ్వరము. సం. విణ. (అ. ఈ. అ.) నశించుస్వభావము కలది, శాశ్వతము కానిది.

నష్ట. సం. వి. ఆ. స్త్రీ. సంప్రాప్తమైథున యగుస్త్రీ.

నష్టము. సం. వి. అ. న. 1. నాశము; 2. మఱుఁగుపడుట, అదర్శనము; 3. చెడుట. విణ. (అ ఆ. అ.) 1. నశించినది; 2. మఱుఁగుపడినది; 3. చెడినది.

నష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. నాశము; 2. అదర్శనము; 3. చెడుట; 4. నష్టము, లోటు. "ఉ. ఆయతి కాని కీడు కుమరాలయముఖ్యము లౌఁ దర్థకృష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం దొరల్పరా, జాయతనంబుఁ జేర్పు..." ఆము. ౪, ఆ. ౨౧౮, హైమ. ౭, ఆ. ౧౦౨.

నస. ఉభ. దే. వి. 1. దురద, కండూతి "సీ... తింత్రిమ్మ కసి తీఁట తీవరమ్ము. గీ. దూల జిల నవ నవ గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి..." ఆం. భా. ద్వి. ౧౨౮; 2. కామము "గీ. కూశలాశ్యంబు నస లేఁకఁ గొంచ్చినప్పు, దనుమలింపఁజ యత్రఁశ హై నబలు." శివరా. ౩, ఆ. ౬౯; 3. ఉపద్రవము. ఉదా:—ప్రొద్దున లేచిన మొదలు నస కాకుఁ బెద్దదిగా నున్నది. (శ. ర.) సం. వి. ఆ. స్త్రీ. ముక్కు, నాసిక.

నసకించు. దే. స. క్రి. మోహింపఁజేయు. "ద్వి. మునిమునినగవులం ముఱిపెంపుసదలం, నసకించు చేర్పులం జాగరకములం, కల్లమోహంబులం గపట కృత్యములం." ప్రభులిం. ౪, ఆ. ౧౪౩. పు.

నసకూఁటి. దే. విణ. (నసకూఁడు+ఇ.) కామోద్రేకముకలది; కామోద్రేకము గలవాఁడు. "సీ. పిన పెట్టి కవకత్తి యొనరేఁగునసకూఁటిపూఁబోండ్లు తమయింద్లపొంత కరుగ." హంస. ౧, ఆ. ౧౩౭.

నసకూఁటితనము. ద్వి. వి. (నసకూఁటి+తనము.) కామోద్రేకము "ఉ ..సా, భూరిమిటట్టి నిట్టి నసకూఁటితనంబున చేలుపెట్టి తా,రార గణింప నన్ను వినవా మఱి యుప్పరిలోనికక్కురిన్." విప్ర. ౪, ఆ. ౨౪.

నసకూఁడు. దే. వి. పొ. కామోద్రేకము. "ఉ... నసకూఁటుల్ చపలస్వభావలై, నారులు రూప యౌవనములన్ నిలుపోపక యువ్వలవ్వలన్, జారహితంబు సేయ .." సా. పంచ. ౩, ఆ. ౨౩౬.

నసగొంటు. దే. వి. (నస+గొంటు.) కామోద్రిక్తుఁడు; విటుఁడు. "గీ. పచ్చితం బింత యొఱుఁగ దమ్మచ్చెకంటి, కంటె విఖ్యాతినాతిఁ గైకొంటి వంచు, కచటిజాటలు నసగొంటు లతని వేఁడి, వేఁడిమీఁదను దోఁచిరి వెట్టి రేఁచి." బహు. ౫, ఆ. ౧౦౮.

నసగొట్టు. దే. వి. (నస+గొట్టు.) కామోద్రేకము గలవాఁడు, విటుఁడు. "క. నసగొట్టుబోటుదయ్యా, పినపెట్టికిఁ దగులఁబడి తపింపఁగ నేలా, బహుపెద్ద గదలకుండెదు, వసతిక రమ్మచటి కేను వచ్చెదఁ బొమ్మా." శుక. ౨, ఆ. ౪౭౮.

నసనస. దే. వి కడిమినచర్మము మొ. వానిధ్వని కనుకరణము. "క. విరమును మెరవుచు విరుపక, నస నస యనుకకవనంబునం దాలంచున, మ్మునుపు రుద్రులోడుత, నసియింపఁగ నీమె కత్తిప్రాకా జోటీ." పార్వ. ౪, ఆ. ౯౬.

నసమిరి. దే. వి. 1. దురద, కండూతి. (శ. ర.); 2. [illegible]. "సీ. [illegible]

శంఖసఖంబు పులుగాసి నసిమిరి బంగపురువు." వాంసు. ౪, ఆ. ౧౮౬.

నసుకు. దే. వి. అసత్యము. "ఆ. జల్లి బుకాద బొంకు బొల్లు దబ్బఱ కల్ల . కసుకు నసుకు... నా నసత్య మధిప." ఆం. భా. ప్ర. ౧౧౯, విణ. అసత్య మైనది, సత్యము కానిది. (శ. ర.)

నసుగు. దే. వి. అ. క్రి. స. క్రి. అస్పష్టముగాఁ జెప్పు. (వా.) వి. అస్పష్టముగాఁ జెప్పుమాట (వా.) [(వా.)

నసుగు. దే. వి. (నసుగు ధా) అస్పష్టముగాఁ జెప్పుట

నస్త. సం. వి. ఆ. స్త్రీ. 1. వృషభాదులకు కుట్టిన ముక్కురంధ్రము; 2. ఆభరణాదు లుంచుటకు కుట్టిననాసికారంధ్రము.

నస్తము. సం. వి. అ. న. ముక్కుపొడి, నస్యము. పుం. ముక్కు, నాసము.

నస్తితము. సం. వి. అ. పుం. ముకుద్రాడు పోయుటకై ముక్కు కుట్టినయెద్దు.

నస్తోతము. సం. వి. అ పుం. ముకుద్రాడుపోసినయెద్దు.

నస్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ముక్కు; 2. పశ్వాదుల ముకుద్రాడు.

నస్యము. సం. వి. అ. న. 1. ముక్కునందలివెంట్రుక; 2. ముక్కుపొడి. విణ. (అ. ఆ. అ.) 1. నాసికకు హితమైనది; 2. నాసికయందుఁ బుట్టినది; 3. నాసికయం దున్నది.

నస్యోతము. సం. = నస్తోతము.

నహి. సం. అవ్య. (అభావమును దెలుపును) లేదు; (లేఁడు, లేవు, లేరు) "చ. నిలుకడ నున్న వావి నహి నేస్తము నాస్తి .." కళా. ౪, ఆ. ౧౭, సా. ౨, ఆ. ౮.

నహుషుఁడు. సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. చంద్రవంశపురాజులలో నొకఁడు, యయాతి తండ్రి. (ఇతఁడు స్వర్గరాజ్యమును పాలించి అగస్త్యమహామునికోపమున సర్పజన్మ మెత్తి యుధిష్ఠిరునివలన శాపవిముక్తి నొందినవాఁడు)

## నా

నా. దే. స. అస్మదర్థకము. (దీనికి ప్రథమాదివిభక్త్యేక వచనములు 'నేను, నేన్, నన్ను, నను, నన్, నాచేత,' మొదలగురూపములును, బహువచనములు 'మేము, మేము, మిము, మమ్ము, మము, మాచేత,' మొ. రూపములును అగును.) "వ. నావిన్నవింపుం బూనుసామక్తమాల్యదామకళా ప్రబంధమునకు. కథాక్రమం బెట్టి దనిన." ఆము. ౧, ఆ ౫౦. "ఉ. నేను భవన్నియోగ సరణిం జరించుచు .." శ్రీరం. 3, ఆ. ౯౧.

దే. అవ్య. ద్రు. "అను" ధాతువునకు తుమున్నా ద్యర్థకరూపము. "సీ. దక్షిణ గంగ నాఁ దద్దయు నొప్పినగోదావరియు..." భార. ఆది. ౮, ఆ. ౧౩౯. సైవ. 3, ఆ. ౧౮.

నాంచారు. దే. వి (త. నాచ్చియార్.) 1. దేవత, అమ్మవారు. "గీ. తోడు శ్రీరంగనాంచారు తోడఁ గూర్చి,లీల నొరయూరునాంచారు పెండ్లి సరణి." శ్రీరం. మా. ౧౦, ఆ. ౧౧౬. ప్రబంధ. ౨౮౫; 2. స్త్రీ, ఆఁడుది. "గీ. పాలు పోయించు కొని యాశ్రుపాటిమూర్తి, కూలినాంచారు పాలింద్లమూడుకములు, పాలచేఁపున గిలిగింత వాఱుటయును, మెత్తమెత్తన నఱచేత నొత్తుకొనుచు." పార. ౨, ఆ ౯౫.

నాంది. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆనందము, సంతోషము; 2. పెంపు, సమృద్ధి; 3. కర్మారంభమున చేయుదేవతాస్తోత్రము; నాటకముముందు మంగళార్థము పఠింపఁబడుపద్యాది; 4. దేవతలు బ్రాహ్మణులు లోనగువారు చేయునట్టి యాశీర్వాదము; 5. భేరి. (శ. ర.)

నాందీకరుఁడు. స. వి. అ. పుం. 1. నాందీశ్లోకాదులను పఠించువాఁడు, సూత్రధారుఁడు; 2. భేరి మొదలగుమంగళవాద్యములను వాయించువాఁడు.

నాందీముఖము. సం. వి. అ. న. వివాహాదులకు పూర్వము పిత్రాదులను గూర్చి చేయఁబడువృద్ధి శ్రాద్ధము.

నాందీవాది. సం. వి. న్. పుం. = నాందీకరుఁడు.

నాందీశ్రాద్ధము. సం. = నాందీముఖము.

నాఁగటిచాలుచూర. ద్వ. వి. (నాఁగటిచాలు+చూర.) కటిగొఱ్ఱు, లాంగలికి. (శ. ర.)

నాఁగటిచాలుపేరియతివ. ద్వ. వి. సీత, జానకి. "క. కన్నియతలమానిక నన్నాఁగటిచాలుపేరి యతివను సిరికిం, బెన్నుద్ది కత్తుకొని చని, యన్నుచుఁడు రథముమీఁద నిడు డిడుకొనియెన్." రామా. ౫, ఆ. ౧౮౯.

నాఁగటిచిప్ప. ద్వ. వి. (నాఁగలి+చిప్ప.) నాఁగటి పలుగు, నాఁగటికొఱగ. (శ. ర.)

నాఁగటిజోదు. వై. వి. (నాఁగలి+జోదు.) హలాయుధుఁడు, బలరాముఁడు. "ఉ. లాలసరీగళాంకకుఁడు లావున నాఁగటిజోదు నైనఁ గెం, గేలను గీటడంచి బలుగెల్పుఁ బయిండిసెలంత సేయకోఁ, జాలినవాఁడు..." య. ౧, ఆ ౪౯.

నాఁగటివాల్జోదు. వై. వి. బలరాముఁడు. వేంక. దేవ. ౨౦.

నాఁగలి. వై. వి ఔ. (సం. లాంగలః.) దున్నెడు సాధనము, లాంగలము. "ఉ. అతఁడు నాఁగటకొత్తినయంత్రమునండి, యేటిదిక్కున కంతయుఁ గసిరియుండు, హస్తినాపురి .." ఉ హరి. ౧, ఆ. ౧౦౯ పరమ. ౨, ఆ. ౧౦౪.

నాఁగు. దే. వి. ధాన్యమునకు వడ్డీగా నిచ్చుధాన్యము "సీ. అచటిరెడ్డికొమార్తె నలహాలాయుధపాణి నాఁగున కడుగుధాన్యంబు కొంత." పాంచా. ౧, ఆ. ౩౯.

నాఁగురు. దే. వి. నాగిని, వృక్షవిశేషము. "గీ... నాగిని నావురు నాఁగు రసఁగఁ, గేరు .." ఆం. భా. ద్వి. ౬౨.

నాఁగెలు. వై. వి. ఔ. (సం. లాంగలః.) హలము "క. అయనయాజ్ఞానుస్మృతిన్, డాయుచు నాగరమణుల్ జడత దొలఁగంగా, నాయత నవసుధ నాఁగెటి, చాయను ఋషధర్మ లమర నవరించు కటిన్. అచలా. ౨, ఆ. ౫, చంద్రా. ౪, ఆ. ౧౧౯.

నాఁగేలు = నాఁగెలు. "సీ...ఓపి దున్న, నాఁగేటి మొనఁ జచ్చు నానావిధప్రాణు లన్నరుఁ బొందు నే యఘము..." భార. అను. ౫, ఆ. ౫౭, ఆం. భా. ద్వి. ౨౩౨.

నాఁచారు = నాంచారు. (స్త్రీ, అఁడుఁ.) "క. ఆచూతముచెంగటఁ గని, నాంచారును దొడుక చెలులు నయమార్గాలి, ప్రాచుర్యశ్రాఘోక్తి, శ్రీచాతురి మనమునఁ బొదలఁజేయుచు డాయన్." ప్రబంధ. ౨౮౭.

నాఁచికొను. దే. వి. (నాఁచు+కొను-స్వార్థమున ) 1. అపహరించు; ఎత్తికొను; లాగుకొను. "చ. ఉలుకకయుండఁ గొండపడ నొండొకకొండనఁ గోడెనాగముల్, బలంగులలేఁడు దన్నుకొని పోవుతెఱం గిటులాడి చూచెఁ గాఁవలయుననంగఁ దేరియు వ్రాలి దశాననునందనుం బదంబుల నిటించి నాఁచికొని పోరు విహాయసవీధి నుద్ధతిన్." రామా. ౬, ఆ ౨౧౯. భార. ద్రో. ౨, ఆ. ౨౫; 2. వశపఱచుకొను. "ఉ. రంగదుదారకీర్తి యగురక్కసిగంగనఁ బెంపులంబునై, భంగపెునర్చి మన్మథవపాలుఁడు బల్విడి నాఁచికొన్నరాజ్యాంగము లెల్ల నిచ్చి..." నిర్వ. ౧, ఆ. ౪౧; 3. అణచు. 'క. ముక్కున పేన నలఁదిన, ప్రసన్నవిభసితంబు నణఁచి క్రమవారి కడుల్, తెక్కునఁగె మంచుమలసం,చుకాన్నఁచికొని ప్రవహించు సురనదిపోలెడిన్." పాండు. ౫, ఆ. ౧౩౧.

నాఁచికోలు. దే. వి. (నాఁచికొను ధా ) అపహరించుట "ఉ...ఫల్గునుఁ డందఱు మీఱి సైంధవ, ప్రాణము నాఁచికోలు దరపాల తలంపఁగ మర్త్య కృత్యమే." భార. శల్య. ౧, ఆ. ౪౯.

నాఁచు. దే. స. క్రి. అపహరించు. "ఉ. వీఁడు గదమ్మ నాహృదయవిత్తము నాఁచినవాఁడు నిగ్మలీ." అని ౨, ఆ. ౧౩౬. దశా. ౨, ఆ. ౪౦౧. వి. దొంగ. "సీ ..నాఁచు నా దొంగయుఁ బ్రాఁచి యమరు." ఆం. భా. కృ. ౪౫; 2. నీటిలోఁ బుట్టెడుతీఁగ. శైవాలము. "సీ. డెంపుజడపెంపు నాఁచుతీవలగుంపు కలికికన్గవ డాలు గండుమీలు" నీలా. ౧, ఆ. ౫౬. ఆం. భా. ప్ర. ౧౬౫.

నాఁచుఁదీఁగ. ద్వ. వి. (నాచు+తీఁగ.) శైవాలత. "సీ. సదలిననిదుడకెంజడలును ముదురఁ బండినఁ నాఁచుఁదీఁగలఁ బెన గొనంగ." హరి. ఉ. ౩, ఆ. ౭౪. ఇట్టే నాఁచుదీఁగె. శైవ. ౨, ఆ. ౫.

నాఁచుద్రాఁచు. దే. వి. (నాఁచు+త్రాఁచు.) నాఁచులో నుండుఒకజాతిసర్పము. 'వ...సరీసృపనారీపరివారంబులతో మనకముల దనివిసనక సంచరించునాఁచుద్రాఁచులఁ గాంచి మేను లుప్పొంగ..." ప్రబంధ ౧౯౬.

నాఁచేఁడు. దే. వి. క్షుద్రజలజంతువిశేషము "సీ... నత్తగుల్ల చుట్టుడుగుల్లకురుదింద నాఁచుడు .." హంస. ౪, ఆ. ౧౭౬.

నాఁచేవన్నె. ద్వ. వి. (నాఁచు+వన్నె) నాచు-రంగు కలవస్త్రవిశేషము. "సీ. ముత్తెలకుందిళ్లసుత్తరగోగ్రహణంబులు కరకంచు నాఁచువన్నె, నిండువన్నెలు...గీ. మొదలుగా వల్వలు ధరించి మదిక లవుడు." ప్రబంధ. ౨౩౨.

నాటించు. దే. స. క్రి. (నాటు. ధా. ప్రే.) 1. గ్రుచ్చు. "క. అందఱు సేనల గంగా, నందనుఁడు శరత్రయములు నాఁటించెను శల్యుం డాఁక నుత్తరుఁడు .." భార. భీష్మ. ౧, ఆ, ౨౮౧. భార. అర. ౭, ఆ. ౩౨; 2. పాఁతించు. "గీ. పెరటిచెట్టుగ నాఁటించుఁ బెంపు గనుము." పారి. ౧, ఆ. ౧౩౬. ప్రభా. ౧, ఆ. ౧౨౦.

నాటు. దే. అ. క్రి. 1. గ్రుచ్చుకొను. "ఉ. దాఁటకమాన రిక్కడలి దాశరథుల్ కమదండి మూఁకతో, దాఁటినదాఁక చూడక...పొమ్మిది నుంచిది పోనినాటికిన్, నాఁటకపోవు నీయుర మునకున్ రఘువీరకఠోరబాణముల్." రామా. ౭, ఆ. ౭౬. భార. ఉద్యో. ౪, ఆ. ౪౦౭; 2. పాదుకొను, స్థిరపడు. "క. మనమున నాఁటిన మానుల,దిను మెన్నియుఁ బాయములను పెకలింప యధిపా." భార. ఉద్యో. ౨, ఆ. ౬౨. భాగ. ౧౦. స్కం. పూ. ౧౦౪౯; 3. కలుఁగు, జనించు. "చ...వెక్కసమగు పెన్వగల్ నాఁడమెం గంటము పుట్టెఁ జెమర్చె మేను మా,నసమున విన్నఁబాటొదవె నాఁటెఁ గడుం బరితాప వేదనల్." పారి. ౧, ఆ. ౧౦౦. హంస. ౩,ఆ. ౧౪౭ ; 4. అంటు, తగులు. "ఉ...వాని కెన్నిజన్మంబులనైనఁ బాపములు నాఁటవు పుణ్యపరుండు గావునన్." వి. పు. ౩, ఆ. ౧౩౮. దశా. ౪, ఆ. ౧౫౯. స. క్రి. 1. గ్రుచ్చు. "సీ ..ఆతఁ డతని, ధనశరాసనముఁ ద్రిఖండం బుగాఁ జేసి నారాచ మొక్కటి నాఁటె వేన." భార. భీష్మ. ౧, ఆ. ౨౫౬. ఉ. హరి. ౩, ఆ. ౬౦; 2. (భూమిలో మొక్కలు లోనగు వానిని) పాఁతు. "గీ. నాఁటె మందారతరువులు తోఁటలందు." భీమ ౫, ఆ. ౮౭. వసు. ౫, ఆ. ౬౪; 3. లగ్నముచేయు. "ఉ . అనంత శేవలాసందము దానియందు మది నాఁటుము మానుము నీచభోగముల్." భర్తృ. వై. ౪౦. నైష. ౪, ఆ. ౬౩, 4. కలిగించు. "చ .. ఆహార్యకూటములు నాఁటిన నాటులవెంబడిం బడిం,బడిఁ బడుసీరధారలు సుపర్వులు నించిన పుష్పవృష్టికై వడి వెలయించుచుండె శిటివర్యుని మన్నది సాశ్రయించెదన్." చంద్రా. ౧, ఆ. ౭౭. వి. 1. రంధ్రము, గండి. చంద్రా. ౧, ఆ. ౭౭; 2. ఉరి, దాల్బు. "సీ. వలంతెంచు నాఁటు తేర్పడినకైస్తానిలోఁ జిఱుచెమ టంటు ముంగురులతోడ." హ్న. వి. ౩, ఆ. ౯౧; 3. నాట్నము, మొక్కలు మొదలగునవి పాఁతుట. (వ్యవ.) ఆచేనియందు నాఁటు ముగిసినది; 4. భూమిలో దిగినపర్వతము లోనగువానియడుగు భాగము, దుదురు. "గీ. నడుమ చతురశ్రవృత్తమా నాఁటు గలిగి, ధగధగాయితకనకరత్న ప్రకాశ, కిరణములు నాలుకలు గోయుంకెలములుగ, సురనగంబు విధూమాగ్నికరణి మెఱయు." వరాహ. ౧౦, ఆ. ౧౦౭.

నాటుకొను. దే. అ. క్రి. (నాటు+కొను.) 1. పాదుకొను, స్థిరపడు. "సీ. పాకంబు లోకభంగిఁ బ్రకటయం బందిన నామీఁద దృఢభక్తి నాఁటు కొనుచు, నామీఁద దృఢభక్తి నాఁటుకొన్నప్పుడు ధర్మంబు వర్తించుఁ దరతరంబు." భీమ. ౫, ఆ. ౧౫౭. వి. పు. ౭, ఆ. ౭౪; 2. కలుగు, సంభవించు. "గీ. ఈక్షణంబున నాఁటుకొనిన, పాటు మదిఁ జిత్తగింపవే పార్థివేంద్ర." వసు. ౨, ఆ. ౧౪౫. వి. పు. ౧, ఆ. ౧౫౬; పాఁతుకొను, వేళ్లు పాఱు. (వా.)

నాటుకొలుపు. దే. స. క్రి. (నాటుకొను ధా. ప్రే.) 1. అతుకుకొనఁజేయు. "గీ. తెగిన దక్షునికంఠంబుఁ ద్రెవ్వనేసి, ప్రేల్చెఁ దలనధ్వరాగ్నిని వీరభద్రుఁ,డా ప్రజాపతి మెడపైని సాక్షణాజ,నగుచుఁ బొట్టేలి తలఁ దెచ్చి నాఁటుకొలిపె" భీమ. ౬, ఆ. ౫౫; 2. పుట్టించు, కలిగించు. "సీ. అయ్యింతికడ విల్చి యనువునఁ గాంతుప నకు మది రాగంబు నాఁటుకొలిపి." దశ. ౬, ఆ. ౧౨౧; 3. పాదుకొనఁ జేయు. "క ..నామీఁదం గనికరంబు నాఁటు కొలుపుచున్." అచ్చ. సుం ౯౧.

నాటుకొల్పు = నాటుకొలుపు. 1. (గ్రుచ్చుకొనఁ జేయు.) "వ...మూటిగ నీటియలు నాఁటు కొల్పి యుయురు సెదల మీఁటుచు .." అచ్చ. యు. ౩౬౪; 2. (పాదుకొనఁజేయు.) "ఉ. నావుడుఁ గన్యకామణి మనంబునఁ గూరిమి నాఁటుకొల్ప నా,భావజబాణముల్ మిగులఁ బజ్జఁ జరించిన .." ద్వా. ౫, ఆ. ౧౨౬.

నాటుతీయు. దే. అ. క్రి. (నాటు+తీయు.) మొక్క మొదలగునవి పాఁతుకొని చక్కఁగా వ్యాపించు.

"చ. కరిశిర మూత మణ్మముఖముఁ గైకొనశ్రేయముడుఁ గుంభమాత్రికో, క్కుర ఘనధారఁ బోల్చియుఁగెఁ జారమఖంగము జూచి సభ్యయు, దరజయకాంత కాంతర, కాంతిరయు కాదని నాఁటుసీతి వ్యిస్సు రదవదాశఖడ్గలత భూచెనో నా జయమైత్ర సంభవన్." కు. సం. ౧౨, ఆ. ౧౮౨.

నాఁటుచేయు. దే. అ. క్రి. (నాఁటు+చేయు.) ఉంచు, పుట్టు. "చ. ఘనవదనాలవాలముఁ గ్రమవచస్సుధ నాఁటుచేసి చిన్నినగవుపెన్నులం గలసి చిక్కనయుప్పవదంపు మోసులో, యన రదనాళి యుంపొనరె .." కాళిందీ. ౧, ఆ. ౩౧౦.

నాఁటువడు. ద్వి. అ. క్రి. (నాఁటు+పడు.) తెగు, నలుకుడుపడు "చ. చిరముగ నొల్వ్యపడ్డ వర సింహాంశికంటెను బెద్దపే శిరంబురలఁగ నాఁటు వడ్డజల బోద్ధృపుకంటెను బెద్దపే..." కు. సం. ౪, ఆ. ౭౬.

నాఁడిక = నాఁడు. (నాఁడు+ఇక—స్వార్థమున.) దేశము. "క. అన్నాతియు నొదయఁడు నటు, లన్నా రని నీవు కోన కరుదెంచినచో, నన్నా యన్నాఁడిక యున్నన్నా యాఁగుకొనఁ జాలు నట్టిద చెపుమా." అచ్చ. అయో. ౧౧౦.

నాఁడు. దే వి. పొ. (బ. నాళులు, నాళ్లు.) 1. దివసము, రోజు. "క. మీఁటు గలరాజరథికుల, నాఁటికి నేపుర వధింతు నరుశరములు నో,నాఁటి పదవై చునంతకు. పేటాడెదఁ బ్రతిబలంబుమీరుల నెల్లన్." భార. ఉద్యో. ౪, ఆ. ౪౦౭, భార. ఆది. ౧, ఆ. ౮; 2. అదినము. "గీ. నాఁడు వధ నాడినంతయుం జేఁడు చేయుం, నట్టులున్నాఁడు మొనతల ననిలసుతుఁడు." భార. భీష్మ. ౩, ఆ. ౭౪, భో. ౨, ఆ. ౧౭౮; 3. సమయము, కాలము. "వ...కని పుట్టిననాఁడ చూచిన వాఁడు గావున నప్పు డెఱుంగలేరక..." భార ఆది. ౪, ఆ. ౧౬౬, భాగ. ౯, స్కం. ౬౯౯; 4. అసమయము, అకాలము. "ఉ. కేఁడినపేఁడి మాట నృపుఁడుఁడు నైపక కర్ణరంధ్రముల్, నాఁడినభంగి దాఁకుటయుం గ్రుక్కి మనంబున నొచ్చి విన్న నే, నాఁడు నృపాలపుత్రి వని నమ్మి వరించితిఁ గాక యిన్నియుర్, నేఁ డొక కాలుకర్వ మయి నీవిటు సేయుట నాకు దోఁచెనే" భా. రా. అయో. ౭౩, ౧భా. ౪, ఆ. ౧౩౨; 5. ఎపుడు, పేసర్థకము. "సీ. నేడు పోషణనాఁడు నివ్వలం విస్మరోయక్క మంతయు నవి ..." భార. ఆది. ౧, ఆ. ౧౧౫, హైమ. ౫, ఆ. ౯౧; 6. దేశము. "ద్వి. నాఁడెల్ల నేలెదు నాఁడు నాతిన్న, నాఁడొక్కనాఁ డేమ నడుకేయఁ బోయి..." రం. రా. అర. ౧౨౩. పు. కు. సం. ౧, ఆ. ౫౩; 7. ప్రదేశము. "ద్వి. పురములం దేశముల్ పుణ్యతీర్థములు, నరుసకం బగునాళ్ల నాళ్లను గడచి." ద్వి. మారిచ్చ. పూ. ౨౨౧౬ సం; 8. జనపదము, కట్టె. "సీ. నాఁడు నా జన పదనాశధేయం బగు..." అం. భా. ద్వి. ౭.

నాఁడునాఁడు. దే. వి. పొ. (నాఁడు+నాఁడు.) దినదినము, ప్రతిదినము. "ఉ ..అశ్వతురగంబుల కెల్లను నన్ను యుంత్రుఁగా, నర్మిలి విన్చి యాఁగిరుఁ బ్రియంబున నామొద నాఁడునాఁటికిం, జేర్మి వహించుచుండె నదె పొ దనకష్ములలోనివానిఁ గాన్." భార. విరా. ౧, ఆ ౨౬౭. కాశీ. ౨, ఆ. ౫౨. "క. భావించి నాఁడునాఁటికి, వేవిధముల మిగులభక్తివినయంబులతో, దైవోపచారముల భూదేవోత్తముఁ గొల్చెఁ గుంతిదేవి నియతయై." భార. ఆది. ౭, ఆ. ౩౨౨.

నాఁడెకాఁడు. ద్వి. వి. (నాఁడెము+కాఁడు.) వైశ్యుఁడు. సాం. ని. మాన. ౨, విణ. నాఁడెము కలవాఁడు. (శ. ర)

నాఁడెము. వై. విణ (సం. నాణకమ్.) శ్రేష్ఠమైనది, మేలైనది. "ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి పంకజసంభవనోవారాంబుపుల్, వేఁడిన నెల్ల చోటఁ బ్రభవింపఁగ భానుఁడు శీతభానుఁడున్, గాఁడినమేఘుకాళికమువికారము దూరము సేయ నెంతయున్. నా.డెము చూపె శారదదినంబులు నిర్మలమూర్తికాళ్ళతిన్." పాండు. ౪, ఆ. ౪౩, అచ్చ. బాల. ౨౮.

నాఁబడాయి. దే. వి. (నాము+బడాయి.) నామువలె నున్నగా నుండుబడాయి. (వా. వివశిల. దీనివి త్రొక్కిన ఆచోట నొప్పి కలుగును అని శ. ర.)

నాక. దే. న. క్రి. (అనుధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థకరూపము) అనక. "చ. కొలఁది యెఱుంగ కిట్టిపలుకుల్ పలుకం దగు నాక..." భార. ఆది. ౫, ఆ. ౨౦౩. కాశీ. ౧, ఆ. ౧౦౧.

నాకబలి. సం. వి. ఇ. పుం. నాగవల్లి, వివాహాంగమగు ఐదవరోజున చేయుసంస్కారవిశేషము. "సీ. కొలఁదు మీఱఁగ నాకబలికృత్యములు సల్పి." కళా. 8, ఆ. ౧౩.

నాకము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. ఆకాశము.

నాకవనిత. సం. వి. ఆ. స్త్రీ. 1. దేవతాస్త్రీ; 2. అప్సరస.

నాకసదుఁడు. సం. వి. ద్. పుం. వేలుపు. ఇట్లే. నాకౌకసుఁడు. మొ.

నాకి. సం. వి. న్. పుం. వేలుపు, దేవత.

నాకిని. సం. వి. ఈ. స్త్రీ. దేవతాస్త్రీ.

నాకు. దే. స. క్రి. 1. లేహనము చేయు, నాలుకతో రాఁచి లోఁగొను. "సీ. సనకాదిదివిజమస్కారి ఫాలగోపిచందనపుంద్రవల్లికల్ నాకి నాకి." ఆము. ౧, ఆ. ౪౧. స్వా. ౪, ౬౦; 2. కాఁడు, వ్యాపించు. "క... ధగధగ లర్చిస్తుంగశిఖగులు నాకెను, నింగులములు నాల్గుదెసల నిడుకొని కదఁకెన్." స్వా. ౬, ఆ. ౨౧.

నాకులము. సం. విశే. (అ. ఆ. అ.) నకులసంబంధమైనది.

నాకులి. సం. వి. ఈ. స్త్రీ. 1. సర్పాక్షి; 2. తెల్ల వాఁకుడు.

నాకువు. సం. వి. ఉ. పుం. 1. పుట్ట, వల్మీకము; 2. కొండ, పర్వతము.

నాకేశుఁడు. సం. వి. అ. పుం-స్వర్గాధిపతి,-ఇంద్రుఁడు.

నాక్రము. సం. వి. అ. పుం. మొసలిమూతివర్క్ర. విశే. (అ. ఆ. అ.) నక్రసంబంధమైనది.

నాగ. వై. విశే. (సం. నాగః.) 1. పూజ్యము. (చూ. నాగబెత్తము); 2. పెద్దది. (శ. ర)

నాగఁడు వై. వి. (సం. నాగః.) శేషుఁడు. (శ.ర.)

నాగకేసరము. సం. వి. అ. పుం. ఒకానొక మొక్క.

నాగకేసరులు. వై. వి బ. (సం. నాగకేసరాః.) ధాన్యవిశేషము. "సీ. నాగకేసరులు చెన్నంగులు మరువులు భోజనప్రియములు రాజనములు .. శాలి. గీ. ధాన్య మెసఁగును......సాం. ని. మాన ౫౧.

నాగ గన్నెరు. ద్వ. వి. ఒకజాతిగన్నేరు. "సీ... నాగగన్నెరులు మూనాల్గుపొగలు." భల్లా. 3, ఆ. (శ. ర.)

నాగచూడుఁడు. సం. వి. అ. పుం.—నాగములు శిరస్సునందు భూషణములుగాఁ గలవాఁడు-శివుఁడు.

నాగజము. సం. వి. అ. న. 1. సిందూరము; 2. తగరము, వంగము.

నాగజిహ్వక. సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

నాగదాళి. దే. వి. ఒకజాతిముండ్లచెట్టు. (శ. ర.)

నాగచేరడు. ద్వ. వి. పెద్దచేరెడు. (శ. ర)

నాగస. దే. వి. నాగవల్లి. (శ. ర.)

నాగపడగలదండ. మి. వి. స్త్రీ కంఠభూషావిశేషము. "ద్వి. భాసురం బగు నాగపడగలదండ, యూనలేఁ జేర సియలిరు నీదండ." ద్వి.భాగ.౧౦. (శ. ర.)

నాగపడగలు. మి. వి. బ. పాముపడగవలె నుండు కర్ణభూషావిశేషము. అం. భా. ద్వి. ౧౦౩.

నాగపసాని. వై. వి. (నాగప+సాని) నాగవల్లి నడపెడిముత్తైదువ. (శ. ర.)

నాగపుష్పము. సం. వి. అ. పుం. 1. పున్నాగము, పొన్న; 2. సంపెంగ, చంపకము; 3. నాగకేసరము.

నాగపెంజెర. ద్వ. వి. ఒకజాతిసర్పము. "సీ. క్రల్ల దంబునఁ ద్రొక్కినట్టినాగులు నాఁగ పెంజెరలును బొట్టపెంజెరలును." ద్వా. ౩. ఆ. ౧౦౦.

నాగప్పు. వై. వి. నాగవల్లి నడపెడిముత్తైదువ. "సీ. నాగప్పసాని నాఁటసాని యనంగ నాకబలిచిరంటి నాను మెసఁగు." అం. భా. ద్వి. ౧౦౩.

నాగబంధము. సం. వి. అ. పుం. 1. అభినయహస్తవిశేషము; 2. చిత్రకవిత్వములోని సర్పాకారబంధము; 3. మల్లబంధవిశేషము; 4. వస్త్రవిశేషము. "వ... నాగబంధంబులు బాహాబంధంబులును ..అను పేళ్లుగలపుట్టంబులు గట్టుకొని.." ద్వా. 3, ఆ. ౨౦౬.

నాగబెత్తము. వై. వి. పొన్నుచేసిన మంత్రపూతమైనచిన్నపేము. "చ. కరమున నాగబెత్తమును గాత్రమున న్నునుబూది యొప్పఁగా, నరుదుగ జోగురా లొకతె యచ్చటికిం జనుదెంచెఁ గ్రక్కునన్." శకుం. ౪, ఆ. ౯౩. కళా. ౨, ఆ. ౪౩.

నాగభూషణుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

నాగమల్లె. వై. వి. ఒకజాతిమల్లెపూ. అం. భా. ద్వి. ౫౨. బ. ధాన్యవిశేషము. "సీ. మందిగంత్రలు

నాగమల్లెలు తీఁగెమల్లెలు కృష్ణశిలాలు పెలుచ డాలు. గీ. అది యగుపేర్లుగలుగువ ద్దశని యింట,నుండు......" హంస. ౪, ఆ. ౧౨౮. ప్రబంధ. ౧౧౭.

నాగమసాని = నాగభుసాని. "మ. సరలం గూర్చిన కొవ్వులోఁ బసుపుమిన్నల్ వేణుశాస్త్రాముతో, గరిమన్ నాగమసాని ప్రోలు దిఱుగంగా ఆఁకువై దూర్యముల్, మొరయంగాఁ గడు నొప్పు నాక బలి..." హేం. పంచ. ౪, ఆ. ౩౭౦.

నాగము. సం. వి. అ. పుం. 1. పాము, త్రాఁచు; 2. పాతాళలోకమున వసించు దివ్యసర్పజాతివిశేషము (అష్టనాగము —అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు. కర్కోటకుఁడు.); 3. ఏనుఁగు; 4. కొండ; 5. మేఘము; 6. చిలుకకొయ్య; 7. దేహమందలి ఉపవాయువులలో వాగ్ద్వారమందుండుశుపవాయువు; 8. గ్రహము, 9. నాగకేసరముశ్రీ, 10. పున్నాగము, పొన్నశ్రీ; 11. ముస్తెశ్రీ. న. 1. తగరము; సీసము; 3. ఒకానొక కరణము. (జ్యోతి.); 4. ఆశ్లేషానక్షత్రము. విణ. (అ. ఈ. అ.) 1. కొండలకు సంబంధించినది; 2. క్రూరము; 3. (సమాసమం దుత్తరపదమై నప్పుడు) శ్రేష్ఠుఁడు. (ఉదా: పున్నాగము, పున్నాగుఁడు. మొ.)

నాగముస్తె. వై. వి. భద్రముస్తకముశ్రీ. (శ. ర.)

నాగరంగము. సం. వి. అ. పుం. నారింజశ్రీ.

నాగరకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) 1. నగరమందు పుట్టినవాఁడు; 2. నేర్పరి, ప్రవీణుఁడు; 3. నగరదురభ్యాసములు అలవడినవాఁడు; 4. దొంగ; 5. శిల్పి.

నాగరము. ఉభ. దే. వి. స్త్రీ శిరోభూషావిశేషము. (వా.) సం. వి అ. పుం. 1. నారింజశ్రీ; 2. కపటము, మోసము; 3. గోరఁటశ్రీ న. 1. సొంటి; 2. ఒకజాతిముస్తెశ్రీ; 3. రతిబంధవిశేషము; 4. ఒకానొకలిపి. (సంస్కృతభాష యీలిపిలో వ్రాయఁబడును.) "గీ. కటములందు నాగరలిపి ప్రస్ఫుటముగ, పరమషీతూలికారేఖ వ్రాసిపెట్టి, యర్ధనాగమగ్రంథ మత్యాదరమున, జెట్టు పతి యింప బోధించు నద్గురుండు." కాశీ. ౬, ఆ. ౭౪. విణ. (అ. ఈ. అ.) 1. నగరమునఁ బుట్టినది; 2. నగరమున నున్నది; 3. నగరమునకు సంబంధించినది.

నాగరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకలిపి; 2. పట్నవాసపుస్త్రీ.

నాగరికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. నగరరక్షణమందు నియుక్తుఁడు; 2. నగరమును రక్షించువాఁడు.

నాగరుఁడు. సం వి. అ. పుం. 1. పౌరుఁడు; 2. మగనిసోదరుఁడు, దేవరుఁడు

నాగరుకము. సం వి. అ. పుం. నారింజశ్రీ.

నాగలోకము. సం. వి. అ. పుం. పాతాళము.

నాగవడిగలు. వై. వి. బ. కర్ణభూషావిశేషము. "సీ. మొనపాటముత్తె మొంచిననాగవడిగలు బిగువొప్పఁ దొడిగిన బిళ్లచెప్పు. గీ. లాచర..." రా. వి. ౨, ఆ. ౪౪.

నాగవలి = నాగవల్లి. (పెండ్లిలో తుదినాఁడు చేయు సంస్కారవిశేషము. కొందఱు దీనిని ఐదవనాఁడు కొందఱు నాలవనాఁడు. జరిగింతురు.) "ఆ. అటుల దినచతుష్టయం బైనయంత నాగవలిగూను నొనర్చె తత్సవరుండు." ఇందు. ౬, ఆ. ౬౬. ఆం. భా. ద్వి ౧౭౮.

నాగవల్లరి సం = నాగవల్లి.

నాగవల్లి. ఉభ. దే. వి. (సం. నాకబలిః.) పెండ్లిలో కడపటినాఁడు చేయుసంస్కారవిశేషము. "క. తగఁ బ్రాకెనయును దీవించి, నగవులకును లైన వెతుక నారదనాఁ డో,న్నగ నాగవల్లి సేయఁగఁ, బగదప్రటుల్పురి గెలోనఁ బదఁటుక తెల్లన్." యు. ౪, ఆ. ౧౧౪. రాజ. చ. ౩, ఆ. ౧౭౪. సం. వి. ఈ. స్త్రీ. తములపాకుతీఁగ, తాంబూలిశ్రీ.

నాగవాసము. ఉభ. దే. వి. 1. గంటలొవిచీల, ఘంటాప్రతీకము. "గీ. నాగవాస మన ఘంటాప్రతీక మనకు వేశ్యలకను బేరు విశ్వనాథ." ఆం. సం. నానా. ౨౪; 2. గొండ్లెము తగిలించుటకు రెండు కొనలు వంచి బిగించిన యినుపకమ్మి. "చ. కులుకు మెఱుంగుఁ గెంపుతఱిగోళ్ల నమర్చిన నాగవాస పుంగొలుకుల జాళువా గొలుసుగోళ్లఁ దగుల్కొని ..." చంద్ర. ౧, ఆ. ౯౧; 3. వేశ్యాసమూహము. "సీ. ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి మహిమ గోల్పడియె నే మాందకర్ణి." స్వా. ౨, ఆ. ౭౩. ఆం. సం. నానా. ౨౪; 4

భోగము చేకము. "ఆ. నాగవాస మనఁగ నాను
మా వేశ్యాజనంబు మేళమునకు నంబికేళ." అం.
సం. మాన. ౮. ఆము. ౪, ఆ. ౩౪. సం. వి.
అ. పుం. నాగలోకము.

నాగవ్రేలిమి = నాగవల్లి. 'క...ముఖముల, వ్రేలి
మిగుల నవల నాగవ్రేలి మొనర్చన్." ముకుంద
౩, ఆ. ౨౯౬.

నాగసంభవము. సం. వి. అ న. సిందూరము

నాగసరము. వై. వి. (సం. నాగస్వరః.) 1. పాముల
వాఁ డూఁదెడిబుఱ్ఱ. "గీ విహిసదంబుగఁ బాముల
మెంగఁ దూద, భోగిరాజులు నర్తించు నాగ
సరము." క్రీడా. ౨౨౪, 2. పాముల కానం
దము గలిగించుస్వరవిశేషము. "గీ...అలకించి
చనియె, నాగసరముల మ్రోఁత యన్నాగరి
కుఁడు." క్రీడా. ౨౧౯. ఆం. భా. ప్ర. ౧౨౯;
3 సన్నాయి. "ద్వి. కంచుకొమ్ములు బూరగలు
నాగసరము, లంచితపటహకాహళములు సరస."
ద్వి. నల. ౨, భా. ౫౪౯. య. ౪, ఆ. ౧౫౮.

నాగస్వరము సం. వి. అ. పుం. 1. పాముల కానం
దముఁ గలుగఁజేయు గానవిశేషము; 2. పాముల
వాఁ డూఁదెడిబుఱ్ఱ. "క. నాగస్వరకుహిరసర,
న్నాగవరాళ్యాది వివిధ నానారాగ, ప్రాగల్భ్య
ప్రకటఫణా, భోగములై యూఁదఁ జొచ్చె భోగిం
ద్రంబుల్." క్రీడా. ౨౨౦.

నాగాంతకము. సం. వి. అ. పుం. 1. గరుడపక్షి; 2.
నెమిలి; 3. సింహము.

నాగారి. సం. వి. ఇ. పుం. 1. గరుడపక్షి; 2. నెమలి;
3. సింహము. [నెమలి.

నాగాశనము. సం. వి. అ. పుం. 1. గరుడపక్షి; 2

నాగి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. పాతాళ
లోకము; 3. ఆఁడుసర్పము; 4. నాగజాతిస్త్రీ.
"క. నీగుణములు దొల్లియుం నా,గీగీతములందు
విని..." భార. ఆది. ౮, ఆ. ౧౩౧. పుం. శివుఁడు.
విణ. (న. సీ. న.) పాములు కలది. (భుట్టెమొ.)

నాగిని. ఉభ. వై. వి. (సం. నాగినీ.) లోకాంతర
గతయై దేవత యైనముత్తైదువ. (శ. ర.) సం. వి
ఈ. స్త్రీ. 1. గొల్లబిడ్డలి. "గీ...నాగిని యగు,
గొల్లబిడ్డన..." ఆం. భా. ద్వి. ౬౬; 2. నాఁగురు,
నావురుని. "గీ ..నాగిని నావురు నాఁగు
రనఁగ." ఆం. భా. ద్వి. ౬౨.

నాగు వై. వి. (సం. నాగః) పాము. "ఆ. సంది
రొమ్ముగిత్త నాగులు సొమ్ములు..." శివ్న. ౩,
ఆ. ౩౯. ఆం. భా. ప్ర. ౧౪౬.

నాగుఁబాము. ద్వ. వి. (నాగు+పాము.) త్రాఁచు.
"సీ . నాగుఁబా మనఁ ద్రాఁచ నఫణి దనర్చు."
ఆం. భా ప్ర. ౧౪౩. అచ్చ. సుం. ౫౫.

నాగువడిగెత్రోగులు. వై. వి. బ. పాముపడగపోలిక
గలకర్ణాభరణ విశేషము. "గీ...చెవులనాగు,
ప్రోగులు మెలిగొన్నపచ్చదములు నవుర..."
వేం. పంచ. ౧, ఆ. ౬౧౪.

నాగులపడగలు. వై. వి. బ. పాముపడగపోలిక గల
కర్ణభూషావిశేషము. "చ....వెన్నునం,దొలకెడు
నొత్తిజాట్టు తెలిదుప్పటి వీనులమానికంపుజా,
గులపడగల్ రహిం దగ నొకాం డగుఁయుంటరి
బోయఁ డుద్ధతిన్." పవల. ౪, ఆ. ౨౦౨.

నాగువు. వై. వి. (సం. నాగః.) పాము "గీ. కుబుస
మూడ్చెడిమేటినాగువును బోలె." భీమ. ౫, ఆ.
౭౦, శైవ ౩, ఆ. ౧౫౪.

నాగేంద్రము. సం. వి. అ. పుం. 1. సర్పరాజము;
2. శేషాహి; 3. గజశ్రేష్ఠము; 4. ఐరావతము.

నాగోదము. సం. వి. అ. న. ఉదరత్రాణము.

నాచి. తె. వి. (త. నాచ్చి.) స్త్రీ. "గీ. కలికి కల్లిక
దేబెలఁ గన్నతల్లి, వాసి కెక్కినయట్టిపోలాస
యిల్లు, చక్కమెప్పులమావులరమ్మక్క నాచి."
క్రీడా. ౧౨౯.

నాట. సం. వి. అ. పుం. రాగవిశేషము. "శా...
వాఁగారుం గొనగోళ్ల నీ నలసతల్ వాయించుచో
నాటకున్, మేళం బైనవిపంచి నిన్నమొదలున్
నీవంటమిం జేసి..." స్వా. ౩, ఆ. ౫౭, హంస.
౫, ఆ. ౧౨౪.

నాటకము. సం. వి అ. న. 1. శృంగారవీరరసములలో
నొకరసముప్రధానముగా నుండి ప్రఖ్యాతచరిత్ర
మును దెలుపుచు అయిదుమొదలు పదివఱకు
అంకము లుండుదృశ్యప్రబంధము; 2. నర్తనము.
"దండకము...గోవర్ధనక్షోణి భృత్కందరక్షోణిఁ
గ్రీడించువిన్నాణి పెన్నాటకం బైనక్రొల్లన్ను
లన్ గల్గుపెన్నొక్కలన్ నల్లదౌ జెల్వు
నొప్పారుబాల్లి కొల్ల..." పాండు. ౪, ఆ.
౭౭; 3. చరిత్రము. "గీ. పుండరీకాక్షునకు
కూలిపూజ లిచ్చి, సంయములు చూచ అదరి

శాస్త్రములయందు, నాఁగ విందు మయ్యూరుపుర
నాటకంబుఁ, జెప్పి చెవులకుఁ బండువు సేయు
మనఁగ." ఉ. హరి. ౨, ఆ. ౪౦; 4. కపటో
పాయము. "ఉ...నాటకమె నాటకమై పలికి
నాటకముల్ ఘటించి రుక్మిణీ, కామిని
మీఁదటం గలుగుగౌరవముం గృపయుం
బ్రియంబుఁ దా, నేమియుఁ గానీక యిట నిచ్చ
దినంబులు నన్నుఁ దేర్చె..." హరి. ౧, ఆ. ౮౯.

నాటకసాల. వై. వి. (సం. నాటకశాలా.) నాట్య
శాల. "చ...ఒకచేడియ నాటకసాలపేరిటై,
నిలుపున నాడుచుండి..." స్వా. ౫, ఆ. ౭౩.

నాటకీయము. సం. విణ. (అ. ఆ. అ.) నాటకసం
బంధమైనది.

నాటకుఁడు. సం. విణ. (అ. టీకా. అ.) నటుఁడు.

నాటనము. సం. వి. అ. పుం. నృత్యము.

నాటి. సం. విణ (న్. ఈ. న్.) నటించువాఁడు.

నాటిక. సం. వి. ఆ. స్త్రీ. ఉపరూపకము లను దృశ్య
కావ్యములలో నొకటి (ఇది నాలుగంకములు
కలిగి స్త్రీపాత్రబహుళముగా నుండును. ఇందలి
కథ కల్పితమై యుండును. నాయకుఁడు ధీరల
లితుఁ డగురాజు. నాయిక అంతఃపురసంబంధ
గాని సంగీతవ్యాపృత గాని అయి నవానురాగ
యగురాజకన్యక, ప్రౌఢయు నృపవంశజాతయు
నగుపెద్దభార్య యుండవలెను. ఇందు వృత్తి
కైశికీ.)

నాటితము. సం. విణ. (అ. ఆ. అ.) అభినయింపఁ
బడినది.

నాట్యము. ఉభ. దే. వి. మల్లవిద్యయందలి విసరు
లలో నొకటి. "వ...అంత్రటీక టీక నాట్యము
...మొదలగుపదునాలుగు విసరులు..." ప్రబంధ
౪౭, సం. వి. అ. న. 1. నృత్యము; 2. నృత్త
గీతవాద్యాత్మక మగులాస్యము; 3. నాటకాది
దశరూపకాభినయము.

నాడము. సం. = నాళము.

నాడా. హిం. వి. సన్ననినూలుపట్టె. (శ. ర.)

నాడి. సం. వి. ఈ. స్త్రీ. 1. నరము; 2. గడియ
కాలము; 3. నారిపుఱుపు; 4. ఈగె; 5. కాడ,
నాళము; 6. గొట్టము, త్రోవ; 7. మోసకాని
సడత, మారియు; 8. ఒకకాలిగణిక; 9. వాత
పిత్తశ్లేష్మధాతువులలో నొకటి; 10. ఇడ, పింగళ,
సుషుమ్న అనుమూఁడునాడులలో నొకటి
(యోగ.)

నాడింధముఁడు సం. వి. అ. పుం.—గొట్టమూఁదు
వాఁడు-కంసాలి, స్వర్ణకారుఁడు.

నాడికేలము. సం. = నారికేళము.

నాడీవ్రణము. సం. వి. అ. పుం నారిపుఱుపు.

నాడు. దే. అ. క్రి. 1. నాఁటు, గ్రుచ్చుకొను. "గీ.
కాఁడె గ్రుచ్చెను దొలిచెను నాడె ననఁగ,నాఁటె
ననుమాట కర్థ మా నాగభూష" ఆం. భా. శ్ర.
౧౨౨; 2. వీఁగు, భాడితమగు. "చ. జనపతి
వేఁడితూపుల భుజంబులు వ్రచ్చి యురంబు
లుచ్చి యానసములు వాఁడి చాపములు నాడి
శతాంగము లాడి యుగ్రకేతువములు కూడిసన్.
..." కవు. ౨, ఆ. ౧౦౦. స. క్రి. బాధించు,
పీడించు. "చ. అనలునిఁ గాఁడుచుం జముని
నాడుచు రాక్షసు నాడుచుం గపర్ది నొప్పలు
చూఁడుచుం ధనదుప్రేవులు దోఁడుచు..."
కవు. ౫, ఆ. ౧౨౩.

నాడె. దే. వి. పడుపు నాలికండె నుంచి నేసెడు
సాలెవానిసాధనవిశేషము, తురి. "సీ... పరికరి
యచ్చులు చరిపుండ యూడిక చీడుదబ్బలు
దండె నాడె క్రోలి." హంస. ౨, ఆ. ౧౧.

నాణకము. సం. వి. అ న. రూపాయ లోనగు
నాణెము

నాణెకత్తె. వై. విణ. (నాణెము+కత్తె.) నాణెము
కలది. (శ. ర.)

నాణెగాఁడు. ద్వ వి. (నాణెము+కాఁడు.) నాణెము
కలవాఁడు 'సీ. చేరెఁడువిద్యాలరాకరముల్
దినువానిఁ గోణాంగిపేవలనాణెగాని" ఘటికా. ౨,
ఆ. ౧౬౮.

నాణెము. వై. వి. (సం. నాణకమ్.) 1. శుద్ధదీనా
రము. (ముద్రింపఁబడినరాగివెండి బంగారముల
బిల్ల అని శ. ర.) "గీ. నాణె మనఁగను శుద్ధదీనార
మొప్ప" ఆం. భా. ద్వి. ౨౭౩, శుక. ౧, ఆ.
౫౧౦; 2. మంజూలత. "చ. అదలుచుఁ దాళ
రాని విరహార్తిమెయిం దురపిల్లుదాని...అంచ
రా, నడుపులందాని మోవిరుచినాణెము దాని
నుగ్మ్యడఁగును..." శుక. ౧, ఆ. ౨౦౧; 3.
ద్రవ్యము, ధనము. "చ. నడవడి గల్గువాఁడు
కడునాణెము చేఁ గలవాఁడు..." హంస. ౫,

ఆ. ౨౧౬; 4. నాగరకత. (శ. ర.); 5. (వస్తువుల) యోగ్యత (ఇచ్చి పుచ్చుకొనుట యందలి యోగ్యత. (శ. ర) విశే. 1. మంజులము, మనోహరము. "సీ... నాణెము చాల. గీ. గొనబు తియ్యంబు గాను తిన్ననిది బాగు, చొక్కటం బన నెలయు మంజులసమాఖ్య." ఆం. భా. కృ. ౧౪; 2. శ్రేష్ఠము. "గీ. కందిలో శోడువాడలఁ గలిగినట్టి, నాణెపుంగోమటులతోడ నంబిసెట్టి, భాసురస్ఫూర్తి శోభిల్లఁ గైలాసమునకు." హర. ౨, ఆ. ౧౪౧.

నాణ్యము = నాణెము. (బ్రౌ. వా)

నాతము. దే. వి. బత్తెము. "ఉ.. కొల్చిన పేదసాదలన్, దప్పనిచేతనాతములఁ దప్పుట భూమణ ముర్వ్యుఁ బత్త్రికా." రా. వి. ౨, ఆ. ౩౪.

నాతి. దే. వి. 1. స్త్రీ. "క. క్షాతులపోరితమును గో, వ్రాతమునాక్రమము విప్రవర్గముచనవున్, నాతులఁ గాఠించుటరయుము, ప్రీతిం జననిచ్చునతని పెం పొప్పు నృపా." భార. ఉద్యో. ౨, ఆ. ౭౩. చూ. సం. భార. ఉద్యో. ౩౬, స. ౬౧, అను. ౫ ఆ. ౪౨; 2. భార్య. "క. అతఁడు పుష్కరిణి యను, నాతిక్ వీరణసమాఖ్యనందనుఁ గనియెన్." హరి. పూ. ౧, ఆ. ౬౧; 3. కన్య. "గీ. సాత్త్విక స్వేదమకరందసహిత మయిన, హారికరాబ్జంబు ధారోదకాభిషిక్త, మగుచు నాత్మకరస్పర్శ నతిశయిల్ల, నాతి రవి యిచ్చె బ్రహ్మార్పణమ్ముటంచు." కాళింది. ౫, ఆ. ౧౧౭.

నాతుక = నాతి. (నాతి+ఉక-స్వార్థమున.) స్త్రీ. "ఉ. తాతరపేరు చెప్పి రథసంబునఁ దల్లియుఁ దానుఁ గూడి యా, నాతుక త్రోవ చూచుచు గమనంబునకుం జని... అవశీకృతమానసయై వడంకుచున్". భో. ౨, ఆ. ౨౭౬. ఆం. భా ద్వి. ౨౦౭. [ముకుఁద్రాఁడు.

నాథము. సం. వి. అ. పుం. (ఎద్దు ము. వాని)

నాథుఁడు. సం. వి. అ. పుం. 1. స్వామి, యజమానుఁడు; 2. భర్త, పెనిమిటి; 3. ప్రభువు, ఏలిక; 4. ఇంద్రుఁడు.

నాదనామక్రియ. సం. వి. అ. స్త్రీ. ఒకానొక రాగము. (సంగీ.) "సీ...శంక, రాభరణము మోహనరంజి తోడి వరాళి నాదనామక్రియ నాట..." హంస. ౫, ఆ. ౧౨౪.

నాదము. సం. వి. అ. పుం. 1. ధ్వని, మ్రోఁత; 2. ప్రణవనాదము, ప్రాణవాయువు నాడుల యందు సంచరించుటవలనఁ గలిగినధ్వని.

నాదారు. దే. విశే. (హిం. నాదార్.) 1. లేద, దరిద్రుఁడు. (వా.); 2. చిక్కినవాఁడు, కృశించినవాఁడు. (వా.)

నాదించు. సం. అ క్రి. మ్రోఁగు, నాదముచేయు, "గీ. గంట నాదించినవిధాన గండుతేఁటి. మొఱయుచుండగాన..." శకుం. ౫, ఆ. ౫౩.

నాదు. వై. వి. (సం. నాదః) ధ్వని, చప్పుడు. "గీ. నాదు మొలనూలిగంటలనాదు వినక, చంట నీయుర మూఁచక చంట దగుసె." సా. ౨, ఆ. ౯౪. శకుం. ౫, ఆ. ౫౩.

నాదుకొను. ద్వి అ. క్రి. (నాదు+కొను.) ధ్వని చేయు. (చూ. నాదుకొల్పు.)

నాదుకొల్పు. ద్వ. స. క్రి. (నాదుకొను ధా.)(విరంగులు తోసికువానిని) ప్రేల్చు. ధ్వనింపఁజేయు. "మ. జిగిసీ దీర్చి ఫిరంగుదారులు సముత్క్షిప్తాంశుకస్తోములై, యనలజ్వాలలు కోలల న్గమిచి పోపోరాదు ముట్టింగఁ ద, ద్ఘనవప్రోదకవాట పాటనకళాగాఢోద్వము ల్లత్స్యదృష్టిని యొక్కుమ్మడి నాదుకొల్పిరి దిశాశ్రేణుల్ కదుం బెగ్గలన్." రంగా. ౩, ఆ. ౫౩.

నాదేయము. సం. వి. అ. పుం. 1. బెల్లం, కాశము; 2. కైవడిముస్తె; 3. వానీరము, ప్రబ్బ. న. 1. సైంధవలవణము; 2. సౌవీరాంజనము. విశే. (అ. ఈ. అ.) 1. నదీసంబంధమైనది; 2. నదియందు పుట్టినది; 3. గ్రహింపఁదగనిది; 4. అదేయముకానిది, ఇయ్యఁదగినది.

నాదేయి. సం. వి. ఈ. స్త్రీ. 1. తక్కిలి; 2. నీరుప్రబ్బ; 3. నేలనేరేడు; 4. నారింజ; 5. దాసనము; 6. కాకినేరేడు.

నాధము. సం. వి. అ. పుం. ముకుఁద్రాడు.

నాధుఁడు. సం. = నాథుఁడు.

నాన. వై. వి. (సం. జ్ఞానమ్ క. త. నాణ్.) 1. సిగ్గు, లజ్జ. "ఉ...నలినాననన గోలతనాన నేల లో, నానఁ బలంబు నీకు మరునాన సుమీ విడు నాన యింకిటన్." విజ. ౨, ఆ. ౨౬. ఆం. భా. ప్ర. ౧౩౨; 2. సంకోచము, ముడుదీరుట. "ఉ.వలబుఁ దనర్ నిరాటుకడ వంటలవాఁ డయి భీముఁడున్

బ్బ,హన్నుల యున నాఁడు పేడి వయి నాన యొకింతయు లేక నీవు స,గ్గల మగుధైర్య మొంది..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౦౦. భార. ఆది. 3, ఆ. ౧3౮; 3 అవమానము. "ఆ. పట్టువస్త్రముచ్చుపగిదిఁ బాంచాలభూ,నాయ కుండు దనకు నాన చేటు,రాక కప్పులించి..." భార. ఉద్యో. ౪, ఆ. 3౭౨. ౪, ఆ. ౨౪౦.

నానఁబ్రాలు. దే. వి. (నాను+ప్రాలు.) 1. నాన బియ్యము "గీ ..అర్ధ్రితండుల మ్మమరు నాన,బ్రాలు నాఁగ..." ఆం. భా. ద్వి. ౨౫3; 2 భక్ష్యవిశేషము. "చ. కొబ్బెరపప్పు నానఁబ్రా, లడుకులు దేవపండులు .. నీ కొసంగెదన్." చెన్న. 3, ఆ. ౮3, కాశీ ౭, ఆ. ౧౭౫.

నానగండ. వై. విశే. (నాన+గండ.) సిగ్గుమాలిన వాఁడు. "చ . వీకరా,గుల వని విఱ్ఱవీఁగెదరు కొందఱుబోదలు నానగండలై." పాండు. ౫, ఆ. ౧౭౨ పారి. ౫, ఆ. ౨౦.

నానబియ్యము దే. వి. (నాను+బియ్యము.) నానఁబ్రాలు. (శ. ర. వా.)

నానా. సం. అవ్య. (తెలుఁగున సిద్ధసమాసపూర్వ పదముగానే యుండును.) 1. అనేకము. 'క. నానావిధ పాకములుగ, నానాలుఁగఁ జేసి..." హర. ౨, ఆ. ౧౨౨; 2. వివిధము, పెక్కుతెఱఁ గులు కలది. వి. ఆ. స్త్రీ. 1 సరస్వతి; 2. తల్లి, జనని; 3. కూఁతురు.

నానాఁడు. దే. అవ్య. నాఁడునాఁడు ప్రతిదినము "క ..ఇది, నానాఁటి కనంత నాంచనంబులు గురి యుఁన్."వసు. 3, ఆ. ౧౨, కాశీ. ౧, ఆ. ౧౧౫.

నాను. దే. అ. క్రి. తడియు, ఆర్ధ్రమగు. "ఆ. తడిసి నాని నవఁగఁ దనరు నార్ద్రిం బయ్యె ననుట నాఖ్య..." ఆం. భా. తృ. ౯౧, ఆము. ౪, ఆ. ౧౨౬; 2. చిరకాలము తడియు. "శా. దాన త్యాగపవిత్రమై దోలుపవిత్రం బంబుధారన్ వదా, నానందల్పికకీర్తిహాంపి చను మింటన్..." ఆము. ౨, ఆ. ౪౨. భా. రా. కిష్కిం. 3౯3. 3. ఇంకు, ఇగురు. "సీ. చిట్టాముదమ్మున లిర వంటి నును మేన వాన మానియు నించి నలుఁగు పెట్టి." ఇందు. ౨, ఆ. ౧౫, వి. స్త్రీ. కంఠభూషా విశేషము. "సీ..,కంఠభూషావిశేష. గీ. మాను గులికంటు మెడనూలు నాను తీఁగె, కంటసరి కంటె యుం చనఁగాను..."ఆం. భా. ద్వి. ౧౪౭.

నానుకోల్లు దే వి. బ. (నాను+కోల్లు.) స్త్రీలకంఠా భరణవిశేషము. (వా.)

నానుగ్రోవి. దే. వి. (నాను+గ్రోవి.) కంఠాభరణ విశేషము. (శ. ర.)

నానుచు. దే. స క్రి. (నాను ధా. ప్రే.) నానఁజేయు, చిరకాలము తడుపు. "గీ. అలరుఁదేనియ నానిచి మొలక గట్టి, శర్కరాబీజములు సుధాశాద భూమి, భావజుఁడు విత్త మొలచినవైరుపేర, వెదవిలాసంబు పూఁబోఁడి పెదవి పదవి." పాండు. 3, ఆ. ౧౯౧. శేష. ౪, ఆ. ౫3.

నానుచుట్టు. దే. వి. (నాను+చుట్టు.) స్త్రీకంఠాభరణ విశేషము. "సీ...పన్నకాటుకరేకలు నాభి నామంబులు నానుచుట్టు." శుక. ౨, ఆ. 33౨.

నానుడి దే. వి. (నాను+నుడి) 1. జనశ్రుతి, కిం వదంతి. "సీ. నానోడి నాఁగను నానుడి నాఁ గను నబ్బు నాఁగను జనశ్రుతి దనర్చు." ఆం. భా. ప్ర. ౧౧౨; 2. సామెత, లోకోక్తి. "చ . వింటలేడ యుం,ట గెలిచి రచ్చ గెల్వ మను నానుడి నానుడి నానుడి నానుఁడీ జాడన్." సా. ౨, ఆ. ౨౫౯. భో. ౮, ఆ. ౭3.

నానుడు. దే. విశే. తడిసినది. ఉదా:—నానుడు నేల. (శ. ర.)

నానుడువాన. దే. వి. (నానుడు+వాన) విడువక కురిసెడిపాడిపాడిచినుకులవర్షము. (శ ర.)

నానుపు. దే. స. క్రి. (నాను. ధా. ప్రే.) చలువ చేయు. (శ. ర)

నానుపుఁగొండ. ద్వ. వి. (నానుపు+కొండ) హిమవ త్పర్వతము. "వ.నానుపుఁగొండరాచూలివాలిక చూపునివాళికలు దనరె......" కాశీ. ౪, ఆ. ౧౨౪.

నానుపుడు. దే. వి. నాప్పుట. (వా.)

నానుబోర. దే. వి. మాంసము కలతొ్ప్పు. (శ. ర.)

నానోడి = నానుడి ఆం. భా. ప్ర. ౧౧౯.

నాప్పు = నానుచు. (ఎక్కువగా తడుపు) "చ... గొడుగుల గాలిఁ దూల్చి కుటిలోలలతోడన పాఱ నాన్చి చేఁద్పడ జడిమేఘుఁడు..." ఆము. ౪, ఆ. ౧౨౯.

నాస్తి. దే. వి. జంటికలు ఒత్తుచున్నప్పుడు జారెడి పిండికారు. "మ. పొలంతీ చూచితె లేటి తెక్కరవ గాడ్పుంబోద లేదాటు జోకలచే జాణమెఱుంగుల బుప్పొడుల రేకల్ మిాంజె గుత్తంబులై, యలరుం బెజ్జపు మ్రానిజంటికలఁ జెన్నా రెం బసీదేవతా, కలకంఠిమణు లొత్తునాస్తి కరికిన్ గన్పించు గావింపుచున్." చంద్రా. ౪, ఆ. ౨౦౯.

నాస్పు = నాన్పు. (నానఁజేయు, తడుపు) "క. నిను బాసి నిముసమైనను, వివు జీవము పట్టఁ జాల విప్రోత్తమ నీ నెనృతంబు పలుక నిజ మిది, నను బ్రీతి పరింపు కరుణ నాన్పు మనంబున్." మార్క. ౪, ఆ. ౭౮౭. ఆము. ౨, ఆ. ౭౧; 2. క్రొత్తబట్టలు చలువచేయు. (బ్రా.)

నాప = నాగప్పు. (చూ. నాపసాని.)

నాపపుత్తికదంట. ద్వ. వి. శివుఁడు. వేంక. దేవ. ౫.

నాపసాని. వై. వి. (నాప+సాని) నాగవల్లి నడపెడి ముత్తైదువ. "సీ. కెలయు విద్యాలంది పీడు కొల్ల గుడిచి నరఁ బువుల్ ముడిచిన నాపసాని." కళా. ౩, ఆ. ౮౩. ఆం. భా. ద్వి. ౧౦౮.

నాపితుఁడు. సం. వి. అ. పుం. మంగలవాఁడు

నాపిత్యము. సం. వి. అ. న. మంగలవృత్తి

నాభజావళి. దే. వి. గీతవిశేషము. "క. క్రమ మెఱుంగ నాభజావళి, గమకముగా శుద్ధసాళగములను సంకీర్ణము లొగిఁ బుంభంపగ మంద్రము మధ్యమ తార మత్యుదారత మిాఱన్." సమీర. ౬, ఆ. ౨౦౫.

నాభి. సం. వి. ఇ. పుం. ఇ, ఈ. స్త్రీ. బొడ్డు. ఇ. కస్తూరి, మృగనాభి. ఇ. పుం. 1. బండికంటి నడిమిరూము; 2. వృక్షవిశేషము; 3. బొట్టు, తిలకము. "ఉ. ఆనవలా యలంతిపసు పాడి దుకూలముఁ దాల్చి గుబ్బచన్, గోనలఁ దావు లుప్పతిలఁ గుంకుమ రేటల విగ్గ దేఱఁ గప్రానన నాభిఁ దీర్చి..." ఆము. ౫, ఆ. ౧౯; 4. నడిమి చోటు, మధ్యభాగము; 5. క్షత్రియుఁడు; 6. చక్రవర్తి. విణ. (ఇ.) శ్రేష్ఠుఁడు.

నాభిక. సం. వి. అ. స్త్రీ. 1. బొడ్డువలె నుండు రంధ్రము; 2. మాచెరుకీ.

నాభిజుఁడు. సం. వి. అ. పుం బ్రహ్మ. (ఇట్లే నాభి జన్ముఁడు. మొ.)

నాభియాలము. సం. వి. అ. న. పౌత్తికము.

నాభిలుఁడు సం విణ. (అ. అ. అ.) పెద్దబొడ్డు కలవాఁడు.

నాభీలము. సం వి. అ. న. 1. కష్టము; 2. పెద్ద బొడ్డు; 3 కస్తూరీపరిమళము.

నామకము. సం. వి అ. న. నామము, పేరు. "సీ ..వాను, దేవాశ్రయుఁడు వానుదేవపరా యణుఁడుకునను మర్త్యుఁ డద్వినుకనామ. అ. కము సుమన్యసించి కల్మషంబుల నెల్లఁడొలఁగి .. బ్రహ్మపదము నొందు."భార.అను ౫, అ. ౩౭౩.

నామకరణము. సం వి. అ. న. 1. పేరుపెట్టుట, 2. బిడ్డలకు పేరుపెట్టుటకు చేయుసంస్కార విశేషము.

నామకుఁడు సం. విణ. (అ. మి గా. అ.) 1. వంగు వాఁడు; 2. వంచువాఁడు; 3. నమస్కరించు; 4. ప్రసిద్ధుఁడు

నామగుంట ద్వ. వి. (నామ+గుంట.) గళగర్తము. (శ. ర.)

నామధేయుఁడు. సం. = నమ్ముఁడు

నామమడఁచు. మి. స. క్రి. (నామము+అడచు.) పేరులేకుండఁ జేయు, చంపు. "అ ..వేణి యొక్క దొడ్డవిల్లు రయము, మెఱయఁ గొని యతండు మెఱుఁగులు గిరికొను నాగసమున వారి నామమడఁచె." భార. ద్రో. ౪, అ. ౧౨౪. భార శా. ౨, అ. ౩౭; 2. నాశముచేయు. "గీ. ఏడుకూరుతరథంబుల నేపుమాపె, నకులుఁ డప్పుడు మున్నాటి నామ మడఁచె, నతనియను జుండు..." భార విరా. ౩. అ. ౭౧౩.

నామమణఁగు మి అ. క్రి. (నామము+అణఁగు) చచ్చు, మరణించు. "గీ. సీనవహోదరి నని శెప్ప సీసుతోడ, నుతుక నన్నొకఁ డిట్టెయఁ బజచి నామ, మణఁగ కున్నాఁడు నేఁడు .." భా. రా. అర. ౧, అ. ౭౬౩.

నామము. ఉభ. దే. వి. (క. నామ. త. నామం.) బొట్టు, తిలకము. "గీ బదిరలుసు గొప్పవల యును బడఁతి రొూద్దు, దిద్దఁ గస్తురినామంబు దీర్చ నోర్తు." య. ౪, అ. ౯౦. చంద్రా. ౪, అ. ౨౬౭. సం వి. న్. న. 1. నామధేయము, పెట్టినపేరు; 2 ప్రాతిపదికము, 3. వాచకము, ఒకవస్తువునకు జనులు వాడుకొను పేరు.

నాయకుఁడు. సం. వి. అ. పుం. 1. ప్రియుఁడు, భర్త; 2. ప్రభువు; అధిపతి; 3. శృంగారరసాలంబన పురుషుఁడు. (వీరు మువ్వురు: పతి, ఉపపతి, వైశికుఁడు. అందు పతి అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని నలుతెఱఁగులవాఁడు; 4. సాధారణ నాయకుఁడు. (అలం. వీరు ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు అని నలువురు.); 5. సేనాధిపతి. విణ. (అ. యిక. అ.) 1. పొందించువాఁడు, ప్రాపకుఁడు; 2. నడుపువాఁడు; 3. ముఖ్యుఁడు, ప్రధానుఁడు; 4. శ్రేష్ఠుఁడు

నాయన. దే. వి. (నా+అన.) తండ్రి, జనకుఁడు. "సీ. అబ్బ నాయన యయ్య యనఁ దండ్రి యన నప్ప యన జనకాఖ్యకా నగువేళ." ఆం. సం. మాన 3. భార. ఆది. ౧, అ. 3౬౨. వా? 2. ఇది వాత్సల్య సంబోధనమందును సంబోధ్యశబ్దమునకు మాఱుగాను ప్రయోగింపఁబడును. (శ. ర. వా.)

నాయము. ఉభ. వై. వి. (సం. న్యాయః. క. నాయ.) పాడి, ధర్మము. "చ...భవదీయ సంగమం, బతిశయముఁ గోరుచుం దగఁ బ్రియంబున వచ్చితి నేను గోరఁగా, నను జనయిత్రి వంచు నొకనాయము బల్కెడు వక్రభావలన్." భార. అర. ౧, అ. 3౬౨. నైష. ౪, అ. ౫౯. విణ. న్యాయయుక్తము. (వ్యవ.) సం. వి. అ. పుం. 1. నడపుట; 2. పొందించుట; 3. ఉపాయము; 4. నీతి, నయము.

నాయి. ఉభ. దే. వి. (క. నాయి. త. నాయ్) కుక్క. "గీ .. దొంతులు నేరి నాయి, దోర్వ నేర్చుఁ గాకది యేమి నేర్వ నేర్చు." కు. సం. ౧, అ. ౨౫. సం. వి. ఈ. స్త్రీ. దిక్కు.

నాయిక. సం. వి. అ. స్త్రీ. 1. భార్య 2. రాణి, ప్రభ్వి; 3. శృంగార రసావలంబనస్త్రీ. (ఈమె స్వీయ, పరకీయ, సామాన్య అని మూఁడుతెఱఁగులది. అష్టవిధనాయికలు:—స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.)

నార. దే. వి. 1. వల్కలము, నారబట్ట. "ఉ. నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో, భారమునం గృశుం డయినబ్రాహ్మణుఁడు. .." భార. అర. ౨, అ. 3౬౬. ఆం. భా. ప్ర. ౧3౧; 2. చెట్లపైచర్మము. "క. వీరుద్ద్రుమంబున పైకొన, పై రవిపతి యేయు దుష్ప్రహారితద్యుతిఁ బైపై నాకసముఁ బొటమరించిన, నారసములవెంబన లసంగ నవ లవి మించెన్." ఆము. ౪, ఆ. ౧౧౫, పచేల. ౨, ఆ. ౪3; 3. తాటిపట్ట, జనుమునాఱు. వాని తడప. "క... పనికిఁ దలఁగు లపురించుచునై, నారలు గావలె నవి..." శుక. ౨, ఆ. 33౮. శివ. సా. ౧౯3.

నారంగము. సం. వి. అ. పుం. నారింజచెట్టు. న. 1. పిప్పలిరసము; 2. ముల్లంగిచెట్టు; 3. నారింజపండు.

నారంగుఁడు. సం. వి. అ. పుం. 1. విటుఁడు; 2. కవల పిల్లలలో నొకఁడు.

నారకము. సం. వి. అ. పుం. నరకము. విణ. (అ. ఈ. అ.) నరకసంబంధమైనది.

నారకీయము. సం. విణ. (అ. ఆ. అ.) నరకసంబంధి.

నారచీర. ద్వ. వి. (నార+చీర.) నారతో చేసినబట్ట. "సీ రంగారుబంగారు చెంగావులు ధరించు శృంగారవతి నారచీర లూనె." ఉ. రా. ౬, ఆ. 3౨౦. (ఇట్లే నారబట్ట.)

నారకొల్ల. దే. వి. (నార+కొల్ల.) మత్స్యభేదము. "ఆ. చీరచింపు కొల్ల నారకొల్ల...బంటు వారి కొల్లఁ బంచి యిచ్చె." ద్వా. ౧, ఆ. ౨౪౦.

నారట్టము. సం. వి. అ. పుం. బీఁటికనేల. (శ. ర.)

నారణపక్కి. వై. వి. (సం. నారాయణపక్షి.) పక్షివిశేషము. (శ. ర.)

నారదబ్బ. దే. వి. (నార+దబ్బ.) 1. నారంగముచెట్టు. "సీ...నారదబ్బనఁగ నారంగాభిధానమై ప్రబలుచుండు." ఆం. భా. ద్వి. ౪౬; 2. ఒకదినుసుదబ్బచెట్టు. (శ. ర. వా.)

నారదము. సం. వి. అ. పుం. 1. నారంగము, నారింజచెట్టు. "రగడ. తనుమధ్య దగె నారదముల నీపఖరములు ఘనపరంటకకంటకములు చానఖరములు." ఉ. రా. ౬, ఆ. ౬౧. ద్వి. పరమ. ౪, ఆ. ౨౬౫; 2 పర్వతవిశేషము. "వ ఇవ్విధంబున వసుదేవనందనుండు సేమును...నారదంబుఁ బరిభ్రమించి ...హిమాచలం బెక్కి హేమకూటంబు ద్రొక్కి నిషధం బతిక్రమించి నిమిషంబున." ఉ. హరి. ౧, ఆ. 3౭.

నారదుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకదేవర్షి. విణ. (అ. ఆ. అ.) 1. జ్ఞానమునిచ్చువాఁడు; 2. కలహమిచ్చువాఁడు.

నారపాదు. దే. అ. క్రి. (నార+పాదు.) (భేదా దికముచే) కట్టుబట్ట తొలఁగు. "పంచచామరము. అలంకులయ్యు కూర్మమస్తకాదు లైనవోదు ల, బ్బలారివెన్ను చూచి నారపాదివాఁడె కాని కేఁ, డలంఘ్యబాహాంకక్రిఁ దావకాజిలోన నంచు..." కళా. ౨, అ. ౧౨౬.

నారమడి. దే. వి. (నార+మడి.) నారతో చేసినబట్ట. (శ. ర. ఇది మడికి పనికివచ్చును. వా.)

నారము. సం. వి. అ. పుం. 1. జలము; 2. అప్పుడు పుట్టినదూడ, తర్ణకము. న. 1. నరులసమూహము; 2. జ్ఞానము విణ. (అ. ఆ. అ.) నరసంబంధమైనది.

నారళ్లు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ... వెన్న ముద్దలు దాళువాలు నారళ్లు రామబాణాలు .." ప్రబంధ. ౧౧౨.

నారసము. వై. వి. (సం. నారాచః.) 1. శరము, బాణము. "క. చేరి వికర్ణునికరి నొక, నారసమునఁ గూల్చి కడిసి నరపతి నొంచెన్." భార. విరా. ౫, అ. ౨౯౬. భార. భీష్మ. ౨, అ. ౩౬; 2. బాణ విశేషము. అచ్చయినుపబాణము. "వ... శరంబుల శిరంబులఁ ద్రుంచియు... నారసంబుల నీరసంబులు చేసియు .." విక్ర. ౪, అ. ౯౦, ఉ. రా. ౩, అ. ౩౫౪; 3. చోరసాధనవిశేషము. "చ. కొంకి నారసము సాదిగఁ గల్గినసాధనంబు ల, న్నియుం బమకూరఁ జేసికొని సేర్పున నేగిలి ముచ్చుప్రొద్దునన్." దశ. ౯, అ. ౬౨.

నారసింహుఁడు. సం. వి. అ. పుం. నరసింహావతారము ధరించిన విష్ణువు.

నారాచము. సం. వి. అ. పుం. 1. బాణము; 2. ఇనుపబాణము; 3. గంటము, తాటియాకులమీఁద వ్రాయుసాధనము; 4. సీటిమేనుఁగు; 5. దుర్దినము

నారాజి=నరాజి. (కత్తి, ఖడ్గము.) "శా. ఘోరాజిం దనతేజిఁ దోలి విముఖక్షోణీశ లాధీశులన్, నారాజిం దెగటార్చి వీరభటసన్నాహంబుతోఁ జేరు..." బహు. ౧, అ. ౫౧, చంద్రా. ౨, అ. ౬౯.

నారాయణగౌళ. సం. వి. ఆ. స్త్రీ. ముప్పదిరెండు నపుంసకరాగములలో నొకటి. "సీ. గౌళ నారాయణగౌళ వసంతవరాళి పున్నాగవరాళి శంక; రాభరణమును..." ప్రబంధ. ౯౬, హంస. ౫, అ. ౧౨౪.

నారాయణపక్షి. సం. వి. న్. పుం. పక్షివిశేషము.

నారాయణము. సం. వి. అ. న. 1. ఒకానొక తైలము; 2. తైత్తిరీయోపనిషత్తులలో కడపటిది.

నారాయణి. సం. వి. ఈ. స్త్రీ. 1. లక్ష్మి; 2. దుర్గ, పార్వతి; 3. శక్తి; 4. ఒకానొక స్త్రీరాగము. "గీ... నారాయణియును, గ్రమత నిరువదినాల్గు స్త్రీరాగములును" ప్రబంధ. ౯౫, హంస. ౫, అ. ౧౨౩.

నారాయణీయము. సం. విణ. (అ. ఆ. అ.) నారాయణ సంబంధమైనది

నారాయణుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు. "క. నారము లనఁగా జలముల పేరయనం బనఁగ నెలవు ప్రీతిగ నాకున్, నారము లయనం బగుటను, నారాయణుఁ డండ్రు జనులు నన్నుఁ గిరీటీ." భార. శాం. ౬, అ. ౪౨౧; 2. నారాయణఋషి. (నరనారాయణులలో నొకఁడు.)

నారాశంసము. సం. వి. అ. పుం. 1. మంత్రభేదము; 2. పితృదేవతలసోమపానార్థమగు చమస పాత్రము; 3. అగ్ని, నిప్పు.

నారాశంసులు. సం. వి. అ. పుం. బ. పితృదేవతలు.

నారి. ఉభ. వై. వి. (సం. నాడీ. క. త. నారి.) వింటి యల్లెత్రాడు. "గీ. అపుడు విల్లెక్కుపెట్టి వాలారు దూపు, నారిఁ గూర్చి నిశాచరనారిఁ గూర్చి, కాఁడనేసెఁ దదీయవక్షస్థలంబు, రాఘవుఁ డమోఘతరశరలాఘవుండు." రామా. ౪. అ. ౩౩, అం. భా. ద్వి ౨౦౧; 2. నరము. (చూ. నారి కుఱుపు.) సం. వి. ఈ. స్త్రీ. 1. మానవస్త్రీ, ఆఁడుది, 2. భార్య. "సీ. తా నారి యై యుండఁగా నజుం డాత్మజఁ గవిసె భారతిసేర్పుకలిమి యొంత." కు. సం. ౭, అ. ౧౨౫. [(వా.)

నారింజ. వై. వి. (సం. నారంగః.) నారంగముచూ.

నారికడము. వై. వి. (సం. నారికేళః.) 1. కొబ్బెర చెట్టు. "గీ. నారి కడవరుసలు నారికడములిదె, కేయఁ దలఁచె దేమొ చిగురువాలు, శంబరా సురారి జళిపించుచున్నాఁడు, తగుచు నీకు డాఁగఁ దలపరెదుట." సాంబో. ౪, అ. ౨౧౬; 2. కొబ్బెరకాయ. (చూ. నాల్కడము.)

నారికాయ. ద్వ. వి. (నారి+కాయ.) అల్లెత్రాటి తాఁకుడువలన చేతులయందు కలిగెడు కాయ, కిణము. (శ, ర.)

నారికుఱుపు. ద్వ. వి. (నారి+కుఱుపు.) నరముమీఁద పేసెడికుఱుపు, నాడీవ్రణము. (శ. ర. వా.)

నారికేడము. వై. వి (సం. నారికేళః.) కొబ్బెరచెట్టు. "చ .....అరుణంపు బొండ్లములనారికేడంబులు వ్రజకుట్టిమంబులగుచుఖమం పెలంగుభవనావాప్రకత్నశరత్నరచకరత్నరక, భృంగకరుసంకలిం బ్రథమభార్యేఁబురిం గిరవ్రంతి వార్ధి నాన్." ఆము.౧, ఆ. ౫౪, అచ్చ. సుం. ౨౫.

నారికేళము. సం. వి. అ. పుం. కొబ్బెరచెట్టు.

నారుదు. దే. స. క్రి. నాఁటఁజేయు. (శ. ర.)

నారువ. దే. వి. వృక్షవిశేషము. "సీ నారువ సుర పొన్న వారిజమును బొన్న కల్లి మూలుగుబిల్లు కమిలియడుగు" హంస. ౪, ఆ. ౧౧.

నాఱు. దే. వి. నాటుటకై విత్తనములు ఒత్తుగా చల్లి మొలిపించిన మొలకలసమూహము. "సీ. కల్ప వృక్షమునాఱుకై పడి యున్నది..." శ్రీరాధా. ౩, ఆ. ౫, ఆం. భా. ద్వి. ౩౫.

నాఱుపోయు. దే. అ. క్రి. (నాఱు+పోయు) నాటుటకై ఒత్తుగా విత్తనములు చల్లి మొలకలు మొలిపించు. "ఉ...కత్తరా, వల్లికతోన మైంబులకవర్గము కాముఁడు నాఱుపోయఁగన్." నిర్వ. ౮, ఆ. ౩౧, భార. విరా. ౨, ఆ. ౫౨. (ఇట్లే: నాఱుపోయు. శివరా. ౧, ఆ. ౩౫.)

నాలవకాలము. ద్వ. వి. (నాలుగు+కాలము.) చతుర్థకులము, శూద్రజాతి. "సీ. కోయల నాలవ కాలముదాయాదుల కేలుకోఁ జెగురాకు సేల యొసఁగు." కువల. ౩, ఆ. ౯౬.

నాలవకాలమువాఁడు. ద్వ. వి. శూద్రుఁడు. "సీ. శూద్రనామంబులు శోభిలు నాలవకాలమువారలన గాపులని పల్కి..." ఆం. భా. ద్వి.౨౮౨. (ఇట్లే నాలవజాతివాఁడు. భార. విరా. ౧, ఆ. ౨౧౮.)

నాలవవాఁడు. దే. వి. (నాలుగు+వాఁడు.) 1. చతుర్థుఁడు, నాల్గవవాఁడు; 2. శూద్రుఁడు. "ఉ పాలితసర్వధర్ము కుశుబ్రహ్మలంబునఁ బుట్టినట్టి నాక, నాలవవానిఁ జేయఁ దగునా యనఁబోకు విగీత్యరాశిలో నాలవవాఁడవై బహుధనస్థుఁడవై కుసుమంచు కున్ననిక్, లాలసచేసి ధాత యొక సర్వవిమాన మొసంగి కెండియున్." ఉ. రా. ౧, ఆ. ౨౨౮. (వైశ్యేంద్రధర్ములకు నిది యుదాహరణము.) ఆం. సం. మూల. ౨; 3. నాలుగవతరము వాఁడు. "ద్వి. బ్రహ్మనాలవవాఁడు పరమసాహసుఁడు, బ్రహ్మచే వరములు బడసినవాఁడు." రం. రా. బా. ౨౩. పు.

నాలాయకు. హిం. విశ. తగనిది, లాయకుకానిది.

నాలి. దే వి. అల్పకృత్యము; నీచపు పని. "అ. కూలి నాలిఁ జేసి గుల్లాపుఁబని చేసి, తెచ్చిపెట్టు నాలు మెచ్చ సేర్పు, లేమిఁ జిక్కువిధుని వేమాఱు దిట్టును..." వేమన. ౧, భా. ౬౩, పాండు. ౩. ఆ. ౬౫; 2. కపటము. "రగడ వనలు వేఁడిన మొఱఁగి తప్పుడు నాలి నాలికుచంబు ముట్టకు." పారి ౪, ఆ. ౧౬; 3. పరిహాసము, వేళాకోళము. "సీ. పతిమోమునకుఁ దమ్మి సరియంటిమా భువనంబులో మిగులంగ నాలియయ్యో" చను ౨, ఆ. ౪౯. విశ. 1. కుత్సితము, అల్పము. "గీ. కుటిలవర్తనంపుఁగులమున జన్మించి చెడుగులకును బుద్ధి చెప్పఁ గాని, పుణ్యనిధివి నిన్నుఁ బొందొందుభాగ్యంబు నాలిదైవ మేల నాకు నిచ్చు." మల్హ. ౩, ఆ. ౧౭౮. స్వా. ౩, ఆ. ౫; 2. నిజముకానిది, కల్లరియైనది. "వ...రోద లేనినాలియేడ్పు లేద్పుప్రియల ననునయింప... చెక్కుటద్దంబులు నొక్కి..." స్వా. ౩, ఆ. ౨౮, విప్ర. ౫, ఆ. ౫౫, క్రి. విశ. తేలికగా. "సీ. బ్రహ్మాండ మనుచిప్పఁ బ్రాణికందుకముల నాలి యాడుడు నొంటిప్రేలఁ బట్టి." ప్రబోధ. ౩, ఆ. ౩౮.

నాలిక. దే. వి. జిహ్వ, నాలుక. "వ...నాలికలు పేలికలవిధంబునందూలం మూలుట గనుంగొని .." వై. ౭. ఆ. ౧౦౦. రాజ. చ. ౨, ఆ ౧౪౫.

నాలికచేఱు. ద్వ. వి. (నాలిక+చేఱు.) 1. తృణవిశేషము. (శ. ర); 2. పశువులజిహ్వ రోగవిశేషము. "ద్వి. వరుదకత్నును నీరు నాలిక చేర్లు... అదిగా నెన్నఁగలపసరాలరోగములకు .."నవ. ౧, ఆ. ౩౦.

నాలిగాలి దే. వి. మందమారుతము. "క. అని వనిత నాలిగాలిం, గనలుచు బోనాడి కుహూనకరశిరణఝరిక్, ముదుర్గఁ బరఁ జెలులు గని వా, యని వనరుచు..." వసు. ౪, ఆ. ౫౧. (ఇట్లే నాలి గాడ్పు, నాలితెమ్మెర. మొ.)

నాలితనము. ద్వ. వి. (నాలి+తనము.) నైచ్యము, అల్పత్వము. "ఆ. ఇదియనాకు మీకు విశకేశర

ద్వేషు, హేతు వసుచుం డోఁచె నేకతన్విఘాతి
శరపునేతు ఋష్యకృతులకు నాలి, తనముతో
సమాఖ్య మనుచు బెట్టు." రాఘవ. ౨, ఆ. ౭౩; 2. వంచనము. "గీ. నాలితనములు మానవె నాలి రేయల, యేలవాడుదు చూడుమా యేలలీల." రాజ. చ. ౨, ఆ. ౧౪౩; 3. మాంద్యము. "ఉ. నాలితనంబు నేర్చికొని నక్కుచు నక్కుచు వాదవాద వే లాలవలీలతావలికెలంకులనుం డిటు వచ్చి వచ్చి రంభోరియుం బోతె మీఁదఁ బడి పోయెదు..." రామా. ౭, ఆ. ౪౭ (ఇది రెండవయర్థమునకు నుదాహరణము.)

నాలిబూతము. ద్వ. విణ. (నాలి+బూతము) కుల్పితుడు; కుల్పితురాలు. అం. వం. మాన. ౧౧.

నాలిముచ్చు. దే. విణ. (నాలి+ముచ్చు.) 1. కుల్పితము; 2. మందము. "ఆ. ఆగినమాట యొకటి మెఁగమెట్టకయక యంచలార యూలకించి వినుడు, తెలివి గలుగువారికెలన నుండెదు మీకు, నాలిముచ్చునడక నడక గాదు." చంద్రా. ౪, ఆ. ౫౯. (వైరెండర్థములకు నిది యుదాహరణము.)

నాలుక. దే. వి. 1. జిహ్వ. "మత్తకోకిల. నావుడు న్నఱుమాటలాడఁగ నాలు కాడుకయుండె..." భార. స్త్రీ. ౧, ఆ. ౧౬౫. భా. రా. యు. ౭, ఆ. ౪౨; 2. అగ్నిజ్వాల, మంట. 'గీ. నాలుకల గ్రోయుచర్చునానలము దడిసి, యొరగొనంగని సంతృప్తి యొసక మెసఁగు." భార. ఉద్యో. ౪, ఆ. ౧౨, భార. ద్రో. ౫, ఆ. ౨౫. ౩. సర్పజిహ్వికలు. "గీ. అప్రమత్తుండ వగుచుఁబద్ధాక్షసీవు, బ్రింగుదువు చాల నాఁకట వ్రేగుచుండి, నాలుకలు గ్రోయుభూరిపన్నగముదాకఁ, బడిన రొలుంకను భక్షించుపాడి సనఘ." భాగ. ౪, స్కం. ౭౨౫. భా. రా. యు. ౧౩౭౫.

నాలుకబెల్లము. దే. వి. (నాలుక+బెల్లము.) మాటల తీపి, వాక్మాధుర్యము. "క. వికచమఁబుఁ దగుచు శాస్త్రములకు హీరులగునట్టివారలం గని భూపా, లకు దేర్చకత్తెరయు నాలుకబెల్లమునై మనంబు లం గనవలయున్." భార. శాం. ౩, ఆ. ౨౭౭.

నాలుగు. దే. స. కొ. మూఁడునొకటి. (దీనికివ్యుత్పత్తియందు 'నాలు, నాల్,నలు, నల్'అనురూపములు వచ్చును.) "వ...వది మేదియందుఁ గ్రిక్కిఱియుఁగఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్..." భార. విరా. ౩, ఆ. ౨౧౫. కాశీ. ౫, ఆ. ౩౩౩. విణ. అల్పము, కొంచెము. "గీ. ఎఱిఁగినది నాల్గు నొడువ నెట్లేని లెస్స." ఆము. ౪, ఆ. ౩౭.

నాలుగుమూలలాట. దే. వి. బాలికాక్రీడావిశేషము. "సీ. అచ్చనగండ్లు దోయాలంపు దాఁగిలిమాఁతలు నాలుగుమూలలాట." దశా. ౭, ఆ. ౭౧.

నాలువు = నాలుగు. "క. ధ్రువమండల మొదలగా, రవిమండల మడుగు గాఁగ రాజిలుపదునాలువు లక్షలయోజనముల, భువనము త్రిదివ మిని భోగభూమి నృపాలా." కకు. ౩, ఆ. ౩, విక్ర. ౧, ఆ. ౧౦.

నాల్క = నాలుక. (జిహ్వ.) "గీ నాసికాగ్రంబు వంగుట నాల్క నల్ల, నగుట వదనంబు గడు నెఱ్ఱనగుట ..అయుం వఱచు." మార్క. ౩, ఆ. ౩౫౩. (బ. సర్పజిహ్వికలు) "చ. ఫణాఫలకంబు విచ్చి . మణిమయ పీఠమధ్యమున నాల్కలు గ్రోయుచునున్న వాసుకిన్ .." నైష. ౫, ఆ. ౨౯, హరి. పూ. ౭, ఆ. ౧౦౫.

నాల్కడము = నారికడము. (కొబ్బెరకాయ) "ఉ. అల్లనఁ జేర వచ్చి ధవళాన్నముఁ గమ్మనియాల నేతితో, బెల్లముతోడ నాల్కడపుఁబేనెము తోడను నిమ్మపండ్లతో...ఊర్వశి పెట్టె భిక్షమున్." హర. ౫, ఆ. ౪౩.

నాల్గుకన్నులవేల్పు. దే. వి. అగ్ని. "సీ. నాల్గు కన్నుల వేల్పునకు వేల్పు పెన్నెని చేసి తే లేమియుఁ జెందకున్న." అచ్చ. బాల. ౭౮. పు.

నాల్గుగంటములయాట. ద్వ. వి. బాలికాక్రీడా విశేషము. ఇందు. ౨, ఆ. ౧౪౩.

నాల్నాఁడు. దే. వి- (నాలుగు+నాఁడు.) 1. నాలుగవనాఁడు చేయుపని (ఋతుస్నానము.) "ఆ. కలితకీర్తిశాలి కళ్యపుఁ డొకనాఁడు, మానవతియుఁ జెలఁగుమానీ యనల, నామతీర్థవారి నాల్నాఁడు చేసిన, యుబిదఁ గాంచి భ్రమదిశాత్ముఁ దగుచు." వరాహ. ౪, ఆ. ౩౧; 2. నాలుగవదినము. "గీ..., సవిత్ర్యఁ దుదయించునాల్నాళ్ల జలకమాడి, చూడ వెవ్వారిఁ బురుషునిఁ జూచి కాని." కాశీ. ౨, ఆ. ౭౨.

నావ. ఉభ. వై. వి. (సం. పౌ శ. నావె. ఉ. నావాయ్) ఓడ, కలము. "సీ. ఓడ నావ

యనంగ నొప్పుచుండుఁ దరణి ..” ఆం. భా. ప్ర. ౧౫౬. కేయూర. 3, ఆ. ౧౯౪. సం. వి. ఔ. స్త్రీ. ఓడ, తరణి.

నావాక్రమము. సం. వి. అ. పుం. ఓడకేవు. భార. అర. 3, ఆ. ౯౫.

నావి. దే. వి. సస్యరోగవిశేషము. (శ. ర.)

నావికుఁడు. సం. వి. అ. పుం. 1. ఓడ నడుపువాఁడు, కర్ణధారుఁడు; 2. ఓడమీఁద ప్రయాణముచేయు వాఁడు.

నావుడు. దే. అవ్య. క్రి. (అను ధా.) అనినపిమ్మట. “మత్తకోకిల. ఏమి కారణమయ్య పాముల కేల యల్గితి వీవు తేజోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు నావుడున్...” భార. ఆది ౧, ఆ. ౧౫౪. ఉ. హరి. ౨, ఆ. ౨౨.

నావురు = నాఁగురు. (వృక్షవిశేషము.) “వ ..కమ్మ తావులు కలనావురాకులు వఱచి ..” స్వా. ౪, ఆ. ౬౦. ఆం. భా. ద్వి. ౬౨.

నావ్యము. సం. వి. అ. న. నవ్యత, క్రొత్తదనము. విశే. (అ. ఆ. అ) నావచే దాఁటఁదగినది.

నాశనము. సం. వి. అ. న. 1. నశింపఁజేయుట; 2. కనఁబడకుండఁజేయుట. విశే. (అ.ఆ. అ.) నాశము చేయునది. (అ. ఈ. అ.) నశింపఁజేయుటకు సాధనమైనది.

నాశపడు. మి అ. క్రి. నశించు. (చూ. నాశపఱుచు.)

నాశపఱుచు. మి. స. క్రి. (నాశపడు ధా. ప్రే.) నాశముచేయు “క. పవనజజంఘాసంభవ, పవనము వడిఁ గదలిఁ బాయపడ నడఁచి మహాప్రవర మునకుం జొరఁబడి, పవనాశనకోటి నాశపఱిచి గమించెన్.” రామా. ౬, ఆ. ౯౭.

నాశము. సం. వి. అ. పుం. 1. చేటు; 2. చావు, మృతి; 3. కనఁబడమి, అదర్శనము; 4. పాఱిపోవుట.

నాశయిత. సం విశే. (ఋ. త్రి. ఋ.) నశింపఁజేయు వాఁడు.

నాశితము. సం. విశే. (అ. ఆ. అ.) నాశముచేయఁ బడినది.

నాశ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నశింపఁజేయఁ దగినది.

నాస. సం. వి. ఆ. స్త్రీ. 1. ముక్కు, ఘ్రాణేంద్రియము; 2. ఏనుఁగుతొండముకొన; 3. ద్వారముపై నుండుఅడ్డకమ్మి; 4. ధ్వని, శబ్దము.

నాసత్యులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీకుమారులు, దేవవైద్యులు.

నాసాపుటము. సం. వి. అ. పుం న. ముక్కుచెరము, ముకుపుటము,

నాసామణి. సం. వి. ఇ. పుం. ముక్కఱ. (శ. ర.)

నాసి. దే. వి. పిల్లి, మార్జాలము. (శ. ర.) విశే. నికృష్టము. (వా.)

నాసిక. సం. = నాస.

నాసిక్యము. సం. వి. అ. పుం. అనునాసికధ్వని. న. ముక్కు, నాసిక. విశే. (అ. ఆ. అ.) 1. నాసిక యందు పుట్టినది, 2. నాసికయం దున్నది

నాసిరిల్లు. వై. అ. క్రి. నశించు. (శ. ర.)

నాసిలు. వై. అ. క్రి. నవయు, క్షీణించు. “క. ఈ సరణిఁ గామతంత్రా,భ్యాసపరిశ్రాంతి మిగులఁ బరవశ మైనన్, నాసిలి ధాతుక్షయమై, మానము లోపలన వాఁడు మరణము నొందున్.” వై. ౫, ఆ. ౧౦౮. పి. శకుం. ౨, ఆ. 3౭.

నాసీరము. సం. వి. అ. పుం. 1. ముందు నడుచుసేన; 2. సేనాముఖము, అనికొన. విశే. (అ. ఆ. అ) ముందు పోవునది.

నాసీరుఁడు. సం. వి. అ. పుం. సేనకుముందు నడుచు యోధుఁడు.

నాస్తి. సం. అవ్య. క్రి. (న+అస్తి.) లేదు. “చ. నిలుకడ నున్న వావి నహి వేస్తము నాస్తి భయంబు లేదు ..” శశా. ౪, ఆ. ౧౭.

నాస్తికత. సం వి. ఆ. స్త్రీ. = నాస్తిక్యము.

నాస్తికుఁడు. సం. విశే. (అ. ఈ. ఆ.) 1. పరలోకము లే దనునమ్మకము కలవాఁడు; 2. దేవుఁడు లేఁ డనునమ్మకము కలవాఁడు; 3. వేదప్రమాణబుద్ధి లేనివాఁడు.

నాస్తిక్యము. సం. వి. అ. న. దేవుఁడు లేఁడనియు పరలోకము లేదనియు నమ్ముట, వేదమందు ప్రమాణబుద్ధి లేకుండుట.

నాస్యము. సం. వి. అ. న. (ఎద్దుముక్కునగుచ్చి) ముకుఁ[త్రాడు.

నాహరీగడలు. దే. వి. బ. వాద్యవిశేషములు. “ఉ. ముందఱ నాహరీగడలు మ్రోయఁ భటావళి వెంట నంటె రాజనందిజనమ్ము ప్రస్తి కయివారముఁ జేయఁగ ...” ఉ. హరి. ౪, ఆ. ౧౧3.

నాళము. ఉభ. దే. వి. లాడము, గుఱ్ఱపుగిట్టలకు వేయుఇనుపబిళ్ల. (శ. ర. వా.) సం. వి. అ. పుం.

తామరలోనగువానికాఁడ. న. 1. త్రోవ, గొట్టము; 2. నరము, నాడి; 3. కర్త్రికిడి; 4. రంధ్రము; 5. మగగుఱి. అ. పుం. జలనిర్గమము, నీరుపోవుటకై యేర్పఱచినగొట్టము.' (తూముకాలువ లోనగునది.)

నాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరలోనగువాని కాఁడ; 2. నరము, నాడి; 3. వాకాదినాడి; 4. వృక్షవిశేషము. ఈ. స్త్రీ. 1. (గోఁగు మొదలగు వాని) నార; 2. గడియకాలము; 3. తామరశి; 4. ప్రణాళి, జలనిర్గమమార్గము.

నాళిక. సం. వి. ఆ. స్త్రీ. 1. తామరలోనగువాని కాఁడ; 2. త్రోవ, గొట్టము; 3 గడియకాలము; 4 రంధ్రము; 5. ప్రాయ్యినందు.

నాళికము. సం. వి. అ. పుం. 1. తామరశి; 2. తామర పూవు; 3. మన్ను, మహిమము; 4. పిల్లనఁగ్రోవి, వేణువు.

నాళీకము. సం. వి. అ. పుం. 1. బాణము; 2 బాణపు ములికి; 3. గొబ్బెరచిప్పతో చేసినకమండలువు; 4. ఇనుపబాళము కలఆయుధము. (తుపాకి మొ.) న. 1. తామరపువ్వు; 2. తామరతంపర, పద్మ సమూహము.

నాళీకాసనుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ.

నాళీకిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతంపర; 2. తామరకొలను.

నాళిలు. దే. వి. బ. భక్ష్యవిశేషము. "సీ. ఎడలవెన్నెల చక్కిరిడి కోఁగ్కువెన్నెలఁ బూరిక నాళిలు గాను గూర్చి. గీ. పండువెన్నెల యనువెండిపళ్లెరములఁ, జెలఁగి యిల్లాండ్రు వడ్డింపఁ జెలఁగి దాము వేఁడుకలుం మీఱ బువ్వంపుఁగూడుఁ గుడిచి, పొదలుకమిటోడ వెన్నెలపులుఁగు లమరె." యు. ౨, ఆ. ౮౩.

ని

ని. ఉప. దే. అవ్య. 1. ద్వితీయైకవచనమందు వచ్చెడి ఒక ప్రత్యయము. "ఉదా.—రాముని, కృష్ణుని. మొ; 2. భూతార్థకోత్తమపురుషైకవచనప్రత్యయము. ఉదా.-చూచితిని. మొ; 3. వ్యతిరేకత్వర్థకార్థమున వచ్చుప్రత్యయము. ఉదా.-చేయని, వ్రాయని. మొ; 4. కొన్నిపదములకు ద్వితీయాద్యేకవచనము పరమగునపుడు వచ్చుఆగమము. ఉదా.-రామునిచేత, రామునికి. మొ; 5. గుణవాచక శబ్దకర్మధారయసమాసమందు వచ్చెడి యాగమము. ఉదా.-తెల్లని. మొ. సం. అవ్య. 1. అధికము. అతిశయము. ఉదా.-నిపీతము. మొ; 2. అభావము, లేనిది. ఉదా.-నిర్ధనుఁడు. మొ.

నింకు = ఇంకు. దే. అ. క్రి. నశించు. "ఉ. శంక రయుక్తింత లేక ద్విజసంఘము లెల్లెడఁ గూడి పొరముల్, నింక వడషురీముపు నీరముతో నుపదేశ మొంది .." ఉద్య. 3, ఆ. ౩౧౩.

నింకె. అ. దే. అవ్య. క్రి. విశే. శీఘ్రముగా. (శ. ర. ప్రా.)

నింగి. దే. వి. 1. ఆకాశము, అంతరిక్షము. "గీ. ప్రాద్ధికాకాంత నిండుగర్భంబునందు, సూర్యుఁ డను యింపు బ్రొద్దులు చొచ్చి యుండ, మొదలఁ దీండ్రించు లేకప్రొద్దులకయుండ, నింగి యుంగిలి కాని వర్ణింగ మార్చె." కాశి. ౧, ఆ. ౧౨౪. భార. ఆది. ౭, ఆ. ౨౯౧; 2. స్వర్గము. (చూ. నింగిమ్రాను.)

నింగిచూలి. దే. వి. నభస్వంతుఁడు - గాలి. "గీ... నింగిచూలి మబ్బులపగదాయ గాలి...అన మారుతాఖ్య లగు..." సాం. ని. దేవ. ౧౩.

నింగిపడు. ద్వ. అ. క్రి. (నింగి+పడు.) (సూర్యాదులు) అస్తమించు. "ఆ. సీత నట్లుపేక్షసేసి మిన్నక యుండ్క, నఖిలభూతములకు నధిపునల్కఁ, బట్టవగలు నింగిపడిరియు నా కేసార్కకోంధకార మడల నపుడు కపులు." భా. రా. యు. ౨౪. ఉ. హరి. ౫, ఆ. ౮౪.

నింగిమిరి. దే. వి. సువర్చలశ. (శ. ర. ప్రా.)

నింగిముట్టు. దే. అ. క్రి. (నింగి+ముట్టు.) ఆకసము నంటు, అత్యధికముగు. "వ...రథచక్రఘోషంబులును గేకసటుపటాత్కారంబులు నింగిముట్ట..." శకాం. ౫, ఆ. ౨౧, వరా. 3, ఆ. ౧౦.

నింగిమ్రాను. దే. వి. (నింగి+మ్రాను.) కల్పవృక్షము, సురతరువు. "మ. హరికిన్ జల్లన నింగి మ్రానివిరి చిన్కుల్ దేవతాదుందుభుల్, మొరసెన్..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౯౯.

నింగిసిగ. ద్వ. వి. (నింగి+సిగ.) వ్యోమకేశుఁడు శివుఁడు. "ఉ. క్రొన్నెలతాల్పునింగిసిగపన్ గసుఁగందనిబాలదండయుఁన్." రామా. ౫, ఆ. ౧౭, (శ. ర. పా.)

నించు. దే. స. క్రి. (నిండు ధా. ప్రే.) 1. నిండఁ జేయు, నిండించు. "సీ. సికాకరవలిలంబు నించి

ననకు నింక నూర్జితచరితా." భార. అర. ౭, ఆ. ౩౬౧; 2. వ్యాపింపఁజేయు. "శా. ఆకాశంబు వెలుంగఁ జేఁతె..." రాకాచంద్రదివాకరానల శిఖారత్నప్రభాజాలకే, ఖాకాంతిం బురుషుం డొకం డచట లోకం బెల్ల నిండించినన్, మా కన్నుంగవ రిట్టికూడ మని నమ్మం డాల పర్యోగ్ నృపా." ఉ. హరి ౨, ఆ. ౫౦, 3. నిండఁజేయు, నింపుకొను. "గీ. భూరిరవిరోచిఁ గాలెడు పుడమి నిడఁద, పెనము పైఁ బండువెన్నెలఁ పేరి యట్టు, మంట మీఁటినయాడటు మంటియుం మటి యుం, బొట్ట నిండించె లేఁతనిపుల్లఁగుదుటుము" కాళిందీ ౪, ఆ. ౪౮, విరాహ. ౮, ఆ ౧౮.

నిండు. దే. అ. క్రి. 1. (జలాదులచే) పూర్ణమగు. "గీ తనువున హిమానిలాశ్లేషజనితపులక, రాజ కైతవమున రాగరసము నిండి, ధైర్య మనుకట్ట నగలింప..." దశా. ౩, ఆ. ౧౫, విక్ర. ౧, ఆ. ౯౦; 2. నెఱవేఱు, సఫలమగు. "గీ. అర గించె జతుర్విధాహారములను, మనసుకోరిక నిండంగ మునిగణంబు." కాశీ. ౭, ఆ. ౧౮౭. హరి. ఉ. ౧౦, ఆ. ౧౨౦; 3. అధికమగు, అతిశయించు. "గీ. శారదాదేవి మామకస్వాంత వీథి నిండుకేడుక విహరించుచుండుఁ గాత." నైష. ౧, ఆ. ౫, హరి. ఉ. ౯, ఆ. ౧౦; 4. వ్యాపించు. "ఉ ..దిక్కులం, జిచ్చఱతూపు తండములు సింహరవంబులు నిండె నొక్కటన్." హరి. ౫, ఆ. ౩, దశా. ౨, ఆ. ౨౦౩; 5. (ఆయుఃపు వెం.) ముగియు, మూడు. "సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన విపినారివరుల కాయువులు నిండు." ఉ. రా. ౧, ఆ. ౩౨౪. కాశీ. ౪, ఆ. ౪౦, 6. కడచు, అతిక్రమించు. "మ. నవమాసంబులు నిండఁగా గురుఁడు కేంద్రస్థాయియై యుండఁగా, శివలగ్నంబున నుద్భవించె మఱుఁ దర్పిష్మంతుసంకంబునన్..." కాశీ. ౪ ఆ. ౯; 7. పూర్తియగు, సర్వాంగసంపూర్ణమగు. "గీ. వలపు గలిగిననిండుజవ్వనిని మనిఁ, గలయం గంటెను సౌఖ్యంబు గలదె వేఱె." దశా ౩, ఆ. ౨౪.. భార. ఉద్యో. ౨, ఆ. ౧౫౯; 8. సంతోషించు. (చూ. నిండుకొను.) వి. పూర్ణత. (వా.) విశే. పూర్ణము. (శ. ర.)

నిండుకొను. దే. స. క్రి. (నిండు+కొను స్వార్థమున.) 1. సంతోషించు. "క...నిన్నుం, గనుఁగొంటిం బండు పర్యోఁ గన్నులకును నాయమ మిపుడు నిండుకొనియెన్..." కళా. ౨, ఆ. ౫౦, ఉ. రా. ౧, ఆ. ౧౩౮; 2. అయిపోవు, ఖర్చగు. (వా); 3. వ్యాపించు. "సీ. ప్రేతవనాయాతశిత విభూతినికరంబు చెన్నైన నిండుకొనఁగ. గీ. రుద్రుఁ డేకళ నెలఁగెడు రౌద్రముగను." దశా. ౩, ఆ. ౫౨, భీమ. ౨, ఆ. ౧౦౧; 4. అతిశయించు. "క. గుండియ జల్లన మదిలో, నిండుకొనినభీతి నావిచిర్మలచిత్తుం, డుండక నలుగడలకు నయ్యెండ విడిచి పఱవఁ దలఁచునాసుపయుమునన్." భీమ. ౨, ఆ. (శ. ర.)

నిండుదొర. దే. వి. (నిండు+దొర.) ధీరుఁడు. "క. మండిపడి వీరతల గొట్టుండటు గొనిపోయి నావుదున్ రావణుతో, నిండుదొర తదనుజుం డనఘుండు విభీషణుండు పలికెఁ గోపమడం గన్." రామా. ౬, ఆ. ౨౩౭.

నిండువన్నెలు. ద్వ. వి. బ. (నిండు+వన్నెలు.) వస్త్ర విశేషములు "సీ. నిండువన్నెలు మంచినిగమ గోచరులు సామంతవీథులు ప్రతిమలును బొగడ, పచ్చలును .." ప్రబంధ ౨౭౨.

నింద. సం. వి. ఆ. స్త్రీ. 1. అపవాదము; 2. నిందించుట, గర్హణము.

నిందకుఁడు. సం.విణ (అ. దిశా. అ.) నిందించువాఁడు.

నిందత్. సం. (శత్రు.) నిందించుచున్న.

నిందనము. సం. వి. అ న. నిందించుట, దూఱుట.

నిందనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిందింపఁదగినది, గర్హ్యము.

నిందాస్తుతి. సం. వి. ఇ. స్త్రీ. పైకి నిందవలెఁ గనఁబడు స్తుతి, వ్యాజస్తుత్యలంకారభేదము. (అలం.)

నిందించు. సం. స. క్రి. దూషించు, దూఱు. "వ. ఆ సంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల కాఱిఁగిరయేని." "క. మిండటిభంగిన కాలల,యందుఁ జరింపంగవలదె యది నీవును జేసుం దెచ్చినయాపదగా, నిందింపరె యొల్లవారు నీరజనయనా." భార. విరా. ౨, ఆ. ౧౮౦, ౧౯౧. కాశీ. ౪. ౧౦౯.

నిందిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) = నిందకుఁడు.

నిందితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. గర్హితము; 2. నిషేధింపఁబడినది; 3. నీచము, అధమము; 4. తిరస్కరింపఁబడినది.

నిందితవ్యము. సం. = నిందనీయము.

నింద్యమానము. సం విశే. (అ. ఆ. అ.) నిందింపఁబడుచున్నది.

నింద్యము. సం. = నిందనీయము

నిండాది. దే.విశే. (నిండు+అది) 1. సమృద్ధము. ఉదా: కొలనిలో నీళ్లు నిండాదిగా నున్నవి. (శ. ర.); 2. సుఖితము. (వ్యవ) అతఁడు నిండాదిగా నున్నాఁడు.

నిండారు = నిసుపారు. (శ. ర)

నిండిరి. దే. వి. మలము. "సీ. మలవాచకం బగు మనటు నిండిరి మస్టు..." ఆం. భా. ద్వి. ౧౩౪.

నిండు. దే. స. క్రి. (నిండుధా. ప్రే) 1. వ్యాపింపఁజేయు. "చ...నల్లదలఁ బ్రసూనకోరకనికాయము నిండిన పొంపు పెంపునన్." వసు. ౧, ఆ. ౧౪౭; 2. కలిగించు. "వ...పాదపు కెంపు పొంపు నిండు విడికెంపురవచెక్కడంపుఁ జోఁడిగద్దియ నధివసించి .." దశా. ౧, అ. ౧౪; 3. నిండఁజేయు, పూరించు. "అ ..ఆనంది, రొంచటి కరుగఁబోక రొంటుకునింట, గండకడుగు చేతఁ గడుపు నింపుచుఁ గొంత,కాల ముండె జాతిగతుల సంత." చెన్న. ౨, అ. ౨౭. స్వా. ౪, అ. ౭౨. వి. బలుపు, సమృద్ధి. "సీ. పయ్యెదకొంగులోపలఁ దిక్కటిల్లెడు కెవ్వేఁగుఁ జన్నులనింపుపొంపు. గీ. కలిగి .." కావ్యా. 3, ఉ. ౪౧. విశే. 1. సమృద్ధము, అధికము. "ఉ. నిద్దపుఁ జెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప..." కళా. ౩, అ. ౧౩౭; 2. మనోజ్ఞము. "మ. కలయం గిన్నరగీతిఁ గూడ మృదుకేళం బాడు మత్తాళిమ, తులము ల్గింపురుషాంగనాతతిరొలంగుల్ నించుభావించుమా రొలంగు ల్నింపుగ నిచ్చునీ 'పెలలం..." ప. సం. 3, ఆ. ౧౭.

ంబము. సం. వి. అ. పుం. వేము.

ంబుక. సం. వి. ఊ. స్త్రీ. ఒకజాతినిమ్మ.

కటము. ఉత్ర. దే. వి. (క. నికటము) నిర్బంధము. (శ. ర.) సం. వి. అ. పుం. న. సామీప్యము. విశే. (అ. ఆ. ఆ.) ఆసన్నము, దేశకాలములచే సన్నిహితమైనది.

నికము. తె. క్రి. విశే. యథార్థముగా. "గీ. కీడు సంకల్పకాలంబు దొలఁగఁ దొందు,నికము ప్రస్తావ మును..." అధ్యా. ఉ. ౨౪౬. పు.

నికరము. ఉత్ర. దే. విశే. శ్రేష్ఠము. "గీ. నీవు చదివిన చదువులో నికర మైనపద్య మొక్కటి చదివి యేర్పాటు గాఁగ,నర్థ మెఱిఁగింపుము......" దశా. ౪, అ. ౧౧౯. కృష్ణ. కీ. ౧౪. ఆం. భా. కృ. ౧౫. సం వి. అ. పుం. 1. సమూహము; 2. సారము; 3. నిధి; 4. న్యాయముగా నిచ్చినధనము.

నికర్తనము. సం. వి. అ. న. కత్తిరించుట, ద్రుంచుట.

నికర్షణము. సం. వి. అ. న. 1. ఇల్లు మొదలగునవి యేర్పరింపబడ యున్నప్రదేశము, నివేశనస్థలము; 2. గ్రామకంఠము, పట్టణము పల్లె లోనగువాని బయటిభూమి.

నికష. సం. వి. ఆ. స్త్రీ. రాక్షసమాత.

నికషము. సం. వి. అ. పుం. 1. ఒరయిక,రాపు; 2. గీటురాయి, ఒరగల్లు; 3. కత్తులు మొదలగునవి సానఁబట్టుసాధనము; 4. గీటురాతిపై రాచిన బంగారు మున్నగువానిగీఁత; 5. పరీక్షార్థమై ఒరగంటిపై గీచుబంగారు లోనగునది.

నికషాత్మజుఁడు. సం. వి. అ. పుం. నైరృతుఁ డను రాక్షసుఁడు.

నికషోపలము. సం. వి. అ. పుం. గీటుఱాయి.

నికామము. సం. వి. అ న. తీవ్రేచ్ఛ. విశే. (అ. ఆ. అ.) 1. అధికమైనది. 2. అధికముగాఁ గోరిక గలది క్రి. విశే. 1. యథేచ్ఛము; 2. చాలఁగంత; 3. అత్యధికముగా.

నికాయము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. తెగ; 3. నివాసము; 4. గుఱి, లక్ష్యము; 5. పరమాత్మ.

నికాయ్యము. సం. వి. అ. పుం. ఇల్లు, గృహము.

నికారణము. సం. వి. అ. న. చంపుట, మారణము.

నికారము. సం. వి. అ. పుం. 1. అవమానము; 2. చంపుట, మారణము; 3. బెదరింపు; 4. (ధాన్యాదులను) ఎగురఁబోయుట, తూర్పెత్తుట; 5. ధాన్యము క్రిందుగఁగునట్లు ఎగఁద్రోయుట; 6. పండ్లు కోయుటకు మొదలగువానివలనఁ గలుగునపకారము; 7. అపకారము, కీడు. "క. వారలు సమయము దప్పిన, వారిజరిపుకులగకు అవశ్యము

ననకు నింక నూర్జితచరితా." భార. అర. ౭, ఆ. ౩౬౧; 2. వ్యాపింపఁజేయు. "శా. ఆకాశంబు వెలుంగఁ దోఁచె..." రాకాచంద్రదివాకరానల శిఖారత్నప్రభాజాలకే, ఖాకాంతిం బురుషుం డొకం డచట లోకం బెల్ల నిండించినన్, మా కన్నుంగవ నిట్టిరూప మని నమ్మంజాల వయ్యెన్ నృపా." ఉ. హరి ౨, ఆ. ౫౦; 3. నిండఁ జేయు, నింపుకొను. "గీ. భూరిరవిరోచిఁ గాలెడు పుడమి పెడఁద, పెనముపైఁ బండువెన్నెలపేరి యట్టు, మంట మీఱినయాడుట మఱియు మఱి యుఁ' బొట్ట నిండించె లేకనిపుఁడుఁగుదుటుము" కాళిందీ ౪, ఆ. ౪౮, విరావ. ౮, ఆ ౧౮.

నిండు. దే. అ. క్రి. 1. (జలాదులచే) పూర్ణమగు. "గీ తనువున హిమానిశాశ్లేషజనితపులక, రాజ కైతవమున రాగరసము నిండి, ధైర్య మనుకట్ట నగలింప..." దశా. 3, ఆ. ౧౫, విక్ర. ౧, ఆ. ౯౦; 2. నెఱవేఱు, సఫలమగు. "గీ. అర గింపఁ జతుర్విధాహారములను, మనసుకోరిక నిం డంగ మునిగణంబు." కాశీ. ౭, ఆ. ౧౮౭. హరి. ఉ. ౧౦, ఆ. ౧౨౦, 3. అధికమగు, అతిశయించు. "గీ. శారదాదేవి మామకస్వాంత వీథి నిండుకేడుక విహరించుచుండుఁ గాక." శైవ. ౧, ఆ. ౫, హరి. ఉ ౯, ఆ. ౧౦; 4. వ్యాపించు. "ఉ ..దిక్కులం, జిచ్చఱతూపు టంపములు సింహరవంబులు నిండె నొక్కటన్." పారి. ౫, ఆ. 3, దశా. ౨, ఆ. ౨౦౩; 5. (ఆయుఃప్రా. మొ.) ముగియు, మూఁడు. "సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన దివిజారివరుల కాయువులు నిండు." ఉ. రా. ౧, ఆ. ౩౨౪. కాశీ. ౪, ఆ. ౪౦, 6. కడచు, అతిక్రమించు. "మ. నవమాసంబులు నిండఁగా గురుఁడు కేంద్ర స్థాయియై యుండఁగా, శివలగ్నంబున నుద్భవించె సుతుఁ డర్చిష్మంతుఁ సంకలంబునన్..." కాశీ. ౪ ఆ. ౯; 7. పూర్తియగు, సర్వాంగసంపూర్ణమగు. "గీ. వలపు గలిగిననిండుజవ్వనివి నీవు, గలసుం కంటెను సౌఖ్యంబు గలదె చెలి." దశా 3, ఆ. ౨౪,. భార. ఉద్యో. ౨, ఆ. ౧౫౯; 8. సంతోషించు. (చూ. నిండుకొను.) వి. పూర్ణత. (వా.) విశే. పూర్ణము. (శ. ర.)

నిండుకొను. దే. స. క్రి. (నిండు+కొను స్వార్థకము.) 1. సంతోషించు. "క...నిన్నుం, గనుఁగొంటిం బంతు వయ్యెఁ గన్నులకును నా,మనము నిపుడు నిండుకొనియెన్..." కళా. ౨, ఆ. ౫౦, ఉ. రా. ౧, ఆ. ౧౩౮; 2. అయిపోవు, ఖర్చగు. (వా.); 3. వ్యాపించు. "సీ. ప్రేతవనాయాతకీశ విభూతినికరంబు శాశ్మేన నిండుకొనఁగ. గీ. రుద్రుఁ డేళళ వెలుఁగెడు రౌద్రముగను." దశా. 3, ఆ. ౫౨, భీమ. ౨, ఆ. ౧౦౧; 4. అతిశయించు. "క. గుండియ జల్లన మదిలో, నిండుకొనినభీతి నావినిర్మలచిత్తుం, డుండక నలుగడలకు వ.య్యెండ విడిచి కలువఁ దలఁచునాకుసుయమునన్." భీమ. ౨, ఆ. (శ. ర.)

నిండుదొర. దే. వి. (నిండు+దొర.) ధీరుఁడు. "క. మండిపడి వీనితల గొ,ట్టుండుటు గొనిపోయి నావుడున్ రావణుతో, నిండుదొర తదనుజుం డన,ఘుండు విభీషణుఁడు పలికెఁ గోప మడం గన్." రామా. ౬, ఆ. ౨౩౭.

నిండువన్నెలు. ద్వ వి. బ. (నిండు+వన్నెలు.) వస్త్ర విశేషములు "సీ. నిండువన్నెలు మంచినిగమ గోచరులు సామంతవీథులు ప్రతిమలును బొగడ, పచ్చలును .." ప్రబంధ ౨౭౨.

నింద. సం. వి. ఆ. స్త్రీ. 1. అపవాదము; 2. నిందించుట, గర్హణము.

నిందకుఁడు. సం.విశే. (అ. దిశా. అ.) నిందించువాఁడు.

నిందత్. సం. (శత్రు.) నిందించుచున్న.

నిందనము. సం. వి. అ న. నిందించుట. దూఱుట.

నిందనీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిందింపఁదగినది, గర్హ్యము.

నిందాస్తుతి. సం. వి. ఇ. స్త్రీ. పైకి నిందవలెఁ గనఁబడు స్తుతి, వ్యాజస్తుత్యలంకారభేదము. (అలం.)

నిందించు. సం. స. క్రి. దూషించు, దూఱు. "వ. ఆ సంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల కాళిఁగిరయేని." "క. ముందటిభంగిన కావల,యుండుఁ జరింపంగవలదె యది నీవును నేనుం దెచ్చినయాపదగా, నిందింపరె తొల్లవారు నీరజనయనా." భార. విరా. ౨, ఆ. ౧౮౦, ౧౮౧. కాశీ. ౪. ౧౦౯.

నిందిత. సం. విశే. (బు. త్రి. బు.) = నిందకుఁడు.

నిందితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. గర్హితము; 2. నిషేధింపఁబడినది; 3. నీచము, అధమము; 4. తిరస్కరింపఁబడినది.

నిందితవ్యము. సం. = నిందనీయము.

నింద్యమానము. సం విణ. (అ. ఆ. అ.) నిందింపఁబడుచున్నది.

నింద్యము. సం. = నిందనీయము

నింపాది. దే.విణ. (నింపు+అది) 1. సమృద్ధము. ఉదా: కొలనిలో నీళ్లు నింపాదిగా నున్నవి. (శ. ర.); 2. సుఖితము. (వ్యవ.) అతఁడు నింపాదిగా నున్నాఁడు.

నింపారు = నినుపారు. (శ. ర)

నింపిరి. దే. వి. మలము. "సీ. మలవాచకం బగు మనటు నింపిరి మస్తు..." ఆం. భా. ద్వి. ౧౩౪.

నింపు. దే. స. క్రి. (నిండుధా. ప్రే.) 1. వ్యాపింపఁజేయుట. "చ...నల్గడలఁ బ్రమానకోరకనికాయము నింపిన పొంపు పెంపునన్." వసు. ౧, ఆ. ౧౪౭; 2. కలిగించు. "వ...పాటవపు కెంపు సొంపు నింపు విడి కెంపురవచెక్కడంపుఁ జకోడి గద్దియ నధివసించి .." దశా. ౧, ఆ. ౧౪; 3. నిండఁజేయు, పూరించు. "ఆ...అనంది, రొచటి కరుగఁబోక రొఱుకునింట, గంటెకడుగు చేతఁ గడుపు నింపుచుఁ గొంత,కాల ముండె జాతిగతుల నంత." చెన్న. ౨, ఆ. ౨౭. సా. ౪, ఆ. ౭౨. వి. బలుపు, సమృద్ధి. "సీ. పరిపూర్ణయోగులోపలఁ దిక్కుటిల్లెడు సర్వేంగుఁ జన్నులనింపుసొంపు. గీ. కలికి .." కావ్యా. 3, ఉ. ౪౧. విణ. 1. సమృద్ధము, అధికము. "ఉ. నిద్దపుఁ జెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప..." కళా. ౩, ఆ. ౧౩౭; 2. మనోజ్ఞము. "మ. కలయం గిన్నరగీతిఁ గూడ మృదుకేళం బాడు మత్తాళిసం,కులము ల్గింపురుషాంగనాతతిరొలుంగుల్ విం-చుభావించుమా తెలుంగు ల్నింపుగ నిచ్చ నెలలు..." కు. సం. 3, ఆ. ౧౭.

నింబము. సం. వి. అ. పుం. వేము.

నింబూ. సం. వి. ఊ. స్త్రీ. ఒకజాతినిమ్మ.

నికటము. ఉభ. దే. వి. (క. నికటము) నిర్బంధము. (శ. ర.) సం. వి. అ. పుం. న. సామీప్యము. విణ. (అ. ఆ. ఆ.) అసన్నము, దేశకాలములచే సన్నిహితమైనది.



నికము. దే. క్రి. విణ. యథార్థముగా. "గీ. మీఁద సంకల్పజాలంబు దొలఁగఁ బొందు,నికము బ్రహ్మత్వ మును..." అధ్యా. ఉ. ౨౪౬. పు.

నికరము. ఉభ. దే. విణ. శ్రేష్ఠము. "గీ. నీవు చదివిన చదువులో నికర మైనపద్య మొక్కటి చదివి యేర్పాటు గాఁగ,నర్థ మెఱిఁగింపుము......" దశా. ౪, ఆ. ౧౫౯. కృష్ణ. పీ. ౧౪. ఆం. భా. కృ. ౧౫. సం వి. అ. పుం. 1. సమూహము; 2. సారము; 3. నిధి; 4. న్యాయముగా నిచ్చినధనము.

నికర్తనము. సం. వి. అ. న. కత్తిరించుట, త్రుంచుట.

నికర్షణము. సం. వి. అ. న. 1. ఇల్లు మొదలగునవి యావరించి యున్నప్రదేశము, నివేశనస్థలము; 2. గ్రామకంతము, పట్టణము పల్లె లోనగువాని బయటిభూమి.

నికష. సం. వి. ఆ. స్త్రీ. రాక్షసమాత.

నికషము. సం. వి. అ. పుం. 1. ఒరయిక,రాపు; 2. గీటురాయి, ఒరగల్లు; 3. కత్తులు మొదలగునవి సానఁబట్టుసాధనము; 4. గీటురాతిపై రాచిన బంగారు మున్నగువానిగీఁత; 5. పరీక్షార్థమై ఒరగంటిపై గీచుబంగారు లోనగునది.

నికషాత్మజుఁడు. సం. వి. అ. పుం. నైరృతుఁ డను రాక్షసుఁడు.

నికషోపలము. సం. వి. అ. పుం. గీటురాయి.

నికామము. సం. వి. అ న. తీవ్రేచ్ఛ. విణ. (అ. ఆ. అ.) 1. అధికమైనది; 2. అధికముగాఁ గోరిక గలది. క్రి. విణ. 1. యథేచ్ఛము; 2. చాలినంత; 3. అత్యధికముగా.

నికాయము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. తెగ; 3. నివాసము; 4. గురి, లక్ష్యము; 5. పరమాత్మ.

నికాయ్యము. సం. వి. అ. పుం. ఇల్లు, గృహము.

నికారణము. సం. వి. అ. న. చంపుట, మారణము.

నికారము. సం. వి. అ. పుం. 1. అవమానము; 2. చంపుట, మారణము; 3. బెదరింపు; 4. (ధాన్యాదులను) ఎగురఁబోయుట, తూర్పెత్తుట; 5. ధాన్యము ప్రోగగునట్లు ఎగఁబ్రోయుట; 6. పండ్లు కోయుట మొదలగువానివలనఁ గలుగుముఖవికారము; 7. అపకారము, కీడు. "క. వారలు నయము దప్పిన, నారిపరిభవింపులగకు అవశ్యము

దర్పున్, వారికి నకారణంబ నికారము నీకొనుట చేసెఁ గడు సహితుండై." భార. అర. ౧, ఆ. ౧౦౦. విణ. (అ. ఆ. అ.) దుష్టము, శఠము. "ఉ. కోయిలనోరు సోఁకనిచిగుళ్ల నికారభూఁబల్క భిన్నములే, సేయనికుడ్డు .." వేం. పంచ. ౪, ఆ. ౧౨౮.

నికాశము. సం. వి. అ. పుం. 1. సమీపము; 2. ప్రకాశము. విణ. (అ. ఆ. అ.) తుల్యము, సాటియైనది.

నికాషము. సం. వి. అ. పుం. ఒరపిడి, రాయిడి.

నికుంచకము. సం. వి. పుం. 1. సోల; 2. నీటిప్రబ్బలి.

నికుంజము. సం. వి. అ. పుం. న. 1. పొదరిల్లు; 2 గుహ; 3. గుహావలె నుండుగది

నికుంభము. సం. వి. అ. పుం. దంతి, నేపాలము.

నికుంభుఁడు. సం. వి. పుం. 1. శివానుచరులలో నొకఁడు; 2. కుంభకర్ణునికొడుకు; 3. ప్రహ్లాదుని కొడుకు; 4. సుందోపసుందులతండ్రి.

నికురంబము. సం. వి. అ. న. సమూహము.

నికురుంబము. సం. = నికురంబము.

నికృంతనము. సం. వి. అ. న. 1. కత్తిరించుట, త్రుంచుట. విణ. విణ. (అ. ఈ. అ.) త్రుంచునది, కత్తిరించునది.

నికృతము. సం. వి. అ. న. వంచన. విణ. (అ. ఆ. అ) 1. అవమానింపఁబడినది; 2. నిందింపఁబడినది; 3. వంచింపఁబడినది; 4. నీచము; 5. కపటహృదయము గలది, శఠము. 6. త్రోసివేయఁబడినది.

నికృతి. సం. వి. ఇ. స్త్రీ 1. బెదరింపు, 2. వంచనము; 3. దైన్యము, 4. నిందించుట; 5. నిరసించుట, త్రోసివేయుట; 6. భూమి.

నికృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) నఱకఁబడినది, త్రుంచఁబడినది, "ఆ. హాతరథుండు నిపతితాశ్వుండు సంఛిన్నచాపుఁడును నికృత్తసారథియును, నయ్యె..." భార. విరా. ౫, ఆ. ౧౫౦. హరి. ఉ. 3, ఆ ౧౩౭.

నికృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) అధమము, నీచము.

నికేతనము. సం. వి. అ. న. ఇల్లు, గృహము.

నికేతము. సం. వి. అ. పుం. ఇల్లు, గృహము. "శా. సింగం బున్నగుహానికేతమునకున్ శిక్షింపఁగా వచ్చు మాతంగంబుం బరుడించుచున్..." భార. విరా. ౨, ఆ. ౩౩౦.

నికోచనము. సం. వి. అ. న. ముడుఁగుట, ముకుళిత మగుట.

నిక్కచ్చి. దే. వి. 1. నిర్బంధము. (వ్యవ: వాఁడు దాయపువాఁడై నన్ను నిక్కచ్చి చేయుచున్నాఁడు. (శ. ర.). 2. సారము. "ఆ. పాము దొక్కఁ దొక్కఁడు పడుదువాఁ డిట వచ్చి, పోయి యొకఁడ చిక్కఁ బోటుబంటు, కలను నొడువ నవ్వఁ గలవారె నిక్కచ్చి, చేరువాని కొడువార మీరు" కవి. ౨, ఆ. ౧౧౨.

నిక్కపుజగము. ద్వ. వి. (నిక్కము+జగము.) సత్యలోకము. "గీ. పుడమి పేరిటిఁ జోరరానియెడలు లేవు, మీఁటి నిక్కపుజగమైన దూటి వాలుఁ, గంటిచందంబు దెలిసి రాఁగలరు మీరు, సెలవొసంగిన నంచుఁ దెచ్చెర నతండు." అచ్చ. కిష్కిం. ౪౬.

నిక్కపుటాలు. దే. వి. (నిక్కము+ఆలు.) ధర్మపత్ని. "క. ఎక్కువ కులం బతనికిని, నిక్కపుటాలైన దాని నీచకులుం డు, క్కెక్కఁగ బలిమిం గలిసినఁ, దక్కని చంపుటయె రాజధర్మం బెందున్." విజ్ఞా. ప్రా. ౧౦౪.

నిక్కము. దే. వి. 1. యాథార్థ్యము. "క. మేనుల కెల్లను జీవుఁడు, తానే గోవిందుఁ డొకఁడు తండ్రీ యున్నాఁ డా నిక్కము తన కబ్బెను..." నృసిం. ౪, ఆ. ౧౫౮ స్వా. ౨, ఆ. ౫౧; 2. సత్యవాక్యము. "గీ. మంచి నిక్కము గలవాని మాట నమ్మి." దశ. ౩, ఆ. ౧౧౮. ఆ. భా. ప్ర. ౧౧౯, 3. శాశ్వతత్వము, త్రికాలాబాధ్యత. "క. అమృతమయ బుగ్యజుస్సా, మములయందుపనిషద్వచస్సమూహములకు వాచ్య మయిన పురుషోత్తము నిక్కము రూపగువాని భక్తిగమ్యుఁ దలంతున్." భార. శాం. ౨, ఆ. ౨. విణ. 1. యథార్థము, నిజమైనది. "ఉ. నిందుమునంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా,ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ, రెండును రాజులందు విపరీతము..." భార. ఆది. ౧, ఆ. ౧౦౦; 2. సిద్ధము, అసందిగ్ధము. "గీ. చావు నిక్కంబు బ్రదుకుట సంశయంబు." కాశి. ౨, ఆ. ౧౨౪. దశా. ౪, అ. ౧౨౫; 3. సార్థకము. "వ... అతనికిఁ బరిజ తనునిక్కంపుఁజేరివాఁడు పుట్టె ..." హరి. పూ. 3, ఆ. ౧౨౩. క్రి. విణ. నిక్క

వాచరములై యుండు నిశ్చ దని నిక్కులందుగ రెంత పొక్కువలయు." నిరం. ౨, ఆ. ౧౨౮. భీమ. ౨, ఆ. ౪౬; 10 గర్వము. "శా. నా సామర్థ్యము నీవెఱుంగ వనిలో నక్తంచరశ్రేణి నుల్లాసం బొందఁగఁ గూల్చి నిక్కెదవు వేల్లచ్చాటితపక్షోంతబాణాసారంబున నీప్రతాప దహనవ్యాసంబు చే నార్పెదన్." భా. రా. యు. ౧౯౯౬. పారి. ౧, ఆ. ౬౬. వి. 1. ఔన్నత్యము. "చ...అందు నేమఁగల్,దనరుచునుండు నాకపము దాఁకెదు నిక్కున .." య. ౧, ఆ. ౯౩. ప్రబంధ. ౧౬౯; 2. ఉబ్బు: పొటకరింపు. "సీ. కెంగేలఁ బైఁటచెఱుంగు బిగించుచో నిద్దంపుఁజనుదోయి నిక్కుదోఁప." కువల. ౨, ఆ. ౩౦; 3. బిగువు, బింకము. "ఉ. చన్నులం నిక్కుదప్పఁ గచసంతతిపై నరనూపెఁ జెక్కులం జెన్ను దొలంగె .." వాహ్నది. ౪, ఆ. ౫౫; 4. అందము, ఒప్పు; వికాసము. "సీ. ఆసురీముఖోజ్జ్వలహాసంబులై వడి నిండారు వెన్నెల నిక్కు దక్కు." భా. రా. యు. ౧౪౩౧. అంభా. ప్ర. ౧౩౯.

నిక్కుఁబోతు. దే. విశే. (నిక్కు+పోతు) గర్వస్వభావము గలవాఁడు. (శ. ర.)

నిక్కుడు. దే. వి. (నిక్కు ధా.) ఉన్నతి. (శ. ర.)

నిక్కులాఁడి. దే. వి. (నిక్కులు+ఆఁడి) అందగత్తె విలాసిని. "వ. అంత నొక్కనిక్కులాఁడి యచ్చక్కఁదనాలకుప్ప కిట్లనియె." కాళిందీ. ౬, ఆ. ౨౪.

నిక్కులించు. దే. స. క్రి. (నిక్కు ధా. ప్రే.) నిగుడఁజేసికొను. "క. వలసిన చేఁపులఁ గొని కాక్ల లాళులను నిక్కులించి...పులుఁగులు చట్టుక లార్చుచుఁ, గొలకొలమని మూఁకలిడుచు గూడులు చేరన్." ప్రబంధ. ౬౧.

నిక్కువము = నిక్కము (సత్యవాక్యము.) "ఉ... ఎట్టిచోఁ, బాయనినిక్కువంబులకుఁ బట్టు ధరిత్రిఁ జనక్యవిశ్వభూ,నాయకుఁడు..." కావ్యా. ౩, ఆ. ౬. విశే. (యథార్థము, నిజమైనది.) "చ. అది గల గాదు నిక్కువము రైౌ నటులున్నది నాకు చెంతయున్." భార. అర. ౪, ఆ. ౨౫౪. భార. విరా. ౨, ఆ. ౫౬. క్రి. విశే. (నిజముగా) "ఉ. నిక్కువ మిందు సూర్యశశికిర్ణ్మల వంశజా రైరవరాజులం, దొక్కుమహాసుభావు తనయుండవు గావలయు న్నరోత్తమా." భార. విరా. ౧, ఆ. ౧౮౧. హరి. ఉ. ౬, ఆ. ౧౧౮.

నిక్తము. సం. విశే. (అ ఆ. అ.) కడుగఁబడినది, శుద్ధముచేయఁబడినది.

నిక్వణము. సం. వి. అ పుం. 1. ధ్వని; 2. వీణాధ్వని.

నిక్వాణము. సం. = నిక్వణము.

నిక్షణము. సం. వి. అ. న. ముద్దిడుట, చుంబనము.

నిక్షిప్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది, త్యక్తము; 2. ఉంపఁబడినది; 3. పాఁతఁబడినది, పూడ్వఁబడినది; 4. ఇల్లడ పెట్టఁబడినది.

నిక్షేపకుఁడు. సం. విశే. (అ. పికా. అ.) నిక్షేపించువాఁడు.

నిక్షేపణము. సం వి. అ. న. అడుగులు మొదలగువానిని ఉంచుట.

నిక్షేపణీయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. విడువఁదగినది; 2. ఉంచఁదగినది; 3. పాఁతఁదగినది.

నిక్షేపము. సం. వి. అ. పుం. 1. చెప్పి చూపి యుంచిన యిల్లడ, న్యాసము; 2. కుదువ, తాకట్టు; 3. పాఁతిపెట్టినసొమ్ము, నిధి; 4. విడుచుట, త్యజించుట; 5. ఉంచుట.

నిక్షేపించు. సం. స. క్రి. 1. దాఁచు, మఱుఁగుపఱుచు. "వ. మఱియు విరాటనగరంబునకుఁ జనుచుండి తత్సమీపశమీవృక్షంబునఁ బాండవులు తమయాయుధంబులు నిక్షేపించి తత్తెవరు నెఱుంగ కుండ విరాటుం గొలిచి యుండిరియు..." భార. ఆది, ౧, ఆ. ౪౦; 2. నిలుపు, స్థాపించు. "వ. ఇవ్విధంబున ద్రుపదపుత్త్రి దురవస్థం బొందుచు మహాపదలకుం బరిహారణంబు హరిస్మరణంబ యని తన హృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొని ..." భార. విరా. ౨, ఆ. ౧౦౩; 3. పాఁతు, పూడ్చు. "వ...అచ్యుతప్రేరితులై భీమార్జునాదులు దొల్లి మరుత్తుం డనురాజు మఖంబునఁ బరిత్యజించి నిక్షేపించిన సువర్ణపాత్రాదికం బైన విత్తం బుత్తర దిగ్భాగంబునఁ బలవంతులై తెచ్చిన..." భాగ. ౧, స్కం. ౨౯౮. వేం. పంచ. ౧, ఆ. ౪౦౦; 4. ఉంచు, పెట్టు. "శా. చాపంబుల్ బటుబాణతూణయుగముల్ శాతాసిరయుల్ వర్మములన్, భూషాజాలంబు నిరూఢ

రత్నమయంబు బాహ్యానేకంబు నిక్షేపింపం దగువారిఁ బిల్చి.." నిర్వ. ౧౦, ఆ. ౬౬.

నిక్షేపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇల్లడ పెట్టింపఁబడినది; 2. చిక్కింపఁబడినది, వ్రాయింపఁబడినది.

నిక్షేప్త. సం. విణ. (బు. స్త్రీ. బు.) నిక్షేపించువాఁడు.

నిక్షేప్తవ్యము. సం. = నిక్షేపణీయము.

నిఖనకుఁడు. సం. విణ. (అ. నిౘా. అ.) 1. త్రవ్వువాఁడు; 2. పాఁతిపెట్టువాఁడు.

నిఖననము. సం. వి. అ. న. 1. త్రవ్వుట; 2. పాఁతిపెట్టుట.

నిఖర్వము. సం. వి. అ. పుం. న. పదివేలకోట్లు, ఆయంతకోటిసంఖ్య.

నిఖర్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి పొట్టివాఁడు.

నిఖాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రవ్వఁబడినది; 2. నాటఁబడినది.

నిఖిలము. సం. విణ. (అ. ఆ. అ.) సర్వము, సమస్తము. "గీ. యోగధర్మంబునకు సిక్కు డొక్కటి యగును, నిఖిలమందును లేదిది నిశ్చయంబు." హరి. పూ. ౨, ఆ. ౧౫౫.

నిగణము. సం. వి. అ. పుం. హోమధూమము.

నిగదనము. సం. వి. అ. న. = నిగదము.

నిగదము. సం. వి. అ. పుం. 1. చెప్పుట; 2. స్పష్టముగాఁ జెప్పుట; 3. శబ్దము; 4. అర్థము తెలియక యే మంత్రాదులఁ జదువుట.

నిగదించు. సం. స. క్రి. స్పష్టముగాఁ జెప్పు. "క. మానుషజన్మము నొందిన, మానవులకు లభ్యమాన మరణములకు మహాజ్ఞానులకుఁ జేయవలయు విధానము నిగదింపఁబడియె ధరణీనాథా." భాగ. ౨, స్కం. ౩౪.

నిగదితము. సం. వి. అ. న. చెప్పుట, భాషణము. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది; 2. స్పష్టముగాఁ జెప్పఁబడినది.

నిగనిగ. దే. వి. 1. కాంతివిశేషము; "క. అలచుక్కల నిగనిగ చూపోలంటీ నీకాలిగోరుఁ బోలదు సుమ్మీ." సా. ౨, ఆ. ౨౨౨. స్వా. ౩, ఆ. ౯; 2. మెఱయుట మెఱుఁగువానియందు దగునటుతరణము. "వ... మెఱుంగులు మెరుపెంటి మించి తాఁక బరి మగడ్గ నిగనిగ తెలుఁగుటం జేసి..." ధీయ. ౫, ఆ. ౧. కళా. ౨, ఆ ౩౧. విణ. నిగనిగ యనుకాంతి కలది. (నిగానిగము వికల్పము.) "గీ. నిగనిగనిసూజకెంజాయసోఁగడు దగడు,మోవి మానికమాని." వసు. ౬, ఆ. ౧౫. హర. ౨, ఆ. ౧౭౨. ఇట్టే: నిగనిగన్నిగ, నిగన్నిగ. మొ.

నిగమగోచరులు. సం. వి. అ. న. బ. వస్త్రవిశేషములు. "సీ. బిందువన్నెలు మంచినిగమగోచరులు సామంతవీథులు ప్రతిమలును బొగడ,పచ్చలు... గీ. మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు." ప్రబంధ. ౨౩౨.

నిగమనము. సం. వి. అ. న. 1. వేదమునుండి పదము నెత్తి చెప్పుట, అట్లెత్తిచెప్పిన పదము; 2. లోనికి చొచ్చుట.

నిగమము. సం. వి. అ. పుం. 1. వేదము; 2. వేదము నుండి యుద్ధృత మగువాక్యపదాది; 3. న్యాయశాస్త్రము, తర్కశాస్త్రము, 4. నిశ్చయము; 5. పట్టణము; 6. బజారు; 7. వాణిజ్యము; 8. వర్తకులసంఘము, సార్థము; 9. దారి, మార్గము.

నిగమి. సం. విణ. (స. సీ. స.) వేదముల నెఱిఁగినవాఁడు.

నిగమించు. సం. స. క్రి. తెలుపు, ఘోషించు. "వ...గృహస్థాశ్రమధర్మంబు లైనతురంగమేధాదియాగంబులచేతఁ బురుషుండు బ్రహ్మహత్యాది పాపంబువలన విడివడి నిర్మలుం డగు నని నిగమంబులు నిగమించు..." భాగ. ౧ స్కం ౨౦౩.

నిగముఁడు. సం. వి. అ. పుం. వణిజుఁడు, బేహారి.

నిగరణము. సం. వి. అ. పుం. 1. కంఠము; 2. హోమధూమము; 3. మ్రింగుట; 4. కప్పిపుచ్చుట, మఱుఁగుపఱచుట; 5. తినుట, భక్షణము.

నిగరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తినఁదగినది; 2. మ్రింగఁదగినది.

నిగరము. ఉభ. దే. వి. 1. కాంతివిశేషము. "వ.. నిగరాలనగరాలనిగరాలఁ గనువిశాంతకాంతదంతంబులును..." ప్రబంధ. ౪౦; 2. పెల్లిక, బిల్ల. "గీ. వలచుఁ గస్తూరినిగరాలకలుపుఁ దెలివ,గాజుటోవరిలో ధూపగంధలహరి" నైష. ౭, ఆ. ౧౫౪. వసు. ౨, ఆ. ౧౧. విణ. 1. శ్రేష్ఠము. "క. నగదంబుల నిగదంబుల, జగదంబుల గెలువఁ జాలునకుపోని జగా,నిగరాలన్ మగరాలన్, నగరాల న్వాలకు నమ్ము నాతిరదమ్ముల్." కళా.

౩, ఆ. ౪౦. చంద్రా. ౧, ఆ. ౯; 2. పెద్దది, పృథువు. "సీ. నిగరంపుఁజనుకట్టున గరంబరవిక పేల్ నరిగకుట్టులమెట్టు సడల నిక్క." రా. వి. ౩, ఆ. ౧౨౪; 3. నీచము, అల్పము. "క. నిగరా లగుమగటాలఁ, నిగరాలుగఁ జేయుచునార సెలఁ కరదంబుల్." ప్రబంధ. ౪౦౩. సం. వి. అ పుం. 1. మ్రింగుట; 2. తినుట, భక్షణము.

నిగరిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. మ్రింగు వాఁడు; 2. తినువాఁడు.

నిగళము. సం. వి అ. పుం. న. 1 సంకెల: 2. ఏనుఁగుకాలిసంకెల; 3. మ్రింగుట.

నిగళితము. సం. విణ. (అ. ఆ అ) 1. సంకెలచేయఁ బడినది; 2. బాధింపఁబడినది.

నిగా. హిం. వి. 1. దృష్టి; 2. లక్ష్యము.

నిగాదము. సం. = నిగదము.

నిగారకము. సం. విణ. (అ. రికా. అ) 1. మ్రింగు నది; 2. భక్షించునది.

నిగారము, ఉభ. దే. వి కాంతివిశేషము, సొంపు. "ఉ, చన్నులు పొన్నకాయలకుఁ జక్కఁదనంబు లొసంగుఁ గల్కివాల్గన్నులు గండుమీలకు నిగారములిచ్చు నొయారి దీని కేల్యచ్చులు సాటిరాఁ గలరు .." వృ. వి ౨, ఆ. ౬౦ విణ. శ్రేష్ఠము. "ఉ. కుందన మొదనుక్ దొరయు కొమ్మనిగారపు మేనిచాయకున్." నీలా. ౧, ఆ. ౫౬. అచ్చ. అయో. ౯౩. సం. వి. అ. పుం. 1. మ్రింగుట 2. తినుట.

నిగారి. సం. విణ. (న్. నీ. న్.) 1. తినువాఁడు; 2. మ్రింగువాఁడు

నిగార్యము. సం. = నిగరణీయము. [చోటు.

నిగాశము. సం. వి అ. పుం. న. గబ్బుపెడసమీపపు

నిగిడించు. దే. స. క్రి. (నిగుడు ధా. ప్రే.) 1. చాఁచు, పొడగఁజేయు. "క. మొగిచినచేతులు ముందల, నిగిడించి నితాంతవినయనిరతిఁ జారుల్, దగ విన్నవించి రిట్లని .." భార విరా. ౩. ఆ. ౬౯. పారి. ౨, ఆ. ౩౬; 2. తెలుపతించు. "వ .. పొచ్చుకుందాదపేరక ఇట్టారు నిగిడించితి..." కాశీ. ౯, ఆ. ౧౦౫. హైమ. ౪, ఆ. ౯౧; 3. ప్రయోగించు. "గీ. పైచుటయు నొక్కతెగఁ గత్తివాతియవుగ్ర,లతఁడు పదునాఱ్ఱ నిగిడించి యదృశ్యుఁగఁ, మునిమొ..." భా. రా. ౮ర. ౧౬౫: 4. కల్గించు "వ ..వజ్రకుంభల నచ్ఛాయ సితాంశుదీప్తి నిగిడించన్ .." చంద్రి. ౬, ఆ. ౬.

నిగిడికొను. దే. స. క్రి. (నిగుడు+కొను.) కదవృకొను, నిముడుకొను. "వ ..గండంబులు గడచిని మని గుండియలు నిగిడికొనుచుం జనిరి" హర. ౨, ఆ. ౨౬.

నిగితము. దే. వి. (సంగీతములోని.) ఒకస్వరస్థాయి, ఒకతాయము. "ద్వి. నిగితినుధాయినన్నిగినంబు .. అదిగా పొగయుతాయములు" బస. ౩, ఆ. ౯౩౯. పం.

నిగితి. దే. వి. (సంగీతములోని) ఒకస్వరస్థాయి. బస. ౩, ఆ. ౯౩౯.

నిగిరత్. సం. (శ త్ర.) 1. మ్రింగుచున్న; 2. తినుచున్న.

నిగీర్ణము. సం. విణ. (అ. ఆ అ) 1. మ్రింగఁబడినది; 2. తినఁబడినది; 3. కప్పిపుచ్చఁబడినది, అంతర్భావితము.

నిగీర్ణి. సం వి ఇ. స్త్రీ. 1 మ్రింగుట. 2. తినుట.

నిగీర్యమాణము. సం. విణ. (అ. ఆ. అ) 1. మ్రింగఁ బడుచున్నది; 2. తినఁబడుచున్నది

నిగుంభన. సం. వి. ఆ. స్త్రీ. (మాటలయొక్క) కూర్పు. "మ. ఒకచో మాధురిఁ గల్కుఁబల్కుగము లింపొందంగ పేర్కొనుచోఁ, బ్రకటప్రౌఢవచోనిగుంభనలఁ దీవ్రస్ఫూర్తి వర్తిల్ల..." కాళిందీ. ౫. ఆ. ౯.

నిగుడఁజేయు. దే. స. క్రి. (నిగుడక్ + చేయు.) 1. వర్ధిల్లఁజేయు. 'క. వావుడు సంజయుఁ డిట్లను, దేవా పాండవుల కలఁక ధృష్టద్యుమ్నుం, డేవెరవు మాటలైనను, నే వోసిరయగ్నిభంగి నిగుడం జేయున్." భార. ఉద్యో. ౨, ఆ ౨౪౩; 2. ప్రసరింపఁజేయు; ప్రయోగించు. "సీ. విరివిగా నొకవేళఁ జెరిఁగి పిటికి కెల్ల నిజశీకలచ్ఛాయ నిగుడఁజేయ." పారి. ౫, ఆ ౫౨. "గీ. రక్తధారలు పెదలంగ రశ్మి వెలుఁగఁ, బొలుచు వాలారుక్కబాదువుఁ జెంపుమిగిలి, ఫల్గునుండు ప్రతాపుఁధరితమూర్తి, యగుచు శరశిరణంబులు నిగుడఁజేసె." భార. విరా. ౫, ఆ. ౧౯౦.

నిగుడము. దే. వి. అశ్వశిక్షాభేదము. "సీ. వరనంబు నొందించి పల్లంబు కల్పించి నిగుడంబు నడుకొల్పి మెలకు మెలకి." సి. కళా. ౧, ఆ. ౧౧౨.

నిగుడారు. దే. అ. క్రి. (నిగుడు+అరు-స్వార్థము.) వ్యాపించు. "ఉ. సవ్యక సవ్యసాచ్యభంగముగాక్ నిగుడారెడురింతకాంతియుఁ గా, జివ్వలుచేసి చేసి యిటు చిక్కఁగ నెక్కలవెల్లి వేఁడిమిన్." ఉ. హరి. ౫, ఆ. ౧౩౪.

నిగుడించు = నిగిడించు. (వ్యాపింపఁజేయు.) "వ... ఏమును నిదిధ్యాసనిశ్వాసనిరోధంబు సేసినం దాఁ దద్ధ్యానదశ వెలికి నిగుడించుచు .." ఆము. ౫, ఆ. ౧౫౭. (ప్రయోగించు.) "సీ. సాత్యకి డిథకుపై సాయకదశకంబు నిగుడించ నని వాని మొనగమునందుఁ, జతుమొనమీఁద పతంబుపై వ్రాఁటిన..." ఉ. హరి ౪, ఆ. ౨౫౦.

నిగుడు. దే. అ. క్రి. 1. నిక్కు, (పైకి) లేచు. "వ ..తోఁ లూఁచు మహానాగంబు తుండంబుఁ గరవాలంబుఁ దాన యొఱవెలికి నిగుడుచున్నయది ..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౪౬. ద్వి. హరిశ్చ ౧. ౫౭౫, ౧౦; 2. విజృంభించు "సీ. చెత్తుటఁ దోఁగియు నిగిడిపోరెడువీరు లలరిన వడమోదుగుల విధంబు" భార శల్య. ౧, ఆ. ౧౨౯. ఉ. హరి 3, ఆ. ౯౧; 3. వ్యాపించు "గీ. వారిముఖమండలములతో వారిజములు, మొగిడె శోకతమంబుతో నిగిడెఁ దిమిర, పటలి ..." భార. సౌ. ౧, ఆ. ౧౩. భార. శాం. ౫, ఆ. ౬౭; 4. బయలువేఁడు. "వ. అశ్వను సభార్యుం డయి వింధ్యావాకోక్యస్తంభయుక్త సంభృతానురాగంబున నిగిడి చని .." పాండు. ౧, ఆ. ౧౩౭; 5. (యుద్ధాదులయందు) కవియు, మార్కొను 'గీ ..కౌరవయోధులయుబ్బు మెఱసె, నృపులసేకులు నామీఁద నిగిడిరేతు, బిక్కువఱిచెదఁ జూడుమీ యక్కుమదంచి." భార భీష్మ. 3, ఆ. ౧౧. 3, ఆ. ౩౯౯; 6. వెలువడు, ఉద్గతమగు "క. చని మసవాగ్ని జ్వాలలు, దమకంగ నిట్టూర్పుగాడ్పుదండడి నిగుడన్." భార విరా. ౨, ఆ ౬౦. శైవ. ౪, ఆ ౮౭; 7. చక్కఁబడు. "క బెడిదముగఁ గత్తిగొడ్డటఁ, దెగిన మ్రానఁ జిగురువొడము బలుకుల, కెడఁద నిపిన కార్యంబు నిగుడ నేరదు విదుర పెట్టుఁ గుసుమాకరనిధీ." భార. ఉద్యో. ౨, ఆ. ౬౧; 8. పొడము, జనించు. "ఉ. సైరలవలికాఁ నసల్ నిగుడు నైఁ బులకల్ పొడమక్ ర్ణధాంగిమై." ఆము. ౫, ఆ. ౬౬; 9. తలఁచు, కోరు. "క. భీముని నర్జును విడిచియు, నీమది నకులుం బ్రతికింప నిగుడుట పుత్రా, నామనమున మాయదు నిన్నే మనవచ్చు సఖిలంబు నింద్రుఁ డెఱుంగున్," భార మహా. ౬౪; 10 ఒప్పు. "సీ. బొమల సన్నడిమిపద్మమువళంబులరేఖ రహిఁ జూపు నూర్ధ్వపుండ్రంబు నిగుడ" విప్ర. ౨, ఆ. ౬౮; 11 ప్రవహించు. "సీ. వాహిను లెంతేని పడి మించి నిగుడంగ..." కాళింది. ౪, ఆ. ౫౮. పాండు. ౫, ఆ. ౨౬; 12. చాఁగు, దీర్ఘమగు. "సీ. నిగిడి భ్రూలతకు బాగుగఁ గత్తిరించిన గడ్డంబు కొన రోమ్ముఁ గమ్మిరింప." శైవ. ౭, ఆ. ౯౧; 13 పరుగెత్తు. "క. మాయామారీచము నిగులుచు, వాయువు దెసఁ బఱతు ధరణిపలయము గడచుం, దోయధి దాఁటును నుక్కియఁ. గాయద్యుతు లదర నొక్కగతిఁ దెగి నిగిడెన్." భా. రా. అర. ౨, ఆ. ౫౭, ౫౮. చిత్రభా. 3, ఆ. ౧౩౯; 14. (బాణాదులు) మీఁదికి వచ్చు. "చ. ఘనరథపమ్మునన్ నిగుడుకైదువులన్ దునుమాడి .." భా. రా. అర. ౧, ఆ. ౨౦౧. పారి. ౫. ఆ. ౧౨; 15. మరలించు. "క. ఈరీతిఁ బొదల మెదలును నారీతిలకంబు మేని నచ్చిక యిచ్చెం, గోరక నవసహకారక, కోరక మూరుకొని వడి నిగుడ గమకించెన్." వసు. 3, ఆ. ౧౯౯; 16. అధికమగు. "వ ..ఒడళ్ల జడియు జడిమ నిగుడ బడలియున్నవారలం గనుంగొని." దశా. ౨, ఆ. ౧౬౨. పాండు. ౨, ఆ. ౨౬; 17. స్వార్థ్యమునొందు. "క. కావున నేతద్దానము, నీవును గావింపు మనమునిగుడుదు వన ..." వరాహ. ౧౨, ఆ. ౬౯.

నిగుడుచు. దే. స. క్రి. (నిగుడు ధా. ప్రే.) 1. పెట్టు, తూర్చు. "చ. పొగడలు బొండుమల్లియలు పొన్నలు పావడచాల్లియంబునన్, నిగిడిచి పీర ధమ్రుము చకోర శశిమాలినమీఁకభూమికిన్." భీమ. ౫, ఆ. ౧౧౦.

నిగుడుదెంచు. దే. అ. క్రి. (నిగుడు+తెంచు-స్వార్థము.) పొడము, కలుగు. "గీ. పెక్కెడలఁ జూచి యొఱుఁగుదు నిక్క మనిన, నగవు లెలక మొగంబున నిగుడుదేర." రాఘ. ౮, ఆ ౨౦౭.

నిగుడ్చు = నిగుడుచు. దే. స. క్రి. (నిగుడు ధా. ప్రే.) 1. వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు. "క. అపు టయుం బతఁ డమ్మునిరుచఁ, దనదృష్టి నిగిడ్చి నగుచు .." కళా. ౩, ఆ. ౪౩. హైమ. ౪, ఆ. ౨౨; 2. వెలువరించు, "గీ. పోవలయుఁ గాద నచుచు నూర్పులు నిగుడ్చు." స్వా. ౧, ఆ. ౫౫; 3. (బాణాదులను) ప్రయోగించు. "సీ...కనలి యర్జునుఁడు ..గొడుగును దునుమాడఁగా భవత్పుత్రుఁ డేపు, గుంపఁగ శక్తి నిగుడ్పఁగఁ ద్రుంచె నేత్రైల గృహాణము గొన నుఱుము సేసె." భార. కర్ణ. ౨, ఆ ౨౯౯; 4. కలిగించు "ఆ. అతఁడు తన యవరజయాకర్ణ నాసాస్త్రములు విజాతుల నఖవిలసనమ్ము, గడు నిగుడ్చ నడిగి యడిగి తత్కటాక్షతన, భార్యరామవృత్తకార్యుఁ డగుచు." రాఘవ. ౩, ఆ. ౭౨; 5. పెట్టు, తూర్చు "గీ . నగపరాతులు నిగిడ్చి, పెప్పుటట్టుల శోధించి సిగలు విప్పి." తిమ్మ. ౬, ఆ. ౨౭.

నిగుఱు. దే. వి. బూడిద, భస్మము. "గీ. నిగుఱులో నిప్పులీఱున నీచరిత్ర, మెఱుఁగఁబడదు..." ఉ. రా. ౫, ఆ. ౫౭. ఆం భా. ద్వి. ౨౪౨.

నిగువు. సం. వి. ఉ. పుం. 1. మనస్సు; 2. మలము; 3. వేరు, మూలము; 4. చిత్తరువు వ్రాయుట. విణ. (ఉ.) మనోజ్ఞము

నిగూఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రహస్యమైనది; 2. దురవగాహము, తెలియనిది; 3. భావగర్భితము, వాచ్యముకానిది. "క. అనిన విని యెఱిఁగికొని యాత్మనిమది నుదియము మాన్పఁ దలఁచి నకేంద్రుం గనుఁగొనుచు నకడితోఁ జెప్పిన భంగి నిగూఢవృత్తి భీష్ముఁడు పలికెన్." భార. విరా. ౪, ఆ. ౯౨.

నిగూహనము. సం. వి. అ. న. దాఁచుట.

నిగూహించు. సం స. క్రి. దాఁచు, మఱఁగుపఱచు "మ. మనువంశాగ్రణిశాగ్రదగ్రసుత సామ్రాజ్యాగమప్రాజ్యము, జ్జనసంవర్ధనభూరజోహారిజహార్యారో మాంచుంచుచ కా,ముని కాయప్రకృతి ప్రజ ద్విగుణ కాతానందముఁ డెందమం,ద నిగూహించుచుఁ బల్కెఁ బాస్తసచివోత్తంసాళితో వత్తఱిన్." చం. రా. ౪, ఆ. ౧౧.

నిగ్రహితి. సం. వి. ఇ. స్త్రీ. 1. విరోధము, అడ్డు; 2. అడఁచుట, నిగ్రహము.

నిగ్రహీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పట్టుకొనఁబడినవాఁడు; 2. నిరోధింపఁబడినవాఁడు, అడ్డగింపఁబడినవాఁడు; 3. ఎదిరింపఁబడినవాఁడు; 4. ఓడింపఁబడినవాఁడు. [బడుచున్నది.

నిగ్రహ్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిగ్రహింపఁ

నిగ్గడి. దే. విణ. (క. నిగ్గడి) కఠినము. "సీ...అది యొక నిగ్గడి యైన యుసురు. గీ గుండియుఁ జేటు పాటింపఁ బుండరీక, నయన యెన్నఁడు లేమి నిర్ణయము గాదె." భార. స్త్రీ. ౨, ఆ. ౪౬

నిగ్గారు. దే. అ క్రి. (నిగ్గు+ఆరు.) 1. ఉత్కృష్టమగు. "ద్వి. నిగ్గారుపంచవన్నియలతోఁ గూర్చి, ముగ్గులుపెట్టి..." పండితా. దీక్షా. ౫౬, పు; 2. ప్రకాశించు. "ద్వి. ముగ్గ చాలదొ పద్మములు సొసరినవొ, నిగ్గారుగందంబు పూరదు దోఁచినదొ." పండితా. పురా. ౧౫౪, పు.

నిగ్గించు. దే. స. క్రి. (నిగ్గు+ఇంచు) కొనవేర్చు, నిర్వహించు. "మ...ధాత్రీకాంత నీ వొప్పమా,విపులశ్రీమ్మలతో నిరీతి మనుమున్ నిగ్గించుచున్ క్షేమము వేఁడుక వర్తిల్లుదు మాశ్రమాళి సురకోటుల్ నిచ్చ హర్షింపఁగన్." చంద్రి. ౧, ఆ. ౧౩౩.

నిగ్గు. దే స. క్రి. మించు, మీఱు. "చ ..మూర్తి యుంబులు ..మైరయుఱపులతీఁగమై మెలఁగి యొయ్యన ముగ్గలనిగ్గు నిగ్గుచున్." కాళిందీ. ౫, ఆ. ౧౨౨. వి. 1. కాంతి. "సీ. బయపునిగ్గులు దేఱ పాఁపజన్నిద మొప్పఁ బ్రమథాధిపతి యుంటిప ట్లైటింగ." స్వా. ౭, ఆ. ౧౧. పారి. ౪, ఆ. ౩౭; 2. సొంపు, అందము. కాళిందీ. ౫, ఆ. ౧౨౨; 3. జిడ్డు. "మ...పోఁగొట్టెయుల్ నంపఁగి నూనెనిగ్గు సడలంగాఁ దైపయిఁ దువ్వి .." వసు. ౫, ఆ, ౭౦; 4. కిరణము. "సీ. మిసిమి కళుకు నిగ్గు మించు కళు కనంగఁ గిరణనామంబులై కరలుచుండు." ఆం. భా. ప్ర. ౯౨; 5. పరిపు కాంతియము. "ఉ. మజ్జనమాడె రాజు. కృశ మధ్యలు లింపున వంప గుంపులై, గొజ్జెఁగనీటి వెల్లువలు గోపజనాళులనిగ్గుఁ జూడ..." స్వా. ౫, ఆ. ౫౬; 6. సారము. (వా.) విణ. త్రోపుడు పోఁగా మిగిలినది. (శ. ర.)

నిగ్గులాఁడి. దే. వి. (నిగ్గులు+ఆఁడి.) అందముగల స్త్రీ, స్త్రీ. "ఛ. కలఁగుచు మోహవాంఛఁ గదుఁ

గ్రస్తుండునిగ్గున నిగ్గులాడి కాన్." కాళిందీ. ౬, ఆ. ౧౫. పరివ. ౫, ఆ ౧౭౭.

నిగ్రహణము. సం. వి. అ. న. 1. నిరోధించుట, అడ్డగించుట; 2. అణఁచుట; 3. బంధించుట, చెఱఁబెట్టుట; 4. ఓడించుట; 5. దండించుట. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగించునది; 2. అణఁచునది.

నిగ్రహపడు. ప్ర. అ. క్రి. (నిగ్రహము+పడు.) చిక్కులంబడు. "క. వెలి వెడలనీజను లిటు దను, గొలువులు డిగి వచ్చి యిచట నిగ్రహపడఁగా." హరి. ఉ. ౨, ఆ. ౧౫౧.

నిగ్రహము. సం. వి. అ. పుం 1. అడ్డగించుట, నిరోధించుట; 2. అణఁచుట; 3. చెఱ; 4. మేర, సీమ; 5. చికిత్స; 6. తెగడుట, నిరసనము; 7. చంపుట, మారణము; 8. శిక్ష, దండనము; 9. బెదరింపు; 10. ఓడించుట; 11. దూఱు, నింద; 12. పిడి; 13. పట్టుకొనుట, పీడించుట. "వ. ఇవ్విధంబున నరదంబులయిుఱకటంబు గడచి రొండ గలుగ నిలిచి రావాండ్ర నిగ్రహనిరాసభాసురుం డగుభానుండునుం బోలె..." భార. విరా. ౫, ఆ. ౨౧౩.

నిగ్రహించు. సం. స. క్రి. 1. తిరస్కరించు, నిరసించు. "క...తన్ను గొదిరిని, మది కోఁకగల నిగ్రహించి మదమెత్తుట యొప్పదు..." భార. ఉద్యో. ౩, ఆ, ౨౮౯; 2. అడఁచు, నిరోధించు. "వ ..నిఖిలేంద్రియంబుల నిగ్రహించి..." మార్క. ౮, ఆ. ౩౬; 3. త్రోపాడు. (శ. ర.)

నిగ్రాహము. సం. వి. అ. పుం. 1. దండనము, శిక్ష; 2. తిట్టు, శాపము.

నిఘంటు సం. వి ఉ. పుం. పదములను వానియర్థములను దెలియఁజేయు గ్రంథము. "మ...విభూతిరూఢ్యాతిశైశ్వర్య మంచు వినంగాఁ దెలిసెన్ నిఘంటుఁ గనినన్..." పాని. ౨, ఆ. ౬౨.

నిఘంటువు. సం.=నిఘంటు.

నిఘము. సం. విణ. (అ. ఆ. అ.) నిడుపు వెడల్పు ఎత్తు సమానముగాఁ గలది. (వేదికాది.)

నిఘర్షణము. సం. వి. అ. న. 1. రుద్దుట, తోముట; 2. రాచుట, రాపిడి; 3. నూఱుట; 4. (పిండిపొ.) పిసరుట.

నిఘర్షము. సం. వి. అ. పుం నిఘర్షణము.

నిఘసము. సం. వి. అ. పుం. భోజనము, భుజించుట.

నిఘాతకుఁడు. సం. విణ. (అ. తిా. అ.) 1. కొట్టువాఁడు; 2. హింసించువాఁడు.

నిఘాతము. సం. వి. అ. పుం. 1. కొట్టుట; 2. దెబ్బ; 3. అనుదాత్తస్వరము.

నిఘాతి. సం. వి. ఇ. స్త్రీ. ఇనుపసుత్తె, లోహఘాతిని.

నిఘానక. సం. వి. ఆ. స్త్రీ. కమ్మరి యినుపపని చేయు దాయి.

నిఘుష్టము సం. వి. అ. న. ధ్వని, శబ్దము.

నిఘృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రుద్దఁబడినది; 2. నూఱఁబడినది; 3. అఱఁగఁదీయఁబడినది.

నిఘృష్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఘర్షింపఁదగినది.

నిఘృష్వము. సం. వి. అ. పుం. 1. డెక్క, ఖురము; 2. వాయువు; 3. గాడిద; 4. మార్గము; 5. పంది, వరాహము.

నిఘ్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లోనైనది, అధీనము. (భృత్యాది); 2. గుణింపఁబడినది. (సంఖ్య); 3. అంతర్వ్యాప్తమైనది. "గీ. రమణి దీపకభూషణరత్న మిద్ది, మంజులై కాంతియోగ మహిత మగుట, మాలికాదీపకం బోను మాయు కీస, మానసము సాత్మ నిఘ్నతఁ బూనఁజేసె." కాళిందీ. ౬, ఆ. ౧౭౭.

నిచయము. సం. వి. అ. పుం. 1. సమూహము, రాశి; 2. నిశ్చయము.

నిచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యాపించినది; 2. పూరితము, నింపఁబడినది; 3. నిర్మితము; 4. ప్రోగుచేయఁబడినది; 5. ఒకటితో నొకటి కలిసినది, సంకీర్ణము; 6. ఆవరింపఁబడినది, వ్యాప్తము. "క . రావణాసురుఁడు దైతేయ, ప్రచయ కలకలనిరంతర, నిచితసభోభాగుఁడై యునికి దెలిసెన్." నిర్వ. ౫, ఆ. ౪౮.

నిచులము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగన్నేరు; 2. వేతసము, ప్రబ్బలి; 3. గవుసెన.

నిచోళకము. సం. వి. అ. పుం. 1. అరచొక్కావంటి యోధులకవచము; 2. రవిక.

నిచోళము. సం. వి. అ. పుం. 1. గవుసెన; 2. స్త్రీల మేలిముసుఁగు, అవగుంఠనము; 3. పఱుపులోనగు వానికప్పెడు దుప్పటి.

నిచ్చెన. దే. వి. (సం. నిశ్రేణి. క. నిచ్చణిగె.) పైకెక్కుట కుపయుక్త మగుమెట్లు గలసాధన విశేషము, నిశ్రేణి. "సీ. ధనము లర్కప్రాప్తంబు

లకుభనంజయుఁమాటు పాటిగాఁ గొనుము సోపాన భంగి, నున్నది మార్గంబు యోగసమారోహణము నకు దాపన నడచిరాక, పడి నుర్కుడు నీకు వచ్చునే ధనసంగ్రహంబు భోగార్థకృతంబు దుష్టు, మగుటయుఁ గలదు యజ్ఞార్థకృతంబైన నదియు నిచ్చెన బ్రహ్మపదము నొంద." భార. శాం. ౧, ఆ. ౧౪౪, అం. భా. ౨, ఆ. ౨౭.

నిచ్చెనపంజా. ద్వ. వి. (నిచ్చెన+పంజా.) నిచ్చెనవలె నుండుదీపములపంక్తి. "మ...నిచ్చెనపంజా లార తులు నిచ్చిజోత్యేతులు కెల్లఁగన్." హంస. 3, ఆ. ౨౮, ప్రబంధ. ౩౪.

నిచ్చ. వై. అవ్య. (సం. నిత్యమ్. క. నిచ్చ.) 1. ఎల్లప్పుడు, సదా. "క...తొలుతాంతము కొలఁదులు చెప్పంగ నిచ్చ క్రొత్తలునుమ్మీ." పారి. ౧, ఆ. ౬3, ఉ. రా. 3, ఆ. ౧3౫; 2. ప్రతిదినము. "సీ. నిచ్చ యొక్కఁపుృగంబు నీకుఁ గట్టడ గాఁగఁ బ్రీతి నాహారంబుఁ బెట్టఁగలము." నా. పంచ. ౧, ఆ. ౭౪౫, పండితా. మహిమ. 3 ౦౬. పు.

నిచ్చచావు. ద్వ. వి. (నిచ్చ+చావు.) నిత్యమరణము. "క. విను దుర్యోధనదుశ్శా, సనులఁ బలికి నిచ్చ చావుగ నప్పునని యలఁచు..." భార. శల్య ౧, ఆ. 3౭.

నిచ్చనిచ్చలు. వై. అవ్య. (నిచ్చలు+నిచ్చలు.) 1. ఎల్లప్పుడు, సదా. "ఉ. ఆకులితోమణ ప్రతిభ నార్చు మహాబలబాహ్నిచేఁ బయో, రాశి శమించిపోమిఁ భర నగ్న మేమొగి నిచ్చనిచ్చలుఁ, వేసట లేక యన్నిమిదు వేంకటరాఘవయజ్వయింట మృ ష్టాశనదానవార్ధిరసహాయక యూ య క మై చెలంగఁగన్." శశాం. పీఠి. ౪౭; 2. ప్రతిదినము. "ఆ. నిచ్చనిచ్చవడ్డి కెలకెలవ డ్డొడఁ, బొటవడ్డి వడ్డిపెరివడ్డి, యనఁగ నాల్గుతెఱఁగు లయ్యెఁ." విజ్ఞా. వ్యవ ౬౬, దశా. ౪, ఆ. ౨౮.

నిచ్చయము. వై. వి. (సం. నిశ్చయః.) నిశ్చయము "క. మెచ్చుగుణె సాహసానకు, వచ్చినతఱి సంధి మనల వారలకొలఁదుల్, నిచ్చయము చేసి ధిటుపఱెఁ, బొచ్చితి మన కింక నొందుచొప్పులు గలవే." భా. రా. యు. ౭3౮.

నిచ్చలము. వై. విశ. (సం. నిశ్చలః.) 1. నిష్కపటము. "క. వచ్చిరఁ గుబేరసూనుఁడు, నచ్చెలపలం బెదురు గాఁగ నరిగి యతనికిన్, నిచ్చల మగుతాత్పర్యం బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్." శశా. 3, ఆ. ౧౫౦, సీలా. ౧, ఆ. ౧౬; 2. నిర్దోషము, నిర్మలము. "ఉ. నిచ్చల మైనకెంపులును నీలమణుల్ వరహా క్తి కంబులున్." శశాం. ౨, ఆ. ౧౮, ఉ. రా. ౧, ఆ. ౫౮; 3. అసందిగ్ధము, యథార్థము. "ఉ... నిచ్చల మమ్మహామహానిశ్శ్రేమ లబ్ధము కొట వాసవా." కవిక. ౬, ఆ. ౩౩. (శ. ర. పా.) ప్రభా. ౨, ఆ ౨౫. (సం. నిశ్చలః) స్థైర్యము; స్థిర్యము. "గీ. బిగివి మాటలలోఁగును మగతన మున, నిచ్చలంబునఁ గడలఁ దానెచ్చు గాంచి." సీలా. ౧, ఆ. ౪౨, అచ్చ. బాల. ౨౮, విశ. 1. చలింపనిది, నిశ్చలము. "క. ఇచ్చటఁ దప మొనరించిన, నచ్చపుభయమును వాంఛితార్థము నొందన్, వచ్చును సంశయ మే లది, నిచ్చ లవుత్ మనసుచేత నిర్ణయయుతుఁడై." సీతం. ౧, ఆ. ౨౬; 2. నిరంతరము, ఎడతెగనిది. "సీ. నిచ్చలం బైన లేవియవాలజడిపొంత్ర లాలితబా నధారాళి గాఁగ." రాఘవ. ౭, ఆ. ౫, దశా. ౭, ఆ. ౧౬౨.

నిచ్చలు. వై. అవ్య. (సం నిత్యమ్.) సదా, ఎల్లపుడు. "ఉ. నిచ్చలు నిచ్చలోఁ దొడలుసిపిత్రుభ క్తి జ్ఞాన శక్తిన్, మెచ్చితి..." పాండు. ౨, ఆ. ౫3. క్రి. విశ. "సీ...నీకు. గీ. చేయులంటిగా నిచ్చలు చెలియ యిత్తు." పారి. ఉ. ౭, ఆ. ౧3౨.

నిజ. సం. వి. ఆ. స్త్రీ. సెచ్చెలి, మిత్రురాలు.

నిజము. సం. విశ. (అ ఆ. అ.) 1. స్వాభావికము, సహజము; 2 తనది, స్వకీయము; 3. శాశ్వతము.

నిజుఁడు. సం. వి. అ. పుం. చెలికాఁడు, మిత్రుఁడు.

నిజ్యమానము. సం. విశ. (అ. ఆ. అ.) శుద్ధిచేయఁ బడుచున్నది.

నిజమరి. ద్వ. విశ. (నిజము+అరి.) సత్యశీలుఁడు. "క. తానొక్కనిజమరివరెన్..." భో. ౬, ఆ. ౫౬, యు. ౧, ఆ. ౫౫. [మరి.]

నిజము. వై. వి. (సం. నిజము.) సత్యము (చూ. నిజ

నిజవణి. దే. వి. సంగీతమునోనిజకస్వరస్థాయి. "ద్వి. నిజవణి నిపకంబు నీచమై ధనము...అదిగా సొగయు తాయుములు." బస. ౭౧, పు.

నిజాము. దే. వి. ఒకానొకమహమ్మదీయప్రభువు. (ఇది మొదట సంజ్ఞావాచకముయ్యెను గ్రమ

ముగా స్ఫురదరాకారాదుమహాష్మదీయప్రభుసామాన్య వాచక మైనది.) "గీ. అనుచు శిరములఁ దాల్తు రవ్వనిమగ్ర, సైన్యధుతధూళిఁ జటిలులై చనుచ పొద, కరకరా కానిజామాదికులకులము." వసు. ౧, ఆ. ౪౬, ఆనంద. పీఠి. ౧౦౯.

నిశావళి. దే. వి. సంగీతములోనిస్వరస్థాయిభేదము. "ద్వి. వరుస లేర్పడ నిజావళి ధజావళియు, సరసి సాళగము కాయము లేర్పఱచి." అ. మ. క. ౨, ఆ. ౧౦౯. పు.

నిటక్కనిలుచు. దే. అ క్రి. స్తంభమువలె పొడుగుగా నిలుచు. "వ ..కొనటకానటలు నమత్కట నిటలతటంబున నిటక్కనిలిచి యంకుశదోలఘటన నటించుచు..." రా. వి. 3, ఆ. ౬౫.

నిటనిటనగు. దే. అ. క్రి. (మదాదులచే) కన్నులు తేలగిలు. "చ. కిటకిటనర్యో కన్నడుము కేసరి మధ్యకు నాఁడునాఁటికిన్, నిటనిటనర్యో బోలము జనించి విశాలవిలోచనంబులున్." పి. కుం. ౪, ఆ. ౫౪.

నిటలము. సం. వి. అ. న. నుదురు, ఫాలము.

నిటలాక్షుఁడు. సం. వి. అ. పు. ముక్కంటి, శివుఁడు.

నిటాలము. సం. = నిటలము. "గీ. శక్యమే సన్నుతిశి యదుసార్వభౌము, లాలితచ్ఛాయమృదులనిటాల తలము." కాళిందీ. ౧, ఆ ౩౧౯. చంద్రా. ౬, ఆ. ౮౩.

నిట్ట. దే.వి. 1. ప్రవాహము, జలపూరము. "సీ. మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి నలిఁ దేల్తు సౌఖ్యరసంపునిట్ట." భార. విరా. ౨, ఆ. ౧౩౦. ద్వా. 3, ఆ. ౧౦౪; 2. పొంగు, పోటు "క...కనుంగొని రమ్యతరసపూరంబున పెన్నిట్టఁ దమచిత్తములం దనరఁగఁగన్." భార. విరా. ౧౪౮. బస. ౬, ఆ. ౮౦౯. సం; 3. నిక్క, నిగుడుట. "గీ. భక్తినంయుక్తి యనుపోఁకపాల పొయ్యఁ, జెట్టుకట్టుచు మునికాఖ నిట్టచూపు, నిజ మనోమార్గసంపన్నులవర్ణ, కైతవంబున లోఁకేక గలయుకూతు" పాండు. 3, ఆ ౧౩౯; 4 స్థానము. "సీ...చెంత నిట్ట యనఁగ. గీ. స్థాన మగు..." అం. భా. ద్వి. ౧౩; 5. స్తంభము. "ఉ...అయ్యవఁటనిట్టులపైఁ బొరలాడి......" కవిక. 3, ఆ. ౧౧౬. విశే. 1. నిక్కనది, సూటిగా పైకి లేచినది. "ఉ. నిట్టరోమములకుఁ బట్టగు చామంద, కొమ్మ కేశ్రుఁ దగుచుఁ బ్రజలి చేసె." భాగ. ౬, స్కం. ౫౬౮. శుక. ౨, ఆ. ౧౦; 2. స్థిరము, నిశ్చలము. "చ...హృజ్జ రజమానససారథమత్పదంబు నర్జునరక్షధూమణంబు వెలిఁ జూడనినిద్దపునిట్టమాపురన్, మునుకొని చొక్క..." పాండు. ౨, ఆ. ౯; 3. నిడుపైనది, ఉన్నతమైనది. "గీ. నిట్టకా దనఁ బొడవుచే నిక్కనాఁడు."స్వా. ౪,ఆ.౪౩, కు.సం. ౧౨, ఆ. ౧౨౨.

నిట్టకనిలుచు. దే. అ. క్రి. (నిట్ట+నిలుచు.) స్తంభము వలె నిలుచు, పొడువుగా నిలుచు. "క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిననిట్రాడుపోలె .."రామా. ౮, ఆ ౧౩౨.

నిట్టకనిల్వు. దే. వి. (నిట్ట+నిలువు) నరినిలువు. "ఉ. నిట్టకనిల్వునం గలఁగి నేత్రయుగంబున బాష్పపూరముల్, దొట్టఁగ...కాఁ, బెట్టిఁ ద దీయపాత్ర నది భిక్షయకాఁ గొనిపోయె సిద్ధఁడున్." భో. 3, ఆ. ౬౬.

నిట్టగ్రమ్ము. దే. అ. క్రి. (నిట్ట+క్రమ్ము.) ఉప్పొంగు, పైకుబుకు. "సీ. చాదుల నగుమోముఁ జందురు పొడుపున రాగాంబుధులు నిట్టగ్రమ్మ ననుట." నృసిం. ౨, ఆ. ౫౦, కు. సం. ౧౨, ఆ. ౨౪.

నిట్టతోలఁకు. దే. అ. క్రి. (నిట్ట+తొలఁకు.) వెల్లివిరియు. "గీ. మున్ను పోయినకల్పాంతమున నరేంద్ర, బ్రహ్మ మనఁగ నైమిత్తికప్రళయ మైన, వింగిపై నిట్టతొలఁకుమున్నీటిలోనఁ, గూలె భూకాళి జగములకొలఁదు లెడలి." భాగ. ౮, స్కం ౪౧౪.

నిట్టదొట్టు. దే అ. క్రి. (నిట్ట+తొట్టు.) వెల్లివిరియు. "చ...అంత్యకాలమున వారిధు లన్నియుం నిట్ట దొట్టిన, ట్లుడుగక యేదురాత్రులు మహోద్ధతి వానలు గుర్య..." పద్మ. ౯, ఆ. ౨౩౧.

నిట్టద్రోచు. దే. అ. క్రి. (నిట్ట+త్రోచు.) ఉప్పొంగు, వెల్లివిరియు. సీ. దుగ్ధాంబునిధి నిట్టద్రోచెనో యని శేషుఁ బొమ్మగా హరి నీటఁ బవ్వళింప." ('నిట్టఁ దోఁచు' అని మ. పా..లు.) కు. సం. ౮, ఆ. ౧౧౮. కావ్యా. 3, ఉ. ౩౯.

నిట్టనిలుచు. దే. అ క్రి. (నిట్ట+నిలుచు.) పొడువుగా నిలుచు. "గీ. కోటిశిఖర మిన్నంగి మిన్ను

ముట్టి, నిట్టనిలుచుండి చూచె నిర్నిమిషదృష్టి." కాశీ. ౧, ఆ. ౧౧౯. పాండు. ౨. ౫౫.

నిట్టవొడుచు. దే. అ. క్రి. (నిట్ట+పొడుచు.) వ్యాపించు. "గీ జనము లానందమునఁ దేల జగము లెల్లఁ, దొట్టి నిండారు వెన్నెల నిట్ట పొడిచె." నిర్వ ౬, ఆ. ౫౫. ఇట్లే నిట్ట వొడుచు. భాను. 3, ఆ. ౧౭.

నిట్టరాడు. దే. వి. (నిట్ట+రాడు.) దూలము లేకయే కట్టెకుగ్గ్రుహమునకు పాఁతు స్తంభము. "సీ...ఆలయాధారదీర్ఘ స్తంభసంజ్ఞ నిట్రాడు నిట్ట, రా డనఁ దగు..." ఆం. భా. ద్వి. ౨౦, ద్వి. పారిశ్చే. ఉ. ౧౬౪౫.

నిట్టలము. దే. వి. నిలుకడ. "సీ...,నిలుకడ తనరును నిట్టల మున." ఆం. భా. తృ. ౨౯, విణ. అధికము. "ఉ. నింగికి నేలకుం బొడవు నిట్టలమై.." భాగ. ౬, స్కం. ౩౧౯. (శ. ర పా. 'నిచ్చలమై.' ముద్రి.) నిర్వ. ౬, ఆ. ౧౪౪.

నిట్టలుద్రోచు. దే. అ. క్రి. (నిట్టలు+త్రోచు.) ఉబుకు, ఉప్పొంగు. "సీ. నిట్టలుద్రోచుచు నెల ఘులు కలమేర లెల్లను మిగొక్క యేర్పడంగ." భార. విరా. ౧, ఆ. ౨౪౫.

నిట్టలుద్రోయు. దే. అ. క్రి. (నిట్టలు+త్రోయు.) అతిశయించు. "ఉ. అరమణీలలామ హృదయంబున నాదట లంతకంతకుం, బేరఁగ ..వేమ కలు నిట్టలుద్రోసెడువాలుఁగన్నులన్, వారణ లేక త్రోచె జనవల్లభసుందరు మేనచెల్వమున్." కేయూర. ౪, ఆ ౫.

నిట్టలుపొడుచు. దే. అ. క్రి. (నిట్టలు+పొడుచు) ఉప్పొంగు, వెల్లివిరియు. "వ. తన్ను విస్మయంబునఁ గొనియాడువై మాణిక్యశోభాజాలంబు లాలకించుచుపడువున నిట్టలుపొడుచుచు మెదలుఁ దనకు సరిరా మని నవ్వుచురువున నురుళ్లులు చూపుచు..." వరాహ. ౧౦, ఆ. ౬౨; 2 రోమాంచితమగు. (శ. ర.) ఇట్లే. నిట్టలు పొడుచు. పద్మ 3, ఆ. ౧౬౪.

నిట్టు. దే. వి. 1. ఉపవాసము. "సీ. పంటగుడారు క్రిందంటి వెల్లువమీరు ప్రాయిు పీఁగఁ దొట్టిన భూఁట నిట్టు." రా. వి. ౨, ఆ. ౬౯. (శ. ర. పా. 'నిట్రు.' ముద్రి.); 2. తాపము. "క. దుష్టక పెడకొట్టక యుంత్సన్నము లై నట్టిపులుపాం నస్యంబుల్, నన్నుఁ దనఁ బండుఁ బ్రాణులకు నిష్టను మాటలేదు గోరంతైనన్." మార్క. ౪, ఆ. ౪౧, (శ. ర. పా.) విణ. శుష్కము. "ఉ. వాడదు మేను నిట్టుఱంకువాసము లుండిన ధైర్య మింత యుంగ్, వీడదు..." ఉద్భ. 3, ఆ. ౨౦.

నిట్టుక్క. దే. వి. బాలికాక్రీడావిశేషము. హంస. ౫, ఆ. ౧౫౫.

నిట్టుపవాసము. మి. వి. (నిట్టు+ఉపవాసము.) శుష్కోపవాసము. "ద్వి. నిట్టుపవాసమే దినము లుండెంగ, కొట్టకేలకు బియ్య మిరుస గల్గినను." బస. ౪, ఆ. ౧౩౫ పు.

నిట్టుపాసము. ద్వ. వి (నిట్టు+ఉపాసము.) శుష్కోపవాసము. "ఉ. నిన్నటినుండి యేము నిఱుపీఁగియుఁ నుంటిమి నిట్టుపాసముల్." కాశీ. ౭, ఆ. ౧౭౯.

నిట్టూరుచు. దే. అ. క్రి. (నిడుద+ఊరుచు.) నిట్టూర్పువిడుచు. (శ. ర.)

నిట్టూరుపు. దే. వి. (నిడుద+ఊరుపు.) దీర్ఘనిశ్వాసము. "గీ. ద్రుపదనందనపరిభవదుఃఖమునకు, నుల్లమున దురపిల్లుచు నున్నవరసి, వేడినిట్టూర్పు యన పెదలెఁ గ్రొత్తతావి మూకులం బిచ్చు కత్తిమ్మిరుల." భార. విరా. ౨, ఆ. ౨౩౬. ఇట్లే. నిట్టూర్పు. కాశీ. ౧, ఆ. ౧౦౧.

నిట్టూర్పులిచ్చు. దే. అ. క్రి. (నిట్టూర్పులు+ఇచ్చు.) నిశ్వాసమువిడుచు. "గీ. అలసి నిట్టూర్పు లిచ్చు నౌర్యాంగము .." కలుగు పెరాహిని దలఁప మైంబులక లొదవె. దశ. ౨, ఆ. ౩౬౦.

నిట్టెము. దే. వి. (నిడుద+ఎమ్ము.) వెన్నెముక, పొడుగైనయెముక. "ద్వి. అట్టిత్రివిక్రమునకొట్టెము గాద, పట్టె ఖట్వాంగముభాతి శంకరుఁడు." బస. ౬, ఆ. ౭౭౭. పు.

నిట్ర = నిట్రము. (శ. ర.)

నిట్రము. దే. వి. నిలువు. ఉదా:—కలము అంత నిట్రముగా పట్టుకొనకుము. (శ. ర.)

నిట్రపడు. ద్వ. అ. క్రి. (నిట్ర+పడు.) నిలుచు, నిక్క. (చూ. నిట్రపాటు.)

నిట్రపాటు. ద్వ. వి. (నిట్రపడు భా.) నిలుచుట, నిక్కుట "వ...నిడుదరోమంబులు బహిర్నిర్గతంబు లైన యంతరరోపాకలశ్యాలలమాళ్ళు నిట్రుపాటునం దనర..." చంద్రా. ౨, ఆ. ౭౪.

నిట్రపొడుచు. దే. అ. క్రి. (నిట్ర+పొడుచు.) పొడుచుగు, నిక్కు. "వ...కటాలున నేడుఁ బండులబాదున్న కొలకులు నిట్రపొడుచ నొడల్లు జాడించుచు..." ప్రబంధ. ౭౮౮.

నిట్రాడు. దే. వి. ఔ. (నిట్ర+రాడు.) దూలము లేకయే కట్టెడు గృహమునకు పోటుస్తంభము. "క. ఇలం కాలి కూల నిట్టక, నిలిచిననిట్రాడు వోలె..." రామా. ౮, ఆ. ౧౩౨, ఆం. భా. ద్వి. ౨౦.

నిట్రాయి. దే. వి. ఔ. (నిట్ర+రాయి.) పొడుపు రాయి. "వ...అయ్యెదవగాలి అంకుటాలిం గాలం గేలం బొడిచి పుడమరలం దిగిచి నిట్రాత నేత పగ్గంబున బంధించి కాలికుందు నిద్రించె.." వేం. పంచ. ౧, ఆ. ౨౫౪.

నిట్రించు. దే. స. క్రి. నిక్కించు, నిలువుగా నుంచు "ద్వి. పలకటెకి కొసంబు వ్రాలి కుంభకము, కొల కొల్పి భుజములు నిట్రించి కంతఁ, మోరగించి ..." పండితా. ౪, ఆ. ౨౫౦, పు. బస. ౫, ఆ. ౪౭౪, పం.

నిట్రిల్లు. దే. అ. క్రి. ఉపవాసముండు. (శ. ర.)

నిట్రు. దే. వి. ఉపవాసము. "సీ. దశమినాఁ డేక భుక్తము చేసి యువలినాఁ డొర్చి జాగరముతో నుండు నిట్రు." అము. ౪, ఆ. ౫౦, ఆం. భా. ద్వి. ౧౭౫. విణ. కుమ్మము. (చూ. నిట్రుపాసము.)

నిట్రుపాసము = నిట్టుపాసము. (కుపోక్కవవాసము) "సీ. సతతంబు నిట్రుపాసములతో సత్యవ్రతమునఁ గావించుచుఁ దానమాడ." వరాహ. ౭, ఆ. ౭౩. వాల్మీ. ౨, ఆ. ౧౩౦.

నిడి. దే. విణ. (నిడివిశబ్దమునకు వృత్తియం దంత్య వర్ణలోపము.) దీర్ఘము. "క...ఒకింతతడవున కాకె, వ్వడి నడలె నడఁగె నుఱుముల్, నిడి మించులు మానె వెలుఁగు నిలిచెఁ గలిచెన్." వేం. పంచ. ౩, ఆ. ౧౦౬.

నిడివి. దే. వి. 1. దైర్ఘ్యము, పొడువు. "క. అడుడ నర వెడలుపు మూఁడు జామడ నిడివియును గలిగి యతిరమ్యంబై,...నిద్రామందిర ములరు మృదుల తల్పతతులలోన్." ఉ. రా. ౨, ఆ. ౨౯౩, పి. శకుం. ౩, ఆ. ౮౩; 2. అశ్వగతిభేదము. "సీ నిజిత్రితంద్రికలో ఖిడి యంబుభు లెల్లఁ గడపె వన్నెవిధాన నిడివిఁ దోలి." ప్రబంధ. ౧౮౫, విణ. దీర్ఘము. "గీ. ఇట్టివేసవికాలఁ బగ లెట్టి నిడివి, దైన వయిరించు తే దివికారి యనుచు..." లక్ష్మి ౩, ఆ ౭౬, కేయూర. ౩, ఆ. ౧౨.

నిడు. దే. విణ. (నిడుదశబ్దమునకు వృత్తియం దంత్య వర్ణలోపము.) దీర్ఘము, పొడువైనది. "సీ. మును మించి నిడువోర మంచి దాఁటినమహాజలధి పూరము దల కెదవ గాఁగ." హరి. పూ. ౪, ఆ. ౧౬, హరిశ్చ. ౪, ఆ. ౯౬౮.

నిడుచేయు. దే. అ. క్రి. (నిడు+చేయు.) చాఁగు. "క. పడి సాదుగఁబడి పలకేల్, నిడుచన గనయమునఁ బెనఁచి నీల్గి బలం జేర్పడ.." భార. ఆది. ౭, ఆ. ౧౭౫.

నిడుద. దే. వి. దీర్ఘము, ద్విమాత్రస్వరసంజ్ఞ. "క. గురువులు నిడుదలు .."కవిజనా. ౧, అధి. ౧౩, ఆం. భా. ద్వి. ౧౮౮. విణ. దీర్ఘము, నిడుపైనది "క...సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం, దొదరి భవత్పుకు మార్కొని, నిడుదపెదఁద తూపు లేసి కాఁకఁ దూలించెన్." భార. కల్యా. ౧, ఆ. ౩౭౬, ఆం. భా. తృ. ౧౮.

నిడుదనిదుర. ద్వ. వి. (నిడుద+నిదుర.) దీర్ఘనిద్ర, మరణము. "క...కాకం,బులు నఱవఁగ నిడుద నిదుర, నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడు గదే." భార. అశ్వ. ౨, ఆ. ౧౬౨.

నిడుదవెన్ను. దే. వి. (నిడుద+వెన్ను.) సర్పము, దీర్ఘపృష్ఠము. "సీ. నిడుదవెన్ను గయాళి తొడ వులదొర యుండు గుండుగం డనఁగఁ గైకొడు చేసి." అచ్చ. సుం. ౫౭.

నిడుపడు. దే. వి. (నిడుపు+అడు-శ. ర.) పాము, సర్పము. "సీ. శశిజాళి తిరుపుచే జడఁ జుట్టు నిడుపడు ద్రావిసపా లెరఁ గ్రాచె ననఁగ." రా. వి. ౩, ఆ. ౧౧.

నిడుపు. దే. వి. 1. నిడివి, ఆయామము. "వ...అది యును మూఁడుయోజనంబుల వెడల్పును మూఁట యేఁబదియోజనంబుల నిడుపును నేనుయోజనంబుల తనర్పును గలిగి..." భార. సభా. ౧, ఆ. ౬౨, ఆం. భా. ద్వి. ౧౫౨; 2. నిలువు. "గీ. అర్ధ చంద్రుఁ డళియు రోమాళి నిడుపుఁ, బడఁగ శేఖరుం గళి కాంచపాది ప్రాసె, లేచినడుముక రాకశంక గా నణంచు జనము తెం దున్న దో

యుని సంకరయింపు." ముకుంద. ౨, ఆ. ౧౦౧. విశే. పొడుపైనది, దీర్ఘము. "ఆ. లంజకల్లు లనఁగ లతాంతకుఁగా నిట్టి, కట్టేఁదులకు వలువ కరుణ లేక, వాఁతిమాలినట్టి బ్రతుకులు నిడుపుగాఁ, జేసి విటులగోడు వోసికొనిరి." కలిక. ౪, ఆ. ౧౧౦, హైమ. ౮, ఆ. ౧౮౫. క్రి. విశే. నిలువుగా "సీ. అర్ధంబు నిలువు వాపద్దలగతి మనువిద్ద డొంకలనుండి శ్రేణిదాఁట." స్వా. ౨, ఆ. ౮.

నిడుబాట. ద్వ. వి. (నిడు+బాట.) పెద్దత్రోవ "అ అడవి యాఁకనమున నిడుబాట నట్టపాయుదము రమ్ము జలధిఁ జదల నవిన." భార. కర్ణ. ౨, ఆ. ౬౩.

నిడుమునుఁగు. దే. వి. (నిడు+మునుఁగు.) నిండు మునుఁగు. "సీ. కాల్లు కుప్పువడంగఁ గదలఁజాలక యుట్టె నిడుమునుం గిడి శయనించుచెలువ." దశా. ౪, ఆ. ౪౫.

నిడుముస్తె. ద్వ. వి. (నిడు+ముస్తె.) తుంగకో. (శ ర.)

నిడువాలు. దే. విశే. (నిడు+వాలు.) నిడుపైనది. "సీ. వారణంబులనిడువాలు తుండంబులఁ జెలఁగి యూఁచఁగఁ గూర్కు చిలుకలులు." శకాం. ౧, ఆ. ౧౯.

నిడుపెంట్రుక. దే. వి. (నిడు+పెంట్రుక.) రోమాంచము. "క. జడనుం దాకము నిద్రయు, నిడు పెంట్రుకతోడ బెగడు నిట్టూర్పులు సంధడిగొని వడిగొని మదిలోఁ, జిడిముడిపడి కన్నులగవయుఁ జిడిముడి పడఁగాన్." ఉ. హరి. ౬, ఆ. ౮౯.

నిడుపెంట్రుకపెట్టు దే. అ. క్రి. (నిడుపెంట్రుక+పెట్టు.) రోమాంచమునొందు "చ. సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపుసేలఁ జూడఁగా, విర విరపోయి మేను నిడుపెంట్రుక పెట్టుచుఁ గంప మొందె..." భార. భీష్మ. ౧, ఆ. ౧౯౧, భాగ. ౧౦, పూ. ఉ. ౯౮౨.

నిడుసు. దే. వి. చదువుటలో దీర్ఘములతోఁ గూడిన పెద్దధ్వని. "సీ. నిడుసునఁ జెట్టక విపొ్పటమునఁ బోక కరువాయి తప్పక కడవికొనక." సకల. ప ౩౦౮.

నిడూర్పు. దే. వి (నిడు+ఊర్పు.) నిట్టూర్పు, దీర్ఘ నిశ్వాసము. "ఉ. అవచనంబు వేడ్క విని యాదల యూఁచి నిడూర్పు పుచ్చి హా, మావలి తల్కి..." హంస. ౪, ఆ. ౧౬౫, శు. శతం. ౮, ఆ. ౫౮.

నితంబము. సం. వి. అ. పుం. 1. పిఱుఁదు; 2. మొల, కటి; 3. మూఁపు, స్కంధము; 4. ఒడ్డు, కూలము; 5. కొండనడుము అద్రికటకము.

నితంబవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. నితంబిని, స్త్రీ; 2. గొప్పపిఱుఁదులు గలస్త్రీ.

నితలము. సం. వి. అ. న. అధోలోకములలో మూఁడ వది.

నితాంతము. సం. విశే. (అ. ఆ. అ.) అధికము. అధికము. క్రి. విశే. అత్యంతము.

నిత్తెపెండ్లికొడుకు ద్వ వి. (నిత్తెము+పెండ్లికొడుకు.) 1. నిత్యశోభనుఁడు. "క...వీమనుచుం, దీవింప నిందు మనుపే, గోవిందుఁడు నిత్తెపెండ్లికొడు కన విందున్." రాధా. 3, ఆ. ౭౫.

నిత్తెమల్లె. వై. వి. (నిత్తెము+మల్లె.) నిత్యముఁబూయు మల్లికావిశేషము. "సీ. నీలాంబరంబులు నిత్తెమల్లెలు కొండగోఁగులు మల్లెలు గోరంటలును." భల్లా. 3, ఆ. (శ. ర)

నిత్తెము. వై. విశే. (సం. నిత్యమ్.) శాశ్వతము. "క. నత్తైన దల్ల క్షణికము, నిత్తెము గా దంచు వావా వివహామువలెనే." దశా. ౧౦, ఆ. ౫౫.

నిత్యకర్మము. సం. వి. న్. న. 1. చేయనిచో ప్రత్యవాయము గలిగించుశాస్త్రవిహిత మగు కర్మము. (స్నానసంధ్యాది); 2. ఎప్పుడును చేయఁ దగునది.

నిత్యకల్యాణము. సం. వి. అ. పుం. ఎల్లప్పుడును గలుగుశుభము. "ఉ...హృద్యనిరంతరవాద్య ఘోషణల్, రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించి నిత్యకల్యాణముఁ బచ్చతోర ణముసై జను లందఱు నుల్లసిల్లఁగన్." విజ. ౧, ఆ. ౯3, దశా. ౧, ఆ. ౨.

నిత్యకడి. వి. వి. (నిత్యము+కడి.) నిత్యము నియము ముగా నీయవలసినది, దినకడి. "ద్వి. మ్రొక్కక కరములు మోడ్చి కందంద, చిక్కక త్రుక్కక చక్కన వచ్చి, గుడి సొచ్చి తననిత్యకడి కేదు కొనఁగ, మిడమిడ మిడుకుచు మిఱుమిండఁ దనిరి." బస ౪, ఆ. ౧౨౯. పు.

నిత్యము. సం వి. అ. పుం. సముద్రము. విశే. (అ. ఆ. అ.) 1. ఎడతెగనిది; 2. చేయనిచో ప్రత్య వాయము గల్గించుచు విధివాక్యముచే బోధింపఁ బడునది; 3. శాశ్వతము; 4. అవశ్యకము. క్రి.

విశే. 1. ప్రతిదినము; 2. ఎల్లపుడు, శాశ్వతముగా (దీనికి కొన్ని రూపముల మువర్ణలోపము. ఆను. ౪, ఆ. ౨౩౩ చూ.)

నిత్యసమాసము. సం. వి. అ. పుం. లౌకికవిగ్రహము లేనిదికాని, స్వపదముతో కాక అన్యపదముతో లౌకికవిగ్రహము కలది యగుసమాసము. (ఆంధ్రశబ్దచింతామణి, వ్యాకరణము చూ.)

నిదర్శకుఁడు. సం. విశే. (అ. కర్తా. అ.) 1. చూచువాఁడు; 2. కనుపెట్టువాఁడు; 3. చూపువాఁడు; 4. తెలుపువాఁడు.

నిదర్శన. సం. వి. ఆ. స్త్రీ. అర్థాలంకారవిశేషము. వసు. ౫, ఆ. ౧౫౩, ౧౫౭.

నిదర్శనము. సం. వి అ. న. 1. చూపు, దృష్టి; 2. చూపుట; 3. ఉదాహరణము; 4. ప్రమాణము. విశే. (అ. ఆ. అ.) 1. చూపునది; 2. వెల్లడించునది; 3. బోధించునది.

నిదర్శించు. సం. స. క్రి. 1. నమ్ము, విశ్వసించు. "క. ఇతఁడా శ్రీగిరిమల్లికార్జునుఁడు... నీ వెట్టిని గాను తెలుపు నిదర్శింపంగ నాతో దనా, చతురత్వంబులు..." హర. 3, ఆ.౪౭; 2. నిశ్చయించు. "వ... కార్యంబు నిదర్శించి బృహస్పతి యింద్రాదిదేవతల కిట్లనిరి." కాశీ. ౫, ఆ ౨౫౫

నిదాఘము. సం. వి. అ. పుం. 1. వేసఁగి, గ్రీష్మము; 2. వేఁడిమి, ఉష్ణము; 3. చెమట, ఘర్మజలము.

నిదానము. ఉభ. వై. వి. (సం. నిర్ధారణమ్) 1. తొందరపడక విచారించుట. (శ. ర. వా.) సం. వి. అ. న. 1. ఆదికారణము, కారణము; 2. దూడను కట్టుపలుపు; 3. రోగనిర్ణయము.

నిదానించు. యుం. వై. అ. క్రి. నిశ్చయించు "వ .. అప్పించుఁబోఁడి విషాదంబు నివాదంబై సంధిల్లిందుఁ దన్నిదానం బిద్ది యని నిదానింప నంతఃకరణం బకరణంబు గాకేరదు..." కాళిందీ. ౨, ఆ. ౬౨, సం. అ. క్రి. పరికించు. "ద్వి. చీకు దర్పణము వీక్షించినయట్లు, నాకలరూపు మిన్నక నిదానించి, చేటుగా కివ్వరుఁ దలియుకే రవిన." నవనాథ. ౫, ఆ. ౧౭౬ పు

నిదిగ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. వృద్ధి నొందింపఁబడినది; 2. పూయఁబడినది.

నిదిగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ములగ, ములాకి; 2. వాకుడుచెట్టు.

నిదిధ్యాసకుఁడు. సం. విశే. (అ. సికా. అ.) నిరంతర ధ్యానము చేయువాఁడు.

నిదిధ్యాసనము. సం. వి. అ. న=నిదిధ్యాసము.

నిదిధ్యాసము. సం. వి. అ. పుం. శ్రవణమననములచే తెలియఁబడినవిషయమును ఏకాగ్రమగుమనస్సుతో నిరంతరము ధ్యానముచేయుట.

నిదిధ్యాసితము. సం. విశే. (అ ఆ. అ.) నిరంతర ధ్యానము చేయఁబడినది.

నిదిశత్. సం. (శత్రం.) 1. చూపుచున్న; 2. ఆజ్ఞాపించుచున్న.

నిదిశ్యమానము. సం. విశే. (అ. ఆ. అ) 1. ఆజ్ఞాపింపఁబడుచున్నది; 2. చూపఁబడుచున్నది.

నిదిష్టము. సం విశే. (అ. ఆ. అ.) 1. చూపఁబడినది; 2. ఆజ్ఞాపించఁబడినది.

నిదుర. వై. వి. (సం. నిద్రా.) నిద్ర. "మ...రాజనందనుచో కూరయ వేఁడి పేరెలుఁగు నిద్రకేను రూఁగాడెదుక్, నను నీయంకతలమ్మున న్నిదురనూనం జేయవే వేఁడెదన్." నిర్వ. 3, ఆ. ౯౪, భార. ఆశ్ర. ౧, ఆ. ౬౩.

నిదురతెలియు. ద్వ. అ. క్రి. (నిదుర+తెలియు.) మేలుకాంచు. "ఆ సాంధ్యరాగలహరి సామి రంజితమువై, తిరిగి మింట నిదుర తెలిసినట్టి యింది రాధిపతికి కాత్తుకర్పూరసో, రాజరంబు లన శరద్ఘనములు." ఆము. ౪, ఆ. ౧౩౯.

నిదురపుచ్చు. ద్వ. స. క్రి. (నిదుర+పుచ్చు) నిద్రింపఁజేయు. "సీ. ఆ క్తమాయలు సుఖాయత్తులై నవ లింప మృదుపదంబుల నొత్తి నిదురపుచ్చి." శుక. ౧, ఆ ౧౪౯.

నిదురపోతు. ద్వ. విశే. (నిదుర+పోతు.) ఎల్లపుడు నిదురపోవు స్వభావము కలవాఁడు, నిద్రాళువు. "క. వినియుం వినవు రణధీరువు, మహజాఢము నిదురపోతు మందుని నకటా, నినుఁ జక్రవర్తిఁ జేసిన, మనజానకుకంటె కొట్టివాఁడును గలఁడే." భాగ. ౯, స్కం. ౪౦౯.

నిదురపోవు. ద్వ. అ. క్రి. (నిదుర+పోవు.) నిద్రించు. "ఉ...కడుఁ ద్రిప్పటచే శ్రమకొందినారుగాఁ, బోలుకు బోదునా నిదురపోయెద కే యని..." కళా. ౪, ఆ. ౧౦౯. ఇట్లే నిదురవోవు. ఉ. రా. ౬, ఆ. ౩౩౫.

నిదురించు. వై. అ. క్రి. నిద్రగొందు, నిద్రించు. "క. నిదురించినకొను వాఁగొని, కదుకుదుఁ బరు

గోరి కారలి…" భాగ. ౧౦, స్కం. పూ. ౨౫౦. నీలా. ౧, ఆ. ౬౭.

నిదేగ్ధ. సం. విణ. (ఋ. గ్ధీ. ఋ.) పూయువాఁడు.

నిదేగ్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పూయఁదగినది.

నిదేశకుఁడు. సం. వి. (అ. శా. అ.) 1. చూపువాఁడు, 2. ఆజ్ఞాపించువాఁడు.

నిదేశనీయము. సం. = నిదేష్టవ్యము.

నిదేశము. సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. చెప్పుట, కథనము; 3. దాఁపు, నికటము.

నిదేశి. సం. విణ. (న్. నీ. న్.) 1. చూపువాఁడు; 2. ఆజ్ఞాపించువాఁడు.

నిదేశించు. సం. స. క్రి. ఆజ్ఞాపించు. "మ. జని సావిత్రకపుఫలం బితనిసాక్షాత్కార మాస్వామి క్రైక నిదేశింప వనిం జరింపఁ జను టాకర్ణింప శక్యంబె…" చం. రా. ౪, ఆ. ౭౪.

నిదేశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁదగినది.

నిదేష్టృ. సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. చూపువాఁడు.

నిదేష్టవ్యము. సం. = నిదేశ్యము.

నిద్దపుఁదనము. వై. వి. (సం. స్నిగ్ధత్వమ్.) నునుపు, స్నిగ్ధత్వము. "వ ..వలఁదకనంబులు నలకంద నంబులు నిద్దంపుఁదనంబులం దద్దయుం గలిగి .. కనక కదళిమృదులంబులు నైనపెందొడలును…" పాండు. ౩, ఆ. ౧౬౯.

నిద్దము. వై. వి. (సం. స్నిగ్ధమ్.) 1. నున్ననిది. "గీ. ఉవిదనిద్దంపుబాహులసవతుఁ గోరి, కలమగర్భంబు లడఁచుఁలోఁగంటకములు." ఆము. ౫, ఆ. ౩౩; 2. మనోహరము. "ఉ…పికంబు గూయ న, న్నిద్దపుమోవిక మున్నుదురు కొచ్చెలు లిచ్చ కౌఁగిలింగి యిచ్చటన్." కావ్యా. ౧. ఉ. ౭౮, విక్ర. ౨, ఆ. ౧౦౨; 3. స్నేహము గలది, ప్రేమతోఁ గూడినది. "సీ. బ్రహ్మాండకోటుల పొరుకత్తెము కెల్లఁ గని యుండ్కి నిద్దంపుమనసు తోడ." పాండు. ౧, ఆ. ౬; 4. అధికము. "సీ. తల్లిదండ్రులకు నిద్దపుభక్తి తవలిల్ల శుశ్రూష చేసినశుద్ధమతులు" కాశీ. ౨, ఆ. ౧౧. దశా. ౮, ఆ. ౮౮; 5. సాంద్రము, దట్టము. "చ.. నిబిడిన బొజ్జపై మిగులనిద్దపుదోవతిదట్టి దొల్లి రాఁ, దివిచి బిగంగ వల్లవముఁ ద్రించి…" ఆము. ౬, ఆ. ౮౧, కళా. టీక. ౪౪.

నిద్దా = నిద్దము. వై. విణ. 1. ప్రేమ గలది. "క. ముద్దుల నిడి వదలింద్దక, ముద్దియ లాక్షీయ లెనసి మురియుందు నిద్దా, ముద్దుల కొత్తుచు, నం దొగి, నిద్దము నిద్ద మని కాలినిద్దం బనుచున్." రా. వి. ౨, ఆ. ౨౦; 2. అధికము. "ఉ. కాలిరి యుం బలల్ మణిపురాధిపహాయల్ చెదియార జంపుని,ద్దాశరికిప్రలంబ లెను దారిబిలక్ వలె లోఁ దలంచివన్." (పెద్దనచాటువు.); 3. శ్రేష్ఠము. "సీ. జిలుఁగుచీనాపట్టుచెంగావిచెఱఁగులనిద్దాజరీనిశానీలకరులు." రంగా. ౧, ఆ. ౧౫౭; 4. సాంద్రము, దట్టము. "మ. కరులుం బాయక జాని మైబొడలు నిద్దామినాసలున్. ః.. కల్గు నిమ్ము భళి యింతుక్ దంభమీనాధిపా." దశా. ౧, ఆ. ౨౧౧.

నిద్దుర = నిదుర. "చ . మననాయకుఁ డేమి చెప్ప న్నిద్దుర మునుమున్న గాఁ జెలిని తోడుగ నిన్నటులైనఁ దేక…" రాఘవ. ౪, ఆ. ౧౯౨. శైవ. ౮, ఆ. ౧౬.

నిద్దురగొను. ద్వి. అ. క్రి. (నిద్దుర+కొను.) నిద్రించు. "సీ…నిద్దురగొనియె గుణక, గొనియె నిద్దుర వోయెఁ గూర్కెడె నన నిద్రికుల కొల్ల…" సాం. ని. మాన. ౨౩.

నిద్దురపుచ్చు = నిదురపుచ్చు. "చ. మది కొలపోరు మాన్ప నిజవల్లభునిద్దురపుచ్చ మాటలో రదు మఁగ…" శుక. ౨, ఆ. ౯౮.

నిద్దురపోఁకు = నిదురపోఁకు. "సీ. అతిథనాపేక్ష చే నలరక నిద్దురపోకును గాక పెంపుడును గాక." భల్లా. ౪, ఆ. (శ. ర.)

నిద్దురపోవు. ద్వి. అ. క్రి. (నిద్దుర+పోవు.) నిద్రించు. "ఉ…వాణిసిభుఁ డిప్డు మై మఱచి నిద్దుర వోవఁగఁ జూచి…" దశా. ౧, ఆ. ౨౬౫.

నిద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. నిదుర, కూర్కు. "క… వేఁగుఁబోకట నంతరించుచుదంబుఁ గెంపుగదు రుట నిద్ర లేమి నని శంకింపక…" భార. విరా. ౨, ఆ. ౨౪౦; 2. మనికిపాటు, ఊఁగు; 3. ముగుడుట, ముకుళనము.

నిద్రతెలియు. మి. అ. క్రి. (నిద్ర+తెలియు.) మేల్కొను. "గీ. నిరతేశమునఁ దశ్వేళ నిద్ర తెలిసి." ఆము. ౪, ఆ. ౧౪౪.

నిద్రపుచ్చు. మి. స. క్రి. 1. (నిద్రపోవు ధా. ప్రే.) నిద్రింపఁజేయు. "ఉ. పాపని నిద్రపుచ్చి తగు

పోవునఁ..." హరి. పూ. ౫, ఆ. ౧౩౮; 2. లయముఁబొందించు. "గీ. సకలమును నిద్రవుచ్చు లీలవుని నిద్రవుచ్చుమనుటకు నిట్టి దద్భుతమె కలఁడు." ఆము. ౪, ఆ. ౧౦౯. (ఇది మొదటి యర్థమునకు నుదాహరణము.)

నిద్రపోతు. వి. వి. (నిద్ర+పోతు.) నిద్రాళువు. "ద్వి. నిదురకుండ్లది యైన నిద్రపోతైన." ద్వి. భల్లా. ౨, ఆ. ౩౭, పు.

నిద్రవోవు. వి. అ. క్రి. (నిద్ర+పోవు.) నిద్రించు. "క...తో, త్మునఁ జేయిడి నిద్రవోరు మది తాత్ముండై." భార. ఆది. ౬, ఆ. ౬౨, ఆము. ౪, ఆ. ౨౪౧.

నిద్రచేయు. వి అ. క్రి. (నిద్ర+చేయు.) నిద్రించు. "ఉ. నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు మున్నున్న తెఱంగు దప్పక సుఖోచిత శయ్యను నిద్రచేయు నీ, కన్ను మొగుడ్చు నూఱ టకుఁ గారణ మెయ్యది భీమసేన..." భార. విరా. ౨, ఆ. ౧౬౬, రఘ. ౯, ఆ. ౪౨.

నిద్రాణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిదురించునది; 2. ముకుళించునది. "శా...దిశాస్తోమంబు శోభాదరి, ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్." స్వా. ౩, ఆ. ౧౨.

నిద్రాళువు. సం. విణ. (ఉ) నిద్రాశీలుండు, నిదురపోతు.

నిద్రించు. సం. అ. క్రి. నిదురపోవు. "వ. ఇట్లూహించి రాత్రిసమయుం బగుటయుఁ సమస్తజనం బులుఁ గ్రమంబున నిద్రింపఁ దొడంగినన్...." భార. విరా. ౭, ఆ. ౧౬౫, కాళిందీ. ౬, ఆ. ౨౭౪.

నిద్రితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిద్రించినది; 2. ముకుళించినది, మొగిడినది. (పుష్ప. మొ)

నిద్రిలు. సం. అ. క్రి. నిద్రించు. "ఉ...జటాచ్ఛటాచ్ఛదిన్, దృష్టిలంగట్టి నిద్రిలుమరుద్భగ ధీశకులంబు మేల్కొనన్." పాండు. ౫, ఆ. ౨౪౯.

నిధనము. సం. వి. అ. పుం. న. 1. మరణము; 2. చేటు, నాశము; 3. సమాప్తి.

నిధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బీద, నిర్ధనుఁడు. సం. మృచ్ఛ. ౧, అం. ౧౪.

నిధానము. సం. వి. అ. న. 1. ఉంచుట, స్థాపనము; 2. పదిలపఱుచుట; 3. పాఁతిపెట్టినసొమ్ము, నిధి; 4. ఆశ్రయము, ఆధారము.

నిధి. సం. వి. ఇ. పుం. 1. ఆధారము, ఆశ్రయము; 2. పాఁతర; 3. బొక్కసము, కోశాగారము.

నిధువనము. సం. వి. అ. న. 1. మైథునము, స్త్రీపురుషులరతి; 2. క్రీడ, కేళి; 3. వణఁకు, కంపము.

నిధ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధ్యానింపఁబడినది; 2. చూడఁబడినది.

నిధ్యానము. సం. వి. అ. న. దర్శనము, చూపు.

నిధ్యానించు. సం. స. క్రి. చూచు. "వ. ఫలితసహకారంబు నిధ్యానించురాజకీరంబువడువునఁ బ్రియనందన సందర్శనానంద కందలకందిల హృదయారవిందుండై..." నిరం. ౧, ఆ. ౭౩.

నిధ్వానము. సం. వి. అ. పుం. ధ్వానము, శబ్దము.

నినదము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

నినదించు. సం. అ. క్రి. ధ్వనిచేయు. "క. అణఁ ద్రుణముగఁ జూచి కేయని, నినదించుచుఁ బోరలు విమతనికరముఁ గరుణన్, గనుఁగొని కాచుట సైజము..." కావ్యా. ౫, ఉ. ౬౨.

నినయనము. సం. వి. అ. న. 1. పొందించుట; 2. చేయుట; 3. (కాలము) కడపుట; 4. సిద్ధింపఁ జేయుట.

నినాదము. సం.=నినదము.

నినాది. సం. విణ. (న్. నీ. న్.) 1. ధ్వనించునది, మ్రోఁగునది; 2. వాయించునది.

నినాదితము. సం. వి. అ. న. ధ్వని. విణ. (అ. ఆ. అ.) మ్రోయింపఁబడినది.

నినుచు. దే. అ. క్రి. (నిండుధా.) అతిశయించు. "సీ. దైత్యారి పరమైనతనచిత్త మంతయు నినుచు గౌరవమున నివ్వటించి." పాండు. ౧, ఆ ౯. స. క్రి. (నిండుధా. ప్రే.) 1. ఉంచు, పెట్టు. "క. అనుటయుఁ రసలింగము నిడు, తనపట్టువ ప్రేమముజ్జదంతపులరణిన్, నినిచినయొక నవ నిధి యది, యని చెప్పక పూనెఁ దత్ప్రదాంబుజయుం గలిన్." స్వా. ౧, ఆ. ౭౭, రసిక. ౪, ఆ. ౭౪; 2. వ్యాపింపఁజేయు. 'క. మనిచెద నానా నాంగము, నినిచెద భువనములఁ గీర్తి నిష్ఠురగతితో నవిచెన నిను జముప్రోలికి..." భా. రా. యు. ౧౨౩౯; 3. చిక్కిలఁజేయు. "మ ..హా, క్షుని నిట్టూర్పు నినుడ్పుఁ గన్నుఁగవ బాష్పాంభఃకణం బుల్ గడున్, నినుచున్..." భో. ౪, ఆ. ౩; 4, నాటు, నిరుడు. "చ. శిసుక మనంబునం గదిసి

క్రీడి కృపాచార్యువిల్లు ద్రెళ్లిడిం,దునిమి నిశాంత గాఢరయదోర్వీర్యభవంబున నొండువిల్లు గైకొని యొడఁబడునన్ నినిచెఁ గ్రూరశరంబు లురంబు నందు ..'' భార. విరా. ౫, ఆ. ౧౭౬, అచ్చ. యు. ౨౧౪; 5. నించు, నిండించు. "చ. అని ప్రణమిల్లినన్ ఫణికులాధిపుఁ డయ్యమృతంబు కుండలో, నినిచి ప్రియంబుతో నొసఁగి..." ద్వా. ౯, ఆ. ౧౨౭, పారి. ఉ. ౧, ఆ. ౧౦.

నినుపారు. దే. అ. క్రి. (నినుపు+ఆరు.) 1. అధికమగు. "సీ. నిండారు చందురు నినుపారు సను గాంతిఁ జెలువగా మరుఁడు సృజించి నట్లు." మార్క. 3, ఆ. ౯౩, నిర్వ. ౧, ఆ. ౫౫; 2. పూర్ణమగు, నిండు. "మ...నాళ్గోడలన్, నినుపారంగ సువర్ణ మెత్తికొని..." కేయూర. 3 ఆ. ౧౭౧, భార. అశ్వ. 3, ఆ. ౧౪౫; 3. వ్యాపించు. "ఉ. చిల్లులచిల్కలం జిలికి చిల్కల కొల్కులు చల్లులాడ సం,కల్లలితాంగి చూచి కదుఁ గ్రొత్తనుచేడుక వారిపూరముల్, చల్లెఁ దదంగనాంగలతల్ నినుపార ననంగ నప్పుడు, తుల్లపరూరుపాంతరమధూళిఁ జిప్పుల్కనఁ జెప్పెఁ దప్పెరల్."రాజ. చ. ౨, ఆ. ౧౫౫; 4. చిప్పిలు, పైకుబుకు. "చ...కరుణారసంబు నినుపారెడు చూపులఁ జూచుఁగావుతన్." పారి. పీఠి. ౬.

నినుపు. దే. వి. (నినుచుధా.) వెల్లువ, జలపూరము. "చ...కన్నులన్, నినుపులు గాఁగ బాష్పములు నివ్వటిలంగ..." భో. ౭, ఆ. ౧౦. విణ. 1. మనోజ్ఞము. 'ద్వి. నినుపుగా స్ఫాటికనిర్మలలింగ, మనఁగ నాస్ఫాటికాయతలింగమూర్తి, వరుణుండు ధరియించి..." పండితా. దీక్షా. ౧౯, పు. 2. సమృద్ధము. "చ. నినుపు లాకర్తు చేతఁ గమనీయలతాంతము లున్న వొక్కెడన్, గనఁగొని..." నిర్వ. ౯, ఆ. 3౬.

నిన్న. దే. వి. అ. (క. నిన్నెత. నిన్నెల్.) 1. కడచినదినము, పూర్వదివసము. "సీ. జనసుత దాని వత్సంబు నిన్నటఁగోలె నడుగక యఱచుచు నున్న యదియు." భార. ఆది. ౯, ఆ. ౧౧౯, వసు. ౫, ఆ. ౫౯; 2. అచిరభూతకాలము, కొలఁది కాలమునకు ముందు. "సీ. మేనత్త యనుపేర మాటి రాధికతోడ కొనయఁడే నిన్నన యనుఁగు బావ."శశాం. 3, ఆ, ౯౧, ఆము. ౬, ఆ. ౪౦.

నిపఠనము. సం. వి. అ. న. పాఠముచదువుట.

నిపఠము. సం. వి. అ. పుం. = నిపఠనము.

నిపతనము. సం. వి. అ న. 1. క్రిందఁబడుట; 2. పశుపక్ష్యాదులు క్రిందికి వచ్చుట.

నిపతించు. సం. స. క్రి. 1. పడఁద్రోయు, పడఁగొట్టు; 2. నిపాతముచేయు. (వ్యాక.)

నిపతితము. సం.=నిపాతితము. పడఁగొట్టఁబడినది. "ఆ. పాతరథుండు నిపతితాశ్వుండు సంఛిన్న, చాపుఁడును..." భార. విరా., ౫, ఆ. ౧౫౦.

నిపత్య. సం. వి. ఆ. స్త్రీ. 1. యుద్ధభూమి; 2. జారునేల, పిచ్ఛిలభూమి.

నిపము. సం. వి. అ. పుం. న. కలశము. పుం. కడిమిచె.

నిపాఠము. సం. వి. అ. పుం. పాఠము చదువుట.

నిపాతకము. సం. వి. అ పుం. న. పాపము, పాతకము. విణ. (అ. తీ. అ) క్రిందికి త్రోయునది.

నిపాతన. సం. వి. ఆ. స్త్రీ. పతనము, పాటు. "ఉ... ఉగ్రగదఁ గైకొని వైచినఁ దన్నిపాతనన్, సూతతురంగకేతువులు చూర్ణములై యడఁగెన్ ..." పారి. ఉ. ౧౦, ఆ ౭౧.

నిపాతనము. సం. వి. అ. న. 1. పడఁద్రోయుట; 2. చంపుట, మారణము; 3. సూత్రమునకు వ్యతిరేకముగా శబ్దరూపమును విధించుట; 4. పదములు మొదలగునవి క్రిందికి వచ్చుట. విణ (అ.ఆ.అ.) 1. పడఁద్రోయునది; 2. చంపునది.

నిపాతము. సం. వి. అ. పుం. 1. పతనము, పడుట; 2. క్రిందికి వచ్చుట; 3. మీఁదికి దుముకుట; 4. ఏయుట, బాణాదులు విసరివైచుట; 5. చావు, మరణము; 6. అప్రయత్నము, యదృచ్ఛ; 7. సూత్రములకు వ్యతిరేకముగా విధించినశబ్దము. "గీ. అలసపత్త్వంబుల నసత్త్వములఁ గ్రియాను, రాశయముల స్వరాదుల నవ్యయములఁ, దా నిపాతంబులుగఁ జేసి ధరఁ దదంతసంగ్రహోయుక్తమతి నైనసాధుమూర్తి." కాళిందీ. ౫, ఆ. ౨౨; 8. అవ్యయము. విణ. (అ. ఆ. అ.) పడఁగొట్టఁ బడినది. కాళిందీ. ౫, ఆ. ౨౭.

నిపాతి. సం. విణ. (న్. పీ. న్.) 1. పడునది; 2. పడఁద్రోయునది; 3. నశించునది; 4. క్రిందికి వచ్చునది; 5. నాశము చేయునది 6, నిపాతము గలది,

నిపాతించు = నిపతించు. (కడఁగొట్టు.) "క. అతో యధి నీచేతం, బీతం బగుడుం గడంగి భీమాసుర సంఘాతంబుఁ దల్ తుణంబ నిపాతింతుము దివ్య శస్త్రపటుఘాతములన్." భార. అర. 3, ఆ. 3౭.

నిపాతితము. సం. విణ. (అ. ఆ. అ) 1. పడఁద్రోయఁబడినది; 2. చంపఁబడినది; 3. నిపాతము చేయఁ బడినది. (వ్యాక.)

నిపానము. సం. వి. అ. న. 1. నిశ్శేషముగా త్రాగుట; 2. పసులు లోనగునవి నీళ్లు త్రాగుటకై బావుల మొదలగువానిలోఁ గట్టినతొట్టి; 3. జలాశయము.

నిపీడన. సం. వి. ఆ. స్త్రీ = నిపీడనము.

నిపీడనము. సం. వి. అ. న. 1. గట్టిగా పిడుచుట; 2. మిక్కిలి బాధించుట, 3. గట్టిగా అదుముట.

నిపీడితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పిండఁబడినది; 2. గట్టిగా అదుమఁబడినది; 3. మిక్కిలి బాధింపఁబడినది.

నిపీడితుఁడు. సం. విణ. (అ. ఆ అ.) మిక్కిలి బాధింపఁబడినవాఁడు. "ఉ ..ఈ, కావర మైన కీచకుఁడు కామనిపీడితుఁడై ..." భార. విరా. ౨, ఆ. ౨౨౮.

నిపీడ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి బాధింపఁబడుచున్నది. "క...మనోభవ నిపీడ్యమానమానస నయిలెన్." భార. ఆది. ౬, ఆ. ౧౯3.

నిపీతము. సం విణ. (అ. ఆ అ ) త్రాగఁబడినది.

నిపీతి. సం. వి. ఇ. స్త్రీ. పానము, త్రాగుట.

నిపుణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి, ప్రవీణుఁడు.

నిప్పచ్చే = నిప్పచ్చరము. (శ. ర.)

నిప్పచ్చరము. ద్వ. వి. (నిఱు+పచ్చరము.) దారిద్ర్యము, బీదతికము. "క. అలజడిగలారు కలుషము, గలారు నిప్పచ్చరంబు గలవారు దుజల్, గలవా రనభిజ్ఞత్వము, గలారు పురి కొందరేరు..." కవిజ. ౧, ఆ. ౭౬, ఆం భా. ద్వి. ౨౧౦. విణ. 1. శూన్యము, రిక్తము. "గీ. బోధమల్పంబు గర్వ మత్యున్నతంబు, కాంతి నిప్పచ్చరంబు..." భీమ. ౧, ఆ ౧3. కాశీ. ౫, ఆ. 3౦౨; 2. బలహీనము; దీనము. "గీ. మోఱపని చందమున నీఱకాఱచూపు, పాండవేయుని కైదార్చి ప్రాణంబుండు, పలికె నిప్పచ్చరం బైన భాషణముల." పార. ౪, ఆ. ౧౪.

నిప్పటి. దే. వి. (నిప్పు+పట్టు.) భస్మవిశేషము, అడవి పిడకలు కప్పి నిప్పులో వేసి కాల్చెడి అట్టు. "ఉ......భానుమండలము మాఁడిననిప్పటిరీతి నుండ..." రామా. ౮, ఆ. ౬3, ఆం. భా. ద్వి. ౨౫౬.

నిప్పట్టు. దే. వి. (నిప్పు+అట్టు.) నిప్పటి. "వ... ఉంద్రంబులర కుడుములు దోసెలు నిప్పట్లు..." ప్రబంధ ౧౮౨.

నిప్పుస్తు. దే. ధి. (నిఱు+పస్తు.) పూర్ణమైనయుపవాసము; ఉపవాసము "క...అశనదూరము, దొరకదు నిప్పుస్తు లుండుదుము నీ మ్రోలన్." వేం. పంచ. ౧, ఆ. ౪౯౫. ఆం. భా. ద్వి. ౧౪౫.

నిప్పు. దే. వి. (క. నిప్, నిప్పురి.) అంగారము; అగ్ని. "ఉ. అత్తతి ద్రొక్కినటు కాదల దెల్గొని నట్టులు..." పాండు. ౫, ఆ. ౧౯౯. ఆం. భా. ద్వి. ౨౪౨. బ. అగ్నికణములు, విస్ఫులింగములు. "క. అప్పుడు కోపము గన్నుల, నిప్పులు రాల్పంగ..." భార. భీష్మ. 3, ఆ. 3౫౦. భా. రా. అర. ౧, ఆ. ౨౪౪.

నిప్పుఁదిండి. దే. వి. (నిప్పు+తిండి.) పక్షివిశేషము. (శ. ర.)

నిప్పుక = నిప్పు. (నిప్పు+ఉక-స్వార్థమున.) అగ్ని; అంగారము. "ద్వి. ఎఱ్ఱగా దీపని మెఱుగు లేబంబు, మఱుపడ్డనిప్పుకమాడ్కి నున్నాఁడు." ద్వి. హరిశ్చ. ఉ. ౧3౪. పు. 33౪. సం. ఆం. భా. ద్వి. ౨౪౨. బ. విస్ఫులింగములు, అగ్నికణములు. "క...కురిసెన్, గనగనగనమనుచు నిప్పుకలు గుప్పలుగన్." పాండు. ౫, ఆ. ౧౬౬. ఆము. ౪, ఆ. ౯౮.

నిప్పోటము. దే. వి. (చదువుటలో) అతిత్వర. "సీ. నిమిషమునఁ బెట్టక నిప్పోటమునఁ బోక తరువాయి తప్పక తడవికొనక" సకల. స. 3౫. పు.

నిబంధ. సం. విణ. (బు. స్త్రీ. బు.) 1. గ్రంథకర్త; 2. బంధించువాఁడు.

నిబంధకుఁడు. సం విణ. (అ. ధికా. అ.) = నిబంధ.

నిబంధనము సం వి. అ. న. 1. కట్టుట, బంధించుట; 2. గృహారామాదులను నిర్మించుట; 3. అడ్డగించుట; 4. సంకెల; 5. ప్రాపు, ఆలంబము; 6. ఏర్పాటు; 7 . స్థాపనము; 8. హేతువు; 9. గ్రంథము; 10. రచన, కూర్పు; 11. సంబంధము;

12. వ్యాఖ్యానము, వివరణగ్రంథము. సం. విణ. (అ. ఈ. అ.) బంధించుటకు సాధనమైనది.

నిబంధని. సం. వి. ఈ. స్త్రీ. సంకెల; గొలుసు లోనగు బంధించుసాధనము.

నిబంధనము. సం. వి. అ. పుం 1. బంధించుట, కట్టుట; 2. గృహారామాదులను నిర్మించుట; 3.(గ్రంథము) రచించుట. 4. గ్రంథము; 5. అడ్డగించుట ప్రతిబంధము; 6. సంకెల; 7. ఏర్పాటు; 8. ఆధారము, ఆశ్రయము; 9. హేతువు.

నిబంధి. సం. విణ. (న్. నీ. న్.) 1. బంధించునది; 2. మూలమైనది, కారణము; 3. సంబంధించునది.

నిబంధించు. సం. స. క్రి. 1. బంధించు, కట్టు; 2. అడ్డగించు, నిరోధించు. "మ...చిక్కఁ డింద్రియనూలం ద్రిప్పక నిబంధించుచున్." భాగ. ౧, స్క౦. ౭౪; 3. కూర్చు, రచించు. "వ...ఒక్క దివ్యప్రబంధంబు నిబంధింపక మదికెంచునవసరంబున." ఆనంద. పీఠి. ౧౨.

నిబద్ది. దే. విణ, సత్యము, నిజము. "క. దగ దప్పి యుండుగు నొంటుం, బిరి దప్పుదు జబ్బుకండ వెట్టఁగ నీ ద్యావగ మేలుగాద యింకా, జగుగణములం జేటలో నిబద్దే యనుమీ." పార్వ ౬, ఆ. ౫౧, ప్రబోధ. ౨, ఆ. ౫౩.

నిబద్దించు. దే. స. క్రి. నిజమగును, రుజావుచేయు. "క. గద్దించును లేదన్న నిబద్దించును జూడకున్నఁ బరికాపించున్." రాధా. ౧, ఆ. ౨౫, (శ.ర.పా.)

నిబద్దిలించు = నిబద్దించు. "మ....పొందుగ నీబుద్ది నిబద్దిలించు జవధద్రుండాగ్రహం బందుచోన్." ఉ. హరివ. ౪, ఆ. ౫౧. (శ. ర. పా.)

నిబద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బంధింపఁబడినది, కట్టఁబడినది; 2. అడ్డగింపఁబడినది; 3. రచింపఁబడినది. (గ్రంథము); 4. ఖచితము; 5. సంబంధించినది.

నిబర్హణము. సం. వి. అ. న. చంపుట, వధము. విణ. (అ. ఆ. అ.) 1. చంపునది; 2. పోఁగొట్టునది. "క ..అనుబిలబర్హణమే యది యక్కథయ వినఁగ నిష్టము మాకున్." భార. ఆది. ౧, ఆ. ౩౦.

నిబర్హితము. సం. విణ. (అ. ఆ. అ.) చంపఁబడినది.

నిబిడము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సాంద్రము, దట్టము; 2. గట్టిది, దృఢము. [(శ. ర.)

నిబిడీకరించు. సం. అ. క్రి. దట్టముగా చేయు.

నిబిడీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) నిబిడముగా చేయఁబడినది.

నిబిరీసము. సం. = నిబిడము.

నిబోధకుఁడు. సం. విణ. (అ. ధిగా. అ.) 1. బోధించువాఁడు; 2. గ్రహించువాఁడు.

నిబోధనము. సం. వి. అ. న. 1. తెలియుట, గ్రహించుట; 2. తెలుపుట, బోధించుట.

నిబ్బద్ది = నిబద్ది. "సీ. నిబ్బద్ది నిక్కము నిలుకడంబు నిజము నిక్కువ మన కాగదు సత్యముపేళ్లు." సాం. ని. మాన. ౫౧, వేంక. మాన. ౬౪.

నిబ్బరము వై. వి (సం. నిర్భరమ్.) 1. అత్యగలిబిశేషము. "సీ బలునిబ్బరమునకుఁ బ్రతి గాక గరుడియసామర్థ్యమునివాహనం బనఁ దగె." ఉ. రా. ౧, ఆ. ౧౭; 2. ఆధిక్యము, అతిశయము. "గీ...మిక్కిలి మిక్కుటం బగ్గలంబు, బెట్టు నిబ్బరము దిటము బిట్టు గాట, మనఁగ నతిశయమగును..." ఆం. భా. ప్ర. ౬౬; 3. పొగ్గ త్యము. "చ. కురులసిరుల్ మెఱుంగుఁజను గుబ్బలనిబ్బరముల్..." పాండు. ౫, ఆ. ౨౨౬; 4. బెత్తలం సవారి పోయునపుడు మిట్టపల్లము మొ. సూచించు హెచ్చరికపదము. "వ... బెత్తలు సిద్ధుగా మోచి నిబ్బడుగు ... నిబ్బరము...అన విని .." ప్రబంధ. ౬౦౫; 5. దిట్టతనము, ధైర్యము. "క. అమాట విని తలారులి, దేముని గద్దింప .....నిబ్బరంబునఁ బలికెన్." శుక. ౩, ఆ. ౫౮౫; 6. పారవశ్యము. "చ...ఒం, డొకమతి విస్మృత మది నుబ్బిన నిబ్బర మందుచుండు...భాగవతోత్తముఁ డాత్మఁ జొక్కుచున్." వి. పు. ౨, ఆ. ౩౦౦, 7. తదేకాగ్రత. "క...ఉత్సాహంబుల్, గుబ్బతిలఁ గొన్ని పెట్టుడు, నిబ్బరమున జలము లెత్తి నిస్త్రాణండై." హంస. ౧, ఆ. ౧౮౬. 8. బుజాత్వము, సూటి. "ఉ ..ఇరుపక్కలంక ముడిచి యుబ్బరపుంబలం నిబ్బరంబునన్." "గీ...పా రావతంబు రాఁ దొడఁగె..." సా. ౧, ఆ. ౧౨౬, ౧౨౭. విణ. 1. అధికము. "ఉ. పె, న్నింటలఁ గూర్పుకామమును నిబ్బరమైన మదంబులై మనం, బొంటిచిఁ బోక ధర్మపరతి నుద్యోగులార..." హరి. ఉ. ౭, ఆ. ౯౧, శైవ. ౫, ఆ. ౧౭౭; 2. ఉన్నతము; పీనము. "గీ.

నిబ్బరపుగబ్బిగుబ్బల యాఁబ్బొకతన..." మను. ౨, అ. ౭౯; 3. తీక్ష్ణము. "గీ...అయ్యగనిజబిరుదు, దెబ్బదేవుదొ ష్మిదియును నిబ్బరంపు, టమ్ము లక నిహైఁ బరఁగించె నలుక నిగుల." హరి. ఉ. ౨, అ. ३3, హరి. పూ. ౪, అ. ౧౬౦; 4. స్పష్టము. "క. ఈశన్నియతం దగునొక, రాశాపరుని సరసి నిబ్బరంబుగ నిపుడే, మాకెఱిఁగింపుము .." నీలా. ౧; అ ౯౦; బస. ౬, అ. ౨౧3. పు. 5. స్థిరము, నిశ్చలము. (వ్యవ.); 6 దిట్టరి. "క. నిబ్బరపుబాల కాంతయు..." భాగ. ౧, స్కం. ౧౬3.

నిబ్బరించు. హై.అ. క్రి. 1 అతిశయించు. "ఉ గుప్పున నప్పు డప్పుడంటిగుబ్బలు మించె...ఉబ్బున నిబ్బ రించుచున్." చంద్రా. ౫, అ. ౧౪౨; 2. నిదా నించు. (శ. ర.)

నిబ్బరికము = నిబ్బరము. వి. 1. బుజాశ్వము, సూటి. "గీ. నిబ్బరిక పేంది యువు .." సా. ౨, అ. ౨౧౫; 2. దయ, కారుణ్యము. "సీ...అక్కటి కం బవ నక్కన మన, నిబ్బరిక మనఁ గనికరం బనంగను గారుణ్యసంజ్ఞ రైా విూఱుచుండు." ఆం. భా. ప్ర. ౧3౧.

నిబ్బరికించు. హై. అ. క్రి. 1. కరుణించు (శ. ర.); 2. నిదానించు, ఆలోచించు. "ఉ. నిన్ను కె నమ్మి యుఁన్నరొడ నిబ్బరికింపక చోరవృత్తి నా, కన్నియఁ దెచ్చు టింతరాఁను గానిధం బని .." పరమ. ౪, అ. ౧౧౧; 3. ఉబ్బొంగు. "వ... అగ్గుబ్బలి సోయగంపుటుబ్బునకు హైంనిబ్బరికింప నబ్బరపడి యుబ్బలియుండు తనలోన." యు. ౨, అ. ౪౦.

నిభము. సం. వి. అ. పుం. 1. ప్రకాశము; 2. కపటము, వ్యాజము. (శ. ర.) విశే. (అ. ఆ. అ.) ఇది సమాసోత్తరపదముగనే కన్పట్టుచున్నది. 1. సమానము, సదృశము; 2. మిక్కిలి ప్రకా శించునది.

నిభృతము. సం. వి అ. న. అడఁకువ, వినయము. విశే. (అ. ఆ. అ.) 1. స్థిరము, నిశ్చలము; 2 పూర్ణము; 3. గుప్తము; 4. గూఢము, అస్పష్టము; 5. రహస్యమైనది; 6. అడఁకువ కలది, వినీతము.

నిభృతుఁడు. సం. విశే (న్. పీ. న్.) చలింపని వాఁడు. "క...పవనపుత్రుఁడు మునికేంద్రునకు జయశబ్దయుతముగ, వినయంబున మ్రొక్కి విన్నవింతె నిభృతుఁడై." భార. విరా. ౧, అ. ౨౧౬.

నిమంత్రకుఁడు. సం. విశే. (అ త్రి కా. అ.) నిమంత్రణము చేయువాఁడు.

నిమంత్రణము సం. వి. అ. న యజ్ఞాదులకు పిలుచుట.

నిమంత్రణీయుఁడు సం. విశే. (అ. ఆ. అ.) నిమంత్రణము చేయఁదగినవాఁడు.

నిమంత్రించు సం. స క్రి. (యజ్ఞాదులకు, పిలుచు, ఆహ్వానించు.

నిమంత్రిత. సం. విశే (బు. త్రీ. బు.) నిమంత్రించు వాఁడు.

నిమంత్రితము. సం. విశే. (అ. ఆ. అ.) నిమంత్రింపఁ బడినవాఁడు.

నిమగ్నుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మునిఁగిన వాఁడు; 2. లీనుఁడు, అణఁగినవాఁడు.

నిమజ్జకుఁడు. సం. విశే. (అ. జ్జికా. అ.) మునుఁగు వాఁడు.

నిమజ్జథువు. సం. వి. ఉ. పుం. 1. నిమజ్జనము, మునుఁ గుట; 2. శయనించుట.

నిమజ్జనము. సం. వి. అ. న. 1. మునుఁగుట; 2. లీన మఁగుట.

నిమటాయి. దే. వి. ఒకానొకతీఁగ. "సీ. నిమటాయి గొలిమిడి నీరుబచ్చలి .." హంస. ౪, అ. ౧౦.

నిమయము. సం. వి. అ. పుం. ఒకవస్తువు నిచ్చి దానికి బదులు మఱొకవస్తువు పుచ్చుకొనుట, వినిమయము.

నిమవఁడు. దే. వి. అశ్వవిశేషము. "క...సారంగని జారని జన్నని నిమ్మవని కెంఁదలుఁగఁ దెచ్చి నిలిపె వాహాళఁ దెదురన్." ద్వా. 3, అ. ౧౪౧.

నిమితకాఁడు. ద్వి. విశే. (నిమితము+కాఁడు) 1. పోఁతకాఁడు. "క...ప్రాయందలముల్, స్థానికుఁ డొసంగి ఘనుఘం,గా నాతఁడు బడినిమితకాంత్రు వహింపన్." అము. ౨, అ. ౯౫; 2. యుద్ధము నకు నియోగింపఁబడినవాఁడు. "మ ..ప్రాఁకుల్ రాలఁ దేరకెయుంతే నలుపద్దయానిమితవాంత్రక్ భానుపుత్రాదుల్, నిమవిూ చంపక పట్టి తెచ్చి. ..." రామా. ౮, అ. ౧౮౫; 3. కాలకాల వలన జీవించువాఁడు. "గీ. మందుపట్టిన చేరు చెనొన్నెండు బాణ, కాల యుఁవఁగను దక్షిణమున

పెలయు, నిమిళత్కాంత్రరుగా సుగంధికలరీళ." ఆం. భా. ద్వి. ౨౫.

నిమితము. రూ. వై. వి. (సం. నియమితః.) నియమనము. (చూ. నిమితకాఁడు.) సం. విణ. (అ. ఆ. అ.) నలుచదరమైనది.

నిమిత్తము. సం. వి. అ. న. 1. కారణము, హేతువు. 2. శకునము; 3. లక్ష్యము; 4. గుఱుతు, చిహ్నము; 5. ఉద్దేశము; 6. చెవులయందు చేయుచుంబనము. "సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు నధరోష్ఠమున ఖాంతము..." హంస. ౫, ఆ. ౧౪౮.

నిమిత్తవిదుఁడు. సం. వి. దీ. అ పుం. జోస్యుఁడు.

నిమిత్తి. సం. విణ (న్. నీ. న్.) నిమిత్తము గలది.

నిమిషము. సం. వి. అ. పుం. 1. ఱెప్పవేయుట, ఱెప్పపాటు; 2. ఱెప్పవేయునంతకాలము; 3. (పుష్పములు.) ముకుళించుట, ముకుళనము.

నిమీల. సం. వి. ఆ. స్త్రీ. 1. కనుమూయుట; 2. కనుగీటుట; 3. నిద్ర; 4. కునికిపాటు; 5. వ్యాజము, కపటము.

నిమీలకము. సం. విణ. (అ. లికా. అ.) 1. మూయునది; 2. ముకుళించునది.

నిమీలత్. సం. (శత.) 1. మూయుచున్న; 2. ముకుళించుచున్న. "లయగ్రాహి...అనిమీలదరవింద సరసీవనములయందు..." భార. ఆది. ౫, ఆ. ౧౩౯. (అనిమీలత్ = వికసించుచున్న.)

నిమీలనము. సం. వి. అ. న. 1. ఱెప్పవేయుట; కనుమూయుట; 2. మరణము; 3. (పుష్పాదులు) ముకుళించుట; 4. మఱుఁగుపడుట; 5. పూర్ణగ్రహణము (జ్యోతి.)

నిమీలనీయము. సం. = నిమీలితవ్యము.

నిమీలిక. సం. = నిమీల.

నిమీలిత. సం. విణ (బు త్రి. బు.) నిమీలకము.

నిమీలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూయఁబడినది; 2. అపరింపఁబడినది; 3. ముకుళించినది. (పుష్పాదికము); 4. అస్తమించినది.

నిమీలితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూసికొనఁదగినది; 2. అపరింపఁదగినది

నిమీల్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూయఁబడుచున్నది; 2 అపరింపఁబడుచున్నది.

నిమీల్యము. సం. = నిమీలితవ్యము.

నిముకళా. దే. వి. (నిమురు+కళ్లము.) 1. నైలంచేసిన కళ్లమునందలియడుగుధాన్యము. (శ. ర.); 2. కొలఁత. (శ. ర.)

నిముఁకు. దే. స. క్రి. కుడుచు, స్తన్యపానము చేయు. "ద్వి ..అక్కట దాదిచన్ను, నిముకనేరని చిన్ని శిశువుఁగండు." ద్వి. హరిశ్చ. ఉ. ౨౩౦౮. కం.

నిమురు. దే. స. క్రి. స్పృశించు, తాఁకు; వాత్సల్యముతో రాచు. "వ...భక్తవత్సలుఁడు దైవహారి దనకరంబున నతనిమేను నిమిరి..." భాగ. ౧౦, స్కం. ఉ. ౯౯, కాళిందీ. ౭, ఆ. ౫౩; 2. అపరించు. (చూ. నిమురుకొను.)

నిమురుకొను. దే. అ. క్రి. (నిమురు+కొను.) అపహృతమగు. "గీ. హిమముచే నంబరం బెల్ల నిమురుకొనఁగ..." శ్రీరం. ౨, ఆ. ౨౪౧. స. క్రి. తడవుకొను. "గీ. పులిక పోవఁగ పొత్తురల్ ప్రోలి కడుపు, నిమిరికొంచు నగస్త్యమంత్రములు నొడివి." దశా. ౨, ఆ. ౪౩౫.

నిముసము. వై. వి. (సం. నిమిషః.) 1. ఱెప్పపాటు; 2. ఱెప్పపాటుకాలము, స్వల్పకాలము. "సీ. నను నిముసంబు గానక యున్న నూర్లెల్ల నరయు మజ్జనకుఁ డెంతడలు నొక్కొ." స్వా. ౨, ఆ. ౧౩, విజ ౧, ఆ. ౧౦౪.

నిమేయము. సం. వి. అ. పుం. వినిమయము విణ. (అ. ఆ. అ.) వినిమయము చేయఁదగినది, మార్చుకొనఁదగినది.

నిమేషము. సం. = నిమిషము. [నది, వీణ.

నిమ్నగ. సం. వి. ఆ. స్త్రీ—పల్లమునకు పాఱునది—

నిమ్నము. సం. వి. అ. న. పల్లము. విణ. (అ. ఆ. అ.) 1. లోఁతైనది, గభీరము; 2 తక్కువది, నీచము.

నిమ్మ. వై. వి. (సం. నింబః.) జంబీరము, జంభలము. "సీ. అసురులసభ జాడ నరుదెంచునొకభక్తి పరుఁడు దెచ్చిననిమ్మపం డనంగ." కృష్ణ. ౪, ఆ. ౧౦౫, ఆం. భా. ద్వి. ౪౨.

నిమ్మళము. వై. వి. (సం. నిర్మలః.) 1. నిష్కళంకత. "సీ. నిమ్మళం బనఁగను నిష్కళంకత యొప్పు. ..." ఆం. భా. ద్వి. ౧౯౧; 2. స్వాస్థ్యము. (వా.) విణ. 1. స్వస్థము; ఉపశాంతము. (వా.); 2. మందము. (వా.)

నిమ్మళించు. వై. అ. క్రి. స్వస్థమగు; ఉపశమించు. (శ. ర. వా.)

నిమ్ము. దే. వి. గొమ్ము మున్నగువాని ధ్వనివిశేషము. "వ...గుబ్బెటలదటులరవమును గొమ్ములనిమ్ముసు జెలంగె నయ్యవసరంబున." కాశీ. 3, ఆ, 3౬.

నిమ్ముక్తి. సం. వి. ఇ. స్త్రీ. క్రుంకుట, అస్తమయము.

నిమ్లోచము. సం. వి. అ. పుం. = నిమ్ముక్తి.

నియంత. సం. వి. ఋ. పుం. 1. సారథి; 2. పరమేశ్వరుఁడు. విణ. (ఋ. త్రీ. ఋ) 1. ఆజ్ఞాపించువాఁడు; 2 దండించువాఁడు; 3. రక్షకుఁడు.

నియంతవ్యుఁడు. సం. = నియమ్యుఁడు.

నియంత్రణ. సం. వి. ఆ. స్త్రీ. 1. అడ్డగింత; 2. ఆజ్ఞాపించుట; 3. నిర్వచించుట.

నియంత్రితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది; 2. ఆజ్ఞాపింపఁబడినది.

నియచ్ఛత్. సం. (శతృ) 1. నియమించుచున్న: 2. ఇచ్చుచున్న.

నియతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నియమము గలది; 2. కట్టఁబడినది, సంయతము; 3. నిగ్రహింపఁబడినది; 4. నిత్యమైనది; 5. అనివార్యము.

నియతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నియమము; 2. ఇంద్రియనిగ్రహము; 3. పూర్వజన్మార్జితమైన సుకృతదుష్కృతరూపకర్మము. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

నియమనము. సం. వి. అ. న. 1. నియమము; 2. బంధించుట; 3. నిగ్రహించుట, అడఁచుట; 4. శిక్షించుట.

నియమనీయము. సం. = నియమ్యము.

నియమము. సం. వి. అ. పుం. 1. బంధము, కట్టు; 2. ఏర్పాటు, వ్యవస్థ; 3. నిగ్రహము, అడఁచుట; 4. ఆజ్ఞ; 5. ప్రతిజ్ఞ; 6. నిశ్చయము; 7. వ్రతనిష్ఠ; 8. నియంత్రణ, నిర్దేశము.

నియమవిధి. సం. వి. ఇ. పుం. నిత్యకర్మానుష్ఠానము.

నియమించు. సం. స. క్రి. 1. ఆజ్ఞాపించు. "క. ఈ కొలఁదిఁ గన్నమన్మథుఁ, డైనఁ జిగురుగొడుగుఁ బుష్పపటమ్ములబోదులంక్, లోనుగ సజ్జలుసేయం, దానియమింపుండె విరహతాపము పేర్మిన్." భార. విరా. ౨, ఆ. ౨౦. మార్క. ౧, ఆ. ౨౩౪; 2. అడ్డపెట్టు, నిరోధించు. "వ...సేసి దైవాధీనతకతంబున బిడ్డల నొత్తిచెప్పను నియమింపను జాలను..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౭; 3. నిర్ణయించు, నిర్ణయించు. "చ. వనిత మనో హారంబులగువస్తువు లెల్లను వేడ్క సేసి నీ,కని నియమించి తెచ్చితిఁ బ్రియంబునఁ గైకొనుము..." భార. విరా. ౨, ఆ. ౩౩౪.

నియమితము. సం. విణ. (అ. ఆ. అ.) 1 ఏర్పఱుపఁబడినది, నిర్ణయింపఁబడినది; 2. కట్టఁబడినది, బద్ధము; 3. నిగ్రహింపఁబడినది; 4. శిక్షింపఁబడినది; 5. అడ్డగింపఁబడినది, నిరుద్ధము.

నియమ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నియమింపఁబడుచున్నది.

నియమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నియమింపఁదగినది

నియాతనము. సం. వి. అ. న. క్రిందికి ద్రోయుట.

నియామకుఁడు. సం. వి. అ. పుం. 1. సారథి; 2. ప్రభువు; 3. తండేలు, నావానియంత. విణ. (అ. మిశ్రా. అ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. శిక్షించువాఁడు; 3. నిరోధించువాఁడు; 4. నిగ్రహించువాఁడు; 5. నిర్ణయించువాఁడు; 6. నిర్దేశించువాఁడు.

నియామము. సం. = నియమము.

నియామి. సం. విణ. (న్. నీ. న్.) నియమించువాఁడు.

నియుంజత్. సం. (శతృ.) నియోగించుచున్న.

నియుంజానము. సం. విణ. (అ. ఆ. అ.) నియోగించుచున్నది.

నియుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆజ్ఞ, పనుపు; 2. ఉద్యోగమందు నియోగించుట.

నియుక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆజ్ఞప్తుఁడు; 2. అధికారమందు నియమింపఁబడినవాఁడు; 3. ప్రేరింపఁబడినవాఁడు.

నియుజ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నియోగింపఁబడుచున్నది.

నియుతము. సం. వి. అ. న. 1. సంఖ్యావిశేషము, లక్షసంఖ్య; 2. దశలక్షసంఖ్య. విణ. (అ. ఆ. అ.) 1. లక్షసంఖ్యావిశిష్టము; 2. దశలక్షసంఖ్యావిశిష్టము.

నియుద్ధము సం. వి. అ. న. శస్త్రాదులు పట్టఁగూడదను నియమము గలయుద్ధము, బాహుయుద్ధము. "క. ఏనికి మార్కొనఁ జాలెదు, దానిఁ దగువానిధర్మతనయుఁ డిపురిలో, నానానియుద్ధలంపటు,నే నొక్కఁడఁ గంటి విపులఁ డిందుల కతఁడున్." భార. విరా. ౨, ఆ. ౯.

నియోక్తృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నియోగించు వాఁడు.

నియోక్తవ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నియోగింపఁ దగినవాఁడు.

నియోగజనుఁడు. సం. వి. అ. పుం. భృత్యుఁడు. "సీ...అవని, సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయబంధుసువృద్ధవీరభటనియోగ, జనులను వేనవేల సాదుల నిత్యంబుఁ దాన పరీక్షించి .." భార. సభా. ౨, ఆ. ౧౧౬.

నియోగము. సం. వి. అ. పుం. 1. అధికారమందు నియమించుట; 2. ప్రేరణము; 3. ఆజ్ఞ; 4. నియోగించినపని. "వ .....ఇన్ని కారణంబులు విచారించి నానియోగంబు చేయుము." భార. ఆది. ౫, ఆ. ౨౯, 5. నిశ్చయము; 6. పుత్త్రులు లేనివిధవను దేవరునివలననో సపిండునివలననో పుత్త్రునిఁ బడయుటకై నియమించుట; 7. పరిజనము. "ద్వి. వినయపూర్వకముగా విభుతిఁ జేయుచును, సుందరంగ నఖిలనియోగంబు గొలువ." బస. ౫, ఆ. ౧౧౫. పం పండితా. దీక్షా. ౭౨. పు.

నియోగి. సం. విణ. (న్. నీ. న్.) 1. రాజాదులచే ఒకపనియందు నియుక్తుఁడైనవాఁడు, ఉద్యోగి. "క. జనకనృపునకుత్తరం బని, జనకులికిం దెల్పి రాయసము వ్రాయునియోగిని బిలిచి యొసఁగ..." దశా. ౭, అ ౧, ఆ. ౨౨౨; 2. ఒకతెగబ్రాహ్మణుఁడు. (వా.) (వీరిలో భేదములు. ఆఱువేల నియోగులు, తెలఁగాణపునియోగులు, నందవరీక నియోగులు మొ.); 3. పురోహితుఁడు. "గీ... రాఘవుల పెండ్లికిని సాగిరమ్మటంచు .. నియోగిఁ బనుప..." దశా. ౨, అ. ౧, ౨౨౦.

నియోగించు. సం. స. క్రి. 1. ఏర్పఱుచు. "ఆ. అనఘచరిత యిట్లు నను నియోగించుట, యెందుఁగు మని యమార్త్యయంకము గాఁగ, భక్తి మెఱసి యొప్పు ధంగులఁ జెప్పెద, నియ్యకొనక యున్న నెట్టు లేని." భార. శాం. ౧, ఆ. ౧౬౪. మార్క. ౨, ఆ. ౨౧౪; 2. ఆజ్ఞాపించు, పంపు. "వ... సుదేష్ణ తన్నుచితవ్యాపారంబునను నియోగించుటను నిర్వేదంబునం బొంది .." భార. విరా. ౨, ఆ. ౧౦3. భార. ఆది. ౫, ఆ. ౨౯; 3. కోరు. "వ...యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ ప్రకటించి వాని నిర్జింప నియోగించుటకునై యరుగుదెంచెం గావలయు..." భార. విరా. ౨, ఆ. ౧౬౭.

నియోగ్యుఁడు. సం విణ. (అ. ఆ. అ.) నియోగింప నర్హుఁడు. (ప్రభుత్వ.)

నియోజకుఁడు. సం. విణ. (అ. ఇకా. అ) నియోగించువాఁడు.

నియోజనము. సం వి. అ. న. 1. ఆజ్ఞాపించుట; 2. ప్రేరించుట; 3. పనియందు నియమించుట. విణ. (అ. ఆ. అ.) నియోజనముచేయునది. (అ.ఈ.అ.) నియోజనము చేయుటకు సాధనమైనది.

నియోజనీయుఁడు. సం. = నియోక్తవ్యుఁడు.

నియోజించు. సం. స. క్రి. లగ్నముచేయు. "గీ. మనము హితధ్యానమునఁ బరంజ్యోతియందు, మనముఁ జాల నియోజించి మహిమఁ దనరు." భాగ. 3, స్కం. ౯౪౨.

నియోజితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆజ్ఞాపింపఁబడినవాఁడు; 2. ప్రేరింపఁబడినవాఁడు; 3. పనియందు నియమింపఁబడినవాఁడు.

నియోజ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నియోజింపఁ దగినవాఁడు.

నియోధకుఁడు. సం. వి. అ. పుం. బాహాయుద్ధము చేయువాఁడు, మల్లుఁడు.

నియోద్ధ. సం. విణ. (ఋ. ద్ధ్రీ. ఋ.) బాహాయుద్ధము చేయువాఁడు.

నియ్యోగి. వై. వి. (సం. నియోగి) 1. మంత్రి. (శ. ర.; 2. ఒకతెగబ్రాహ్మణుఁడు. (శ. ర.,; 3. ఒకతెలుఁగుభృత్యుఁడు. "గీ. కటికవారలు దగు నూడిగములవార, లవసరంబున నియ్యోగు లాదట నాడఁ, బోడగని యథోచితాకృతుల్ వారి గొలువ." ఉ. రా. ౬. ఆ. ౧౯౦.

నిరంకుశము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డులేనిది, నిరర్గళము; 2. అంకుశములేనిది.

నిరంజనము. సం. వి. అ. పుం. చిత్రవర్ణమైన యక్షాక్ష మగువారికము. విణ. అ. ఆ. అ. 1. కాటుక లేనిది. (కస్తు.); 2. నిర్మలము.

నిరంజనుఁడు. సం. వి. అ. పుం. 1. పరమాత్మ; 2. శివుఁడు.

నిరంతరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతతము, ఎడతెంపు లేనిది; 2. మిక్కిలి దగ్గఱగా నున్నది;

3. సాంద్రము; 4. విఱుఁగు లేనిది; 5. భేదము లేనిది. అభిన్నము.

నిరంశము. సం. విణ. (అ. ఆ. అ) 1. అఖండము, పూర్ణము; 2. భాగము లేనిది.

నిరతము. సం. విణ. (అ ఆ. అ) 1. మిక్కిలి ఆసక్తి కలది; 2. అవిచ్ఛిన్నము "క నిరతముగఁ దీర్ఘజీవా, పరులకు...దుష్కర మెవ్వరియు లేదు. ..." భార. ఆర ౬, ఆ. ౬౯౧; 3 స్థిరము, నిశ్చలము. "చ. సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపుఁ బేరఁ జూడఁగా, నిరవిరతోయి మేను నిడు వెంట్రుక వెట్టుచుఁ గంపమొందెఁ జే, నిరతము గాదు గాండీవము డిల్లఁగ నోర్వవు గాళ్లు .." భార భీష్మ. ౧, ఆ ౧౯౧, క్రి. విణ. ఎల్లప్పుడు "క. కిరణములభంగిఁ జటురపుఁ, బరిజనముల నొందుఁ జొనిపి పరకృత్యంబుల్, నిరతంబును గనుఁగొనుచును, దరణికరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్." భార. శాం. 3, ఆ. ౧౦౭.

నిరతి. సం. వి. ఇ. స్త్రీ మిక్కిలియాసక్తి.

నిరత్యయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాశనము లేనిది; 2. దోషము లేనిది.

నిరపేక్ష. సం. వి ఆ. స్త్రీ. కోరికలేమి

నిరపేక్షము. సం. విణ. (అ. ఆ అ.) 1. కోరిక లేనిది; 2. ప్రయోజనము లేనిది.

నిరప్పణ. వై. విణ (సం. నిరర్పణమ్) నిరభ్యంతరము, ఆటంకము లేనిది "వ. అని నిరప్పణగాఁ గప్పులఱేఁడు సెలవిచ్చిన..." వేం. పంచ. ౨, ఆ. ౩౭౦.

నిరయము. సం. వి. అ. పుం. నరకము.

నిరర్గళము. సం. విణ. (అ. ఆ అ.) 1. గడియ లేనిది; ఆటంకము లేనిది. క్రి. విణ. యథేచ్ఛముగా, విచ్చలవిడిగా.

నిరర్థకము. సం. వి. అ. న. ఒకానొకపదదోషము. విణ. (అ ఆ అ.) 1. అర్థము లేనిది. (పదాది.); 2. ప్రయోజనము లేనిది.

నిరర్థము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధనము లేనిది; 2. అర్థము లేనిది. (పదాది.); 3. ప్రయోజనము లేనిది.

నిరవద్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దోషము లేనివాఁడు, ఉత్కృష్టుఁడు; 2. నింద లేనివాఁడు.

నిరవము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వని లేనిది.

నిరవహాలిక. సం. వి. ఆ. స్త్రీ. వెలుఁగు కంచె.

నిరశనము. సం. వి. అ. న. ఉపవాసము. విణ. (అ. ఆ. అ.) భోజనము చేయనిది.

నిరసనము. సం. వి. అ. న. 1. త్రోసివేయుట; 2. (వాదాదులను) ఖండించుట, ప్రత్యాఖ్యానము; 3. తిరస్కారము; 4. వెడలఁగొట్టుట; 5. ఉమియుట, నిష్ఠీవనము; 6. వధము. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁగించునది; 2. వెడలఁగొట్టునది, తఱుము నది; 3. ఉమియునది.

నిరసనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిరసింపఁ దగినది.

నిరసము. సం. విణ. (అ. ఆ. అ.) 1. శృంగారాది రసహీనము. (కావ్యాది.); 2. చప్పిడి; 3 సార హీనము, ఎండినది. (ఫలాది.)

నిరసించు. సం. స. క్రి. 1. పోఁగొట్టు. "వ...మదీయ మనఃక్లేశంబు నిరసింప నీవ యర్హుండవు .." భార. శాం. ౬, ఆ. ౫౯౪; 2. తిరస్కరించు. "శా...నీలాంబుదో, న్మేషంబుల్ నిరసింపఁజాలు తనుకాంతిశ్రీలం దిగ్భాగముల్, భూషింపంగ.." వరాహ. ౧, ఆ. ౧౪౧. కృష్ణ. ౪, ఆ. ౯; 3. విడుచు, పరిహరించు (శ. ర.); 4. జయించు. "క. తిరముగ భవదీయాంతః, కరణసరోజాత కర్ణికాతలమున సుస్థిరుఁ జేసి యింద్రియంబుల, నిరసించి మనోంబుజమున నెఱిఁ గను మనఘా." భార. 3, స్కం. ౯౬౪; 5. కాశీ. దీ. ౬, ఆ. ౧౦౦; 6. చంపు. "క. నిరసించిన నిరసించెన్, శరణన రక్షించ నీకె చను నృపతులతోఁ, గరుణించితి నీపట్టున్..." కృష్ణ. ౪, ఆ ౯.

నిరసిత. సం. విణ. (బు. త్రి. బు.) నిరసించువాఁడు.

నిరసితవ్యము. సం. = నిరసనీయము.

నిరస్తము. సం. వి. అ. న. 1. తొలఁగించుట, త్రోసి వేయుట; 2 ఉమియుట, నిష్ఠీవనము; 3. విడరుట; ఏచుట. విణ. (అ. ఆ. అ.) 1. త్రోసి వేయఁబడినది; 2. తఱుమఁబడినది, 3. ప్రయోగింపఁబడినది. (బాణాది.); 4. విడువఁబడినది, త్యక్తము; 5. ప్రత్యాఖ్యాతము, ఖండింపఁబడినది. (వాదాది.); 6. ఉమియఁబడినది, నిష్ఠ్యూతము; 7. త్వరితముగా ఉచ్చరింపఁబడినది. (మాట); 8. తిరస్కరింపఁబడినది; 9. వెడఁగొట్టఁబడినది, ప్రతిహతము. (వ్రకాది.); 10. జయింపఁబడినది,

దాటఁబడినది. "ఆ. ఎఱిఁగిరేనిఁ జాల శుద్ధ వాటిల్లు న, ట్టగుట మమ్ము నింక నతిరహస్య వృత్తిమై నిరస్తవిఘ్నులకై చరి,యింపుఁ దని యనుగ్రహింపవలయు." భార. విరా. ౧, ఆ. ౪౭.

నిరస్యత్. సం. (శతృ) నిరసించుచున్నది.

నిరస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిరసింపఁబడుచున్నది.

నిరస్యము. సం. = నిరసనీయము.

నిరాకరణము. సం. వి. అ. న. 1. తొలఁగించుట; 2. తిరస్కరించుట; 3. (వాదాదికముచు) ఖండించుట, ప్రత్యాఖ్యానము; 4. అనాదరించుట.

నిరాకరణీయము. సం విణ. (అ. ఆ. అ) నిరాకరింపఁదగినది.

నిరాకరించు. సం. స. క్రి. 1. తిరస్కరించు, త్రోసివేయు. "ఉ. వాసవునిందుకొల్వునకు వచ్చిన యప్పుడు తత్పరుండవై, గ్ధాసన మెక్కి యున్న నిను నంగజసన్నిభుఁ జూచి పుష్పబాణాసను పుష్పబాణనివహమ్ములకుం గుఱియైతి నిట్టినా, యూస నిరాకరింపఁ దగవా కరుణాకర పాండునందనా." హర. ౭, ఆ. ౧౨౯; 2. అగౌరవించు, అలక్ష్యముచేయు. "శా. అవ్వాక్యంబు నిరాకరించి దిశ లల్లాడం గఠోరంబుగా, నక్వేన్.." వరాహ. ౨, ఆ. ౧౮.

నిరాకరిష్ణువు. సం. విణ. (ఉ) నిరాకరించుస్వభావము గలవాఁడు.

నిరాకరిష్యమాణము. సం. విణ. (అ ఆ. అ.) నిరాకరింపఁబడఁబోవుచున్నది.

నిరాకర్త. సం విణ. (ఋ. త్రీ. ఋ ) నిరాకరించువాఁడు.

నిరాకర్తవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁదగినది.

నిరాకారకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరించువాఁడు.

నిరాకారము. స. వి. అ పుం. నిరాకరణము. విణ. (అ. ఆ. అ.) 1. రూపము లేనిది; 2. పిలుపు లేనిది, అనాహూతము; 3. వికృతరూపము గలది.

నిరాకారి. సం విణ. (న్. నీ. న్.) నిరాకరించువాఁడు.

నిరాకార్యము. సం. = నిరాకరణీయము.

నిరాకుర్వత్. సం. (శతృ.) నిరాకరించుచున్న.

నిరాకుర్వాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరించుచున్నవాఁడు.

నిరాకులము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి కలఁతనొందినది; 2. మిక్కిలివ్యాప్తమైనది; 3. నిర్వ్యాకులము, స్వస్థము.

నిరాకృతము. సం. వి అ. న. = నిరాకరణము. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁబడినది.

నిరాకృతి సం. వి. ఇ స్త్రీ. = నిరాకరణము. ఇ. పుం. 1. పంచయజ్ఞములను త్యజించినవాఁడు; 2. అధ్యయనము చక్కఁగా చేయనివాఁడు విణ. (ఇ.) 1. ఆకారము లేనిది; 2. వికృతాకారము కలది.

నిరాక్రియ. సం. వి. ఆ. స్త్రీ. నిరాకరణము.

నిరాక్రియమాణము. సం విణ. (అ. ఆ అ.) నిరాకరింపఁబడుచున్నది.

నిరాగస్కుఁడు. సం. విణ. (స్) 1. పాపము లేనివాఁడు; 2. అపరాధము లేనివాఁడు.

నిరాగుఁడు. సం. = నిరాగస్కుఁడు.

నిరాఘాటము. సం. విణ. (అ. ఆ. అ.) 1. హద్దు లేనిది, అపరిమితము. "గీ. ఏఁటిధృతి యేఁటి వికరణ మే టిశౌర్య, మేఁటిగాంభీర్య మని నిరాఘాటధైర్య, దానశక్తిగభీరతానూనుఁ డగుడు.." కృ. శతం ౬౨, 2. అడ్డులేనిది; నిలుపులేనిది. "వ ..ఖచరపురవరస్థితతురంగంబే సేన యని యభినయించురీతిని నైజామోరలు చేయంనిరాఘాటధాటీసమాటీకఘోటీపటలంబు జటిలంబగుచు నుండ..." ఆం. భా. పీఠి. ౭; 3. చెదరనిది, నిశ్చలము. "గీ. ప్రతిదినంబును బ్రాతరారంభవేళ, నిర్నిబంధననిరుపాధినిరవగాధ, నిర్నిరోధనిరాఘాటనిరుపమాన, భక్తి సంభజియింతు రీపద్మబంధు." కాశీ. ౩, ఆ. ౧౭౪.

నిరాణి. దే. వి. (క. నిరాళ.) స్వచ్ఛము. "క. నిరం, తరభక్తుఁడై శివైక్యుఁడు, నిరాణి యగు ఘనుఁడి వోలె నిలువఁగ వలయున్." శివ. సా. ౧౪౫.

నిరాతంకము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జంకు లేనిది; 2. రోగము లేనిది; 3. బాధింపనిది; 4. అడ్డు లేనిది.

నిరాతప. సం. వి. ఆ. స్త్రీ. రాత్రి.

నిరాదిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) తీర్పఁబడినది. (ఋణాది.)

నిరాదేశము. సం. వి. అ. పుం. ఋణమును పూర్తిగాఁ దీర్చుట.

నిరాపనింద. మి. గ్రా. వి. (శ. ర.) అపనింద, లేని పోనినింద. "క. పినతల్లిది పెనుపఁగ నో, పినతల్లిది గాను వచ్చి పిలిచిన నయ్యో, గనికరము లేక వానిం, గని కరము నిరాపనింద గట్టం దగునే." పా ౩, ఆ. ౫౦, ౩ ఆ. ౨౧౭.

నిరాబాధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బాధ లేనిది, నొవ్వు లేనిది; 2. దుఃఖము లేనిది; 3. అడ్డు లేనిది, ప్రతిబంధము లేనిది.

నిరాబారి. వై. వి. (సం. నిరాహారీ.) ముని. "సీ. . గాలి రొంగిరము గాఁ గను నీటిలోనఁ దబము లొనర్చెడు నిరాబారిగములు." య. ౨. ఆ. ౪౩, అచ్చ. బాల. ౫.

నిరామయము. సం. వి. అ. పుం న. రోగములేమి, ఆరోగ్యము. పుం. 1. అడవిమేఁక; 2. పంది. విణ. (అ. ఆ. అ.) 1. రోగము లేనిది; 2. దోషము, లేనిది; 3. కపటము లేనిది.

నిరాయతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి నిడివి యైనది; 2. సంకుచితము.

నిరాయము. సం. విణ. (అ. ఆ. అ.) రాబడి లేనిది.

నిరాలంబము సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆధారము లేనిది; 2. స్వతంత్రము.

నిరాసకము. సం. విణ. (అ. సిక. అ.) నిరసించునది.

నిరాసము. సం.=నిరసనము విణ (అ ఆ అ.) నశింపఁ జేయునది. (నాశము.) "క. ఈసౌవర్ణాఖ్యానము, భాసురముగ వినినపుణ్యపరులకు నధిక, శ్రీసంపద లగు దురితని, రాసం బగుఁ బాయు నురగరతో భయముల్." భాగ. ఆది. ౨, ఆ. ౧౨౪.

నిరాసీలు. దే. వి. బ. వస్త్రవిశేషము. "రగడ ఋరుత కాసీలు మహాముదులు నిరాసీలు, సరిసేయరాని హంసావళులు లాకీలు." హంస ౫. ఆ ౩౫౬.

నిరాస్వాదము. సం. విణ. (అ. ఆ అ.) 1. అను భవము లేనిది; 2. రుచి లేనిది.

నిరాహారము. సం వి. అ. పుం. ఉపవాసము. విణ. (అ. ఆ. అ.) ఆహారము లేనిది.

నిరీక్ష. సం. వి. ఆ. స్త్రీ.=నిరీక్షణము. [వాఁడు.

నిరీక్షకుఁడు. సం. విణ. (అ. క్షకా. అ) వీక్షించు

నిరీక్షణ. సం.=నిరీక్షణము. (చూచుట, కనుఁగొనుట.) "ఉ. పంకజలోచనుప్పుడు భాసిమిలింద నిశాప వాసమై, యంతురనూచి కామినిహతాహితమండల జీవితంబునై, శంకిలఁజేయు సాధరకశాస్త్రము నామని దానిఁ జూడఁగా, సంకుర మూను మోర థర మన్యనిరీక్షణఁ గల్గఁజేస్పనే." కాళిందీ. ౪, ఆ. ౨౬.

నిరీక్షణము. సం. వి. అ. న. 1. చూపు, దృష్టి; 2. చూచుట, కనుఁగొనుట; 3. ఎదురుచూచుట; 4. తలఁచుట, భావించుట.

నిరీక్షించు. సం. స. క్రి. 1. చూచు "శా. శేరం బోవుటయుంగ్ సమీరుఁడు సురశ్యేష్ఠు న్నిరీక్షించి ..." నిర్వ. ౭, ఆ. ౧౧౩, మార్క. ౬, ఆ. ౧౨౪; 2. ఎదురుచూచు, ప్రతీక్షించు. "వ... ఇట్లేకతంబ యేకవస్త్రయై యోడ శొక్కువచ్చు వారి నిరీక్షించుచున్న సత్యవతిం జూచి యాముని వరుండు."భార. ఆది. ౩, ఆ. ౩౭; 3. భావించు, తలపోయు. "ఉ చంచలనేత్ర సీత విడఁజాలుదునే శుక యేమిగా నిరీ, క్షించితి నన్ను సృష్టి యిటఁ జీకటిచేసెదఁ జూడు మంచు..."రామా. ౭, ఆ. ౧౭౩.

నిరీక్షితము. సం.వి. అ. న.=నిరీక్షణము. విణ. (అ. ఆ. అ.) నిరీక్షింపఁబడినది.

నిరీషము. సం. వి అ. న. నాఁగటికఱ్ఱు. ఫాలము. విణ. (అ. ఆ. అ.) లాంగలదండము లేనిది. (నాఁగలి.)

నిరీహ. సం. వి. ఆ. స్త్రీ. 1. చేష్టాశూన్యత్వము; 2. ఇచ్ఛాశూన్యత; 3. ప్రయత్నము లేమి.

నిరీహుఁడు సం. విణ. (అ ఆ. అ.) 1. చేష్టా శూన్యుఁడు; 2. ఇచ్ఛాశూన్యుఁడు; 3. ప్రయత్న శూన్యుఁడు.

నిరు. దే. అవ్య. గతార్థకము. (నిరుడు, నిన్న, నిప్పచ్చ మొ. శ ర)

నిరుంధత్. సం. (శత్రృ.) నిరోధించుచున్న.

నిరుంధానము. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధించు చున్నది.

నిరుకడము దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

నిరుకు. దే వి. (క. నిరఖు.) 1. నిర్ణయము; 2 నిర్ణ యించిన వెల. (శ. ర.)

నిరుకుశము. వై. విణ. (సం. నిరర్గళమ్.) నిరర్గళము. (శ. ర.) "గీ. నిగమునూపురములు మ్రోయ నిరు కుశముగ..." పాండు. ౨, ఆ. ౭౨౯.

నిరుక్తము. సం. వి. అ. న. 1. పదముల అవయవార్థములను వివరించుట, నిర్వచనము. 2. వేదాంగములలో నొకటి. విణ. (అ. ఆ. అ.) నిర్వచింపఁబడినది.

నిరుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిర్వచనము; 2. ఒక అర్థాలంకారము, శబ్దమునకు యోగమువలన అన్యార్థమును కల్పించుట 3. వేదాంగములలో నొకటి.

నిరుడు. దే. వి. డు. (నిరు+ఏఁడు.) గతవత్సరము "చ. ఒకవిరజాజితీఁగె నిరు డుంచిన దించుక పూయు..." పార్వ. 3, ఆ. ౧౦, ఆం. భా. ప్ర. ౯౬.

నిరుతి. వై. వి. (సం. నిర్ఋతిః. క. నిరుతి.) నైర్ఋతుఁడు నిర్ఋతి. "క...ఆర్చెన్, సురబలము లసురపుత్త్రులు, నిరుతికి వెన్నిచ్చి రెదిరి నిల్వక భీతిన్." కు. సం. ౧౨, ఆ. ౪౬.

నిరుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది; 2. చెఱఁబెట్టఁబడినది.

నిరుధ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధింపఁబడుచున్నది.

నిరుపద్రవము సం. విణ. (అ. ఆ. అ.) 1. బాధలేనిది, 2 విపత్తు లేనిది.

నిరుపహతము సం. విణ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడనిది; 2. ఉపద్రవము లేనిది.

నిరుపహతి సం. విణ (ఇ.)=నిరుపహతము.

నిరుహ్యమానము. సం. విణ (అ. ఆ. అ.) నిర్వహింపఁబడుచున్నది.

నిరూఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధికెక్కినది; 2. పెండ్లియాడఁబడనిది; 3. రూఢము సంకేతసిద్ధము. (వ్యతి. యౌగికము); 4. నిరూఢలక్షణచే అర్థమును బోధించునది. (శబ్దము.)

నిరూఢలక్షణ. సం. వి. ఆ. స్త్రీ. వ్యాకరణకోశాదులందు ప్రసిద్ధ మగునర్థమును తెలుపులక్షణ. (ఉదా:—లావణ్యము, అనుకూలము, ప్రతికూలము.)

నిరూఢి. సం. వి ఇ. స్త్రీ. 1. మిక్కిలిప్రసిద్ధి; 2 (విద్యాదులందు) కౌశలము, ప్రవీణత; 3. నిర్ధారణ, నిశ్చయము; 4. నిరూఢలక్షణ. "గీ. కటిపదంబున నర్థసంఘటిత మగుచు, జఘనమభిధకు సాటి యాసన్నితంబ, మాత్రపశ్చాన్నిరూఢిరై యందు లక్షణాభిరూప్యంబు రుచి గాంచి వ్యక్తిఁ బోలు." కాళింది. ౬, ఆ. ౨౫౨.

నిరూపకుఁడు సం. విణ. (అ. పు. అ.) నిరూపించువాఁడు "ఉ. ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్...ప్రసిద్ధుఁడవు .." భార. విరా. ౧, ఆ. ౫౧.

నిరూపణ. సం. వి. ఆ. స్త్రీ. = నిరూపణము. (విచారణము, అరయుట) "చ. పొరిఁబొరిఁ బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన మాచరించుఁ దత్పరముగుసద్వివేకమున భావనిరూపణ సేయు .." భార. విరా. ౧, ఆ. ౨౦౯.

నిరూపణము. సం. వి. అ. న. 1. నిర్ణయించుట, నిర్ధారణ చేయుట; 2. అరయుట, విచారణము; 3. నిదర్శనము; 4. చూచుట; 5. చూపుట; 6. నిర్వచించుట.

నిరూపణీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁదగినది. "గీ. ప్రౌఢవిచిత్ర, విహారిఁ దెగఁ జూచి యనిరూపణీయదుర్నివారవృత్తిమై నరిగిరి కౌరవేంద్ర." భార. విరా. 3, ఆ. ౭౯. (అనిరూపణీయము = నిరూపింపరానిది.)

నిరూపయత్. సం. (శత్రు.) నిరూపించుచున్న.

నిరూపయమాణము. సం. విణ (అ. ఆ. అ) నిరూపించుచున్నది

నిరూపయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ) నిరూపించు [వాఁడు.

నిరూపయితవ్యము. సం. = నిరూపణీయము.

నిరూపించు. సం స క్రి. 1. నిర్ణయించు "వ .. మరణభయంబున కిది నిమిత్తం బని నిరూపింపరాదు." మార్క. ౧, ఆ. ౫౬, భార. శాం. ౪, ఆ. 3౬౬; 2. గ్రహించు, తెలిసికొను. "వ .. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించు..." భార. విరా. ౪, ఆ. ౧౪, భార. విరా. 3, ఆ. ౪౨; 3. చూచు. "సీ. మెలఁగిన యట్టివఁ బలికింపఁ దలఁచి నిరూపించి లేమి నక్రులు వహించు." భార. విరా. ౨, ఆ. 3౦౧; 4. నిర్వచించు; 5. అభినయించు. (నాట్య.)

నిరూపితము. సం.విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁబడినది.

నిరూప్యమాణము. సం.విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁబడుచున్నది

నిరూప్యము. సం. = నిరూపణీయము తెలియఁదగినది. "చ...సంగరోత్సవోద్యమరథసాతిరేకము బయ

ల్పడు జెందుక లేక రోషనం, ధ్రిత కెంకయింత
రైనఁ బరభావనిరూహ్యము గాక..."భార. విరా.
౨, ఆ. ౩౨.

నిరూహణము. సం. = నిరూహము.

నిరూహము. సం. విణ. (అ. ఆ. అ.) ఊహ లేనిది.

నిర్ఋతి. సం. వి. ఇ. పుం. దక్షిణపశ్చిమదిదిక్పాల
కుఁడు. స్త్రీ. 1. అలక్ష్మి; 2. అధర్మునిభార్య; 3.
అధర్మునికూఁతుఁరు; 4. మృత్యువుభార్య; 5. మూలా
నక్షత్రము.

నిరోధకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధించు
వాఁడు.

నిరోధనము. సం. = నిరోధము.

నిరోధనీయము. సం. = నిరోద్ధవ్యము.

నిరోధము. సం. వి. అ. పుం. 1. చెఱఁబెట్టుట, బంధిం
చుట; 2. అడ్డగించుట; 3. నాశము; 4. వశ
పఱుచుకొనుట.

నిరోధి. సం. విణ. (న్. నీ. న్.) నిరోధించువాఁడు.

నిరోధించు. సం. స. క్రి. అడ్డగించు. "మ ..ధి,
కరులై యొక్కటఁ జుట్టుముట్టుకొని మార్గంబున్
నిరోధించినన్." ఉ. రా. ౩, ఆ. ౩౩౧.

నిరోద్ధ. సం. విణ. (బు. ద్ధ్రీ. బు.) నిరోధించువాఁడు.

నిరోద్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ) నిరోధింపఁ
దగినది.

నిరోధ్యము. సం. = నిరోద్ధవ్యము.

నిర్గంధనము. సం. వి. అ న. 1. చంపుట; 2. మిగుల
హింసించుట. విణ. (అ. ఆ. అ) గంధము లేనిది

నిర్గచ్ఛత్. సం. (శత్రు.) నిర్గమించుచున్న.

నిర్గతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిష్క్రమించి
నది; 2 నశించినది; 3. పైకివచ్చినది. (రసము,
రక్తము. మొ.); 4. బయలువెడలినది, ఉద్గతము.
(ఔద్గ. మొ.)

నిర్గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వెడలుట; 2. నిష్క్రి
మణము.

నిర్గమనము. సం. = 1. నిర్గతి. 2. ద్వారము.

నిర్గమనుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

నిర్గమము. సం. వి. అ. పుం. = నిర్గమనము.

నిర్గమించు. సం. అ. క్రి. 1. ఉద్భవించు, పుట్టు.
"వ. అబ్జవిలోచననందనుశరీరంబుననుండి సురూ
పరయు సుగౌరవరయుం నగునొక్కముగువ నిర్గమించి
నం గని కౌశికుండు..." భార. శాం. ౪, అ
౪౦౦; ౫, ఆ. ౪౬౫; 2. పైకివచ్చు, ఉద్యత
మగు. "గీ. ౯గిడి పొక్కిలివిరిచుండి నిర్గమించు,
నట్టివట్టదరేఖ దా నగుటఁజేసి .." రామా. ౩,
ఆ. ౯౧; 3. బయలువెడలు బయలుదేఱు."వ ..
దీవించి పీసలు సల్లం బురంబు నిర్గమించి .."
భార విరా. ౪, ఆ. ౪౯.

నిర్గర్వము. సం. విణ. (అ. ఆ. అ.) గర్వము లేనిది.
"శా. అనూను బవిశార మాథుజబలం బత్యంత
నిర్గర్వము..." భార విరా. ౨, అ ౨౦౯.

నిర్గళనము. సం. వి. అ. న. వెలికిజాఱుట.

నిర్గళితము. సం. విణ. (అ. ఆ. అ) వెలికిజాఱినది.

నిర్గుండి. సం. వి. ఈ. స్త్రీ 1. వావిలిచె; 2. నల్ల
వావిలిచె.

నిర్గుణుఁడు. సం. విణ. (అ. ఆ. అ) గుణములు లేని
వాఁడు.

నిర్గూఢము. సం. వి. అ. పుం. చెట్టుతొఱ్ఱ విణ.
(అ. ఆ. అ.) 1. సంవృతమా, కప్పఁబడినది; 2.
మిక్కిలి గూఢమైనది.

నిర్గ్రంథకుఁడు. సం. వి. అ. పుం. 1. క్షపణకుఁడు;
2. దిగంబరసన్న్యాసి; 3. జూదరి విణ.
(అ థికా. అ) 1. ఒంటరి, నిస్సహాయుఁడు;
2. వస్త్రరహితుఁడు, 3. జ్ఞాని, హృదయగ్రంథి
వీడినవాఁడు.

నిర్గ్రంథనము. సం. వి. అ. న. చంపుట.

నిర్గ్రంథుఁడు సం. వి. అ. పుం. 1. క్షపణకుఁడు;
2. దిగంబరసన్న్యాసి; 3. ముని. విణ. (అ. ఆ. అ.)
1. నిర్ధనుఁడు, బీదవాఁడు; 2. ఒంటరి, నిస్సహా
యుఁడు; 3. జ్ఞాని; 4. మూర్ఖుఁడు; 5. జూదరి.

నిర్గ్రాహ్యము. సం. విణ. (అ. ఆ అ) తప్పక
గ్రహింపఁదగినది.

నిర్ఘటము. సం. వి. అ. న. బహుజనసమ్మర్దము గల
అంగడి. విణ. (అ. ఆ. అ.) ఘటము లేనిది.

నిర్ఘాతనము. సం. వి అ. న. యంత్రాదులచే అదిమి
పట్టి మున్నగువానిని వెలికితీయుట.

నిర్ఘాతము. సం. వి. అ. పుం. 1. నాశము; 2 దెబ్బ;
3. సుడిగాలి; 4. వజ్రాయుధము.

నిర్ఘోషము. సం. వి. అ. పుం. 1. మ్రోఁత శబ్దము;
2. మహాధ్వని. విణ. (అ ఆ. అ.) ధ్వని లేనిది.

నిర్ఘోషించు. సం. అ. క్రి. ధ్వనిచేయు. "ము ..
అజాం డేవృష్టిను స్థాని... నిద్రించుచున్

గుజువెట్టం దొడఁగెఁ గలల్ గచుచు నిర్లో షించుచుఁ భూవరా." భాగ ౧, స్కం. ౭౧౮.

నిర్జయము. సం. వి. అ. పుం పూర్ణవిజయము.

నిర్జర సం. వి. అ. స్త్రీ. 1. తిప్పతీఁగ; 2. మురఅను గంధద్రవ్యము.

నిర్జరము. సం. వి. అ. న. అమృతము

నిర్జరుఁడు. సం. వి. అ. పుం వేలుపు, దేవత. విణ. (అ. ఆ. అ.) ముదిమి లేనివాఁడు.

నిర్జాతము. సం. విణ. (అ. ఆ. అ.) ఉద్ఘాటము, ఉద్గతము.

నిర్జించు. సం. స. క్రి 1. బాధించు. "గీ. బలము గలవాని బలువురు బలిమిఁ జెరఁచు, లొక్కటై కూడి నిర్జింతు రక్షహించి, మధువుఁ గొన నుక్షహించిన మనుజుల బట్టి, కుట్టి నిర్జించుమధుకరకులమునట్లు." భార. అర. ౧, ౨౫౧; 2. జయించు. "గీ .. ఇంద్రియముల నిర్జించి సత్త్వాదు లవులఁ ద్రోఁచి, యేను శాంతిసుఖాబ్ధిన కెలయుం టసఘు." భార శాం ౫, ఆ ౩౯౫, భార. అశ్వ. 3, ఆ. ౬, 3. చంపు. "వ .. యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించునదియై యరుగుదెంచెం గావలయుం .." భార. విరా. ౨, ఆ. ౧౬౭.

నిర్జితి. సం. వి. ఇ. స్త్రీ పూర్ణవిజయము.

నిర్జితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) జయింపఁబడినవాఁడు.

నిర్ఝరము. సం వి అ. పుం న. సెలయేఱు, ఝరము. పుం. 1 ఏనుఁగు; 2. సూర్యాశ్వము; 3. తుషానలము. ఊఁకనిప్పు.

నిర్ఝరి. సం. వి. ఈ. స్త్రీ. సెలయేఱు. నది. న్ పుం. సెలయేళ్లు కలది-పర్వతము.

నిర్ఝరిణి. సం. వి. ఈ. స్త్రీ. నది, సెలయేఱు.

నిర్ణయత్. సం. (శత్రు.) నిర్ణయించుచున్న.

నిర్ణయనము. సం. వి. అ. న నిర్ణయించుట.

నిర్ణయనీయము. సం. = నిర్ణేయము.

నిర్ణయము సం. వి. అ. పుం. 1. నిశ్చయము, నిర్ధారణ; 2 తీర్పు; 3. ఏర్పాటు.

నిర్ణయించు. సం. స. క్రి 1. స్థిరపఱచు, నిర్ధారణచేయు. ."ఉ. ఇంతిరో మోము చంద్రు నివయిత్వము సైఁకునియట్లుఁ గొంపు మో, వంత సుధారసం బనఁగ నధ్యవసాయునహిష్ణుతాగుణా, క్రాం తము గాదొ తద్రసము కాఁగనో యమృతంబుఁ గొంటి మున్నిం తిది నిర్ణయింతు నని యింపుగఁ జేసెను జాంబవత్సుతుల్." కాళింది ౬, ఆ. ౧౬౮ వరాహ. ౧,ఆ. ౪౧; 2. ఏర్పఱచు. "చ. సమయము నిర్ణయింప విని చంద్రనిభానన కల్కు లద్దుచి, త్తమునకు నింపు నింప .." భార విరా. ౨, ఆ ౨౬౯.

నిర్ణాయకుఁడు. సం. విణ. (అ. యికా అ.) 1. నిర్ణయించువాఁడు; 2. నిర్ణయింపఁజేయువాఁడు

నిర్ణాయనము సం. వి. అ. న. 1. నిర్ణయము చేయుట; 2. నిర్ణయింపఁజేయుట; 3. మరణము; 4 ఏనుఁగు యొక్క అపాంగప్రదేశము.

నిర్ణిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కడుగఁబడినది; 2. పవిత్రము చేయఁబడినది.

నిర్ణిక్తి. సం. వి ఇ. స్త్రీ. 1. కడుగుట; 2. పాపము పోఁగొట్టుట.

నిర్ణిద్రము సం. విణ (అ. ఆ. అ.) 1. నిద్ర లేనిది; 2. జాగ్రత్త కలది; 3. ముకుళితము కానిది, వికసించినది (పుష్పాది.)

నిర్ణీతము. సం. విణ. (అ. ఆ. అ) నిర్ణయింపఁబడినది.

నిర్ణీతి సం వి. ఇ. స్త్రీ. నిశ్చయము. "క. బాలా పాణిగ్రహశుభ, వేళానిర్ణీతి కిపుడ విచ్చేయుము .." వసు. 3, ఆ. ౮౯.

నిర్ణీయమానము. సం. విణ (అ. ఆ. అ.) నిర్ణయింపఁబడుచున్నది.

నిర్ణుదత్. సం. శత్రు. తొలఁగింపఁబడుచున్న.

నిర్ణుదమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగించుచున్నవాఁడు.

నిర్ణుద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడుచున్నది.

నిర్ణేకము. సం. వి అ. పుం. 1. మిక్కిలిశుద్ధి; 2. పాదప్రక్షాళనాదికము; 3. పాపపరిహారము. 4. ప్రాయశ్చిత్తము.

నిర్ణేజకుఁడు. సం. వి. అ. పుం. చాఁకలి, రజకుఁడు. విణ. (అ. ఆ. అ.) శుద్ధిచేయువాఁడు.

నిర్ణేజనము. సం. వి. అ. న. 1. కడుగుట; 2. పాపము పోఁగొట్టుట; 3 ప్రాయశ్చిత్తము. విణ. (అ. ఈ. అ.) 1. కడుగుటకు సాధనమైనది; 2. పాపము పోఁగొట్టుటకు సాధనమైనది; 3. ఉదుకుటకు సాధనమైనది.

నిర్ణేత. సం. విశే. (ఋ. త్రి. ఋ.) 1. నిర్ణయించువాఁడు; 2. నేత, నాయకుఁడు; 3. న్యాయాధిపతి, తీర్పుచెప్పువాఁడు.

నిర్ణేతవ్యము. సం.=నిర్ణేయము.

నిర్ణేయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ణయింపఁదగినది.

నిర్ణోదకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తొలఁగించువాఁడు.

నిర్ణోదనీయము. సం. విశే. (అ. ఆ. అ.) తొలఁగింపఁదగినది.

నిర్ణోదము. సం వి. అ పుం. 1. తొలఁగించుట; 2. నిరసించుట. విశే (అ. ఆ. అ.) 1. తొలఁగించునది; 2. నిరసించునది.

నిర్ణోది. సం. విశే. (న్. నీ న్) తొలఁగించువాఁడు.

నిర్ణోద్యము. సం:=నిర్ణోదనీయము.

నిర్దగ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁగా కాలినది; 2. కాలనిది.

నిర్దయము. సం. విశే. (అ. ఆ అ.) క్రూరము, దయలేనిది. క్రి. విశే క్రూరముగా.

నిర్దరము. సం. వి. అ. న. సారము. విశే. (అ. ఆ అ) 1. కఠినము; 2. సిగ్గులేనిది; 3. నిర్భయము; 4. పెలుచము, నిర్ఝరము.

నిర్దళనము. సం. వి. అ న. పూర్తిగా పెల్చుట, భేదించుట.

నిర్దళించె. సం. స. క్రి. చంపు. "క. ప్రజగరము సంతసిల్లఁగ, నజగరము నశేషలోకవారణగుణోద్య, న్నిజగరము నిర్దళించె, న్భుజగారి ధ్వజాఁడు విబుధబుధసన్నుతుఁడై." సాంబో. ౧, ఆ. ౭౧.

నిర్దళితము. సం. విశే (అ. ఆ. అ.) పూర్తిగా చీల్పఁబడినది.

నిర్దహనము. సం. వి. అ. న. పూర్తిగా కాల్చుట. విశే. (అ. ఆ. అ.) 1. పూర్తిగా కాల్చునది; 2. అగ్ని లేనిది; 3. కాలుట లేనిది.

నిర్దహించె. సం. స క్రి. 1. పూర్తిగా కాల్చు, బాగుగా కాల్చు. "శా. వంశారణ్యము గాల్చు పావకుగతిఁ బర్బిష్ణువై విద్విషు, ద్వంశారణ్యము నిర్దహించు భవమద్దామప్రతాపాగ్ని .." నిరం. ౪, ఆ. ౧౧౮. భార. కర్ణ. ౧, ఆ. ౨౮౫; 2. నాశముచేయు. "మ. అవికృష్టప్రకటీసమాఖ్యతపోవ్యాసంగు లైనట్టిభౌ, గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైకజ్యోతిమైఁ జూపి శో,కవిశోకంబులు నిర్దహించి .." భాగ. ౩, స్కం. ౭౮, పూని. ఉ. ౧౦, ఆ ౨౧౯.

నిర్దారణము. సం. వి. అ. న. చక్కఁగా చీల్చుట.

నిర్దారితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పూర్తిగా చీల్పఁబడినది; 2. తెలుపఁబడినది.

నిర్దిశత్. సం (శతృ.) నిర్దేశించుచున్న.

నిర్దిశ్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్దేశింపఁబడుచున్నది.

నిర్దిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చూపఁబడినది; 2. ఏర్పఱుపఁబడినది; 3. ఆజ్ఞాపింపఁబడినది; 4. ఉపదేశింపఁబడినది; 5. చెప్పఁబడినది, కథితము.

నిర్దిష్టి సం. వి. ఇ. స్త్రీ. నిర్దేశించుట.

నిర్దేశకుఁడు. సం. విశే. (అ. ఈ. అ) నిర్దేశించువాఁడు.

నిర్దేశనము. సం. వి. అ. న. నిర్దేశించుట.

నిర్దేశనీయము. సం.=నిర్దేష్టవ్యము.

నిర్దేశము. సం. వి. అ. పుం 1. చూపుట; 2. ఆజ్ఞ; 3. ఉపదేశము; 4. చెప్పుట, కథనము; 5. ఏర్పాటు; 6. నిశ్చయము; 7. దాపు; 8. వేతనము; 9. ప్రతిపాదకశబ్దము.

నిర్దేశి. సం. విశే. (న్. నీ. న్.) నిర్దేశించువాఁడు.

నిర్దేశించె. సం. స క్రి. 1. చూపు, 2. ఆజ్ఞాపించు; 3. నిరూపించు, నిర్ణయించి చెప్పు "క విను మఱుఁడు శ్రద్ధ యలిపా, వని యది గలవాఁడు గౌరవశ్రేష్ఠుం డా, తనియన్నము భోజ్యతరం, బని నిర్దేశించె నెల్లయమరులు వినఁగన్" భార. శాం. ౫, ఆ. ౨౪౭.

నిర్దేశ్యము సం.=నిర్దేష్టవ్యము.

నిర్దేష్ట. సం. విశే. (ఋ. త్రీ. ఋ) నిర్దేశించువాఁడు.

నిర్దేష్టవ్యము సం. విశే (అ. ఆ అ.) నిర్దేశింపఁదగినది.

నిర్దైన్యము. సం. విశే. (అ. ఆ. అ.) దైన్యము లేనిది.

నిర్ధనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ధనహీనుఁడు, దరిద్రుఁడు.

నిర్ధరించె. సం. స క్రి. నిర్ధారణచేయు. కాశీ. ౫, ఆ (శ ర.)

నిర్ధారకుఁడు. సం. విశే. (అ. రికా. అ.) నిర్ధారణచేయువాఁడు.

నిర్ధారణ. సం వి. ఆ. స్త్రీ.=నిర్ధారణము.

నిర్ధారణము. సం. వి. అ. న. 1. నిశ్చయము; 2. తీర్పు,

నిర్ధారణీయము. సం.=నిర్ధార్యము.

నిర్ధారము. సం. వి. అ. పుం.=నిర్ధారణము.

నిర్ధారయత్. సం. (శత్రు) నిర్ధారణచేయుచున్న.

నిర్ధారయమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణ చేయుచున్నది.

నిర్ధారయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ) నిర్ధారణ చేయువాఁడు.

నిర్ధారయితవ్యము. సం.=నిర్ధార్యము.

నిర్ధారి. సం. విణ. (న్. ణీ న్.) నిర్ధారణ చేయువాఁడు .

నిర్ధారించు. సం. స. క్రి. నిశ్చయించు "శా .. భార్గవుఁడు కార్యం బాత్మ నూహించి నిర్ధారించెన్ బలమర్దనాధ్వర పశు గ్రామం బవశ్యంబు గాన్." వరాహ. ౫, ఆ. ౬౪.

నిర్ధారితము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణచేయఁబడినది.

నిర్ధార్యమాణము. సం. విణ. (అ. ఆ అ.) నిర్ధారణ చేయఁబడుచున్నది.

నిర్ధూతము. సం. విణ. (అ ఆ. అ.) 1. తొలఁగింపఁబడినది; 2. విదుల్పఁబడినది; 3. విడువఁబడినది, త్యక్తము; 4. ఖండింపఁబడినది. (వాదాది.)

నిర్నాభి సం. విణ. (ఇ) 1 బొడ్డు లేనిది, 2. నాభిని అతిక్రమించినది, బొడ్డుక్రిందికి దిగినది.

నిర్నాభిబిలము. సం.=నిర్నాభి. (నాభిని అతిక్రమించినది.) "సీ అభిషేకసిద్ధియోగ్య మగుమడుఁగొల్లి యనిర్నాభిబిలముగా కాటిక గట్టి. .." హర. ౪, ఆ ౭౧. (అనిర్నాభిబిలము = నాభిని అతిక్రమింపనిది )

నిర్బంధ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్బంధించువాఁడు.

నిర్బంధకుఁడు. సం. విణ. (అ. ధికా. అ.) నిర్బంధించువాఁడు. [దగినది.

నిర్బంధనీయము. సం విణ. (అ ఆ. అ.) నిర్బంధింపఁ

నిర్బంధపడు. వి అ. క్రి (నిర్బంధము+పడు.) బలాత్కారము నొందు.

నిర్బంధపఱచు. వి. స. క్రి. (నిర్బంధపడు ధా. ప్రే.) 1. బలవంతముచేయు, "గీ . బాధువుల్ వీని నిర్బంధకులు మనకు, తేమికారణ మని చెప్పరింత రొత్తి." ఉద్భ. ౩, ఆ. ౧౨౪. రామా. ౬, ఆ. ౧౯౪.

నిర్బంధము. సం. వి. అ. పుం. 1. బలాత్కారము; 2. పట్టుదల; 3. గట్టిగా బంధించుట.

నిర్బంధి. సం. విణ. (న్. నీ. న్.) నిర్బంధించువాఁడు.

నిర్బంధించు. సం. స. క్రి. 1. గట్టిగా బంధించు, కదల కుండఁ జేయు. "శా. భూలోకంబున దుష్టశాత్రవచయంబుం బంపి ధర్మజ్ఞులన్, బాలింపంగ బనించినాఁడవు మహీభారావతీర్ణక్రియా, శీలత్వంబు వహించె నీ విపుడు లక్ష్మీనాథ యీ పాములో, బాలక్రీడలు సల్ప నేమిటికి నిర్బంధించి మర్దింపవే." వి. పు. ౭, ఆ. ౧౪౪; 2. బలవంతపెట్టు, నిర్బంధపఱచు. "మ అని దైన్యంబున వేశ్యమాత మిగులం బ్రార్థింప నార్ద్రాత్ముఁడై, వనవాసంబునఁ గష్టముం దపము సాఫల్యంబునుం జెప్పి జవ్వని నవ్వేశ్య బహుప్రకారముల నిర్బంధించె బొమ్మన్న ..." దశ. ౫, ఆ. ౨౦

నిర్బంధ్యము. సం.=నిర్బంధనీయము.

నిర్బద్ధము. సం. విణ. (అ. ఆ. అ. నిర్బంధింపఁబడినది.

నిర్బధ్నత్. సం. (శత్రు.) నిర్బంధించుచున్న.

నిర్బధ్యమానము. సం విణ. (అ. ఆ. అ.) నిర్బంధింపఁబడుచున్నది

నిర్బర్హణము. సం. వి. అ, న. చంపుట, నిబర్హణము.

నిర్బాధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డు లేనిది; 2. ఉపద్రవము లేనిది; 3. జనసమ్మర్దము లేనిది.

నిర్భయము. సం. వి. అ. న. భయములేమి, భయాభావము. "ఉ ..ఇందుల కెప్పుడున్ మనుజు లెన్నఁడు వత్తురె వచ్చి రేని యానందముఁ బొంది నిర్భయమునన్ శయనింతురె .." భార. ఆది. ౬, ఆ. ౧౭౬.

నిర్భరము. సం. వి. అ న. 1. అతిశయము, ఆధిక్యము. "చ ..నరసుతకీర్తి యుమ్యానిలనందనుఁ డెవ్వరి తోడ నేని భీకరసమరంబు సేయు నమకట్టినయట్లు మహానురాగని, ర్భరమున నున్నవాఁడు .." భార. ఆది. ౬, ఆ. ౨౪౯; 2. భారములేమి. క్రి. విణ. 1. మిక్కుటముగా, అధికముగా. (శ. ర.); 2. గాఢముగా.

నిర్భర్త్సకుఁడు. సం విణ. (అ. త్సికా. అ.) నిర్భర్త్సించువాఁడు.

నిర్భర్త్సన. సం. వి అ. స్త్రీ. = నిర్భర్త్సనము.

నిర్భర్త్సనము. సం. వి. అ. న. 1. బెదరించుట, బెదరింపు; 2. తిరస్కారము; 3, లత్తుక,

నిర్భర్త్సనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్భర్త్సింపఁదగినది.

నిర్భర్త్స్యమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిర్భర్త్సించుచున్నవాఁడు.

నిర్భర్త్సయిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) నిర్భర్త్సించువాఁడు.

నిర్భర్త్సయితవ్యము. సం. = నిర్భర్త్సనీయము.

నిర్భర్త్సి. సం. విణ (న్. ణీ. న్.) నిర్భర్త్సించువాఁడు.

నిర్భర్త్సించు. సం. స. క్రి. 1. తిరస్కరించు; 2. బెదరించు "వ ..ఆమాయకుటిలం బగుకటాక్ష వీక్షణంబునం దర్జించి నిట్లు నిర్భర్త్సింపఁబడి..." శైవ. ౮, ఆ. ౭౨,

నిర్భర్త్సితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. బెదరింపఁబడినవాఁడు; 2. తిరస్కరింపఁబడినవాఁడు.

నిర్భర్త్స్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్భర్త్సింపఁబడుచున్నది.

నిర్భర్త్స్యము. సం. = నిర్భర్త్సనీయము.

నిర్భిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా ఛేదింపఁబడినది.

నిర్భేదము. సం. వి. అ. పుం. 1. భేదించుట; 2. చీలిక; 3. వెల్లడిచేయుట.

నిర్భేదించు. సం. స. క్రి. చీల్చు. "వ. ఈక్షణంబున నిన్ను నిర్భేదించి నీగర్భంబున నున్నయతలవిత లాదిసప్తపాతాళలోకంబులు చీకాకుగావించి .." ఉ. రా. ౮, ఆ. ౧౧౭.

నిర్భేద్యము. సం. విణ. (అ. ఆ. అ.) భేదింపరానిది.

నిర్మంథకుఁడు సం. విణ (అ. ఋకా. అ.) మథించువాఁడు.

నిర్మంథనము. సం. వి. అ. న. 1. మథించుట; 2. త్రచ్చి నిప్పుపుట్టించుకఱ్ఱ, అరణి, 3. ధ్వంసము.

నిర్మంథనీయము. సం. విణ. (అ. ఆ. అ.) మథింపఁదగినది.

నిర్మంథము. సం. = నిర్మంథనము.

నిర్మంథ్యము. సం. అ. న. అరణి, మథించి నిప్పుపుట్టించుకఱ్ఱ. వి౯. (అ. ఆ. అ.) మథింపఁదగినది

నిర్మక్షికము. సం. అవ్య. అ. న. 1. మక్షికాభావము, ఈఁగలులేమి; 2. జనములేమి. విణ (అ. ఆ. అ.) 1. ఈఁగలు లేనిది; 2. నిర్జనము.

నిర్మథనము. సం.=నిర్మంథనము. 1. (మథించుట.) "ఉ. ధర్మసుతు దక్షిణ తాపసకుతంబున కంకిలిపాటొనర్పఁ గ్రోధోర్మిమహాతాత్ముఁలై తమకు లోక్కుట తాకని దక్షిణాపుఁగే, ల్నిర్మథనంబుచేసిన జనించెఁ బృథుం డనురాజు .." హరి పూ. ౧, ఆ, ౧౩౩; 2. (నిర్మూలించుట, చంపుట.) "శా...దుర్వారోద్యమబాహువిక్రమరసాస్త్రోకప్రతాపస్ఫురత్, గర్వాంధప్రతిపీరనిర్మథన విద్యాపారగుల్ మత్సుతుల్." భార విరా. ౨, ఆ. ౫౫.

నిర్మథము. సం. వి. అ. పుం.=నిర్మంథనము.

నిర్మథించు. సం. స. క్రి. ధ్వంసముచేయు, పోఁగొట్టు. "మ ..దు, ర్మలినావాంకృతి నిర్మథించి..." విష్ణు కా. 3, ఆ. 33౯.

నిర్మదము. సం. అవ్య. అ. న. మదములేమి. విణ. (అ. ఆ. అ) మదము లేనిది.

నిర్మర్యాదము. సం. అవ్య. అ. న. మర్యాదలేమి. విణ. (అ. ఆ. అ.) మర్యాద లేనిది.

నిర్మలము. సం. వి. అ. న. 1. అభ్రకము; 2. నిర్మాల్యము. విణ. (అ. ఆ అ.) 1. మురికి లేనిది, శుద్ధము; 2. తెల్లనిది; 3. పాపము లేనిది.

నిర్మాణము. సం. వి. అ. న. 1. సృష్టి, సృజించుట; 2. చేయుట; 3. గ్రంథాదుల రచించుట; 4. నిర్మించుటకు సాధనము; 5. కన్నుట, కూర్చుట; 6. ఆకారము; 7. కృతి, గ్రంథము; 8. సారము; 9. యోగ్యత.

నిర్మాత. సం. విణ. (ఋ. త్రి. ఋ ) నిర్మించువాఁడు.

నిర్మాతవ్యము. సం విణ. (అ. ఆ. అ.) నిర్మింపఁదగినది.

నిర్మానుషము. సం. అవ్య. అ న. మనుష్యాభావము. విణ (అ. ఆ. అ.) నిర్జనము.

నిర్మాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ) 1. నిర్మించువాఁడు; 2. మాయలేనివాఁడు.

నిర్మాయి. సం. విణ. (న్. నీ న్.) నిర్మించువాఁడు.

నిర్మార్జనము. సం. వి. అ. న. 1. కడుగుట; 2. శుద్ధిచేయుట. విణ. (అ. ఆ. అ.) మార్జనము లేనిది.

నిర్మాల్యము. సం. వి. అ. న. దేవతలను పూజించి పిదప తీసివేసినపుష్పాదికము, ధరించి తీసివేసిన పుష్పాదికము.

నిర్మించు. సం. స. క్రి. 1. సృజించు. "వ...చరాచరంబులఁ బురాతనవర్గంబుల చందంబున నిర్మించి ..." వి. పు. ౧, ఆ. ౮౧; 2. కావించు, చేయు. "క...న న్నతిరుచిరాంబరభూషా, న్వితఁ జేసి మనఃప్రియంబు నిర్మింపు దయన్." భార. ఆర

౨, ఆ. ౩౨౨; 3. (గ్రంథాదులను) రచించు. "మ... ప్రబంధం బూని నిర్మించు టే, సరసత్వం బని .." ఉ. రా. పీఠి. ౧౪; 4. (గృహాదులను) కట్టు. "వ...ఇట ధృతరాష్ట్రుండు దననిర్మింపం బంచినసభ దుర్యోధనునకుం జూపి .." భార. సభా. ౨, ఆ. ౧౩౪. ౧, ఆ. ౪.

నిర్మితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింపఁబడినది.

నిర్మితి. సం. వి. ఇ. స్త్రీ. నిర్మించుట.

నిర్మితిచేయు. మి. స. క్రి. (నిర్మితి+చేయు) నిర్మించు. "చ...జగజ్జయసాధనంబులై మెలఁగెడు చాప బాణములు మేలుగ నిర్మితిచేసి మాధవుం, డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు ననంగ లక్ష్యమా." కాళిందీ. ౨, ఆ. ౫.

నిర్మిత్స. సం. వి. ఆ. స్త్రీ. నిర్మింపనిచ్ఛ.

నిర్మిత్సితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింప నిచ్ఛగింపఁబడినది.

నిర్మిత్సువు. సం. విశే (ఉ.) నిర్మింప నిచ్ఛగించువాఁడు.

నిర్మిమీష. సం. వి ఆ. స్త్రీ. నిర్మింపనిచ్ఛ.

నిర్ముక్తము. సం. వి. అ. పుం. కుబుసము విడిచిన పాము.

నిర్ముక్తి. సం. వి. ఇ. స్త్రీ. బంధమునుండి విడిపడుట, ముక్తి.

నిర్ముక్తుఁడు. సం. వి. అ. పుం. సంగము విడిచిన సన్న్యాసి విశే. (అ. ఆ. అ.) 1 విడువఁబడిన వాఁడు; 2. సంసారాదిబంధవిముక్తి నొందిన వాఁడు. [వాఁడు.

నిర్మూలకుఁడు. సం. విశే. (అ. లిశా. అ.) నిర్మూలించు

నిర్మూలనము. సం. వి. అ. న. 1. పెల్లగించుట, 2. నాశముచేయుట.

నిర్మూలనీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁ దగినది.

నిర్మూలపడు మి. స. క్రి. (నిర్మూలము+పడు.) నాశ మగు. (చూ. నిర్మూలపఱచు.)

నిర్మూలపఱచు. మి. స. క్రి. (నిర్మూలపడుధా.) నాశముసేయు. "గీ భూల సేసినవాని నిర్మూల పఱచి, ఊల సేసినవాని పేరాశమైన, లీలఁ గరుణించితివి .." నిరం. 3, ఆ. ౪౨.

నిర్మూలము. విశే. (అ. ఆ. అ.) 1. వేరు లేనిది. (చెట్టు.); 2. ఆధారము లేనిది. (వాక్యాది.); 3. మూలము లేనిది, నశించినది, 4. నశింపఁ జేయునది.

నిర్మూలయత్. సం (శత్రు.) నిర్మూలించుచున్న.

నిర్మూలయమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలించుచున్నది.

నిర్మూలయితృ. సం. విశే. (ఋ. త్రి. ఋ) నిర్మూలించువాఁడు.

నిర్మూలయితవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁదగినది.

నిర్మూలించు. సం. స. క్రి. 1. నాశముచేయు. "వ... నీయందుఁ గలనిఖిలజంతువుల నిర్మూలించి ..ఈ యేడులోకంబుల నీఱు కావించెద .." ఉ. రా. ౮, ఆ. ౧౧౨; 2. ఊడఁదీయు. "క. తూలింతు దానవుల ని,ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్." భాగ. ౮, స్కం. ౪౮౩; 3. పెకలించు.

నిర్మూలితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁ బడినది.

నిర్మూల్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁ బడుచున్నది.

నిర్మూల్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిర్మూలింపఁ దగినది; 2. విలువ లేనిది.

నిర్మృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) శుద్ధిచేయఁ బడినది.

నిర్మేయము. సం. విశే. (అ ఆ. అ) నిర్మింపఁదగినది.

నిర్మోకము. సం. వి. అ పుం. 1. విడిచిపెట్టుట, మోచనము; 2. కుబుసము; 3. కవచము; 4. ఆకాశము.

నిర్మోచనము. సం. వి. అ. న. 1. పూర్తిగా విడిచి పెట్టుట; 2. పూర్తిగా విడిపించుట.

నిర్యంత్రణము. సం. వి అ. న. 1. పిడుచుట; 2. నలఁచుట. అవ్య. అ. న. 1. అడ్డులేమి; 2. బంధము లేమి, ఉచ్ఛృంఖలత్వము; 3. బాధలేమి. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డులేనిది; 2. బంధములేనిది, ఉచ్ఛృంఖలము; 3. బాధలేనిది.

నిర్యంత్రితము. సం. విశే. (అ. ఆ. అ.) అడ్డములేనిదిగా చేయఁబడినది.

నిర్యాణము. సం. వి. అ. న. 1. వెడలుట, నిస్సరణము; 2. మరణము; 3. మోక్షము, ముక్తి; 4. ప్రయాణముగుట; 5. ఏనుఁగుకడకన్ను.

నిర్యాతకుఁడు. సం. విశే. (అ. లిశా. అ.) పీనుఁగును మోయువాఁడు, శవవాహకుఁడు.

నిర్యాతనము. సం. వి. అ. న. 1. ఈవి, దానము; 2. ఇచ్చినదానికి బదులుగా నిచ్చుట, ప్రతిదానము;

3. ప్రతీకారము; 4. చంపుట; 5. అప్పు లోనగు వానిని తీర్చుట; 6. దాఁచ బెట్టినసొమ్మును తిరిగి అప్పగించుట.

నిర్యాతము సం. వి. అ న. 1. వెడలుట; 2. మర ణము. విశ. (అ. ఆ. అ ) 1. వెడలినది; 2. మర ణించినది.

నిర్యాతి. సం. వి. ఇ. స్త్రీ. 1 వెడలుట, నిస్సరణము, 2. ప్రయాణము; 3. మరణము.

నిర్యాత్యము. సం. విశ. (అ ఆ. అ.) తీర్పఁదగినది.

నిర్యాపణము. సం. వి అ. న. వెడలఁగొట్టుట.

నిర్యాసము. సం. వి. అ. పుం న. 1. బంక; 2. కషా యము. "గీ. సల్లకీజాతనిర్యాసమెల్ల దేవ, తలకు మేలు...ధూపదానము కడ..." భార. అను. ౪, అ. ౧౨.

నిర్యుక్తి. సం అవ్య. ఇ న. 1. కూడిక లేమి; 2. అర్థ్హతలేమి. విశ. (ఇ)=నిర్యుక్తికము.

నిర్యుక్తికము. సం. విశ. (అ ఆ. అ.) 1. కూడిక లేనిది; 2. అర్థ్హము కానిది.

నిర్యూషము. సం. వి అ. పుం. బంక, నిర్యాసము.

నిర్యూహము. సం. వి అ. పుం. 1. వాకిలి, ద్వారము; 2. నిర్యాసము, బంక; 3. సిగబంతి; 4. కషా యము; 5. గోడపైని కఱ్ఱతో కట్టినగువ్వగూడు, 6. చిలుకకొయ్య.

నిర్లజ్జుఁడు. సం. విశ. (అ. ఆ. అ ) లజ్జ లేనివాఁడు.

నిర్లిప్తము. సం. విశ. (అ. ఆ. అ.) 1. పూఁత లేనిది లేపనము లేనిది; 2. నిస్సంగము.

నిర్లుంచనము. సం. వి. అ. న. 1 ఒలుచుట, పొట్టు లోనగునవి తీయుట; 2. త్రుంచుట

నిర్లుంఠనము. సం. వి. అ. న. అపహారణము.

నిర్ఘూత. దే. వి. జలజంతువిశేషము. "గీ. ..పెలుక నిర్ఘూత కోచు తాఁబేలు పిడుక, మొసలి శింశు మారము పెద్దమెఁసలి .."హంస ౪, అ. ౧౭౩.

నిర్లేఖనము. సం. వి. అ. న. 1. వ్రాయుట; 2. గోఁ కుట. విశ. (అ. ఈ. అ.) 1. వ్రాయుటకు సాధన మైనది. (కలము. మొ.); 2. గోఁకుటకు సాధన మైనది.

నిర్లేపము. సం. = నిర్లిప్తము.

నిర్వక్తవ్యము. సం. = నిర్వచనీయము.

నిర్వచనము. సం. వి. అ. న. 1. ఉచ్చరించుట; 2. అర్థమును వివరించి చెప్పుట; 3. సామెత; 4. ప్రసిద్ధి. విశ. (అ. ఆ. అ.) 1. గద్యము లేనిది. (కావ్యము.); 2. మాటాడనిది.

నిర్వచనీయము. సం. విశ. (అ. ఆ. అ.) నిర్వచింపఁ దగినది.

నిర్వచించు. సం. స. క్రి. వివరించిచెప్పు, స్పష్ట పఱచు. "గీ ..భ్రూమధ్యమాస్థలంబు, వరణ సంసారదోషనివారణంబు, నాశి యింద్రియదోష వినాశనంబుఁ, జేయుచుండుట యిది నిర్వచింపఁ బడియె." కాశీ. ౨, అ. ౧౯౯.

నిర్వపణము. సం. వి. అ. న. 1. పితృతర్పణము విడు చుట; 2. ఈవి ,దానము; 3. యజ్ఞాదులందు దేవ తల కన్నాదులను పంచుట; 4. విత్తనములు చల్లుట.

నిర్వర్ణనము సం. వి. అ. న. 1. చూపు; 2. పరిశీలన పూర్వకముగా చూచుట.

నిర్వర్ణించు. సం. స. క్రి. చూచు. "వ...పూర్ణ చంద్రు దర్శించుకలశాంబుధి కెఱంగున పరో వరంబు దర్శించుతర్షి తునిమాడ్కి..." నిరం. ౧, అ. ౭౯.

నిర్వర్తకుఁడు. సం. విశ. (అ. ర్తికా. అ.) కొఱ నేర్చువాఁడు.

నిర్వర్తనము. సం. వి. అ. న. కొఱవేర్చుట.

నిర్వర్తనీయము. సం. = నిర్వర్తితవ్యము.

నిర్వర్తమానము. సం. విశ. (అ. ఆ. అ.) నిర్వర్తించు చున్నది.

నిర్వర్తి సం. విశ. (న్. నీ. న్.) కొఱవేర్చునది.

నిర్వర్తించు. సం. స. క్రి. 1. చేయు. "వ . దుర్యో ధనుసందర్శనంబును నిర్వర్తించి......" భార. ఉద్యో. ౧, అ. ౨౩౦; 2. ఆచరించు. "సీ .. దేవ, పితృతిథిజ్ఞాతిమిత్ర కార్యములు నిర్వర్తించు చునిరయువంతు లైన, తనయులఁ గన్నాఁడు..." భార. శాం ౩, అ. ౪౮౭; 3. సిద్ధముచేయు, ఒడఁగూర్చు. "వ. అని నిశ్చయించి యతనికి నావాసరసంఛాదనంబులు సమీచీనంబులుగా నిర్వ ర్తింపఁ దగువాని నియోగించి..."భార. శాం. 3, అ. ౪౯3. [వాఁడు.

నిర్వర్తిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ ) నిర్వర్తించు

నిర్వర్తితము. సం. విశ. (అ.ఆ అ ) నిర్వర్తింపఁబడినది.

నిర్వర్తితవ్యము. సం విశ. (అ ఆ. అ.) నిర్వర్తింపఁ దగినది.

నిర్వర్తిల్లు. సం. స. క్రి. కొనసాగు. (శ. ర.)

నిర్వర్త్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁబడుచున్నది.

నిర్వర్త్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁదగినది.

నిర్వహణము. సం. వి. అ. న. 1. కొనసాగించుట; 2. జరుపుట; 3. నాటకసంధులలో నొకటి.

నిర్వహణీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్వహింపఁదగినది.

నిర్వహత్. సం. శత్రు. నిర్వహించుచున్న.

నిర్వహించు. సం. అ. క్రి. జీవించు, బ్రదుకు. "వ. నిన్నుం బాసి నిమిషం బయిన నిర్వహింపనేర మని ధర్మరా జెట్టకేనియు గరుడగమనుగమనంబున కొడంబడియె నంత." భార. సభా. ౨, ఆ. ౧౩, ఏకా. ౨, అ. ౧౨, స. క్రి. 1. కొనసాగు, పూర్తిచేయు. "వ.. ధర్మదేవత .." యాగవిశేషవిధానంబు వరప్రదానంబున నిర్వహించి .. భార. శాం. ౫, ఆ. ౩౬౨; 2. ఆచరించు "ఉ. వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచున్." భార. విరా. ౧, ఆ. ౧౫, 3 చేయు. "సీ. ప్రామిసుకులు మూర్తములచి లోకహితంబుగా నిర్వహించె సుబ్బనిబుద్ధి." వరాహ. ౧. ఆ. ౯, 4. జరిగించు, సాగించు. "ఉ...మది యెంతయు సెగ్గలై మేను చేష్టలం, దక్కొనశక్యమిం కిట రక్షవ్యవహారము నిర్వహింపఁగన్." భార. విరా. ౫, ఆ ౧౧౨. భార. సభా. ౧, ఆ. ౫౦; 5. అన్నాదిక మిడి పోషించు. "చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ, బడసి మహీసురోత్తముల భిక్షులఁ బల్వుర నిర్వహించె నృపుఁడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండినశాకమూలముల్, గడురుచి నిచ్చ భోజనసుఖంబును దృప్తియుఁ జేయుచుండఁగన్." భార అర. ౧, ఆ. ౪౪.

నిర్వహిల్లు. సం అ. క్రి. 1. జరుగు; 2. కొనసాగు. (శ. ర.)

నిర్వాచ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్వచింపఁదగినది.

నిర్వాణము. సం. వి. అ. న. 1. అస్తమించుట, 2. మృతి; 3. మోక్షము; 4. సంతోషము; 5. సంగమము; 6. ఏనుఁగు నీళ్లలో మునుఁగుట; 7 విశ్రాంతి. విశే. (అ. ఆ. అ.) 1. శూన్యము, లేనిది; 2. మృతము, చచ్చినది; 3. నిశ్చలము; 4. నీళ్లలో మునిఁగినది, (ఏనుఁగు); 5. అస్తమించినది; 6. శాంతము, అణఁగిపోయినది. (గర్వము, దీపము. మొ.) "ఉ. శోణిత వర్షంబె దిగ్గహనఘోరముగా వివిధూమకేతు వత్రీణతఁ దోఁచె శర్కరలు పేర్వడఁ జల్లుచుఁ దీవ్రతఁ దైజగత్త్రాణుఁడు వీచె శోణితపురం బురుశోణిత వృష్టిఁ దేలె నిర్వాణము లయ్యె దేవరిపువర్గము లేడుము లెల్ల నొక్కమై." హరి. ఉ. ౩, ఆ ౪౪.

నిర్వాణి. సం. విశే. (న్. నీ. న్.) నిర్వాణము కలవాఁడు-శాంతుఁడు. "ద్వి. బాపురే నిర్వాణి బాపురే తపసి." బస. ౩, ఆ. ౧౧౭. పం.

నిర్వాణుఁడు. సం. వి. అ. పుం. 1. సేవకుఁడు; 2. బరువు మోయువాఁడు; 3. సన్న్యాసి; 4. ముక్తి నొందినవాఁడు

నిర్వాతము. సం. అవ్య. అ. న. గాలిలేమి. విశే. (అ. ఆ. అ) గాలి లేనిది

నిర్వాదము. సం. వి. అ. పుం. 1. జనవాదము, నింద; 2. నిశ్చితవాదము. అవ్య. అ. న. వాదములేమి. విశే. (అ. ఆ. అ.) వాదము లేనిది.

నిర్వాపకుఁడు. సం. విశే. (అ. పికా. అ.) నిర్వాపము చేయువాఁడు, పోఁగొట్టువాఁడు "క. ఉర్వీశ మౌళి యగుచూ, తుర్వసువంశంబునందు దుష్టారిభుజా, దుర్వారగర్వరేఖా, నిర్వాపకుఁ డీశ్వరాఖ్యనృపకలి జనించెన్." పారి. పీఠి. ౧.

నిర్వాపణము. సం. వి అ. న. 1. ఈవి, దానము; 2. తర్పణముచేయుట, 3. (దీపాదులను) ఆర్పుట, 4. ఉపశమింపఁజేయుట; 5. నాశముచేయుట; 6. చంపుట; 7. విత్తనములు చల్లుట; 8. చల్లఁబఱచుట; 9. చలువచేయుటయందు లోనగువస్తువు; శిశిరోపచారద్రవ్యము.

నిర్వాపము. సం వి. అ. పుం. 1. దానము; 2. తర్పణముచేయుట; 3. (అగ్న్యాదులను) చల్లార్చుట.

నిర్వాపయిత. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) నిర్వాపము చేయునది.

నిర్వాసనము. సం. వి. అ. న. 1. నిస్సారణము, వెళ్లఁగొట్టుట, 2. చంపుట; 3. విసర్జించుట.

నిర్వాసము. సం. వి. అ పుం 1. ఇల్లువెడలిపోవుట, ప్రవాసము, 2. వెడలఁగొట్టుట; 3. చంపుట.

నిర్వాసించు. సం. స. క్రి. ప్రవాసముగాఁ బంపు; వెడలఁగొట్టు.

నిర్వాసితము. సం. విణ. (అ. ఆ. అ.) వెళ్లఁగొట్టఁబడినది.

నిర్వాహకుఁడు. సం. విణ. (అ. హి. కా. అ) నిర్వహించువాఁడు.

నిర్వాహము. సం. వి. అ. పుం. నిర్వహించుట.

నిర్వాహి. సం. విణ (న్. నీ. న్.) 1. నిర్వహించునది, కొనవేర్చునది; 2. వెలువరించునది.

నిర్వాహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వహింపఁదగినది. "గీ. వైశ్వదేవ మవశ్య నిర్వాహ్యమనఘ." భార. అను. 3, ఆ. 33౭.

నిర్వికల్పము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పక్షాంతరము లేనిది; 2. సందేహము లేనిది. క్రి. విణ. నిస్సంశయముగా.

నిర్విఘ్నము. సం. విణ. (అ. ఆ. అ.) విఘ్నము లేనిది. క్రి. విణ విఘ్నము లేకుండఁగా.

నిర్విణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూనిన కార్యము విఫలమైన దని యనుతాప మొందువాఁడు; 2. ఖిన్నుఁడు; దుఃఖముచే కృశించినవాఁడు; 3. మిక్కిలి విరక్తుఁడు; 4. తన్ను తాను నిందించుకొనువాఁడు.

నిర్విశేషము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆధిక్యము లేనిది; 2. అభిన్నము; సమానము. క్రి. విణ భేదము లేకుండునట్లుగా. అవ్య. అ. న. భేదము లేమి.

నిర్విశేషుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అభిన్నుఁడు; సమానుఁడు. "వ... పుత్రనిర్విశేషం బగునిజప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంతయె.." భార. విరా. ౪, ఆ. ౧౯౫.

నిర్విష. సం. వి. ఆ. స్త్రీ. అతివసశీ.

నిర్విషము. సం. అవ్య. అ. న. విషాభావము. "చ... ఈ ప్రమద్వరకు నిర్విషమయ్యెడు నేఁడు మీఁద యన్." భార. ఆది. ౧, ఆ. ౧౪౮. విణ. (అ. ఆ. అ.) విషము లేనిది.

నిర్విష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుభవింపఁబడినది; 2. చొరఁబడినది; 3. పొందఁబడినది. (శ. ర.)

నిర్వీరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వీరుఁడు కానివాఁడు, పిఱికివాఁడు.

నిర్వీర్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పుంస్త్వము లేనిది; 2. పౌరుషము లేనిది.

నిర్వృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సుఖముగా నుండునది; 2. నశించినది.

నిర్వృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. స్వస్థత, 2. నాశము. మృత్యువు; 3. మోక్షము; 4. సుఖము. "శా. ఎంతే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్, జెందున్..." స్వా. ౨, ఆ. ౩౨.

నిర్వృత్తము. సం విణ. (అ. ఆ. అ.) కొనవేఱినది.

నిర్వృత్తి. సం. వి. ఇ స్త్రీ. 1. కొనవేఱుట, సంసిద్ధి; 2. మోక్షానందము. అవ్య. ఇ. న. వృత్తిలేమి, జీవికలేమి. విణ. (ఇ) వృత్తిలేనివాఁడు, జీవిక లేనివాఁడు.

నిర్వేదనము. సం. వి. అ. న. దుఃఖము. ఖేదము. "వ ....సుదేష్ణ త న్ననుచితవ్యాపారంబునకు నియోగించుటకు నిర్వేదనంబునం బొంది." భార. విరా. ౨, ఆ. ౧౦౩.

నిర్వేదము. సం. వి. అ. పుం. 1. శోకము; 2. తన్నుఁ దాను నిందించుకొనుట; 3. పరమవైరాగ్యము.

నిర్వేదించు. సం. అ. క్రి. 1. విచారించు, దుఃఖించు "వ. ఇట్లురగు లమృతం బుపయోగింపం గానక చనిన శేషుండు దనతల్లియుం దమ్ములుం జేసిన యధర్మంబునకు నిర్వేదించి..." భార. ఆది. ౨, ఆ. ౧౨౫. శివరా. ౨, ఆ. ౧౦౮; 2. రోఁతపడు; విరక్తినొందు. "వ. తపోమహత్త్వంబున మాకు నాయువు గడుం బెద్దయైన నిర్వేదించి మనుష్యలోకంబున నుండ నొల్లక..." భార. ఆది. ౨, ఆ. ౧౪౦. భార. సభా. ౧, ఆ. ౧౩౬.

నిర్వేశము. సం. వి. అ. పుం. 1. భోగము; 2. అనుభవము; 3. భృతి, వేతనము; 4. మూర్ఛపోవుట.

నిర్వైరము. సం. అవ్య. అ. న. వైరము లేమి. విణ. (అ. ఆ అ.) వైరము లేనిది.

నిర్వోఢ. సం. విణ (ఋ. ఢీ. ఋ.) నిర్వహించువాఁడు.

నిర్వోఢవ్యము. సం. విణ. (అ. ఆ. అ) నిర్వహింపఁదగినది.

నిర్వ్యథనము. సం. వి. అ. న. 1. మిక్కిలిబాధ; బెజ్జము, రంధ్రము. అవ్య. అ. న. వ్యథలేమి.

నిర్వ్యథము. సం వి. అ. న. అధికబాధ. అవ్య. అ. న. బాధలేమి. (విణ. అ. ఆ. అ.) వ్యథ లేనిది.

నిర్హరణము. సం. వి. అ. న. 1. శవాదులను తీసికొనిపోవుట; 2. వెడలఁగొట్టుట; 3. నివారించుట,

పోఁగొట్టుట. "క. శ్రీమదపాంగాలోకన,ధామ సకృత్సంగరూఢతాదృశ విభవో,ద్దామాశ్రిత లోకాలో,కామయనిర్హారణ నిపుణ హరిహర నాథా." భార. విరా. ౨, ఆ. ౧

నిర్హాదము. సం. వి. అ. పుం. మలవిసర్జనము.

నిర్హారకుఁడు. సం. విశే. (అ. రి కా. అ) నిర్హారణము చేయువాఁడు.

నిర్హారము. సం. వి. అ. పుం. 1. నిర్హారణము; 2. రహస్యముగా ధనాదులు కూడఁబెట్టుట; 3. మలమూత్రాదివిసర్జనము.

నిర్హారి. సం. విశే. (న్. శీ. న్.) 1. నిర్హారణము చేయువాఁడు, 2. మిక్కిలిమనోహరము; 3.దూరముగా వ్యాపించునట్టిది. (పరిమళాది.)

నిర్హృతము. సం. విశే. (అ. ఆ. అ) నిర్హారణము చేయఁబడినది.

నిర్హృతి. సం. వి ఇ. స్త్రీ = నిర్హారణము.

నిర్హ్రాదము. సం. వి. అ. పుం. ధ్వని.

నిఱునిఱు. దే. వి. నీల్గుటయందగు ధ్వని కనుకరణము. "ద్వి. నిఱునిఱు నీల్గుచు నిక్కుచు పీపు,విఱిచికొను .." పండితా. పురా. ౧౦౧. పు

నిఱు దే. విశే. (క నిఱు.) మిక్కిలి. (చూ. నిఱుపేద మొ.)

నిఱునీఁగు. దే. స. క్రి. (నిఱు+నీఁగు) సంపూర్ణముగా త్యజించు. "ఉ నిన్నటినుండి యేము నిఱునీఁగియుం నుంటిమి నిట్రుపాసముల్." కాశీ. ౧, ఆ. ౧౭౯.

నిఱుపేద. దే. విశే. (నిఱు+పేద.) 1. కడుబీద, అతిదరిద్రుఁడు. "క. నిఱుపేద యింటి కేఁటికిఁ, బఱతెంచు నిధానము .." నైష. ౪, ఆ. ౭3; 2. మిక్కిలి సన్ననిది. "సీ. ఘనమైనరారాపు చనుకోయిరాయిడి నిఱుపేదనడిమికి నెఱపు చూపు." కాశీ. ౧, ఆ. ౯౦. స్వా. 3, ఆ. ౧౧3. ఇట్లే: నిర్పేద పాండు. ౧, ఆ. ౧౦౧.

నిఱుప్రేమ వి. వి (నిఱు+ప్రేమ) పూర్ణముగప్రేమ "చ . పిల్చియుం బిలువక మున్ను వచ్చు నిఱుప్రేమ దొలంకఁగ .." సా. ౧, ఆ. ౧౩౦.

నిఱ్ఱునీల్గు. దే. అ. క్రి. (నిఱ్ఱు+నీల్గు) ఒడలువిఱిచికొను. "సీ. నీడుగాలికిఁ బసివట్టి నిఱ్ఱునీల్గి,పట్టెడల బిగఁబట్టిన పట్టపదక,నిలువ కోరెంచి పేటపక్కలు పకూర,చుట్టుక గునిసి యాడంగఁ జాడ వేమి." కాశీ. 3, ఆ. ౭౫. ఇట్లే: నిఱ్ఱున నీల్గు. చెన్న. ౪, ఆ. ౪౧౦.

నిఱ్ఱు. దే వి. నీల్గుట కనుకరణము. (చూ. నిఱ్ఱునీల్గు.)

నిలఁబడు = నిలువఁబడు. (నిలుచు) "క. ఇలుకాలి కూల నిట్టక, నిలిచిన నిట్రాడువోలె నిజరథమటులం,బోలియన్ నిలఁబడి రాకా,సులతోఁ డుండుటకు నగుచుఁ జూచిరి వేల్పుల్." రామా. ౯, ఆ. ౧౩౨

నిలక. దే. వి. (నిలుచు ధా.) నిలుపు, నిలుకడ. (శ ర. త్ర)

నిలయనము. సం. వి. అ. న. 1. కలకొనుట,ఉండుట; 2 కనుమూసికంతలు అనుక్రీడావిశేషము; 3. లీనమగుట, అంతర్ధానముగుట; 4. ఉనికిపట్టు, నిలయము.

నిలయము. సం. వి. అ. పుం. 1. ఉనికిపట్టు, వాసస్థానము; 2. ఇల్లు, గృహము; 3. పూర్ణముగా నశించుట; 4. లీనముగుట, కనఁబడకుండుట; 5. కనుమూసికంతలు అనుక్రీడావిశేషము.

నిలింపుఁడు. సం వి. అ. పుం. దేవత, వేల్పు.

నిలీనము. సం. విశే. (అ ఆ. అ) 1. నశించినది; 2. కనఁబడనిది; 3. కరఁగినది; (బంగారు మొ); 4. నిశ్శేషముగా లీనమైనది.

నిలుకడ. దే. వి. 1. ఉనికి, స్థితి. "మ. సదుపుం బెల్కులకొల్కి...నిల్కడ గావించె భవద్రసజ్ఞపటు నింకన్...కల్పంబు గావింపుమా." చం.రా. ౧, ఆ. ౯3. హరి. ఉ. ౭, ఆ. ౧౧౪; 2 వాసస్థానము. "వ ..కావున నలుక నలఁకువలకు నిలుకడ యగుట దాని విడువవలయు .."య 3, ఆ. ౯; స్థిరత్వము, నిశ్చలత్వము. "చ. నిలుకడ నున్న వాని నహి నేత్రము వాస్తి భయంబు లేదు..." శకుం. ౪, ఆ ౧౭. సా. ౨, ఆ. ౧౪ ; 3 నిలువఁబడుట, ఉత్థానము. "వ. పురారి...ఒయ్యారంపునిలుకడ నిలిచి..." హర. ౭, ఆ. ౪౯. శుక. ౨, ఆ. ౪33; 4. సమాప్తి, ముగింపు. "సీ. అందంద కదిరెదు కొందలపాటుచేఁ దలఁకుచు మనికికి నిలుకడయును." గీ. శేమి... భార. విరా. ౨, ఆ. 3౧౫; 5. స్థైర్యము. "గీ. దానవాధిపునిలుకడ దప్పినట్లు, పదసరోజయుగము దొట్రుపడుచు నుండె.' భా. రా. యు. ౧౯౬౪. య. ౪, ఆ. ౧.

నిలుకాలు. దే. వి. వి. (నిలుచు+కాలు) కాలి నిలుకడ. "క. తల యొక్క లెక్కగక యాగతి వలచి...నిలుకాల నిలువఁ దీఱక,మెలఁగంగా." మల్హా. ౩, ఆ. ౧౮.

నిలుగు = నీలుగు. 1. (ఒడలువిఱుచుకొను.) "చ నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్టు వల్కు నవ్వులుకులె యట్టు లెత్తి విని పక్కాడు వింటివె కీరశారికల్." స్వా. ౩, ఆ. ౫౮. వరాహ. ౧౧, ఆ. ౧౨౬; 2. (చచ్చు.) "చ... రోగముల ప్రుంది గృహంబులయందు బాధు లేద్య నిలుగుకష్టులు న్నరులె వారలకల్లులు కల్లులే మహిన్." మార్క. ౩, ఆ. ౩౨. చం. రా. ౭, ఆ. ౪౬; 3. (గర్వించు.) "చ. జల రుహనేత్ర నన్నుపును సారెకుఁ దూఱుదుఁ గేరి నిక్కుచున్, నిలుగుచు విఱ్ఱవీఁగుచును .."సా. ౩, ఆ. ౫౫.

నిలుచు. దే. అ. క్రి. 1. నిలువఁబడు, ఉత్థితుఁడగు "చ. కని యతిభక్తిపూర్వకముగా ధరఁ జాఁగి నమస్కరించి లేచి నిలిచి ఫాలభాగమునఁ జేతులు చేరిచి .."విక్ర. ౨, ఆ. ౨౨౧; 2. ప్రతిష్ఠితమగు. (శ. ర.); 3. వర్తించు. "గీ .. ధర్మంబు కాద్రులతలన నిలుచు, శాక్తబౌద్ధాది దుర్మతకల్లాను లెనగు." హరి. ఉ ౯, ఆ. ౩౮. భార. విరా. ౧, ఆ. ౬౪; 4. నివసించు. "గీ. కాంచి యేలెడుజయసేనుఁ గాంచి యతఁడు, నన్ను మన్నింప నందుఁ గొన్నాళ్లు నిలిచి .." విక్ర. ౫, ఆ. ౧౬౯; 5. పాతిపోవుండు. "గీ. సింహచర్మంబు దొడిగినఁ జెనఁటిమెకము, గంధగజ గంధమునకును గలదె నిలువ." హరి. ఉ. ౬, ఆ. ౧౬౯. పారి. ౫, ఆ ౩; 6 మిగులు, శేషించు. "గీ. ఇంట దొర్లెడుకుండలు నిడుపకట్ల, మాని ముంతలు నిలిచె నమ్మల్లపటికి, వార్ధికన్యాకటాక్ష మవ్వలిక్కఁ జనిన." శుక. ౨, ఆ. ౩౫౦. ఉ. హరి. ౧, ఆ. ౧౧; 7. ఆఁగు. "క ..రా,జేరరు గావున నిట చను, దేరక నిలువుండ యువియు దేవపథంబుల్." భార. ఆది. ౫, ఆ. ౬౮. ఉ. హరి. ౨, ఆ. ౨౪; 8. ఉండు, పోవుండు. "గీ. అంధకారంబు నిలుచునే యర్కుఁ గెదుట." వి. పు. ౪, ఆ. ౧౨౨; 9. ఓర్చు, తాళు. "అ .. అక్ష్ణగాణి నీళ్ళు వరింపక, నిలువలేవు మరుఁడు బలియుఁ డగుట." భార. శాం. ౧, ఆ. ౨౫౨. భార. ఆది. ౬, ఆ. ౨౯౧; 10. కలుగు, జనించు. "క ...నీకృప సామిాదఁ జాల నిలిచిన కతనన్." వి పు. ౬, ఆ. ౩౩౬; 11. తీఱు, పోవు. "గీ. నీరు గ్రోలిన దాహంబు నిలువదేని, వాఁడు వేంచేయు నీరైదువాసరముల." జై. ౮, ఆ. ౧౦౧. వరాహ. ౧౨, ఆ. ౬౬; 12. జీవించు, బ్రదుకు. "అ నిద్ర లేక తనుతు నిలుచును పాయంబు, లాంచు దక్కి వెదకుచున్న వారు." భార. ఆది. ౬, ఆ. ౭౭౮; 13. కనఁబడు. "ద్వి. తఱుచుమెఱుంగులు తళతళమనఁగ, నెతిఁ దూర్పుఁగొండపై నిలిచె నాదిత్యుఁడు ..."ద్వి. హరిశ్చ. పూ. ౫౫౪. పం; 14. వృద్ధి నొందు, పోషింపఁబడు. "సీ స్థావరజంగమాత్మక మగుభూలోకం బెవ్వనిచేఁ బుట్టు నెవ్వనికృప. గీ. నిలుచు నెవ్వనికతన చే విలయ మొందు." పాండు. ౨, ఆ. ౨౧౩, 15. తగులుకొను, నక్కమగు "సీ. భూషామణివ్యాజమున నంగకంబుల జనుల చూపులు నిశ్చలత నిలువ." సైమ, ౫, ఆ. ౭; 16. నశింపకుండు "క ...కౌలఁదులవారికి గర్వము, నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్." భార. ఉద్యో. ౩, ఆ. ౩౦౩; 17. చిత్తైకాగ్రత నొందు. "క. అని యిష్టదేవతాప్రార్థనము నాదిసు కవినుతముగుం గావిం,చి నిలిచి పెల్లగుతుల్లం,బు నందు నే నొకపురాణము చెప్పంగన్." జై. ౧, ఆ. ౭; 18. విశ్రమించు. "సీ. నిలనీవివంటు వార్వుల నత్తమామలపోరును లేనికాఁపురము గలిగె."శుక. ౩, ఆ. ౬౦౪.

నిలుచుండఁబెట్టు. దే. స. క్రి. (నిలుచుండు ధా. ప్రే.) నిలుచునట్లుచేయు. "సీ. నిలుచుండఁబెట్టి యంగుళీ యూఁత చూపఁగాఁ బ్రితిఁ దప్పడుగులు పెట్టి పెట్టి." హరి. పూ. ౫, ఆ. ౧౯౦.

నిలుచుండు. దే. అ. క్రి. (నిలుచు+ఉండు-స్వార్థము.) 1. నిలువఁబడు, ఉత్థితుఁడగు. "గీ ..పద పడి కాల్కడయొద్ద కల్లఁ జరి నిరముఁద్రై నిలుచుండె నవ్యసాచి." భార. ఉద్యో. ౧, ఆ. ౬౫. కాశీ. ౫, ఆ. ౧౯౩. భార. మా. ౧, ఆ. ౬౩; 2. కదలకయుండు; లేచియుండు "గీ...శార్ఙ్గ, మెదుర నిలుచుండు గద చేయు నెల్లపుడును." ఉ. హరి. ౨, ఆ. ౧౬౫

నిలుచుకొను. దే. అ. క్రి. (నిలుచు+కొను - స్వార్థము.) నిలుచు. (శ. ర.)

నిలుచాలు. దే. వి. (నిలుపు+చాలు.) నిలుపుకోలు, దేహముమీఁద ధరించు వస్తువు లన్నియు నిచ్చుట "ద్వి. అమ్మెడి దనమేలు నేలకుఁ దోడు, సొమ్ము లన్నియుం నిలుచాలుగా నిచ్చి." ద్వి. హరిశ్చ. ఉ. ౮౧౧, ౫౦

నిలుపు. దే. స. క్రి. (నిలుచు ధా. ప్రే.) 1. నిలువఁబెట్టు, కనఁబఱచు. "క ..కన్నియఁ దెచ్చి యతని యెదుట నిలిపి దీనికి జనకుఁడై, మెచ్చుకొను పెండ్లి కొడుకును, నిచ్చలముగఁ దెల్పుము .." నీలా. ౨, ఆ. ౬; 2. స్థాపించు, ప్రతిష్ఠించు. "సీ. విధుల నిల్పిండ్లును నిలిపెఁ గోటలు సత్రములు చలివెంద రల్ వెలయఁబెట్టె." హరి. పూ. ౧, ఆ ౧౯. భార ఉద్యో. ౨, ఆ. ౨౦౬; 3. అలంకరించు, పెట్టు. "గీ. కటకములు హస్తపరము లంగదము లంగుళీయకములును బాహువల్లికల ప్రేమ, నిలిపి ..." ఆము. ౬, ఆ. ౧౨౮. కాశీ. ౪, ఆ. ౧౩౬; 4. వసింపఁజేయు. "క. అని చెప్పినఁ గలను కలను, వినునట్ల వచించి యంను నిలిపితి నని .." కళా. ౨, ఆ. ౧౬౭; 5. ఆఁపు. "సీ. క్రొంకుగా శోఁగినం గలఁగ కండఱఁ దీర్చి నిలిపి యమ్మోఁలివానికి మగిడి." ఆము. ౩, ఆ. ౬. వసు. ౬, ఆ. ౧౬; 6. అడ్డగించు, నిరోధించు. 'క. కలఁగిన సేనలఁ గాచెన, నిలిపెన నర్జునుని కడఁక .." భార. ద్రో. ౧. ఆ. ౩౩. ఆం. భా. స్కా. ౧౨౦; 7. స్థిరముగా నుంచు. "గీ. అలరు విలుదాల్పు తండ్రిపై వలపు నిలిపి." నీలా. ౨, ఆ ౨౫. వసు. ౩, ఆ. ౯౩; 8. పుట్టించు, కలిగించు. 'మ ..కంసఘస్మరుఁ డత్యుద్ధతిఁ బారిజాతధరణీజాతంబు ..ఉత్పాటించి లీలాగతిన్, గరుడస్కంధముమీఁద నిల్పి నిలిపెం గౌతూహలం బింతికిన్." హరి. ౪, ఆ. ౫౩. కాశీ. ౯, ఆ. ౧౩౦; 9. తగులొకొనఁజేయు, సక్తమొనరించు. "వ ..భీమనందన యానరేంద్ర బృందారకునియందు డెందంబు నిలుపుటయును ..." నైష. ౧, ఆ. ౭౯. హరి. పూ. ౨, ఆ. ౯౬; 10. స్వాధకించు. "క. కలఁగినచిత్తము దృఢముగ, నిలిపి విచారించి .." దశ. ౫, ఆ. ౩౬; 11. ఏర్పఱచు. "ఉ. దేవరవంటిపుణ్యుఁడిఁ గృతిప్రభుఁగా నిలుపంగఁ గల్గుటం, బావనమై ప్రసిద్ధిఁ గను మాకవితావిధవంబు దిక్కులన్." వరాహ. ౧, ఆ. ౧౫. భార. ఆది. ౫, ఆ. ౯౫; 12. పాలించు. "సీ. కట్టింపలేనైతిఁ గవులకాసారంబు నిలుపంగలేనైతిఁ దులసివనము." కాశీ. ౩. ఆ. ౯౧; 13. నిర్మించు. "సీ. అద్యంబులైన దేవాలయంబులు వ్రాల నవని నిరాశ మఠాళి నిలుపు." ఆము ౪, ఆ. ౪౩. వసు. ౩, ఆ. ౩౦; 14. కూరుమాడఁబెట్టు. "మ ..మోహం బంది యానందనం,దను దీవించుచుఁ జెంగట న్నిలిపెఁ జెంతారత్నపీఠంబునన్." పారి. ౩, ఆ. ౨౫. హర. ౩, ఆ. ౪౦, 15. రక్షించు. "సీ. నిలుపంగ వలయును నిజమువాటిలకుండ శాస్త్రధర్మస్వవర్ణాశ్రమముల" కాశీ ౭, ఆ. ౧౧౪. కేయూర. ౪, ఆ, ౧౧౭. వి. 1. ఉత్థానము, నిలువఁబడుట. "గీ. ఒకఁడు కుంతానఁ బగవానియుఁరము గ్రమ్మ,వెంటనే పూఁతఁ డీఁటెచే వెళ్లఁబొడువ, వెలసె నిద్దఱు నిల్చిన నిలుపు కదని, కాళికై కావడించినకాను కనఁగ" కువల. ౨, ఆ. ౧౩౬; 2. స్థైర్యము. "గీ. బలము లిది యేమి నలుగడఁ బాఱఁ జొచ్చెఁ, గర్ణగృపముఖ్యు లేటికిఁ గలఁగి రేట, మొగముపడి రెల నీవును ముఖ్ను వోలె, నిలువరింపఁగఁ దగియెడునిలుపు లేవ" భార. ద్రో. ౫, ఆ. ౩౨౬; 3. స్థానము, చోటు. "గీ. కుజము కొనగొమ్మ డిగి క్రిందికొమ్మమీఁది, నిలుపు నైకొను పులుఁగులయోలుఁగు లెచ్చె." విక్ర. ౪, ఆ. ౨౭; 4. ప్రాపు, ఆధారము. "క...నీరక్షణ నీని కెల్ల నిలుపై యుండున్." భార. భీష్మ. ౨, ఆ. ౨౬౬; 5. రక్షణము. "క...తనప్రాణమునిలుపుకన్న ధర్మము కలదే." పాండు. ౪, ఆ. ౧౬౧; 6. నిలుచుట, ఉండుట. "చ ..వారిఁ బడకాత్మ రతికి నిలు పిచ్చు మోహముచున్." భార. శాం. ౪, ఆ. ౩౫౪; 7. బ్రతుకు, జీవనము. "క. ఇలఁ జిత్రము తారకకర,కలసంగత మైనఘోరశరవారి పొరన్, నిలు పగుఁ దమఁ జోర కదరినఁ, దల మును యగుక్ విరోధితతి కబ్బథవా." కు. సం. ౪, ఆ. ౧౪.

నిలుపుకొను. దే. స క్రి. (నిలుపు+కొను.) 1. ఏర్పఱచుకొను. "వ...ఇట్లన్నియుం దమకు మహాభేగుం దతుశిక చక్కనిమందుహాకంబు రాజుగా

నిలుపుకొని సుఖం బుండునంత..." కేయూర. ౩, ఆ. ౧౭, కళా. ౭, ఆ. ౧౩౦; 2. స్థిరముగాఁ గొను, చిక్కఁబట్టుకొను. "క. కలఁగిన ధైర్యముఁ గ్రమ్మఱ, నిలుపుకొని దశాననుండు నిర్భయుఁడగుచున్..." ఉ. రా. ౪, ఆ. ౧౩.

నిలుపుమందు. దే. వి. (నిలుపు+మందు.) వీర్యస్తంభనము చేయుమందు. "వ ..మచ్చువీడెంబులును నిలుపుమందులకరాటంబులును..." ప్రబంధ. ౫౮.

నిలుపుసేయు. దే. స. క్రి. (నిలుపు+చేయు.) ఆఁపు "ద్వి. మరుమనపై దూతఁ బోవఁ బరుసంబు నిలుపు, సేయక నలుని కాకేలిఁ గూర్చి కలఁపుఁ ద్రోయక." ద్వి. నల. ౧, ఆ. ౫౫౩.

నిలుపోపు దే. అ క్రి. (నిలుపు+ఓపు.) తాళు, ఓర్చు. (దీనికి వ్యతిరేకముమున్న ర్థములందుమాత్రమే ప్రయోగములుం గనఁబట్టుచున్నవి.) "వ ఇట్లు పాంచాలుబాణవృష్టికి నిలుపోపక కురుకుమారులు .." భార. ఆది. ౭, ఆ. ౫౫. సా. ౨, ఆ. ౯౪.

నిలువ. దే. వి. (నిలుపు ధా ) 1. మిగిలినవస్తువు శేషము 'ఆ. వానివిపర మెల్ల వరుసగాఁ గూర్చి, తెలియఁ దెల్పు లెక్కలెక్కిఁగొనుచు, వ్యయము పుచ్చి నిలువ ప్రాయించి చైకొంటు .." ద్వా. ౧౧, ఆ. ౯౫; 2. బాకీ, ఋణము. "ద్వి. కొలిచినవారికిఁ గోరి జీతములు, నిలువ గాకుండ నిచ్చులు నొసంగుదువె." రం. రా. అయో. ౧౩౮. పు.

నిలువఁబట్టు. దే. స. క్రి. (నిలువన్+పట్టు.) దాఁచు, శాశ్వతముగా నుంచు. "ఉ. దివ్యఖగేంద్ర పత్మవు మది నున్న సీయెడ నాకు విప్రలం, భవ్యవహారము న్నిలువఁబట్టఁగ నేమిఫలంబు..." నైష. ౨, ఆ. ౫౨.

నిలువఁబడు ద్వ. అ. క్రి. (నిలువన్+పడు. 1. ప్రతిష్ఠితుఁడగు. "క. మేలెట్టి దట్టిశోధన, కాలము నరిగడచితేని కావని కంతే,కాలుఁడు కారుణ్యాదమున్ని,లితమతిఁ దనకుఁ దాన నిలువంబడియెన్." భీమ. ౪, ౨౧౭; 2. నిలుచుండు, నిలఁబడు. "గీ. సత్యవతికొడుకుకొడుకు విశాల మహిమ, దెలిసి యప్పర్వతముమీఁద నిలువఁబడియె." భార. శాం. ౬, ఆ. ౩౩౫; 3. ఆఁగిపోవు, నిలిచిపోవు. "చ. వలపదు పొం దనంగ



నిలువంబడక పోవున మారవర్మ యమ్ములయందు మీఁదఁ గ్రూరశరము త్రిగిడ్చిన..." భార. అశ్వ. ౪, ఆ. ౮. రామా. ౫, ఆ. ౧౧; 4 సహించు. "క. బహుకాలము సీతోడను, విహరించితి నిలువఁబడియె విషయసుఖైక, స్పృహ యుబ్బుడు గడు మదిసిది. విహారభోగము చింత నుడుగు దెంతయు నొప్పున్." మార్క. ౫, ఆ. ౯౮.

నిలువనాడు దే. స. క్రి. (నిలువన్+ఆడు.) ఘోషించు, దృఢముగా పలుకు. "గీ. ఇతఁడు చోరుఁడు గాఁ డని యొంతకైన, నిలువనాడంగ వచ్చు. .." విప్ర. ౫, ఆ. ౩౯.

నిలఁవరము. దే. వి. 1. క్రోధము. "చ. నిలువరముం గగాఁ గలిగెనేని నను దిలకించి సీదువరా, న్గలంకుమిటారిగుబ్బచనుగుట్టలఁ గ్రమ్మి యదల్చి పల్కచే, నలవడఁ జెక్కుఁగొట్టి యకటా జడకొద్దిని మీట కిప్పుడే, తెలియల కొప్పు గించి యిటు సేయఁగఁ జెల్లునె రాధికామణీ." రాధికా. ౪, ఆ. ౨౧; 2. స్థిరత్వము. "చ... నిలువర మైన లేక నను నిక్కముఁగ౧దలఁ జేసి నవ్వనో... తెలుపుఁగదమ్మ .." పార్వ. ౫, ఆ. ౯-. విశే. స్థిరము, యథార్థము. "క. నిలువర మయ్యెను మును నాతలఁచినయది .." శకుం. ౩, ఆ.౫౭.

నిలువరించు దే. అ. క్రి. తాళు, ఓర్చు. "గీ ..ను వరించుచు నాచంద్రభానుఁ డపుడు, నిలువరింపఁగ లేక కన్నియఁ దలంచి." చంద్ర. ౪, ఆ. ౧౦౯. స. క్రి. 1. కదియు, మార్కొను. "ఆ వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన, సేమిసేయు వార మీరు దక్క, నొరులు నిలువరింప నోపెడు వారు లేరు..." భార. విరా. ౫, ఆ. ౧౮౧; 2. నిరోధించు. "గీ. ఇంద్రియంబుల నాకంటి నిట్టు విషయ, ములకు నోలయక యుండఁగ నిలువరించి, తలఁపు లుడిగి..." భార. శాం. ౫, ఆ. ౧౮౧; 3. ఉంచు, పెట్టు. "గీ... పొదలవలకేలు నిలువరించి, చదివె నాతనిదక్షిణశ్రవణవీథి, నపుడు తచ్చిత్తమానంద మనుభవించె." కళా. ౧, ఆ. ౧౫౮; 4. నిలుపు, సహించు. "సీ. ఉపవాసములు దస్సియున్నయాకొఁడీఁగ నిలువరించెదు లొత్తు పలిలెపడఁగ." భా. రా. యు. ౨౩౩౨; 5. ఆఁపు, నిలుచునట్లుచేయు. "వ కలఁగి పాఱునిజబలంబుల నిలువరించుచు..." కళా. ౮, ఆ. ౧౨౩.

నిలువసలువలు. దే. వి. బ. నిలిచియున్న సొమ్మును దానిపై పెద్దుము. "వ ..బుణశుద్ధి కావలసిన వాడుచుంటో శ మననిలువసలువలు మనము ప్రవేశించినట్లు లైయుండె..." పరమ. ౪, ఆ. ౧౫౫.

నిలువు. దే. వి. 1 నిలుచుట, ఊర్ధ్వానము. "క. నిలిచిన నిలువున నా వారు కూలం ద్రాలన్." రామా. ౮. ఆ. ౧౫, హరి. ఉ. ౨, ఆ. ౧౩౯; 2. చేయి పైకెత్తుకొని నిలుచున్న పురుషుని పరిమాణము. వ్యవ.-మూలితో రెండునిలువులనీ రున్నది; 3. అంతస్తు. "క. మద మొదవ రమ్యహర్మ్యము, తుదినిలువున బ్రణయసఖులతోడ విహారా,స్పద మగుకొలవున మెలంగెడు, సుదేష్ణ కజ్జలకములఁ జూచెం బ్రీతిన్." భార. విరా. ౧ ఆ. ౩౦౫; 4. బ్రతుకు, జీవితము. "గీ...ఇంపు సమకొల్పు తనవల్పు నిందువదన, గలసి వర్తింపలేకున్న నిలువు మున్న." ఉద్భ. ౨, ఆ. ౧౭౫; 5. శరీరము, ఆకృతి. "చ. నిలువు దయామయంబు మహనీయము లావదకల్ తలంపఁగా." రామా. పీఠి. ౯౫, ము. క. ౫౪; 6. పరిమాణము; ఎత్తు. "చ. తలనిలు వర్థ మిచ్చినను తాము కులస్థులు కాని హీనులన్, నిలువమటన్న నేమములు భేషజముల్ ..." వైజ. ౨, ఆ. ౭౧; 7. చేనిలో కొంత కోసినతరువాత కోయఁగలభాగము. (శ. ర. వా.) బ. ద్వారపుగుజ్జుపుటీటలకు వెనుకటిభాగమున మోఁకగా మంచెడుకమ్ములు. (శ. ర.) 8. స్థైర్యము. "చ...హృదయము వ్రాసి తోన నిలువేడి కవుంగిటఁ జిక్కఁ జేర్చుచున్." కవిక. ౩, ఆ. ౭౦. విశే. మీఁదికుండునది, ఊర్ధ్వముగా నుండునది. "సీ. కిఱ్ఱుచెప్పులు గొప్పగీఱసాము బులు మొలఁజెక్కుకత్తులు నిలువుసిగలు. గీ. కలిగి ..."నిలా. ౩, ఆ. ౪౯.

నిలువుగాళ్లు. దే. వి. బ. (నిలువు+కాళ్లు.) తావకాళ్లకు వెనుక మాను పెఁడలైనవాని కాధారముగా నాటిన స్తంభములు. (శ. ర.)

నిలువుజీతము. ద్వ. వి. (నిలువు+జీతము.) నిలుచుండి సేవచేయుట కిచ్చుజీతము. (శ. ర.)

నిలువుటద్దము. ద్వ. వి. (నిలువు+అద్దము.) నిలువు ప్రమాణము కల అద్దము. "సీ. కొలయంగఁ గైకొసి నిలువుటద్దము చూచి సవిమత్రమున విశాలాక్షి

గారి." కాశీ. ౩, ఆ. ౨౩౬, ఉ. రా. ౬, ఆ. ౧౨౭.

నిలువుటీఁత. దే. వి. (నిలువు+ఈఁత.) నిలుచుండి యీఁదెడి యీఁత. "తరళ. నిలువుటీఁతల వచ్చు కొమ్మల కామ్మెగంబులు పొల్పగున్." యు. ౩, ఆ. ౬౯.

నిలువులంపడు. ద్వ. అ. క్రి. (నిలువులు+పడు.) 1. నిలువునఁ గూలఁబడు; నిశ్చేష్టుడగు. "చ. నిలువులఁబడ్డయట్టు తననేత్రము లేమియుఁ గాన లేమి నగ్గలముగ వెగ్గలించు బలభుత్పురవప్తుల నోడు పేసి నిట్టల మగుడప్పి సోలుటయు..." నిర్వ. ౬, ఆ ౧౪౪; 2. తెలుచుకొను. "ద్వి. నిలువులంబడి శివుకేత్ర త్రయంబు, పొలువుగా జొప్పుఁ బొందకున్న యది." బస. ౩, పు.

నిలువోపు. దే. అ. క్రి. (నిలువు+ఓపు.) తాళు, ఓర్చు. (శ. ర.)

నిల్కడ = నిలుకడ. (శ. ర.)

నిల్వకొల్వు. దే. వి. (నిల్వు+కొల్వు.) నిలుచుండి చేయుసేవ. "సీ. అలవాటుచేసి కొమ్మఖలమురు కాల్పలకులఁ గూడుకొని నిల్వకొల్వసకును. .." పరమ. ౪, ఆ. ౬౭.

నిల్వకోక. దే. వి. (నిల్వు+కోక.) పాదమైనకోక; పెద్దచీర. "మ ..నిల్వకోకలటు లెంతేఁ దాల్చి. ..." సాంబ. ౨ ఆ ౫౦.

నివపనము. సం. వి. అ. న. 1. (నీళ్లలోనగువానిని.) చల్లుట, పోయుట; 2. పితకర్పణాదికము; 3. విత్తనములు చల్లుట.

నివరి. వై. వి. (సం. నీవారః) సస్యవిశేషము (శ. ర.)

నివర్తకము. సం. విశే. (అ. త్రికా. అ.) 1. నివర్తిల్లునది; 2. నివర్తించునది

నివర్తనము. సం. వి అ. న. 1. మరలుట; 2. ప్రవృత్తి లేమి. (వ్యతి. ప్రవర్తనము); 3. విడుచుట. "చ ..భీష్ముఁడు ..నిఖిలావనిరాజ్యనివర్తనంబునుం దనరఁగ బ్రహ్మచర్యమును దాల్చి జగద్విదితప్రతిజ్ఞుఁడై." భార. ఆది. ౪, ఆ. ౨౪౩; 4. మరల్పుట; 5. తొలఁగించుట. విశే. (అ. ఆ. అ.) 1. మరల్చునది; 2. మరలునది; 3. ఉడుగునది.

నివర్తనీయము. సం విశే. (అ. ఆ. అ.) నివర్తింపఁ దగినది. [చున్నది.

నివర్తమానము. సం, విశే. (అ. ఆ. అ.) నివర్తిల్లు

నివర్తయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తిల్లఁ జేయుచున్నది.

నివర్తయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నివర్తిల్లఁ జేయునది.

నివర్తయితవ్యము. సం.=నివర్తనీయము.

నివర్తి. సం. విణ. (న. నీ. న.) 1. మరల్చువాఁడు; 2. మరలువాఁడు. "వ...భవదీయభ్రాతలు సమరంబున ననివర్తులై యూర్ధ్వలోకవర్తులైరి." భార. అశ్వ. ౧, ఆ. ౭ (అనివర్తులు = మరలనివారు.)

నివర్తించు. సం. స. క్రి. 1. మరలించు; 2. పోఁగొట్టు. "వ...బ్రహ్మహత్యాపాతకంబు నివర్తింప విచారించి..." వరాహ. ౨, ఆ. ౫౭; 3. నిర్వర్తించు, చేయు. "సీ. వేదికాసమ్మార్జనవిధి నివర్తించును లీలమై రంగవల్లిక లొనర్చు." హర. ౩ ఆ. ౩౬.

నివర్తింపించు. సం. స. క్రి. (నివర్తించుధా. ప్రే) మరలింపఁజేయు. "వ...భీష్ముండు తనరథంబు నివర్తింపించి...అతిరౌద్రాకారుండై నిలిచిన." భార. ఆది. ౪, ఆ. ౨౦౫.

నివర్తిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) మరలునది.

నివర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) మరలింపఁబడినది.

నివర్తిల్లు. సం. అ. క్రి. తొలఁగు, పోవు. "వ... అప్పుడు సత్యవతీనందనునకు వాగ్భుజాస్తంభంబులు నివర్తిల్లె ..." కాశీ. ౭, ఆ. ౧౦౯.

నివర్త్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మరలింపఁబడుచున్నది.

నివర్త్యము. సం. = నివర్తనీయము.

నివసత్. సం. శత్రు. నివసించుచున్న. "చ. శతశృంగశైలనివసన్మునిసంఘము సంతసిల్లఁగన్..." భార. ఆది. ౫, ఆ. ౧౦౪.

నివసతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఇల్లు, గృహము; 2. నివసించుట.

నివసథము. సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.

నివసనము. సం. వి. అ. న. 1. గృహము, ఇల్లు; 2. నివసించుట; 3. వస్త్రము.

నివసించు. సం. అ. క్రి. ఉండు, వాసముచేయు. "క...ఎందు ధరణి వెన్నొందు బహుసస్యదాయిని, యందుఁగా నివసింపఁ దగు సుఖార్థులు పుత్రా." మార్క. ౩, ఆ. ౨౫౧.

నివహము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. సప్తవాయువులలో నొకటి.

నివాకువు. సం. విణ. (ఉ) మాటాడకుండునది, మిన్నకుండునది.

నివాతము. సం. వి. అ. పుం. 1. ఆశ్రయము, నివాసము; 2. బాణాదులచే భేదింపరానికవచము. న. 1. గాలి లేనిచోటు; 2. సురక్షితస్థలము, అవ్య. అ. న. గాలిలేమి. విణ. (అ. ఆ. అ.) 1. గాలి లేనిది; 2. సురక్షితము; 3. బాణాదులచే భేదింపరానిది.

నివాదము. సం. అ. అవ్య. న. నిర్వివాదము, సంశయములేమి. "వ...అప్పించుకోఁడి విహావంబు నివాదంబై సంభవిల్లుదుఁ దన్నిదానం బిద్ది యని నిదానింప సంతతకరణం బకరణంబు గానేరదు." కాళింది. ౨, ఆ. ౬౨.

నివాన్య. సం. వి. ఆ. స్త్రీ. తనదూడ చచ్చుటచే మఱియొకదూడను కుడిపింపఁగా పాలిచ్చునట్టి యావు.

నివాపకుఁడు. సం. విణ. (అ. పి. అ.) విత్తనములు చల్లువాఁడు.

నివాపము. సం. వి. అ. పుం. 1. పితరుల నుద్దేశించి నువ్వులు నీళ్లు విడుచుట. (తిలతర్పణాదికము.)

నివారణ. సం. వి. ఆ. స్త్రీ. = నివారణము.

నివారణము. సం. వి. అ. న. 1. అడ్డగించుట; 2. తొలఁగించుట.

నివారణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁదగినది; 2. తొలఁగింపఁదగినది.

నివారము. సం. వి. అ. పుం. 1. నివ్వరిధాన్యము; 2. నివారించుట.

నివారించు. సం. స. క్రి. 1. పోఁగొట్టు; 2. అడ్డగించు, నివారణచేయు. "మ. కని తత్తీరవనాంతరంబునఁ గురంగశ్రేణి వెంటన్ గృతాంతునిలీలం బఱతెంచు నివ్వరకు ధానుష్కుం గుమారోత్కరా, స్త్రనిరక్తాక్షుని జాంబూనదాలంకారాఢ్యున్ ముందరం జూచి వ్రేక నివారించుచు..." వరాహ. ౭, ఆ. ౧౬.

నివారితము. సం. విణ. (అ. ఆ. అ.) నివారింపఁబడినది.

నివాసకుఁడు. సం. విణ. (అ. పి. అ.) 1. నివసించువాఁడు; 2 నివసింపఁజేయువాఁడు.

నివాసనము. సం. వి. అ. న. నివసింపఁజేయుట.

నివాసము. సం. వి. అ. పుం. 1. వాసము, కాఁపురము; 2. వస్త్రము; 3. గృహము, ఇల్లు. "క. అనవముస కని సీదుని,వాసమునకు దివసములో సవర్ణ్యంబుగు సే, వారునటిం బుత్తెంచు..." భార. విరా. ౨, అ. ౭౧.

నివాసి. సం. విణ. (స్. సీ. స్.) 1. నివసించువాఁడు; 2. (వస్త్రము) ధరించువాఁడు.

నివాళి. దే. వి. 1. నీరాజనము, ఆరతి. "సీ నీరాజ నావిధ నొసగదు నివాళి యారతి నాఁగ..." ఆం. భా. ద్వి. ౧౬౫. కై. భా. ౨, అ. ౯౯; 2. దీపము. "క. కల్యాణపాత్రికల సాంకల్యముగ నివాళు లునిచి గటికలు గౌరీకల్యాణంబులు పాడిరి,.." రసిక. ౬, అ. ౨౦౦.

నివాళించు. దే. అ. క్రి. ఆరతిచ్చు. "గీ. పార్వతీదేవి కై సేసి బహువిధములఁ, బలుకుఁదోయ్యాలి రత్న దర్పణము మాపె, కది నివాళించె మానిదీపసం చయమున, శివకయనునిపట్టాభిషేకవేళ." కాశీ.౪, అ. ౨౯౫. స. క్రి. 1. నీరాజితము చేయు, నివాళి కలదానినిగాఁ జేయు. "సీ. అమరంగ నింద్రాణి యాఖండలుని నివాళించెదుపసిఁడిపళ్లెర మునంగ." ద్వా ౪, అ. ౧౦౮. ఉరా. ౪, అ. ౧౬౦; 2. దిగఁదుడుచు "క. వసన్నపతి మాధవునిఁ బొడఁ, గనుచు నివాళించ వైచుగను కపులాళ్వా, పనిచేయం దగుతబుకుల, యనువున శల్లెదలఁ బందుటాకులు దుల్లెన్." ల. వి. 3, అ. ౧౦౬; 3 తృణీకరించు, తిరస్కరించు. "సీ. దీపకాంతులు సుదతీలోచనముల ధుర్షించెనేనియు నివాళించవలదె "సాంబో. ౪, అ. ౧౨౨.

నివాళిక. దే. వి. (నివాళి+ఇక-స్వార్థమున.) ఆరతి "ద్వి. వనజలోచనలు నివాళిక లొసఁగ." రం. రా. బాల. ౩౫. పు. (శ. ర పా.)

నివాళితము. సం విణ. (అ. అ. అ.) చుట్టఁబడినది. (శ. ర.) "వ...ప్రతిగృహాంగణప్రదేశనివాళిత నీరాజనంబులు గైకొనుచు..." బ్రహ్మో. ౪, అ. ౧౩౯. పు.

నివాళిపళ్లెము. ద్వ వి. (నివాళి+పళ్లెము ) నీరాజన పాత్రము. "చ...మనోహరంబులై, తనరు నివాళిపళ్లెములు తామరసాక్షు లొసంగ..." భాను. ౪, అ. ౬౧.

నివాళిసేయు. దే. అ. క్రి. (నివాళి+చేయు.) 1. ఆరతిచ్చు "క. ధవళాంశుమండలమునిధి, నివాళి సేయుచు లతాంగిశశిముగమునకున్." శైవ. ౨, అ. ౧౪; 2. వ్యాపించు. "సీ. చెక్కులందు నివాళిసేయు లేనగవులు తాటంకరుచి కొల్లకోటు సేయ." విక్ర. ౭, అ. ౧౦౧.

నివిడించు. దే. స క్రి. (నివుడు ధా.) వెలిగించు. "క. అవయవము లెట్టు కూర్మము, నివిడించును లోని కడఁచు..." భార. శాం. ౫, అ. ౧౬౨.

నివిష్టుఁడు. సం. విణ. (అ. అ. అ.) 1. కూర్చున్న వాఁడు; 2. ప్రవేశించినవాఁడు; 3. పట్టుదల కలవాఁడు; 4. ఏకాగ్రత కలవాఁడు.

నివీతము. సం. వి. అ న. 1. పేరుగా వేసికొనిన జన్నిదము; 2. జన్నిదమును మెడలో పేరుగా వేసికొనుట. విణ. (అ. అ అ.) కప్పికొనఁ బడినది, ప్రావృతము.

నివీతి. సం. విణ. (న్, సీ. న్.) నివీతము గలవాఁడు.

నివుడు. దే. అ. క్రి. 1. చిప్పిలు, స్రవించు. "ఆ. అని గురంతశోకమును బొంది సిగ్గుపై, మేను వైచి కన్నుఁగొనలందు, నివుడునశ్రువారి చెవులలోలం కుల, నిండ నిట్టు లను విభుండు మఱియు" నిర్వ. ౯, అ. ౯౦; 2. వ్యక్తమగు, స్ఫుట మగు. "మ. అవనీనాథుఁడు బిట్టు మేలుకొని కోపాటోపమున్ చూడ్కులన్, నివుడన్ దారుణవృత్తిఁ గాలయవనున్ వీక్షించినన్ .." వి. పు ౭, అ. ౨౧; 3. చాఁగు, దీర్ఘమగు. "క. శివునంగయష్టి నిలియఁగ, నవిరళముగఁ బట్టిప్రాఁక నని కడు చెమ్మిన్, నివుడునవకల్పలతికల, నదిమి మృదుబాహులతలు పార్వతి కొప్పన్." కు. సం. 3, అ. ౫౬; 4. తగు, ఒప్పు. "క. ప్రవితత వక్త్రింశత్ త్ర్యవికాసంబులకు నుద్భవస్థానంబై, నివుడురజోగుణసంగతి, భవుఁ డనునాయుంబు నీకుఁ బరఁగు మహేశా." శివ. సా. ౭౧; 5. వైతు బుకు "చ. కవ వటు డించి రోఁ గుసుకఁగా మరిఁ గొంతులఁ దార్చి కూలుదున్, నివిడిపలోజ్జ్వలై మిగులునిద్ధపుదోవతి దట్టి డొల్లి రాఁదివిచి..." అము. ౬, అ. ౭౧. 6. వ్యాపించు. "క. నిని ముట్టి ధరణియంతట, నివిడి చెలఁగుచుండు నువ్వనియగోరము..." భార. అర. ౭, అ. ౪౫౩. చంద్రా ౪, అ. ౧౧౨. 7. అతిశయించు. "ద్వి.

లీల సారణరయుం దలిర్ప సంక్రీతి, నివ్రుడంగ..." ఆమ. ౩, ౪ కండికా. దీపా. ౭౫. ౪.

నివ్రుడు. దే. అ. క్రి. అతిశయించు. "ద్వి. ఆరాధ్యు లాదిగా సలరుజంగములు,దవిలి కండికవిధు దర్శిం చుచేడ్క,నివ్రురంగ..." కండికా. దీపా. ౫౯, ౪. స. క్రి. 1. వాత్స్యాయాదులచే చేతితో రాచు. "క. కర కమర్త్తిని మోము నివిరి తద్వృత్తాంత మెల్ల తెలుదులు సంతతి,పురవాసులు చెప్పిన విని..." భాగ...౪, స్కం, ౨౨౫. కాశీ. ౫, ఆ. ౨౨౪; 2. దువ్వు,సవరించు. "కా...సౌంద్రా మోదంబునఁ బక్షముల్ నివురుమాస్తాంభోజ యుగ్మంబునన్." సైమ. ౨, ఆ. ౧౦౫. పా. ౨, ఆ. ౨౨౫; 3. తుడుచు,తొలఁగించు. "ద్వి. నవఘనర్మ కథముల నఖరాంకురముల,నివురుచు .." ద్వి. హరిశ్చ. భూ. ౯౩౩, పరి.

నివురు. దే. వి. బూడిద,భస్మము. "గీ. నివురు గవి సిన మెఱయునివ్వఁవాలి." భార. విరా. ౪, ఆ. ౭౫. కేయూర. ౩, ఆ. ౧౪.

నివృతము. సం. వి. అ. న. ఉత్తరీయము,పైబట్ట విణ. (అ. ఆ. అ). 1. ఆవరింపఁబడినది; 2. పైని కప్పఁబొనఁబడినది. (వస్త్రము)

నివృతి. సం. వి. ఇ. స్త్రీ. ఆవరించుట.

నివృత్తము. సం. వి. అ. న. 1. మరలుట; 2. లేమి, అభావము; 3. మనస్సువిషయములనుండిమరలుట. విణ. (అ. ఆ. అ). 1. మరలినది; 2. తొలఁగి నది; 3. విషయములనుండి మరలినది.

నివృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. మరలుట; 2. పోవుట, నశించుట; 3. విషయములయందు ప్రవర్తింప కుండుట,అప్రవృత్తి; 4. ముక్తి. అవ్య. ఇ. న. మరిలేమి.

నివేదకము. సం. విణ. (అ. దిశా. అ.) 1. తెలుపు నది; 2. ఇచ్చునది; 3. విన్నవించునది.

నివేదనము. సం. వి. అ. న. 1. తెలుపుట; 2 సమ ర్పించుట; 3. విన్నవించుట.

నివేదనీయము. సం. విణ. (అ. ఆ. అ) నివేదింపఁదగినది.

నివేదయత్. సం. శత్రు. నివేదించుచున్న.

నివేదయమానము. సం. విణ. (అ. ఆ. అ) నివేదించు చున్నది.

నివేదించు. సం. స. క్రి. 1. విన్నవించు. "వ... భరతుం గాంచి మద్వృత్తాంతంబు నివేదించి రమ్ము పొమ్మనిన..." భా. రా. యు. ౨౫౩౯; 2. సమర్పించు,భక్తితో నిచ్చు. "వ...గోలోక ప్రచారులు నివేదించుకానుక లంగీకరింపుచు..." ఉ. రా. ౮, ఆ. ౨౯౪. భార. ఆది. ౬, ఆ.౨౩౭.

నివేదిత. సం. విణ. (బు. త్రీ. బు.) నివేదించువాఁడు.

నివేదితము. సం. విణ. (అ. ఆ. అ). 1. తెలుపఁబడి నది; 2. విన్నవింపఁబడినది; 3. సమర్పింపఁబడినది.

నివేదితవ్యము. సం. విణ. (అ ఆ.అ.) నివేదింపఁదగినది.

నివేది. సం. విణ. (న్. నీ. న్) నివేదించువాఁడు.

నివేద్యమానము. సం. విణ. (అ. ఆ. అ) నివేదింపఁ బడుచున్నది.

నివేద్యము. సం. అ. న. దేవతలకు సమర్పింపఁదగిన భోజనపదార్థము,నైవేద్యము. విణ. (అ. ఆ అ.) 1 ఎఱిఁగింపఁదగినది, 2. సమర్పింపఁదగినది; 3. విన్నవింపఁదగినది.

నివేశనము. సం. వి. అ. న. 1. ప్రవేశము, చొచ్చుట; 2. చొప్పించుట; 3. ఇల్లు, గృహము; 4. వాసస్థానము, ఉనికిపట్టు; 5. వీడు,నగరము; 6. స్కంధావారము; 7. స్థితి,ఉనికి; 8. ఉండుట; విన్యాసము; 9. కూర్చుండుట; 10. కూర్చుండఁ బెట్టుట.

నివేశము. సం. వి. అ. పుం. 1. ఇల్లు, గృహము; 2. ఉంచుట, విన్యాసము; 3. చొచ్చుట; 4. స్కంధావారము; శిబిరము; 5. స్థానము; 6. కూర్చుండుట; 7. విడియుట; 8. పెండ్లి.

నివేష్టనము. సం. వి. అ. న. చుట్టుకొనుట.

నివ్వగిలు. వై. అ. క్రి. (నివ్వటించు ధా.) వెలువడు. "సీ. కేలు సాఁచిన నివ్వగిలుకఠకాంతులు జిగి చన్నుఁగ్రేవలఁ జేరువాఱ." శ్రీరం. మా. ౨, ఆ. ౨౮౨.

నివ్వటించు. వై. స. క్రి. ఒప్పునట్లు చేయు. "సీ. ద్రాక్ష్యారివక మైనకనచిత్ర మంతయు నిసుదు గౌరవమున నివ్వటించి." పాండు. ౧, ఆ. ౯.

నివ్వటిలు = నివ్వటిల్లు. 1. (అతిశయించు.) "చ. మోహనగుణశక్తి నివ్వటిలు నవ్వలరాయుని జేర్పు పెంపునన్." వసు. ౩, ఆ. ౫౧. విప్ర. ౭. ఆ. ౨౯౧; 2. (కలుగు, జనించు.) "క. ఇద్విధమున సత్పాతము, నివ్వటిలం దొడఁగుటయును..." ఉ. హరి. ౬, ఆ. ౧౪౮; 3. (వ్యాపించు, ప్రస రించు.) "క. త్రవ్వఁ బ్రథ శెల్ల కాపుల, నివ్వ

టిలఁగ వెలుఁగుచుండె నిధి..." భార. ఆశ్వ. 3, ఆ. ౧౫౪; 4. (వర్ధిల్లు). "క. నివ్వటిలు జగము లన్నియుఁ, గెవ్వనిచే నమ్ముకుందు గెల్వుదుఁ గొలఁకుఁన్." భార. శాం. ౪, ఆ ౨౧౭. కాశీ. ౪, ఆ. ౭౧; 5. (ఒప్పు). "ఉ. ఎవ్వని కెంతబుద్ధి పరమేశుఁడు దాఁ గృపఁ జేసి పట్టెఁబై, నివ్వటిలంగ గవిత్వరుచి .." కవిరా. ౧, ఆ. ౧౦.

నివ్వటిల్లు=నివ్వటిలు. వై. అ. క్రి. (నివ్వటించు ధా.) 1. నిండారు. "సీ. నివ్వటిల్లె ననంగ నిండారె ననఁ బూరటిల్లె నా నమములై యుల్లసిల్లు." ఆం. భా. కృ. ౩౦౧; 2. సిద్ధించు. "ద్వి. అనఘ నీచేతఁ గార్యము నివ్వటిల్లు." రం రా. యు. (శ. ర.) హైమ. ౨, ఆ. ౭౬; 3. ఒప్పు, ప్రకాశించు. "సీ. ఎవ్వనికడకంట నివ్వటిల్లెడు మాఢ్కి మానితసంపద లీనుచుండు" భార. విరా. ౨, ఆ. ౧౯౧. విక్ర. ౪, ఆ. ౭౧; 4. అతిశయించు. "చ. అని వినుచుం గలంగుహృదయంబునఁ దాపము నివ్వటిల్ల నిట్లను .." భార. విరా. ౫, ఆ. ౨౩౬; 5. వ్యాపించు. "మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం బేఁటు లల్లన నోలిన్ వెడలంగ .." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౦; 6. కలుగు, జనించు. "గీ. ఉదయపర్వతకటకగండోపలములఁ బటుమయూఖచ్ఛదాక్రాంతప్రభవమైన కొత్తరవిరుచిపూనిదికళ్ళ నివ్వటిల్ల, భానుకిరణంబు లోకకొన్ని ప్రాకె నభము." కాశీ. ౧, ఆ. ౧౨౨.

నివ్వరిముల్లు. ద్వ. వి. జా. (నివ్వరి+ముల్లు) నీవారశూకము, నివ్వరిధాన్యపుగింజచివరిముల్లు. "గీ. కలఁప నివ్వరిముంటిచందమున మిగులఁ, గొంతసై..." అచ్చ. యు. ౧౬౦. నివ్వరులు. వై. వి. బ. (నీవారః.) తృణధాన్యవిశేషము. "సీ. నివ్వరుల్ దబ్బరల్ నీరుకాకులు .. గీ...అది యగుపేగు గల్గిన ద్దకని యుంటు, మందు..." హంస. ౪, ఆ. ౧౨౮. ప్రబంధ. ౧౧౨.

నివ్వాళి = నివాళి. (ఆరతి.) (శ. ర.)

నివ్వాళిపళ్లెము = నివాళిపళ్లెము. "ద్వి. నివాళి పళ్లెము." భల్లా. ద్వి. ౧ భా. (శ. ర.)

నివ్వెఱ. దే. వి. (నిండు+వెఱ.) 1. మిక్కిలి ఆశ్చర్యము. "సీ...పాలుపారుచుండుదు నిర్ఘరాశ్చర్యంబు నివ్వెఱఁగఁ." ఆం. భా. ప్ర. ౧౩౨. దశా. ౧, ఆ. ౨౯౪; 2. మిక్కిలిభయము. "చ తెలుప మెసంగినట్టి యలచిత్తభవాగ్నికమానపాళికల్, బలంపుటు నారసా లనుచుఁ బాయనినివ్వెఱ యూత్మ మించఁగన్." చంద్రి. ౪, ఆ. ౭౯. దశా. ౪, ఆ. ౧౦౭; 3. పారవశ్యము సంమోహము. "ఉ. నిక్కము యట్ల లేమిఁ గడు నివ్వెఱ నవ్వర మేల కేఁడితిన్." విక్ర 3, ఆ. ౧౦. స్వా. ౫. ఆ. ౬౫; 4. భ్రాంతి. (శ. ర.); 5. (భయాదులవలని నిశ్చేష్టత.) (చూ నివ్వెఱపడు.)

నివ్వెఱఁగు = నివ్వెఱ. దే. వి. (నిండు+వెఱఁగు). 1. మిక్కిలి ఆశ్చర్యము. "మ. అనినన్ నివ్వెఱఁ గంది భూవిభుఁడు నాహా యిట్టివానిం బులింగని నామో విని నామెలు రెండు దయిన... అటంచు ..." దశా. ౧, ఆ. ౧౫౫. ఉ. రా. 3, ఆ. ౬౪; 2. మిక్కిలిభయము. "చ. పులిఁ బోడఁ గన్న వెళ్లగమిశోరె మదోధను నగ్రసైనికుల్, దలఁకి కలంగి నివ్వెఱఁగుఁ దక్కినఁ జెప్పలు దక్కి .." భార. భీష్మ. ౨, ఆ. ౧౫౪; 3. భ్రాంతి. "ద్వి. నిలుకడ దప్పిన నివ్వెఱఁ గంద." విష్ణు. పు. 3. (శ. ర.); 4. భయాదులవలని నిశ్చేష్టత "క. వెఱచఱచి వెగడువడి నివ్వెఱఁ గందుఁ గురుబలంబులెల్ల లనిదగ్గఱ కంత నంతఁ బాడఁగ, నుఱక నదీసుతుఁడు దాఁకె నుద్భటభంగిన్." భార. భీష్మ. ౨, ఆ. ౨౨౩.

నివ్వెఱపడు. ద్వ. అ. క్రి. (నివ్వెఱ+పడు.) 1. మిక్కిలిభయపడు. "వ...కౌరవసైనికులు కలంగినమనంబులతోడ నివ్వెఱపడి యుండ." భార. విరా. ౪. ఆ. ౭౫. ("విత్రస్తమనసస్సర్వేభయం జయకృతాద్భుతాత్." అనియూలము.); 2. మిక్కిలి ఆశ్చర్యపడు. "క. అద్వరుం దవ్విప్రుని, క్రొవ్వున నాస్యమయమితి క్రూరోద్ధతి యుఁన్, నివ్వటిలునీక కుచలులు, నివ్వెఱపడ సమరకేళి నిర్భరత మెఱసెన్." భార. కర్ణ. ౨, ఆ. ౩౦౫; 3. చేష్టలుడక్కు. "గీ. నీవు మమ్ము బోధింపఁగా నేర్తు గాక, యిమ్మహాపలుమ్మరణంబు నిట్టి దనఁగ నేము నేర్తుమె యుమిరూ యొంటఁగ మనికి, గాద నివ్వెఱపడితిమి కమలనాభ." భార. అను. ౪, ఆ. ౪౦౩; 4. భ్రాంతిపడు. (శ. ర.)

నివ్వెఱపడుచు. ద్వ. స. క్రి. (నివ్వెఱపడుధా. ప్రే.) భయపెట్టు. "క. పకియుఁ గను మెఱుఁగి మధుకర,చికుర నిశారాజువాజిఁ జేరి ప్రభూ ప్రాం, బక ధాటీకుకఘోటీ, వికరాటీకనము మనము నివ్వెఱపఱుచున్." వసు. 3, ఆ. ౧౧౪.

నివ్వెఱపాటు. ద్వ. వి. (నివ్వెఱపడుధా.) 1. మిక్కిలిభయము. "గీ. ఇట్లు పాండవసైన్యంబు తల్లడిల్లఁ గలఁగి, యిక్కడక్కడఁ బఱచుచుండ నక్క జంబు, కడిమి కచ్చెరువడి యొక్కకడకు వచ్చి, పాండుసూనులు నివ్వెఱపాటునొంద." భార. భీష్మ. ౧, ఆ. ౨౯౪; 2. మిక్కిలి ఆశ్చర్యము. "వ .. పాత్రులలో నెన్నయొక్క చక్కనిబాలికనుం జూచి యొక్కింతతడవు నివ్వెఱపాటున నిశ్చలుం డగుచు .." ౫, ఆ. ౨; 3. నిశ్చేష్టత. "సీ. చిత్రరూపంబున చెలువున నేలాగో పతియూర్తి నివ్వెఱపాటు నొంద." నిర్వ. ౯, ఆ. ౧౧౧; 4. భ్రాంతి. "సీ. తొట్రిలుభయమునఁ ద్రోవఁ గానఁగలేక నివ్వెఱపాటులో నిలుచుకొలఁత. దశా. ౪. ఆ. ౫. [3. కల, స్వప్నము.

నిశ. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు;

నిశమనము. సం. వి. అ. న. 1. వినుట; 2. చూచుట.

నిశాంధక. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిబీఱకి.

నిశాంతము. సం. వి. అ. పుం. ప్రభాతము, వేకువ. న. ఇల్లు. విణ. (అ. ఆ అ.) మిక్కిలి శాంతమైనది.

నిశాకరము. సం. వి. అ. పుం. 1. కర్పూరము; 2. కోడి, కుక్కుటము. [వాఁడు, చంద్రుఁడు

నిశాకరుఁడు. సం. వి. అ. పుం. రాత్రిని కలిగించు

నిశాచరము. సం. వి. అ. పుం. 1. నక్క; 2. గుడ్లగూబ; 3. పాము, 4. చక్రవాకము.

నిశాచరి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాక్షసి; 2. జంకుటాలు; 3. ఆఁడునక్క; 4. ఆఁడుగుడ్లగూబ; 5. పైఁడికంటి అనుపక్షి.

నిశాచరుఁడు. సం. వి. అ. పుం. 1. దొంగ; 2. రాక్షసుఁడు. విణ (అ. ఈ అ.) రాత్రులందు తిరుగువాఁడు.

నిశాటము. సం. వి. అం. పుం. గుడ్లగూబ.

నిశాటి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాక్షసి; 2. జంకుటాలు. 3. ఆఁడుగుడ్లగూబ.

నిశాటుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు. విణ (అ. ఈ. అ.) రాత్రియందు తిరుగువాఁడు.

నిశాతము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వాఁడి చేయఁబడినది. "క. అసదు నిశాతాశుగములు, దసజానికై నేయు .." ఉ. హరి. ౯, ఆ. ౨౮౦.

నిశాత్యయము. సం. వి. అ. పుం. ప్రభాతము, వేకువ.

నిశానము. సం. వి. అ. న. 1. వాఁడిచేయుట; 2. మెఱుఁగుపెట్టుట.

నిశానాథుఁడు. సం. వి. అ. పుం. రాత్రికిదొర - చంద్రుఁడు ఇట్లే: నిశాధీశుఁడు. మొ.

నిశానిశము. సం. అవ్య. ప్రతిరాత్రము.

నిశాని = నిశానీ. ధ్వజము జెండా "చ. తొలుకటి దిక్కుదీవుఁ లటఁ దోడకు భూధవునాజ్ఞ చేకొనన్, మలయక నిల్చుతద్ధవళిమం బను తెల్ల నిశానిచేరువన్, వెలిఁగొడు పద్మరాగయుత విశ్రుతకాంచనకుంభమో యనన్, జలరుహ బాంధవుం డుదయశైలముపైఁ గనుపట్టె నయ్యెడన్." ఉ. హరిశ్చ. ౧, ఆ. ౫౩.

నిశానీ. హిం వి. 1. గుఱుతు, చిహ్నము. "సీ. జిలుఁగు దీవాచుట్టు కెంగావి చెఱఁగుల నిద్దాజరీనిశానీల కరులు." రంగా. ౧, ఆ. ౧౫౭; 2. జెండా, ధ్వజము "క. అరాచవారి మద్మున్, వారు నకుం దీర్చి యొక్కపసిమినిశానీ, వారల చేతికి నిచ్చిన ఘోరాహవ మోర్చి దానిఁ గొంటిమ యేనిన్." రం. రా. ౨, ఆ. ౨౨౨; 3. వ్రేలి ముద్ర. (వా).

నిశానీదారు. హిం. వి. 1. చేతివ్రేలిముద్ర వేయువాఁడు, వ్రాలుచేయలేనివాఁడు. (వా); 2. రాజచిహ్నములు ధరించి దర్బారు మొదలగునవి వాయించువాఁడు. "సీ. కొమ్మఁ గోవెల నిశానీదారుగములు కర్నాచీదమారములన్నదు నేయ." అని ౨, ఆ. ౨౯.

నిశామణి. సం. వి ఇ పుం 1. చంద్రుఁడు; 2. మిణుఁగుఱుఁబురుగు. ఖద్యోతము; 3. కర్పూరము.

నిశామనము. సం. వి. అ. న. 1. చూచుట; 2. వినుట; 3. ఆలోచనము.

నిశామము. సం. వి. అ. పు. 1. చూచుట; 2. వినుట.

నిశారణము. సం. వి. అ. న. చంపుట, మారణము.

నిశారము. సం = నీశారము.

నిశితము. సం. వి అ. న. ఇనుము. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలివాఁడి చేయఁబడినది; 2. మెఱుఁగు పెట్టుట. [మెఱుఁగుపెట్టుట.

నిశితి. సం. వి. ఇ. స్త్రీ. 1. వాఁడిచేయుట; 2.

నిశీథము. సం. వి. అ. పుం. జనులు పరుండువేళ - 1. నడురేయి, అర్ధరాత్రము; 2. రాత్రి, రేయి.

నిశీథిని. సం. వి. ఈ. స్త్రీ. రేయి, రాత్రి.

నిశుంభము. సం. వి. అ. పుం. 1. చంపుట; 2. హింసించుట.

నిశుంభి. సం. విశే. (న్. పు. న్.) చంపువాడు.

నిశ్చయనీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిశ్చయింపఁదగినది.

నిశ్చయము. సం. వి. అ. పుం. 1. నిర్ణయము; 2. సిద్ధాంతము; 3. తప్పక కలుగుట; 4. అలంకారభేదము.

నిశ్చయించు. సం. స. క్రి. నిర్ణయించు, స్థిరపఱుచు. "చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె నిట్లు పోయెఁ దుము కులప్రయుక్త మగు చున్న సనాతనధర్మ మిత్తెఱంగ దహనకర్మ మెల్ల మది గాబిదిగా మను నిశ్చయించి మా మొదలిటి వా రొనర్చు విధముం గొనిచూడిరి పేము నిర్యోధన్." భార. విరా. ౧, అ. ౧౪౯. కాళిందీ. ౬, అ. ౨౪౬.

నిశ్చల. సం. వి. ఆ. స్త్రీ. భూమి.

నిశ్చలము. సం. విశే. (అ ఆ. అ.) 1. కదలనిది, స్థిరము; 2. మాఱనిది.

నిశ్చాయకుఁడు. సం. విశే. (అ. యికా. అ.) నిశ్చయించువాఁడు. [వాఁడు.

నిశ్చాయి సం. విశే. (న్. పు. న్) నిశ్చయించు

నిశ్చింతము. సం. అవ్య. అ. న. చింతలేమి నిర్విచారము. "మ ..ఏచిన పెం పొప్పఁగ బాష్పికు దరిగా నిశ్చింతంబునం బోరికిన్." భార. భీష్మ ౧, అ. ౯౪, భార. విరా. 3, అ. 30. విశే. (అ. ఆ. అ.) చింతలేనిది.

నిశ్చితము సం. వి వి. అ. న. నిశ్చయము. క్రి. విశే. 1. తప్పక. 2. రూఢిగా; విశే. (అ. ఆ. అ.) నిశ్చయింపఁబడినది. [సంకల్పము.

నిశ్చితి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిశ్చయము; 2. దృఢ

నిశ్చిన్వత్. సం. శతృ. నిశ్చయించుచున్న.

నిశ్చిన్వానము. సం. విశే. (అ. ఆ. అ.) నిశ్చయించుచున్నది.

నిశ్చీయమానము. సం. విశే. (అ ఆ. అ.) నిశ్చయింపఁబడుచున్నది. [వాఁడు.

నిశ్చేత. సం. విశే. (ఋ. త్రి. ఋ.) నిశ్చయించు

నిశ్చేతవ్యము. సం. = నిశ్చయనీయము.

నిశ్చేయము. సం. = నిశ్చయనీయము.

నిశ్చేష్టము. సం. విశే. (అ. ఆ. అ) చేష్టలు లేనిది.

నిశ్చేష్టితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చేష్టలుదక్కినవాఁడు.

నిశ్క్రమము. సం. వి. అ. పుం. అతిక్రమము

నిశ్రయణి. సం. వి. ఈ. స్త్రీ. నిచ్చెన.

నిశ్రేణి. సం. వి. ఇ, ఈ. 1. నిచ్చెన; 2. ఖర్జూర వృక్షము.

నిశ్శ్రేయసము సం. వి అ. న. 1. మేలు, మంగళము; 2. మోక్షము. విశే. (అ. ఆ. అ.) శ్రేష్ఠమైనది.

నిశ్వసనము. సం. వి. అ. న. నిట్టూర్పుట.

నిశ్వసించు. సం. అ క్రి. 1. నిట్టూర్పు విడుచు. "సీ. పద్మిని నిశ్వసింపఁగఁ బూచె వావిలి కమలాక్షి గనఁ దిలకంబు పూచె." వరాహ 3, అ. ౮౦; 2. ఊర్పు లోపలికిఁగొను; 3. ఊర్పు వెలుపలికి విడుచు.

నిశ్వసితము. సం. వి అ. న. నిశ్వాసము. విశే. (అ. ఆ. అ.) నిట్టూర్పుపుచ్చినది, నిశ్వసించినది

నిశ్వాసము సం. వి అ. పు నిట్టూర్పు.

నిశ్వాసించు. సం. అ. క్రి. నిట్టూర్పు విడుచు. ". మ వనితల్ నవ్వఁగఁ గౌఁగిలింపఁ గన నిశ్వాసింపఁ గానం బొనర్ప నరల్పన్."... రామా. ౧. అ. ౧౯౦.

నిశ్శంకుఁడు. సం. విశే. (న్. న్. పు.) 1. భయము లేనివాఁడు; 2. సందేహము లేనివాఁడు.

నిశ్శబ్దము. సం. అవ్య. అవ్య. అ. న. సద్దులేమి. విశే. (అ. ఆ. అ.) 1. సద్దులేనిది; 2. మిన్నకుండునది.

నిశ్శమము. సం. అవ్య. అ న. శాంతిలేమి. విశే. (అ. ఆ. అ.) శాంతిలేనిది.

నిశ్శరణము. సం. విశే. (అ. ఆ అ.) 1. రక్షకము లేనిది; 2. ఇల్లులేనిది.

నిశ్శలాకము. సం. వి. అ. న ఏకాంతస్థలము. విశే. (అ. ఆ. అ.) 1. నిర్జనము, ఏకాంతమైనది; 2. శలాకము లేనిది.

నిశ్శల్యము. సం. విశే. (అ. ఆ. అ.) శల్యము లేనిది.

నిశ్శేషపఱుచు. మి. స. క్రి. మిగులకుండఁజేయు. "గీ. చిక్కుబాటులు విడక నిశ్శేషపఱచె, బ్రతి

దినము దానిసంసారబాధ లెల్ల, శత్రుకర్తుగ నడచె దుర్వృత్తి నతఁడు." నిరం. ౨, ఆ. ౧౧౬.

నిశ్శేషము. సం. క్రి. విణ. అంతయు, సర్వము. విణ. (అ. ఆ. అ.) మిగులు లేనిది.

నిశ్శోధ్యము. సం. విణ. (అ. ఆ అ.) శుద్ధిచేయఁబడినది.

నిశ్శ్రీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాంతిలేనివాఁడు; 2. సంపదలేనివాఁడు.

నిషంగధి. సం. వి. ఇ. పుం. 1. కాఁగిలింత; 2. విలుకాఁడు; 3. సారథి; 4. రథము; 5. తృణము; 6. మూఁపు.

నిషంగము సం. వి. అ. పుం. 1. అమ్ములపొది; 2. కత్తి; 3. మిక్కిలి సంగము.

నిషంగి. సం. విణ. (న్ తీ. న్.) 1. విలుకాఁడు; 2. ఖడ్గధారి; 3. అత్యంతసంగము కలవాఁడు.

నిషణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ అ) 1. కూర్చున్నవాఁడు; 2. ఉన్నవాఁడు.

నిషద్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అంగడి; 2. కూర్చుండుట; 3. చిన్నమంచము; 4. అంగడివీధి.

నిషద్వర. సం. వి. ఆ. స్త్రీ. రాత్రి.

నిషద్వరము. సం. వి. అ. పుం. బురద, కర్దమము.

నిషధము. సం. వి. అ. పుం. 1. ఒకదేశము, 2. ఒక కొండ. విణ. (అ. ఆ. అ.) కఠినము.

నిషా. హిం. వి. మత్తు.

నిషాదనము. సం. వి. అ. న. కూర్చుండఁబెట్టుట.

నిషాదము. సం. వి అ. పుం. 1. ఒకదేశము; 2. సప్తస్వరములలో కడపటిది. (సంగీ.)

నిషాది. సం. వి. న్. పుం. మావటివాఁడు. ఈ. స్త్రీ 1 నిషాదస్త్రీ; 2. చండాలస్త్రీ. విణ. (న్.నీ.న్.) 1. కూర్చుండువాఁడు; 2. ఉండువాఁడు.

నిషాదితము. సం. వి. అ. న. కూర్చుండఁబెట్టుట. విణ. (అ. ఆ. అ) కూర్చుండఁబెట్టఁబడినది.

నిషాదుఁడు. సం. వి. అ. పుం. 1 బోయవాఁడు; 2. చండాలుఁడు. శ

నిషిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తడుపఁబడినది. 2. గర్భాదులం దుంచఁబడినది (శుక్రము. మొ.); 3. గర్భాధానము చేయఁబడినది (స్త్రీ.)

నిషిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింప బడినది. "క. నాయున్న బాము పిలఁకువ, యీయొడ లీబీర యిట్టిదేమిపుఁజంపం, బోయన్న మదనవిశ్రుతిం, జేయు నసుట యెంతయును నిషిద్ధము గాదే." భార. విరా. ౨, ఆ. ౪౯.

నిషిధ్యత్. సం. శత్ర. నిషేధించుచున్న.

నిషిధ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁబడుచున్నది.

నిషీదత్. సం. శత్ర. కూరుచున్న.

నిషూదనము సం. వి. అ. న. చంపుట, వధము. విణ. (అ. ఆ. అ.) చంపునది.

నిషేకము. సం. వి. అ. పుం. 1. మిక్కిలితడుపుట; 2. కాఱుట, స్రవించుట, 3. గర్భాధానము; 4. చల్లుట.

నిషేచనము. సం. వి. అ. న.=నిషేకము.

నిషేద్ధ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిషేధించువాఁడు.

నిషేద్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁదగినది.

నిషేధకము. సం. విణ. (అ. ధి కా. అ.) నిషేధించునది.

నిషేధత్. సం. శత్ర. నిషేధించుచున్న.

నిషేధనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁదగినది.

నిషేధము. సం. వి. అ. పుం. 1. నివారణము; 2. నిరాకరణము; 3. మరలించుట; 4. ఈపని చేయఁగూడ దని తెలుపువేదవాక్యాదికము.

నిషేధించు. సం. స. క్రి. కూడ దని చెప్పు, త్రోసిపుచ్చు. "వ. హంసాభిముఖ యైనయాత్రఁ బెద్దలు నిషేధింతురుసుమీ..." శైవ. ౨, ఆ.౪౩.

నిషేధిత. సం.=నిషేద్ధ.

నిషేధితము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁబడినది.

నిషేధితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁదగినది.

నిషేధ్యము. సం.=నిషేధితవ్యము.

నిషేవణము. సం. వి. అ. న. 1. కొలువు, సేవ; 2. (వ్రతాదులను) చేయుట; 3. (ఆహారాదికమును) అనుభవించుట.

నిషేవితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొలువఁబడినది; 2. అనుభవింపఁబడినది; 3. ఆచరింపఁబడినది. (వ్రతాదికము.)

నిషేవ్యము. సం. విణ. (అ. ఆ. అ) సేవింపఁదగినది.

నిష్కము. సం. వి. అ. పుం. న. 1. మాడ, పదునాఱుమాషములు తూనిక గలబంగారునాణెము;

2. టంకము; 3. దీనారము; 4. బంగారు; 5. పల కము; 6. బంగారుపాత్రము; 7. పలము, నాలుగు కర్షములయెత్తు.

నిష్కర్తనము. సం. వి. అ. న. కత్తిరించుట, ఛేదించుట.

నిష్కర్షణము. సం. వి. అ. న. 1. ఊడఁబెఱుకుట, నిస్సారణము; 2. నిశ్చయించుట.

నిష్కర్షము. సం. వి. అ. పుం. 1. నిస్సారణము; 2 సారాంశము; 3. నిశ్చయము.

నిష్కర్షించు. సం. స. క్రి. నిశ్చయించు (శ. ర)

నిష్కళ. సం. వి. ఆ. స్త్రీ. ముట్టుడిగినయాఁడుది.

నిష్కళము. సం. విణ. (అ ఆ అ.) 1. కళలు లేనిది. (చంద్రబింబము. మొ.) 2. వీర్యము లేనిది; 3. భాగములు లేనిది, సంపూర్ణము. (బ్రహ్మము.)

నిష్కారణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కారణము లేనిది, నిర్హేతుకము; 2. ఒక కారణమువలన కలుగ నిది, సహజము.

నిష్కాసము. సం. వి. అ. పుం. 1. వెడలుట; 2. వెడలఁ గొట్టుట; 3. మేడ మొదలగువానిమీఁది బహిః ప్రదేశము.

నిష్కాసి. సం. విణ. (న్. సీ. న్.) 1. వెళ్లువాఁడు; 2. వెళ్లఁగొట్టువాఁడు.

నిష్కాసితము. సం. విణ. (అ. ఆ. అ) 1. వెడలఁ గొట్టఁబడినది; 2. ఉంచఁబడినది.

నిష్కించనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1 ఏమియు లేనివాఁడు, దరిద్రుఁడు; 2. పొందఁదగినది లేని వాఁడు, ఆప్తకాముఁడు.

నిష్కుటము. సం. వి. అ. పుం. 1. అంతఃపురము; 2. తలుపు, కవాటము; 3. మడి, కేదారము. 4. ఇంటి తోఁట, గృహారామము.

నిష్కుటి. సం. వి. ఈ. స్త్రీ. ఏలకి. [వాఁడు.

నిష్కులీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నీచవంశము

నిష్కుహము. సం. వి. అ. పుం. తొఱ్ఱ, కోటరము

నిష్కూటము. సం. విణ. (అ. ఆ. అ )కపటము లేనిది.

నిష్కృతము. సం. వి. అ. న. 1. ప్రాయశ్చిత్తము; 2. సంకేతస్థలము. విణ. (అ. ఆ. అ.) 1. చేయఁ బడినది; 2. ప్రాయశ్చిత్తము చేయఁబడినది; 3. (ఋణాదులనుండి) విముక్తి నొందినది.

నిష్కృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. (ఋణాదులనుండి) విముక్తి; 2. ప్రాయశ్చిత్తము. విణ (ఇ.) కృతి లేనివాఁడు.

నిష్కృష్టము. సం విణ (అ. ఆ. అ.) 1. నిస్సారితము, వెడలింపఁబడినది; 2. సారముగాఁ దీయఁ బడినది; 3. నిశ్చయింపఁబడినది.

నిష్కైవల్యము. సం. విణ. (అ. ఆ. అ ) 1. కేవలము; 2. మోక్షహీనము.

నిష్కోషణము. సం. వి. అ న. 1. (పండ్లు మొ. వాని) తోలు ఒలుచుట; తొట్టుదీయుట; 2. నిస్సారణము, వెలికిఁదీయుట.

నిష్కోషము. సం. వి. అ. పుం.=నిష్కోషణము.

నిష్క్రమణము సం. వి. అ. న. 1. వెడలిపోవుట; 2. షోడశసంస్కారములలో నొకటి.

నిష్క్రమణిక. సం. వి. ఆ. స్త్రీ. షోడశసంస్కారము లలో నొకటి, నిష్క్రమణము.

నిష్క్రమత్. సం. శత్రు. నిష్క్రమించుచున్న.

నిష్క్రమము. సం. వి. అ. పుం. 1. వెడలిపోవుట; 2. శిశువును నాల్గవమాసమునఁ గాని మూఁడవమాస మునఁ గాని మొదటిసారి యింటినుండి బయటికిఁ దీసికొనివచ్చి సూర్యచంద్రాగ్నులదర్శనము చేయిం చుట. (ఇది షోడశసంస్కారములలో నొకటి;) 3. కులభ్రంశము; 4. ధీశక్తి (శుశ్రూష, శ్రవ ణము, గ్రహణము, ధారణము, ఊహ, అపో హము, అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము అను ఎని మిదిగుణములు గలది.)

నిష్క్రమించు. సం. అ. క్రి. వెడలిపోవు.

నిష్క్రయము. సం. వి. అ. పుం. 1. భృతి, వేతనము; 2. వినిమయద్రవ్యము. 3. వినిమయము; 4. మూల్యము, వెల; 5. వెలకుఁ గొనుట, క్రయము; 6. అమ్మట, విక్రయము; 7. పరాధీన మగుదానిని ప్రతిఫల మిచ్చి విడిపించుట; 8. పరాధీన మగు దానిని విడిపించుట కిచ్చుప్రతిఫలము; 9. ప్రత్యుప కారము; 10. సామర్థ్యము; 11. బయలువెడలుట, నిర్గమనము; 12. బ్రహ్మానుసంధానము, బుద్ధి యోగము.

నిష్క్రాంతము. సం. విణ (అ. ఆ. అ.) నిష్క్ర మించినది.

నిష్క్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. నిష్క్రమించుట.

నిష్క్రామ్యత్. సం. శత్రు. నిష్క్రమించుచున్న.

నిష్టంకము. సం. వి. అ. న. 1. మధుపర్కము. (అతిథులకు తేనె పండ్లు పెరుగు మొదలైనవి యొసఁగుట.); 2. ఎదుర్కొనుట.

నిష్టంకించు. సం. అ. క్రి. మార్కొను, తాఁకు. "శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండున్,...సాదృశ్యం బదృశ్యంబుగా, ముష్టిముష్టి రణంబు చేసిరి..." హర. ౭, ఆ. ౧౫, పాంచాలీ. ౨, ఆ. ౯.

నిష్టానకము. సం. వి. అ. పుం. మొఱ, ఆర్తధ్వని.

నిష్టాపము. సం. వి. అ. పుం. 1. కాల్చుట, వెచ్చచేయుట; 2. పరితాపము, దుఃఖము. "క...సుజనో, త్కృష్టుఁ దగుగురుని తెగుటకు, నిష్టాపముఁ బొందె భూతనికరము లెల్లన్." భార. ద్రో. ౧. ఆ. ౭౧.

నిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉనికి, స్థితి; 2. చేటు, నాశము; 3. తుది, సమాప్తి; 4. కొనవేఁడుట; 5. యాచన, వేఁడికోలు; 6. అసక్తి; 7. నిలుకడ; 8. ఆధారము;. 9. ప్రస్తుతకథాసమాప్తిరూప ముగుసంధివిశేషము (నాట్య); 10. ధర్మాదులయందలి శ్రద్ధ. నమ్మిక, 11. నిశ్చయము, అవధారణము. "గీ...సంశయిత సంవేదనంబు, మనసుకృత్యంబు లుకార్యమునను నొండ్లు, పౌరవు నిష్ఠ బుద్ధియగుఁ జేరఁగఁజేర, విత్తంబుగున కపరంబు తెలిసికొనుము." భార. అశ్వ. ౨, ఆ. ౨౯.

నిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) ఉన్నది. "వ.. నివృత్తిధర్మంబునందు నిష్ఠుండును విద్యాసహాయుండునునై..." భార. శాం. ౬, ఆ. ౭౧౩.

నిష్ఠానము. సం. వి. అ. న. 1. పాలు పిండి బెల్లము కలిపి వండెడుపదార్థము; 2. తేమనము, తిమ్మనము.

నిష్ఠించు. సం. అ. క్రి. శ్రద్ధవహించు. "ద్వి. శిలకొని మముఁ బ్రోవ నిష్ఠించి కావఁ, దలఁచి .." పండితా. పురా. ౧౩౭. పు. స. క్రి. నిర్ణయించు. "క. అని నిష్ఠించి పలుక నృపనుతచరిత్రుండు... తపమునన మేలొందెన్." భార. అశ్వ. ౨, ఆ. ౧౨, ౩, ఆ. ౯౫.

నిష్ఠితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉన్నది; చక్కఁగా నున్నది; 2. శ్రద్ధ గలది; 3 నిలుకడ గలది; 4. నిర్ణయింపఁబడినది.

నిష్ఠీవనము. సం. వి. అ. న. ఉమియుట.

నిష్ఠీవము. సం. వి. అ. పుం. = నిష్ఠీవనము.

నిష్ఠీవితము. సం. వి. అ. న. = నిష్ఠీవనము.

నిష్ఠురము. సం. వి. అ. న. 1. పరుషవచనము; 2 అమంగళవచనము. విణ. (అ. ఆ. అ.) 1. కఠినమైనది; 2. అమంగళకర మైనది.

నిష్ఠేవనము. సం. = నిష్ఠీవనము.

నిష్ఠేవము. సం. = నిష్ఠీవము.

నిష్ఠ్యూతము. సం. వి. అ. న. ఉమియుట. విణ. (అ. ఆ అ.) ఉమియఁబడినది.

నిష్ఠ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. ఉమియుట.

నిష్ణాతుఁడు సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రవీణుఁడు, నేర్పరి; 2. పారంగతుఁడు, పూర్తిగా నేర్చినవాఁడు.

నిష్ణుఁడు. సం. = నిష్ణాతుఁడు.

నిష్పక్వము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి పక్వ మైనది; 2. కషాయముగా కాఁచఁబడినది, క్వథితము.

నిష్పత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక, ఉత్పత్తి; 2. సిద్ధి, కొనవేఁడుట; 3. పండుట, పరువము; 4. సంబంధము; సామ్యము. (గణిత.)

నిష్పద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) కలుగుచున్నది.

నిష్పన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగినది, ఉత్పన్నము; 2. సిద్ధించినది, కొనసాఁగినది.

నిష్పవనము. సం. వి. అ. న. చేట మొదలగువానిచే చెరుగుట.

నిష్పాదకము. సం. విణ. (అ. దిశా. అ.) కలిగించునది.

నిష్పాదన. సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగించుట, ఉత్పత్తిఁ జేయుట; 2. కొనవేర్చుట.

నిష్పాదనము. సం. వి. అ. న. = నిష్పాదన.

నిష్పాదనీయము. సం. విణ. (అ. ఆ. అ) కొనవేర్పఁదగినది.

నిష్పాదయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిష్పాదించుచున్నది.

నిష్పాదయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిష్పాదించువాఁడు.

నిష్పాదయితవ్యము. సం. = నిష్పాదనీయము.

నిష్పాదించు. సం. స. క్రి. 1. కలిగించు. 2. కొనవేర్చు.

నిష్పాదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగింపఁబడినది; 2. కొనవేర్పఁబడినది.

నిష్పాద్యమానము. సం. = నిష్పాదయమానము.

నిష్పాద్యము. సం. = నిష్పాదనీయము.

నిష్పావము. సం. వి. అ. పుం. 1. (ధాన్యాదులను) ఎగురఁబోయుట, తూర్పెత్తుట; 2. చెరుగుట; 3. చేట మొదలగువానిగాలి; 4. పొలుపు లోనగు

వానిపోట్టు; 5. అనుములుకి; 6. పెద్దబొబ్బరలుకి, 7. శొల్లు. విణ. (అ. ఆ. అ.) నిశ్చితము.

నిష్పావలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చెరుగఁబడినది; 2. తూర్పెత్తఁబడినది.

నిష్పిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి నలఁగఁగొట్టఁబడినది; 2. చక్కఁగా నూఱఁబడినది.

నిష్పీడనము. సం. వి. అ న. 1. పిసుకుట; 2. పిండుట; 3. పీడించుట; 4. మర్దించుట.

నిష్పేషణము. సం. వి. అ. న. 1. చక్కఁగా నూఱుట; 2. చూర్ణముచేయుట; 3. నిష్పీడనము.

నిష్పేషము. సం. వి. అ. పుం = నిష్పేషణము.

నిష్ప్రయోజనము. సం. వి. అవ్య. అ. స. ప్రయోజనములేమి. విణ. (అ. ఆ. అ.) ప్రయోజనము లేనిది.

నిష్ప్రవాణము. సం. వి. అ. న. చలువచేయని క్రొత్తబట్ట.

నిష్ప్రవాణి. సం. విణ. (ఈ.) చలువచేయనిది, క్రొత్తది. (వస్త్రము.)

నిష్ఫల. సం. వి. ఆ. స్త్రీ. ముట్టుడిగినయాఁడుది.

నిష్ఫలము. సం. విణ. (అ. ఆ. అ.) ఫలములేనిది.

నిష్యందము. సం. వి. అ. పుం. 1. స్రవించుట, కాఱుట; 2. ప్రవాహము; 3. వృక్షాదులకట్టనుండి కాఱుద్రవము, రసము. విణ. (అ. ఆ. అ.) స్రవించునది.

నిష్యంది. సం. విణ. (న్. నీ. న్.) 1. స్రవించునది, 2. రసము కలది; 3 ఒలికించునది.

నిష్పందము. సం. విణ. (న్. నీ. న్.) కొంచెమైనను కదలికలేనిది.

నిసర్గము. సం. వి. అ. పుం. 1. స్వభావము, 2. స్వరూపము; 3. సృజించుట, సృష్టి; 4. విడుచుట; 5. ఈవి, ఇచ్చుట.

నిసి. వై. వి. (సం. నిశా.) 1. అర్ధరాత్రము. (శ.ర.; 2. రాత్రి. 'క. అని తలఁచి మెచ్చి...ఒకమఁడు పార్థునిచే నిప్పించి నగరు సొచ్చి నిసి చనన్." ఆము. ౨, ఆ. ౭౩. విక్ర. ౨, ఆ. ౧౦౫.

నిసివెలుఁగు. ద్వ. వి. (నిసి+వెలుఁగు.) చంద్రుఁడు. (శ ర.)

నిసుఁగు. వై. వి (సం. శిశుః. త. నిసువు.) 1. శిశువు, బిడ్డ. "వ...గాధిపుత్రు విమాఁదిమైత్రియుఁ దల్లితో నంగనిసుంగు విూఁది కారుణ్యంబును పెనఁగొన." పి. శకుం. ౨, ఆ. ౧౪౯. అచ్చ. యు. ౧౪౨;

2. పక్షి మొదలగువానిపిల్ల. "గీ. నిసు వనంగను బిల్ల నా నిసుఁ గనంగఁ, గూన యనఁగను గందు నాఁ గొదమ యనఁగఁ, దిర్యగర్భకములుగాను దెలియ వలయుఁ." ఆం. భా. ద్వి. ౯౯.

నిసువు = నిసుఁగు. 1. శిశువు, బిడ్డ. "సీ. నిసువువై పసుపునూనియుబిడ్డు లంటినచిటికమ్మికుఱుమాఫుచీర తోడ." శుక. ౪, ఆ. ౩౭. పార. ౨, ఆ. ౯౯; 2. అంకురము. "సీ. మొక్క మోక నిసువు మొలక మో సనఁగ నంకురమునకుఁ బేర్లు..." ఆం. సం. స్థా. ౩, 3. పక్షి మొ. వానిపిల్ల. ఆం. భా. ద్వి. ౯౯.

నిసృష్టము. సం విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. ఈయఁబడినది, సృజింపఁబడినది; 4. ఉంచఁబడినది, 5. దాఁచఁబడినది; 6. మధ్యస్థము ఒకపక్షమున అభిమానము లేక సమానముగా నుండునది. [సహింపఁబడినది.

నిసోఢము. సం. విణ (అ. ఆ. అ.) మిక్కిలి

నిస్తబ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిలిచినది, అఁగినది, 2. నిశ్చేష్టము.

నిస్తరణము. సం. వి. అ. న. 1. వెలువడుట. నిర్గమము, 2. తరణము, దాఁటుట, 3. పూర్ణముగా తెలిసికొనుట, 4. ఉపాయము.

నిస్తరించు. సం. స క్రి. 1. దాఁటు, తొలఁగించుకొను "వ. ధృతరాష్ట్రులంబనంబునంగదా యయాతి యూపడు నిస్తరించె." భార. శాం. ౫, ఆ. ౭౭. భార. విరా. ౧, ఆ. ౧౩౪; 2. దాఁటించు, తరింపఁజేయు. ద్వా. ౪, ఆ. ౧౫౫. దశ. ౧౨, ఆ. ౩.

నిస్తర్హణము సం. వి. అ. న. చంపుట, మారణము.

నిస్తలము. సం. వి. అవ్య. అ. న. తలాభావము. విణ. (అ. ఆ. అ) 1. తలములేనిది. అడుగులేనిది; 2. వర్తులము, గుండ్రనిది; 3 నిలుకడలేనిది, చంచలము.

నిస్తారకము. సం. విణ. (అ. రిక. అ.) దాఁటించునది.

నిస్తారణము. సం. వి. అ. న. 1. దాఁటించుట; 2. కష్టాదులనుండి ఉద్ధరించుట.

నిస్తారము. సం. వి. అ. పుం. 1. దాఁటుట; 2. కష్టాదులనుండి తప్పించుకొనుట; 3. ఉపాయము; 4. మోక్షము, 5. ఋణాదులను పూర్తిగా చెల్లించుట.

**నిస్తీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁబడినది; 2. కష్టాదులనుండి తప్పింపఁబడినది; 3. నెఱవేర్పఁబడనిది. "క. మతి మఱచి యనిస్తీర్ణ ప్రతిజ్ఞుఁడగువానికోపటుదహన మనిర్గతమయి వడి నరణిసము, త్థితదహనముపోలె నాత్మదేహము నేర్చున్." భార. ఆది. ౭, ఆ. ౧౪౩.

**నిస్తుషము.** సం విణ. (అ. ఆ. అ.) 1. పొట్టుతీసినది; 2. నిర్మలము; 3. లఘువైనది, తేలికయైనది

**నిస్తుషితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. పొట్టులేనిదిగాఁ జేయఁబడినది, 3. లఘూకృతము, చులుకనిదిగాఁ జేయఁబడినది.

**నిస్తేజము.** సం. వి. అవ్య. స్. న. 1. తేజోభావము; 2. శౌరుషములేమి. "మ ..నృపప్రకృతి నిస్తేజంబు సైరించునే." దశ. ౨, ఆ. ౩౧. విణ. (అ. ఆ. అ) ప్రతాపములేనిది.

**నిస్త్రాణము.** సం. విణ. (అ. ఆ. అ.) సత్త్వలేనిది "మ...దుర్జనవృత్తిం జనువారలై మనుల నిస్త్రాణంపుగోవుల్ సృజించి నియోగించిరి గౌతమోక్త కలమక్షేత్రంబు భక్షింపఁగన్." వరాహ. ౧౦, ఆ. ౩౭. హంస. ౧, ఆ. ౧౮౬.

**నిస్త్రింశము.** సం. వి. అ. పుం. ఖడ్గము. విణ. (అ. ఆ. అ.) 1. కనికరము లేనిది; 2. ముప్పదికి మించినది.

**నిస్పందము.** సం. వి. అవ్య. అ. న. కదలిక లేమి. వి అ. పుం. మిక్కిలికదలుట. విణ. (అ. ఆ. అ.) కొంచెమైనను కదలనిది.

**నిస్పృహము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ లేనిది.

**నిస్యందము.** సం. వి. అ పుం. కాఱుట, స్రవించుట.

**నిస్రవము.** సం. = నిస్రావము.

**నిస్రావము.** సం. వి. అ. పుం. 1. గంజి; 2. స్రవించుట, 3. ప్రవాహము.

**నిస్వనము.** సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత. విణ. (అ. ఆ. అ.) ధ్వని లేనిది.

**నిస్వానము.** సం. = నిస్వనము. (ధ్వని.) "సీ. చతురుదాత్తకవిత్వసాధునిస్వానంబు వీనుల కొక్కెడ వింత యొసఁగ." కాళింది. ౫, ఆ. ౭౪.

**నిస్సంతు.** వై. విణ. (సం. నిస్సంతతిః.) సంతానము లేనిది. (వ్యవ.) అతనిసంతు నిస్సంతై పోయినది. (శ. ర.)

**నిస్సంశయము** సం. వి. అవ్య. అ. న. సంశయము లేమి. విణ. (అ. ఆ. అ.) సందేహము లేనిది.

**నిస్సత్తువ.** వై. వి. (సం. నిస్సత్వం.) శక్తిలేమి, అశక్తి (శ. ర. ప్రా)

**నిస్సత్వము.** సం. అవ్య. అ. న 1. అశక్తి, 2. అభావము. విణ (అ. ఆ. అ.) 1. బలము లేనిది; 2. యోగ్యత లేనిది; 3. జంతువులు లేనిది; 4. పారమార్థికసత్యత లేనిది.

**నిస్సరణము.** సం. వి. అ. న. 1. వెడలుట, నిర్గమము; 2. మరణము, 3. ముక్తి, 4. ఉపాయము; 5. ఇల్లు లోనగువానిముందటిభాగము.

**నిస్సరత్.** సం. శత్ర. వెలువడుచున్న. "ఉ. తావకకంఠనిస్సరదుదంచితభారతి సద్గుణాత్మసం, భావితమైనదోషముల భాసిలు .." కళింది. ౬, ఆ. ౧౬౮.

**నిస్సరించు.** సం. అ. క్రి. వెలువడు. "గీ. రసికులానన ద్రిప్రకారత ఘటిల్లి, నాల్గువిధముల రచనమిష్టాన్నదనంబుఁ, గొంచు సీకారమున నిస్సరించుచుంచు, వినికి నాకగు నది కొర్కికనువుసొమ్ము." కాళింది. ౬, ఆ. ౧౭౧.

**నిస్సహాణము.** సం. వి. అ. పుం. చర్మవాద్యవిశేషము. "ఉ...పట్టణంబులన్, భేరులు తమ్మటంబులును నిస్సహాణంబులు శంఖకాహళుల్, బోరుకలంగ మ్రోయ నృపపుంగవురాజ్ఞ నొనంగఁ జెప్పుచున్." రుక్మా. ౧, ఆ. ౧౧౫, భా. రా. సుం. ౪౬౧.

**నిస్సాణము.** సం. వి అ. పుం. చర్మవాద్యవిశేషము. "ఉ. బొబ్బులు గారవించి పురభంజను పేరోక్కని శంఖనాదని, స్సాణధణంధణల్ చెలఁగ..." అని. ౫, ఆ. ౪౮, పారి. ౪, ఆ. ౯౧.

**నిస్సానము.** వై. వి. (సం. నిస్సాణః) చర్మవాద్యవిశేషము. "మ. చనియెన్ రాజును బేరులున్ గడఁది నిస్సానంబులున్ లోనుగాఁ, గను బెక్కుల్ బలువాయిదంబులు చెలంగన్..." య. ౪, ఆ. ౧౫౧.

**నిస్సారణము.** సం. వి. అ. న. 1. వెడలఁగొట్టుట; 2. ఇల్లు లోనగువానిముందటిభాగము.

**నిస్సారము.** సం. వి. అ. పుం. నిర్గమము, బయటికి పోవుట. విణ. (అ. ఆ. అ.) సారము లేనిది.

**నిస్సారితము.** సం. విణ. (అ. ఆ. అ.) వెడలఁగొట్టఁబడినది.

**నిస్స్రవము.** సం.=నిస్స్రావము.

**నిస్స్రావము.** సం. వి. అ. పుం. 1. గంజి; 2. వ్యయము.

ఉత్త్యో. ౪, ఆ. ౨౯౦; 2. (ఋణము) తీర్పు. "మ. తత్ప్రసాదమున నీక్రిలోంది రాఁ సాన్నఁడ బెం, పెనయుక్ సామది నానుహోత్మనిఋణం బే నేమిట న్నీఁగెదన్." భా. రా. కిష్కిం. ౪౯౩, విక్ర 3, ఆ. ౧౭౯.

నిహంతృ. సం. విణ. (ఋ. త్రి. ఋ.) చంపువాఁడు.

నిహతము. సం. వి. అ. న. గుణకారము. (గణిత.) పుం. అనుదాత్తస్వరము. విణ. (అ. ఆ. అ.) 1. గుణింపఁబడినది; 2. చంపఁబడినది, 3. కొట్టఁబడినది.

నిహతి. సం వి. ఇ. స్త్రీ. 1. చావు, మరణము; 2 దెబ్బ.

నిహననము. సం. వి. అ. న. 1. చంపుట; 2. దెబ్బ కొట్టుట. [యుడుము.

నిహాక సం. వి. ఆ. స్త్రీ. 1. ఉడుము; 2. నీటి

నిహారము. సం వి. అ. పుం. మంచు.

నిహింసనము. సం. వి. అ. న. చంపుట.

నిహితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2. దాఁచఁబడినది.

నిహ్నవనము. సం. వి. అ. న. 1. కపటము, మిష, 2. (సత్యాదులను) మఱుఁగుపఱిచి చెప్పుట.

నిహ్నవము. సం. వి. అ. పుం. 1. (సత్యాదులను) మఱుఁగుపఱిచి చెప్పుట, 2. రహస్యము, 3. కపటము; 4. అవిశ్వాసము; 5. కపటము; 6. తిరస్కారము.

నిహ్నవించు. సం. స. క్రి. మఱుఁగుపఱుచు. "సీ .. సమరనిశ్శంకాంకశంఖ నినాదంబు నేమిస్వనంబుల నిహ్నవింప" భాగ. ౬, స్కం. ౩౬౯. శైవ ౧, ఆ. ౦౪.

నిహ్నుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మఱుఁగుపఱుపఁబడినది; 2. నిరాకరింపఁబడినది.

నిహ్నుతి. సం. వి. ఇ. స్త్రీ.=నిహ్నవము.

## నీ

నీ. దే. స. (క. త. నీ.) యుష్మదర్థకము. (దీనికి ప్రథమాదివిభక్త్యేకవచనములయందు నీవు, నువ్వు, నిన్ను, నిను, నిన్, నీచేత, నీకు, నీకు మొదలగు రూపములును బహువచనముల మీరు, మీరు, మీరలు, మీరలు, మిమ్ము, మీచేత, మీకు, మీకు మొదలగురూపములును వచ్చును.) "గీ...నీవు మాదుట్టపుపోలె కుమ్మితోఁడ." భార. ఆది. ౨, ఆ. ౧౪౪. 'సీ....కనుఁగొందు నేను మి మ్మిరుపుర..."శైవ. ౨, ఆ. ౦౬, ఆము. 3, ఆ. ౫౦.

నీఁగు. దే. స. క్రి. 1. పోఁగొట్టుకొను. "ఉ. ఇక్కథ త్రితో విన్న కెప్పుడుఁ గీర్తనసేసిరేని జనుల్, నిక్కము సర్వదోషముల నీఁగి ఫలింతురు భవ్యభద్రముల్." భార. అర. ౫, ఆ. ౨౦౯. భార.

నీఁడు. దే. వి. కమ్మవారిబిరుదు పేరు. (శ. ర. బ్రా.) (వ్యవ.) అంకినీఁడు, అచ్చినీఁడు. కామినీఁడు. మొ.

నీకారము. సం. వి. అ. పుం. తిరస్కారము.

నీకాశము. సం.=నికాశము.

నీగ. దే. వి. బాలక్రీడావిశేషము. (బ్రా.) "సీ. గోట దొర్లుడుకాయ గొబ్బిళ్ల మోపిళ్ల నీగ పోగిన బంతి దూగిలాట." హంస. 3, ఆ. ౧౪౬.

నీచక. సం. వి ఆ. స్త్రీ. ఉత్తమమైనయావు.

నీచము. సం. వి. అ. పుం. చోరమనుగంధద్రవ్యముశి. న. సూర్యాదిగ్రహముల నీచస్థితి. విణ. (అ.ఆ.అ.) 1. అధమము; 2. పొట్టిది; 3. పల్లమైనది, నిమ్నము; 4. హీనము, దిగ్గఱకానిది.

నీచిక. సం.=నీచక.

నీచికి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తమమైనయావు.

నీచీభావము. సం. వి. అ. పుం. నీచత్వము. "మ... చెడుగుంగంపును గల్గి హేయమగు నీచీభావముం దాల్చి . చండాలవేషంబుతోన్..." మార్క. ౧, ఆ. ౭౭౪.

నీచు. ఉభ వై. వి. (సం. నీచః) 1. ధూర్తుఁడు. "సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ బేరజ మన ధూర్తుపేరు వెలయు." ఆం. భా. శ్రు. ౬; 2. మత్స్యవిశేషము. "ఉ...పెక్, కెల్లయు పక్కెపారయుంచు నీచుకు ముచ్చగి బొమ్మడాయముల్ ...కరకాదిగఁ జేపలఁ బట్టిబెట్టుగన్." ప్రబంధ. ౧౯౫; 3. మత్స్య మాంసాదికము. (వా) సం. విణ. (అ. ఆ. అ.) మూర్ఖుఁడు. "క. అనునప్పలుకుల కయ్యెం, గన కోపము గదిరి నీచు గావున జంకించినఁ గాని మెత్తఁబడి పోఁ డని..." భార. విరా. ౨, ఆ. ౫౪, ప్రబోధ. 3, ఆ. ౩౦.

నీచుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూర్ఖుఁడు, పామరుఁడు; 2. అధముఁడు. "క. నన్నడుగ నేల నీవును, నన్నీచుఁడు నేమి మాటలాడితి రని నా,కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము..."భార. విరా. ౨, ఆ. ౨౬౩.

**నీటఁగలియు.** దే. అ. క్రి. (నీటన్+కలియు.) నశించు, పోవు. "సీ. తనపార్శ్వభాగసంధర్షణంబున ద్విప కోటులు నుగ్గులై నీటఁగలియ." దశా. ౧, ఆ. ౧౬౩.

**నీటరి.** దే. విశే. (నీటు+అరి.) నీటుకలవాఁడు; విలాసి. "చ... తామరకంటి సాటిఁ దొరపరంగు పొంగి డెడు నీటరి సాటి యటంచుఁ బల్కఁగా...." కాళిందీ. ౨, ఆ. ౯.

**నీటారు.** దే అ. క్రి. (నీటు+ఆరు.) ప్రకాశించు, ఒప్పు. "గీ. భానుదీప్తుల నీటారి ప్రసన్నమైన, పృథులమందారసీ పద్మబీజమాల." హర. ౩, ఆ. ౭౮.

**నీటికావుపు** ద్వ. వి. (నీరు+కావుపు.) అగ్ని. "గీ. బారకై నీటికావుపుపాపయుప్పు, పుదుకుఁగల్గల కట్టికై పొడమినట్టి, మెట్టవాల్పిట్టరామేని దిట్ట చెల్వు." అచ్చ. బాల. ౮.

**నీటికుప్ప.** ద్వ. వి. (నీరు+కుప్ప.) జలరాశి, సముద్రము. "సీ. తనకుందనపుఁజాయ, పెను నీటికుప్పకు పెనసినకుసుఁ బసరెక్కె ననఁగ." వసు. ౫, ఆ. ౩౬.

**నీటిచూలి** ద్వ. వి. (నీరు+చూలు+ఇ.) అగ్ని. "ఉ... ప్రదక్షిణమ్ము చొక్కమ్ముగఁ జేసెఁ బద్మహితుగాదిలిఘూఁటురు నీటిచూలికిన్." కాళిందీ. ౫, ఆ. ౧౩౨. కాళిందీ. ౪, ఆ. ౭౨.

**నీటితాత.** వై. వి. (నీరు+తాత.) వాయువు. (వాయువునుండి అగ్ని అగ్నినుండి జలము పుట్టినట్లు తైత్తిరీయోపనిషత్తునఁ గలదు.)

**నీటిదయ్యము.** వై. వి. (నీరు+దయ్యము.) నీటి వాశ్రయించి యుండుభూతము, చెగడు. "గీ. నీటి దయ్యంబు చెగడు నా నివ్వటిల్లు." ఆం. భా. ప్ర. ౬౪.

**నీటిదారి.** వై. వి. (నీరు+దారి.) జలధరము, మేఘము. "సీ అల దచ్చిచెనలకొండలను నిల్కడగల్గి నింగి నంటకయున్న నీటిదారి,కి .." ప్రబంధ. ౧౪౬.

**నీటిదాలుపు.** ద్వ. వి. జలధరము, మేఘము. 'క .. సిరిరాచవేల్పు కడునీ, పరితనమున నీటిదాల్పు వలమురిసుడివాల్గొరవంటి యొప్పు గలచే, వర ..' య. ౫, ఆ ౧.

**నీటినిసువు.** వై. వి (నీరు+నిసువు.) నీరునిసువుగా కలవాఁడు?; అగ్ని. "సీ. నీటినిసువు గాడ్పుచెప్పలి దుగ వెూము .." వేంక. దేవ. ౧౬, ఇట్లే: నీటిబిడ్డము. కొం.

**నీటిపుట్టుగు.** ద్వ. వి (నీరు+పుట్టుగు.) తామరపువ్వు, అబ్జము. (చూ నీటిపుట్టుగుపట్టి.)

**నీటిపుట్టుగుపట్టి.** ద్వ. వి. (నీరు+పుట్టుగు+పట్టి.) పద్మజుఁడు, బ్రహ్మ. "మత్తకోకిల. నీటిపుట్టుగుపట్టి యొన్నఁడు చెమ్మిఁ గానఁగ లేనియ, మ్మేటివేలుపు రాయఁ డామరు పేపుకంటికి మామగా, నేటి నీటుతలంబు చేసెనొ యీపదంబున లంచు .." య. ౨, ఆ. ౪౧.

**నీటిమానికము** వై. వి. (నీరు+మానికము.) కౌస్తుభమణి. "సీ. అనుబింబమునఁ బద్మకన్యక న్యాయముత్తిఁ బ్రకటించు నీటిమానికము మించు." దశా. ౪, ఆ. ౧౭౦. [వి. దేవ. ౨౧.

**నీటిమోపరి** =నీరుమోపరి. ద్వ. వి. (మేఘము.) సాం.

**నీటియిక్క.** ద్వ. వి. (నీరు+ఇక్క.) కౌస్తుభమణి. "సీ. ..తొలుకడకదలిలోఁ దులకించుసిరిగేస్తునక్కనఁ దగునీటియిక్క యనఁగ." య. ౨, ఆ. ౧౦౫.

**నీటియొకిమీఁడు.** ద్వ. వి. (నీరు+ఎకిమీఁడు.) 1. సముద్రుఁడు. "గీ. నీటియొకిమీని మొలనూలు బోటిమిన్న, యొంటిపంటచు గలకిటియొకటి దక్క, కలను చెమకిన మెకములపొలఁపు గానము .." ప్రబంధ. ౧౬౩, 2. అప్పతి, వరుణుఁడు.

**నీటియొడయఁడు** = నీటియొకిమీఁడు. (నీరు+ఒడయఁడు.) వరుణుఁడు. "సీ. పడమటిదొర నీటియొడయఁడు జడసామి." సాం. ని. దేవ. ౧౩.

**నీటిరాయఁడు.** వై. వి (నీరు+రాయఁడు.) వరుణుఁడు. "సీ. మాటమాటై యల్గి మకుఁగుమై దాఁగిన నీటిరాయనికూర్మి చెలఁత యనఁగ." య. ౩, ఆ. ౪౧.

**నీటిరిక్క.** వై. వి. (నీరు+రిక్క.) పూర్వాషాఢా నక్షత్రము. (శ. ర.)

**నీటిఱేఁడు.** వై. వి. (నీరు+ఱేఁడు.) 1. సముద్రుఁడు; 2. వరుణుఁడు. "సీ. కొలముపాఁగెమున నప్పా లకుదిండిని నల్పి తెగి నీటిఱేనిపెం పిగురఁ జేసి." య. ౨, ఆ. ౧౦౭.

**నీటిఱేనిరిక్క.** వై. వి. (నీటిఱేఁడు+రిక్క.) శతభిషన్నక్షత్రము.

నీటు. దే. వి (క. నీటు. త. నీటుపు.) 1. మురిపము, శృంగారగర్వము, 2. విలాసము. "సీ. సాక్షాత్క రించినజలదేవత యనంగ నీరాటరేవున నీటు చూపు." శుక. ౨, ఆ. ౪౧౦. ఆం. భా. ప్ర. ౧౩౯; 3. అందము. "సీ. కురులు నున్నఁగ దువ్వి కొప్పు పెట్టిననీటు గనుఁగొన్న మోహాంధకార మొదవు." ఉ రా. ౪, ఆ. ౧౯౭; 4. లావణ్యము, నైగనిగ్యము. "ఉ...సీ. జవ్వనముల్ విలాసమును జక్కఁదనంబును నీటుఁ జూచినన్, బువ్విలుకాని కైన భ్రమపుట్టుఁగదే భువనైకమోహినీ." ఉ. రా. ౪, ఆ. ౧౯౬; 5 నగ. "ఉ. సాహులకూటముల్ కలుగుజాణలు నీటులు పెట్టుకుందురే" దశా. ౨, ఆ. ౧౫౫; 6. రీతి, విధము. "వ . ఆంబువాంబుచంచంబునఁ దిము రుచు మున్నిటినీటునఁ గనరుచు మత్తేభంబువడువునఁ బుష్కరవాలంబు విసరుచు .."చంద్రా. ౬, ఆ. ౯౩. కువల. ౪, ఆ. ౯౨. విణ. చక్కనిది. "సీ. కస్తూరికాచర్చ సిస్తు గా దని నీటుగాఁ దావికుంకుమగంద మలఁది." ఉ. రా. ౪, ఆ. ౧౭౬. నీలా. ౧, ఆ. ౪.

నీటుకత్తియ ద్వ. వి. (నీటు+కత్తియ.) అందుడి, విలాసము గలయాఁడుది. "క. అలుగువగ చూపు కోళ్ళం, దలకలమచు నింత సోఁకిన న్నగవానిం, గళదాకఁ బెఁగునొక మొక్కలపుదొరకరాని నీటుకత్తియ యగుటన్." కువల. ౨, ఆ. ౧౩౯.

నీటుకత్తె = నీటుకత్తియ. వి. (విలాసముకల ఆఁడుది, ఆఁడుది). "వ . మగలఁ గికురింపఁ గంకణాంబులు పెట్టినరీతి నత్తమిల్లు పుత్తడికంకణాంబులు గల చూతనినీటుకత్తెలు .." ప్రబంధ. ౭౮. విణ. (విలాసముకలది). "చ. కరిగిరికైనపై కొనరు కల్గినపై జాణనీటుకత్తె యై, . మచ్చరైనపై, సురతకళా ప్రవీణ యగుసుందరి యందఱకున్ లభించునే." శశాం. ౪, ఆ. ౭౦.

నీటుకాఁడు. దే. విణ. (నీటు+కాఁడు.) 1 అందము గలవాఁడు. "సీ...సొగసుకాఁ డనంగను వన్నెకాఁ డనంగను నీటుకాఁ డనఁగా నలంకారి యొప్పు." ఆం. భా. కృ. ౧౦; 2. విలాసపురుషుఁడు. ' గీ. సిక్కి సిక్కి నిరీక్షించునీటుకాని, నందముల కెల్ల కెల్ల యానందగాని."చంద్రా. ౨, ఆ. ౧౩౬. సాం. సి. మాన. ౮.

నీటుకోల. దే. వి. (నీటు+కోల.) విలాసార్థము చేతఁ బట్టుకొనుకఱ్ఱ. "క. తిండాడుపై రిపీరులఁ, తిండాడుట యేమి దొడ్డు చెండాడుగరిన్, గొండకుఁ గొండ గూలఁగఁ, గొండిక పాయమున నీటుకోల స్తీటున్." సుద. ౨, ఆ. ౧౨౭.

నీటుపడు. ద్వ. అ. క్రి. (నీటు+పడు.) నీటుకలదగు. (చూ. నీటుపఱచు.)

నీటుపఱచు. ద్వ. స. క్రి. (నీటుపడు ధా ప్రే.) 1. నీటుకలదానినిగాఁ జేయుం. "సీ. పాఁపట చేటుకు పాణిము త్తెపుబొట్టు పాటలాధర యొత్తు నీటుపఱచె." ఇందు. ౫, ఆ. ౭౯.

నీటుబోఁడి. దే. వి. = నీటుకత్తె. "సీ. కలికిచిల్కల పల్కుకులుకు లుల్కఁ జిందఁ దేఁటగాఁ బల్కవే నీటుబోఁడి" కాళింది. ౨, ఆ. ౬౬.

నీటుపెట్టు. దే. అ. క్రి. (నీటు+పెట్టు.) విలాసము కలిగించుకొను. "సీ తనవిలాసము గనుంగొని నీటుపెట్టుదుకూనాస్త్ర రతియుం నుచుక్కురనఁగ." దశా. ౧, ఆ. ౫౭.

నీటుచేయు. దే. అ. క్రి. (నీటు+చేయు.) విలాసము చూపు. "సీ. నీటుచేయుందు రొక్కచోటఁ గేళిని మనోహరుఁ దేడ వలఁచునో యని చలింప." ఉ. రా. ౧ ఆ. ౧౭౦.

నీడ. దే. వి. 1. ఛాయ, అనాతపము "ఉ. సేమ మొనర్పఁగా గొడుగునీడవహించు వసుంధరాస్థలీ, సీమను యెక్కియాడెను విచిత్రగతిన్..." శైవ. ౧, ఆ ౮౮; 2. ప్రతిబింబము. "గీ. నిద్ర మేల్కాంచి సెలయేట నీడఁ గాంచి." ఆము. ౧, ఆ. ౩౯, 3. కాంతి, తళుకు. "ఉ ..చెక్కుల తళ్కు లద్దపుర్, నీడల నేలుగుబ్బగవనిగ్గు లనం గునిగుందుబంగరుర్, మేడలఁ బోలు......" ముకుంద. ౨, ఆ. ౧౧౧; 4. చాటు, మఱుఁగు. "క. తెచ్చుటయుఁ గేలిభవనముఁ, జొచ్చునో చోరకో యనంగ సుదతులనీడన్, జొచ్చి... అచ్చేడియ తలుపుదండ నల్లన నిలిచెన్."స్వా. ౬, ఆ. ౬; 5. ఆశ్రయము ప్రాపు. (వా.)

నీడకము. సం. వి. అ. పుం. 1. గూఁడు; 2. పక్షి.

నీడజము సం. వి. అ. పుం. పక్షి. విణ. (అ. ఆ. అ.) నీడమునందుఁ బుట్టినది.

నీడదోఁచు. దే. అ. క్రి. (నీడ+తోఁచు.) ప్రతిబింబించు. "గీ. నిర్మలం బైనవసధిలో నీడదోఁచు,

నిండుబింబంబులను బోలి యుక్కగణంబు." హర ౪, ఆ. ౧౫౨.

నీడము. సం. వి. అ. పుం. 1. పక్షిగూడు; 2. ఆశ్రయము. "వ... తరుకోటరక్రోడంబులు నీడంబులు చేసికొని నలుదిక్కులం బక్వంబులైనఫలంబులు తిని వచ్చి .." శ్రీరాధా. ౨, ఆ. ౧౩౮.

నీడోద్భవము. సం. వి. అ. పుం. పక్షి. విణ. (అ. ఆ అ). నీడమునందుఁ బుట్టినది.

నీతకము = నీతము. వి. నియమము. (శ. ర.)

నీతము. ఉభ. వై. వి. (సం. నియతకమ్.) నియమము. "క. జాతులు నాతుల కెందుక్, నీతములే కుక్కఁ గామినీలోకానాం, జాతిః ప్రకల్పితా యను,నీతి పురాతనమె కాక నేఁటిద యరయన్." విక్ర. 3, ఆ. ౭౮. సం. వి అ. న. 1. ధనము; 2. ధాన్యము; 3. నీతి. "శా. కానీరా యిటువంటి నీతము లనేకంబుల్ వినుంబోలి విన్నా వేమన్.." శకా౦. 3, ఆ. ౬౮. విణ. (అ. ఆ అ.) 1. కొని పోఁబడినది, 2. పొందింపఁబడినది; 3. నడపింపఁ బడినది; 4. గడుపఁబడినది. (కాలము); 5. గురువుచే శిక్షింపఁబడినది.

నీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కొనిపోవుట; 2. పొందించుట; 3. న్యాయము, పాడి; 4. ఉపాయము; 5. చాణక్యనీతి మొ. రాజనీతి; 6. సత్ప్రవర్తనము; 7. (అశ్వాదులను గూర్చి తెలుపుశాస్త్రము. "క. ఈతండు శాలిహోత్రుఁడో, మాతలియో నలుఁడో యొరులు మానవులు జవో,పేతముగ నిట్లు రథవాయు, నీతి యెఱుంగుదురె ధారుణీవలయమునన్." భార. అర. ౨, ఆ. ౧౭౧; 8. విధము, రీతి. (ఈయర్థము తెలుఁగునమాత్రమే కలదు.) "సీ ..భరతు, నీతి సుహోత్రునిభాతి భార్గవుభలె రాముపోలిక భగీరథునిపోలుపు. గీ. ధాత్రిఁ బాలించునవిభుండు దద్వ్యఘుఁడు." హంస. ౧, ఆ. ౪౨. [వాఁడు.

నీతిమంతుఁడు. సం. విణ. (త్. మతీ. త్.) నీతి కల

నీధ్రము. సం. వి. అ. న. 1. ఇంటిచూరు, 2. అడవి; 3. నేమి, చక్రముచుట్టుకమ్మి; 4. రేవతీనక్షత్రము.

నీధ్రుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

నీపము. సం. వి. అ. పుం. 1. కడిమి, కదంబము్; 2. మంకెన, బంధూకము్; 3. నల్లయిరుగుడు్; న. కడిమిపువ్వు.

నీయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొనిపోఁబడుచున్నది; 2. పొందింపఁబడుచున్నది; 3. నడుపఁబడుచున్నది.

నీరంధ్రము. సం. విణ. (అ. ఆ. అ.) రంధ్రములు లేనిది; సాంద్రము.

నీరగు. ద్వ. అ. క్రి. (నీరు+అగు.) 1. ద్రవించు. "చ. చెవు లదిరెన్ దిశ ల్దిరిగెఁ జిత్తము నీరయి పోయె..." భార. విరా. ౪, ఆ. ౧౩౩; 2. నశించు "చ. జరఠ యొకర్తు కుంజగృహచంద్రశిలం గనుమూర్కొనుండ...పాన్పుఁ గరంచె వెన్నెలల్, చోరఁబడి నిద్ర నీరగుట చోద్యమె దానికి నట్టిపట్టునన్." రామా. ౨, ఆ. ౯౩.

నీరజము. సం వి. అ న. 1. తామరపువ్వు; 2. ముత్యము; 3. చెంగల్వకోష్టము్; 4. వట్టివేరు, ఉశీరము్. విణ. (అ. ఆ అ.) జలమునఁ బుట్టినది. న్. 1. రజోగుణము లేనిది; 2. దుమ్ము లేనిది; 3. పుప్పొడి లేనిది; 4. ముట్టుడిగినది. (స్త్రీ.)

నీరజాతము సం. వి. అ. న. తామరపువ్వు. విణ. (అ. ఆ. అ.) నీటఁబుట్టినది.

నీరదము. సం. వి. అ. పుం. మేఘము, మబ్బు. విణ. (అ. ఆ. అ.) దంతములు లేనిది.

నీరధి. సం. వి ఇ. పుం. నీటికి ఉనికిపట్టు-సముద్రము.

నీరము. సం. వి. అ. న. 1 జలము, నీరు, 2. ద్రవపదార్థము, రసము.

నీరవము. సం. విణ. (అ ఆ. అ.) ధ్వని లేనిది.

నీరసము. సం. అవ్య. అ. న. రసాభావము, బలము లేమి. వి. అ పుం. దానిమ్మ్. విణ. (అ. ఆ. అ.) 1. రుచి లేనిది; 2. సారము లేనిది; 3. శృంగారాదిరసము లేనిది, సరసము కానిది. "గీ. నీరసాకార సైరంధ్రిఁ గోరఁ దగునె." భార. విరా. ౨, ఆ. ౬౪.

నీరసించు. సం. అ. క్రి. బలహీనమగు. (గ్రా. వా.) స. క్రి. నీరసము కల్గించు. "సీ. లేల వెన్నెలలు చంద్రెండు మార్యులు చూపు చీమండలై కాసి నీరసింప." కవిక. ౪, ఆ. ౧3.

నీరసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అరసికుఁడు. "క... పెద్దపరిహాసంబుల్, రూఢిగఁ బలికి మెట్టుం, జాడఁడు మావలను నీరసుం డన నుండెన్." భార. ఆది. ౮, ఆ. ౧౫౬.

నీరాకు. ద్వ. వి. (నీరు+ఆకు.) పాచి, వారిపర్ణి. "సీ. పాచి నీరాకు నా వారిపర్ణి చెలంగు..." ఆం. భా. ప్ర. ౧౬౫.

నీరాజన. సం. వి. ఆ. స్త్రీ.=నీరాజనము.

నీరాజనము. సం. వి. అ. న. దీపాదులచే దేవతా ప్రతిమాదుల కిచ్చునారతి.

నీరాట. ద్వ. వి. (నీరు+ఆట.) స్నానము. "సీ.... నీరాట కారణముగా నిర్ఝరంబుల కేఁగి సవిధవానీర కుంజముల నొందు." శివరా. ౩, ఆ. ౧౧౩; 2. జలక్రీడ. "గీ. చల్లులాడంగ నప్పుడు చదల కాఁగి, మగుడు తెలినీటికుంభరల్ దగిరోఁ జూడ, వారి నీరాటకును మెచ్చి వలపురాయఁ, డాని కురియించు పువ్వులవాన లనఁగ." య. ౩, ఆ. ౬౩.

నీరాటము. ఉభ. ద్వ. వి.=నీరాట. (స్నానము.) "క. నీరాట మొనర్చియుఁ శృంగారించిరి వేడ్కఁ బొడవు గ్రక్కున నంతన్." విల్హ. ౩, ఆ. ౨౧౪. సం. విణ. (అ. ఆ అ.) నీటిలో సంచరించునది. (మొసలి. మొ.) "క. నీరాటవనాటములకుఁ, బోరాటం బెట్లు కలిగె .." భాగ. ౮, స్కం. ౧౯.

నీరాటరేవు. ద్వ. వి. (నీరాట+రేవు) స్నానము చేయురేవు. "సీ. ఆరాటమునఁ బొంగి నీరాట రేవునఁ గాచి కన్నులఁ బల్మిఁ గవయఁ జూచు." నీలా. ౧, ఆ. ౭౬.

నీరాడు. ద్వ. అ. క్రి. (నీరు+ఆడు.) స్నానము చేయు. "శా...మిన్నేట నీరాడం బోయెడి చేసి తాపసులు." వరహ. ౫, ఆ. ౫౭. వి 1. కాఁగు, ఆలంబనము. "గీ కాగడు నీరా డనంగను నీళ్లు చివవి, యన నలంజరనామధేయమ్ము..." ఆం. భా. ద్వి. ౨౪౫; 2. కూరాటిలో పోసెడు వేన్నీళ్లు. (శ. ర.)

నీరాదులు. దే. వి. బ. వస్త్రవిశేషము. "వ...పీతాంబరములు నీరాదులు మురుసాలు పన్నెమడుంగులు చందురుకావులు .." ప్రబంధ. ౬౦౫.

నీరామని. ద్వ వి (నీరు+ఆమని) వర్షఋతువు. "క. ధారణిఁ గలమే ల్లెల్లను, ధారాళకరాళవర్షధారలచేతన్, నీరామని కాఁ గల దని, పూరాల్చిన భంగి మణురు వారిఁబోఁ దొరఁగెన్." విక్ర. ౪, ఆ ౩౦.

నీరార్చు. ద్వ. స. క్రి. (నీరాడు ధా. ప్రే.) స్నానము చేయించు. "గీ. కాంచి యవగాహనము చేసి కనకకుంభ, రాంతకీరంబుఁ దివిచి నీరార్చి...." రాజ. చ. ౨, ఆ. ౧౨౨. (నీరాఱు ధా. ప్రే.) తడియాఱఁజేయు, ఎండించు. "గీ. చికురసంతతి నీరార్చుచెలువకురిమె, చేసకొప్పు .." శివరా. ౩, ఆ ౪౫. [ఎండు. (చూ. నీరార్చు.)

నీరాఱు. ద్వ. అ. క్రి. (నీరు+ఆఱు.) తడియాఱు,

నీరాళము దే. వి. ఒకవిధమగురంగు. "మ. వెలతాలీవియసంతనంపుమగటానీరాళపుం గొప్పుటా, కులనిద్దంపుఁబసిండి నున్నవిరిబొగుల్ దొట్టు కట్టాణి పూసలపేర్ బొబ్బమెకంబు చెక్కడపుఁగీల్ జాగాజ గాగద్దియల్, తెలు వెచ్చం గొలువుండె. ..." ప్రబంధ. ౧౨౬.

నీరాళ్లగొంది. ద్వ. వి. ఈశాన్యదిక్కు. "సీ. ధళధళక్కన నింగిఁ దాటించెఁ బలుమాఱు నీరాళ్లగొందిఁ గన్నియమెఱుంగు." పాండు. ౪, ఆ. ౨౧, కవిరా. ౪, ఆ. ౨౬.

నీరిజి. దే. వి. ఒకానొకయడవిచెట్టు. (శ. ర. శ్రా.)

నీరిప్ప. ద్వ. వి. (నీరు+ఇప్ప.) మధూలకము. "గీ . నీరిప్ప యన మధూల, క మగు..." ఆం. భా. ద్వి. ౪౩.

నీరీఁగ. ద్వ. వి. (నీరు+ఈఁగ.) నీటిలో నుండు ఈఁగ. "సీ. నీరుకుమ్మరపుర్వు నీరీఁగ తలకప్పు.." హంస. ౪, ఆ. ౧౮౬.

నీరు. యు. దే విణ. అల్పము. (చూ. నీరుకావి, నీరెండ మొ.) వై. వి. బొ. అసా. (సం. నీరమ్. క. త. నీరు. బ. నీరులు, నీర్లు, నీళ్లులు.) 1. ఉదకము. "ఆ. నీరిలోనఁ దోఁచుతారకప్రతిబింబ, మొక్కొ యనఁగ ..' భార. ఆది. ౫, ఆ. ౨౦౭, ౪, ఆ. ౧౫౧, సాంబో. ౫, ఆ. ౨౪౦; 2. కన్నీరు బాష్పము. "మ. కని యంతంతన చాప కట్టుగ నమస్కారంబు లర్పించి లో, చనగోళంబుల నీరు గ్రమ్మ పదపాణంబుల్ కనుంగొంద .." సాంబో. ౫, ఆ. ౨౩౭, భాగ. స్కం. ౪౩౦; 3. (లోహాదుల) ద్రవము. "సీ ..అమర చేసిక దోయి కరార్చునపరంజి కిటి వ్రాఁత." ఆము. ౧, ఆ. ౫౩; 4. మూత్రము. (శ. ర.); 5 పశురోగవిశేషము. "ద్వి. నిరదకవ్వున పనీరు నాలుక చేర్చు."నవనాథ. ౧, ఆ. ౩౦, పు. 6. శుక్రము (చూ. నీరువోయు; 7. క్రొవ్వు. (చూ. నీరు పోయు.)

నీరుకందువ. ద్వ. వి. (నీరు+కందువ.) జలాశయము. "ద్వి. నీరుకందువ నుండు నీటుమారుండు, నీరు ముంచుఁగఁ గుంభినిపద మాలించి" రం. రా ఆర. ౧౨౭, పు. ౧౯. పం.

నీరుకట్టు. ద్వ. వి. (నీరు+కట్టు.) మూత్రకృచ్ఛ్ర రోగము. "గీ...అడరు నీరు, క ట్టనఁగ మూత్ర కృచ్ఛ్రంబు..." ఆం. భా. ద్వి ౧౨౬.

నీరుకట్టె. వై. వి. నీరుపాము "సీ. నీరుపా మనఁ గను నీరుకట్టె యనంగ జలభుజంగము పేరు చెలఁగు ..." ఆం. భా. క్ర. ౧౪౬, ఆము. ౪, ఆ.౧౨౭.

నీరుకడిమి. వై.వి. (నీరు+కడిమి.) ధారాకదంబముశీ. (శ. ర.)

నీరుకాకి. వై. వి. (నీరు+కాకి.) జలకాకము. "సీ. కొఁజా బెగ్గురు నీరుకాకి కంకణమును గొంగ డాలయుం గువ్వ పంగపండు." య. ౨, ఆ. ౨౪, ఆం. భా. ద్వి. ౯౩.

నీరుకాకిపసము. వై. వి. (నీరుకాకి+పసము.) లేని నేరము. "శా...అ, స్తోకప్రాథిని నీరుకాకిపస ముల్ జోడించి పల్లా ఱరో, పాకీము ల్దను రిట్లు పల్కుటకు నర్హాంచె .." రంగా. ౨. ఆ. ౨౧౯.

నీరుకాయ. ద్వ. వి. (నీరు+కాయ.) నీటిబుగ్గ, బుద్బుదము. (శ. ర. బ్రా.) [బ్రా.)

నీరుకాయవాఁడు ద్వ. వి. నీటిమనుష్యుఁడు. (శ. ర.

నీరుకాఱు. ద్వ. వి కమసాలివాని యొకవిధమగు పనిముట్టు. "చ ..నీరుకాఱుశాణము పటుకాఱు మూస బలువాతెపరీక్షలకుచ్చు లాదిగా, నమరఁగ భద్రకారక సమాహ్వయుఁ డొండొకఁడుండు నప్పురిన్." హంస. ౨, ఆ. ౧౯౧.

నీరుకావి. దే. వి. (నీరు+కావి.) కొంచెమెఱుపు, లేతకావి. "ఆ. పరఁగ జలకమాడి పట్టెనామము దీర్చి నీరుకావిపంచె నెరయఁ గట్టి." వేమన. ౩, భా. ౨౬౨. బ. ధాన్యవిశేషము. "సీ నివ్వరుల్ దెబ్బసల్ నీరుకావులు గాజుకప్పెర ల్కుయ వడా ల్కుంకుసరులు." హంస. ౪, ఆ. ౧౨౯

నీరుకాను. ద్వ. వి. (నీరు+కాను.) స్నానముచేయు నప్పుడు నీటియొద్దున మంత్రములు చెప్పెడు బ్రాహ్మణుల కిచ్చెడుడబ్బు. "సీ. తిలలు దర్భలుం గూని తీర్థసన్నిధి మంత్రములు సెప్పి నీరుకానులు గడించి." హంస. ౨, ఆ. ౧౭౨.

నీరుకాష్ఠ. ద్వ. వి. బ. శోణహారితవర్ణములై సంధ్యాకాలములందు కానవచ్చుసూర్యకిరణములు. "సీ. ఈఁగ మిక్కుట మయ్యె కెంపు నింగి గడు మించె నిడుదలై తిలకించె నీరుకాష్ఠ." హరి. పూ. ౬, ఆ ౧౬౦.

నీరుకుక్క. వై. వి. (నీరు+కుక్క.) జలశునకము. (శ. ర)

నీరుకుప్ప. ద్వ. వి. (నీరు+కుప్ప.) జలరాశి, సముద్రము. "ఆ. ఓరితోఁడి పూశి యొక్కింతయును మది, గొంకులేక నీరుకుప్ప దాఁటి, గడుసు పాలసుదిండిగము లుండునిద్దీవి,కెట్టు చేరివాఁడ వెఱుక మాలి" అచ్చ. సుం. ౧౩౪.

నీరుకుమ్మరపురువు. ద్వ. వి. (నీరు+కుమ్మరపురువు.) నీటిలో నుండుకుమ్మరపురువు. "సీ. నీరుకుమ్మర పురువు నీరఁగ తలకప్పు..." హంస. ౪, ఆ. ౧౬౬.

నీరుకోఁతి. ద్వ. వి. (నీరు+కోఁతి.) జలమర్కటము. (శ. ర.)

నీరుకోడి. ద్వ. వి. (నీరు+కోడి.) జలకుక్కుటము, పరిప్లవము. "గీ. సలిలకుక్కుటనామంబు వెలయుం నీరుకోడి యన..." ఆం. భా. ద్వి. ౯౨, ఆము. ఆ. ౬౧.

నీరుగండి. ద్వ. వి. (నీరు+గండి.) తూముకాలువ, వాహనము. (శ. ర.)

నీరుగన్నేరు. ద్వ. వి. (నీరు+గన్నేరు.) హిజ్జలము. (శ. ర.)

నీరుగాఱు. ద్వ. అ. క్రి. (నీరు+కాఱు) ఉత్సాహము లేకుండుట. "సీ. ఇంతికన్నులతోడ నీడన వచ్చునే గండుమీలని నీరుగాఱుచుండు." శశి. ౨, ఆ. ౧౬.

నీరుగాలిపడు. ద్వ. అ. క్రి. తాపముపొందు. "శా. వక్షోభంబులు గొన్ని . భూరిభూధరదరీద్వారంబులం దుండి సౌ,జన్యక్రీడల నీరుగాలిపడి కాసారావగాహార్థమై." భాగ. ౮, స్కం. ౨౬.

నీరుగుట్టు. ద్వ. వి జలజంతువిశేషము. "సీ. గులకరింతయుం నీరుగుట్టు శంఖనఖంబు పులుకాసి నసిమిరి బుంగపురువు." హంస. ౪, ఆ. ౧౯౬.

నీరుచము. సం. విణ. (అ. ఆ. అ.) కాంతి లేనిది.

నీరుచల్ల. ద్వ. వి. (నీరు+చల్ల.) లేటమజ్జిగ. "చ...ఫలం,బులును సుగంధిశీతజలము ల్వడపిం డలు నీరుచల్లయున్, వెలయఁగఁ బెట్టు భోజనము

వేసవిఁ జందనచర్చ మున్నుగన్." ఆము. ౧, ఆ. ౮౧. సాం. ని. స్థా. ౬౮. ఇట్టే: నీరుమజ్జిగ. సాం. ని. స్థా. ౬౮.

నీరుచించేలము. ద్వ. వి. (నీరు+చించలము.) ఓషధీ విశేషముశి. "సీ. విమళంటకాలార్లు వేతసంబును నీరుచించలంబును బలిచించలంబు." హంస. ౫, ఆ. ౫౬౮.

నీరుచిచ్చు. వై. వి. (నీరు+చిచ్చు.) 1. బడబాగ్ని. "గీ...నీరుచి చ్చనంగఁ బొలుచు బడబాగ్ని .." ఆం. భా. ప్ర. ౪౮; 2. జలమెక్కువగుటచే వృక్షలతాదులకుఁ గలుగురోగవిశేషము "వ... సుధాకరుండు చెంగలువకేదారంబులకుఁ దీర్చిన తేటమున్నిటికాలువలజాలువలె ధళధళని వెలి వెలుంగుచలుకల జలజలనఁ దొలఁగుసలిలములు దొట్టి నీరుచిచ్చుఁగొని యంచుల సంచరించు రాయంచబోదలు వాడుగా ముక్కుం బక్కు పక్కునఁ బొడువ నొక్కించుక నిచ్చుమెట్ట గుత్తమ్మిమొగడల వెదలుకట్టావివెట్టగిలి ....." చంద్రా. ౫, ఆ. ౬౩.

నీరుచిచ్చువడు. వై. అ. క్రి. (నీరుచిచ్చు+పడు.) నశించు. పార్వ. ౪, ఆ. ౫౧.

నీరుచిట్టి. ద్వ. వి. (నీరు+చిట్టి) అ స్తుండులీయముశి. "సీ. ఆగు నీరుచిట్టి నా న స్తుండులీయంబు..." ఆం. భా. ద్వి. ౬౭. [(శ. ర)

నీరుచేఱుకు. ద్వ. వి. (నీరు+చుఱుకు.) మూత్రము విడుచునపుడు మంట కలిగెడురోగవిశేషము.

నీరుచెంచేలి. ద్వ. వి. (నీరు+చెంచేలి.) నిరున్నముశి. (శ. ర.)

నీరుటెంకి. ద్వ. వి. (నీరు+టెంకి.) జలాశయము; చెఱువు. "సీ. నీరుటెంకి యనంగ మీఱు జలాశయంబు." ఆం. భా. ప్ర. ౧౬౫.

నీరుడి. ద్వ. వి. (నీరు+ఊడు) 1. మూత్ర మధిక ముగా విడుచురోగవిశేషము, అతిమూత్రము (శ. ర.); 2. మూత్రము. (వా.) [(శ. ర.)

నీరుదుము. ద్వ. వి. (నీరు+ఉదుము.) జలగోధిక.

నీరుతిట్ట. ద్వ. వి. (నీరు+తిట్ట.) జలరాశి, సముద్రము "సీ. అత్తఱిఁ గైక క్రచ్చఱ నీరుతిట్ట బత్తళికవ తిరుబల్విలు దునిమిన, వెరవరినొసలబంగరురేకు గట్టుతెలుంగుకుంధర యనుతాఁగపాలఁతి, వలన కేతెంగి..." అచ్చ. అయో. ౫౧.

నీరుతిత్తి. వై. వి. (నీరు+తిత్తి.) 1. మూత్ర కోశము. (శ. ర.), 2. నీటితిత్తి. "వ...బన్నీరు నించిన యన్నీరుతిత్తు లొత్త నియత్తలంబున బాఱి కయిువ్రాలుధారలవాద్యంబులు దడిసిన..." ఆము. ౪, ఆ. ౩౫.

నీరుతుట్ర. ద్వ. వి. (నీరు+తుట్ర.) నీరుకట్టె, అల గర్దము. (శ. ర.)

నీరుదాలుపు. ద్వ. వి. (నీరు+తాలుపు.) జలధరము, మేఘము. "శా. ఏఁడే రక్కసి నీరుదాలుపులగా ద్వేఁడీ జగం బేలుతేఁ,డు..."అచ్చ.అయో.౮౮.

నీరుదొత్త. ద్వ. వి. నీరుకట్టె, అలగర్దము. "గీ. నిక్క మొకరూఁడుదియు నొకనీరుదొత్త, యొక్క గాడిద యొకకోడె యొక్కగుఱ్ఱ, మని తలంపకు నను విలుప్తారిగంధుఁ, డగుజరాసంధుఁడుగ నింక నరసికొనుము." హరి. ఉ. ౧, ఆ. ౧౦. [(శ ర.)

నీరుదోమ. ద్వ. వి. (నీరు+దోమ.) జలమశకము.

నీరుద్రిమ్మరి. ద్వ. వి. (నీరు+త్రిమ్మరి.) జలచరము, జలజంతువు. "గీ. నీరుద్రిమ్మరిపదువులు తెఱయ బెరయఁ, బొనరుమున్నీరు తేరి యబ్బురము మీఱ." అచ్చ యు. ౩. [(శ. ర.)

నీరుపంది. ద్వ. వి (నీరు+పంది.) జలసూకరము.

నీరుపదను. ద్వ. వి. (నీరు+పదను.) కొంచెపుఁబదను. 'సీ. ఘుమఘుమాధిరుతాకుంతితాంభోరాశి నిజ పాయకమునకు నీరుపదను."చంద్రా. ౧, ఆ. ౮౧.

నీరుపాఁకి. ద్వ. వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

నీరుపాప. యు. దే. వి. పసిబిడ్డ. "చ...విరు లను దూపు లుంచుకొని వేడుకగా రసికాలి వైచు చున్, దిరిగెడునీరు పాపను వధించెను శంభుఁడు కూరుఁడేకదా." పార్వ. ౩, ఆ. ౧౦౦. ద్వ. వి. (నీరు+పాప) 1. కృపీటయోని, అగ్ని. "ఆ. నీరు పాప గాలికొచ్చెలి యన్నిఁటి, తిండికాఁడు... అగ్గి యనఁగ నొప్పు నవలుఁ డీశ." ఆం. నం. దేవ. ౧౮, 2. జలజంతువిశేషము. "గీ ..నీరు, పాప పీరెన్గు కిర్పిల్లి ప్రాఁచిపురువు, లాదిగొలఁగాని జంతువు లన్ని విడిచి." హం. ౪, ఆ ౧౮౬; 3. జలమనుష్యుఁడు; జలమనుష్యాంగన. "సీ. కొలఁకులోకలనుఁడి కెలఁకుల విహరింప బయట నిల్చినీరుపాప లొక్కొ." కపటి. ౪, ఆ. ౬౪.

నీరుపాము. ద్వ వి. (నీరు+పాము.) జలసర్పము, నరుకట్టె. "సీ. నీరుపా మనఁగను నీరుకట్టె

యనంగ జలభుజంగము పేరు చెలఁగుచు..." ఆం. భా. ప్ర. ౧౪౩. పాం. వి. తిర్య. ౯౦.

**నీరుపిప్పలి** వై. వి. (నీరు+పిప్పలి) పిప్పలివిశేషము, తోయపిప్పలిక. "సీ. నీరుపిప్పలి యనం జనిన బొక్కైన యనంగఁ దోయపిప్పలిసంజ్ఞ తోఁచు చుండు." ఆం. భా. ద్వి. ౫౩.

**నీరుశిల్లి.** వై. వి. (నీరు+శిల్లి) జలమార్జాలము. (శ. ర.)

**నీరుపుట్టువు.** ద్వ. వి. (నీరు+పుట్టువు.) 1. శంఖము. "సీ. నీరుపుట్టువయును నీరుపుట్టువయును బూర యనఁ దొడవునై బొలుపు కెక్కు." అచ్చ. బాల. 3; 2. కౌస్తుభము. అచ్చ. బాల. 3; 3. తామరపువ్వు. (శ. ర.)

**నీరుపోఁక.** ద్వ. వి. (నీరు+పోఁక.) జలక్రీడ. "ఆ. ప్రణయభావ మెసఁగఁ బౌరు లుత్సవమునఁ, గూడి నీరుపోఁక లాడి రొప్పు" కు. సం. ౯, ఆ. ౧౨౦.

**నీరుపోయు.** ద్వ. అ. క్రి. (నీరు+పోయు.) క్రొవ్వెక్కు, మదించు. "గీ. ఇవ్విధంబున మెలఁగునయ్యింతి యొంటి, తిండికతమున నినుమడి కండ పట్టి, నీరుపోసిన మేనితో నిలుపరాని, మన సుచే జారభోగ మేమఱక తిరుగు." శుక. 3, ఆ. ౩౫౧.

**నీరుప్పి.** ద్వ. వి. (నీరు+ఉప్పి.) వృక్షవిశేషము. "సీ ..తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన మప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్ప." హంస. ౪, ఆ. ౧౧.

**నీరుప్రబ్బలి.** ద్వ. వి. (నీరు+ప్రబ్బలి) జలవేతసముక. (శ. ర)

**నీరుబచ్చలి.** ద్వ. వి. (నీరు+బచ్చలి) ఒకవిధమైన కూరాకు. "సీ...నిమిటాయి గోలిమిడి నీరు బచ్చలి ప్రబ్బ .." హంస. ౪, ఆ ౧౦.

**నీరుబొద్ది.** ద్వ. వి. (నీరు+బొద్ది.) వృద్ధదారకవిశే షము. (శ. ర.)

**నీరుమట్టము.** ద్వ. వి. (నీరు+మట్టము.) జలవ్యాప్తి గలభూభాగము. (శ. ర.)

**నీరుమానిసి.** వై. వి. (సం. నీరమానుషః.) నీటియందు న్నవాఁడు. "గీ. శైవలచ్ఛన్నముఖముతోఁ జలశ యించి, ఘనవాతిచేత నశ్వాచు బయలుపడిన, నీరు మానిసిఁ జాడు మన్నికకరవి, రూపితుం దగు రుక్మి పౌరుషముఁ దలిచె." సాంబో. ౧, ఆ. ౧౯౯.

**నీరుముంపు.** ద్వ. విశే. జలప్రాయము, క్రీనీరుపేల, అనూపము. "గీ నీరుముం పనఁ గ్రీనీరుపేల యనఁగ, భూమిఁ గాంచు ననూపంబు..." ఆం. భా. ద్వి. ౩.

**నీరుముట్టు.** ద్వ. అ. క్రి. (నీరు+ముట్టు.) మల మూత్రవిసర్జనముచేయు. "గీ. రచ్చఁ దెరువున గృహవాటి మచ్చుమీఁద, నీటిచేరువఁ గొఱ గాదు నీరుముట్ట,వసుధమీఁదను దళముగాఁ గసవుఁ బఱపి, వేగ మూత్రపురీషముల్ విడువవలయు." వి. పు. ౪, ఆ. ౧౯౨.

**నీరుమోపరి.** ద్వ. వి. (నీరు+మోపరి) 1. మేఘము. (శ. ర.); 2. కలశము. "సీ. ముదిశగుబ్బలం నీరు మోపరుల గణింప వప్పుఁబుట్టుట్రఁ గాదు నతిప కేలు." హ. న. ౪, ఆ. ౪౩, విశే. నీరుమోచు నది. (శ. ర.)

**నీరుమోయు.** ద్వ. అ. క్రి. 1. నీటిలో మునుఁగు; నీటితో నిండు. "ఉ. తామర నీరుమోవ హిమధా ముఁడుకుం గళవచ్చి డిగ్గఁ దే, జోమహిమాఢ్యుఁ రాము మగుచున్ సుదతీవదనంబు వొల్పు..." సాంబో. 3, ఆ. ౧౦౫; 2. గర్భవతియగు. "ఉ. శైవలమల్లి కావికచసారస నీలసరోజచక్రకూ, ర్మావయ వాఢ్యనిష్కలుషమానస పద్మిని నీరు మోచిన, ట్లావిలసిల్లి గర్భకమలంబును బోలిన కల్వలో మధు, స్రావము నుష్మసీ రగడిజాడను జూపక చూచుచున్నదన్." పార్వ. ౨, ఆ. ౭, పద. 3, ఆ. ౨౧. (ఈరెండు పద్యములందు పైరెండర్థముల కుదాహరణములు.)

**నీరుల్లి.** ద్వ. వి. (నీరు+ఉల్లి.) ఎఱ్ఱగడ్డ, పలాండువు. "సీ ..ఎఱ్ఱ, యుల్లియం చనఁగ నీరుల్లి నాఁగఁ బలాండు వొప్పు..." ఆం. భా. ద్వి. ౬౯.

**నీరువంగ.** వై వి. (నీరు+వంగ.) వార్తాకవిశేషము, వృంతాకము. "సీ...నీరత్తువంగ నా నీరువంగ, యనఁగను వృంతాక ములరును .." ఆం. భా. ద్వి. ౨౫౯.

**నీరువట్టివేరు.** ద్వ. వి. (నీరు+వట్టివేరు.) ఉశీరవిశే షము, లామజ్జకము. (శ. ర.)

**నీరువట్టు.** ద్వ. అ. క్రి. (నీరు+వట్టు.) దప్పిగొను. "ఆ. రాత్రి జాగరణభరక్రాంతు లైవారు, నిద్రఁ బొందియుండ నీరువట్టి, ధారుణీశ్వరుండు తన్మంత్రకలశోద, కంబు తెల్లఁ ద్రావెఁ గడువు

నిండ." భార. అర. 3, ఆ. ౨౦౨. వి. 1. దాహము దప్పిక. "ఉ. గాసిలినీక రానుతులఁ గొళికుఁ డాఁకలి నీరువట్టు నా, యాసము లేనిమంత్రము రణాధియప్పత్తి యమోఘబాణమా, గాసన సాధనంబులు. కృపచేసి కృతార్థులఁ జేసె కొంత యుఁన్." రామా. ౪, ఆ. ౨౮, భార. అని. ౬, ఆ. ౨౧౯; 2. పీటిచాటిక. "మ ..నిర్మలతో యమ్మపనం బొనర్చినశరీరం బేటికి న్నీరువట్టులు గట్టెం భవదాత్మశుద్ధి కిది గూడుంగా మనః హేయముల్." కాశి. 3, ఆ. ౯౬; 3. జలాశయము, నీరున్నచోటు. (బ్రౌ. వా.)

నీరువత్తిగ. వై. వి. భక్ష్యవిశేషము. "వ...మణుఁగుఁ బువ్వులుం జేణీలు నీరువత్తిగలు మడతలుఁ బప్పు బూరెలు .." హంస. ౧, ఆ. ౧౦౧ (శ.ర.పా)

నీరువరి. ద్వ. వి. (నీరు+వరి.) నీవారతృణముళీ.(శ.ర)

నీరువామి. ద్వ. వి. (నీరు+వామి.) జలరాశి, సముద్రము. "చ. ఋజువెఁ జెల్లిగ జేఱులు నీగు వామికిన్." అచ్చ. కిష్కిం. ౬౪, (శ. ర. పా.)

నీరువెట్టు. ద్వ. అ. క్రి. (నీరు+పెట్టు) పొలము మున్నగువానికి నీరు ప్రవహింపఁజేయు. "చ .. అసురఘనస్మరవైరి భుజాంతరాళకాం, గల మహీజాలఁబట్టి పయిఁగ్రమ్మెడునెత్తురు నీరు వెట్టి యుం, డలుకనె కీర్తిపూర్తికలమాంకుర మింద్రరమాఫలార్థివై." పాండు ౨, ఆ. ౫౯.

నీరూపము. సం. వి. అ. పుం గాలి. న. ఆకాశము. విణ. (ఁ. అ. అ.) రూపములేనిది.

నీరెండ. దే. వి. (నీరు+ఎండ) కొంచెపాటియెండ. లేఁతయెండ. "ఉ. కొండలు ద్రవ్వినట్టి పెను గుంటలవెంటనె నిర్గమించి మార్తాండమరీచులం దటిమి తాఁకినమాత్రమె కాదు రయ్యూత కన్నండ లముం గరాగ్రగిరిమండలిచేఁ గపులాచి దాఁచనీ,రెండలుగాఁచెఁ శైకొని ఫణీశఫణామణి దీప్తి లిప్తికన్." రామా. ౭, ఆ. ౧౨౬, శకాం.టీ. 3౭.

నీరెత్తువంగ. ద్వ. వి. నీరువంగ, వృంతాకముళీ. ఆం. భా. ద్వి. ౫౯. [౪, ఆ. ౧౭౬.

నీరేన్గు. ద్వ. వి. (నీరు+ఏనుఁగు.) నీటిగజము. హంస.

నీరొట్టు. ద్వ. వి. భక్ష్యవిశేషము. "గీ. రొట్టె నీరొట్టు నిప్పటి యట్టు దోసె, ..భక్ష్య భేదాహ్వయంబులు..." ఆం. భా. ద్వి. ౨౫౬.

నీర్కావి = నీరుకావి. "సీ....నిద్ద మైనమడుంగు నీర్కావిసోవలి కనకమేఖలతోడఁ గటిఘటించి." కాశీ. ౧, ఆ. 3౯.

నీర్గొబ్బి. ద్వ. వి. (నీరు+గొబ్బి.) వృక్షవిశేషము, నీరుగొబ్బిమిడిశీ. "గీ. వలఁగ వాఁడుడు పల్లేరు ములక వేము, నగిర నీర్గొబ్బి మొదలుగా జగతిఁ గల్గు కంప లన్నియు వేవేగఁ గడచి కడచి." హంస. ౪, ఆ. ౬

నీర్చిచ్చుకాఁడు ద్వ. వి. ఒకవిధమైనలతుముకిపిట్ట. "సీ.. టిట్టి, భమ లతుముకి యనఁ బరఁగు దద్దేదంబు నీర్చిచ్చుకాఁ డన కొగడుచుండు." ఆం. భా. ద్వి. ౯౭.

నీర్వట్టు. ద్వ. అ. క్రి. (నీరు+పట్టు.) దప్పిగొను. "వ... వెన్నెల నీర్వట్టువెన్నెలపిట్టలు బొట్టలు నిండ నాస్వాదించె." పాండు. ౪, ఆ. ౧౬. వి దప్పి. "శా. వానోన్నిగ్రహ మెన్న రాఁకలియు నీర్వట్టుఁ గణింప న్గలల్, మానెం గాయనరు .." పాండు. ౫, ఆ. ౧౬౮, ఆము. ౪, ఆ. ౧౨౨

నీర్వామి=నీరువామి. "గీ...కడు మ్రోయునీర్వామి గాంచి కెరుట." అచ్చ. కిష్కిం. ౯౦.

నీఱు. దే. వి. (క. త. నీఱు.) బూది, భస్మము. "ఆ. మాఁఱుకొన్నవారి నీఱుసేయుము ప్రజ, గరసి మనుపు ధరణిసురులఁ బ్రోవు" భార. శాం. ౧, ఆ. 3౭౦, వరాహ ౪, ఆ. ౫౬.

నీల. సం. వి. అ. స్త్రీ. 1. నీలిచెట్టు, 2. నల్లగలిజేరుళీ.

నీలంగువు. సం. వి. అ పుం. 1. పురుగు, 2. ఇంద్రనీలమణి; 3. నక్ష్మ. స్త్రీ. 1. ఈఁగ. 2. తుమ్మెదలపంక్తి.

నీలఁడు. వై. వి. (సం నిలః) అశ్వవిశేషము. "క. ఒనరించిన నీలని నడ, గని బొల్లని గత్తలాని గైరని సారం, గని కారని జన్నని నిమ, వని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహముఁ డెదురన్." ద్వా. 3, ఆ. ౧౪౧.

నీలకంఠ. సం. వి. అ. స్త్రీ. కొమిలి. "క. ఘనమండలి యత్యున్నతి, గనుఁ దొలం బిదపఁ గరక కలిత కుసుమలా, లసవజలసేకములఁ దా,మెసయుంట్రుచు నీలకంఠ మద మొనరించున్." కాళింది ౪, ఆ. ౭౯.

నీలకంఠము. సం. వి. అ. పుం. 1. నెమిలి; 2. ఊరపిచ్చుక; 3. కాటుకపిట్ట; 4. బంగారు పిచ్చుక; 5. తుమ్మెద; 6. పాము విణ. (అ. ఆ. అ.) నల్లని కంఠము కలది.

నీలకంఠుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. (ఇట్లే నీల గ్రీవుఁడు. మొ.

నీలకత్తి. మి. వి. ఖడ్గవిశేషము. "క, ...వంటులక్క చిలుకం దఱుగం, గోరిపచన క్రియాచిం, తార తితో నలకత్తి నలుగడ సాచుకన్." శుక. ౩, ఆ. ౫౭.

నీలకము. సం. వి. అ. పుం. 1. నల్లగుఱ్ఱము; 2. తుమ్మెద; 3. నల్లకోఁతి. న. 1. నల్లయుప్పు; 2. నల్లయుక్కు; 3. మైలుతుత్తము; 4. వేగిసకీ. విణ. (అ.. వి కా. అ.) నల్లనిది.

నీలగంధి. సం. వి. ఇ. పుం. మాణిక్యవిశేషము. (ఇది తుంబురమునఁ బుట్టినది. నల్లదాళు గల అధమ జాతిరత్నము. అని శ. ర.) [లము.

నీలతాలము. సం. వి. అ. పుం. చీకటిమ్రాను, తమా

నీలదూర్వ. సం. వి. ఆ. స్త్రీ. 1 నల్లగఱికకీ. 2. నల్ల గొలిమిడికీ.

నీలధ్వజము. సం. వి. అ. పుం 1. తమాలము, చీకటి చెట్టు; 2. తాడిచెట్టు.

నీలపత్త్రము. సం. వి. అ. పుం. 1. దానిమ్మకీ, 2. నల్లతామరకీ. న. 1. నల్లకలువ; 2. నల్లనిసునాకు. విణ. (అ. ఆ. అ.) నల్లపత్త్రములు గలది.

నీలపద్మము. సం. వి. అ. న. నల్లతామరకీ.

నీలపుచ్ఛము. సం. వి అ. పుం. డేగ.

నీలఫల. సం. వి ఆ. స్త్రీ. నేరేడు, జంబువుకీ.

నీలమల్లిక. సం. వి ఆ. స్త్రీ. మారేడు, బిల్వముకీ.

నీలము. సం. వి. అ. పుం. 1 కృష్ణవర్ణము, నలుపు, 2. ఇంద్రనీలమణి; 3. మఱ్ఱి, వటముకీ. 4. మచ్చ, కళంకము; 5. ఒకపర్వము; 6. ఒకనిధి; 7. నల్లనియెద్దు. న. 1. విషము; 2. మైలుతుత్తము; 3. నీలిమందు; 4. చీకటి. విణ. (అ ఆ. అ.) నల్లనిది.

నీలలోహిత. సం. వి. ఆ. స్త్రీ. 1. నేలనేరేడుకీ; 2. పార్వతి.

నీలలోహితము. సం. వి. అ. పుం. నలుపు కలిసిన యెఱుపు. విణ. (అ. ఆ. అ.) నలుపు కలిసిన యెఱుపు గలది.

నీలలోహితుఁడు. సం. వి. అ. పుం -కంఠమున నలుపును కేశములందు ఎఱుపును కలవాఁడు - శివుఁడు.

నీలాంబరము. సం. వి. అ. పుం. 1. నల్లనిబట్ట; 2. తాళిసపత్త్రికీ.

నీలాంబరి. సం. వి. ఈ. స్త్రీ. ముప్పదిరెండునప్రుంబక రాగములలో నొకటి "గీ. రీతి గౌళయుం నీలాంబరియును ఘనము, దనరుహాంపీర నాటయుం నని నపుంసకములు ముప్పదిరెండు రాగములు మఱియు ..." ప్రబంధ ౯౭.

నీలాంబరుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు. 2. శని; 3. నిర్ృతి. విణ. (అ. ఆ. అ.) నల్లని వస్త్రము కలవాఁడు. (ఇట్లే. నీలవసనుఁడు. మొ.)

నీలాక్షము. సం. వి. అ. పుం. బాతు. విణ. (అ. ఈ. అ.) నల్లనికన్నులు గలది.

నీలాలి. దే. వి ద్విముఖదీపిక. "సీ. ద్విముఖదీపిక దడి దేరు నీలాలి నా .." ఆం భా. ద్వి. ౧౬౫.

నీలి. ఉభ. యు. దే వి. మల్లవిద్యాసాధనవిశేషము. "సీ. మరున ఱెట్టి యనంగ మల్లాభిధానంబు తద్విద్య సాధనం దనరుచుండుఁ, దత్సాధనం బులై తగు...... గీ. సంగడము నీలి గోతా మనంగఁ గొన్ని." ఆం. భా. ద్వి. ౨౦౭. వై. వి. (సం. నీలం. ప్రా నీలీ.) 1. నీలవస్త్రము. "సీ .. నీలవస్త్రం బగు నీలి యనఁగ." ఆం. భా ద్వి. ౧౫౪, 2. నలుపు, నీలిమ. "గీ .. సకలజగద్భీష ణాయమాన, నీలవర్ణియలను నొక్కనీలి ప్రింగె, ననుట నిజమై యశేషవర్ణాంతరములఁ, గప్పుకొని యొప్పుచిమ్మచీకటులు కాఱియు." శుక. ౧, ౧౦౪. కు. సం. ౮, ఆ. ౯౯; 3 నల్లనూలు. (శ. ర.; 4. ఇంద్రనీలము. (చూ. నీలితిక్కు.) విణ. 1. నల్లనిది. "గీ. కొన దిగఁగ నీలిపుట్టంబు మునుఁగు వెట్టి." హర ౭, ఆ. ౧౧౯. 2. ధూర్తురాలు. "ఉ. అద్దమరేయిదాఁక పొల మారసి మారకిలీ ముఖావాలి, విద్దురఁ గాచియున్నతగవిట్ జగ నీలిపిసాళిజాత యు, మ్మద్గియ సేవచేయదు .." పాండు. 3, ఆ. ౭౧. సం. వి. ఈ. స్త్రీ. 1. నీలి చెట్టు; 2. నల్లయూఁగ; 3. నల్లగోరంటకీ; 4. నల్లగలిజేరుకీ.

నీలిచీర. వై. వి. (నీలి+చీర.) నల్లనివస్త్రము; చోర సాధనవిశేషము. "ఉ. కత్తియు నీలిచీరయును గంకటిరజ్జువు సారసంబు .. క. మొదలగు

సాధనములంగొని..." శుక్ల. ౩, ఆ. ౨౯౪, ౨౯౫.

నీలితనము. వై. వి. (నీలి+తనము.) 1. దౌష్ట్యము. "గీ...నరపాలమాళి దా న సత్యభామతోలి గావున జాలిగొలుపు, వాలి నీలితనాన కా వనగ జాలి, సోలి సుకుమారిమిని సాగరయాలి జూచి." చం. రా. ౪, ఆ. ౭౨; 2. మాయయేదుపు. (బ్రౌ.)

నీలితిన్నె. వై. వి. (నీలి+తిన్నె.) ఇంద్రనీలమణుల నొగట్టినవేదిక. "సీ. అచ టెల్ల దమచాయ నంటినట్టుగ నుండ దిరుగులాడెడునీలితిన్నె లనగ." య. ౨, ఆ. ౧౨.

నీలిదట్టి. వై. వి. (నీలి+దట్టి.) 1. నల్లనికాసెకోక; 2. చోరసాధనవిశేషము. "క. బలకమున గన్నపు కత్తియు, దలమున్లను జొక్కు నీలిదట్టి యినుము." మొదలగువానిన్." పరమ. ౪, ఆ. ౧౮౪; 3. ఒకానొకవేటసాధనము. "మ. వలలం బోనులం చిక్కములన్... నీలిదట్లు పిడియంబుల్ శ్రూని లీలన్ వికృం, ఖలవృత్తిన్ చరవేటకాండ్రు గొలువంగా వచ్చె రా జాన్నతిన్." రామా. ౨, ఆ. ౨౨.

నీలిమ. సం. వి. న్. పుం. నలుపు

నీలిమము. సం. = నీలిమ.

నీలిమందు. ద్వ. వి (నీలి+మందు.) నీలియాకులనుండి తీసినరంజకద్రవ్యము. (వా.)

నీలిముబ్బు. ద్వ. వి. ఒకానొక వేటసాధనము. "ద్వి. జిగురుకోలలు మేటిచిక్కము లురులు, తెగనీలిముబ్బులు ద్రిప్పుడుత్రాళ్లు, పిగిలిపొం డ్లమరిన పెదయీగెలును."ద్వి.నల.౩, భా.౨౩౪. పం.

నీలుగు. దే. అ. క్రి. 1. మరణించు. "గీ. అట్టు లొక్కొక్కపోటున నాలపోతు, లన్నియుంచు వాశ ముక్కున గన్నుగవల, నెత్తురులు గాఱ నీలిగి నేల బడిన, నెల్లవారలు వెఱగంది రుల్ల ములను." నీలా. ౩, ఆ. ౫౬; 2 ఒడలు పెంచు, దేహ ముబ్బించు. "క. లలితపుటురి గ్రామంబున, నిలుచుట యార్జజ్ఞ త్రెవ్వ నీలిగి నుకుతుల్, వెలుపడి చని సుఖులగుదురు .." భార. శాం. ౬ ఆ. ౨౩౨.

నీలోత్పలము. సం. వి. అ. న. నల్లకలువ. (ఇది మన్మథునియంచబాణములలో నొకటి. (ఇట్లే: నీలాంబుజము, నీలాబ్జము. మొ.

నీల్గు = నీలుగు. 1. చచ్చు. "సీ. పనుయంట యాల్గంట...నీల్గంట...నా విరాఱను మరణము." ఆం. భా. ద్వి. ౨౨౫. నా. పంచ. ౧, ఆ. ౭౫; 2. సాగు; 3. గర్వించు. "చ. అతివకుచంబు లన్ మెఱుగుటాఱను పేనలియున్ ధరాధి పోన్నతియుం నకీనభూతిశలనంబు ఘనాభ్యు దయంబు నివ్వ డొందితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీగెడున్, తీతి నటుగాద యొక్కొకరికి న్నదుకుంత్రపుగల్మి గల్గినన్." విజ. ౧, ఆ. ౩౪. (ఇది వైరందర్థములకు నుదా హరణము.); 4. ఒడలువిఱుచుకొను. "ఉ. పెచ్చని యూర్పు నించుచును వేదన బొందుచు గన్ను మోడ్చుచున్, వెచ్చుచు సెజ్జపై దనువు వెప్పగ వేచుచు నీల్గి లేచుచున్."కేయూర.౩,ఆ ౩౪౩. ఉ. రా. ౨, ఆ. ౧౮౯; 5. ఒడలుసాచు. "గీ. అవయవంబులు గదలించి యావులించి, నిదుర దెప్పిరి మేల్కాంచి నీల్గి మలగి, యొడలు విఱుచుచు ....." భాగ. ౮, స్కం. ౩౩౪. స్వా. ౪, ఆ. ౨౮; 6. ఒడలుపెంచు, దేహ ముబ్బించు. "సీ. జమిలిమద్దులతోడ సంరంభ మున దగిలించి తా దగులక లీల రెంటి. గీ. నడుము గడచి నీల్గంటయును బడమి వగుల, బెల్ల గిలి కూలె దరువులు .."హరి. పూ.౫,ఆ.౨౪౩.

నీవగి = నివరి. (సస్యవిశేషము.) "గీ...పాములపడగ నీడ, నలరుచు జెలంగు సెలుకలు తలవరు లయి, వరుస గావంగ వెలయునీవరులు గలిగి." శకాం. ౧, ఆ. ౧౭. [వణిజుడు.

నీవరుడు. సం. వి. అ. పుం. 1. సన్న్యాసి; 2.

నీవారము. సం. వి. అ. పుం. సస్యవిశేషము, నివ్వరిశీ.

నీవి. సం. వి. ఈ. స్త్రీ. 1. స్త్రీలపోకముడి; 2. మూల ధనము; 3. పందెపుసొమ్ము; 4. చెఱసాల.

నీవు. దే. స. యుష్మదర్థకము. "గీ. నీవు మాచుట్ట మవపోలె నిప్మితోడ." భార ఆది. ౨, ఆ. ౧౪౪. భార. ఆది. ౨, ఆ. ౧౫౦.

నీవృతము. సం. = నీవృత్తు.

నీవృత్తు. సం. వి. త్. పుం. 1. గ్రామము; 2. దేశము.

నీధ్రము. సం. = నీధ్రము.

నీశారము. సం. వి. అ. పుం. మంచు.

నీళులాడు. ద్వ. అ. క్రి. స్నానముచేయు. "ఉ... యశోద పేడుకన్,...అ, ర్భ్యాభగ నీళులాడు

టమున్నై చనిరొయిన్..." హరి. పూ. ౫, ఆ. ౧౪౮. శ్రీరాధా. ౫, ఆ. ౨౬౯.

నీళ్లచివది. ద్వ. వి. (నీళ్లు+చివది.) శాఁగు, ఆలంజ రము. "గీ. శాగడు నీరా దనంగను నీళ్లచివది, యన నలంజరనాముధేయమ్ము... .." ఆం భా. ద్వి. ౨౪౫.

నీళ్లదొర. ద్వ. వి (నీళ్లు+దొర.) వరుణుఁడు. "చ...నీళ్లదొర గాడుపు జక్కులఱేడు చిల్వ ప్రొమ్ములయొకిమీఁడు నాల్గుబుజముల్గల వేలుపు దమ్మిమాలియుఁన్, గొలువఁగ వెండికొండపయిఁ గూర్మిఁ జెలంగు గడించిదయ్యెమా." అచ్చ. ఆర. ౧౨౬ .

నీళ్లాడు. ద్వ. అ. క్రి. (నీళ్లున్+ఆడు.) స్నానము చేయు. "ఉత్సాహ. మలుసమర్త నంటపుండి మాలదాన నగుట నేఁ, గలయ నీళ్లు శాడి కదరఁ గ్రంత యంటుకొనుటకై, కొలనఁ గ్రుంకి .." శివరా. ౩, ఆ. ౮౪. [వేంక దేవ. ౯౭.

నీళ్లరాయఁడు. వై. వి. (నీళ్లు+రాయఁడు.) వరుణుఁడు.

నీళ్లవరుగు. ద్వ. వి. ఉప్పు, లవణము. (శ. ర.)

నీళ్లాడు. ద్వ. అ క్రి. (నీళ్లు+ఆడు) 1. స్నానము చేయు. "సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండె యాచేరువ నోర్తు తదుపు, గట్టక నీళ్లాడఁగాఁ జూచి దనమునుక్రము నిర్గమించిన ..." భార. శల్య. ౨, ఆ. ౧౬౦. కాశీ. ౨ ఆ. ౪౫; 2. ప్రసవించు. "సీ. తెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్లాడె రమ్మురమ్మని భోజరాజు తోడఁ, జెప్పిన .." భాగ. ౧౦. స్కం. పూ. ౧౮౮; ౮, స్కం. ౫౦౨.

నీళ్లార్చు. ద్వ. స. క్రి. స్నానము చేయించు. "సీ పాకకదంబజంబాలంబుఁ గడిగెడుసుగిది నీళ్లార్చిరి పావనికిని." కాశీ. ౩, ఆ. ౨౪.

నీళ్లుకాఁకు. ద్వ. అ. క్రి (నీళ్లు+కాఁకు.) మంద మతితోనుండు; జాప్యము చేయు. (బ్రా. వ్యవ.)

నీళ్లునములు. ద్వ. అ. క్రి. (నీళ్లు+నములు.) సంకో చించు, సంశయించు. "క. నీ వాపురికిని పొంద లం, బోవం బని యేమి చెప్పుము యథార్థముగా, నావుడును నీళ్లునములుచు, నాబిహాగము చెప్పఁ గొంక నంచయు 'దానిన్.' ప్రభా. ౪, ఆ. ౮. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౬.

నీళ్లోడు = నీళ్లుకాఁకు. (వ్యవ.)

III—63

# ను

ను. దే. అవ్య. (కొన్నియెడల దీనియుత్వమునకు లోపము కలుగును.) 1. నాశబ్దమునకును తన శబ్దమునకును వచ్చు ప్రథమైకవచనము. (ఉదా:- నేను, తాను.) "చ . సర్వమునను నేన నిల్తు సుఖ వాసక నన్ దగఁ జెంది నిల్చు సర్వము..." భార. అశ్వ. ౩. ఆ. ౩౮. "గీ. తాను దాసుతో బాంధవదారపుత్ర, మిత్రులను సజ్జనంబు లేమి టికి .." భార. శాం. ౬, ఆ. ౨౩౩; 2. ద్వితీయైకవచనము "గీ. నక్కవిశ్రేష్ఠు లిక్కయు ట్వను భరించి." కాశీ. ౧, ఆ ౧౯. భార. ఆది. ౨, ఆ. ౫౮; 3. తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైక వచనమునందు వచ్చు ప్రత్యయము. "ఉ...పొంద జన్య మొసఁగున్ గల్యాణసౌశల్యమున్." ఆము. ౧, ఆ. ౫, భార. ఆది. ౪, ఆ. ౮౬; 4. ఉత్తమ పురుషైకవచన ప్రత్యయము. ఉదా.-చేయు చున్నాను, చేయఁగలను. "ఉ ..వేంకటభర్తఁ గొల్చెదన్." ఆము. ౧, ఆ. ౧; 5. తుమర్థభావ లక్షణాద్యర్థములయందు వచ్చు ప్రత్యయము. ఉదా:-వండను బోయెను. వాఁడు వండ నతిథి వచ్చెను; 6. సముచ్చయార్థమును దెలుపును. "చ. ఇది యెసున్ సతతంబు నాయెదఁ గరం బిష్టంబులై యుండుఁ బాయవు భూదేవులాళి తర్పణమహీయఃప్రీతియున్ భారత, శ్రవణా సక్తియు...శశ్వత్సాధు సాంగత్యమున్." భార. ఆది. ౧, ఆ. ౧౨; 7. అవధారణార్థమును దెలు పును. "క...ఒకం,డును మధ్యరాత్రమునఁ గడుం గుతుకమును." హరి. ఉ. ౫, ఆ. ౧౫౮; 8. సహితార్థమును దెలుపును. "వ... మేనం బులక లిప్పుడుం బొడమెడును." స్వా. ౧, ఆ. ౪౨; 9. ఏని, ఐన అనునర్థమును దెలుపును. "క. భీమా ర్జునులకు రణమున సేయఁగలును బ్రతిరొ." భార. ఉద్యో. ౧, ఆ. ౨౮; 10. కొన్ని ప్రత్యయముల కును కొన్ని అవ్యయములకును అంతాగమముగా వచ్చును. ఉదా:-రామునిచేతను, వలెను. మొ.; 11. వృత్తి యందు కొన్నియెడల ఆగమముగా వచ్చును. ఉదా: తలుపుంజెక్కులు, తెల్లందనము. మొ.; 13. కల అనుబంధము పరమగునెపుడు షష్ఠీ అనుబంధము పరమగునపుడును ధాతువునకు వచ్చు ఆగమము. ఉదా:-చేయఁగలఁడు, చేయఁబడెను;

13. ప్రథమాంతము లగునట్టి ద్వితీయవిభక్తులకు ప్రాయికముగా నగు అంతాగమము ఈయాగమము పరమగునపు డుత్వమున కత్వ మగును. ఇట్టి లపై దీనికి 'ని' వచ్చును. ఉదా:-నేను భయ్యంపను. నేను సుకృతిని. నేను స్త్రీని.

నుంత. దే. వి. ఉపవాసము. "సీ. ప స్త్రీల నుంతు నిష్ఫస్తు ని ట్రనగను సుబవాసనంజ్ఞలై యొప్పుచుండు." ఆం. భా. ద్వి. ౧౭౫.

నుంజె. దే. వి. పొగటాలుపలక. "సీ. పునిగిండి చిటి కెన చాపురాల్ పొగటాలు నుంజెలు గొరవంక నుంజరంబు." ప్రబోధ. ౯౨౩.

నుక్కట. దే. వి. 1. బాధ. "ఉ. ఘోరతరానన స్ఫురితకోపులంబై యముదూత లావరుం, జేరినఁ గాంచి పై నడఁకఁ జేష్టలు వైకృత మందఁ బల్కుచున్, నోరును గన్నులుం దెఱచు నుక్కటయై వెగ డగ్గలింపఁగన్." మార్క. ౨, ఆ. ౩౮; 2. కదలియాడుట, అసియాడుట. "ద్వి. చెక్కుల నన్నంపు జెమ రెక్క నడుము,నుక్కట నొక్కింత నూగారు దోఁప, నలరుపయ్యెద జాఱ నలకలు చెదర..." ద్వి. హరిశ్చ. ఉ. ౯౧౦. పం.

నుగ్గడుచు. దే. స. క్రి. (నుగ్గు+అడుచు.) నలఁగఁ గొట్టు. "సీ ఎక్కుడు వలనైనయెడ లడ్డగించిన చలముల నుగ్గడుపుడు..." హరి. ఉ. ౧, ఆ. ౮౩.

నుగ్గాడు. దే. స. క్రి. (నుగ్గు+ఆడు.) 1. నలఁగఁ గొట్టు, పొడిచేయు. "మ. భటులన్ గీటడఁగించి ఘోటకములన్ భర్జించి భద్రేభరా, జ్ఞటలం జెక్కులుచేసి సైనికశతాంగశ్రేణి నుగ్గాడి..." రా. వి. ౫, ఆ. ౧౪; 2. వధించు, చంపు. "సీ. నుగ్గాడెఁ బరిమార్చె నురిపిను దెగటార్చెఁ జదిపెఁ జంపెను వదవద మొనర్చె." ఆం. భా. తృ. ౧౨౩, భా. రా. అర. ౨, ఆ. ౩౩౩; 3. ధ్వంసముచేయు. "సీ. వనజలాయము లిక్షువనము నుగ్గాడినదియుఁ గాల్వుర జేలపాలు చేసి." కు. సం. ౧౧, ఆ. ౧౩౮, రా. వి. ౨, ఆ. ౬౫; 4. ఖండించు. "ద్వి. నీతలల్ నుగ్గాడి నిను సంహరించి, సీతఁ దోడ్కొని పోవు సిద్ధ మీపలుకు." రం. రా. సుం. ౩౬౯ పు ౭. పం.

నుగ్గించు. దే. స. క్రి. తిట్టు. "మ...తల్లి న్నాన్న నుగ్గించి మోహమునకుం దైన్యము కొంత తెచ్చి కొని దంభుల్ జూపి యవ్విప్ర నొ,య్యన జాయం జని యిట్లు పల్కెను రహస్యాలాపరూపంబునన్." విప్ర. ౪, ఆ. ౭౬.

నుగ్గు. దే. అ. క్రి. నలఁగు. "చ...మా, కఱచిన కాట్టుకన్ శిశువుకాయము తోలును నుగ్గ దేమి యయ్యెన్." నృసిం. ౪, ఆ. ౪౩. (శ. ర. పా.) వి. 1. చూర్ణము, పొడి. "గీ. నురుము నుగ్గు పొడుము పొడి నురుము నుర్చి, చూ రనంగను విలసిల్లుఁ జూర్ణ మభిప." ఆం. భా. ద్వి. ౨౬౯, భార. ఆది ౨, ఆ. ౪౮; 2 ఖండము, ముక్క. "చ. తేరిపై, నొగనొగ దాఁకఁగాఁ బఱపి నుగ్గుగఁ గొరవమూతు చేసి..." భార. భీష్మ. ౨, ఆ. ౩౩౧, దశా. ౧, ఆ. ౧౯౬; 3. సమూహము. "ఆ. ఉగ్రభానుసుతుఁడు నగ్రభాగంబున బలిముఖాధిపతులు పన్ని నడువ, వెనుకఁ దాను గదలె పెన్నుబలం బయి, నూఱుకోట్లకపులనుగ్గులవు." రామా. ౭, ఆ. ౨౭౫, బ. పిడుకలు. (శ ర. జా.)

నుగ్గుచేయు. దే. స. క్రి. (నుగ్గు+చేయు.) ముక్కలు చేయు; పొడిచేయు. "గీ. యోధసారథియుగ్గ్రసంయుతము గాఁగ, నూఱురథములు ద్రెళ్ళిడి నుగ్గుచేసె" భార. విరా. ౩, ఆ. ౧౭౨.

నుగ్గులువాఱు. దే. అ. క్రి. (నుగ్గులు+వాఱు.) పొడి యగు. "ద్వి. కలయఁ బర్వెడుభవద్దరకాలాగ్నిఁ, గులగిరు లైన నుగ్గులువాఱుఁ గాలు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౬. పం.

నుగ్గువేయు = నుగ్గుచేయు. (చంపు.) "చ .. తేరికి సారథి కమ్మ నాకుఁ జి,చ్చుఱపిడు గట్టు లట్టడరి కూరులమొత్తము నుగ్గువేసెదన్." భార. విరా. ౫, ఆ. ౮౩. (ఇట్లే: నుగ్గుల్ వేయు." దశా. ౨, ఆ. ౪౦౬.)

నుచ్చిలి. దే. వి. నురుఁగు, ఫేనము. "శా. నోర న్నుచ్చిలి గ్రమ్ము చుండ...కన్ను ల్తారకాభింబనం, చారవ్యాప్తి నధఃకరింప హృదయస్థానంబు గంపింప .." హర. ౨, ఆ ౮౩, శివరా. ౪, ఆ. ౪౮.

నుచ్చె. దే. స. క్రి. పుచ్చుపాఁతలు చుట్టు. (శ.ర.) వి. గొట్టెలయొక్కయు మేఁకలయొక్కయు వెంటిక. "వ ..గొల్లకొయ్యలు ద్రచ్చి నుచ్చులంటించినం బెచ్చు పెరుఁగుచిచ్చు లాత్రంతులం దవిలించి..." స్వా. ౪, ఆ. ౬౦.

నుచ్చుకోక. దే. వి. (నుచ్చు+కోక.) గోఁగులయుం కోఁకలయుం చన్నులను చుట్టెడుగుడ్డ. "ద్వి. మలిం గత్తి నుచ్చుకోకలుఁ జాఁదుఁగోడుపు, మొల త్రిత్తి విడి దొడ్డమొలకచ్చ గట్టి." బస. 3, ఆ. ౧౧౧౭, పం.

నుచ్చుప్రాఁక. ద్వ వి. (నుచ్చు+ప్రాఁక.) గోఁగులయుం కోఁకలయుం చన్నులను చుట్టెడుగుడ్డ. "సీ. ఒడి సెల పాలకావడి నుచ్చుప్రాఁకలగుది యూఁపువై ప్రేలుఁగోర్వదంబు." వేం. పంచ. ౧, ఆ. ౯౯౭.

నుజ్జు. దే. విణ. శుతి నొందినది. "ఉ. అంటినఁ గందు నో యనక యంగము నిర్దయ వృత్తి మీఱఁ గాఁ, గింటికిఁదార్చి నుజ్జుగనొ కెంజిగురట్టిది సాక మోవిఁ బల్లంటు లొనర్చి..." ఉ. రా. ౫.ఆ. ౪౫౫.

నుడి. దే. వి 1. మాట, పలుకు. "మ. దశకంఠుండనుఁ దాశ! నీనుడి యథార్థంబైనచో శంకబాలికుఁ డైనన్ నయ మేది యగ్రజుని బల్మిం ద్రోచి దుర్వృత్తిఁ దద్వశమా విల్లెటు లాక్రమించు .." ఉ. రా. ౨, ఆ. ౨౨౬; 2. అప్రథ. "క. పుడమి నప్రథయగుకాదఁ, బడఁతికిదేహంబు విడువఁ బాడియకాదే, నుడికంటెఁ జావు మేలను, నుడువు పురాతనముకాద నూతనపదమే." భో. ౫, ఆ. ౧౫౬. (శ. ర పా.)

నుడికారము. ద్వ. వి. (నుడి+కారము - స్వార్థమున.) 1. మాట, పదము. "సీ. నుడుగు నుడువు నుడి కారము నొవ్వు నొడి నొడికారము నొడుగు సాఁగఁ, బదమొప్పు .." ఆం. భా. ప్ర ౧౧౧. కాశీ. ౨, ఆ. ౧౯౨, 2. (మాట మొదలగు వానియందలి) సొగసు, సరసత్వము. "గీ. ప్రౌఢి బరికింప సంస్కృతభావయం ద్రు, పలుకు నుడి కారమున నాంధ్రభావయందు,రు .." భీమ. ౧, ఆ. ౧౫; 3. పలుకుబడి, రచనము. "గీ. ఆపురా ణంబుగనఁ దనుఁ గర్యో్యనేని, శిల్పనేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ, దనుఁగు నుడికారమున మించు గనిరొనేనిఁ, గుంపనము కట్టువలచిన చంద మగును." శై. ౧, ఆ. ౧౭. విణ. సరసమైనది. "చ ..నీవుపల్కు నుడికారపు మాటలకెల్ల నాతఁ డొ్డదును విరసంపుఁ బల్కులు గడ్డక మంతి మోసమువచ్చు నత్తఱిన్." శుక. 3, ఆ. 3౯౦.

నుడిపడఁతుక. దే వి. (నుడి+పడఁతుక.) సరస్వతి. వేంక. దేవ. ౫.

నుడుగు. దే. స. క్రి. 1. వచించు, చెప్పు. "క. నుడిగె రహస్యోక్తులు..." బహు. ౫, ఆ. ౯౯; 2. జపించు. "సీ. మదవాహితుని నామమంత్రంబు నుడుగువాఁ డొడికంపుఁబాములఁ దొడుగు వాఁడు." భీమ. ౨, ఆ. (శ ర.) వి. మాట, పలుకు. "క. ఉడుపతి మకుటుండు చెవుల నొన రని నుడుగుల్, నొడివిన......" భీమ. ౨, ఆ. ౧౫౪. వసు. ౪, ఆ. ౨3.

నుడుగుపడఁతి. దే. వి. (నుడుగు+పడఁతి.) సరస్వతి. వేంక దేవ. ౯౯.

నుడుగుపడఁతిమామ. దే. వి. (నుడుగుపడఁతి+మామ.) విష్ణువు. వేంక. దే. ౧౯.

నుడుగుఱేఁడు. ద్వ. వి. (నుడుగు+ఱేఁడు.) బృహస్పతి, గీష్పతి. "సీ. అరయ వేల్పులకెల్ల నయ గారనందగు నుడుగుఱేనికిఁ గూర్మికొడుకుఁగుఱ్ఱ." య. 3, ఆ. 3౧.

నుడుగులచెలి. దే. వి. (నుడుగు+చెలి.) సరస్వతి. "సీ. జగములమ్రాఁటిపై జంగఁ జాచినదాఁగ నుడుగులచెలిమగఁ డడుగుఁజొరుదు." య. ౨, ఆ. ౪౪.

నుడుగువాలు. దే వి. దేవత, వేల్పు. "సీ. నుడుగు వాల్గమిపైల గడుగువారి మెఱుంగు లడుగు వాఱని క్రేలి మడుగువాఁడ." ప్రబంధ. ౨౧౫.

నుడువరి దే. విశే. (నుడువు+అరి) మాటలమారి, వాచాలుఁడు. (చూ. నుడువరితనము.)

నుడువరితనము. ద్వ. వి. (నుడువరి+తనము.) వాచాలత. "ద్వి. వడుగుచేసిన భక్తి వట్టిపాటుగఁ, నుడువరితనమునఁ గడచ నాడెదవు." బస. పు. ౧, ఆ. ౪౫౪. పం. (శ. ర. పా. నొడువరితనము. ముద్రి. పా.)

నుడువు = నుడుగు. దే. స. క్రి. 1. వచించు, చెప్పు. "గీ. వాని కౌశల్యగతి నుడువంగనా, కవుల కైనను మానిపుంగవులకైన." ఇందు. ౪, ఆ. ౧౬. ద్వి. మారిశ్వ. ఉ. ౧౦3౨. పం; 2. తెల్పు, బోధించు. "గీ. తూరుఁగొను నొజ్జ కాఁబోలుఁ గొదమచిలుక, తపసి బుడుతల గమికి వేదంబు నుడువు." కువల. ౨, ఆ. ౬3; 3. చదువు, పఠించు. "క...వి, వేకన్ వేదము నుడువున్, లోలాక్షుం డుండు బ్రహ్మలోకమునందున్." కాశ్యపి. 3, ఆ. ౬౦; 4 (అంకితముగా)

రచించు. "క. యశము గలిగించు నీ మృదు, విశదోక్తులఁ బాండరీకవిభుచరితఁ జతుర్దశభువన విపులముగ శుభ, పశుపతి నాపేర నుడువు వర తత్త్వనిధీ." పాండు. ౧, ఆ. ౨౫. వి. 1. మాట, పలుకు. "మధ్యాక్కర. నుడువులు వేయుఁ బింకేల యిప్పాటినోములు తొల్లి, కడఁగి నోఁచితిని గాకేమి యనుచును గంటె డెందమున." భార. ఆది. ౪, ఆ. ౧౦౨; 5. లోకోక్తి, నానుడి. "క ..నుడికంటెఁ జావు మేలను, నుడువు పురాతనముగాఁ బూకనపడమే." భో. ౭, ఆ. ౧౫౬. కాళింది. ౪, ఆ. ౨౯; 3. ఆజ్ఞ. "క. నడవడు నిలయము కొలువడి, తడవదు పరపురుషగుణముఁ దనపలిననుడువుం, గడపమ......" భాగ. ౧, స్కం. ౨౫.

నుడువులననఁబోఁడి. దే. వి. సరస్వతి. "సీ. నుడువుల ననఁబోఁడి జడియుచు మని వెన్న పఱచు ప్రాణేశు తెచ్చువడి చూచె." దశా. ౨, ఆ. ౫౫.

నుడువులపడఁతుక. దే వి. సరస్వతి. "క. నుడువుల పడఁతుక కైవడి, దడవుల విడుపసికిఁజైనఁ దరమే యున్నన్." అచ్చ. యు. ౫౫౦.

నుడువులఱేఁడు. ద్వ. వి (నుడువులు+ఱేఁడు.) బృహస్పతి. "గీ. వానిఁ గొలువంబు నుడువులఱేఁ కైనఁ, బూని దిటముగ వాక్రువ్వఁ బోల దెందు." నీలా. ౨, ఆ. ౭౨.

నుతము సం విణ. (అ. ఆ. అ.) నుతింపఁబడినది.

నుతి. సం వి. ఇ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.

నుతించు. సం. స. క్రి. పొగడు, కొనియాడు 'సీ. పరమేష్ఠియంత యీ గిరికొలంకులయందు పిందులోఁ దప్పిన పిల్లయొక్కొ. గీ. యని నుతించుచు..."మార్క. ౧, ఆ. ౯౭. ద్వి పరమ. 3, ఆ. ౧౬౨. పు.

నులిక = నులికె. (శ. ర.)

నులికె. దే. వి. 1. తెగ, ముత్తము. (శ. ర.); 2. దండు, దళము. (బ్రౌ.) "ద్వి. మాఱేసి గుఱ్ఱాల నులికెలు రెండు, పోఁజాలఁగాఁ జేసి పదిలంబుచేసి." కల్హాటివీరచరిత్ర. ౬౦. (బ్రౌ.)

నుతియించు = నుతించు. 'గీ. కాన నింద్రుండు ఫణిరాజుకైనఁ గాని, యీసుదతియందమును నుతి యింపలేరు." మార్క. ౬, ఆ. ౯౫. వరాహ. ౪, ఆ. ౧౬౨.

నుత్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రోయఁబడినది; 2. ప్రేరింపఁబడినది.

నుత్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁదగినది.

నుదత్. సం. శత్రు. 1. తొలఁగించుచున్న; 2. ప్రేరించుచున్న.

నుదమానము. సం. విణ (అ. ఆ. అ.) 1. తొలఁ [గించుచున్నది.

నుదుటికన్ను. దే. వి (నుదురు+కన్ను.) ఫాలాక్షము, శివుని తృతీయనేత్రము. "ఆ. నుదుటి కంటిమంట చదలంటి పర్వఁగఁ, గలసి తరతరంబ కప్పి కొనఁగ." కు. సం. ౧౦, ఆ. ౫.

నుదురు. దే. వి. బౌ. నొసలు లలాటము. "సీ. వదనంబు కొమరు భావనఁజేసి వేఱుగా నుదుటి చెంపలకలఁ బొదువఁబడఁగ." భార. విరా. ౧, ఆ. ౨౬౯. రం. రా. యు. ౩౭౨. పు. ౨౬. పం.

నుద్యమానము. సం. విణ (అ. ఆ. అ) 1. తొలఁగింపఁబడుచున్నది; 2 ప్రేరింపఁబడుచున్నది.

నును. దే. విణ. (నునుపుశబ్దము కడవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. వృత్తియందు హల్లు పరమైనపుడు దీని కడపటియచ్చునకు లోపము వైకల్పికము.) 1. నున్ననిది, స్నిగ్ధము. "ఉ. నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం, జేరిచి బుజ్జగించి నునుఁజెక్కుల జాలుకొనంగ జాఱు కన్నీరు కరంబునం దుడిచి .." పారి. ౧, ఆ. ౧౩౪. దశా. ౧. ఆ. ౧౩౧, 2. మెత్తనిది, మృదువైనది "చ ..కెంపు మీఱిన నునుఁబట్టుఁజేలఁ గటిచెంగులు వాఱఁగఁగట్టి ....." హర. 3, ఆ. ౭౯. స్వా. ౫, ఆ ౭౫; 3. లేఁత. "సీ. నునుఁదీవ మురిపాన్నఁ బెనఁగొన్నఁ గనుఁగొని ప్రాణేశుఁ గౌఁగిలింపఁగఁ దలంచు." దశా. 3, ఆ. ౧౭. స్వా. 3, ఆ. ౯౨; 4. అల్పము. "సీ. నునువవ్వు నవ్వనోపని మృదువ్వనలిటువలె నట్టపోసముల్ పలుపు పెట్టు." వరాహ. ౧౧, ఆ. ౯౬. పారి. ౫, ఆ. ౧౦౩; 4 సాంద్రము. "ఉ. ఎక్కడనుండి వచ్చెఁ దరళేక్షణ కీ నును సిగ్గు దొంతరల్." విజ. ౧, ఆ. ౧౦౪; 5. మనోజ్ఞము. "చ.. చంద్రుదురు నునుపోఁగ వెన్నెలలతోఁ దులదూఁగెడు తద్గుణంబులన్." వైజ. ౧, ఆ. ౪౯, దశకు. ౬, ఆ. 33.

నునుపరి. దే. విణ. (నునుపు+అరి.) నునుపుకలది. (శ. ర. బ్రౌ.)

నునుపు. దే. వి. 1. నున్ననగు, స్నిగ్ధత్వము. "వ... నారికేళఫలాగ్రావళీకోమల పలాశప్రోతికలనునుపు గల పొరలకొరల శరధికరంగలమీఁదటం బోలెఁ జెలికొని .." స్వా. 3, ఆ. ౨౮; 2. మనోజ్ఞత, సొంపు. "గీ. నునుపు దళుకొత్తఁ బలుకులు నుడువ వేమి" నీలా. ౨, ఆ. ౭౮, ద్వా. ౪, ఆ. ౧౮౫. విశే. 1. నున్ననిది, స్నిగ్ధము "చ నునుపగు పచ్చపట్టునఁ గనుంగొన నొప్పఁగ దిండు గట్టి. ..." పారి. పూ. ౬, ఆ. ౧౪౮, కు. సం. ౮, ఆ. ౫౯; 2. మనోజ్ఞము. "క. నునుపగు నలిగానము విని, వనదేవత గరము మెచ్చి .." కు. సం. ౪, ఆ. ౯౬

నున్న. దే. వి. 1. నున్నని ఉముక. (శ. ర.) 2. నున్నఁదనము, స్నిగ్ధత. "సీ .. తేటనున్నన నున్న తెలివి నునుపు. గీ. నిద్దమనస్నిగ్ధత కెనంగు .." సాం. ని. స్థా. ౬౦, విశే. (దీనికి కర్మధారయమందు నిగాగమము బహుళము.) 1. నునుపైనది, స్నిగ్ధము. "సీ. కురులు నున్నఁగ దువ్వి కొప్పుఁబెట్టిన నీటు గనుఁగొన్న మోహాంధకార మొదవు." ఉ. రా. ౪, ఆ. ౧౯౭; 2. మృదులము. "వ ..ఆమ్రాంధగంధ సింధురంబు . తుండంబెత్తి నున్నని యప్పళ్ళపండ గ్రమ్మనఁ గ్రమ్మించి విసరి .." హర. ౬, ఆ. ౧౬, వరాహ 3, ఆ. ౯౨; 3. మనోజ్ఞము. "సీ. మలదాయ రానున్న మలపు కెల్పులు దిండి పెంరాకలిమ కాలిపెండె మనుర." చంద్రా. ౨, ఆ 3౬; 4. సుఖకరమైనది. "ఉ. సువర్ణడోలికాం, దోళనఖేలనంబులను నున్నని నిద్దుర సోలగింప నా, బాలికఁ బాడుచుండుదురు పాటలగంధులు జోల పాటలన్." వి ప్ర. ౨, ఆ. 3౮; 5. అల్పము. (చూ. నున్నగాలి.)

నున్నఁదనము. ద్వ. వి. (నున్న+తనము.) మార్దవము, మెత్తన. "ఉ. . నున్నఁదనంబుగా నలుఁగు నూఁకియుఁ జందనమట్లు రాచియుం, బన్నుగఁ గ్రొత్తలైనకలపంబులు గూర్చి ..." భార. విరా. ౨, ఆ. ౨౨౧.

నున్నగాలి. దే వి. (నున్న+గాలి) మందమారుతము. "చ...నున్నగాలికి నెల తైన పుష్పఁబొదలే పొదలే పులకింప..." కావ్యా. ౨, ఉ. ౬౩.

నున్నన. దే. వి. నున్నఁదనము, స్నిగ్ధత. "సీ .. తేట నున్న తెలివి నునుపు. గీ. నిద్ద మన స్నిగ్ధత కెనంగు..." సాం. ని. స్థా. ౬౦, విశే. నున్ననిది, స్నిగ్ధము "మ. ఉడుమార్గం బఖిలంబు నున్న నయి కాశోత్తేజనం బొంది పుల్లడుగం బద్దనికాతఖడ్గము క్రియా గన్పట్టె నప్పట్టునన్." హర ౨, ఆ. ౨౫, అం. భా. ద్వి. ౨౫౨.

నున్నము. స. విశే. (అ. ఆ. అ.) 1. తొలఁగింపఁబడినది; 2. ప్రేరింపఁబడినది.

నుయి. దే. వి. బావి, కూపము. (దీనికి ప్రథమైక వచనమందే ప్రయోగములు గన్పట్టుచున్నవి. "శా ..నుయి దాఁటేవానికిన్ జింతయూ,శం తైనం గడమేనియుం గడచు కారా యంచు నూహించుచున్." పాండు. ౪, ఆ. ౨౮౫.

నుయ్యి=నుయి "క. వాలినదప్పి వినుజ్ఝర,కూలంబున నుయ్యి ద్రవ్వకునికి గలిగినన్, క్రీలలనా విభుఁ డుండని, నేలయు క్షేత్ర మనియురుగ నీచుఁడు గలుగున్." పాండు ౫, ఆ ౬౨, విజ్ఞా. వ్యవ. ౧౫౧.

నురుఁగు దే వి. ఫేనము. "సీ. కొడుకు రాఁగలఁ డంచుఁ గడుఁ బొంగువాహినీవరుని యూర్ముల మించు నురుఁ గనంగ." ఉ. రా. ౪, ఆ. ౧౫౦. ఆం. భా. ప్ర. ౧౫౪.

నురుఁగుకొను. దే. అ. క్రి. (నురుఁగు+కొను) నురుఁగు కట్టు. "వ...లాలాబిందుర్యానంబులు సెలవుల నురుఁగుకొన..." కవిక. ౫, ఆ. ౧౧౦.

నురుఁగుదబ్బ. దే. వి. (నురుఁగు+దబ్బ.) కారిజము, కడుపులో కుడిప్రక్క నుండు మాంసఖండవిశేషము. (శ. ర.)

నురువు. దే. వి. ఫేనము, నురుఁగు. "క. అపాలనురువు పవన,వ్యాపారముచేతఁ దరలి వచ్చి నిలిచె లీ, లాపింఛచ్ఛవిధ త్రిస్రుత, తాపింఛమదయ మౌళి కటిఁగుచలికుచా." పాండు. ౪, ఆ. ౧౯౨, ఆము. ౪, ఆ. ౧౪౫.

నుర్గాడు. దే అ. క్రి. (నుర్గు+ఆడు) నుగ్గగు. "శా. భర్గుం దంతకవాహినుల్ శరహతిన్ భంజించుచు ట్టైమ్మెయిన్, దర్గంగా రథపత్త్రముల్ విఱుగఁ బె దండాంకురానీకముల్ నుర్గాడన్ .." కు. సం. ౧౧, ఆ. 33.

నుర్గు = నుగ్గు. (చూర్ణము, పొడి.) "క. నుర్గై విశ్వేశ్వరదో,ర్గర్గశహతిఁ జన్నరిపులనగు విజులింపన్." కావ్యా. ౪, ఉ. ౪౯.

సుర్వా=సురువు. "చ. జలధి మథింపఁగాఁ బొడమెఁ జంద్రముయుం బగుసుర్వముద్ద..." కాళిందీ ౪, ఆ. ౩౦, అచ్చ. కిష్కిం. ౬౬.

సుఱిచియాడు. దే. స. క్రి. (సుఱుచు+ఆడు-స్వార్థమున) సంహరించు. "సీ. ఆమేటి తనదు సైన్యమును బద్మవ్యూహమంగఁ జొకట్టంగఁ బన్ని పాలిక, రథప్రహారప్రవర్తనలచేఁ జీకాకువఱుచుచుఁ గడుఁ జొచ్చి సుఱిచియాడు, వీర కుంజరు..." రాఘవ. ౪, ఆ. ౧౪౨.

సుఱిపిడి. దే. వి. ధాన్యము మొదలగువానిని కాళ్ల మొదలగువానితోఁ ద్రొక్కి నలుపుట. "వ .. సుఱిపిడికిం జొచ్చినప్రబలహాలికునిలీల నేలం బెట్టి కాలం జమరి చంపి తొంటివోవ్రమగంటిమిం జేర్చి యార్చిన .." భార. ద్రో. ౩, ఆ ౨౬౯.

సుఱుచు. దే. స క్రి. 1. ధాన్యాదికమును గాళ్లతోఁ ద్రొక్కి నలుపు. "ఆ. శాలివడలు లంకపాలికిఁ దెచ్చిన, పేటిఁ గూడి యుంక్కుమిగిలి తగిలి, ముంచి వంచి దంచి చించి నొంచి కలంచి, కఱచి విఱిచి చఱిచి సుఱిచి రటులు" రామా. ౫, ఆ. ౨౪౭. మార్క. ౨, ఆ. ౧౦౦; 2. నశింపఁజేయు. "సీ కరిసింహశార్దూలశరభాది మృగముల సుగ్గునూచంబుగా సుఱుచునవియు." కళా. ౬, ఆ. ౮, ప్రభా ౭, ఆ. ౧౫౪.

సుఱుపు. దే. స. క్రి. 1. ధాన్యాదికమును కాళ్లతోఁ ద్రొక్కి నలుపు. "గీ. సుఱిపి తూర్పెత్తి కడలకు బీఱును దిగిచి, గంద్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి." శివధ ౭, ఆ. ౯; 2. ధ్వంసముచేయు. "సీ. శత్రుభూమణసముచ్చయములు సుఱుపంగఁ గదలొత్తు వలంద క్రేంకారములును." హరి. ఉ. ౫, ఆ. ౨౦౯; 3. చంపు, వధించు. "సీ... నిఖలబలము. గీ. సుఱిపి శాత్రవులేఖలు వఱపి భీమసేన మాయన్న బకుని నాలేనిచోట, నట్టు చేసితి గాక నీయలవుఁ జలము, వింక మెఱయంగ వచ్చునె యేను గలంగ." భార. ద్రో. ౩, ఆ. ౨౭౯, హరి. పూ. ౬, ఆ. ౧౯౫; 4. ఖండించు, నఱకు. "లయవిభాతి. తఱిమి పెను రక్కసుల వెఱచఱవఁ బట్టుకొని, బఱబఱగ వే తలలు సుఱిపి యవలీలన్." భా. రా. యు. ౧౪౩౫.

సుఱుమాడు. దే. స. క్రి. (సుఱుము+ఆడు.) 1. పొడిచేయు. "ఉ. కొన్నిటి నప్పళించుకొని కోలెమకల్ సుఱుమాడు..." భార. సౌ. ౧, ఆ. ౧౮; 2. చంపు, వధించు. "క. ఉఱక విరాటబలము పై, గొఱియలపిండునకుఁ గవియుం గోల్పులిక్రియ బిట్టుఱఁ గవిసి నదీసూనుఁడు, సుఱుమాడె వియచ్చరులు వినుతిసేయంగన్." భార. భీష్మ. ౧, ఆ. ౨౯౬, అం. భా. కృ. ౧౨౩; 3. ఖండించు, ముక్కలుచేయు. "సీ. మెను జాంబమున నిడ్డ పసిఁగఁ గొన్నిటి నిరుమంతలుగా సుఱుమాడియాడ." భార. విరా. ౫, ఆ. ౩౫, భా. రా. సుం. ౩౩౩.

సుఱుము. దే. స. క్రి. 1. పొడిచేయు. "చ. .. మఱితరుం విభీషణుండు ..దైత్యులన్, సుఱుముచు రూపుమాపుచును నొంచుచుఁ ద్రుంచుచుఁ జేర్చి కంతముల్, నఱకుచు నొక్కపెట్ట రణమందునఁ గూల్చె నుదగ్రమూర్తియై." భా. రా. యు. ౧౩౬౫; 2. చంపు, వధించు. "సీ.... దక్షుఁడు దూషింపఁ దక్షణంబునఁ గొట్టి సుఱుమట దలఁచిన పెఱపు రాదొ." పార్వ. ౪, ఆ. ౧౦౯; 3. పీడించు. "కళిక. నఱిమి తఱిమి చఱిమి సుఱుమునకుఁ గెల్చినవితకరిక." అప్ప. ౪, ఆ. ౩౨౫. వి. చూర్ణము, పొడి. "సీ. అద్దానిపులు దారుణాశ్మవర్షము మైఁ, గురిసిన నవి నన్నుఁ దరలఁ గప్పెఁ, నేను గులిశాస్త్ర మేసి పాషాణముల్, సుఱుము గావించితి .." భార అర. ౪, ఆ. ౬౮, భార ఆది ౬, ఆ. ౧౬౧, అం భా. ద్వి. ౨౨౦. [భా. కృ. ౧౨౩.

సుఱుముచేయు = సుఱుముసేయు. (చంపు.) అం.

సుఱుముసేయు. దే. స. క్రి. (సుఱుము+చేయు.) 1. చంపు. "ఉ. వాతసుతుండు ముట్టికొని వారి బదల్పడ వ్రేసి యందఱం, జేతులలీల వా సుఱుము సేసె విశృంఖలవిక్రమంబునన్." భార. విరా. ౩, ఆ. ౨౮, నీలా. ౧, ఆ. ౩; 2. పొడిచేయు. "సీ. ఉర్వీధరంబు లొండొంటితోఁ దాఁకించి సుఱుము సేయుచు మనోవసంత." చెన్న. ౭, ఆ. ౧౮౦. భా. రా. అర. ౧, ఆ ౨౦౩.

సులక. దే. వి. (సులంచు ధా.) నారతో పేనినదారము, క్షవ్యూప్రతము. "సీ . పెలఁగుఁ ద్వ్యహ్నాత్రంబు సులక యనఁగ." అం. భా. ద్వి. ౨౯౭.

సులకమంచము. ద్వ. వి. (సులక+మంచము.) సులకతో నేయుమంచము. "ఆ. మలిన మైన సేత

వలంచనైనను నల్లు, లున్న నులకమంచ మెుక్క దంద్రు." వి. పు. ౪, ఆ. ౨౧౫.

నులకకయ్యి. వి. వి. (నులక+కయ్యి.) నులక మంచము. "మ. అహహా బ్రహ్మమువారయే నులకకయ్యిం బ్రెల్లి నిద్రింతురో." శివరా. 3. ఆ. ౯.

నులి దే. వి. (నులియు ధా.) మెలిక, చిక్కు. "సీ. కొమ్మకోజ్జ్వలపదకంబుగఁ బెనఁగొన్న చారుపాశము నులి చక్కఁజేసి." హరి. పూ. ౫, ఆ. ౯, ౯౫. ౧౦, న్క౦. ఉ. ౨౪౨. విశ. 1. అల్పము, చిన్నది. "సీ. బలుగోడలఁ దొసంగు నలిపచ్చ బొడంబు బారుదూలంబులవార మాను, పులుదిండి బాకంబుములగరిమంబు." ఉ. రా. ౬, ఆ. ౭౨౭; 2. మెలికలు గలది. "ద్వి. పులిగోరు సేవకంబులు సందమైన, నులికడియంబులు నూపు రంబులును." నవ. ౪, ఆ. ౧౮౬. పు.

నులించు. దే. స. క్రి. (నులియు. ధా. ప్రే.) నులియఁజేయు, నులుపు. "ఉ...తానును దైత్యు లాపునకుఁ దద్దయుఁ మెచ్చుచుఁ జేర్చి దేవకీ, సూనుఁడు కొమ్ములాడి మెడ ప్రక్కకుఁగా నొత్తి నులించి త్రిప్పి వే, వేసెకిఁ దప్పఁద్రోచుట గుఁ..." హరి. పూ. ౮, ఆ ౫౦.

నులిగొమ్ముమేకము. ద్వ వి. ఇట్టి, మగజింక. "సీ .. నులిగొమ్ముమేక మన పెలయుఁ గృష్ణమృగంబు..." సాం. ని. తిర్య. ౭౪, ఇట్టే నులిగొమ్ములమేకము. ఆం. నం. తిర్య. ౬.

నులిగాయ. దే. వి (నులి+కాయ) దృష్టిదోషము గాలిసోకు మొదలగునవి కలుగ కుండుటకు కట్టెడి కాయ, దిష్టి పూస. "గీ. త్రాట నులిగాయఁ గూర్చి పాదములఁ గట్టు, నుట్టు వేఁపాకు పైఁ జల్లు నిప్పు లతివ, త్రిప్పి యిడుదృష్టిదోషంబు దీఱ బిడ్డలఁ జెంచునపుడు." కాశీ. ౪, ఆ. ౧౧. ఆ. మ. క. ౧, ఆ ౨౬. పు.

నులిగొను. దే. అ. క్రి. (నులి+కొను.) 1. చిక్కు పడు. "సీ. నులిగొన్నమెలఁదిపుర్వులనూలిపట్టు నా నమరెడుముడుతకన్బొమలవలన." కళా. 3, ఆ. ౮3. శుక. ౧, ఆ. ౨౮౭; 2. చుట్టుకొనఁ బడిన దగు, పలుయిక మగు. "క .. పెనగొని గిఱికొనియెను ..నులిగొని నన సాఖ్య లగును పలుయికమయ్యె ననుటకును..." ఆం. శ. ౬.౭.

నులిగొల్పు. దే. స. క్రి. (నులిగొను ధా, ప్రే.) మెలిపెట్టు. "ద్వి. ముదురుజాంజారుమీసమముల నులిగొల్పి" ద్వి. హరిశ్చ. పూ. ౨౦౬౭. పు. చంద్రా. ౬, ఆ. ౮.

నులిజెముడు. దే. వి. (నులి+జెముడు.) చిన్న జెముడుశ్రీ. "సీ నల్లేరునులిజెము డాకుజెముడు." హంస. ౪, ఆ. ౧౦.

నులితడ. దే. వి. మహాబలశ్రీ. "గీ ..గూబతడ నులి తడ, యన మహాబల దనరు వృషాధిరూఢ." ఆం. భా. ద్వి. ౫౬.

నులిపచ్చి. దే. విశ. (నులి+పచ్చి.) కొంచెము కడిసినది. "ద్వి. పసపడ నులిపచ్చి పర్యొద కొంగు, మొనల పానిన పచముల నొప్ప దాని." ద్వి. పరమ. ౪, ఆ. ౨౯౭. పు.

నులిపడు. ద్వ అ. క్రి. (నులి+పడు.) దోఁపుడుపడు. "ఆ. దోఁపువారొ నుటు దోఁచు నులిపడె ననంగ..." ఆం. భా. కృ. ౧౧౬.

నలిపురుగు. ద్వ. వి. (నులి+పురుగు.) కడుపులోఁ బుట్టుచిన్నపురుగు. (బ్రౌ. వా.)

నులిబిల్ల. దే. వి. (నులి+బిల్ల.) చిన్న జైనయొక రకముసీటిపురుగు. "సీ. నులిబిల్ల రొయ్యబిల్ల పురుగు గోఁదురుకప్ప . ఎంద్రకాయఁ జలగ." హంస. ౪, ఆ ౧౮౬.

నులియు. దే. అ. క్రి. 1. పొడియగు. "వ...మిడియు ప్రేక్షణ నలియుకన్నులును నులియువెన్నులును జడియుచెక్కులును .." చంద్రా. ౬, ఆ. ౯3; 2. చలించు, అల్లాడు. "చ. పెరవున సంగమున్ నులియున్నేటుల నిమ్మగఁ దాఁకినప్పు..." భార. శల్య. ౧, ఆ. ౧౭౬. (శ. ర. పా. నుసులు ముద్రి. పా.) కృ. శతం. 3, ఆ. ౭౫.

నులివంక. ద్వ. వి. (నులి+వంక) 1. పల్లకికొంగు యొక్కదోషవిశేషము. "వ ..నులివంక యగ్గి సోఁకుడు .....మొదలుగాఁ గల దుర్గుణంబులు లేక .." ప్రబంధ. ౬౦౫.

నులివడు = నులిపడు. మెలికపడు. "చ. నులివడి వాని దాశి నకనున్ కలదూర్చుట... కోర్వమద్దిలో నిలుచుట . గ్రీష్మకాలసంపలదురు తాప మోర్వక ..." కాళిందీ. ౨, ఆ. ౧౦౮. పారి. ౪, ఆ. ౧౬.

నులివాడు. దే. అ. క్రి. (నులి+వాడు.) కొంచెమొగా వాడు "సీ. నులివాడు నాఁచువజ్జల గొంత్లో

గర్పి కేఁకీల వల్పుగాలి కే తాఁక రొందిని."
ఆము. ౨, ఆ. ౫౩.

నులివాఁడ్డవాడు. దే అ. క్రి. కొంచెమువాడు. "క.
నులివాఁడ్డవాడుచున్నవి, లలిత మహోతరుణ దేహ
లతికలు .." విక్ర. ౫, ఆ ౩౮.

నులివు. దే వి. 1. నులియుట. (శ. ర); 2. అధరణ
విశేషము. "ద్వి. చంద్రాస్య రొరాత్తు, తన కేలి
నులివుమధ్యమునఁ బొంకించి, యరు చెంచి..."
ద్వి. పరమ. ౫, ఆ. ౪౪౧. పు; 3. విధము, రీతి.
"ద్వి ..వాఁడు నారీతి నొందు, నుదువ నేరక
మూఁక నులివున నున్న." ద్వి. పరమ. ౨,
ఆ. ౧౨౬. పు.

నులిపెచ్చ. దే. విశే. (నులి+పెచ్చ.) కొంచెము పెచ్చ
నిది, కదుష్ణము. "చ. తెలినులిపెచ్చరొగిరముఁ
దియ్యనిచారులంఁ దివ్యనంబులున్." ఆము. ౧,
ఆ. ౭౧. ఆం. భా. క్ర. ౮౩.

నులిపెట్టు. దే. స. క్రి. (నులి+పెట్టు) 1. మెలి
పెట్టు. "చ. అవ విని నవ్వి యవ్వికసితాంబుజ
లోచన హైటటొంగు కేలున నులివెట్టుచుం దళు
క్కుచుకృనఁ జాపులఁ జాచి... .." శుక. ౨,
ఆ ౪౭౮. భాగ. ౧౦, స్కం ఉ. ౫౪౪; 2.
గ్రుచ్చు "మ. ధర గంపింప మహాసభాభవన
రత్న స్తంభసంభూతుఁ డై, కరజంబుల్ నులివెట్టి
రక్తకణముల్ గాఱంగ పీడించి ..చెండాడె
నృసింహాకృతిన్." వరాహ. ౮, ఆ. ౨౮.

నులివేఁడి. దే. విశే. (నులి+వేఁడి) కొంచెము పెచ్చ
నిది. "చ...కీరి మనుజాధమ నిచ్చలుఁ దెచ్చు
వంటకం,బును నులివేఁడిమూరలు నభ్యాకముల్
గొనిరా కమాంకృతిన్." విక్ర. ౫, ఆ. ౨౧౮.
భీమ. ౩, ఆ. ౩౬. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౮. పం.

నులుచు. దే. స. క్రి. (నులియు ధా. ప్రే.) 1.
చంపు, వధించు. "సీ...మూగియుంచె నులిచెను ..
గీ వధించె, నచుటటు వమాఖ్యలు .." ఆం. భా.
కృ. ౧౨౩. వరాహ. ౧, ఆ. ౫౨; 2. మెలి
పెట్టు. "సీ మెలకచ్చకట్టుకై మలఁగినపచ్చని
నునుకొంగుడిందుగా నులిచి చుట్టి."హరి. పూ. ౬,
ఆ. ౧౩. భార. భీష్మ. ౧. ఆ. ౨౦౪.

నులుపు. దే. స. క్రి (నులియు ధా. ప్రే.) నలఁగఁ
గొట్టు, నలఁగఁజేయు. "ఉ. గొన్నిటికంఠముల్
నులుపుఁ గొన్నిటికాళులు ద్రుంచు...అన్నిటి
నయ్యులాకము రయం బెనఁగగ వధియించె
భూవరా." భార. సౌ. ౧౮. ఉ. రా. ౨, ఆ.
౭౨. వి. వన్నుగడ.

నులుము. దే. స. క్రి. (నులియు ధా. ప్రే.) 1. మెలి
పెట్టు. "సీ. ధూర్జటి నే మనిదూషించితి
వటం చుఁ బుష్పఁబోణి యొకర్తు బుగ్గ నులిమె."
పార్వ. ౪, ఆ. ౧౨౧. నిరా. ౩, ఆ. ౬౪; 2.
నలుపుకొను. "సీ. కాటుక కాఱఁ దుంగఁ గన్నులు
నులుముచు పెదలంకన్నిటితో పెగడువాని."
భాగ. స్కం. పూ. ౩౬౨; 3. పెకలించు.
"సీ. బలిమి వాసవుచెట్టు నులిమి వాకిటఁబెట్టు
కలిమివాలుఁగకంటిచెలిమివాని." చంద్రా. ౧, ఆ
౮౪; 4. నాశముచేయు. "సీ. బాధనంబులఁ
బాహుపంచలు గావించు నొల్లయునాపదలను
నులిమివైచు." సీతారా. ౧, ఆ. ౭౩; 5.
వధించు, చంపు "సీ ..నుగ్గాడె, బరిమూర్చ
నులిమెను దాగటార్చ ..గీ ..వధించె నచుటటు
సమాఖ్యలు..." ఆం. భా. కృ. ౧౨౩; 6.
విదుచు. "సీ. అన నవ్వు డెన్నిక నమరకత్రు
విభీమణుఁడు భీష్ముఁ దనుకంక నులిమివైచి, పలుకుఁ
బంతము మీఱ .." రాఘవ. ౪, ఆ. ౫౩; 7.
పిసుకు, గట్టిగా అదుము. (వా.); 8. ఒడిసిపుచ్చు
కొను, లాగుకొను. "క. అని మరుబాములఁ బడ
లే, నని కైదువు దుస్సి దాఁటు నాయికము
బలెన్, బెనఁగు నలయుఁ ఆరియచే నురియ నులిమి
బలిమి విడిపించి యను నవరక్తిన్." సా. ౨,
ఆ. ౨౩౫. వీర. ౪, ఆ. ౧౪౭.

నులుసు. దే. వి. లోపము, లోటు. "తరలము. నలిన
లోచన...మమ్ముఁ గావుము భీతులన్, నులుసు
లేక ఫలించె నోచిననోములెల్లను నీవ యై."
భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౦.

నుల్లింద. దే. వి. వృక్షవిశేషము. "వ...మణిరయుమం
బెదపిచ్చి చిరపిచ్చి నల్లింద నుల్లింద యిప్ప కర్పూర
మద్ది .." పి. కథం ౨, ఆ. ౧౪.

నువల్. సం. శత్రు. నుతించుచున్న.

నువు = నువ్వు. సస్యవిశేషము. "సీ. ఎడ లేదు
నువుగింజ యిడఁగ సప్తద్వీపములయందు యూధ
ముల్ పొదలుకతన." నీలా. ౨, ఆ ౧౫, రా.
వి. ౩, ఆ. ౪౮. బ. ధాన్యవిశేషము. "ఆ.
ఘటము గాన్గఁ జేసి కరణ మెద్దుగఁ జేసి తవిలి

కర్మములను నువ్వులఁ జేసి తెలిసి గానుగాఁడు తిలకారుఁ డాత్మయు..." వేమన. ౨, భా. ౨౫౫.

నువ్వు. దే. వి. తిలసస్యము. "ఆ. నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వనిసాసిక . " విజ. ౧, ఆ. ౪౪, భీమ. ౩, ఆ ౫౭. ౨ ధాన్యవిశేషము. "ఆ. నూనె లేని దివ్వె నువ్వుల మందుసా... .." వేమన. ౧, భా ౩౪౦.

నుసము. దే. వి. కసరు. "ద్వి. బలవంత మగువిధి ప్రాణేశుఁ బాసి, వలవంతఁ జెందిన వరవధూ మణికి... పూఁబోదరిండ్ల క్రంతలు వంతలు కమ కమనీయసరసి, బిసములు నుసములు పృథుమక రంద, రసములె విసములు .." ద్వి. పారిజా. పూ. ౨౫౨౭. పం.

నుసలు. దే. అ. క్రి. 1. అలసించు "ఆ. నొడివినంత వట్టు నుసలక యిచ్చుచో, చేల కట్టు విష్ణుఁ డేటి మాట." భాగ. ౮, స్కం. ౫౮౪; 2. కదలు "ద్వి. చాల నీతనివల్ల సత్యంబుకొలఁది, నూలి పోఁగునఁ జిక్కి నుసుల కున్నాఁడ" ద్వి. పారిజా. ఉ. ౧౫౨౭ పం; 3. వినయు, ప్రమాద మొందు. "ద్వి. కుడికవ్వు వాతవ్వు నుసలక వత్య మెదలింపఁ గనివట్టు కొపుడుఁ గౌశికుఁడు" ద్వి. పారిజా. ఉ. ౧౪౪. పం. ద్వి పారిజా. ఉ. ౧౫౪౨; 4 వ్యతిరేకించు. "క... వశి, నుసలక మతి నామనను ననుసరింపఁగ దే." గాథే. ౧౫౭. స. క్రి. కట్టుకొను "మ. పెసరుం గాయను మెక్తకన్నులకు నై పేటాడు మన్గొల్లలన్, నుసలం జూచుచు దోసచేల్ చెఱకుచాల్ నుగ్గాడుచున్ ." రా. వి. ౧, ఆ. ౬౫

నుసి. దే. వి. 1. పురుగులు తొలువఁగా రాలు ప్రాని పొడి. "చ ..అప్పుడు తుక భ్రూలతాధనువు పుట్టి మనోభవుఁ డింతనుండి యుక్, విడుచునకాని మానఁ డిగిని కృముఁ పట్టదకీటజాష్ట మై, యుండు గక కమ్మధూళి నుసియొల్కుచు నున్న పురాణ చాపమున్." నైష. ౫, ఆ. ౧౨, ఆము. ౪, ఆ. ౧౪౧; 2 బూడిద. (వా) బిణ నుసి ట్టినది ప్రాంతది. "ఉ ఈనుసివి ల్లోక పెద్దకొండగాఁ, జూచెద రెల్లవారు నది కూలిక గా కిట సాను లక్ష్యమే." రామా ౪, ఆ. ౪౪.

నుసిపురుగు. ద్వ. వి (నుసి+పురుగు) ప్రాతతొలిచి నుసి రాల్చెడి పురుగు. (శ. ర. ప్రా.)



నుసుఁగు. దే. అ. క్రి. తిరస్కరించు. "గీ. అన్నకం నుఁడు నుసుఁగు వైఖానసులను, అదురాత్ముండు శ్రోత్రియుల సకహసించు, శాఖలుండు పోడు యాజి నిరాకరించు, నక్కరాతుఁ డనుష్ఠాత ధిక్కరించు." నైష. ౭, ఆ. ౧౩౦.

నుసుమ. దే. వి. ఎండకాలమునందు కన్నులపై ముసరెడు చిన్నదోమ. (శ. ర. ప్రా.)

నుసుము. దే. స. క్రి. లాగు, ఆకర్షించు. "వ .. చరణాంగుళి దంశికలం బట్టి నుసిమి నమిట్టిపడి యిట్టట్టు గదల కేరక..." వసు. ౪, ఆ. ౨౩.

నుసులు దే. అ. క్రి. 1. కదలు, చలించు, "గీ... మధుఁడు సారంగధరుఁడు మన్మథుఁడు విధుఁడు, మసులపాఁకర కై వీరు నుసులనీయ, రెటుల నిటు తాళఁగల దని తొలఁగ వైతి." సా. ౨, ఆ. ౧౬; 2. పూను, యత్నించు. "క . ఏ నుఁగుఁ గంబంబునకుఁ బెనియ నుసిలితిమినుమీ." రామా. ౨, ఆ. ౧౧౩; 3. (ఒదలు) విఱుచుకొను. "చ.. నిద్రచేఁ, గనరినయట్లు నుత్కరము గబ్బిచనుంగవ పైఁ దార్చి మై, నుసులుచు నీవి జార్చిన మనో హరలీలల కన్న కల్యమే." కళా. ౪, ఆ. ౬౨; 4. ఒదుఁగు, ముడిఁగియుండు. "మ. గదలన్యోన్య సమాహతిన్ మిడుఁగురుల్ గ్రక్కంగ సారించుచుం, గదియం బాయఁగ పేటు గప్పు నుసులంగా చేర్పు లంగంబులం, దొదవన్..." భార. ద్రో. ౧, ఆ. ౧౫౯; 5. నలుపు (చూ. నుసులుకొను) వి. 1. ఒదుగుట. "వ... అవ్వడమూడి పుడమిజేని వెడఁదయురం బుపలక్షించి లాఘవ ఘోరంబుగ గదాదండంబుఁ ద్రిప్పి వైవ నాతం డది మేని నుసులునం దప్పింప నది యిల చలింపం బడిన నన్నుసులు తెలిసిన యుక్తికి యద్భుత వేగుం డగునవ్వాయుపుత్రుండు .." భార. శల్య. ౨, ఆ. ౨౬౭; 2. వెనుదీయుట, జారు. "వ... నుసులు లేక మానంబు మనంబునకు ధనంబుగా వనంబునం గార్చిచ్చునం గమిరినయట్లు రూపునెడి పీచుంగుపెంట లగుచొట్ల పరంబులు రాలినను శిరంబు వంపక..." ఉ హరి. ౩, ఆ. ౪౦.

నుసులుకొను. దే. అ. క్రి. (నుసులు+కొను) నలుపు కొను "గీ. చంద్రశేఖరుఁడు ముఖకాంతి నవలీ కనులు, నుసులుకొంచును మేల్కాంచి నుసలఁ జొచ్చె." చంద్రాభి. ౩, ఆ. ౧౩౫.

## నూ

నూ. వృత్తియందు నూవుశబ్దమునకు లుప్తరూపము. (చూ. నూఁబువ్వు. మొ.) [(శ. ర.)

నూఁక. దే. వి. (త. నూక్కం.) వృక్షవిశేషము.

నూఁకు. దే. వి. భూనిక, యత్నము. "సీ. చిఱుత నూఁకుల నింగి జేర్వారు గేహపక్రముల విచ్చిన రేకప్రాఁకి ప్రాఁకి." కళా. ౧, ఆ. ౧౨౦.

నూఁగారు. దే. వి. (నూఁగు+ఆరు.) రోమావళి. "ఉ. ..అరమణీలలాము ..వలిచన్నులఁ జిన్ని మోము నూఁగారుఁ గృశోదరంబు వలకావలి యందం బొలుపొందఁగా..." వా. రా. ౫, ఆ. ౧౨౬, ఆం. భా. ద్వి. ౧౪౭.

నూఁగు. దే. వి. 1. కొన్నియాకులు, కాయలు, తీఁగలు, ధాన్యము మొదలగువానిమీద చిన్న ముండ్లవలె నేర్పడుసూక్ష్మావయవ సమూహము (దీనియామ్రేడితరూపము నూఁగునూఁగు, నూనూఁగు) "సీ. తాఁగ రాయంచలు నూఁగారుఁ బెరిఁగిన బిసములు దమపాలఁ బెట్టికొనఁగ" కళా. ౨, ఆ. ౮౦, నిర్వ. ౬, ఆ. ౫౧, 2. రోమాంకురము, క్రొత్తగా బయలుదేరినరోమము. "సీ. పెడపెడ నూఁగారి వింత యై యేర్పడు దేరని పలలలో నారు నిగుడ." భార. విరా. ౧, ఆ. ౨౪౫. విణ. లేఁతది. "సీ. నూనూఁగు మీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి." కాశీ. ౧, ఆ. ౭, దశా. ౮, ఆ. ౨౧౨.

నూఁగుటారు = నూఁగారు. "సీ. కమలోద్భవస్ఫూర్తి సుముఖాంబు భరయింప హరిలీల నూఁగుటారతి కయింప." ఇందు. ౨, ఆ. ౨౯౧.

నూఁగుడు. దే. వి. కొన్నియాకులు, కాయలు, తీఁగలు, ధాన్యము మొదలగువానిమీఁద నేర్పడియుండు సూక్ష్మావయవసమూహము. "క. . బ్రదికెదు నంతకుఁ బురుషుఁడు, బ్రిదులక నిలువెల్ల వగలఁ బొరఁగొనియుండుక్, గుదురుకొని దూది నూఁగుడు, పొదివినకార్పాసబీజమునకుం బ్రతి యై." కవిక. ౫, ఆ. ౧౧౮. (శ. ర. పా.)

నూఁగుదోస. దే. వి. (నూఁగు+దోస.) కూఁతురు బుడమకాయ. (శ. ర.)

నూఁబిండి. ద్వ. వి (నూవు+పిండి.) నువ్వులపిండి "సీ. ఉంబ్రాల్ల నూఁబిండి పుండ్రేక్షులుం దేశ యనఁటిపండ్లు..." హర. ౬, ఆ. ౫౫.

నూఁబువ్వు. దే. వి. (నూవు+పువ్వు.) నువ్వుఁబువ్వు, తిలపుష్పము.

నూఁబూవు = నూఁబువ్వు. "వ...నూఁబూవువంటి నాసికయు..." హర. 3, ఆ. ౨3.

నూక. దే.వి. తండులాదిక ఖణ్డసముదాయము.(వ్యవ.) గోధుమనూక. బ. తండులకణములు. "సీ. ధాన్య శకలములు దనరునూక లనంగ." ఆం. భా. ద్వి. ౨3౯, ద్వా. ౨, ఆ. ౧౭3.

నూకించు. దే. స. క్రి. (నూకు ధా. ప్రే.) త్రోయించు. "గీ ..అబ్బురపుఁగినుకఁ, గెరలివడిఁ దన్ని వెడల నూకించె నిందు." అచ్చ. యు. ౭౨.

నూకు. దే. స క్రి. 1. దాఁటు. "ద్వి. చనియెను గోదను నూకికొని యందమేని, చనుచోట గోద నూకిన చొప్పు లేదు" పండితా. దీక్షా. ౪౪, పు. 2. త్రోలు. "మ ..ఏటలనికిగ్ వాహంబు నూకి రసావల్లభుఁ జేసె భల్లమున .." స్వా. ౪, ఆ. ౪౪, రామా. ౮, ఆ. ౧౬౫; 3. త్రోయు, గెంటు. "వ...ఈబ్రహ్మచారి శంకరునిగురించి యింకను వంకరటొంకరమాటలాడ నుంకించు చున్నాఁడు ఇతని మెడపట్టి నూకుం డనిపలికి కోపావేశంబున." హర. ౪, ఆ. 33; 4 పడఁ ద్రోయు పడఁగొట్టు. "మ. పురముల్ గూలఁగఁ ద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారముల్, ధరణిం గూల్చి .." భాగ. ౧౦, స్కం. ఉ. 3౯౮, సుద. ౫, ఆ. ౮౦. విణ. త్రోయునది. "వ...చిగురాకు తొగరు జిగివగబొగరు నూకుదుగుల జోడించిన పాలవెండి పాగడమ్ములు.." ప్రబంధ. ౭౮.

నూకుడు. దే. వి. (నూకు ధా.) త్రోపుడు. "చ... కిట్టడీక థే, నుకములపై ఖరిం గపులనూకుడు భంగిని భైరవాశ్మయు, గ్మకములరీతి సింహముల కై వడిఁ బోరి రనూనచాతురిన్." హంస. 3, ఆ. ౨3౨.

నూగు=నూవు. (శ. ర. నూగులు ధాన్యవిశేషము అని. బ్రౌ.)

నూచే. దే వి. 1. పొడి, చూర్ణము. (ఇది నుగ్గునకు మఱొకగలిసిమె ప్రయోగములలోఁ గానవచ్చు చున్నది. నుగ్గు అనునది అపుడక్యంతార్థము నిచ్చును.) "ఉ. కొన్నిటి హస్తముల్ చదియఁ గొన్నిటిఁ గొమ్ములు దుమ్మ్ముదూళిగాఁ గొన్నిటిఁ

గంధముల్ బగులఁ గొన్నిటిఁ గాఁచల నుగ్గు నూచగా...'' అన్నిటి భీముఁ డుక్కటగదా హతి నేలకఁ జేఁట రాడఁగన్.'' భార. భీష్మ. ౨, ఆ. ౨౨౧, భాగ. ౧౦, స్కం. ఉ ౮౮౦.

నూచేము = నూచ. (శకలము ముక్క.) ''క.. పెల్లుబ్బెడు గబ్బి మెఱుఁగు చన్నుబ్బలచే రవికె నుగ్గునూచము లయ్యెన్.'' రా వి. ౩, ఆ. ౧౩౦. పొడి, చూర్ణము. ''మ ..వేదచోరపురవప్రశ్రేణి కల్ నుగ్గునూ, చముగాఁ దాఁకె సుధాశనాన హనయోషాగర్భనిర్భేది యై.'' దశా. ౧, ఆ ౨౪౪.

నూటిడి. దే వి. భేత్యారిశేషము. ''మ. ఇడి రమ్మాని యపాకసంబులు మనోభీష్టంబుగా ..నూ, టిడు లన్ దోశెలు నప్పముల్ సుకియలున్ హేరాళ మై కన్పడన్'' రామా. ౨, ఆ. ౧౧౫, హైమ. ౮, ఆ. ౧౯౮.

నూతనము. సం. విశే. (అ. ఆ. అ) 1. క్రొత్తది; 2. వింతయైనది.

నూత్నము. సం.=నూతనము.

నూదోస. దే. వి. 1. నూఁగుదోసకాయ (శ. ర.); 2. రేణుకలు ..ఆం. భా. ద్వి ౬౧, ఆం పద. ఆచర. ౪౩.

నూనియ. ద్వ. వి (నూవు+నేయి.) తైలము, నువ్వులచమురు. ''క. ..జనవాదము నిండె సర్వజగతీస్థలిఁ గెద్యన నూనియ కారసిన క్రియ, బెనఁగొని నేత్రమున నవిరి వెసిగినకరణిన్.'' సాంబో. ౩, ఆ. ౩౬, భార. అను. ౨, ఆ. ౩౦౮.

నూనె = నూనియ. 1. తైలము నువ్వులచమురు. ''సీ. జడగట్టుపెన్నుఱుల్ విడిచి పెట్టినవాఁడు వీని కిచ్చుటనుండి నూనెఁ దెచ్చు.'' పార్వ. ౪, ఆ. ౯౮, ఆం. భా. ద్వి. ౨౫౮; 2. చమురు కలుఁగఁజేసెడు విత్తులు గలచెట్టునకు పిదప వచ్చినపుడు చమురు అనునర్థ మిచ్చును. ఉదా;—కొబ్బరినూనె, వేపనూనె. మొ)

నూనెముంత. ద్వ. వి. గుచ్ఛలలకీ. ''గీ. నూనెముంత యనంగను నొప్పుగుచ్ఛ, బలయు...'' ఆం. భా ద్వి. ౫౪.

నూనెముడి. ద్వ. వి. (నూనె+ముడి) కీలుగంటు, కాఱుముడి. ''గీ. అపుడుఁ జెలియలు మధురోక్త లాడుచున్నఁ, బడఁతి యొక్కర్తు మిగుల నేర్పరి సుగంధ, తైలమున నింతి తలయంటి తార్చి తీర్చి, నూనెముడి సంఘటించెను నూనెముడికి.'' కాళిందీ. ౫ ఆ. ౯౧, ఆం. భా. ద్వి. ౧౪౫.

నూనెకసుగిసె. ద్వ. వి. నల్లగిసె, అకసిశి. (శ. ర.)

నూపురము. సం. వి. అ. పుం. మంజీరము, అందె.

నూయమానము. సం. విశే. (అ. ఆ. అ.) నుతింపఁబడుచున్నది.

నూయి. దే. వి. ఔ. చేఁదుడుబావి, కూపము. ''క. అనఘ యధర్మము ధర్మం, బనుమతిఁ బుట్టించుఁ దృణసమావృత మై ప్రచ్ఛన్నవిశలముచందమునఁ దోఁచినసూయిందో లె మూఢచిత్తత లేమిన్.'' భార. అను. ౫, ఆ. ౪౦౯. భార. ఆది. ౪, ఆ. ౯౩.

నూర్గొనలకట్టెము. ద్వ. వి. వజ్రాయుధము. ''వ... నూర్గొనలకట్టెంబువట్టువేల్పుఁ బలుకన్ గట్టిన గోపురంబు డాసి ..'' ఉ. రా. ౩, ఆ. ౨౨.

నూర్వురు దే. స. (నూఱునకు మహాన్మహత్వార్థక రూపము.) శతసంఖ్య కలవారు. ''సీ. అతనికి నూర్వురు సుతులు బుట్టినాదు లుదయించి రఖిల భూవిదితతేజు లు...'' భార. ఆది. ౩, ఆ. ౪౦.

నూఱంచులకైదువు. ద్వ. వి. వజ్రాయుధము. ''ఉ. మించినపేర్మి నేయొదల మిన్నులుముట్టి వెలుంగు వట్టి నూ,ఱంచులకైదువున్ దృణకణాకృతి యై వెడఁబాయఁ జేర్చి దర్పించిన ధీరచిత్తములు...'' నృసిం. ౨, ఆ. ౪౬. (ఇట్లే: నూఱంచులవాలు. ఆం. సం దేవ. ౧౭.

నూఱాఱు. దే. స. (నూఱు+ఆఱు.) అనేకము. ''సీ పాతలోఁ బ్రత్తి విచ్చుమలెత్తి నూఱాఱు వగల జున్నిదములు వడికి వడికి.'' శుక. ౪, ఆ. ౧౦౯. శశాం. ౨, ఆ. ౨౪. ఇట్లే:నూఱార్లు. రామా. ౪, ఆ. ౧౨౯.

నూఱిపిడి = నుఱిపిడి. (శ. ర.)

నూఱిపోయు. దే. స. క్రి. (నూఱు+పోయు) బాగుగా బోధించు. ''క. తనయులకును మనుమలకును, దనచేరుపు నూఱిపోసి ..''కళా. ౩, ఆ ౧౨.

నూఱు. దే. స. క్రి. 1. సన్నకంటు మర్దించు. ''ఉ. నూఱక క్రొవ్వు నణఁడు కనుంగొను నంతటిపో మసుమ్ములన్.'' కాశీ. ౩, ఆ. ౨౦౫. హ. న. ౪, ఆ. ౧౪; 2 రాచు, నలఁచు. ''ఉ. సన్నఁదనంబుగా నలుఁగు నూఱియుఁ జందనమట్లు రాచి

యమున్." భార. విరా. ౨, ఆ. ౨౨౨; 3. ఆయుధములు మొ. పదునెక్కుటకు వాలివీఁద ఒరపెట్టు. "గీ. మదనుఁ డమ్ముల నూఱె హిమంబు పేర." స్వా. ౩ ఆ. ౨౩. ఉ. రా. ౫, ఆ. ౨౩౭. స. వి. శతము, వంద. "చ. నతజల పూరితంబు లగు నూతులు నూటికంటె సూనృత వ్రత యొకబావి మేలు .." భార. ఆది. ౪, ఆ. ౭౩. హరి. పూ. ౪, ఆ. ౧౧౪.

నూఱుగురు. దే స. వందమంది. "వ ..గంధర్వదేవ మానవకన్యలం బదాఱువేలు న్నూఱుగుర నప్ప రోగణంబు లేడింటిం జెఱలుపట్టి..." ఉ. హరి ౧ ఆ. ౭౪.

నూలిగరసు. దే. వి. బట్టతల, ఇంద్రలుప్తకము. "సీ ..ఇంద్రలుప్తకం బగు నూలిగర సం చనఁ గను..." అం. భా. ద్వి. ౧౨౯.

నూలు. దే. వి. ఓ. 1. ప్రత్తివడికినపోఁగు, దారము. "చ. .కలువతండము మొల్లలు నంచు మిన్ను గ్రుచ్చి రహిని రిత్తనూలొ వఁగి సిగ్గు వహింతురు పువ్వుఁబోడికల్." ఆము. ౨, ఆ. ౨౦. అం. భా ద్వి. ౫౯౫; 2. తామర మొ. వానిలోనిదారము. "ఉ. .కౌనుఁదీగె లేనూలను జన్నుమొగ్గలు గనుంగలిదమ్ములు మోవిచేరియుం, జాలగు నవ్వుతేటయుం భుజాబిసవం ల్గని యవ్విలాస పాంచాలుఁడు ప్రేమఁ బన్నిని నిజప్రియఁగా మదిలోఁ దలంచుచున్." సా. ౨, ఆ. ౧౫౭ క్రీడా. ౨; 3. మొలనూలు.

నూలుకొను. దే. అ. క్రి. 1. చక్కఁబడు, సరియగు. (చూ. నూలుకొలుపు.); 2. స్థిరపడు. "క. మనసు సరస్వతిఁ గనుఁగొని, జననీ నామనసు శోక వంత పనుచున్, బోనుగుపడి వివేకమునఁ గొనఁగొఱయై చాల నూలకొన దని పలుకన్" ప్రబోధ. ౫, ఆ. ౧౭; 3. పూనుకొను. "వ .. యజ్ఞాదికృత్యంబులు ధనసామగ్రి లేక నడప రాదు ధనంబు గలిగియుండియు లోభంబున పుంసా రులు తత్కృత్యంబులకు నూలుకొనరు ....." వరాహ. ౭, ఆ. ౨; 4. ప్రతికొను. "గీ. బీఱు పోయి రథ్యంబులు మాఱుమొఁగము, వడినఁ దా నొచ్చియుండియుఁ దడవి తేరి నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్ర, భల్లమునఁ గ్రీడి భీష్ముబవిల్లు దునిమె." భార. భీష్మ. ౩, ఆ. ౨౫౬.

నూలుకొలుపు. దే స. క్రి. (నూలుకొను ధా. ప్రే.) 1. చక్కఁబఱుచు, సరిచేయు. "వ...అలిక దేశంబువం గలయఁబడిన యలకంబులు నూలు కొలిపి." ఉ. హరి. ౫, ఆ. ౧౩౦; 2. ప్రసరింపఁ జేయు. "సీ. హరిణాక్షి లసదపాంగాలోకనము నూలుకొలుపుడు స మ్మరిఁగొలిపె మరుఁడు." కు. సం. ౫, ఆ. ౩౬. వరాహ. ౧౦, ఆ. ౫౪; 3. కలిగించు. "గీ. ఎట్టకేలకు ధైర్యంబు హృదయ మునకు, నూలుకొలుపుచు సంస్కారుఁడు ....." వరాహ. ౫, ఆ. ౪౪.

నూలుకొల్పు=నూలుకొలుపు. 1. (పురికొల్పు, ప్రేరించు.) "ఉ . ఈనృపులుఁ దమ్ములు' సేనను జుట్టిరాఁ జమూమండలి నూలుకొల్పికొని మార్తురనోర్చినఁ గాక యొప్పునే." భార భీష్మ. ౨, ఆ. ౧౫. 2. (స్థిమితపఱుచు, కుదురుపఱుచు.) "చ. మనసుల నూలుకొల్పి యనుమానము తెల్లను బాచి .." భార. విరా ౪, ఆ. ౧౭౭. 3. (అంగీకరింపఁజేయు.) "ఉ మిక్కిలి మిక్కుటంబగు తమిన్ రతికిన్ సతినూలుకొల్పుచున్ .." కళా. ౭, ఆ. ౧౫౭.

నూలుకోలు. దే. వి. (నూలుకొను ధా.) నూలు కొనుట. (శ. ర.)

నూలుపట్టు. దే. అ. క్రి. (నూలు+పట్టు.) దారము ఉంచి నూటి యగునట్లుచేయు. "గీ కర్తికా రాంబికా మహాశాంభిణికి, నందముగ నూలు పట్టినచాయ, సూర్యవీథికిఁ జని సంశుద్ధమతులఁ, బళ్ళిమ ద్వారమునకునై పరమమునులు." భీమ. ౩, ఆ. ౫౯.

నూల్కొను=నూలుకొను. దే. అ. క్రి. 1. పురికొను. "గీ వెడలి తమతమ చతురంగ వితతులెల్ల, నుచిత గతి నూల్కొనంగఁ జేయుచుఁ గడంగి. సంగరో త్సవ సంభృతోత్సాహు లగుచు." భార. భీష్మ. ౧, ఆ. ౭౭; 2. చక్కఁబడు. "చ. కనుఁ గొని ఫల్గుణుండు దురగంబుల వాగెలు పట్టి యొత్తితత్తనువులు నూల్కొనన్ నిలిచి......" భార. విరా. ౪, ఆ. ౧౭౪; 3. ఒప్పుకొను. "చ . బాలతంబునఁ బటు రోగ దుఃఖములఁ బొందుచు నొప్పెలు లిట్టు లుండఁగా, మనసిజ భోగ లీలలకు మానవ మెప్పెయి నాకు నూల్కొ నున్." మార్క. ౫, ఆ. ౫౦; 4. జాలువాఱు. "చ...గురుతర నవ్యవేతస నికుంజము రంతలు

చోట...నవారవింద బంధుర మకరంద తైలములు నూల్కొనుచోట .. .." వసు. 3, ఆ. ౨౨; 5. సన్నుతమగు. "చ .ఏను కామధేనువ నిను మెచ్చితిన్ మదికి నూల్కొను నిష్టము వేడు కొమ్ముడున్." ద్వా. ౧౦, ఆ. ౫౮; 6. స్థిరపడు. "చ...నీమది కార్యవృత్తి నూల్కొనియె సుయోధనుం గొని యకుంఠిత నిశ్చయమై..." భార. ఉద్యో. ౨, ఆ ౯౭; 7. వ్యాపించు. "ద్వి. ఓరువ రాక దిట్టోకిలిం తొడవ, నోర మద్యపుగంపు నూల్కొనంబలికె." ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౦౨. పం; 8 సంభవించు, కలుగు. "ద్వి. ఇల యేలఁగా లేని యీ రామ లక్ష్మణుల చేత నే కీడు నూల్కొను నింక." రం. రా. యు. 3౨౬. ప్ర. స. క్రి. 1. స్థిరపడుచు "చ. పలికిన సేమి యున్ని కుంను పల్కనగున్ మనరాజునొద్ద మూర్ఖులికెదు వారు లేరు నిను పాండవమధ్యము గాండివంబు దీప్తుల మింట మిట్టు గొన్న కను దోయి గుణ ధ్వని ప్రయ్యలైన వీనులు నయిన బలేపలుకు నూల్కొన కుండుదు సూతనందనా." భార. ఉద్యో. ౪, ఆ. ౪౧౮; 2. సమ్మతించు. "మ. ధన మద్యన్ని ధనంబు, దేహము వినశ్వంతాన గేహమ్ము ..ఇ ట్లెఱిఁగి నూల్కొ లేరు ప్రాజ్ఞుల్ కటా, యనవ ధ్యాత్మ సమేధమాన సుఖ సద్యావృద్యసంచార ముల్." ప్రబోధ. ౫, ఆ. ౩౭

నూల్కొలుపు = నూలుకొలుపు. చక్కఁబఱచు, పొందుపఱచు. "మ. లలనారత్నము నొయ్య నొయ్య మెయిప్రేలన్ వేల ప్రాయించి నిశ్చల వృత్తిన్ వరవర్ణపూర్ణఫలకాసంగంబు నొందించి మిన్కులు వేమాఱుఁ దదర్థచింతనలతో నూల్కొల్పి సొయ్యంపు టొజ్జలు పైపై సొనయింప సాగెఁ బటు శాస్త్రశ్రేణి కాభ్యాసమున్." వసు. 3, ఆ. ౧౦౦.

నూవు = నువ్వు. సస్యవిశేషము, తిలసస్యము. "సీ .. తిలసంజ్ఞ నూవనఁ దేజరిల్లు."ఆం. భా. ద్వి. ౨౩౬.

## నృ

నృ. సం. వి. ఋ. పుం. నరుఁడు, మానవుఁడు (దీనికిఁ దెనుఁగునస్వతంత్రప్రయోగము లేదు.)

నృకేసరి. సం. వి. ఇ. పుం. నరసింహమూర్తి, విష్ణువు.

నృతి. సం. వి. ఇ. స్త్రీ. నాట్యము.

నృత్తము. సం. వి. అ. న. అంగప్రత్యంగములచే భావమును దెలుపని ఆడెడియాట.

నృత్తశాల=నృత్యశాల.

నృత్తప్రియము. సం. వి. అ. పుం. నెమలి.

నృత్యము = నృత్తము.

నృత్యశాల. సం. వి. ఆ స్త్రీ. నాట్యమందిరము.

నృపతి. సం. వి. ఇ. పుం. 1 ప్రభువు; 2 క్షత్రియుఁడు; 3. కుబేరుఁడు.

నృపత్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. రాణి; 2. మనుష్యుని భార్య.

నృపమానము. సం. వి. అ. న. రాజుయొక్క భోజన కాలమును దెలుపు వాద్యభేదము.

నృపలక్ష్మము. సం. వి. న్. న. రాజులకు పట్టెడు తెల్ల గొడుగు.

నృపాంశుఁడు. సం. వి. అ. పుం. రాజకుమారుఁడు.

నృపాభీరము. సం.=నృపమానము.

నృపాలుఁడు. సం.=నృపతి.

నృపుఁడు. సం. వి. అ. పుం. రాజు, ప్రభువు.

నృమేధము. సం. వి. అ. పుం. మనుష్యుని పశువుగా నేర్పఱచి చేయుయాగము.

నృలోకము. సం. వి. అ. పుం భూలోకము.

నృశంసుఁడు సం. విశే. (అ. ఆ అ.) ఘాతుకుఁడు, మనుజులను హింసించువాఁడు.

నృసింహము. సం. వి. అ. న. 1. రతిబంధ విశేషము; 2. ముప్పదిరెండు విన్నాణములలో నొకటి. "వ...గళకర్తరియుఁ గాసె నిల్కడయుం నృసింహంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణముల నాణెంబు పరీక్షించి .." హంస. ౧, ఆ. ౧౦౬, ప్రబంధ ౪౮.

నృసింహుఁడు. సం. వి. అ. పుం. విష్ణుమూర్తి.

నృహరి. సం. వి. ఇ. పుం. నృసింహమూర్తి. "కు. నృహరీ వాదము లేల లేర యితరుల్ నీలీలకుం బాత్రముల్." ఆము. ౨, ఆ. ౭౧.

## నె

నె. దే. వి తెలుఁగుశబ్దమునకు లుప్తశేషము. (దీనిమీఁది హల్లునకుద్విత్వము వచ్చును. చూ. నెక్కొను ము.) విశే. నెఱ నెటి శబ్దములకు కొన్ని హల్లులు పరమగునపుడు. వృత్తియగు దంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి కొన్ని రూపాల

నుగాగమును కొన్నిచోటుల దీనిమీఁది హల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా. కొమ్మది, కొచ్చెలి కొన్నడుము, కొమ్మేను. మొ.)

కొంజెలి. దే. వి. మనోవ్యథ, అధి; ఖేదము. "చ. .. అచటయుం బంభ్రమంబడర నంగనతొల్తటి నాటి యామినిం, దనకని పండి డించికొని నాథుఁడు వల్లియకేఁగు కొంజెలిం, దనికి ఘటించుకున్ .." పాండు. ౪, ఆ. ౧౭౩, అం. భా. ప్ర. ౧౩౭.

కొందోలు. దే. వి (కొఱ+తోలు.) పెద్దతోలు. "ద్వి. కాయగాచినయట్టిచేయి కొందోల్ల, గోయఁ దాఁకిన యసికోఁతడాచేసు." పండితా. దీక్షా. ౪౦, పు. (ప్రొత్తప్రతిపా.)

కొకబిక. దే. వి. పట్టుదల. "క. ..ఒకని నొకించుక యును సోఁకక యుండఁడే కటారి కొనలు కదు బెట్టు వడిన్, కొకబికలంగఁ బోట్లాడుచు, వికసిల్లెడు నాకడింది వీరులయందున్." కళా. ౮, ఆ. ౧౦౨.

కొక్కర. దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర. ప్రా.)

కొల్కొను దే. అ. క్రి. (కొలవు+కొను.) 1. ఉండు. "క. మొక్కి వినుతింతు దనమది, కొల్కొను కొంగెల్ల నేల కొలఁతుకకన్నీ, రొల్కొక్కబొట్టు మెఱుఁగుం, జెక్కుల దిగ జాఱ గోరఁ జిమ్ముచు హరికిన్" పాంచ. 3, ఆ ౧౬౯; 2. ప్రాలు, పడు. "క. ఇక్కరణి లలిత యదుపతి చక్కని రవణమునఁ జిక్కు వదలింపుచుఁ జక్, జొక్కపుఁ బాగుత్తులమై, కొల్కొనఁగాఁజేసెఁ గన్ను కొలికి తుమ్మెదలన్." కాళిందీ. ౬, ఆ. ౧౮౭; 3. పాదుకొను, స్థిరపడు. "ఉ. నీదగు నాదుచిత్తమున కొల్కొని యుండెడు భక్తిభద్రసం, పాదిని గావు టప్పెరువె .."భార్గ. కల్యా.౧, ఆ. ౨౭౫, భార. ఉద్యో. ౧, ఆ ౨౮౭, భార. అర. ౭, ఆ. ౪౬; 4. తోఁచుడు. "చ...నుూద్ధత వృత్తినదల్చి వెన్నుదన్ని నిలిచె దాన వేశ్వరుఁడు కొల్కొనఁగాఁ దనముద్దుఁదమ్ములున్, దనయులు దండనాథులు నుదగ్రతపేరుడు దర్పమెక్కఁగన్." నిర్వ. 3, ఆ. ౧౩; 5. తగులు, నాటు. "మ.. నుయ వాయవ్యాస్త్ర ముద్వృత్తిగా, గొల్కొన మారీచ నిశాచరుం దన మృగాంకుం దంబురాశిం బడెన్." పా. ౨, ఆ. ౧౮౬; 6. వ్యాపించు, పర్వు. "చ... కొను మంటలు మింట కొల్కొనం, గనదురు విస్ఫులింగములు గ్రక్కుచుపాశనిఁబోలు కూలమున్." భా. రా. అర. ౧, ఆ. ౨౪; 7. కలుగు, జనించు. "వ ..అఖిలజనంబులకుఁ బ్రీతి కొల్కొన నతఁ డమ్మహాంబు దీర్చుచు .." భార. భీష్మ. ౭, ఆ. ౩౪౪, భో. 3, ఆ. ౧౪౨; 8. అతిశయించు. "ఉ. చప్పు ఘటోత్కచుండు మన సైన్యములెల్లఁ గలంగి వల్లద, న్విచ్చుటఁ జూచియేము నగ కొల్కొన వంచదము..." భార. ద్రో. ౫, ఆ. ౨౩౮, ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౮, పం; 9. ఫలించు. "ఉ...ఎవ్విధంబులన్, కొల్కొనకున్న మర్త్యులకు నిక్కము ప్రాక్తన భోగ్య కర్మముల్." హరి. ఉ. ౪, ఆ. ౬౬; 10. నిగుడు. "ద్వి. కొల్కొన్నచన్నులు నిరు పేదనడుము..." రం రా. ఉ. ౧౦౦. పు. స. క్రి. పొందు, పడయు. "క. అక్కట సద్ద్విజ జన్మము, కొల్కొనియును జేసికొనిన కేరమి నిన్నుం, ద్రొక్కొన .." పద్మ. 3, ఆ. ౯౨.

కొల్కొలుపు. దే. స. క్రి. (కొల్కొను ధా. ప్రే.) 1. నిలుపు. "వ ..పాండవాగ్రజా నీమనంబున కొల్కొలుపు మిక్కథ యభిప్రాయంబు." భార. అను. ౧, ఆ. ౮౩; 2. తాల్చు, ధరించు. "సీ. వనమాలికలు పాఱవైచి రుద్రాక్షపూసల పేరు లఱుత కొల్కొలుప వచ్చు." శుక. 3, ఆ. ౮౯; 3. సంఘటించు. "క. . అక్కట దైవము రాజ్యము, ద్రొక్కొని యాలిం దనూజుఁ జాగ నమ్మఁగా, కొల్కొలిపి హరిశ్చంద్రుని, నిక్కడ గాడ్పఱిచె నింక నేఁగతిఁ బోదున్." మార్క. ౧, ఆ. ౨౪౮. [(శ. ర.)

కొల్కోలు. దే. వి. (కొల్కొను ధా.) కొల్కొనుట.

కొగడి. దే. వి. 1. దుష్టమృగములు రాకుండుటకును చలికాచుకొనుటకును వేసెడి మంట. "గీ.... కొగడికిఁ బాచనమున, కింధనము లిచ్చి ధనముల కొనక మెఱఁగు" భార. అను. ౨, ఆ. ౩౮౮, చిత్రభా. ౨, ఆ. ౩౪; 2. అగ్ని. "గీ. ఎపుడు నీవు వనం బాసి యేఁగి తపుడె, నీరసైనను సరిసైన కొగడిసైన, విడుతుప్రాణము..." శివరా. 3, ఆ. ౧౩౦; 3. పిశాచము, దయ్యము. "సీ. గాలి గాము కొగడి. గీ. కొఱవిరాలుపు బాధి సోఁకుడు పిసాసి, దయ్య మనఁగఁ బిశాచాభిధాన ములగు." సాం. ని. దేవ. ౮౯.

నెగడించు. దే. స. క్రి. (నెగడు ధా. ప్రే.) 1. వర్ధిల్లఁజేయు. "ద్వి. మగువఁ బుంసవనసీమంతో త్సవముల, నెగడింపఁదొమ్మిది నెలలు నిండు టయు." ద్వి. భాగ. ౪, అ. ౭౪, పు.; 2. ప్రవర్తింపఁజేయు. "ఆ. నింగి ముట్టినట్టి నన్న జంగమమల్లయు, పరమునందుఁ గవిన వస్తుకవిత, దగిలి వారి యందు నెగడింతురవిశదీ, కమున సర్వ లిచ్చు పనిది దోఁప." కు. సం. ౧ అ. ౪౯.

నెగడు. దే. అ. క్రి. 1. బయలుపడు, ప్రకటిత మగు. "క...ఈ, ఖగపతిసీతావృత్తము, నెగడఁగ వినిపించి చనిరొ విజగృహముసకున్." భా. రా. కిష్కిం. ౭౫౭, భార. విరా. ౧, అ. ౧౪౩; 2. వర్ధిల్లు. "రగడ. నీకను దెలచిన నెగడును జగములు, నీకను మూసిన నిలువవు జగములు." ఉ. రా. ౪, అ. ౯౨. "క. కౌరవులకుఁ బాండ వులకు, వారయ నేనొక్కరూప యట్లగుటఁదగఁ వారును వీరును దమతమ, నేరిమిమెయి ధరణి యేలి నెగడఁగఁజాతున్." భార. ఉద్యో. ౧, అ. ౪౧; 3. ప్రవర్తించు, నడచు. "క. ధర్మ మునఁ దున్న చోటను, ధర్మువునకు హాని గలదె ధారుణి నైనన్, ధర్మువ తాత్పర్యముగా, నిర్మ లమతి నెగడునది వినీతాత్ములరై." భార. ఆది. ౭, అ. ౩౫, భార అర. ౧, అ ౬౯; 4. ప్రసిద్ధి కెక్కు. "చ...దక్షిణ లిమ్ముగ నిచ్చియజ్ఞముల్, నెగడఁగఁ జేసియుం బడయ నేరరపుత్రకులైన దుర్మతుల్." భార. ఆది. ౨, అ ౧౫౦, అం. భా. కృ. ౯౦; 5. యత్నించు. "నీ తొంవమ్మి తూండ్లతోఁ బొందు లీసెడుకొను దిగుడు బావి హసింప నెగడు నాభి." గంధ. ౯౯౯; 6. గర్వించు. "క. తనయింట దినియు యుండఁగ, నను డాయఁ మనందు నెగడి నాతోఁ గొఱమా, లినమాటల నిసుమంతయుఁ, గొనకుండఁగ నాడె నిట్టి కుటిలుఁడు గలఁడే." కేయూర. ౩, అ. ౨౭౯; 7. అతిశయించు, అధికమగు. "సీ. తెలువంబు నెగడఁదీర్చిన క్రొత్తకస్తూరి పట్టెలమేల్తావి మట్టు మీఱ." చంద్రి. ౧. అ. ౧౦౭. చిత్రభా. ౨, అ. ౩౪; 8. కలుగు, లభించు. "గీ. నిల్పి గెల్చిన సత్కీర్తి నెగడుఁ గాక, దవ్వు దవ్వుల నిట్టైన నవ్వ రెట్టు" భార. విరా. ౪, అ. ౬౨, ధర్మ. ౧. ౯. ౮౦; 9. ఒప్పు. "చ...వీణె మీటుచును వేడు బహం తుల యొద్దను గదుర్, నెగడెదు నిండు గర్గె నని శమ్మది మెచ్చుచు వచ్చెఁ జెప్పరన్." కళా. ౩, అ. ౧౬౭; 10 వ్యాపించు. "గీ. నింతె నెగడె వెలసెఁ బర్వె నిగిడె ననఁగ, వ్యాప్త మయ్యెడి నను పేర్లు కలరు సాంబ." సాం. ని. మాన. ౫౦. వి. తంతువాగము, క్రూరజలజంతు విశేషము. "గీ. ఊఁతయులజల్లఁ జెఱువుల నుండ రాక, కార్మొసట్లు నెగడ్లను గవులు విడిచి, తరలి చెంతల మాతిగుంతల వసించె." వేం పంచ. ౧, అ. ౨౬౪. అచ్చ. యు. ౩.

నెగడ్త. దే వి. (నెగడు ధా.) ప్రసిద్ధి. "క. జల జార్యంతక కశ్యప, కులభామినులై నెగడ్తకుం గని బహుంపు, కుల్ఁ బడసి పేరుకొను కూఁ, తులఁ జూడఁగ నరిగె నతి కుతూహల బుద్ధిన్." కు సం. ౧, అ. ౧౧౧, ౩. అ. ౧.

నెగపు = ఎగపు. (శ. ర.)

నెగయు = ఎగయు. దే. అ. క్రి. 1. ఎగురు. "క. నెగయుచు నెగసి పిఱుందం, దగిలెదు మిడుఁ గుఱుల చేత దగ్ధచ్ఛదమై, గగనమునఁ బఱపఁబోవుచు, ఖగ నివహము వహ్ని యందు కడు వడిఁ బడి యెన్." భార. ఆది. ౮, అ. ౨౬౪ భార అను. ౩, అ. ౨౪౬; 2. పైకి లేచు. "ఉ. దాని నెఱింగి యొంతయు నుదగ్రత నా బకవైరి గ్రక్కునన్, వానినడంగఁబట్టి పడవైచి మహో గ్రత నాక్రమించెఁ బం,చానన మేణముం బొదువు నట్లతఁ డూర్జితశక్తి నుద్భటుం,డై నెగ సెన్ సమీరసుతు నల్కుఁ బ్రాఁకిడి నట్లు వీఁక తోన్." భార. విరా. ౨, అ ౩౫౦. భార. విరా. ౨, అ. ౩౫౧ 3. బయలువెడలు, ఉద్గ మించు. "ఉ. నావుడు నవ్వు నెమ్మొగమున న్నెగయంగ జనార్దనుండు .." ఉ. హరి. ౩, అ. ౬౯. కు సం ౫, అ. ౧౦౮; 4. నీటినుండి పైకిలేలు. "గీ నీరమందినపొరకాయ నెగసి నట్లు."ఉ హరి. ౪, అ. ౨౮. అము. ౨, అ. ౯.

నెగయుతెంచు దే అ. క్రి. (నెగయు+తెంచు.) నీటినుండి పైకిలేలు. "ఆ. బంధకంబు రెల్లఁ బాయుఁడు భీముండు, నీరిలోననుండి నెగయుఁ దెంచె." భార. ఆది. ౫, అ. ౧౯౩.

సెగవు. దే. వి. ఎగురుట, ఉడ్డీనము. "సీ. నిఖిలాండ ములు నొక్క సెగవున దాటంగఁ గల యద్భు తోగ్ర వేగంబువాని." హం. పూ. ౪, ఆ. ౧౫౫.

సెగవైచు. దే. స. క్రి. (సెగయు+వైచు.) ఎగుర వైచు. "చ. దర్పదు.ర్దమరిపు ఖండ కాండ భుజ దండమునందుఁ బ్రచండ మండలా.గ్రము జళి పించుచుఁ గిరిగిరన్ దిరుగన్ సెగవైచి పట్టు చున్." కళా. ౬ ఆ. ౧౪.

సెగచు = ఎగచు. దే. స. క్రి. తఱుము. "ఆ. వన గజంబు సెగచు వనచారిఁ బోఁగని, వన గజంబు కాన వజ్రిగజము వెల్లనై సురేంద్రు వేచి సుధాం ధులు, పట్టఁ బట్టనీక బయలు ప్రాఁకె." భాగ. ౮, స్కం. ౬౬.

సెగలు. దే. వి 1. బాధ. "ఆ ..నరులు జూంటి, చవియుగాని సెగలుఁ జఱిరయంబున నెక్కి, తారు విఱుగఁబడుటఁ దలఁపలేరు." భార. శాం. ౬, ఆ ౭౩, కాశీ. ౪, ఆ. ౨౨౭; 2. విచారము, దుఃఖము. "క. మ్రొక్కి వినుతించెఁ దనమని, సొక్కును సెగలెల్ల నేలనెలఁతుక కన్నీ, రొక్కొక్క బొట్టు మెఱుఁగుం, జెక్కుల జిగఁ జాఱ గోరఁ జిమ్ముచు హరికిన్." పాండు 3, ఆ. ౧౬౯. య. 3, ఆ. ౪౨; 3. హాని. "క... ...ధృతరాష్ట్ర సుతు లసద్వృత్తులు నిష్కారణ వైరులు వీరల. కారణమున సెగలు పుట్టుఁ గౌరవ్యులకున్." భార. ఆది. ౫, ఆ. ౧౬౦. ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౦౪; 4. కోపము. "చ. మనమున యందు నీ సెగలు మానుము పర్వత పుత్రి .." కాశీ. ౪, ఆ. ౧౫౪. సా. ౨. ఆ. ౨౪౬.

సెగలుకొను. దే. అ. క్రి. (సెగలు+కొను.) పీడ నొందు. "గీ. తెగువ మోమునఁ జేట్పాటు మిగుల మఱియుఁ, జూచి పాణిపంకజమును శోక ఘుమ్మ, కంఠనాళాంతరమున గద్గదిక సెగులఁ, కొను నెలుంగును నెత్తి యజ్ఞసుతనయ." భా. గా యు. ౫౮౦.

సెగలుపడు. ద్వ. అ. క్రి. (సెగలు+పడు.) బాధ నొందు (చూ. సెగలుపఱుచు)

సెగలుపఱుచు. ద్వ. స. క్రి. (సెగలుపడు ధా.) బాధించు, పీడించు. "వ. ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు సెగలుపఱుచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రుని గృథకిష్మువు గన్గొని శపించిన..." భాగ. ౯, స్కం. ౧౯౩.

సెగలుపెట్టు. దే. స. క్రి. (సెగలు+పెట్టు.) బాధించు. "సీ చారుమధ్యముఁ గని శరభముల్ మననీవు నెమ్మోముఁ గని యళుల్ సెగలుపెట్టు." భా. రా. అర. ౨, ఆ. ౩౦౩.

సెగ్గడము. వై. వి. (సం. నికటమ్. ప్రా. నిఘట్టనమ్.) త్రొక్కుటము, సమ్మర్దము. (శ. ర.) విణ. సాం ద్రము, దట్టము. "గీ...అలరు సాంద్రంబు సెగ్గడ మనఁగ..." ఆం. భా. తృ. ౧౬.

సెగ్గు. దే. అ. క్రి. 1. నెఱవేఱు, సిద్ధించు. "గీ. మీదు కార్యంబు సెగ్గదు మీరలుంగి, వేగ సుగ్రీవు శల్మి గా వింపుఁ దనిన వచ్చినారము..." మొ. రా. కిష్కిం. ౫; 2. మను, బ్రతుకు. "క... చంద్రిక్, మగ్గము వెట్టిన మొదలే, సెగ్గ వరూ సింగ భూప నృపసుమ చాపా." చంద్ర. వి. 3, ఆ. ౪౩; 3 జయమునొందు. (వ్యవ.) వారు యుద్ధములో సెగ్గుట కష్టము; 4. నిస్సత్త్వము, బెండువడు. "వ ..వారి చతురంగబలంబున కూర కయొ దారున బెగ్గడిల సెగ్గి వేటకాంద్రు చోపుడు వెట్టఁ బోడలు వెల్వడి పిట్ట తొరిపోవు చాడ్పున.' ప్రబంధ. ౭౮౮. సానందో. ౧, ఆ. ౮, పు; 5. ఎదురాడు, మాఱుపలుకు. "గీ. నీకు హితవుగ నడిచెద సెగ్గనింకఁ, జెంతకును రార యోరి లక్ష్మీకుమార." పార్వ. 3, ఆ. ౭౮.

సెగ్గుకొను. దే. స. క్రి. (సెగ్గు+కొను) జయించు. "గీ. నిందు కల్యాలరా నిగ్గు సెగ్గుకొనెడి, మొగము చిఱునవ్వు కెమ్మోవి ముడిచి యుణఁప."పార్వ 3, ఆ ౪౪.

సెగ్గురు దే. వి. గుండె యదరుట యందలి యనుకర ణము. "ఉ ..ఆ, కిన్నరజగంధిఁ జూచి దొంద సెగ్గు రనం గడు విస్మితాత్ముఁడై." శుక. ౧, ఆ.౧౨౧.

సెచ్చె. దే. వి. 1. మిక్కిలి సన్నమైన నూకలనుచూ హము. (శ. ర.), 2. మెత్తని బియ్యపుపిండి.(బ్రా.)

సెచ్చోలి. దే. వి. (సెల+చూలి.) ప్రియపుత్రి. "ద్వి పలుపలికెడిఁ బంటవలఁతి సెచ్చోలి, పల నొప్పఁ దమ్ముఁ దప్పులనొప్ప .."ద్వి. పరమ. 3, ఆ. ౨౧౮. పు.

సెచ్చెలి. దే. వి. (సెల+చెలి.) 1. ప్రాణస్నేహితుడు; ప్రాణస్నేహితురాలు. "ఉ. కాంచిరి నిర్జరేశ్వ

రులు...ధీరతం గాంచనభూధరంబునకు గాదిలి నెచ్చెలి యైనవాని నిర్వంచిత దానశక్తి సుర రత్నముఁ బోలెడు వాని నైషధున్." నైష. ౩, ఆ. ౪౦, మార్క. ౨, ఆ. ౩౨౪; 2. ఆఁడుది, స్త్రీ. "ద్వి. ..వేల్పు నెచ్చెలుల పాలిండ్లఁ, గలకల నవ్వు బంగారుకుండలను." ద్వి. పరమ. ౩, ఆ. ౧౪౬ పు.

నెచ్చెలికత్తె. ద్వ. వి. (నెచ్చెలి+కత్తె-స్వార్థము.) ప్రాణస్నేహితురాలు. "ఉ. మ్రుచ్చిలి గంధ వారణ సమూహము కుంభవిలాస సంపదల్, మ్రుచ్చిలి మించు బయ్యెదలలోపల డాగుచు నుండు దప్పు మీ, నెచ్చెలికత్తె చన్నుఁగవ నీవు విచారము సేయుమా .." శైవ. ౯, ఆ. ౬౯, శు. సం. ౫, ఆ. ౬౧౦.

నెచ్చెలికాఁడు. దే. వి. (నెచ్చెలి+కాఁడు - స్వార్థము.) ప్రాణస్నేహితుఁడు. "చ. అని వరమిచ్చి శూలి రజతాద్రికి నెచ్చెలికాని వెంటఁబోఁ, ద్దొని చనుదెంచె." ఉ. రా. ౨, ఆ. ౩౧౯. పి. శకుం. ౪, ఆ. ౧౮౪.

నెచ్చెలికారము. దే. వి. స్నేహము.

నెచ్చెలితనము. ద్వ. వి. (నెచ్చెలి+తనము.) ప్రాణస్నేహము. "సీ. ఇచ్చియుండెఁగఁ బూచి యెదుట నెచ్చెలితన మసుచు బంతెన గుందులాడు వొకఁడు." భాగ. ౧౦. స్కం. పూ. ౪౯౬.

నెచ్చెలియ. దే. వి. (నెఱ+చెలియ.) ప్రియసఖి. "శా. మేలంబాడుచు వచ్చె నెచ్చెలియపై మిథ్యాలసత్వంబు నూల్కొ లోలోపల వేదుకల్ నిగుడ..." వరాహ. ౪, ఆ. ౯.

నెచ్చెలువ. దే. వి. (నెఱ+చెలువ.) మిక్కిలి మనోజ్ఞురాలైనస్త్రీ. "సీ. తన జాలిఁగొన్న నెందిన మరుద్గలి బంధు జీవంబు వడఁకె నెచ్చెలువ చూడు." ఉ. రా. ౧, ఆ. ౧౮౧.

నెటిక. దే. వి. వ్రేలిగనుపు, అంగుళిపర్వము. "చ. నెటికలు దీసి యిచ్చకము సేర్చి ప్రసంగము దీసి ...విటులఁ గలంచి తీయఁదగు విత్తము లుత్తమ వారకాంతలున్." విప్ర. ౪, ఆ. ౩౨, బహు. ౫, ఆ. ౧౬౬.

నెటికలువిఱుచు. దే. అ. క్రి. (నెటికలు+విఱుచు.) 1. వ్రేళ్లసందులను విఱుచు. "ద్వి. అనలార నాయయ్యహస్తతలంబు నటుసొఁగఁ దిగుచుచు నప్పటి వ్రేళ్ల, నెటికలు విఱుచుచు నెమ్మిఁ గొత్తుచును." పండితా. పురా. ౧౨౪, పు. 2. వికసించుకొను. "సీ. తనకు లేమిరి నొర్ల ధనము పెంపురు జూచి విధిమీఁద నెటికలు విఱిచి విఱిచి." పద్మ. ౨, ఆ. ౨౩౯.

నెటికె = నెటిక. (చూ. నెటికలువిఱుచు.)

నెటికెకట్టు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. తిరుగుడు బిళ్లత్రిప్పట్లు జరుగుడ్లు చిటితాళ మోళలు నెటికెకట్టు." హంస. ౩, ఆ. ౧౪౬.

నెటికెవిఱుచు = నెటికలు విఱుచు. (వికసించుకొను.) "సీ. మమతతో నాథుండు మాటాడియుండక యటు మొగంబైనచో నెటికె విఱుచు." శకాం. ౪, ఆ. ౩౨.

నెటుకురు. దే. వి. వీపు పెందలగువాని శబ్దధ్వని కనుకరణము. "సీ. అష్టోత్తరశతవ్రణాధ్యక్షుఁడగు రాజ పిటకునకును వీపు నెటుకురనిరొ." శైవ. ౯, ఆ. ౧౮.

నెటుక్కు. దే. వి. ఎముకలు మున్నగు వానిని ఖండించుటయందగు ధ్వని కనుకరణము. "దండకము...వజ్రసారాస్థిపాళిన్ నెటుక్కుంచు ఖండించుచున్..." దశా. ౪, ఆ. ౨౩౨.

నెట్ట. దే. క్రి. విశే. అధికముగా. "గీ. విరహకాలంబు మరు బాణవితతిఁ గొన్న, గంటు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపు మిగిలి, పెనఁగు నెడ నెట్ట విరిసె నా వనిత మేనఁ, గలయ నవనఖదంతవిక్షతము లడరె." శు. సం. ౯, ఆ. ౧౮౯, యు. ౪, ఆ. ౨౦.

నెట్టన. దే క్రి. విశే. 1. అధికముగా. "ఉ. నెట్టన ధర్మనందనుఁడు నిన్నవలంబము సేసియుండఁగాఁ, గట్టినయోడవోలె గతగౌరవుఁ డైకడుఁ దూలె. ..." భార. సభా. ౨, ఆ. ౪౦, అం. ౧. ౫౮; 2. అవశ్యము, తప్పక. "క...ముక్, గట్టినకర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్." భార. ఆది. ౫, ఆ. ౫౯, భాగ. ౧, స్కం. ౩౧౨; 3. శీఘ్రముగా. "ఉ...రాక్షస వధోచిత నీలగర్వ మేచఁగా, నిన్ను వధించి యివ్వనము నెట్టన చేసెద నిర్భయంబుగాన్." భార. ఆది. ౬, ఆ. ౨౦౪. వి. పు. ౨, ఆ. ౧౯౩, 4. నిజముగా, యథార్థముగా. "ఉ. నెట్టన యాదవగా సుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా, కట్టెడి

నీను లేమి విను శాతియశోర్వ్యశ్రు..." భార. భీష్మ. ౧, ఆ. ౬౫, శా. పంచ. ౨, ఆ. ౧౧౧; 5. న్యాయముగా, పాడిదప్పక. "సీ. కవచధారణమును ధనువిద్య గవ్వడి చే నెఱింగించిలి నితఁడు దాని, నేర్పుట నీకని నెట్టన నొప్పింప శక్యంబు గాదు .."భార. ద్రో. ౨, ఆ. ౨౦౫; 6. కొంచెమైనను, ఇంచుకయైనను. "చ. అనవుఁడు చిన్న నవ్వునగి యున్నరుఁ డన్న మొగంబుఁ జూచి నె, ట్టన బలుమాట లాడఁగఁ గడంగఁగ నొల్లకయున్న దా త్తతన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౨౫; 7. చక్కఁగా, మనోజ్ఞముగా. "ఉ. నెట్టన యల్లలచ్చియయును నీశయును భూపతి యుండ నీవు నీ, నెట్టిక సీలపై మనసు నిల్పుట కేమనవచ్చు..." ఆము. ౬, ఆ. ౧౧౧; 8. సాహసించి, తెగువ బూని. "క నెట్టన సభలో నేవుర, కట్టెదుర నరాతితనము గాకెంతయు వా, రెట్టిరులుపఁగా ద్రౌపది, నట్టులు పఱిచెడిద జాదమాడరె యెందున్." భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౪, మార్క. ౧, ఆ. ౭౬; 9. అనాలోచితముగా. "చ .. ఉదకంబుల నీ విటు కుండ ముంచఁగా, నినదము వా స్తినాద మని నెట్టన యేసితిఁ దప్పుచేసితిన్." భా. రా. అయో. ౧౯౬, భార. సౌ. ౧, ఆ. ౩౫.

నెట్టణము = నెట్టనము. విశ. యథార్థము. "సీ. ఎట్టి వాఁడు గురుండు నెట్టణంబుగ శిష్యు లెవ్వరుసోదరు లెట్టివారు."శివయోగసారము ౨,ఆ.౧౯౦.

నెట్టనము. దే. వి. పెంపు, అతిశయము. "గీ...చెవులకు విందు గాఁగ, నెట్టనంబునఁ దేనియ లుట్టి పడఁగ." చిత్రభా. ౫, ఆ. ౩౪. విశ. 1. సంపూర్ణము. "గీ. దరిసెనంబిచ్చెఁ దాతలకరము వాఁటి, కట్టుబండి యొక్క రైతు నెట్టనముగ" రుక్మా. ౪, ఆ. ౧౦౪.; 2. అనివార్యము. "గీ. పాత్ర మెఱుఁగని చెనఁటి భూపతుల యిండ్ల, కెట్టినియ కాత్మకులనైన నేఁగఁజేయు, ద్వారనిలయులు వారింప వారి నచట, నిలుపఁ బెట్టును గామంబు నెట్టనముగ." శివయోగసారము. ౨, ఆ. ౨౧.

నెట్టపంట. దే. క్రి. విశ. నిష్కారణముగా. "సీ... నెట్టపంట యనంగ నిష్కారణం బంట..." ఆం. ౫౬.

నెట్టము. దే. వి. నెమిలియీఁకలతో పేనినదారముల పాగ. "గీ. నెమలి యీఁకలఁ జేను దారముల పాగ, నెట్టమని పల్కఁగాఁ దగు .." ఆం. భా. కృ. ౩౪.

నెట్టించు. దే. స. క్రి. (నెట్టు+ఇంచు-స్వార్థమున.) 1. జయించు. "శా. నీలుక్ శౌర్యగుణాల వాలు ననితో నెట్టించు వా రే రిలన్." సీతావి. ౧, ఆ. ౧౦౬; 2. పెంపొందించు. "క. కట్టిగరాలను మంటపు, గట్టినదేవాలయమును గలిగినవారల్, నెట్టించి రాలచేతను, గట్టించినయిల్లు నొక్కగతి పుణ్యముగున్." శివ. ౨, ఆ ౯౨.

నెట్టిక = నెటిక. అంగుళిపర్వము. (చూ. నెట్టికసీల.)

నెట్టికసీల. యుం. దే. వి. వ్రేలిగనపుఱోని సీల. "గీ...గొరగపడుచు, నాడుచున్నది చూడు మూర్ధాభినయము, తాను నెట్టికసీలంత గాని లేదు." క్రీడా. ౧౪౩, ప్రభా. ౧, ఆ ౧౦౪. నై. విశ. (సం. నైష్ఠికశీలః.) బ్రహ్మచారిణి; బ్రహ్మచారి. "ఉ నెట్టన యల్లలచ్చి యల నీశయుం భూపతియుండ నీవు నీ, నెట్టికసీలపై మనసు నిల్పుట కే మనవచ్చు .."ఆము. ౬, ఆ. ౧౧౧, పాండు. ౪, ఆ ౧౭౯.

నెట్టియము=నెట్టెము. 1. చుట్టకుదురు. (శ.ర.బ్రా.); 2. తలపాగ, శిరస్త్రాణము. "వ... కెంజడముడి బిగియించి నెట్టియంబుచుట్టిన జగజెట్టి పాఁపతేని యాదల మాణిక్యంబుల కుఱంగలి మెఱుంగులు వినువెంట మింట దాఁకను జరిగి .." భీమ. ౫, ఆ. ౯

నెట్టు. దే. అ. క్రి. అధికమగు, అతిశయించు. "క. అనుటయు భగభగమండెడు, కనుఁగవతో నొడల నదరు కంపముతో నెట్టిన నిట్టూర్పులతో వెంగ, మునఁదనికిన కెంపుతోఁడ మునిపతియుండెన్." ఉ. హరి. ౪, ఆ. ౯౯. స. క్రి. 1. త్రోయు; పడఁద్రోయు. "క. నెట్టిరి విషాన్న మంటం, గట్టిరి ఘనపాశములను గంగానదిలో, నెట్టిరి రాజ్యము కెడలం, గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్మకులై." భాగ. ౩, స్కం. ౧౩, కృ. శతం. ౨, ఆ. ౨౨౧, 2. తిరస్కరించు. "ఉ...పేదుచో, నప్పన నెట్టి పోఁ దడిగినన్ని వరా లిడుఁ గొండ మీఁదిలి, మ్మప్పని వంటి కావ్యపతియబ్బుట యబ్బుర మిబ్బుధాళికిన్."రా.వి. ౧,ఆ. ౨౬, వి. 1. త్రోపు, గెంటు. "గీ. కుఱుచ నెట్టున నందియల్ చఱచి మొరయు." కవిక. ౩, ఆ. ౧౫౧; 2. నాశము,

సెవము. వై. వి. (సం. నిభః.) 1. హేతువు, కారణము. "చ. మొనసిన దీపికానికరముల్ గృహాంగర్య గతాభిసారికా, వనితల యూర్పుగాడ్పుల సెవంబునఁ గంపమునొంద..." హరి. ౨, ఆ. ౩౬. శైవ. ౮, ఆ ౪౫. 2. దోషము, తప్పు. "ఉ...మహీవల్లభ శక్తి బాధము సెవంబున సర్పము లెల్లనగ్నిలోఁ, బ్రక్షిఁగ .." భార. ఆది. ౧, ఆ. ౧౨౭. 3. మిష, వ్యాజము. "క. .. అశందుచు దల్పే, వనతాత్పర్యంబు తగ సెవంబిడి యేర్పాడ్డను సెదమడుగగుమదిలో, ననువర్తింపఁగఁ గించి దవశిష్టముగాన్." హరి. పూ. ౧, ఆ. ౮౩.

సెవయఁబడు. ద్వి. అ. క్రి (సెవయు+పడు–స్వార్థమున.) ఎగయు, పైకిలేచు. "క. దివిజులు తోలు దాఁకునఁ ధ, స్మైవిచిన దనుజులు మనుకులేశ్వర శరముల్, పావయుని మాటలు మింటికి, సెవయంబడి కెడపమొనసి నిలిచిరి వారున్." కళ. ౭, ఆ. ౩౬.

సెవఱు. దే. అ. క్రి. ఎగయు, ఎగురు. "క. అవమానదుఃఖతుఁడయి, పావగుంచుఁ గోపానలంబు పొదమి వెలుంగన్, బవనసఖుఁ దగ్నికణములు, సెవయఁగఁ దఁబొడవు మాపె నిషధుని మ్రోలన్." భార. సభా. ౧, ఆ. ౨౫౫.

సెవులు. దే. అ. క్రి. బాధనొందు. "సీ. క్రొవ్విరులెసఁగి పూగోలల మోహోపశనవకంపులే దీఁగె సెవులునట్లు" కు. సం. ౮, ఆ. ౯.

సెవ్వ. దే. వి. 1. దారిద్ర్యము, బిడఆికము. "గీ. చుట్టువాలుచు సెవ్వ పోఁగొట్టునాలు, బిట్టుగ్రాలు పసిండి క్రొంబట్టుసేలు, మెట్టజాలు మొగిల్ పసమెట్టఁజాలు, నట్టిడాలును గలజగ జెట్టిఁ దలఁతు." అచ్చ. బాల. ౩. ధర్మ. సీతి. ౩౬. 2. అభావము, ఎడ్డడి. "శా. ...వర్షంపు సెవ్వన్ రుజన్, పావల్లందిగు నన్యభూప్రజల రా జాయాయి జాల్యోచితిన్, బ్రోవంగాఁ దగు..." అము. ౪, ఆ. ౨౪౫. ఆం. భా. ద్వి. ౨౧౦. 3. శ్రమ, ఆయాసము. "గీ. తెల్లవారిన గుండెఁగి కోళ్లలీల, నీళ్ల మునుఁగుచు నొడలెల్లఁ జల్లఁబాఱి, నిట్రుపాసంబులనుగూడి సెవ్వఁదొడరు, వెడఁగుబాఁపన తగులునఁ బడిలిపేల." వాల్మీకి. ౨, ఆ. ౧౩౦. రామా. ౩, ఆ. ౩౨. 4. దుఃఖము, విచారము. "గీ. నీ మనంబునఁ దగిలిన సెవ్వయెల్లఁ, బలుకు బాలోఁడ బాలోఁడుబద్మనేత్ర, దాఁచ నేటికి..." చిత్ర. భా. ౭, ఆ. ౧౨౦. భాగ. ౧౦. స్కం. పూ. ౧౭౧౧.

సెవ్వగ. దే. వి. (సెఱు+వగ.) 1. అధికదుఃఖము. "వ. సెవ్వగలు నివ్వటిల్లనీక నిలుపు నది యొట్టిది దాని సెఱింగింపు మనిన విదురుం డిట్లనియె." భార. ఉద్యో. ౨. ఆ. ౮౩. సీలా. ౨, ఆ. ౫౨. 2. పూర్ణాలోచన, అతివిచారణ. "సీ. అతివిచారణ సంజ్ఞ యలరు సెవ్వగ యన..." ఆం. భా. ద్ర. ౧౦౩. భార. ఆది. ౫, ఆ. ౨౩౦.

సెవ్వడ. దే. వి. (సెఱు+వడ.) అధికతాపము, ఆత్యుష్ణము. "సీ. పొలయుఁ నిట్టూర్పుల ..పెడ బీట వాఁడి సెవ్వడ వడు మోవిలో ముడిగి వాఁడిన యొల్లు వడఁకు చూడు." కు. సం. ౭. ఆ. ౫౦.

సెవ్వడి. దే. వి. (సెఱు+వడి.) మిక్కిలివేగము. "క. వడముడి యారక్కసు న, య్యెడ కిష్ట ధనుః ప్రమాణ మెడగలుగఁగ సె, వ్వడి నీడ్చె..." భార. ఆది. ౬, ఆ. ౨౦౬, శాం. ౬, ఆ. ౧౮౦. భార. ఆది. ౬, ఆ. ౮౨.

సెవ్వలి. దే. విశే. (సెఱు+వలి.) మిక్కిలిపెద్దది. "క. సెవ్వలి చన్నుల క్రేఁగునఁ, జివ్వంకలు వంగఁగౌను .." కు. సం. ౯, ఆ. ౧౧౩.

సెవ్వీఁగు. దే. విశే. (సెఱు+వీఁగు.) ఉన్నతమైనది; మిక్కిలివీఁగినది. "తరువోజ. వెలదునిట్టూర్పుల వెస నుచ్చలించు వెలుపునఁ గలుగు సెవ్వీఁగు చందోయి." కు. ౭, ఆ. ౧౦౯. శైవ. ౫, ఆ. ౪౧. భార. విరా. ౧, ఆ. ౨౯౧.

సెసుర్లు. దే. వి. బ. ఒకజాతిపురుగులు. "చ. చిరిఁగిన విల్లు ద్రుంచుటయు చేఁడియ నొందుటయుఁన్ సెసుర్ల నె, క్కువ పలమాఱుఁ జంపుటయుఁ గోఁతిని జెంకకు గీటడంచుటల్." అచ్చ. యు. ౧౧౯.

సెళవరి. దే. విశే. (సెళవు+అరి.) 1. పరిచితుఁడు. "క. ఆసకుచు మూర్ఛిలి తెలుసుక, కళవళపడి లేచి మనసు గాసిల్లంగా, ధళిరా యని వెలువడి తన, సెళవరులను జూచు కొనుచు నిలుచున్నంతన్." ఉ. హరి. ౩, ఆ. ౫౨. 2. మర్మము సెఱిఁగినవాఁడు. (శ. ర.)

సెళవు. దే. వి. 1. పరిచయము. (చూ. సెళవరి.) 2. రహస్యము, గుట్టు. "చ...అమ్మదవతీమణి గర్భభరంబుఁ దాల్చె ని, స్సెళవు గృహంబులోపల

ను నిక్కముగా వివరింపఁగాఁ దగున్." అని. 3, ఆ. ౧౦౫. వేం. పంచ. ౧, ఆ. ౨౪౮. 3. ఆయువుపట్టు, మర్మస్థానము. "సీ. మఱపించి యొల్లని మర్మంబు లంటుచోఁ బఱికిళ్లు నెళవులు పుణికివైచి." కవిక. 3, ఆ. ౨౨౨. 4. అభ్యాసము. "సీ. కాలములం దప్పక త్రిసంధ్యలందు ను మాధీశుఁ బూజించు నట్టి నెళవు." చెన్న. పీఠి. ౯౮. విశ. యుక్తము. "సీ. నెళవుగ మాటాడ నేర్చునో నేరదో పురుషుల పనులాను పొలఁతి చేత." వేం. మా. ౫, ఆ. ౪.

**నెళినెళి.** దే. వి. విఱుగుట మున్నగువానియందగు ధ్వనికనుకరణము. "ద్వి. నిజరథంబంతయుం నెళి నెళి విఱుగ." అచ్చ. యు. (క.ర.) ఉ. హరి. 3, ఆ. ౭౨.

# నే

**నే** త్రి. వి. (సం. స్నేహః) (ఇది ప్రథమైక వచనమును సమాసమునను గానవచ్చుచున్నది.) నేయి, ఘృతము. "మ...ప్ర, జ్వలితాగ్న్యగ్ర వాగ్ని నే విడిచినం జల్లారునే..." ఉ.రా. ౯, ఆ. ౩౨౬. భార. ఉద్యో. ౨, ఆ. ౨౪౧.

**నేఁకెల్ల.** దే అవ్య. సంతాపమును దెలుపును. "గీ. అకట నేఁకెల్ల నే కెల్ల నో కుమార, హా తనూభవ నా వత్స యనుచు నార్తిఁ, దల్లిగొంను దాద్రియును వచ్చి తనుఁ బోదివి,రి .' హరి. పూ. ౫, ఆ. ౧౫౫

**నేఁడు.** దే.వి. 1. ఈ దినము. 'సీ కుందలమ్ములు వేగ నొవిరమ్ము నాలవనాఁటి కని పూని నన్నుఁ బనిచె, గురుపత్ని నేఁడ యక్కుండలంబులు దొడ్గు దివసము .." భార. ఆది ౧, ఆ ౧౧౫. పాండు ౪, ఆ ౬౧. 2. ఈ కాలము, ఇప్పుడు. "సీ. చక్రవర్తి మహాప్రశస్తి నాఁడును నేఁడుఁ జెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె." పారి. పీఠి. ౧౮. భార. ఉద్యో. ౪ ఆ. ౩౫

**నేఁత.** దే వి. (నేయుట). 1 బట్టలు నేయుట. "సీ పరిలేని ... గుజ్జరినేఁత పట్టయుఁ బఱపైన రాణించు గఱులపఱుపు" ఉ. రా ౬, ఆ. ౧౬౦. 2. ఇల్లు నేయుట. "సీ. కఱవు గేస్తుల యొద్దకుప్పు నేఁతలయందు నుడివడి కలఁ గుటల్ మదుగలాద". అచ్చ. బాల. ౫౯, ఆ. మన్నెవార చాఁపులు. కవిక. 3, ఆ. (క.ర.)

**నేఁతకాఁడు.** దే. వి. 1. నేఁత నేయువాఁడు, తంతువాయుఁడు "ఉ...తొల్లిచే, నేఁతఁ బరిగ్రహించి యతిశిష్యునిచే నొక నేఁతకానిచే, దూలిక నొచ్చి నాత్మకృతదోషము గంగద..." వేం. పంచ ౧, ఆ. ౨౧౪. ఆం. భా. ద్వి. ౨౯౩ 2. ఇల్లు నేయువాఁడు. (వా)

**నేఁతపలక.** ద్వ. వి (నేఁత+పలక.) వాయదండము, నేఁత నేయునపుడు పడుగు పేకలను సరిగా చేర్చు పలక. "సీ ..వాయదండము నేఁతపలకనఁదగు. ఆం. భా. ద్వి. ౨౮౬.

**నేఁతపురువు.** ద్వ. వి (నేఁత+పురువు). సాలె పురుగు, తంతువాయము "క. నేసి మఱి తాన క్రమ్మఱ, గ్రాసముగొను నేఁతపురువుగతి .." కవిక ౬, ఆ. ౧౭౨.

**నేఁతపూఁబోఁడి** (నేఁత+పూఁబోఁడి) సాలెపడుచు 'ఉ. అదుబుడక్కవానికి రయంబున భిక్ష యొసంగ నేఁతపూఁబోఁడి ప్రకోష్ఠకస్థలిఁ బోయి ..' హంస. ౨, ఆ ౨౮.

**నేఁతయంత్రము.** మి. వి (నేఁత+యంత్రము) మగ్గము. 'సీ ..నేఁతయంత్రము మగ్గ మనఁగను దనరుచుండు". ఆం. భా ప్ర. ౨౮౬.

**నేఁతరి.** దే. వి. (నేఁత+అరి) తంతువాయుఁడు, నేఁతకాఁడు "సీ. తంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁతకాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్". ఆం. భా. ద్వి. ౨౮౩.

**నేజకుఁడు.** సం. వి. అ పుం. చాకలి, రజకుఁడు. విశ. (అ. టీకా. అ) 1 శుద్ధిచేయువాఁడు. 2 బట్ట లుదుకువాఁడు.

**నేజనము** సం. వి. అ. న. 1. శుద్ధిచేయుట. 2. బట్టలుదుకుట. 3. చాకిరేవు. 4 బట్టలుదుకు పలక.

**నేజి.** సం. విశ. (న్.సి.న్) 1. శుద్ధిచేయువాఁడు, బట్ట లుదుకువాఁడు.

**నేజె** దే. వి. ఈఁటె, బల్లెము. "సీ...నేజ బిరిచి యాఁటె యనంగఁ బరగుఁ గుంతము..."ఆం.భా. ద్వి. ౨౧౭. చంద్రా. 3, ఆ. ౧౧౭.

**నేజెము=నేజె.** "క. నేజముగొని యుపాఖ్యటున, నేజ మునిం జేర్చు వసుచు నిశిచరవీరుల్, జేజే లిడ సాహసమున, జేజేలగబంటుఁ బంధపీడుం ద్రుమ్మెన్." కళా. ౫, ఆ. ౨౫. నరస. 3, ఆ. ౩౩.

**నేజా=నేజ.** "సీ. తరుణ రాజావర్తదండంబులైన నేజాలు వెం జెలువలజాలెఁ జెలుప." సాంబో. ౨, ఆ. ౧౧౦. కృష్ణ. 3, ఆ. ౭౯.

**నేజాము=నేజా.** "సీ. నడుమ రెండుగఁ దున్మనమలి ఖండించిన సర్పంబుఁ బోలి నేజాముఁ గాంచి" సాంబో. 3, ఆ ౪౮. య. ౨, ఆ. ౨౭.

**నేటించు.** దే. అ. క్రి. 1 చాఁగిలఁబడు. "ఆ. నిన్ను నన్నులించి నేటించి మ్రొక్కెడు, హరిమురారి శౌరి యవధరింపు." భద్రరాజపుత్రచరిత్రము. 3, ఆ. (శ. ర.) 2. నిశ్చయించిపలుకు, గట్టిగా జెప్పు. "క. కూటము లెఱుఁగవుమాతో, సాటికి బద్యములు చెప్పి చదివెద విది బల్,చేటుకుమీ యని పెద్దలు, నేటించినఁ గుకవి కడుఁ గినిసి జగడించున్." అప్ప ౨, ఆ. ౩౫౧.

**నేటు.** దే. వి. 1. సత్యము. "గీ. నిజమనఁగ నిక్కువంబన నిక్కమనఁగ, నేటునాఁగను సత్యంబు నెగడుచుండు." ఆం. భా. ప్ర. ౧౧౮. 2. నిశ్చయము, నిర్ధారణము. "ద్వి. నేటుగా నీ కల్ల నిజములు రెండుఁ, దేటగా నిప్పుడు తెలుపకయున్న." ద్వి. సా. ౨, భా. (శ. ర) నీలా. ౨, ఆ. ౪౧. 3. ఎన్నిక, గణుతి. "ఉ. ఆటలఁ బాటలన్ మరఁగి యమ్మునిమానులఁ గూడియుండుటల్, నేటుకు వచ్చునే సభల..." శుక. ౨, ఆ. ౧౪౩. విశే. 1. గట్టిది, దృఢము. "ఆ. కలఁగి చేటపోదు గడిదప్పు వెలుచును, నీటికుప్పనీరు నేటుమనను" అచ్చ. భా. ౪, ఆ. ౨౧, అచ్చ. యు. ౧౭౯. 2. సూటియైనది, తిన్ననిది. "సీ. సీటిపై నుఱుకుచు నేటుగా నీఁదుచుఁ గ్రమ్మఱ నడవక దొమ్మిఁజనుచు."అచ్చ. యు. ౭౦. 3. నర్మయుక్తము. "చ....వాలుఁజూపులన్, గిలకిలనవ్వులన్ మిగుల నేటగు గాటపు మాటిమాటలన్, గలిగి విటావళిం దిరముగా వలపింతురు వేశ్యలత్తతిన్." రా. వి. ౧, ఆ. ౧౩౫.

**నేటుకొను.** దే. అ. క్రి. (నేటు+కొను.) అతిశయించు. "క. నేటుకొని పండ్లుగొఱుకుచుఁ, జీటికి మాటికిని గసరు చిలుకం బిలుకా, బోటుల నలయించెదు నీ, గోటాడున యొన్నఁ డింక గూటంబడునో." నీలా 3, ఆ. ౨౬.

**నేటుచేయు.** దే. స. క్రి. (నేటు+చేయు.) 1. దృఢపఱచు. "ఆ...వేల్పుబోఁటి సాక్షి, విశ్వసిద్ధి నపుడు పెడఁద బాసిని బోల్చు నేర్పుకాంత్ర మాట నేటుచేసి." రసిక. ౬, ఆ. ౧౦౦. 2. గణన చేయు, "ఆ. ముసలివానిమాట ముద్దియమాటయు నేటుచేసి యేలు నేల వదలి, కటకటా కడింది కార్తికంబులు గల పాలము సొరఁగఁ దగునె పాలఁతిఁ గూడి." అచ్చ. అయో. ౧౦౯.

**నేత** సం. వి. ఋ పుం. 1. రాజు. 2. విష్ణువు. 3. వేము. * విశే. (ఋ. త్రి. ఋ.) 1. అధిపతి. 2. పొందించువాఁడు. 3. తీసికొని పోవువాఁడు. 4. నాయకుఁడు, (సేనాదులను) నడపువాఁడు. 5. కథానాయకుఁడు 6. కొలువేర్చువాఁడు.

**నేతవ్యము.** సం. విశే. (అ. ఆ. అ) 1. పొందింపఁదగినది. 2. కొనిపోఁదగినది. 3. నడపఁదగినది. 4. నెరవేర్పఁదగినది.

**నేతిబీఱ.** ద్వ. వి. (నేయి+బీఱ.) ఒకదినుసు బీఱ, ఘృతకోశాతకి * "సీ. బీరకు బీఱ హాపెలయుఁ గోశాతకి నేతిబీఱయునంగ నెగడుచుండుఁ, దద్భేద నామంబు .." ఆం. భా. ద్వి. ౬౦. గాథే. ౯౦. (నేతిబీఱలో నేయియుండదు. కాన దీనిని అర్థరహితమైనదాని కుదాహరణముగా వాడుదురు.).

**నేతిబీఱాకు.** ద్వ. విశే. (నేతిబీఱ+ఆకు.) వ్యర్థము. "మ. తీతిలో ..గావు మేఁక పెంతచన్నుల్ నేతిబీఱాకులుఁ .." ఒంటి. శ. ౨౬.

**నేత్రచ్ఛదము.** సం. వి అ. పుం. కనుఱెప్ప.

**నేత్రపట్టము.** సం. వి. అ. పుం. కన్నులకుఁ గట్టుకొను గుడ్డ. "వ ..గాంధారి ..తనపతి కనుగుణంబు నేత్రపట్టంబు గట్టికొనియుండె..." భా. ఆది. ౫, ఆ. ౧౨.

**నేత్రపట్టు.** మి. వి. ఒకరకము పట్టువస్త్రము. "వ... ఉదయరాగపట్టులును నేత్రపట్టులును వజ్రపట్టులు నను పేర్లుగల పుట్టంబులు. ద్వా. 3, ఆ. ౧౮౮. ఇట్టే: నేత్రముపట్టు. బస. 3, ఆ. ౫౬. పు.

**నేత్రపర్వము.** సం. వి. న్. న. కనులపండువు. "ఆ... సిరివరింప నభినవోజ్జ్వలత్వ మొంది దివిజులకు నేత్రపర్వమై, పొలిచి యింద్రుఁ డాత్మపురికి నరిగె." భార. శాం. ౫, ఆ. ౧౫.

**నేత్రబంధము.** సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము, దాఁగిలిమూఁతలు.

నేత్రము. సం. వి. అ. న. 1. కన్ను. 2. తరిత్రాడు. 3. తేరు, రథము. 4. నది. 5. వేరు, మూలము. 6. జడ. 7. నాడి. 8. వలిపము, వస్త్రవిశేషము. "గీ. గరుడపచ్చలు నేత్రముల్ తురగవట్లు, హంస వట్లును బద్మాలు హరిణవట్లు, మొదలుగా వల్వలు ధరించి ముదితలపుడు." ప్రబంధ ౨౭౨.

నేత్రాంతము. సం. వి. అ. పుం. కడకన్ను, అపాంగము.

నేత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. నాయకురాలు. 2. నది 3. నాడి. 4. లక్ష్మి.

నేదిష్ఠము. సం. వి. అ. పుం. అంకోలవృక్షము. విణ. (అ. ఆ. అ.) 1 మిక్కిలి సమీపముననున్నది. 2. నిపుణము.

నేదీయము. సం. విణ. (న్. యసీ. స్.) మిక్కిలిసమీపమున నున్నది.

నేని—ఏని. అభ్యర్థకము. "మత్తకోకిల ..మదీయ భాషితకొన్నఁడు, స్నేని మోఘముగాదు దిగ్ధరణీ రచింప నెఱుంగఁగాన్." భార ఆది. ౭,అ.౧౪౨.

నేనిజత్. సం. శత్రు. 1. శుద్ధిచేయుచున్న. 2. ఉదుకుచున్న.

నేనిజమానము. సం. విణ. (అ. ఆ. అ.) = నేనిజత్.

నేను. దే. స. నామశబ్ద ప్రథమైకవచనము. (చూ. నా.)

నేపథ్యము. సం. వి అ. న. 1. తెరవెనుక నటులుండెడిచోటు. 2 అలంకారము. 3. వేషము; నటులు ధరించు వేషము.

నేపాళము. సం. వి. అ. పుం. 1. దేశవిశేషము. 2. ఒక దినుసు చెఱకు. 3. వృక్షభేదము. న. రాగి, తామ్రము.

నేపాళిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నేపాళిపుచెట్టు. 2. మణిశిల.

నేబీలు—నేబిబీలు. "ఆ. ఉల్లితెలికపిండి ముల్లంగినేబీలు ..మారేడుగాయల, ట్లనుభవించువారి నవఁగి కొనఁగు." పద్మ. ౬, అ. ౧౧౮.

నేము. దే. వి. పండ్రెండుకాసుల నాణెము. "చ. పలువలు చెంతఁజేరి యొక పాతిక నేములు చేతికిచ్చినన్." చంద్ర. వి. ౨, అ. ౩౪.

నేమకము. వై. వి. (సం. నియమకః.) నియమము. "వ. ... లక్ష్మీ రఃగస్థలంబు దారి పలసిల్లు పెండ్లి చవిక లొనరవెలుంచి రెండులక్షలు నిష్కంబు లుం బెండ్లినెలవులు నేమకంబులుం జేసికొని..." [illegible]

నేమగాఁడు. ద్వ. విణ. (నేమము+కాఁడు.) నియమవంతుఁడు. "సీ. తల నిల్వుగట్టు వ్రతంబులరాయుని గోమరి పళ్యాలనేమగాని." ఘటికా. ౨,అ.౧౭౭.

నేమము. ఉభ. వై. వి. (సం. నియమః. క. నేమవు.) సం. వి. అ. పుం. 1. ఖండము, భాగము; 2. కాలము; 3. మేర; 4. ప్రాకారము; 5. వ్యాజము, మిష; 6. వజ్రము, 7. గోయి, గర్తము; 8. అన్నము. విణ. 1. తుల్యము; 2. సమీపము.

నేమి సం. వి. ఇ. పుం. 1. వజ్రాయుధము; 2. గాడిద; పుం. స్త్రీ. నూతిగిరక. ఇ. ఈ. స్త్రీ. బండిచక్రము చుట్టుకమ్మి. న్. పుం. కమ్మి, తినాసవృక్షము.

నేమించు వై.అ. క్రి. నియమముగొను, దీక్షవహించు. "క. కామింపకయును సర్వముఁ, గామించియు నైన ముక్తిఁ గామించి తగన్, లోనించి పరమ పురుషుని, నేమించి భజించు దక్ష నిపుణుం డధిపా." భాగ ౨, స్కం.౩౯. స. క్రి. 1. నియమించు. "గీ. మణిరయింఁ గడుఁ బేరు గలిగిన మలల నరసి, యున్న తావులఁ గదలింప దనిచిరందు, మీరంచును బిలిచి నేమించి పనుప" య. ౩, అ. ౩౪. ఉ. రా. ౨ అ. ౪౦౬. 2. నిరోధించు. "ద్వి. అంతకంతకు మనం బాకాంక్ష సేయ, నంత కంతకుఁ బెర్గు వశ నేచ్ఛయెడల, నంత కంతకు మనం బాకాంక్ష దరుగ, నంతకంతకుఁ దర్గు వశ నేచ్ఛగాన, నేమించి మది బరిణామించి కీడిన, గామించు నీ యెడల్ దామించుఁగాక." పండితా పురా. ౧౩౦ పు.

నేము. దే. స క్రి. ధాన్యాదులను చేటలో పోసి యిటునటు త్రిప్పు. (శ. ర)

నేయము. ఉభ. వై. వి. (సం. స్నేహః.) స్నేహము, మైత్రి. "ఉ. నేయము లజ్జయుం గరుణ నెమ్మిక కోపభయైక వేశమే, నేయుడ జూచినన్ మదికి నించుకయుంచక..." రస. ౩, ఆ. (శ. ర) (సం. న్యాయః) న్యాయము, పాడి. "నేయము గాదు వద్దంటే నిలిచేది మేరగాదు." క్షేత్రయ. ౧౯౯ పదము. సం. = నేతవ్యము.

నేయార్థము. సం. వి. అ. న. కావ్యదోషములలో నొకటి, స్వసంకేతితమగు అర్థముగల పదము. "క. ఇలఁ దన సంకేతంబున, నిలిపిన పద మెంచి చూడ నేయార్థంబౌ, బలంతేశి దిండిగమినగు నల సాగరకర్ణయాన యులకలసంగన్." నరస ౪.ఆ.౭.

నేయి. వై కృ. స్త్రీ. అసా. (సం.స్నేహః.) 1. తైలము, చమురు. "క. నేయి బోలుపజేసిన దీపియు, మాయు కరణి..." భార. అను. ౧, ఆ. ౧౩౯. 2. ఘృతము, "క. కామములు భోగములఁ దాగు, నే మెలఁకువ నేత నాలుగే చిచ్చు..." భార. అను. ౫, ఆ. ౨౩౩. వా. రా. ౪, ఆ. ౬౬. 3. క్రొవ్వు మజ్జ. "గీ .. శేరజములు, గువ్వలును మొదలుగ లెక్క కొలఁది మీఱఁ. గలవు పులుఁగులు నేతులు గ్రక్కఁ గ్రొవ్వి." చిత్రభా. 3, ఆ. ౧౭౨

నేయు. దే. స. క్రి. 1. నేఁతచేయు, వయనముచేయు "చ ..తద్భటకోటి చాతురీ తురి ..యకోం, బర ములు నేయుచుండు .." శైవ. ౧,ఆ ౪౯.2.ఇల్లు మొదలగువానిని గడ్డి తాటియాకులు మొదలగు వానితో. కప్పు.

నేరఁబోఁతు. దే. విశే. (నేరమి+పోతు.) తెలియని వాఁడు, అనభిజ్ఞుఁడు.

నేరఁబోలు. దే అ. క్రి. (నేరఁగ+పోలు) సాధ్యమగు "చ. ...అమలిన తారకాసముదయంబుల నెన్న ను...బుద్ధిబొవాలువిక్రమమున దుర్గమార్గ జల గౌరవ భారత భారతీ సముద్రముఁ దటియుంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే" భార. ఆది. ౧, ఆ ౧౯.

నేరపెట్టు. దే. స. క్రి. (నేరము+పెట్టు) దోషినిగాఁ బలుకు. "క .. రెడ్డిన్, గలసి యొకముడుపు గైకొని, పిలిచిన నీకిత్తు నేరపెట్టుదు మగనిన్." వేం పంచ. ౪, ఆ ౪౯౪

నేరమి. దే. వి (నేరుచు ధా.) 1. తెలియమి, అజ్ఞా నము. "క. ఏ నెఱుగమి నిట్టడిగితి, నా నేరమి సైఁపవలయు .." భార. అర. ౫, ఆ. ౩౧౧. స్కా. ౫,ఆ.౧౧. 2. తప్పు, దోషము, 'క వైరుల దూతలు నేరవగు, వారు నిరాకృతులఁ బాప వర్తులఁ దమకుం, జేరువగా వర్తించుట, నేరమి కుదిఁబోయి చేటు నిందయు వచ్చున్."భార.విరా ౧, ఆ. ౧౩౯. ఆం భా. ద్వి. ౧౯౧.

నేరము. దే. వి తప్పు, దోషము "సీ. తప్పొనర్చినవారి దండింతు నంటివి తప్పొనర్చినివారు ధరణిఁ గలరె గీ. యజ్ఞభిద్వు కూఁతురైన యహల్య మొదలు నేర మొనరించె దనినచో నేర్చి నడువ, నొకరితరమా నె ..." శకాం.౪, ఆ. ౨౦. ఆం, భా. ద్వి. ౧౯౧.

నేరముకొను. దే. అ. క్రి. (నేరము+కొను.) తప్పు పట్టు. "క. ఓరి దురాత్మక విని పలు, మాఱటు రావలదు హెచ్చి మఱి వచ్చితివా, నేరము గొందు గ్రహించుక, యూరక యాపని ఘటింప మొప్పదు మాకున్." ద్విప. 3, ఆ. ౧౫౯.

నేరాసీ. దే. విశే. సరిగతో నేసినది. జరబాజీ (వస్త్రము—శ ర.)

నేరిమి. దే వి. (నేరుచు ధా.) 1. శక్తి, సామర్థ్యము. "ఉ ..అంబక జాలపీచికా, స్ఫారముతైన భీష్మఁ డను సాగరముం గడవంగ నీఁదఁగా, నేరిమి యె ట్లొకో కలుగనేర్చె శిఖండికి నేమిచెప్పుఁడున్". భార. భీష్మ. ౧, ఆ. ౫౪. 2 చాతుర్యము, నై పుణ్యము. "చ. ఎఱుఁగక తప్పుగా మెలఁగె నేని యు దానికి సైఁచి నేరుముల్, గఱపి ప్రియంబు తోఁ గొలువు గైకొనఁగాఁదగు ." భార. అర. ౭, ఆ. ౩౭౦. దశకు. ౫, ఆ. ౬౯.

నేరుచు. దే. అ. క్రి. దీనికి నేచును, నేరుదును, నేరఁడు, నేరువఁడు, నేతున్, నేరన్ మొదలగు రూపములు వచ్చును.) 1. సమర్థమగు. "క. కీచ కుఁడు ప్రేటుపడి తన, నీచపుదిన యొరు లెఱుంగ నేరకయుండన్, లేచి..." భార. విరా. ౨, ఆ. ౧౩౦. భార స్త్రీ. ౧, ఆ. ౯౬ 2 సంధి ంచు "వ ..యుష్మ త్సంఘటితములైన సంబంధ ములకు వికారం బెన్నఁడును బుట్టనేరదు." హర. ౪, ఆ. ౪౯. స. క్రి. 1 ఎఱుఁగు, తెలియు. "వ ..ఇంకనైన నుపేక్షింపక యీ మష్టద్యూ తంబు వారింపు మనినఁ బుత్రస్నేహంబున నెద్ది యుఁ జేయఁనది నేరక ధృతరాష్ట్రుఁడు మిన్న కుండె." భార. సభా. ౨, ఆ. ౧౯౪. పళను ౩, ఆ ౧౪౦. 3. అభ్యసించు విక్ర. ౧, ఆ. ౨౦.

నేరుపరి. దే. విశే. (నేరుపు+అరి) 1. పటుఁడు, నిపుణుఁడు. "క నేరుపరి పోషించిన హారము వెల యొక్కులీల ." ప్రబోధ ౧ ఆ ౨౭. ఇట్లే నేర్పరి. భార. ఉద్యో. ౨, ఆ. ౩౬౫. సమర్థుఁడు, శక్తిగలవాఁడు. య. ౧, ఆ. ౬౬.

నేరుపు నేర్పు. దే. వి. చాతుర్యము ప్రావీణ్యము. "ఉ. ఇంచిన భక్తి నొక్కతరళేక్షణ సైవధ భూమి భర్తను, న్నిందు పయోధిసీపతికి నేరుపు మీఱఁగ పట్టిచెల్లఁగా, పంచిన తాళవృంతముల

"పీచుచునుండె..." శైవ. ౬, అ. ౧౧౯. ఉ. హరి. ౩, ఆ. ౧౧౬.

నేరటేఱు. దే. వి. (నేరేడు+ఏఱు;) జంబూనది. "గీ. నేరటేటి యసల్ దెచ్చి నీరజాక్షు, సానఁబట్టిన రాపాడి చల్లి మెఱిపి, పసను పుట విడిచేసెనో పద్మభవుఁడు, నీదు గాత్రమ్ముఁ గలదె యీ మేనికాంతి." స్వా. ౨, అ. ౩౬.

నేరడ్లులు. దే వి. బ. నమస్కారములు. "సీ... టెంకణాలు నేరె, డల్లుల్ వలా మన నమసు దండము పెట్టి .." సాం ని. మాన. ౨౫.

నేరేడు. దే. వి. బొ. అగా. జంబూవృక్షము. "ఉ ..అ, న్నేరెడు మ్రాని మూలమున నెక్కొని యుండు జగత్ప్రశస్తమై." మార్క. ౪, అ. ౧౪౪. ఆం. భా. ద్వి. ౪౬.

నేరెడుదీవి. ద్వ. వి. (నేరెడు+దీవి.) జంబూద్వీపము. "గీ. దీవులందెల్ల నేరెడు దీవి లెస్స." హర. ౨. అ. ౩. ఇట్లే: నేరటిదీవి. శైవ. ౫. అ. ౭౬.

నేరేడు=నేరెడు "సీ నేరే డనంగను నేరె డనంగను జంబూసమాఖ్యలై చనును." ఆం. భా. ద్వి. ౪౬.

నేర్చు=నేరుచు. స. క్రి. (కఱచు, అభ్యసించు) "క. అఱువది నాలుగువిద్యలు, నఱువదినాలుగు దినంబు లంతన వారల్, నెఱవాదులైనకతమున, నెఱి నొక్కొకనాఁటి విని నేర్చిరి లేకా." భాగ. ౧౦, స్కం. పూ. ౧౪౧౦.

నేర్పరి. దే. విశే. (నేర్పు+అరి.) సమర్థుఁడు. (చూ. నేర్పరితనము)

నేర్పరితనము. ద్వ వి. (నేర్పరి+తనము) సామర్థ్యము. "క. ఓనంద గోపవల్లభ, నీనందనుఁ డాచరించు నేర్పరితనముల్, మానవులకు శక్యంబులె, మానవమాత్రుండె సుకుమారుఁడె తండ్రీ." భాగ. ౧౦. స్కం. పూ. ౯౩౨

నేర్పు=నేరుపు స. క్రి. (నేర్చు ధా. ప్రే.) అభ్యసింపఁజేయు. "చ . పలుకులు నేర్పు వేళఁ గల భాషిణి నీ విటు లుండ .." స్వా. ౩, అ ౫౮. శైవ. ౨, అ. ౫౬.

నేర్పుకాఁడు. దే. విశే. (నేర్పు+కాఁడు) 1. శిక్షకుఁడు. "క కవ కడు నేర్పుకాఁడవు, గా వలవదు పీనిఁ గొన్ని కఱచితి పేమఁన్." భార. ఆది ౬, అ. ౩౨. 2. చతురుఁడు, నిపుణుఁడు "గీ. భూని యూప్రోలి మేలికడాని కోట, వానియందు నగత్త్రభాం దుపు వలను మీఱఁ, జూడఁ జెప్పంగ నరిదియౌఁ జూప్పఁ జేయు, క న్నులును నోర్లుగల నేర్పుకాండ్రగు వైన." అచ్చ. బాల. ౩౬.

నేల. దే. వి. 1. భూమి. "సీ. నేలయుం నింగియుఁ దాళము ల్గాఁ జేసి యేపున రేఁగి వాయించి యాడ." భార. విరా. ౨, అ. ౧౩౪. మార్క. ౩, అ. ౨౯౬. 2. ప్రదేశము, "వ ..పటికంపు రాచట్టు నేలలు నెట్టుకొని .." స్వా. ౩, అ. ౨౮. భార. ఆది. ౬, అ. ౨౬౪. 3. భూలోకము. "శా. పాతాళంబును నేలయుం త్రిదివముం బాలించు సిద్ధుండవో..." ఉ. హరి. ౨, అ. ౧౩౩. 4. దేశము. "అ. నేల ప్రొద్దటింగి చాలు మానిసి రణోద్యమ మొనర్చి కాక..." భార. విరా. ౪, అ. ౨౨౧. శ్లో. దేశకాలౌతు సంప్రేక్ష్య యోద్ధవ్య మితి మే మతిః. మూలము. 5. మృత్తిక, మన్ను. (చూ. నేలఁగలయు.)

నేలఁగలపు. దే. స. క్రి. (నేలఁగలయు ధా.) మంటిపాలుచేయు, నాశముచేయు. "సీ. అయ్యస్త్రమాశక్తి నద్భుతంబుగ నేలఁగలపి యుధిష్ఠిరుపలను నిగుడ." భార. ద్రో. ౩, అ. ౨౪౩. దశా. ౩, అ. ౨౦౮.

నేలఁగలయు. దే. అ. క్రి. (నేలన్+కలయు.) మంటిపాలగు, నశించు. "ఆ. ఘోరశిలలవృష్టిఁ గురియించె పీ, గించియతఁడు నికట గిరులు గాఁడ, గురుతర ద్రుమముల గుదిగ్రుచ్చునట్లుగ, నిఖిల జంతుతతులు నేలఁగలయ." కళా. ౬, అ. ౬౭. వరాహ. ౪, అ. ౨౧.

నేలకడిమి. ద్వ. వి. (నేల+కడిమి) భూకదంబము శ.

నేలకలిగొట్టు. దే. వి. భూపాటలి. (శ. ర.)

నేలకాన్పు. దే. వి. (నేల+కాన్పు.) భూపుత్త్రి, సీత. "గీ. బాగడ పూరెమ్మ వలపు కప్పురపు దిమ్మ, కాకలెమ్మ యౌ నేలకాన్పుఁ గొమ్మ." అచ్చ. అయో. ౯౮. ఇట్లే. నేలచూలి. య. ౩, అ. ౨౨.

నేలకుఁ గోలకుఁ దెచ్చు. దే. స. క్రి. ఓడించు. "ఉ. బాలుఁడవైన నీ పరిది బంటుతనంబునఁ బ్రాభవరథభూపాలురఁ గుంభజప్రభృతి బాహుబలాఢ్యులఁ గిట్టి నేలకుం, గోలకుదెచ్చి..." భార. ద్రో. ౨, అ. ౩౩౨, భార. ద్రో. ౧, అ. ౧౦౭.

నేలగాపరి. దే. వి. (నేల+గాపరి.) భూపాలుఁడు, రాజు. "సీ. అలగాపరిశ్రీఁపు లచ్చట దిగఁద్రోచి నేలగాపరులఁ దా నేలఁగల్గె." అచ్చ. భా. ౧,ఆ.౬.

నేలగుమ్మడి. దే. వి (నేల+గుమ్మడి.) భూమికర్కారువు. "సీ. సొగడు విదార్యాఖ్య నేలగుమ్మడి యన .." ఆం. భా. ద్వి. ౫౭.

నేలగుమ్ముడు=నేలగుమ్మడి. (ఇది నల్లనేలగుమ్ముడు తెల్లనేలగుమ్ముడు అని ద్వివిధము. శ. ర.)

నేలగొలిమిడి. దే. వి. (నేల+గొలిమిడి) గోలోమిశి. (శ. ర.)

నేలజమ్మి. ద్వ. వి. (నేల+జమ్మి.) చిన్నజమ్మి, శమీరము. శి. (శ. ర.)

నేలజేజే. దే. వి. భూసురుఁడు, బ్రాహ్మణుఁడు. "సీ. ఇటు నేలజేజేల కెఱుకైన చెంగావి పుదసంజఁ దగుకొండఁ జూచినాఁడ." నరస ౫,ఆ.౨౨. అచ్చ. అయో. ౯౩.

నేలతంగేడు. గే.వి. (నేల+తంగేడు.) చిన్నతంగేడు అతుల్యము. "సీ. మఁలువెంపలి ములుస్తె గలికేఁగుంటగల్జేరుచు దంతెలందారు నేల, తంగేడు .." హంస. ౪, ఆ. ౧౦.

నేలతాడి. ద్వ. వి. (నేల+తాడి) తాళమూలిక, ముసలిశి. "సీ . బీఱ మొగలింగ కోఁదాడు నీఁదాడు ఖర్జూర మీఁత నేల,తాడి .." హంస. ౪, ఆ. ౧౧. ఆం. భా. ద్వి. ౬౧.

నేలతామర. ద్వ. వి (నేల+తామర. క. నెలతావరె. 1. స్థలపద్మము, మెట్టతామర. "సీ. స్థలపద్మమగు మెట్టతామర యన .. నేలతామర యన .." ఆం. భా. ద్వి. ౬౯. 2. స్థలపద్మినిశి. (చూ. తామర.)

నేలతాలుపు. దే. వి. (నేల+తాలుపు.) 1. భూధరము, పర్వతము. "సీ. నేలతాలుపు రాచమాలి గాదిలికందు దొసఁగుదీకటిచాల్పు లొగలవిందు" అచ్చ. కిష్కి. ౭. 2. రాజు, ప్రభువు. "క. కలికపు మానిసి యని నీ, తలఁపున నిపుడల్ల నేలతాలుపు మిన్నుం, జాలంగఁగఁ జూచెద పకనిక్, గెలుపఁగ నీవంటివారికిం దరమగునే" అచ్చ. యు. ౨౧.

నేలచీఁటకసింద. దే. వి. ఒకజాతి కసిందశి. హంస. ౪, ఆ. ౧౦.

నేలతొగసి. ద్వ. వి. (నేల+తొగసి.) భూతులసిశి. (శ. ర.)

నేలనమలి. దే. వి. (నేల+నమలి.) పక్షివిశేషము. "వ... నేలనమలి డాబుగొంగడిగాఁడు మొదలగు పక్షులు..." చంద్రా. ౨, ఆ. ౦౪. ఇట్లే: నేలనమిలి, నేలనెమలి, నేలనెమిలి.

నేలనేరేడు. దే. వి. (నేల+నేరేడు.) శాకినేరేడు, భూమిజాంబుక. "సీ .. నేలనేరే డనఁగ ...భూజంబు నామంబు పొల్చుచుండు." ఆం. భా. ద్వి. ౪౬.

నేలపట్టి దే. వి. 1. అంగారకుఁడు, కుజుఁడు. (శ. ర.); 2. నరకాసురుఁడు. (శ. ర.) 3. భూపుత్రి, సీత. (శ. ర.)

నేలపల్లటి. దే. వి. (నేల+పల్లటి.) పారావతవిశేషము. 'సీ. పారావతంబగు పావురాయి యనంగ... తద్భేదములుగాచ దనరుచుండును నేలపల్లటి... అనంగ..." ఆం. భా. ద్వి. ౯౯. ఇట్లే: నేలపల్లటీ. సాం. ని. తిర్య. ౭౯.

నేలపాలుచేయు. దే. స. క్రి. కూల్చు. "గీ. పలుకయును వాలుగొని నరుపట్టి గవిసి, పౌరవుని రథ్యముల నేలపాలుచేసి .." భార.ద్రో.ఆ.౧౭,

నేలపొన్న. ద్వ. వి. (నేల+పొన్న.) కోలపొన్న. అంఘ్రిపర్ణిక. ఆం. భా. ద్వి. ౫౫.

నేలమట్టముచేయు; దే. స. క్రి. నాశమొనర్చు. "గీ దేవ యొకవానరంబు లీలావనంబు నేలమట్టంబు చేసి యాఖీలవాల, మూఁచి యాడెడు తనుఁ జూచి కోఁచవాఱు, రక్కసుల నొక్కి తోరణం బెక్కినగుచు" రామా. ౬, ఆ. ౨౦౩. భా. రా. యు. ౩౧౫.

నేలమామెన. దే. వి. (నేల+మామెన) వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౧౦.

నేలమాళె. ద్వ. వి. (నేల+మాళె.) భూమిలోపలి యిల్లు, భూగృహము, "వ ..బహుశ్రుతుండు నేల మాళె నున్నట్టి కాలవేదిపాలికిం జనుదెంచి..." విక్ర. ౩, ఆ. ౧౦౬. ఆం. భా. ద్వి. ౧౩.

నేలములక. దే. వి. (నేల+ములక.) వాఁకుడు, వార్తాకి. శ. ఆం. భా. ద్వి. ౫౯.

నేలమొలత్రాఁడు. దే.వి. (నేల+మొలత్రాఁడు) సముద్రము. "గీ. వచ్చి యవ్వేఁడి వేలుపు వంగదంపు నేలమొలత్రాటి నిండుకుం దేవికాల్పు, మ్రొలనిల్చి ..." అచ్చ. యు. ౧౫౫.

నేలయడుగు. దే. వి. (నేల+అడుగు.) పాతాళము. "సీ. పాతాళనామంబు... నేలయడుగనంగ నొగడుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౫.

నేలయుసిరిక. దే. వి. (నేల+ఉసిరిక.) భూధాత్రి శ. "గీ .. నేలయుసిరిక యన, నలరు భూధాత్రి..." ఆం. భా. ద్వి. ౪౯.

నేలయెకిమీఁడు. దే. వి. (నేల+ఎకిమీఁడు.) భూపతి, రాజు. "గీ...ఓ నేలయెకిమీల కొలముసామి, చేఁతి కత్తుక కలపెద్దచెంచువాని, యింటిచెంచెత చెలిమించు గుంటికెలని, పొలముకోకలఁ జెలఁగు చెంచులము మేము." ఉ. రా. ౭, ఆ. ౩౯౬.

నేలరేను. దే. వి. (నేల+రేను) భూపతి శ.

నేలఱేఁడు. దే. వి. (నేల+ఱేఁడు.) భూపతి, రాజు. "గీ. అట్టిప్రోలికి నేలికయగుచు నెల్ల, నేలఱేఁడులు దనమేలు మేలటంచుఁ, బొగడ..." అచ్చ. బాల ౪౪. రసిక. ౧, ఆ. ౯౪.

నేలవేము. దే. వి. (నేల+వేము) భూనింబము శ. "సీ... నేలవే మనంగ భూనింబ మొప్పు." ఆం. భా. ద్వి. ౫౦. హంస. ౪, ఆ. ౧౦.

నేలవేలుపు. దే. వి. (నేల+వేలుపు.) భూసురుఁడు, బ్రాహ్మణుఁడు "గీ .. నేలవేలుపు మొదలిటి సేమములకు నెలవు..." య. ౩, ఆ. ౧౩౧. అచ్చ. బాల. ౯౪.

నేలసంపెఁగ. ద్వ. వి. (నేల+సంపెఁగ.) భూమిచంపకము శ. (శ. ర.)

నేలాఁపు. దే. వి. (నేల+ఆఁపు.) ఎల్కవిశేషము. "సీ నేలకొవ్వుల్లైతె నేలాఁపుడేగల విడిచి యేపునఁ బీఁచ మడఁచ జేసె." రసిక. ౧, ఆ. ౧౧౫.

నేలొద్ది. దే. వి. (నేల+ఒద్ది.) వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౧౧.

నేవడము=నేవళము. (శ. ర.)

నేవము=నెవము. (శ. ర.)

నేవళము. దే. వి. మణులు గ్రుచ్చినహారము. "సీ. మొలనూలు నొడ్డాణమును నేవళంబును బుంజాలదండయుం బన్నసరము మొగపు, తీఁగయుం ..." కళా. ౭, ఆ. ౬౬. ఆం. భా. ద్వి. ౧౪౯.

నేష్ట. సం. వి. ఋ. పు. సోమయాగమందలి ఋత్విజులలో నొకఁడు.

నేస్తకత్తె ద్వ. విశే. (నేస్తము+కత్తె.) స్నేహితురాలు. (శ. ర.)

నేస్తకము=నేస్తము. 'ఎత్తు గీ. ప్రీతితో నేస్తకంబు గావించువిధము, లరయ వారితోడఁ జర్లాట మాడినట్లు." సానందో. ౩, ఆ. ౪౧.

నేస్తకాఁడు. దే. విశే. (నేస్తము+కాఁడు.) స్నేహితుఁడు. "సీ. ..నేస్తకాఁడు సంగడికాఁడు నాఁగను మిత్త్రుని నామము లగు." ఆం. భా. ద్వి. ౧౯౬. కువల. ౪, ఆ. ౧౦౩.

నేస్తమగు దే. అ. క్రి. (నేస్తము+అగు.) చెలిమి చేయు. "ఉ నీవ యెఱింగియుండుదువు నేనును చంద్రుఁడు నేస్తమాటయున్ .." శశాం. ౪, ఆ. ౪౧.

నేస్తము. దే. వి. చెలిమి, మైత్రి. "సీ. సెయ్యము నేస్తము .. గీ.. అనఁ, బరఁగుచుండును మిత్త్ర భావంబు ." ఆం. భా. ద్వి. ౧౯౬. అని. ౨, ఆ. ౯౩.

నేస్తి దే విశే. నేస్తకాఁడు. "సీ. నేస్తి గాదిలిచెలి నేస్తకాఁడు సకుఁడు సంగాతి చెలికాఁడు సంగడీఁడు, నాఁగఁ బేరులు మిత్త్రున కగు..." వేంక. మాన. ౨౬. సాం. ని. మాన. ౫.

నేస్తుఁడు. దే. విశే. స్నేహితుఁడు. "చ. వినుఁ దన బావగాఁ దలఁచి నేస్తులతోఁ గడుఁ బంతగించి..." చెన్న. 3, అ. ౧౩౧. అచ్చ. భా. ౪, అ. ౘ౧.

నేస్తురాలు. దే. వి. (నేస్తము+ఆలు.) స్నేహితురాలు. (శ. ర.)

నేహరము. దే. వి. మణులు గ్రుచ్చినహారము. "ద్వి. లోహాచితంబులై లోలతమించు, నేహరంబులు గొన్ని నీలాల నమర..." ద్వి. పారిశ్చా. ఉ. ౬౩. పం.

# నై

నైకటికుఁడు, సం. వి. అ. పుం. భిక్షాదులకై గ్రామాదులదాపున వసించువాఁడు - భిక్షువు, యతి.

నైకట్యము. సం. వి. అ. న. దాపు, సామీప్యము.

నైకము. సం. విశే. (అ. ఆ. అ.) ఏకముకానిది- అనేకము, పెక్కు.

నైకృతికుఁడు సం. విశే. (అ. ఈ. అ.) వంచకుఁడు.

నైగమిక్యము. సం. వి. అ. న. నిగనిగలాడుట.

నైగమము. సం. వి. అ. న. 1. నీతి, నయము. 2 వేదాంతము, ఉపనిషద్రూపమగు వేదభాగము. విశే. (అ. ఈ. అ.) 1. వేదసంబంధమైనది. 2. పట్టణసంబంధమైనది. 3. వణిక్సంబంధమైనది.

నైగముఁడు. సం. వి. అ. పుం. 1. వేదార్థము తెలిసినవాఁడు 2. పౌరుఁడు. 3. వణిజుఁడు.

నైచికము. సం. వి. అ. న. గోశిరః ప్రదేశము.

నైచికి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తమమైనయావు. "క. చూచి యిదియల్ల మొన్నటి, వాచంయము చేర్చిగిడ్డి వదుకొంటఁడు నీ, నైచికికి శిట్టాకో యా, నీచత వాటిల్లె నిన్ను నేటొ యనుచున్." పాండు. ౫, అ. ౬౩౦. నైష. ౫, అ. ౘ౪.

నైచ్యము. సం. వి. అ. న. 1. నీచత్వము. 2. భక్తిచే నేర్పడు వినమ్రత.

నైజము. సం. వి. స్వభావము. "క. పెరుఁగుట స్రగ్గక పుచులం, బొరయుట యరుచుంబు గాఁగఁ బుట్టుట సాపం, బొరయుట పాయుఁటదార్థోత్కరములనైజమది యెట్లు దప్పింపనగున్." భార. స్త్రీ. ౧, అ. ౭౪. భార. విరా. 3, అ. ౫౭. సం. విశే. (అ. ఆ. అ.) 1. తనది, స్వకీయము. 2. స్వాభావికము.

నైతలము. సం. వి. అ. న. నరకము.

నైదాఘము. సం. వి. అ. పుం. నిదాఘము, వేసఁగి. విశే. (అ. ఈ. అ.) నిదాఘసంబంధమైనది.

నైదానికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) (రోగ) నిదానము తెలిసినవాఁడు.

నైదానుఁడు. సం. నైదానికుఁడు.

నైదేశికుఁడు. సం. విశే. (అ ఈ. అ.) సేవకుఁడు.

నైధనము. సం. వి. అ. న. 1. మరణము. 2. నైధన తార. విశే. (అ. ఈ. అ) మరణసంబంధమైనది.

నైపథ్యము. సం. వి అ. న. నేపథ్యము.

నైపుణము. సం. వి. అ. న. కౌశలము, నేర్పు. "చ...జమదగ్ని సూనుఁడును ద్రోణుఁడు నిన్ననివిందు నిల్లనేర్పున నయనైపుణంబునను భూరి పరాక్రము గర్వసంపదన్." భార. ఆది. ౫, అ. ౭౭౭. భార. విరా. ౧, అ. ౭౪3.

నైపుణి. సం. వి. ఈ. స్త్రీ.=నైపుణము.

నైపుణ్యము. సం.=నైపుణము.

నైభృత్యము. సం. వి. అ. న. 1. నిశ్చలత్వము. 2. వినయము. 3 రహస్యము.

నైమంత్రణకము. సం. వి. అ. న. ఆతిథ్యము.

నైమిత్తము. సం. వి. అ. న. శకునగ్రంథివ్యాఖ్యానము. సం. విశే. (అ. ఈ. అ.) నిమిత్తసంబంధమైనది.

నైమిత్తికము. సం. విశే. (అ. ఈ అ.) 1. నిమిత్తము వలనఁ గలిగినది. 2. నిమిత్తమునుబట్టి చేయఁబడినది. (శ్రాద్ధము మొ.) వి. అ. న. నిమిత్తమును అనుసరించివచ్చినకార్యము - ఫలము.

నైమిత్తికుఁడు. సం. వి. అ. పుం. శకునశాస్త్రజ్ఞుఁడు.

నైమిశము. సం. వి. అ. న. ఒకానొక అరణ్యము, సూతుఁడు శౌనకాది మహర్షులకు పురాణాదులు వినిపించిన అరణ్యము.

నైమేయము. సం. వి. అ. పుం. సరకులమార్పు, వినిమయము.

నైయగ్రోధము. సం. వి. అ. పుం. మఱ్ఱిపండు. విణ. (అ. ఈ. అ.) న్యగ్రోధవృక్షసంబంధమైనది.

నైయత్యము సం. వి. అ. న. 1. నియతముగా నుండుట 2. ఆత్మనిగ్రహము.

నైయాయికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) తర్కశాస్త్రపండితుఁడు.

నైరాశ్యము. సం. వి. అ. న. 1. ఆశలేనితనము. 2 ఆశలుడుగుట.

నైరృతము. సం. వి. అ. న. మూలనక్షత్రము. విణ. (అ. ఈ. అ.) నిరృతికి సంబంధించినది.

నైరృతి. సం. వి. ఈ. స్త్రీ. దక్షిణపశ్చిమముల నడిమి దిక్కు.

నైరృతుఁడు. సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు. 2 చతుర్థదిక్పాలకుఁడు

నైర్ఘృణ్యము. సం. వి అ. న. కనికరము లేకుండుట, దయాభావము.

నైర్దేశికుఁడు. సం. వి. అ. పుం. సేవకుఁడు.

నైర్మల్యము. సం. వి. అ. న 1. నిర్మలత్వము. 2. భోగ్యవస్తువులందలి వైరాగ్యము.

నైర్వాహికుఁడు. సం. విణ. (అ. ఈ. అ) 1. నిర్వహించువాఁడు, కొఱవేర్చువాఁడు. 2. (జలాదులకు) మోచికొనిపోవువాఁడు.

నైల్యము. సం వి. అ. న. నల్లఁదనము.

నైవేద్యము. సం. వి. అ. న. దేవతలకు నివేదింపఁదగినవస్తువు.

నైశము. సం. విణ. (అ. ఈ. అ.) నిశాసంబంధమైనది. "క. ఘనతరనైశతమం బో, యనఁగ ఘనాగము తమిస్ర మలినకలమై క, ప్పిన జనులకు వస్తువిభా, వన మొక్కొకయెడలఁ గలిగె నైద్యుతరుచులన్." భార. అర. ౪, ఆ. ౧౩౬.

నైశ్చిత్యము. సం. వి. అ. న నిశ్చయము.

నైషధుఁడు. సం. వి. అ. పుం. 1. నిషధదేశపురాజు. 3. నలుఁడు 3. నిషధదేశీయుఁడు.

నైష్కర్మ్యము సం. వి అ. న. 1. కర్మత్యాగము; కర్మఫలత్యాగము. 2 సోమరితనము.

నైష్కికుఁడు. సం. వి. అ పుం. కోశాధ్యక్షుఁడు.

నైష్ఠికము. సం. విణ. (అ. ఈ. అ) 1. నిశ్చితము. 2. నిష్ఠకలది, ఆసక్తము. 3. నిలుకడగలది. 4. మృత్యుకాలమునఁ జేయఁదగినది.

నైష్ఠికుఁడు. సం. వి. అ.పుం. మరణపర్యంతము బ్రహ్మచర్య మవలంబించి గురుకులమున వసించు బ్రహ్మచారి. విణ. (అ. ఈ. అ.) ఆసక్తుఁడు, నిష్ఠకలవాఁడు.

నైష్ఠుర్యము. సం. వి. అన. 1. కాఠిన్యము. 2. పారుష్యము, పరుసఁదనము.

నైసర్గికము. సం. విణ. (అ. ఈ. అ.) స్వాభావికము.

నైస్త్రింశికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కత్తి ముఖ్యాయుధముగాఁ గలవాఁడు.

నైస్పృహ్యము. సం. వి. అ. న. నిస్పృహత్వము, ఇచ్ఛలేమి.

## నొ

నొంచు. దే. స క్రి. (నొచ్చు ధా. ప్రే.) 1. నొవ్వఁజేయు, బాధించు. "ఆ. ఘోరశక్తివైచెఁ గౌరవపతి యది, నడుమఁ దునిమి ధర్మనందనుండు, నొంచె నిశితవిశిఖపంచకమ్మున నమ్మహీశునురము దర్ప మెసక మెసఁగ." భార. కర్ణ. ౧, ఆ ౧౯౭. భార. స్త్రీ. ౧, ఆ. ౧౫౪. 2. చంపు. "ఉ.... తల్లి వినవమ్ము యీజగములెల్ల సృజింప ధరింప నొంపఁ గా, ల్దేవత లెట్టు వర్తిలిన లెస్సగుఁగా కని చెల్లఁ జేరికిన్." సా. ౨, ఆ. ౧౨౦." దశా. ౧' ఆ. ౨౫౩.

నొంచువాఁడు. దే. విణ. (నొంచు+వాఁడు) "గీ.

మాతుకుఁడు నొంచువాఁ డనఁగాఁ జెలంగు." ఆం. భా. కృ. ౮.

నొక్కము. దే. వి. పెద్దపదాపు. శతావ్యయ. (బ్రౌ. శ ర.)

నొక్కు. దే. స. క్రి. నలుపు. "శా. . వాఁ, దక్కొణంబున మందరశ్మియగు దీపాంకూరముల్ మీఁదికై, యొక్కుంద్రోచి ఘృతంబు నించి నిజవర్తి ప్రాంతముం జించి చే నొక్కుచున్ వత్తిగ నేతఁ దోఁచెను శిఖన్ యోజించె వైశ్వానరున్." కాశీ ౪, ఆ. ౧౨౩. 2. అదుము. "సీ. బలితంపు గుబ్బలఁ బట్టిచూడ నెకాని నునువాఁడిగోరుల నొక్కరాదు." దశా. ౨ ఆ. ౩౧౧. దశా. 3, ఆ. ౭౮. వి. 1. అదుముటవలనఁ గలిగినపల్లము. (శ. ర.) 2. ముడుత. "సీ. ప్రిదిలి కైరవదళశ్రేణినొక్కులు దీఱ" స్వా. 3, ఆ. ౨౩. జై ౪, ఆ. ౫౫.

నొక్కుడు. దే. వి. (నొక్కుధా.) నొక్కు. "సీ. తలిరుపైఁ గెంపులు దాఁపినచందాన మునిపండ్ల నొక్కుల్లమోము లలర." య. ౫. ఆ. ౨౬. (శ. ర. పా.)

నొగ. దే. వి. యుగంధరము, బండికి ఆధారమై బండి లోనగువాని మొదటనుండెడు నిడుపాటి కఱ్ఱ. "ఆ... మత్స్యరాజతనయుఁ డెలమి, దొలఁక నొగలఁ బగ్గములఁగట్టి చనివాని, సెల్లఁ దెచ్చి యరద మెక్కుటయును." భార. విరా. ౫, ఆ ౨౧౦. ఆం. భా. ద్వి. ౨౦౩.

నొగిలించు. దే. స. క్రి. (నొగులు ధా. ప్రే.) 1. పగులగొట్టు, ముక్కలు చేయు. 'వ ..శిరంబులు నొగిలించియు .." ఉ. హరి ౧, ఆ. ౧౪౦. 2. బాధించు. "క. మనసిజుని తూపులయి మన మనములు నొగిలించుఁగాన మాటికి నవిగో, మన గోష్ఠి దాఁకె విరులకు, ననిపువ్వులు గోయఁ దొడఁగి రలరుంబోఁడుల్." రామా. ౧, ఆ. ౧౦౯

నొగులు. దే. అ. క్రి. బాధనొందు. "ఆ. ఇన్ని సంకటముల నిట్టుంగి కుంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వదీర్ప విజ్జీవకావె .." భార. ఉద్యో. ౩, ఆ. ౨౬. ఆను. ౪, ఆ. ౧౨౭. 2. నలఁగు. "వ...వీఁపులు పగిలియు మూఁపులు నొగిలియు ..." ఉ. హరి 3, ఆ. ౪౦ ద్వి. పారిజా. ౧౭౯. పం. 3. వికలమగు, చెడు. "గీ. ఘనబరాజభూతహాంకృతి నెనయదగ్గు నొఱల సద్వృత్తి కర్ణవిస్ఫురణ నొగుల". దశా. ౨, ఆ. ౧౩౯. రా వి. ౨, ఆ. ౪౨. 4. పాడు. "సీ. పగలింటి కట్టొడ నొగిలిన కుముదిని సితరోచిఁ గనివికసిల్లునట్లు" కు సం. ౭, ఆ. ౬౫. వి. 1. వికలమగుట. (శ ర.) 2. నొప్పి, బాధ. "క. తనువు నొగిలించుకంటెను, మనము నొగుల్చుటయె హింస మదిఁ బరికింపన్, దనువు నొగులపుడ తీఱును, మనము నొగులు మనిన దనుక మానదు సుమ్మీ." (శ. ర.) "సీ. బారి నొగులు నొప్పి బాద నెగులు నొవ్వినఁదుకుదురిపిల్లు కొంగలంబు, పలుపు నోవి యనంగఁ జనువ్యథ..." ఆం భా. ప్ర. ౧౫౦.

నొగుల్చు. దే. స. క్రి. (నొగులు ధా. ప్రే.) 1. నొప్పించు, బాధించు. "క. ..భోజవరు రెంట నొగిల్చిన సాత్యకి మారొకని..." జై. ౭, ఆ. ౧౭౨. 2. నగులఁజేయు. "గీ .. తేరుపదిబాణముల నొగిల్చె" ఉ. హరి. ౩, ఆ. ౫౩. భాగ. ౧౦. స్కా. ఉ. ౪౪౯.

నొచ్చిలు. దే. అ. క్రి. రాలు, పడు. "మ .. చూతజాతములు చింతం బల్లవశ్రేణి నొచ్చిలు నీహారము పేర నశ్రువులు రాల్చెం గంటివే కోమలీ." కృ. శతం. 3, ఆ. ౧౦౭.

నొచ్చిల్లు. దే. వి బ. చొంగ. (శ. ర. బ్రౌ.)

నొచ్చు. దే. అ. క్రి. (దీనికి తుమున్నాద్యర్థమున నొవ్వన్, నోవన్, నోన్ మొ. వ్యతిరేకార్థమున నొవ్వక, నోవక, నోక, నొవ్వకుము, నోవకుము, నోకుము మొ. రూపములు వచ్చును.) 1. బాధపడు. "ఉ...సత్పురుషచిత్తము నొచ్చిన రిత్తవోవునే." ప్రభా. ౧, ఆ. ౯౫. భార. ఉద్యో. ౪, ఆ. ౨౩౦. 2. నశించు. "సీ. ఉపవాసముల చేత నుడివోనికలుషముల్ పరహితంబులఁబోని పాతకములు, వ్రతములచేత నొవ్వని దుష్కృ-

తంబులు." వి పు. ౩, ఆ. ౧౫౩. దశా. ౪, ఆ. ౫౬.

నొచ్చుకొను. దే. స క్రి. (నొచ్చు+కొను) విసిగించు. "క. విపరీతకాల మింతే యిపు డెవ్వరి నొచ్చుకొనఁగ నేఁటికి నీచే, నపవాద మగుట నిజ మని, తపియించి సుమిత్ర పట్టి కరలఁగ నంటెన్." చం. రా ౫, ఆ. ౬౮.

నొడలదొంతి. దే. వి. సంశయము (శ. ర బ్రౌ.)

నొడి దే. వి. పదము, మాట. "సీ. నడుగు నుడువు నుడి నుడికారము నొడువు నొడి నొడికారము నొడుగునాఁగఁ, బదమొప్పు..." ఆం భా. ప్ర ౧౧౧.

నొడికాఁడు. దే. విశే. (నొడి+కాఁడు.) మాటకారి "ఉ ..తనుఁగన్న దెప్పు నొడికాఁ డని కొంకెదఁ గాని యచ్యుతా" భార. ఆశ్వ. ౩, ఆ. ౧౮౧.

నొడికారము. దే. వి. (నొడి+కారము—స్వార్థమున.) 1. పదము, మాట. ఆం. భా. ప్ర. ౧౧౧. 2. మాటలయందలి చమత్కృతి. "వ ..కళావతీ నీవు నొడికారపుమాటలాడం బ్రోడ వని విందుము..." నైష. ౮, ఆ. ౫౫.

నొడికారి. దే. విశే. (నొడికారము+ఇ) మాట చమత్కారము కలవాఁడు. (చూ. నొడికారితనము.)

నొడికారితనము. ద్వ. వి. (నొడికారి+తనము.) మాట చమత్కారము "ఉ. కౌఁగిటికాసచేసి నొడికారితనంబున నిన్నుఁ దేర్చెగా, రాఁగొలగాని వాఁడవయి రామలలో నగుఁబాటుసేతు నీ,కు." ఉ హరి. ౧, ఆ. ౭౪. ఉ. హరి. ౪, ఆ. ౧౫౫.

నొడిమ దే. వి. చెప్పినమాట. "క. నొడిమలకుఁ గలవి లేనివి, గొడిమలు గట్టుచును జనులు కుడువని నోళ్లన్, గుడుపుచుఁ బోయెద రూరకె, మడుగడలను కెరువమాయ మాఁకుడు గలదే?" మల్హ. ౧, ఆ. ౪౭. పు.

నొడుగు. దే. వి. మాట, పదము. ఆం.భా. ప్ర. ౧౧౧.

నొడుచు. దే. స. క్రి. తప్పులుపట్టు. (శ. ర)

నొడుపు. దే వి. (నొడుచు. ధా.) తప్పులుపట్టుట. (శ ర.)

నొడుపరి. దే. విశే. (నొడువు+అరి.) వాచాలుఁడు. (చూ. నొడుపరితనము.)

నొడుపరితనము. ద్వ. వి. (నొడుపరి+తనము) వాచాలత. "ద్వి. కడు యంత్రతంత్రములన్ నొడుపరితనము, లం..." పండితా. పురా. ౧౧౩. పు.

నొడువు. దే. స. క్రి. 1. వచించు, చెప్పు. "క. ఏనిది యింతయుం దెలియఁగుదుఁ, గాన వృథాశోకవహ్నిఁ గాలమికిని నీ,మానసమునఁ గృపకలిమికిఁ, గానొడివితి దేవగుహ్యగతిరాఁ దెలిపితిన్." భార. స్త్రీ. ౧, ఆ. ౧౬. భార. ఆది. ౨, ఆ. ౩౩. 2. రచించు. "సీ. నూఱుఁగు మీసాల నూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి." కాశీ. ౧, ఆ. ౭. 3. స్తుతించు. "గీ. వెట్టిమాడ్కిని లీలతో విశ్వమయుని, నొడువుచును బాహ్యత నొందవలయు" భాగ. ౧౧, స్కం. ౪౪. కష. ౧, ఆ ౨౫. వి. పలుకు, మాట. "క... నే నొడివిననొడువులు నొడువఁడు, దుడుకని జనియింప మాకు దుర్లభ మధిపా" భాగ. ౭, స్కం. ౨౫౩. ఆం భా. ప్ర. ౧౧౧.

నొడువు జవ్వని. ద్వ.వి. (నొడువు+జవ్వని.) సరస్వతి. "సీ. నొడువుజవ్వనిపోఁక ముడి కానవడు పెద్ద సరిగద్దెచుండు పెద్దటికమెల్ల." చం.రా. ౨, ఆ.౩౦.

నొప్పి. దే. వి. (నొచ్చు ధా.) 1. బాధ. "ఉ. కంటకములన్ పదాగ్రములఁ గాఁడఁదూసిన నొప్పిఁగూడన్" ఆము. ౩, ఆ. ౩౩. నైష ౩, ఆ.౮౨. 2. అపచారి. "క. అప్పాండవమధ్యమునకు, నొప్పమి పుట్టంగవలయు నల్లము కలఁగెన్, ఒప్పదు సాకల నీకును, నొప్పి పరిహరించి దయఁ గనుంగొను మనినన్." జై. ౭, ఆ. ౧౧౭. ౩. ప్రసవవేదన. "సీ నొప్పులు దఱచయ్యె నిప్పుడె చని వేగ పెద్దలా ముదుసళ్లఁ బిలిచిరారె." ఇందు. ౨, ఆ. ౫.

నొప్పించు. దే. స. క్రి. (నొచ్చు ధా.) నొవ్వఁ జేయు. "ద్వి ఏసియుఁ గోసియు నేరిచిఁ గపుల, నొప్పింప కొంతయు నొచ్చి ఖిల్లి, యప్పుడు తరుగిరు లవనిపై వైచి." రం. రా. యు. ౪౭౭, పు.

నొప్పిపడు. ద్వ. అ. క్రి. (నొప్పి+పడు) బాధపడు. "క. ఇప్పగిది నాఁడునాఁటికి, నప్పాపులు సంహరింప నాతనిజనుల్, నొప్పిపడిపోయి పలు

నపుఁ, జెప్పిన నతఁ డాగ్రహంబు చిప్పిలం బది తోన్." వరాహ. ౩, ఆ. ౬౨.

నొప్పిగుంటి. దే. విశే. (నొప్పి+గుంటి.) వ్యాధిగ్రస్తుఁడు. (శ. ర.)

నొల్లు. దే. స. క్రి. 1. ప్రోగుచేయు (వ్యవ.) ఆకలములు నొల్లితెచ్చికొనివచ్చిరి. 2. బిడ్డలు నోట వ్రేలిడుకొని చప్పరించు. "సీ. వ్రేళ్లలు గఱవంగ వెరవల్వరించిరో నోరఁజేతులు గ్రుక్కి నొల్లునాఁడ." నిర్వ. ౧, ఆ. ౪౦.

నొవులు=నొగులు, బాధపడు. "సీ ప్రచురముక్తాచ్ఛత్రరుచి కొంతవడి పేఁగి యని గూలఁ దడఁబడి నొవులఁ కరులు." చెన్న. ౫, ఆ. ౫౫.

నొవ్వి=నొవ్వు. 1. వేదన, బాధ "క. ఎవ్వరు లేకొడ నొక్కఁడు, నొవ్వంగా నడిచెనేని నొప్పి గొలఁది యగున్, జివ్వకతము నరయందగు, నొవ్విక్ వాఁ డెగ్గులాడు నుత్తము నయిసన్." విజ్ఞా. ప్రా. ౫౦. భా. రా. యు. ౨౧౪౫. 2. వ్యాధి. "క. ఎవ్వరు చేటికి నామెయిఁ, గ్రొవ్విన మాంసంబు గలదు కొను మాఁకలియఁన్, నొవ్వియును దీఱునంతట నవ్వల నారోగ్యమగు మృగాధిప వింటన్." నా పంచ. ౧, ఆ. ౪౦౭.

నొవ్వు. దే. వి. (నొచ్చు ధా.) 1. భాధ, వేదన. "గీ. వాయువంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి, నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వు చెఱుచు." భార. అశ్వ. ౧, ఆ. ౧౭౬. భార. విరా. ౨, ఆ. ౧౦౬. 2. వ్యాధి. "ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి జెంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వుఁ దీర్చు, వెజ్జవీవకావె..." భార. ఉద్యో. ౩, ఆ. ౨౬.

నొసలికన్ను. దే. వి. (నొసలు+కన్ను.) ఫాలనేత్రము

నొసలిచూపువేల్పు. దే. వి. శివుఁడు చంద్రి. ౫ ఆ. ౧౦౫.

నొసలు. దే. వి. నుదురు, ఫాలము. "ఉ. నిక్కపుఁగిన్క వచ్చినే నినిన్ నొసలం గనుసూపు వాటిపాటక్కట రిత్తవోవుట..." భార. అశ్వ. ౪, ఆ. ౧౫. అం. భా. ద్వి. ౧౪౩.

## నో

నోఁచు. దే. స. క్రి. (వ్రతాదులు) ఆచరించు. "ఉ. నోములు నోఁచినప్డులు మనోరథముల్ దయివారని క్తతలిక్, దామరతంపరై ప్రియులుఁ దారు విహారమునల్ప .." స్వా. ౩, ఆ. ౭౯. భార. ఆది. ౪, ఆ. ౧౦౨.

నోఁత. దే. వి (నోచు ధా.) నోఁచుట. "చ. కెలిచని గోరు దుండగపువేడుకకత్తెల నోమునోఁత .. చీకటిపర్వె నుర్వరన్." కవిక. ౪, ఆ. ౭౬. (వ్రతఫల మని భావము.)

నోటిగయ్యాళి. దే. వి (నోరు+గయ్యాళి.) వాక్పారుష్యముగల స్త్రీ. 'సీ. మాటమాటకు జగడో నోటిగయ్యాళియో యాచారహీనయో యయలసురాలో." చెన్న. ౪. ఆ. ౩౯.

నోటిబీగము. దే. వి. (నోరు+బీగము.) దేవతలకు మ్రొక్కుబడిగా పరానావలంబనమునకై దవుడల యందు కుట్టుకొను లోహపుకడ్డీ. "వ...కొందఱు నోటిబీఁగముల దాసర్ల పెల్లున నోరులఁ బూరుల గఱచువారును..." ప్రబంధ. ౭౭

నోమించు. దే. స క్రి. (నోము ధా. ప్రే.)

నోము. దే స. క్రి. 1. వ్రతాదు లాచరించు. 'గీ. వ్రతము నోమించు దినవాసరములు దెలుపు.'. కాశీ. ౬, ఆ. ౬౦. పార్వ ౩, ఆ. ౧౩౬. 2. పూజించు. "క. అన్నెలఁత ..క్రొన్ననవిలుతుని నోముచు .." విక్ర. ౧, ఆ. ౧౨౦. జై. ౭, ఆ. ౭౫ 3 పోఁగొట్టు (శ. ర.) వి. 1. వ్రతము. "ద్వి. మానసంబున రంగమంజిరుం జేరి, యానోము తానోమి యానోముకరణి." ద్వి పరమ ౫, ఆ. ౪౦౯. స్వా ౩, ఆ ౭౯. 2. యజ్ఞము. "చ... వాఁడు దివ్యులక్, మునులకు బిల్చి నోము పెనుమూఢత నోఁచిననోముఁ గాక .." పీర ౧, ఆ. ౧౧౪; ౧, ఆ. ౧౧౫.

నోముపంట. దే వి. (నోము+పంట) వ్రతఫలము. "ఉ...తొలినోమిన నోముపంటగా, హిండితకీర్తి యుక్తి జనియించెను .." శకాం. పీఠి. ౪౬.

నోయు. దే. అ. క్రి. 1. నొచ్చు, బాధపడు. "వ. వినత యోటువడి కద్రువకు దాసియై నోసినను లుసేయుచున్నంత .." భార. ఆది. ౨, ఆ. ౩౭. భా. రా. సుం. ౨౪౪.

నోరఁబట్టు. దే. స. క్రి. (నోరన్+పట్టు) త్రాఁగు, పుక్కిటఁబట్టు. "ఉ ..అగస్త్యమూర్తియై, యా వృషకేతుం డది మహోగ్ర బలాంబుధి నోరఁ బట్టెదున్." శై. భా. ౧, ఆ. ౧౦౦.

నోరడుము. దే. స. క్రి. నోరునొక్కు, మాటలాడ నీయకుండు. "గీ. అత్తమామల గృహకర్తలగుచు మెలఁగు, నట్టిభర్తలనెల్ల నోరడిమి గదిమి, పొంచి యుపనాథుతోడఁ గ్రీడించి..." శుక. ౧, ఆ. ౫౫.

నోరాడు. దే. అ. క్రి. మాటవెలువడు. "గీ చెప్ప నోరాడ దేమని చెప్పవాడ, నెఱిఁగినర్థంబుచెప్పక యెట్లుడంతు." కాశీ. ౪, ఆ. ౩౫.

నోరార్చు. దే. స. క్రి. (నోరాడు. ధా. ప్రే.) నోరాడించు, బొంకు. "ద్వి. దంటమాటలు గొన్ని తడవాటివన్ని, గెంటకనోరార్చి గెల్వఁజూచెదవు." ద్వి. హరి. పూ. ౩౦౦ ప.

నోరికిఁబోవు. ద్వ. అ. క్రి. నోటికింపగు "ఉ.తు ప్పులుకట్టె నేర బలుతూపులు నీగుగిగింజపండదున్, దప్పితిపేమి నావుడు నకండును దిగ్గన లేచి దేవ రా, యిప్పటికమ్ము లింకఁజెడిరొం గడినోరికిఁ బోదుదూపకుం, దిక్కులనీక మాగురుల తీయని పాలు రుచింపవేమియున్." కకు. ౪, ఆ. ౫౧.

నోరికాళము=నోటిబిగము. "గీ. లలనయొకర్తు నోరి కాళంబు లిచ్చె, శక్తిజాతర నద్భక్తికర్తలెసఁగ." పాండు. ౩, ఆ. ౭౭

నోరిసని. ద్వ. వి. తినుట కుపయోగము లేకపోవుట, అనుభవమున కదృష్టము లేకపోవుట. "క. నోరిసని నుండకే నోఁరోరియకట మా సమీరపుూరనె మని యుం, మరము వోయితివె సౌ, ష్మేరీతిని నీకు దక్కునే కాసిరా." ఆము. ౬, ఆ. ౮౨.

నోరుకారు. ద్వ. అ. క్రి. నోటికి రుచియైన గల్లఁ దినకుండ కష్టము చేయు.

నోరుకాయలుగాచు = పలుమాఱు పిలుచుటవలన నోరు నొప్పిచెందు

నోరుచేయు. దే. అ. క్రి. మాటలాడు. "సీ. కూత నిత్తుకు మాఱుకొని మోఱయెత్తినఁ గదిమెద నోరింతకంటెఁ జేయ." బహు. ౨, ఆ. ౬౧.

నోరుగొట్టు. ద్వ. స. క్రి. (నోరు+కొట్టు) తినకుండఁ జేయు. "సీ. కొలుచువారల నోరుగొట్టి లెక్కలు వ్రాసి హరువుమీఱఁగ పణియములు చేసి." శుక. ౩, ఆ. ౩౭౫.

నోరుదెఱచు. దే. అ. క్రి. (నోరు+తెఱచు). 1. మాటలాడు. "ఆ. శిఖలు చూపకుండ శిక్షించి హాలికసైఁ, నోరుదెఱవకుండ పేరవెట్టి, వేఁడియెల్ల నుడిపి విబుధారి కినుకమై, ఖలిపాత్రుఁజేసె బలి వోత్రు." నృసిం. ౨, ఆ. ౧౧౮. 2. బయలు చెప్పకయుండు. 3. ఆశ్యాశపడు. "క. గతము నకును వగవక సాగతమునకును నోరుదెఱచి కడుఁగోరక దీనతఁబొందక దైవం బేగతిఁదెచ్చిన దానఁబోదుఁగా కనవలయున్." భార. శాం. ౩, ఆ. ౩౦.

నోరునొక్కు. ద్వ. స. క్రి. మాటలాడకుండఁజేయు. "గీ. ఎవ్వఁడివి యని పక్కన నవ్వధూటి, నోరు నొక్కుచుఁ గౌఁగిటఁ జేరఁదిగిచి. మగువచెవిలోన నలుకుడు మాను మేను, వాసవుఁడ నిన్నుఁ గని కూర్మి వచ్చినాఁడ." జాహ్నవీ. ౪, ౮౭.

నోరుమాలినది. కే. విశే. 1 నోరులేనిది. (జంతువు.) "గీ. శర్వ యీనోరుమాలినజంతువునకు, పొందల వరమిమ్ము వరమిమ్ము పిదప నాకు." కాశీ. ౫, ఆ. ౩౩౫. 2. గడుసుగామాటలాడుతాలనివాఁడు.

నోరుమూయు. దే. అ. క్రి. (నోరు+మూయు) మాటలాడకుండు. "ఆ. అనిన నొడ్డుగలచి యనుచు ద్వ్యమండోరి, పదుచ నాకుఁ బుట్టి చెడుగవైతి, పేర్చి నోరుమూయు పెదకలవాపోరు, దిట్టవదర గలఁడె యెచటనైన." నృసిం. ౪, ఆ. ౩౭.

నోరుమెంగ. దే. విశే. (నోరు+మెంగ) మూఁగ. "క. తన్నట్టు పలికి ద్రొబ్బఁగ, మిన్నకచన నంత నోరు మెంగయె .." కళా. ౩, ఆ. ౨౩౯.

నోరుమెదపు. దే. అ. క్రి. మాటలాడు.

నోరుమెదల్పు. దే. స. క్రి. తెరచు. "ఉ. ఎన్నఁగ నింత రక్షచయ మింతగభీరము నింత దానసం,ప న్నత యింతబుద్ధి యని బ్రహ్మయు నోరుమెదల్ప లేని యు,త్కృష్ణలీలఁగన్న పెన్నదలి సత్కీర్తనమై వెలిగీరివెన్నగద్." పాండు. ౩, ఆ. ౧౫౧.

నోరూరు. దే. అ. క్రి. 1. అపేక్షకలుగు. "సీ. గబ్బిగుబ్బలఁ బతిరొమ్మఁ గ్రమ్మి క్రమ్మి, యున్నసకి యలఁ జూచి నోరూరసాగె." కలు. క. ౫౫. 2 తినుబండములఁ దలఁచినపుడు నోట నీరుపుట్టు. "క. శ్రీరాముని దయచేతను, వారాధిగ సకల జనులు నారా యనఁగా, ధారాళమైన నీతులు, నోరూరఁగఁ జవులుపుట్ట నుడికెద సుమతీ!" సుమ తి. క. ౧.

నోరెత్తు. దే. అ. క్రి. (నోరు+ఎత్తు) మాటాడ యత్నించు. "ఉ. అత్తఱి భీష్మ ముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబులెల్ల నో, రెత్తకయూరకుండిరి మహీశ్వరు చిత్తమెఱుంగ కున్కి...." భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౯. భో. ౬, ఆ. ౧౬౬.

నోవరి. దే. విశే. (నోవు+అరి) వ్యాధికలవాఁడు.

నోవి. దే. వి. = నొవ్వి. (నొచ్చు ధా.) బాధ, నొప్పి. రూ. నోవు.

నోవిక. దే. వి. అనుకూల్యము.

నోవు. దే. వి. (క. త. నోవు.) 1. బాధ. "క. చావుకు నోవుకు మనరో, భావలీలఁ గెలువు నువ్వుకు నావలికిని నీ,చే వినిరొమఁ దుది నెట్టులు, శ్రీవిభవము పాండవులకుఁ జేపడునకదే." భార. భీష్మ. ౨, ఆ. ౧౯౯. ఉద్యో. ౩. ఆ. ౨౬౭. 2. వ్యాధి. "ఉ...బెంకలు నక్కలు గొంకనక్క లు, న్దోమలు ప్రాఁకులుం బొదలునోవులఁ బీడలఁ బొందువ్వారు మఱ్,తామసభాగులట్ల మఱి తద్విధ జంతువు లెన్నియున్నియుర్." భార. అశ్వ. ౨. ఆ. ౧౧౬.

## నౌ

నౌ. దే. వి. నవ్వు (మొదటిరూపము నవు. శ. ర.)

నౌక. సం. వి. ఆ. స్త్రీ. 1. నావ, ఓడ. 2. చిన్నపడవ,

నౌకర్ణధారుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు. మాలిమివాఁడు.

నౌకర్మము. సం. వి. న్. న. నావికవృత్తి.

నౌకాదండము. సం. వి. అ. పుం. ఓడనడపుగడ, తెడ్డు.

నౌకు. దే. వి. మొల్లి. "ద్వి. నల్లముల్లుకుఁ గ్రింద నౌకుదాపురమును, దల్లినివాల్పుక్క తెగిపడ్డరీతిఁ, గనిపించె .." ద్వి. సా. ౨. భా, ౩౦. పు. రూ. నవుకు.

నౌచరుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) పడవతో తిరుగువాఁడు, నావికుఁడు

నౌజీవికుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపువృత్తి జీవన ముగాఁ గలవాఁడు.

నౌజొ. దే. వి. భత్యవిశేషము.

నౌదుకొట్టు. దే. అ. క్రి. మినుకరించు. రూ. నవ్రుదు కొట్టు. (శ. ర.)

నౌతార్యము. సం.విశే. (అ. ఆ. అ.) ఓడచే దాఁటఁ దగినది.

నౌబత్తు. హిం. వి. = నవుబత్తు. మహారాజులకోట ముందు వాయించెడు చర్మవాద్యవిశేషము. "సీ. నక్తం దివంబును నాదుపాదుకొనంగ సాహేబు నౌబత్తు చఱవఁబడిచి." రంగా ౨, ఆ. ౧౯౦. రూ. నౌబతు.

నౌరు. దే. విశే. = నవురు. మృదువు. (శ. ర.)

## న్య

న్యంకువు. సం. వి. ఉ. పుం. 1. ఇఱ్ఱి. 2. ఒకానొక ముని.

న్యంచనము. సం. వి. అ. న. 1. తక్కువపాటు. 2. వంపు. 3. కల్లము.

న్యంతము. సం. వి. అ. పుం. చిట్టచివరిభాగము.

న్యక్కరణము. సం. వి. అ. న. అవమానము.

న్యక్కారము. సం. వి. అ. పుం. తిరస్కారము.

న్యక్కు. సం. విశే. (చ్. నీచీ. చ్.) 1. కల్లము. 2. నీచము.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ. న్యక్కరణము.

న్యక్తము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి భూయఁ బడినది.

న్యక్షము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అధమము, 2. సమస్తము. వి. అ. పుం. దున్నపోతు.

న్యక్షుఁడు. సం. వి అ. పుం. పరశురాముఁడు.

న్యగ్రోధము. సం. వి. అ. పుం. 1. మఱ్ఱి. 2. జమ్మి. 3. బార.

న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకచెవి.

న్యచ్ఛము. సం. వి. అ. న. పుట్టుమచ్చ.

న్యయము. సం.వి. అ.పుం. 1. నాశము. 2. తఱుగుట.

న్యర్బుదము. సం. వి. అ. న. పదియర్బుదములసంఖ్య. విశే. (అ. ఆ. అ.) పదియర్బుదముల సంఖ్యకలది.

న్యసనము. సం. వి. అ. న. 1. ఉంచుట 2. ఇల్లడపెట్టుట. 3. విడిచిపెట్టుట.

న్యసించు. సం స. క్రి. 1. ఉంచు, 2. ఇల్లడపెట్టు, 3. తాఁకు. 4 జపసమయమున దేహావయవములను బీజాక్షరము లుచ్చరించుచు స్పృశించుట. "వ. ...కేశవాది నామంబులతోడ గోకర్ణహస్తంబున మాషమజ్జనపరిమితశుద్ధోదకంబుల ముమ్మాఱు లానికించి యిరుమాఱు పరిమార్జనంబుచేసి దక్షిణపూర్వకంబుగా నేత్రనాసాశ్రోత్రద్వయ శిరోబాహుద్వయ నాభిహృదయంబుల న్యసించి యాచమనంబుచేసి .." వి. పు. ౪, ఆ. ౧౯౩.

న్యస్తము. సం. విశే. (అ. ఆ అ.) 1. ఉంచఁబడినది. 2. త్రోయఁబడినది. 3. ఇల్లడపెట్టఁబడినది 4. మంత్రోచ్చారణముచే తాఁకఁబడినది.

## న్యా

న్యాక్యము. సం వి. అ. న. వేఁపుడు బియ్యము. (వాచ.)

న్యాదము సం. వి. అ. పుం. 1. భోజనము, కుడుపు. 2. ఆహారము.

న్యాయపథము. సం. వి. అ. పుం. 1. ధర్మమార్గము. 2. మీమాంసాశాస్త్రము.

న్యాయము. సం. వి. అ. పుం. 1. తగవు. 2. స్వధర్మమువలన చలింపకుండుట. 3. తర్కశాస్త్రము. 4. పద్ధతి. 5. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయనము, నిగమనములను పంచావయవములుగల వాక్యసముదాయము. 6. లోకమందును శాస్త్రమందును ప్రసిద్ధమగు దృష్టాంతవాక్యవిశేషము.

న్యాయవర్తి. [illegible] న.) న్యాయముగ నడచుకొనువాఁడు.



న్యాయవాది. సం. విశే. (న. సీ. న.) 1. న్యాయమునకై వాదించువాఁడు. 2. న్యాయముచెప్పువాఁడు.

న్యాయసూత్రము. సం. వి. అ. న. గౌతమరచితమగు న్యాయశాస్త్రసూత్రములు.

న్యాయి. సం. విశే. (న. సీ. న.) న్యాయవంతుఁడు.

న్యాయ్యము. సం. విశే. (అ. ఆ. అ.) న్యాయముతోఁ గూడినది.

న్యాసకుఁడు సం. విశే. (అ. సీకా. అ.) న్యాసము చేయువాఁడు.

న్యాసధారి. సం. విశే. (న. జీ న.) ఇల్లడసొమ్ము దాఁచిపెట్టువాఁడు.

న్యాసము. సం. వి. అ పుం. 1. ఉంచుట. 2. ఇల్లడ. 3. వాడిక. 4. సన్న్యాసము, విడుపు. 5. మంత్రము జపించునపుడు దేహావయవములందు మంత్రబీజాక్షరము లుంచుట.

## న్యు

న్యుబ్జము. సం. విశే. (అ ఆ. అ.) 1. బోరగిల పండఁబడినది. 2. వంకరైనది. 3. గూనుకలది. వి. అ. పుం. దర్భతో చేసిన స్రుక్కు. న. కర్మరంగ మను మ్రానిపండు.

## న్యూ

న్యూంఖము. సం. విశే. (అ. ఆ. అ) ప్రియము.

న్యూనాంగుఁడు. సం. విశే. (అ. ఆ, ఈ. అ.) 1. హీనమైన అవయవములు కలవాఁడు. 2. వికలాంగుఁడు. 3. నిందింపఁదగినవాఁడు.

న్యూనము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తక్కువైనది. 2. నిందింపఁదగినది.

న్యూనాధికము. సం. విశే. (అ. ఆ. అ.) విషమము, హెచ్చుతగ్గులు కలది.

## నృ

నృస్థిమాలి సం వి. న్. పుం. (నృ+అస్థిమాలి.) శివుఁడు.

...డు సంఖ్య...... చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
...... 21-7-... వావిళ్ల ప్రెస్సున ముద్రితము. [illegible]

# సంస్కృతాంధ్ర నిఘంటువులు

## సంస్కృత నిఘంటువులు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| సంస్కృత ఆంధ్ర అకారాది నిఘంటువు | * | |
| త్రికాండశేషము, సటీక | 1 | 12 |
| విశ్వకోశము (విశ్వనిఘంటువు) సటీక | 2 | 8 |
| మేదినీకోశము " | 4 | 0 |
| హారావళి, ఏకాక్షరీకోశము " | 1 | 0 |
| వైజయంతినిఘంటువు | * | |
| అమరము, ప్రథమకాండమూలము పెద్దచ్చు | 0 | 4 |
| " " టీక | 0 | 10 |
| అమరము 3 కాండలు, మూలము | 1 | 0 |
| అమరము, సటీక, మేలుకాకితములు, కలికో | 5 | 0 |
| ధనంజయనిఘంటువు సటీక | 1 | 4 |
| నానార్థరత్నమాల, సటీక | 2 | 8 |
| గురుబాలప్రబోధిక, సటీక | * | |

## తెనుగు నిఘంటువులు

| | | |
|---|---|---|
| నానార్థనిఘంటువు, పద్యకావ్యము | 0 | 4 |
| శ్రీ వేంకటేశాంధ్రము, పద్యకావ్యము | 0 | 6 |
| షడ్భాషామంజరి (ఆరుభాషల వకాబ్యులరి) | * | |
| వావిళ్లనిఘంటువు (అ — ఔ వఱకు) | | |
| I సంపుటము | 10 | 0 |
| డిటో (క - ఞ వఱకు) II | 12 | 0 |
| డిటో (ట - న) III | 10 | 0 |
| డిటో IV | అచ్చు | |

| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకా, అకారాద్యనుక్రమణికతో (నిఘంటుత్రయము) | 1 | 12 |
| డిటో కాలికోబైండు | 2 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీ మహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | 10 | 0 |
| లఘుశబ్దార్థచంద్రిక | 6 | 0 |
| తెనుగుసామెతలు with English Translation by Captain Carr | 2 | 0 |
| Gellette's Telugu Dictionary (*Printed in Roman letters*) | 7 | 8 |
| Sankaranarayana's Telugu-English Dictionary. శంకరనారాయణగారినిఘంటువు (తెనుగుపదములకు ఇంగ్లీషుఅర్థము కలది) | 12 | 0 |
| Sankaranarayana's English-Telugu Dictionary. | 15 | 0 |
| శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషు పదములకు తెలుగు అర్థములు కలది) | | |
| English Telugu Pocket Dictionary ఇంగ్లీషు తెలుగు పాకెట్టు డిక్షనరి | 5 | 0 |
| Translation Guide (English to Telugu & (*Vice-Versa*) useful for Revenue Officials | | |
| సంస్కృతాంధ్రనిఘంటువు | | |

# ఆంధ్రగ్రంథములు

## ఆంధ్రవ్యాకరణములు, అలంకారములు

| | ప్రతి 1కి రూ | అ |
|---|---|---|
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, పద్యకావ్యము | 0 | 6 |
| కవిజనసంజీవని | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము | * | |
| సులక్షణసారము | 1 | 8 |
| లఘువ్యాకరణము | 1 | 0 |
| ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము | 1 | 0 |
| రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి తెనుగు వ్యాకరణము (ప్రాచీనము) | 1 | 8 |

| | ప్రతి 1-కి | |
|---|---|---|
| పట్టాభిరామపండితీయం (పద్యవ్యాకరణము) | 0 | 8 |
| ప్రౌఢవ్యాకరణము | 1 | 8 |
| " సటీక | 3 | 0 |
| వెంకయ్యవ్యాకరణము | 0 | 6 |
| వ్యాకరణసంగ్రహము | 0 | 8 |
| ఆంధ్రశబ్దమంజరి బి.సీతారామాచార్యులు | 0 | 12 |
| బాలవ్యాకరణము, శ్రీ చిన్నయసూరిగారిది | 1 | 4 |
| " శ్రీ దూసిరామమూర్తిగారి టీకతో | 6 | 0 |
| " విద్వాన్ బులుసు వెంకటరమణయ్యగారి లఘుటీకతో | | |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| బాలచంద్రోదయము, అలఘుకౌముది | 0 | 8 |
| బాలసరస్వతీయము, సటీక | | అచ్చు |
| విభక్తిచంద్రిక | 0 | 6 |
| ఆంధ్రసంస్కృతవ్యాకరణము, ప్రథమ శిక్షాత్మకము, వేదము సూర్యనారాయణ శాస్త్రిగారిది | 1 | 4 |

## పద్యకావ్యములు

| | | |
|---|---|---|
| ఆధ్యాత్మరామాయణము | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు | 5 | 0 |
| ,, శ్రీగిడుగురామమూర్తిపంతులవిమర్శ | 0 | 12 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | 0 | 12 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము 2 సం॥ | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము — | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | 1 | 8 |
| ,, టీక (పాఠ్య) | 8 | 0 |
| ఆదిపంచకము | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 7 | 8 |
| శాంతిపర్వము | 7 | 8 |
| ఆది సభాపర్వములు, కలసంపుటము | 4 | 0 |
| అరణ్యపర్వము | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిపర్వము | 4 | 0 |
| 2 శాసనిక, అశ్వమేధ ఆశ్రమవాస, మౌసల మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | 4 | 0 |
| శ్రీభారతవిమర్శనము శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | 0 | 3 |
| ,, టీకతో | 0 | 10 |
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము సాంబనిఘంటువు (నిఘంటుత్రయము) | 2 | 0 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము — శ్రీజనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | 6 | 0 |
| ఉత్తరహరివంశము | 3 | 0 |
| కవికంఠోక్తి | 0 | 4 |
| కవిజనాశ్రయము | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | 0 | 8 |
| కవిరాజమనోరంజనము | 1 | 4 |
| కవిజనరంజనము | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరనార్యునిది | 4 | 0 |
| కృష్ణదండకము | 0 | 2 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | 1 | 8 |
| కవిగజాంకుశము | 0 | 4 |
| కేరళపద్యములు | 0 | 4 |
| దండకరామాయణము, చక్కనిశైలి | 3 | 8 |
| కృష్ణరాయవిజయము | 0 | 12 |
| కాశీఖండము, శ్రీనాథునిది | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | 0 | 8 |
| డిటో గట్టుప్రభుకృతము | 0 | 10 |
| కుమారసంభవము నన్నెచోడకృతము | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యకవి | 0 | 12 |
| గయోపాఖ్యానము ద్విపద (కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 0 | 12 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | 1 | 12 |
| చిత్రభారతము చరిగొండ ధర్మనగారిది | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | 0 | 8 |
| జైమినీభారతము | 2 | 8 |
| దశావతారచరిత్ర | 4 | 0 |
| ధనాభిరామము | 0 | 12 |
| నిర్వచనోత్తరరామాయణము | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 137, చెన్నపురి. 1.